

శ్రీధామ మాయాపురము నందలి శ్రీ చైతన్య మఠములో
నిత్యసేవలనందుకొనుచున్న శ్రీ చైతన్య మహాప్రభువు, శ్రీశ్రీ రాధాకృష్ణులు



వైష్ణవ సార్వభౌమ
శ్రీల జగన్నాథ దాస బాబాజీ మహారాజ్



పరమహంస శ్రీల గౌర కిశోరదాస బాబాజి మహారాజ్



శ్రీ చైతన్యమఠము, శ్రీగౌడీయమఠముల ప్రతిష్ఠాతయగు
ఓం విష్ణుపాద ౧౦౮ శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి ఠాకూరు ప్రభుపాదులు



ప్రభుపాద ప్రేష్ఠయగు శ్రీల భక్తి విలాస తీర్థగోస్వామి మహారాజ్

# నివేదన

శ్రీమద్భాగవతము పరమహంస సంహిత. నిర్మలమైన పురాణము. వైష్ణవులకత్యంత ఆదరణీయమైనది. శ్రీమద్భాగవతమును శ్రవణము, పఠనము, మననము చేయుటద్వారా మనయందు భక్తి కలిగి జీవుడు మాయా బంధము నుండి విముక్తుడగును.

**అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం భారతార్థ - వినిర్ణయః ।**
**గాయత్రీభాష్యరూపోఽసౌ వేదార్థ - పరిబృంహితః ॥** (గరుడ పురాణము)

శ్రీమద్భాగవతము బ్రహ్మసూత్రములకు అర్థము, మహాభారతము యొక్క తాత్పర్యనిర్ణయము, గాయత్రీమంత్రమునకు భాష్యమునై యున్నది. సమస్త వేదములయొక్క తాత్పర్యమును తెలుపుచున్నది.

**సర్వవేదాన్త సారం హి శ్రీమద్భాగవతమిష్యతే ।**
**తద్రసామృతతృప్తస్య నాన్యత్ర స్యాద్రతిః క్వచిత్ ॥** (శ్రీమద్భాగవతము)

సర్వవేదాంత సారమే శ్రీమద్భాగవతము. ఈ భాగవత రసామృతముచే తృప్తిపొందిన వ్యక్తికి ఇతర శాస్త్రములయందెన్నడును రుచియుండదు.

ఇట్టి మహత్తరమైన గ్రంథము ప్రతిగృహమునందును నిత్యము పూజింప తగినది, పఠింపదగినదియై యున్నది. పన్నెండు స్కంధములతో గూడిన ఈ గ్రంథము ఇదివరలో రెండుమారులు ఏ స్కంధమునకు ఆ స్కంధము విడివిడిగా ముద్రితమైనది. ఇపుడా ప్రతులు లభించుటలేదు. పాఠకుల సౌకర్యార్థమై మూడు మూడు స్కంధములను కలిపి ఒక్కొక్క భాగముగ ముద్రింప దలచితిమి. భగవదనుగ్రహమువలన గత మాఘమాసమునందు ప్రథమ ద్వితీయ తృతీయ స్కంధములతో ప్రథమ భాగము విడుదలైనది. ప్రస్తుతము చతుర్థ పంచమ షష్ఠ స్కంధములతో ఈ రెండవ భాగము ముద్రితమైనది. వృద్ధులకు కూడా చదువుటకనుకూలముగ నుండుటకై గ్రంథమును పెద్ద అక్షరములలో ముద్రించితిమి. ఈ గ్రంథములో ప్రతిస్కంధములోను శ్రీ వ్యాసమహర్షి రచించిన సంస్కృత మూలశ్లోకములు, వానికి ఆంధ్రతాత్పర్యములు, కొన్ని చోట్ల పోతనామాత్యుని తెలుగు పద్యములు ఈయబడినవి. వ్యాసుడు రచించిన బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యాన రూపములైన భాగవత శ్లోకములను ప్రత్యేకముగ నిచ్చితిమి.

శ్రీ మద్భాగవతము, జైవధర్మము, భక్తిరసామృత సింధువు ఇత్యాది పెక్కుగ్రంథములను తెనుగించిన శ్రీ జన్నాభట్ల వాసుదేవ శాస్త్రి (భాషా ప్రవీణ) గారు ఈ గ్రంథమునందలి చతుర్థ స్కంధము యొక్క ప్రూఫును సరిచూచుచు గుంటూరు నందలి స్వగృహములో అంతిమ శ్వాసను విడచిరి. వారికి శ్రీ శ్రీ గురుగౌరాంగ గాంధర్వికా గిరిధారులు తమ నిత్యసేవను ప్రసాదించు గాక యని ప్రార్థించుచున్నాము.

ఈ గ్రంథ ముద్రణమునకు ద్రవ్యసహాయమొసర్చిన భక్తులకు, ప్రూఫులు సరిచూచిన త్రిదండి శ్రీ భక్తి ప్రమోద జనార్దన మహారాజ గారికి, ఈ గ్రంథమును సకాలములో సర్వాంగ సుందరముగ ముద్రించి ఇచ్చిన శ్రీ లక్ష్మీ గణపతి ప్రింటింగ్ వర్క్సు అధికారులైన శ్రీ మన్యం నాగభూషణరావు గారికి, శ్రీ మన్యం వీర భద్రరావు గారికి శ్రీ శ్రీ రాధాకృష్ణుల పరిపూర్ణ కృపాకటాక్షము లభించుగాక!

ఇట్లు,
భాగవత సేవలో
త్రిదండి శ్రీ భక్తి సుధీర దామోదర మహారాజ

కొవ్వూరు
23-9-1996




శ్రీమద్భాగవతము ప్రథమ భాగమును ఆవిష్కరించు సమయమున కీ॥శే॥ శ్రీ జన్నాభట్ల వాసుదేవ శాస్త్రిగారు త్రిదండిస్వామి శ్రీ భక్తి సుధీర దామోదర మహారాజగారి నుండి గ్రంథమును అందుకొనుచున్న దృశ్యము.



# చతుర్థ స్కంధము

శ్రీ శ్రీ గురుగౌరాంగౌ జయతః

# అవతరణిక

జీవులు పురుషార్థములకై పెక్కువిధములుగ పాటుపడు చుందురు. పురుషార్థముల వలననే అర్థము, పరమార్థము, పరమానందము సాధింపవచ్చునని వారి అభిప్రాయము. అయ్యభిప్రాయము యథార్థమే కాని శ్రేష్ఠమైన పురుషార్థ మననేమియో విచారింపవలసి యున్నది.

"శ్రీమద్భాగవతము" పురుషార్థములను నిర్ణయించు గ్రంథము. అది వేదసారము, శ్రీకృష్ణ విగ్రహాభిన్నము నై యున్నది. ఈ విషయమును శ్రీచైతన్య భాగవత మిట్లు చెప్పుచున్నది-

***సబే పురుషార్థ "భక్తి" భాగవతే హాయ,***

***"ప్రేమరూప భాగవత" చారి వేదే కయ॥***

***చారివేద - "దధి" భాగవత - "నవనీత",***

***మథిలేన శుకే - ఖాయిలేన పరీక్షిత॥***

"సర్వశ్రేష్ఠమైన పురుషార్థమగు భక్తి భాగవతములో వివరింపబడినది. భాగవతము ప్రేమరూపమైన దని నాలుగువేదములు చెప్పుచున్నవి. నాలుగు వేదములు దధివంటివి. భాగవతము నవనీతము వంటిది. శుకుడు దానిని మథించెను. పరీక్షిన్మహారాజు దానిని ఆస్వాదించెను." ఈ విషయమును గూర్చి శ్రీచైతన్య చరితామృతము ఇట్లు చెప్పినది.

***"కృష్ణతుల్య భాగవత విభు సర్వాశ్రయ,***

***ప్రతిశ్లోకే ప్రతిఅక్షరే నానాఅర్థ కయ"॥***

"శ్రీమద్భాగవతము శ్రీకృష్ణునితో సమానమై, విభువై, సర్వాశ్రయమై విరాజిల్లుచున్నది. అందులోని ప్రతిశ్లోకము, ప్రత్యక్షరము నానావిధములైన అర్థములను చెప్పుచున్నది."

పై యుదాహరణములనుబట్టి శ్రీమద్భాగవతము శ్రీకృష్ణ స్వరూపమనియు, పరమార్థదాయక మనియు, రసాలయమనియు తేటతెల్లమగుచున్నది.

ప్రస్తుత మట్టి శ్రీమద్భాగవతములోని చతుర్థస్కంధము ముద్రితమైనది. "తృతీయ తుర్యౌ యదూరూ" అను శ్లోక పాదమును అనుసరించి ఈ స్కంధము శ్రీకృష్ణునియొక్క ఊరువు (తొడ) వంటిదని పద్మపురాణము చెప్పుచున్నది. ఈ స్కంధములో సతీదేహ త్యాగఘట్టము వలన గురువును తిరస్కరించు వారికి ఆత్మనాశము, వైష్ణవ దూషణము చేయువారికి సంసారాసక్తి కలుగునని తెలుపబడినది; అధర్మ వంశఘట్టమువలన మిథ్యా వ్యవహారముచే ప్రపంచమున కలహము వృద్ధిచెందుననియు, ఆ కలహమే నరకయాతనకు కారణమనియు; ధ్రువ చరిత్రమువలన చిన్ననాటి నుండియే భగవద్దర్శనమునకై ప్రయత్నింపవలెననియు, భగవద్దర్శనము అయినప్పటికి విషయమున్నై యున్నచో ఆ విషయములవలన బాధలు తప్పవనియు, భక్తులు భగవంతుని నుండి విషయ సుఖములను కోరగూడదనియు; అంగరాజ చరిత్రము వలన భగవంతుని పూజించి లభించునట్టి పుత్రకళత్రాదులను కోరగూడ దనియు, దుష్పుత్రుడు కూడ విషయాసక్తికి సహాయ కారియనియు; పృథుచక్రవర్తి చరిత్రమువలన రాజులు ప్రజలను బిడ్డలవలె పోషింప వలెననియు, పెద్దలు చెప్పినప్పుడు తన పట్టుదలను విడచి పెట్టవలెననియు, ఎంత ఉన్నతపదవిలో నున్నప్పటికిని మహాభాగవతులను గౌరవించు చుండవలెననియు, మహాభాగవతులు భగవంతుని గూర్చి చెప్పుచున్నప్పుడు దానిని వినుటయందు ఆసక్తి కలిగియుండ వలెననియు; ప్రాచీనబర్హి నారద సంవాదము వలన కర్మలచే ఎన్నడును శ్రేయస్సు చేకూరదనియు, పురంజనోపాఖ్యానము దానికి సరియగు తార్కాణమనియు, వైష్ణవ సాంగత్యమే భగవంతుని నుండి కోరదగిన విషయమనియు, క్షణకాలమైనను సాధుసాంగత్యము లభించినచో జీవితము ధన్యము కాగలదనియు తెలియవచ్చు చున్నది.

శ్రీ చైతన్య మఠప్రతిష్ఠాతలగు శ్రీశ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ ఠాకురులు సంస్కృతమునుండి వంగభాషలోనికి అనువదించిన దానిని శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రి 'భాషాప్రవీణ' గారు సరళగ్రాంథిక భాషలోనికి ఆంధ్రీకరించి ఆంధ్రపాఠకలోకమున కెంతయు మేలు కలుగజేసినారు. వారికి ప్రేమమూర్తులైన శ్రీశ్రీ రాధాకృష్ణులు సర్వసుఖముల జేకూర్చుగావుత.

గుంటూరు

20-11-80

ఇట్లు

శ్రీ భక్తి విజయవిష్ణు

# విన్నపము

శ్రీ మద్భాగవతము ద్వాదశస్కంధాత్మకము, అష్టాదశ సహస్ర శ్లోకపరిమితము, గాయత్రీ భాష్యరూపము, బ్రహ్మసూత్రార్థ బోధకము, భారతార్థ వినిర్ణయము, వేదార్థ పరిబృంహితము, పారమహంస్యము, వైయాసిక్యము, భగవదభిన్న విగ్రహము, ప్రేమభక్తి ప్రబోధకము, వైష్ణవప్రియంకరము, సమాధి భాషాగ్రథితము.

ప్రస్తుత గ్రంథము ఆశ్రీమద్భాగవతములోని నాలుగవ స్కంధము. ఇది భాగవతస్వరూపుడైన భగవానునియూరువులలో నొకటి. ఈ స్కంధములో ముప్పదియొక్క (31) అధ్యాయములు, 1,455 శ్లోకములు గలవు. సర్గాదిదశ లక్షణములలో రెండవది యగు విసర్గము దీనిలో వివరింపబడినది. బ్రహ్మద్వారా జరుగువ్యష్టిసృష్టిలేదా వివిధసృష్టులను విసర్గమందురు. శ్రీమద్భాగవతమున విసర్గసృష్టితత్త్వము వర్ణింపబడుటలో గల తాత్పర్యము జనులా విసర్గముద్వారా ఆశ్రయభూతుడగు భగవానుని అన్వేషించి ఆయనను పొందుటకే. ఈ స్కంధములో స్వాయంభువ మనువు పుత్రికల వంశము విపులముగ వర్ణింపబడినది. సతీదేవి దేహత్యాగము, దక్షయజ్ఞ ధ్వంసము, దక్షయజ్ఞ సమాప్తి. ధ్రువోపాఖ్యానము, ధ్రువవంశము, వేనరాజు కథ, పృథుచక్రవర్తికథ, పృథుచక్రవర్తి వంశపరంపర, రుద్రగీతము, పురంజనో పాఖ్యానము, ప్రచేతసుల చరిత్ర మున్నగు విషయములు విపులముగ వర్ణింపబడినవి.

ధ్రువుడు అర్థార్థి యగు భక్తుడు. అతడు భగవానుని శరణాగతిని పొందగా భగవానుడాయనకు దర్శనమిచ్చెను. రాజ్యము నొసంగెను. చివరకు వైకుంఠమునుగూడ నొసంగెను. ఇదియె భగవానుని యనన్యశరణాగతి ఫలము. ఈజన్మమునందే భగవానుని పొందవలె నన్న బాల్యావస్థనుండియె భగవద్భక్తి కలిగియుండవలె ననియూ ధ్రువోపాఖ్యానము చెప్పుచున్నది.

పృథుమహారాజు అర్చనభక్తికి ఉదాహరణము. ఆయనభార్య అర్చి. అర్చనభక్తిలో పృథువు శ్రేష్ఠుడు.

నారదుడు ప్రాచీనబర్హికి చిత్తశుద్ధి యైన పిమ్మట ఏకాంతమున కూర్చుండి భగవానుని ధ్యానింప వలెననియు, యజ్ఞమును జేసినంత మాత్రమున ఈశ్వర సాక్షాత్కారము కలుగదనియు బోధించెను.

స్వస్వరూపము నెఱుంగనివాడు ఈశ్వరుని గుర్తింపడను విషయము పురంజనో పాఖ్యానము ద్వారా వివరింపబడెను. ఈ కథరూపకముగ చెప్పబడినది.

ఈ స్కంధమంతయు విదురమైత్రేయ సంవాదరూపమున నడచినది.

దీనిలో సుందరములైన ప్రకృతివర్ణనలు, భక్తిపూరితములైన స్తుతులు, విష్ణుభగవానుని రూపవర్ణనము, ధర్మార్థ కామమోక్షముల వివరణములు, నీతిబోధకము లగు విషయములు మున్నగున వెన్నియో గలవు. ఇవి పాఠకునకు ఆనందమును, భగవద్భక్తిని గలిగించును.

**"అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం"** అనుగరుడ పురాణవచనానుసారము శ్రీమద్భాగవతము బ్రహ్మసూత్రములకు అకృత్రిమ భాష్యముగా జెప్పబడినది. 558 బ్రహ్మసూత్రములు పండ్రెండు స్కంధములలో ఇముడ్చబడినవి. ప్రస్తుత స్కంధములో 29 సూత్రములను 40 శ్లోకములు వ్యాఖ్యానరూపమున వ్రాయబడినవి.

వెనుకటి స్కంధములలో వలె దీనిలో గూడ మొదట స్కంధకథాసారము, అధ్యాయకథాసారము, తరువాత ప్రతి శ్లోకమునకు తాత్పర్యము వ్రాయబడినవి. కొన్నిశ్లోకముల కచ్చటచ్చట విశేష వివరణములుగూడ నొసంగబడినవి. ఆయా శ్లోకముల క్రింద పోతనామాత్యుని భాగవతములోని మధురము లగు పద్యములు 81 వఱకు వ్రాయబడినవి. చివరలో శ్లోకపద్యాను క్రమణిక లీయబడినవి.

ప్రభుపాద శ్రీ శ్రీలభక్తి సిద్ధాంత సరస్వతీఠాకురులు వంగభాషలో అనువదించిన శ్రీమద్భాగవతము ననుసరించి నే నీ ఆంధ్రానువాదము చేసితిని. నిత్యలీలాప్రవిష్టులగు ఓం విష్ణుపాద శ్రీశ్రీమద్భక్తివిలాస తీర్థగోస్వామి మహారాజాగారి యనుగ్రహమునకు పాత్రులగు త్రిదండిస్వామి శ్రీభక్తికమల పద్మనాభ మహారాజా, త్రిదండిస్వామి శ్రీభక్తి విజయ విష్ణుమహారాజా, త్రిదండిస్వామి శ్రీభక్తిసుధీర దామోదర మహారాజాగార్ల ప్రోత్సాహముచే నాకీ భాగవతానువాద సేవాభాగ్యము గలిగినది. ముఖ్యముగ శ్రీభక్తి విజయవిష్ణు మహారాజాగారు ముద్రణకు పూర్వ మీయనువాదమును శ్రద్ధగ విని అచ్చటచ్చట తగినసలహాల నిచ్చిరి. పై మువ్వురికీ నా సాష్టాంగ నమస్కారములు.

ఇట్లు

భక్తజనాంఘ్రిరేణువు

**జన్నాభట్ల వాసుదేవశాస్త్రి**

గుంటూరు

20-11-80

# బ్రహ్మ సూత్రములు - వానికి వ్యాఖ్యాన రూపములైన ఈ చతుర్థస్కంధములోని శ్లోకములు

(ప్రక్కన బ్రాకెట్లలో ఈయబడిన మూడంకెలు గలవి సూత్రములు; రెండంకెలు గలవి శ్లోకములు.)

**సూ. ప్రాణస్తథానుగమాత్** (1-1-28)

శ్లో॥ యోఽన్తః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం (9-6)

ఏకస్త్వమేవ భగవన్నిదమాత్మశక్త్యా (9-7)

**న వక్తురాత్మోపదేశాదితి చేదధ్యాత్మ సంబన్ధ భూమా హ్యస్మిన్** (1-1-29)

అంశాంశాస్తే దేవ మరీచ్యాదయ ఏతే (7-43)

**ధృతేశ్చ మహిమ్నోఽస్యాస్మిన్నుపలబ్ధేః** (1-3-16)

బ్రహ్మ చ బ్రాహ్మణాంశ్చైవ యద్యూయం (2-30)

**తదుపర్యపి బాదరాయణః సంభవాత్** (1-3-26)

యస్యాంఘ్రిపద్మం పరిచర్య విశ్వ (8-20)

**శుగస్య తదనాదర శ్రవణాత్తదా ద్రవణాత్సూచ్యతేహి** (1-3-34)

దృఢవ్రతః సత్య సంధో (16-16)

మాతృభక్తి పరస్త్రీషు (16-17)

దేహినామాత్మవత్ (16-18)

**కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః** (1-4-14)

యత్రేదం వ్యజ్యతే విశ్వం (24-60)

**సమాకర్షాత్** (1-4-15)

త్వమేకమాద్యః పురుషః సుప్తశక్తిః (24-63)

సృష్టం స్వశక్త్యేదమనుప్రవిష్టః (24-64)

**జగద్వాచిత్వాత్** (1-4-16)

యత్రేదం వ్యజ్యతే విశ్వం (24-60)

| | |
|---|---|
| **అపీతౌ తద్వత్ ప్రసంగాదసమంజసమ్** | (2-1-8) |
| పురాకల్పాపాయే స్వకృతం | (7-42) |
| న తు దృష్టాన్తభావాత్ | (2-1-9) |
| శుద్ధం స్వధామ్న్యుపరతాఖిల | (7-26) |
| **ఆత్మని చైవం విచిత్రాశ్చహి** | (2-1-28) |
| యస్మిన్ విరుద్ధ గతయో | (9-16) |
| **అనుస్మృతేశ్చ** | (2-2-25) |
| ఏకస్త్వమేవ భగవన్నిద | (9-7) |
| **క్షణికత్వాచ్చ** | (2-2-31) |
| అతస్తదపవాదార్థం | (29-79) |
| తేజోఽత స్తథా హ్యాహ | (2-39) |
| త్వమేక ఆద్యః పురుషః సుప్తశక్తిః | (24-63) |
| **ఆపః** | (2-3-10) |
| పృథివ్యధికార రూప శబ్దాన్తరేభ్యః | (2-3-11) |
| మహానహం ఖం మరుదగ్నివార్ధరాః | (25-62) |
| **జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్** | (2-4-14) |
| యోన్తఃప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం | (9-6) |
| ఏకస్త్వమేవ భగవన్నిదమాత్మశక్త్యా | (9-7) |
| **అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్** | (3-1-4) |
| ఏవం స వీరప్రవరః | (23-13) |
| ఉత్సర్పయంస్తు తం మూర్ధ్ని | (23-15) |
| **భాక్తం వాఽనాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి** | (3-1-7) |
| స్వం లోకం న విదుస్తే వై యత్ర | (29-48) |
| తథా కామాశయో జీవ | (29-31) |
| **కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యామ్** | (3-1-8) |
| గుణాభిమానీ స తదా | (29-37) |

| | |
|---|---|
| క్వచిత్పుమాన్ క్వచిచ్చస్త్రీ | (29-29) |
| **చరణాదితి చేన్న తదుపలక్షణార్థేతి కార్ష్ణాజినిః** | (3-1-10) |
| ఏవం పంచవిధం లిఙ్గం | (29-74) |
| అనేన పురుషో దేహాన్ | (29-75) |
| యదాద్యైశ్చరితాన్ ధ్యాయన్ | (29-78) |
| **ఉభయవ్యపదేశాత్త్వహికుణ్డలవత్** | (3-2-28) |
| త్వం ప్రత్యగాత్మని తదా | (11-30) |
| **అన్తరా భూతగ్రామవత్ స్వాత్మనః** | (3-3-36) |
| యదా యస్యానుగృహ్ణాతి | (29-46) |
| **ధ్యానాచ్చ** | (4-1-8) |
| ప్రసాదాభిముఖం శశ్వత్ | (8-45) |
| తరుణం రమణీయాంగం | (8-46) |
| **అతివాహికాస్తల్లిఙ్గాత్** | (4-3-4) |
| స దదర్శ విమానాగ్ర్యం | (12-19) |
| తత్రాసుదేవప్రవరౌ చతుర్భుజౌ | (12-20) |
| **ఉభయవ్యామోహాత్ తత్సిద్ధేః** | (4-3-5) |
| **భో భో రాజన్ సుభద్రం తే** | (12-23) |
| తస్యాఖిలజగద్ధాతుః | (12-24) |
| **సామీప్యాత్తు తద్వ్యపదేశః** | (4-3-9) |
| స్వధర్మనిష్ఠః శతజన్మభిః పుమాన్ | (24-29) |
| **విశేషం చ దర్శయతి** | (4-3-16) |
| **తస్యాఖిలజగద్ధాతుః** | (12-24) |
| **బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః** | (4-4-5) |
| **భో భో రాజన్ సుభద్రం తే** | (12-23) |
| **చైతన్యరూపం భవతోఽపి పదార్థ** | (7-31) |

# చతుర్థస్కంధ కథాసారము

తృతీయస్కంధమున వర్ణితుడగు కపిలదేవుడు స్వాయంభువమనువు దౌహిత్రుడు. మనువునకు ముప్వురు కన్యకలు, ఇరువురు పుత్రులు గలరు. ఆ ముగ్గురుకన్యకలలో ఆకూతిని ప్రజాపతి యగురుచి, దేవహూతిని కర్దమఋషి, ప్రసూతిని ప్రజాపతి యగుదక్షుడు వివాహమాడిరి. దక్షునకు పదునాఱు గురుపుత్రికలు గలిగిరి. వారిలో సతియనుకన్య యగుసతిని శివుడు వివాహమాడెను.

పూర్వకాలమున విశ్వస్రష్టల యజ్ఞములో శివుడు ప్రత్యుత్థానాదుల ద్వారా దక్షుని ఏవిధముగను గౌరవింపక పోవుటచే దక్షుడు భౌతికదృష్టితో శివుని తనకంటె హీనునిగ భావించి బహుదేవతలు ఋషులు గలసభలో ఆ శివుని నిందించి "శివదీక్షయందు దీక్షితుడగు వ్యక్తి పాషండధర్మాశ్రితుడగు గాక" యని శపించెను. శివానుచరుడగు నంది శివదూషణమును విని క్రుద్ధుడై "శివనింద చేసిన వారిమతి వేదములలోని యర్థవాదములచే జడీకృతము, దేహమునందాసక్తము నగుగాక! వారు ఛాగముఖులై క్రియలం దాసక్తులు, సర్వభోక్తలు అగుదురుగాక! పరమార్థమునుండి చ్యుతులై సంసారయాతన ననుభవింతురు గాక!" యని శపించెను.

దక్షుడు రుద్రేశ్వరుని ఆహ్వానింపక "బృహస్పతిసవన" మను యజ్ఞము నారంభింపగా త్రిలోకములలో నివసించు వారందఱు నా యజ్ఞమున పాల్గొనుట చూచి సతీదేవి పితృయజ్ఞమును జూడ మిగుల కుతూహల పడెను. ఆమె శివునితో "పితృయజ్ఞమును జూడ నేగెద" ననిపలికెను. పూర్వవృత్త మగు దక్షుని వ్యవహారమును గుర్తుచేసి రుద్రుడామె నచటికి వెడలవల దనుచు ఇట్లు పలికెను:- 'విద్య, తపస్సు, విత్తము, దేహము, వయస్సు, కులము అనునవి సాధువులయందున్నచో గుణరూపమున శోభిల్లును. కాని యివి యన్నియు అసాధువగు వ్యక్తియం దున్నచో వానికి గర్వము పెరుగును. సాధువగు వ్యక్తి వాసుదేవునకు దాసుడు, ప్రణతుడునై జీవమాత్రుని గౌరవించును. అందువలన వైష్ణవవిముఖుడు బహిర్ముఖుడగు జీవున కెవనికిని స్వతంత్ర భావముతో అభివాదాదులను చేయవలసిన అవసరము లేదు.'

సతి శివుని వాక్కుల నుల్లంఘించి పితృగృహమునకు వెడలెను. ఆమెతల్లియు, అక్కలుతప్ప ఇతరులెవ్వరును దక్షుని భయముచే సతిని పలుకరింపలేదు. యజ్ఞమున రుద్రునకు భాగము లేకపోవుట చూచి సతి యిట్లుపలికెను:- "దుర్మదుడగు వ్యక్తి వైష్ణవనింద చేసినచో సామర్థ్య మున్నవాడు వాని జిహ్వను ఛేదించవలెను లేదా తాను దేహత్యాగము చేయవలెను. అసమర్థుడైనచో చెవులుమూసికొని యాప్రదేశము వీడిపోవలయును." ఆమె వైష్ణవ విద్వేషి యగుతండ్రివలన గలిగిన దేహమును ధరించుట కిష్టపడక యోగబలముచే తనదేహమును దగ్ధము జేసికొనెను.

నారదాదులవలన సతియొక్క దేహత్యాగమును విని శివుడు క్రుద్ధుడై శిరస్సునుండి యొకజడను పెఱికి భూమిపై గొట్టెను. దానినుండి వీరభద్రుడు జన్మించెను. వీరభద్రుడు శివునియాదేశము ననుసరించి దక్షయజ్ఞమునకు వెడలి యజ్ఞమును ధ్వంసముచేసి, దక్షుని సంహరించెను. దక్షసంహారమును విని బ్రహ్మ దేవతలతోగూడి శివునికడకు వెడలి వివిధములగు స్తుతులద్వారా శివుని ప్రసన్నునిగ జేసి దక్షుని తిరిగి బ్రతికింపవలసినదిగా గోరెను. శివునికృపవలన దక్షుడు ఛాగశిరస్కుడై జీవించెను. మరల యజ్ఞమును ప్రారంభించి రుద్రునకు యజ్ఞభాగము నిచ్చెను. సతి హిమవంతుని గృహమున జన్మించి మరల శివుని వివాహమాడెను.

స్వాయంభువమనువు పుత్రుడగు ఉత్తానపాదునకు సునీతి సురుచి యనునిరువురు భార్యలు గలరు. సురుచి పతి కత్యంత ప్రేయసి యయ్యెను. సునీతిపుత్రుడగు ధ్రువుడు సవతితల్లి యొక్క మాటలకు దుఃఖితుడై సర్వదుఃఖ నివారకుడగు శ్రీహరిని ఆరాధించుటకై వనమునకు వెడలెను. అచట నారదకృపను పొంది కఠోరతపస్సుచే శ్రీహరిని సంతుష్టి పఱచెను. ఆయన ధ్రువుని వరము నడుగవలసిన దని పలికెను. ధ్రువుడు దానికి సమాధానముగ నిట్లు పలికెను: - "విష్ణువును వరకము నీయవలయు ననియడుగుట మూర్ఖులపని. భక్తులసహవాసమున హరికథను వినుట కీర్తించుట యనునవే జీవుడు కోరవలసినది. బ్రహ్మానందము గూడ దానిముందు తుచ్ఛమైనదే." ధ్రువున కపూర్వధామము, సుదీర్ఘ జీవనము, అప్రతిద్వంద్వమగు సామ్రాజ్యభోగములను ఇచ్చి శ్రీహరి యంతర్ధాన మయ్యెను. ధ్రువుడు రాజధానికి తిరిగిరాగా ఉత్తానపాదుడు ధ్రువునకు రాజ్యభారము నిచ్చి వానప్రస్థమును స్వీకరించెను.

ధ్రువుడు రాజ్యమును పొందిన పిమ్మట వాని సవతితల్లి కొడుకగు ఉత్తముడు వేటకై వెడలి యక్షులచేతిలో మృతుడయ్యెను. ఈ సంఘటనను విని ధ్రువుడు యక్షుల పట్టణము పైకి దండెత్తి యక్షులను నాశనము చేయపోగెను. ఇంతలో మనువచటికి వెడలి ధ్రువునితో నిట్లు పలికెను- "దేహాత్మాభిమానులగు జీవులె పరస్పరము హింసచేసికొను చుందురు. భగవద్భక్తులు సర్వభూతములయందు సమదర్శులై యుందురు. భ్రాతృత్వాది సంబంధము పంచభూతాత్మక మగు దైహిక సంబంధము మాత్రమే. భగవానుని కాలశక్తి ప్రభావము చేతనే దేహము వినాశము చెందును. తమతమ కర్మానుసారముగ జీవునకు విభిన్నగతులు కలుగును. భగవానుడె యందఱకు మూలకారణుడు. ఆయన నన్వేషించినచో అహంకార మమకారబుద్ధి నశించును.

మనువు ఉపదేశమును విని ధ్రువుడు హింసాకార్యమును వదలగా యక్షాధిపతి యగు కుబేరుడు ధ్రువుని వరమడుగ వలసినదిగ పలికెను. ధ్రువుడు అచల మగు

భగవత్స్మృతిని తప్ప మఱిదేనిని గూడ కోరలేదు. అచటినుండి తన నగరమునకు దిరిగివచ్చి వివిధములగు యజ్ఞానుష్ఠానముల ద్వారా శ్రీహరి నారాధించి చివరకు విష్ణువు యొక్క పరమపదమును పొందెను.

ధ్రువుని తరువాత అంగరాజునుండి వేనుడు జన్మించెను. వేనుని దుష్ప్రవర్తనముచే అంగరాజు పట్టణమును విడచి వెడలగా వేనుడు రాజ్యభారమును స్వీకరించి మహాభాగవతుల కపచారము చేయసాగెను. మునులు వేనునకు సదుపదేశము చేయదలచి యిట్లు పలికిరి- "సర్వలోకారాధ్యుడగు శ్రీహరిభక్తుల నవమానించుట తగదు. వారి కోపమువలన శ్రీహరికి పొందినచో జీవునకిక పొందదగిన దేదియు నుండదు". వేనుడు ఆ మాటలకు కుపితుడై తానే సర్వ పూజ్యుడననియు, తన్ను తిరస్కరించి శ్రీహరిని యారాధించుట కులట యగు స్త్రీయొక్క వ్యభిచారము వంటిదనియు పలికెను. మునులు విష్ణునిందను విని హుంకార శబ్దముచే వేనుని సంహరించిరి. వేనునితల్లి మంత్రబలముచే కుమారుని మృతకళేబరమును రక్షించెను. రాజు లేకపోవుటచే రాజ్యమున వివిధములగు ఉపద్రవములు చెలరేగెను. ఇది చూచి మునులామృతు డగు వేనుని బాహువును మథించిరి. దానివలన విష్ణువుయొక్క అంశతో భార్యాసహితుడై పృథువు ఆవిర్భవించెను. బ్రహ్మతోగూడ దేవతలందరు చటకు వచ్చి పృథువునకు అస్త్రశస్త్రాదులను కానుకలుగా నిచ్చి వానిని రాజసింహాసనముపై అభిషిక్తునిగ జేసిరి. వంది మాగధులు వానిని స్తుతింప మొదలిడగా అతడు వారి కిట్లు బోధించెను-" పుణ్యకీర్తి యగు శ్రీహరియొక్క లీల లెన్నియో యుండగా అల్పకీర్తి గల రాజులస్తుతి ద్వారా యేలవాక్కులను వ్యర్థముగ వ్యయపఱచెదరు? ఇది యనుచితము." పిమ్మట ఆయన నూఱుయజ్ఞముల నొనర్చెను. చివర యజ్ఞమున ఇంద్రుడు యజ్ఞాశ్వమును హరించెను. పృథువు యజ్ఞాహుతుల ద్వారా ఇంద్రుని నాశనము చేయుటకు ప్రయత్నించు డయ్యెను. అపుడు బ్రహ్మ యచటకు వచ్చి దానిని నివారించెను. యజ్ఞేశ్వరుడగు విష్ణువు యజ్ఞస్థలమునకు వచ్చి పృథువునకు తత్త్వోపదేశము చేసి, అంతట సమబుద్ధిగలవాడవై ప్రజాపాలనము చేయవలసినదిగ ఆదేశించెను. పృథువు విష్ణువు ఆదేశము ననుసరించి యింద్రునిపట్ల వైరభావమును విడచెను. విష్ణుభగవానుడు పృథువును వర మడుగవలసి నదిగ పలికెను. 'సత్పురుషుల వలన హరికీర్తన శ్రవణఫలమును గ్రహించి భగవద్గుణాను వాదశ్రవణమునకై పదివేల చెవుల నీయవలసినదిగ' కోరెను. విష్ణువు ఆమాటలను విని సంతుష్టుడై యంతర్హితుడయ్యెను.

పృథువు రాజ్యమునకు వచ్చిన పిమ్మట ధరణి అన్నరహిత కాగా ప్రజలు ఆకలిచే పీడితులై పృథువును శరణుజొచ్చిరి. పృథివి ఓషధుల నన్నింటిని గ్రసించి వేసిన దని అనుమానించి పృథుమహారాజు పృథివిపై బాణము నెక్కుపెట్టెను. పృథివి భీతయై పృథువును

శరణుజొచ్చెను. పృథువు పృథివియొక్క వాక్కుల ననుసరించి వత్సపాత్రాది భేదములచే పృథివి నుండి యోషధులను పిండెను.

పృథుమహారాజు ఇంకను నూరు యజ్ఞములను జేసి ప్రజలకు పరమపురుషుడగు విష్ణువును, వైష్ణవులను గౌరవింప వలసినదిగా నుపదేశించెను.

భగవదాదేశము ననుసరించి సనత్కుమారుడు పృథువు సభలోనికి వచ్చెగా పృథుమహారాజాయనను జీవుల శ్రేయస్సును ఉపాయము నడిగెను. సనత్కుమారుడు యిట్లు పలికెను - 'విషయసాంగత్యమును వదలి మనుజుడు విరక్తి నాశ్రయించుట, ఆత్మేంద్రియ తృప్తిమూలక మగు పనుల భజనమును వదలుట, హరిగుణములను గానముచేయుట, సహనము చూపుట మున్నగువాని ద్వారా పరబ్రహ్మమునందు నైష్ఠికమగు భక్తి కలిగి దేహముల యందు అహంకార మమకారములు నశించును. అవియే జీవుని కాత్యంతిక సుఖవిషయము. కేవల విషయచింతనము స్మృతిభ్రంశము చేసి ఆత్మ వినాశమునకు గారణమగును.

పృథుమహారాజు సనత్కుమారుని యుపదేశము ననుసరించి అహంకారమును వదలి భక్తి మార్గ విహిత మగు అనుష్ఠానముద్వారా కర్మఫలములను నాశనము చేసెను. దానివలన వానికి శ్రీహరి యందు ఐకాంతిక మగు భక్తి కలుగుటచే వాని సంసార బంధనములు భిన్నములయ్యెను. చివరకు యోగబలముతో కళేబరమును త్యజించెను. ఆయన సహధర్మచారిణి ఆయన ననుసరించెను.

పృథుతనయుడగు విజితాశ్వునకు హవిర్ధానుడను పుత్రుడు కలిగెను. అతడు యజ్ఞములను చేసి ప్రాచీనాగ్రములగు కుశలద్వారా పృథివీతలము నాచ్ఛాదనము చేయుటవలన అతనికి ప్రాచీనబర్హి యను నామము కలిగెను. ప్రచేతసులు వీని పుత్రులే. ప్రచేతసులు శివోపదేశము ననుసరించి రుద్రగీత స్తవము ద్వారా పదివేల సంవత్సరములు విష్ణువు నారాధించిరి. వైష్ణవశ్రేష్ఠుడగు రుద్రుడు ప్రచేతసులతో నిట్లు పలికెను - 'విష్ణుభక్తులు రుద్రుని కతిప్రియులు, స్వధర్మనిష్ఠ కలిగిన వ్యక్తి నూరుజన్మలు బ్రహ్మత్వమును, పిమ్మట రుద్రుని సాక్షాత్కారమును పొందును, కాని వైష్ణవులు వెంటనే విష్ణువు పరమపదమును పొందగలుగుదురు. స్వర్గవిషయము నట్లుండనీయుము ముక్తిని గూడ వారు హీనమైనదిగ తలంతురు."

ప్రచేతసులు తపస్సు చేయునపుడు దేవర్షియగు నారదుడు ప్రాచీనబర్హికడకు వెడలి వాని నుపదేశించెను. కర్మల ద్వారా యెప్పుడును నిశ్శ్రేయసము లభింపదు. యజ్ఞాదులచే సంహరింపబడిన పశువులు పరజన్మమున తమ్ముజంపిన వానిని దిరిగి చంపును. ఈ

ప్రసంగమున దేవర్షి యొకయుపాఖ్యానమును జెప్పెను. పురంజనుడను నొకరాజు భోగములయం దాసక్తుడై వివిధ ప్రయత్నములతో ఎన్నియో భోగముల ననుభవించినను తృప్తుడుకాలేదు. అతడు యజ్ఞము ద్వారా యేపశువులను సంహరించెనో అవి మృత్యువునై యమలోకమునకు వెడలిన పురంజనుని సంహరింప సాగినవి. మరియు పూర్వజన్మమున ఎల్లపుడు స్త్రీయందాసక్తుడై యుండుటకు ఫలముగ ఒకానొకరాజునకు పుత్రీరూపమున జన్మించెను. ఆజన్మమున అదృష్టముచే కృష్ణభక్త సాంగత్యమును పొంది వైరాగ్యయుక్త మగు భక్తి యోగము నవలంబించి పరమార్థమును పొందెను. ఈ పురంజనుడు మఱియెవ్వరోకాదు. బద్ధజీవుడు తన స్వాతంత్ర్యమును దుర్వినియోగ పఱచుటవలన, కృష్ణ విస్మృతివలన, భోగముల యం దాసక్తమైన చిత్తమువలన జీవునకెట్టి దుర్గతి కలుగునో యను విషయమొక రూపకము ద్వారా ప్రదర్శింపబడినది. దేవర్షి ప్రాచీనబర్హికి ఉపదేశమును ఈ విధముగ జెప్పెను. "కేవలము కర్మద్వారా త్రితాపముల వలన గలుగు బాధలకు ప్రతీకారము చేయప్రయత్నించుట శిరముపై నున్న బరువును భుజముపై నుంచుకొని అలసటను తగ్గించుట వంటిదే యగును. కర్మద్వారా ఉత్పన్నములగు వివిధయోనుల యందు పరిభ్రమించుచుండును. స్వప్నదృష్టము లగు దుఃఖములు జాగ్రదవస్థ లేనిది దూరము కానట్లు వాసుదేవుని యందు భక్తికాక యితరోపాయములచే జీవునకు శుభము కలుగదు. సత్పురుషులు వచించు హరికథను వినుటచేతనే జీవుని త్రితాపములు నశించును; పరమప్రయోజన మగు భగవత్ప్రేమను పొందుటకు సమర్థుడగును. గురు బ్రుపుడు ఆత్మతత్త్వమును తెలిసికొనజాలడు. సద్గురువే జీవుని సంశయములను భేదింపగలడు. మనస్సే సంసారమునకు కారణము. ప్రాచీనబర్హి నారదోపదేశముచే భక్తియోగము నవలంబించి సారూప్యముక్తిని పొందెను.

ప్రచేతసులు విష్ణువు నారాధించి ఆయనకు సంతోషమును గలిగించిరి. విష్ణువు ప్రత్యక్షమై ప్రచేతసులను వరమడుగ వలసినదని పలికెను. వారు వైష్ణవసాంగత్యమును వరమును గోరిరి. ఏలయన క్షణకాల సాధుసాంగత్యము అశేష శుభములను జేకూర్చును. వారు విష్ణువు ఆదేశము ననుసరించి అప్సరస పుత్రిక యగు మారిషను వివాహమాడి దక్షుడను పుత్రుని గనిరి. ఈ దక్షుడు శివశాపముచే గర్భవాసబాధ ననుభవించెను.

ప్రచేతసులు దక్షునకు రాజ్యమిచ్చి భక్తియోగము నవలంబించి ముక్తిని పొందిరి.

❀ ❀ ❀

శ్రీశ్రీ గురు గౌరాంగౌ జయతః

# శ్రీ మద్భాగవతము

# చతుర్థ స్కంధము

## మొదటి అధ్యాయము

### స్వాయంభువ మను పుత్రికల వంశ వర్ణనము

కథాసారము :- చతుర్థస్కంధ మందలి ముప్పదియొక్క యధ్యాయములలో ఈశ్వరాధీనులగు బ్రహ్మ, మనువు మున్నగు వారిద్వారా చేయబడిన విసర్గసృష్టి విషయము వర్ణింపబడినది. వానిలో ప్రథమాధ్యాయమున మనుకన్యకల వేఱువేఱు వంశముల వివరణము, ఆ వంశములలో యజ్ఞాది మూర్తిద్వారా శ్రీహరి ప్రాకట్యమునకు సంబంధించిన విషయము వర్ణింపబడినది. మైత్రేయుడీ కథ నంతటిని వివరముగ విదురునకు జెప్పెను.

స్వాయంభువమనువునకు ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను మువ్వురు పుత్రికలు, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు నను నిర్వురు పుత్రులు గలరు. జ్యేష్ఠపుత్రిక యగు ఆకూతిని ప్రజాపతియగు రుచి, మధ్యమపుత్రికయగు దేవహూతిని కర్దమ ప్రజాపతి, కనిష్ఠ పుత్రిక యగు ప్రసూతిని బ్రహ్మనందనుడగు దక్షప్రజాపతి పరిణయమాడిరి. వీరి పుత్రపౌత్రాదులచే మూడులోకములు వ్యాప్తమై యుండెను. కర్దమ మహర్షి తొమ్మండుగురుపుత్రికలు తొమ్మండుగురు బ్రహ్మర్షులను వివాహమాడిరి. అత్రిమహర్షి సహధర్మచారిణియగు అనసూయయొక్క గర్భము నాశ్రయించి విష్ణు రుద్ర బ్రహ్మాంశలతో దత్తాత్రేయుడు, దుర్వాసుడు, సోముడు నను మువ్వురు తనయు లావిర్భవించిరి. అంగిరసుని పత్నియగు 'శ్రద్ధ'కు నల్వురు కుమార్తెలు, ఉతథ్యుడు, బృహస్పతి యను నిర్వురు కుమారులు జన్మించిరి. పులస్త్య మహర్షిపుత్రులు అగస్త్యుడు, విశ్రవసుడు. విశ్రవసునకు 'ఇలా విల, కేశిని' యను నిర్వురు భార్యలు గలరు.

విశ్రవసునివలన ఇలావిలకు కుబేరుడు, కేశినికి రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు నను పుత్రులు, శూర్పణఖయను పుత్రిక జన్మించిరి. వశిష్ఠుని పత్నియగు 'ఊర్జ' యను నామెకు చిత్ర కేతువు, సురుచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసుభృద్యానుడు,

**నాదండ్యం దండయత్యేష సూతమాత్మద్విషామపి ।**
**దండయత్యాత్మజమపి దండ్యం ధర్మపథేస్థితః ॥ 13**

ఈపృథుచక్రవర్తి యమునివృత్తియందుండి, శత్రుసంతానమైనను దండనమున కర్హము కానిచో వానిని దండింపడు, తనసంతాన మైనను దండనమున కర్హమైనచో శిక్షింపక వదలుటయుండదు.

**అస్యాప్రతిహతం చక్రం పృథోరామానసాచలాత్।**
**వర్తతే భగవానర్కో యావత్తపతి గోగణైః ॥ 14**

ఐశ్వర్యవంతు డగుసూర్యదేవుడు మానసాచలమువఱకు గలప్రదేశములను తన కిరణములద్వారా ప్రకాశింపజేయును. ఈయన ఆజ్ఞాచక్రము లేదా రథచక్రము ఆ ప్రదేశము లన్నింటియందు అప్రతిహతముగ సంచరించును.

**రంజయిష్యతి యల్లోకమయమాత్మవిచేష్టితైః ।**
**అథాముమాహూ రాజానం మనోరంజనకైః ప్రజాః ॥ 15**

ఈపృథువు మనోరంజక మగుతనపరాక్రమముద్వారా ప్రజారంజనముచేయును. అందువలన ప్రజ లాయనను 'రాజా' యని పిలచెదరు.

**దృఢవ్రతః సత్యసంధో బ్రహ్మణ్యో వృద్ధసేవకః ।**
**శరణ్యః సర్వభూతానాం మానదో దీనవత్సలః ॥ 16**

ఇతడు దృఢవ్రతుడు, సత్యప్రతిజ్ఞుడు, బ్రాహ్మణులమేలును గోరువాడు, వృద్ధసేవకుడు, సర్వజీవుల కాశ్రయయోగ్యుడు, గౌరవించువాడు, దీనవత్సలుడు.

**మాతృభక్తిః పరస్త్రీషు పత్న్యామర్ధ ఇవాత్మనః ।**
**ప్రజాసు పితృవత్ స్నిగ్ధః కింకరో బ్రహ్మవాదినామ్ ॥ 17**

ఈయన పరదారలయందు మాతృభక్తిని, తనభార్యయందు అర్ధాంగతుల్య మగుప్రీతిని, ప్రజలయందు పితృసమాన మగు ప్రేమను, బ్రహ్మవాదు లగుబ్రాహ్మణులకు సేవకునివలె ఉండును.

**దేహినామాత్మవత్ ప్రేష్ఠః సుహృదాం నన్దివర్ధనః ।**
**ముక్తసంగప్రసంగోఽయం దండపాణిరసాధుషు ॥ 18**

ఇతరప్రాణు లీతనిని తమశరీరమును ప్రేమించునట్లు ప్రేమింతురు ఈయన బంధువుల కానందమును వృద్ధిచేయును. ముఖ్యముగ విరాగులగుపురుషుల నెక్కువగ ప్రేమించు, దండధరు డగుయమునివలె దుష్టులను శిక్షించుట కుద్యుక్తుడగును.

శ్రీశ్రీ గురు గౌరాంగౌ జయతః

# శ్రీ మద్భాగవతము

# చతుర్థ స్కంధము

# మొదటి అధ్యాయము

## స్వాయంభువ మను పుత్రికల వంశ వర్ణనము

కథాసారము :- చతుర్థస్కంధ మందలి ముప్పదియొక్క యధ్యాయములలో ఈశ్వరాధీనులగు బ్రహ్మ, మనువు మున్నగు వారిద్వారా చేయబడిన విసర్గసృష్టి విషయము వర్ణింపబడినది. వానిలో ప్రథమాధ్యాయమున మనుకన్యకల వేఱువేఱు వంశముల వివరణము, ఆ వంశములలో యజ్ఞాది మూర్తిద్వారా శ్రీహరి ప్రాకట్యమునకు సంబంధించిన విషయము వర్ణింపబడినది. మైత్రేయుడీ కథ నంతటిని వివరముగ విదురునకు జెప్పెను.

స్వాయంభువమనువునకు ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను ముప్వురు పుత్రికలు, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు నను నిర్వురు పుత్రులు గలరు. జ్యేష్ఠపుత్రిక యగు ఆకూతిని ప్రజాపతియగు రుచి, మధ్యమపుత్రికయగు దేవహూతిని కర్దమ ప్రజాపతి, కనిష్ఠ పుత్రిక యగు ప్రసూతిని బ్రహ్మనందనుడగు దక్షప్రజాపతి పరిణయమాడిరి. వీరి పుత్రపౌత్రాదులచే మూడులోకములు వ్యాప్తమై యుండెను. కర్దమ మహర్షి తొమ్మండు గురుపుత్రికలు తొమ్మండుగురు బ్రహ్మర్షులను వివాహమాడిరి. అత్రిమహర్షి సహధర్మచారిణియగు అనసూయయొక్క గర్భము నాశ్రయించి విష్ణు రుద్ర బ్రహ్మాంశలతో దత్తాత్రేయుడు, దుర్వాసుడు, సోముడు నను ముప్వురు తనయు లావిర్భవించిరి. అంగిరసుని పత్నియగు 'శ్రద్ధ'కు నల్వురు కుమార్తెలు, ఉతథ్యుడు, బృహస్పతి యను నిర్వురు కుమారులు జన్మించిరి. పులస్త్య మహర్షిపుత్రులు అగస్త్యుడు, విశ్రవసుడు. విశ్రవసునకు 'ఇలా విల, కేశిని' యను నిర్వురు భార్యలు గలరు.

విశ్రవసునివలన ఇలావిలకు కుబేరుడు, కేశినికి రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు నను పుత్రులు, శూర్పణఖయను పుత్రిక జన్మించిరి. వశిష్ఠుని పత్నియగు 'ఊర్జ' యను నామెకు చిత్ర కేతువు, సురుచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసుభృద్యానుడు,

ద్యుమనుడు నను నేడుగురు ఋషులు జన్మించిరి. అథర్వఋషి పత్నియగు చిత్తికి దధీచి ముని యావిర్భవించెను. భృగువు వంశమున మార్కండేయుడు, వేదశిరుడు, శుక్రాచార్యుడు మున్నగు ప్రథితయశస్కులగు వ్యక్తులు జన్మించిరి. బ్రహ్మనందనుడగు దక్షుడు ప్రసూతివలన పదునాఱుగురు పుత్రికలను గనెను. వారిలో చివరి కన్య నతడు శివునకిచ్చెను. దక్షునిపుత్రిక యగు 'మూర్తి' యను నామెవలన ధర్ముడు నర నారాయణ ఋషులను గనెను. ఈ నరనారాయణ ఋషులిర్వురు శ్రీకృష్ణభగవానుని యంశలై యున్నారు. వీరే ద్వాపరాంతమున శ్రీకృష్ణార్జునులలో ప్రవేశించిరి.

## శ్రీ మైత్రేయ ఉవాచ

**మనోస్తు శతరూపాయాం తిస్రః కన్యాశ్చ జజ్ఞిరే,**
**ఆకూతిర్దేవహూతిశ్చ ప్రసూతిరితి విశ్రుతాః ॥ 1**

మైత్రేయుడు పలికెను :- విదురా! మనువు వలన శతరూపకు ముగ్గురు పుత్రికలు జన్మించిరి. వారు ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను నామములతో ప్రసిద్ధి కెక్కిరి. (ఇంతే కాక మనువు ఇరువురు పుత్రులనుగూడ కనెను)

**ఆకూతిం రుచయే ప్రాదాదపి భ్రాతృమతీం నృపః ।**
**పుత్రికాధర్మమాశ్రిత్య శతరూపానుమోదితః ॥ 2**

మనువు తన భార్యసమ్మతి ననుసరించి ముగ్గురి కన్యకలలో జ్యేష్ఠ కన్యకయగు ఆకూతిని పుత్రికా ధర్మము ననుసరించి ప్రజాపతి యగు రుచికి నిచ్చెను.

**ప్రజాపతిస్సభగవాన్ రుచిస్తస్యామజీజనత్ ।**
**మిథునం బ్రహ్మవర్చస్వీ పరమేణ సమాధినా ॥ 3**

బ్రహ్మతేజస్వియు ఐశ్వర్యవంతుడును నగు రుచిప్రజాపతి అధిక మనస్సంయమముద్వారా తన పత్ని యగు ఆకూతివలన నొక పుత్రుని, ఒక పుత్రికను కనెను.

**యస్తయోః పురుషః సాక్షాద్విష్ణుర్యజ్ఞస్వరూపధృక్ ।**
**యా స్త్రీ సా దక్షిణా భూతేరంశభూతానపాయినీ ॥ 4**

వారిలో పురుషుడు యజ్ఞస్వరూపధారి యగు సాక్షాద్విష్ణువే. కన్యక లక్ష్మియొక్క యంశభూతయు, జననమరణ రహితయు నగు "దక్షిణ" యనునామె.

**ఆనిన్యే స్వగృహం పుత్ర్యాః పుత్రం వితతరోచిషమ్ ।**
**స్వాయంభువో ముదాయుక్తో రుచిర్జగ్రాహ దక్షిణామ్ ॥ 5**

స్వాయంభువ మనువు ఆనందయుక్తుడై మహాతేజస్వియు, ఆకూతి పుత్రుడు నగు యజ్ఞుని (దౌహిత్రుని) తన గృహమునకు దెచ్చుకొనెను. రుచి 'దక్షిణ" యనునామెను స్వీకరించెను. (పుత్రికను బుత్రునివలె స్వీకరించి పెంచసాగెను)

**తాం కామయానాం భగవానువాహ యజుషాం పతిః ।**
**తుష్టాయాం తోషమాపన్నోఽజనయద్ద్వాదశాత్మజాన్ ॥ 6**

కొంతకాలము పిమ్మట దక్షిణ తన సహోదరుడగు యజ్ఞుని వివాహమాడగోరెను. యజ్ఞభగవానుడు లేదా మంత్రపతి యగు విష్ణువు పరమసంతుష్టుడై యామెను పరిణయమాడెను. దక్షిణగూడ పరమానందభరిత యయ్యెను. పిమ్మట యజ్ఞుడామెవలన పంద్రెండుగురు పుత్రులను గనెను.

**తోషః ప్రతోషః సంతోషో భద్రః శాన్తిరిడస్పతిః ।**
**ఇధ్మః కవిర్విభుః స్వాహ్నః సుదేవో రోచనో ద్విషట్ ॥ 7**

తోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతి, ఇడస్పతి, ఇధ్మడు, కవి, విభుడు, స్వాహ్నుడు, సుదేవుడు, రోచనుడు నను వారు పంద్రెండుగురు పుత్రులు.

**తుషితా నామ తే దేవా ఆసన్ స్వాయంభువాన్తరే ।**
**మరీచిమిశ్రా ఋషయో యజ్ఞః సురగణేశ్వరః ॥ 8**

**ప్రియవ్రతోత్తానపాదౌ మనుపుత్రౌ మహౌజసౌ ।**
**తత్పుత్రపౌత్రనప్తౄణా మనువృత్తం తదన్తరమ్ ॥ 9**

స్వాయంభువ మన్వంతరమున రుచిప్రజాపతియొక్క యీ పంద్రెండుగురు దౌహిత్రులు "తుషితు"లను దేవతలైరి. మరీచి ప్రముఖులు సప్తఋషులైరి. యజ్ఞుడు హరియవతార మయ్యెను. అతడే స్వయముగ దేవేంద్రుడయ్యెను. మహాతేజస్వులగు ప్రియవ్రతోత్తానపాదు లిర్వురు మనుపుత్రులైరి. వీరి పుత్రపౌత్ర దౌహిత్రులద్వారా ఆ మన్వంతరము వ్యాప్తమై పరిపాలితమయ్యెను.

**దేవహూతిమదాత్తాత కర్దమాయాత్మజాం మనుః ।**
**తత్సంబన్ధి శ్రుతప్రాయం భవతా గదతో మమ ॥ 10**

విదురా! మనువు తన ద్వితీయపుత్రిక యగు దేవహూతిని కర్దమ మహర్షి కిచ్చెను. వారినిగురించి నీకు సవిస్తరముగ జెప్పితిని. నీవు దాని నంతటిని వింటివి.

దక్షాయ బ్రహ్మపుత్రాయ ప్రసూతిం భగవాన్ మనుః ।
ప్రాయచ్ఛద్యత్కృతః సర్గస్త్రిలోక్యాం వితతో మహాన్ ॥ 11

ఐశ్వర్యవంతుడగు మనువు తన కనిష్ఠ పుత్రిక యగు ప్రసూతిని బ్రహ్మనందనుడగు దక్షున కిచ్చెను. వారివంశములచేతనే త్రిలోకములు పరివ్యాప్తమయ్యెను.

యాః కర్దమసుతాః ప్రోక్తా నవబ్రహ్మర్షి పత్నయః ।
తాసాం ప్రసూతిప్రసవం ప్రోచ్యమానం నిబోధ మే ॥ 12

కర్దమమహర్షియొక్క తొమ్మండుగురు పుత్రికలను గూర్చి నీకు వెనుక జెప్పియుంటిని. వారు తొమ్మండుగురు బ్రహ్మర్షులను వివాహమాడిరి. ఇపుడు నేను పుత్రపౌత్రాదిక్రమముతో వారి వంశాభివృద్ధిని గూర్చి వర్ణింతును, వినుము.

పత్నీ మరీచేస్తు కలా సుషువే కర్దమాత్మజా ।
కశ్యపం పూర్ణిమానం చ యయోరాపూరితం జగత్ ॥ 13

మరీచునిపత్ని కర్దముని పుత్రిక యగు 'కళ' యనునామె కశ్యపుడు, పూర్ణిమానుడు ననునిరువురు కుమారులను గనెను. ఈ యిరువురివంశము వలననె జగత్తంతయు నిండిపోయెను.

పూర్ణిమాసూత విరజం విశ్వగం చ పరంతప ।
దేవకుల్యాం హరేః పాదశౌచాద్యాభూత్సరిద్దివః ॥ 14

పరంతపుడ వగువిదురా! పూర్ణిమానుడు విరజుడు, విశ్వగుడు ననునిరువురు పుత్రులను, దేవకుల్య యనునొక పుత్రికను గనెను. ఈ కన్యయె జన్మాంతరమున శ్రీహరి పాదప్రక్షాళనమువలన ఈ జగత్తులో స్వర్గనది యగు గంగానదిరూపమున ఉత్పన్న మయ్యెను.

అత్రేః పత్న్యనసూయా త్రీన్ జజ్ఞే సుయశసః సుతాన్ ।
దత్తం దుర్వాససం సోమమాత్మేశబ్రహ్మ సంభవాన్ ॥ 15

అత్రి మహర్షి సహధర్మచారిణి యగు అనసూయ దత్తాత్రేయుడు, దుర్వాసుడు, సోముడు వను మహాయశస్వులగు ముగ్గురు పుత్రులను ప్రసవించెను. ఆ మువ్వురు క్రమముగ విష్ణు రుద్ర బ్రహ్మంశలతో నావిర్భవించిరి.

## శ్రీ విదుర ఉవాచ

అత్రేర్గృహే సురశ్రేష్ఠాః స్థిత్యుత్పత్త్యన్త హేతవః ।
కించిచ్చికీర్షవో జాతా ఏతదాఖ్యాహి మే గురో ॥ 16

విదురుడు పలికెను :- గురువర్యా! సృష్టి స్థితి లయములకు గారణభూతులగు దేవతాశ్రేష్ఠ లేయభిప్రాయముతో నత్రిమహర్షి గృహమున నావిర్భవించిరి. దయయుంచి యా విషయమును నాకు దెలుపవలసినది.

## శ్రీ మైత్రేయ ఉవాచ

బ్రహ్మణా చోదితః సృష్టావత్రిర్బ్రహ్మవిదాం వరః ।
సహపత్న్యా యయా వృక్షం కులాద్రిం తపసి ి తః ॥ 17

మైత్రేయుడు పలికెను :- విదురా! బ్రహ్మ ప్రజా ృష్టి నిమిత్తమై యాదేశింపగా బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడగు నత్రిమహర్షి తపస్సు చేయస ట్టి భార్యయగు అనసూయతో గూడి "ఋక్ష" మను కులపర్వతము కడకు వెడలెను.

తస్మిన్ ప్రసూనస్తబకపలాశా శోకకాననే ।
వార్భిః స్రవద్భిరుద్ఘుష్టే నిర్విన్ధ్యాయాః సమన్తతః ॥ 18

ప్రాణాయామేన సంయమ్య మనో వర్షశతం మునిః ।
అతిష్ఠ దేకపాదేన నిర్ద్వన్ద్వోఽనిలభోజనః ॥ 19

శరణం తం ప్రపద్యేఽహం య ఏవ జగదీశ్వరః ।
ప్రజామాత్మసమాం మహ్యం ప్రయచ్ఛత్వితి చిన్తయన్ ॥ 20

ఆ పర్వతము పూలగుత్తులతో గూడిన పలాశ వృక్షములు, అశోక వృక్షములు గల వనముతో శోభిల్లుచుండెను. 'నిర్వింధ్య' యను నదియందలి జలముయొక్క కలకల ధ్వనితో ఆ ప్రదేశము ప్రతిధ్వనించు చుండెను. అత్రిమహర్షి ప్రాణాయామముద్వారా మనస్సును నిగ్రహించి వాయువును మాత్ర మాహారముగ గొనుచు నిర్ద్వంద్వభావముతో నా పర్వతముపై నొక్క నూఱుసంవత్సరములు ఒంటికాలిపై నిలుచుండి తపస్సు చేయసాగెను. అప్పుడాయన తన మనస్సులో "ఈ జగత్తున కధీశ్వరుడగు శ్రీహరిని నేను శరణుజొచ్చితిని, ఆయన నాకు తనవంటి సంతానము నిచ్చుగాక" యని ప్రార్థించుచుండెను.

తప్యమానం త్రిభువనం ప్రాణాయామైధసాగ్నినా ।
నిర్గతేన మునేర్మూర్ధ్నః సమీక్ష్య ప్రభవస్త్రయః ॥ 21

అప్సరో మునిగన్ధర్వ సిద్ధవిద్యాధరోరగైః ।
వితాయమానయశసస్తదాశ్రమపదం యయుః ॥ 22

ప్రాణాయామ ప్రదీప్తుడగు అత్రిమహర్షి శిరోభాగమునుండి యొక యగ్నిశిఖ బయల్వెడలెను. ఆ యోగాగ్నిద్వారా ముల్లోకములు సంతప్త మగుట జూచి అప్సరసలను, మునులను, గంధర్వులను, సిద్ధులను, విద్యాధరులను, నాగులను వెంటనిడుకొని ప్రథితయశస్కులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముప్వురు అత్రిమహర్షి యాశ్రమమునకు వెడలిరి.

*చ॥ మునుకొని యత్తపోధనునిమూర్ధజ మైనతపః కృశానుచే*
*తను త్రిజగంబులుం గరఁగి, తప్తము లైననుజూచి పంకజా*
*సనమురశాసనత్రిపురశాసను లచ్చటి కేఁగి రప్సరో*
*జనసురసిద్ధ సాధ్యమునిసన్నుత భూరియశోభిరాములై.* (4-14)

తత్ప్రాదుర్భావ సంయోగవిద్యోతిత మనామునిః ।
ఉత్తిష్ఠన్నేకపాదేన దదృశే విబుధర్షభాన్ ॥ 23

సర్వలోకనమస్కృతులగు ముప్వురు దేవతలు ప్రత్యక్షముకాగా మునిచిత్తము ప్రఫుల్లమయ్యెను. ఆయన యొంటికాలిపై నిలబడి యా దేవతా శ్రేష్ఠులను జూడసాగెను.

ప్రణమ్య దణ్డవద్భూమావుపతస్థేఽర్హణాంజలిః ।
వృషహంససుపర్ణస్థాన్ స్వైః స్వైశ్చిహ్నైశ్చ చిహ్నితాన్ ।
కృపావలోకేన హసద్వదనేనోపలంభితాన్ ॥ 24

వారు ముప్వురు వృషభ - హంస - గరుడ వాహనములయందారూఢులై త్రిశూలము, కమండులువు, చక్రము మున్నగు తమతమ చిహ్నములను ధరించియుండిరి. వారి నయనములయందు దయ, వదనమున మందస్మితము ప్రస్ఫుటితమగు చుండెను. అత్రిమహాముని సాష్టాంగ నమస్కార మాచరించి, పుష్పాంజలి గ్రహించి వారిని యథావిధిగ పూజించెను.

చ॥ *అనఘ తపోభిరాముఁ డగు నత్రిమునీంద్రుఁడు గాంచెఁ దప్తకాం*
*చనఘనచంద్రి కారుచిరచారు శరీరుల హంసనాగసూ*
*దనవృషభేంద్రవాహుల నుదారకమండలుచక్రశూలసా*
*ధనుల విరించి విష్ణుపురదాహుల వాక్కమలాంబి కేశులన్.* (4-16)

తచ్ఛోచిషా ప్రతిహతే నిమీల్య మునిరక్షిణీ ।
చేతస్తత్ప్రవణం యుంజన్నస్తావీత్సంహతాంజలిః ।
శ్లక్ష్ణయా సూక్తయా వాచా సర్వలోకగరీయసః ॥ 25

అత్రిమహర్షి రెండు నేత్రములు ఆముమ్మురుదేవతల వెలుగుద్వారా మిఱుమిట్లు చెందినవయ్యెను. అందువలన ఆయన నిమీలితనేత్రుడై వారియందు మనస్సు నుంచి, దోసి లొగ్గి, గంభీరార్థయుక్తము లగు మధురవాక్కులతో సర్వలోకారాధ్యులగు నాదేవతలను స్తుతింపసాగెను.

## శ్రీ అత్రిరువాచ

విశ్వోద్భవస్థితిలయేషు విభజ్యమానై -
ర్మాయాగుణైరనుయుగం విగృహీతదేహాః ।
తే బ్రహ్మవిష్ణుగిరిశాః ప్రణతోఽస్మ్యహం వ-
స్తేభ్యః క ఏవ భవతాం మ ఇహోపహూతః ॥ 26

అత్రి పలికెను:- సురశ్రేష్ఠులారా! ప్రతికల్పమునందును విభజింపబడు మాయా గుణముల ద్వారా ప్రపంచముయొక్క సృష్టి స్థితిలయములు సాధింపబడుచున్నవి. మీరా ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయముల కధీశ్వరులగు బ్రహ్మవిష్ణు రుద్రరూపములతో అవతరించిరి. నేను మీ చరణములకు నమస్కరించుచున్నాను. కాని నేను మీలో నొక్కనినే యాహ్వానించితిని, ఆయన యెవ్వరు?

ఏకో మయేహ భగవాన్ వివిధప్రధానై -
శ్చిత్తీకృతః ప్రజననాయ కథం ను యూయమ్ ।
అత్రాగతాస్తనుభృతాం మనసోఽపి దూరా
బ్రూత ప్రసీదత మహానిహ విస్మయో మే ॥ 27

మీలో షడైశ్వర్యశాలియు, సర్వదేవతలలో ప్రధానుడు నగు వానినే నేను సంతానముకొఱకై బహువిధములగు నుపచారములతో నారాధించి మనస్సుతో

భావనచేసితిని. కాని దేహధారుల మనస్సునకుగూడ నగోచరులగు మీరు ముప్పురు నొక్క సమయమునందే యేల ప్రత్యక్షమైరి? ప్రసన్నులై దయయుంచి యావిషయమును వ్యక్తముచేయుడు. దీనివలన నాకు గొప్ప ఆశ్చర్యము కలుగుచున్నది.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఇతి తస్య వచః శ్రుత్వా త్రయస్తే విబుధర్షభాః ।
ప్రత్యాహుః శ్లక్ష్ణయా వాచా ప్రహస్య తమృషిం ప్రభో ॥ 28

మైత్రేయుడు పలికెను:- విదురా! బ్రహ్మ విష్ణు మహేశ్వరరూపులగు నా ముప్పురు దేవతాశ్రేష్ఠులు అత్రిమహర్షి పలికిన యీ వాక్కులను విని మందస్మితవదనులై మధురవాక్కులతో నా మహర్షి కిట్లు ప్రత్యుత్తర మీయసాగిరి.

## శ్రీ దేవదేవా ఊచుః

యథా కృతస్తే సంకల్పో భావ్యం తేనైవ నాన్యథా ।
సత్సంకల్పస్య తే బ్రహ్మన్ యద్వై ధ్యాయతి తే వయమ్ ॥ 29

దేవతలు పలికిరి :- మహర్షీ! నీ సంకల్పము ఉత్తమమైనది. అందువలన అది తప్పక సిద్ధించును. నీ వారాధించిన ఆ జగదీశ్వరతత్త్వము మేము ముప్పురమైయున్నాము. (ఏలయన, అద్వయజ్ఞానతత్త్వస్వరూపుడగు భగవానునికంటె భిన్నముగ మాకు స్వతంత్రప్రతిపత్తి లేదు. మేము స్వతంత్ర భగవానుడగు శ్రీహరియొక్క యంశలము, ఆశ్రితతత్త్వ స్వరూపులము.)

అథాస్మదంశభూతాస్తే ఆత్మజా లోకవిశ్రుతాః ।
భవితారోఽఙ్గ భద్రం తే విస్రప్స్యన్తి చ తే యశః ॥ 30

మహర్షీ! నీకు శుభము కలుగుగాక! మా ముప్పురియంశములతో నీకు త్రిలోకవిఖ్యాతులగు ముగ్గురుపుత్రులు గలుగుదురు. వారు నీకీర్తిని నలువైపుల విస్తరింపజేయుదురు.

ఏవం కామవరం దత్త్వా ప్రతిజగ్ముః సురేశ్వరాః ।
స భాజితాస్తయోః సమ్యగ్దంపత్యోర్మిషతో స్తతః ॥ 31

పిమ్మట ముప్పురుదేవతలు అత్రిమహర్షికి ఆయన యభిలషించిన వరము నిచ్చి, భార్యాసహితుడగు మహర్షి పూజను స్వీకరించి వారి యెదుటనె అంతర్హితులైరి.

సోమోఽభూద్బ్రహ్మణోఽంశేన దత్తో విష్ణోస్తు యోగవిత్ ।
దుర్వాసాః శంకరస్యాంశో నిబోధాంగిరసః ప్రజాః ॥ 32

అత్రిమహర్షి ముప్పురు పుత్రులలో బ్రహ్మాంశముతో సోముడు, విష్ణ్వంశముతో యోగవేత్త యగు దత్తాత్రేయుడు, రుద్రాంశముతో దుర్వాసుడు జన్మించిరి. ఇపుడు అంగిరసఋషి (బ్రహ్మయొక్క మూడవ కుమారుని) ప్రజావర్గ విషయమును జెప్పెదను. శ్రద్ధగ వినవలసినది.

*ఉ॥ ఆ సుచరిత్రదంపతు లుదంచితలీలఁ గనుంగొనంగ న*
*బ్జాసనువంశమందు నమృతాంశుఁడు విష్ణుకళన్ సుయోగవి*
*ద్యాసుభగుండు దత్తుఁడు బురాంతకు భూరి కళాంశమందు దు*
*ర్వాసుఁడు నై జనించి రనవద్య పవిత్ర చరిత్రు లిమ్ములన్.* (4-23)

శ్రద్ధాత్వంగిరసః పత్నీ చతస్రోఽసూత కన్యకాః ।
సినీవాలీ కుహూ రాకా చతుర్థ్యానుమతి స్తథా ॥ 33

అంగిరసునిభార్య శ్రద్ధ-ఆమె సినీవాలి, కుహు, రాక, అనుమతి యను నల్వురు కన్యకలను గనెను.

తత్పుత్రావపరావాస్తాం ఖ్యాతౌ స్వారోచిషేఽన్తరే ।
ఉతథ్యో భగవాన్ సాక్షాద్బ్రహ్మిష్ఠశ్చ బృహస్పతిః ॥ 34

ఇంతేకాక వారికి స్వారోచిషమన్వంతరమున ఇరువురుపుత్రులు గూడ కలిగిరి. వారిలో నొకడు సాక్షాత్తుగ భగవదవతారుడగు ఉతథ్యుడను పేరుతోను, మఱియొకడు బ్రహ్మజ్ఞుడగు బృహస్పతి యనుపేరుతోను ప్రసిద్ధికెక్కిరి.

పులస్త్యోఽజనయన్ పత్న్యామగస్త్యం చ హవిర్భువి ।
సోఽన్యజన్మని దహ్రాగ్నిర్విశ్రవాశ్చ మహాతపాః ॥ 35

పులస్త్యమహర్షి "హవిర్భూ" యను తన భార్యవలన అగస్త్యుడను నొకపుత్రుని గనెను. అయ్యగస్త్యుడే జన్మాంతరమున జఠరాగ్నిరూపముతో జన్మించెను. పులస్త్యఋషి విశ్రవసుడను మఱియొక పుత్రుని గూడ గనెను. ఇతడు మహాతపస్వి.

తస్య యక్షపతిర్దేవః కుబేరస్త్వైలవిలాసుతః ।
రావణః కుంభకర్ణశ్చ తథాన్యస్యాం విభీషణః ॥ 36

ఆ విశ్రవసునకు "ఇలావిల, కేశిని" యను నిరువురు భార్యలు గలరు. ఇలావిలకు యక్షాధిపతి యగు కుబేరుడు, కేశినికి రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు ననువారు పుత్రులుగా జన్మించిరి.

**పులహస్య గతిర్భార్యా త్రీనసూత సతీ సుతాన్ ।**
**కర్మశ్రేష్ఠం వరీయాంసం సహిష్ణుం చ మహామతే ॥ 37**

విదురా! పులహుని భార్యయగు 'గతి' యను నామె కర్మశ్రేష్ఠుడు, వరీయాంసుడు, సహిష్ణువు నను ముగ్వురు పుత్రులను గనినది.

**క్రతోరపి క్రియాభార్యా వాలఖిల్యానసూయత ।**
**ఋషీన్ షష్టిసహస్రాణి జ్వలతో బ్రహ్మతేజసా ॥ 38**

క్రతుమహర్షి భార్య యగుక్రియ యనునామెగూడ బ్రహ్మతేజస్సుచే ప్రకాశించు అఱువదివేలమంది వాలఖిల్యఋషులను ప్రసవించెను.

**ఊర్జాయాం జజ్ఞిరే పుత్రా వశిష్ఠస్య పరన్తప ।**
**చిత్రకేతుప్రధానాస్తే సప్త సప్తర్ష యోఽమలాః ॥ 39**

విదురా! వశిష్ఠునిభార్య యగు ఊర్జ యనునామెకు చిత్రకేతువు మున్నగు నేడుగురు పుత్రులు గలిగిరి. వారే విమలచరిత్రులగు సప్తర్షులుగా ప్రసిద్ధికెక్కిరి.

**చిత్రకేతుస్సురోచిశ్చ విరజా మిత్ర ఏవ చ ।**
**ఉల్బణో వసుభృద్యానో ద్యుమాన్ శక్త్యాదయోఽపరే ॥ 40**

ఆ సప్తమహర్షులు చిత్రకేతువు, సురోచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసు భృద్యానుడు, ద్యుమాంసుడు ననువారు, వీరేకాక వశిష్ఠ మహర్షికి మఱియొకభార్యవలన శక్తి మున్నగుపుత్రులెందఱో కలిగిరి.

**చిత్తిస్త్వథర్వణః పత్నీ లేభే పుత్రం ధృతవ్రతమ్ ।**
**దధ్యంచమశ్వశిరసం భృగోర్వంశం నిబోధ మే ॥ 41**

అథర్వఋషిసహధర్మచారిణి యగుచిత్తి యనునామె తపోనిష్ఠుడు, అశ్వశిరుఁడునగు దధీచి యను నొకపుత్రుని గనెను. ఇప్పుడు భృగువంశ వృత్తాంతమును జెప్పెదను. వినుము.

**భృగుః ఖ్యాత్యాం మహాభాగః పత్న్యాం పుత్రానజీజనత్ ।**
**ధాతారం చ విధాతారం శ్రియం చ భగవత్పరామ్ ॥ 42**

మహాత్ముడగు భృగువు తనభార్య యగు ఖ్యాతివలన ధాత, విధాత యను నిర్వురు పుత్రులను, శ్రీయను భగవద్భక్తురాలగు నొకకన్యను గనెను.

**ఆయతిం నియతిం చైవ సుతే మేరుస్తయోదరాత్ ।**
**తాభ్యాం తయోరభవతాం మృకణ్డః ప్రాణ ఏవ చ ॥ 43**

మేరుఋషి ఆయతి, నియతి యనుతన నిరువురు పుత్రికలను క్రమముగ ధాతవిధాతల కిచ్చెను. ఆ ధాతవిధాతలవలన ఆకన్యకలకు మృకండుడు, ప్రాణుడు నను నిర్వురు పుత్రులు గలిగిరి.

**మార్కండేయో మృకణ్డస్య ప్రాణాద్వేదశిరా మునిః ।**
**కవిశ్చ భార్గవో యస్య భగవానుశనా సుతః ।**
**సర్వే తే మునయః క్షత్తర్లోకాన్ సర్గైరభావయన్ ॥ 44**

ఆ మృకండఋషికి మార్కండేయుడు, ప్రాణునకు వేదశిరుడు నను పుత్రులు జన్మించిరి. భృగువునకు కవి యను నామముతో మఱియొక పుత్రుడు జన్మించెను. ఐశ్వర్యయుక్తుడగు ఉశనుడను ఋషి ఆ కవియొక్క పుత్రుడే.

**ఏష కర్దమదౌహిత్రసన్తానః కథితస్తవ ।**
**శృణ్వతః శ్రద్దధానస్య సద్యః పాపహరః పరః ॥ 45**

విదురా! ఈ ఋషియొక్క ప్రజాసృష్టిద్వారా సర్వలోకము వ్యాప్తి చెందెను. కర్దమ ప్రజాపతి యొక్క యీ దౌహిత్రవంశవర్ణనమును శ్రద్ధగ వినినచో శీఘ్రముగనే పాపము నివృత్తియగును. నీవు శ్రద్ధాయుక్తుడవు, అందువలన పై వంశవిషయమును నీకు జెప్పితిని.

**ప్రసూతిం మానవీం దక్ష ఉపయేమే హ్యజాత్మజః ।**
**తస్యాం ససర్జ దుహితౄః షోడశామలలోచనాః ॥ 46**

బ్రహ్మపుత్రుడగు దక్షుడు మనుపుత్రిక యగు ప్రసూతిని పరిణయమాడి యామెవలన పదునాఱుగురు సుందరవదనలగు పుత్రికలను గనెను.

**త్రయోదశాదాద్ధర్మాయ తథైకామగ్నయే విభుః ।**
**పితృభ్య ఏకాం యుక్తేభ్యో భవాయైకాం భవచ్ఛిదే ॥ 47**

ఆయన తన పదునాఱుగురు కన్యకలలో పదుముగ్గురను ధర్మునకు, ఒకామెను అగ్నికి, మఱియొక నామెను పితృగణమునకు, మిగిలిన యొక్క కన్యను సంసారబంధనాశకుడగు శివునకు నిచ్చెను.

శ్రద్ధా మైత్రీ దయా శాన్తిస్తుష్టిః పుష్టిః క్రియోన్నతిః ।
బుద్ధిర్మేధా తితిక్షా హ్రీర్మూర్తిర్ధర్మస్య పత్నయః ॥ 48

శ్రద్ధ, మైత్రి, దయ, శాంతి తుష్టి, పుష్టి, క్రియ, ఉన్నతి, బుద్ధి, మేధ, తితిక్ష, లజ్జ, మూర్తి యను పదుముగ్గురు ధర్మునిపత్నులు.

శ్రద్ధాసూత ఋతం మైత్రీ ప్రసాదమభయం దయా ।
శాన్తిః సుఖం ముదం తుష్టిః స్మయం పుష్టిరసూయత ॥ 49

వారిలో శ్రద్ధ సత్యమును, మైత్రి ప్రసాదమును, దయ అభయమును, శాంతి సుఖమును, తుష్టి హర్షమును, పుష్టి గర్వమును ప్రసవించెను.

యోగం క్రియోన్నతిర్దర్పమర్థం బుద్ధిరసూయత ।
మేధా స్మృతిం తితిక్షా తు క్షేమం హ్రీః ప్రశ్రయం సుతమ్ ॥ 50

క్రియ యోగమును, ఉన్నతి దర్పమును, బుద్ధి అర్థమును, మేధ స్మృతిని, తితిక్ష మంగళమును, లజ్జ వినయమును ప్రసవించెను.

మూర్తిస్సర్వగుణోత్పత్తిర్నరనారాయణావృషీ ।
యయోర్జన్మన్యదోవిశ్వమభ్యన న్దత్సునిర్వృతమ్ ॥ 51

నిఖిల కల్యాణగుణనిలయ యగుమూర్తియనునామె ధర్మునివలన నరనారాయణులను ఋషులను గనెను. వీరి జన్మ సమయమున పరిదృశ్యమానమగు నీ విశ్వమెట్టి యుద్వేగము లేనిదై ఆనందముతో విలసిల్లెను.

మనాంసి కకుభో వాతాః ప్రసేదుః సరితోఽద్రయః ।
దివ్యవాద్యన్త తూర్యాణి పేతుః కుసుమవృష్టయః ॥ 52

నరనారాయణులు జన్మించినపుడు మానవుల మనస్సులు, దిక్కులు, వాయువు, నదులు, పర్వతములు సమస్తము ప్రసన్నము లయ్యెను. స్వర్గమున వాద్యములు మ్రోగెను. ఆకసమునుండి పుష్పవృష్టి గురిసెను.

మునయస్తుష్టువుస్తుష్టాజగుర్గన్ధర్వ కిన్నరాః ।
నృత్యన్తిస్మ స్త్రియో దేవ్య ఆసీత్పరమ మంగలమ్ ॥ 53

మునులు పరమసంతుష్టులై స్తుతించిరి. గంధర్వులు, కిన్నరులు భగవద్యశస్సును గానము చేసిరి. దివ్యాంగనలు నృత్యము చేసిరి. నలువైపుల పరమమంగళము విరాజిల్లెను.

దేవాబ్రహ్మాదయస్సర్వ ఉపతస్థురభిష్టవైః ॥ 54

బ్రహ్మాది దేవతలందఱు నానావిధములగు స్తోత్రములద్వారా ఆ నర నారాయణులను పూజించిరి.

## శ్రీ దేవా ఊచుః

యో మాయయా విరచితం నిజయాత్మనీదం
ఖే రూపభేదమివ తత్ప్రతిచక్షణాయ ।
ఏతేన ధర్మసదనే ఋషిమూర్తినాద్య
ప్రాదుశ్చకార పురుషాయ నమః పరస్మై ॥ 55

దేవతలు పలికిరి :- ఆకాశమున గంధర్వనగరమువలె తనమాయ ద్వారా భగవానుడీ విరాడ్రూపమును తనయధిష్ఠానమున నిర్మించెను. అయ్యాత్మప్రకాశమునకై ఆయన యపుడు ధర్మునిగృహమున నరనారాయణ రూపముతో తన్ను ప్రకటించుకొనెను. అట్టి పరమపురుషుడగు భగవానునకు నమస్కరించు చున్నాము.

సోఽయం స్థితివ్యతికరోపశమాయ సృష్టాన్
సత్త్వేన నః సురగణాననుమేయతత్త్వః ।
దృశ్యాదదభ్రకరుణేన విలోకనేన
యచ్ఛ్రీనికేతమమలం క్షిపతారవిన్దమ్ ॥ 56

శాస్త్రము నాధారము చేసికొనియె మన మా భగవత్తత్త్వమును దెలిసి కొనవచ్చునుగాని ప్రత్యక్షము చేసికొనజాలము. అట్టి షడైశ్వర్యశాలి యగు భగవానుడీ జగత్తుయొక్క మర్యాద కెట్టియాటంకము కలుగకుండుటకై దేవతలను సృష్టించినాడు. ఆయన నేత్రములు శోభకు నివాసస్థాన మగు నిర్మల కమలముల శోభనుగూడ తిరస్కరించినవి. అధికకరుణతో గూడిన అట్టి దృష్టిని ఆయన మాపై ప్రసరింపజేయుగాక!

ఏవం సురగణైస్తాత భగవన్తావభిష్టుతౌ ।
లబ్ధావలోకైర్యయతురర్చితౌ గన్ధమాదనమ్ ॥ 57

విదురా! దేవత లిట్లు స్తుతించుచుండగా నరనారాయణు లిరువురు వారిపూజలను స్వీకరించి వారిపై కృపాదృష్టిని ప్రసరింపజేయుచు గంధ మాదన పర్వతముపైకి వెడలిరి.

తావిమౌ వై భగవతో హరేరంశావిహాగతౌ ।
భారవ్యయాయ చ భువః కృష్ణౌ యదుకురూద్వహౌ ॥ 58

శ్రీకృష్ణభగవానుని యంశరూపులగు ఆ నరనారాయణులిరువురు భూభారహరణము కొఱకు, భగవానుని వాంఛను పూర్తిచేయుట కొఱకు ద్వాపరాంతమున ప్రకటులైన యదుకురు వంశశ్రేష్ఠులగుకృష్ణార్జునులలో ప్రవేశించిరి.

**స్వాహాభిమానినశ్చాగ్నే రాత్మజాం స్త్రీనజీజనత్ ।**
**పావకం పవమానం చ శుచిం చ హుతభోజనమ్ ॥ 59**

అగ్న్యాభిమాని యగుదేవత యొక్క పత్ని "స్వాహా" యనునామె. ఆమె యగ్నివలన పావకుడు, పవమానుడు, శుచి యను హుతభుక్కులగు ముమ్వురు పుత్రులను గనెను.

**తేభ్యోఽగ్నయః సమభవంశ్చత్వారింశచ్చ పంచ చ**
**త ఏవైకోనపంచాశత్సాకం పితృపితామహైః ॥ 60**

ఈ ముమ్వురివలన నలువదియైదువిధములగు అగ్ని యుత్పన్నమయ్యెను. వారు తమ తండ్రులతోను, తాతలతోను గలసి నలువది తొమ్మండుగురైరి.

**వైతానికే కర్మణి యన్నామభిర్బ్రహ్మవాదిభిః ।**
**ఆగ్నేయ్య ఇష్టయో యజ్ఞే నిరూప్యన్తేఽగ్నయస్తు తే ॥ 61**

వైదికకర్మ యగు యజ్ఞమునందు బ్రహ్మవాదులగు ఋషులెవరి నామము నుచ్చరించి అగ్ని సంబంధము లగునాహుతుల నిత్తురో వారీ యగ్నులే.

**అగ్నిష్వాత్తా బర్హిషదః సౌమ్యాః పితర ఆజ్యపాః ।**
**సాగ్నయోఽనగ్నయస్తేషాం పత్నీ దాక్షాయణీ స్వధా ॥ 62**

అగ్నిష్వాత్త, బర్హిషదుడు, సోమపుడు, ఆజ్యపుడు ననువారు పితృదేవతలు. వీరిలో గొందఱు సాగ్నికులు, కొందఱు నిరగ్నికులు. దక్షునిపుత్రిక యగు "స్వధ" యనునామె ఉభయవిధములుగ నున్న ఈ పితృగణములకు భార్యయై యున్నది.

**తేభ్యో దధార కన్యే ద్వే వయునాం ధారిణీం స్వధా ।**
**ఉభే తే బ్రహ్మవాదిన్యౌ జ్ఞానవిజ్ఞానపారగే ॥ 63**

స్వధ పితృగణములవలన 'వయున, ధారిణి' యను నిర్వురు పుత్రికలను కనెను. వీరిరువురు బ్రహ్మవాదినులు, జ్ఞానవిజ్ఞాన వివేకపారగలు.

**భవస్య పత్నీ తు సతీ భవం దేవమనువ్రతా ।**
**ఆత్మనః సదృశం పుత్రం న లేభే గుణశీలతః ॥ 64**

రుద్రునిభార్య సతీదేవి. ఆమె అన్నివిధముల తనభర్త సేవలో సంలగ్నమై యుండును. కాని యామె తన గుణములకు దగిన పుత్రుని పొందలేకపోయెను.

**పితర్యప్రతిరూపే స్వే భవాయానాగసే రుషా ।**
**అప్రౌఢైవాత్మనాత్మానమజహాద్యోగ సంయుతా ॥** 65

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థ స్కందే దాక్షాయణ్యం నామ
ప్రథమోఽధ్యాయః ॥

సతీదేవితండ్రి యగు దక్షుడు ఎట్టిదోషము లేకపోయినను శివునిపై విరోధమును బూనెను. అందువలన సతి క్రుద్ధురాలై యౌవనకాలమందే యోగము నవలంబించి శరీరమును త్యజించెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి నాలుగవ
స్కంధములోని మొదటి అధ్యాయము
సమాప్తము.

❀ ❀ ❀

# రెండవ అధ్యాయము

## ఈశ్వరునకు దక్షప్రజాపతికి విరోధము సంభవించుట

కథాసారము :- ప్రథమాధ్యాయమున సూత్రరూపముగ జెప్పబడిన శివదక్షుల పరస్పరవిద్వేషము విశ్వస్రష్టల యజ్ఞమునుండియే బయల్వెడలినది. అదియే యీ యధ్యాయమున వర్ణితమైనది.

శివునకు దక్షునకు పరస్పరము వైర మేర్పడుటకు గల కారణము నడుగగా మైత్రేయుడు విదురునితో నిట్లు పలికెను:- "పూర్వకాలమున ప్రజాపతుల యజ్ఞమున శివుడు ప్రత్యుత్థానాదుల ద్వారా దక్షునిపై యేవిధమగు గౌరవమును జూపక పోయెను. అంతట దక్షుడు శివుని హీనముగ జూచి దేవతలు ఋషులు గల నిండుసభలో అనేకవిధముల దూషించి శపించెను. శివానుచరులలో ప్రధానుడగు నంది శివనిందను సహింపలేనివాడై దక్షుని, దక్షునివాక్కుల నామోదించు ద్విజులను శపించుచు నిట్లు పలికెను :- 'భగవదభిన్న తనువు గలశివుని నిందించువారిబుద్ధి అర్థవాదరూపములగు వేదవాక్కులచే మోహిత మగుగాక! దేహాదులయం దాసక్తమగుగాక! సర్వభుక్కులై యుండియు పరమార్థము నుండి చ్యుతులై సంసార క్లేశముల ననుభవింతురుగాక!' ద్విజులకిచ్చిన యా శాపమును విని భృగువుకూడ శివానుచరులను 'శివదీక్షయందు దీక్షితులగువారు పాషండ ధర్మాశ్రితు లగుదురు గాక' యని తిరిగి శపించెను.

### శ్రీ విదుర ఉవాచ

**భవే శీలవతాం శ్రేష్ఠే దక్షో దుహితృవత్సలః ।**
**విద్వేషమకరోత్కస్మాదనాదృత్యాత్మజాం సతీమ్ ॥ 1**

విదురుడు పలికెను :- మైత్రేయా! పుత్రికలపై ప్రేమగల దక్షప్రజాపతి యేకారణమున తనపుత్రిక యగుసతీదేవిని అగౌరవించి సచ్చరిత్రులలో శ్రేష్ఠుడగు మహాదేవునిపై ద్వేషము బూనెను.

**కస్తం చరాచరగురుం నిర్వైరం శాన్తవిగ్రహమ్ ।**
**ఆత్మారామం కథం ద్వేష్టి జగతో దైవతం మహత్ ॥ 2**

చరాచర జగత్తునకు గురువైనవాడును, శత్రుత్వము లేనివాడును, ప్రశాంత మూర్తియును, ఆత్మారాముడు (పరమాత్మ యగువాసుదేవునిపై ప్రేమగలవాడును) జగత్తునకు పరమదేవతయునగు ఈ మహాదేవునిపై దక్షప్రజాపతి యేలవైరమును బూనెను?

ఏతదాఖ్యాహి మే బ్రహ్మన్ జామాతుః శ్వశురస్య చ ।
విద్వేషస్తు యతః ప్రాణాంస్తత్యాజ దుస్త్యజాన్ సతీ ॥ 3

మహాత్మా! మామయల్లుండ్ర యీ కలహమునకు గల కారణమును వివరింపవలసినది. ఏ కారణమువలన సతీదేవి విడువరాని ప్రాణములను గూడ విడచినది? ఈవిషయమునుగూడ వివరింపవలసినది.

## శ్రీ మైత్రేయ ఉవాచ :

పురా విశ్వసృజాం సత్రే సమేతాః పరమర్షయః ।
తథామరగణాః సర్వే సానుగా మునయోఽగ్నయః ॥ 4

మైత్రేయుడు పలికెను :- విదురా! పూర్వకాలమున ప్రజాపతుల యజ్ఞమున ప్రధానఋషులు, దేవతలు, మునులు, అగ్నులు తమతమ యనుచరవర్గముతో గలిసి యుండిరి.

తత్ర ప్రవిష్టమృషయో దృష్ట్వార్కమివ రోచిషా ।
భ్రాజమానం వితిమిరం కుర్వన్తం తన్మహత్సదః ॥ 5

ఉదతిష్ఠన్ సదస్యాస్తే స్వధిష్ణ్యేభ్యః సహాగ్నయః ।
ఋతే విరించాచ్ఛర్వాచ్చ తద్భాసాక్షిప్తచేతసః ॥ 6

దక్షప్రజాపతి సూర్యునివలె తనతేజస్సుతో ప్రకాశించు నా సభామండపములోనికి ప్రవేశించెను. ఆయన యవయవప్రభచే సభాస్థలి యంతయు ప్రదీప్తమై యంధకార మంతయు దొలగెను. అగ్నితోగూడ సభాసదులగు ఋషులందఱు ఆయన సభలోనికి ప్రవేశించుట చూచి తమతమ స్థానములనుండి లేచిరి. కాని బ్రహ్మ-శివుడు మాత్రము తమతమస్థానముల నుండి లేచి యేవిధమగు గౌరవమును జూపలేదు.

*చ. సరసిజగర్భయోగిజనసర్వ సుపర్వమునీంద్ర హవ్యభు*
*క్పరమఋషిప్రజాపతులు భక్తిమెయిం జనుదెంచి యుండ న*
*త్తరణిసమానతేజుఁ డగుదక్షుఁడు వచ్చిన ఁదత్సదస్యులా*
*దరమున లేచి రప్పుడు పితామహభర్గులు దక్కనందఱున్.* (4-38)

సదసస్పతిభిర్దక్షో భగవాన్ సాధుసత్కృతః ।
అజం లోకగురుం నత్వా నిషసాద తదాజ్ఞయా ॥ 7

దక్షుడు సదస్యులసత్కారమును స్వీకరించి, లోకగురువగు బ్రహ్మకు ప్రణమిల్లెను. ఆయనయాజ్ఞ ననుసరించి ఆసనమునందుపవిష్టు డయ్యెను.

ప్రాఙ్నిషణ్ణం మృడం దృష్ట్వా నామృష్యత్తదనాదృతః ।
ఉవాచ వామం చక్షుర్భ్యామభివీక్ష్య దహన్నివ ॥ 8

కాని దక్షుడు ఆసనమునందుపవిష్టు డగుటకు పూర్వమునుండియే శివుడు తన యాసనమున గూర్చుండియుండెను. దక్షుడు దీనిని జూచి శివుడు చేసిన యీ యవమానమును సహింపనివాడై క్రోధదృష్టితో జూచుచు మహాదేవుని దగ్ధము చేయువానివలె ఉద్యుక్తుడై సదస్యులతో నిట్లుపలికెను.

శ్రూయతాం బ్రహ్మర్షయో మే సహదేవాః సహాగ్నయః ।
సాధూనాం బ్రువతో వృత్తం నాజ్ఞానాన్న చ మత్సరాత్ ॥ 9

బ్రహ్మర్షులారా! దేవతలారా! అగ్నులారా! నే నజ్ఞానముతో గాని లేక మాత్సర్యమునకు వశుడనైగాని యెట్టి విషయమును జెప్పుటలేదు. శిష్టాచారమును మాత్రము చెప్పుచున్నాను. దయయుంచి మీరు వినవలసినది.

అయన్తు లోకపాలానాం యశోఘ్నో నిరపత్రపః ।
సద్భిరాచరితః పన్థా యేన స్తబ్ధేన దూషితః ॥ 10

ఈ లజ్జావిహీనుడు యథోచితములగు కర్తవ్యములకు విముఖుడై శిష్టాచార మార్గమును దూషించినాడు. అందువలన వీనిచే లోకపాలకుల యశస్సు అంతయు నష్టమైనది.

ఏష మే శిష్యతాం ప్రాప్తో యన్మే దుహితురగ్రహీత్ ।
పాణిం విప్రాగ్నిముఖతః సావిత్ర్యా ఇవ సాధువత్ ॥ 11

బ్రాహ్మణులయొక్క అగ్నియొక్క సమక్షమున సాధువువలె సావిత్రితో సమానమగు నా పుత్రిక నితడు పరిణయమాడెను. అందువలన నితడు నా శిష్యత్వమును పొందెను. (అనగా నా శాసనమునకు లోబడెను.)

గృహీత్వా మృగశాబాక్ష్యాః పాణిం మర్కటలోచనః ।
ప్రత్యుత్థానాభివాదార్హే వాచాప్యకృతనోచితమ్ ॥ 12

మర్కటలోచను డగు నీ శివుడు లేడిపిల్ల వంటికన్నులు గల నా పుత్రికను పరిణయ మాడి ప్రత్యుత్థానాదుల ద్వారా పూజార్హుడ నగు నన్నొక్క వాక్కుచేత గూడ గౌరవింపలేదు.

లుప్తక్రియాయాశుచయే మానినే భిన్నసేతవే ।
అనిచ్ఛన్నప్యదాం బాలాం శూద్రాయేవోశతీం గిరమ్ ॥ 13

పరాధీనుడగు బ్రాహ్మణు డిష్టము లేకపోయినను శూద్రునకు వేదము చెప్పునట్లు నేనుగూడ సదాచారవిహీనుడు, అశుచియు, గర్వియు, ధర్మమర్యాద నుల్లంఘించినవాడు నగు వీనికి నా పుత్రిక నిచ్చితిని.

ప్రేతావాసేషు యో ఘోరైః ప్రేతైర్భూతగణైర్వృతః ।
అటత్యున్మత్తవన్నగ్నో వ్యుప్తకేశో హసన్ రుదన్ ॥ 14

ఈ వ్యక్తి భయంకరాకారులగు భూతప్రేతములతో గూడి జుట్టు విరబోసికొని దిగంబరుడై పిచ్చివానివలె నవ్వుచు నేడ్చుచు శ్మశానమున సంచరించుచుండును.

చితాభస్మకృతస్నానః ప్రేతస్రఙ్ న్రస్థిభూషణః ।
శివాపదేశో హ్యశివో మత్తో మత్తజనప్రియ ।
పతిః ప్రమథనాథానాం తమో మాత్రాత్మకాత్మనామ్ ॥ 15

ఇతడు శరీరమంతయు చితాభస్మమును పూసికొనును. కంఠమున ప్రేతములు ధరించు మానవకపాలములను, శరీరమున ఎముకలతో జేయబడిన ఆ భూషణములను ధరించును. పేరుకుమాత్ర మితడు శివుడు, వాస్తవములో అశివుడె. అనగా అమంగళరూపుడె. స్వయముగ ఉన్మత్తుడై యుండుటవలన వీనిని పిచ్చివారుమాత్రమే ప్రేమింతురు. ఇతడు భూతప్రేతాదులకు నాయకుడై యున్నాడు.

తస్మా ఉన్మాదనాథాయ నష్టశౌచాయ దుర్హృదే ।
దత్తా బత మయా సాధ్వీ చోదితే పరమేష్ఠినా ॥ 16

అయ్యో! బ్రహ్మమాటను నమ్మి నేను భూతప్రేతములకు నాథుడు, ఆచారహీనుడు, దుష్టస్వభావుడు నగు వీనికి "సతి" యను నా పుత్రిక నిచ్చితిని.

సీ॥ *అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మానహీనుండు మర్యాదలేనివాడు*
*మత్తప్రచారుండున్మత్త ప్రియుండు దిగంబరుడు భూతప్రేతపరివృతుండు*
*దామసప్రమథభూతములకు నాథుండు భూతిలిప్తుం డస్థిభూషణుండు*
*నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్టహృదయుఁ డుగ్రుఁడును బరేతభూని*

తే॥ *కేతనుఁడు నితతస్రస్త కేశుఁ డశుచి*
*యైన యితనికి శివనాముఁడనుప్రవాద*
*మెటులు గలిగె నశివుఁ డగునితని నెఱిఁగి*
*యెఱిఁగి వేదంబు శూదునకిచ్చి నటులు* (4-43)

## శ్రీ మైత్రేయ ఉవాచ

వినిన్ద్యైవం స గిరిశమప్రతీపమవస్థితమ్ ।
దక్షోఽథాప ఉపస్పృశ్య క్రుద్ధః శప్తుం ప్రచక్రమే ॥ 17

మైత్రేయుడు పలికెను :- నిర్వికారభావముతో సభాస్థలమున ఉపవిష్టుడైయున్న శివుని నిట్లునిందించియు దక్షుడు శాంతిబొందలేదు. పైగా క్రోధాంధుడై జలమును స్పృశించి శాపమిచ్చుట కుద్యుక్తుడయ్యెను.

అయన్తు దేవయజన ఇన్ద్రోపేన్ద్రాదిభిర్భవః ।
సహభాగం న లభతాం దేవైర్దేవగణాధమః ॥ 18

ఈ దేవాధము డగు భవుడు దేవతాదుల యజనసమయమున ఇంద్రోపేంద్రులు మున్నగు దేవతలతోపాటు యజ్ఞభాగమును పొందజాలడు.

నిషిధ్యమానః స సదస్యముఖ్యై ।
ర్దక్షో గిరిత్రాయ విసృజ్య శాపమ్ ।
తస్మాద్వినిష్క్రమ్య వివృద్ధమన్యు -
ర్జగామ కౌరవ్య నిజం నికేతనమ్ ॥ 19

కురునందనుడ వగు విదురా! సభామండపమునందున్న ప్రధాన సభ్యులు మాటిమాటికి నివారించినను వినక దక్షుడధిక క్రోధముతో గిరీశుని శపించి సభాస్థలము నుండి బహిర్గతుడై తన గృహమునకు వెడలెను.

విజ్ఞాయ శాపం గిరిశానుగాగ్రణీ -
ర్నన్దీశ్వరో రోషకషాయదూషితః ।
దక్షాయ శాపం విససర్జ దారుణం
యే చాన్వమోదం స్తదవాచ్యతాం ద్విజాః ॥ 20

ఈ శాపవిషయమును విని గిరీశానుచరులలో ప్రధానుడగు నందీశ్వరుని నయనములు క్రోధముచే నెఱ్ఱుపెక్కెను. వెంటనే యతడు దక్షుని, సభ్యులలో శివదూషణము నామోదించిన ద్విజులను దారుణముగ శపించెను.

య ఏతన్మర్త్యముద్దిశ్య భగవత్యప్రతిద్రుహి ।
ద్రుహ్యత్యజ్ఞః పృథగ్దృష్టిస్తత్త్వతో విముఖో భవేత్ ॥ 21

భేదదర్శియు, మూఢుడు నగు దక్షు డీనశ్వర శరీరము నుత్కృష్టమైనదిగ దలంచి, తిరిగి ద్రోహము చేయనిశివునకు ద్రోహము చేసినాడు. అందువలన నతడు తత్త్వజ్ఞానరహితుడై పరమార్థమునుండి వంచితుడగుగాక!

**గృహేషు కూటధర్మేషు సక్తో గ్రామ్యసుఖేచ్ఛయా ।**
**కర్మతన్త్రం వితనుతాద్వేదవాదవిపన్నధీః ॥ 22**

ఇట్టివ్యక్తిబుద్ధి వేదోక్తములగు నర్థవాదముల ద్వారా వినష్టమగును. అందువలన అతడు స్త్రీలంపటాది హీనసుఖముల యందలి యిచ్ఛతో కపట ధర్మాసక్తుడై కర్మకాండను విస్తరింపజేయును.

**బుద్ధ్యా పరాభిధ్యాయిన్యా విస్మృతాత్మగతిః పశుః ।**
**స్త్రీ కామః సోఽస్త్వతితరాం దక్షో వస్తముఖోఽచిరాత్ ॥ 23**

ఈ దక్షునిబుద్ధి దేహాదులనె ఆత్మయని తలచుచున్నది. దానివలన నతడు ఆత్మతత్త్వమును మరచినవాడు, పశుతుల్యుడు, స్త్రీలంపటుడు నై త్వరలోనె కామాసక్తయగు మేకవంటి ముఖముగలవాడగుగాక!

**విద్యాబుద్ధిరవిద్యాయాం కర్మమయ్యామసావజః ।**
**సంసరన్త్విహ యే చాముమనుశర్వావమానినమ్ ॥ 24**

ఈ దక్షుడు కర్మమయ మగునవిద్యనే తత్త్వవిద్యగా భావించి స్థిరపఱచికొనినాడు, అందువలన నితడు నిజముగ మేకయే యైయున్నాడు. ఇంకను శివద్వేషియగు నీదక్షునిశాపము నామోదించిన ద్విజులుగూడ ఈ సంసారమున మాటిమాటికి జననమరణముల బొందుదురు గాక!

**గిరః శ్రుతాయాః పుష్పిణ్యా మధుగన్ధేన భూరిణా ।**
**మథ్నా చోన్మథితాత్మానః సమ్ముహ్యన్తు హరద్విషః ॥ 25**

వేదవాణీరూపమగులత ఫలశ్రుతిరూపములగు పుష్పములచే శోభిల్లుచున్నది. కర్మఫలరూపము, మనోహరమునగు దానిగంధముచే వీరి మనస్సులు క్షోభిల్లుచున్నవి. అందువలన ఈ శంకరద్రోహులు కర్మకాండమున ఆసక్తి గలవారగుదురుగాక!

**సర్వభక్షా ద్విజా వృత్త్యై ధృతవిద్యాతపోవ్రతాః ।**
**విత్తదేహేన్ద్రియారామా యాచకా విచరన్త్విహ ॥ 26**

ఈ ద్విజులందఱు సర్వభక్షకులు అనగా భక్ష్యాభక్ష్యవిచార శూన్యులగుదురుగాక! దేహమును, సంతానమును, కళత్రాదులను పోషించుకొనుటకై విద్యాతపస్సులను,

వ్రతములను ఆశ్రయింతురుగాక! ధనదేహేంద్రియముల సుఖమునె సుఖముగ భావించి యాచకవేషములతో పుడమియందు దిరుగుచుందురుగాక!

**తస్యైవం వదతః శాపం శ్రుత్వా ద్విజకులాయ వై ।**
**భృగుః ప్రత్యసృజచ్ఛాపం బ్రహ్మదణ్డం దురత్యయమ్ ॥ 27**

బ్రాహ్మణవంశమున కిచ్చిన నందీశ్వరుని శాపవాక్కులను విని భృగువు దుస్తరము, బ్రహ్మదండరూపము నగుశాపము నిచ్చెను.

**భవవ్రతధరా యే చ యే చ తాన్ సమనువ్రతాః ।**
**పాషణ్డినస్తే భవన్తు సచ్ఛాస్త్రపరిపన్థినః ॥ 28**

శివవ్రతధారులైనవారు, శివవ్రతదీక్ష నవలంబించిన వ్యక్తుల ననుసరించువారు సచ్ఛాస్త్రములకు వ్యతిరేకముగ ప్రవర్తించుటచే పాషండు లగుదురుగాక!

**నష్టశౌచా మూఢధియో జటాభస్మాస్థిధారిణః ।**
**విశన్తు శివదీక్షాయాం యత్ర దైవం సురాసవమ్ ॥ 29**

ఈ పురుషులందఱు శౌచాదివిహీనులు, మూఢబుద్ధులు, జటాభస్మాస్థిధారులు నై శివదీక్షయందు ప్రవేశింతురుగాక! శివదీక్షయందు దీక్షితులగు పురుషులు (గౌడి, పైష్టి, మాధ్వీమున్నగు) సురాసవములనె దేవతలవలె నాదరింతురు.

**బ్రహ్మ చ బ్రాహ్మణాంశ్చైవ యద్యూయం పరినిన్దథ ।**
**సేతుం విధరణం పుంసామతః పాషండమాశ్రితాః ॥ 30**

మీరు ధర్మమర్యాదను స్థాపించినదియు, వర్ణాశ్రమములను రక్షించునదియునగు వేదమును, బ్రాహ్మణులను నిందించుచున్నారు. అందువలన మీరు పాషండధర్మము నాశ్రయించు వారగుదురుగాక!

**ఏష ఏవ హి లోకానాం శివః పన్థాః సనాతనః ।**
**యం పూర్వే చానుసంతస్థుర్యత్ప్రమాణం జనార్దనః ॥ 31**

వేదలక్షణయుక్త మగు మార్గమె సనాతనము, మానవులకు మంగళదాయకము నగు మార్గమైయున్నది. పూర్వకాలమున ఋషులీ వేదమునే ఆశ్రయించిరి. జనార్దనుడె యీ వేదమునకు మూలము.

**తద్బ్రహ్మపరమం శుద్ధం సతాం వర్త్మ సనాతనమ్ ।**
**విగర్హ్య యాత పాషణ్డం దైవం వో యత్ర భూతరాట్ ॥ 32**

మీరు ఆపరమవిశుద్ధము, సత్పురుషుల కవలంబనీయమార్గము, సనాతనము నగువేదమును నిందించితిరి. అందువలన మీరు తామసభూతగణముల కధినాథుడు నివసించు ప్రదేశమునకు వెడలి ఆపాషండ దేవతనె పొందుడు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

తస్యైవం వదతః శాపం భృగోః స భగవాన్ భవః ।
నిశ్చక్రామ తతః కించిద్విమనా ఇవ సానుగః ॥ 33

మైత్రేయుడు పలికెను :- భగవదభిన్నుడగు మహాదేవుడు భృగువు పలికిన యీశాప వాక్కులను విని కొలదిగ ఖిన్నుడై యనుచరవర్గముతో గలసి యచటనుండి వెడలిపోయెను.

తేఽపి విశ్వసృజస్సత్రం సహస్రం పరివత్సరాన్ ।
సంవిధాయ మహేష్వాస యత్రేజ్య ఋషభో హరిః ॥ 34

ఆప్లుత్యావభృథం యత్ర గంగాయమునయాన్వితా ।
విరజేనాత్మనా సర్వే స్వం స్వం ధామ యయుస్తతః ॥ 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్ర భాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే దక్షశాపో నామ
ద్వితీయోఽధ్యాయః ॥

ధనుర్ధారి వగు విదురా! ఆప్రజాపతులు దేవాధిదేవుడు, యజ్ఞేశ్వరుడు నగు శ్రీహరి నుద్దేశించి సహస్రవర్ష పరిమితమగు యజ్ఞమును పూర్తి చేసి, గంగాయమునలు గలియు ప్రదేశమున అవభృథస్నానములు చేసి, నిర్మలాంతః కరణులై తమతమనిలయములకు వెడలిరి.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి నాలుగవ
స్కంధములోని రెండవ యధ్యాయము
సమాప్తము.

❀ ❀ ❀

# మూడవ అధ్యాయము

## సతీదేవి పితృగృహమున జరుగు యజ్ఞోత్సవమునకు వెడలుటకై పట్టుదల చూపుట

కథాసారము :- ఈ యధ్యాయమున సతీదేవి తండ్రి చేయు యజ్ఞమును జూడదలచి శివుని ప్రార్థించుట, శివుడు బహువిధములగు నీతుల జెప్పి, హేతుపూర్వకముగ నామెను నివారించుటకు ప్రయత్నించుట యనువిషయములు వర్ణింపబడినవి.

దక్షుడు 'బృహస్పతిసవన' మనుయజ్ఞము జేయనారంభించెను. బ్రహ్మర్షులు, దేవర్షులు, పితృదేవతలు, దేవతలు బంధువులతో గూడ ఆ యజ్ఞమున పాల్గొనుట జూచి సతీదేవిగూడ పితృయజ్ఞమును జూడ నుత్సుకత గలదియయ్యెను. సతీదేవి శివునికడకు వెడలి తండ్రి చేయుయజ్ఞమునకు బోవ ప్రార్థించెను. గిరీశుడు సతీదేవితో నామెతండ్రి తనపట్ల పూర్వము వ్యవహరించిన తీరును అనగా ప్రజాపతుల యజ్ఞమున శివనిందకథను జ్ఞాపకము చేసెను. నానావిధములగునుపదేశముల జేసెను. కారణమునుగూడ చెప్పి దక్షయజ్ఞమునకు బోవ నిషేధించెను.

విద్య, తపస్సు, ధనము, దేహము, వయస్సు, వంశము నను నీయాఱును సాధువులలో నున్నచో గుణరూపమున శోభిల్లును. కాని యవియె అసాధువులకు గర్వమును గలుగజేయును. శివుడు వాసుదేవునకు దాసుడు, అందువలన ఆయన వైష్ణవుని దప్ప వైష్ణవద్వేషులకు, భగద్విముఖులగు వ్యక్తుల కెప్పుడును బాహ్యదేహముద్వారా నమస్కరింపడు. ఇంకను అతడెల్లప్పుడును వాసుదేవునకు నమస్కరించి జీవమాత్రుని గౌరవించును. విశుద్ధము అనగా అప్రాకృతమగు నంతః కరణమే వాసుదేవుడు; విశుద్ధ మగు నంతః కరణమునందే అధోక్షజుడగు వాసుదేవుడు ప్రకాశించును. మహాభాగవతుడగు శంభువు మనస్సులో ఎల్లపుడు అచ్యుతీంద్రియ పురుషుని సేవచేయు చుండును.

### శ్రీ మైత్రేయ ఉవాచ

**సదా విద్విషతోరేవం కాలో వై ధ్రియమాణయోః ।**
**జామాతుః శ్వశురస్యాపి సుమహానతిచక్రమే ॥ 1**

మైత్రేయుడు పలికెను:- ఇట్లెల్లపుడు పరస్పర విద్వేషభావముతో నున్న మామయల్లుండ్రు బహుకాలము గడిపిరి.

**యదాభిషిక్తో దక్షస్తు బ్రహ్మణా పరమేష్ఠినా ।**
**ప్రజాపతీనాం సర్వేషామాధిపత్యే స్మయోఽభవత్ ॥ 2**

పిమ్మట పరమేష్ఠి యగుబ్రహ్మ దక్షుని సర్వప్రజాపతులకు నధిపతిగా అభిషేకము చేసెను. అనాటినుండి దక్షునిగర్వ మధికమయ్యెను.

**ఇష్ట్వా స వాజపేయేన బ్రహ్మిష్ఠానభిభూయ చ ।**
**బృహస్పతిసవం నామ సమారేభే క్రతూత్తమమ్ ॥ 3**

ఆ దక్షుడు గర్వమువలన శంకరుడు మున్నగు బ్రహ్మనిష్ఠులను తిరస్కరించి వాజపేయ యజ్ఞము నొనరించి "బృహస్పతిసవ" మనునొక మహాయజ్ఞమును జేయ సమకట్టెను.

**తస్మిన్ బ్రహ్మర్షయస్సర్వే దేవర్షిపితృదేవతాః ।**
**ఆసన్ కృతస్వస్త్యయనా స్తత్పత్న్యశ్చ సభర్తృకాః ॥ 4**

ఆ యజ్ఞమునందు బ్రహ్మర్షులు, దేవర్షులు, పితృదేవతలు, దేవతలు; తమ తమ భర్తలతో గలసి వారిభార్యలు చక్కగ నలంకృతులై పాల్గొనిరి.

*చ॥ కర మనురక్తి న మ్మఖము గన్గొను వేడుక దొంగలింపగా*
*బరమముని ప్రజాపతి సుపర్వమహర్షి వరుల్ సభార్యులై*
*పరువడి వచ్చి యందఱు శుభస్థితి దీవన లిచ్చి దక్షుచేఁ*
*బొరిఁబొరి నచ్చటన్ విహితపూజల నొందిరి సమ్మదంబునన్.* (4-56)

**తదుపశ్రుత్య నభసి ఖేచరాణాం ప్రజల్పతామ్ ।**
**సతీ దాక్షాయణీ దేవీ పితృయజ్ఞ మహోత్సవమ్ ॥ 5**

**వ్రజన్తీః సర్వతో దిగ్భ్య ఉపదేవవరస్త్రియః ।**
**విమానయానాః సప్రేష్ఠా నిష్కకంఠీః సువాససః ॥ 6**

**దృష్ట్వా స్వనిలయాభ్యాసే లోలాక్షీర్మృష్టకుండలాః ।**
**పతిం భూతపతిం దేవమౌత్సుక్యాదభ్యభాషత ॥ 7**

ఖేచరు లాయజ్ఞవిషయమును జెప్పికొనుచు ఆకాశమార్గమున సంచరింపసాగిరి. దక్షునిపుత్రిక యగుసతీదేవి వారివలన తండ్రియొక్క యజ్ఞ మహోత్సవ వృత్తాంతమును వినెను. తమ గృహమునకు సమీపమున నలువైపులనుండి పతకములను కంఠమున ధరించినవారును, మంచివస్త్రములను సముజ్జ్వలము లగుకుండలములను ధరించినవారును చంచలలోచనములు గలవారును నగు గంధర్వస్త్రీలు భర్తలతోను పుత్రులతోను గలసి

విమానము నధిరోహించి యజ్ఞమండపమునకు వెడలుచుండిరి. ఇది జూచి సతీదేవియు పితృయజ్ఞదర్శనార్థమై మిగుల యుత్సుకతజూపి, తనకు భర్తయు దేవాదిదేవుడు, భూతపతియు నగు శివునితో నిట్లు పలికెను.

## శ్రీ సత్యువాచ

ప్రజాపతే స్తే శ్వశురస్య సాంప్రతం
నిర్యాపితో యజ్ఞమహోత్సవః కిల ।
వయం చ తత్రాభిసరామ వామ తే
యద్యర్థితామీ విబుధా వ్రజన్తి హి ॥ 8

సతీదేవి పలికెను :- నాథా! మీమామగారగుదక్షప్రజాపతియొక్క యజ్ఞమహోత్సవ మారంభమయ్యెను. అటు చూడుడు, దేవతల గూడ నాయజ్ఞమును దర్శించుటకై వెడలుచున్నారు. మీ కిష్టమైనచో మనము గూడ నచటికి వెడలుదము.

తస్మిన్ భగిన్యో మమ భర్తృభిః స్వకై
ర్ధ్రువం గమిష్యన్తి సుహృద్దిదృక్షవః ।
అహం చ తస్మిన్ భవతాభికామయే
సహోపనీతం పరిబర్హమర్హితుమ్ ॥ 9

నాఅక్కలందఱు తమతమభర్తలతో గలసి యాత్మీయుల జూచు నభిలాషతో తప్పక ఆ యజ్ఞమండపమునకు వెడలుదురు. ఆ యజ్ఞమున నా తల్లిదండ్రులిచ్చిన అలంకారాది ద్రవ్యములను వారు గ్రహింతురు. అట్లే మీతోపాటు నాకుగూడ వానిని స్వీకరింపవలయు నను కోరికగలదు.

తత్ర స్వసౄర్మే నను భర్తృసమ్మితా
మాతృష్వసౄః క్లిన్నధియం చ మాతరమ్ ।
ద్రక్ష్యే చిరోత్కంఠమనా మహర్షి భి-
రున్నీయమానం చ మృడాధ్వరధ్వజమ్ ॥ 10

శివా! బహుదినములనుండి నామనస్సు నాబంధువులను జూచుట కుత్సాహ పడుచున్నది. అందువలన నే నాయజ్ఞమహోత్సవమునకు వెడలి, తమతమభర్తలతో వచ్చిన నాయక్కలను, పినతల్లులను, స్నేహార్ద్రచిత్తయగు తల్లిని, ఋషులచే నెత్తబడిన అధ్వరధ్వజమును (యూపమును) దర్శింప గలను.

త్వయేతదాశ్చర్యమజాత్మమాయయా
వినిర్మితం భాతి గుణత్రయాత్మకమ్ ।
తథాప్యహం యోషిదతత్త్వవిచ్చ తే
దీనా దిదృక్షే భవ మే భవక్షితిమ్ ॥ 11

శివా! గుణత్రయాత్మకము, ఆశ్చర్యరూపము నగు నీవిశ్వము నీయందు నీమాయచే నిర్మితమై విరాజిల్లుచున్నది. అందువలన నీ కద్భుతముగా దోచదు. కాని నేను స్త్రీని, ఉత్సుక స్వభావము గలదానను, పైగా నీ యథార్థ స్వరూపము నెఱుంగనిదానను. అందువలన శివా! దీనురాలనై నేను నాజన్మభూమిని జూడగోరుచున్నాను.

పశ్య ప్రయాన్తీరభవాన్య యోషితో
ఽప్యలంకృతాః కాన్తసఖా వరూథశః ।
యాసాం వ్రజద్భిః శితికంఠమండితం
నభో విమానైః కలహంసపాండుభిః ॥ 12

అభవా! (కనుకనే నీవు సుహృద్విరహదుఃఖమును అనుభవించలేదు) నీలకంఠా! ఒకమా రటుచూడుము, అన్యస్త్రీలు గూడ తమతమ భర్తలతోపాటు అలంకృతలై గుంపులు గుంపులుగ నాతండ్రి చేయు యజ్ఞమును జూడ వెడలుచున్నారు. కలహంసలవలె తెల్లగనున్న వారి విమానముల వరుసలచే నభోమండల మెంతటి అపూర్వశోభతో శోభిల్లుచున్నదో చూడుము.

*చ॥ ముదమునఁ దన్మఖోత్సవవిభూతిం గనుంగొన దివ్య కామినుల్*
*పదుపులు గట్టి భూషణవిభాసిత లై నిజనాథయుక్త లై*
*మదకలహంసపాండుర సమంచితదివ్య విమానయాన లై*
*యదె చనుచున్నవారు గను మభ్రపథంబున నీలకంధరా॥* (4-66)

కథం సుతాయాః పితృగేహకౌతుకం
నిశమ్య దేహః సురవర్య నేంగతే ।
అనాహుతా అప్యభియన్తి సౌహృదం
భర్తుర్గురోర్దేహకృతశ్చ కేతనమ్ ॥ 13

సురశ్రేష్ఠా! పితృగృహమున జరుగు నుత్సవ సమాచరమును విని వానిపుత్రిక యొక్క శరీరము దానిలో పాల్గొనుట కేలతొందరపడదు? బంధువులు, భర్త, మామ, తల్లిదండ్రులు మున్నగు వారియింటికి పిలువక పోయినను వెడలవచ్చును.

తన్మే ప్రసీదేదమమర్త్య వాంఛితం
కర్తుం భవా కారుణికో బతార్హతి ।
త్వయాత్మనోఽర్ధేఽహమదభ్రచక్షుషా
నిరూపితా మానుగృహాణ యాచితః ॥ 14

దేవా! అందువలన నాకు ప్రసన్నుడవగుము; నీవు దయాళుడవు. దయయుంచి నా యీ కోరికను దీర్పుము. పరమజ్ఞానివై యుండియు నీవు నన్ను నీ యర్ధాంగినిగా స్వీకరించితివి. అందువలన నాపై దయ జూపుము. నేను నీకృపను యాచించుచున్నాను.

## శ్రీ ఋషిరువాచ

ఏవం గిరిత్రః ప్రియయాభిభాషితః
ప్రత్యభ్యధత్త ప్రహసన్ సుహృత్ప్రియః ।
సంస్మారితో మర్మభిదః కువాగిషూన్
యానాహ కో విశ్వసృజాం సమక్షతః ॥ 15

మైత్రేయుడు పలికెను:- విదురా! బంధుప్రియుడగు గిరీశుడు తనభార్య పలికిన యీమాటలు విని నవ్వెను. దక్షుడు ప్రజాపతులయెదుట తన్నుగూర్చి చేసిన దూషణములను గుర్తుకు దెచ్చుకొని ఆమె కిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

## శ్రీ భగవానువాచ

త్వయోదితం శోభనమేవ శోభనే
అనాహుతా అప్యభియన్తి బన్ధుషు ।
తే యద్యనుత్పాదితదోషదృష్టయో
బలీయసాఽనాత్మ్యమదేన మన్యునా ॥ 16

యోగేశ్వరుడగు మహాదేవుడు పలికెను :- కళ్యాణీ! పిలువబడక పోయినను బంధువులయింటికి వెడలవచ్చునని నీవు పలికిన మాట చాల సుందరముగ నున్నది. కాని నీ బంధువులదృష్టి ప్రబల మగు దేహాభిమానము వలన గలిగిన గర్వముచేత, క్రోధముచేత దోషయుక్తము కానిచో నీవు పలికినమాట యింకను బాగుగ నుండును.

విద్యాతపోవిత్తవపుర్వయః కులైః
సతాం గుణైః షడ్భిరసత్తమేతరైః ।
స్మృతౌ హతాయాం భృతమానదుర్దృశః
స్తబ్ధా న పశ్యన్తి హి ధామ భూయసామ్ ॥ 17

విద్య, తపస్సు, ధనము, సుందరదేహము, యౌవనము, ఆభిజాత్యము (ఉన్నత వంశము) అనునీయాఱును సత్పురుషులకు గుణములు; కాని యీ యాఱును హీనులగు వ్యక్తులలో నున్న విపరీతఫలము నిచ్చును. ఈ గుణములచే గర్వము పెరిగినచో అసాధువుల వివేకము లుప్తమగును. అందువలన వారు మహాపురుషుల తేజస్సును దర్శింపజాలరు.

> నైతాదృశానాం స్వజనవ్యపేక్షయా
> గృహాన్ ప్రతీయాదనవస్థితాత్మనామ్ ।
> యేఽభ్యాగతాన్ వక్రధియాభిచక్షతే
> ఆరోపితభ్రూభిరమర్షణాక్షిభిః ॥ 18

తనవారను దృష్టితో దుష్టచిత్తులగు వ్యక్తుల గృహములకు వెడులట మంచిదికాదు. వీరు కుటిలబుద్ధివలన అభ్యాగతులను క్రోధదృష్టితో జూతురు.

*కం॥ విను మట్లు కుటిలు లగు దు*
*ర్జనులగృహంబులకు బంధుసరణిని బోవన్*
*జనదు వినీతుల కది కదు*
*ననుచితమై యుండు నింతి యది యెట్లనినన్.* (4-71)

> తథారిభిర్న వ్యథతే శిలీముఖైః
> శేతేఽర్దితాంగో హృదయేన దూయతా ।
> స్వానాం యథా వక్రధియాం దురుక్తిభి
> ర్దివానిశం తప్యతి మర్మతాడితః ॥ 19

కుటిలబుద్ధులగు బంధువుల పరుషవాక్కులచే గలుగు వ్యథ శత్రువుల బాణములచే తాడితుడైనను గలుగదు. ఏలయన, బాణములచే శరీరము ఛిన్నభిన్నమైన పిమ్మట మానవుడు నిద్రాసుఖమును పొందవచ్చును. కాని వాగ్బాణములచే వ్యథితహృదయుడగు వ్యక్తి రేయింబవళ్ళు సంతప్త హృదయముతో కాలము గడుపును.

*చం॥ సమదరిపుప్రయుక్త పటుసాయకజర్జరితాంగుఁ డయ్యు దుః*
*ఖమును దొఱంగి నిద్రఁ గనుఁ గాని కృశింపఁడు మానవుండు నో*
*యుమ విను మిష్టబాంధవ దురుక్తులు మర్మము లంట నాటఁజి*
*తమున నహర్నిశంబు పరితాపము నొంది కృశించు [illegible] నన్* (4-73)

వ్యక్తం త్వముత్కృష్టగతేః ప్రజాపతేః
ప్రియాత్మజానామసి సుభ్రు మే మతా ।
తథాపి మానం న పితుః ప్రపత్స్యసే
మదాశ్రయాత్కః పరితప్యతే యతః ॥ 20

సుందరీ! ఉత్కృష్టగతిగల దక్షప్రజాపతికి తన పుత్రికలలో నీవు చాలప్రియమైన దానవని నానిశ్చితాభిప్రాయము. అయినను నీవు నన్నాశ్రయించి యుండుటవలన నీకు తండ్రికడ గౌరవము కలుగదు. అతడు నాపై నెక్కువగ మండిపడుచున్నాడు.

పాపచ్యమానేన హృదాతురేంద్రియః
సమృద్ధిభిః పూరుషబుద్ధిసాక్షిణామ్ ।
అకల్ప ఏషామధిరోఢు మంజసా
పరంపదం ద్వేష్టి యథాఽసురా హరిమ్ ॥ 21

నిరహంకారులగు పురుషుల పుణ్యకీర్తి మున్నగువానిని దర్శించి దుష్టుల హృదయము ఈర్ష్యానలముచే దగ్ధమగును. వారి యింద్రియములు పట్టుతప్పిపోవును. శ్రేష్ఠమగు నైశ్వర్యమును పొంద నసమర్థులై కేవలము శ్రీహరిని ద్వేషించు నసురులవలె నాదుష్టులితరులను ద్వేషింతురు.

మ॥ *నిరహంకార నిరస్త దోషసుజనానింద్యోల్ల సత్కీర్తిం గొం*
*దఱు కామించి యశక్తులై మనములన్ దందహ్యమానేంద్రియా*
*తురులై యూరక మచ్చరింతురు మహోత్కృండీశ్వరుండైన యా*
*హరితో బద్ధవిరోధమున్ దొడరు దైత్యశ్రేణి చందంబునన్.* (4-76)

ప్రత్యుద్గమప్రశ్రయణాభివాదనం
విధీయతే సాధు మిథస్సుమధ్యమే ।
ప్రాజ్ఞైః పరస్మై పురుషాయ చేతసా
గుహాశయాయైవ న దేహమానినే ॥ 22

సుందరీ! అజ్ఞానజనులు పరస్పరము ప్రత్యుత్థానము, నమస్కారము, అభివాదనము మున్నగువానిని చేసికొందురు. కాని విజ్ఞులు వానిని అన్యవిధములుగ ఉత్తమరూపముతో సాధింతురు. వారు బహిర్ముఖుడగు దేహాభిమానికి కాయికవ్యాపార యోగముతో అభివాదనాదులను జేయక మనస్సుద్వారా వాని హృదయమున శయనించు అంతర్యామియు, పరమపురుషుడువగు వాసుదేవునకు నమస్కారాదులను జేయుదురు.

సత్త్వం విశుద్ధం వసుదేవశబ్దితం
యదీయతే తత్ర పుమానపావృతః ।
సత్త్వే చ తస్మి భగవాన్ వాసుదేవో
హ్యధోక్షజో మే నమసా విధీయతే ॥ 23

అప్రాకృతము, విశుద్ధమునగు నంతఃకరణమే వసుదేవశబ్దము ద్వారా చెప్పబడినది. అంతఃకరణ శూన్యుడు అనగా స్వరూపశక్తి వృత్తిభూతుడు, స్వప్రకాశశక్తి లక్షణయుక్తుడు నగు పురుషుడు ఆ విశుద్ధసత్త్వము నందు ప్రకాశించుచుండుటవలన అతడు వాసుదేవుడయ్యెను. ఆయన షడైశ్వర్యశాలియగు భగవానుడు, ఇంద్రియజ్ఞానాతీతుడు, ఆయన విశుద్ధసేవోన్ముఖము, అప్రాకృతమునగు అంతఃకరణమున నిత్యము ప్రకాశించు చుండును. నేనట్టి భగవానునికి విశేషరూపముగ నమస్కరించుచున్నాను.

(విశుద్ధమగునంతఃకరణమునె "వసుదేవు" డందురు. దానిలో భగవంతుడగు వాసుదేవునకు అపరోక్షానుభవము కలుగును. ఆశుద్ధ చిత్తముననున్నవాడు, ఇంద్రియాతీతుడు నగు వాసుదేవునకే నేను నమస్కరించుచున్నాను.)

తత్తే నిరీక్ష్యో న పితాపి దేహకృ-
ద్దక్షో మమ ద్విట్ తదనువ్రతాశ్చ యే ।
యో విశ్వసృగ్యజ్ఞగతం వరోరు మా
మనాగసం దుర్వచసాఽకరోత్తిరః ॥ 24

ప్రియా! దక్షుడు నీకు దేహము నిచ్చిన తండ్రి యైనను వానిని జూచుటకు వెడలుట నీకు తగదు. వాని ననుసరించువారిని గూడ నీవు జూడదగదు. ప్రజాపతుల యజ్ఞమున అతడు నాకెట్టియపరాధము చేయక పోయినను కటువాక్కులతో నన్ను తిరస్కరించినాడు.

యది వ్రజిష్యస్యతిహాయ మద్వచో
భద్రం భవత్యా న తతో భవిష్యతి ।
సంభావితస్య స్వజనాత్పరాభవో
యదా స సద్యో మరణాయ కల్పతే ॥ 25

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్ర భాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే ఉమారుద్ర సంవాదోనామ

నామాటలను పెడచెవినిబెట్టి యచటికి వెడలినచో నీకు శుభము కలుగదు. ఏలయన, గౌరవము గల వ్యక్తికి బంధువులవలన అవమానము గలిగినచో నది వెంటనే వాని మరణమునకు కారణమగును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి నాలుగవ

స్కంధములోని మూడవ అధ్యాయము

సమాప్తము.





# నాలుగవ అధ్యాయము

## సతీదేవి అగ్నిప్రవేశము చేయుట.

కథాసారము :- ఈ యధ్యాయమున పతిని విడచిపెట్టి తండ్రి చేయు యజ్ఞమునకు వెడలిన సతీదేవి తండ్రిచే అవమానింపబడినదై ఆయజ్ఞస్థలమున క్రోధముతో దేహమును త్యజించుట యనువిషయము వర్ణితమైనది.

సతీదేవి భర్తమాటను పెడచెవిని బెట్టి తండ్రియింటికి వెడలెను. అచట దక్షుని భయమువలన ఆమెతల్లియు, అక్కలు తప్ప ఇతరులెవ్వరును నామెతో బలుకలేదు. దక్షయజ్ఞమున రుద్రున కెట్టిభాగము లేకపోవుట చూచి సతీదేవి వైష్ణవ స్వామికి గలిగిన అవమానమును సహింపజాలనదియై కోపముతో దండ్రితో నిట్లు పలికెను.

'గౌరవము నిచ్చువాడు, ధర్మవిశిష్టుడు, వైష్ణవశ్రేష్ఠుడు నగుశివుని అవమానించినవాడు తనకాళ్ళను తానే గొడ్డలితో నఱకుకొన్నవా డగును. జడదేహము నాత్మయని భావించువాని కిట్టి వైష్ణవద్వేషము దగినదే యగును. దానివలన వానికి దగినదండన గలుగును. దుర్జనుడగువాడు ధర్మరక్షకుడగు వైష్ణవుని నిందించినచో వెంటనే వానినాలుకను ఛేదింపవలెను. అట్లు చేయజాలనిచో తాను ప్రాణములను విడువవలెను. అదికూడ కుదరకపోయినచో చెవులు మూసికొని యచటినుండి వెడలిపోవలెను. సామర్థ్యమున్నచో ఆదుష్టులజిహ్వను ఛేదించి పిమ్మట తాను దేహత్యాగము చేయుట శాస్త్రములలో జెప్పబడిన ధర్మము.

సమస్తైశ్వర్యము వైష్ణవుల కరతలగతమై యున్నది. వైష్ణవుడు కోరకపోయినను అది దాసునివలె వాని ననుసరించును. కాని కర్మజడుల కట్టి యైశ్వర్యము లేశమాత్రమును నుండదు. వైష్ణవద్వేషి యగు తండ్రివలన జన్మించిన దేహము హీనమైనది. అందువలన అది వైష్ణవ సేవార్థమై విడువదగినది.

సతీదేవి వైష్ణవద్వేషియగుతండ్రిని సంహరింపజాలనదియై తానే యోగము నవలంబించి దేహత్యాగము చేసెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

ఏతావదుక్త్వా విరరామ శంకరః
పత్న్యఙ్గనాశం హ్యుభయత్ర చిన్తయన్ ।
సుహృద్దిదృక్షుః పరిశంకితా భవా -
న్నిష్క్రామతీ నిర్విశతీద్విధాఽఽస సా॥

మైత్రేయుడు పలికెను :- విదురా! శంకరుడిట్లు పలికి మిన్నకుండెను. కాని "దక్షునియింటికి బోవ ననుమతి యిచ్చినను, ఈయకపోయినను తన భార్య సతీదేవి ప్రాణత్యాగము చేయుట సంభవమే" యని ఆయన తలంపసాగెను. ఇక సతీదేవియు బంధువుల జూచు దలంపుతో నొకమారు బయటకు వచ్చును. శంకరుడు కోపించు ననుభయముతో మఱియొకమారు లోనికిబోవును. ఇట్లు యేవిషయమును నిర్ణయించుకొన లేకపోవుటచే ఆమె ద్వంద్వావస్థలో బడెను.

సుహృద్దిదృక్షా ప్రతిఘాతదుర్మనాః
స్నేహాద్రుదత్యశ్రుకలాతివిహ్వలా ।
భవం భవాన్యప్రతిపూరుషం రుషా
ప్రధక్ష్యతీవైక్షత జాతవేపథుః ॥ 2

బంధుజనులను జూడవలెననెడు తలంపున కాటంకము కలుగగా సతీదేవి మనస్సు మిగుల బాధచెందెను. బంధువులపై గల ప్రేమాతిశయముచే నామె కనులవెంట బాష్పముల రాల్చుచు నేడ్చుచు మిగుల విహ్వలయయ్యెను. క్రోధముచే నామె శరీరము కంపింపసాగెను. ఆ క్రోధాగ్నిచే అప్రతిమపురుషుడగు రుద్రుని భస్మము చేయునో అన్నట్లుగా ఆమె ఆయనను జూడసాగెను.

తతో వినిశ్వస్య సతీ విహాయ తం
శోకేన రోషేణ చ దూయతా హృదా ।
పిత్రోరగాత్ స్త్రైణ్యవిమూఢధీర్గృహాన్
ప్రేమ్ణాత్మనో యోఽర్ధమదాత్సతాం ప్రియః ॥ 3

అనంతరము సతీదేవి శోకక్రోధములచే మిగుల కాతరచిత్తయై నిట్టూర్పుల విడచుచు పితృగృహమునకు బయల్వెడలెను. సాధుగణప్రియుడగు శంకరుడు ప్రేమతో సతీదేవిని తనయర్ధాంగినిగ జేసికొనెను. స్త్రీ స్వభావముచే మూఢబుద్ధిగలదియై యామె ఆ పరమేశ్వరునిగూడ వదలి పితృగృహమునకు వెడలెను.

తామన్వగచ్ఛన్ ద్రుతవిక్రమాం సతీ
మేకాం త్రినేత్రానుచరాః సహస్రశః ।
సపార్షదయక్షా మణిమన్మదాదయః
పురో వృషేన్ద్రాస్తరసా గతవ్యథాః ॥ 4

ఒంటరిగను, అతివేగముగను వెడలుచున్న సతీదేవిని జూచి మణిమంతుడు, మదుడు మున్నగు వేలకొలది పరమేశ్వరానుచరులు వృషభేంద్రుని ముందుంచుకొని, ఇంకను అనేకపార్షదులను, యక్షులను వెంటనిడుకొని వేగముగ సతీదేవి ననుసరించిరి.

తాం సారికాకన్దుకదర్పణాంబుజైః
శ్వేతాతపత్రవ్యజనస్రగాదిభిః ।
గీతాయనైర్దున్దుభిశంఖవేణుభి-
ర్వృషేన్ద్రమారోప్య విటంకితా యయుః ॥ 5

పిమ్మట వారు సతీదేవి సమీపమునకు వెడలి యామె నావృషభేంద్రునిపై నధిరోహింపజేసి గోరువంకలు, బంతులు, అద్దములు, కమలములు మున్నగు ఆటవస్తువులను; శ్వేతచ్ఛత్రము, వింజామరము, మాల మున్నగు రాజచిహ్నములను, నగారాలను; శంఖములు, వేణువులు మున్నగు వాద్యసామగ్రులను దీసికొని సతీదేవి వెంట పయనించిరి.

ఆబ్రహ్మఘోషోర్జితయజ్ఞవైశసం
విప్రర్షిజుష్టం విబుధైశ్చ సర్వశః ।
మృద్దార్వయః కాంచనదర్భచర్మభి -
ర్నిసృష్టభాండం యజనం సమావిశత్ ॥ 6

సతీదేవి తనతండ్రి యజ్ఞము చేయు ప్రదేశమునకు వెడలెను. అచట నలువైపుల వేదధ్వని ప్రతిధ్వనించుచుండెను. వేదమంత్రోచ్చారణ పూర్వకముగ పశువిశసనము జరుగుచుండెను. దానివలన యజ్ఞప్రదేశము యజ్ఞసంబంధ పశువధచే కోలాహలముగ నుండెను. నలువైపుల విప్రర్షులు దేవతలు ఉపవిష్టులై యుండిరి. మృత్తిక, కాష్ఠము, లోహము, కాంచనము, దర్భ, చర్మము మున్నగువానిచే నిర్మితములైన పాత్రలతో ఆప్రదేశ మలంకృతమై యుండెను.

చ॥ మనమున మోదమందుచు నుమాతరుణీమణి గాంచె దారుమృ
త్కనకకుశాజినాయసనికాయ వినిర్మిత పాత్రసీమము
న్ననుపము వేదఘోష సుమత్పశుబంధన కర్మభూమమున్
మునివిబుధాభిరామము సముజ్జ్వల హోమము యాగధామమున్. (4-82)

తామాగతాం తత్ర కశ్చనాద్రియ -
ద్విమానితాం యజ్ఞకృతో భయాజ్జనః ।
ఋతే స్వసౄర్వై జననీం చ సాదరాః
ప్రేమాశ్రుకణ్ఠ్యః పరిషస్వజుర్ముదా ॥ 7

అచటికి జేరినపిమ్మట తండ్రివలన సతీదేవికి తిరస్కారము జరిగెను. ఇది చూచి దక్షునిభయమువలన నెవ్వరుగూడ నామెను ఆదరింపలేదు. ఆమెతల్లియు, అక్కలు మాత్రము ఆనందముతో నామె నాలింగనము చేసి కొనిరి. ప్రేమవిగళితము లగునశ్రుధారలచే నామెకంఠము రుద్ధమయ్యెను.

సౌదర్యసంప్రశ్నసమర్థవార్తయా
మాత్రా చ మాతృష్వసృభిశ్చ సాదరమ్ ।
దత్తాం సపర్యాం వరమాసనం చ సా
నాదత్త పిత్రాప్రతినన్దితా సతీ ॥ 8

కాని తండ్రి యేవిధముగను ఆదరింపకపోవుట చూచి సతీదేవి తన అక్కల కుశలప్రశ్నాదులను వినలేదు. తల్లి పినతల్లులు ప్రేమతో నిచ్చిన అలంకారములను ఆసనాదులను ఆమె స్వీకరింపలేదు.

అరుద్రభాగం తమవేక్ష్య చాధ్వరం
పిత్రా చ దేవే కృతహేలనం విభౌ ।
అనాదృతా యజ్ఞసదస్యధీశ్వరీ
చుకోప లోకానివ ధక్ష్యతీ రుషా ॥ 9

మహేశ్వరుని సహధర్మచారిణీ యగు సతీదేవి యజ్ఞమండపమున తన కవమానము జరుగుటను, విభూతిశాలి యగు మహాదేవుని ఆహ్వానింపక తన తండ్రి ఆయనను అవమానించుటను జూచెను. పైగా యజ్ఞమున రుద్రునకు భాగములేదు. అందువలన నామె మిగులక్రుద్ధయయ్యెను. క్రోధము ద్వారా లోకముల నన్నింటిని దగ్ధముచేయుటకు సిద్ధముగ నున్నట్లుండెను.

జగర్హ సామర్ష విపన్నయా గిరా
శివద్విషం ధూమపథశ్రమస్మయమ్ ।
స్వతేజసా భూతగణాన్ సముత్థితాన్
నిగృహ్య దేవీ జగతోఽభిశృణ్వతః ॥ 10

ఉపద్రవార్థమై లేచిన భూతగణములను గౌరవముతో నివారించి సతీదేవి లోకమునకు దెలియునట్లుగ క్రోధముచే తొట్రుపడు వాక్కులతో శివద్వేషియు, కర్మమార్గమున పయనించుటచేత గర్వముచెందినవాడును నగు దక్షుని నిందింపసాగెను.

## శ్రీ దేవ్యువాచ

న యస్య లోకేఽస్త్యతి శాయన: ప్రియ -
స్తథాఽప్రియో దేహభృతాం ప్రియాత్మన: ।
తస్మిన్ సమస్తాత్మని ముక్తవైరకే
ఋతే భవన్తం కతమ: ప్రతీపయేత్ ॥ 11

సతీదేవి పలికెను :- తండ్రీ! ఇహలోకమున దేహధారులగు జీవులకు ప్రియమైన ఆత్మస్వరూపుడు, తనకు ప్రియమైనవాడుగాని అప్రియమైనవాడుగాని లేనివాడు, ఎవ్వరితోను విరోధము లేనివాడు, ఈజగత్తులో తనకంటె శ్రేష్ఠుడెవ్వడును లేనివాడు, సర్వజగత్తునకు గారణమైనవాడు నగు శివునిపై నీవుతప్ప మఱియెవరు విరోధము పూనుదురు?

దోషాన్ పరేషాం హి గుణేషు సాధవో
గృహ్ణన్తి కేచిన్న భవాదృశా ద్విజ ।
గుణాంశ్చ ఫల్గూన్ బహులీకరిష్ణవో
మహత్తమా స్తేష్వవిదద్భవానఘమ్ ॥ 12

ద్విజవరా! సత్పురుష లెవ్వరైనను ఇతరులదోషములను గూడ గుణములుగనే గ్రహింతురు. కాని నీవంటి అసూయాపరవశుడగు వ్యక్తి పరులగుణములలోగూడ దోషములనే దర్శించును. గుణదోషములను యథార్థముగ బరిశీలించువాడు మధ్యముడు, తుచ్ఛగుణములనుగూడ గొప్పగా ప్రశంసించువాడు శ్రేష్ఠుడు. నీవట్టి సర్వోత్తముడగు శివునిపై గూడ దోషముల నారోపించుచున్నావు.

నాశ్చర్యమేతద్యదసత్సు సర్వదా
మహద్వినిన్దా కుణపాత్మవాదిషు ।
సేర్ష్యం మహాపురుషపాదపాంసుభి -
ర్నిరస్తతేజస్సు తదేవశోభనమ్ ॥ 13

ఈజడదేహమునె ఆత్మ యనిభావించు అసత్పురుష లెల్లపుడు మహాత్ములను నిందించుచుందురు. ఇందులో నాశ్చర్య మేమియున్నది? మహాపురుషులు తమనిందనుగూడ సహింతురు. కాని వారి పాదరేణువులు సహింపజాలవు, అవి నిందించువారి తేజస్సును నాశనము చేయును. అందువలన అసత్పురుషులకు మహాత్ములతోడి ద్వేషమె శోభనీయమైనది. ఏలయన, వారిద్వారా వారికి దగిన ప్రతిఫలము లభించునుగదా!

యద్ద్వ్యక్షరం నామ గిరేరితం నృణాం
సకృత్ప్రసంగాదఘమాశు హన్తి తత్ ।
పవిత్రకీర్తిం తమలంఘ్యశాసనం
భవానహో ద్వేష్టి శివం శివేతరః ॥ 14

రెండక్షరములతో గూడిన "శివ" యను నామము నొక్కమారైనను ప్రసంగవశమున వాగింద్రియముద్వారా నుచ్చరించినచో మానవుల సర్వవిధములగు నశుభములు వెంటనే నాశమనమగును. అలంఘ్యమైన శాసనము గలవాడు, పవిత్రమైన యశస్సుగలవాడు నగుశివుని అమంగళస్వరూపుడవై నీవు ద్వేషించుచున్నావు.

యత్పాదపద్మం మహతాం మనోఽలిభి -
ర్నిషేవితం బ్రహ్మరసాసవార్థిభిః ।
లోకస్య యద్వర్షతి చాశిషోఽర్థిన -
స్తస్మై భవాన్ ద్రుహ్యతి విశ్వబంధవే ॥ 15

బ్రహ్మానందమకరందలోభు లగు మహాత్ముల మనోభృంగ మెవరి పాదపద్మమును నిరంతరము సేవించుచుండునో, ఎవరిపాదపద్మము కాముకులగు పురుషులకు మనోవాంఛిత వస్తువులను వర్షించునో అట్టి విశ్వబాంధవుడగు భవునకు నీవు ద్రోహముచేసితివి.

కిం శివాఖ్యమశివం న విదుస్త్వదన్యే
బ్రహ్మాదయ స్తమవకీర్య జటాః శ్మశానే ।
తన్మాల్య భస్మనృకపాల్యవసత్పిశాచై -
ర్యే మూర్ధభిర్దధతి తచ్చరణావసృష్టమ్ ॥ 16

శ్మశానభూమియందలి మానవకపాలమాలను, చితాభస్మమును, ఎముకలను ధరించువాడును, జడలను విరబోసికొని భూతపిశాచములతో గలసి శ్మశానమున నివసించువాడును నగు శివునిచరణములపై బడియున్న నిర్మాల్యమును బ్రహ్మాదిదేవతలు తమశిరముపై ధరించుచుందురు. అట్టి శివుడు పేరుకుమాత్రము శివుడనియు, ఆయన వేషము అమంగళమైన దనియు నీవుమాత్రమే భావించుచున్నావు. నీవుతప్ప యెవ్వరట్లు భావింతురు?

చ॥ *పరఁగఁ జితాస్థిభస్మసృకపాలజటాధరుఁడున్ బరేతభూ*
*చరుఁడు పిశాచయుక్తుఁడని శర్వు నమంగళుఁగాఁ దలంప రె*
*వ్వరు నొకఁ డీవు దక్క మఱి వాక్పతిముఖ్యులు న మ్మహాత్ము స*
*చ్చరణసరోజ రేణువులు సమ్మతిఁ దాల్తురు మస్తకంబులన్* (4-90)

కర్ణౌ పిధాయ నిరయాద్యదకల్ప ఈశే
ధర్మావితర్యసృణిభిర్నృభిరస్యమానే ।
ఛిన్ద్యాత్ప్రసహ్యారుషతీ మసతాం ప్రభుశ్చే -
జ్జిహ్వామసూనపి తతో విసృజేత్స ధర్మః ॥ 17

నిరంకుశులగు వ్యక్తులు ధర్మమర్యాదను రక్షించు తమప్రభువును నిందించుచున్నచో దాసుడు వారిని సంహరింపవలెను. లేదా తాను చావవలెను. అట్లు చేయ సామర్థ్యములేనిచో రెండుచెవులు మూసికొని యచటి నుండి వెడలిపోవలెను. సామర్థ్యమున్నచో అమంగళవాక్కులను బలుకు నాదుష్టులనాలుకలను ఛేదింపవలెను. అనంతరము తన ప్రాణములను సయితము పరిత్యజింపవలెను. ఇది యొక్కటియే ప్రభుభక్తుడు చేయవలసినపని.

చ॥ *నెలకొని ధర్మపాలన వినిర్మలు భర్గుఁ దిరస్కరించు న*
*క్కలుషుని జిహ్వఁ గోయఁ దగుఁగా కటు సేయగ నోపఁడేని దాఁ*
*బొలియుట యొప్పు రెంటికిఁ బ్రభుత్వము చాలమిఁ గర్ణ రంధ్రముల్*
*బలువుగ మూసికొంచుఁ జనఁ బాడి యటందురు ధర్మవర్తనుల్.* (4-91)

అతస్తవోత్పన్న మిదం కలేవరం
న ధారయిష్యే శితికంఠగర్హిణః ।
జగ్ధస్య మోహాద్ధి విశుద్ధిమన్ధసో
జుగుప్సిత స్యోద్ధరణం ప్రచక్షతే ॥ 18

అందువలన శివద్వేషి వగునీవలన సంభవించిన ఆ యీదేహమును నేనిక ధరింపను. అజ్ఞానమువలన నెవ్వడైన దూష్యమైన వస్తువును దినినచో దానిని వమనము జేసికొనుటద్వారా అతడు పరిశుద్ధుడగు నని పండితులు చెప్పుచున్నారు.

న వేదవాదాననువర్తతే మతిః
స్వ ఏవ లోకే రమతో మహామునేః ।
యథా గతిర్దేవమనుష్యయోః పృథక్
స్వ ఏవ ధర్మే న పరం క్షిపేత్ స్థితః ॥ 19

ఆత్మానందమునందె రమించువాడు, విరక్తుడు నగు పురుషునిబుద్ధి యెప్పుడును వేదోక్తములగు విధినిషేధముల ననుసరింపదు. దేవమానవుల గమనములో భేదమున్నట్లు ప్రవృత్తి నివృత్తిరూప ధర్మముల రెండింటిలోను తారతమ్యమున్నది. అందువలన ప్రవృత్తి లక్షణాత్మకధర్మమునందున్న వ్యక్తి అన్యపురుషుని లేదా అన్యధర్మమును నిందింపరాదు.

కర్మప్రవృత్తం చ నివృత్తమప్యృతం
వేదే వివిచ్యోభయలింగమాశ్రితమ్ ।
విరోధి తద్యోగపదైకకర్తరి
ద్వయం తథా బ్రహ్మణి కర్మ నర్ఛతి ॥ 20

ప్రవృత్తి (అగ్నిహోత్రాదులు), నివృత్తి (శమదమాదులు) కర్మలు రెండును సత్యములే. ఏలయన, విశేషముగ వివేచనము చేసినపిమ్మట వేదమున ఉభయవిధము లగుకర్మలకు వ్యవస్థ చేయబడినది. ఇంకను ఉభయవిధకర్మ లొకేమారు ఒకేకర్తయందు పరస్పరము విరుద్ధభావాపన్నములై యుండును. భోగవిరాగములు రెండును ప్రాకృతములు. అందువలన వైష్ణవశ్రేష్ఠుడగు శివుడు భగవత్సేవతప్ప ప్రాకృతకర్మలను వేనిని గూడ జేయడు.

మా వః పదవ్యః పితరస్మదాస్థితా
యా యజ్ఞశాలాసు న ధూమవర్త్మభిః ।
తదన్నతృప్తైరసుభృద్భిరీడితా
అవ్యక్తలింగా అవధూతసేవితాః ॥ 21

తండ్రీ! మమ్మాశ్రయించియున్న అణిమాద్యైశ్వర్యములు నీకడలేవు. నీ యైశ్వర్యములు యజ్ఞశాలకే పరిమితములు. అగ్నులే వాని ననుభవించును. యజ్ఞాన్నము దిని తృప్తిచెందువారు ఈయైశ్వర్యములను ప్రశంసింపలేరు. కాని యలక్ష్యప్రభావము గల నీయైశ్వర్యములు నారదాదిమహర్షులచే సేవితములగును.

నైతేన దేహేన హరే కృతాగసో
దేహోద్భవేనాలమలం కుజన్మనా ।
వ్రీడా మమాభూత్కుజనప్రసంగత -
స్తజ్జన్మధిగ్యో మహతా మవద్యకృత్ ॥ 22

నీవు శివద్వేషివి, అందువలన నీదేహమునుండి యుత్పన్న మైన నా యీకుత్సిత దేహమువలన నెట్టి ప్రయోజనములేదు. నీవు దుష్టుడవు, నీతోసంబంధ ముండుటవలన నేను మిగుల సిగ్గిల్లుచున్నాను. మహాత్ముల కపరాధములు చేయువానివలన గలుగు జన్మ హీనమైనది.

ఉ॥ *నీలగళాపరాధి యగు నీకుఁ దనూభవ నౌట చాలదా*
*చాలుఁ గుమర్త్య నీదు తనుజాత నన్ మది సిగ్గు పుట్టెడి*
*న్నేల ధరన్ మహాత్ములకు నెగ్గొనరించెడి వారి జన్మముల్*
*గాలుపనే తలంప జనకా కుటిలాత్మక యెన్ని చూడఁగన్* (4-95)

గోత్రత్వదీయం భగవాన్ వృషధ్వజో
దాక్షాయణీత్యాహ యదా సుదుర్మనాః ।
వ్యపేత నర్మస్మితమాశు తద్ధ్యహం
వ్యుత్స్రక్ష్య ఏతత్కుణపం త్వదంగజమ్ ॥ 23

ఐశ్వర్యశాలియు, వృషభధ్వజుడు నగుశివుడు పరిహాసనెపముతో నన్ను "దాక్షాయణి" యనిసంబోధించినపుడు పరిహాసమును విడచి నీతో నాకు గల సంబంధమును దలంచుకొని నేను మిగుల బాధపడుచుందును. పరిహాస సమయ మయినను నాకు నవ్వు కలుగుటలేదు, అందువలన నీదేహము నుండి పుట్టినశవతుల్య మగునా యీ దేహమును విడచిపెట్టెదను.

చ॥ *వరవృషకేతనుండు భగవంతుఁడు నైనహరుండు నన్ను నా*
*దరపరిహాసవాక్యముల దక్షతనూభవ యంచుఁ బిల్వ నేఁ*
*బురబురఁ బొక్కుచున్ ముదముఁ బొందక నర్మవచః స్మితంబులన్*
*దొఱగుదు నీతనూజ నను దుఃఖముకంటెను జచ్చు టొప్పగున్.* (4-96)

## శ్రీ మైత్రేయ ఉవాచ.

ఇత్యధ్వరే దక్షమనూద్య శత్రుహన్
క్షితావుదీచీం నిషసాద శాన్తవాక్ ।
స్పృష్ట్వా జలం పీతదుకూలసంవృతా
నిమీల్య దృగ్యోగపథం సమావిశత్ ॥ 24

మైత్రేయుడు పలికెను:- శత్రుఘాతకుడ వగు విదురా! సతీదేవి యజ్ఞమండపము నందు దక్షునితో నిట్లు పలికి మౌనము నవలంబించి ఉత్తరాభిముఖియై భూమిపై గూర్చుండెను. పిమ్మట ఆమె పీతాంబరము ద్వారా దేహమును గప్పుకొని జలమును స్పృశించి, ఆచమనముచేసి, రెండుకనులను మూసికొని యోగమార్గమున ప్రవేశించెను.

కృత్వా సమానావనిలౌ జితాసనా
సోదానముత్థాప్య చ నాభిచక్రతః ।
శనైర్హృది స్థాప్య ధియోరసి స్థితం
కంఠాద్భ్రువోర్మధ్యమనిన్దితానయత్ ॥ 25

విశుద్ధస్వభావ యగు సతీదేవి మొదట ఆసనమును జయించి ప్రాణాపానవాయువులను నిరోధించుటద్వారా నాభిచక్రమున నేకరూపముగ జేసెను. పిమ్మట ఉదానవాయువును మెల్లమెల్లగ లేవనెత్తి బుద్ధితోగూడ హృదయమున నిలిపెను. చివరకు కంఠమార్గముద్వారా ఆప్రాణాదివాయువులను భ్రూమధ్యమునకు దీసికొని వెడలెను.

ఏవం స్వదేహం మహతాం మహీయసా
ముహుః సమారోపితమంకమాదరాత్ ।
జిహాసతీ దక్షరుషా మనస్వినీ
దధార గాత్రేష్వనిలాగ్నిధారణామ్ ॥ 26

మహాపురుషులకుగూడ పూజ్యతము డగు రుద్రుడాదరముతో మాటిమాటికి నొడిలో గూర్చుండబెట్టుకొను తనదేహమును మనస్విని యగు రుద్రాణి దక్షునిపై గల రోషముచే పరవశయై పరిత్యజింపదలంచి, పైన జెప్పిన విధముగ తనయవయవము లన్నింటిలోను అగ్నిని, వాయువును నిలుపుకొనెను.

తతస్స్వభర్తుశ్చరణాంబుజాసవం
జగద్గురోశ్చిన్తయతీ న చాపరమ్ ।
దదర్శ దేహో హతకల్మషః సతీ
సద్యః ప్రజజ్వాల సమాధిజాగ్నినా ॥ 27

పిమ్మట సతీదేవి తనపతియు, జగద్గురువు నగు శంభుని పాదపద్మ మకరంద మాధుర్యము నాస్వాదించుచు మిగిలిన ధ్యానముల నన్నింటిని మఱచెను. ఆమె కాయనతప్ప మఱియేమియు నగుపడలేదు. దానివలన నామె దోషరహితయయ్యెను. వెంటనే ఆమె శరీరము సమాధివలన బుట్టిన అగ్నిచేఁ బ్రదీప్తమయ్యెను.

తత్పశ్యతాం ఖే భువి చాద్భుతం మహద్
హాహేతి వాదః సుమహానజాయత ।
హన్త ప్రియా దైవతమస్య దేవీ
జహావసూన్ కేన సతీ ప్రకోపితా ॥ 28

ఆకాశమునందును పృథివియందును నున్నవారు అత్యాశ్చర్యకరమగు సతీదేవి దేహత్యాగ సంఘటనను జూచి "అయ్యో, అయ్యో' అని పెద్దగ పలుకసాగిరి. అందఱును "అయ్యో! దక్షుని దుర్వ్యవహారముచే శివునిప్రియపత్ని యగు సతీదేవి తండ్రిపై గోపించినదియై ప్రాణములను విడచినది గదా" యని పలుకసాగిరి.

అహో అనాత్మ్యం మహదస్య పశ్యత
ప్రజాపతేర్యస్య చరాచరం ప్రజాః ।
జహావసూన్ యద్విమతాత్మజా సతీ
మనస్వినీ మానమభీక్ష్ణమర్హతి ॥ 29

ఆహా! ఈ చరాచర జగత్తు ఈ దక్షప్రజాపతి సంతానము. అయినను వీని దౌర్జన్యమును జూడుము. ఈయన పుత్రిక యగు సతీదేవి శుద్ధహృదయ, గౌరవించుటకు యోగ్యురాలైనది. కాని అతడు చేసిన అవమానమువలన ఆమె ప్రాణములను విడువవలసి వచ్చెను.

సో ఽ యం దుర్మర్షహృదయో బ్రహ్మధ్రుక్చ
లోకే చ కీర్తిమసతీమవాప్స్యతి ।
యదంగజాం స్వాం పురుషద్విడుద్యతాం
న ప్రత్యషేధన్మృత యేఽపరాధతః ॥ 30

కఠినహృదయుడు, బ్రహ్మద్రోహియు నగు నీదక్షుడు జనులలో అపకీర్తిని, పరలోకమున శిక్షను పొందగలడు. ఏలయన, (వైష్ణవద్వేషి యగు) దక్షుడు తాను చేసిన అవమానమువలన తనపుత్రిక యగు సతీదేవి దేహత్యాగము చేయుటకు సిద్ధమయ్యెను. ఇది చూచియు అతడామెను నివారించుటకు ప్రయత్నింపలేదు.

వదత్యేవం జనే సత్యా దృష్ట్వా సుత్యాగమద్భుతమ్ ।
దక్షం తత్పార్షదా హన్తుముదతిష్ఠన్నుదాయుధాః ॥ 31

ఇట్లు అద్భుతముగ సతీదేవి చేసిన ప్రాణత్యాగమును జూచి జనులందఱు వివిధరీతుల మాటలాడుకొనసాగిరి. ఇంతలో సతీదేవి అనుచరులు శస్త్రాస్త్రముల ధరించి దక్షుని జంప నుద్యుక్తులైరి.

తేషామాపతతాం వేగం నిశామ్య భగవాన్ భృగుః ।
యజ్ఞఘ్నఘ్నేన యజుషా దక్షిణాగ్నౌ జుహావ హ ॥ 32

రుద్రపార్షదుల వేగమును జూచి ఐశ్వర్యశాలి యగు భృగువు యజ్ఞమును పాడు చేయువారిని నాశనము చేయునట్టి యజుర్వేదోక్తమంత్రముల నుచ్ఛరించుచు దక్షిణాగ్నియం దాహుతుల నిచ్చెను.

అధ్వర్యుణా హూయమానే దేవా ఉత్పేతురోజసా ।
ఋభవో నామ తపసా సోమం ప్రాప్తాః సహస్రశః ॥ 33

అధ్వర్యుడగు భృగువు ఆహుతుల నిచ్చినపిమ్మట వేలకొలదిగ "ఋభువు"లను దేవతలు యజ్ఞకుండమునుండి వేగముగ బయల్వెడలిరి. ఈ దేవతలు తపః ప్రభావముచే సోమత్వమును బొందిరి.

తైరలాతాయుధైః సర్వే ప్రమథాః సహగుహ్యకాః ।
హన్యమానా దిశో భేజురుశద్భిర్బ్రహ్మ తేజసా ॥ 34

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్ర భాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే సతీదేహోత్సర్గో నామ
చతుర్థోఽధ్యాయః ॥

బ్రహ్మతేజస్సంపన్ను లగు నాదేవతలు మండుచున్న కట్టెలను ఆయుధములుగా జేసికొని ప్రమథగణములపైన, గుహ్యకులపైన దాడిచేసిరి. దానివలన వారందఱు నలువైపుల పారిపోయిరి.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి నాలుగవ
స్కంధములోని నాలుగవ యధ్యాయము
సమాప్తము.



# ఐదవ అధ్యాయము

## వీరభద్రుడు దక్షయజ్ఞమును విధ్వంసముచేసి

## దక్షుని వధించుట

కథాసారము :- ఈ యధ్యాయమున సతీదేవి దేహత్యాగ వృత్తాంతమును విని కోపోద్రిక్తుడగు ధూర్జటి జడను పెఱకుట, దానినుండి వీరభద్రుడు జన్మించుట, వానిద్వారా దక్షుడు వధింపబడుట యనువిషయములు వర్ణితములైనవి.

నారదునివలన సతీదేవి దేహత్యాగవార్తను, దక్షయజ్ఞమునుండి బయల్వెడలిని ఋభుగణములచే రుద్రానుచరులు దెబ్బలు దిని పారిపోయిరనువార్తను విని ధూర్జటి క్రుద్ధుడై శిరస్సునుండి యొక జడను పెఱికి నేలపై గొట్టెను. దానివలన రుద్రాంశముతో వీరభద్రుడు జన్మించెను. ఈ వీరభద్రుడు రుద్రానుచరులతో గూడి దక్షుని యజ్ఞమండపమునకు బరుగిడి ఆయజ్ఞమునుధ్వంసము చేయసాగెను. రుద్రానుచరులలో మణిమంతుడు భృగువును, వీరభద్రుడు దక్షుని, చండీశుడు సూర్యుని, నందీశ్వరుడు భగదేవతను బంధించిరి. వీరభద్రుడు బహువిధము లగునస్త్రముల ప్రయోగించియు దక్షుని శిరస్సును ఛేదింపలేకపోయెను. చివరకు గొంతు నులిమి పశుమారణ యంత్రముతో పశువునువలె దక్షుని సంహరించెను. దక్షయజ్ఞమును నాశనము చేసి వీరభద్రుడు కైలాసము వెడలెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

భవో భవాన్యా నిధనం ప్రజాపతే -
రసత్కృతాయా అవగమ్య నారదాత్।
స్వపార్షదసైన్యం చ తదధ్వరర్భుభి -
ర్విద్రావితం క్రోధమపారమాదధే ॥ 1

మైత్రేయుడు పలికెను :- విదురా ! భవాని దక్షప్రజాపతిచే అవమానింపబడినదై యచటనే ప్రాణత్యాగము చేసినదనియు, ఋభువు లను దేవతలు తనపార్షదులను యజ్ఞభూమినుండి పారద్రోలినా రనియు నారద మహర్షివలన విని రుద్రు డధికక్రోధ యుక్తుడయ్యెను.

క్రుద్ధః సుదష్టోష్ఠపుటః స ధూర్జటి -
ర్జటాం తడిద్వహ్నిసటోగ్రరోచిషమ్ ।
ఉత్కృత్యరుద్రః సహసోత్థితో హసన్
గంభీరనాదో విససర్జ తాం భువి ॥ 2

మహాదేవుడు దారుణ మగుకోపముతో దనపెదవిని గొరకసాగెను. క్రుద్ధు డగునాధూర్జటి మెరుపువలెను, అగ్నిశిఖవలెను ప్రదీప్తమగుచున్న ఒకజడను మస్తకమునుండి యూడబెరికి లేచి అట్టహాసముచేయుచు దానిని నేలపైగొట్టెను.

*శా॥ ఆద్యుం డుగ్రుఁడు నీలకంఠుఁ డిభదైత్యారాతి దష్టోష్ఠుఁ డై*
*మాద్యద్భూరిమృగేంద్రఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్*
*విద్యుద్వహ్నిశిఖాసముచ్చయరుచిన్ వెల్గొందు చంచజ్జటన్*
*సద్యఃక్రోధముతో డఁ బుచ్చి వయిచెన్ క్ష్మాచక్రమధ్యంబునన్* (4-106)

తతో౽తికాయస్తనువా స్పృశన్ దివం
సహస్రబాహుర్ఘనరుక్ త్రిసూర్యదృక్ ।
కరాలదంష్ట్రో జ్వలదగ్ని మూర్ధజం
కపాలమాలీ వివిధోద్యతాయుధః ॥ 3

వెంటనే యాజడనుండి పెద్దశరీరముగలవాడు, కపాలమాలను ధరించినవాడు నగువీరభద్రు డుద్భవించి శిరముతో ఆకాశమును స్పృశించెను. ఆయనమూడునేత్రములు ముగ్గురుసూర్యులవలె, కేశకలాపము అగ్నివలె ప్రజ్వలించు చుండెను. ఆయన తనసహస్రబాహువులతో అనేకవిధములగు అస్త్రశస్త్రములను ధరించియుండెను.

*సీ॥ అభ్రంలిహాదభ్రవిభ్రమాభ్రమభ్రమ కృన్నీలదీర్ఘ శరీర మమరఁ*
*బ్రజ్వలజ్జ్వలనదీ ప్త జ్వాలికాజాల జాజ్జ్వల్యమాన కేశములు మెఱయఁ*
*జండదిగ్వేదండశుండాభదోర్దండ సాహస్రధృత హేతిసంఘ మొప్ప*
*వీక్షణత్రయలోకవీక్షణద్యుతిలోక వీక్షణతతిదుర్నిరీక్ష మగుచుఁ*

*తే॥ గ్రకచకఠినకరాళదంష్ట్రలు వెలుంగ*
*ఘనకలాపాస్థివనమాలికలును దనర*
*నఖిలలోకభయంకరుఁ డగుచు వీర*
*భద్రుఁ డుదయించె నాఁటి రుద్రుఁ డగుచు.* (4-108)

తం కిం కరోమీతి గృణన్తమాహ
బద్ధాంజలిం భగవాన్ భూతనాథః ।
దక్షం సయజ్ఞం జహి మద్భటానాం
త్వమగ్రణీ రుద్రభటాంశకో మే ॥ 4

వీరభద్రుడు దోసిలొగ్గి "ప్రభూ! నేనేమిచేయవలయునో ఆజ్ఞయీయుము" డనియడిగెను. ఐశ్వర్యశాలియు, భూతపతియు నగు రుద్రుడు వీరభద్రుని యీవాక్కులను విని ఆయనను సంబోధించుచు నిట్లు పలికెను. భయంకరుడా! యుద్ధకుశలుడా! నీవు నా భటులకు నాయకుడవై దక్షుని వాని యజ్ఞముతోగూడ ధ్వంసము చేయుము, నీవు నాయంశమున జన్మించితివి.

ఆజ్ఞప్త ఏవం కుపితేన మన్యునా
స దేవదేవం పరిచక్రమే విభుమ్ ।
మేనే తదాత్మానమసంగరంహసా
మహీయసాం తాత సహః సహిష్ణుమ్ ॥ 5

వత్సా! విదురుడా! వీరభద్రుడు కుపితుడగు రుద్రుని యీయాజ్ఞను పొంది ఆయనకు ప్రదక్షిణ మాచరించెను. అప్పుడాయనకు అప్రతి హతమగు వేగము ప్రాదుర్భవించెను. దానివలన నతనికి తాను మహాబలిష్ఠుల బలమునుగూడ సహించు శక్తిగలవాడనను భావము గలిగెను.

అన్వీయమానః స తు రుద్రపార్షదై -
ర్భృశం నదద్భిర్వ్యనదత్సుభైరవమ్ ।
ఉద్యమ్యశూలంజగదన్తకాన్తకం
సంప్రాద్రవద్ఘోషణ భూషణాంఘ్రిః ॥ 6

అనంతరము వీరభద్రుడు భీషణముగ ధ్వనిచేయు రుద్రభటులతో గలసి భయంకరముగ గర్జించుచు జగత్తును సంహరించు మృత్యువును గూడ సంహరించు త్రిశూలమును ధరించి దక్షయజ్ఞమువైపు వేగముగ పరుగిడెను. అపుడు వీరభద్రుని చరణములయందున్న నూపురములు మున్నగు అలంకారములు ధ్వనింపసాగెను.

చ॥ *అనఘుడు రుద్రుఁ జేరి ముదమారఁ బ్రదక్షిణ మాచరించి వీ*
*డ్కొని యనివార్యవేగమునఁ గుంభిని గ్రక్కదలన్ ఝుళంఝుళ*
*ధ్వని మణినూపురంబులు పదంబుల మ్రోయఁగ భీషణప్రభల్*
*దనరఁ గృతాంతకాంతక శితస్ఫుటశూలముఁబూని* చెచ్చెరన్. (4-112)

అథర్త్విజో యజమానః సదస్యాః
కకుభ్యుదీచ్యాం ప్రసమీక్ష్య రేణుమ్ ।
తమః కిమేతత్కుత ఏతద్రజోఽభూ -
దితిద్విజా ద్విజపత్న్యశ్చ దధ్యుః ॥ 7

పిమ్మట యజ్ఞప్రవర్తకులు, యజ్ఞదీక్షితుడగు దక్షుడు, సదస్యులు, ద్విజులు, ద్విజపత్నులు ఉత్తరదిక్కున లేచిన ధూళిరాశిని జూచి "ఏమి యిట్లు హఠాత్తుగ నంధకారము వ్యాపించినది? ఎచటినుండి యీధూళి యిట్లు లేచినది" యని భావించుకొనసాగిరి.

వాతా న వాన్తి న హి సన్తి దస్యవః
ప్రాచీనబర్హిర్జీవతి హోగ్రదణ్డః ।
గావో న కాల్యన్త ఇదం కుతో రజో
లోకోఽధునా కిం ప్రలయాయ కల్పతే ॥ 8

వాయువు ప్రచండవేగముతో వీచుటలేదు. కఠినముగ దండించు ప్రాచీనబర్హి యనురాజుగూడ నింకను జీవించియే యున్నాడు. కనుకనే దొంగలమాట ఎక్కడ వినవచ్చుటలేదు. ఇంకను గోవులు వచ్చుసమయము కాలేదు. ఐనచో నీ ధూళి యెచటనుండి బయల్వెడలినది? లోకమున కిప్పుడే ప్రళయకాలము రాలేదుగదా!

ప్రసూతిమిశ్రాః స్త్రియ ఉద్విగ్నచిత్తా
ఊచుర్విపాకో వృజినస్యైవ తస్య
యత్పశ్యతీనాం దుహితౄణాం ప్రజేశః
సుతాం సతీమవదధ్యావనాగామ్ ॥ 9

ప్రసూతి మున్నగు దక్షపత్ను లుద్విగ్నచిత్తులై యిట్లు పలుకసాగిరి - దక్షప్రజాపతి తన యితర పుత్రికలయెదుట నిరపరాధ యగు సతీదేవిని అవమానించినాడు, ఆతని యీపాప ఫలమే యిది యని తోచుచున్నది.

యస్త్వన్తకాలే వ్యుప్తజటాకలాపః
స్వశూలసూచ్యర్పితదిగ్గజేన్ద్రః ।
వితత్య నృత్యత్యుదితాస్త్రదోర్ధ్వజా-
నుచ్చాట్టహాసస్తనయిత్నుర్భిన్నదిక్ ॥ 10

రుద్రుడు ప్రళయకాలమున జటాజూటమును విరబోసికొని, తన త్రిశూలాగ్ర భాగముతో దిగ్గజేంద్రములను బొడచుచు, మేఘగర్జనమువలె భయంకర మగు నట్టహాసముతో దిఙ్మండలమును జీల్చుచునుండెను. వివిధములగు నాయుధములతో గూడియున్న భుజములను ధ్వజములవలె వ్యాపింపజేసి ఆనందముతో నృత్యము చేయసాగెను.

అమర్షయిత్వా తమసహ్య తేజసం
మన్యుప్లుతం దుర్నిరీక్ష్యం భ్రుకుట్యా ।
కరాలదంష్ట్రాభిరుదస్తభాగణం
స్యాత్స్వస్తి కిం కోపయతో విధాతుః ॥ 11

సహింపరాని తేజస్సు గలవాడు, క్రోధముచే వ్యాప్తమైనవాడు, కనుబొమలముడిచే మిగుల భయము గొల్పువాడు, భయంకరము లగు గోరలచే తారాగణముల నస్తవ్యస్తము చేయువాడు నగు శివునకు గోపమును గలిగించి స్వయముగా బ్రహ్మయైనను సుఖముగ నుండగలడా!

బహ్వేవముద్విగ్నదృశోచ్యమానే
జనేన దక్షస్య ముహుర్మహాత్మనః ।
ఉత్పేతురుత్పాతతమాః సహస్రశో
భయావహా దివి భూమౌచ పర్యక్ ॥ 12

యజ్ఞసభలో నున్న జనులందఱు ఉద్విగ్న మగుదృష్టితో మాటిమాటికి నిట్లు నానావిధములుగ జెప్పికొనసాగిరి. అపుడు భూమ్యాకాశముల యంతట ఉత్పాతములు బయలుదేరెను. దానివలన నతిధీరుడగు దక్షునకు గూడ భయము కలిగెను.

తావత్సరుద్రానుచరైర్మహామఖో
నానాయుధై ర్వామనకైరుదాయుధైః ।
పింగైః పిశంగైర్మకరోదరాననైః
పర్యాద్రవద్భిర్విదురాన్వరుధ్యత ॥ 13

విదురా! శీఘ్రముగనే రుద్రుని అనుచరులు నానావిధములగు నస్త్రశస్త్రములు ధరించి ప్రబలవేగముతో నా యజ్ఞభూమికడకు వచ్చి దానిని చుట్టుముట్టిరి. వారిలో కొందఱు పొట్టివారు, కొందఱు కపిలవర్ణులు, కొందఱు పచ్చనిరంగు గలవారు, కొందఱు మొసలివంటి పొట్టగలవారు, కొందఱు మొసలివంటి ముఖము గలవారు.

కేచిద్బభంజుః ప్రాగ్వంశం పత్నీశాలాం తథాపరే ।
సద ఆగ్నీధ్రశాలాంచ తద్విహారం మహానసమ్ ॥ 14

ఈ రుద్రభటులలో గొందఱు యజ్ఞశాలకు తూర్పుపడమరలలో నున్న స్తంభములపైన అడ్డముగా వేయబడిన కఱ్ఱలను విరుగగొట్టిరి, కొందఱు పత్నీశాలను, గొందఱు యజ్ఞశాలకు ఎదుటనున్న సభామండపమును, దానికెదురుగ ఘృతము నుంచు స్థానమును బగులగొట్టిరి. కొందఱు దాని కుత్తరముగ నున్న ఆగ్నీధ్రశాలను, కొందఱు యజమాన గృహమును, కొందఱు పాకశాలను పడగొట్టిరి.

రురుజుర్యజ్ఞపాత్రాణి తథైకేఽగ్నీ ననాశయన్ ।
కుండేష్వమూత్రయన్ కేచిద్బిభిదుర్వేది మేఖలాః ॥ 15

కొందఱు యజ్ఞపాత్రలను పగులగొట్టిరి. కొందఱు యజ్ఞకుండములలో మూత్రమును విడచిరి. కొందఱు యజ్ఞవేదికకు గట్టిన సూత్రములను ద్రెంపివేసిరి.

అబాధన్త మునీనన్యే ఏకే పత్నీరతర్జయన్ ।
అపరే జగృహుర్దేవాన్ ప్రత్యాసన్నాన్ పలాయితాన్ ॥ 16

కొందఱు తిట్లతో మునులను బాధించిరి. కొందఱు మునిపత్నులను భయపెట్టిరి. మఱికొందఱు తమకు దగ్గరగా పరుగెత్తు దేవతాదులను పట్టుకొనిరి.

భృగుం బబన్ధ మణిమాన్ వీరభద్రః ప్రజాపతిమ్ ।
చణ్డేశః పూషణం దేవం భగం నన్దీశ్వరోఽగ్రహీత్ ॥ 17

మణిమంతుడను రుద్రభటుడు భృగువును, వీరభద్రుడు దక్షుని, చండేశుడు సూర్యదేవుని, నందీశ్వరుడు భగదేవతను బంధించిరి.

సర్వే ఏవర్త్విజో దృష్ట్వా సదస్యాః సదివౌకసః ।
తైరర్ద్యమానాః సుభృశం గ్రావభిర్నైకధాఽద్రవన్ ॥ 18

ఋత్విక్కులు, దేవతలతోగూడ సదస్యులు రుద్రభటుల యీ యాగడముల జూచి నలువైపుల బరుగిడసాగిరి. రుద్రానుచరులు వారిని రాళ్ళతో గొట్టసాగిరి, దానివలన వారు దెబ్బలకు గురియైరి.

జుహ్వతః స్రువహస్తస్య శ్మశ్రూణి భగవాన్ భవః ।
భృగోర్లులుంచే సదసి యోఽహసత్ శ్మశ్రు దర్శయన్ ॥ 19

భృగువు హోమపాత్రను (స్రువమును) బట్టుకొని అగ్నియం దాహుతుల నిచ్చుచుండెను. అట్టి సమయమున ఐశ్వర్యశాలి యగు వీరభద్రుడు వాని మీసములను బెరికివేసెను. ఏలయన, ఈ భృగువు సభాస్థలమున మహాదేవునకు మీసముల జూపి ఆయనను పరిహసించెను.

భగస్య నేత్రే భగవాన్ పాతితస్య రుషా భువి ।
ఉజ్జహార సదఃస్థోఽక్ష్ణా యః శపన్తమసూసుచత్ ॥ 20

దక్షుడు సభామధ్యమున శివనిందను జేసినపుడు, భగదేవత కనుసన్నచే దక్షుని యుత్సాహపఱచెను. అందువలన వీరభద్రుడు కోపముతో వానిని భూమిపై బడవేసి వాని రెండుకన్నులను పీకి వేసెను.

పూష్ణో హ్యపాతయద్దన్తాన్ కలింగస్య యథా బలః ।
శప్యమానే గరిమణి యోఽహసద్దర్శయన్దతః ॥ 21

బలదేవుడు కళింగరాజగుదంత వక్త్రుని దంతములను లాగివేసి నట్లు వీరభద్రుడు గూడ పూషాదేవతయొక్క దంతముల నూడబెరికెను. దక్షుడు పరమగురు వగు రుద్రుని నిందించునపు డీ పూషాదేవుడు దంతముల జూపి నవ్వెను.

ఆక్రమ్యోరసి దక్షస్య శితధారేణ హేతినా ।
ఛిన్దన్నపి తదుద్ధర్తుం నాశక్నోత్ త్ర్యంబకస్తదా ॥ 22

పిమ్మట రుద్రాంశుడగు వీరభద్రుడు దక్షుని వక్షస్థలముపై కెక్కి పదునైన ఖడ్గముతో వానితలను నఱుకుటకు ప్రవృత్తుడయ్యెను. కాని దక్షుని శరీరమునుండి వానిశిరస్సు విడివడకపోయెను.

శస్త్రైరస్త్రాన్వితై రేవమనిర్భిన్నత్వచం హరః ।
విస్మయం పరమాపన్నో దధ్యౌ పశుపతిశ్చిరమ్ ॥ 23

నానావిధములగు నస్త్రశస్త్రములతో గొట్టినను దక్షునిచర్మము గూడ బగిలిపోలేదు. అపుడు వీరభద్రుడు మిగుల విస్మితుడై చాలకాల మాలోచించెను.

దృష్ట్వా సంజ్ఞపనం యోగం పశూనాం స పతిర్మఖే ।
యజమానపశోః కస్య కాయాత్ తేనాఽహరచ్ఛిరః ॥ 24

పిమ్మట పశుపతి యగు నా వీరభద్రుడు యజ్ఞస్థలమున కంఠము నుత్తరించుట యను పశుమారణోపాయమును జూచి దానిద్వారా పశుతుల్యుడు యజమానుడు నగు దక్షప్రజాపతి శరీరమునుండి మస్తకమును విచ్ఛిన్నము చేసెను.

**సాధువాదస్తదా తేషాం కర్మ తత్తస్య పశ్యతామ్ ।**
**భూతప్రేతపిశాచానామన్యేషాం తద్విపర్యయః ॥** 25

వీరభద్రుడు చేసిన యీపనిని జూచి భూతప్రేతములు, పిశాచములు మేలు, మేలనికోలాహలము చేయసాగినవి. కాని దక్షుని అనుయాయులగు ద్విజులముఖములనుండి హాహాకారములు బయల్వెడలెను.

**జుహావైతచ్ఛిరస్తస్మిన్ దక్షిణాగ్నావమర్షితః ।**
**తద్దేవయజనం దగ్ధ్వా ప్రాతిష్ఠద్గుహ్యకాలయమ్ ॥** 26

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్ర భాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థ స్కంధే సతీదేవోత్సర్గో నామ
పంచమోఽధ్యాయః ॥

అనంతరము క్రోధప్రదీప్తుడగు వీరభద్రుడు దక్షునిశిరమును దక్షిణాగ్నియం దాహుతిగ నిచ్చెను. పిమ్మట దక్షుని యజ్ఞగృహమును దగ్ధము చేసి కైలాసమునకు వెడలెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి నాలుగవ
స్కంధములోని యైదవ అధ్యాయము
సమాప్తము.





# ఆఱవ అధ్యాయము

## బ్రహ్మాదిదేవతలు కైలాసమునకు వెడలి మహాదేవుని శాంతింపజేయుట

కథాసారము :- ఈ యధ్యాయమున బ్రహ్మ దేవతలతో గూడ కైలాసమునకు వెడలి దక్షుని, ఆయనయనుయాయుల హితార్థమై శంభుని కోపమును శాంతింప జేయుట యనువిషయము వర్ణితమైనది.

దేవతల ప్రార్థన ననుసరించి బ్రహ్మ వారితోగూడ మహాసౌందర్యముతో నొప్పుచున్న కైలాసపర్వతమునకు వెడలి తరుమూలమున నాసీనుడై యున్నవాడు, భగవదారా ధనరతుడు నగు శంభుని జూచెను. బ్రహ్మాదిదేవత లాయనకు యథోచితములగు అభివాదనాదులను జేయగా శివుడు గూడ బ్రహ్మకు ప్రతి నమస్కారము జేసెను. బ్రహ్మ వైష్ణవశ్రేష్ఠుడగు మహాదేవుని యిట్టిదీనావస్థను, ఆయన యపారమహిమను దర్శించెను. పిమ్మట బ్రహ్మ స్తుతిద్వారా శివుని సంతుష్టిపఱచి వైష్ణవాపరాధియగు దక్షుని యపరాధములను క్షమింపమనియు, వాని యసంపూర్ణ యజ్ఞమును పునరుద్ధరింప వలసినదనియు ప్రార్థించెను. శివానుచరుల ద్వారా యజ్ఞస్థలమున హీనాంగులై తాము చేసిన దుష్కృత్యమునకు ఫలము ననుభవించువారి హితార్థమై వారిపై దయచూపవలసిన దనియు, యజ్ఞభాగమును స్వీకరించి యాయజ్ఞమును పూర్తి చేయింపవలసిన దనియు రుద్రుని ప్రార్థించెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

అథ దేవగణాస్సర్వే రుద్రానీకైః పరాజితాః ।
శూలపట్టిసనిస్త్రింశగదా పరిఘముద్గరైః ॥ 1

సంఛిన్నభిన్న సర్వాంగాః సర్త్విక్సభ్యా భయాకులాః ।
స్వయంభువే నమస్కృత్య కార్‌త్స్న్యేనైతన్న్యవేదయన్ ॥ 2

మైత్రేయుడు పలికెను :- విదురా! పిమ్మట రుద్రుని సైన్యము దేవతలను పరాభూతము చేసి, శూలము, పట్టిసము, ఖడ్గము, గద, పరిఘ, ముద్గరము మున్నగు నాయుధములచే వారినిగొట్టిరి. భయవిహ్వాలులై వారు ఋత్విక్కులను, సభ్యులను వెంటనిడుకొని బ్రహ్మకడకు వెడలి, ఆయనకు నమస్కరించి దక్షయజ్ఞ వృత్తాంతము నంతటిని సవిస్తరముగ జెప్పిరి.

**ఉపలభ్య పురైవైతద్భగ వానబ్జసంభవః ।**
**నారాయణశ్చ విశ్వాత్మా న కస్యాధ్వరమీయతుః ॥ 3**

ఐశ్వర్యశాలి యగు బ్రహ్మ, విశ్వాత్ముడగు శ్రీమన్నారాయణుడు ముందుగనే యీ వృత్తాంతము నంతటిని దెలిసికొన గలిగియుండిరి. కనుకనే వారు దక్షప్రజాపతి యజ్ఞమునకు వెడలలేదు.

**తదాకర్ణ్య విభుః ప్రాహ తేజీయసి కృతాగసి ।**
**క్షేమాయ తత్ర సా భూయాన్న ప్రాయేణ బుభూషతామ్ ॥ 4**

దేవతలు నివేదించిన వృత్తాంతమును విని బ్రహ్మ యిట్లు పలికెను :- "దేవతలారా! పరమతేజస్వి యగుపురుషున కెవరైన అపరాధము చేసి బ్రతుకదలచినచో వారి కది క్షేమమును గలుగజేయునది కాదు.

*కం॥ ఘనతేజోనిధి పురుషుం*
*దనయుంబుఁ గృతాపరాధుఁ డయినను దా మ*
*ల్లన ప్రతీకారముఁ గావిం*
*చిన జనులకు లోకమందు సేమము గలదే.* (4-128)

**అథాపి యూయం కృతకిల్బిషా భవం**
**యే బర్హిషో భాగభాజం పరాదుః ।**
**ప్రసాదయధ్వం పరిశుద్ధ చేతసా**
**క్షిప్రప్రసాదం ప్రగృహీతాంఘ్రిపద్మమ్ ॥ 5**

మీరు యజ్ఞాంశభాగి యగు మహాదేవునకు మహాపరాధము చేసితిరి. మీ రాయనను దూరముగ పరిత్యజించితిరి. అందువలన ఇపుడు విశుద్ధాంతః కరణముతో పరమశివుని పాదపద్మములను బట్టుకొని ఆయనను ప్రసన్నునిగ జేయుటకు ప్రయత్నింపుడు.

**ఆశాసానా జీవితమధ్వరస్య**
**లోకస్సపాలః కుపితే న యస్మిన్ ।**
**తమాశు దేవం ప్రియయా విహీనం**
**క్షమాపయధ్వం హృది విద్ధం దురుక్తైః ॥ 6**

ఆయన కోపించినచో లోకపాలురతో గూడ సర్వలోకములను నాశనము చేయగలడు. దుర్వాక్యముల ద్వారా ఆయన హృదయము మిగుల బాధ చెందినది. తన ప్రియురాలి

యొక్క వియోగముచే ఆయన మిగుల కోపముతో నున్నాడు. అందువలన మీ రాయనకడకు వెడలి మీరు చేసిన యపరాధములకు క్షమాపణ వేడుకొని యజ్ఞమును పునరుద్ధరింప వలసినదగా ప్రార్థింపుడు.

నాహం న యజ్ఞో న చ యూయమన్యే
యే దేహభాజో మునయశ్చ తత్త్వమ్ ।
విదుః ప్రమాణం బలవీర్యయోర్వా
యస్యాత్మతన్త్రస్య క ఉపాయం విధిత్సేత్ ॥ 7

నేను, ఇంద్రుడు, మీరు, మునులు, ఇంకను నితరులగు జీవులు దేవదేవుడగు ఆ మహాదేవుని యథార్థ స్వరూపమును, బలవీర్యముల ప్రమాణమును దెలిసికొనజాలము. నేనా స్వతంత్ర పురుషుని ప్రసన్నార్థమై యే యుపాయమును విధింప (ఆలోచింప) గలను? (ఆయనను క్షమాపణము వేడుకొనుటతప్ప మఱియే యుపాయము లేదు)

స ఇత్థమాదిశ్య సురానజస్తైః
సమన్వితః పితృభిః సప్రజేశైః ।
యయౌ స్వధిష్ణ్యాన్నిలయం పురద్విషః
కైలాసమద్రిప్రవరం ప్రియం ప్రభోః ॥ 8

కమలయోని యగు బ్రహ్మ దేవతలనిట్లా దేశించి ప్రజాపతులతోను, దేవతలతోను గలసి తనలోకమునుండి త్రిపురారి యగు శివునకు ప్రియతమ నిలయమగు గిరిరాజమునకు వెడలెను.

జన్మౌషధితపోమన్త్ర యోగసిద్ధైర్నరేతరైః ।
జుష్టం కిన్నరగన్ధర్వైరప్సరోభిర్వృతం సదా ॥ 9

ఆ కైలాసము జన్మము, ఓషధులు, తపస్సు, మంత్రము, యోగము మున్నగు నుపాయములచే సిద్ధిని బొందిన సిద్ధులచేత దేవతలచేత నిత్యము సేవింపబడుచున్నది. కిన్నరులు, గంధర్వులు అప్సరసలు మున్నగువారిచే నెల్లప్పుడు పరివృతమై యున్నది.

ఉ॥ *భాసురలీలఁ గాంచిరి సుపర్వులు భక్తజనైక మానసో*
*ల్లాసముఁ గిన్నరీజనవిలాసము నిత్యవిభూతిమంగళా*
*వాసము సిద్ధగుహ్యకనివాసము రాజతభూవికాసి కై*
*లాసముఁ గాంతినిర్జితకులక్షితిభృత్యమహద్వి లాసమున్.* ( 4-133)

**నానామణిమయైః శృంగైర్నానాధాతు విచిత్రితైః ।**
**నానాద్రుమలతాగుల్మై ర్నానామృగగణావృతైః ॥ 10**

ఈ పర్వతశృంగములు విచిత్రములగు మణులచే మండితములై యున్నవి. విచిత్రములగు గైరికాదిధాతువులచే రంజితములై యున్నవి. విచిత్రములగు చిత్రములతో చిత్రితములై యున్నవి. వివిధములగు ద్రుమములతోను, లతలతోను, పొదలతోను నాచ్ఛాదితములై, బహువిధములగు పశువులతో పరివృతములై యున్నవి.

**నానామలప్రస్రవణై ర్నానాకన్దరసానుభిః ।**
**రమణం విహరన్తీనాం రమణైః సిద్ధయోషితామ్ ॥ 11**

ఇచట నిర్మలజల పూరితములగు నెన్నియో సెలయేళ్ళు ప్రవహించు చున్నవి. అసంఖ్యములగు గుహలు, చరియలు గలిగియుండుట వలన ఈ పర్వతము తమ ప్రియులతో విహరించుటకు వచ్చు సిద్ధపత్నుల కనురాగమును పెంచుచున్నది.

**మయూరకేకాభిరుతం మదాన్ధాలివిమూర్ఛితమ్ ।**
**ప్లావితై రక్తకంఠానాం కూజితైశ్చ పతత్త్రిణామ్ ॥ 12**

నెమళ్ళకూతలచేత, కోకిలల కుహూకుహూ ధ్వనులచేత, ఇతరములగు పక్షుల కలకలారవముల చేత, మదించిన తుమ్మెదల ఝంకారముల చేత అచటి ఆకాశమండలము ప్రతిధ్వనించుచుండెను.

**ఆహ్వయన్తమివోద్ధ స్తైర్ద్విజాన్ కామదుఘైర్ద్రుమైః ।**
**వ్రజన్తమివ మాతంగైర్గృణన్తమివ నిర్ఝరైః ॥ 13**

అచటి కల్పవృక్షముల పెద్దపెద్ద కొమ్మలు వాయువుచే గదల్పబడినవై పక్షులను పిలచుచున్నట్లుండెను. ఏనుగులు సంచరించుచుండుట వలన ఆ కైలాసపర్వతము స్వయముగ నడచుచున్నట్లును, సెలయేళ్ళ కలకల ధ్వనిచే సంభాషించు చున్నట్లుగను తోచుచుండెను.

**మన్దారైః పారిజాతైశ్చ సరలైశ్చోపశోభితమ్ ।**
**తమాలైః సాలతాలైశ్చ కోవిదారాసనార్జునైః ॥ 14**

**చూతైః కదంబనీపైశ్చ నాగపున్నాగ చంపకైః ।**
**పాటలాశోకవకులైః కున్దైః కురవకైరపి ॥ 15**

స్వర్ణార్ణశతపత్రైశ్చ వీరరేణుక జాతిభిః ।
కుబ్జకైర్మల్లికాభిశ్చ మాధవీభిశ్చ మండితమ్ ॥ 16

పనసోదుంబరాశ్వత్థ ప్లక్షన్యగ్రోధహింగుభిః ।
భూర్జైరోషధిభిః పూగై రాజపూగైశ్చ జంబుభిః ॥ 17

ఖర్జూరామ్రాతకామ్రాద్యైః పియాలమధుకేంగుదైః ।
ద్రుమజాతిభిరన్యైశ్చ రాజితం వేణుకీచకైః ॥ 18

కుముదోత్పలకహ్లారశతపత్ర సమృద్ధిభిః ।
నలినీషు కలం కూజత్ఖగబృందోపశోభితమ్ ॥ 19

మృగైః శాఖామృగైః క్రోడైర్మృగేన్ద్రైరృక్షశల్లకైః ।
గవయైః శరభైర్వ్యాఘ్రైరురుభిర్మ హిషాదిభిః ॥ 20

కర్ణాన్త్రైక పదాశ్వాసైర్నిర్జుష్టం వృకనాభిభిః ।
కదలీషండ సంరుద్ధ నలినీపులినశ్రియమ్ ॥ 21

పర్యస్తంనన్దయా సత్యాః స్నానపుణ్యతరోదయా ।
విలోక్య భూతేశగిరిం విబుధా విస్మయం యయుః ॥ 22

కైలాసపర్వతము మందారములు, పారిజాతములు, సరళములు, తమాలములు, మద్దె, తాడి, రక్తకాంచనము, వేగిస, అర్జునములు (ఏఱుమద్దె), మామిడి, కడిమి, నీపము, నాగము, పున్నాగము, చంపకము, పాటలము, అశోకము, వకుళము (పొగడ), మొల్ల, ఎఱ్ఱగోరంట, బంగారు వన్నెగల నూఱురేకులు గల తామరలు, వీరము, రేణుక, ఉసిరిక, ఉత్తరేణు, మల్లె, మాధవి మున్నగు వృక్షములతోను, లతలతోను శోభిల్లుచున్నది. ఇంకను అది పనస, అత్తి, అశ్వత్థము (రావి), ప్లక్షము (జువ్వి), న్యగ్రోధము (జమ్మి), ఇంగిలీకము, భూర్జము, వివిధములగు నోషధులు, పోకలు, రాజపూగము, నేరేడు, ఖర్జూరము, ఆమ్రాతకము (అబాళపుజెట్టు), మామిడి, పియాలము (మోరటిచెట్టు) విప్ప, గారచెట్టు, వెదురు, సన్నవెదురు మున్నగు వృక్షములచే శోభిల్లుచుండెను.

అచటి సరోవరముల యందు వివిధములగు జలపక్షులు ఎఱ్ఱదామరలు, కలువలు, కల్హారములు, పద్మములు మున్నగు వికసించిన జలజపుష్పముల యొక్క మకరందమును, సౌరభమును జూచి మధురముగ ధ్వనించు చుండెను.

ఆ పర్వతమున మృగములు, కోతులు, పందులు, సింహములు, ఏనుగులు, ఎలుగుబంట్లు, శల్యకములు (ఏదుపందులు), గవయములు (ఎడ్లు), శరభములు, పెద్దపులులు, రురువులు, దున్నపోతులు, కర్ణములు, ఊర్ణములు, ఏకపదాశ్వముఖములు, తోడేళ్లు, కస్తూరీ మృగములు మున్నగు నానావిధ మృగములు నివసించుచున్నవి.

సరస్సుల తటములయందు అరటిచెట్ల వరుసలు అపూర్వ మగు శోభను విస్తరింప జేయుచున్నవి. సతీదేవి స్నానమునకై పుణ్యతోయ యగు ఆకాశగంగ గిరిరాజమగు కైలాస పర్వతమును పరివేష్టించి ప్రవహించు చుండెను. భూతపతియగు గిరీశుని కావాసమగు నిట్టి కైలాసపర్వతమును దర్శించి దేవతలు మిగుల విస్మయాన్వితులైరి.

**దదృశుస్తత్ర తే రమ్యామలకాం నామ వై పురీమ్ ।**
**వనం సౌగన్ధికం చాపి యత్ర తన్నామపంకజమ్ ॥ 23**

పిమ్మట దేవతలా కైలాసపర్వతమున మనోహారిణియగు 'అలక' యను పట్టణమును, సౌగంధిక మనువనమును దర్శించిరి. సౌగంధిక పద్మము లీ సౌగంధవనమునందే జన్మించును.

**నన్దా చాలకనన్దా చ సరితౌ బాహ్యతః పురః ।**
**తీర్థ పాదపదాంభోజరజసాతీవ పావనే ॥ 24**

ఈ పట్టణమునకు బయట తీర్థ పాదుడగు శ్రీహరిపాద పద్మరేణువుల స్పర్శచే పవిత్రమగు నంద, అలకనంద యను రెండునదులు ప్రవహించు చుండెను.

**యయోః సురస్త్రియః క్షత్తరవరుహ్య స్వధిష్ణ్యతః ।**
**క్రీడన్తి పుంసః సించన్త్యో విగాహ్య రతికర్శితాః ॥ 25**

విదురా! సంభోగశ్రాంత లగు దేవతాస్త్రీలు తమతమలోకముల నుండి యవతరించి యీ రెండునదులలో స్నానము జేయుచుందురు. అనురాగముతో ప్రియుల శరీరములపై నీరుజల్లుచు జలక్రీడలాడుచుందురు.

**యయోస్తత్స్నాన విభ్రష్టనవకుంకుమపింజరమ్ ।**
**పితృషోఽపి పిబన్త్యంభః పాయయన్తో గజా గజీః ॥ 26**

దేవతాంగనలు స్నానము చేయునపుడు వారి శరీరముల నుండి జారిన నవకుంకుమ యొక్క సంయోగముచే ఆ రెండునదులలోని జలములు పీతవర్ణము లగుచుండును.

అందువలన దాహము కాకపోయినను మగయేనుగు లాడయేనుగులచే నీటిని త్రాగించుచు, తాముగూడ త్రాగుచుండును.

తారహేమమహారత్నవిమానశతసంకులామ్ ।
జుష్టాం పుణ్యజనస్త్రీభిర్యథా ఖం సతడిద్ఘనమ్ ॥ 27

అయ్యల కాపట్టణము వెండిబంగారములచే నిర్మితములు, మహారత్న ఖచితములు నగు వందలకొలది విమానములచే పరివ్యాప్తమై యుండెను. మెఱపులతోను, మేఘములతోను వ్యాప్తమైన ఆకాశమువలె నున్న యీ ప్రదేశము యక్షకాంతలచే సేవింపబడుచున్నది.

హిత్వా యక్షేశ్వరపురీం వనం సౌగన్ధికం చ తత్ ।
ద్రుమైః కామదుఘైర్హృద్యం చిత్రమాల్య ఫలచ్ఛదైః ॥ 28

యక్షేశ్వరుడగు కుబేరుని రాజధానియైన అయ్యలకాపట్టణమును విడచి దేవతలా సౌగంధికవనమునకు వచ్చిరి. ఆవనము రంగురంగుల ఫలపుష్ప పత్రములు గల యనేక కల్పవృక్షములతో శోభిల్లుచుండెను.

రక్తకంఠఖగానీక స్వరమండిత షట్పదమ్ ।
కలహంసకులప్రేష్ఠ ఖరదండ జలాశయమ్ ॥ 29

అది కోకిల మున్నగు పక్షుల కలరవములతోను, తుమ్మెదల ఝుంకారములతోను ప్రతిధ్వనించు చుండెను. రాజహంసలకు పరమప్రియములగు తామరపూవులచే శోభిల్లు అనేక సరోవరములతో గూడియుండెను.

వనకుంజర సంఘృష్ట హరిచందన వాయునా
అధిపుణ్యజనస్త్రీణాం ముహురున్మథయన్మనః ॥ 30

అది అడవి యేనుగుల శరీరముల ఒరపిడులచే బెరడు లేచిన హరి చందనవృక్షములను స్పృశించి వీచు సుగంధ వాయువులద్వారా యక్షపత్నుల మనస్సులను హరించుచున్నది.

వైదూర్య కృతసోపాన వాప్య ఉత్పలమాలినీః ।
ప్రాప్తం కింపురుషైర్దృష్ట్వా త ఆరాద్దదృశుర్వటమ్ ॥ 31

అడవిలో నున్న బావులయందలి మెట్లు వైడూర్యమణులచే నిర్మితములైనవి. వానియందనేక కమలములు వికసించియున్నవి. అచటికి కింపురుషులు విహరించుటకు వచ్చిరి. ఇట్లావనశోభను జూచుచు దేవతలు ముందుకు సాగగా సమీపమున వారి కొక వటవృక్ష మగపడెను.

స యోజనశతో త్సేధః పాదోనవిటపాయతః ।
పర్యక్కృతాచలచ్ఛాయో నిర్నీడస్తాపవర్జితః ॥ 32

ఈ మఱ్ఱిచెట్టు నూఱుయోజనముల యెత్తుగ నున్నది. దానిశాఖలు డెబ్బది యాఱుయోజనముల వఱకు విస్తరించియున్నవి. అవిచలమగు దానిఛాయ నలువైపుల వ్యాపించియున్నది. దానిపై నొక్కగూడు కూడ లేదు. దానిక్రింద నెట్టితాపము కలుగదు.

తస్మిన్ మహాయోగమయే ముముక్షుశరణే సురాః ।
దదృశుః శివమాసీనం త్యక్తామర్ష మివాన్తకమ్ ॥ 33

ముముక్షువుల కాశ్రయస్వరూపము, అణిమాదిసిద్ధి ప్రదము నగునీవట వృక్షముక్రింద క్రోధమును విడచిపెట్టినవాడై సాక్షాత్తుగ యమునివలె నున్న మహాదేవుని దేవతలు దర్శించిరి.

సనన్దనాద్యైర్మహాసిద్ధైః శాన్తైః సంశాన్తవిగ్రహమ్ ।
ఉపాస్యమానం సఖ్యా చ భర్త్రా గుహ్యక రక్షసామ్ ॥ 34

ప్రశాంతమూర్తి యగు శివుని శాంతస్వభావులు, సిద్ధులలో శ్రేష్ఠులు నగు సనందనాదులు, యక్షరాక్షసులకు ప్రభువు సఖుడు నగు కుబేరుడు స్తుతింపసాగిరి.

విద్యాతపోయోగపథమాస్థితం తమధీశ్వరమ్ ।
చరన్తం విశ్వసుహృదం వాత్సల్యాల్లోక మంగలమ్ ॥ 35

విశ్వబాంధవుడగు శంభువు ప్రేమతో నందఱకు శుభములు గలుగజేయు చుండును. ఆయన లోకహితార్థమై ఉపాసన, చిత్తైకాగ్రత, సమాధి మున్నగు సాధనముల నాచరించు చుండును.

లింగం చ తాపసాభీష్టం భస్మదండజటాజినమ్ ।
అంగేన సంధ్యాభ్రరుచా చన్ద్రలేఖాం చ బిభ్రతమ్ ॥ 36

సంధ్యాకాల మేఘమువంటి కాంతి గల శరీరముపై ఆయన తాపసుల కభీష్ట చిహ్నములగు భస్మము, దండము, జటలు, మృగచర్మము, మస్తకముపై చంద్రకళను ధరించియుండెను.

ఉపవిష్టం దర్భమయ్యాం బృస్యాం బ్రహ్మ సనాతనమ్ ।
నారదాయ ప్రవోచన్తం పృచ్ఛతే శృణ్వతాం సతామ్ ॥ 37

శంభువు దర్భాసనముపై గూర్చుండి నారదుడడుగుచుండగా సనంద నాదిశ్రోతలకు నిత్యసత్య మగు వేద తత్త్వము నుపదేశించుచుండెను.

కృత్వోరౌ దక్షిణే సవ్యం పాదపద్మం చ జానుని ।
బాహుం ప్రకోష్ఠేఽక్షమాలామాసీనం తర్కముద్రయా ॥ 38

ఆయన యెడమపాదమును కుడితొడపైన, ఎడమచేతిని యెడమ తొడమీద ఉంచెను. కుడిచేతి మణికట్టుపై అక్షమాలను ధరించి తర్క (జ్ఞాన) ముద్రను బట్టి కూర్చుండెను.

తం బ్రహ్మనిర్వాణ సమాధిమాశ్రితం
వ్యుపాశ్రితం గిరిశం యోగకక్షామ్ ।
సలోకపాలామునయో మనూనా -
మాద్యం మనుం ప్రాంజలయః ప్రణేముః ॥ 39

యోగపట్టము నవలంబనము చేసికొని యేకాగ్రచిత్తముతో బ్రహ్మానందము ననుభవించుచుండెను. లోకపాలురతోగూడ సర్వమునులలో నగ్రగణ్యుడగు మహాదేవునకు బద్ధాంజలురై దేవతలందఱు నమస్కరించిరి.

స తూపలభ్యాగతమాత్మయోనిం
సురాసురేశైరభివన్దితాంఘ్రిః ।
ఉత్థాయ చక్రే శిరసాభివన్దన -
మర్హత్తమః కస్య యథైవ విష్ణుః ॥ 40

వామనావతారమున పరమపూజ్యుడగు విష్ణుభగవానుడు కశ్యప ప్రజాపతికి అభివాదనము చేసినట్లుగ నేడు సురాసుర శ్రేష్ఠులచే నమస్కరింపబడు చరణములుగల ఆశివుడు తనకడకు వచ్చిన బ్రహ్మకు ప్రణమిల్లెను.

తథాపరే సిద్ధగణా మహర్షిభి -
ర్యే వై సమన్తాదను నీలలోహితమ్ ।
నమస్కృతః ప్రాహ శశాంక శేఖరం
కృతప్రణామం ప్రహసన్నివాత్మభూః ॥ 41

ఇట్లే శంకరునకు నలువైపుల మహర్షులతో గలసి కూర్చుండి యున్న ఇతరులగు సిద్ధపురుషులుగూడ బ్రహ్మకు ప్రణమిల్లిరి. పిమ్మట బ్రహ్మ ప్రణమిల్లుచున్న చంద్రమౌళిని జూచి నవ్వుచు నిట్లు పలికెను.

## శ్రీ బ్రహ్మోవాచ

జానే త్వామీశం విశ్వస్య జగతో యోనిబీజయోః ।
శక్తేః శివస్య చ పరం యత్తద్బ్రహ్మ నిరన్తరమ్ ॥ 42

(బ్రహ్మ శైవమతావలంబుల మతము ననుసరించి పలికెను) - నీవు సదాశివరూపముతో ప్రాకృతాప్రాకృతవిశ్వమున కంతటికి ఈశ్వరుడవై యున్నావు. నీవు ప్రాకృత ప్రపంచమునకు యోనిరూప మగు ప్రకృతివి, బీజరూపుడవగు పురుషుడవు, నిర్గుణ నిర్వికార బ్రహ్మముగూడ నీవే. అందువలన నీవు నాకు దైన్యమువలన నమస్కారములను జేసినను నేను నిన్ను ఈశ్వరునిగనే తలంచుచున్నాను.

త్వమేవ భగవన్నేతచ్ఛివశక్త్యోః సరూపయోః ।
విశ్వం సృజసి పాస్యత్సి క్రీడన్నూర్ణపటో యథా ॥ 43

ప్రభూ! నీవే సదాశివరూపముతో నీయంశభూతులగు శివశక్తులలో (పురుష ప్రకృతులలో) నుండి సాలెపురుగువలె నీవిశ్వమును సృష్టించు చున్నావు, పాలించుచున్నావు. లయము చేయుచున్నావు.

త్వమేవధర్మార్థ దుఘాభిపత్తయే
దక్షేణ సూత్రేణ ససర్జిథాధ్వరమ్ ।
త్వయైవ లోకేఽవసితాశ్చ సేతవో
యాన్ బ్రాహ్మణాః శ్రద్దధతే ధృతవ్రతాః ॥ 44

దేవా! నీవే ధర్మార్థముల నిచ్చు వేదమును రక్షించుటకై దక్షుని నిమిత్తముగా జేసి యజ్ఞమును సృష్టించితివి. ప్రభూ! నియమనిష్ఠులగు బ్రాహ్మణులనుష్ఠించు వర్ణాశ్రమ మర్యాదలను నీవే లోకమున నిర్ణయించితివి.

త్వం కర్మణాం మంగలమంగలానాం
కర్తుః స్వలోకం తనుషే స్వః పరం వా ।
అమంగలానాం చ తమిస్రముల్బణం
విపర్యయః కేన తదేవ కస్యచిత్ ॥ 45

శివా! నీవు శుభకర్మల ననుష్ఠించువారికై స్వర్గమును, నిజలోకమును లేదా మోక్షమును నిచ్చుచున్నావు. ఇంకను నీవే అశుభకర్మల జేయువారికి భీషణమగు నరకలోకమును విధించుచున్నావు. ప్రభూ! అయినను గొందఱు వ్యక్తుల పక్షమున ఈ కర్మఫలము వ్యతిరేకముగ నుండును. దీనికి గారణమేమి?

న వై సతాం త్వచ్చరణార్పితాత్మనాం
భూతేషు సర్వేష్వభిపశ్యతాం తవ ।
భూతాని చాత్మన్యపృథగ్దిదృక్షతాం
ప్రాయేణ రోషోఽభిభవేద్యథా పశుమ్ ॥ 46

నీపాదారవిందములయందు మనస్సును నిలిపినవారు, స్థావరజంగమములగు సర్వభూతములయందు నిన్నే జూచువారు, భేదదర్శనరహితమగు దృష్టితో సర్వభూతములను తమవలె భావించువారు నగు మానవులు పశుతుల్యుడగు దక్షునివలె ఎప్పుడును నీకోపమున కధీనులుగారు.

పృథగ్ధియః కర్మదృశో దురాశయాః
పరోదయేనార్పితహృద్రుజోఽనిశమ్ ।
పరాన్ దురుక్తైర్వితుదన్త్యరున్తుదా
స్తాన్ మావధీద్దైవవధాన్ భవద్విధః ॥ 47

భేదదృష్టి గలవారగుటవలన జడకర్మల యందే ఆసక్తిగలవారు, పరులయైశ్వర్యమును జూచి నిరంతరము బాధపడువారు, పరుషవాక్కులతో నితరుల హృదయమునకు బాధకలుగజేయువారు నగు మానవులకు దైవమే శిక్ష విధించును. అందువలన నీవంటి సత్పురుషుడు వారిని వధించుట తగదు.

యస్మిన్ యదా పుష్కరనాభమాయయా
దురన్తయా స్పృష్టధియః పృథగ్దృశః ।
కుర్వన్తి తత్ర హ్యనుకంపయా కృపాం
న సాధవో దైవబలాత్కృతే క్రమమ్ ॥ 48

ప్రభూ! ఏ దేశమునందైన, ఏకాలమునందైన మానవులు ప్రబలమగు విష్ణుమాయచే మోహితులై భేదదృష్టితో నెట్టి యపరాధమైన నొనర్చినచో సాధువు లీయపరాధుల కృత్యములను ప్రారబ్ధకృత్యములని తలంచి వారిపై దయచూపవలెను. కాని యెప్పుడును వారినాశార్థమై పరాక్రమమును జూపరాదు.

భవాంస్తు పుంసః పరమస్య మాయయా
దురన్తయాఽస్పృష్టమతిః సమస్తదృక్ ।
తయా హతాత్మస్వనుకర్మచేతః -
స్వనుగ్రహం కర్తుమిహార్హసి ప్రభో ॥ 49

నీవు పరమపురుషుడగు భగవానుని అచింత్య ప్రభావముగల మాయచే విమోహితచిత్తుడ వగుటలేదు. అందువలన నీవు సర్వజ్ఞుడవు. భగవన్మాయచే మోహితుడై కేవలము జడకర్మలయందాసక్త చిత్తుడగు మానవునిపై నీవంటి వ్యక్తి తప్పక దయచూపవలెను.

కుర్వధ్వరస్యోద్ధరణం హతస్య భో-
స్త్వయాఽసమాప్తస్య మనో ప్రజాపతేః ।
న యత్ర భాగం తవ భాగినో దదుః
కుయాజినో యేన మఖో నినీయతే ॥ 50

శివా! నీవు యజ్ఞఫలదాతవు, యజ్ఞభాగమును భుజించువాడవు దక్షయజ్ఞమున దుష్టులగుయాజ్ఞికులు నీకు నీభాగము నీయక పోవుటవలన నీవు దక్షప్రజాపతి యజ్ఞమును నాశము చేసితివి. అందువలన అది యసంపూర్ణముగనే యుండిపోయినది. దయయుంచి నీ వాయజ్ఞమును పునరుద్ధరింప వలెను.

జీవతాద్యజమానోఽయం ప్రపద్యేతాక్షిణీ భగః ।
భృగో శ్మశ్రూణి రోహన్తు పూష్ణో దన్తాశ్చ పూర్వవత్ ॥ 51

దేవా! నీదయవలన యజమానుడగు దక్షుడు మరల జీవించు గాక! భగదేవతకు నేత్రములు, భృగవునకు మీసములు, పూషాదేవతకు దంతములు వెనుకటివలె కలుగుగాక!

దేవానాం భగ్నగాత్రాణామృత్విజా చాయుధాశ్మభిః ।
భవతానుగృహీతానామాశు మన్యోఽస్త్వనా తురమ్ ॥ 52

రుద్రదేవా! అస్త్రశస్త్రములచేత, రాళ్ళచేత, దేవతలయొక్క, ఋత్విక్కులయొక్క శరీరములు గాయములైనవి. వారు నీయనుగ్రహమువలన మరల ఆరోగ్యవంతులగుదురు గాక!

ఏష తే రుద్రభాగోఽస్తు యదుచ్ఛిష్టోఽధ్వరస్య వై
యజ్ఞస్తే రుద్రభాగేన కల్పతామద్య యజ్ఞహన్ ॥ 53

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్ర భాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థ స్కంధే రుద్రసాన్త్వనంనామ
షష్ఠోఽధ్యాయః ॥

రుద్రదేవా! నీ యీయజ్ఞభాగమును గ్రహింపుము. నేటినుండి యజ్ఞమున మిగిలిన ఈభాగమంతయు నీదిగనే పరిగణింపబడును. యజ్ఞ విధ్వంసకా! నేడు నీవు నీభాగమును స్వీకరించి యజ్ఞమును పూర్తి చేయుము.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి నాలుగవ
స్కంధములోని ఆఱవ అధ్యాయము
సమాప్తము.

# ఏడవ అధ్యాయము

## దక్షయజ్ఞమును పూర్తి చేయుట

కథాసారము :- ఈయధ్యాయమున దక్షుడు, శివుడు మున్నగువారు స్తుతింపగా యజ్ఞక్షేత్రమున విష్ణుభగవానుడు ఆవిర్భవించుట, ఆయన కృపవలన దక్షుడు మరల యజ్ఞమును ప్రారంభించుట యను విషయములు వర్ణితములైనవి.

బ్రహ్మాదిదేవతలు ప్రార్థింపగా శివుడు సంతుష్టుడై ఛాగ (మేకపోతు) ముఖముద్వారా దక్షుని పునర్జీవితునిగ జేసెను. విభిన్నము లగునుపాయములతో హీనాంగు లగు వ్యక్తుల అంగవైకల్యమును తొలగించెను. శివుడు బ్రహ్మాదిదేవతలతో గలసి యజ్ఞభూమికి వెడలెను. దక్షుడు శివకృపచే మోహము తొలగినవాడై వైష్ణవాపరాధమునకు శివుని క్షమాపణము వేడుకొనెను. దక్షుడు మరల యజ్ఞమును ప్రారంభింపగా శ్రీహరి యచటికి విచ్చేసి, యజ్ఞములో అగ్రభాగమును స్వీకరించెను. అనంతరము మిగిలిన భాగములో శివబ్రహ్మాది దేవతలు తమతమ భాగముల స్వీకరించి సంతుష్టులైరి. దక్షయజ్ఞము పూర్తియయ్యెను. తగినసమయమున సతీదేవి హిమాలయక్షేత్రమున మేనకకు జన్మించి మరల శివుని పొందెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

**ఇత్యజేనానునీతేన భవేన పరితుష్యతా ।**
**అభ్యధాయి మహాబాహో ప్రహస్య శ్రూయతామితి ॥ 1**

మైత్రేయుడు పలికెను:- విదురా! బ్రహ్మ పలికిన ఈ యనునయవాక్యులకు పరితుష్టుడై మహాదేవుడు నవ్వి "మీరందఱు వినుడని పలికెను.

### శ్రీ మహాదేవ ఉవాచ

**నాఘం ప్రజేశ బాలానాం వర్ణయే నానుచిన్తయే ।**
**దేవమాయాభిభూతానాం దండస్తత్ర ధృతో మయా ॥ 2**

మహాదేవుడు పలికెను :- ప్రజాపతీ! నేను భగవన్మాయా మోహితులు, అజ్ఞానులు నగు దక్షాదుల అపరాధమును చర్చింపను, తలంపను. మర్యాదను గాపాడుటకే వారిని శిక్షింపవలసి వచ్చినది.

ప్రజాపతేర్దగ్ధశీర్‌ష్ణో భవత్వజముఖం శిరః ।
మిత్రస్య చక్షుషేక్షేత భాగం స్వం బర్హిషో భగః ॥ 3

దక్షప్రజాపతి శిరము దగ్ధమైనది. అందువలన నిపుడు మేకపోతు ముఖము ఆ దక్షునకు ముఖముగ నుండుగాక! భగదేవత మిత్రదేవత యొక్క చక్షువులద్వారా తన యజ్ఞభాగమును జూచుచుండుగాక!

పూషా తు యజమానస్య దద్భిర్జక్షతు పిష్టభుక్ ।
దేవాః ప్రకృతసర్వాంగా యే మ ఉచ్ఛేషణం దదుః ॥ 4

పూష పిష్టమును (పిండిని) భుజించునదై యజమానుని దంతముల ద్వారా భక్షించునుగాక! యజ్ఞమున మిగిలిన భాగములను నాకు లభించునట్లు చేయుటచే భగ్నములైన వారియవయవము లన్నియు యథాస్థితిలో నుండుగాక!

బాహుభ్యామశ్వినోః పూష్ణో హస్తాభ్యాం కృతబాహవః ।
భవన్త్వధ్వర్యవశ్చాన్యే బస్తశ్మశ్రుర్భృగుర్భవేత్ ॥ 5

ఋత్విక్కుల అవయవము లన్నియు నొక్కమారే వినష్టములయ్యెను. అశ్వినీకుమారుల బాహువులద్వారా వారు బాహువిశిష్టులు, సూర్యుని హస్తముల ద్వారా చేతులుగలవారు నగుదురుగాక! ఛాగము (మేక) యొక్క మీసములే భృగువునకు మీసము లగుగాక!

## శ్రీ మైత్రేయ ఉవాచ

తదా సర్వాణి భూతాని శ్రుత్వా మీఢుష్టమోదితమ్ ।
పరితుష్టాత్మభిస్తాత సాధుసాధ్విత్యథాబ్రువన్ ॥ 6

మైత్రేయుడు పలికెను :- విదురా! చంద్రశేఖరుడు పలికిన యీమాటలను విని సర్వప్రాణులు హృష్టచిత్తముతో మేలు మేలని పలికెను.

తతో మీఢ్వాంసమామంత్ర్య శునాసీరాః సహర్షిభిః ।
భూయస్తద్దేవయజనం సమీఢ్వద్వేధసో యయుః ॥ 7

పిమ్మట దేవతలు మహాదేవు నాహ్వానించి, శివుని బ్రహ్మను వెంట దీసికొని ఋషులతోగూడి మరల దక్షునియజ్ఞశాలకు వెడలిరి.

విధాయ కార్త్స్న్యేన చ తద్యదాహ భగవాన్ భవః ।
సందధుః కస్య కాయేన సవనీయపశోః శిరః ॥ 8

అచట ఐశ్వర్యశాలి యగు శంకరుడు చెప్పినదాని ననుసరించి సమస్తకార్యములను నిర్వహించి దేవతలు దక్షునిమొండెమునకు యజ్ఞపశువు శిరస్సును దగిలించిరి.

**సంధీయమానే శిరసి దక్షో రుద్రాభివీక్షితః ।**
**సద్యస్సుప్త ఇవోత్తస్థౌ దదృశే చాగ్రతో మృడమ్ ॥ 9**

ఇట్లు దక్షునకు శిరస్సు తగిలింపగా రుద్రుడు దక్షునిపై కృపాదృష్టిని ప్రసరింపజేసెను. వెంటనే యతడు నిద్రించి మేలుకొనినవానివలె లేచి యెట్టయెదుట భూతనాథుని గనెను.

**తదా వృషధ్వజద్వేషకలిలాత్మా ప్రజాపతిః ।**
**శివావలోకాదభవచ్ఛరద్ధ్రద ఇవామలః ॥ 10**

ఈశ్వరునియందలి ద్వేషముచే మలినమైన ఆత్మగల దక్షప్రజాపతి మహాదేవుని కృపాదృష్టి పడినంతనె శరత్కాలమందలి సరస్సువలె నిర్మలమైన అంతఃకరణము గలవాడయ్యెను.

**భవస్తవాయ కృతధీర్నాశక్నోదనురాగతః ।**
**ఔత్కంఠ్యాద్బాష్పకలయా సంపరేతాం సుతాం స్మరన్ ॥ 11**

అపుడు దక్షుడు శివుని స్తుతింపదలచెను. కాని యత డనురాగము వలన పరలోకమునకు వెడలినపుత్రికను స్మరించి మిగుల ఉత్కంఠితుడయ్యెను. దానివలన నేత్రములయందు నీరు నిండెను. శివుని స్తుతింప లేకపోయెను.

**కృచ్ఛ్రాత్సంస్తభ్య చ మనః ప్రేమవిహ్వలితస్సుధీః ।**
**శశంస నిర్వ్యలీకేన భావేనేశం ప్రజాపతిః ॥ 12**

పుత్రికపై గలప్రేమచే విహ్వలచిత్తుడు, బుద్ధిమంతుడు నగుదక్షుడు అతికష్టముతో మనస్సును నిగ్రహించుకొని నిష్కపటభావముతో శివుని స్తుతించెను.

## శ్రీ దక్ష ఉవాచ

**భూయాననుగ్రహ అహో భవతా కృతో మే**
**దణ్డస్త్వయా మయి భృతో యదపి ప్రలబ్ధః ।**
**న బ్రహ్మబన్ధుషు చ వాం భగవన్నవజ్ఞా**
**తుభ్యం హరేశ్చ కుత ఏవ ధృతవ్రతేషు ॥ 13**

దక్షుడు పలికెను :- దేవా! నేను నిన్నవమానించితిని, అయినను నీవు అపరాధి నగు నన్ను ఉపేక్షింపక నాకు దగినదండనము విధించి నాపై గృపజూపితివి. నీవు, శ్రీహరి ఆచార

హీనులగు నామమాత్ర బ్రాహ్మణుల నుపేక్షింపరు. ఇక మావంటి యజ్ఞయాగాదులను జేయువారిని యేల ఉపేక్షింతురు?

విద్యా తపోవ్రతధరాన్ ముఖతః స్మ విప్రాన్
బ్రహ్మాత్మతత్త్వమవితుం ప్రథమం త్వమస్రాక్ ।
తద్బ్రాహ్మణాన్ పరమసర్వవిపత్సు పాసి
పాలః పశూనివ ప్రభో ప్రగృహీతదణ్డః ॥ 14

పరమపురుషా! నీవు వేదమును, ఆత్మతత్త్వమును రక్షించుటకై విద్యాతపోవ్రతధారులగువిప్రులను మొదట ముఖమునుండి సృష్టించితివి. పశులకాపరుల పశువులను రక్షించునట్లు నీవు గూడ నాబ్రాహ్మణులను సర్వ విపత్తులనుండి రక్షించుచున్నావు.

యో సౌ మయా విదితతత్త్వదృశా సభాయాం
క్షిప్తో దురుక్తివిశిఖైర్విగణయ్య తన్మామ్ ।
అర్వాక్ పతన్తమర్హత్తమనిన్దయాపా -
ద్దృష్ట్యార్ద్రయా స భగవాన్ స్వకృతేన తుష్యేత్ ॥ 15

నీతత్త్వమును దెలిసికొనక పోవుటచే నేను సభాస్థలమున నావాగ్బాణములతో నిన్ను బాధించితిని. నీవు పూజ్యులగు వారిలో శ్రేష్ఠుడవు, ఇట్టి నిన్ను నే నావిధముగ నిందించి యధఃపతితుడనైతిని. కాని నీవు నాయపరాధమును స్వీకరింపక దయాపూర్ణ దృష్టితో నన్ను రక్షించితివి. ఇట్టి నీవు నీ గుణములచేతనే ప్రసన్నుడ వగుదువుగాక!

## శ్రీ మైత్రేయ ఉవాచ

క్షమాప్యైవం స మీఢ్వాంసం బ్రహ్మణా చానుమన్త్రితః ।
కర్మసన్తానయామాస సోపాధ్యాయర్త్విగాదిభిః ॥ 16

మైత్రేయుడు పలికెను :- దక్షు డిట్లు మహాదేవుని తనతప్పులను క్షమింపు మని వేడుకొని, బ్రహ్మదేవునియాజ్ఞ ననుసరించి ఉపాధ్యాయులు, ఋత్విక్కులు మున్నగువారి సాహాయ్యముతో మరల యజ్ఞము చేయనారంభించెను.

వైష్ణవం యజ్ఞసన్తత్యై త్రికపాలం ద్విజోత్తమాః ।
పురోడాశం నిరవపన్ వీరసంసర్గశుద్ధయే ॥ 17

బ్రాహ్మణులు యజ్ఞవిస్తరణకొఱకు, రుద్రపార్షదు లగుప్రమథ గణముల సంసర్గము వలన గలిగిన దోషమును బోగొట్టుటకొఱకు విష్ణుసంబంధమైన మూడుకపాలాకారపాత్రల యందున్న పక్వాన్నముతోను, పురోడాశ మనుహవిస్సుతోను హోమముచేసిరి.

అధ్వర్యుణాత్తహవిషా యజమానో విశాంపతే ।
ధియా విశుద్ధయా దధ్యౌ తథా ప్రాదురభూద్ధరిః ॥ 18

విదురా! యజమాను డగుదక్షుడు హవిస్సును చేతిలోనికి దీసికొని అధ్వర్యునితో గూడ విశుద్ధచిత్తముతో ధ్యానింపగా శ్రీహరి ప్రాదుర్భవించెను.

తదా స్వప్రభయా తేషాం ద్యోతయన్త్యా దిశోదశ ।
ముష్ణం స్తేజ ఉపానీతస్తార్క్ష్యేణ స్తోత్రవాజినా ॥ 19

అప్పుడు శ్రీహరి శరీరకాంతిద్వారా దశదిశలను ప్రకాశింపజేయుచు, బ్రహ్మాదిదేవతల ప్రభావమును దగ్గించి, "బృహత్", "రథంతరము" వను స్తోత్రములు రెక్కలుగాగల గరుడు నిపై గూర్చుండి యచటికి విచ్చేసెను.

శ్యామో హిరణ్యరశనోఽర్కకిరీటజుష్టో
నీలాలకభ్రమరమండితకుండలాస్యః ।
శంఖాబ్జచక్రశరచాపగదాసిచర్మ -
వ్యగ్రైర్హిరణ్మయభుజైరివ కర్ణికారః ॥ 20

ఆ శ్రీహరి శ్యామవర్ణుడు. ఆయనకటిప్రదేశమున బంగారుమొలనూలు, శిరస్సున సూర్యునివలె ప్రకాశించు నుజ్జ్వలకిరీటము శోభిల్లుచుండెను. శ్రీహరియొక్క కుండలమండిత మగుముఖకమలముపైన కృష్ణవర్ణము లగుముంగురులు తుమ్మెదలవలె విహరించు చుండెను. బాహువులు సువర్ణ భూషణములకాంతిచే బంగారురంగును పొంది శంఖచక్ర గదా పద్మములను, శరమును, ధనుస్సును, ఖడ్గమును, చర్మమును ధరించి తన భక్తుల రక్షణమున వ్యగ్రుడయ్యెను. దానివలన ఆ శ్రీహరి పుష్పించిన కొండగోగుచెట్టువలె శోభిల్లు చుండెను.

వక్షస్యధిశ్రితవధూర్వనమాల్యుదార -
హాసావలోకకలయా రమయంశ్చ విశ్వమ్ ।
పార్శ్వభ్రమద్వ్యజనచామర రాజహంసః
శ్వేతాతపత్రశశినోపరి రజ్యమానః ॥ 21

ఆయన వక్షఃస్థలమున లక్ష్మీదేవి, వనమాల విరాజిల్లుచుండెను. ఆయన తనయుదార హాసలీలామయకటాక్షముల ద్వారా సమస్తప్రపంచమున కానందమును గలుగజేయుచుండెను. పార్షదులు రెండువైపుల రాజహంసల వలె తెల్లనిచామరములను, వ్యజనములను వీచు చుండిరి. ఆయన శిరముపై పూర్ణచంద్రునివలె శ్వేతచ్ఛత్రము శోభిల్లుచుండెను.

తముపాగతమాలక్ష్య సర్వే సురగణాదయః ।
ప్రణేముః సహసోత్థాయ బ్రహ్మేన్ద్రత్ర్యక్ష నాయకాః ॥ 22

అట్లువచ్చిన భగవంతుని దర్శించి బ్రహ్మ, ఇంద్రుడు, త్రినేత్రుడు మున్నగుదేవతలు వెంటనే లేచి నమస్కరించిరి.

తత్తేజసా హతరుచః సన్నజిహ్వాః ససాధ్వసాః ।
మూర్ధ్నా కృతాంజలిపుటా ఉపతస్థురధోక్షజమ్ ॥ 23

ఆయనతేజస్సుచే అందఱిప్రభావము తిరస్కృతమయ్యెను. ఆయనమహిమచే విహ్వలచిత్తులై, దోసి లొగ్గి, శిరస్సువంచి గద్గదవాక్కులచే ఆయధోక్షజు నిట్లు స్తుతింపసాగిరి.

అప్యర్వాగ్వృత్తయో యస్య మహిత్వాత్మభువాదయః ।
యథామతి గృణన్తిస్మ కృతానుగ్రహవిగ్రహమ్ ॥ 24

శ్రీహరిమహిమయెదుట బ్రహ్మాదిప్రముఖదేవతలుగూడ క్షుద్రవృత్తి సంపన్నులై తిరస్కృతులైరి. అయినను ఆయన భక్తులపై ననుగ్రహము జూపుటకు దయతో దన విగ్రహమును బ్రకటించెను. అట్టి శ్రీహరిని దేవతలు తగువిధముగ స్తుతింప నారంభించిరి.

దక్షో గృహీతార్హణసాదనోత్తమం
యజ్ఞేశ్వరం విశ్వసృజాం పరం గురుమ్ ।
సునన్దనన్దాద్యనుగైర్వృతం ముదా
గృణన్ ప్రపేదే ప్రయతః కృతాంజలిః ॥ 25

మొదట దక్షప్రజాపతి చిత్తమును నిగ్రహించి, యుత్తమపాత్రమున పూజాసామగ్రి నుంచుకొని ప్రజాపతులకు పరమగురువు, సునందనందాది దేవర్షి గణపరివృతుడు నగు శ్రీహరిని ఆనందముతో స్తుతించుచు ఆయనను శరణుజొచ్చెను.

## శ్రీ దక్ష ఉవాచ

శుద్ధం స్వధామ్న్యుపరతాఖిలబుద్ధ్యవస్థం
చిన్మాత్రమేకమభయం ప్రతిషిధ్య మాయామ్ ।
తిష్ఠం స్తయైవ పురుషత్వముపేత్య తస్యా -
మాస్తే భవానపరిశుద్ధ ఇవాత్మతన్త్రః ॥ 26

దక్షుడు పలికెను :- దేవా! నీవు నీస్వరూపశక్తివైభవ మగు పరమవైకుంఠమున నివసించుచు ప్రకృతిసంసర్గమువలన నిత్యము నిర్ముక్తుడ వైయుందువు. అనగా బ్రహ్మ

రుద్రాదులవలె నీ వెప్పుడును ప్రకృతి సంసర్గమున నుండవు. అందువలన నీవు శుద్ధుడవు, పాపరహితుడవు, చిద్ఘనస్వరూపుడవు, అద్వయజ్ఞానస్వరూపుడవు. నీయందు ద్వితీయ వస్తువగుమాయకు ఉనికిలేదు. అందువలన నీవు అభయస్వరూపుడవు, మాయాధీశుడవు, కనుక మాయను తిరస్కరింపసమర్థుడవు. స్వతంత్రభగవద్రూపముతో నున్నను మహ త్స్రష్టయు, కారణార్ణవశాయియు నగుపురుష రూపమును ధరించి ప్రకృతీక్షణాదిమాయా సంబంధవ్యాపారమున నియుక్తుడవై యుందువు. దానివలన నిన్ను ప్రాకృతజనులు అక్షజ దృష్టితో అపరిశుద్ధునివలె దర్శింతురు. కాని నీవు పరిశుద్ధుడవు, మాయాధీశరూపముతోనే యుందువు.

## శ్రీ ఋత్విజ ఊచుః

తత్త్వం న తే వయమనఞ్జన రుద్రశాపాత్
కర్మణ్యవగ్రహధియో భగవన్ విదామః ।
ధర్మోపలక్షణమిదం త్రివృదధ్వరాఖ్యం
జ్ఞాతం యదర్థమధిదైవమదోవ్యవస్థాః ॥ 27

ఋత్విక్కులు పలికిరి :- నిరంజనుడా! నందీశ్వరుని శాపమువలన మా బుద్ధి కర్మల యందే ఆసక్త మైయున్నది. మేము మిగుల మూఢులము, అందువలన నీ తత్త్వమును తెలిసికొనలేకపోయితిమి. కాని మేము వేదప్రతిపాదితము, ధర్మమున కుపలక్షణభూతము నగు నీ యజ్ఞస్వరూపమును తెలిసికొంటిమి. నీ వీ యజ్ఞసిద్ధికై విభిన్నదేవతాధికారములతో తత్తదధికారోచితము లగు యజ్ఞభాగాదుల నేర్పాటుచేసితివి.

## శ్రీ సదస్యా ఊచుః

ఉత్పత్త్యధ్వన్యశరణ ఉరుక్లేశదుర్గేఽన్తకోగ్ర -
వ్యాలాన్విష్టే విషయమృగతృష్యాత్మ గేహోరుభారః ।
ద్వన్ద్వశ్వభ్రే ఖలమృగభయే శోకదావేఽజ్ఞసార్థః
పాదౌ కస్తే శరణద కదా యాతి కామోపసృష్టః ॥ 28

సభ్యులు పలికిరి :- జీవుల కాశ్రయము నిచ్చుదేవా! ఈ సంసార మార్గము దుస్సహము లగు క్లేశములతోగూడి చోరరాని దైయున్నది. కాలరూప మగు భయంకరసర్పము నిరంతరము పొంచియున్నది. ఈ స్థానమున సుఖదుఃఖాదులతోగూడిన గోతు లెన్నియో కలవు. దుర్జనరూపులగు నడవిజంతువులభయ మాస్థానమున నున్నది. శోకరూప మగుదావాగ్ని యెల్లపుడు ప్రజ్వరిల్లుచుండును. విషయములనెడు ఎండమావు లెల్లపుడును జీవులకాశ

గొలుపుచుండును. వానివలన నీ మార్గ మేవిధముగను విశ్రాంతికి స్థానముగాదు. అజ్ఞు లగు జీవులు జననమరణాదిలక్షణములతో గూడిన యీ సంసారమార్గమునందే దేహగేహాదుల భారముచే ఆక్రాంతలు కామప్రపీడితులు నై నివసించుచున్నారు. ఆహా! వారెప్పటికి నీ చరణ కమలముల నాశ్రయింతురోకదా!

## శ్రీ రుద్ర ఉవాచ

తవ వరద వరాఙ్ఘ్రా వాశిషేహాఖిలార్థే
హ్యపి మునిభిరసక్తైరాదరే ణార్హణీయే ।
యది రచితధియం మావిద్యలోకో౽పవిద్ధం
జపతి న గణయే తత్త్వత్పరానుగ్రహేణ ॥ 29

రుద్రుడు పలికెను :- వరదా! నీ చరణములు సకామపురుషులకు సర్వపురుషార్థముల నిచ్చునట్టివి. నిష్కాము లగుమునులు గూడ ఆదరముతో వానిని సేవించుచుందురు. మా మనస్సు సర్వాభీష్టప్రదము లగు నీ యీ చరణములయందు లగ్నమైయున్నది. మూర్ఖులాకారణమువలన మమ్ము సదాచారభ్రష్టులని చెప్పుచున్నారు. అయినను నేను నీయనుగ్రహము వలన వాని నేమాత్రమును లక్ష్యపెట్టను.

చ॥ *వరద నిరీహ యోగిజనవర్గసుపూజిత నీపదాబ్జముల్*
*నిరతము నంతరంగమున నిల్పి భవత్సదనుగ్రహాదిక*
*స్ఫురణఁ దనర్చునన్ను నతిమూఢు లవిద్యులు మున్నమంగళా*
*వరణుఁడటంచుఁ బల్కిన భవన్నతి నే గణియింప నచ్యుతా* (4-175)

## శ్రీ భృగురువాచ

యన్మాయయా గహనయాపహృతాత్మబోధా
బ్రహ్మాదయస్తనుభృతస్తమసి స్వపన్తః ।
నాత్మన్ శ్రితం తవ విదన్త్యధునాపి తత్త్వం
సో౽యం ప్రసీదతు భవాన్ ప్రణతాత్మబన్ధుః ॥ 30

భృగువు పలికెను :- దుస్తర మగు నీ మాయచే తత్త్వజ్ఞాన మాచ్ఛాదితమగుటవలన బ్రహ్మాదిదేహధారులు అజ్ఞానతిమిరమున శయనించుచున్నారు. నీ తత్త్వము వారియాత్మ యందు సుప్తరూపముతో నున్నను వారు నేటికిని ఆతత్త్వమును పొందలేకపోవుచున్నారు. అట్టి శరణాగతులను పాలించునీవు ప్రసన్నుడవగుము.

మ॥ *అరవిందోదర! తావకీనఘనమాయామోహితస్వాంతు లై*
*పరమం బైన భవన్మహామహిమముం బాటించి కానంగ నో*
*పరు బ్రహ్మాదిశరీరు లజ్ఞు లయి యో పద్మాక్ష భక్తార్తిసం*
*హరణాలోకన! నన్నుఁగావఁ దగు నిత్యానందసంధాయివై* (4-177)

## శ్రీ బ్రహ్మోవాచ

నైతత్స్వరూపం భవతోఽసౌపదార్థ -
భేదగ్రహైః పురుషో యావదీక్షేత్ ।
జ్ఞానస్య చార్థస్య గుణస్య చాశ్రయో
మాయామయాద్వ్యతిరిక్తో మతస్త్వమ్ ॥ 31

బ్రహ్మ పలికెను :- జీవుడు విషయగ్రాహకము లగు నింద్రియములద్వారా చూచున దంతయు నీ స్వరూపముగాదు. అసద్వస్తువే మాయామయమైనది. నీవు దానికంటె భిన్నుడ వని సత్పురుషులయభిప్రాయము. నీవు జ్ఞానమునకు, పదార్థమునకు, ఇంద్రియములకు నాశ్రయుడ వైయున్నావు.

## శ్రీ ఇంద్ర ఉవాచ

ఇదమప్యచ్యుత విశ్వభావనం
వపురానందకరం మనోదృశామ్ ।
సురవిద్విట్ క్షపణైరుదాయుధై -
ర్భుజదండైరుపపన్నమష్టభిః ॥ 32

ఇంద్రుడు పలికెను :- అచ్యుతా! నీవు ధర్మరక్షకుడవు, అధర్మనాశకుడవు, దేవతలను ద్వేషించు రాక్షసులను నాశనముచేయునట్టి, నానావిధము లగు నాయుధములను ధరించి నట్టి యెనిమిదిభుజదండములతో గూడుకొనినట్టి నీ యీశరీరము జగత్తునకు సుఖమును గలుగజేయునదియు, మనస్సులకు నేత్రములకు ఆనందమును గలుగజేయునదియు నైయున్నది.

మ॥ *దితిసంతానవినాశసాధనసముద్దీప్తాష్టబాహాసమ*
*న్వితమై యోగిమనోనురాగపద మై వెల్గొందునీ దేహ మా*
*యత మైనట్టిప్రపంచముంబలెను మిథ్యాభూతముంగామి శా*
*శ్వతముం గా మదిలోఁ దలంతు హరి దేవా దైవచూడామణీ.* (4-181)

## శ్రీ పత్న్య ఊచుః

యజ్ఞోఽయం తవ యజనాయ కేన సృష్టో
విధ్వస్తః పశుపతినాద్య దక్షకోపాత్ ।
తం నస్త్వం శవశయనాభశాన్త మేధం
యజ్ఞాత్మన్నలినరుచా దృశా పునీహి ॥ 33

ఋత్విక్కులభార్యలు పలికిరి:- యజ్ఞేశ్వరా! నిన్ను పూజించుటకే బ్రహ్మ పూర్వకాలమున ఈయజ్ఞమును సృష్టించెను. కాని దక్షునిపై గల కోపముచే మహాదేవుడు నేడు ఈ యజ్ఞమును ధ్వంసము చేసెను. ఇప్పుడు శ్మశానభూమివలె ఉత్సవహీనమై పశుహింసావిహీనమైన యీ యజ్ఞమును నీవు పద్మములవంటి కాంతిగల నేత్రములతో జూచి పవిత్రము చేయుము.

*చ॥ కడఁగి భవత్పదార్చనకుఁ గా నిటు దక్షునిచే రచింపఁగాఁ*
*బడి శితికంఠరోషమున భస్మము నొంది పరేతభూమి యై*
*చెడి కడు శాంతమేధమునఁ జెన్నఱియున్న మఖంబుఁ జూడు మే*
*ర్పడ జలజాభనేత్రములఁ బావన మై విలసిల్లు నచ్యుతా.* (4-183)

## శ్రీ ఋషయ ఊచుః

అనన్వితం తవ భగవన్ విచేష్టితం
యదాత్మనాచరసి హి కర్మనాజ్యసే ।
విభూతయే యత ఉపసేదురీశ్వరీం
న మన్యతే స్వయమనువర్తతీం భవాన్ ॥ 34

ఋషులు పలికిరి :- దేవా! నీ వాచరించినది అభూతపూర్వము. ఏలయన, నీవు నీ శరీరముతో పనిచేసినను ఆపనియందు లిప్తుడవుగావు. అన్యులు విభూతిని పొందు అభిలాషతో లక్ష్మీదేవిని సేవించుచుందురు. అట్టి లక్ష్మీదేవి స్వయముగ నేగుదెంచి నీ సేవకై తహతహలాడుచున్నది. కాని నీవు దానిని స్వీకరించుటలేదు.

*మ॥ అనఘా! మాధవ! నీవు మావలెనె కర్మారంభి వై యుండియున్*
*విను తత్కర్మఫలంబు బొంద వితరుల్ విశ్వంబునన్ భూతికై*
*యనయంబున్ భజియించునిందిర గరంబర్థిన్ నినుం జేర గై*
*కొనలే మందుము నీచరిత్రమునకున్ గోవింద పద్మోదరా.* (4-185)

## శ్రీ సిద్ధా ఊచుః

అయం త్వత్కథామృష్టపీయూషనద్యాం
మనోవారణః క్లేశదావాగ్నిదగ్ధః ।
తృషార్తోఽవగాఢో న సస్మార దావం
న నిష్క్రామతి బ్రహ్మసంపన్నవన్నః ॥ 35

సిద్ధులు పలికిరి :- దేవా! మా మనస్సనెడు ఏనుగు నానావిధము లగు క్లేశములనెడు దావానలముచే దగ్ధమగుచు దప్పికగొన్నదై నీ కథామృతమనునదిలోనికి ప్రవేశించి మునకలు వేయుచున్నప్పుడు దావాగ్ని తుల్యములగు సంసారక్లేశములు విస్మృతములగును. భగవత్సేవా సంపన్నుడగు వ్యక్తివలె నది నీ సేవను పరిత్యజించి యిక అన్యవిషయముల యందు ప్రవేశింపదు.

చ॥ *హరి భవదుఃఖభీషణదవానలదగ్ధతృషార్త మన్మనో*
*ద్విరదము శోభనంబును బవిత్రము నైనభవత్కథాసుధా*
*సరిదవగాహనంబునను సంసృతితాపము బాసి క్రమ్మఱం*
*దిరుగదు బ్రహ్మముం గనినధీరుని భంగిఁ బయోరు హోదరా.* (4-816)

## శ్రీ యజమాన్యువాచ

స్వాగతం తే ప్రసీదేశ తుభ్యం నమః
శ్రీనివాస శ్రియా కాన్తయా త్రాహి నః ।
త్వామృతేఽధీశ నాఙ్గైర్మఖః శోభతే
శీర్షహీనః కబన్ధో యథా పూరుషః ॥ 36

యజమానపత్ని పలికెను :- పరమేశ్వరా! నీకు స్వాగతము, నీకు నమస్కరించుచున్నాను, నాకు ప్రసన్నుడవుకమ్ము. శ్రీనివాసా! నీవు నీభార్య యగులక్ష్మీదేవితో గూడి మమ్ము రక్షింపుము. యజ్ఞేశ్వరా! మస్తక విహీనుడగు పురుషుడు కేవలము కరచరణాద్య వయవములచేత శోభింపనట్లు నీవు లేనిదే యజ్ఞమునకు శోభకలుగదు.

చ॥ *కరచరణాదికాంగములు గల్గియు మస్తకము లేనిమొండెముం*
*బరువడి నొప్ప కున్నగతిఁ బంకజలోచన నీవులేని య*
*ధ్వరము ప్రయాజులం గలిగి తద్దయు నొప్పక యున్న దీయెడన్*
*హరి యిటు నీదురాక శుభ మయ్యె రమాధిప మమ్ముఁ గావనే.* (4-187)

## శ్రీ లోకపాలా ఊచుః

దృష్టః కిం నో దృగ్భిరసద్గ్రహైస్త్వం
ప్రత్యగ్ద్రష్టా దృశ్యతే యేన విశ్వమ్ ।
మాయా హ్యేషా భవదీయా హి భూమన్
యస్త్వం షష్ఠః పంచభిర్భాసి భూతైః ॥ 37

లోకపాలురు పలికిరి :- పరమాత్మా! నీవు సర్వసాక్షి వగుటవలన నిఖిలప్రపంచము నెల్లపుడు దర్శించుచుందువు. ఇట్టినిన్ను మేము విషయాభిభూతములగు మా ప్రాకృతేంద్రియముల ద్వారా ఎట్లు చూడగలము? నీవు పంచభూతములకంటె భిన్నముగ నాఱవభూతముగ మాకు గనబడుచున్నావు. అదియును నీ మాయాప్రభావమే.

## శ్రీ యోగేశ్వరా ఊచుః

ప్రేయాన్నతేఽన్యోఽస్త్యముతస్త్వయి ప్రభో
విశ్వాత్మనీక్షేన్న పృథగ్య ఆత్మనః ।
అథాపి భక్త్యేశతయోపధావతా -
మనన్యవృత్త్యానుగృహాణ వత్సల ॥ 38

యోగేశ్వరులు పలికిరి :- ప్రభూ! ఎవడు నిఖిలజీవులకు నిలయమగు నీయందు జీవులను భిన్నముగ జూడడో, వానికంటె మించిన ఇష్టుడు నీకిక ఎవడున్నాడు. అయినను దేవా! భక్తప్రియా! అనన్య భక్తితో సేవించుమమ్ము ననుగ్రహింపుము.

వివరణము :- ప్రభూ! నీవు సర్వజీవుల కాలయస్వరూపుడవు. జీవులు నీయందే సేవకరూపముతో నిత్యము నివసించుచుందురు. అట్టి జీవులను నీ శక్తిస్వరూపులని భావించి నీకంటె అభిన్నముగ అనగా నీతో భేదాభేద సంబంధయుక్తమగు స్వరూపముతో నెవరు దర్శింతురో అట్టివారికంటె నీకిక ప్రియమైన వారెవ్వరును లేరు. అయినను, ఈశా! భక్తవత్సలా! మే మట్టి యచింత్యభేదాభేద తత్త్వముయొక్క అప్రాకృత సూక్ష్మత్వమును ధారణ చేయలేనివారమై, భేదవాదులమై నీ యందు అవ్యభిచారి యగు భక్తిని జూపుచున్నాము. మా మతము ననుసరించు నధికారిపై నీ వనుగ్రహమును జూపుదువుగాక!

జగదుద్భవస్థితిలయేషు దైవతో
బహుభిద్యమానగుణయాత్మమాయయా ।
రచితాత్మభేదమతయే స్వసంస్థయా
వినివర్తితభ్రమగుణాత్మనే నమః ॥ 39

దేవా! జగత్తుయొక్క ఉత్పత్తిస్థితిలయములకై జీవునియదృష్టము వలన నీ బహిరంగ మాయాగుణములు బహువిధములుగ నిర్భిన్నములై యున్నవి. నీవు సృష్ట్యాదికార్యమునకై ఆమాయచేతనే నీ స్వరూపమునందు జీవునకు భేదబుద్ధిని గలిగించుచున్నావు. అనగా జీవుడు నీ మాయాప్రభావముచే జడభేదవాదియై అచింత్యభేదాభేద రహస్యమును ధారణ చేయలేకపోవు చున్నాడు. అందువలన మేము నిన్ను శరణుజొచ్చితిమి. ఏలయన, జీవులు శుద్ధస్వరూపమునందున్న వారై నీ దయవలననే ద్వితీయాభినివేశమువలన గలిగిన భేదభ్రమనుండి నివృత్తిని పొందెదరు. అందువలన ఇట్టి మహిమాన్వితుడవగు నీకు మేము కేవలము నమస్కరించుచున్నాము.

## శ్రీ బ్రహ్మోవాచ

నమస్తే శ్రితసత్త్వాయ ధర్మాదీనాం చ సూతయే ।
నిర్గుణాయ చ యత్కాష్ఠాం నాహం వేదాపరేఽపి చ ॥ 40

బ్రహ్మపలికెను :- దేవా! విశుద్ధసత్త్వగుణమును స్వీకరించియున్న వాడవు, ధర్మాదుల నుత్పన్నము చేసినవాడవు, నిర్గుణస్వరూపుడవు నగు నీకు నమస్కారము. భగవానుడవగు నీయచింత్యతత్త్వమును నేను దెలిసి కొనలేదు. రుద్రాదిదేవతలు గూడ దానిని దెలిసికొనలేరు.

చ॥ *హరి భవదీయతత్త్వము సమంచితభక్తి నెఱుంగ నేను నా*
*సరసిజసంభ వాదులును జాలము సత్త్వగుణాశ్రయుండవున్*
*బరుఁడవు నిర్గుణండవును బ్రహ్మము నై తగు నీకు నెపుడు నిం*
*దఱముఁ జతుర్విధార్థఫలదాయక మ్రొక్కెద మాదరింపవే.* (4-195)

## శ్రీ అగ్నిరువాచ

యత్తేజసాహం సుసమిద్ధతేజా
హవ్యం వహే స్వధ్వర ఆజ్యసిక్తమ్ ।
తం యజ్ఞియం పంచవిధం చ పంచభిః
స్విష్టం యజుర్భిః ప్రణతోఽస్మి యజ్ఞమ్ ॥ 41

అగ్ని పలికెను :- దేవా! నీతేజస్సుచే ప్రజ్వరిల్లి నేను యజ్ఞములయందు దేవతలకడకు ఘృతసిక్త మగుహవిస్సును దీసికొనిపోవు చున్నాను. నీవు సాక్షాత్తుగ యజ్ఞపురుషుడవు; యజ్ఞరక్షకుడవు. అగ్నిహోత్రము, దర్శము, పౌర్ణమాసము, చాతుర్మాస్యములు, పశుసోమము నను పంచవిధయజ్ఞ స్వరూపుడవు. "ఆశ్రావయ, అస్తు, శ్రౌషట్, యజే, యజా మహే,

వషట్" అనునైదు విధములగు యజుర్మంత్రములతో నీవే పూజింప బడుచున్నావు. అట్టి నీకు నేను నమస్కరించుచున్నాను.

*మ॥ హవరక్షాచరణుండ వై నెగడు దీ వయ్యగ్నిహోత్రాదిపం*
*చ విధంబున్ మఱిమంత్ర పంచక ను సృష్టం బై తగం బొల్చు నా*
*హవరూపం బగునీకు మ్రొక్కెదను నీయాజ్ఞన్ భువిన్ హవ్యముల్*
*సవనవ్రాతములన్ వహింతు హరి యుష్మత్తేజముం బూనుచున్.* (4-197)

## శ్రీదేవా ఊచుః

పురా కల్పాపాయే స్వకృతముదరీకృత్యవికృతం
త్వమేవాద్యస్తస్మిన్ సలిల ఉరగేన్ద్రాధిశయనే ।
పుమాన్ శేషే సిద్ధైర్హృది విమృశితాధ్యాత్మపదవిః
స ఏవాద్యాక్ష్ణోర్యః పథి చరసి భృత్యానవసి నః 42

దేవతలు పలికిరి :- ఆదిపురుషడవగు నీవు పూర్వకల్ప మంతము కాగా భిన్నాకారముగ పరిణమించిన సమస్త కార్యమును నీయుదరమున లీనము చేసికొని కారణార్ణవజలమునందు శేషశయ్యపై పరుండితివి. సనకాది సిద్ధులు జ్ఞానమార్గముతో తమతమ మనస్సులయందు నిన్నెల్లప్పుడు చింతించు చుందురు. అట్టి ఆదిపురుషడవగు నీవు మానేత్రములకు విషయమై విహరించుచు నీ సేవకుల మగుమమ్ము రక్షించుచున్నావు.

*మ॥ మును కల్పాంతమునందుఁ గుక్షి నఖిలంబున్ దాచి యేకాకి వై*
*జనలోకోపరిలోక వాసులును యుష్మత్తత్త్వమార్గంబు చిం*
*తనముం జేయఁ బయోధియందు నహిరాట్తల్పంబు నం బవ్వళిం*
*చిననీ రూపము నేడు చూపితివి లక్ష్మీనాథ దేవోత్తమా* (4-199)

## శ్రీగన్ధర్వాప్సరస ఊచుః

అంశాంశాస్తే దేవ మరీచ్యాదయ ఏతే
బ్రహ్మేన్ద్రాద్యా దేవగణా రుద్రపురోగాః ।
క్రీడాభాండం విశ్వమిదం యస్య విభూమన్
తస్మై నిత్యం నాథ నమస్తే కరవామ ॥ 43

గంధర్వులు, అప్సరసలు పలికిరి:- దేవా! మరీచ్యాదిప్రజాపతులు, రుద్రప్రముఖులు, బ్రహ్మ, ఇంద్రుడు మున్నగుదేవతలు నీయంశాంశలు. ఈ విశ్వము నీక్రీడకు సాధనము. నాథా! నీకు మేము నమస్కరించు చున్నాము.

మ॥ *హరపంకేజభవామరాదులు మరీచ్యాదిప్రజానాథులో*
*యరవిందాక్ష రమాహృదీశ భవదీయాంశాంశ సంభూతు లై*
*పరఁగం దావకలీలకై నెగడునీ బ్రహ్మాండమున్ దేవ యీ*
*శ్వర నీకే మతిభక్తి మ్రొక్కెదము దేవాధీశ రక్షింపుమా.* (4-201)

## శ్రీ విద్యాధరా ఊచుః

త్వన్మాయయార్థ మభిపద్య కలేవరేఽస్మిన్
కృత్వా మమాహమితి దుర్మతిరుత్పథైః స్వైః ।
క్షిప్తోఽప్యసద్విషయలాలస ఆత్మమోహం
యుష్మత్కథామృతనిషేవక ఉద్వ్యుదస్యేత్ ॥ 44

విద్యాధరులు పలికిరి :- దేవా! దుర్మతి యగుమానవుడు పురుషార్థ సాధనమున కుపాయస్వరూప మగు దేహమును పొందియు దుర్మార్గులగు తనపుత్రుల ద్వారా దుఃఖమును పొందును. అయినను అతడు ఈ దేహమునందు నేను నాది యను అభిమానమును జూపుచు అనిత్యవిషయముల యందాసక్తి గలిగియుండును. కాని నీకథామృతమును ద్రావనిచ్ఛగల పురుషుడట్టి దేహాభిమానరూప మగు మోహమును పూర్తిగ త్యజించును.

## శ్రీ బ్రాహ్మణా ఊచుః

త్వం క్రతుస్త్వం హవిస్త్వం హుతాశః స్వయం
త్వం హి మన్త్రః సమిద్దర్భపాత్రాణి చ ।
త్వం సదస్యర్త్విజో దంపతీ దేవతా
అగ్నిహోత్రం స్వధా సోమ ఆజ్యం పశుః ॥ 45

బ్రాహ్మణులు పలికిరి :- ప్రభూ! నీవే యజ్ఞస్వరూపుడవు, నీవు హవిస్సువు, నీవే అగ్నివి, నీవే మంత్రము, నీవే సమిధవు, నీవే యజ్ఞపాత్రవు, నీవే సదస్యుడవు, నీవే ఋత్విజుడవు, నీవే భార్యాసహితుడైన యజమానివి, నీవే దేవతవు, నీవే అగ్నిహోత్రుడవు, నీవే స్వధవు, నీవే సోమరసము, నీవే ఘృతము, నీవే యజ్ఞపశు స్వరూపుడవు నై యున్నావు.

త్వం పురా గాం రసాయా మహాసూకరో
దంష్ట్రయా పద్మినీం వారణేన్ద్రో యథా ।
స్తూయమానో నదల్లీలయా యోగిభి -
ర్వ్యుజ్జహర్థ త్రయీగాత్ర యజ్ఞక్రతుః ॥ 46

వేదమూర్తీ! యూపయుక్తమగు యజ్ఞమునీవే లేదా యజ్ఞ సంకల్ప స్వరూపడవు నీవే. గజేంద్ర మవలీలగ తామరపూవును పెకలించి వేయునట్లు నీవుగూడ లీలతో మహాసూకర రూపమును ధరించి గర్జించుచు పూర్వకాలమున కోఱలచివరలతో రసాతలమునకు వెడలిన పుడమిని లేవనెత్తితివి. అపుడు యోగులు నిన్ను స్తుతింపసాగిరి.

స ప్రసీద త్వమస్మాకమాకాంక్షతాం
దర్శనం తే పరిభ్రష్టసత్కర్మణామ్ ।
కీర్త్యమానే నృభిర్నామ్ని యజ్ఞేశ తే
యజ్ఞవిఘ్నాః క్షయం యాన్తి తస్మై నమః ॥ 47

యజ్ఞేశ్వరా! అట్టినీవు మాకిపుడు ప్రసన్నుడవు కమ్ము. మా యజ్ఞము భ్రష్టమైనది. దానికై మేమిపుడు నీదర్శనమును గోరుచుంటిమి. నీ నామమును గీర్తించుమానవుల యజ్ఞవిఘ్నములు పూర్తిగ నశించును. అట్టి ప్రభావశాలి వగు నీకు నమస్కరించుచున్నాము.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఇతి దక్షః కవిర్యజ్ఞం భద్ర రుద్రాభిమర్శితమ్ ।
కీర్త్యమానే హృషీకేశే సన్నిన్యే యజ్ఞభావనే ॥ 48

మైత్రేయుడు పలికెను :- విదురా! ఈవిధముగ నందఱు సర్వ యజ్ఞేశ్వరుడగు హృషీకేశుని గుణములను గీర్తించుచుండగా ప్రాజ్ఞుడగు దక్షుడు వీరభద్రునిచే నాశము చేయబడిన యజ్ఞమును మరల ప్రారంభించెను.

భగవాన్ స్వేన భాగేన సర్వాత్మా సర్వభాగభుక్ ।
దక్షం బభాష ఆభాష్య ప్రీయమాణ ఇవానఘ ॥ 49

అనఘా! విదురా! సర్వదేవతల కాత్మయు, సర్వభాగములను భుజించువాడు నగు విష్ణుభగవానుడు తనభాగమును భుజించి తృప్తిచెందిన వానివలె దక్షుని బిలచి యిట్లు పలికెను.

## శ్రీ భగవానువాచ

**అహం బ్రహ్మ చ శర్వశ్చ జగతః కారణం పరమ్ ।**
**ఆత్మేశ్వర ఉపద్రష్టా స్వయం దృగవిశేషణః ॥ 50**

భగవానుడు పలికెను :- నేను జగత్తునకు పరమకారణుడను, ఆత్మను, ఈశ్వరుడను, సాక్షిస్వరూపుడను, స్వయంప్రకాశుడను, జడోపాధి రహితుడను, అప్రాకృత వస్తువును, నేనే బ్రహ్మను, శివుడనునై యున్నాను.

**ఆత్మమాయాం సమావిశ్య సోఽహం గుణమయీం ద్విజ ।**
**సృజన్ రక్షన్ హరన్ విశ్వం దధ్రే సంజ్ఞాం క్రియోచితామ్ ॥ 51**

అట్టినేను గుణమయ మగునాత్మమాయను స్వీకరించి యీ జగత్తును సృష్టించుచున్నాను, పాలించుచున్నాను, సంహరించుచున్నాను. నేనే ఆ పనులకు దగిన సంజ్ఞలను (బ్రహ్మ విష్ణు శివనామములను)ధరించుచున్నాను.

**తస్మిన్ బ్రహ్మణ్యద్వితీయే కేవలే పరమాత్మని ।**
**బ్రహ్మరుద్రౌ చ భూతాని భేదేనాజ్ఞో ఽనుపశ్యతి ॥ 52**

నే నద్వయజ్ఞానతత్త్వ స్వరూపుడను. నేనొక్కడనే స్వతంత్రుడనగు భగవానుడను. బ్రహ్మరుద్రాదు లందఱు నాయధీనమున నాయందే యున్నారు. అజ్ఞులగు వ్యక్తులే బ్రహ్మరుద్రాది జీవుల నందఱిని నాకంటె భిన్నులు లేదా స్వతంత్రులునని భావించుచున్నారు.

**యథా పుమాన్న స్వాంగేషు శిరః పాణ్యాదిషు క్వచిత్ ।**
**పారక్యబుద్ధిం కురుతే ఏవం భూతేషు మత్పరః ॥ 53**

ఏ మానవుడైనను తన శిరస్సు, చేతులు మున్నగు నవయవములలో "ఇది నాకంటె భిన్నమైన" దని భావింపడు అట్లే నా భక్తుడు గూడ సర్వభూతముల యందును భేదబుద్ధిని గలిగియుండడు. అనగా బ్రహ్మరుద్రాది దేవతలను, జీవులను నాకంటె స్వతంత్రులని భావింపడు. (అద్వయజ్ఞాన స్వరూపుడనగు నాయందే భేదాభేద సంబంధము గలవారై దేవతలు జీవులు నాయందే నివసించుచున్నారు.)

**త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదామ్ ।**
**సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాన్తిమధిగచ్ఛతి ॥ 54**

మహాత్మా! (మేము మువ్వురము అచింత్యభేదాభేద సంబంధ విశిష్టులము), సర్వభూతముల కాత్మస్వరూపులమగు మా ముప్పురిలో నెవడు భేదమును జూడడో అతడు శాంతిని పొందును.

## శ్రీ మైత్రేయ ఉవాచ

**ఏవం భగవతాదిష్టః ప్రజాపతిపతిర్హరిమ్ ।**
**అర్చిత్వా క్రతునా స్వేన దేవానుభయతోఽయజత్ ॥ 55**

మైత్రేయుడు పలికెను :- విదురా! విష్ణుభగవానుడిట్లాజ్ఞాపింపగా ప్రజాపతి ముఖ్యుడగు దక్షుడు "త్రికపాల" మను యజ్ఞముద్వారా శ్రీహరిని అర్చించెను. పిమ్మట "అంగము, ప్రధానము" అను రెండు విధములగు యజ్ఞముల ద్వారా దేవతలను పూజించెను.

**రుద్రం చ స్వేన భాగేన హ్యుపధావత్సమాహితః**
**కర్మణోదవసానేన సోమపా నితరానపి ।**
**ఉదవస్య సహర్త్విగ్భిః సస్నావవభృథం తతః ॥ 56**

పిమ్మట సమాహిత చిత్తముతో శంకరుని యొక్క యజ్ఞశిష్టభాగము ద్వారా ఆయనను పూజించెను. యజ్ఞసమాపక కర్మద్వారా సోమపానము చేయువారిని, అన్యదేవతలను అర్చించుటయందు ప్రవృత్తుడయ్యెను. అంతమున ఋత్విక్కులతో గూడ దక్షుడు అవభృథ స్నానము చేసెను.

**తస్మా అప్యనుభావేన స్వేనైవావాప్త రాధసే ।**
**ధర్మ ఏవ మతిం దత్త్వా త్రిదశాస్తే దివం యయుః ॥ 57**

దక్షుడు తన భగవదారా ధనప్రభావముచేతనే అభీష్టసిద్ధులను పొందెను. అయినను దేవతలు వానికి "ధర్మమునం దెల్లపుడు నీ బుద్ధి లగ్నమగుగాక" యని వరమునిచ్చి స్వర్గమునకు వెడలిరి.

**ఏవం దాక్షాయణీ హిత్వా సతీ పూర్వకలేవరమ్ ।**
**జజ్ఞే హిమవతః క్షేత్రే మేనాయామితి శుశ్రుమ ॥ 58**

విదురా! దక్షునిపుత్రిక యగు సతీదేవి వెనుకచెప్పిన విధముగ దేహమును పరిత్యజించిన పిమ్మట హిమవంతుని భార్యయగు మేనకకు జన్మించెనని నేను వింటిని.

**తమేవ దయితం భూయ ఆవృఙ్క్తే పతిమంబికా ।**
**అనన్యభావైక గతిం శక్తిః సుప్తేవ పూరుషమ్ ॥ 59**

ప్రళయకాలమున సుప్తయైన ప్రకృతి మరల కారణార్ణవశాయియగు పురుషుని ఆశ్రయించినట్లు సతీదేవియు మరల అనన్యభజన పరాయణుడగు వాని కేకైకశరణ్యుడు, ప్రియతముడు, వైష్ణవశ్రేష్ఠుడు నగు శంభువునే పతిగా సేవించెను.

**ఏతద్భగవత: శంభో: కర్మదక్షాధ్వరద్రుహ: ।**
**శ్రుతం భాగవతాచ్ఛిష్యాదుద్ధవాన్మే బృహస్పతే: ॥ 60**

దక్షయజ్ఞవినాశకుడగు రుద్రదేవుని యీ చరిత్రను నేను బృహస్పతికి శిష్యుడు, పరమభాగవతుడు నగు ఉద్ధవుని వలన వింటిని.

**ఇదం పవిత్రం పరమీశచేష్టితం**
**యశస్య మాయుష్యమఘౌఘమర్షణమ్ ।**
**యో నిత్యదాకర్ణ్య నరోఽనుకీర్తయే -**
**ద్ధునోత్యఘం కౌరవభక్తిభావత: ॥ 61**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్ర భాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థ స్కంధే దక్షయజ్ఞసంధానం నామ
సప్తమోఽధ్యాయ: ॥

విదురా! పరమపవిత్రము, కీర్తికరము, ఆయుర్వర్ధకము, పాపనాశకమునగు ఈ శంకరుని చరిత్రను భక్తిభావముతో నిత్యము శ్రవణము, కీర్తనము చేయు వ్యక్తి తనయొక్క, ఇతరులయొక్క సాంసారిక క్లేశములను నాశనముచేయ సమర్థుడగును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని ఏడవ అధ్యాయము
సమాప్తము.



# ఎనిమిదవ అధ్యాయము

## ధ్రువుడు అరణ్యమునకు వెడలుట.

కథాసారము :- ఈయధ్యాయమున సవతితల్లి పరుష వాక్కులను విని రోషపరవశుడై ఐదు సంవత్సరముల వయస్సు గల ధ్రువుడు పట్టణమును విడచి అరణ్యమునకు వెడలుట, తపస్సుచేయుట, దానిద్వారా హరి సంతోషించుట అనువిషయములు వర్ణితములైనవి.

స్వాయంభువమనువు తనభార్య యగు శతరూపవలన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనునిరువురు పుత్రులను గనెను. ఉత్తానపాదునకు సునీతి, సురుచి అనునిరువురు భార్యలు గలరు. సురుచికి ఉత్తముడు, సునీతికి ధ్రువుడు అనుపుత్రులు జన్మించిరి. సురుచిని రాజు గాఢముగా ప్రేమించుచుండెను. సునీతి, తత్పుత్రుడగు ధ్రువుడు సురుచియొక్క మాత్సర్యమువలన ఎవ్వరికిని ప్రీతిభాజనులు కాలేకపోయిరి. సవతితల్లి యగుసురుచి యొక్కవాగ్బాణములచే బాధితుడై బాలుడగు ధ్రువుడు తల్లి యుపదేశము ననుసరించి సర్వదుఃఖ నివారకుడు, పద్మపలాశ లోచనుడునగు శ్రీహరి నారాధించుటకు వనమునకు వెడలెను. అచట దేవర్షి యగునారదుడు వానికి హరిసాధన విషయమును బోధించి దీక్షనిచ్చెను. ఇట్లు సాధుసాంగత్యమును పొందిన ధ్రువుడు శ్రేయఃపథమును తెలిసికొనినవాడై మధువనమున మధుమురహరుడగు శ్రీహరియారాధనయందు మగ్నుడయ్యెను. ఆయన కఠోర తపస్సుచే దేవతాద్యు పరిలోకములందున్న జనులు మహావిస్మయాన్వితులైరి. ధ్రువుడు ప్రగాఢమగు భక్తియోగముచే శ్వాసను నిరోధించి సర్వాత్ముడగు శ్రీనాథుని పాదపద్మధ్యానముచే సమాధిస్థితుడయ్యెను. లోకపాలురతో గూడ సమస్తజీవులశ్వాస ఆగిపోయెను. దేవతలు దీనికి గారణమును తెలిసికొనలేక పోయినవారై పరమేశ్వరుడగు శ్రీహరిని శరణుజొచ్చిరి. శరణాగతవత్సలు డగు భగవానుడపుడు వారికి ధైర్యము చెప్పుచు నిట్లు పలికెను:- "బాలుడగు ధ్రువుడు నాయందు మనస్సునుంచి సమాధిస్థితు డయ్యెను. వాని శ్వాసనిరోధము వలన మీశ్వాసకు గూడ ఆటంక మేర్పడెను. భయపడవలదు. ఈ దుష్కరమగు తపస్సునుండి వానిని నేను మఱలింతును."

### శ్రీ మైత్రేయ ఉవాచ

సనకాద్యా నారదశ్చ ఋభుర్హంసోఽరుణిర్యతిః ।
నైతే గృహాన్ బ్రహ్మసుతా హ్యావసన్నూర్ధ్వ రేతసః ॥ 1

మైత్రేయుడు పలికెను :- విదురా! సనకాదులు, నారదుడు, ఋభువు, హంసుడు, అరుణి, యతి అను వీరందఱు బ్రహ్మదేవుని పుత్రులు, ఊర్ధ్వరేతస్కులు. వీరు గృహస్థాశ్రమమును స్వీకరింపలేదు.

**మృషాఽధర్మస్య భార్యాసీద్దంభం మాయాం చ శత్రుహన్ ।**
**అసూత మిథునం తత్తు నిర్ఋతిర్జగృహేఽప్రజాః ॥ 2**

జితేంద్రియుడవగు విదురా! అధర్మమునకు మిథ్య యనునొక భార్యయుండెను. ఈమిథ్య దంభుడను పుత్రుని, మాయయను పుత్రికను గనినది. వీరిరువురికి భార్యాభర్తల సంబంధ మేర్పడెను. సంతానము లేకపోవుటచే నిర్ఋతియనువాడు ఆదంభుని, మాయను తనసంతానముగా జేసికొనెను.

**తయోః సమభవల్లోభో నికృతిశ్చ మహామతే ।**
**తాభ్యాం క్రోధశ్చ హింసా చ యద్దురుక్తిః స్వసా కలిః ॥ 3**

ఆ మాయాదంభులకు లోభుడను పుత్రుడు, నికృతి (శఠత) యనుకన్య జన్మించిరి. వారివలన క్రోధుడు, హింస ఉద్భవించిరి. వారివలన కలి, ఆ కలికి సోదరి యగుదురుక్తి జన్మించిరి.

**దురుక్తౌ కలిరాధత్త భియం మృత్యుం చ సత్తమ ।**
**తయోశ్చ మిథునం జజ్ఞే యాతనా నిరయస్తథా ॥ 4**

సత్పురుషశ్రేష్ఠుడవగు విదురా! ఈ దురుక్తివలన కలి భీతి (భయము) అనుకన్యను, మృత్యువను కుమారుని గనెను. వీరివలన యాతన యనుపుత్రిక, నరక మనుపుత్రుడు ఉద్భవించిరి.

**సంగ్రహేణ మయాఖ్యాతః ప్రతిసర్గస్తవానఘ ।**
**త్రిఃశ్రుత్వైతత్పుమాన్ పుణ్యం విధునోత్యాత్మనో మలమ్ ॥ 5**

అనఘా! నేను నీకు ప్రళయమునకు హేతుభూత మగు ఈయధర్మ వంశమును గూర్చి సంక్షేపముగ జెప్పితిని. మానవు లీయ ధర్మవంశచరిత్రను ముమ్మారు విన్నచో వారియాత్మ మాలిన్యము నశించును.

**అథాతః కీర్తయే వంశం పుణ్యకీర్తేః కురూద్వహ ।**
**స్వాయంభువస్యాపి మనోర్హరేరంశాంశజన్మనః ॥ 6**

కురుకులశ్రేష్ఠా! పిమ్మట నేను పుణ్యమయకీర్తియు, శ్రీహరియంశాంశ వలన జన్మించినవాడునగు స్వాయంభువ మనువు వంశమును వర్ణింతును.

ప్రియవ్రతోత్తానపాదౌ శతరూపాపతేః సుతౌ ।
వాసుదేవస్య కలయా రక్షాయాం జగతః స్థితౌ ॥ 7

శతరూప భర్తయగు స్వాయంభువ మనువుకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనునిరువురు పుత్రులు భగవానుడగు వాసుదేవుని యంశతో జన్మించి యీ పృథివిని పాలించుటయందు నియుక్తులయిరి.

జాయే ఉత్తానపాదస్య సునీతిః సురుచిస్తయోః ।
సురుచిః ప్రేయసీ పత్యుర్నేతరా యత్సుతో ధ్రువః ॥ 8

ఉత్తానపాదునకు సునీతి, సురుచి యనునిరువురు భార్యలు గలరు. వారిలో సురుచి ప్రభువునకు మిగుల ప్రీతిపాత్రురాలయ్యెను. కాని రెండవ భార్యయగు సునీతి సురుచివలె కాలేకపోయెను. ధ్రువుడు ఆసునీతియొక్క కుమారుడే.

ఏకదా సురుచేః పుత్రమంకమారోప్య లాలయన్ ।
ఉత్తమం నారురుక్షన్తం ధ్రువం రాజాభ్యనన్దత ॥ 9

ఒకనాడు రాజగు ఉత్తానపాదుడు సురుచికుమారుడైన ఉత్తముని ఒడిలో గూర్చుండ బెట్టుకొని ముద్దాడుచుండెను. ఇంతలో సునీతికుమారుడగు ధ్రువుడు గూడ తండ్రితొడపై గూర్చుండ నభిలషించెను. కాని రాజు (సురుచి భయముతో) వానిని ఆదరింపలేకపోయెను.

తథా చికీర్షమాణం తం సపత్న్యాస్తనయం ధ్రువమ్ ।
సురుచిః శృణ్వతో రాజ్ఞః సేర్ష్యమాహాతిగర్వితా ॥ 10

అపుడు సవతికొడు కగు ధ్రువుడు రాజుతొడపై గూర్చొనదలంచుచున్నా డనితలంచి అతిగర్విత యగుసురుచి ఈర్ష్యగలదియై రాజుసమక్షమునందే వానితో నిట్లనెను.

న వత్స నృపతేర్ధిష్ణ్యం భవానారోఢుమర్హతి ।
న గృహీతో మయా యత్త్వం కుక్షావపి నృపాత్మజః ॥ 11

వత్సా ! ధ్రువా ! నీవు రాజకుమారుడవైనను నాగర్భమునందు జన్మింపకపోవుటచే రాజుయొక్క తొడపై నెక్కుటకు తగవు.

బాలోఽసి బత నాత్మానమన్యస్త్రీ గర్భసంభృతమ్ ।
నూనం వేద భవాన్ యస్య దుర్లభేఽర్థే మనోరథః ॥ 12

అయ్యో ! నీవు బాలుడవు, అన్యస్త్రీకి జన్మించితి వనినీకు తెలియదా ? అయినను నీ విట్టిపొందరానివిషయము నభిలషించుచున్నావు.

తపసారాధ్య పురుషం తస్యై వానుగ్రహేణ మే ।
గర్భే త్వం సాధయాత్మానం యదీచ్ఛసి నృపాసనమ్ ॥ 13

వత్సా ! నీ వీరాజసింహాసనమును కోరుచున్నచో తపస్సుచే భగవాను నారాధించి, ఆయన యనుగ్రహముచే నాగర్భమున జన్మింపుము.

*కం॥ అది గాన నీవధోక్షజు*
*పదపద్మము లాశ్రయింపు పాయక హరి నా*
*యుదరమునఁ బుట్టఁజేయును*
*వదలక యట్లయిన ముదము వడసెద వనఘా.* (4-220)

**శ్రీ మైత్రేయ ఉవాచ**

మాతుః సపత్న్యాః సుదురుక్తి విద్ధః
శ్వసన్ రుషా దండహతో యథాహిః ।
హిత్వా మిషన్తం పితరం సన్నవాచం
జగామ మాతుః స రుదన్ సకాశమ్ ॥ 14

మైత్రేయుడు పలికెను :- విదురా ! సవతితల్లి యగుసురుచి పలికిన యిట్టియసంబద్ధ వాక్కులచే ధ్రువునిహృదయము మిగుల కలతచెందెను. తండ్రి యామె మాటలను వినుచుండెనే కాని తా నొక్కమాట యైనను బదులుపలుకజాలకపోయెను. ఇదిచూచి ధ్రువుడు దెబ్బదినిన సర్పమువలె క్రోధముతో నిట్టూర్పులను విడచుచు, కన్నీరు గార్చుచు తనతల్లి కడకు వెడలెను.

తం నిఃశ్వసన్తం స్ఫురితాధరోష్ఠం
సునీతిరుత్సంగముదూహ్య బాలమ్ ।
నిశమ్య తత్పౌరముఖాన్నితాన్తం
సా వివ్యథే యద్గదితం సపత్న్యాః ॥ 15

సునీతి నిట్టూర్పులను విడచుచున్నవాడు, వణకుచున్న అధరోష్ఠము గలవాడు నగు ధ్రువుని జూచి, యొడిలోనికి దీసికొని, సవతి యగుసురుచి పలికినమాటలను అంతఃపురస్త్రీలు చెప్పగా విని, ఆమెయు మిగుల బాధ చెందెను.

సోత్సృజ్య ధైర్యం విలలాప శోక -
దావాగ్నినా దావలతేవ బాలా ।
వాక్యం సపత్న్యాః స్మరతీ సరోజ -
శ్రియా దృశా బాష్పకలాముువాహ ॥ 16

దావాగ్నినడుమనున్న లతవలె సునీతి శోకాగ్నిచే ధైర్యమును విడచి దుఃఖించెను. సవతి పలుకులను స్మరించుచు ఆమె కమలములవలె సుందరములైన నేత్రములనుండి బాష్పములను విడువసాగెను.

దీర్ఘం శ్వసన్తీ వృజినస్య పార-
మపశ్యతీ బాలకమాహ బాలా ।
మామంగలం తాత పరేషు మంస్థా
భుంక్తే జనో యత్పరదుఃఖదస్తత్ ॥ 17

నిట్టూర్పులను విడచుచు దుఃఖమున కంతము గనుగొనలేనిదై ఆమె ధ్రువునితో నిట్లు పలికెను :- "వత్సా! ఇతరులు నీ కపకారము చేసినా రని భావింపవలదు. జీవుడు పూర్వజన్మమున ఎవరికైన గష్టమును గలిగించినచో అతడీ జన్మమున అట్టి దుఃఖమును తప్పక అనుభవించును.

*కం॥ అనఘా యీ దుఃఖమునకుఁ*
*బని లే దన్యులకు సొలయ బలవంతం బై*
*తనపూర్వజన్మదుష్కృత*
*ఘనకర్మము వెంట నంటఁగా నెవ్వలనన్.* (4-228)

సత్యం సురుచ్యాభిహితం భవాన్మే
యద్దుర్భగాయా ఉదరే గృహీతః ।
స్తన్యేన వృద్ధశ్చ విలజ్జతే యాం
భార్యేతి వా వోఢుమిడస్పతిర్మామ్ ॥ 18

నాయనా! నీ వీదురదృష్టవంతురాలి కడుపున జన్మించితివి. ఈమె స్తన్యముతో పోషింపబడితివి. సురుచి పలికినది సత్యమే. రాజు నన్ను భార్యగనేకాక దాసిగ స్వీకరించుటకుగూడ సిగ్గుపడుచున్నాడు.

ఆతిష్ఠ తత్తాత విమత్సరస్త్వ -
ముక్తం సమాత్రాపి యదవ్యలీకమ్ ।
ఆరాధయాధోక్షజపాదపద్మం
యదీచ్ఛసే ఽధ్యాసనముత్తమో యథా ॥ 19

కనుక కుమారా! నీవు ఉత్తమునివలె రాజసింహాసనమును పొంద దలచినచో మాత్సర్యమును విడువుము. సవతితల్లి యైనను ఆమె నీకు "అతీంద్రియుడగు శ్రీహరిభగవానుని పాదపద్మములను సేవింప" మని చెప్పినమాట సత్యమైనదే. దానిని నీవు తప్పక అనుష్ఠింపుము.

యస్యాంఘ్రిపద్మం పరిచర్య విశ్వ -
విభావనాయాత్తగుణాభిపత్తేః ।
అజోఽధ్యతిష్ఠత్ఖలు పారమేష్ఠ్యం
పదం జితాత్మశ్వసనాభివన్ద్యమ్ ॥ 20

అధోక్షజుడగు ఆ శ్రీహరి భగవానుడు జగత్పాలన నిమిత్తమై సత్త్వగుణమును స్వీకరించెను. మనఃప్రాణములను జయించు యోగులచే అభివంద్యుడగు ఆ శ్రీహరి పాదపద్మములను సేవించి బ్రహ్మ సర్వోత్కృష్ట మగుపదవిని పొందెను.

తథా మనుర్వో భగవాన్ పితామహో
యమేకమత్యా పురుదక్షిణైర్మఖైః ।
ఇష్ట్వాభిపేదే దురవాపమన్యతో
భౌమం సుఖం దివ్యమథాపవర్గ్యమ్ ॥ 21

బ్రహ్మ భగవాను నారాధించి పారమేష్ఠ్యపదవిని పొందినాడు. నీ పితామహుడగు మనువు దక్షిణాబహుళము లగు యజ్ఞముల జేసి ఏకాగ్రచిత్తుడై ఆ శ్రీహరి నారాధించి, ఇతరులకు లభింపని లౌకికా లౌకిక సుఖములను, మోక్షసుఖమును పొందెను.

తమేవ వత్సాశ్రయ భృత్యవత్సలం
ముముక్షుభిర్మృగ్యపదాబ్జపద్ధతిమ్ ।
అనన్యభావే నిజధర్మభావితే
మనస్యవస్థాప్య భజస్వ పూరుషమ్ ॥ 22

ధ్రువా! ముముక్షువులగు వ్యక్తులుగూడ ఆ భగవానుని పాదపద్మముల మార్గమును అన్వేషించుచుందురు. నీవుగూడ అన్యవస్తువునం దాసక్తిని వదలి, స్వధర్మపాలనముచే పవిత్రమైన చిత్తమున భక్తవత్సలుడగు ఆ శ్రీహరిని నిలుపుకొని ఆయననే సేవింపుము.

నాన్యం తతః పద్మపలాశలోచనా -
ద్దుఃఖచ్ఛిదం తే మృగయామి కంచన ।
యో మృగ్యతే హస్తగృహీతపద్మయా
శ్రియేతరైరంగ విమృగ్యమానయా ॥ 23

కుమారా! పద్మపత్రలోచనుడగు ఆ శ్రీహరితప్ప మఱియెవ్వరును నీ దుఃఖమును నివారించువారు లేరు. బ్రహ్మాదిదేవతలు ఏ మహాలక్ష్మిని ప్రణిహితచిత్తముతో ధ్యానించుచుందురో అట్టి మహాలక్ష్మిగూడ దీపతుల్యమగు పద్మమును హస్తమునందు ఇడికొని స్వయముగ ఆ శ్రీహరిని అన్వేషించుచుండును.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఏవం సంజల్పితం మాతురాకర్ణ్యార్థాగమం వచః ।
సంనియమ్యాత్మనాత్మానం నిశ్చక్రామ పితుః పురాత్ ॥ 24

మైత్రేయుడు పలికెను :- విదురా! తా నభిలషించు వస్తువును పొందుటకు తగినమార్గమును జూపునట్టి తనతల్లి పలికిన వాక్కులను విని ధ్రువుడు తన బుద్ధిద్వారా చిత్తమునకు ధైర్యమును గలుగజేసి తండ్రినగరమునుండి బయల్వెడలెను.

నారదస్తదుపాకర్ణ్య జ్ఞాత్వా చాస్య చికీర్షితమ్ ।
స్పృష్ట్వా మూర్ధన్యఘఘ్నేన పాణినా ప్రాహ విస్మితః ॥ 25

ధ్రువు డిట్లు గృహమునుండి వెడలిపోవుచున్నాడను విషయమును, వాని భగవదారాధనవిషయమును నగరవాసులవలన విని దేవర్షి యగు నారదుడు మిగుల విస్మితుడై అచటికి వెడలి అమంగళవినాశక మగు హస్తముచే ధ్రువుని మస్తకమును స్పృశించి యిట్లు పలుకసాగెను.

అహో తేజః క్షత్రియాణాం మానభంగమమృష్యతామ్ ।
బాలోఽ ప్యయం హృదా ధత్తే యత్సమాతురసద్వచః ॥ 26

ఆహా! అభిమానము భంగమగుట సహింపని క్షత్రియుల తేజస్సు ఎంతటి యాశ్చర్యకరమైనది? ధ్రువుడు బాలుడయ్యును సవతితల్లి పలికిన ఆ తిరస్కారవాక్కులిపుడు వాని హృదయమున నాటుకొనెను.

## శ్రీ నారద ఉవాచ

నాధునాప్యవమానం తే సమ్మానం చాపి పుత్రక ।
లక్షయామః కుమారస్య సక్తస్య క్రీడనాదిషు ॥ 27

నారదుడు పలికెను :- వత్సా! ధ్రువా! నీవిపుడు ఐదు సంవత్సరముల బాలుడవు. ఆటలయం దాసక్తుడవై యున్నావు. ఈ వయస్సులో నీ కవమానముగాని మానముగాని గలుగవని నేను తలంచుచున్నాను.

కం॥ *విను పుత్రక బాలుఁడవై*
*యనయంబును గ్రీడలందు నాసక్తమనం*
*బునఁ దిరిగెడు నిక్కాలం*
*బున నీకవమానమానములు లే వెందున్.* (4-237)

వికల్పే విద్యమానేఽపి న హ్యసన్తోషహేతవః ।
పుంసో మోహమృతే భిన్నా యల్లోకే నిజకర్మభిః ॥ 28

మానావమానవివేక మున్నచో మానవుని అసంతోషమునకు కారణము మోహముతప్ప మఱియేదియు గాదు. జగత్తులో తానుఅనుష్ఠించు కర్మలవలననే జీవునకు మానావమానములు, సుఖదుఃఖములు కలుగును.

తే॥ *కాన మనమునఁ దద్వివేకంబు నీకుఁ*
*గలిగెనేని సంతోషకలితులయిన ।*
*పురుషు లాత్మీయ కర్మవిస్ఫురణఁ జేసి*
*వితతసుఖదుఃఖము లనుభవింతు రెపుడు* (4-28)

పరితుష్యేత్తతస్తాత తావన్మాత్రేణ పూరుషః ।
దైవోపసాదితం యావద్వీక్ష్యేశ్వరగతిం బుధః ॥ 29

ధ్రువా! దైవానుకూలత లేనిదే యెట్టిప్రయత్నము ఫలప్రదము కాదను విషయమును పరిశీలించి, తన ప్రార్బద్ధము ననుసరించి లభించిన దానితోనే మానవుడు సంతుష్టి చెందుట ఉచితము.

అథ మాత్రోపదిష్టేన యోగేనావరురుత్ససి ।
యత్ప్రసాదం స వై పుంసాం దురారాధ్యో మతో మమ ॥ 30

అంతియకాక తల్లియుపదేశము ననుసరించి నీవేయుపాయముతో ఏ భగవానుని యనుగ్రహమును పొంద నభిలషించుచున్నావో ఆ భగవానుని మానవ మాత్రుడైనవాడు సంతోషపెట్టుట చాలకష్టమైన విషయము.

**మునయః పదవీం యస్య నిస్సంగేనోరుజన్మభిః ।**
**న విదుర్మృగయన్తోఽపి తీవ్రయోగసమాధినా ॥ 31**

ఏలయన, మునులు పూర్తిగ అనాసక్తులై తీవ్రయోగయుక్తమగు సమాధిద్వారా బహుజన్మలనుండి అన్వేషించినను ఆ భగవానుని మార్గమును తెలిసికొనలేక పోవుచున్నారు.

**అతో నివర్తతామేష నిర్బన్ధస్తవ నిష్ఫలః ।**
**యతిష్యతి భవాన్ కాలే శ్రేయసాం సముపస్థితే ॥ 32**

అందువలన నీవు నీ యీ నిష్ఫలమగు పట్టుదలను వదులుము. ధర్మానుష్ఠానమునకు ఉపయుక్తమగు వార్ధక్యము వచ్చినపుడు ఈ విషయమునకై ప్రయత్నము చేయుము.

**యస్య యద్దైవవిహితం స తేన సుఖదుఃఖయోః ।**
**ఆత్మానం తోషయన్ దేహీ తమసః పారమృచ్ఛతి ॥ 33**

సుఖదుఃఖములలో దైవవశమున ప్రారబ్ధానురూపముగ లభించిన దానితో సంతృప్తిచెందుచు మానవుడు సంసారమును తరించును.

**గుణాధికాన్ముదం లిప్సేదనుక్రోశం గుణాధమాత్ ।**
**మైత్రీం సమానాదన్విచ్ఛేన్న తాపైరభిభూయతే ॥ 34**

తనకంటె అధికగుణ సంపన్నుడగు వ్యక్తిని జూచి వానిపై ప్రేమ జూపునట్టివాడు, తనకంటె గుణహీనుడగు వానిని జూచి వానిపై కృపజూపువాడు, తనతో సమానుడైన గుణవంతునితో మైత్రినెఱపువాడు నగు మానవు డెట్టి సంతాపమును పొందడు.

## శ్రీ ధ్రువ ఉవాచ

**సోఽయం శమో భగవతా సుఖదుఃఖహతాత్మనామ్ ।**
**దర్శితః కృపయా పుంసాం దుర్దర్శోఽస్మద్విధైస్తు యః ॥ 35**

ధ్రువుడు పలికెను :- సుఖదుఃఖములచే వివేకము నశించిన పురుషులపై గల కృపచే నీవు జూపిన ఆత్మసంతోష లక్షణరూపమగు శాంతిమార్గము నావంటివారి విషయమున మిగుల దుర్లభము.

అథాఽపి మేఽ వినీతస్య క్షాత్రం ఘోరముపేయుషః ।
సురుచ్యా దుర్వచో బాణైర్నభిన్నే శ్రయతే హృది ॥ 36

నేను సహింపరాని లక్షణములతో గూడిన క్షాత్రస్వభావమును పొందితిని. అందువలన నేను సహజముగనే దుర్వినీతుడను. పైగా సురుచి దుర్వాక్యబాణములచే నా హృదయము దెబ్బతినినది. అట్టి హృదయమున నీయుపదేశములకు స్థానముండదు.

పదం త్రిభువనోత్కృష్టం జిగీషోః సాధు వర్త్మ మే ।
బ్రూహ్యస్మత్పితృభిర్బ్రహ్మన్నన్యైరప్యనధిష్ఠితమ్ ॥ 37

మహాత్మా! నా తాతతండ్రు లెవ్వరును పొందలేనిదియు, మూడు లోకములలో ఉత్కృష్ట మైనదియు నగు స్థానమును పొంద నభిలషించు చున్నాను. దానికై నీవు నాకు సులభమైన మార్గమును జెప్పుము.

నూనం భవాన్ భగవతో యోఽఙ్గజః పరమేష్ఠినః ।
వితుదన్నటతే వీణాం హితాయ జగతోఽర్కవత్ ॥ 38

నీ వైశ్వర్యశాలి యగు బ్రహ్మదేవునకు గుమారునిగ జన్మించితివి. లోకహితమునకై వీణను మ్రోగించుచు సూర్యునివలె ముల్లోకములలోను తిరుగుచుందువు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఇత్యుదాహృతమాకర్ణ్య భగవాన్ నారదస్తదా ।
ప్రీతః ప్రత్యాహ తం బాలం సద్వాక్య మనుకంపయా ॥ 39

మైత్రేయుడు పలికెను :- ఈ మాటలు విని భక్తశ్రేష్ఠుడగు నారదుడు మిగుల సంతుష్టి చెంది, దయతో బాలుడగు ఆ ధ్రువునకు హిత ముపదేశించెను.

## శ్రీ నారద ఉవాచ

జనన్యాభిహితః పన్థాః స వై నిఃశ్రేయసస్య తే ।
భగవాన్ వాసుదేవస్తం భజ తం ప్రవణాత్మనా ॥ 40

నారదుడు పలికెను :- ధ్రువా! నీతల్లి యగుసునీతి నీకు ఆత్యంతిక క్షేమమును గూర్చి చెప్పినది. అది యొక్కటియే సుకరమైన మార్గము. అది వాసుదేవుని ఆరాధనా లక్షణభక్తియోగము. అందువలన నీవు ఏకాగ్ర చిత్తముతో ఆ వాసుదేవుని భజింపుము.

ధర్మార్థకామ మోక్షాఖ్యం య ఇచ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః ।
ఏకం హ్యేవ హరేస్తత్ర కారణం పాదసేవనమ్ ॥ 41

ధర్మార్థకామ మోక్షరూపమగు తనశ్రేయస్సును కాంక్షించువాడు విష్ణు భగవానుని పాదపద్మములనే సేవింపవలెను. అదితప్ప వేఱుమార్గము లేదు.

కం॥ *పురుషుఁడు దవిలి చతుర్విధ*
*పురుషార్థశ్రేయ మాత్మఁబొందెద ననినన్,*
*ధరఁ దత్ప్రాప్తికి హేతువు*
*హరిపదయుగళంబు దక్క నన్యము గలదే* (4-244)

**తత్తాత గచ్ఛ భద్రం తే యమునాయాస్తటం శుచి ।**
**పుణ్యం మధువనం యత్ర సాన్నిధ్యం నిత్యదా హరేః ॥ 42**

అందువలన కుమారా! నీకు శుభమగుగాక! నీవు యమునాతటమునం దున్న పరమపావన మగు మధువనమునకు వెడలుము. అచట శ్రీహరి యెల్లపుడు నివసించు చుండును.

**స్నాత్వానుసవనం తస్మిన్ కాలిన్ద్యాః సలిలే శివే ।**
**కృత్వోచితాని నివసన్నాత్మనః కల్పితాసనః ॥ 43**

**ప్రాణాయామేన త్రివృతా ప్రాణేన్ద్రియమనో మలమ్ ।**
**శనైః వ్యుదస్యాభిధ్యాయేన్మనసా గురుణా గురుమ్ ॥ 44**

వత్సా! నీ వామధువనమునకు వెడలి మొదట కాళిందీ పవిత్రజలముల యందు మూడువేళల స్నానముచేసి కర్తవ్యకర్మలను పూర్తిచేసి కొనుము. పిమ్మట ఆసనము నేర్పఱచుకొని దానియందు గూర్చుండుము. అనంతరము రేచకము, పూరకము, కుంభకము ననువానితో గూడిన ప్రాణాయామము ద్వారా ప్రాణేంద్రియ మనస్సుల చాంచల్యమును నిరోధించి స్థిరచిత్తముతో క్రమముగ జగద్గురు వగు వాసుదేవుని ధ్యానింపుము.

**ప్రసాదాభిముఖం శశ్వత్ ప్రసన్నవదనేక్షణమ్ ।**
**సునసం సుభ్రువం చారు కపోలం సురసున్దరమ్ ॥ 45**

**తరుణం రమణీయాంగమరుణోష్ఠేక్షణాధరమ్ ।**
**ప్రణతాశ్రయణం నృమ్ణం శరణ్యం కరుణార్ణవమ్ ॥ 46**

**శ్రీవత్సాంకం ఘనశ్యామం పురుషం వనమాలినమ్ ।**
**శంఖచక్రగదాపద్మై రభివ్యక్తం చతుర్భుజమ్ ॥ 47**

**కిరీటినం కుండలినం కేయూరవలయాన్వితమ్ ।**
**కౌస్తుభాభరణగ్రీవం పీతకౌశేయవాససమ్ ॥ 48**

**కాంచీకలాప పర్యస్తం లసత్కాంచననూపురమ్ ।**
**దర్శనీయతమం శాన్తం మనోనయన వర్ధనమ్ ॥ 49**

**పద్భ్యాం నఖమణిశ్రేణ్యా విలసద్భ్యాం సమర్చతామ్ ।**
**హృత్పద్మకర్ణికాధిష్ణ్యమాక్రమ్యాత్మన్యవస్థితమ్ ॥ 50**

**స్మయమానమభిధ్యాయేత్సానురాగావలోకనమ్ ।**
**నియతేనైకభూతేన మనసా వరదర్షభమ్ ॥ 51**

వరము నిచ్చుటకు సిద్ధముగ నున్నవాడును; ఎల్లపుడు ప్రసన్నమైన ముఖము చూపులు కలవాడును; మంచిముక్కు, మంచికనుబొమలు, సుందరములైన చెక్కిళ్లు గలవాడును; దేవతలలో సుందరమైన వాడును; తరుణుడైన వాడును; రమణీయములైన అవయవములు గలవాడును; ఎఱ్ఱనిపెదవులు కన్నులు గలవాడును; భక్తుల కాశ్రయమిచ్చువాడును; సర్వపురుషార్థములకు నిలయమైనవాడును; శరణ్యుడును; దయాసాగరుడును; శ్రీవత్సలాంఛనము గలవాడును; మేఘమువలె శ్యామల వర్ణము గలవాడును; వనమాలను ధరించినవాడును; శంఖచక్రగదాపద్మముల చేత అభివ్యక్తమైన చతుర్భుజములు గలవాడును; కిరీటము, కుండలములు, కేయూరములు గలవాడును; కౌస్తుభాభరణము కంఠమునందు గలవాడును; పచ్చని పట్టువస్త్రమును ధరించినవాడును; మొలనూలుచే జుట్టబడిన కటిప్రదేశము గలవాడును; ప్రకాశించు బంగారు అందెలు గలవాడును; దర్శనీయులలో శ్రేష్ఠుడైనవాడును, శాంతమైనవాడును; మనస్సునకు నేత్రములకు ఆనందమును వృద్ధిచేయువాడును; నఖమణిశ్రేణులతో విలసిల్లు పాదములద్వారా భక్తుల హృదయపద్మముల నధివసించువాడును; మధ్యస్థానము నాక్రమించి మనస్సున నున్నవాడును; చిఱునవ్వుతో గూడినవాడును, అనురాగముతో గూడినచూపులు గలవాడును; వరముల నిచ్చువారిలో శ్రేష్ఠుడును అగు ఆ శ్రీహరిని వెనుక జెప్పిన ధారణచే ఏకాగ్రమైన మనస్సుతో విశేషముగ ధ్యానింపవలెను.

**ఏవం భగవతో రూపం సుభద్రం ధ్యాయతో మనః ।**
**నిర్వృత్యా పరయా తూర్ణం సంపన్నం న నివర్తతే ॥ 52**

ఇట్లు మంగళప్రద మగు భగవానుని రూపమును ధ్యానించుచుండగ శీఘ్రముగనే నీ మనస్సు పరమశాంతిని పొందును, ధ్యేయవస్తువుయొక్క ధ్యానము ఎప్పుడును విడువదు.

**జపశ్చ పరమో గుహ్యః శ్రూయతాం మే నృపాత్మజ !**
**యం సప్తరాత్రం ప్రపఠన్ పుమాన్ పశ్యతి ఖేచరాన్ ॥ 53**

రాజకుమారా! ఉత్కృష్టము, గుహ్యము నగు మంత్రమును గూడ ఉపదేశింతును వినవలసినది. ఈ మంత్రమును ఏడు రాత్రులు జపించినచో నీవపుడు ఆకాశమున విహరించు భగవత్పార్షదులను దర్శింపగలవు.

"ఓం నమో భగవతే వాసుదేవాయ"

మన్త్రేణానేన దేవస్య కుర్యాద్ద్రవ్యమయీం బుధః ।
సపర్యాం వివిధైర్ద్రవ్యైర్దేశకాలవిభాగవిత్ । 54

"ఓం నమో భగవతే వాసుదేవాయ" యను మంత్రము ద్వారా దేశకాల విభాగముల నెఱింగినవాడును, పండితుడును అగు వ్యక్తి వివిధములగు ద్రవ్యములతో వాసుదేవునకు ద్రవ్యమయ మగు అర్చనను చేయవలెను.

సలిలైః శుచిభిర్మాల్యైర్వన్యైర్మూలఫలాదిభిః ।
శస్తాంకురాంశుకైశ్చార్చేత్తులస్యా ప్రియయా ప్రభుమ్ ॥ 55

పవిత్రము లగు జలములు, పుష్పమాలలు, వనములో పుట్టిన కందమూలఫలాదులు, ప్రశస్తములగు దూర్వాంకురములు, వనమున లభించు వల్కలములు, భగవంతునకు ప్రియ మగు తులసి మున్నగు పూజోపకరణముల ద్వారా వాసుదేవు నర్చింపవలెను.

లబ్ధ్వా ద్రవ్యమయీ మర్చాం క్షిత్యంబ్వాదిషు వార్చయేత్ ।
ఆభృతాత్మా మునిః శాన్తో యతవాఙ్మితవన్యభుక్ ॥ 56

శిలాదులచే నిర్మిత మగుప్రతిమను పొంది సంయతచిత్తుడు, శాంతుడు, మనన శీలుడు, వాక్కును నిగ్రహించినవాడు, పరిమిత మగు ఫలమూలాదులను భుజించువాడునై దానిని పూజింపవలెను. అది లభింపనిచో మృత్తికాజలాదులతో శ్రీమన్నారాయణుని అర్చింపవలెను.

స్వేచ్ఛావతార చరితై రచిన్త్య నిజమాయయా ।
కరిష్యత్యుత్తమ శ్లోకస్తద్ధ్యాయేద్ధృదయంగమమ్ ॥ 57

అచింత్య మగుతనశక్తి నాశ్రయించి భగవానుడు తన యిచ్ఛ ననుసరించి అవతారములను, లీలలను లోకమున ప్రకటించెను. ఉత్తమశ్లోకుడగు భగవానుని ఆయా యవతారములను, మనోహరము లగు చరిత్రలను ధ్యానింపవలెను.

పరిచర్యా భగవతో యావత్యః పూర్వసేవితాః ।
తా మన్త్రహృదయేనైవ ప్రయుంజాన్మన్త్ర మూర్తయే ॥ 58

భగవానుని పూజకై యేయే పరిచర్యలను ప్రాచీనులు నియమించిరో వానిని పూర్వోక్త మగు ద్వాదశాక్షర మంత్రముద్వారా మంత్రమూర్తి యగు ఆ భగవానున కర్పింపవలెను.

**ఏవం కాయేన మనసా వచసా చ మనోగతమ్ ।**
**పరిచర్యమాణో భగవాన్ భక్తిమత్పరిచర్యయా ॥ 59**

**పుంసామమాయినాం సమ్యగ్భజతాం భావవర్ధనః ।**
**శ్రేయో దిశత్యభిమతం యద్ధర్మాదిషు దేహినామ్ ॥ 60**

వెనుకజెప్పిన ప్రణాళిక ననుసరించి మనోవాక్కాయముల ద్వారా భక్తితో అర్చించినచో భగవానుడు గర్వము లేనియూ పురుషులకు ధర్మార్థ కామమోక్షములలో వారు గోరినదాని నిచ్చును. భగవద్భక్తుల పాదముల నాశ్రయించి భగవాను నర్చించినచో ఆయన వారి మనోగత భావమును పెంచును. (అనగా వారికి ముక్తి కంటెను శ్రేష్ఠమగు ప్రేమభక్తిని ప్రసాదించును.)

**విరక్తశ్చేంద్రియరతౌ భక్తియోగేన భూయసా ।**
**తం నిరన్తరభావేన భజేతాద్ధా విముక్తయే ॥ 61**

ధర్మార్థకామము లను విషయసుఖముల యందు చివరకు, మోక్షము నందును విరక్తి చెందిన మానవుడు ప్రేమభక్తిని పొందుటకై జ్ఞానకర్మాది వ్యవధానము లేనిభక్తి యోగముతోను, ఐకాంతిక భావముతోను శ్రీహరిని సేవింపవలెను.

**ఇత్యుక్తస్తం పరిక్రమ్య ప్రణమ్య చ నృపార్భకః ।**
**యయౌ మధువనం పుణ్యం హరేశ్చరణచర్చితమ్ ॥ 62**

దేవర్షియగు నారదు డిట్లుపదేశింపగా రాజకుమారుడగు ధ్రువు డాయనకు ప్రదక్షిణ ప్రణామము లొనరించి శ్రీహరిచరణ చిహ్నములచే చిహ్నితమైన మధువనమునకు వెడలెను.

**తపోవనం గతే తస్మిన్ ప్రవిష్టోఽన్తః పురం మునిః ।**
**అర్హితార్హణకో రాజ్ఞా సుఖాసీన ఉవాచ హ ॥ 63**

ధ్రువుడు తపోవనమునకు వెడలగా దేవర్షియగు నారదుడు అంతఃపురము లోనికి వెడలి అచట రాజిచ్చిన అర్ఘ్యాదులను స్వీకరించి ఆసనమునందు ఉపవిష్టుడై రాజగుఉత్తాన పాదునితో ఇట్లు చెప్పసాగెను.

## శ్రీ నారద ఉవాచ

రాజన్ కిం ధ్యాయసే దీర్ఘం ముఖేన పరిశుష్యతా ।
కిం వా న రిష్యతే కామో ధర్మో వార్థేన సంయుతః ॥ 64

నారదుడు పలికెను :- రాజా! నీముఖము వాడిపోయినట్లుగ కనపడుచున్నది. ఏల దీర్ఘముగ ఆలోచించుచున్నావు? నీ ధర్మార్థకామములకు నష్టము వాటిల్లలేదుకదా!

## శ్రీ రాజోవాచ

సుతో మే బాలకో బ్రహ్మన్ స్త్రైణేనాకరుణాత్మనా ।
నిర్వాసితః పంచవర్షః సహ మాత్రా మహాన్ కవిః ॥ 65

రాజు పలికెను :- మహాత్మా! నేను భార్యకు వశుడనై నిర్దయతో ఐదుసంవత్సరముల వయస్సు గలవాడు, బుద్ధిమంతుడునగు నాకుమారుని వాని తల్లితోగూడ వెడలగొట్టితిని.

అప్యనాథం వనే బ్రహ్మన్ మాస్మాదన్త్యర్భకం వృకాః ।
శ్రాన్తం శయానం క్షుధితం పరిమ్లానముఖాంబుజమ్ ॥ 66

మహాత్మా! అనాథుడు, సుశీలుడు, క్షుధార్తుడు, మ్లానవదనుడునగు బాలుని వ్యాఘ్రాదిక్రూరమృగములు వనములో భక్షింపక ఉండునా?

మః *చని యుగ్రాటవిఁ జొచ్చి యచటఁ బరిశ్రాంతుండు క్షుత్పీడితుం*
*డును సంమ్లానముఖాంబుజుండు ననఘుండున్ బాలకుండైన మ*
*త్తనయున్ ఘోరవృకాహిభల్లముఖసత్త్వశ్రేణి భక్షించెనో*
*యని దుఃఖించెద నాదుచిత్తమున నార్యస్తుత్య యిట్లొటకున్* (4-261)

అహో మే బత దౌరాత్మ్యం స్త్రీజితస్యోపధారయ ।
యోఽఙ్కం ప్రేమ్ణాఽఽరురుక్షన్తం నాభ్యనన్ద మసత్తమః ॥ 67

ఆహా! నేను భార్యకు వశుడనై యెంతక్రూరముగ ప్రవర్తించితినో జూడుము ? దుష్టుడ నగునేను ప్రేమతో తొడపై కెక్కదలచిన ధ్రువుని ఆదరింపలేకపోయితిని గదా!

## శ్రీ నారద ఉవాచ

మా మా శుచః స్వతనయం దేవగుప్తం విశాంపతే ।
తత్ప్రభావమవిజ్ఞాయ ప్రావృఙ్క్తే యద్యశో జగత్ ॥ 68

నారదుడు పలికెను :- మహారాజా ! దైవముచే రక్షితు డగు నీకుమారుని, వానిప్రభావమును తెలిసికొన లేకున్నావు. వానికీర్తి జగత్తంతట వ్యాపించును. అట్టివానినిగూర్చి దుఃఖింపవలదు.

సుదుష్కరం కర్మ కృత్వా లోకపాలైరపి ప్రభుః ।
ఏష్యత్యచిరతో రాజన్ యశో విపులయంస్తవ ॥ 69

రాజా! లోకపాలురకుగూడ అసాధ్య మగు భగవదారాధనారూప మగు కర్మ నొనరించి ధ్రువుడు నీకీర్తిని విస్తరింపజేయుచు త్వరలోనె తిరిగి రాగలడు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఇతి దేవర్షిణా ప్రోక్తం విశ్రుత్య జగతీపతిః ।
రాజలక్ష్మీమనాదృత్య పుత్రమేవాన్వచిన్తయత్ ॥ 70

మైత్రేయుడు పలికెను :- విదురా! ఉత్తానపాదుడు దేవర్షియగు నారదుడు చెప్పినవిషయమును విని రాజలక్ష్మినిగూడ తిరస్కరించి నిరంతరము పుత్రునిగూర్చియే ఆలోచింపసాగెను.

తత్రాభిషిక్తః ప్రయతస్తాముపోష్య విభావరీమ్ ।
సమాహితః పర్యచరదృష్యాదేశేన పూరుషమ్ ॥ 71

ధ్రువుడు యమునానదికడకు వెడలి దానిలో స్నానముచేసి పవిత్రుడు, ఏకాగ్రచిత్తుడు నై యారాత్రి యుపవసించెను. నారదుని యుపదేశము ననుసరించి పురుషోత్తముడగు శ్రీహరి యారాధనమున ప్రవృత్తుడయ్యెను.

త్రిరాత్రాన్తే త్రిరాత్రాన్తే కపిత్థబదరాశనః ।
ఆత్మవృత్త్యనుసారేణ మాసం నిన్యేఽర్చయన్ హరిమ్ ॥ 72

ధ్రువుడు మూడుదినముల కొక్కసారి వెలగపండ్లను, రేగుపండ్లను ఆహారముగ స్వీకరించుచు ఏదియోవిధముగ దేహయాత్ర గడపుచు శ్రీహరి యర్చనయందు మొదటిమాసమును గడిపెను.

ద్వితీయం చ తథామాసం షష్ఠే షష్ఠేఽర్భకో దినే ।
తృణపర్ణాదిభిః శీర్ణైః కృతాన్నోఽభ్యర్చయన్ విభుమ్ ॥ 73

రెండవనెల ఆరంభము కాగా ధ్రువుడు ఆఱుదినముల కొక్కమాఱు వృక్షమునుండి స్వయముగ పడిన ఎండుటాకులను, తృణాదులను ఆహారముగ స్వీకరించుచు భగవానుని సేవింపసాగెను. ఇట్లు రెండవనెలను గడిపెను.

తృతీయం చానయన్ మాసం నవమే నవమేఽహని ।
అబ్భక్ష ఉత్తమః శ్లోకముపాధావత్సమాధినా ॥ 74

పిమ్మట మూడవనెలలో తొమ్మిదిదినముల కొక్కమాఱు జలమును త్రావుచు ఏకాగ్రచిత్తముతో ఉత్తమశ్లోకుడగు భగవానుని యారాధన యందు తత్పరుడై యుండెను.

చతుర్థమపి వై మాసం ద్వాదశే ద్వాదశేఽహని ।
వాయుభక్షో జితశ్వాసో ధ్యాయన్ దేవమధారయత్ ॥ 75

నాల్గవమాసమున పండ్రెండుదినముల కొక్కమారు వాయువును భక్షించుచు శ్వాసను జయించి నారాయణుని ధ్యానముద్వారా ఆరాధింప సాగెను.

పంచమే మాస్యనుప్రాప్తే జితశ్వాసో నృపాత్మజః ।
ధ్యాయన్ బ్రహ్మపదైకేన తస్థౌ స్థాణురివాచలః ॥ 76

ఐదవనెలలో ప్రాణముల జయించి ధ్రువుడొంటికాలిపై స్థాణువు వలె నిశ్చలముగ నుండి పరబ్రహ్మమును ధ్యానింపసాగెను.

సర్వతో మన ఆకృష్య హృది భూతేన్ద్రియాశయమ్ ।
ధ్యాయన్ భగవతో రూపం నాద్రాక్షీత్కించ నాపరమ్ ॥ 77

శబ్దాదిభూతములకు, చక్షురాదులైన యింద్రియములకు విశ్రాంతి స్థలమగు మనస్సును విషయములనుండి మరల్చి హృదయమున నిల్పి కేవలము భగవద్ధ్యానతత్పరుడగుట వలన ధ్రువుడు భగవద్రూపమును దప్ప మఱియే బాహ్యవిషయమునుగూడ జూడలేదు.

ఆధారం మహదాదీనాం ప్రధానపురుషేశ్వరమ్ ।
బ్రహ్మధారయమాణస్య త్రయో లోకాశ్చకంపిరే ॥ 78

ఇట్లు ప్రకృతి పురుషులకు ఈశ్వరు (కారణు)డైనవాడు, మహదాదులకు గూడ ఆధారుడైనవాడు అగు పరబ్రహ్మమును ధ్యానించుచుండగా ముల్లోకములు వానితేజస్సును సహింపజాలనివియై కంపింపసాగెను.

యదైకపాదేన స పార్థివాత్మజ -
స్తస్థౌ తదంగుష్ఠనిపీడితా మహీ ।
ననామ తత్రార్ధమిభేన్ద్రధిష్ఠితా
తరీవ సవ్యేతరతః పదే పదే ॥ 79

రాజకుమారుడగు ధ్రువుడు ఒంటికాలిపై నిలబడి యుండగా వాని కాలిబొటనవ్రేలి యొత్తిడిచే సగముభూమి, గజరా జెక్కగా పడవ అటునిటు వంగునట్లు క్రుంగిపోయెను.

**తస్మిన్నభిధ్యాయతి విశ్వమాత్మనో**
**ద్వారం నిరుధ్యాసుమనన్యయా ధియా ।**
**లోకా నిరుచ్ఛ్వాసనిపీడితా భృశం**
**సలోకపాలాః శరణం యయుర్హరిమ్ ॥ 80**

ధ్రువుడు ప్రాణములను, ప్రాణద్వారములను నిరోధించి విశ్వాత్ముడగు విష్ణుభగవానుని ధ్యానించుచుండెను. అపుడు లోకపాలురతో గూడ సర్వజీవుల నిట్టూర్పులు నిలచిపోయెను. దానివలన వారు మిగుల పీడితులై శ్రీహరిని శరణుజొచ్చిరి.

## శ్రీదేవా ఊచుః

**నైవం విదామో భగవన్ ప్రాణరోధం**
**చరాచరస్యాఖిలసత్త్వధామ్నః ।**
**విధేహి తన్నో వృజినాద్విమోక్షం**
**ప్రాప్తా వయం త్వాం శరణం శరణ్యమ్ ॥ 81**

దేవతలు పలికిరి :- దేవా! సర్వచరాచర జీవుల కిట్లు ప్రాణనిరోధ మేర్పడుట మేమింతకు పూర్వ మెన్నడును చూడలేదు. నీవు శరణాగత పాలకుడవు. మేము నిన్ను శరణుజొచ్చితిమి. ప్రాణనిరోధము వలన గలిగిన కష్టమునుండి మమ్ముద్ధరింపుము.

## శ్రీ భగవానువాచ

**మాభైష్ట బాలం తపసో దురత్యయా-**
**న్నివర్తయిష్యే ప్రతియాత స్వధామ ।**
**యతో హి వః ప్రాణనిరోధ ఆసీ-**
**దౌత్తానపాదిర్మయి సంగతాత్మా ॥ 82**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే ధ్రువచరితే
అష్టమోఽధ్యాయః॥

భగవానుడు పలికెను :- దేవతలారా! మీ యీ ప్రాణనిరోధమునకు గారకుఁడయిన ఆబాలు నిప్పుడే తపస్సునుండి విరమింపజేతును. నేను విశ్వాత్ముఁడను. ఉత్తానపాదుని కుమారుడగు ధ్రువుడిపుడు ధ్యాన యోగముతో, ఏకాంతభావముతో నాయందు మనస్సును నిలిపి యున్నాడు. అందువలన మీరు వానికి భయపడవలసిన అవసరము లేదు. మీరు మీ మీ నెలవులకు వెడలుడు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని యెనిమిదవ
అధ్యాయము సమాప్తము.





# తొమ్మిదవ అధ్యాయము

## ధ్రువుడు వరమును పొంది, ఇంటికి తిరిగి వెడలుట.

కథాసారము :- ఈ యధ్యాయమున ధ్రువుడు భగవానుని స్తుతించి, ఆయననుండి వరముల పొంది, తండ్రి రాజ్యమునకు దిరిగివచ్చి, పితృదత్తమగు రాజ్యమును స్వీకరించుట యను విషయములు వర్ణితములైనవి.

ధ్రువుడు సమాధియోగమున శ్రీహరి రూపమును దర్శించు చుండెను. ఇంతలో శ్రీహరి స్వయముగ ప్రత్యక్షమై వాని కపోలములను స్పృశించెను. దానివలన ధ్రువునకు వెంటనే పరావిద్య కలిగెను. అతడు నారాయణుని స్తుతింప నారంభించెను. "శ్రీనారాయణుడు సర్వాభీష్ట ప్రదాత. ఆయనను నరకమును పొందించు విషయభోగముల నడుగుట మూఢత్వమే యగును. భక్తసాంగత్యమున నుండి హరికథలను వినుటవలన గలుగు ఆనందము మిగుల శ్రేష్ఠమైనది. దానితో బ్రహ్మానందముగూడ సాటిరాదు; ఇక స్వర్గసుఖమన్న హీనాతిహీన మైనదే. భక్తులతోగూడి హరికథను వినుట, కీర్తించుట యనునదే జీవుడు కోరదగిన వస్తువు. హరిసేవకులు దేహమును, గృహమును, పుత్రకళత్రాదులను గూర్చి యెప్పుడును ఆలోచింపరు. భగవానుడే మాయాధీశుడు. జీవుడు మాయావశుడు. భగవత్సేవయే జీవుని నిత్యకర్తవ్యము" అని యిట్లు స్తుతించి ధ్రువుడు భగవానుని శరణుజొచ్చెను. శ్రీహరి ధ్రువున కొక అపూర్వధామమును, సుదీర్ఘజీవితమును, సాటిలేని సామ్రాజ్యభోగములను అనుభవించు వరము నొసంగి యంతర్హితుడయ్యెను. అనంతర మతడు తండ్రిరాజధానికి తిరిగివచ్చి అందఱిద్వారా సంవర్ధితుడయ్యెను. ఉత్తానపాదుడు పుత్రునకు రాజసింహాసనమిచ్చి, తాను తప మొనరించుటకై అడవికి వెడలెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

త ఏవముత్సన్నభయా ఉరుక్రమే
కృతావనామాః ప్రయయుస్త్రివిష్టపమ్ ।
సహస్రశీర్షాపి తతో గరుత్మతా
మధోర్వనం భృత్యదిదృక్షయా గతః ॥ 1

మైత్రేయుడు పలికెను :- విదురా! ఇట్లాయింద్రాది లోకపాలురు శ్రీహరి చెప్పినమాటలు విని భయము లేనివారై ఆయనకు నమస్కరించి స్వర్గమునకు వెడలిపోయిరి. పిమ్మట

సహస్రశీర్షుడగు శ్రీమన్నారాయణుడు తనసేవకు డగు ధ్రువుని చూచుటకై గరుత్మంతునిపై అధిరోహించి మధువనమునకు జేరెను.

స వై ధియా యోగవిపాకతీవ్రయా
హృత్పద్మకోశే స్ఫురితం తడిత్ప్రభమ్ ।
తిరోహితం సహసైవోపలక్ష్య
బహిఃస్థితం తదవస్థం దదర్శ ॥ 2

ధ్రువుడు తీవ్ర మగు యోగాభ్యాసము ద్వారా ఏకాగ్రమైన బుద్ధియోగముచే తన హృదయపద్మమున మెఱుపుతో సమానముగ ప్రకాశించు శ్రీహరి రూపవిలాసమును దర్శించుచుండెను. కాని వెంటనే యది అంతర్హితము కాగా అతడు కన్నుల దెఱచెను. లోపల గనబడిన రూపమువంటిదే బయట కనబడసాగెను.

తద్దర్శనేనాగతసాధ్వసః క్షితా-
వవన్దతాంగం వినమయ్య దండవత్ ।
దృగ్భ్యాం ప్రపశ్యన్ ప్రపిబన్నివార్భక-
శ్చుచుంబన్నివాస్యేన భుజైరివాశ్లిషన్ ॥ 3

భగవానుని దర్శించి ధ్రువుడు మిగుల సంభ్రమయుక్తుడై సాష్టాంగ దండప్రణామ మొనర్చెను. భగవానుని రూపమాధుర్యమును పానము చేయునట్లుగను, ముఖముద్వారా చుంబించునట్లుగను, బాహువులద్వారా ఆలింగనము చేసికొనునట్లుగను అతడు భగవానుని ప్రేమపూర్ణ దృష్టితో చూడసాగెను.

స తం వివక్షన్తమతద్విదం హరిః
జ్ఞాత్వాస్య సర్వస్య చ హృద్యవస్థితః ।
కృతాంజలిం బ్రహ్మమయేన కంబునా
పస్పర్శ బాలం కృపయా కపోలే ॥ 4

ఈ ధ్రువునియొక్క, సర్వజగత్తుయొక్క హృదయమున నుండు ఆ హరి కృతాంజలి యైనవాడును, తన్ను స్తుతింప నభిలషించుచున్నవాడును, కాని స్తుత్యాదికములను తెలియనివాడును అగు ధ్రువుని మనస్సులో నున్న విషయమును తెలిసికొని దయతో వేదాత్మకమగు శంఖముతో వాని కపోలములను స్పృశించెను.

స వై తదైవ ప్రతిపాదితాం గిరిం
దైవీం పరిజ్ఞాతపరాత్మనిర్ణయః ।
తం భక్తిభావోఽ భ్యగృణాదసత్వరం
పరిశ్రుతోరుశ్రవసం ధ్రువక్షితిః ॥ 5

భగవంతుని శంఖముచే స్పృశింపబడినంత మాత్రముననే ధ్రువునకు భగవద్విషయక మగు వాక్శక్తి ప్రాదుర్భవించెను. వాని హృదయమున పరమాత్మ జీవాత్మవిషయక మగు సంబంధజ్ఞానము స్ఫురించెను. అతడు భక్తివలన గలిగిన ప్రేమచే పరిప్లుతుడై ధీరభావముతో సర్వవిఖ్యాతుడు, విపుల కీర్తియునగు భగవానుని స్తుతింపసాగెను.

## శ్రీ ధ్రువ ఉవాచ

యోఽన్తః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిలశక్తిధరః స్వధామ్నా ।
అన్యాంశ్చ హస్తచరణశ్రవణత్వగాదీన్
ప్రాణాన్ నమో భగవతే పురుషాయ తుభ్యమ్ ॥ 6

ధ్రువుడు పలికెను:- చక్షురాద్యఖిలజ్ఞాన క్రియాశక్తిని ధరించిన వాడవు, చిచ్ఛక్తితో లోన ప్రవేశించి నిద్రితమైయున్న నా యీ వాక్శక్తికి, ఇతరములగు హస్తపాదకర్ణత్వగాదులైన యింద్రియములకు చైతన్యమును గలుగజేసినవాడవు, అంతర్యామి పురుషుడవు నగు నీకు నమస్కరించు చున్నాను.

ఏకస్త్వమేవ భగవన్నిదమాత్మశక్త్యా
మాయాఖ్యయోరుగుణయా మహదాద్యశేషమ్ ।
సృష్ట్వానువిశ్య పురుషస్తదసద్గుణేషు
నానేవ దారుషు విభావసువద్విభాసి ॥ 7

దేవా! నీవే విచిత్రగుణమయి యగు నీ మాయద్వారా ఈ మహదాది సంపూర్ణ విశ్వమును సృష్టించి దానిలో అంతర్యామి రూపముతో ప్రవేశించితివి, ఒకేయగ్ని బహువిధములగు కాష్ఠముల నాశ్రయించి నానారూపములుగ భాసిల్లునట్లు నీవుగూడ ఉన్ముఖులగు జీవుల విభిన్నేంద్రియముల నాశ్రయించి విభిన్నరూపములుగ అగపడుచున్నావు.

త్వద్దత్తయా వయునయేదమచష్ట విశ్వం
సుప్తప్రబుద్ధ ఇవ నాథ భవత్ప్రపన్నః ।
తస్యాపవర్గ్య శరణం తవ పాదమూలం
విస్మర్యతే కృతవిదా కథమార్తబన్ధో ॥ 8

దీనబాంధవా! సృష్ట్యారంభమున బ్రహ్మ నిన్ను శరణుజొచ్చి నీవు ప్రసాదించిన జ్ఞానము ద్వారా ఈ విశ్వమును నిద్రించి లేచిన వ్యక్తివలె దర్శించెను. నాథా! నీ పాదపద్మములు ముక్తపురుషుల కాశ్రయములు. అందువలన నీవలన ఉపకారమును పొందిన ముక్తపురుషుడెట్లు నీ పాదపద్మములను మఱచును.

*చ॥ వరమతి నార్తబాంధవ భవద్ఘనబోధసమేతుఁడై భవ*
*చ్చరణముఁ బొందినట్టి విధిసర్గము సుప్తజనుండు బోధ మం*
*దరయఁగఁ జూచురీతిఁ గనునట్టి ముముక్షుశరణ్య మైననీ*
*చరణములం గృతజ్ఞుఁ డగుసజ్జనుఁ డెట్లు దలంపకుండెడున్.* (4-281)

నూనం విముష్టమతయస్తవ మాయయా తే
యే త్వాం భవాప్యయవిమోక్షణమన్యహేతోః ।
అర్చన్తి కల్పకతరుం కుణపోపభోగ్య-
మిచ్ఛన్తి యత్స్పర్శజం నరకేఽపినృణామ్ ॥ 9

నీవు జీవులను జనన మరణములనుండి విముక్తులుగ జేసి వారికి నీనిత్య సేవను కలుగజేసితివి. నీవు వాంఛాకల్పతరువు వైయున్నావు. ఇట్టి నిన్ను నీనిత్యసేవను పొందు నుద్దేశ్యముతో గాక మఱియొక యుద్దేశ్యముతో ఎవ్వరైన ఆరాధించినచో వారిబుద్ధి నిజముగ మాయచే వంచిత మైనట్లుగనే భావింపవలెను. ఏలయన, శవతుల్యముగు శరీరము ద్వారా అనుభవింపబడు సుఖములకై వారు తహతహలాడుచున్నారు. ఇట్టి విషయభోగ జనితసుఖము జీవులను నరకమును పొందించును.

యా నిర్వృతిస్తనుభృతాం తవ పాదపద్మ-
ధ్యానాద్భవజ్జనకథాశ్రవణేన వా స్యాత్ ।
సా బ్రహ్మణి స్వమహిమన్యపి నాథ మా భూత్
కిమ్వన్తకాసి - లులితాత్పతతాం విమానాత్ ॥ 10

నాథా! నీ చరణకమలములను ధ్యానించుటవలన, నీ భక్తులతోగూడి నీ చరిత్రను వినుటవలన గలుగు ఆనందము బ్రహ్మానందమునందును లభింపదు. కాల మను ఖడ్గముచే స్వర్గమునకు బోవువిమానము ఖండింపబడగా భూలోకమున బడు దేవతల కీసుఖ మెట్లు లభించును?

*మ॥ అరవిందోదర తావకీనచరణధ్యానానురాగోల్లస*
*చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ స్వానందక బ్రహ్మమం*
*దరయన్ లేవట దండభృద్భటవిమానాకీర్ణు లై కూలునా*
*సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైక చింతామణీ.* (4-283)

భక్తిం ముహుః ప్రవహతాం త్వయి మే ప్రసంగో
భూయాదనన్తమహతామమలాశయానామ్ ।
యేనాంజసోల్బణమురువ్యసనం భవాబ్ధిం
నేష్యే భవద్గుణకథామృతపానమత్తః ॥ 11

అనంతా! నీయందు అవిచ్ఛిన్నమగు భక్తిభావము గలవారు, విశుద్ధ హృదయులునగు మహాత్ముల సాంగత్యము నెల్లపుడు నాకు గలుగజేయుము. వారి సాంగత్యముచేత నేను నీ గుణకథామృతపానముచే ఉన్మత్తుడనై దుఃఖ పరిపూర్ణము, భీషణమునగు ఈ భవసాగరమును అనాయాసముగ దాటగలను.

*చ॥ హరిభజనీయమార్గనియతాత్మకు లై భవదీయమూర్తిపై*
*వఱలిన భక్తియుక్తులగు వారలసంగతిఁ గల్గఁజేయు స*
*త్పురుషసుసంగతిన్ వ్యసనదుస్తరసాగర మప్రయత్నతన్*
*సరసభవత్కథామృతరసంబున మత్తుఁడ నై తరించెదన్.* (4-284)

తే న స్మరన్త్యతితరాం ప్రియమీశ మర్త్యం
యే చాన్వదః సుతసుహృద్గృహవిత్తదారాః ।
యే త్వబ్జనాభ భవదీయపదారవిన్ద-
సౌగన్ధ్యలుబ్ధ హృదయేషు కృతప్రసంగాః ॥ 12

దేవా! పద్మనాభా! నీపాదకమల సుగంధమునం దాసక్తి గల మహాత్ముల సాంగత్యమును పొందువారు మిగుల ప్రియమగు ఈ దేహమును గూర్చి గాని దానికి సంబంధించిన పుత్రమిత్ర కళత్ర గృహవిత్తముల గూర్చిగాని యేమియు ఆలోచింపరు.

చ॥ నిరతముఁ దావకీన భజనీయపదాబ్జ సుగంధలుబ్ధు లై
వ్వరమది పొందఁగాఁ గలుగు వారలు తత్ప్రియ మర్త్యదేహమున్
అరయఁ దదీయదారతనయాదిసుహృద్గృహ బంధు వర్గమున్
మఱతురు విశ్వతోముఖ రమాహృదయేశ ముకుంద మాధవా. (4-285)

తిర్యఙ్నగద్విజసరీసృపదేవదైత్య-
మర్త్యాదిభి: పరిచితం సదసద్విశేషమ్ ।
రూపం స్థవిష్ఠమజ తే మహదాద్యనేకం
నాత:పరం పరమవేద్మి న యత్ర వాద: ॥ 13

జన్మరహితుడవగు పరమేశ్వరా! నీయీవిరాడ్రూపము పశువులు, పక్షులు, పర్వతములు, పరీసృపములు, దేవతలు, దైత్యులు, మనుష్యులు మున్నగువారిద్వారా వ్యాప్తమై యున్నది. దీనియందు స్థూల సూక్ష్మాది పదార్థములు, సదసత్పదార్థములు పరస్పరము భిన్నరూపముగ ప్రకాశించుచున్నవి. దీనికి మహదాదులైన అనేకకారణములు గూడ ఉన్నవి. నీ ఈ రూపమునె నే నెఱుగుదును. కాని దీనికంటె భిన్నమైన నీ యీశ్వరస్వరూపమును, శబ్దాది వ్యాపారశూన్యమైన బ్రహ్మస్వరూపమును నే నెఱుంగను.

కల్పాన్త ఏతదఖిలం జఠరేణ గృహ్ణన్
శేతే పుమాన్ స్వదృగనన్త సఖస్తదఙ్కే ।
యన్నాభిసిన్ధురుహకాంచనలోకపద్మ -
గర్భే ద్యుమాన్ భగవతే ప్రణతోఽస్మి తస్మై ॥ 14

ప్రళయకాలమున తనయుదరమున సర్వబ్రహ్మాండములను నిలుపుకొని, యోగనిద్ర నవలంబించి శేషశాయియై యున్నపురుషుని నాభిసముద్రమునుండి పుట్టిన కాంచనమయ మగు లోకపద్మముయొక్క కర్ణికారము నుండి మహాతేజస్వి యగు బ్రహ్మ జన్మించెను. నేనట్టి వాసుదేవునకు నమస్కరించుచున్నాను.

త్వం నిత్యముక్త పరిశుద్ధవిబుద్ధ ఆత్మా
కూటస్థ ఆదిపురుషో భగవాంస్త్ర్యధీశ: ।
యద్బుద్ధ్యవస్థితిమఖండితయా స్వదృష్ట్యా
ద్రష్టా స్థితావధిమఖో వ్యతిరిక్త ఆస్సే ॥ 15

దేవా! నీవు నీయఖండచిన్మయదృష్టితో బుద్ధియొక్క సర్వావస్థలను జూచుచున్నావు. నీవు నిత్యముక్తుడవు, శుద్ధసత్వమయుడవు. సర్వజ్ఞుడవు, పరమాత్మస్వరూపుడవు, నిర్వికారుడవు, ఆదిపురుషుడవు, షడైశ్వర్య సంపన్నుడవు, త్రిగుణముల కధీశ్వరుడవు. ఇట్టి నీవు జీవునికంటె పూర్తిగ భిన్నుడవు. ప్రపంచస్థితికై యజ్ఞమునకు అధిష్ఠాత యగు విష్ణురూపముతో నీవు విరాజిల్లుచున్నావు.

వివరణము:- దేవా! నీవు నిత్యముక్తుడవు; జీవుడు నీయనుగ్రహమువలన జడబంధనములనుండి విముక్తుడై స్వరూపమున నుండును; నీవు పరిశుద్ధుడవు; జీవుడు మలినుడు; నీవు సర్వజ్ఞుడవు; జీవుడల్పజ్ఞుడు; నీవు మాయాధీశుడవు, జీవుడు మాయావశయోగ్యుడు; నీవు నిర్వికారుడవు; జీవుడు మాయాసంస్పర్శముచే విస్మృత స్వరూపుడు. నీవు జన్మరహితుడవు, జీవుడు జన్మయుక్తుడు; నీవు పూర్ణైశ్వర్యుడవు; జీవుడు స్వరూపావ స్థితివలన స్వల్పైశ్వర్యయుక్తుడు; నీవు త్రిగుణముల కధీశ్వరుడవు, స్వతంత్రుడవు; జీవుడు గుణములచే నభిభావ్యుడు. నీవు నీయఖండిత చిన్మయ దృష్టిద్వారా బుద్ధియొక్క సర్వావస్థలను దర్శింతువు. నీవు జగత్పాలనమునకై యజ్ఞాధిష్ఠాత యగు విష్ణురూపముతో నున్నావు. అందువలన నీవు జీవునికంటె పూర్తి విలక్షణుడవు.

యస్మిన్ విరుద్ధగతయో హ్యనిశం పతన్తి
విద్యాదయో వివిధశక్తయ ఆనుపూర్వ్యా ।
తద్బ్రహ్మవిశ్వభవమేకమనన్త మాద్య-
మానన్దమాత్రమవికారమహం ప్రపద్యే ॥ 16

నీనుండియే విద్యాఅవిద్యాది విరుద్ధస్వభావములు గల శక్తులెన్నియో నిరంతరము ఉద్భవించుచుండును. నీ వీ విశ్వమునకు గారణభూతుడవు, అఖండుడవు, అనంతుడవు, అనాదివి, ఆనందమాత్రుడవు, నిర్వికారుడవు, పరబ్రహ్మ స్వరూపుడవు. అట్టి భగవానుని చరణములను శరణుబొందు చున్నాను.

సత్యాశిషో హి భగవం స్తవ పాదపద్మ-
మాశీస్తథానుభజతః పురుషార్థమూర్తేః ।
అప్యేవమర్య భగవాన్ పరిపాతి దీనాన్
వాశ్రేవ వత్సకమనుగ్రహ కాతరోఽస్మాన్ ॥ 17

దేవా! నీవు పరమానంద స్వరూపుడవని యెఱింగి నిష్కామభావముతో నిన్ను నిరంతరము సేవించు మానవునకు రాజ్యాది భోగములకంటె నీ చరణకమలములను

పొందుటయే నిజమైన భజనఫలము. కాని దేవా! ధేనువు ప్రేమవిహ్వలమై అప్పటికప్పుడు పుట్టినదూడకు పాలనిచ్చునట్లు, వ్యాఘ్రాదులనుండి రక్షించునట్లు ఐశ్వర్యశాలివి యగునీవు అనుగ్రహ పరవశుడవై మావంటి సకామవ్యక్తులనుగూడ (సంసారభయమునుండి) రక్షించుచున్నావు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

అథాభిష్టుత ఏవం వై సత్సంకల్పేన ధీమతా ।
భృత్యానురక్తో భగవాన్ ప్రతినన్ద్యేదమబ్రవీత్ ॥ 18

మైత్రేయుడు పలికెను:- విదురా! పిమ్మట దృఢసంకల్పుడు, బుద్ధిమంతుడు నగు ధ్రువునిచే నిట్లు స్తుతింపబడినవాడై భక్తవత్సలుడగు భగవానుడు వాని ప్రార్థనమునకు సంతోషించి యిట్లు పలుకసాగెను.

## శ్రీ భగవానువాచ

వేదాహం తే వ్యవసితం హృది రాజన్య బాలక ।
తత్ప్రయచ్ఛామి భద్రం తే దురాపమపి సువ్రత ॥ 19

భగవానుడు పలికెను :- ఉత్తమవ్రతమును పాలించు రాజకుమారా! నేను నీ హృదయమున నున్న సంకల్పమును ఎఱుంగుదును. నేను నీ కీయబోవుపదమును పొందుట చాలకష్టము, అయినను నేను నీకు దాని నిత్తును. నీకు శుభమగుగాక!

నాన్యైరధిష్ఠితం భద్ర యద్భ్రాజిష్ణు ధ్రువక్షితి ।
యత్ర గ్రహర్క్ష తారాణాం జ్యోతిషాం చక్రమాహితమ్ ।
మేఢ్యాం గోచక్రవత్ స్థాస్ను పరస్తాత్కల్పవాసినామ్ ॥ 20

ధర్మోఽగ్నిః కశ్యపః శక్రో మునయో యే వనౌకసః ।
చరన్తి దక్షిణీకృత్య భ్రమన్తో యత్సతారకాః ॥ 21

తేజోమయము, వినాశరహితము నగునాలోకము నేటివఱకెవ్వడును పొందలేదు. దానికి నలువైపుల గ్రహనక్షత్ర తారాగణరూప మగుజ్యోతి శ్చక్రము మేఢి * యందు తిరుగు గోచక్రమువలె తిరుగుచున్నది. అవాంతర కాలపర్యంత ముండులోకములు నాశనమైనను నీవాసస్థానము స్థిరముగ నుండును. తారాగణముతోపాటు ధర్మాగ్ని కశ్యప,శక్రాదులు వనౌకసులైన మునులు, సప్తర్షులు దానిచుట్టు తిరుగుచుందురు. అట్టి దుర్లభమైన ధ్రువలోకమును నీకిత్తును.

* కోసినపంటను కళములోవేసి నూర్చుటకై ఎద్దులను త్రిప్పుదురు. అపుడు నడుమ నొక స్తంభమును పాతి దానికి కట్టివేయుదురు. ఆ స్తంభమును మేఢి అందురు.

ప్రస్థితే తు వనం పిత్రా దత్త్వా గాం ధర్మసంశ్రయః ।
షట్త్రింశద్వర్షసాహస్రం రక్షితా వ్యాహతేన్ద్రియః ॥ 22

వత్సా! నీతండ్రి యిపుడు నీకు రాజసింహాసనము నిచ్చి వనమునకు వెడలును. నీవు ధర్మము నాశ్రయించి అవ్యాకులచిత్తముతో ముప్పదియాఱు వేలసంవత్సరములవఱకు ఆ రాజ్యమును పాలింతువు.

త్వద్భ్రాతర్యుత్తమే నష్టే మృగయాయాన్తు తన్మనాః ।
అన్వేషతీ వనం మాతా దావాగ్నిం సా ప్రవేక్ష్యతి ॥ 23

నీసోదరుడగు ఉత్తముడు వేటకై వెడలి మరణించును. అపుడు వానితల్లి సురుచి పుత్రప్రేమతో వానిని వెదకుచు అడవిలో దావాగ్నియందు ప్రవేశించును.

ఇష్ట్వా మాం యజ్ఞహృదయం యజ్ఞైః పుష్కలదక్షిణైః ।
భుక్త్వా చేహాశిషః సత్యా అన్తే మాం సంస్మరిష్యసి ॥ 24

భూరిదక్షిణలు గల యజ్ఞములతో యజ్ఞస్వరూపుడనగు నన్ను ఆరాధించి యీ లోకమున భోగముల ననుభవించి అంతమున నన్నే స్మరింప గలవు.

తతో గన్తాసి మత్ స్థానం సర్వలోకనమస్కృతమ్ ।
ఉపరిష్టాదృషిభ్యస్త్వం యతో నావర్తతే యతిః ॥ 25

అనంతరము నాధామమునకు వెడలగలవు. ఆ నాధామము సర్వలోక నమస్కృత మైనది. ఋషులస్థానము కంటెను పైన ఉన్నది. ఒకమారచటికి వెడలినవాడు తిరిగి యీ ప్రపంచములోనికి వచ్చుట ఉండదు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఇత్యర్చితః స భగవానతిదిశ్యాత్మనః పదమ్ ।
బాలస్య పశ్యతో ధామ స్వమగాద్గరుడధ్వజః ॥ 26

మైత్రేయుడు పలికెను :- విదురా! గరుడధ్వజుడగు విష్ణుభగవానుడు ధ్రువునిచే అట్లర్చితుడై వానికి తన పరమపదమునిచ్చి తనలోకమునకు వెడలిపోయెను.

సోఽపి సంకల్పజం విష్ణోః పాదసేవోపసాదితమ్ ।
ప్రాప్య సంకల్పనిర్వాణం నాతిప్రీతోఽభ్యగాత్పురమ్ ॥ 27

ధ్రువుడు శ్రీహరి పాదపద్మసేవను పొందెను. ఈ పాదసేవను పొందినచో జీవుని సర్వబహిర్ముఖ సంకల్పములు సమాప్తిచెందును. ధ్రువుడు తన మనోభీష్టములను పొందెను. కాని వానిచిత్తము ప్రసన్నము కాలేదు. ఐనను అతడు తన నగరమునకు వెడలెను.

## శ్రీ విదుర ఉవాచ

సుదుర్లభం యత్పరమం పదం హరే-
ర్మాయావినస్తచ్చరణార్చనార్జితమ్ ।
లబ్ధ్వాప్యసిద్ధార్థమివైకజన్మనా
కథం స్వమాత్మానమమన్య తార్థవిత్ ॥ 28

విదురుడు పలికెను :- మైత్రేయా! శ్రీహరిపరమపదము సకాములగు వ్యక్తులు పొంద నలవికానిది; కాని పురుషార్థతత్త్వము నెఱింగిన ధ్రువు డాయుత్కృష్ట పదము నొకే జన్మమున పొందియు తన్నేల అకృతార్థునిగ దలంచెను?

## శ్రీ మైత్రేయ ఉవాచ

మాతుః సపత్న్యా వాగ్బాణైర్హృది విద్ధస్తు తాన్ స్మరన్ ।
నైచ్ఛన్ముక్తిపతేర్ముక్తిం పశ్చాత్తాపముపేయివాన్ ॥ 29

మైత్రేయుడు పలికెను :- సవతితల్లి వాగ్బాణములచే పీడితుడగు ధ్రువుడు వానిని స్మరించుచు ముక్తిదాత యగు భగవానునినుండి ముక్తిని (స్వరూపస్థితిని) కోరలేదు. పిమ్మట మనస్తాపమును పొందెను.

## శ్రీ ధ్రువ ఉవాచ

సమాధినా నైకభవేన యత్పదం
విదుః సనన్దాదయ ఊర్ధ్వరేతసః ।
మాసైరహం షడ్భిరముష్య పాదయో-
శ్ఛాయాముపేత్యాపగతః పృథఙ్మతిః ॥ 30

ధ్రువుడు పలికెను :- ఆహా! ఊర్ధ్వరేతస్కులగు సనందనాది మునులు బహుజన్మలచే అభ్యస్తమైన సమాధిద్వారా తెలిసికొనిన భగవానుని పాదపద్మచ్ఛాయను నే నాఱునెలలలోపలనే పొందియు ద్వితీయాభినివేశము వలన నా పదమునుండి చ్యుతుడనై మరల సంసారమున నిమగ్నుడ నైతిని.

**అహో బత మమానాత్మ్యం మన్దభాగ్యస్య పశ్యత ।**
**భవచ్ఛిదః పాదమూలం గత్వాయాచే యదన్తవత్ ॥ 31**

నేనెంతటి దురదృష్టవంతుడను? నా మూఢత్వమును జూడుము. నేను సంసారవినాశకుడగు శ్రీహరి పాదములకడకు జేరియు నశ్వరమగు వస్తువును కోరితిని.

**మతిర్విదూషితా దేవైః పతద్భిరసహిష్ణుభిః ।**
**యో నారదవచస్తథ్యం నాగ్రహీషమసత్తమః ॥ 32**

స్వర్గభోగానంతరము అధోలోకములకు బోవు దేవతలు భగవత్ప్రాప్తి రూప మగునా యుత్కృష్టస్థితిని జూచి యోర్వజాలక నాబుద్ధిని పాడుచేసిరి. అట్లుకానిచో నావంటి దుష్టుడు దేవర్షి యగు నారదుడు చెప్పినమాటల నేల స్వీకరింపడు?

**దైవీం మాయాముపాశ్రిత్య ప్రసుప్త ఇవ భిన్నదృక్ ।**
**తప్యే ద్వితీయేఽప్యసతి భ్రాతృభ్రాతృవ్యహృద్రుజా ॥ 33**

నిద్రించిన వ్యక్తి భేదదృష్టివలన వ్యాఘ్రాదిద్వితీయ వస్తువు లేక పోయినను వృథాభయజనిత మగు దుఃఖమును పొందునట్లు నేనుగూడ దైవమాయచే మోహితుడనై అద్వయజ్ఞానుడగు భగవానుని కాక మఱియొక వస్తువును కల్పనజేసి సోదరుని శత్రువుగ భావించితిని, ఇపుడు మనస్తాపముచే తప్తుడ నగుచుంటిని.

**మయైతత్ప్రార్థితం వ్యర్థం చికిత్సేవగతాయుషి ।**
**ప్రసాద్య జగదాత్మానం తపసా దుష్ప్రసాదనమ్ ।**
**భవచ్ఛిదమయాచేఽహం భవం భాగ్యవివర్జితః ॥ 34**

జగత్తున కాత్మస్వరూపుడు, సంసార నివర్తకుడు నగు భగవానుని తపస్సుచే ప్రసన్నునిగ జేసికొనుట దుస్సాధ్యము. కాని నే నాయనను ప్రసన్నునిగ జేసికొనియు అసత్యమగు ఈ సాంసారిక విషయమునే కోరితిని. మరణించిన వ్యక్తికి చేసిన చికిత్స నిష్ఫలమగునట్లు నాచే ప్రార్థింపబడిన విషయము గూడ నిరర్థకమైనదే.

**స్వారాజ్యం యచ్ఛతో మౌఢ్యాన్మానో మే భిక్షితో బత ।**
**ఈశ్వరాత్ క్షీణపుణ్యేన ఫలీకారానివాధనః ॥ 35**

అయ్యో! నిర్ధనుడగు వ్యక్తి చక్రవర్తిని పొట్టుతోగూడిన బియ్యమును యాచించునట్లు నేనుగూడ దుష్కృతుడనై శ్రీహరిని అసద్వస్తువు నిమ్మని గోరితిని. శ్రీహరి నాకు సేవానందము నీయ నుద్యుక్తుడయ్యెను. కాని నేను మూర్ఖతవలన అభిమానమును పెంచు ఉన్నతపదవిని కోరితిని.

మ॥ ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుండైనట్టి పంకజలో
చనుఁడే చాలఁ బ్రసన్నుఁడైన నతనిన్ సాంసారికం బర్థిగో
రిననావంటివిమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్. (4-300)

## శ్రీ మైత్రేయ ఉవాచ

న వై ముకున్దస్య పదారవిన్దయో-
రజోజుషస్తాత భవాదృశా జనాః ।
వాంఛంతి తద్దాస్యమృతేఽర్థమాత్మనో
యదృచ్ఛయా లబ్ధమనః సమృద్ధయః ॥ 36

మైత్రేయుడు పలికెను :- వత్సా! విదురా! నీవలె ముకుందుని పాదపద్మ పరాగరేణువులను సేవించువారు ఆ భగవానుని నిత్యదాస్యమును దప్ప మఱిదేనిని గూడ కోరరు. ఏలయన, తనంత తాను లభించిన వస్తువును శ్రీహరి ప్రసాదముగ భావించి వారు పూర్ణచిత్త ప్రసాదమును పొందగలరు.

ఆకర్ణ్యాత్మజమాయాన్తం సంపరేత్య యథాఽఽగతమ్ ।
రాజా న శ్రద్దధే భద్రమభద్రస్య కుతో మమ ॥ 37

తనపుత్రుడు తిరిగివచ్చినా డని ఉత్తానపాదుడు వినెను. మరణించిన వ్యక్తి తిరిగివచ్చినాడన్న ఎవ్వరును నమ్మరు. అట్లే రాజుగూడ ఆ వార్తను విశ్వసింపలేదు. "నావంటి దురదృష్టవంతున కింతటి యదృష్ట మెట్లు కలుగు" నని అతడు భావించెను.

శ్రద్ధాయ వాక్యం దేవర్షేర్హర్షవేగేన ధర్షితః ।
వార్తాహర్తురతిప్రీతో హారం ప్రాదాన్మహాధనమ్ ॥ 38

కాని దేవర్షియగు నారదుడు 'నీకుమారుడు త్వరలోనే తిరిగి రాగల'డని చెప్పియున్నాడు. ఉత్తానపాదుడు ఈ మాటపై శ్రద్ధ నుంచి హర్షాతిరేకముతో మొదట తన్ను నిందించుకొనెను; పిమ్మట మిగుల ప్రేమగలవాడై వార్తాహరునకు విలువైన కానుక నిచ్చెను.

సదశ్వం రథమారుహ్య కార్తస్వరపరిష్కృతమ్ ।
బ్రాహ్మణైః కులవృద్ధైశ్చ పర్యస్తోఽమాత్య బన్ధుభిః ॥ 39

**శంఖదుందుభినాదేన బ్రహ్మఘోషేణ వేణుభిః ।**
**నిశ్చక్రామ పురాత్తూర్ణమాత్మజావేక్షణోత్సుకః ॥ 40**

పిమ్మట స్వర్ణభూషితమైన మంచిగుఱ్ఱములను బూన్చిన రథము నధిరోహించి కులవృద్ధులతోను, బ్రాహ్మణులతోను, అమాత్యులతోను, బంధువులతోను గూడుకొనినవాడై ఉత్తానపాదుడు శంఖములు, వేణువులు, దుందుభులు ధ్వనించుచుండగ, వేదమంత్రములు పఠింపబడుచుండగ పుత్రదర్శనార్థమై మహోత్సాహముతో పురమునుండి బయల్వెడలెను.

**సునీతిః సురుచిశ్చాస్య మహిష్యౌ రుక్మభూషితే ।**
**ఆరుహ్య శిబికాం సార్ధముత్తమేనాభిజగ్మతుః ॥ 41**

మహారాజు భార్యలగు సునీతి సురుచి యనువారు స్వర్ణాభరణములచే అలంకృతలై యొకపల్లకి నధిరోహించి ఉత్తముని వెంటనిడుకొని ధ్రువుని దర్శించుటకై వెడలిరి.

**తం దృష్ట్వోపవనాభ్యాస ఆయాన్తం తరసా రథాత్ ।**
**అవరుహ్య నృపస్తూర్ణమాసాద్య ప్రేమవిహ్వలః ॥ 42**

**పరిరేభేఽఙ్గజం దోర్భ్యాం దీర్ఘోత్కంఠమనాః శ్వసన్ ।**
**విష్వక్సేనాంఘ్రిసంస్పర్శహతాశేషాఘబన్ధనమ్ ॥ 43**

ధ్రువుడు ఉపవన సమీపమునకు వచ్చుట చూచి ఉత్తానపాదుడు ప్రేమవిహ్వలుడై అతిశీఘ్రముగ రథమునుండి దిగెను. పుత్రుని జూచుటకై అతడు బహుదినముల నుండి యుత్కంఠుడగుచు దీర్ఘ నిశ్వాసముల విడచుచు వేగముగ రెండుచేతులతో పుత్రుని ఆలింగనము చేసికొనెను. ధ్రువుని కపుడెట్టి రాగద్వేషములు లేవు. శ్రీ నారాయణుని పాదస్పర్శచే వాని సర్వబంధనములు వినష్టము లయ్యెను.

**అథాజిఘ్రన్ ముహుర్మూర్ధ్ని శీతైర్నయనవారిభిః ।**
**స్నాపయామాస తనయం జాతోద్దామమనోరథమ్ ॥ 44**

పిమ్మట ఉత్తానపాదుడు పూర్ణమనోరథుడగు పుత్రుని మస్తకమును మాటిమాటికి ఆఘ్రాణింపసాగెను. ఆనందాశ్రువులచే వాని నభిషేకించెను.

**అభివన్ద్య పితుః పాదావాశీర్భిశ్చాభిమన్త్రితః ।**
**ననామ మాతరౌ శీర్ష్ణా సత్కృతః సజ్జనాగ్రణీః ॥ 45**

సజ్జనాగ్రగణ్యుడగు ధ్రువుడుగూడ మొదట తండ్రిచరణములకు నమస్కరించెను. ఉత్తానపాదు డాశీర్వదించి, కుశలప్రశ్నల ద్వారా పుత్రునితో సంభాషించెను. పిమ్మట ధ్రువుడు తల్లులిరువురకు సాష్టాంగ ప్రణామము లొనర్చెను.

**సురుచిస్తం సముత్థాప్య పదావనతమర్భకమ్ ।**
**పరిష్వజ్యాహ జీవేతి బాష్పగద్గదయా గిరా ॥** 46

సురుచి పాదములకు నమస్కరించు బాలుని ప్రేమతో లేవనెత్తి ఆలింగనము జేసికొనెను. బాష్పగద్గదవాక్కుతో "చిరంజీవివి కమ్ము" అని యాశీర్వదించెను.

**యస్య ప్రసన్నో భగవాన్ గుణైర్మైత్ర్యాదిభిర్హరిః ।**
**తస్మై నమన్తి భూతాని నిమ్నమాప ఇవ స్వయమ్ ॥** 47

మైత్రి మున్నగుగుణములు గలవానికి భగవానుడు ప్రసన్నుడగును. నీరు పల్లమునకు ప్రవహించునట్లు వానియెదుట జీవులందఱు తలవంచుచుందురు.

**ఉత్తమశ్చ ధ్రువశ్చోభావన్యోఽన్యం ప్రేమవిహ్వలౌ ।**
**అంగసంగాదుత్పులకావస్రౌఘం ముహురూహతుః ॥** 48

అనంతరము ఉత్తముడు ధ్రువుడు ఇరువురు ప్రేమవిహ్వలురై పరస్పరము ఆలింగనము జేసికొనసాగిరి. అవయవస్పర్శవలన వారి శరీరములు పులకరించెను. ఇరువురు మాటిమాటికి ఆనందాశ్రువులను విడువసాగిరి.

**సునీతిరస్య జననీ ప్రాణేభ్యోఽపి ప్రియం సుతమ్ ।**
**ఉపగుహ్య జహావాధిం తదంగస్పర్శ నిర్వృతా ॥** 49

ధ్రువుని తల్లియగు సునీతి ప్రాణములకంటె అధికప్రియుడైన పుత్రుని కౌగలించుకొని వానియవయవస్పర్శవలన గలిగిన సుఖముచే తనమానసిక బాధను పరిత్యజించెను.

**పయః స్తనాభ్యాం సుస్రావ నేత్రజైః సలిలైః శివైః ।**
**తదాభిషిచ్యమానాభ్యాం వీర వీరసువో ముహుః ॥** 50

వీరుడవగు విదురా! అపుడు వీరప్రసవిని యగు సునీతిస్తనములు ప్రేమాశ్రువులచే గడుగబడెను. దానివలన అనవరతముగ క్షీరములు స్రవింపసాగెను.

**తాం శశంసుర్జనా రాజ్ఞీం దిష్ట్యా తే పుత్ర ఆర్తిహా ।**
**ప్రతిలబ్ధశ్చిరం నష్టో రక్షితా మండలం భువః ॥** 51

పురవాసులు మహారాణి యగు సునీతితో నిట్లు పలుకసాగిరి. దేవీ! ఎన్నియో పుణ్యముల ఫలముగ బహుదినముల పిమ్మట నేడు నీయొక్క, మాయొక్క సంతాపమును హరింపజేయు నీపుత్రుని తిరిగి పొందితివి. ఇతడే పృథివిని పాలించును.

**అభ్యర్చితస్త్వయా నూనం భగవాన్ ప్రణతార్తిహా ।**
**యదనుధ్యాయినో ధీరా మృత్యుం జిగ్యుః సుదుర్జయమ్ ॥ 52**

శ్రీహరిధ్యానపరాయణులై యోగులు దుర్జయమగు మృత్యువునుగూడ జయించిరి. నీవు నిజముగ ప్రణతజనుల క్లేశములను హరించు భగవాను నారాధించితివి.

**లాల్యమానం జనై రేవం ధ్రువం సభ్రాతరం నృపః ।**
**ఆరోప్య కరిణీం హృష్టః స్తూయమానోఽవిశత్పురమ్ ॥ 53**

విదురా! అట్లు సర్వజనులచే ఆదరింపబడు ధ్రువుని ఉత్తమునితో గూడ గజేంద్రముపై అధిరోహింపజేసి ఉత్తానపాదుడు ఆనందచిత్తముతో పురాభిముఖముగ వెడలెను. అప్పుడచ్చట ఉన్నవారందఱు స్తుతించుచు వారి ననుసరింపసాగిరి.

**తత్ర తత్రోపసంక్లిప్తైర్లసన్మకరతోరణైః ।**
**సవృన్తైః కదలీస్తంభైః పూగపోతైశ్చ తద్విధైః ॥ 54**

**చూతపల్లవ వాసఃస్రఙ్ముక్తాదామవిలంబిభిః ।**
**ఉపస్కృతం ప్రతిద్వారమపాంకుంభైః సదీపకైః ॥ 55**

నగరములోని ప్రతిప్రాసాదద్వారమునందును మకరతోరణము లేర్పాటు చేయబడియుండెను. వానియందు పండ్లగుత్తులతో గూడిన అరటిచెట్లు, పోకమొక్కలు, మామిడిచిగుళ్ళు, వస్త్రములు, పూలమాలలు, ముత్యాలహారములు అలంకృతములై యుండెను. దీపములతోగూడ జలపూర్ణము లగు కలశములు ప్రతిద్వారమందును శోభిల్లుచుండెను.

**ప్రాకారైర్గోపురాగారైః శాతకుంభపరిచ్ఛదైః ।**
**సర్వతోఽలంకృతం శ్రీమద్విమానశిఖరద్యుభిః ॥ 56**

**మృష్టచత్వరరథ్యాట్టమార్గం చన్దనచర్చితమ్ ।**
**లాజాక్షతైః పుష్పఫలైస్తణ్డులైర్బలిభిర్యుతమ్ ॥ 57**

ఆ పట్టణమునకు నలువైపుల ప్రాకారములు, గోపురములు, పురద్వారములు స్వర్ణమయ సామగ్రులచే అలంకృతములై విమానశిఖరముల వలె శోభిల్లుచుండెను.

ముంగిళ్ళు, రాజమార్గములు, ఉన్నతములగు హర్మ్యములపై నిర్మితములైన విహారస్థలములు, చిన్నచిన్న మార్గములు మంచిగంధపు నీటిచే తడుపబడియుండెను. వానియందు లాజలు (పేలాలు), అక్షతలు, పుష్పములు, ఫలములు, తండులములు, మిష్టాన్నములు, వస్త్రభూషణాదులు మున్నగు పూజోపహారములు సుసజ్జితములై యుండెను.

**ధ్రువాయ పథి దృష్టాయ తత్ర తత్ర పురస్త్రియః ।**
**సిద్ధార్థాక్షతదధ్యంబు దూర్వాపుష్పఫలాని చ ।** 58

**ఉపజహ్రుః ప్రయుంజానా వాత్సల్యాదాశిషః సతీః ॥**
**శృణ్వంస్తద్గుణగీతాని ప్రావిశద్భవనం పితుః ॥** 59

ఆయామార్గములగుండా వచ్చు ధ్రువుని జూచి పురస్త్రీలు వాత్సల్యముతో ఆశీర్వదించుచు వాని శిరముపై శ్వేతసర్షపములు, యవలు, దధి, జలము, దూర్వాంకురములు, పుష్పములు, ఫలములు మున్నగు మంగళకర ద్రవ్యములను చల్లసాగిరి. ధ్రువుడు వారి మనోహర గానములను వినుచు పితృభవనములోనికి ప్రవేశించెను.

*మ॥ హరిమధ్యల్ పురకామినీతతులు సౌధాగ్రంబులందుండి భా*
*స్వరసిద్ధార్థఫలాక్షతప్రసవ దూర్వవ్రాతదధ్యంబువుల్*
*గరవల్లీ మణిహేమకంకణఝుణత్కారంబు శోభిల్లఁ జ*
*ల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై లీలాప్రమేయంబుగన్.* (4-317)

**మహామణివ్రాతమయే స తస్మిన్ భవనోత్తమే ।**
**లాలితో నితరాం పిత్రా న్యవసద్దివి దేవవత్ ॥** 60

మహామణి ఖచితము, అత్యుత్తమము నగు ఆ భవనమున ధ్రువుడుత్తానపాదునిచే లాలింపబడుచు స్వర్గవాసులగు దేవతలవలె సుఖముగ నివసింపసాగెను.

**పయఃఫేననిభాః శయ్యా దాన్తా రుక్మపరిచ్ఛదాః ।**
**ఆసనాని మహార్హాణి యత్ర రౌక్మా ఉపస్కరాః ॥** 61

ఆ భవనమున పాలనురుగువలె తెల్లనైన, మృదువైన శయ్యలు, ఏనుగుదంతములచే నిర్మితములైన స్వర్ణమయ పరిచ్ఛదవిశిష్టములైన మంచములు, మహామూల్యములగు ఆసనములు, స్వర్ణపాత్రాదులు ఉండెను.

యత్రస్ఫటికకుడ్యేషు మహామారకతేషు చ ।
మణిప్రదీపా ఆభాన్తి లలనారత్నసంయుతాః ॥ 62

స్ఫటికమహామరకత మణినిర్మితములైన ఆ భవనకుడ్యములయందు ప్రతిఫలించిన స్త్రీరత్నములచే ధరింపబడిన మణిమయదీపములు ప్రకాశించు చుండెను.

ఉద్యానాని చ రమ్యాణి విచిత్రైరమరద్రుమైః ।
కూజద్విహంగమిథునైర్గాయన్మత్త మధువ్రతైః ॥ 63

భవనమునకు సమీపమున దేవతావృక్షములతో శోభిల్లు ఉద్యాన వనములుండెను. ఆ వృక్షములపై పక్షులజంటలకలరవములు, మధుపానముచే మత్తిల్లిన తుమ్మెదల ఝుంకారములు వినసొంపుగ నుండెను.

వాప్యోవైదూర్యసోపానాః పద్మోత్పలకుముద్వతీః ।
హంసకారణ్డవకులైర్జుష్టాశ్చక్రాహ్వసారసైః ॥ 64

ఆయుద్యానవనముల యందు వైడూర్య మణిఖచితములైన సోపానములచే శోభిల్లుబావులు గలవు. వానియందు పద్మములు, ఉత్పలములు, కుముదములు వికసించియుండెను. హంసలు, కారండవములు, చక్రవాకములు, సారసములు మున్నగు జలపక్షులు విహరించుచు సరోవరముల శోభను పెంచుచుండెను.

ఉత్తానపాదో రాజర్షిః ప్రభావం తనయస్య తమ్ ।
శ్రుత్వా దృష్ట్వాద్భుతతమం ప్రపేదే విస్మయం పరమ్ ॥ 65

రాజర్షి యగు ఉత్తానపాదుడు తన పుత్రుని అత్యాశ్చర్యప్రభావమును దర్శించి, విని మిగుల విస్మయమును పొందెను.

వీక్ష్యోఢవయసం పుత్రం ప్రకృతీనాం చ సమ్మతమ్ ।
అనురక్తప్రజం రాజా ధ్రువం చక్రే భువః పతిమ్ ॥ 66

ధ్రువుడు రాజ్యమును నిర్వహించుటకు దగిన యౌవనమును పొందెను. అమాత్యులు వానిని ఆదరముగ జూచుచుండిరి. ప్రజలకును వానిపై అనురాగ ముండెను. ఇది చూచిరాజు ఆతనికి యువరాజ్యపట్టాభిషేకము చేసెను.

ఆత్మానం చ ప్రవయసమాకలయ్య విశాంపతిః ।
వనం విరక్తః ప్రాతిష్ఠద్విమృశన్నాత్మనో గతిమ్ ॥ 67

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే ధ్రువచరితే
నవమోఽధ్యాయః

తనకును వార్ధక్యము వచ్చినట్లుగ భావించి యుత్తానపాదుడాత్మ తత్త్వమును గూర్చి చింతించుచు విషయవిరక్తుడై వనమునకు వెడలెను.

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని తొమ్మిదవ
అధ్యాయము సమాప్తము.





# పదియవ అధ్యాయము

## యక్షులచే ఉత్తముడు సంహరింపబడుట: ధ్రువుడు ఆ యక్షులతో యుద్ధము చేయుట.

కథాసారము :- తనసోదరుడగు ఉత్తముడు యక్షుల చేతిలో చచ్చుట చూచి శోకాతురుడై ధ్రువుడు ఆ యక్షులతో అలకాపట్టణమున భయంకర యుద్ధము చేయుట అనువిషయ మీయధ్యాయమున వర్ణితమైనది.

మహాబలుడగు ధ్రువుడు రాజ్యాభిషిక్తుడై యిరువురు కన్యలను పరిణయ మాడి రాజ్యమును పరిపాలింపసాగెను. ఒకప్పుడు సురుచినందనుడగు ఉత్తముడు వేటాడుటకై యొంటరిగ వనమునకు వెడలెను. అచట అతడు బలవంతులగు యక్షులచే సంహరింప బడెను. సురుచి జనులద్వారా పుత్రమరణ వార్తను విని తాను గూడ వనములోనికి వెడలి పుత్రునిగతినే పొందెను. ధ్రువుడు యుద్ధయాత్రచేసి యక్షులరాజధాని యగు అలకాపట్టణమునకు వెడలి యక్షులతో ఘోరసంగ్రామ మొనరించి వారి సైన్యమును చాలవఱకు నాశనము చేసెను. యక్షులు ఉత్తేజితులై భయంకర మగు అసురమాయను సృష్టించిరి. ఇది తెలిసికొని మునులు యుద్ధరంగమునకు వెడలి ధ్రువుని క్షేమమునకై శ్రీహరిని ప్రార్థింపసాగిరి.

### శ్రీ మైత్రేయ ఉవాచ

**ప్రజాపతేర్దుహితరం శిశుమారస్య వై ధ్రువః ।**
**ఉపయేమే భ్రమిం నామ తత్సుతౌ కల్పవత్సరౌ ॥ 1**

మైత్రేయుడు పలికెను :- విదురా! ధ్రువుడు ప్రజాపతియగు శిశుమారుని తనయయగు భ్రమి యనునామెను వివాహమాడి, ఆమెయందు కల్పము, వత్సరము అనుఇరువురు పుత్రులను కనెను.

**ఇలాయామపి భార్యాయాం వాయోః పుత్ర్యాం మహాబలః ।**
**పుత్రముత్కలనామానం యోషిద్రత్నమజీజనత్ ॥ 2**

మహాబలుడగు ధ్రువుడు వాయుపుత్రికయు, తనకు భార్యయునగు ఇల వలన ఉత్కలుడను నొకకుమారుని, స్త్రీ రత్న మగు నొక కన్యను గనెను.

ఉత్తమస్త్వకృతోద్వాహో మృగయాయాం బలీయసా ।
హతః పుణ్యజనేనాద్రౌ తన్మాతాస్య గతిం గతా ॥ 3

ఉత్తము డింకను వివాహమాడలేదు. అతడు వేటకై హిమాచలమునకు వెడలెను. అచట బలవంతుడగు ఒక యక్షునిచే అతడు సంహరింపబడెను. వానితల్లి యగు సురుచియు వానిని వెదకుచు మరణించెను.

ధ్రువో భ్రాతృవధం శ్రుత్వా కోపామర్షశుచార్పితః ।
జైత్రం స్యన్దనమాస్థాయ గతః పుణ్యజనాలయమ్ ॥ 4

ధ్రువుడు సోదరుని మరణవార్త విని క్రోధశోకోద్వేగములతో గూడినవాడై విజయప్రద మగునొకరథము నధిరోహించి యక్షదేశము వైపుగా వెడలెను.

గత్వోదీచీం దిశం రాజా రుద్రానుచరసేవితామ్ ।
దదర్శ హిమవద్ద్రోణ్యాం పురీం గుహ్యకసంకులామ్ ॥ 5

రాజగు ధ్రువుడు ఉత్తరాభిముఖముగ వెడలి రుద్రానుచరులచే సేవింపబడు హిమాలయ పర్వతముయొక్క సానువులలో యక్షులచే పరివ్యాప్తమగు అలక యను నగరమును చూచెను.

దధ్మౌ శంఖం బృహద్బాహుః ఖం దిశశ్చానునాదయన్ ।
యేనోద్విగ్నదృశః క్షత్తరుపదేవ్యోఽత్రసన్ భృశమ్ ॥ 6

విదురా! బృహద్బాహు వగు ధ్రువుడు ఆ పట్టణ సమీపమునకు వెడలి దిక్కులన్నియు ప్రతిధ్వనించునట్లు శంఖమును పూరించెను. దానివలన యక్షకాంతలు మిగుల భీతిచెందిరి.

తతో నిష్క్రమ్య బలిన ఉపదేవమహాభటాః ।
అసహన్తస్తన్నినాదమభిపేతురుదాయుధాః ॥ 7

మహాబలశాలురగు కుబేరుని సైనికు లా శంఖధ్వనిని సహింప జాలకపోయిరి. వారస్త్రశస్త్రముల ధరించి పట్టణమునుండి బయల్వెడలి ధ్రువుని కభిముఖముగ పరుగిడిరి.

స తానాపతతో వీర ఉగ్రధన్వా మహారథః ।
ఏకైకం యుగపత్సర్వానహన్ బాణైస్త్రిభిస్త్రిభిః ॥ 8

మహాధనుర్ధారియు, మహారథుడు, వీరుడు నగు ధ్రువుడు ముందుకువచ్చుచున్న ఆ సైన్యమును జూచి యొక్కొక్కనిని మూడేసి బాణములద్వారా యక్షులనందరిని ఒక్కమారే చంపెను.

**తే వై లలాటలగ్నైస్తైరిషుభిః సర్వ ఏవ హి ।**
**మత్వా నిరస్తమాత్మానమాశంసన్ కర్మ తస్య తత్ ॥ 9**

యక్షసైనికు లందఱు లలాటములయందు సంలగ్నములైన బాణములద్వారా తమ్ము పరాజితులునుగా భావించి ధ్రువుని ఆపనిని ప్రశంసింపసాగిరి.

**తేఽపి చాముమమృష్యన్తః పాదస్పర్శమివోరగాః ।**
**శరైరవిధ్యన్ యుగపద్ద్విగుణం ప్రచికీర్షవః ॥ 10**

పిమ్మట పాదస్పర్శనుగూడ సహింపని సర్పములవలె వారుగూడ ధ్రువుని ఆబాణపుదెబ్బలను సహింపజాలనివారై ప్రతీకారాభిప్రాయముతో వానిపై ఒకేకాలమున ఆఱేసిబాణముల చొప్పున విడచిరి.

**తతః పరిఘనిస్త్రింశైః ప్రాసశూలపరశ్వధైః ।**
**శక్త్యృష్టిభిర్భుశుండీభిశ్చిత్రవాజైః శరైరపి ॥ 11**

**అభ్యవర్షన్ ప్రకుపితాః సరథం సహసారథిమ్ ।**
**ఇచ్ఛన్తస్తత్ప్రతీకర్తుమయుతానాం త్రయోదశ ॥ 12**

పిమ్మట ప్రతీకారవాంఛతో కుపితులైన పదమూడు అయుతముల (130000) సంఖ్యగల యక్షసైన్యము రథముపైన, సారథిపైన, రథికుడగు ధ్రువునిపైన ఏకకాలములోనె పరిఘములు, ఖడ్గములు, ప్రాసములు, శూలములు, పరశ్వధములు, శక్తి, ఋష్టి, భుశుండి మున్నగునాయుధములను; విచిత్రములగు ఱెక్కలు గలిగిన బాణములను గురిపింపసాగిరి.

**ఔత్తానపాదిః స తదా శస్త్రవర్షేణ భూరిణా ।**
**నో ఏవాదృశ్యతాచ్ఛన్న ఆసారేణ యథా గిరిః ॥ 13**

వర్షధారలచే కప్పివేయబడిన పర్వతమువలె ధ్రువుడు అసంఖ్యములగు బాణముల వర్షముచే గప్పబడినవాడై కనబడకుండగ పోయెను.

**హాహాకారస్తదైవాసీత్సిద్ధానాం దివి పశ్యతామ్ ।**
**హతోఽయం మానవః సూర్యో మగ్నః పుణ్యజనార్ణవే ॥ 14**

అపుడు స్వర్గమున నున్న సిద్ధులందఱు యుద్ధమును జూచి హాహాకారముల జేయుచు "అయ్యో! మనువుపౌత్రుడగు ఈ ధ్రువుడు సూర్యునివలె యక్షసాగరమున నిమగ్నుడయ్యెనుగదా" యని పలుకసాగిరి.

నదత్సు యాతుధానేషు జయకాశిష్వథో మృధే ।
ఉదతిష్ఠద్రథస్తస్య నీహారాదివ భాస్కరః ॥ 15

పిమ్మట ఆ యుద్ధభూమియందు రాక్షసులు జయమగుగాక యని కేకలు వేయసాగిరి. ఇంతలో మంచునుండి బయల్వెడలిన భాస్కరునివలె యుద్ధరంగమునుండి ధ్రువునిరథము బయల్వెడలెను.

ధనుర్విస్ఫూర్జయన్దివ్యం ద్విషతాం ఖేదముద్వహన్ ।
అస్త్రౌఘం వ్యధమద్బాణైర్ఘనానీకమివానిలః ॥ 16

ధ్రువుడు ధనుష్టంకారముచేసి శత్రువులకు భయము కలుగజేసెను. వాయువు మేఘములను ఛిన్నభిన్నము చేయునట్లు తన శరాఘాతములచే శత్రువుల యస్త్రశస్త్రముల నన్నింటిని పొడిపొడిగ జేసెను.

తస్య తే చాపనిర్ముక్తా భిత్త్వా వర్మాణి రక్షసామ్ ।
కాయానావివిశుస్తిగ్మా గిరీనశనయో యథా ॥ 17

వాని ధనుస్సునుండి విడువబడిన ఆతీక్ష్ణ బాణములు పర్వతాగ్రములను భేదించు వజ్రాయుధమువలె రాక్షసుల కవచముల బగులగొట్టి శరీరముల లోనికి ప్రవేశింపసాగెను.

భల్లైః సంఛిద్యమానానాం శిరోభిశ్చారుకుండలైః ।
ఊరుభిర్హేమతాలాభైర్దోర్భిర్వలయవల్గుభిః ॥ 18

హారకేయూరముకుటైరుష్ణీషైశ్చ మహాధనైః ।
ఆస్తృతాస్తా రణభువో రేజుర్వీరమనోహరాః ॥ 19

జితేంద్రియుడవగు విదురా! ధ్రువుని బాణములచే తెగిపోయి సుందరకుండలములచే శోభిల్లు యక్షుల మస్తకములతోను, సువర్ణతాళవృక్షముల వంటి తొడలతోను, వలయ విభూషితములగు బాహువులతోను, హార కేయూరముకుటములతోను, బహుమూల్యము లగు ఉష్ణీషములతోను (తలపాగాలతోను) వ్యాప్తమైయున్న ఆ రణభూమి మనోహర మగు శోభను గలిగియుండెను.

హతావశిష్టా ఇతరే రణాజిరా -
ద్రక్షోగణాః క్షత్రియవర్యసాయకైః ।
ప్రాయో వివృక్ణావయవా విదుద్రువు -
ర్మృగేన్ద్రవిక్రీడితయూథపా ఇవ ॥ 20

చావగా మిగిలిన యక్షులు క్షత్రియశ్రేష్ఠుడగు ధ్రువుని బాణములచే వికలాంగులైరి. సింహముచే కొట్టబడిన యేనుగువలె వారు యుద్ధభూమి నుండి పారిపోసాగిరి.

**అపశ్యమానః స తదాఽఽతతాయినం**
**మహామృధే కంచన మానవోత్తమః ।**
**పురీం దిదృక్షన్నపి నావిశద్ద్విషాం**
**న మాయినాం వేద చికీర్షితం జనః ॥** 21

మనువంశశ్రేష్ఠుడగు ధ్రువునకు విశాలమగు ఆ రణభూమియం దొక్క శత్రువుగూడ అస్త్రశస్త్రముల ధరించి తనకెదురు వచ్చుచున్నట్లు గనబడలేదు. అపుడతడు అలకా పట్టణమును చూడదలంచెను. కాని యతడు దానిలోనికి ప్రవేశింపలేదు. యక్షులు మాయావులు, వారియభిప్రాయమును మానవులు తెలిసికొనజాలరుగదా!

**ఇతి బ్రువంశ్చిత్రరథః స్వసారథిం**
**యత్తః పరేషాం ప్రతియోగశంకితః ।**
**శుశ్రావ శబ్దం జలధేరివేరితం**
**నభస్వతో దిక్షు రజోఽన్వదృశ్యత ॥** 22

అని తనసారథి చెప్పగా విని చిత్రమైన రథము గల ధ్రువుడు 'శత్రువులు మరల దాడిచేయుదురేమో' యని జాగరూకుడై యుండెను. ఇంతలో వానికి మేఘగర్జనము వంటి భయంకరమగు నొకశబ్దము వినబడెను. వెంటనే ప్రచండమైన వాయువేగముచే నలువైపుల దుమ్మురేచెను.

**క్షణేనాచ్ఛాదితః వ్యోమ ఘనానీకేన సర్వతః ।**
**విస్ఫురత్తడితా దిక్షు త్రాసయత్ స్తనయిత్నునా ॥** 23

క్షణములో ఆకాశమార్గము మేఘచ్ఛన్నమయ్యెను. అన్నివైపుల మెఱుపులు మాటిమాటికి మెఱయసాగెను. భయంకరములగు ఉరుముల వలన ప్రాణులు భయపడుచుండెను.

**వవృషూ రుధిరౌఘాసృక్పూయవిణ్మూత్రమేదసః ।**
**నిపేతుర్గగనాదస్య కబన్ధాన్యగ్రతోఽనఘ ॥** 24

విదురా! అప్పుడా మేఘములనుండి రక్తము, శ్లేష్మము, చీము, మలము, మూత్రము, మేదస్సు కురియసాగెను. గగనమండలమునుండి ధ్రువునియెదుట శిరస్సులు లేని కళేబరములు పడసాగెను.

తతః ఖేఽ దృశ్యత గిరిర్నిపేతుః సర్వతో దిశమ్ ।
గదాపరిఘనిస్త్రింశముసలాః సాశ్మవర్షిణః ॥ 25

అనంతర మాకాశమున ఒకపర్వతము కనబడెను. దానినుండి నలువైపుల రాళ్ళవర్షము,దానితోపాటు గదలు, పరిఘలు, ఖడ్గములు, ముసలములు పడసాగెను.

అహయోఽ శనినిఃశ్వాసా వమన్తోఽగ్నిం రుషాక్షిభిః ।
అభ్యధావన్ గజా మత్తాః సింహవ్యాఘ్రాశ్చ యూథశః ॥ 26

భయంకరములగు సర్పములు క్రోధముతో నేత్రములనుండి నిప్పుకణములను గురిపించుచు పిడుగుపాటువంటి ధ్వనితో బుసలుగొట్టుచు పరుగిడసాగెను. మదించిన యేనుగులు, సింహములు, వ్యాఘ్రములు మున్నగు జంతువులు గుంపులుగుంపులుగ ధ్రువుని కభిముఖముగ పరుగిడ జొచ్చెను.

సముద్ర ఊర్మిభిర్భీమః ప్లావయన్ సర్వతో భువమ్ ।
ఆససాద మహాహ్రాదః కల్పాన్త ఇవ భీషణః ॥ 27

భయంకరమగు సముద్రము ప్రళయకాలమునాటి మహాభయంకరత్వమును పొంది ప్రబలములగు తరంగములతో నిఖిలభువనములను ముంచివేయుచు భీషణముగ గర్జించుచుండెను.

ఏవం విధాన్యనేకాని త్రాసనాన్యమనస్వినామ్ ।
ససృజుస్తిగ్మగతయ ఆసుర్యా మాయయాసురాః ॥ 28

విదురా! క్రూరప్రవృత్తి గల యక్షులు తమ ఆసురీమాయచే పరాక్రమహీనులగు మానవులకు (పిరికివారికి) భయముగొల్పు నిట్టి పనుల నెన్నింటినో చూపిరి.

ధ్రువే ప్రయుక్తామసురైస్తాం మాయామతిదుస్తరామ్ ।
నిశమ్య తస్య మునయః శమాశంసన్ సమాగతాః ॥ 29

ధ్రువునిపై రాక్షసులు ప్రయోగించిన అతిదుస్తరమగు మాయను గూర్చి తెలిసికొని మును లాప్రదేశమునకు వెడలి, ధ్రువునిక్షేమమునకై భగవానుని ప్రార్థింపసాగిరి.

### శ్రీ మునయ ఊచుః

ఔత్తానపాద భగవాంస్తవ శార్ఙ్గధన్వా
దేవః క్షిణోత్వవనతార్తిహరో విపక్షాన్ ।
యన్నామధేయమభిధాయ నిశమ్య వాద్ధా
లోకోఽఞ్జసా తరతి దుస్తరమంగ మృత్యుమ్ ॥ 30

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే ధ్రువచరితే యక్షమాయాధానం
నామ దశమోఽధ్యాయః

మునులు పలికిరి :- ఉత్తానపాదుని నందనుడవగు ధ్రువా! ఎవనినామము నుచ్చరించిన, శ్రవణముచేసిన జీవుడు దుర్నివారమగు మృత్యుహస్తములనుండి సులభముగ పరిత్రాణమును పొందునో అట్టి ప్రణతజనులదుఃఖమును పోగొట్టువాడు, శార్ఙ్గమను ధనుస్సును ధరించినవాడు నగు శ్రీహరి నీ శత్రువులను సంహరించుగాక!

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని పదియవ
అధ్యాయము సమాప్తము.

❀ ❀ ❀



# పదునొకండవ అధ్యాయము

## స్వాయంభువమనువు యుద్ధమును విరమింపుమని ధ్రువునకు బోధించుట.

కథాసారము :- ఈ యధ్యాయమున స్వాయంభువ మనువు యక్షవినాశమును చూచి పౌత్రుడగు ధ్రువునికడకు వచ్చుట, వానికి ఆయన తత్త్వము నుపదేశించి అట్టి కార్యమును ఆపుచేయుట యనువిషయములు వర్ణితములైనవి.

మనువు ధ్రువునితో నిట్లు పలికెను :- "దేహాత్మాభి మానులగు జీవులు పరస్పరము హింసించు కొనుచుందురు. భగవద్భక్తులు సర్వభూతములయందు ఆత్మభావమును దర్శింతురు. సర్వప్రాణుల కాశ్రయుడగు భగవానునొక్కనినే ఆరాధింతురు. వారు సర్వభూతములయందు దయ, శత్రువులపై క్షమ, సర్వజీవులలో సమదర్శనము మున్నగు శిష్టాచారముల ద్వారా భగవంతుని ప్రసన్నునిగ జేయుచు దేహబంధనముల నుండి విముక్తులగుదురు. ఆత్మతత్త్వదృష్టిలో భ్రాతృత్వాది సంబంధములు పంచభూతాత్మకము లైన దైహిక సంబంధములు మాత్రమే. భగవానుని యచింత్యకాలశక్తి ప్రభావముచే సృష్టి స్థితిలయకార్యాదులు జరుగును. వారికి ద్వేషింపదగినవారు కాని, ప్రేమింపదగినవారు కాని యెవ్వరు ఉండరు. కర్మఫలానుయాయులగు జీవులకు విభిన్నగతులు గలుగును. భగవానుని గొందఱు స్వభావమనియు, గొందఱు కాలమనియు, కొందఱు దేవుడనియు, కొందఱు పురుషుని కామమనియు కీర్తింతురు. వాస్తవములో ఆయన వాక్కు మున్నగు ఇంద్రియముల కతీతమైన వస్తువైయున్నాడు. భగవంతుడే సమస్తమునకు మూలకారణుడు. ఆయన నన్వేషించిన నేను, నాది యనుబుద్ధి, దానివలన గలుగు శత్రుమిత్రాది భేదజ్ఞానము నశించును." పిమ్మట స్వాయంభవుమనువు కుబేరునకు సంతోషమును గలుగజేయ వలసినది యని ధ్రువునకు ఉపదేశించి స్వస్థానమునకు వెడలెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

**విశమ్య గదతామేవమృషీణాం ధనుషి ధ్రువః ।**
**సన్దధేఽస్త్రముపస్పృశ్య యన్నారాయణ నిర్మితమ్ ॥** 1

మైత్రేయుడు పలికెను :- ఋషులు పలికిన యీ వాక్యములను విని ధ్రువుడు ఆచమించి శరాసనమున నారాయణాస్త్రమును సంధించెను.

సన్దీయమాన ఏతస్మిన్ మాయా గుహ్యకనిర్మితాః ।
క్షిప్రం వినేశుర్విదుర క్లేశా జ్ఞానోదయే యథా ॥ 2

విదురా! జ్ఞానాదులు గలుగగా రాగాదులు నివృత్తి చెందునట్లు ధ్రువుడు ధనుస్సున శరము నెక్కుబెట్టగా యక్షనిర్మిత మగు మాయ వెంటనే నశించెను.

తస్యార్షాస్త్రం ధనుషి ప్రయుంజతః
సువర్ణపుంఖాః కలహంసవాససః ।
వినిస్సృతా ఆవివిశుర్ద్విషద్బలం
యథా వనం భీమరవాః శిఖండినః ॥ 3

నారాయణ ఋషిచే ఆవిష్కృతమగు ఆయస్త్రము ధ్రువుని ధనుస్సుపై నెక్కుపెట్టబడినంతనె దానినుండి సువర్ణమయమూల ప్రదేశయుక్తములు, కలహంసలవలె మనోహరపక్ష విశిష్టములు నగు శరములు బయల్వెడలెను. నెమళ్లు భయంకరధ్వనుల జేయుచు వనములోనికి ప్రవేశించునట్లు ఆ బాణములు శత్రుసేనలోనికి ప్రవేశించినవి.

తైస్తిగ్మధారైః ప్రధనే శిలీముఖై-
రితస్తతః పుణ్యజనా ఉపద్రుతాః ।
తమభ్యధావన్ కుపితా ఉదాయుధాః
సుపర్ణమున్నద్ధఫణా ఇవాహయః ॥ 4

యక్షులు ఆతీక్ష్ణ బాణములచే యుద్ధరంగమున అటునిటు చెల్లచెదరై పోయిరి. పెద్దపెద్దపడగలు గల సర్పములు పడగల నెత్తుకొని గరుడుని వైపు పరుగిడునట్లు ఈ యక్షులందఱు క్రోధముతో అస్త్రశస్త్రముల ధరించి ధ్రువునివైపు పరుగిడిరి.

స తాన్ పృషత్కైరభిధావతో మృధే
నికృత్తబాహూరుశిరోధరోదరాన్ ।
నినాయ లోకం పరమర్కమండలం
వ్రజన్తి నిర్భిద్య యమూర్ధ్వరేతసః ॥ 5

యక్షులు యుద్ధస్థలమునకు వచ్చుట చూచి ధ్రువుడు బాణములచే వారిలో కొందఱి బాహువులను, కొందఱి తొడలును, కొందరి మెడలను, గొందఱి యుదరములను ఛేదించెను. ఇట్లే అనేకులను పరలోకము (సత్యలోకము) నకు పంపెను. ఊర్ధ్వరేతస్కులు, బ్రహ్మచారులు, సన్న్యాసులు సూర్యమండలమును ఛేదించుకొని యాలోకమునకు వెడలుదురు.

తాన్ హన్యమానానభివీక్ష్య గుహ్యకా -
ననాగసశ్చిత్రరథేన భూరిశః ।
ఔత్తానపాదిం కృపయా పితామహో
మనుర్జగాదోపగతః సహర్షిభిః ॥ 6

ధ్రువు డిట్లు నిరపరాధులగు యక్షుల నెందరినో చంపుట చూచి పితామహుడగు మనువు కృపాపరవశుడై మహర్షుల వెంటనిడుకొని అచటికి వెడలి ఉత్తానపాదుని పుత్రునితో నిట్లు పలికెను.

## శ్రీ మనురువాచ

అలం వత్సాతిరోషేణ తమోద్వారేణ పాప్మనా ।
యేన పుణ్యజనా నేతా నవధీస్త్వమనాగసః ॥ 7

మనువు పలికెను :- వత్సా! నీవు క్రోధవశుడవై నిరపరాధులగు ఈ గుహ్యకుల నెందఱినో చంపితివి. ఇది మహాపాపమును గలుగజేయు నట్టిది. అందువలన నరకమునకు ద్వారస్వరూప మగు నీ యాక్రోధమును విడువుము.

నాస్మత్కులోచితం తాత కర్మైతత్సద్విగర్హితమ్ ।
వధో యదుపదేవానామారబ్ధస్తేఽ కృతైనసామ్ ॥ 8

కుమారా! నీ వీనిరపరాధులగు గుహ్యకులను జంపుటకు ప్రవృత్తుడవైతివి. ఇది సాధుజననిందిత మైన కార్యము, ఇది మనకులమునకు తగినది కాదు.

నన్వేకస్యాపరాధేన తత్సంగాద్బహవో హతాః ।
భ్రాతుర్వధాభిత ప్తేన త్వయాంగ భ్రాతృవత్సల ॥ 9

భ్రాతృవత్సలుడ వగు ధ్రువా! నీ సోదరుని ఒక్కడు సంహరించి నాడు, కాని నీవు భ్రాతృవధవలన గలిగిన కోపముచే అభితప్తుడవై యొకని యపరాధమునకు ఎందఱినో బలిచేసితివి.

నాయం మార్గో హి సాధూనాం హృషీకేశానువర్తినామ్ ।
యదాత్మానం పరాగ్గృహ్య పశువద్భూతవైశసమ్ ॥ 10

ధ్రువా! ప్రత్యక్షముగ నున్న యీదేహము ను ఆత్మగ భావించి ప్రాణులను హింసించుట పశువుల స్వభావము, కాని అట్టిహింసాప్రవృత్తి సర్వేంద్రియాధిపతి యగుహృషీకేశు ననుసరించు భగవద్భక్తుల మార్గము గాదు.

**సర్వభూతాత్మభావేన భూతావాసం హరిం భవాన్ ।**
**ఆరాధ్యాప దురారాధ్యం విష్ణోస్తత్ పరమం పదమ్ ॥ 11**

సర్వప్రాణులయందు భగవానుడున్నాడని తెలిసికొని సర్వభూతాంతర్యామియు, దురారాధ్యుడు నగు శ్రీహరి నారాధించి పరమోత్కృష్ట మగు పదమును పొందితివి.

**స త్వం హరేరనుధ్యాత స్తత్పుంసామపి సమ్మతః ।**
**కథం త్వవద్యం కృతవాననుశిక్షన్ సతాం వ్రతమ్ ॥ 12**

నీవు నిరంతరము శ్రీహరిని ధ్యానించుచున్నావు. హరిభక్తులు నిన్ను ప్రశంసించు చుందురు. నీవు సాధువుల ఆచరణమును నేర్చుకొంటివి. అయినను నీ వేల యిట్టి నిందింపదగిన కార్యము నొనర్చుచున్నావు?

**తితిక్షయా కరుణయా మైత్ర్యా చాఖిలజన్తుషు ।**
**సమత్వేన చ సర్వాత్మా భగవాన్ సంప్రసీదతి ॥ 13**

మహాత్ములయందు తితిక్షను, నీచులయందు దయను, సమాన వ్యక్తులయందు మైత్రిని, సర్వప్రాణులయందు సమత్వమును జూపువానిపై సర్వాంతర్యామియగు భగవానుడు ప్రసన్నుడగును.

**సంప్రసన్నే భగవతి పురుషః ప్రాకృతైర్గుణైః ।**
**విముక్తో జీవనిర్ముక్తో బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 14**

భగవానుడు ప్రసన్నుడైనచో మానవుడు ప్రాకృతగుణములనుండి విముక్తుడగును. అందువలన గుణములకు కార్యస్వరూప మగు లింగశరీరము నుండి విముక్తుడై సుఖాత్మక మగు బ్రహ్మపదమును పొందును.

**భూతైః పంచభిరారబ్ధైర్యోషిత్ పురుష ఏవ హి ।**
**తయోర్వ్యవాయాత్ సంభూతిర్యోషిత్పురుషయోరిహ ॥ 15**

పంచభూతములు దేహాకారముగ పరిణమించి స్త్రీపురుషరూపములుగ ఉత్పన్నము లగును. ఇంకను ఈ స్త్రీ పురుషుల గలయికవలన ఈ ప్రపంచమున ఇతర స్త్రీ పురుషులు ఉద్భవింతురు.

**ఏవం ప్రవర్తతే సర్గః స్థితిః సంయమ ఏవ చ ।**
**గుణవ్యతికరాద్రాజన్ మాయయా పరమాత్మనః ॥ 16**

వత్సా! భగవానునిమాయచే గుణవైషమ్యమువలన సృష్టి స్థితి లయకార్యములు ప్రవర్తిల్లుచుండును.

**నిమిత్తమాత్రం తత్రాసీన్నిర్గుణః పురుషర్షభః ।**
**వ్యక్తావ్యక్తమిదం విశ్వం యత్ర భ్రమతి లౌహవత్ ॥ 17**

ఈశ్వరుడు గుణాధీశుడు, ఆయన సృష్ట్యాది కార్యములయందు జడప్రకృతి కధిష్ఠాత, నిమిత్తకారణుడు, లోహము జడమైనను నిమిత్తస్వరూపమగు అయస్కాంతముచే ఆకృష్టమై చైతన్యము గలది యగును. అట్లే యీ విశ్వముగూడ భగవదీక్షణ ప్రభావముచే దేవమనుష్యాది రూపములుగ పరివర్తిత మగుచుండును.

**స ఖల్విదం భగవాన్ కాలశక్త్యా**
**గుణప్రవాహేణ విభక్తవీర్యః ।**
**కరోత్యకర్తైవ నిహన్త్యహన్తా**
**చేష్టా విభూమ్నః ఖలు దుర్విభావ్యా ॥ 18**

కాలశక్తి ప్రభావముచే గుణములకుక్షోభము గలుగగా ఈశ్వరుడు తనశక్తిని విభజించి "అకర్త"యైనను కర్మచేయుచుండును. "హన్త" కాకపోయినను వినాశము చేయును. సర్వశక్తిమంతుడగు భగవానుని కార్యము నిజముగ అచింత్యమైనదే.

**సోఽనన్తోఽన్తకరః కాలోఽనాదిరాదికృదవ్యయః ।**
**జనం జనేన జనయన్ మారయన్ మృత్యునాన్తకమ్ ॥ 19**

కాలరూపుడగు భగవానుడు స్వయముగ అనాదియు, అనంతుడు, అవ్యయుడు నై యున్నాడు. ఆయన ప్రాణులద్వారానే ప్రాణులను సృష్టించు చుండును. మృత్యువుద్వారా అంతకు (చోరులు మొదలగు వారి) ని గూడ సంహరించును.

**న వై స్వపక్షోఽస్య విపక్ష ఏవ వా**
**పరస్య మృత్యోర్విశతః సమం ప్రజాః ।**
**తం ధావమానమనుధావన్త్యనీశా**
**యథా రజాంస్యనిలం భూతసంఘాః ॥ 20**

మృత్యురూప మగుకాలమునకు తనవాడని పరుడని ఎవ్వడును లేడు. అది సమభావముతో సర్వప్రాణులలో ప్రవేశించును. అంతట సంచరించుచుండును. ధూళిసమూహము వాయువు వెంటనంటి పరుగిడు నట్లు కర్మాధీనములైన ప్రాణులన్నియు తమతమ కర్మలకు లోబడి కాలము వెంటనంటి పరుగిడుచుండును.

**ఆయుషోఽపచయం జన్తోస్తథైవోపచయం విభుః ।**
**ఉభాభ్యాం రహితః స్వస్థో దుఃస్థస్య విదధాత్యసౌ ॥ 21**

సర్వశక్తిమంత ముగకాలము తనయందు తానే యుండును. అందువలన ఆకాలమునకు కాలముకాని అకాలముకాని లేదు. అది కర్మాధీనులగుజీవులలో గొందఱికి అకాలమరణమును గలిగించును, కొందఱను కాల మరణమునుండి రక్షించును.

**కేచిత్కర్మ వదన్త్యేనం స్వభావమపరే నృప ।**
**ఏకే కాలం పరే దైవం పుంసః కామముతాపరే ॥ 22**

రాజా! మీమాంసకు లీకాలమును కర్మమనియు, చార్వాకులు స్వభావమనియు, వ్యావహారికులు కాలమనియు, జ్యోతిశ్శాస్త్రవేత్తలు గ్రహాదిరూపదైవమనియు, వాత్స్యాయనాది ఋషులు పురుషుని కామమనియు జెప్పుచున్నారు.

**అవ్యక్తస్యాప్రమేయస్య నానాశక్త్యుదయస్య చ ।**
**న వై చికీర్షితం తాత కో వేదాథ స్వసంభవమ్ ॥ 23**

వత్సా! ఈశ్వరు డవ్యక్తుడు, అప్రమేయుడు, మహదాది నానావిధ శక్తు లాయన నుండియే యుద్భవించినవి. ఆయన యేమిచేయదలచు చున్నాడో యెవ్వరికిని దెలియదు. అందువలన తనకు మూలకారణుడైన ఆభగవానుని గూర్చి ఎవ రెరుగగలరు?

**న చైతే పుత్రక భ్రాతుర్హన్తారో ధనదానుగాః ।**
**విసర్గాదానయోస్తాత పుంసో దైవం హి కారణమ్ ॥ 24**

ధ్రువా! ఈ కుబేరుని యనుచరులు నీ సోదరుడగు ఉత్తముని సంహరించినా రని నీవు తలంచుచున్నావు. కాని వాస్తవముగ వారు వాని వధకు కర్తలుగారు. పురుషుని జననమరణములకు కర్త భగవానుడే.

**స ఏవ విశ్వం సృజతి స ఏవావతి హన్తి చ ।**
**తథాపి హ్యనహంకారో నాజ్యతే గుణకర్మభిః ॥ 25**

ఈశ్వరుడే విశ్వమును సృష్టించుచున్నాడు. రక్షించుచున్నాడు, సంహరించుచున్నాడు. అయినను ఆయన నిరంహంకారుడు, ఏవిధముగను గుణములయందు కర్మలయందు లిప్తుడు గాడు.

**ఏష భూతాని భూతాత్మా భూతేశో భూతభావనః ।**
**స్వశక్త్యా మాయయా యుక్తః సృజత్యత్తిచ పాతి చ ॥ 26**

ఈ భగవానుడు సర్వనియంత, సర్వభూతరక్షకుడు, సర్వప్రాణకారణుడు. ఆయన తనశక్తిద్వారా ఈ స్థావరజంగమాత్మక మగు విశ్వమును సృష్టించుచున్నాడు. పాలించు చున్నాడు. సంహరించుచున్నాడు.

తమేవ మృత్యుమమృతం తాత దైవం
సర్వాత్మనోపైహి జగత్పరాయణమ్ ।
యస్మై బలిం విశ్వసృజో హరన్తి
గావో యథోత వసి దామయన్త్రితాః ॥ 27

కుమారా! ఆయన భక్తులు గానివారికి మృత్యువు, భక్తులైనవారికి అమృతస్వరూపుడు. ఆయనయే విశ్వమునకు పరమేశ్వరుడు, జగద్వాసులకు ఏకైకాశ్రయుడు. సర్వాత్మనా ఆయననే ఆశ్రయింపవలెను. ముక్కుత్రాళ్లు వేయబడిన ఎడ్లు యజమాని పనులను నెఱవేర్చునట్లు బ్రహ్మాది ప్రజాపతులు పరమేశ్వరునికై పూజోపహారములను తెచ్చుచున్నారు.

యః పంచవర్షో జననీం త్వం విహాయ
మాతుః సపత్న్యా వచసా భిన్నమర్మా ।
వనం గతాస్తపసా ప్రత్యగక్ష -
మారాధ్య లేభే మూర్ధ్ని పదం త్రిలోక్యాః ॥ 28

ధ్రువా! నీవు సవతితల్లి వాగ్బాణములచే పీడితుడవై ఐదు సంవత్సరముల వయస్సులోనే నీ తల్లిని విడచిపెట్టి వనమునకు వెడలితివి. యోగులచే ధ్యానింపబడు భగవానుని తపస్సుచే నారాధించి త్రిలోకముల కంటె పైనగల లోకమును పొందితివి.

తమేనమంగాత్మని ముక్తవిగ్రహే
వ్యపాశ్రితం నిర్గుణమేకమక్షరమ్ ।
ఆత్మానమన్విచ్ఛ విముక్తమాత్మదృక్
యస్మిన్నిదం భేదమసత్ప్రతీయతే ॥ 29

ఇప్పుడు నీవు ఆత్మదర్శివై నిర్గుణుడు, అద్వయతత్త్వుడు, అచ్యుతుడు, నిత్యముక్తుడు నగు పరమాత్మ నన్వేషింపుము. ఆయన నిర్విరోధాంతఃకరణమున నిరంతరము నివసించియుండును. ఆపరమాత్మని అన్వేషణమున తత్పరుడ వైనచో నీకు శత్రుమిత్రాదిభేదమ అరుచిగ దోచును.

త్వం ప్రత్యగాత్మని తదా భగవత్యనన్త
ఆనన్దమాత్ర ఉపపన్నసమస్తశక్తౌ ।
భక్తిం విధాయ పరమాం శనకైరవిద్యా -
గ్రన్థిం విభేత్స్యసి మమాహమితి ప్రరూఢమ్ ॥ 30

పరమాత్మను అన్వేషించుసమయమున నీవు స్వరూపభూతుడు, త్రివిధ పరిచ్ఛేద రహితుడు, ఆనందైకరసుడు, సర్వశక్తిసంపన్నుడు నగు నా భగవంతునియందు అహైతుకము, అవ్యవహితము నగు పరాభక్తిని గలిగియున్నచో సహజముగనే నేను, నాది యను అవిద్యాగ్రంథిని ఛేదింప గలవు.

సంయచ్ఛ రోషం భద్రం తే ప్రతీపం శ్రేయసాం పరమ్ ।
శ్రుతేన భూయసా రాజన్నగదేన యథామయమ్ ॥ 31

రాజా! క్రోధము శ్రేయస్సాధన విషయమున మిగుల ప్రతికూల మైనది, ఔషధమును సేవించుట వలన రోగము నిరామయ మగునట్లు శాస్త్రజ్ఞానము ద్వారా నీవు దాని నుపసంహరింపుము. దానివలన నీకు శుభము కలుగును.

యేనోపసృష్టాత్పురుషాల్లోక ఉద్విజతే భృశమ్ ।
న బుధస్తద్వశం గచ్ఛేదిచ్ఛన్న భయమాత్మనః ॥ 32

క్రోధమునకు వశుడయిన పురుషునివలన జనులకు మిగుల భయము కలుగును. అందువలన తనక్షేమమును గోరుకొను వ్యక్తి యెప్పుడును క్రోధమునకు వశుడు కారాదు.

హేలనం గిరిశభ్రాతుర్ధనదస్య త్వయా కృతమ్ ।
యజ్జఘ్నివాన్ పుణ్యజనాన్ భ్రాతృఘ్నా నిత్యమర్షితః ॥ 33

వత్సా! యక్షానుచరులు నీ సోదరుని వధించినా రని భావించి క్రోధముతో వారిని సంహరించి శంకరునకు సోదరుడగు కుబేరున కవమానమును గలుగజేసితివి.

తం ప్రసాదయ వత్సాశు సన్నత్యా ప్రశ్రయోక్తిభిః ।
న యావన్మహతాం తేజః కులం నోఽభిభవిష్యతి ॥ 34

లోకపాలుర తేజస్సుచే మనవంశము నాశము కాకపూర్వమే నీవు త్వరగ ధనపతి యగు కుబేరునకు నమస్కరించి, స్తుతివాక్కులచే ఆతనిని ప్రసన్నునిగ జేసికొనుము.

ఏవం స్వాయంభువః పౌత్రమనుశాస్య మనుర్ధ్రువమ్ ।
తేనాభివన్దితః సాకమృషిభిః స్వపురం యయౌ ॥ 35

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే ధ్రువచరితే మనువాక్యం
నామ ఏకాదశోఽధ్యాయః

స్వాయంభువ మనువు తనపౌత్రున కిట్లు ఉపదేశించి, వానిచే సంస్తుతుడై ఋషులతో గలసి తనలోకమునకు వెడలెను.

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని పదునొకండవ
అధ్యాయము సమాప్తము.





# పంద్రెండవ అధ్యాయము

## ధ్రువుడు కుబేరునివలన వరములను పొంది, విష్ణులోకమునకు వెడలుట

కథాసారము:- ఈయధ్యాయమున కుబేరుని సంతుష్టపఱచి ధ్రువుడు తనపట్టణమునకు వెడలుట, భూరిదక్షిణాదులతో గూడిన బహుయజ్ఞములద్వారా యజ్ఞేశ్వరు డగుశ్రీహరి నారాధించుట, సప్తర్షులకు దుర్లభము, సర్వలోకపూజ్యమునగు విష్ణువుయొక్క పరమపదము నధిరోహించుట యను విషయములు వర్ణింపబడినవి.

ఆ విష్ణువుయొక్క పరమపదము స్వయంప్రకాశజ్యోతి ద్వారా యెల్లపుడు ప్రకాశించుచుండును. అచటికి ఎవ్వరును వెడలలేరు. భగవద్భక్తులకు ప్రియమును జేకూర్చువారే అనాయాసముగ విష్ణువుపరమపదమును పొందుదురు. పిమ్మట దేవర్షి యగునారదుడు ధ్రువునిమహిమను వర్ణించి, అట్టిభక్తుల మహిమను శ్రవణము చేయుటద్వారా, కీర్తించుట ద్వారా అనాయాసముగ భక్తిని పొందవచ్చు ననిచెప్పెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

ధ్రువం నివృత్తం ప్రతిబుధ్య వైశసా -
దపేతమన్యుం భగవాన్ ధనేశ్వరః ।
తత్రాగతశ్చారణయక్షకిన్నరైః
సంస్తూయమానో న్యవదత్కృతాంజలిమ్ ॥ 1

మైత్రేయుడు పలికెను:- విదురా! ధ్రువుడు పితామహుని వాక్కులను విని, క్రోధమును విడచి, హింసాత్మకకార్యమునుండి నివృత్తుడయ్యెను. ఇది తెలిసికొని ధనపతి యగు కుబేరుడు వానికడకు వచ్చెను. యక్షులు, కిన్నరులు గూడ స్తుతించుచు ఆకుబేరుని వెంట వచ్చిరి. దోసిలి యొగ్గి నమస్కరించుచున్న ధ్రువుని జూచి కుబేరుడు వానితో నిట్లు పలుకసాగెను.

### శ్రీధనద ఉవాచ

భోభోః క్షత్రియదాయాద పరితుష్టోఽస్మి తేఽ నఘ ।
యత్త్వం పితామహాదేశాద్వైరం దుస్త్యజమత్యజః ॥ 2

ధనపతి పలికెను :- క్షత్రియకుమారా ! అనఘా ! నేను నీపట్ల మిగుల సంతుష్టుడ నైతిని.ఏలయన, నీవు పితామహు డగుమనువు యొక్క ఉపదేశము ననుసరించి విడువరాని శత్రుత్వమును విడచిపెట్టితివి.

న భవానవధీద్యక్షాన్ న యక్షా భ్రాతరం తవ ।
కాల ఏవ హి భూతానాం ప్రభురప్యయభావయోః ॥ 3

నీవు యక్షులను సంహరింపలేదు. యక్షులు నీసోదరుని సంహరింప లేదు. కాలమే ప్రాణులజననమరణముల కేకైక మగు గారణము.

అహం త్వమిత్యపార్థా ధీరజ్ఞానాత్పురుషస్య హి ।
స్వాప్నీవాభాత్యతద్ధ్యానాద్యయా బన్ధవిపర్యయౌ ॥ 4

పురుషునిఅజ్ఞానమువలన స్వప్నకాలికజ్ఞానమువలె వానికి నేను, నీవు అనుమిథ్యాబుద్ధి కలుగుచున్నది. ఈబుద్ధిద్వారానే దేహాభిమానము, బంధనములు, దుఃఖములు గలుగుచున్నవి.

తద్గచ్ఛ ధ్రువ భద్రం తే భగవన్తమధోక్షజమ్ ।
సర్వభూతాత్మభావేన సర్వభూతాత్మవిగ్రహమ్ ॥ 5

భజస్వ భజనీయాంఘ్రిమభవాయ భవచ్ఛిదమ్ ।
యుక్తం విరహితం శక్త్యా గుణమయ్యాత్మ మాయయా ॥ 6

ధ్రువా ! ఈప్రదేశమునుండి వెడలుము. సర్వభూతములను పరమాత్మభావముతో దర్శించుచు అతీంద్రియుడు, సర్వభూతాంతర్యామి, సంసారనాశకుడు అగుభగవానుని పాదపద్మములను పొందుటకై ఆయనను సేవింపుము. ఆయనపాదపద్మములే జీవునకు సేవింపదగినవి, సంసారనివర్తకములు నైయున్నవి. ఆయున స్వరూపభూత మగుఅంతరంగశక్తియుక్తుడు. కాని ఆయనయందు త్రిగుణమయ మైనబహిరంగ మాయకు అధిష్ఠానము లేదు. ఆయన మాయాధీశుడు. ఇట్లు భగవానుని సేవించుటవలననే నీకు శుభము గలుగును.

వృణీహి కామం నృప యన్మనోగతం
మత్తస్త్వమౌత్తానపదేఽ విశంకితః ।
వరం వరార్హోఽ మ్బుజనాభపాదయో -
రనన్తరం త్వాం వయమంగ శుశ్రుమః ॥ 7

ఉత్తానపాదనందనా! రాజా! నానుండి వరము, ఏదైన కోరుకొనదలచినచో నిర్భయముగ అడుగవచ్చును. వత్సా! నీవు పద్మనాభుడగు శ్రీహరిపాదముల కతి సమీపమునకు జేరుకొంటి వనివింటిని. అందువలన నీవు వరములను పొందుటకు దగినవాడవు, దీనిలో నెట్టిసందేహమును లేదు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

స రాజరాజేన వరాయ చోదితో
ధ్రువో మహాభాగవతో మహామతిః ।
హరౌ స వవ్రేఽ చలితాం స్మృతిం యయా
తరత్యయత్నేన దురత్యయం తమః ॥ 8

మైత్రేయుడు పలికెను ;- ఇట్లు ధనపతి యగుకుబేరుడు వరమడుగ మనిప్రేరేపింపగా మహాభాగవతుడు, మహామతియు నగుధ్రువుడు దేనిచే మానవుడు దుస్తర మగుసంసార సాగరమును సులభముగ దాటగలుగునో అట్టిశ్రీహరియందు స్థిరమగు స్మృతిని తనకు గలుగజేయవలసినదిగా కోరుకొనెను.

తస్య ప్రీతేన మనసా తాం దత్త్వైలవిలస్తతః ।
పశ్యతోఽ న్తర్దధే సోఽ పి స్వపురం ప్రత్యపద్యత ॥ 9

ఇలవిలయొక్కపుత్రు డగుకుబేరుడు ప్రసన్న మగుమనస్సుతో ఆధ్రువునకు స్థిర మగుభగవత్స్మృతిని కలిగించి అంతర్హితుడయ్యెను. పిమ్మట ధ్రువుడు తనపట్టణమునకు వెడలెను.

అథాయజత యజ్ఞేశం క్రతుభిర్భూరిదక్షిణైః ।
ద్రవ్యక్రియా దేవతానాం కర్మకర్మఫలప్రదమ్ ॥ 10

పిమ్మట ధ్రువుడు గృహమునకు తిరిగివచ్చి భూరిదక్షిణలతో గూడిన యజ్ఞములతో యజ్ఞపురుషుని ఆరాధించెను. భగవానుడే ద్రవ్యక్రియా దేవతాసంబంధ మగుకర్మయు, తత్కర్మఫలరూపుడు నైయున్నాడు. ఆయనయే ఫలప్రదాతయు నైయున్నాడు.

సర్వాత్మన్యచ్యుతేఽ సర్వే తీవ్రౌఘాం భక్తిముద్వహన్ ।
దదర్శాత్మని భూతేషు తమేవావస్థితం విభుమ్ ॥ 11

సర్వజీవుల కాత్మస్వరూపుడు, సర్వజడోపాధివర్జితుడు అగునచ్యుతునియందు అనన్యభక్తి నుంచి, ఆయనను తనలోను సర్వభూతములలోను ఉన్నట్లుగ దర్శించెను.

తమేవం శీలసంపన్నం బ్రహ్మణ్యం దీనవత్సలమ్ ।
గోప్తారం ధర్మసేతూనాం మేనిరే పితరం ప్రజాః ॥ 12

ఇట్టి భగవద్భక్తి లక్షణయుక్తుడు సద్బ్రాహ్మణులకు హితముచేయువాడు,దీనులపై దయగలవాడు, వర్ణాశ్రమధర్మములను రక్షించువాడు అగు ధ్రువుని ప్రజలు తమకు దండ్రిగా తలంచిరి.

షట్త్రింశద్వర్షసాహస్రం శశాస క్షితిమండలమ్ ।
భోగైః పుణ్యక్షయం కుర్వన్నభోగైరశుభక్షయమ్ ॥ 13

ఇట్లు భోగములద్వారా పుణ్యము క్షయము కాగా, యజ్ఞాద్యనుష్ఠానములద్వారా ప్రారబ్ధముయొక్క అశుభము క్షయము కాగా ధ్రువుడు ముప్పది యాఱువేల సంవత్సరములు రాజ్యమును పరిపాలించెను.

ఏవం బహుసవం కాలం మహాత్మా విచలేన్ద్రియః ।
త్రివర్గౌపయికం నీత్వా పుత్రాయాదాన్నృపాసనమ్ ॥ 14

మన్యమాన ఇదం విశ్వం మాయారచితమాత్మని ।
అవిద్యారచితస్వప్నగంధర్వనగరోపమమ్ ॥ 15

ఇట్లు సంయతేంద్రియుడు,శుద్ధచిత్తుడు నగుధ్రువుడు ఈదేహాది విశ్వము భగవానుని బహిరంగశక్తినుండి జన్మించిన దగుటవలన సత్యమైనను జీవునియవిద్యచే (స్వరూప జ్ఞానాభావముచే) రచిత మగు స్వప్నదృష్ట గంధర్వనగరమువలె అసత్య మనిభావించెను. బహువిధము లగుయజ్ఞముల నొనరించి త్రివర్గసాధనమున బహుకాలము గడపి చివరకు పుత్రునకు రాజ్యమిచ్చెను.

ఆత్మస్త్ర్యపత్యసుహృదో బలమృద్ధకోశ -
మన్తఃపురం పరివిహారభువశ్చ రమ్యాః ।
భూమండలం జలధిమేఖలమాకలయ్య
కాలోపసృష్టమితి స ప్రయయౌ విశాలామ్ ॥ 16

అప్పుడాయన దేహము, భార్య, పుత్రులు,బంధువులు, మిత్రులు, సైన్యము, సమృద్ధ మగు ధనాగారము, అంతఃపురము, రమణీయవిహారభూమి, సముద్రపర్యంత మగు భూమండలము మున్నగునవవి కాలగర్భమున గలసిపోవునవి యనియు, అనిత్యము లైనవి యనియు దలంచి భగవాను నారాధించునిమిత్తమై బదరికాశ్రమమునకు వెడలెను.

తస్యాం విశుద్ధకరణః శివవార్విగాహ్య
బధ్వాసనం జితమరున్మనసా హృతాక్షః ।
స్థూలే దధార భగవత్ప్రతిరూప ఏతద్
ధ్యాయం స్తదవ్యవహితో వ్యసృజత్సమాధౌ ॥ 17

ఆ బదరికాశ్రమమున ధ్రువుడు పవిత్ర మగుజలములయందు స్నానమొనరించెను. విశుద్ధేంద్రియుడయి ఆసనము నేర్పఱచుకొనెను. పిమ్మట శ్వాసను జయించిన వాడయి మనస్సుద్వారా యింద్రియము లన్నింటిని విషయములనుండి మరల్చి భగవానునకు ప్రతినిధి యైనవిరాడ్రూపమునందు నిలిపెను. ఇట్లు తదేకనిష్ఠుడై సమాధిస్థితుడై ఆ స్థూలరూపమును మఱచెను.

భక్తిం హరౌ భగవతి ప్రవహన్నజస్ర -
మానన్దబాష్పకలయా ముహురర్ద్యమానః ।
విక్లిద్యమానహృదయః పులకాచితాంగో
నాత్మానమస్మరదసావితి ముక్తలింగః ॥ 18

ఇట్లు ధ్రువుడు భగవానునిపై నిత్యము భక్తిప్రవాహమును వృద్ధిచేయుచుండుట వలన వానినేత్రములనుండి ఆనందాశ్రువులు ప్రవహింప జొచ్చెను. దానివలన నతడభిభూతుడయ్యెను, వానిహృదయము ద్రవించెను, అవయవములు పులకించెను, శరీరాభిమానము నశించెను. చివరకు దేహస్మృతిగూడ లేకపోయెను.

స దదర్శ విమానాగ్ర్యం నభసోఽవతరద్ధ్రువః ।
విభ్రాజయద్దశదిశో రాకాపతిమివోదితమ్ ॥ 19

ఇంతలో ధ్రువు డొకవిమాన మాకాశమునుండి క్రిందకు దిగుచుండుట చూచెను. అది తనప్రకాశముచే దశదిశలను ప్రకాశింపజేయుచు పూర్ణిమనాటి చంద్రునివలె నుండెను.

తత్రాను దేవప్రవరౌ చతుర్భుజౌ
శ్యామౌ కిశోరావరుణాంబుజేక్షణౌ ।
స్థితావవష్టభ్య గదాం సువాససౌ
కిరీటహారాంగదచారుకుండలౌ ॥ 20

పిమ్మట ఆవిమానమున చతుర్భుజులు, శ్యామవర్ణులు, తరుణవయస్కులు, అరుణవర్ణకమలములవంటి నేత్రములు గలవారు నగునిర్వురు దేవతాశ్రేష్ఠులు గదలను

ధరించి నిలబడియుండిరి. వారిదేహములు సుందరము లగువస్త్రములతోను, మనోజ్ఞము లగు కిరీటహారములతోను, కుండలములతోను అలంకృతము లైయుండెను .

విజ్ఞాయ తావుత్తమగాయకింకరా -
వభ్యుత్థితః సాధ్వసవిస్మృతక్రమః ।
ననామ నామాని గృణన్మధుద్విషః
పార్షత్ప్రధానావితి సంహతాంజలిః ॥ 21

ధ్రువుడు వారిరువురిని ఉత్తమశ్లోకు డగు భగవానుని కింకరులనియు, మధురిపు వగుశ్రీహరి ప్రధానపార్షదు లనియు భావించి సంభ్రమముతో పూజాదికములను మఱచి అసనము నుండి లేచి దోసిలియొగ్గి శ్రీహరినామమాత్రము నుచ్చరించి నమస్కరించెను.

తం కృష్ణపాదాభినివిష్టచేతసం
బద్ధాంజలిం ప్రశ్రయనమ్రకన్ధరమ్ ।
సునన్దనన్దావుపసృత్య సస్మితం
ప్రీత్యోచతుః పుష్కరనాభసమ్మతౌ ॥ 22

శ్రీనారాయణునకు ప్రియభాజను లగుసునందనందులు శ్రీకృష్ణచరణములయం దభినివిష్టచిత్తుడు, దోసిలియొగ్గి నిలబడినవాడు, వినయావనతుడు చిరునవ్వుతో గూడిన ముఖము గలవాడు నగుధ్రువునికడకు వెడలి ప్రేమతో నిట్లుపలికిరి.

### శ్రీసునందనందా వూచతుః

భోభో రాజన్ సుభద్రం తే వాచం నోఽవహితః శృణు ।
యం పంచవర్షస్తపసా భవాన్ దేవమతీతృపత్ ॥ 23

తస్యాఖిలజగద్ధాతురావాం దేవస్య శార్జ్గిణః ।
పార్షదావిహ సంప్రాప్తౌ నేతుం త్వాం భగవత్పదమ్ ॥ 24

సునందుడు, నందుడు పలికిరి:- రాజా ! నీకు శుభ మగుగాక ! నీ వేకాగ్రచిత్తుడవై మా మాటలను వినుము. నీ యైదుసంవత్సరముల వయస్సులో తపస్సుచేసి నిఖిల జగత్కర్తయు, సర్వేశ్వరుడు, శార్జ్గపాణియు నగు విష్ణుభగవానుని తృప్తిపఱచితివి. మే మాయన యనుచరులము. మేము ని న్నాభగవానుని పాదపద్మములకడకు దీసికొనిపోవుట కిచటికివచ్చితిమి.

సుదుర్జయం విష్ణుపదం జితం త్వయా
యత్సూరయోఽప్రాప్య విచక్షతే పరమ్ ।
ఆతిష్ఠ తచ్చన్ద్రదివాకరాదయో
గ్రహర్క్షతారాః పరియన్తి దక్షిణమ్ ॥ 25

నీవు పరమదుర్లభ మగవిష్ణుపదమును జయించితివి. సప్తర్షుల గూడ ఈశ్రేష్ఠపదమును బొంద నసమర్థులై కేవలము దానివైపు చూచుచుందురు.చంద్రసూర్యాదిగ్రహములు, తారకామండలము నిరంతర మీ స్థానమునకు ప్రదక్షిణము చేయుచుండును. నీ వీపదము నధిష్ఠింపుము.

అనాస్థితం తే పితృభిరన్యైరప్యంగ కర్హిచిత్ ।
ఆతిష్ఠ జగతాం వన్ద్యం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 26

ధ్రువా ! నీపితృపితామహులుగాని, మఱి యితరులెవ్వరైనగాని యెప్పుడును ఆపదవిని అధిష్ఠింపలేకపోయిరి. నీవు జగద్వంద్యు డగు ఆ విష్ణువుపరమపదము నధిరోహింపుము.

ఏతద్విమానప్రవరముత్తమశ్లోకమౌలినా ।
ఉపస్థాపితమాయుష్మన్నధిరోఢుం త్వమర్హసి ॥ 27

ఆయుష్మంతుడా! మహాయశస్వు లగుపురుషులలో శ్రేష్ఠుడగు ఆశ్రీహరి నీనిమిత్తమై ఈయుత్కృష్ట మగువిమానమును పంపెను. దయచేసి దీనిపై అధిరోహింపుము.

## శ్రీమైత్రేయ ఉవాచ

నిశమ్య వైకుంఠనియోజ్యముఖ్యయో -
ర్మధుచ్యుతం వాచమురుక్రమప్రియః ।
కృతాభిషేకః కృతనిత్యమంగలో
మునీన్ ప్రణమ్యాశిషమభ్యవాదయత్ ॥ 28

మైత్రేయుడు పలికెను:- విదురా ! వైకుంఠనాథునకు ప్రియపాత్రుడగుధ్రువుడు భగవత్పార్షదుల తేనె లొలుకు మాటలను విని స్నానమును, చేయవలసిన నిత్యమాంగలిక కర్మలను ఒనర్చి మునులకు ప్రణమిల్లి, వారియాశీస్సులను కోరెను.

పరీత్యాభ్యర్చ్య ధిష్ణ్యాగ్ర్యం పార్షదావభివన్ద్య చ ।
ఇయేష తదధిష్ఠాతుం బిభ్రద్రూపం హిరణ్మయమ్ ॥ 29

అనంతర మతడు విమానశ్రేష్ఠమునకు ప్రదక్షిణము చేసి, నమస్కరించి, పార్షదులకును అభివాదన మొనర్చెను. తేజోమయరూపమును ధరించి ఆవిమానము నధిరోహింపదలచెను.

తదోత్తానపదః పుత్రో దదర్శాన్తకమాగతమ్ ।
మృత్యోర్మూర్ధ్ని పదం దత్త్వా ఆరురోహాద్భుతం గృహమ్ ॥ 30

ఉత్తానపాదునిపుత్రు డగుధ్రువుడు విమానము నెక్కబోవుచుండగ అచటికి మృత్యువు వచ్చెను. ఆయన ఆమృత్యువు శిరస్సున తనపాదముల నుంచి అనగా మృత్యువును జయించి ఆవిమానము అధిరోహించెను.

తదా దున్దుభయో నేదుర్మృదంగపణవాదయః ।
గన్ధర్వముఖ్యాః ప్రజగుః పేతుః కుసుమవృష్టయః ॥ 31

అప్పుడు దుందుభులు, మృదంగములు, పణవములు మున్నగువాద్యములు మ్రోగసాగెను. గంధర్వముఖ్యులు గానముచేయుచుండిరి. ఆకాశము నుండి పుష్పవృష్టి గురియజొచ్చెను.

స చ స్వర్లోకమారోక్ష్యన్ సునీతిం జననీం ధ్రువః ।
అన్వస్మరదగం హిత్వా దీనాం యాస్యే త్రివిష్టపమ్ ॥ 32

ధ్రువుడు విష్ణుపదము నారోహించుట కుద్యుక్తుడై "దుఃఖిత యగు తల్లి సునీతిని విడచి దుర్గమ మగుస్వర్గమున కెట్లు పోగల" నని భావింపసాగెను.

ఇతి వ్యవసితం తస్య వ్యవసాయ సురోత్తమౌ ।
దర్శయామాసతుర్దేవీం పురో యానేన గచ్ఛతీమ్ ॥ 33

ధ్రువునియీయాయభిప్రాయమును దెలిసికొని భగవత్పార్షదులు ధ్రువునకు ముందు భాగమున విమానము నధిరోహించి వెడలుచున్న సునీతిని జూపిరి.

తత్ర తత్ర ప్రశంసద్భిః పథి వైమానికైః సురైః ।
అవకీర్యమాణో దదృశే కుసుమైః క్రమశో గ్రహాన్ ॥ 34

ధ్రువుడు స్వర్గమార్గమున పయనించుచు తన్ను ప్రశంసించుచున్న వారు, విమానవిహారులు నగుదేవతలు గురిపించుపుష్పవృష్టిచే అలంకృతుడయి క్రమముగ గ్రహములను జూచెను.

త్రిలోకీం దేవయానేన సోఽతివ్రజ్య మునీనపి ।
పరస్తాద్యద్ధ్రువగతిర్విష్ణోః పదమథాభ్యగాత్ ॥ 35

యద్భ్రాజమానం స్వరుచైవ సర్వతో
లోకాస్త్రయో హ్యను విభ్రాజన్త ఏతే ।
యన్నావ్రజన్ జన్తుషు యేఽననుగ్రహా
వ్రజన్తి భద్రాణి చరన్తి యేఽ నిశమ్ ॥ 36

నిశ్చలగతిగల ధ్రువు డిట్లువిమానముతో త్రిలోకములను, సప్తర్షిమండలమును దాటి వానికంటెను పైనగల విష్ణుపదమును పొందెను. ఇది తనతేజస్సుద్వారా యెల్లపుడు ప్రకాశించుచుండును. దానికి క్రింద నున్న లోకములు దాని వెలుగుచేతనే నిరంతరము ప్రకాశించుచుండును. ప్రాణుల కెల్లపుడు మేలు గలుగజేయువారే యీయుత్తమపదమును పొందుటకు సమర్థులగుదురు.

శాన్తాః సమదృశః శుద్ధాః సర్వభూతానురంజనాః ।
యాన్త్యఞ్జసాచ్యుతపదమచ్యుతప్రియబాన్ధవాః ॥ 37

శాంతులు, సమదర్శులు, శుద్ధులు, సర్వప్రాణులను హరిసేవ కున్ముఖులుగా జేసి వారియాత్మను రంజింపజేయువారు, శ్రీకృష్ణునకు పరమ ప్రియబంధువు లైనవారు నగు మానవులు  సులభముగ ఆయచ్యుతపదమునకు వెడలుదురు.

ఇత్యుత్తానపదః పుత్రో ధ్రువః కృష్ణపరాయణః ।
అభూత్త్రయాణాం లోకానాం చూడామణిరివామలః ॥ 38

గంభీరవేగోఽ నిమిషం జ్యోతిషాం చక్రమాహితమ్ ।
యస్మిన్ భ్రమతి కౌరవ్య మేధ్యామివ గవాం గణః ॥ 39

విదురా! ఎద్దులు మేథియందు గట్టబడి తిరుగునట్లు గంభీర వేగము గల యీ జ్యోతిశ్చక్రము ధ్రువుడు పొందినయాపదము నాశ్రయించి నిరంతరము తిరుగుచుండును. ఇట్లే ఉత్తానపాదనందను డగుధ్రువుడు కృష్ణపరాయణుడు నిర్మలచిత్తుడు నై మూడులోకము లకు చూడామణియయ్యెను.

మహిమానం విలోక్యాస్య నారదో భగవానృషిః ।
ఆతోద్యం వినుదన్ శ్లోకాన్ సత్రేఽ గాయత్ప్రచేతసామ్ ॥ 40

ఐశ్వర్యశాలియు, దేవర్షియు నగునారదుడు ధ్రువుని యీమహిమను దర్శించి ప్రజాపతుల యజ్ఞసభలో వీణను మ్రోగించుచు క్రిందిశ్లోకములను గానముచేయుచుండెను.

నూనం సునీతేః పతిదేవతాయా -
స్తపః ప్రభావస్య సుతస్య తాం గతిమ్ ।
దృష్ట్వాభ్యుపాయానపి వేదవాదినో
నైవాధిగన్తుం ప్రభవన్తి కిం నృపాః ॥ 41

పతిపరాయణ యగుసునీతికుమారు డయినధ్రువుడు తపఃప్రభావముచే పొందిన ఫలమును వేదవాదు లగుబ్రహ్మర్షులుగూడ పొందజాలరు. ఇక ఇతరరాజులసంగతి చెప్ప నేల?

యః పంచవర్షో గురుదారవాక్శరై -
ర్భిన్నేన యాతో హృదయేన దూయతా ।
వనం మదాదేశకరోఽజితం ప్రభుం
జిగాయ తద్భక్తగుణైః పరాజితమ్ ॥ 42

ధ్రువు డైదుసంవత్సరములవయస్సులోనే సవతితల్లి వాగ్బాణములచే పీడితుడయి దుఃఖితాంతఃకరణముతో వనమునకు వెడలి, నాయాదేశానుసారముగ అజితు డగుశ్రీహరిని భక్తితో వశముచేసికొనెను. శ్రీహరి అజితుడయ్యును తనభక్తులగుణములద్వారానే యెల్లప్పుడు పరాజితు డగును.

యః క్షత్రబన్ధుర్భువి తస్యాధిరూఢ -
మన్వారురుక్షేదపి వర్ష పూగైః ।
షట్పంచవర్షో యదహోభిరల్పైః
ప్రసాద్య వైకుంఠమవాప తత్పదమ్ ॥ 43

ధ్రువు డైదాఱుసంవత్సరములవయస్సులో కొలదిదినములలోనే వైకుంఠనాథు డగు విష్ణుభగవాను నారాధించి, ఆయనపరమపదమును పొందెను. భూమండలములో ఏరాజైనను బహుసంవత్సరములకాలము తపస్సుచేసియు ఈపదమును పొందగలడా?

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఏతత్తేఽభిహితం సర్వం యత్పృష్టోఽహమిహ త్వయా ।
ధ్రువస్యోద్దామయశసశ్చరితం సమ్మతం సతామ్ ॥ 44

మైత్రేయుడు పలికెను :- విదురా! నీవు నన్ను సాధుసమ్మతమైన, ఉత్కృష్టయశస్వి యగుధ్రువునిచరితమును జెప్పవలసినది యని యడిగితివి. నేను దాని నంతటిని నీకు వివరించిచెప్పితిని.

**ధన్యం యశస్యమాయుష్యం పుణ్యం స్వస్త్యయనం మహత్ ।**
**స్వర్గ్యం ధ్రౌవ్యం సౌమనస్యం ప్రశస్యమఘమర్షణమ్ ॥ 45**

ధ్రువునిచరిత్రము ధన్యము, యశోవర్ధకము, ఆయుర్వర్ధకము, పవిత్రము, పరమ మంగళస్వరూపము, ఉత్కృష్టము నైనది. స్వర్గమును గలిగించునది, ధ్రువస్థానము నిచ్చునట్టిది, మనశ్శుద్ధిని గలిగించునది, ప్రశంసనీయమైనది, పాపమును నాశము చేయునట్టిది.

**శ్రుత్వైతచ్ఛ్రద్ధయా భీక్ష్ణమచ్యుతప్రియచేష్టితమ్ ।**
**భక్తిర్భవేద్భగవతి యయాస్యాత్ క్లేశసంక్షయః ॥ 46**

అచ్యుతునకు ప్రియపాత్రు డగు ధ్రువునియాచరితమును శ్రద్ధతో మాటిమాటికి శ్రవణ మొనరించినచో భగవానునియందు భక్తికలుగును, దానివలన అవిద్యాదిక్లేశములు సంపూర్ణముగ నశింపగలవు.

**మహత్త్వమిచ్ఛత స్తీర్థం శ్రోతుః శీలాదయో గుణాః ।**
**యత్ర తేజస్తదిచ్ఛూనాం మనో యత్ర మనస్వినామ్ ॥ 47**

మహత్త్వమును కోరువారు ఈధ్రువునిచరిత్రమును శ్రవణముచేయవలెను. దీనిని శ్రవణము చేసిన శ్రోతకు శీలాదిగుణములు గలుగును, తేజస్సుగోరువారికి తేజస్సు గలుగును. మనస్వులకు ఉన్నతహృదయము కలుగును.

**ప్రయతః కీర్తయేత్ప్రాతః సమవాయే ద్విజన్మనామ్ ।**
**సాయం చ పుణ్యశ్లోకస్య ధ్రువస్య చరితం మహత్ ॥ 48**

పుణ్యశ్లోకు డగుధ్రువునియీమహచ్చరితమును బ్రాహ్మణాది ద్విజాతులసభలలో ప్రాతఃకాలమున, సాయంసమయమున ఏకాగ్రచిత్తముతో కీర్తింపవలెను.

**పౌర్ణమాస్యాం సినీవాల్యాం ద్వాదస్యాం శ్రవణేఽథవా ।**
**దినక్షయే వ్యతీపాతే సంక్రమేఽర్కదినేఽపి వా ॥ 49**

పూర్ణిమయందు, అమావాస్యయందు, ద్వాదశియందు, శ్రవణా నక్షత్రమునందు, తిథిత్రయస్పర్శమునందు, వ్యతీపాతమునందు, సంక్రాంతి యందు లేదా ఆదివారమునందు ఈధ్రువచరితమును కీర్తింపవలెను.

శ్రావయేత్ శ్రద్ధధానానాం తీర్థపాదప్రియాశ్రయః ।
నేచ్ఛం స్తత్రాత్మనాత్మానం సంతుష్ట ఇతి సిధ్యతి ॥ 50

తీర్థపాదు డగుశ్రీహరి ప్రియభక్తుల పాదముల నాశ్రయించినవాడయి శ్రద్ధావంతులకు ఈధ్రువచరితమును వినిపింపవలెను. నిష్కాముడయి ధ్రువచరితము కీర్తించినను, శ్రవణము చేసినను మనస్సు దానంతటదియె సంతుష్టి చెందును. అనాయాసముగ సిద్ధి కలుగును.

జ్ఞానమజ్ఞాతతత్త్వాయ యో దద్యాత్సత్పథేఽ మృతమ్ ।
కృపాలోర్దీనవాథస్య దేవాస్తస్యాను గృహ్ణతే ॥ 51

ఏ మానవుడు భగవద్భక్తి విషయమునందు అనభిజ్ఞుడగు మూర్ఖునకు భగవానుని సన్మార్గ విషయకజ్ఞానామృతము నిచ్చునో దేవత లిట్టి దయాళువు, దీనజనోద్ధారకుడు నగు వ్యక్తి కెట్టి విఘ్నములను గలుగజేయరు.

ఇదం మయా తేఽ భిహితం కురూద్వహ
ధ్రువస్య విఖ్యాతవిశుద్ధకర్మణః ।
హిత్వార్భకః క్రీడనకాని మాతు -
ర్గృహం చ విష్ణుం శరణం జగామ ॥ 52

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే ధ్రువచరితం నామ
ద్వాదశోఽధ్యాయః

కురువంశశ్రేష్ఠుడ వగు విదురా! నీకు నేను ఈవిశ్రుతము, విశుద్ధము నగు కర్మలు గల ధ్రువుని చరితము వివరించితిని. ఈ ధ్రువుడు బాల్యకాలమున ఆటబొమ్మలను, మాతృగృహమును విడచి విష్ణుభగవానుని శరణు జొచ్చెనుగదా!

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములో ధ్రువచరిత మను
పండ్రెండవ అధ్యాయము
సమాప్తము.



# పదుమూడవ అధ్యాయము

## ధ్రువవంశవర్ణనము: అంగరాజుచరిత్ర

కథాసారము :- ఈయధ్యాయమున ధ్రువునివంశములో పృథుచక్రవర్తి జన్మించుట, పుత్రునిదుష్టప్రవర్తనమునకు విరక్తుడై వేనునితండ్రి యగు అంగరాజు పట్టణమును విడచి వెడలుట యనువిషయములు వర్ణింపబడినవి.

ధ్రువునిపుత్రుడు ఉత్కలుడు. కులవృద్ధులు, మంత్రులు ఆయుత్కలుని రాజకార్యములయం దసమర్థుడనియు, ఉన్మత్తుడనియు భావించి, వానిపౌత్రుడగువత్సరుని రాజుగా జేసిరి. వత్సరునకు సువీథి యనుభార్యవలన పుష్పార్ణుడు, తిగ్మకేతువు, ఇషుడు, ఊర్జుడు, వసువు, జయుడు అనునార్గురు పుత్రులు జన్మించిరి. పుష్పార్ణునిమొదటిభార్య యగుప్రభకు ప్రాతర్మధ్యందినసాయంతనము లనుముప్పురుపుత్రులు గలిగిరి. రెండవభార్య యగుదోష యనుదానికి ప్రదోష నిశీథ వ్యుష్ట లను ముప్పురు పుత్రులు గలిగిరి. వారిలో వ్యుష్ట డనువానికి పుష్కరిణీ యనుపత్నియందు సర్వతేజుం డనుసుతుడు కల్గెను. ఆయనకు చక్షు వనునామాంతరము గలదు. వానికి ఆకూతి భార్యవలన చాక్షుష డగుమనువు జన్మించెను. వానికి పురువు, కుత్సుడు, ఋతుడు మున్నగు పండ్రెండుగురు పుత్రులు జన్మించిరి. వారిలోఉల్ముకు డనువానికి పుష్కరిణియనుభార్యయందు అంగుడు, సుమనుడు, ఖ్యాతి, క్రతువు, అంగీరసుడు, గయుడు అనునాఱ్వురుసుతులు జన్మించిరి. అంగరాజునకు అత్యుగ్రస్వభావముకల వేనుడు పుట్టెను. వేనునకు నారాయణాంశముతో పృథువు ఆవిర్భవించెను. విదురుడడుగగా మైత్రేయుడిట్లుచెప్పెను- -అంగరాజు పుత్రార్థియై అశ్వమేధయజ్ఞముచేసెను. దానినుండి వచ్చినపాయసమును భుజించి అంగపత్ని యగుసునీథ వేను డనుపుత్రుని గనెను. ఆకుమారునిదుష్ప్రవర్తనమునకు విరక్తుడై అంగరాజు నగరమును విడచి వెడలెను. వానికై ప్రజలు మిగుల శోకించిరి.

### శ్రీ సూత ఉవాచ

నిశమ్య కౌశారవిణోపవర్ణితం
ధ్రువస్య వైకుంఠపదాధిరోహణమ్ ।
ప్రరూఢభావో భగవత్యధోక్షజే
ప్రష్టుం పునస్తం విదురః ప్రచక్రమే ॥ 1

సూతుడు పలికెను :- మైత్రేయునివలన ధ్రువుడు భగవద్ధామమును పొందినా డనువిషయమును వినినవిదురునకు ఇంద్రియాతీతుడగు శ్రీమన్నారాయణునిపై ఇంకను ధృడ మగుభక్తి యేర్పడెను. ఆయన మరల మైత్రేయమహాముని నిట్లడిగెను.

## శ్రీవిదుర ఉవాచ

కే తే ప్రచేతసో నామ కస్యాపత్యాని సువ్రత ।
కస్యాన్వవా యే ప్రఖ్యాతాః కుత్ర వా సత్రమాసత ॥ 2

విదురుడు పలికెను :- భగవత్పరాయణుడ వగుమహామునీ! (దేవర్షియగునారదుడు ప్రచేతసులయజ్ఞస్థలమున ధ్రువునిమహత్త్వమును గానము చేసెను). ఆప్రచేతసు లెవ్వరు? వా రెవరివంశమున జననమొందిరి? వారెవరిపుత్రులు? ఎక్కడ వారు యజ్ఞము చేసిరి.

మన్యే మహాభాగవతం నారదం దేవదర్శనమ్ ।
యేన ప్రోక్తః క్రియాయోగః పరిచర్యావిధిర్హరేః ॥ 3

దేవా! భగవానునిపరిచర్యాక్రియాయోగ మగుపంచరాత్రాదిశాస్త్రములను జెప్పిన దేవర్షియగునారదుని మహాభాగవతు డనియు, భగవత్తత్త్వము నెఱింగినవాడనియు నేను తలంచుచున్నాను.

స్వధర్మశీలైః పురుషైర్భగవాన్ యజ్ఞపూరుషః ।
ఇజ్యమానో భగవతా నారదేనేడితః కిల॥ 4

ఆయజ్ఞమున వర్ణాశ్రమధర్మనిష్ఠు లగుప్రచేతసులు యజ్ఞపురుషు డగు నారాయణభగవానుని పూజించుచుండగా శక్తిమంతుడగునారదు డాభగవానుని స్తుతించెను.

యాస్తా దేవర్షిణా తత్ర వర్ణితా భగవత్కథాః ।
మహ్యం శుశ్రూషవే బ్రహ్మన్ కార్త్స్న్యే నాచష్టుమర్హసి ॥ 5

మహాత్మా! ప్రచేతసులయజ్ఞస్థలమున దేవర్షి వర్ణించిన ఆభగవత్కథలను సవిస్తరముగ నీవు నాకు వివరింపవలసినది. దానివి వినవలయునని నేను చాలకుతూహలపడుచున్నాను.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ధ్రువస్య చోత్కలః పుత్రః పితరి ప్రస్థితే వనమ్ ।
సార్వభౌమశ్రియం నైచ్ఛదధిరాజాసనం పితుః ॥ 6

మైత్రేయుడు పలికెను :- విదురా! తండ్రి వనమునకు బోవనుద్యుక్తుడు కాగా ధ్రువతనయు డగుఉత్కలుడు పితృపాలిత మగు భూసంపదను, రాజసింహాసనమును స్వీకరించుట కిష్టపడలేదు.

**స జన్మనోపశాన్తాత్మా నిస్సంగః సమదర్శనః ।**
**దదర్శ లోకే వితతమాత్మానం లోకమాత్మని ॥ 7**

ఏలయన అతడు పుట్టుకనుండియే జ్ఞాని, రాగాదిసంగరహితుడు, సమదర్శియు నై యుండెను. ఆయన సర్వభూతములయందు పరమాత్మను, పరమాత్మయందు సర్వ భూతములను దర్శించెను.

**ఆత్మానం బ్రహ్మనిర్వాణం ప్రత్యస్తమితవిగ్రహమ్ ।**
**అవబోధరసైకాత్మ్యమానన్దమనుసన్తతమ్ ॥ 8**

**అవ్యవచ్ఛిన్నయోగాగ్నిదగ్ధకర్మమలాశయః ।**
**స్వరూపమవరున్ధానో నాత్మనోఽన్యత్తదైక్షత ॥ 9**

నిరంతరాభ్యస్త మగుయోగానలముచే వానికర్మవాసనాత్మక మగు మల మంతయు దగ్ధముకాగా అతడు శాంతుడు, నిరుపాధికుడు, జ్ఞానైకరసుడు, ఆనందమయుడు, అంతట అనుస్యూత మగుజీవాత్మను పరమకారణరూపమగు బ్రహ్మముకంటె అభిన్ను డనితెలిసి కొనెను. ఆయాత్మోపలబ్ధికాలమున అద్వయజ్ఞానతత్త్వ మగుబ్రహ్మముకంటె నితర మగు ద్వితీయ వస్తువుయొక్క స్వతంత్రాధిష్ఠానము ఆయనదర్శనమునకు విషయభూతము కాలేదు.

**జడాన్ధబధిరోన్మత్తమూకాకృతిరతన్మతిః ।**
**లక్షితః పథిబాలానాం ప్రశాన్తార్చిరివానలః ॥ 10**

మార్గమున సంచరించుచున్నపుడు బాలురు వానిని జడుడు, అంధుడు, బధిరుడు, ఉన్మత్తుడు అనిపలుకసాగిరి. కాని వానిబుద్ధి జడవ్యక్తివలె నుండలేదు. అతడు ప్రశాంత మగుఅగ్నిజ్వాలవలె నుండెను.

**మత్వా తం జడమున్మత్తం కులవృద్ధాః సమన్త్రిణః ।**
**వత్సరం భూపతిం చక్రుర్యవీయాంసం భ్రమేః సుతమ్ ॥ 11**

అమాత్యులు, కులవృద్ధులు ఉత్కలుని అకర్ముడు, ఉన్మత్తుడు నని భావించి వాని కనిష్ఠసోదరు డగుభ్రమికుమారుడైన వత్సరుని పట్టాభిషిక్తునిగ జేసిరి.

సువీథీర్వత్సరస్యేష్టా భార్యాసూత షడాత్మజాన్ ।
పుష్పార్ణం తిగ్మకేతుం చ ఇషమూర్జం వసుం జయమ్ ॥ 12

సువీథి వత్సరుని ప్రియభార్య. ఆమె పుష్పార్ణుడు, తిగ్మకేతువు, ఇషుడు, ఊరుడు, వసువు, జయుడు అనువాఱ్గురుపుత్రులను గనెను.

పుష్పార్ణస్య ప్రభా భార్యా దోషా చ ద్వే బభూవతుః ।
ప్రాతర్మధ్యన్దినం సాయమితి హ్యాసన్ ప్రభాసుతాః ॥ 13

పుష్పార్ణునకు ప్రభ, దోష అనునిరువురుభార్యలు గలరు. వారిలో ప్రభ ప్రాతర్మధ్యందిన సాయము లనుమువ్వురుపుత్రులను గనెను.

ప్రదోషో నిశథోవ్యుష్ట ఇతి దోషా సుతాస్త్రయః ।
వ్యుష్టస్సుతం పుష్కరిణ్యాం సర్వతేజసమాదధే ॥ 14

దోష యనునామెకు ప్రదోషనిశీథవ్యుష్ట లనుమువ్వురుపుత్రులుగల్గిరి. వ్యుష్టుడు పుష్కరిణి యనుభార్యవలన సర్వతేజు డనునొక పుత్రుని గనెను.

స చక్షుః సుతమాకూత్యాం పత్న్యాం మనుమవాప హ ।
మనోరసూత మహిషీ విరజాన్ నడ్వలా సుతాన్ ॥ 15

పురుం కృత్స్నమృతం ద్యుమ్నం సత్యవన్తం ధ్రుతం వ్రతమ్ ।
అగ్నిష్టోమమతీరాత్రం ప్రద్యుమ్నం శిబిముల్ముకమ్ ॥ 16

ఆసర్వతేజుడు పిమ్మట చక్షు వనుసంజ్ఞను పొందెను. అతడు ఆకూతి యనుభార్యవలన చాక్షుషమనువను నొకపుత్రుని గనెను. ఈమనువు భార్య యగునడ్వల యనునామె పురువు, కుత్సుడు, ఋతుడు, ద్యుమనుడు, సత్యవంతుడు, ధ్రుతుడు, వ్రతుడు, అగ్నిష్టోముడు, అతిరాత్రుడు, ప్రద్యుమ్నుడు, శిబి, ఉల్ముకుడు అనుపండ్రెండుగురు శుద్ధచిత్తులగుపుత్రులను గనెను.

ఉల్ముకోఽజనయత్పుత్రాన్ పుష్కరిణ్యాం షడుత్తమాన్ ।
అంగం సుమనసం స్వాతిం క్రతుమంగిరసం గయమ్ ॥ 17

ఉల్ముకుడు తనభార్య యగుపుష్కరిణివలన అంగుడు, సుమనసుడు, స్వాతి, క్రతువు, అంగిరసుడు, గయుడు అనునాఱుగురు ఉత్తమపుత్రులను గనెను.

సునీథాంగస్య యా పత్నీ సుషువే వేనముల్బణమ్ ।
యద్దౌశ్శీల్యాత్స రాజర్షిర్నిర్విణ్ణో నిరగాత్పురాత్ ॥ 18

అంగునిభార్య యగుసునీథ వేను డనునొకభయంకరపుత్రుని గనినది. ఈవేనుని దుష్ప్రవర్తనమువలన ధర్మాత్ము డగు అంగుడు విరక్తుడయి నగరమునుండి వెడలిపోయెను.

**యమంగశేపుః కుపితా వాగ్వజ్రా మునయః కిల ।**
**గతాసోస్తస్య భూయస్తే మమన్థుర్దక్షిణం కరమ్ ॥ 19**

విదురా! వాగ్వజ్రసంపన్ను లగు (అతిప్రభావశాలురగు) మునులు కుపితులై ఆవేనుని శపించిరి. దానివలన అతడు గతప్రాణుడయ్యెను. అపుడు వారు వేనుని కుడిచేతిని మథించిరి.

**అరాజకే తదా లోకే దస్యుభిః పీడితాః ప్రజాః ।**
**జాతో నారాయణాంశేన పృథురాద్యః క్షితీశ్వరః ॥ 20**

పృథివి అరాజక మగుటవలన ప్రజలు దొంగలచే పీడింపబడసాగిరి. అపుడు భగవాను డగునారాయణునియంశచే ఆదిరా జగుపృథువు ఆవిర్భవించెను.

## శ్రీవిదుర ఉవాచ

**తస్య శీలనిధేః సాధోర్బ్రహ్మణ్యస్య మహాత్మనః ।**
**రాజ్ఞః కథమభూద్దుష్టా ప్రజా యద్విమనా యయౌ ॥ 21**

విదురుడు పలికెను :- మహాత్మా! సర్వసద్గుణసంపన్నుడు, సాధువు, బ్రహ్మణ్య స్వభావుడు, మహాత్ముడు నగుఅంగరాజున కిట్టిదుష్ట డగుపుత్రుడెట్లు జన్మించెను? కుల పాంసను దగుఆవేనునివలన అంగరాజు విరక్తుడయి వనమునకు వెడలవలసివచ్చెనుగదా!

**కిం వాంహో వేన ఉద్దిశ్య బ్రహ్మదండమయూయుజన్ ।**
**దండవ్రతధరే రాజ్ఞి మునయో ధర్మకోవిదాః ॥ 22**

ధర్మకోవిదు లగుమునులు రాజదండమును ధరించినవేనరాజును ఏయపరాధము నుద్దేశించి శపించిరి?

**నావధ్యేయః ప్రజాపాలః ప్రజాభిరఘవానపి ।**
**యదసౌ లోకపాలానాం బిభర్త్యోజః స్వతేజసా ॥ 23**

ప్రజాపాలకుడగురాజు పాపయుక్తుడయ్యును ప్రజలతిరస్కారమునకు గురికారాదు. ఏలయన, రాజు తనతేజఃప్రభావముచే ఇంద్రాదిలోకపాలురసామర్థ్యమును ధరించి యుండును.

ఏతదాఖ్యాహి మే బ్రహ్మన్ సునీథాత్మజచేష్టితమ్ ।
శ్రద్దధానాయ భక్తాయ త్వం పరావరవిత్తమః ॥ 24

మహాత్మా! నీవుభూతభవిష్యత్తులను తెలిసినవారిలో అతిప్రధానుడవు. ఆసునీథాత్మజుని ఆచరణమును, వానిపై మునులకు కోపము కలుగుటకు గారణమును వర్ణింపుము. నేను శ్రద్ధాభక్తులతో దీనిని వినగోరుచున్నాను.

## శ్రీమైత్రేయ ఉవాచ

అఙ్గోఽశ్వమేధం రాజర్షిరాజహారమహాక్రతుమ్ ।
నాజగ్ముర్దేవతాస్తస్మిన్నాహూతా బ్రహ్మవాదిభిః ॥ 25

మైత్రేయుడు పలికెను :- విదురా! రాజర్షి యగు అంగుడు అశ్వమేధయజ్ఞమును జేయుచుండెను. మంత్రజ్ఞులగు బ్రాహ్మణు లాహ్వానించినను దేవత లచటికి రాలేదు.

త ఊచుర్విస్మితాస్తత్ర యజమానమథర్త్విజః ।
హవీంషి హూయమానాని న తే గృహ్ణన్తి దేవతాః ॥ 26

వత్సా! ఋత్విక్కులు విస్మితులై యజమాని యగుఅంగరాజుతో నిట్లుపలికిరి - "రాజా! మేము హవిస్సు లన్నింటిచే హోమము చేసినను దేవతలు వానిని స్వీకరించుటలేదు".

రాజన్ హవీంష్యదుష్టాని శ్రద్ధయా సాదితాని తే ।
ఛన్దాంస్యయాతయామాని యోజితాని ధృతవ్రతైః ॥ 27

రాజా! నీ వీ హవిర్ద్రవ్యముల నన్నింటిని శ్రద్ధతోడనే సేకరించితివి, ఇవి నిర్దోషములు. ధృతవ్రతులమై మేము ప్రయోగించినవేదమంత్రములుగూడ శక్తిహీనములుగావు.

న విదామేహ దేవానాం హేలనం వయమణ్వపి ।
యన్న గృహ్ణన్తి భాగాన్ స్వాన్ యే దేవాః కర్మసాక్షిణః ॥ 28

ఈయజ్ఞమున దేవతలకు ఏవిధమగుతిరస్కారముగూడ జరుగలేదనియే మేము భావించుచున్నాము. అయినను ఏకారణమువలననో కర్మసాక్షు లగునాదేవతలు తమతమ యజ్ఞభాగములను స్వీకరించుటలేదు. వారియునికి లేనిదే సర్వము వ్యర్థమగును.

## శ్రీమైత్రేయ ఉవాచ

అఙ్గో ద్విజవచః శ్రుత్వా యజమానః సుదుర్మనాః ।
తం ప్రష్టుం వ్యసృజద్వాచం సదస్యాం స్తదనుజ్ఞయా ॥ 29

మైత్రేయుడు పలికెను :- యజమాను డగుఅంగరాజు ఋత్విక్కులు పలికినవాక్కులు విని మిగుల దుఃఖితుడయ్యెను. పిమ్మట దానికి గలకారణమును తెలిసికొనుటకై యాజ్ఞకులయనుమతిని వడసి మౌనమును వీడి సదస్యుల నడిగెను.

**నాగచ్ఛన్త్యాహుతా దేవా న గృహ్ణన్తి గ్రహానిహ ।**
**సదస్పతయో బ్రూత కిమవద్యం మయా కృతమ్ ॥ 30**

సదస్యులారా! దేవత లీయజ్ఞమున ఆహూతు లయ్యును రాలేదు, సోమపాత్రలను స్వీకరింపలేదు, దీనికి గారణమేమి? నే నట్టినీచ మైన పని యేమి చేసితిని? ఆవిషయమును మీరు నాకు జెప్పవలసినది.

**శ్రీ సదసస్పతయః ఊచుః**

**నరదేవేహ భవతో నాఘం తావన్మనాక్ స్థితమ్ ।**
**అస్త్యేకం ప్రాక్తనమఘం యదిహేదృక్ త్వమప్రజః ॥ 31**

సదస్యులు పలికిరి :- నరపతీ! ఈజన్మమున నీవు కొలదిగ గూడ పాపకార్యము నాచరింపలేదు. కాని పూర్వజన్మకృత మగుపాపమొకటిగలదు. తన్నిమిత్తమై యీజన్మమున నీవు ధార్మికుడవయ్యును అపుత్రుకుడవైతివి.

**తథా సాధయ భద్రం తే ఆత్మానం సుప్రజం నృప ।**
**ఇష్ట స్తే పుత్రకామస్య పుత్రం దాస్యతి యజ్ఞభుక్ ॥ 32**

అందువలన రాజా! నీకుశుభము కలుగుగాక! మొదట నీవు సుపుత్రుని పొందు నుపాయ మేదియైన ఆలోచింపుము. నీవు పుత్రవాంఛతో యజ్ఞము చేసినచో యజ్ఞేశ్వర భగవానుడు నీకు తప్పక పుత్రునిచ్చును.

**తథా స్వభాగధేయాని గ్రహీష్యన్తి దివౌకసః ।**
**యద్యజ్ఞపురుషః సాక్షాదపత్యాయ హరిర్వృతః ॥ 33**

నీవు సంతానలాభార్థమై సాక్షాత్తుగ యజ్ఞపురుషుడగు శ్రీహరిని సేవింపుము, ఆయనతోపాటు దేవతలందఱు వచ్చి తమయజ్ఞభాగములను గ్రహింతురు.

**తాంస్తాన్ కామాన్ హరిర్దద్యాత్ యాన్యాన్ కామయతేజనః ।**
**ఆరాధితో యథైవైష తథా పుంసాం ఫలోదయః ॥ 34**

జను లే యేకోరికలను గోరుదురో శ్రీహరి వారికి ఆయాయభిలషితవిషయముల నిచ్చును. వాస్తవముగ ఏవ్యక్తి యేభావముతో భగవానునారాధించునో వానిఫలోదయముగూడ అట్లేయుండును.

**ఇతి వ్యవసితా విప్రాస్తస్య రాజ్ఞః ప్రజాతయే ।**
**పురోడాశం నిరవపన్ శిపివిష్టాయ విష్ణవే ॥ 35**

ఋత్విక్కులు అంగరాజునకు పుత్రప్రాప్తిని గలిగించుటకు నిశ్చయించి, పశువులో యజ్ఞరూపముతో నున్న విష్ణుభగవానుని పూజించుటకై పురోడాశ మనుచరువును సమర్పించిరి.

**తస్మాత్పురుష ఉత్తస్థౌ హేమమాల్యమలాంబరః ।**
**హిరణ్మయేన పాత్రేణ సిద్ధమాదాయ పాయసమ్ ॥ 36**

సువర్ణపాత్రమున పక్వ మైయున్నపాయసమును తీసికొని బంగారుహారములను, శుభ్రవసనములను ధరించినపురుషు డొకడు ఆ యజ్ఞకుండము నుండి బయటకు వచ్చెను.

**స విప్రానుమతో రాజా గృహీత్వాంజలినౌదనమ్ ।**
**అవఘ్రాయ ముదా యుక్తః ప్రాదాత్పత్న్యా ఉదారధీః ॥ 37**

ఉదారబుద్ధి యగురాజు బ్రాహ్మణులయనుజ్ఞ ననుసరించి దోసిలొగ్గి ఆపాయసమును గ్రహించెను, హర్షచిత్తుడయి దానిని తానాఘ్రాణించి భార్య యగుసునీథికి ఇచ్చెను.

**సా తత్పుంసవనం రాజ్ఞీ ప్రాశ్య వై పత్యురాదధే ।**
**గర్భం కాల ఉపావృత్తే కుమారం సుషువేఽప్రజాః ॥ 38**

పుత్రహీన యగురాణి (సునీథి) పుత్రుని గలిగించు నాపాయసమును ఆనందముతో భక్షించి భర్త వలన గర్భమును ధరించెను. తగిన సమయమున ఆమె యొక పుత్రుని గనెను.

**స బాల ఏవ పురుషో మాతామహమనువ్రతః ।**
**అధర్మాంశోద్భవం మృత్యుం తేనాభవదధార్మికః ॥ 39**

ఆరాజకుమారుడగువేనుడుబాల్యకాలమునుండియు అధర్మాంశోద్భవుడు, మాతామహుడు నగుమృత్యువు ననుసరించుచుండెను. దానివలన అతడధార్మికుడయ్యెను.

చ. *కమలదళాక్షి పాయసము గౌతుక మొప్ప భుజించి భర్తృసం*
*గమమునఁజేసి తత్క్షణమ గర్భముఁ దాల్చి కుమారుఁగాంచెన*
*క్కొమరుఁడు నంత మాతృజనకుం డగుమృత్యువుఁ బోలి తా నధ*
*ర్మమునఁ జరించు చుండె గుణమండన వేనుఁడనంగ నిచ్చలున్.* (4-401)

స శరాసనముద్యమ్య మృగయుర్వనగోచరః ।
హన్త్యసాధుర్మృగాన్ దీనాన్ వేనోఽసావిత్యరౌజ్జనః ॥ 40

దుష్టబాలు డగుఆవేనుడు వేటయం దాసక్తిగలవాడయి వనమునకు వెడలి ధనస్సు నెక్కుపెట్టి దీనమృగములను సంహరించుచుండెడివాడు. పురజనులు వానిని దూరము నుండియే చూచి "వేనుడు వచ్చుచున్నా"డని భయముతో అఱచుచుండెడివారు.

ఆక్రీడే క్రీడతో బాలాన్ వయస్యానతిదారుణః ।
ప్రసహ్య నిరనుక్రోశః పశుమారమమారయత్ ॥ 41

అతినిష్ఠురుడు, నిర్దయుడు నగువేనుడు క్రీడాస్థలమున సమాన వయస్కులగుబాలురతో క్రీడించుచు వారిని పశువులవలె చంపుచుండెడివాడు.

చ. *ఎనయఁగఁ బాల్యమందుఁదనయీడుకుమారులఁ గ్రీడఁబోలె నె*
*మ్మనమున భీతి లేక కృప మాలి పశుప్రకరంబు నొంచుపో*
*ల్కిని నరికట్టి చంపుచును గిల్బిషలుబ్ధకవృత్తి మై శరా*
*సనవరముల్ ధరించి మృగజాతి నసాధుగతిన్ వధించుచున్* (4-402)

తం విచక్ష్య ఖలం పుత్రం శాసనైర్వివిధైర్నృపః ।
యదా న శాసితుం కల్పో భృశమాసీత్సు దుర్మనాః ॥ 42

ప్రాణిహింసాపరాయణు డగువేనుని జూచి తండ్రి యగుఅంగరాజుకొట్టుట, భయపెట్టుట మున్నగునానావిధము లగు ఉపాయములతో వానిని శాసింపసాగెను. కాని వానిలో నేయొక్కటియు ఉపయోగపడక పోవుటచే రాజు మిగుల దుఃఖితుడయ్యెను.

ప్రాయేణాభ్యర్చితో దేవో యే ఽప్రజా గృహమేధినః ।
కదపత్యాభృతం దుఃఖం యే న విన్దన్తి దుర్భరమ్ ॥ 43

పుత్రులు లేనిగృహస్థులు సామాన్యముగ పుత్రవాంఛతో భక్తుల దుఃఖమును బోగొట్టు శ్రీహరిని అర్చించుచుందురు. కుపుత్రునివలన సహింపనలవికాని యేకష్టములు గలుగనున్నవో వానిని వా రెరుంగరుకాబోలు.

యతః పాపీయసీకీర్తిరధర్మశ్చ మహాన్ నృణామ్ ।
యతో విరోధః సర్వేషాం యత ఆధిరనన్తకః ॥ 44

దుస్సంతానమువలన మానవులకు అపఖ్యాతి, అధర్మము కలుగును. సర్వప్రాణులతో విరోధ మేర్పడును, అనేకవిధముల మానసికబాధ కలుగును.

కస్తం ప్రజాపదేశం వై మోహబన్ధనమాత్మనః ।
పండితో బహుమన్యేత యదర్థాః క్లేశదా గృహాః ॥ 45

వారినిమిత్తమై గృహములు క్లేశదాయకము లగును. అట్టినామమాత్రులగుకుపుత్రులు తనమోహబంధనములకు గారణస్వరూపులగుదురు. అందువలన పండితు డగు ఏవ్యక్తి అట్టిపుత్రులను ఆదరించును?

కదపత్యం వరం మన్యే సదపత్యాచ్ఛుచాం పదాత్ ।
నిర్విద్యేత గృహాన్మర్త్యో యత్క్లేశనివహా గృహాః ॥ 46

శోకమునకు గారణ మగుసత్సంతానముకంటె దుస్సంతానమె యధిక శుభదాయక మైనది; ఏలయన, ఇట్టి కుసంతానమువలన గృహము దుఃఖప్రద మగును. దానివలన మానవులకు గృహస్థధర్మముపట్ల విరక్తి కలుగును.

*సీ॥ జనులకు దుష్పుత్రకునిచేత నపకీర్తి*
*యు నధర్మమును సర్వజనవిరోధ*
*మును మనోవ్యథయును నసయంబుఁ బ్రాపించు*
*నట్టికుపుత్రుమోహంబు విడువఁ*
*జాలక బహుమానసంగతిఁ గను నెవ్వఁ*
*డతనిగేహంబు దుఃఖాలయంబు*
*నగు నని మఱియు నిల్లను మనుజుండు శో*
*కస్థాన మగుపుత్రుకతనఁ జేసి*

*తే॥ యనుపమక్లేశభాజనం బయినగృహము*
*విడుచుఁ గావున నిట్టివివేకహీనుఁ*
*డగుకుపుత్రు సుపుత్రుఁగా నాత్మఁ దలఁతు*
*ననుచు నారాజు బహుదుఃఖితాత్ముఁడగుచు.* (4-406)

ఏవం సనిర్విణ్ణమనా నృపో గృహా -
న్నిశీథ ఉత్థాయ మహోదయోదయాత్ ।
అలబ్ధనిద్రోఽనుపలక్షితో నృభి-
ర్హిత్వా గతో వేనసువం ప్రసుప్తామ్ ॥ 47

ఈవిధముగ అంగరాజునకు నిర్వేదము కలిగెను. రాత్రివేళ వానికి నిద్రపట్టకపోయెను. అతడర్ధరాత్రమున శయ్యనుండి లేచి యెవ్వరికిని దెలియకుండగ వేనునితల్లి యగు సునీథినిగూడ పరిత్యజించి, మహావిభవ సంపన్న మగుగృహమునుండి వెడలిపోయెను.

**విజ్ఞాయ నిర్విద్య గతం పతిం ప్రజాః**
**పురోహితామాత్యసుహృద్గణాదయః ।**
**విచిక్యురుర్వ్యామతిశోకకాతరా**
**యథా నిగూఢం పురుషం కుయోగినః ॥ 48**

పిమ్మట రాజు విరాగియై గృహమును పరిత్యజించినా డనితెలిసికొని ప్రజలు, పురోహితులు, అమాత్యులు, బంధువులు మిగుల శోకవిహ్వాలులయిరి. కుయోగులు అంతర్యామి యగుపరమాత్మ నన్వేషించినను ఆయనను గనజాలనట్లు వారుగూడ భూమియందంతట రాజును వెదుకసాగిరి.

**అలక్షయన్తః పదవీం ప్రజాపతే -**
**ర్హతోద్యమాః ప్రత్యుపసృత్య తే పురీమ్ ।**
**ఋషీన్ సమేతానభివన్ద్య సాశ్రవో**
**న్యవేదయన్ పౌరవభర్తృవిప్లవమ్ ॥ 49**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే అంగప్రవ్రజ్యా నామ
త్రయోదశోఽధ్యాయః ।

విదురా! ప్రజలు, పురోహితులు మున్నగువారు ప్రజాపతి యగు అంగరాజును ఎచ్చటను గానలేనివారై విఫలమనోరథులై నగరమునకు దిరిగి వచ్చిరి. అందఱు ఋషులకు ప్రణమిల్లి అశ్రునయనములతో రాజు కనబడలే దనువార్తను వారికి తెలియజేసిరి.

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని పదుమూడవ
అధ్యాయము సమాప్తము.



# పదునాల్గవ అధ్యాయము

## వేనరాజు కథ

కథాసారము:- ఈయధ్యాయమున కుపుత్రుని భయముచే అంగరాజు వెడలిపోవుట, బ్రాహ్మణులు వేనునకు రాజ్యాభిషేకముచేయుట, పిమ్మట రోషమువలన వాడు వినాశము చెందుట అనువిషయములు వర్ణితములైనవి.

మునులు సదుపదేశములద్వారా వేనరాజును దుష్ప్రవర్తనమునుండి మరల్చుటకు దృఢ మగుప్రయత్నమును జేసి యిట్లుపలికిరి-"లోకపాలురతోపాటు సర్వజనులచే ఆరాధింపబడు ఆశ్రీహరి సంతుష్టి చెందినచో ఇక జీవునకు పొందదగని దేదియు నుండదు. యజ్ఞవిస్తరణముద్వారా భగవానుని పూజించువారిని అవమానించుట తగదు." ఈమాటలకు వేనుడు క్రుద్ధుడై తానే సర్వపూజ్యుడు, సర్వభోక్తయుననియు, తనదేహమునందే విష్ణువు మున్నగుసర్వదేవతలు నుందురనియు, తన్ను త్యజించి యజ్ఞపురుషుని ఆరాధించుట కులట యగు స్త్రీ తనపతిని విడచి పరపురుషునిగోరునట్లు అగుననియు పలికెను. మునులిట్లు విష్ణునిందను విని మిగులక్రుద్ధులై భయంకర మగుహుంకారముచేసి వానిని దగ్ధమొనరించిరి. పిమ్మట వేనుని సంహరించి మునులు స్వస్థానములకు వెడలుట, వేనునితల్లి మంత్రబలముచే మృతపుత్రుడగు వేనుని దేహమును రక్షించుట, రాజు లేక పోవుటచే రాజ్యమున నానావిధములగు ఉపద్రవములు చెలరేగుట, ఋషులు చనిపోయిన వేనునియూరుదేశమును మథింపగా పొట్టిగానున్న వొక పురుషుడు పుట్టుట, ఋషులు వానిని "నిషీద" అనగా "కూర్చుండు" మనిపలుకగా వానికి నిషాదుడనుపేరు గలుగుట, వేనరాజు యొక్క కల్మషమును స్వీకరించుటచే నిషాదగణములకు నీచత్వము కలుగుట మున్నగువిషయములను మైత్రేయముని విదురనకు వివరించి చెప్పెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

**భృగ్వాదయస్తే మునయో లోకానాం క్షేమదర్శిన: ।**
**గోప్తర్యసతి వై నౄణాం పశ్యన్త: పశుసామ్యతామ్ ॥ 1**

**వీరమాతరమాహూయ సునీథాం బ్రహ్మవాదిన: ।**
**ప్రకృత్య సమ్మతం వేనమభ్యషించన్ పతిం భువ: ॥ 2**

మైత్రేయుడు పలికెను :- విదురా! లోకకల్యాణచింతారతుడగు భృగువు మున్నగు బ్రహ్మవాదు లైనమునులు, రక్షకుడు లేనిప్రజలు పశువులవలె భోగములవైపు మ్రొగ్గటచూచి

వేనునితల్లి యగుసునీథిని ఆహ్వానించి, యామెయనుమతిని బొంది, ప్రజల కిష్టము లేకపోయినను ఆవేనునె రాజపదమునం దభిషిక్తునిగ జేసిరి.

**శ్రుత్వా నృపాసనగతం వేనమత్యుగ్రశాసనమ్ ।**
**నిలిల్యుర్దస్యవః సద్యః సర్పత్రస్తా ఇవాఖవః ॥ 3**

అత్యుగ్రప్రతాపు డగువేనుడు రాజసింహాసనమును పొందినా డని విని నంతనె దొంగలు సర్పములకు భయపడిన ఎలుకలవలె ఎక్కడివారక్కడ దాగికొనిరి.

**స ఆరూఢనృపస్థాన ఉన్నద్ధోఽష్టవిభూతిభిః ।**
**అవమేనే మహాభాగాన్ స్తబ్ధః సంభావితః స్వతః ॥ 4**

వేనుడు రాజసింహాసనము నధిష్ఠించి అష్టలోకపాలురయైశ్వర్యములచే వృద్ధిపొంద సాగెను. తన్ను మహాపరాక్రమశాలిగ భావించుకొనుచు మహాభాగవతుల నవమానింపసాగెను.

**ఏవం మదాన్ధ ఉత్సిక్తో నిరంకుశ ఇవ ద్విపః ।**
**పర్యటన్ రథమాస్థాయ కంపయన్నివ రోదసీ ॥ 5**

**న యష్టవ్యం న దాతవ్యం న హోతవ్యం ద్విజాః క్వచిత్ ।**
**ఇతిన్యవారయద్ధర్మం భేరీఘోషేణ సర్వతః ॥ 6**

ఇట్లు రాజసింహాసనమును పొంది వేనుడు మదాంధుడు, లోకవేదాచారశూన్యుడు అయ్యెను, అంకుశము లేనియేనుగువలె స్వర్లోకభూలోకములను కంపింపజేయుచు అతడు రథముపై నధిరోహించి యిటునటు సంచరించుచు "ద్విజాతు లెవ్వరయిన ఎట్టి యజ్ఞమునుగాని, దానములనుగాని, హోమాదులనుగాని చేయరా"దని చాటింపువేయుచు ధర్మానుష్ఠానమునకు పూర్తిగ అవరోధము గలుగజేసెను.

**వేనస్యావేక్ష్య మునయో దుర్వృత్తస్య విచేష్టితమ్ ।**
**విమృశ్య లోకవ్యసనం కృపయోచుః స్మ సత్రిణః ॥ 7**

విదురా! మునులు దురాచారి యగువేనునివలన సదాచారమునకు గలిగినప్రతిబంధకమును గాంచి ధర్మకర్మాదినాశమువలన నరలోకమునకు మిక్కిలి కష్టము గలిగిన దనిభావించిరి. దయగలవారై వారొకచోటగూడి తమలో తాము చర్చించు కొనసాగిరి.

**అహో ఉభయతః ప్రాప్తం లోకస్య వ్యసనం మహత్ ।**
**దారుణ్యుభయతో దీప్త ఇవ తస్కరపాలయోః ॥ 8**

ఆహా! ఎంతటియాశ్చర్యము! రెండువైపుల మండు కాష్ఠమునకు నడుమ నున్నచీమ మున్నగుప్రాణులకు మహత్కష్టము కలుగునట్లు ప్రజలా సమయమున ఒకవైపు రాజుయొక్క రెండవవైపు దొంగలయొక్క అత్యాచారములవలన మిగుల సంకటస్థితిలో పడిపోయిరి.

**అరాజకభయా దేషకృతో రాజాఽతదర్హణః ।**
**తతోఽప్యాసీద్భయం త్వద్య కథం స్యాత్స్వస్తి దేహినామ్ ॥ 9**

అరాజకభయమువలన రాజసింహాసనమున క్షేమాత్రము తగని యీవేనుని మనము రాజుగా జేసితిమి. కాని దానివలన ఇపుడెంతటి భయము కలిగినది? ఇపుడు ప్రజలకు క్షేమమును జేకూర్చు ఉపాయమేది?

**అహేరివ పయః పోషః పోషకస్యాప్యనర్థభృత్ ।**
**వేనః ప్రకృత్యైవ ఖలః సునీథాగర్భసంభవః ।**
**నిరూపితః ప్రజాపాలః స జిఘాంసతి వై ప్రజాః ॥ 10**

పాలుపోసి పెంచినపాము ఆపోషించినవాని కనర్థమును గలుగజేయునట్లు ఈవేనుడు మన కనిష్టమును గలుగజేయుచున్నాడు. సునీథాగర్భసంభవుడగునీవేనుడు సహజముగ దుర్మార్గుడు. మనము వీనిని ప్రజాపాలకునిగ నియమించితిమి. కాని యిప్పుడితడు ప్రజాహంతకుడయ్యెను.

**తథాపి సాన్త్వయేమాముం నాస్మాంస్తత్పాతకం స్పృశేత్ ।**
**తద్విద్వద్భిరసద్వృత్తో వేనోఽస్మాభిః కృతో నృపః ॥ 11**

ఇదియంతయు దెలిసియుండియు మన మీదురాచారి యగువేనుని రాజుగా నొనరించితిమి. అయినను వానిపాపము మనకు తగులకుండుటకై వానికి మన మిప్పుడు తెలియజెప్ప ప్రయత్నింపవలెను.

**సాన్త్వితో యది నో వాచం న గ్రహీష్యత్యధర్మకృత్ ।**
**లోకధిక్కారసన్దగ్ధం దహిష్యామః స్వతేజసా ॥ 12**

మంచిమాటలచే ప్రబోధితుడయ్యును అధార్మికు డగునీవేనుడు మనవాక్కులను గ్రహింపడు. అపుడు లోకధిక్కారముచే మృతప్రాయుడగు వీనిని మనతేజస్సుచే దహింప జేయగలము.

**ఏవమధ్యవసాయైనం మునయో గూఢమన్యవః ।**
**ఉపవ్రజ్యా బ్రువన్ వేనం సాన్త్వయిత్వాథ సామభిః ॥ 13**

మును లిట్లు నిశ్చయించుకొని తమక్రోధమును దాచుకొని వేనుని కడకు వెడలి ప్రియ మైనవాక్కులద్వారా వానిని ప్రబోధింపసాగిరి.

శ్రీ మునయః ఊచుః

నృపవర్య నిబోధైతద్యత్తే విజ్ఞాపయామ భోః ।
ఆయుఃశ్రీబలకీర్తీనాం తవ తాత వివర్ధనమ్ ॥ 14

మునులు పలికిరి :-నృపశ్రేష్ఠా!వత్సా! మేము చెప్పబోవువిషయములను నీవు శ్రద్ధగ నాలకింపవలసినది. దానివలన నీకు ఆయుష్యము, ఐశ్వర్యము, బలము, కీర్తి మున్నగునవి వృద్ధిపొందును.

ధర్మ ఆచరితః పుంసాం వాఙ్మనః కాయబుద్ధిభిః ।
లోకాన్ విశోకాన్ వితరత్యథానన్త్యమసంగినామ్ ॥ 15

మనోవాక్కాయములద్వారా, బుద్ధిద్వారా అనుష్ఠింపబడిన ధర్మము సకామమనుష్యులకు స్వర్గాదిలోకములను, నిష్కామపురుషులకు మోక్షమును ఇచ్చును.

స తే మా వినశేద్వీర ప్రజానాం క్షేమలక్షణః ।
యస్మిన్ వినష్టే నృపతిరైశ్వర్యాదవరోహతి ॥ 16

వీరశ్రేష్ఠా! నీవు ప్రజలకు శ్రేయస్సును గలుగజేయు ధర్మమును నాశము చేయవలదు. ఆ ధర్మము నశించినచో రాజు ఐశ్వర్యభ్రష్టుడు కాగలడు.

రాజన్నసాధ్వమాత్యేభ్యశ్చోరాదిభ్యః ప్రజా నృపః ।
రక్షన్ యథా బలిం గృహ్ణన్నిహ ప్రేత్య చ మోదతే ॥ 17

రాజా! అసాధువు లగునమాత్యులనుండి, తస్కరాదులనుండి ప్రజలను రక్షించువాడు, శాస్త్రమున నిర్దేశించినదాని ననుసరించి పన్నును దీసికొనువాడు అగురాజు ఇహపరముల రెండింటియందును సుఖమును పొందును.

యస్య రాష్ట్రే పురే చైవ భగవాన్ యజ్ఞపూరుషః ।
ఇజ్యతే స్వేన ధర్మేణ జనైర్వర్ణాశ్రమాత్మకైః ॥ 18

తస్య రాజ్ఞో మహారాజ భగవాన్ భూతభావనః ।
పరితుష్యతి విశ్వాత్మా తిష్ఠతో నిజశాసనే ॥ 19

మహారాజా! ఏరాజుయొక్కరాజ్యమునందు, పురమునందు వర్ణాశ్రమధర్మావలంబులగుప్రజలు తమతమయధికారములకు దగినధర్మము ననుసరించి యజ్ఞపురుషభగవానుని ఆరాధింతురో, ప్రజాపాలన యనెడు భగవదభిలషితకార్యమున నున్న ఆరాజుపై భూతభావనుడు, విశ్వాత్ముడు నగుభగవానుడు పరితుష్టుడగును.

**తస్మింస్తుష్టే కిమప్రాప్యం జగతామీశ్వరేశ్వరే ।**
**లోకాస్సపాలా హ్యేతస్మై హరన్తి బలి మాదృతాః ॥ 20**

బ్రహ్మాదిజగదీశ్వరులకుగూడ ఈశ్వరుడగు ఆభగవానుడు ప్రసన్నుడయినచో ఆరాజు ఇక పొందదగని దేమియుండును? ఏలయన, లోకపాలురతోపాటు సర్వప్రాణులు సాదరముగ ఆయనకు పూజోపహారములను సమర్పించుచుందురు.

**తం సర్వలోకామరయజ్ఞసంగ్రహం**
**త్రయీమయం ద్రవ్యమయం తపోమయమ్ ।**
**యజ్ఞైర్విచిత్రైర్యజతో భవాయ తే**
**రాజన్ స్వదేశానురోద్ధుమర్హసి ॥ 21**

స్వర్గాదిలోకములకు లోకపాలురకు అమరులకు యజ్ఞములకు నియామకుడును, యజ్ఞబోధకవేదత్రయీరూపుడును, యజ్ఞద్రవ్యరూపుడును, తపోరూపుడును నగుభగవానుని ఈదేశవాసు లగుప్రజలు నీకు శుభమును జేకూర్చుటకై స్వాధ్యాయద్రవ్యాదిమయము లగుయజ్ఞములద్వారా అర్చించుచున్నారు. నీవుగూడ వారిని అనుసరింపవలెను.

**యజ్ఞేన యుష్మద్విషయే ద్విజాతిభి -**
**ర్వితాయమానేన సురాః కలా హరేః ।**
**స్విష్టాః సుతుష్టాః ప్రదిశన్తి వాంఛితం**
**తద్ధేలనం నార్హసి వీర చేష్టితుమ్ ॥ 22**

వీరుడా! నీరాజ్యమున బ్రాహ్మణులు యజ్ఞములుచేయుచున్నచో శ్రీహరియంశ సంభూతులగుదేవతలు చక్కగ ప్రసన్నులై అభీష్టములైన వాని నిత్తురు. అందువలన ఆదేవతల నవమానించుట నీకు తగదు.

## శ్రీవేన ఉవాచ

**బాలిశా బత యూయం వా అధర్మే ధర్మమానినః ।**
**యే వృత్తిదం పతిం హిత్వా జారం పతిముపాసతే ॥ 23**

వేనుడు పలికెను:- మునులారా! మీరు నాసేవను విడిచి విష్ణుసేవనే ధర్మ మనినమ్మ చున్నారు. అందువలన మీరు నిజముగ మూర్ఖులు. ఏలయన, మీరు అన్నదాతను, ప్రకృతమున రాజును నగునన్ను పరిత్యజించి వ్యభిచారిని యగుస్త్రీవలె మరియొక ప్రభువును సేవించుచున్నారు.

అవజానన్త్యమీ మూఢా నృపరూపిణమీశ్వరమ్ ।
నానువిన్దన్తి తే భద్రమిహ లోకే పరత్ర చ ॥ 24

మీరు మూర్ఖులు. నృపరూపమున నున్నయీశ్వరుని తెలిసికొనలేక అవమానించు చున్నారు. అందువలన మీ కీలోకమునగాని, పరలోకమున గాని యెచ్చటను శుభము గలుగదు.

చ. *ఎనయఁగ జారకామిని నిజేశుని మ్రుచ్చిలి జారపూరుషుం*
*దనపతిఁగాఁదలంచుగతిఁ దద్దయు మూఢమనస్కులై తన*
*ర్చిన నరపాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగ*
*కన్యుని భజియింప మీరిహపరోన్నతసౌఖ్యములంద రెన్నఁడున్.* (4-424)

కో యజ్ఞపురుషో నామ యత్ర వో భక్తిరీదృశీ ।
భర్తృస్నేహవిదూరాణాం యథా జారే కుయోషితామ్ ॥ 25

భర్తలపై ప్రేమలేని కులటాస్త్రీలు పరపురుషులయం దాసక్తి గలిగియుందురు అట్లే మీకెవరియం దింతగొప్ప భక్తి యున్నదో ఆయజ్ఞపురుషుడెవ్వడు? వానిపేరేమి?

విష్ణుర్విరించో గిరిశ ఇన్ద్రో వాయుర్యమో రవిః ।
పర్జన్యో ధనదః సోమః క్షితిరగ్నిరపాంపతిః ॥ 26

ఏతే చాన్యే చ విబుధాః ప్రభవో వరశాపయోః ।
దేహే భవన్తి నృపతేః సర్వదేవమయో నృపః ॥ 27

బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, ఇంద్రుడు, చంద్రుడు, వాయువు, అగ్ని, వరుణుడు, పర్జన్యుడు, కుబేరుడు, యముడు, సూర్యుడు, పృథివి ఇంకను ఇతరదేవతలు వరములను శాపములను ఈయగలసమర్థులు, వారందఱు రాజుదేహమున నివసించియుందురు. అందువలన రాజు సర్వదేవమయుడు.

తస్మాన్మాం కర్మభిర్విప్రా యజధ్వం గతమత్సరాః ।
బలిం చ మహ్యం హరత మత్తోఽన్యః కోఽగ్రభుక్పుమాన్ ॥ 28

అందువలన విప్రులారా! మీరు నాయందు మాత్సర్యమును విడచి నాయిచ్చకు దగినకార్యముద్వారా నన్నుద్దేశించి యజ్ఞముచేయుడు. నాకొఱకై పూజోపహారమును తీసికొనిరండు. నాకంటె భిన్నముగ ఆరాధ్యుడయిన వాడు మఱియొకడు లేడు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

**ఇత్థం విపర్యయమతిః పాపీయానుత్పథం గతః ।**
**అనునీయమానస్తద్యాచ్ఞాం న చక్రే భ్రష్టమంగలః ॥ 29**

మైత్రేయుడు పలికెను:- ఇట్లు విపర్యయ మైనబుద్ధిగలవాడు, పాపిష్ఠుడు, దుర్మార్గ గామియు, నష్టపుణ్యుడు నగునావేనుడు మునులచే అనునీయమాను డయ్యును వారి ప్రార్థనము నంగీకరింపలేదు.

**ఇతి తే సత్కృతాస్తేన ద్విజాః పండితమానినా ।**
**భగ్నాయాం భవ్యయాచ్ఞాయాం తస్మై విదుర చుక్రుధుః ॥ 30**

విదురా! తన్ను బుద్ధిమంతునిగ దలంచువేను డామునుల నవమానించెను. అపుడు తమకోరిక వ్యర్థ మగుట చూచి వారు వానిపై మిగుల కుపితులై యిట్లుపలికిరి --

**హన్యతాం హన్యతామేష పాపః ప్రకృతిదారుణః ।**
**జీవన్ జగదసావాశు కురుతే భస్మసాద్ధ్రువమ్ ॥ 31**

సహజముగనే దారుణుడు, పాపిష్ఠుడు నగు నీవేనుని సంహరింపుడు. ఈపాపాత్ముడు జీవించియున్నచో జగత్తును నిజముగనే దగ్ధముచేయగలడు.

**నాయమర్హత్యసద్వృత్తో నరదేవవరాసనమ్ ।**
**యోఽధియజ్ఞపతిం విష్ణుం వినిన్దత్యపత్రపః ॥ 32**

ఈ దురాచారునకు రాజసింహాసన మెక్కుటకెట్టియోగ్యతయు లేదు. లజ్జావిహీనుడగు ఇతడు సర్వయజ్ఞేశ్వరుడగు శ్రీహరినె నిందించుచున్నాడు.

**కో వైనం పరిచక్షీత వేనమేకమృతేఽశుభమ్ ।**
**ప్రాప్త ఈదృశమైశ్వర్యం యదనుగ్రహభాజనః ॥ 33**

ఏ విష్ణుభగవానునియనుగ్రహమునకు పాత్రుడయినవీడు ఇంతటి మహదైశ్వర్యమున కధిపతి యయ్యెనో, పాపము రూపుగట్టిన యీవేనుడుకాక మఱియెవ్వ రాభగవానుని నిందింతురు?

**ఇత్థం వ్యవసితా హన్తుమృషయో రూఢమన్యవః ।**
**నిజఘ్నుర్హుంకృతై ర్వేనం హతమచ్యుతనిన్దయా ॥ 34**

ఇట్లు మునులు వేనుని నాశనము చేయసంకల్పించి కోపమును వెల్లడిచేసిరి, అచ్యుతుని నిందించుటవలన పూర్వమే హతుడయిన వీనిని హుంకారముచేసి నిహతునిజేసిరి.

**ఋషిభిః స్వాశ్రమపదం గతే పుత్రకలేవరమ్ ।**
**సునీథా పాలయామాస విద్యాయోగేన శోచతీ॥ 35**

ఇట్లు వేనుని సంహరించి ఋషులు తమతమయాశ్రమములకు వెడలిరి. వేనునితల్లి యగుసునీథి దుఃఖించుచు పుత్రునిమృతదేహమును విద్యాయోగముచే (మంత్రముచే) రక్షింపసాగెను.

**ఏకదా మునయస్తేతు సరస్వత్సలిలాప్లుతాః ।**
**హుత్వాగ్నీన్ సత్కథాశ్చక్రురుపవిష్టాః సరిత్తటే ॥ 36**

ఒకనాడామును లందఱు సరస్వతీజలములలో స్నానముచేసి హోమకార్యముల నెఱవేర్చి ఆ నదీతటమున ఉపవిష్టులై భగవత్కథను కీర్తింపసాగిరి.

**వీక్ష్యోత్థితాన్ తదోత్పాతానాహుర్లోకభయంకరాన్ ।**
**అప్యభద్రమనాథాయా దస్యుభ్యో న భవేద్భువః ॥ 37**

ఇంతలో లోకభయంకరము లగుఎన్నియో ఉత్పాతములు బయలుదేరుట చూచి జనులు పరస్పరము "రాజు లేనియీపుడమికి దొంగలవలన ఏమిట్టైన అశుభములు గలుగుట లేదుగదా" యని చర్చించుకొనసాగిరి.

**ఏవం మృశన్త ఋషయో ధావతాం సర్వతో దిశమ్ ।**
**పాంసుః సముత్థితో భూరిశ్చోరాణామభిలుమ్పతామ్ ॥ 38**

ఋషు లిట్లుపరస్పరము చర్చించుకొనుచున్నసమయమున ధనాపహారకు లగు దొంగలు నలువైపుల పరుగిడసాగిరి. దానివలన పెద్దగా దుమ్ము పైకి లేచెను.

**తదుపద్రవమాజ్ఞాయ లోకస్య వసులుంపతామ్ ।**
**భర్తర్యుపరతే తస్మిన్నన్యోన్యం చ జిఘాంసతామ్ ॥ 39**

**చౌరప్రాయం జనపదం హీనసత్త్వమరాజకమ్ ।**
**లోకాన్నావారయన్ శక్తా అపి తద్దోషదర్శినః ॥ 40**

వేనరాజు చనిపోగా ధనాపహారకులు, పరస్పరహింసారతులు నగు దుర్జనులవలన సాధువులకు గలుగునుపద్రవమును జూచియు, జనపదము అరాజకము, చోరబహుళము, ధైర్యహీనము నగుట గాంచియు, ఉపద్రవకారులను వేనునివలె సంహరింపగల శక్తి

గలిగియుండియు, వారిని నాశనము చేసినచో హింసాదిదోషములు గలుగుననియు భావించి మునులు వారిని నివారింపకపోయిరి.

బ్రాహ్మణః సమదృక్ శాన్తో దీనానాం సముపేక్షకః ।
స్రవతే బ్రహ్మ తస్యాపి భిన్నభాండాత్ పయో యథా ॥ 41

సమదర్శియు, శాంతుడు నైయుండియు బ్రాహ్మణుడు దుర్బలురపై జరుగు అత్యాచారమును జూచి, తన్నివారణమున ఉపేక్షవహించినచో పగిలినకుండలోనుండి పాలు బయటకు పోవునట్లు వానితపస్సు భ్రష్టమగును.

నాఙ్గస్య వంశో రాజర్షేరేషసంస్థాతుమర్హతి ।
అమోఘవీర్యా హి నృపా వంశేఽస్మిన్ కేశవాశ్రయాః ॥ 42

(ఋషులు పలుకసాగిరి) :- రాజర్షియగు అంగునియీవంశమొక్కమారు ధ్వంసమగుట యుచితము కాదు. ఈవంశమున నెందఱో విష్ణుభక్తిపరాయణులు, అమోఘవీర్యులు నగురాజులు జనించిరి.

వినిశ్చిత్యైవమృషయో విపన్నస్య మహీపతేః ।
మమంథురూరుం తరసా తత్రాసీద్బాహుకో నరః ॥ 43

కాకకృష్ణోఽతిహ్రస్వాంగో హ్రస్వబాహుర్మహాహనుః ।
హ్రస్వపాన్నిమ్ననాసాగ్రో రక్తాక్షస్తామ్రమూర్ధజః ॥ 44

ఋషులిట్లునిశ్చయించి అతివేగమున సునీథచే రక్షిత మగుచున్న వేనరాజుమృత శరీరము యొక్క ఊరుదేశమును మథించిరి, దానివలన ఒకపొట్టిమనుష్య డుద్భవించెను. వానిరంగు కాకివలె నల్లగ నుండెను. అవయవములు, బాహువులు మిగుల పొట్టిగ నుండెను. వానిదవడలు పెద్దవిగను, పాదములు పొట్టిగను, ముక్కుచివరిభాగము నిమ్నము గను, నేత్రములు ఎరుపుగను, జుట్టు రాగిరంగుగను ఉండెను.

తం తు తే ఽవనతం దీనం కింకరోమీతి వాదినమ్ ।
నిషీదేత్యబ్రువంస్తాత స నిషాదస్తతోఽభవత్ ॥ 45

వత్సా! అతడు తలవంచుకొని వినీతభావముతో "నేనేమి చేయవలె" ననియడిగెను. అప్పుడు ఋషులు వానితో 'నిషీద' అనగా గూర్చుండు మనిపలికిరి. దానివలన వాడు 'నిషాదు' డయ్యెను.

తస్య వంశ్యాస్తు నైషాదా గిరికాననగోచరాః ।
యేనాహరజ్జాయమానో వేనకల్మషముల్బణమ్ ॥ 46

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే పృథుచరితే నిషాదోత్పత్తిర్నామ
చతుర్దశోఽధ్యాయః॥

అతడు జన్మించినంతనె వేనరాజుయొక్క భయంకరపాపములను స్వీకరించెను. దానివలన వానివంశమువారు నిషాదు లనిచెప్పబడిరి. వారు గ్రామములలోను, నగరములలోను ఉండక అడవులలో నివసించుచుందురు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని పదునాల్గవ
అధ్యాయము సమాప్తము.





# పదునైదవ అధ్యాయము

## పృథుచక్రవర్తి జననము, రాజ్యాభిషేకము

కథాసారము :- ఈయధ్యాయమున విప్రులు వేనుని బాహువులను మథించుట, దానివలన పృథురాజు ఆవిర్భవించుట, వానికి రాజ్యాభిషేకము జరుగుట మున్నగు విషయములు వర్ణితములైనవి.

పృథువు ఆవిర్భవించినపుడు బ్రహ్మ దేవతలతోగలసి వచ్చి వానియందు విష్ణుచిహ్నాదులను దర్శించి, వానిని భగవదంశగా భావించెను. వానిరాజ్యాభిషేకమునకు ప్రయత్నము సాగుచుండగ ప్రజలు నానాదిక్కులనుండి వచ్చి అభిషేకమున కుపయోగపడు సంభారములను కానుకలుగా నిచ్చుచుండిరి.

సముద్రుడు తనసలిలములనుండి పుట్టినశంఖములను, పర్వతములు నదులు పృథురాజునకు రథమార్గమును ఇచ్చినవి. పృథివి పాదస్పర్శమాత్రముచేతనే అభీష్టదేశములకు చేర్చుపాదుకలను, ఆకాశము పుష్పములను, గోవులు శృంగనిర్మితధనువును ఇచ్చినవి. కుబేరుడు పృథురాజున కత్యుత్తమమగు నాసనమును, వరుణుడు శ్వేతచ్ఛత్రమును, వాయువు చామరమును, ధర్ముడు కీర్తిమయ మగుమాలను, ఇంద్రుడు ముకుటమును, యముడు దండమును, బ్రహ్మ కవచమును, సరస్వతి అత్యుత్కృష్ట మగు హారమును, హరి సుదర్శనచక్రమును, రుద్రాదిదేవతలు నానావిధములగు నుపహారములను నిచ్చిరి. వందిమాగధులు స్తుతింప నారంభింపగా పృథు విట్లుపలికెను- "పుణ్యకీర్తి యగుభగవానునిలీలలుండగా మావంటి అవ్యక్తకీర్తులు, అయోగ్యులు నగువ్యక్తులను నుతించి వ్యర్థముగ వాక్కులను వ్యయము చేయవలదు. స్తోత్రములచే మూఢులగువారు మోహము చెందుదురు, ఉదారవ్యక్తులు సిగ్గుపడుదురు".

### శ్రీ మైత్రేయ ఉవాచ

**అథ తస్య పునర్విప్రైరపుత్రస్య మహీపతేః ।**
**బాహుభ్యాం మథ్యమానాభ్యాం మిథునం సమపద్యత॥ 1**

మైత్రేయుడు పలికెను:- విదురా! పిమ్మట మునులు మరల అపుత్రకు డగు నావేనరాజు బాహువులను మథించుచుండగ దానినుండి యొక పురుషుడు, ఒకస్త్రీ జన్మించిరి.

**తద్దృష్ట్వా మిథునం జాతమృషయో బ్రహ్మవాదినః ।**
**ఊచుః పరమసంతుష్టా విదిత్వా భగవత్కలామ్ ॥ 2**

బ్రహ్మవాదులగుమునులు జన్మించిన ఈస్త్రీపురుషులను జూచి భగవదంశలుగా ఎఱింగి పరమసంతుష్టులై యిట్లుపలుకసాగిరి.

## శ్రీ ఋషయ ఊచుః

**ఏష విష్ణోర్భగవతః కలా భువనపావనీ ।**
**ఇయం చ లక్ష్మ్యాః సంభూతిః పురుషస్యానపాయినీ ॥ 3**

ఋషులు పలికిరి :- ఈపురుషుడు విష్ణుభగవానుని భువనపాలకాంశము. ఈస్త్రీగూడ భగవానునియొక్క సనాతని యగులక్ష్మీదేవియంశము నుండి పుట్టినట్టిదే.

**అత్ర యః ప్రథమో రాజ్ఞాం పుమాన్ ప్రథయితా యశః ।**
**పృథుర్నామ మహారాజో భవిష్యతి పృథుశ్రవాః ॥ 4**

వీరిలో పురుషుడు ఆదిరాజై కీర్తిని విస్తరింపజేయును, మహాకీర్తివంతు డగుపృథువు నామముతో ప్రసిద్ధిచెంది మహారాజు అగును.

**ఇయం చ దేవీ సుదతీ గుణభూషణభూషణమ్ ।**
**అర్చిర్నామ వరారోహా పృథుమేవావరున్ధతీ ॥ 5**

దేదీప్యమానయు, మంచిదంతములు గలదియు, గుణములకు భూషణస్వరూపిణియు, వరారోహయు నగు నీమె అర్చియను నామముతో ప్రసిద్ధి చెంది పృథుమహారాజును భర్తృరూపముతో సేవించును.

**ఏష సాక్షాద్ధరేరంశో జాతో లోకరిరక్షయా ।**
**ఇయం చ తత్పరా హి శ్రీరనుజజ్ఞేఽనపాయినీ । 6**

ఏలయన, ఈపురుషుడు సాక్షాతుగ శ్రీహరియంశము : కేవలము లోకరక్షణనిమిత్తమై జన్మను పరిగ్రహించెను. ఇంకను నీ స్త్రీ భగవానుని యం దైకాంతికభక్తిగలదియు, తద్వియోగమును సహింపలేనిదియు నగు లక్ష్మీస్వరూపిణి. అందువలన నీమె భర్తతోపాటిహలోకమున నావిర్భవించినది.

## శ్రీ మైత్రేయ ఉవాచ

**ప్రశంసన్తి స్మ తం విప్రా గన్ధర్వప్రవరా జగుః ।**
**ముముచుః సుమనోధారాః సిద్ధా నృత్యన్తి స్వఃస్త్రియః ॥ 7**

మైత్రేయుడు పలికెను :- పిమ్మట విప్రు లీపురుషునిగుణములను కీర్తింపసాగిరి. గంధర్వశ్రేష్ఠులు వానికీర్తిని గానముచేయుచుండిరి. సిద్ధులు పుష్పముల గురిపింపసాగిరి. అప్సరసలు నృత్యము చేయసాగిరి.

**శంఖతూర్యమృదంగాద్యా నేదుర్దున్దుభయో దివి ।**
**తత్ర సర్వ ఉపాజగ్ముర్దేవర్షి పితౄణాం గణాః ॥ 8**

స్వర్గమున దేవతలు శంఖములు, తూర్యములు, మృదంగములు, దుందుభులు మున్నగువాద్యములను మ్రోగించుచుండిరి. పిమ్మట దేవర్షులు, పితృదేవతలు అందఱు అచటికి చేరుకొనిరి.

**బ్రహ్మా జగద్గురుర్దేవై : సహాసృత్య సురేశ్వరైః ।**
**వైన్యస్య దక్షిణే హస్తే దృష్ట్వా చిహ్నం గదాభృతః ॥ 9**
**పాదయోరరవిన్దం చ తం వై మేనే హరేః కలామ్ ।**
**యస్యాప్రతిహతం చక్రమంశః స పరమేష్ఠినః ॥ 10**

జగద్గురు వగు బ్రహ్మ దేవతలతోను, దేవతాశ్రేష్ఠులతోను గలసి యచటికి వెడలి వేననందనుని కుడిహస్తమున విష్ణుచక్రరేఖలు, పాదముల యందు పద్మచిహ్నములు ఉండుట చూచెను. అందువలన ఆయన వానిని శ్రీహరియంశగా భావించెను. ఏలయన, చక్రరేఖలు ఇతరరేఖలచే విలుప్తము గానిచో అతడు పరమేశ్వరునియంశమే యగును.

**తస్యాభిషేక ఆరబ్ధో బ్రాహ్మణైర్బ్రహ్మవాదిభిః ।**
**అభిషేచనికాన్యస్మై ఆజహ్రుః సర్వతో జనాః ॥ 11**

బ్రహ్మవాదులగుబ్రాహ్మణులు వానికి రాజ్యాభిషేకముచేయ మొదలిడిరి, అపుడు జనులందఱు నలువైపులనుండి పృథువునకు అభిషేకసాధనద్రవ్యములను దెచ్చి సమర్పింపసాగిరి.

**సరిత్సముద్రా గిరయో నాగా గావః ఖగా మృగాః ।**
**ద్యౌః క్షితిః సర్వభూతాని సమాజహ్రురుపాయనమ్ ॥ 12**

గిరులు, నదులు, సముద్రములు, నాగములు, గోవులు, పక్షులు, మృగములు, ద్యులోకము, భూలోకము, సమస్తజీవులు నానావిధములగు ఉపహారముల దెచ్చి సమర్పింపసాగిరి.

**సోఽభిషిక్తో మహారాజః సువాసాః సాధ్వలంకృతః ।**
**పత్న్యార్చిషాలంకృతయా విరేజే ఽగ్నిరివాపరః ॥ 13**

పృథు మహారాజు బ్రాహ్మణులచే అభిషిక్తుడయి ప్రకాశవంతములగు వస్త్రములను, సత్పురుషులు నివేదించినభూషణములను ధరించెను. పిమ్మట అతడు నానాలంకారభూషిత యగు అర్చిదేవితో గూడి రాజసింహాసనము నధిరోహించి రెండవయగ్నివలె విరాజిల్లసాగెను.

తస్మై జహార ధనదో హైమం వీర వరాసనమ్ ।
వరుణః సలిలస్రావమాతపత్రం శశిప్రభమ్ ॥ 14

వాయుశ్చ వాలవ్యజనే ధర్మః కీర్తిమయీం స్రజమ్ ।
ఇన్ద్రః కిరీటముత్కృష్టం దండం సంయమనం యమః ॥ 15

బ్రహ్మా బ్రహ్మమయం వర్మ భారతీ హారముత్తమమ్ ।
హరిః సుదర్శనం చక్రం తత్పత్న్యవ్యాహతాం శ్రియమ్ ॥ 16

దశచన్ద్రమసిం రుద్రః శతచన్ద్రం తథాంబికా ।
సోమోఽమృతమయానశ్వాంస్త్వష్టా రూపాశ్రయం రథమ్ ॥ 17

అగ్నిరాజగవం చాపం సూర్యో రశ్మిమయానిషూన్ ।
భూః పాదుకే యోగమయ్యౌ ద్యౌః పుష్పావలిమన్వహమ్ ॥ 18

నాట్యం సుగీతం వాదిత్రమన్తర్ధానం చ ఖేచరాః ।
ఋషయశ్చాశిషః సత్యాః సముద్రః శంఖమాత్మజమ్ ॥ 19

సిన్ధవః పర్వతా నద్యో రథవీథీర్మహాత్మనః ।
సూతోఽథ మాగధో వన్దీ తం స్తోతుముపతస్థిరే ॥ 20

వీరుడా! పృథుమహారాజునకు కుబేరుడు సువర్ణనిర్మిత మగునొక యుత్తమాసనమును, వరుణుడు సలిలములను స్రవించు చంద్రకాంతివంటి శ్వేతచ్ఛత్రమును, వాయువు రెండుచామరములను, ధర్మదేవత కీర్తిమయమగునొకమాలను, ఇంద్రుడు గొప్పకిరీటమును, యముడు శత్రువులను వశముచేయునట్టి దండమును, బ్రహ్మ వేదమయ మగు కవచమును, సరస్వతి ఉత్తమహారమును, విష్ణుభగవానుడు సుదర్శనచక్రమును, విష్ణుప్రియ యగులక్ష్మి అక్షయసంపదను, రుద్రదేవుడు దశచంద్రాకారచిహ్నాయుక్తమగుకోశములు గలఖడ్గమును పార్వతి శతచంద్రాకారచిహ్నిత మగుడాలును, సోముడు మరణము అలసట కలత లేని కొన్నియశ్వములను, విశ్వకర్మ సుందర మగునొకరథమును, అగ్ని అజగోశృంగనిర్మితధనువును, సూర్యుడు రశ్మిమయము లగుబాణములను, భూమి పాదస్పర్శమాత్రముననే యభీష్టదేశములను పొందించు పాదుకలను, ఆకాశము ప్రతిదినము

పుష్పావలిని, విమానచారు లగుగంధర్వాదులు నాట్యమును, గీతమును, వాద్యమును, నాట్యాదికౌశలమును, ఋషులు యథార్థము లగునాశీస్సులను, సముద్రుడు తనసలిలముల నుండి పుట్టినశంఖములను కానుకలుగా నిచ్చిరి. సముద్రములు, పర్వతములు, నదులు మున్నగున వన్నియు విష్ణువుఅవతారుడగునీపృథుచక్రవర్తికి రథమార్గము నిచ్చినవి. అనంతరము సర్వవిధములగునుపాయములు నివేదింపబడినపిమ్మట సూతులు, వందిమాగధులు ఆయను స్తుతించుటకై వచ్చియుండిరి.

**స్తవకాంస్తానభిప్రేత్య పృథుర్వైణ్యః ప్రతాపవాన్ ।**
**మేఘనిర్హ్రాదయా వాచా ప్రహసన్నిదమబ్రవీత్ ॥ 21**

స్తోత్రముచేయుట కుద్యుక్తులగుచున్న వారియభిప్రాయమును దెలిసికొని ప్రతాపవంతుడు వేనరాజకుమారుడు నగుపృథుచక్రవర్తి నవ్వి మేఘగంభీరస్వరముతో నిట్లు పలికెను.

## శ్రీ పృథు రువాచ

**భోఃసూత హే మాగధ సౌమ్యవన్దిన్**
**లోకేఽధునాస్పష్టగుణస్య మే స్యాత్ ।**
**కిమాశ్రయోమేఽ స్తవ ఏష యోజ్యతాం**
**మా మయ్యభూవన్ వితథా గిరో వః ॥ 22**

పృథుచక్రవర్తి పలికెను :- సూతుడా! వందిమాగధులారా! నాపరాక్రమ మింకను లోకమున వెల్లడికాలేదు. అందువలన మీరు ఏవిషయము నాశ్రయించి నన్ను స్తుతింప దలచితిరి? కనుక యీస్తుతిని నన్ను గూర్చికాక యోగ్యుడగువ్యక్తి నెవ్వరినై నగూర్చి చేయ ప్రయత్నింపుడు. మీవాక్కులు నాయందు ప్రయుక్తములై మిథ్యారూపమున పరిణమింపకుండగ నుండుగాక ! అదియే నాకోరిక.

**తస్మాత్పరోక్షేఽస్మదుపశ్రుతాన్యలం**
**కరిష్యథ స్తోత్రమపీవ్యవాచః ।**
**సత్యుత్తమఃశ్లోకగుణానువాదే**
**జుగుప్సితం న స్తవయన్తి సభ్యాః ॥ 23**

మధురవచస్కులారా! ఇప్పుడు నాగుణము లవ్యక్తముగ నున్నవి. కాలాంతరమున అవి వ్యక్త మైనపుడు మీరు నాకీర్తిని చక్కగ కీర్తింపుడు. ఉత్తమశ్లోకు డగుభగవాముని గుణానువాదము కీర్తింపదగినది. సభ్యులు నావంటియప్రసిద్ధగుణవంతుని స్తుతించుట కిష్టపడరు.

**మహద్గుణానాత్మని కర్తుమీశః**
**కః స్తావకైః స్తావయతేఽసతోఽపి ।**
**తేఽస్యాభవిష్యన్నితి విప్రలబ్ధో**
**జనావహాసం కుమతిర్న వేద ॥** 24

మహాత్ములగుణములు తమయందు నిలుపుకొనుటకు అనేకులకు సామర్థ్య మున్నను ఆగుణములు ఆవిర్భవింపకుండగ సంభావనామాత్రము చేతనే స్తోత్రపాఠకులద్వారా తమ్ముస్తుతింజేసికొనువారెవరుందురు? ఎవ్వడయిన నొకడు శాస్త్రాభ్యాసమున తనకు విద్యాతపోయోగగుణములు గలుగు ననిపలికినచో వానిని జూచి సభ్యులు పరిహసింతురు. అది కుమతియగువా డెఱుంగడు.

**ప్రభవో హ్యాత్మనః స్తోత్రం జుగుప్సన్త్యపి విశ్రుతాః ॥**
**హ్రీమన్తః పరమోదారాః పౌరుషం వా విగర్హితమ్ ॥** 25

నిష్కపటులు, ఉన్నతహృదయులు, లజ్జావంతులు అగుపురుషులు జగత్తులో విశ్రుతకీర్తులు, ప్రభావశాలురునై యుండియు ఆత్మస్తుతిని నిందితమగు పౌరుషమునువలె గర్హింతురు.

అనగా 'నీవు గొప్ప తేజస్వివి, ధర్మాతిక్రమణమువలన నీకెట్టి ప్రత్యవాయము గలుగదు' అనునిట్టిస్తుతి తేజస్వులపట్ల అనుచితము, అతిస్తుతి కాకపోయినను తేజస్వి యైనవాడిట్టిస్తుతిని సహింపడు.

**వయం త్వవిదితా లోకే సూతాద్యాపి వరీమభిః ।**
**కర్మభిః కథమాత్మానం గాపయిష్యామ బాలవత్ ॥** 26

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే పృథుచరితే పంచదశోఽధ్యాయః ॥

సూతుడా ! మే మింతవఱ కెట్టిశ్రేష్ఠకర్మలద్వారా లోకమున ప్రసిద్ధిని పొందలేదు. అందువలన అజ్ఞులవలె ఆత్మస్తుతి నెట్లుచేయించుకొందుము.?

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని పదునైదవ అధ్యాయము
సమాప్తము.



# పదునాలవ అధ్యాయము

## వందిమాగధులు పృథుచక్రవర్తిని స్తుతించుట.

కథాసారము:- ఈయధ్యాయమున మునులయాదేశము ననుసరించి వందిమాగధులు పత్నీసహితముగ పృథుమహారాజును వర్ణించుట యనువిషయము వర్ణితమైనది.

వందిమాగధులు పృథుమహారాజు పలికిన ఆవాక్కులను విని మిగుల సంతుష్టిచెందిన వారై క్రిందివిధముగ పలికిరి - "మేము నీగుణములను వర్ణించుట కయోగ్యుల మయ్యును మునులు మాహృదయమున ప్రేరణకలిగించిన విధముగ మేము నీప్రశంసనీయ మగు కర్మలను వర్ణింతుము. ధర్మజ్ఞుడ వగు నీవు ప్రజలను ధర్మపథమున నడిపించుట, ధర్మద్రోహులను శిక్షించుట,తగువిధముగ పన్నులను స్వీకరించుట, దానము పాలనము పోషణము మున్నగుపనులద్వారా స్వర్గమర్త్యములకు శుభముల జేకూర్చుట, పృథివివలె దయాసహనములను గలిగి యుండుట ప్రజాసంరక్షణము మున్నగు అసంఖ్యగుణములు నీయందు స్పష్టముగ నుండగలవు. నిన్నెవ్వరును జయింపజాలరు. నీవు యమునివలె న్యాయవిచారకుడవై అప్రతిహతభావముతో సంచరింపగలవు." పిమ్మట సరస్వతీనదీ తీరమున పృథుమహారాజు వందలకొలదిగ యజ్ఞములు చేయుట, సర్వశేషయజ్ఞమున ఇంద్రుడు యజ్ఞాశ్వమును హరించుట,అనంతరము సనత్కుమారునితో గలియుట, గురుసేవాప్రభావముచే ఆయననుండి నిర్మల మగుభగవద్జ్ఞానమును పొందుట మున్నగు విషయములు వర్ణింపబడెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

**ఇతి బ్రువాణం నృపతిం గాయకా మునిచోదితాః ।**
**తుష్టువు స్తుష్టమనసస్తద్వాగమృతసేవయా ॥ 1**

మైత్రేయుడు పలికెను ;- పృథుమహారాజిట్లుపలుకుచుండగా సూతాదిగాయకులు వానికథామృతసేవనమున సంతుష్టచిత్తులై మునుల ప్రేరణ ననుసరించి వానిని స్తుతింపనారంభించిరి.

**నాలం వయం తే మహిమానువర్ణనే**
**యో దేవవర్యో ఽవతతార మాయయా ।**
**వేనాంగజాతస్య చ పౌరుషాణి తే**
**వాచస్పతీనామపి బభ్రముర్ధియః ॥ 2**

మహారాజా ! నీవు విష్ణుభగవానుని శక్త్యావేశావతారుడవు. నీమహిమను వర్ణించు సామర్థ్యము మాకు లేదు. ఏలయన, నీవు వేనరాజు శరీరమునుండి జన్మించినను నీపౌరుషవర్ణనమున బ్రహ్మాదులబుద్ధిగూడ భ్రమచెందును.

**అథాప్యుదారశ్రవసః పృథోర్హరేః**
**కలావతారస్య కథామృతాదృతాః ।**
**యథోపదేశం మునిభిః ప్రచోదితాః**
**శ్లాఘ్యాని కర్మాణి వయం వితన్మహి ॥ 3**

(నీగుణకీర్తనమున మాకు సామర్థ్యము లేకపోయినను) శ్రీహరి యంశావతారుడవు, మహాయశస్కుడవు నగు నీకథామృతమున మాకు విశేషాదరము కలిగినది. మునులు మమ్ము ప్రేరేపించిరి. వారు యోగబలముచే మాహృదయమున ప్రవేశించి స్ఫూర్తిని గలుగజేసిరి. మేము దాని ననుసరించి శ్లాఘనీయ మగునీకీర్తిని కీర్తింతుము.

**ఏష ధర్మభృతాం శ్రేష్ఠో లోకం ధర్మేఽనువర్తయన్ ।**
**గోప్తా చ ధర్మసేతూనాం శాస్తా తత్పరిపన్థినామ్ ॥ 4**

(గాయకులు పలుక నారంభించిరి -) ఈపృథుచక్రవర్తి స్వధర్మమును పాలించువారిలో శ్రేష్ఠుడు, జనులధర్మమును ప్రవర్తింపజేయువాడు. ఇతడు వర్ణాశ్రమధర్మమర్యాదను సంరక్షించువాడు, దుర్మార్గులను శిక్షించువాడు.

**ఏష వై లోకపాలానాం బిభర్త్యేకస్తనౌ తనూః ।**
**కాలే కాలే యథాభాగం లోకయో రుభయోర్హితమ్ ॥ 5**

ఇత డొంటరిగనే తగినభావముతో ఇహలోకపరలోకములకు మేలు జేకూర్చుటకై ఆయాసమయములయందు స్వశరీరమున ఇంద్రాది లోకపాలురమూర్తులను ధరించును.

**వసు కాల ఉపాదత్తే కాలే చాయం విముంచతి ।**
**సమస్సర్వేషు భూతేషు ప్రతపన్ సూర్యవద్విభుః ॥ 6**

ఈపృథువు సర్వప్రాణులయందు సమదర్శియై, సూర్యసదృశ మగు తనప్రతాపమును వెల్లడిచేసి తగినసమయమున ధనమును గూడబెట్టును, దానము చేయును.

**తితిక్షత్యక్రమం వైన్య ఉపర్యాక్రమతామపి ।**
**భూతానాం కరుణః శశ్వదార్తానాం క్షితి వృత్తిమాన్ ॥ 7**

వేననందను డగునీపృథువు ధరిత్రీస్వభావమైనక్షమాగుణముగలవాడు. ఇతడార్తులపట్ల కరుణ గలిగియుండును. వారీతనిశిరముపై పాదము నుంచినను ఇతడు దానిని సహించును.

దేవేఽవర్షత్యసౌ దేవో నరదేవవపుర్హరిః ।
కృచ్ఛ్రప్రాణాః ప్రజా హ్యేష రక్షిష్యత్యఞ్జసేన్ద్రవత్ ॥ 8

ఇంద్రుడు వర్షము గురిపించుట నాపివేయగా ప్రజలప్రాణములు సంకటమున బడును. ఇది చూచి శ్రీహరిభగవానునియంశసంభూతుడు నరదేవశరీరధారియు నగుపృథువు స్వయముగ ఇంద్రునివలె మేఘములను వర్షింపజేసి ప్రజలను రక్షించును.

ఆప్యాయయత్యసౌ లోకం వదనామృతమూర్తినా ।
సానురాగావలోకేన విశదస్మితచారుణా ॥ 9

ఈపృథుమహారాజు అనురాగసంపృక్తమగు అవలోకనములతోను, విశుద్ధము హాసోత్ఫుల్లము నగుసుందరముఖచంద్రునితోను లోకమున కానందమును గలుగజేయును.

అవ్యక్తవర్త్మైషనిగూఢకార్యో
గంభీరవేధా ఉపగుప్తవిత్తః ।
అనంతమాహాత్మ్యగుణైకధామా
పృథుః ప్రచేతా ఇవ సంవృతాత్మా ॥ 10

ఈమహాత్ముని ప్రవేశనిర్గమనమార్గము లవ్యక్తముగ నుండును, ఫలనిష్పత్తికి పూర్వము వీనికార్యముల నెవ్వడును తెలిసికొనజాలడు, ఇతడీపని నెందులకు జేసెనో యని యెవ్వరును దెలిసికొనజాలనంతటిగంభీరముగ పనులను జక్కబెట్టును. ఈతనిధనాదు లుత్తమరూపమున రక్షితములగును. అనంతమాహాత్మ్యసంపన్నుడు, అశేషగుణధాముడు, సంయతమూర్తియు నగు ఈపృథుచక్రవర్తి వరుణసదృశుడయి శోభిల్లును.

దురాసదో దుర్విషహ ఆసన్నోఽపి విదూరవత్ ।
నైవాభిభవితుం శక్యో వేనారణ్యుత్థితోఽనలః ॥ 11

వేనుడను అరణినుండి పృథు వనుఅగ్ని ఉత్పన్నమైనది. దీనిని శత్రువర్గము మనస్సుతోగూడ స్పృశింపజాలదు. ఈపృథువుయొక్క పరాక్రమమును శత్రువులు సహింపజాలరు. వారిసమీపమున నున్నను ఈయన నెవ్వరును ఓడింపజాలరు.

అన్తర్బహిశ్చ భూతానాం పశ్యన్ కర్మాణి చారణైః ।
ఉదాసీన ఇవాధ్యక్షో వాయురాత్మేవ దేహినామ్ ॥ 12

ఈమహాత్ముడు చారణులద్వారా ప్రాణులలోపల బయట ఉన్నకార్యముల నెఱింగియు దేహధారి యగుజీవునిలోపల ఉన్నవాయువువలె అనగా అంతర్యామివలె (తననిందయందుగాని స్తుతివిషయమునందుగాని) ఉదాసీనుడయి సాక్షిరూపముతో నుండును.

**నాదండ్యం దండయత్యేష సూతమాత్మద్విషామపి ।**
**దండయత్యాత్మజమపి దండ్యం ధర్మపథేస్థితః ॥ 13**

ఈపృథుచక్రవర్తి యమునివృత్తియందుండి, శత్రుసంతానమైనను దండనమున కర్హము కానిచో వానిని దండింపడు, తనసంతాన మైనను దండనమున కర్హమైనచో శిక్షింపక వదలుటయుండదు.

**అస్యాప్రతిహతం చక్రం పృథోరామానసాచలాత్।**
**వర్తతే భగవానర్కో యావత్తపతి గోగణైః ॥ 14**

ఐశ్వర్యవంతు డగుసూర్యదేవుడు మానసాచలమువఱకు గలప్రదేశములను తన కిరణములద్వారా ప్రకాశింపజేయును. ఈయన ఆజ్ఞాచక్రము లేదా రథచక్రము ఆ ప్రదేశము లన్నింటియందు అప్రతిహతముగ సంచరించును.

**రంజయిష్యతి యల్లోకమయమాత్మవిచేష్టితైః ।**
**అథాముమాహూ రాజానం మనోరంజనకైః ప్రజాః ॥ 15**

ఈపృథువు మనోరంజక మగుతనపరాక్రమముద్వారా ప్రజారంజనముచేయును. అందువలన ప్రజ లాయనను 'రాజా' యని పిలచెదరు.

**దృఢవ్రతః సత్యసంధో బ్రహ్మణ్యో వృద్ధసేవకః ।**
**శరణ్యః సర్వభూతానాం మానదో దీనవత్సలః ॥ 16**

ఇతడు దృఢవ్రతుడు, సత్యప్రతిజ్ఞుడు, బ్రాహ్మణులమేలును గోరువాడు, వృద్ధసేవకుడు, సర్వజీవుల కాశ్రయయోగ్యుడు, గౌరవించువాడు, దీనవత్సలుడు.

**మాతృభక్తిః పరస్త్రీషు పత్న్యామర్ధ ఇవాత్మనః ।**
**ప్రజాసు పితృవత్ స్నిగ్ధః కింకరో బ్రహ్మవాదినామ్ ॥ 17**

ఈయన పరదారలయందు మాతృభక్తిని, తనభార్యయందు అర్ధాంగతుల్య మగుప్రీతిని, ప్రజలయందు పితృసమాన మగు ప్రేమను, బ్రహ్మవాదు లగుబ్రాహ్మణులకు సేవకునివలె ఉండును.

**దేహినామాత్మవత్ ప్రేష్ఠః సుహృదాం నన్దివర్ధనః ।**
**ముక్తసంగప్రసంగోఽయం దండపాణిరసాధుషు ॥ 18**

ఇతరప్రాణు లీతనిని తమశరీరమును ప్రేమించునట్లు ప్రేమింతురు ఈయన బంధువుల కానందమును వృద్ధిచేయును. ముఖ్యముగ విరాగులగుపురుషుల నెక్కువగ ప్రేమించు, దండధరు డగుయమునివలె దుష్టులను శిక్షించుట కుద్యుక్తుడగును.

అయన్తు సాక్షాద్భ గవాంస్త్ర్యధీశః
కూటస్థఆత్మా కలయావతీర్ణః ।
యస్మిన్నవిద్యారచితం నిరర్థకం
పశ్యన్తి నానాత్వమపి ప్రతీతమ్ ॥ 19

ఇతడు సాక్షాత్తుగ భగవానుడు . ఈయన చిచ్ఛక్తి, జీవశక్తి, మాయాశక్తుల కధీశ్వరుడు, నిర్వికారుడు, విష్ణువుయొక్క అంశతో అవతరించినవాడు. అద్వయతత్త్వస్వరూపు డగు భగవానుడు బహురూపములతో వెల్లడి యైనను ఆయనయందు భేదబుద్ధి అవిద్యాకల్పితము, కనుక అది పురుషార్థశూన్యమైనది.

అయం భువో మండలమోదయాద్రే -
ర్గోప్తైకవీరో నరదేవనాథః ।
ఆస్థాయ జైత్రం రథమాత్తచాపః
పరేష్యతే దక్షిణతో యథార్కః ॥ 20

అద్వితీయపరాక్రమశాలియు, రాజాధిరాజు, భగవదంశరూపుడు నగు ఈ పృథుచక్రవర్తి ఉదయాచలమువఱకు గల సమస్తభూమండలమును శాసించును. దానికై జయప్రద మగురథము నధిరోహించి శరాసనహస్తుడై సూర్యునివలె అంతట ప్రదక్షణముచేయును.

అస్మై నృపాలాః కిల తత్ర తత్ర
బలిం హరిష్యన్తి సలోకపాలాః ।
మంస్యన్త ఏషాం స్త్రియ ఆదిరాజం
చక్రాయుధం తద్యశ ఉద్ధరన్త్యః ॥ 21

పృథుమహారాజు ఏయేప్రాంతములను చుట్టివచ్చునో ఆయాప్రాంతములయందలి ఇంద్రుడు వరుణుడు మున్నగులోకపాలురు, నృపతులు ఈయనకు శుల్కముల నిత్తురు. ఈలోకపాలురభార్యలు చక్రధరు డగు ఈరాజుకీర్తిని గానముచేయుచు ఈయనను 'అదిరా'జని గౌరవింపగలరు.

అయం మహీం గాం దుదుహేఽధిరాజః
ప్రజాపతిర్వృత్తికరః ప్రజానామ్ ।
యో లీలయాద్రీన్ స్వశరాసకోట్యా
భిన్దన్ సమాం గామకరోద్యథేన్ద్రః ॥ 22

దేవరా జగునింద్రుడు తన ధనుస్సుయొక్క అగ్రభాగముద్వారా అనాయాసముగ పర్వతము లన్నింటిని పగులగొట్టి పృథివిని చదునుచేయునట్లు రాజచక్రవర్తి యగునీపృథువు ప్రజాపాలకరూపముతో ప్రజలజీవికను సంపాదించుటకై గోస్వరూపిణి యగునీపృథివిని పితుకును.

విస్ఫూర్జయన్నాజగవం ధనుస్స్వయం
యదాచరత్ క్ష్మామవిషహ్యా ఆజౌ ।
తదా నిలిల్యుర్దిశి దిశ్యసన్తో
లాంగూలముద్యమ్య యథా మృగేన్ద్రః॥ 23

మృగేంద్రము తనతోకను పైకెత్తి వనమున సంచరించునట్లు ఈయనగూడ ఆజగవ మను (మేకయొక్క ఆవుయొక్క కొమ్ములతో జేసినట్టి) ధనుస్సు నారిని మ్రోగించుచు యుద్ధరంగమున సంచరించును. అపుడు దుష్టులు వానిపరాక్రమమును సహింప లేనివారై నానాదిక్కులకు పారిపోవుదురు.

ఏషోఽశ్వమేధాన్ శతమాజహార
సరస్వతీ ప్రాదురభావి యత్ర ।
అహార్షీద్యస్య హయం పురన్దరః
శతక్రతుశ్చరమే వర్తమానే ॥ 24

సరస్వతీనది ప్రాదుర్భవించిన స్థానమున పృథుచక్రవర్తి నూ అశ్వమేధయజ్ఞములను జేయును. చివరియజ్ఞము పూర్తికాకమునుపే ఇంద్రుడు వీనియజ్ఞాశ్వమును హరించును.

ఏష స్వసద్మోపవనే సమేత్య
సనత్కుమారం భగవన్తమేకమ్ ।
ఆరాధ్య భక్త్యా లభతామలం తజ్ -
జ్ఞానం యతో బ్రహ్మపరం విదన్తి ॥ 25

అనంతరము పృథుమహారాజు తనగృహమునకు సమీపమున నున ఉద్యానవనమున అనుపమజ్ఞానావైరాగ్యాదులతో గూడిన శ్రీసనత్కుమారునికడకు వెడలి భక్తితో ఆయనను సేవించును. ఏజ్ఞానముచే పరబ్రహ్మమును తెలిసికొనుటకు వీలగునో ఆశుద్ధనిర్మల జ్ఞానమును పొందును.

తత్ర తత్ర గిరస్తాస్తా ఇతి విశ్రుతవిక్రమః ।
శ్రోష్యత్యాత్మాశ్రితాగాథాః పృథుః పృథుపరాక్రమః ॥ 26

ఈయన, పృథు (మహా) పరాక్రమశాలి, విఖ్యాతిచెందిన పరాక్రమముగలవాడు అని తనకు సంబంధించిన ఆయావాక్కులను, గాథలను ఆయా ప్రదేశములలో వినగలడు.

దిశో విజిత్యాప్రతిరుద్ధచక్రః
స్వతేజసోత్పాటితలోకశల్యః ।
సురాసురేంద్రైరుపగీయమాన -
మహానుభావో భవితా పతిర్భువః ॥ 27

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే పృథుచరితే
షోడశోఽధ్యాయః ॥

ఈయన దిగ్విజయి యగును, ఈయనఆజ్ఞాచక్రము అప్రతిహతముగ నుండును. ఈయన తనతేజఃప్రభావముచే జీవులహృదయములలోని అమంగళము లన్నింటిని తొలగించును. పృథివీపతి యగు ఈపృథువు సురాసురేంద్రులచే కీర్తింపబడును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని పదునాఱవ
అధ్యాయము సమాప్తము.





# పదునేడవ అధ్యాయము

## పృథుమహారాజు పృథివిపై కోపించుట, పృథివి ఆయనను స్తుతించుట.

కథాసారము :- ఈయధ్యాయమున ప్రజలు క్షుధార్తులగుట చూచి పృథుమహారాజు ఓషధీబీజసమూహములను గ్రసించినపృథివిని వధింప నుద్యుక్తుడు కాగా, ఆధరణీదేవి పృథుమహారాజును స్తుతించుట యనువిషయము వర్ణింపబడినది.

సూతుడు శౌనకాదిమహామునులతో నిట్లుపలికెను :- విదురుడు మైత్రేయమహామునిని, పృథివి గోరూపమును ధరించుటకు గలకారణ మడుగగా మైత్రేయుడిట్లుపలికెను:- "పృథుమహారాజు రాజ్యమునకు రాగా ధరణి అన్నవిహీనయగుటచే ప్రజలు క్షుధార్తులై మహారాజును శరణుజొచ్చిరి. పృథివి ఓషధిబీజములను గ్రసించుటవలననే దుర్భిక్షమేర్పడినట్లు నిశ్చయించుకొని పృథుమహారాజుపృథ్వి నుద్దేశించి శరసంధానము చేసెను. పృథ్వి భీతయై పలాయనము సాగించెను. క్రోధముచే ఎరుపెక్కిననేత్రములు గలవాడై సశస్త్రుడై పృథుమహారాజు తనవెంట పరుగిడుట యాపృథ్విచూచెను. చివరకు పృథ్వి యెట్టియుపాయము లేనిదియై పృథుమహారాజును శరణుజొచ్చెను. మహారాజు పృథ్విని నాశముజేయ సంకల్పించెను. పృథివి ఆయనను స్తుతింపసాగెను. పృథ్వి చేసినస్తోత్రముతోనే ఈయధ్యాయము సమాప్తమయ్యెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ.

ఏవం స భగవాన్ వైన్యః ఖ్యాపితో గుణకర్మభిః ।
ఛన్దయామాస తాన్ కామైః ప్రతిపూజ్యాభినన్ద్య చ ॥ 1

మైత్రేయుడు పలికెను :- విదురా! భగవానునియంశావతారుడు వేనరాజుకుమారుడు నగు పృథువు గుణకర్మవర్ణ రూప మగుస్తుతిద్వారా యిట్లు స్తుతింపబడెను. అనంతర మాయన ఈగాయకులను వాక్కులచే అభినందించి, వాంఛితము లగువస్తువుల నిచ్చి, గౌరవించి వారిని సంతుష్టిపఱచెను.

బ్రాహ్మణప్రముఖాన్ వర్ణాన్ భృత్యామాత్యపురోధసః ।
పౌరాన్ జానపదాన్ శ్రేణీః ప్రకృతీః సమపూజయత్ ॥ 2

పిమ్మట ఆయన బ్రాహ్మణాదిచాతుర్వర్ణ్యములవారిని, భృత్యులను, పురోహితులను, పురవాసులను, జానపదులను, తైలికతాంబూలికాదిసాధారణ వ్యక్తులను, ఇంకను తనయాజ్ఞానువర్తులను సర్వులను తగువిధముగ గౌరవించెను.

## శ్రీవిదుర ఉవాచ

**కస్మాద్దధార గోరూపం ధరిత్రీ బహురూపిణీ ।**
**యాం దుదోహ పృథుస్తత్ర కో వత్సో దోహనం చకిమ్ ॥ 3**

విదురుడు పలికెను:- బ్రాహ్మణశ్రేష్ఠా! పృథుమహారాజు దేనిని పితికెనో, బహురూపధారిణి యగుఆపృథివి గోరూపము నేలధరించినది? ఆదోహనకార్యమున వత్స యెవరు? దోహనపాత్ర మేది?

**ప్రకృత్యా విషమా దేవీ కృతా తేన సమా కథమ్ ।**
**తస్య మేధ్యం హయం దేవః కస్య హేతో రపాహరత్ ॥ 4**

పృథివి సహజముగనే మిట్టపల్లములు గలది. అనగా సమతలముగ నుండదు. కాని పృథుమహారాజు దాని నెట్లుసమతలము చేసెను? దేవతల కధిపతి యగునింద్రు డేకారణమున పృథువుయొక్కయజ్ఞాశ్వమును హరించెను?

**సనత్కుమారాద్భగవతో బ్రహ్మన్ బ్రహ్మవిదుత్తమాత్ ।**
**లబ్ధ్వా జ్ఞానం సవిజ్ఞానం రాజర్షిః కాం గతిం గతః ॥ 5**

మహాత్మా! రాజర్షియగుపృథువు వేదవేత్తలలో శ్రేష్ఠు డగు సనత్కుమారునివలన భగవత్తత్త్వమును తెలిసికొని యెట్టిగతిని పొందెను?

**యచ్చాన్యదపి కృష్ణస్య భవేద్భగవతః ప్రభోః ।**
**శ్రవః సుశ్రవసః పుణ్యం పూర్వదేహకథాశ్రయమ్ ॥ 6**

**భక్తాయ చానురక్తాయ తవ చాధోక్షజస్య చ ।**
**వక్తుమర్హసి యోఽదుహ్యద్వైన్యరూపేణ గామిమామ్ ॥ 7**

పృథురూపముతో సర్వేశ్వరుడగు శ్రీకృష్ణభగవానుడె అవతరించెను. అందువలన పుణ్యకీర్తి యగు శ్రీహరియొక్కఆపృథువుఅవతారమునకు సంబంధించిన పవిత్ర చరిత్రమును నాకు జెప్పుము. నేను నీకు, శ్రీకృష్ణచంద్రునకు ప్రియభక్తుడను.

(దేవా! నేను నిన్నేవిషయముల నడిగితినో వానిని, పవిత్రకీర్తియగు శ్రీకృష్ణభగవానుని పృథువు అవతారమునకు సంబంధించిన కథలతో సంశ్లిష్టములగు ఇతరవిషయములను నాకు వినిపింపుము. నేను నీకు, అధోక్షభగవానునకు ప్రియభక్తుడను. అందువలన శ్రీకృష్ణభగవానుడు పృథురూపముతో ఈపృథ్విని పితికినవిషయమును నాకు జెప్పుట నీకర్తవ్యము)

## శ్రీసూత ఉవాచ

చోదితో విదురేణైవం వాసుదేవకథాం ప్రతి ।
ప్రశస్య తం ప్రీతమనా మైత్రేయః ప్రత్యభాషత ॥ 8

సూతుడు పలికెను :- వాసుదేవునికథలయందు విదురునకు గల శ్రద్ధను పట్టుదలను జూచి, సంతుష్టచిత్తుడయి మైత్రేయుడు వానిని ప్రశంసించి వాసుదేవునికథలను కీర్తించెను.

## శ్రీమైత్రేయ ఉవాచ

యదాభిషిక్తః పృథురఙ్గ విప్రై -
రామన్త్రితో జనతాయాశ్చ పాలః ।
ప్రజా నిరన్నే క్షితిపృష్ఠ ఏత్య
క్షుత్ క్షామదేహాః పతిమభ్యవోచన్ ॥ 9

మైత్రేయుడు పలికెను :- విదురా! బ్రాహ్మణులచే నభిషిక్తుడై పృథువు "ప్రజా పాలకుడు" మున్నగువాక్యములతో ఆమంత్రితుడయ్యెను. అపుడు భూమియం దన్నము లేకపోవుటచే ప్రజలు క్షుధార్తులై పృథువు కడకు వెడలి ఇట్లుపలికిరి -

వయం రాజన్ జాఠరేణాభితప్తా
యథాగ్నినా కోటరస్థేన వృక్షాః ।
త్వామద్య యాతాః శరణం శరణ్యం
యస్సాధితో వృత్తికరః పతిర్నః ॥ 10

రాజా! వృక్షములు తమకోటరముల (తొఱ్ఱల) యందున్న అగ్నిద్వారా దగ్ధము లగునట్లు మేముగూడ జఠరాగ్నిచే సంతప్తుల మగుచున్నాము. మాకు జీవికను గలుగజేయువాడవు, పాలకుడవు అని నిన్ను మునులు సృష్టించిరి. శరణ్యుడవగు నిన్ను మేము శరణుపొందితిమి.

తన్నో భవానీహతు రాతవేఽ న్నం
క్షుధార్దితానాం నరదేవ దేవ।
యావన్ననజ్ క్ష్యామహ ఉజ్ఝితోర్జా
వార్తాపతిస్త్వం కిల లోకపాలః ॥ 11

మహారాజా! మేము మిగుల క్షుధార్తుల మైయున్నాము. అన్నాభావమువలన మేము నశించిపోకమునుపే నీవు మాకు అన్నమును బెట్టుటకు ప్రయత్నింపుము. నీవు సర్వలోకరక్షకుడవు, జీవికాప్రదాతవు నని కీర్తింపబడితివి.

## శ్రీ మైత్రేయ ఉవాచ

పృథుః ప్రజానాం కరుణం నిశమ్య పరిదేవితమ్ ।
దీర్ఘం దధ్యౌ కురుశ్రేష్ఠ నిమిత్తం సో ఽన్వపద్యత॥ 12

మైత్రేయుడు పలికెను :- కురుశ్రేష్ఠుడ వగువిదురా! పృథువు ప్రజలయొక్కకరుణ విలాపముల నాలకించి, బహుకాలము ఆలోచించి ప్రజలన్నహీనులగుటకు కారణమును తెలిసికొనగల్గెను.

ఇతి వ్యవసితో బుద్ధ్యా ప్రగృహీతశరాసనః ।
సన్దధే విశిఖం భూమేః క్రుద్ధస్త్రిపురహా యథా ॥ 13

పృథివి ఓషధీబీజములను తనలో దాచుకొనినది; దానివలననే జనుల కాహారము లేకపోయినది యని ఆయన తనబుద్ధిబలముచే స్థిరపఱచుకొని కుపితుడయి త్రిపురారి యగునీశ్వరునివలె పృథివిని లక్ష్యముగా జేసి బాణమును సంధించెను.

ప్రవేపమానా ధరణీ నిశామ్యోదాయుధం చ తమ్ ।
గౌః సత్యపాద్రవద్భీతా మృగీవ మృగయుద్రుతా ॥ 14

రాజు ధనస్సున బాణము నెక్కు పెట్టుట చూచి ధరణి భయముతో కంపించుచు, గోరూపమును ధరించి వ్యాధుడు వెంబడించిన మృగమువలె పరుగిడసాగెను.

తామన్వధావత్తద్వైన్యః కుపితో ఽత్యరుణేక్షణః ।
శరం ధనుషి సన్ధాయ యత్ర యత్ర పలాయతే ॥ 15

రోషముచే నెరుపెక్కిన కన్నులు గలపృథువు ధనుస్సున బాణము నెక్కుపెట్టి, ధరణి యే యేప్రదేశములకు పరుగిడుచుండెనో ఆ యాప్రదేశములకు అతడును దాని ననుసరింపసాగెను.

సా దిశో విదిశో దేవీ రోదసీ చాన్తరం తయోః ।
ధావన్తీ తత్ర తత్రైనం దదర్శానూద్యతాయుధమ్ ॥ 16

ధరణీదేవి దిక్కులు, విదిశలు, స్వర్గము, మర్త్యము, అంతరిక్షములలో ఎచటికి వెడలినను పృథుమహారాజు ఆయాప్రదేశములకు ధనుస్సు నెక్కుపెట్టి దానివెంట బరుగిడసాగెను.

లోకే నావిన్దత త్రాణం వైణ్యాన్మృత్యోరివ ప్రజాః ।
త్రస్తా తదా నివవృతే హృదయేన విదూయతా ॥ 17

మృత్యువునుండి ప్రాణులరక్షణ కెట్టియుపాయము లేనట్లు పృథవిగూడ వేణతనయుడగుపృథువునుండి తన్ను రక్షించుకొనుట కెట్టియుపాయము లేకపోవుట చూచి భీతయై దుఃఖితచిత్తముతో పరుగిడుట విరమించెను.

ఉవాచ చ మహాభాగం ధర్మజ్ఞాపన్న వత్సల ।
త్రాహి మామపి భూతానాం పాలనేఽ వస్థితో భవాన్ ॥ 18

తరువాత మహాత్ముడగుపృథువుతో పృథ్వి యిట్లుపలికెను :- "ధర్మజ్ఞా! శరణాగతవత్సలా! నీవు ప్రజారక్షణకార్యమున నియుక్తుడవైతివి, అందువలన నన్ను రక్షింపుము."

స త్వం జిఘాంససే కస్మాద్దీనామకృతకిల్బిషామ్ ।
అహనిష్యత్కథం యోషాం ధర్మజ్ఞ ఇతి యో మతః ॥ 19

దీనురాలను, నిరపరాధను అగు నన్నేల చంపదలచితివి? నిన్నందరు ధార్మికుడవనితలంచుచున్నారు. కనుక యేల స్త్రీని వధింతువు?

ప్రహరన్తి న వై స్త్రీషు కృతాగస్స్వపి జన్తవః ।
కిముత త్వద్విధా రాజన్ కరుణా దీనవత్సలాః ॥ 20

రాజా! స్త్రీ లపరాధముల నొనరించినచో వారిని సామాన్యవ్యక్తి యైననుగొట్టడు. ఇక నీవంటి దయార్ద్రహృదయుడు, దీనవత్సలుడు నగువానివిషయము చెప్పునదేమి?

మాం విపాట్యాజరాం నావం యత్ర విశ్వం ప్రతిష్ఠితమ్ ।
ఆత్మానం చ ప్రజాశ్చేమాః కథమమ్భసి ధాస్యసి ॥ 21

ఈవిశ్వము నాయందే ప్రతిష్ఠిత మైయున్నది. నేనే దీనికి దృఢమగునౌకను. నన్ను విరుగగొట్టి ఈసలిలముపై నిన్ను, నీప్రజలను ఎట్లునిలుపుదువు?

## శ్రీపృథు ఉవాచ

వసుధే త్వాం వధిష్యామి మచ్ఛాసనపరాఙ్ముఖీమ్ ।
భాగం బర్హిషి యావృఙ్క్తే న తనోతి చ నో వసు ॥ 22

పృథువు పలికెను :- వసుంధరా! నీవు నాశాసనమును వ్యతిరేకించితివి. అందువలన నిన్ను నాశనముచేయుదును. నీవు యజ్ఞమున దేవతారూపముతో భాగమును గ్రహించుచుందువు. కాని మాకు ధాన్యాదికముల నిచ్చుటలేదు.

యవసం జగ్ధ్యనుదినం నైవ దోగ్ధ్యౌధసం పయః ।
తస్యామేవం హి దుష్టాయాం దణ్డో నాత్ర న శస్యతే ॥ 23

గోవు ప్రతిదినము గడ్డిని దినును, కాని పాలనుమాత్ర మీయదు. ఆయపరాధముచే ఆ దుష్టురాలిని దండించుట తగదా?

త్వం ఖల్వోషధిబీజాని ప్రాక్సృష్టాని స్వయంభువా ।
న ముంచస్యాత్మరుద్ధాని మామవజ్ఞాయ మన్దధీః ॥ 24

బ్రహ్మ సృష్ట్యారంభమున లోకహితార్థమై సమస్తము లైన ఓషధీబీజములను సృష్టించెను. అవి యన్నియు నీశరీరమున లీనమయ్యెను. మందబుద్ధి వగునీవు నన్ను తిరస్కరించి వాని నన్నింటిని విడిచిపెట్టుటలేదు.

అమూషాం క్షుత్పరీతానామార్తానాం పరిదేవితమ్ ।
శమయిష్యామి మద్బాణైర్భిన్నాయాస్తవ మేదసా ॥ 25

అందువలన నాబాణములచే చంపబడిన నీ దేహమందలి మాంసము ద్వారా క్షుధార్తులగు ఈప్రజల ఆర్తనాదము శాంతింపగలదు.

పుమాన్ యోషిదుత క్లీబ ఆత్మసంభావనోఽధమః ।
భూతేషు నిరనుక్రోశో నృపాణాం తద్వధో ఽవధ ॥ 26

తన్ను దాను పోషించుకొనుచు ఇతరప్రాణులను నిర్దయగ జూచు దుష్టుడు పురుషుడు కావచ్చును, స్త్రీ కావచ్చును, లేదా నపుంసకుడు కావచ్చును. అట్టివానిని చంపిన రాజున కెట్టిదోషము వాటిల్లదు.

త్వాం స్తబ్ధాం దుర్మదాం నీత్వా మాయాగాం తిలశః శరైః ।
ఆత్మయోగబలేనేమా ధారయిష్యామ్యహం ప్రజాః ॥ 27

కపటగోరూపమును ధరించిన దానివి, గర్వితురాలవు, ఉద్ధతస్వభావముగలదానవు అగు నిన్ను బాణములచే ముక్కలు ముక్కలు జేయుదును. చివరకు నాయోగప్రభావముచే ఈప్రజల నందఱిని ధరింతును.

ఏవం మన్యుమయీం మూర్తిం కృతాన్తమివ బిభ్రతమ్ ।
ప్రణతా ప్రాంజలిః ప్రాహ మహీ సంజాతవేపథుః ॥ 28

సాక్షాత్తుగా యమునివలె పృథుమహారాజు క్రోధమయరూపమును ధరించి, మర్మభేదకము లగు మాటలను పలుకగా పృథివి భయముతో వణకుచు సాష్టాంగదండ ప్రణామముచేసి దోసిలయొగ్గి వానితో నిట్లు పలికెను.

## శ్రీపృథివ్యువాచ

నమః పరస్మై పురుషాయ మాయయా
విన్యస్తనానాతనవే గుణాత్మనే ।
నమః స్వరూపానుభవేన నిర్ధూత -
ద్రవ్యక్రియాకారకవిభ్రమోర్మయే ॥ 29

పృథ్వి పలికెను :- తన అచింత్యశక్తి ద్వారా నానావిధములగు తనువుల ధరించి గుణమయునిగ అగపడువాడవు, స్వరూపానుభవముచే ద్రవ్యక్రియాకారకములు అనగా అధిభూతము, అధ్యాత్మము, అధిదైవము మున్నగువానికి సంబంధించిన అహంకారము, దానివలన పుట్టు రాగద్వేషాదులు లేనివాడవు, పరమపురుషుడవు నగు నీకు నమస్కరించుచున్నాను.

యేనాహమాత్మాయతనం వినిర్మితా
ధాత్రా యతోఽ యం గుణసర్గసంగ్రహః ।
స ఏవ మాం హన్తుముదాయుధః స్వరా -
డుపస్థితోఽ న్యం శరణం కమాశ్రయే ॥ 30

ప్రాణులఆవాసస్థలరూపమున నన్ను సృష్టించి, నాయందుజరాయుజములు (మనుష్యులు, పశ్వాదులు), అండజములు (పక్షులు, సరీసృపాదులు) స్వేదజములు (నల్లులు మున్నగునవి), ఉద్భిజ్జములు (వృక్షాదులు) అను చతుర్విధగుణమయదేహధారులైన ప్రాణులను నిలిపినవాడగు ఆవిధాత స్వతంత్రుడు. ఆయన స్వయముగా ఆయుధమును ధరించి నన్ను జంపుటకు సిద్ధముగ నున్నాడు. ఇక యిప్పుడు నే నెవరిని శరణుజొచ్చెదను.

యు ఏతదాదావసృజచ్చరాచరం
స్వమాయయాత్మాశ్రయయా వితర్క్యయా ।
తస్మైవ సోఽయం కిల గోప్తుముద్యతః
కథం ను మాం ధర్మపరో జిఘాంసతి ॥ 31

సృష్ట్యాదియందు జీవవిషయిణి యగు తన యచింత్యశక్తిద్వారా ఈచరాచర జీవజగత్తును సృష్టించినవాడు, తనపాలనశక్తిద్వారా పృథురూపముతో దానిని రక్షించుట కుద్యుక్తుడైనవాడు అగు ఈధర్మపాలకపురుషుడు నన్నేల సంహరింపవలెనని తలంచు చున్నాడు?

నూనం బతేశస్య సమీహితం జనై-
స్తన్మాయయా దుర్జయయాకృతాత్మభిః ।
న లక్ష్యతే యస్త్వకరోదకారయద్ -
యోఽనేక ఏకః పరతశ్చ ఈశ్వరః ॥ 32

భగవానుని దుర్జయ మగుమాయచే విక్షిప్తచిత్తులగుజనులు సమర్థుడగు పురుషుని కర్మల నేమిఎఱుంగుదురు? ఈశ్వరుడు స్వతంత్రుడైయుండియు బ్రహ్మను సృష్టించినాడు. ఆ బ్రహ్మచే సృష్టిచేయించినాడు. ఆయన స్వయముగ ఒక్కడే యైనను తనయచింత్యశక్తి ద్వారా అనేకములుగ అయ్యెను.

సర్గాది యోఽస్యానురుణద్ధి శక్తిభి-
ర్ద్రవ్యక్రియాకారకచేతనాత్మభిః ।
తస్మై సమున్నద్ధవిరుద్ధశక్తయే
నమః పరస్మై పురుషాయ వేధసే ॥ 33

భగవానుడు తన శక్తి స్వరూపము లగు మహాభూతములు, ఇంద్రియములు, దేవతలు, బుద్ధి, అహంకారము మున్నగువానిద్వారా యీజగత్తునకు సృష్టిస్థితిలయములను గలుగజేసినాడు. ఆయన శక్తులన్నియు ఉత్కటములు, విరుద్ధభావసంపన్నములు, అట్టి యచింత్యశక్తిశాలియు, పరమపురుషుడు నగు విధాతకు నమస్కరించుచున్నాను.

స వై భవానాత్మవినిర్మితం జగద్ -
భూతేన్ద్రియాన్తఃకరణాత్మకం విభో ।
సంస్థాపయిష్యన్నజ మాం రసాతలా -
దభ్యుజ్జహారామ్భస ఆదిసూకరః ॥ 34

మహాత్మా! జన్మరహితా! తన మాయాశక్తిచే నీ విశ్వమును సృష్టించిన ఆ పురుషుడవు నీవే. నీవే స్వనిర్మితభూతేంద్రియాన్తః కరణాత్మక మగు ఈ జగత్తును ఐక్కగ స్థాపించుటకై ఆదివరాహరూపమును ధరించి జలమయమగు రసాతలమునుండి నన్నుద్ధరించితివి.

అపాముపస్థే మయి నావ్యవస్థితాః
ప్రజా భవానద్య రిరక్షిషుః కిల ।
స వీరమూర్తిః సమభూద్ధరాధరో
యో మాం పయస్యుగ్రశరో జిఘాంససి ॥ 35

ధరాధరుడ వగు ఆవరాహమూర్తివి నీవె. నేను జలముపై నావవలె నుంటివి. నీప్రజలు నావవలె నున్న నాయం దుండిరి. కాని నేడు నీవు ప్రజలను రక్షించు నుద్దేశ్యముతో పృథురూపమును ధరించి కేవలము దుగ్ధముకొరకై సర్వాధారభూత నగు నన్ను పదునైనబాణములతో చంపుట కుద్యుక్తుడవైతివి. ఇది చాల ఆశ్చర్యకర విషయము.

నూనం జనైరీహితమీశ్వరాణా -
మస్మద్విధైస్తద్గుణసర్గమాయయా ।
న జ్ఞాయతే మోహితచిత్తవర్త్మభి -
స్తేభ్యో నమో వీరయశస్కరేభ్యః ॥ 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే ధరానిగ్రహో నామ సప్తదశోఽధ్యాయః ॥

దేవా! ఈ త్రిగుణాత్మకసృష్టిని చేయు నీమాయచే నావంటి సాధారణజీవులమనస్సు, మోహాగ్రస్త మగుచున్నది. నావంటివారు నీభక్తులలీలలను గూడ తెలిసికొనజాలరు. ఇక నీలీలల నేమియెఱుంగుదురు. అందువలన ఆ పరమేశ్వరునకువలె వారికిని నమస్కరించుచున్నాను. భక్తులు జితేంద్రియ లగువారియశస్సును వృద్ధిచేయుదురు. నే నాభగవద్భక్తులకు నమస్కరించుచున్నాను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని పదునేడవ అధ్యాయము
సమాప్తము.



# పదునెనిమిదవ అధ్యాయము

## పృథ్వీదోహనము.

కథాసారము :- ఈయధ్యాయమున పృథుచక్రవర్తి పృథ్వి పలికినవాక్కులను విని వత్సపాత్రాదిభేదముతో జేసిన పృథ్వీదోహనము వర్ణితమైనది.

భీత యగుపృథివి పృథుమహారాజును స్తుతించుచు నిట్లు పలికెను-"మహారాజా! గోరూపిణి నగు నాకు తగినవత్సను, దోహనపాత్రమును, దోగ్దను (పితుకువానిని) గల్పించి వాదుగ్ధములంతట సమభావముగ కనబడునట్లు నన్ను సమతలముగ నొనరింపుము." ఇదివిని రాజు సంతుష్టుడై మనువును వత్సగ గల్పించి తనహస్త మను పాత్రమున ఓషధిబీజములను పితికెను. పిమ్మట ఋషులు బృహస్పతిని వత్సగా నొనరించి వాఙ్మనశ్రవణరూపపాత్రమున వేద మను పవిత్రదుగ్ధములను, దేవతలు ఇంద్రుని వత్సగ జేసి స్వర్ణపాత్రమున అమృతమును, దేహమన శ్శక్తిరూపదుగ్ధమును పితికిరి. అట్లే దైత్యులు, దానవులు, గంధర్వులు, అప్సరసలు, సిద్ధులు, యక్షులు, రాక్షసులు, పిశాచములు మున్నగువారందఱు తమకభీష్టములగు వస్తువులకు పృథివినుండి పితుకనారంభించిరి.

పిమ్మట మైత్రేయుడు విదురినితో పృథుమహారాజు పృథివిని కన్యారూపమున వరించుట, పృథివిని సమతలముగ జేయుట, పృథువు ప్రజలకు తగిన నివాసస్థానమును చూపుట, వారికై వివిధస్థానములను నిర్మించుట, ప్రజలు నిర్భయముగ నివసించుట మున్నగువిషయములను చెప్పెను.

### శ్రీమైత్రేయ ఉవాచ

**ఇత్థం పృథుమభిష్టూయ రుషా ప్రస్ఫురితాధరమ్ ।**
**పునరాహావనిర్భీతా సంస్తభ్యాత్మానమాత్మనా ॥ 1**

మైత్రేయుడు పలికెను :- విదురా! కోపముచే కంపించుచున్న ఓష్ఠములు గల పృథువును వెనుకజెప్పిన విధముగ స్తుతించి భీత యగు అవని (భూమి) మనస్సును, బుద్ధిని నిగ్రహించుకొని ధైర్యముతో మరల యిట్లుపలికెను.

**సంనియచ్ఛాభిభో మన్యుం నిబోధ శ్రావితం చ మే ।**
**సర్వత: సారమాదత్తే యథా మధుకరో బుధ: ॥ 2**

దేవా! నీవు క్రోధము నుపసంహరించి నాకభయము నిమ్ము. నామాటల నాలకింపుము. మధుకరము (తుమ్మెద) పుష్పములనుండి వానిసార భాగమగు మకరందమును గ్రహించునట్లు పండితులగువారు విషయములనుండి సారమును గ్రహింతురు.

**అస్మింల్లోకే ఽథవాముష్మిన్ మునిభిస్తత్త్వదర్శిభిః ।**
**దృష్టా యోగాః ప్రయుక్తాశ్చ పుంసాం శ్రేయః ప్రసిద్ధయే ॥ 3**

ఇహలోకపరలోకములయందు మానవులపురుషార్థసిద్ధికై తత్త్వదర్శులగుమునులు శాస్త్రములనుండి నానావిధములగు ఉపాయములను నిర్ణయించి ప్రయోగించిరి.

**తానాతిష్ఠతి యః సమ్యగుపాయాన్ పూర్వదర్శితాన్ ।**
**అవరః శ్రద్ధయో పేత ఉపేయాన్ విన్దతే ఽఞ్జసా ॥ 4**

అర్వాచీను డగువ్యక్తిగూడ శ్రద్ధతో గూడినవాడయి ప్రాచీనులగుమునులు ప్రదర్శించిన ఉపాయములను చక్కగ అనుష్ఠించినచో దానివలన ఆవ్యక్తి అనాయాసముగ పురుషార్థమును పొంద సమర్థుడగును.

**తానవాదృత్య యోఽ విద్వానర్థానారభతే స్వయమ్ ।**
**తస్య వ్యభిచరన్త్యర్థా ఆరబ్ధాశ్చ పునః పునః ॥ 5**

పండితుడగువాడు ఈయుపాయముల నాదరింపక స్వతంత్రమగు నిచ్ఛ ననుసరించి కల్పితము లగునర్థముల ననుష్ఠించినచో వాని యాకర్మలు సిద్ధింపవు. ఆతడెన్నిమారు లారంభించినను ఆకర్మలు నిష్ఫలములె యగును.

**పురా సృష్టా హ్యోషధయో బ్రహ్మణా యా విశాంపతే ।**
**భుజ్యమానా మయా దృష్టా అసద్భిరధృతవ్రతైః ॥ 6**

మహారాజా! పూర్వకాలమున బ్రహ్మ లోకయాత్రార్థమై, యజ్ఞసంపాదనార్థమై వ్రీహియవాదులైన ఓషధులను సృష్టించెను. ఆవస్తువులను శాస్త్రాచారవర్జితు లగుదురాచారులె అనుభవించుచున్నట్లు నేను చూచితిని.

**అపాలితానాదృతా చ భవద్భిర్లోకపాలకైః ।**
**చౌరీభూతే ఽథ లోకే ఽహం యజ్ఞార్థే ఽగ్రసమోషధీః ॥ 7**

వేనుడు మున్నగు లోకపాలురు చోరాదులను నిరోధించుటద్వారా నన్ను పాలించుట, యజ్ఞాదులను జేయుటద్వారా నన్ను ఆదరించుట జరుగలేదు. అందువలన జీవులు

చోరులగుటచే అనంతరకాలమున యజ్ఞములను రక్షించుసర్వవిధములైన ఓషధులను గ్రసించితిని.

చ॥ *జలరుహగర్భుచేత మును చాల సృజింపఁగఁ బడ్డ యోషధుల్*
*కలుషమతిన్ ధ్రుతవ్రతులు గానియసజ్జనభుజ్యమాన మై*
*వెలయుటఁ జూచి యేన్నపతివీరులు మాస్వమిఁజోరబాధలం*
*బలుమఱుఁబొంది యే నపరిపాలిత నై కృశియించి వెండియున్.* (4-492)

నూనం తా వీరుధః క్షీణా మయి కాలేన భూయసా ।
తత్ర దృష్టేన యోగేన భవానాదాతుమర్హతి ॥ 8

ఓషధులన్నియు చాలకాలము నాయుదరమున నుండుటవలన జీర్ణములైపోయినవి. అందువలన ఉపాయములను ప్రయోగించి వాని నన్నింటిని ఉద్ధరించుట నీకు దగినది.

వత్సం కల్పయ మే వీర యేనాహం వత్సలా తవ ।
ధోక్ష్యే క్షీరమయాన్ కామాననురూపం చ దోహనమ్ ॥ 9

దోగ్ధారం చ మహాబాహో భూతానాం భూతభావన ।
అన్నమీప్సితమూర్జస్వద్భగవాన్ వాంఛతే యది ॥ 10

మహాబాహూ! వీరుడా! భూతభావనుడా! నీవు ప్రాణుల కభీష్టమగు, బలకర మగుఅన్నమును గోరినచో నాకనురూప మగువత్సను, దోహనపాత్రమును, దోగ్ధను (పితుకువానిని) నిరూపింపుము. దానివలన నేను వత్సలనై నీకోరికకు తగినక్షీరమయము లగు వస్తువుల నీయగలను.

సమాం చ కురుమాం రాజన్ దేవవృష్టం యథా పయః ।
అపర్తావపి భద్రం తే ఉపావర్తేత మే విభో ॥ 11

రాజా! నీవు నన్ను సమతలముగ జేయుము, దానివలన వర్షఋతువు పోయినను నాపై నింద్రుడు వర్షించినజలము అంతట సమభావముగ నుండవచ్చును. నాలోనిఆర్ద్రత ఎండిపోకుండగ నుండును. ఇది నీకు మిగుల శుభకారకమగుగాక!

చ॥ *మనుజవరేణ్య యేను విషమస్థలి నై యిపుడున్న దాన నో*
*య్యనజలదాగమోదితపయః ప్రకరంబు తదాగమంబు వో*
*యినను దదంబువుల్ పుడమి నింకక యంతట నిల్చునట్లుగా*
*మనునిభ నన్ను నిప్పడు సమస్థలి నై పెనుపొందఁజేయవే.* (4-498)

ఇతి ప్రియహితం వాక్యం భువ ఆదాయ భూపతిః ।
వత్సం కృత్వా మనుం పాణావదుహత్సకలౌషధీః ॥ 12

పృథుమహారాజు పృథివి పలికిన ప్రియము హితము నగువాక్కును విని స్వాయంభువ మనువును వత్సరూపమున గ్రహించి పాణిపాత్రమున సర్వౌషధులను పిండెను.

తథాపరే చ సర్వత్ర సారమాదదతే బుధాః ।
తతో ఽన్యే చ యథా కామం దుదుహుః పృథుభావితామ్ ॥ 13

పండితు లంతట అసారమును పరిత్యజించి సారవస్తువును గ్రహింతురు. పృథురాజు పృథివిని వశముచేసికొనగా ఇతరఋషులుగూడ వశమైన ఆ పృథివినుండి తమతమ యభీష్టానుసారముగ వస్తువులను పితుకసాగిరి.

చ. *మనువును దూడఁ జేసి గరిమన్ నిజపాణితలంబు లీలదో*
*హనముగఁ జేసి యందు సకలౌషధులం బిది కెం గ్రమంబునం*
*దనరఁగఁ దద్విధంబునను దత్పృథువత్స యైనభూమియం*
*దనయము వారుమారును బ్రియం బగుకోర్కులు వొంది రున్నతిన్.* (4-500)

ఋషయో దుదుహుర్దేవీమిన్ద్రియేష్వథ సత్తమాః ।
వత్సం బృహస్పతిం కృత్వా పయశ్ఛందోమయం శుచి ॥ 14

సత్పురుషశ్రేష్ఠు లగుఋషులుగూడ బృహస్పతిని వత్సగా జేసి, ఇంద్రియ (వాఙ్మనశ్శ్రోత్ర) మనుపాత్రమున పృథివినుండి పవిత్రవేదమను దుగ్ధమును పిండిరి.

కృత్వా వత్సం సురగణా ఇంద్రం సోమమదూదుహన్ ।
హిరణ్మయేన పాత్రేణ వీర్యమోఽజో బలం పయః ॥ 15

దేవతలు ఇంద్రుని వత్సగా జేసి హిరణ్మయపాత్రమున అమృతమును, వీర్యమును (మనశ్శక్తిని), ఓజస్సును (ఇంద్రియశక్తిని), బలమును (దేహశక్తిని) పాలను పితికిరి.

దైతేయా దానవా వత్సం ప్రహ్లాదమసురర్షభమ్ ।
విధాయ దుదుహుః క్షీరమయఃపాత్రే సురాసవమ్ ॥ 16

దైత్యులు, దానవులు, అసురశ్రేష్ఠుడగుప్రహ్లాదుని వత్సగా జేసి లోహపాత్రమున సురాసవరూప మగుదుగ్ధమును పిండిరి.

గన్ధర్వాప్సరసోఽధుక్షన్ పాత్రే పద్మమయే పయః ।
వత్సం విశ్వావసుం కృత్వా గన్ధం మధు ససౌభగమ్ ॥ 17

గంధర్వులు, అప్సరసలు విశ్వావసువును వత్సగా జేసి పద్మమయ పాత్రమున గంధర్వ సంబంధ మగుగానమును, వాఙ్మాధుర్యమును, సౌందర్యరూపదుగ్ధమును పితికిరి.

**వత్సేన పితరోఽర్యమ్ణా కవ్యం క్షీరమధుక్షత ।**
**ఆమపాత్రే మహాభాగ శ్రద్ధయా శ్రాద్ధదేవతాః ॥ 18**

మహాభాగా! విదురా! శ్రాద్ధదేవతలు, పితరులు, అర్యముని వత్సగా జేసి పచ్చిగా నున్నమట్టిపాత్రలో శ్రద్ధతో కవ్యమును అనగా పితరుల కన్నరూప మగుదుగ్ధమును పిండిరి.

**ప్రకల్ప్య వత్సం కపిలం సిద్ధాః సంకల్పనామయీమ్ ।**
**సిద్ధిం నభసి విద్యాం చ యే చ విద్యాధరాదయః ॥ 19**

సిద్ధులు కపిలదేవుని వత్సగాజేసి అణిమాదిసిద్ధులను, విద్యాధరులు ఆకాశరూప పాత్రమున ఖేచరత్వాది (ఆకాశగమనాది) విద్యలను దోహనము చేసిరి.

**అన్యే చ మాయినో మాయమన్తర్ధానాద్భుతాత్మనామ్ ।**
**మయం ప్రకల్ప్య వత్సత్వే దుదుహుర్ధారణామయీమ్ ॥ 20**

ఇతరులగుకింపురుషాదులు మయుడనుదానవుని వత్సగా గల్పించి ఆయాకాశరూప పాత్రమునందే అంతర్ధాన మగుట, విచిత్రరూపములనుధరించుట మున్నగు సంకల్ప మయము లగుమాయలను దుగ్ధరూపమున పిండిరి.

**యక్షరక్షాంసి భూతాని పిశాచాః పిశితాశనాః ।**
**భూతేశవత్సా దుదుహుః కపాలే క్షతజాసవమ్ ॥ 21**

యక్షులు, రాక్షసులు, పిశాచులు, మున్నగుమాంసాహారులు రుద్రుని వత్సగాజేసి నరకపాల మనుపాత్రమున రుధిరమయ మగుమద్యమును పితికిరి.

**తథాహయో దన్దశూకాః సర్పా నాగాశ్చ తక్షకమ్ ।**
**విధాయ వత్సం దుదుహుర్బిలపాత్రే విషం పయః ॥ 22**

ఇట్లు పడగలు లేనిసర్పములు తేళ్లు మున్నగునవి, పడగలు గలిగిన సర్పములు, నాగులు తక్షకుని వత్సగా జేసి ముఖరూపపాత్రమున విషమయ మగుదుగ్ధమును పితికినవి.

**పశవో యవసం క్షీరం వత్సం కృత్వా చ గోవృషమ్ ।**
**అరణ్యపాత్రే చాదుక్షన్ మృగేన్ద్రేణ చ దంష్ట్రిణః ॥ 23**

**క్రవ్యాదాః ప్రాణినః క్రవ్యం దుదుహుః స్వకలేవరే ।**
**సుపర్ణవత్సా విహగాశ్చరం చాచరమేవ చ ॥ 24**

గోవులు, అశ్వములు మున్నగుపశువులు రుద్రునివాహన మగు వృషభమును వత్సగా జేసి అరణ్య మనుపాత్రమున తృణమయ మగుదుగ్ధమును పిండినవి. పదునైన కోఱలుగలవి, మాంసమును దినునట్టివి యగు వ్యాఘ్రాదిపశువులు సింహమును వత్సగా గల్పించి కళేబర మనుపాత్రమున మాంసరూప మగుదుగ్ధమును పితికినవి. పక్షులు గరుడుని వత్సగా నొనరించి తమదేహ మనుపాత్రమున కీటాదులు, ఫలములు, సస్యములు మున్నగువానిని దుగ్ధరూపమున పితికినవి.

**వటవత్సాశ్చ తరవః పృథగ్రసమయం పయః ।**
**గిరయో హిమవద్వత్సా నానాధాతూన్ స్వసానుషు ॥ 25**

వృక్షములు మఱ్ఱిచెట్టును వత్సగా గల్పించి భిన్నభిన్నరసమయము లగుదుగ్ధములను పిండినవి. పర్వతము లన్నియు హిమాలయమును వత్సగజేసి తమతమచఱియ లనుపాత్రములయందు వివిధధాతుమయము లగు దుగ్ధములను పిండినవి.

**సర్వే స్వముఖ్యవత్సేన స్వే స్వే పాత్రే పృథక్పయః ।**
**సర్వకామదుఘాం పృథ్వీం దుదుహుః పృథుభావితామ్ ॥ 26**

అందఱు తమతమజాతులలోని ప్రధానవ్యక్తులను వత్సలుగా జేసి సర్వకామములను పిండువా డగుపృథురాజు వశము చేసికొనిన ధరిత్రినుండి తమతమపాత్రములలో భిన్నభిన్న వస్తురూపదుగ్ధములను పిండుకొనిరి.

**ఏవం పృథ్వాదయః పృథ్వీమన్నాదాః స్వన్నమాత్మనః ।**
**దోహవత్సాదిభేదేన క్షీరభేదం కురూద్వహ॥ 27**

కౌరవ శ్రేష్ఠుడవగువిదురా! అన్నమును భుజించు పృథువు మున్నగు జీవులు భిన్న భిన్నము లగుదోహనపాత్రములద్వారా, వత్సాదులద్వారా తమ తమ యభీష్టవస్తువులను పిండిరి.

**తతో మహీపతిః ప్రీతః సర్వకామదుఘాం పృథుః ।**
**దుహితృత్వే చకారేమాం ప్రేమ్ణా దుహితృవత్సలః ॥ 28**

పిమ్మట దుహితృవత్సలు డగు పృథుమహారాజు ప్రీతుడై సర్వకామములను దీర్చు ఈపృథ్విని ప్రేమతో పుత్రికారూపమున స్వీకరించెను.

**చూర్ణయంశ్చ ధనుష్కోట్యా గిరికూటాని రాజరాట్ ।**
**భూమండలమిదం వైన్యః ప్రాయశ్చక్రే సమం విభుః ॥ 29**

రాజాధిరాజు, ప్రభావశాలియు, వేనునిపుత్రుడు నగుపృథువు తనధనుస్సుయొక్క అగ్రభాగముద్వారా పర్వతశిఖరములను పొడిపొడిగజేసి ఈపృథివిని సమతలముగ నొనర్చెను.

**అథాస్మిన్ భగవాన్ వైన్యః ప్రజానాం వృత్తిదః పితా।**
**నివాసాన్ కల్పయాంచక్రే తత్ర తత్ర యథార్హతః ॥ 30**

పిమ్మట ప్రజావర్గమున కన్నప్రదాతయు, పితృస్వరూపుడు నగు పృథువు ఈభూమండలమున ఏస్థాన మెవరికి ఉపయుక్తమో ఆయాస్థానములలో వారికి తగిననివాసస్థానముల నేర్పరచెను.

**గ్రామాన్ పురః పత్తనాని దుర్గాణి వివిధాని చ ।**
**ఘోషాన్ వ్రజాన్ సశిబిరానాకరాన్ ఖేట ఖర్వటాన్ ॥ 31**

గ్రామములు, పురములు, పట్టణములు, వివిధదుర్గములు, గొల్లపల్లెలు, గోప నివాసములు, సేనానివాసములు, గనులు, కర్షకగ్రామములు, పర్వతప్రాంతస్థగ్రామములు మున్నగునివాసస్థానములను నిర్మించెను.

**ప్రాక్పృథోరిహ నైవైషా పురగ్రామాదికల్పనా ।**
**యథాసుఖం వసన్తి స్మ తత్ర తత్రాకుతోభయాః ॥ 32**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే పృథ్వీదోహో నామ
అష్టాదశో ఽధ్యాయః

పృథువునకు పూర్వ మీభూమండలమున ఈపురగ్రామాదులేవియు లేకుండెను. ఇపుడు ప్రజలందఱు తమతమస్థానములయందు నిర్భయముగను, పరమసుఖముగను నివసింపసాగిరి.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని పదునెనిమిదవ
అధ్యాయము సమాప్తము.



# పందొమ్మిదవ అధ్యాయము

## పృథుచక్రవర్తి నూఱశ్వమేధయాగముల నొనరించుట.

కథాసారము :- ఈ యధ్యాయమున అశ్వమేధయజ్ఞాంగ మగు అశ్వము ఇంద్రునిచే అపహృతముకాగా పృథువు ఇంద్రుని జంప ప్రయత్నించుట, బ్రహ్మ ఆయనను నివారించుట యనువిషయములు వర్ణితములైనవి.

కపటధార్మికునివేషమును స్వీకరించి యింద్రుడు అశ్వమును దీసికొని ఆకాశ మార్గమున పరుగిడుట చూచి అత్రిముని పృథుతనయు డగుమహారథుని ఇంద్రవధకై ఉత్సాహపఱచెను. ఇంద్రుడు పృథుపుత్రునిభయమువలన తనకపటవేషమును, అపహరించిన అశ్వమును విడచి అంతర్హితుడు కాగా పృథుతనయు డశ్వమును పునరుద్ధరించి "విజితాశ్వు" డనుపేరుతో ప్రసిద్ధికెక్కెను. ఇంద్రుడంధకారమును సృష్టించి యూపకాష్ఠమున గట్టివేయబడియున్న అశ్వమును మరల అపహరించెను. అత్రిమహాముని చే మరల ప్రేరితుడై పృథుపుత్రుడాకాశమున పరుగిడుచున్న ఇంద్రునిపై బాణమును విడచెను. ఇంద్రుడు భీతుడై తనకపటవేషమును, అశ్వమును విడచి మరల అంతర్హితుడయ్యెను. ఇంద్రుని యాకపటధార్మికవేషమును దిగంబరజైనులు, రక్తాంబరులగుబౌద్ధులు, కాపాలికులు స్వీకరించిరి. ఈపాషండచిహ్నములద్వారా జనుల బుద్ధి సహజసుందర మగునుపధర్మము నందు ఆసక్తమయ్యెను. పృథువు ఇంద్రునికాపట్యమును దెలిసికొని యజ్ఞాహుతులద్వారా ఇంద్రవధ కుద్యుక్తుడు కాగా బ్రహ్మ అచటకు వచ్చి ఇంద్రవధను నివారించెను. ఉపధర్మజనని యగుఇంద్రునిమాయను నాశముచేసి ప్రజాపతులకు సంతోషమును గలుగజేయ నుపదేశించెను. పిమ్మట మైత్రేయమహాముని విదురునితో, పృథువు యజ్ఞానుష్ఠానమునుండి విరతుడగుట, పురోహితులు పృథువున కభీష్టవరములను ఆశీస్సులను ఇచ్చుట మున్నగు విషయములను చెప్పెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

**అథాదీక్షత రాజర్షిర్హయమేధశతేన సః ।**
**బ్రహ్మావర్తే మనోః క్షేత్రే యత్ర ప్రాచీ సరస్వతీ॥** 1

మైత్రేయుడు పలికెను :- విదురా! పిమ్మట రాజర్షి యగు పృథువు పూర్వదిక్కుగా ప్రవహించుసరస్వతీనది గల మనువుక్షేత్ర మగు బ్రహ్మావర్తమున నూఱశ్వమేధయజ్ఞములను చేయుటకై దీక్షబూనెను.

తదభిప్రేత్య భగవాన్ కర్మాతిశయమాత్మనః ।
శతక్రతుర్నమమృషే పృథోర్యజ్ఞమహోత్సవమ్ ॥ 2

ఐశ్వర్యశాలి యగుశతక్రతువు (ఇంద్రుడు) పృథువుయొక్క యజ్ఞోత్సవము తనశతాశ్వమేధరూపకర్మకంటెను మిగుల ఆడంబరపూర్ణముగ నుండుట జూచి మత్సరగ్రస్తుడై సహింపలేకపోయెను.

యత్రయజ్ఞపతిస్సాక్షాద్భగవాన్ హరిరీశ్వరః ।
అన్వభూయత సర్వాత్మా సర్వలోకగురుః ప్రభుః ॥ 3

ఆయజ్ఞమహోత్సవమున సర్వాత్ముడు, సర్వలోకగురువు, యజ్ఞేశ్వరుడు అగు విష్ణుభగవాను డావిర్భవించెను.

అన్వితో బ్రహ్మశర్వాభ్యాం లోకపాలైః సహానుగైః ।
ఉపగీయమానో గన్ధర్వైర్మునిభిశ్చాప్సరోగణైః ॥ 4

ఆయనతోపాటు బ్రహ్మ, రుద్రుడు తమతమయనుచరులతోగూడి లోకపాలురు, గంధర్వులు, మునులు, అప్సరసలు ఆయనకీర్తిని గానము చేయుచుండిరి.

సిద్ధా విద్యాధరా దైత్యా దానవా గుహ్యకాదయః ।
సునన్దనన్దప్రముఖాః పార్షదప్రవరా హరేః ॥ 5

కపిలో నారదో దత్తో యోగేశాః సనకాదయః ।
తమన్వీయుర్భాగవతా యే చ తత్సేవనోత్సుకాః ॥ 6

సిద్ధులు, విద్యాధరులు, దైత్యులు, దానవులు, గుహ్యకులు, సునందనందాది ప్రముఖులైనభగవత్పార్షదులు, భగవత్సేవకై యుత్సుకు లగు కపిలుడు, నారదుడు, దత్తాత్రేయుడు, సనకాదులు నగుయోగేశ్వరులును ఆయనతోగూడ ఏగుదెంచిరి.

యత్ర ధర్మదుఘా భూమిః సర్వకామదుఘా సతీ ।
దోగ్ధిస్మాభీప్సితానర్థాన్ యజమానస్య భారత ॥ 7

భారతా! ఆయజ్ఞమున యజ్ఞసామగ్రుల నిచ్చుభూమి కామధేనువై యజమానుని సర్వకామ్యములను నెఱవేర్చినది.

ఊహుః సర్వరసాన్ నద్యః క్షీరదధ్యన్నగోరసాన్ ।
తరవో భూరివర్ష్మాణః ప్రాసూయన్త మధుచ్యుతః ॥ 8

నదులు ఇక్షుద్రాక్షాదిరసములను ప్రవహించుచుండెను. మధువును స్రవించు పెద్దపెద్దవృక్షములు, క్షీరములు, దధి, అన్నము, ఘృతములు మున్నగుసామగ్రుల నిచ్చుచుండెను.

**సిన్ధవో రత్ననికరాన్ గిరయోఽన్నం చతుర్విధమ్ ।**
**ఉపాయనముపాజహ్రుః సర్వలోకాః సపాలకాః ॥ 9**

సముద్రములు రత్నరాసులను, పర్వతములు భక్ష్యభోజ్యలేహ్యచోష్యము లను నాలుగువిధములగు అన్నములను, లోకపాలురతోగూడ సర్వలోకములు వివిధము లగుఉపహారములను ఆయనకు సమర్పించుచుండెను.

**ఇతి చాధోక్షజేశస్య పృథో స్తత్పరమోదయమ్ ।**
**అసూయన్ భగవానిన్ద్రః ప్రతిఘాతమచీకరత్ ॥ 10**

అధోక్షజు డగు శ్రీహరిభగవానునిసేవకు డగు పృథువు చేయు అభ్యుదయసంపన్న మగు యజ్ఞకార్యమును జూచి సహింపలేనివాడయి ఇంద్రు డాపృథువుయజ్ఞమునకు విఘ్నముల గలుగజేయసాగెను.

**చరమేణాశ్వమేధేన యజమానే యజుష్పతిమ్ ।**
**వైన్యే యజ్ఞ పశుం స్పర్ధన్నపోవాహ తిరోహితః ॥ 11**

మిగిలిన అశ్వమేధముద్వారా పృథువు యజ్ఞపతి యగువిష్ణువు నారాధింప ప్రవృత్తుడయ్యెను. ఇంద్రుడు మాత్సర్యమువలన గుప్తరూపముతో వానియజ్ఞపశువు నపహరించెను.

**తమత్రిర్భగవానైక్షత్త్వరమాణం విహాయసా ।**
**ఆముక్తమివ పాషణ్డం యోఽధర్మే ధర్మవిభ్రమః ॥ 12**

ఇంద్రు డాకాశమార్గమున వేగముగ పరుగిడుచుండుటయు, పాషండవేషమను కవచమును ధరించి జనులకు అధర్మమున ధర్మభ్రమను గలుగజేయుచుండుటను అత్రిమహర్షి చూచెను.

**అత్రిణా చోదితో హన్తుం పృథుపుత్రో మహారథః ।**
**అన్వధావత సంక్రుద్ధస్తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్ ॥ 13**

అత్రిమహర్షి యిదిచూచి యింద్రుని సంహరింపవలసినదిగా మహారథుడగు పృథునందనుని ప్రోత్సాహపఱచెను. పృథుతనయుడు క్రోధముతో ఇంద్రునివెంట పఱుగిడుచు, “నిలునిలు” మనిపలుకసాగెను.

**తం తాదృశాకృతిం వీక్ష్య మేనే ధర్మం శరీరిణమ్ ।**
**జటిలం భస్మనాచ్ఛన్నం తస్మై బాణం న ముంచతి ॥ 14**

పృథు తనయుడు జడలను ధరించినవాడు, శరీరమున భస్మము నలదుకొనినవాడు నగు ఇంద్రుని జూచి, వానిని మూర్తిమంత మగుధర్మముగా భావించెను. అందువలన వానిపై బాణమును విడువలేదు.

**వధాన్నివృత్తం తం భూయో హన్తవేఽత్రిరచోదయత్ ।**
**జహి యజ్ఞహనం తాత మహేన్ద్రం విబుధాధమమ్ ॥ 15**

పృథుపుత్రు డింద్రవధనుండి నివృత్తుడగుట చూచి అత్రి వానిని మరల శత్రువధార్థమై ప్రేరేపించి 'వత్సా! నీ తండ్రి యజ్ఞమును నాశనము చేయు దేవాధము డగు నీయింద్రుని వధింపు' మని పలికెను.

**ఏవం వైన్యసుతః ప్రోక్తస్త్వరమాణం విహాయసా ॥**
**అన్వద్రవదభిక్రుద్ధో గృధ్రరాడివ రావణమ్ ॥ 16**

పృథుతనయుడు అత్రిపలికిన యీ వాక్యలను విని మిగుల క్రుద్ధుడయ్యెను. పక్షిరాజగు జటాయువు రావణుని వధించుటకై వానివెంట పరుగిడినట్లు పృథుతనయుడుగూడ ఆకాశమార్గమున పరువెత్తు ఇంద్రుని వెంట పరుగిడెను.

**సోఽశ్వం రూపం చ తద్ధిత్వా తస్మా అన్తర్హితః స్వరాట్ ।**
**వీరః స్వపశుమాదాయ పితుర్యజ్ఞముపేయివాన్ ॥ 17**

అపు డింద్రుడు ఆ పాషండవేషమును యజ్ఞపశువును వదలి అంతర్హితుడయ్యెను. మహావీరు డగుపృథుతనయుడు తన యజ్ఞాశ్వమును తీసికొని యజ్ఞస్థలమునకు వెడలెను.

**తత్తస్య చాద్భుతం కర్మ విచక్ష్య పరమర్షయః ।**
**నామధేయం దదుస్తస్మై విజితాశ్వ ఇతి ప్రభో ॥ 18**

ప్రభూ! మహర్షులు పృథుతనయుడు చేసిన అద్భుతకార్యమును జూచి వానిని 'విజితాశ్వు'డను నామముతో పిలచిరి.

**ఉపసృజ్య తమస్తీవ్రం జహారాశ్వం పునర్హరిః ।**
**చషాలయూపతశ్ఛన్నో హిరణ్యరశనం విభుః ॥ 19**

పృథుతనయు డశ్వము నుద్ధరించి సువర్ణశృంఖలములద్వారా దానిని యూపకాష్టమున గట్టివేసెను. శక్తిశాలి యగు ఇంద్రుడు ఘోర మగునంధకారమును సృష్టించి ప్రచ్ఛన్న వేషముతో ఆ అశ్వమును మరల అపహరించెను.

అత్రిః సన్దర్శయామాస త్వరమాణం విహాయసా ।
కపాలఖట్వాంగధరం వీరో నైనమధావత ॥ 20

ఈమారు ఇంద్రుడు కపాలమును, ఖట్వాంగమును (శివుని ఆయుధవిశేషము) ధరించి ఆకాశమార్గమున వేగముగ పరుగిడుచుండెను. అత్రి మరల వానిచూపించెను. మహావీరు డగు పృథుపుత్రుడు ఆయింద్రుని వెంట ఇకపరుగిడలేదు.

అత్రిణా చోదితస్తస్మై సన్దధే విశిఖం రుషా ।
సోఽ శ్వం రూపం చ తద్ధిత్వా తస్మా అన్తర్హితః స్వరాట్ ॥ 21

పిమ్మట అత్రిచే మరల ప్రేరితుడై పృథుతనయుడు క్రోధముతో ఇంద్రునిపై బాణమును వదలెను. అప్పు డిష్టము పచ్చిన రూపమును ధరించుటయందు సమర్థుడగు ఇంద్రుడు ఆయజ్ఞాశ్వమును, పాషండవేషమును పరిత్యజించి యంతర్హితుడయ్యెను.

వీరశ్చాశ్వముపాదాయ పితుర్యజ్ఞమథావ్రజత్ ।
తదవద్యం హరేరూపం జగృహుర్జ్ఞానదుర్బలాః ॥ 22

పిమ్మట మహావీరు డగుపృథుతనయు డశ్వమును దీసికొని తండ్రి యొక్క యజ్ఞస్థలమునకు వెడలెను. మందబుద్ధు లగువారే ఇంద్రుడు విడచిన దూషిత మగుఆకపటవేషమును స్వీకరించిరి.

యాని రూపాణి జగృహే ఇన్ద్రో హయజిహీర్షయా ।
తాని పాపస్య షణ్డాని లింగం షణ్డమిహోచ్యతే ॥ 23

ఇంద్రుడశ్వమును హరించుటకై యే యే కపటవేషములను ధరించెనో అవి యన్నియు పాపమునకు షండములైయున్నవి. శాస్త్రమున "షండ" శబ్దమునకు "చిహ్న" మనుఅర్థముకలదు. పాషండ మనగా పాపచిహ్న మనియర్థము.

ఏవమిన్ద్రే హరత్యశ్వం వైన్యయజ్ఞజిఘాంసయా ।
తద్గృహీతవిసృష్టేషు పాషండేషు మతిర్నృణామ్ ॥ 24

ధర్మః ఇత్యుపధర్మేషు నగ్నరక్తపటాదిషు ।
ప్రాయేణ సజ్జతే భ్రాన్త్యా పేశలేషు చ వాగ్మిషు ॥ 25

పృథువు యజ్ఞమును నాశము చేయుదలంపుతో ఇంద్రు డిట్లు మాటి మాటికి ఏయే పాషండరూపములను స్వీకరించి విడచెనో ఆయారూపములయందు క్రమముగ మానవులబుద్ధి లగ్నమయ్యెను.

దిగంబరజైనులు, రక్తాంబరధారు లగుబౌద్ధులు, కాపాలికాదివ్యక్తులు పాషండోప ధర్మముల నా శ్రయించిరి. సహజసుందరములు, హేతూక్తులచే చతురములు అగుఉపధర్మములయందు మానవులమనస్సు భ్రాంతిచే ఆకృష్టమగును.

తదభిజ్ఞాయ భగవాన్ పృథుః పృథుపరాక్రమః ।
ఇన్ద్రాయ కుపితో బాణమాదత్తోద్యతకార్ముకః ॥ 26

మహాపరాక్రమవంతుడగుపృథువు ఇంద్రునియీవ్యాపారముల నన్నింటిని తెలిసికొని క్రుద్ధుడయి ధనుర్బాణములను దీసికొని ఆ యింద్రునిపై బాణము వేయ నుద్యుక్తుడయ్యెను.

తమృత్విజః శక్రవధాభిసన్ధితమ్ ।
విచక్ష్య దుష్ప్రేక్ష్యమసహ్యరంహసమ్
నివారయామాసురహో మహామతే
న యుజ్యతేఽత్రాన్యవధః ప్రచోదితాత్ ॥ 27

ఋత్విక్కులు శక్రువధకు ఉద్యుక్తుడయినవాడు, దుర్నిరీక్ష్యుడు, సహింపరాని వేగముగలవాడు నగుపృథువును జూచి శక్రువధనుండి వానిని నివారించుచు "మహామతీ! ఈయజ్ఞస్థలమున శాస్త్రవిహిత మగుపశువును దప్ప మఱిదేనిని గూడ నీవు వధించుట తగ"దని పలికిరి.

వయం మరుత్వన్తమిహార్థనాశనం
హ్వయామహే త్వచ్ఛ్రవసా హతత్విషమ్ ।
అయాతయామోపహవైరనన్తరం
ప్రసహ్య రాజన్ జుహవామ తేఽహితమ్ ॥ 28

రాజా! ఈయజ్ఞకార్యమున కాటంకము కలుగజేయువాడు, నీకు శత్రువు నగునింద్రుడు నీకీర్తివలననే ఈర్ష్యావశుడు, నిస్తేజుడు నగుచుండెను. మేము అమోఘము లగు ఆవాహన మంత్రములద్వారా వాని నిచటకు నాహ్వానించి, బలవంతముగ అగ్నియందు హోమము చేయుదుము.

ఇత్యామన్త్ర్య క్రతుపతిం విదురాస్యర్త్విజో రుషా ।
స్రుగ్ఘస్తాన్ జుహ్వతోఽభ్యేత్య స్వయంభుః ప్రత్యషేధత ॥ 29

విదురా! యజమానితో నిట్లాలోచించి ఋత్విక్కులు క్రోధముతో నింద్రు నావాహనము చేసిరి. వారు స్రువముద్వారా అగ్నిలో ఆహుతిని వేయ ఉద్యుక్తులు కాగా బ్రహ్మ యచటికి వచ్చి వారిని నివారించెను.

**న వధ్యో భవతామిన్ద్రో యద్యజ్ఞో భగవత్తను: ।**
**యం జిఘాంసథ యజ్ఞేన యస్యేష్టాస్తనవ: సురా: ॥ 30**

ఋత్విక్కులారా! మీరు యజ్ఞరక్షార్థమై ఏ యింద్రుని యజ్ఞమున ఆహుతుల నిచ్చి వధింప దలచితిరో అయింద్రునకు మఱియొకపేరు యజ్ఞ మనికలదు. అతడు భగవానుని అవతారవిశేషము. యజ్ఞమున పూజితులగుదేవతలు వానిదేహమే, అందువలన ఆయింద్రుని వధించుట మీకు దగినపనికాదు.

**తదిదం పశ్యత మహద్ధర్మవ్యతికరం ద్విజా: ।**
**ఇంద్రేణానుష్ఠితం రాజ్ఞ: కర్మైతద్విజిఘాంసతా ॥ 31**

ద్విజులారా! చూడుడు, పృథుమహారాజుయొక్క యజ్ఞమును నాశనము చేయుదలంపుతో ఈయింద్రుడు మహాత్ములగు వేదవాదుల ధర్మమునకు విరుద్ధ మగుకార్యము నొనర్చినాడు.

**పృథుకీర్తే: పృథోర్భూయాత్తర్హ్యేకోనశతక్రతు: ।**
**అలం తే క్రతుభి: స్విష్టైర్యద్భవాన్ మోక్ష ధర్మవిత్ ॥ 32**

విపులకీర్తిమంతు డగుపృథువుయొక్క తొంబదితొమ్మిదియజ్ఞములు పూర్తియయ్యె నని బ్రహ్మ ఋత్విక్కులకు జెప్పి పిమ్మట పృథువుతో నిట్లు పలికెను-- రాజా! నీవు మోక్షధర్మవేత్తవు. అందువలన మోక్షధర్మములను అనుష్ఠింపుము. కామ్యయజ్ఞాదులవలన నీ కెట్టిప్రయోజనము లేదు.

**నైవాత్మనే మహేన్ద్రాయ రోషమాహర్తుమర్హసి ।**
**ఉభావపి హి భద్రం త ఉత్తమశ్లోకవిగ్రహౌ ॥ 33**

రాజా! నీకు శుభమగుగాక! నీవు, ఇంద్రుడు ఇర్వురు ఉత్తమ శ్లోకుడగు శ్రీహరియొక్క శక్త్యావేశావతారులే. అందువల నీవు ఇంద్రుని కంటె భిన్నుడవు కావు. కనుక నీవు నీపై క్రోధముచూపుట యోగ్యము కాదు.

మాస్మిన్ మహారాజ కృథాః స్మ చిన్తాం
నిశామయాస్మద్వచ ఆదృతాత్మా ।
యద్ధ్యాయతో దైవహతం ను కర్తుం
మనోఽతిరుష్టం విశతే తమోఽన్ధమ్ ॥ 34

మహారాజా! ఈయజ్ఞమునకు విఘ్నముగలిగినదిగదా యనినీవు చింతింపవలదు. శ్రద్ధతో నామాటలను వినుము. దైవముద్వారా నష్టమైనకార్యమును మరల సంపన్నముచేయ దలంచు మానవునిమనస్సు మిగుల రుష్టమై మోహాంధకారరాజ్యమున ప్రవేశించును.

క్రతుర్విరమతామేష దేవేషు దురవగ్రహః ।
ధర్మవ్యతికరో యత్ర పాషండైరిన్ద్రనిర్మితైః ॥ 35

నీవీ యజ్ఞప్రయత్నమును విరమింపుము. ఈ యింద్రుడు దేవతలలో దుష్టమైనపట్టుదల గలవాడు. నీ యజ్ఞమున నింద్రుడే యే పాషండ వేషములను ధరించెనో అవి యన్నియు ధర్మమునకు వినాశకరములె యగును.

ఏభిరిన్ద్రోపసంసృష్టైః పాషండైర్హారిభిర్జనమ్ ।
హ్రియమాణం విచక్ష్వైనం యస్తే యజ్ఞ ధ్రుగశ్వముట్ ॥ 36

నీయజ్ఞమునకు విఘ్నములను గలుగజేసి గుఱ్ఱమును హరించిన ఇంద్రుడే యేపాషండములను సృష్టించెనో వానిద్వారా యితడు మానవుల చిత్తమును ఆకర్షించుచున్నాడు చూడుము.

భవాన్ పరిత్రాతుమిహావతీర్ణో
ధర్మం జనానాం సమయానురూపమ్ ।
వేనాపచారాదవలుప్తమద్య
తద్దేహతో విష్ణుకలాసి వైన్య ॥ 37

వేనుని దురాచారములవలన మానవులయుగధర్మములు విలుప్తములయ్యెను. నీవాధర్మములను ఉద్ధరించుటకై యిప్పుడు విష్ణువుయొక్క అంశాంశతో వేనునిదేహమునుండి ప్రాదుర్భవించితివి.

స త్వం విమృశ్యాస్య భవం ప్రజాపతే
సంకల్పనాం విశ్వసృజాం పిపీపృహి ।
ఐన్ద్రీం చ మాయాముపధర్మమాతరం
ప్రచండపాషండపథం ప్రభో జహి ॥ 38

ప్రజాపతీ! ఈవిశ్వముయొక్క ఉత్పత్తినిగూర్చి ఆలోచించి విన్న ఈవిశ్వస్రష్ట లగు ఋషులు వెలువరించిరి. నీవు వారిమనోరథములను పూర్తిచేయుము. ప్రచండ మగుపాషండమతవాదరూపిణియు, ఉపధర్మములపుట్టుకకు కారణ మైనదియు నగుఐంద్రీమాయను నాశముచేయుము.

## శ్రీ మైత్రేయ ఉవాచ

**ఇత్థం స లోకగురుణా సమాదిష్టో విశాంపతిః ।**
**తథా చ కృత్వా వాత్సల్యం మఘోనాపి చ సన్దధే ॥ 39**

మైత్రేయుడు పలికెను:- విదురా! పృథుమహారాజు లోకగురువగుబ్రహ్మచే ఇట్లాజ్ఞాపింపబడినవాడై యజ్ఞము చేయవలయు ననుతలంపును విడచిపెట్టెను. వాత్సల్యభావమును వెలువరించి ఇంద్రునితో మైత్రినెఱపెను.

**కృతావభృథస్నానాయ పృథవే భూరికర్మణే ।**
**వరాన్ దదుస్తే వరదా యే తద్బర్హిషి తర్పితాః ॥ 40**

అనంతరము పృథువు యజ్ఞాంతస్నాన మొనరించెను. వరప్రదాతలగుదేవత లందఱు భూరికర్మల నొనరించిన పృథువుయజ్ఞమున అర్చితులై పరితృప్తులైరి. వా రాతనికి అభీష్టవరముల నొసంగిరి.

**విప్రాః సత్యాశిషస్తుష్టాః శ్రద్ధయా లబ్ధదక్షిణాః ।**
**ఆశిషో యుయుజుః క్షత్తరాదిరాజాయ సత్కృతాః ॥ 41**

విదురా! వ్యర్థముకాని యాశీస్సులు గలబ్రాహ్మణులు ఆదిరా జగుపృథువు శ్రద్ధతో ఇచ్చిన దక్షిణలను స్వీకరించి సంతుష్టులై వాని కనేకవిధముల ఆశీస్సుల నొసంగిరి.

**త్వయాహూతా మహాబాహో సర్వ ఏవ సమాగతాః ।**
**పూజితా దానమానాభ్యాం పితృదేవర్షిమానవాః ॥ 42**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే పృథువిజయే బ్రహ్మవాక్యం
నామ ఏకోనవింశో ఽధ్యాయః ॥

(బ్రాహ్మణులు పలికిరి :-) మహాబాహూ! పృథుచక్రవర్తీ! నీవు ఆహ్వానించినపితరులు, దేవతలు, ఋషులు, మానవులు అందఱు సమాగతులై నీవు చేసినదానములచేత పూజలచేత సత్కృతులయిరి.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని పందొమ్మిదవ అధ్యాయము.
సమాప్తము.





# ఇరువదియవ అధ్యాయము

## పృథుమహారాజు యజ్ఞశాలలో శ్రీవిష్ణుభగవానుడు

## ఆవిర్భవించుట.

కథాసారము:- పృథుయజ్ఞమున విష్ణువు పృథువున కుపదేశించుట, వరములనిచ్చుట, ఆయన యాజ్ఞ ననుసరించి ఇంద్రునితో సఖ్యత కలిగియుండుట అనువిషయములు ఈ యధ్యాయమున వర్ణితములైనవి.

విష్ణుభగవానుడు పృథుమహారాజునకు తత్త్వమునుపదేశించి 'అంతట సమబుద్ధి విశిష్టుడవై ప్రజాపాలనరక్షణాదులజేయు' మనియాదేశించెను. పృథువు దానిని అవనతమస్తకుడయి స్వీకరించెను. భగవదాదేశము ననుసరించి యింద్రునితో వైరభావమును విడచెను. పిమ్మట భగవానుడు పృథువున కభీష్టవరముల నీయదలంపగా అతడు స్వర్గసుఖములు, కైవల్యముక్తి తుచ్ఛము లనిభావించి భగవద్గుణానువాదమును శ్రవణము జేయుటకై పదివేలచెవులను గోరెను. సాధువుల వలనహరికథను వినిన పిమ్మట పశువుతప్ప యెవ్వరు దానినుండి నివృత్తులగుట కిష్టపడుదురు? ధనమున కధిదేవత యగులక్ష్మితో విరోధము కలిగినను నష్టములేదు. దీనవత్సలుడగుభగవానునిసేవతప్ప జీవునిదేహధారణము నకు వేరొక సార్థకతలేదు. భగవన్మాయాముగ్ధు డగుటవలననే జీవుడు పుత్రైషణాది నానావిధము లగుకోరికలను కోరుచుండును. పృథుమహారాజు పలికినమాటలకు భగవానుడు సంతుష్టుడయి ఋత్విక్కులతోపాటు రాజర్షి యగుపృథువుమనస్సునుగూడ హరించి తనధామమునకు వెడలెను.

### శ్రీమైత్రేయ ఉవాచ

**భగవానపి వైకుంఠః సాకం మఘవతా విభుః ।**
**యజ్ఞైర్యజ్ఞపతిస్తుష్టో యజ్ఞభుక్తమభాషత ॥ 1**

మైత్రేయుడు పలికెను:- యజ్ఞేశ్వరుడు, యజ్ఞభుక్కు, వైకుంఠుడు నగు విష్ణుభగవానుడు ఇంద్రునితోగలసి యజ్ఞస్థలమునకు విచ్చేసి పృథువుపూజను స్వీకరించి ఆతనితో నిట్లుపలికెను.

## శ్రీ భగవానువాచ

ఏష తేఽకార్షీద్భంగం హయమేధశతస్య హ ।
క్షమాపయత ఆత్మానమముష్య క్షన్తుమర్హసి ॥ 2

భగవానుడు పలికెను :- ఈ యింద్రుడు నూఱవదైన అశ్వమేధయజ్ఞమునకు విఘ్నము గలుగజేసెను. కాని యిపుడతడు తన్ను క్షమింపుమని నిన్ను ప్రార్థించుచున్నాడు. అందువలన వీనిని క్షమించుట నీ కర్తవ్యము.

సుధియః సాధవో లోకే నరదేవ నరోత్తమాః ।
నాభిద్రుహ్యన్తి భూతేభ్యో యర్హి నాత్మా కలేవరమ్ ॥ 3

నరదేవా! దేహ మాత్మకాదు. అందువలననే నరోత్తములు, పండితులు, సజ్జనులు అగువారు ప్రాణులను హింసింపరు.

పురుషా యది ముహ్యన్తి త్వాదృశా దేవమాయయా ।
శ్రమ ఏవ పరం జాతో దీర్ఘయా వృద్ధసేవయా ॥ 4

నీ వంటి వివేకవంతులగు మానవులు దైవీమాయచే మోహితులైనచో బహుదినముల నుండి జ్ఞానులకు జేసినసేవ వ్యర్థమే యగును.

అతః కాయమిమం విద్వానవిద్యాకామకర్మభిః ।
ఆరబ్ధ ఇతి నైవాస్మిన్ ప్రతిబుద్ధో ఽనుషజ్జతే ॥ 5

అందువలన ఈదేహమును అవిద్యాకామ కర్మలద్వారా విరచితమైనదనియెఱింగిన ఆత్మజ్ఞు డగువ్యక్తి మరియీదేహమునం దెప్పుడును ఆసక్తుడుగాడు.

అసంసక్తః శరీరేఽస్మిన్నమునోత్పాదితే గృహే ।
అపత్యే ద్రవిణే వాపి కః కుర్యాన్మమతాం బుధః ॥ 6

ఈదేహమునం దాసక్తుడుకాని ఆత్మదర్శి యగువ్యక్తి మఱి యీ దేహమునుండి పుట్టినగృహము, సంతానము, ధనము మున్నగు వానిపై మమత్వమును జూపుటయేల?

ఏకః శుద్ధః స్వయంజ్యోతిర్నిర్గుణోఽసౌ గుణాశ్రయః ।
సర్వగోఽనావృతః సాక్షీ నిరాత్మాఽఽత్మాఽఽత్మనః పరః ॥ 7

ఈపరమాత్మ ఏకమాత్రుడు, శుద్ధుడు, స్వయంప్రకాశుడు, నిర్గుణుడు, గుణముల కాశ్రయుడు, సర్వవ్యాపకుడు, అవరణశూన్యుడు, సాక్షి, అన్యములైన ఆత్మలు లేనివాడు, దేహముకంటె పరమైనవాడు.

వివరణము :- పరమాత్మ-జీవాత్మకంటెను, దేహము కంటెను తొమ్మిదివిధముల భిన్నముగ ఉండును. దేహజీవులసంఖ్య అనేకములు. కాని పరమాత్మ యొకేయొక అద్వయతత్త్వమైయున్నాడు. దేహము-మలినము, పరమాత్మ-పరిశుద్ధుడు; దేహము-జడము; పరమాత్మ-స్వయంప్రకాశుడు లేదా చేతనవస్తువు; దేహము-ప్రాకృత గుణమయవస్తువు; పరమాత్మ - అప్రాకృతజ్ఞానానందాదిగుణాధారుడు; దేహము - పరిచ్ఛిన్నము; ఆత్మ - అంతట ఉండునది; దేహము - గేహాదివస్తువులద్వారా ఆవృతము, కాని ఆత్మ - అంతట అనావృతము; ఆత్మ- దేహేంద్రియాదిద్రష్టృస్వరూపము; కానిదేహము - తద్విపరీత ధర్మవిశిష్టమగు అచేతనము; పరమాత్మ ఆత్మాంతరరహితమైనది, అనగా ఆయనతో సమానుడుగాని, ఆయనకంటె గొప్పవాడుగాని మఱియెవ్వరును లేరు. అందువలన దేహముకంటె ఆత్మ సర్వవిధముల భిన్నమైనది.

**య ఏవం సన్తమాత్మానమాత్మస్థం వేద పూరుషః ।**
**నాజ్యతే ప్రకృతిస్థోఽపి తద్గుణైః స మయి స్థితః ॥ 8**

ఈదేహమునం దున్న ఆత్మను వెనుక జెప్పినవిధముగ తెలిసికొనినవాడు, దేహమునం దున్నను దేహముయొక్కగుణములద్వారా ఆసక్తుడుగాడు, అతడు నాయందే యుండును.

**యః స్వధర్మేణ మాం నిత్యం నిరాశీః శ్రద్ధయాన్వితః ।**
**భజతే శనకైస్తస్య మనో రాజన్ ప్రసీదతి ॥ 9**

నిష్కాముడు, శ్రద్ధాయుక్తుడునై కర్మానుష్ఠానముద్వారా నన్నే నిత్యము భజించు వానిమనస్సు క్రమముగ ప్రసన్నతను పొందును.

**పరిత్యక్తగుణః సమ్యగ్దర్శనో విశదాశయః ।**
**శాన్తిం మే సమవస్థానం బ్రహ్మకైవల్యమశ్నుతే ॥ 10**

ప్రసన్నమనస్కు డయినంతనె యతడు త్రిగుణములనుండి విముక్తుడయి సమ్యగ్దర్శియగును. నాయందు జక్కగ ఔదాసీన్యరూపముతో నుండుటయె "బ్రహ్మ కైవల్యము". అత డాబ్రహ్మకైవల్య మనుశాంతిని పొందును.

**ఉదాసీమివాధ్యక్షం ద్రవ్యజ్ఞానక్రియాత్మనామ్ ।**
**కూటస్థమిమమాత్మానం యో వేదాప్నోతి సోఽ భవమ్ ॥ 11**

ఉదాసీనరూపముతో నున్నదియు, సాక్షిస్వరూప మైనదియు, నిర్వికార మయినదియు నగు నీయాత్మను దేహజ్ఞాన కర్మేంద్రియములకు, మనస్సునకు ద్రష్ట (అధ్యక్షము) అని తెలిసికొనినవాడు మోక్షమును పొందును.

భిన్నస్య లింగస్య గుణప్రవాహో
ద్రవ్యక్రియాకారకచేతనాత్మన: ।
దృష్టాసు సంపత్సు విపత్సు సూరయో
న విక్రియన్తే మయి బద్ధసౌహృదా: ॥ 12

దేహములు, కర్మలు, ఇంద్రియములు, ఇంద్రియాధిష్ఠానదేవతలు, చిదాభాసము-వీనియొక్కసంఘాతాత్మకలింగదేహమునకు సంసారభోగములు గలుగును. ఈవిషయమును తెలిసికొని వివేకులగువారు నాయందు బద్ధానురాగులై నిశ్చలముగ నుందురు. అందువలన సంపదలు కలిగినను విపత్తులు గలిగినను దేనిచేతగూడ వారిచిత్తము వికారముచెందదు.

సమ: సమానోత్తమమధ్యమాధమ:
సుఖే చ దు:ఖే చ జితేంద్రియాశయ: ।
మయోపక్లిప్తాఖిలలోకసంయుతో
విధత్స్వ వీరాఖిలలోకరక్షణమ్ ॥ 13

వీరుడా! (నీవు పండితుడవు) అందువలన నీవు సుఖదు:ఖములను సమానముగ భావించి, ఉత్తమమధ్యమాధములయందు సమబుద్ధివిశిష్టుడవై సుఖదు:ఖ విషయముల యందు ఇంద్రియములను మనస్సును వశముచేసికొనుము. నేను నీ కమాత్యాదిపార్షదుల నిచ్చుచున్నాను, వారితోగలసి సర్వలోకములను రక్షింపుము.

శ్రేయ: ప్రజాపాలనమేవ రాజ్ఞో
యత్సాంపరాయే సుకృతాత్ షష్ఠమంశమ్ ।
హర్తాన్యథా హృతపుణ్య: ప్రజానా -
మరక్షితా కరహారోఽఘమత్తి ॥ 14

ప్రజాపాలనమే రాజులకు పరమమంగళజనక మగుకార్యము, పరలోకమున రాజు ప్రజలచే సంపాదింపబడినపుణ్యములో ఆఱవ భాగమును అనుభవించును. ప్రజలనుండి పన్నులు తీసికొనుచు వారిరక్షణ విషయమున ఉదాసీను డయినరాజు యొక్క పుణ్యమును ఆప్రజలు హరింతురు. రాజు ప్రజలపాపఫలమును అనుభవించును.

ఏవం ద్విజాగ్ర్యానుమతానువృత్త-
ధర్మప్రధానోఽ న్యతమోఽ వితాస్యాః ।
హ్రస్వేన కాలేన గృహోపయాతాన్
ద్రష్టాసి సిద్ధాననురక్తలోకః ॥ 15

అందువలన ఏ ధర్మము ప్రధాను లగుఋషులచే ఆమోదింపబడినదో, పరంపరగ వచ్చినదో ఆధర్మమునే నీవు ప్రధాన మనిభావించి అనాసక్తభావముతో ఈపృథివిని పాలింపుము. దానివలన ప్రజలు నీయం దనురక్తులగుదురు. నీవుగూడ అచిరకాలములోనె నీభవనమునకు వచ్చిన సనకాది సిద్ధపురుషులను చూడగలవు.

వరం చ మత్కంచన మానవేన్ద్ర
వృణీష్వ తేఽహం గుణశీలయన్త్రితః ।
నాహం మఖైర్వై సులభస్తపోభి -
ర్యోగేన వా యత్సమచిత్తవర్తీ ॥ 16

మహారాజా! నేను నీశమాదిచరిత్రకు, నిర్మత్సరాదిస్వభావమునకు వశుడనైతిని. అందువలన నీవు నీకభీష్ట మగువరములను గోరుకొనుము. ఎవరిచిత్తము వైషమ్యరహిత మయియున్నదో వారియనుభవమునకు నేను విషయమునగుదును. తపోయజ్ఞ యోగాదులద్వారా నేను సులభుడనుగాను.

## శ్రీ మైత్రేయ ఉవాచ

స ఇత్థం లోకగురుణా విష్వక్సేనేన విశ్వజిత్ ।
అనుశాసిత ఆదేశం శిరసా జగృహే హరేః ॥ 17

మైత్రేయుడు పలికెను:- విదురా! విశ్వవిజేత యగుపృథువు లోకగురు వగుశ్రీహరి భగవానునిచే నిట్లు ఉపదిష్టుడై ఆయనయాదేశమును అవనతమస్తకుడై స్వీకరించెను.

స్పృశన్తం పాదయోః ప్రేమ్ణా వ్రీడితం స్వేన కర్మణా ।
శతక్రతుం పరిష్వజ్య విద్వేషం విససర్జహ ॥ 18

అప్పుడింద్రుడు తాను చేసినపనికి సిగ్గిలి పృథువుపాదములపై బడెను. అపుడు పృథువు ప్రేమతో వానిని ఆలింగనముచేసికొని వానిపై గలవిద్వేషభావమును వదలిపెట్టెను.

భగవానపి విశాత్మా పృథునోపహృతార్హణః ।
సముజ్జిహానయా భక్త్యా గృహీతచరణాంబుజః ॥ 19

పిమ్మట పృథుమహారాజు విశ్వాత్ముడగు శ్రీహరిభగవానుని పూజించుటకై వివిధసామగ్రులనుదెచ్చి, పరివర్ధిత మగుభక్తి యోగముతో ఆయన చరణకమలములకు నమస్కరించెను.

ప్రస్థానాభిముఖో ఽప్యేన మనుగ్రహవిలంబితః ।
పశ్యన్ పద్మపలాశాక్షో న ప్రతస్థే సుహృత్సతామ్ ॥ 20

శ్రీహరి సజ్జనులకు బంధువువంటివాడు. అందువలన ఆయన వెడలుట కుద్యుక్తుడయ్యును భక్తునిపై గలయనుగ్రహముచే ఆలస్యము చేసెను. పద్మపలాశలోచనుడగుభగవానుడు రాజును జూచుచు అచటి నుండి వెడలలేకపోయెను.

మ. *భగవంతుండును విశ్వరూపకుఁడు నై భాసిల్లు నవ్విష్ణుఁడా*
*జగతీనాథకృతార్చనానతులచే సంప్రీతచేతస్కుఁడున్*
*నిగృహీతాంఘ్రిసరోరుహద్వయుఁడు నై నిల్చెంబ్రయాణాభిము*
*ఖ్యగరిష్ఠాత్మకుఁడయ్యు నాపృథునిపైఁగారుణ్యమేపారగన్.* (4-547)

స ఆదిరాజో రచితాంజలిర్హరిం
విలోకితుం నాశకదశ్రులోచనః ।
న కించనోవాచ స బాష్పవిక్లవో
హృదోపగుహ్యాముమధాదవస్థితః ॥ 21

అప్పు డాదిరాజగు పృథువు శ్రీహరిని స్తుతించుటకై కృతాంజలి అయ్యెను, కాని ఆనందబాష్పములచే రెండుకన్నులు నిండియుండుట వలన అత డాయనను దర్శింపలేకపోయెను, బాష్పములచే కంఠము రుద్ధముకాగా నిశ్శబ్దుడయి శ్రీహరిని హృదయముతో ఆలింగనము చేసికొనియుండెను.

అథావమృజ్యాశ్రుకలా విలోకయ-
న్నతృప్తదృగ్గోచరమాహ పూరుషమ్ ।
పదా స్పృశన్తం క్షితిమంస ఉన్నతే
విన్యస్తహస్తాగ్రమురంగవిద్విషః ॥ 22

పిమ్మట ఆయన కన్నీటిని దుడిచికొని, భూమిపై చరణములను ఉన్నతమగు గరుడుని భుజముపై హస్తాగ్రమును ఉంచి నిలుపబడియున్న శ్రీహరిని అతృప్త నయనములతో చూచుచు నిట్లు పలుకసాగెను.

## శ్రీపృథురువాచ

వరాన్ విభో త్వద్వరదేశ్వరాద్బుధః
కథం వృణీతే గుణవిక్రియాత్మనామ్ ।
యే నారకాణామపి సన్తి దేహినాం
తానీశ కైవల్యపతే వృణే న చ ॥ 23

పృథువు పలికెను :- దేవా! వరముల నీయసమర్థు లగుబ్రహ్మాది దేవతలకుగూడ నీవీశ్వరుడవైయున్నావు. బుద్ధిమంతుడగు ఏవ్యక్తియైన దేహాభిమానులగువా రనుభవింపదగిన విషయములను నీనుండి అభిలషించునా? పరమేశ్వరా! ఈభోగవస్తువు లన్నియు నరకవాసులగు దేహధారుల కుండును. ముకుందా! ఆతుచ్ఛభోగవస్తువులకై నేను నిన్ను ప్రార్థింపను.

న కామయే నాథ తదప్యహం క్వచి -
న్న యత్ర యుష్మచ్చరణాంబుజాసవః ।
మహత్తమాన్తర్హృదయాన్ముఖచ్యుతో
విధత్స్వ కర్ణాయుతమేష మే వరః ॥ 24

నాథా! మహాత్ము లగుభాగవతుల హృదయమునుండి ముఖము ద్వారా బయల్వెడలిన నీపాదపద్మమకరందము ఏముక్తియందు లేదో, ఎచట నీకీర్తికథను శ్రవణముచేయుట కవకాశముగూడ లేదో, నే నామోక్షపదమును కోరను, నీగుణములను శ్రవణముచేయుటకు నాకు పదివేల చెవుల నీయుము. ఇదియే నా కోరిక. ఇక నేను దేనిని గోరను.

చ. *ఘన మగుదేవ యీవరమె కాదు మహాత్మక వాగ్వినిర్గతం*
*బనఁ దగుతావకీనచరణాంబుజ చారుమరందరూపమై*
*తనరిన కీర్తియున్ విని ముదంబును బొందఁగ లేనిమోక్షమై*
*నను మదిఁ గోర నొల్ల నఘనాశ రమేశ సరోజలోచనా.*

కం. *అది గాన పద్మలోచన*
*సదమల భవదీయ ఘనయశము వినుటకు నై*
*పదివేల చెవులు కృప ని*
*మ్మిదియె నాయభిమతంబు నిపుడు ముకుందా.* (4-550,51)

స ఉత్తమశ్లోక మహన్ముఖచ్యుతో
భవత్పదాంభోజసుధాకణానిలః ।
స్మృతిం పునర్విస్మృతతత్త్వవర్త్మనాం
కుయోగినాం నో వితరత్యలం వరైః ॥ 25

పుణ్యశ్లోకుడా! మహాజనులముఖమునుండి బయల్వెడలిన నీపాదపద్మమకరంద కణసంపృక్తమగువాయువు కుయోగులకు మరల తత్త్వజ్ఞానమును గలిగించును. అందువలన నాకిక ఇతరవరములతో పని లేదు.

చ. *అనఘ మహాత్మ వాగ్గళిత మైన భవత్పదపంకజాత సం*
*జనితసుధాకణానిలవశంబున విస్మృతతత్త్వమార్గవ*
*ర్తను లగుదుష్టయోగులకుఁ గ్రమ్మఱఁదత్త్వముఁజూపఁజాలు ని*
*ట్లొనరుట దక్క నన్యవర మొల్లఁబయోరుహపత్రలోచనా.* (4-552)

యశశ్శివం సుశ్రవ ఆర్యసంగమే
యదృచ్ఛయా చోపశృణోతి తే సకృత్ ।
కథం గుణజ్ఞో విరమేద్వినా పశుం
శ్రీర్యత్ప్రవవ్రే గుణసంగ్రహేచ్ఛయా ॥ 26

ఉత్తమకీర్తిగలదేవా! మహాత్ములసాహచర్యమున మంగళప్రదమగు నీకీర్తి నొక్కమారైన, ఏవిధముగనైన వినినమీదట పూర్తిగ పశువు కాకుండగ కొలదిగ సారమును గ్రహించు వాడయినచో దాని నెట్లు విడువగలడు? లక్ష్మీదేవిగూడ నిఖిలగుణసంగ్రహేచ్ఛతో నీకీర్తిశ్రవణమునె ప్రముఖముగ ఆశ్రయించినది.

అథాభజే త్వాఖిలపూరుషోత్తమం
గుణాలయం పద్మకరేవ లాలసః ।
అప్యావయోరేకపతిస్పృధోః కలి-
ర్న స్యాత్ కృతత్వచ్చరణైకతానయోః ॥ 27

అందువలన లక్ష్మీదేవివలె నేనుగూడ సముత్సుకుడనై నిన్ను సేవింతును. నీవు పురుషోత్తముడవు, సర్వగుణాకరుడవు. నాథా! లక్ష్మికి, నాకు ఏకైకపతి వగు నిన్నే మేము కోరుచున్నాము. ఉభయులము నీపాదారవిందములయం దేకాగ్రభావముతో మనస్సు నుంచుదుము. అందువలన మాయిరువురినడుమ వైర మేర్పడదు.

జగజ్జనన్యాం జగదీశ వైశసం
స్యాదేవ యత్కర్మణి నః సమీహితమ్ ।
కరోషి ఫల్గ్వప్యురు దీనవత్సలః
స్వ ఏవ ధిష్ణ్యేఽభిరతస్య కిం తయా ॥ 28

జగదీశా! జగజ్జనని యగులక్ష్మీదేవితో విరోధము తప్పక కలుగును. ఏలయన, నేనుగూడ జగజ్జననివలె నీసేవజేయ దలంచితిని. కాని నే నావిరోధమునకై వెనకడుగువేయను. ఏలయన, నీవు దీనవత్సలుడవు. అందువలన నీవు భక్తులుచేసిన తుచ్ఛమైనకామ్యమునుగూడ గొప్పగా జేయుదువు. నీవు పరమానందపదమునందే యుందువు. ఇక నీకు లక్ష్మీదేవితో నేమిపనియున్నది?

భజన్త్యథ త్వామత ఏవ సాధవో
వ్యుదస్తమాయాగుణవిభ్రమోదయమ్ ।
భవత్పదానుస్మరణాదృతే సతాం
నిమిత్తమన్యద్భగవన్ న విద్మహే ॥ 29

దేవా! దీనవత్సలుడ వనినిన్ను సాధువులు భజించుచుందురు. నీయందు మాయాగుణ విలాసమువలన గలిగినకార్య మేదియు లేదు. నీపాదపద్మసేవతప్ప సజ్జనులకు కావలసిన దిక యేమియున్నది?

మన్యే గిరం తే జగతాం విమోహినీం
వరం వృణీష్వేతి భజన్తమాత్థ యత్ ।
వాచా ను తన్త్యా యది తే జనోఽసితః
కథం పునః కర్మకరోతి మోహితః ॥ 30

"వరము నడుగు"మని నీవు పలికితివి, అది జగత్తును మోహపఱచునట్టిది. నాథా! మానవుడు నీవా క్యనుత్రాటిచే బంధింపబడక పోయినచో మోహవశుడై సకామకర్మ నేలచేయును?

త్వన్మాయయాద్ధా జన ఈశ ఖండితో
యదన్యదాశాస్త ఋతాత్మనోఽబుధః ।
యథా చరేద్బాలహితం పితా స్వయం
తథా త్వమేవార్హసి నః సమీహితుమ్ ॥ 31

దేవా! అజ్ఞు డగుమానవుడు నీమాయచే నిజముగ మోహితుడగును. ఏలయన, అతడు అద్వయతత్త్వమును సత్యస్వరూపుడ వగునీకంటె భిన్నముగజేసి దానిని కోరక తన భోగముకొరకై వేఱుగ లోకపుత్రాదులను వాంఛించును. కాని తండ్రి తనంతటతాను కుమారుని హితమునకై ప్రయత్నించునట్లు నీవుగూడ స్వయముగ మావంటి అజ్ఞవ్యక్తులక్షేమమునకై ప్రయత్నించుచుందువు.

## శ్రీమైత్రేయ ఉవాచ

ఇత్యాదిరాజేన నుతః స విశ్వదృక్
తమాహ రాజన్ మయి భక్తిరస్తు తే ।
దిష్ట్యేదృశీ ధీర్మయి తే కృతా యయా
మాయాం మదీయాం తరతి స్మ దుస్తరామ్ ॥ 32

మైత్రేయుడు పలికెను :- విదురా! విశ్వద్రష్టయగువిష్ణుభగవానుడు అదిరా జగుపృథువు చేసిన యీస్తుతిని విని యిట్లుపలికెను:- "రాజా! నాయందు నీకు భక్తి కలుగుగాక! పూర్వజన్మ సుకృతిఫలమువలననే నీవిట్టి బుద్ధిని పొందితివి. పండితు డీబుద్ధియోగముద్వారా సుదుస్తరమగు నామాయనుగూడ అతిక్రమించును.

తత్త్వం కురు మయాఽఽ దిష్ట మప్రమత్తః ప్రజాపతే ।
మదాదేశకరో లోకః సర్వత్రాప్నోతి శోభనమ్ ॥ 33

అందువలన పృథుమహారాజా! నాయాదేశమును నీవు శ్రద్ధగ పాలింపుము. నాయాజ్ఞ ననుసరించి మెలగువ్యక్తి అంతట శుభములను పొందును.

ఇతి వైన్యస్య రాజర్షేః ప్రతినన్ద్యార్థవద్వచః ।
పూజితోఽనుగృహీత్వైనం గన్తుం చక్రేఽచ్యుతో మతిమ్ ॥ 34

విదురా! శ్రీహరిభగవాను డిట్లురాజర్షి యగుపృథువుయొక్క సారవంతము లగువాక్కులను ఆదరించి, వానిపూజను గ్రహించి వెడలిపోదలంచెను.

దేవర్షి పితృగన్ధర్వ సిద్ధచారణపన్నగాః ।
కిన్నరాప్సరసో మర్త్యాః ఖగా భూతాన్యనేకశః ॥ 35

యజ్ఞేశ్వరధియా రాజ్ఞా వాగ్విత్తాంజలిభక్తితః ।
సభాజితా యయుః సర్వే వైకుంఠానుగతాస్తతః ॥ 36

పిమ్మట పృథుమహారాజు దేవర్షులను, పితరులను, గంధర్వులను, సిద్ధులను, చారణులను, పన్నగులను, కిన్నరులను, అప్సరసలను, మర్త్యులను, ఖగములను, ఇంకను నితరబహువిధప్రాణులను, విష్ణుపార్షదులను యజ్ఞేశ్వరుడగువిష్ణువుకంటె అభిన్ను లనిభావించి (అనగా వారిని స్వతంత్రముగ పూజింపక, వారిని సర్వేశ్వరు డగువిష్ణువుయొక్క ఆశ్రిత తత్త్వమగువిష్ణుసంబధవస్తుజ్ఞానముతో) వాక్కులతోను, ధనముతోను, భక్తితోను వారిని తగినవిధముగ పూజించెను. ఇట్లు పూజితులై వారందఱు తమతమ స్థానములకు వెడలిరి.

**భగవానపి రాజర్షేః సోపాధ్యాయస్య చాచ్యుతః ।**
**హరన్నివ మనోఽముష్య స్వధామ ప్రత్యపద్యత ॥ 37**

శ్రీహరిభగవానుడు ఋత్విక్కులతోపాటు రాజర్షి యగుపృథువు మనస్సును హరించి తనధామమునకు వెడలెను.

**అదృష్టాయ నమస్కృత్య నృపః సన్దర్శితాత్మనే ।**
**అవ్యక్తాయ చ దేవానాం దేవాయ స్వపురం యయౌ ॥ 38**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే పృథుచరితే పృథుస్తవో
నామ వింశో ఽధ్యాయః ॥

సర్వదేవతలలో పరమదేవత యగుశ్రీవాసుదేవుడు ప్రాకృతచక్షువులకు కనబడడు. కాని ఆయన సేవోన్ముఖు డగుపృథువు నేత్రములకు తనస్వరూపమును జూపెను. ఆ వాసుదేవుడు పృథువు నయనపథమునుండి వెడలగా పృథువు భగవానునకు ప్రణమిల్లి తననగరమునకు వెడలెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని ఇరువదియవ అధ్యాయము
సమాప్తము.



...ధ్వాచార్యసంప్రదాయము ననుసరించు శ్రీమద్భాగవతవ్యాఖ్యలలో క్రింద నీయబడిన రెండుశ్లోకము లధికపాఠరూపమున లభించుచున్నవి.

**తే సాధు వర్ణితం రాజన్నాశాస్సే న యదాశిషః ।**
**స్వర్గాపవర్గనరకాన్ సమం పశ్యతి మత్పరః ॥** 1

రాజా! నీవు చక్కగ పలికితివి; నీ వీ యైహికపురుషార్థములను కోరుటలేదు. కాని నాయందాసక్తుడవై స్వర్గమును, (నాసేవారహితమగు) మోక్షమును, నరకమును సమముగనే దర్శింతువు.

**ప్రీతో ఽహం తే మహారాజ రోషం దుస్త్యజమత్యజః ।**
**మదాదేశం శ్రద్దధానస్తన్మహ్యాం పరమార్హణమ్ ॥** 2

రాజా! నేను నీపట్ల సంతుష్టుడనైతిని. నీవు నావాక్కులయందు శ్రద్ధగలవాడవై విడువరాని క్రోధమును విడచిపెట్టితివి. ముఖ్యముగ నాయాదేశమును పాలించుటయె నాకు తగినపూజ యగును.





# ఇరువదియొకటవ అధ్యాయము

## పృథుమహారాజు తన ప్రజలకు ఉపదేశించుట

కథాసారము :- ఈయధ్యాయములో మహాయజ్ఞమున దేవతలమహాసభయందు పృథుమహారాజు ప్రజలకు జేసిన అనుశాసనము వర్ణితమైనది.

విదురు డడుగగా మైత్రేయుడు పృథుమహారాజు యొక్క ఇతరకార్యముల నన్నింటిని వివరించెను. పృథుమహారాజు జన్మజన్మాంతర భోగములకై యెట్టికర్మలను చేయలేదు. బ్రాహ్మణులను, విష్ణుభక్తులను ఎప్పుడును దండింపలేదు. అతడొక మహాయజ్ఞము నొనరించెను. ఆయజ్ఞమున దేవర్షులు, బ్రహ్మర్షులు, రాజర్షులు పాల్గొనిరి. పృథుమహారాజు ఆ సభలో అందరిని యుద్దేశించి విధాత తన్ను ప్రజలను శాసించుటకు, రక్షించుటకు, వర్ణాశ్రమధర్మస్థాపనాదికార్యములకు నియోగించినాడనియు, ఆవిషయమును, ప్రజలకు రాజు ధర్మోపదేశములను చేయవలసినయవసరమును ఉదహరించి ప్రజలు పరమపురుషు డగుభగవానుని సేవింపవలసినదనియు, వైష్ణవబ్రాహ్మణులను గౌరవింపవలసినదనియు బోధించెను. విష్ణువునందు, వైష్ణవబ్రాహ్మణులయందు పృథుమహారాజునకు గల భక్తికి సర్వులు సంతుష్టులై వానిని ప్రశంసించిరి. వైష్ణవపుత్రుడగు ప్రహ్లాదునిప్రభావముచే విష్ణుద్వేషి యగుహిరణ్యకశిపుడు నరకమున పడకుండగ రక్షింపబడెను. వైష్ణవపుత్రుడగు పృథువు ప్రభావముచే వేనుడుగూడ అట్టినరకమున బడకుండగ రక్షింపబడెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

**మౌక్తికైః కుసుమస్రగ్భిర్దుకూలైః స్వర్ణతోరణైః ।**
**మహాసురభిభిర్ధూపైర్మణ్డితం తత్ర తత్ర వై ॥ 1**

**చన్దనాగురుతోయార్ద్ర రథ్యాచత్వరమార్గవత్ ।**
**పుష్పాక్షతఫలైస్తోక్మైర్లాజైరర్చిభిరర్చితమ్ ॥ 2**

**సబృన్తైః కదలీస్తంభైః పూగపోతైః పరిష్కృతమ్ ।**
**తరుపల్లవమాలాభిః సర్వతః సమలంకృతమ్ ॥ 3**

మైత్రేయుడు పలికెను :- ఆరాజపురమునందలి ఆయాప్రదేశములు ముత్యములు, పుష్పమాలలు, దుకూలములు, స్వర్ణతోరణములు మున్నగు వానిచే శోభిల్లుచుండెను, సుగంధధూపములద్వారా సువాసితమగుచుండెను. మార్గములు, ప్రాంగణములు

చందనాగురుమిశ్రితజలములతో తడుపబడియుండెను; పుష్పములు, అక్షతలు, ఫలములు, యవాంకురములు, పేలాలు, ప్రదీపములు, పుష్పఫలయుక్తము లగుకదళీస్థంభములు, పోకమొక్కలు, తరుపల్లవములు మున్నగువానిచే సుశోభితమై యుండెను.

ప్రజాస్తం దీపవలిభిః సంభృతాశేషమంగలైః ।
అభీయుర్మృష్టకన్యాశ్చ మృష్టకుండలమండితాః ॥ 4

స్నానాదులచే పరిశుద్ధులు, సముజ్జ్వలమగుకుండలములచే శోభిల్లువారునగుకన్యకలు, ప్రజలు దీపమాలలతోను, దధిమున్నగుబహువిధములగు మాంగలికద్రవ్యములతోను పృథుమహారాజునకు స్వాగతమీయ వెడలిరి.

శంఖదుందుభిఘోషేణ బ్రహ్మఘోషేణ చర్త్విజామ్ ।
వివేశ భవనం వీరః స్తూయమానో గతస్మయః ॥ 5

మహాప్రతాపుడగుపృథుమహారాజు శంఖదుందుభిధ్వనులచేత, ఋత్విక్కుల వేదమంత్రములచేత ప్రశంసితు డయ్యును నిరభిమానియై తనగృహమునకు వెడలెను.

పూజితః పూజయామాస తత్ర తత్ర మహాయశాః ।
పౌరాన్ జానపదాంస్తాంస్తాన్ ప్రీతః ప్రియవరప్రదః ॥ 6

విపులకీర్తి యగు పృథుమహారాజు అచ్చటచ్చట పురవాసులచేత, జనపదావాసులచేత పూజితుడయి, సంతుష్టుడయి వారికభీష్టవరముల నిచ్చి వారిని మరల పూజించెను.

స ఏవమాదీన్యనవద్యచేష్టితః
కర్మాణి భూయాంసి మహాన్ మహత్తమః ।
కుర్వన్ శశాసావనిమండలం యశః
స్ఫీతం నిధాయారురుహే పరం పదమ్ ॥ 7

పవిత్రకర్ముడు, మహాపురుషశ్రేష్ఠుడు నగుపృథుమహారాజిట్లు యజ్ఞాదులగు బహువిధకర్మల నొనరించి భూమండలమును శాసించెను. చివరకు పృథివియందు విపులకీర్తిని నిలిపి విష్ణుభగవానుని పరమపదమునకు వెడలెను.

## శ్రీసూత ఉవాచ

తదాదిరాజస్య యశో విజృంభితమ్
గుణైరశేషైర్గుణవత్సభాజితమ్ ।
క్షత్తా మహాభాగవతః సదస్పతే
కౌషారవిం ప్రాహ గృణన్తమర్చయన్ ॥ 8

సూతుడు పలికెను :- శౌనకా! అనేకగుణవిలసితులు, గుణజ్ఞులు నగువ్యక్తులచే ప్రశంసింపబడిన పృథుమహారాజుయొక్క కీర్తిని మైత్రేయునివలన విని మహాభాగవతుడగు విదురు డాయనను అర్చించెను.

## శ్రీవిదుర ఉవాచ

సో ఽభిషిక్తః పృథుర్విప్రైర్లబ్ధాశేషసురార్హణః ।
బిభ్రత్స వైష్ణవం తేజో బాహ్వోర్యాభ్యాం దుదోహ గామ్ ॥ 9

విదురుడు పలికెను :- విప్రులచే అభిషిక్తుడగు ఆ పృథుమహారాజు దేవదతలకడ బహువిధసన్మానము లందెను. అతడు పృథివిని బాహువులతో పితికి విష్ణుతేజమును ధరించెను, ఆయన ఇంకను ఏయేపనుల నొనరించెను?

కో న్వస్య కీర్తిం న శృణోత్యభిజ్ఞో
యద్విక్రమోచ్ఛిష్టమశేషభూపాః ।
లోకాః సపాలా ఉపజీవన్తి కామ -
మద్యాపి తన్మే వద కర్మ శుద్ధమ్ ॥ 10

ఆపృథుచక్రవర్తియొక్క పరాక్రమోచ్ఛిష్టరూపములగు అభీష్టభోగములను పొంది ఇంద్రాదిలోకపాలురతోగూడ నిఖిలజనులు, భూపాలురు నేటికిని జీవించియే యుండిరి. అతనికీర్తిని గుణజ్ఞు డగు ఏవ్యక్తి వినుట కిష్టపడడు? నీవు నాకు ఆ మహారాజు పవిత్ర చరితమును వివరింపుము.

## శ్రీ మైత్రేయ ఉవాచ

గంగాయమునయోర్నద్యోరన్తరాక్షేత్రమావసన్ ।
ఆరబ్ధానేవ బుభుజే భోగాన్ పుణ్యజిహాసయా ॥ 11

మైత్రేయుడు పలికెను :- గంగాయమునా నదులనడుమ నున్న పవిత్రప్రదేశమున నివసించి పృథుమహారాజు ప్రాకృతజీవులవలె తన పుణ్యకర్మలు నశింపవలయు ననుతలంపుతో ప్రాక్తనకర్మలబ్ధభోగ్యవస్తువులను అనుభవింపసాగెను. (అనగా ఆయన ప్రారబ్ధ కర్మలను భగవదభిప్రేతములనిభావించి యిష్టము లేకపోయినను అవసరము ఉన్నంతవఱకే వానిని అనుభవింపసాగెను).

సర్వత్రాస్ఖలితాదేశః సప్తద్వీపైకదండధృక్ ।
అన్యత్ర బ్రాహ్మణకులాదన్యత్రాచ్యుతగోత్రతః ॥ 12

పృథుమహారాజు సప్తద్వీపవతి యగు పృథివియందు ఏకచ్ఛత్రాధిపత్యమును వహించియుండెను. ఆయన ఆజ్ఞ అంతట అప్రతిహతముగ వ్యాప్తమై యుండెను. కేవలము ఋషులపైన, బ్రాహ్మణులపైన, విష్ణుభక్తులపైన ఆయన యెట్టి యాధిపత్యమును చూపలేదు.

**ఏకదాఽఽసీన్మహాసత్రదీక్షా తత్ర దివౌకసామ్ ।**
**సమాజో బ్రహ్మర్షీణాం చ రాజర్షీణాం చ సత్తమ॥ 13**

సత్పురుషశ్రేష్ఠా! పురమున ఆయన యొకమహాయజ్ఞమున దీక్షవహించి యుండెను. ఆ యజ్ఞమున దేవతలు, బ్రహ్మర్షులు, రాజర్షులు సభజేసిరి.

**తస్మిన్నర్హత్సు సర్వేషు స్వర్చితేషు యథార్హతః ।**
**ఉత్థితః సదసో మధ్యే తారాణాముడురాడివ॥ 14**

ఆయజ్ఞమున పూజనీయు లగువ్యక్తులను తగువిధముగ పూజించెను. సభామధ్యమున రాజు తారకలచే పరివేష్టితుడయి యుండుచంద్రునివలె ఉండెను.

**ప్రాంశుః పీనాయతభుజో గౌరః కంజారుణేక్షణః ।**
**సునాసః సుముఖః సౌమ్యః పీనాంసః సుద్విజస్మితః ॥ 15**

ఆయన ఉన్నత మయినశరీరము, స్థూలములు దీర్ఘములు నగు బాహువులు, గౌరవర్ణము గలవాడు; ఎఱ్ఱనిపద్మములవంటి నేత్రములు సుందర మయిననాసిక, ప్రసన్నమగువదనము, ఉన్నతములైనస్కంధములు, చిరునవ్వుచే శోభిల్లు దంతపంక్తి గలవాడు.

**వ్యూఢవక్షా బృహచ్ఛ్రోణిర్వలివల్గుదలోదరః ।**
**ఆవర్తనాభిరోజస్వీ కాంచనోరురుదగ్రపాత్ ॥ 16**

ఆయన విపుల మగువక్షస్థలము, స్థూల మగుకటిప్రదేశము, త్రివళులచే శోభితము అశ్వత్థపత్రమువలె ఊర్ధ్వభాగమున విస్తృతము అధోభాగమున సంకుచితము నగుఉదరము గలవాడు. సుడివలె గంభీర మగునాభియు, తేజస్వి యగుశరీరము, బంగారమువలె ప్రకాశించు ఊరువులు, ఉన్నతము లయిన చరణాగ్రభాగములు గలవాడు.

**సూక్ష్మవక్రాసితస్నిగ్ధమూర్ధజః కంబుకన్ధరః ।**
**మహాధనే దుకులాగ్ర్యే పరిధాయోపవీయ చ ॥ 17**

ఆయన సూక్ష్మము, కుంచితము, కృష్ణవర్ణము, దట్టము నగు కేశకలాపము గలవాడు, శంఖమువంటి రేఖలతోగూడిన కంఠదేశము గలవాడు. బహుమూల్యమైన, పట్టుదైన ధోవతిని ఉత్తరీయమును ధరించినవాడు.

వ్యంజితాశేషగాత్రశ్రీర్నియమే న్యస్తభూషణః ।
కృష్ణాజినధరః శ్రీమాన్ కుశపాణిః కృతోచిత ః ॥ 18

పృథుమహారాజు దీక్షానియమముల ననుసరించి సర్వభూషణములను త్యజించెను. ఆయన ప్రకటితమైన ఆశేషావయవశోభ గలవాడు కృష్ణాజినము ధరించినవాడు, కాంతివంతుడు, దర్భహస్తుడు నిత్యకృత్యములను యథావిధిగ నొనరించినవాడు.

శిశిరస్నిగ్ధతారాక్షః సమైక్షత సమన్తతః ।
ఊచివానిదముర్వీశః సదః సంహర్షయన్నివ ॥ 19

ఆయన సంతాపహారకములు, స్నిగ్ధతారకయుక్తములు నగు నేత్రములద్వారా నలువైపులచూచి, సభను సంతోషపెట్టుచు నిట్లుపలికెను.

చారు చిత్రపదం శ్లక్ష్ణం మృష్టం గూఢమవిక్లబమ్ ।
సర్వేషాముపకారార్థం తదా అనువదన్నివ ॥ 20

శ్రవణమధురములు, మనోహరములు, విచిత్రపదవిశిష్టములు, ప్రశస్తములు, శుద్ధములు, గంభీరార్థయుక్తములు నగువాక్కులను తాను అనుభవించినట్లుగా సర్వోపకారార్థమై అవ్యాకులచిత్తముతో నిట్లుచెప్పసాగెను.

## శ్రీరాజోవాచ

సభ్యాః శృణుత భద్రం వః సాధవో య ఇహాగతాః ।
సత్సు జిజ్ఞాసుభిర్ధర్మమావేద్యం స్వమనీషితమ్ ॥ 21

పృథురాజు పలికెను:- సభ్యులారా! సమాగతు లగు సాధువులారా! మీరందఱు నావాక్కులు వినుడు, మీకు శుభములు కలుగును. ధర్మజిజ్ఞాసువు లగు వ్యక్తులకడ తమమనోభిలాషను వ్యక్తము చేయుట తగును. కనుకనే నేను మీకు నాయాలోచనను వ్యక్తము చేయుచున్నాను.

అహం దణ్డధరో రాజా ప్రజానామిహ యోజితః ।
రక్షితా వృత్తిదః స్వేషు సేతుషు స్థాపితా పృథక్ ॥ 22

పరమేశ్వరుడు నన్నీజగత్తులో ప్రజారక్షకునిగను, ధర్మసంరక్షకునిగను, జీవికాప్రదునిగను, వేఱువేఱువర్ణాశ్రమాది ధర్మమర్యాదాస్థాపకుని గను నియమించినాడు.

తస్య మే తదనుష్ఠానాద్యానాహుర్బ్రహ్మవాదినః ।
లోకాః స్యుః కామసందోహా యస్య తుష్యతి దిష్టదృక్ ॥ 23

సర్వధర్మసాక్షి యగుభగవానుడు ప్రసన్నుడైన యే పుణ్యలోకములు లభించు నని వేదజ్ఞులు చెప్పియున్నారో ప్రజారక్షణాదిస్వధర్మానుష్ఠానములవలన నాకును సర్వాభీష్టప్రదము లగు ఆలోకములు లభించును.

య ఉద్ధరేత్కరం రాజా ప్రజా ధర్మేష్వశిక్షయన్ ।
ప్రజానాం శమలం భుఙ్క్తే భగం చ స్వం జహాతి సః ॥ 24

ప్రజలకు తమతమధర్మములను బోధింపక వారినుండి పన్నులను మాత్రము గ్రహించురాజు ప్రజలపాపఫలమును అనుభవించును, వాని యైశ్వర్యమంతయు నశించును.

తత్ప్రజా భర్తృపిణ్డార్థం స్వార్థమేవానసూయతః ।
కురుతాధోక్షజధియస్తర్హి మేఽనుగ్రహః కృతః ॥ 25

అందువలన ఓప్రజలారా! మీ రసూయారహితులై అధోక్షజుని యందు మనస్సు నిలుపుడు. నేను మీకు ప్రభువును, పితరుల నుద్దేశించి చేయుపిండదానమువలె మీరు నాపారలౌకికసుఖార్థమయి స్వధర్మమున నుండుడు. దానివలన నాపై అనుగ్రహము చూపినవారగుదురు.

యూయం తదనుమోదధ్వం పితృదేవర్షయోఽమలాః ।
కర్తుః శాస్తురనుజ్ఞాతుస్తుల్యం యత్ప్రేత్య తత్ఫలమ్ ॥ 26

ఓపితృదేవతలారా! ఋషులారా! మీరు వివేకులరు. నామాటలనామోదించుడు. కర్త, ఉపదేష్ట, అనుమోదకుడు ముగ్గురు పరలోకమున సమానఫలమును పొందుదురు.

అస్తి యజ్ఞపతిర్నామ కేషాంచిదర్హసత్తమాః ।
ఇహాముత్ర చ లక్ష్యన్తే జ్యోత్స్నావత్యః క్వచిద్భువః ॥ 27

పూజ్యులారా! కొందఱిమతమున యజ్ఞపతి యనునొక పరమేశ్వరుడున్నాడు. అతడు లేకపోయినచో ఇహలోకపరలోకములయందు సముజ్జ్వల మగుభోగభూమి, భోగసాధన శరీరము సర్వము ఏల కనబడును ?

మనోరుత్తానపాదస్య ధ్రువస్యాపి మహీపతే : ।
ప్రియవ్రతస్య రాజర్షేరంగస్యాస్మత్పితుః పితుః ॥ 28

ఈదృశానామథాన్యేషామజస్య చ భవస్య చ ।
ప్రహ్లాదస్య బలేశ్చాపి కృత్యమస్తి గదాభృతా ॥ 29

దౌహిత్రాదీనృతే మృత్యోః శోచ్యాన్ ధర్మవిమోహితాన్ ।
వర్గస్వర్గాపవర్గాణాం ప్రాయేణై కాత్మ్యహేతునా ॥ 30

మృత్యుదౌహిత్రు లగువేనుడు మున్నగుధర్మవిమూఢులు, శోచనీయులు అగువ్యక్తులు గాక మనుచక్రవర్తి, ఉత్తానపాదుడు, ధ్రువుడు, రాజర్షి యగుప్రియవ్రతుడు, నాపితామహుడగు అంగరాజు, బ్రహ్మ,శివుడు, ప్రహ్లాదుడు, బలి ఇంకను ఇతరులగు మహాత్ముల దృష్టిలో భగవాను డున్నాడు. ఏలయన, ధర్మార్థకామము లనుత్రివర్గము, స్వర్గము, మోక్షము సర్వము ఆయనకృపాధీనమే .

యత్పాదసేవాభిరుచిస్తపస్వినా
మశేషజన్మోపచితం మలం ధియః ।
సద్యః క్షిణోత్యన్వహమేధతీ సతీ
యథా పదాంగుష్ఠవినిస్సృతా సరిత్ ॥ 31

వినిర్ధూతాశేషమనోమలః పుమా
నసఙ్గవిజ్ఞానవిశేషవీర్యవాన్ ।
యదఙ్ఘ్రిమూలే కృతకేతనః పున-
ర్న సంసృతిం క్లేశవహాం ప్రపద్యతే ॥ 32

తమేవ యూయం భజతాత్మవృత్తిభి -
ర్మనోవచః కాయగుణైః స్వ కర్మభిః ।
అమాయినః కామదుఘాఙ్ఘ్రి పఙ్కజం
యథాధికారావసితార్థసిద్ధయః ॥ 33

ఎవరిచరణసేవాభిరుచి విష్ణుపాదాంగుష్ఠవినిస్సృత మగుగంగవలె వృద్ధిపొంది ప్రతిదినము సంసారతాపదగ్ధు లగుజీవులజన్మజాన్మాంతరసంచిత బుద్ధిమలమును వెంటనే నాశముచేయునో, ఎవరాభగవానునిచరణములనాశ్రయింతురో, ఎవరియశేషమనోమలము క్షాళిత మయినదో ఆ పురుషులు వైరాగ్యసహిత మగుభక్తియోగముద్వారా విజ్ఞానమును

పొంది మరల క్లేశావహ మగుసంసారగతిని పొందరు. అందువలన ప్రజలారా! మీరు సిద్ధిని పొందువిషయమున దృఢనిశ్చయులై అధికారము ననుసరించి నిష్కపటముగ మీమీయధ్యాపనాదిస్వధర్మములద్వారా, మనోవాక్కాయములద్వారా, స్వకర్మాదులద్వారా సర్వాభీష్టప్రదు డగు ఆభగవానునిపాదపద్మములను సేవింపుడు.

ఉ॥ *భూరితపోభిరామ మునిపూజన మెవ్వనిపాదపద్మసే*
*వారతి వృద్ధిఁ బొంది యనివారణఁ బూర్వభవానుసారసం*
*సారమహోగ్రతాపము భృశంబుగఁబాపఁగ నోపుఁదత్పదాం*
*భోరుహజాతదేవనదిఁబోలి యశేషమనోఘహారి యై.* (4-576)

అసావిహానేకగుణోఽ గుణోఽ ధ్వరః
పృథగ్విధద్రవ్యగుణక్రియోక్తిభిః ।
సంపద్యతేఽర్థాశయలింగనామభి -
ర్విశుద్ధవిజ్ఞానఘనః స్వరూపతః ॥ 34

ఆభగవానుడు సహజముగ శుద్ధసత్త్వమయుడు, సచ్చిదానందస్వరూపుడు. ఆయన ప్రాకృతగుణరహితుడై వివిధము లగుద్రవ్యములు, గుణములు, కర్మలు, మంత్రములు, అర్థములు, సంకల్పములు, ద్రవ్యశక్తులు, నామములు అనువిభిన్నసంజ్ఞలద్వారా కర్మమార్గమున యజ్ఞరూపముతో వెల్లడియగును.

ప్రధానకాలాశయధర్మసంగ్రహే
శరీర ఏష ప్రతిపద్య చేతనామ్ ।
క్రియాఫలత్వేన విభుర్విభావ్యతే
యథానలో దారుషు తద్గుణాత్మకః ॥ 35

అగ్ని కాష్ఠగతమై కాష్ఠమునందలిగుణములను అనగా దీర్ఘత్వ వక్రత్వాదులను పొందునట్లు భగవానుడుకూడ అవ్యక్తమగు ప్రకృతి, తత్క్షోభక మగుకాలము, వాసన, అదృష్టము అనువానితో గలసి పుట్టిన శరీరములయందు కర్మార్పణరూప మగుబుద్ధిని ప్రేరేపించి వారికర్మఫలానుసారముగ తాను ప్రకాశించును.

అహో మమామీ వితరన్త్యనుగ్రహం
హరిం గురుం యజ్ఞభుజామధీశ్వరమ్ ।
స్వధర్మయోగేన యజన్తి మామకా
నిరన్తరం క్షోణితలే దృఢవ్రతాః ॥ 36

ఈ భూమండలమునందలి యే నా ప్రజలు దృఢవ్రతులై యజ్ఞ భుక్కు లగు దేవతల కధీశ్వరుడు, జగద్గురువు నగు శ్రీహరిని ఆరాధింతురో వారే నాపై అనుగ్రహమును చూపుదురు.

మా జాతు తేజః ప్రభవేన్మహర్ద్ధిభి-
స్తితిక్షయా తపసా విద్యయా చ ।
దేదీప్యమానే ఽజితదేవతానాం
కులే స్వయం రాజకులాద్ద్విజానామ్ ॥ 27

సహనశీలత, తపస్సు, జ్ఞానము అను ఈవిశిష్టవిభూతులు గల బ్రాహ్మణ వంశముల మీద, విష్ణుభగవానుడే దేవతగా గలవైష్ణవులమీద మహాసమృద్ధిశాలు రగు రాజులు తమ తేజస్సు నెప్పుడును చూపరాదు.

*మ॥ వరసంపద్విభవ ప్రతాపసుమహైశ్వర్యంబులం బొల్చు నీ*
*ధరణీనాథుల తేజ మంచితతపో దాంతిక్షమావిద్యలం*
*గర మొప్పారు ధరాసుపర్వహరిభక్తశ్రేణులం దెప్పుడున్*
*ధరలోనం బ్రభవింప కుండు నని యద్ధాత్రీవిభుం డిట్లనున్* (4-585)

బ్రహ్మణ్యదేవః పురుషః పురాతనో
నిత్యం హరిర్యచ్చరణాభివన్దనాత్ ।
అవాప లక్ష్మీమనపాయినీం యశో
జగత్పవిత్రం చ మహత్తమాగ్రణీః ॥ 38

యత్సేవయాశేషగుహాశయః స్వరాడ్
విప్రప్రియస్తుష్యతి కామమీశ్వరః ।
త దేవ తద్ధర్మపరైర్వినీతైః
సర్వాత్మనా బ్రహ్మకులం నిషేవ్యతామ్ ॥ 39

మహాత్ములలో అగ్రగణ్యుడు, బ్రహ్మణ్యదేవుడు, పురాణపురుషుడు నగు శ్రీహరియు ఎల్లప్పుడు బ్రాహ్మణులచరణములకు నమస్కరించి స్థిర మగు లక్ష్మిని, భువనపావన మగుయశస్సును పొందినాడు. ఆబ్రాహ్మణులను సేవించి సర్వాంతర్యామియు, విప్రప్రియుడు, స్వప్రకాశుడు నగు భగవానుడుగూడ సంతుష్టుడగును. మీరు భగవద్ధర్మ పరాయణులై సర్వాంతఃకరణముతోను, వినీతభావముతోను ఆత్మవేత్త లగు ఆ బ్రాహ్మణులను సేవింపుడు.

*చ॥ అరయఁగ నేధరామరపదాంబుజరేణువు లర్థిఁదాల్చి య*
*ప్పరమపురాణపూరుషుఁడు బ్రాహ్మణ దేవుఁడు నైనయట్టియీ*
*శ్వరుఁడు సదానపాయినిని సాగరకన్యను సర్వలోకవి*
*స్ఫురితపవిత్రకీర్తియును బొంది విభూతిఁ దనర్చెఁగావునన్.* (4-586)

పుమాంల్లభేతానతివేలమాత్మనః
ప్రసీదతోఽత్యన్తశమం స్వతః స్వయమ్ ।
యన్నిత్యసంబన్ధనిషేవయా తతః
పరం కిమత్రాస్తి ముఖం హవిర్భుజామ్ ॥ 40

ఆత్మవేత్త లగు బ్రాహ్మణులను నిత్యసేవాజ్ఞానముతో సేవించినచో చిత్తము స్వయముగ శీఘ్రముగనె పరిశుద్ధ మగును. జ్ఞానాదుల అభ్యాసము లేకయె ముక్తి గలుగును. ఈ లోకమున హవిర్భుక్కులగు దేవతలకు బ్రాహ్మణులుకాక ముఖస్వరూపులైన వారెవరున్నారు?

అశ్నాత్యనన్తః ఖలు తత్త్వకోవిదైః
శ్రద్ధాహుతం యన్ముఖ ఇజ్యనామభిః ।
న వై తథా చేతనయా బహిష్కృతే
హుతాశనే పారమహంస్యపర్యగుః ॥ 41

భగవానుడగు అనంతుడు సర్వాంతర్యామి, చిద్ఘనవిగ్రహుడు. యజ్ఞవేత్తలు ఇంద్రాదుల నామముల నుచ్చరించి శ్రద్ధతో బ్రాహ్మణుల ముఖములయందు యజ్ఞద్రవ్యమును హోమము చేసినచో దానిని ఆయన (భగవానుడు) తృప్తిగ భుజించును, అచేతన మగు అగ్నియందు హోమము చేసినదానిని భుజింపడు.

యద్బ్రహ్మ నిత్యం విరజం సనాతనం
శ్రద్ధా తపో మంగలమౌనసంయమైః ।
సమాధినా బిభ్రతి హార్థదృష్టయే
యత్రేదమాదర్శ ఇవావభాసతే ॥ 42

తేషామహం పాదసరోజరేణు
మార్యా వహేయాధికిరీటమాయుః ।
యం నిత్యదా బిభ్రత ఆశు పాపం
నశ్యత్యముం సర్వగుణా భజన్తి ॥ 43

ఏ వేదములయందు ఈ విశ్వము దర్పణగత మగు ప్రతిబింబమువలె ప్రకాశమును పొందుచున్నదో ఆవేదములయొక్క తాత్పర్యమును తెలిసి కొనుటకై బ్రాహ్మణులు శ్రద్ధ (దృఢవిశ్వాసము), తపస్సు, మంగళమయమగు ఆచరణము, మౌనము, ఇంద్రియ సంయమనము, సమాధి యను వానిద్వారా నిత్యము చర్చించుచుందురు. ఆర్యులారా! నే నట్టి ఆత్మ వేత్తలగు బ్రాహ్మణుల పాదరేణువులను జీవితపర్యంతము నా ముకుటముపై వహించుచుందును. ఎవరీచరణధూళిని నిత్యము శిరమున ధరింతురో వారి పాపరాశి శీఘ్రముగనె తొలగును. సమస్తసద్గుణములు వారి నాశ్రయించును.

గుణాయనం శీలధనం కృతజ్ఞం
వృద్ధాశ్రయం సంవృణతేఽను సంపదః ।
ప్రసీదతాం బ్రహ్మకులం గవాం చ
జనార్దనః సానుచరశ్చ మహ్యామ్ ॥ 44

ధర్మార్థకామమోక్షాదిసంపద లన్నియు సర్వగుణాధారుడు, సచ్చరిత్రుడు, కృతజ్ఞుడు, జ్ఞానవృద్ధుడు నగు గురువు నాశ్రయించు మానవుని సమ్యగ్భావముతో సేవించును. అందువలన బ్రాహ్మణులు, గోవులు, అనుచరులతో గూడ భగవానుడు నాకు ప్రసన్ను లగుదురుగాక!

## శ్రీమైత్రేయ ఉవాచ

ఇతి బ్రువాణం నృపతిం పితృదేవద్విజాతయః ।
తుష్టువుర్హృష్టమనసః సాధువాదేన సాధవః ॥ 45

మైత్రేయుడు పలికెను :- విదురా! పృథుమహారాజు పలికిన మాటలు విని పితరులు, దేవతలు, సాధువులు, బ్రాహ్మణులు సర్వులు సంతుష్టిచెందిరి. సంతుష్టచిత్తముతో సాధు వాదముల ద్వారా వారు పృథువును ప్రశంసింపసాగిరి.

పుత్రేణ జయతే లోకానితి సత్యవతీశ్రుతిః ।
బ్రహ్మదండహతః పాపో యద్వేనో ఽత్యతరత్తమః ॥ 46

పుత్రునిద్వారా తండ్రి యుత్తమలోకములను పొందునని పలుకుశ్రుతి సత్యమైనదే. కనుకనే బ్రహ్మదండముచే శిక్షితుడు, పాపియునగు వేనుడు పుత్రునిద్వారా నరకమునుండి విముక్తుడయ్యెను.

హిరణ్యకశిపుశ్చాపి భగవన్నిన్దయా తమః ।
వివిక్షురత్యగాత్సూనోః ప్రహ్లాదస్యానుభావతః ॥ 47

ఇట్లే హిరణ్యకశిపుడుగూడ భగవానుని నిందించి నరకమున ప్రవేశించుచుండెను. కాని పుత్రుడగు ప్రహ్లాదుని ప్రభావమువలన నరకమును దాటగల్గెను.

చ॥ *పురుషవరేణ్య హేమకశిపుండు రమాలలనేశునిందచే*
*నరకము నొందఁ గోరియు గుణజ్ఞుఁడు భాగవతుండు నైనయా*
*వరతనయప్రభావమున వాసికి నెక్కి విధూతపాపుఁడై*
*నిరయముఁ పొందఁడయ్యె నతినిర్మలకీర్తిఁదనర్చెఁగావునన్* (4-595)

వీరవర్య పితః పృథ్వ్యాః సమాః సంజీవ శాశ్వతీః ।
యస్యేదృశ్యచ్యుతే భక్తిః సర్వలోకైకభర్తరి॥ 48

వీరశ్రేష్ఠా! పృథివీపతీ! సర్వలోకైకనాథుడగు అచ్యుతునియందు నీ కిట్టి భక్తియుండుట చూచి నేను మిగుల సంతుష్టుడ నైతిని. నీవు చిరంజీవివి అగుదువుగాక.

అహో వయం హ్యద్య పవిత్రకీర్తే
త్వయైవ నాథేన ముకున్దనాథాః ।
య ఉత్తమశ్లోకతమస్య విష్ణో
ర్బ్రహ్మణ్య దేవస్య కథాం వ్యనక్తి ॥ 49

పవిత్రమైన కీర్తిగలవాడా! నీవే మాకు నాథుడవు. కాని నేడు మేము నీవలననే ముకుందుని స్వామిరూపమున పొందితిమి. కనుకనే నీవు ఉత్తమశ్లోకుడు, బ్రహ్మణ్యదేవుడు నగు విష్ణుభగవానుని కీర్తిని వెల్లడి చేసితివిగదా!

నాత్యద్భుతమిదం నాథ తవాజీవ్యానుశాసనమ్ ।
ప్రజానురాగో మహతాం ప్రకృతిః కరుణాత్మనామ్ ॥ 50

దేవా! ఈ సేవకులకు నీవు చేసినయుపదేశమత్యాశ్చర్యకరమైనది కాదు; ప్రజారంజనమె పరదుఃఖ దుఃఖితులగు మహాత్ముల స్వభావముగదా!

అద్య నస్తమసః పారస్త్వయోపాసాదితః ప్రభో ।
భ్రామ్యతాం నష్టదృష్టీనాం కర్మభిర్దైవసంజ్ఞితైః ॥ 51

ప్రభూ! మేము జ్ఞానరహితులమై ప్రారబ్దకర్మ ననుసరించి నానాయోనులయందు సంచరించుచుంటిమి. మాజ్ఞానము విలుప్తమైనది. నేడు నీవట్టి మాయజ్ఞానాంధ కారమును తొలగించితివి.

నమో విశుద్ధసత్త్వాయ పురుషాయ మహీయసే ।
యో బ్రహ్మక్షత్రమావిశ్య బిభర్తీదం స్వతేజసా ॥ 52

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే పృథుచరితే ప్రజావాక్యం
నామ ఏక వింశోఽధ్యాయః ॥

బ్రాహ్మణుల హృదయములయందు అధిష్ఠితుడై క్షత్రియులను, క్షత్రియుల హృదయముల యందుండి బ్రాహ్మణులను, బ్రాహ్మణ క్షత్రియులిరువురిలో ఒకేమారు విరాజితుడైయుండి తనతేజస్సుతో నీ విశ్వమును పాలించుచున్నవాడు, విశుద్ధసత్త్వరూపుడు, పురుషోత్తముడు నగు శ్రీహరికి మేము నమస్కరించుచున్నాము.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని ఇరువదియొకటవ అధ్యాయము
సమాప్తము.





# ఇరువదిరెండవ అధ్యాయము

## పృథుమహారాజునకు సనకాదులు ఉపదేశించుట

కథాసారము :- ఈయధ్యాయమున భగవదాదేశము ననుసరించి సనత్కుమారులు పృథుమహారాజునకు చేసినజ్ఞానోపదేశము వర్ణితమైనది.

భగవదాదేశము ననుసరించి సనత్కుమారాదిఋషులు పృథుమహారాజుసభలోనికి వచ్చిరి. ఆరాజు వారిని యథావిధిగ పూజించి జీవులకు శ్రేయస్సు గలుగుఉపాయముల నడుగగా సనత్కుమారుడిట్లుపలికెను :- "విషయులసాంగత్యమును విడచి ముకుంద చరితామృతము నాస్వాదించుట, ఆత్మేంద్రియప్రీతివాంఛకు మూల మైనకపట నిర్జనభజన ప్రయత్నమును త్యాగముచేయుట, హరిగుణములను గానముచేయుట, ధర్మాంతరములను నిందింపకుండుట, సహిష్ణుత మున్నగువానిద్వారా పరబ్రహ్మమున నైష్ఠికభక్తి యుద్భవించును. దేహాదులయందు అహంకారమమకారబుద్ధి తొలగును. అప్పుడు జీవుడంతట భగవద్దర్శనమునుగాక తదితరమైనదానిని దేనినిగూడ దర్శింపడు. ఇదియే జీవుని చరమశ్రేయస్సు. విషయములను గూర్చియే ఆలోచించు వారిస్మృతి భ్రంశమగును, క్రమముగ జ్ఞానాదులు లుప్తములగును. పండితులు దానినె ఆత్మవినాశమందురు. ఇంతకంటె జీవునకు గురుతర మగునష్టము మఱి యొకటిలేదు. ధర్మార్థకామాదిత్రివర్గమునం దాసక్తియె అనర్థములకు మూలము. భగవద్గుణములను స్మరించుట మున్నగు వానిద్వారా భగవద్భక్తులు అనాయాసముగ కర్మగ్రంథులను ఛేదనమొనరింతురు. అట్లు ఇతరులు చేయజాలరు. నలుగురు ఋషులుపదేశించిన పరమాత్మజ్ఞానమును పొంది పృథుమహారాజు వారిని స్తుతింపసాగెను. పిమ్మట అతడు ఋషుల యుపదేశముల ననుసరించి భగవానునియందు కర్మల నర్పించి అనాసక్తభావముతో రాజకార్యముల నిర్వహింపసాగెను.

### శ్రీమైత్రేయ ఉవాచ

**జనేషు ప్రగృణత్స్వేవం పృథుం పృథులవిక్రమమ్ ।**
**తత్రోపజగ్ముర్మునయశ్చత్వారః సూర్యవర్చసః ॥ 1**

మైత్రేయుడు పలికెను:- ప్రజలందఱు ప్రబలపరాక్రమవంతుడగు పృథువుతో నిట్లుపలికిరి. ఇట్టిసమయమున అచటికి సూర్యునివంటి తేజస్సుగలవారగు నల్గురుమునులు (సకాదులు) వచ్చిరి.

తాంస్తు సిద్ధేశ్వరాన్ రాజా వ్యోమ్నోఽ వతరతోఽర్చిషా ।
లోకానపాపాన్ కుర్వాణాన్ సానుగోఽ చష్ట లక్షితాన్ ॥ 2

సిద్ధేశ్వరులగు సనకాదులు జనులను పవిత్రులుగాజేయుచు అంతరిక్షమునుండి అవతరించుచుండిరి. అపుడు తమతేజస్సుచే వారు సనకాదులుగా వెల్లడియైరి. అనుచరులతోగూడ పృథుమహారాజు వారిని దర్శింపసాగెను.

తద్దర్శనోద్గతాన్ ప్రాణాన్ ప్రత్యాదిత్సురివోత్థితః ।
సదసస్యానుగో వైన్య ఇంద్రియేశో గుణానివ ॥ 3

జీవుని చిత్తము రూపరసగంధాదులవైపు సహజముగనే పరుగిడునట్లు ఋషుల దర్శనమాత్రముచేతనె పృథుమహారాజు ప్రాణములు వారివెంట పరుగిడినవి. ఆయన అమాత్యులతోను, సదస్యులతోను గలసి ఆ సనకాదులను దర్శించుటకై వెంటనే లేచి నిలుచుండిరి.

గౌరవాద్యన్త్రితః సద్యః ప్రశ్రయానతకన్ధరః ।
విధివత్పూజయాంచక్రే గృహీతాద్యర్హణాసనాన్ ॥ 4

ఋషుల గురుత్వమునకు వశుడై పృథువు వినయావనత మగు మస్తకముతో వారికి తత్క్షణమే అర్ఘ్యమును ఆసనమును ఇచ్చి యథావిధిగ పూజించెను.

తత్పాదశౌచసలిలైర్మార్జితాలకబన్ధనః ।
తత్ర శీలవతాం వృత్తమాచరన్మానయన్నివ ॥ 5

పృథువట్లు వారి పాదప్రక్షాళనజలముతో తన కేశబంధనమును క్షాళనముచేసికొనెను. సాధువుల నడవడిని ఆదరించుచున్నవానివలె ఆయన గూడ అట్లే ఆచరించెను.

హాటకాసన ఆసీనాన్ స్వధిష్ణ్యేష్వివ పావకాన్ ।
శ్రద్ధాసంయమసంయుక్తః ప్రీతః ప్రాహ భవాగ్రజాన్ ॥ 6

ఆనల్పురుఋషులు తమతమ స్వర్ణసింహాసనములయం దగ్నివలె ఉపవిష్టులైరి. అపుడు పృథుమహారాజు మహాదేవునకు అగ్రజులగు ఋషులపట్ల శ్రద్ధాసంయమములతో ప్రేమను జూపి యిట్లు పలుకసాగెను.

## శ్రీపృథురువాచ

అహో ఆచరితం కిం మే మఙ్గలం మఙ్గలాయనాః ।
యస్య వో దర్శనం హ్యాసీద్దుర్దర్శనాం చ యోగిభిః ॥ 7

పృథువు పలికెను:- మంగళములకు నిలయులగు ఋషులారా! నే నెంతయో పుణ్యకర్మ నొనరించితిని, కనుకనే యోగులకుగూడ దుర్లభమగు మీదర్శనము నాకు లభించినది.

కిం తస్య దుర్లభతరమిహలోకే పరత్ర చ।
యస్య విప్రాః ప్రసీదన్తి శివో విష్ణుశ్చ సానుగః ॥ 8

ఏ పురుషునకు బ్రాహ్మణులు ప్రసన్నులగుదురో వానికి అనుచరులతోపాటు శివవిష్ణువులుగూడ ప్రసన్నులగుదురు. ఇహపరలోకముల యందు వానికి పొందదగనిది యేమియుండును?

*కం. భువి నెవ్వనియెడ విప్రులు*
*భవుఁడును విష్ణుఁడుఁ దదీయభక్తులును బ్రస*
*న్నవదనులగుదురు వానికి*
*భువి దివిని నసాధ్యకర్మములు లే వరయన్.* (4-606)

నైవ లక్షయతే లోకో లోకాన్ పర్యటతోఽపి యాన్ ।
యథా సర్వదృశం సర్వ ఆత్మానం యేఽ స్యహేతవః ॥ 9

మన్వాదిఋషులుగూడ ఈవిశ్వమునకు గారణభూతుడు, సర్వజ్ఞుడు అగు పరమాత్మను తెలిసికొనజాలనట్లు అంతటపర్యటించుచున్నను మిమ్ము జనులు తెలిసికొనజాలరు.

అధనా అపి తే ధన్యాః సాధవో గృహమేధినః ।
యద్గృహా హ్యర్హవర్యాంబుతృణభూమీశ్వరావరాః ॥ 10

ఎవరిగృహములలో మీవంటి పూజ్యతములగు సాధువుల సేవకు యోగ్యము లగు జలము, తృణము, భూమి, యజమాని, భృత్యాదిసేవాసంభారములు నుండునో వారే ప్రకృతమున గృహస్థులు. నిర్ధను లయ్యును వారు ధన్యులే.

*చ. అరయ ధరిత్రి నెవ్వనిగృహంబు మహార్హజనోపయోగ్యవి*
*స్ఫురితతృణాంబుభృత్యగృహభూముల సొరెఁదనర్చు నట్టిమం*
*దిరపతి పేద యైన జగతిం గడు ధన్యుఁడటండ్రు గాక సు*
*స్థిరమతి మీరు వచ్చుట నశేషశుభంబుల నేను బొందెదన్.* (4-608)

వ్యాలాలయద్రుమా వై తేఽప్యరిక్తాఖిలసంపదః ।
యద్గృహాస్తీర్థపాదీయపాదతీర్థవివర్జితాః ॥ 11

తీర్థపాదు లగు మహాభాగవతుల పాదోదకముచే వర్జితములగు గృహములు సర్వసంపదలచే పరిపూర్ణము లయ్యును సర్పములకు నివాసస్థానము లగు వృక్షములవలె మృత్యుభయప్రదము లగును.

చ. *వరమతులార యెవ్వనినివాసముఁదీర్థపదాంతరంగు లై*
*పరఁగినయట్టి భాగవతపాదజలంబులు సోకవేనిఁద*
*త్పురుషుఁడు భూరిసంపదలఁ బొంపిరిపోయిన నైన వానిమం*
*దిర మురగప్రకీర్ణ జగతీజముఁ బోలు నటండ్రు కోవిదుల్.* (4-610)

స్వాగతం వో ద్విజశ్రేష్ఠా యద్వ్రతాని ముముక్షవః ।
చరన్తి శ్రద్ధయా ధీరా బాలా ఏవ బృహన్తి వై ॥ 12

ద్విజశ్రేష్ఠులారా! మీకు స్వాగతము, ముముక్షువు లాచరించువ్రతములను మీరు బాల్యకాలమందే ధైర్యపూర్వకముగ అనుష్ఠించితిరి.

కచ్చిన్నః కుశలం నాథా ఇంద్రియార్థార్థవేదినామ్ ।
వ్యసనావాప ఏతస్మిన్ పతితానాం స్వకర్మభిః ॥ 13

స్వాములారా! ఇంద్రియార్థములనె మేము పురుషార్థము లని భావించితిమి. ఈ సంసారము నానావిధములగు క్లేశములకు నివాసస్థలము. మేము మాకర్మవశమున ఆ సంసారమున బడితిమి. మాకెప్పుడైన శుభము కలుగుట కవకాశ మున్నదా?

భవత్సు కుశలప్రశ్న ఆత్మారామేషు నేష్యతే ।
కుశలాకుశలా యత్ర న సన్తి మతివృత్తయః ॥ 14

ఆత్మారాములగు మిమ్ము కుశల మడుగుట యుచితముకాదు. శుభాశుభముల యందు భేదబుద్ధి మీకు లేదుగదా!

తదహం కృతవిశ్రంభః సుహృదో వస్తపస్వినామ్ ।
సంపృచ్ఛే భవ ఏతస్మిన్ క్షేమః కేనాఞ్జసా భవేత్ ॥ 15

సంసారసంతప్తులగు వ్యక్తులకు మీరే బంధువులని నావిశ్వాసము. అందువలన ఈసంసారమున అనాయాసముగ శుభ మెట్లు కలుగునని నేను మిమ్ము ప్రశ్నించుచున్నాను.

వ్యక్తమాత్మవతామాత్మా భగవానాత్మభావనః ।
స్వానామనుగ్రహాయేమాం సిద్ధరూపీ చరత్యజః ॥ 16

ప్రాకృతజన్మరహితుడు, స్వప్రకాశుడు నగు భగవానుడు ఆత్మజ్ఞులగు పురుషుల ఆత్మలయందు స్వస్వరూపమును ప్రకాశింపజేయును, తన భక్తులపై అనుగ్రహము జూపుటకే జగత్తులో సిద్ధరూపముతో సంచరించును. ఈ విషయము నిశ్చితమైనదే.

## శ్రీమైత్రేయ ఉవాచ

పృథోస్తత్సూక్తమాకర్ణ్య సారం సుష్ఠు మితం మధు ।
స్మయమాన ఇవ ప్రీత్యా కుమారః ప్రత్యువాచ హ ॥ 17

మైత్రేయుడు పలికెను :- బ్రహ్మర్షి యగు సనత్కుమారుడు పృథుమహారాజు పలికిన న్యాయసంగతములు, గంభీరార్థయుక్తములు, అల్పాక్షరములు, శ్రవణాభిరామములు నగు వాక్కులను విని మందహాసము చేయుచు ప్రేమతో నిట్లు పలికెను.

## శ్రీ సనత్కుమార ఉవాచ

సాదు పృష్టం మహారాజ సర్వభూతహితాత్మనా ।
భవతా విదుషా చాపి సాధూనాం మతిరీదృశీ ॥ 18

సనత్కుమారుడు పలికెను:- మహారాజా! నీవు సర్వభూతముల హితమును గోరువాడవు, విద్వాంసుడవు. నీవడిగినది ఉత్త మమైనదే. నీ వంటి సత్పురుషుల కిట్టి బుద్ధి యుండుట ఉచితమే.

సంగమః ఖలు సాధూనాముభయేషాం చ సమ్మతః ।
యత్సంభాషణసంప్రశ్నః సర్వేషాం వితనోతి శమ్ ॥ 19

సత్పురుషులసాంగత్యము శ్రోతకు వక్తకు ఇరువురకు అభిలషణీయమైనదే. వారితోడిసల్లాపము, పరిప్రశ్నము అందఱకు శుభమును గలుగజేయును.

*తే॥ ధరణి సజ్జనసంగంబు దలఁప నుభయ*
*సమ్మతం బగువారలు సలుపునట్టి*
*సరససంభాషణప్రశ్నసరణి నిఖిల*
*జనములకు సుఖకర మగు జనవరేణ్య.* (4-615)

అస్త్యేవ రాజన్ భవతో మధుద్విషః
పాదారవిన్దస్య గుణానువాదనే ।
రతిర్దురాపా విధునోతి నైష్ఠికీ
కామం కషాయం మలమన్తరాత్మనః ॥ 20

రాజా! మధురిపు డగు శ్రీహరియొక్క పాదపద్మగుణానుకీర్తనమునందు నీకు సుదుర్లభము, నిశ్చలము నగు మతి ఉన్నది. ఇట్టి మతివలన అంతరాత్మయందలి విషయవాసనారూపమలము క్షాళితమగును.

శాస్త్రేష్వియానేవ సునిశ్చితో నృణాం
క్షేమస్య సధ్ర్యగ్విమృశేషు హేతుః ।
అసంగ ఆత్మవ్యతిరిక్త ఆత్మని
దృఢా రతిర్బ్రహ్మణి నిర్గుణే చ యా ॥ 21

ఆత్మకంటె భిన్న మగుదేహాద్యనాత్మవస్తువునందు ఆసక్తి లేకుండుట, నిర్గుణబ్రహ్మ స్వరూప మగు ఆత్మయందు దృఢ మగు ఆసక్తి యుండుట అనునది జీవుని మోక్షమునకు గారణ మని శాస్త్రములు చక్కగ చర్చించి నిరూపించినవి.

సా శ్రద్ధయా భగవద్ధర్మచర్యయా
జిజ్ఞాసయాధ్యాత్మికయోగనిష్ఠయా ।
యోగేశ్వరోపాసనయా చ నిత్యం
పుణ్యశ్రవః కథయా పుణ్యయా చ ॥ 22

శ్రద్ధచేత, భగవద్ధర్మానుశీలనముచేత, తత్త్వజిజ్ఞాసచేత, భగవత్సేవా నిష్ఠచేత, భక్తశ్రేష్ఠుల పూజచేత, పుణ్యకీర్తి యగు భగవానుని కథా శ్రవణాదులచేత అట్టి భగవదాసక్తి కలుగును.

అర్థేన్ద్రియారామసగోష్ఠ్యతృష్ణయా
తత్సమ్మతానామపరిగ్రహేణ చ ।
వివిక్తరుచ్యా పరితోష ఆత్మని
వినా హరేర్గుణపీయూషపానాత్ ॥ 23

ధనరూపములయందు ఇంద్రియభోగములయందు ఆసక్తులగు అసద్వ్యక్తుల గోష్ఠులయందు తృష్ణ లేకపోవుట, వారికి ప్రియము లగు నర్థకామాదులను పరిత్యజించుట, ఏకాంతమునం దభిరుచికలుగుట అనువానిద్వారా ఆత్మకు సంతోషము కలుగును, కాని

ఏ ప్రదేశమున సత్పురుషుల ముఖమునుండి వినిర్గత మగు హరికథామృతమును పానముచేయుట కవకాశముండదో అట్టి నిర్జనప్రదేశమునందు నివసింపవలయునని యెప్పుడును దలంపరాదు. దానివలన ఆత్మేంద్రియములకు తృప్తికలిగినను కృష్ణునకు ప్రీతిమాత్రము కలుగదు.

అహింసయా పారమహంస్యచర్యయా
స్మృత్యా ముకున్దాచరితాగ్ర్యసీధునా ।
యమైరకామైర్నియమైశ్చాప్యనిన్దయా
నిరీహయా ద్వంద్వతితిక్షయా చ ॥ 24

హరేర్ముహుస్తత్పరకర్ణపూర-
గుణాభిధానేన విజృంభమాణయా ।
భక్త్యా హ్యసంగః సదసత్యనాత్మని
స్యాన్నిర్గుణే బ్రహ్మణి చాంజసా రతిః ॥ 25

అహింస, శుద్ధసత్త్వప్రధాన మగువృత్తి, సద్గురూపదేశము ననుసరించి సదాచారానుష్ఠానరూప మగుస్మృతి (ఆత్మహితానుసంధానము), ముకుందచరిత పర్యాలోచనము, ఇంద్రియ నిగ్రహము, భోగవాసనాపరిత్యాగము, హరివ్రతాది నియమములు, ధర్మాంతరములను నిందింపకుండుట, తానను భవింపదగిన విషయములకై ప్రయత్నింపకుండుట, శీతోష్ణాది ద్వంద్వములను సహించుట, భగవద్భక్తులకు కర్ణభూషణములవంటి వగు హరిగుణములను గీర్తించుట అనువానిద్వారా భక్తివృద్ధియగును. దాని వలన కార్యకారణరూపము, అనాత్మ వస్తువు నగు ప్రపంచమునందు వైరాగ్యము, నిర్గుణపరబ్రహ్మమునందు సహజముగనే పరమాసక్తి కలుగును.

యదా రతిర్బ్రహ్మణి నైష్ఠికీ పుమా
నాచార్యవాన్ జ్ఞానవిరాగరంహసా ।
దహత్యవీర్యం హృదయం జీవకోశం
పంచాత్మకం యోనిమివోత్థితోఽగ్నిః ॥ 26

పరబ్రహ్మమునందు నైష్ఠికరతి గలిగినపుడు ఆచార్యసేవాపరాయణుడగు పురుషుడు జ్ఞానవైరాగ్యప్రభావముచే, ప్రజ్జ్వలిత మగునగ్ని తనయుత్పత్తికి స్థాన మగు అరణిని (కాష్ఠమును) దగ్ధము చేయునట్లు దుర్బలమగు అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము నను పంచక్లేశాత్మక మగు జీవస్వరూపావరణమును అనగా లింగదేహమును దగ్ధము చేయును.

దగ్ధాశయో ముక్తసమస్తతద్గుణో
నైవాత్మనో బహిరన్తర్విచష్టే।
పరాత్మనోర్యద్వ్యవధానం పురస్తాత్
స్వప్నే యథా పూరుషస్తద్వినాశే॥ 27

జాగ్రదావస్థయందు స్వప్నదృష్టవిషయములు గానరానట్లు జీవాత్మ పరమాత్మలనడుమ పూర్వమున (సంసారావస్థయందు) ఏవ్యవధానము అనగా సంబంధజ్ఞానాభావ మున్నదో అది నాశము కాగా ఉపాధిరహితుడు కర్తృత్వాద్యభిమానయుక్తుడు నగు పురుషుడు బాహ్యవిషయములను (శబ్దస్పర్శాదులను), అంతర్విషయములను (శోకమోహాదులను) అనుభవింపడు.

*చ. పురుషుఁడు నిద్రపోఁగలలఁబొందినయాత్మసుఖైకహేతు వై*
*పరగినరాజభృత్యజనభావగుణంబులు సంప్రబోధమం*
*దరయఁగఁ మిథ్య యైనగతి నాంతరబాహ్యగుణ ప్రభేదముల్*
*పరువడిఁ గాన కుండు జనపాలనశీలన నిత్యఖేలనా.* (4-621)

ఆత్మానమిన్ద్రియార్థం చ పరం యదుభయోరపి।
సత్యాశయ ఉపాధౌ వై పుమాన్ పశ్యతి నాన్యదా॥ 28

లింగదేహమే జీవునియుపాధి వ్యవధానశబ్దములచే చెప్పదగినది. సోపాధికజీవుడు లింగదేహముతో భోగమువలన కలుగు సుఖదుఃఖాదుల ననుభవించును. కాని యీదేహము లేనిచో దానిననుభవింపడు. అనగా వ్యవధానము లేనిచో జీవునకు స్వస్వరూపానుభూతి, పిమ్మట పరేశానుభూతి కలుగును.

నిమిత్తే సతి సర్వత్ర జలాదావపి పూరుషః।
ఆత్మనశ్చ పరస్యాపి భిదాం పశ్యతి నాన్యదా॥ 29

లోకమున జలదర్పణాదినిమిత్తములు ఉన్నపుడె బింబప్రతిబింబముల నడుమ నున్న భేద మగపడును, కాని జలాదులు లేనప్పు డుండదు. అట్లే ఉపాధిరూప మగు లింగదేహ మున్నచో దానివలన జీవపరమాత్మలనడుమ జడవైషమ్య మగపడును. కాని తదభావమున అది యుండదు.

ఇంద్రియైర్విషయాకృష్టైరాక్షిప్తం ధ్యాయతాం మనః।
చేతనాం హరతే బుద్ధేః స్తంభస్తోయమివ హ్రదాత్॥ 30

విషయచింతారతు లగు వ్యక్తులచిత్తము విషయాకర్షణప్రభావముచే విషయమునందే ఆసక్త మైయుండును. తీరమునం దున్న కుశాదుల మూలము జలాశయమందలి జలము నాకర్షించును, అట్లే మనస్సుగూడ బుద్ధియొక్క విచారసామర్థ్యమును పూర్తిచేయును.

భ్రశ్యత్యనుస్మృతిశ్చిత్తం జ్ఞానభ్రంశః స్మృతిక్షయే ।
తద్రోధం కవయః ప్రాహురాత్మాపహ్నవమాత్మనః ॥ 31

విచారసామర్థ్యరూపమగు బుద్ధివృత్తి అపహృతము కాగా స్మృతి శక్తి విలుప్తమగును. స్మృతిశక్తి నాశమువలన జ్ఞానము నష్టమగును. సోపాధికుడగు జీవుని యాజ్ఞాన నాశమునె పండితులాత్మ నాశము అనగా నిరుపాధిక మగు ఆత్మ స్ఫురించకపోవుటయే యనియందురు.

నాతః పరతరో లోకే పుంసః స్వార్థవ్యతిక్రమః ।
యదధ్యన్యస్య ప్రేయస్త్వమాత్మనః స్వవ్యతిక్రమాత్ ॥ 32

ఆత్మ నాశ్రయించుటవలననె దేహము మున్నగు ఇతరవస్తువులు ప్రియములగును. ఆయాత్మ నష్టము కాగా దానికంటె మించిన క్షతి (నష్టము) జీవునకిక యేమి యుండను.

అర్థేన్ద్రియార్థాభిధ్యానం సర్వార్థాపహ్నవో నృణామ్ ।
భ్రంశితో జ్ఞానవిజ్ఞానాద్యేనావిశతి ముఖ్యతామ్ ॥ 33

ధనముయొక్క, భోగవిషయాదులయొక్క చింతనమే జీవుని సర్వపురుషార్థనాశమునకు కారణము. వానిరెండింటియాలోచనమువలన జీవుడు పరోక్షాపరోక్షానుభూతిలనుండి భ్రష్టుడై జడత్వమును పొందును.

నకుర్యాత్కర్హిచిత్సంగం తమస్తీవ్రం తితీరిషుః ।
ధర్మార్థ కామమోక్షాణాం యదత్యన్తవిఘాతకమ్ ॥ 34

సంసారజనక మగు అజ్ఞానాంధకారమును తరింపదలచినమానవు డెప్పుడును విషయములయం దాసక్తి గలిగియుండరాదు. ఇది ధర్మార్థకామమోక్షములను పొందుటకు బాధక మగును.

తత్రాపి మోక్ష ఏవార్థ ఆత్యన్తికతయేష్యతే ।
త్రైవర్గ్యోఽర్థో యతో నిత్యం కృతాంతభయసంయుతః ॥ 35

ధర్మార్థకామములు, భక్తిహీనమగు మోక్షము అనునీనాలుగును పురుషార్థము లని చెప్పబడినను సహజముగ భగవత్సేవారూపమోక్షమే పరమపురుషార్థ మగును. కనుక అదియె వాంఛనీయ మైనది. ధర్మార్థకామము లెల్లప్పుడు కాలభయ యుక్తము లై యుండును.

పరేఽవరే చ యే భావా గుణవ్యతికరాదను ।
న తేషాం విద్యతే క్షేమమీశవిధ్వంసితాశిషామ్ ॥ 36

బ్రహ్మాది స్తంభపర్యంతము గల ఉత్తమాధమము లగు సర్వవస్తువులు గుణక్షోభమైనపిమ్మటనే ఉత్పన్నములైనవి. భగవచ్ఛక్తి రూపమగు కాలప్రభావముచే వాని ధర్మాదిపురుషార్థము లన్నియు వినష్టము లగును. అందువలన వాని కిక యెట్టి శుభములు ఉండవు.

తత్త్వం నరేంద్ర జగతామథ తస్థుషాం చ
దేహేన్ద్రియాసుధిషణాత్మభిరావృతానామ్ ।
యః క్షేత్రవిత్తపతయా హృది విశ్వగావిః
ప్రత్యక్చకాస్తి భగవాంస్తమవేహి సోఽస్మి ॥ 37

రాజా! దేహేంద్రియప్రాణబుద్ధులు, అహంకారము అనువానిచే సమాచ్ఛన్నమగుస్థావరజంగమాదులహృదయములయందు సాక్షాత్తుగ అంత ర్యామిరూపముతో అంతట ప్రకాశించువానినె భగవానునిగ తెలిసికొనుము.

యస్మిన్నిదం సదసదాత్మతయా విభాతి
మాయా వివేకవిధుతి స్రజి వాహిబుద్ధిః ।
తం నిత్యముక్త పరిశుద్ధవిశుద్ధతత్త్వం
ప్రత్యూఢకర్మకలిలప్రకృతిం ప్రపద్యే॥ 38

పుష్పమాలయందు సర్పబుద్ధివలె మాయవలన కార్యాకారణభావముతో పరమాత్మయం దున్నజీవున కిట్టిభ్రమ లేదా వివర్తబుద్ధి కలుగును. వివేకోదయమువలన అట్టిభ్రమ యుండదు. నే నట్టినిత్యముక్తుడు, సత్యస్వరూపుడు,విశుద్ధసత్త్వుడు, ప్రాకృత కర్మమలరహితుడు నగుభగవానుని శరణుజొచ్చితిని.

ఉ. *భూవర యేమహాపురుషభూషణునందుల నీసమస్తవి*
*శ్వావళి లీనమై సదసదాత్మకభావము నొంది భూరిమా*
*యావిభవంబులం దగి సమగ్రవివేకవిరోధిస్రగ్గనా*
*శీవిషబుద్ధి దోఁచుచు విశేషగతిన్ వెలుఁగొందు నెప్పడున్.* (4-627)

యత్పాదపంకజపలాశవిలాసభక్త్యా
కర్మాశయం గ్రథితముద్గ్రథయన్తి సన్తః ।
తద్వన్న రిక్తమతయో యతయోఽపి రుద్ధ -
స్రోతోగణాస్తమరణం భజ వాసుదేవమ్ ॥ 39

భక్తులు భగవానునిపాదపద్మములయందలి పత్రములవంటి అంగుళులనుండి వెలువడుకాంతిని భక్తితో స్మరించుచు కర్మవాసనామయ మగు హృదయగ్రంథిని సులభముగ ఛేదించునట్లు భక్తి రహితులు, నిర్విషయులు అగు యోగులు ఇంద్రియములను నిగ్రహించియు ఛేదింపజాలరు. అందువలన ఇంద్రియనిగ్రహాదిప్రయత్నమును విడచి వాసుదేవుని భజింపుము.

కృచ్ఛ్రో మహానిహ భవార్ణవమప్లవేశాం
షడ్వర్గనక్రమసుఖేన తితీరషన్తి ।
తత్త్వం హరేర్భగవతో భజనీయమంఘ్రిం
కృత్వోడుపం వ్యసనముత్తర దుస్తరార్ణమ్ ॥ 40

ఇంద్రియాదిమకరపరిపూర్ణ మగునీసంసారసముద్రమును యోగాదుల ద్వారా దాటుట కిష్టపడువారు, భవసాగరమును తరింపజేయునౌకవంటి దగు భగవదాశ్రయమును వదలినచో అధికకష్టముల పాలగుదురు. అందువలన రాజా! నీవుగూడ భజనీయు డగు భగవానునిపాదపద్మములను నౌకగా జేసికొని వ్యసనసంకుల మగునీభవసాగరమును తరింపుము.

## శ్రీ మైత్రేయ ఉవాచ

స ఏవం బ్రహ్మపుత్రేణ కుమారేణాత్మమేధసా ।
దర్శితాత్మగతిః సమ్యక్ ప్రశస్యోవాచ తం నృపః ॥ 41

మైత్రేయుడు పలికెను :- ఆత్మతత్త్వజ్ఞుడు, బ్రహ్మపుత్రుడు నగు సనత్కుమారునివలన ఆత్మతత్త్వమును పొంది పృథుమహారాజు ఆయనను స్తుతింపసాగెను.

## శ్రీరాజోవాచ

కృతోమేఽనుగ్రహః పూర్వం హరిణాఽర్తానుకంపినా ।
తమపాదయితుం బ్రహ్మన్ భగవన్ యూయమాగతాః ॥ 42

రాజుపలికెను :- దేవా! దీనులపై దయగలవాడగు శ్రీహరిపూర్వమే నాపైకృపజూపినాడు. ఆభగవదనుగ్రహమును సంపాదించుట కొఱకే అనగా భగవద్భక్తిని స్థాపించుటకొఱకే మీరు వచ్చిరి.

నిష్పాదితశ్చ కార్త్స్న్యేన భగవద్భిర్ఘృణాలుభిః ।
సాధూచ్ఛిష్టం హి మే సర్వమాత్మనా సహ కిం దదే ॥ 43

మీరు దయగలవారు, భగవద్భక్తి స్థాపన మను భగవదనుగ్రహమును మీరు చక్కగ సంపాదించితిరి. మీకు నే నెట్టిదక్షిణ నీయగలను? నా దేహము, ఈరాజ్యాదులు మీవంటిసత్పురుషులిచ్చినట్టి యుచ్ఛిష్టముల వంటివి. (అందువలన పితృప్రదత్త మగునుచ్ఛిష్టమును మరల వారి కిచ్చుట యుచితము కాదు).

ప్రాణా దారాః సుతా బ్రహ్మన్ గృహాశ్చ సపరిచ్ఛదాః ।
రాజ్యం బలం మహీ కోశ ఇతి సర్వం నివేదితమ్ ॥ 44

మహాత్ములారా! (భృత్యుడు రాజునకు సేవారూపముతో తాంబూలాదుల నిచ్చునట్లు నేనుగూడ) మీకు ప్రాణములు, పుత్రులు, పరివారము మున్నగు సర్వవిధసామగ్రులతో గూడ గృహములు, రాజ్యము, సేన, పృథివి మున్నగుసర్వవస్తువులను నివేదింతును, అంగీకరింపవలసినది.

సేనాపత్యం చ రాజ్యం చ దణ్డనేతృత్వమేవ చ ।
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్రవిదర్హతి ॥ 45

సైన్యాధిపత్యము, రాచరికము, దండవిధానము, సర్వలోకాధిపత్యము వేదశాస్త్రవేత్త యగు బ్రాహ్మణునకే తగును.

స్వమేవ బ్రాహ్మణో భుంక్తే స్వం వస్తే స్వం దదాతి చ ।
తస్యైవానుగ్రహేణాన్నం భుంజతే క్షత్రియాదయః ॥ 46

అందువలన బ్రాహ్మణులు తమధనమునె అనుభవించుదురు, తమ వస్త్రములనె ధరించుదురు. తమద్రవ్యమునె యితరులకు దాన మిత్తురు. వారియనుగ్రహమువలననె క్షత్రియాదులు అన్నాదివిషయములను అనుభవింతురు.

యైరీదృశీ భగవతో గతిరాత్మవాద
ఏకాన్తతో నిగమభిః ప్రతిపాదితా నః ।
తుష్యన్త్వదభ్రకరుణాః స్వకృతేన నిత్యం
కో నామ తత్ప్రతికరోతి వినోదపాత్రమ్ ॥ 47

మీరు వేదవేత్తలు, పరమాత్మతత్త్వవిచారమున ఏకాంతనిష్ఠాయుక్తులు. మీరు నాకు అత్యపూర్వ మగువాసుదేవతత్త్వమును వివరించితిరి. మీరు గొప్పదయగలవారు; స్వకర్మచే సంతుష్టులగుదురు. దోసిలి యొగ్గి నివేదించుటతప్ప మీ కెట్టిప్రత్యుపకారమును చేయజాలను. అందువలన నేనుగూడ దానినే యొనరింతును.

## శ్రీ మైత్రేయ ఉవాచ

**త ఆత్మయోగపతయ ఆదిరాజేన పూజితాః ।**
**శీలం తదీయం శంసన్తః ఖేఽభవన్ మిషతాం నృణామ్ ॥ 48**

మైత్రేయుడు పలికెను:- ఆత్మతత్త్వోపదేశకు లగు సనత్కుమారాది ఋషులు ఆదిరా జగు పృథువుచే పూజితులై వానిగుణములను ప్రశంసించుచు, అందఱు చూచు చుండగనే ఆకాశమార్గమున వెడలిపోయిరి.

**వైన్యస్తు ధుర్యో మహతాం సంస్థిత్యాధ్యాత్మశిక్షయా ।**
**ఆప్తకామమివాత్మానం మేన ఆత్మన్యవస్థితః ॥ 49**

మహాత్ములలో ఉత్తము డగుపృథువు ఆత్మతత్త్వశిక్షాప్రభావముచే భగవదుపాసనయం దేకైకనిష్ఠగలవాడయి పూర్ణమనోరథునివలె తన్ను భావించుకొనెను.

**కర్మాణి చ యథాకాలం యథాదేశం యథాబలమ్ ।**
**యథోచితం యథావిత్తమకరోద్బ్రహ్మసాత్కృతమ్ ॥ 50**

ఆయన దేశకాలపాత్రానుసారముగ యోగ్యములగు విషయములను భగవదర్పణము చేసి శుద్ధభక్త్యనుమోదితములయిన కర్మలనొనరింపసాగెను.

**ఫలం బ్రహ్మణి సంన్యస్య నిర్విషంగః సమాహితః ।**
**కర్మాధ్యక్షం చ మన్వాన ఆత్మానం ప్రకృతేః పరమ్ ॥ 51**

**గృహేషు వర్తమానోఽపి స సామ్రాజ్యశ్రియాన్వితః ।**
**నాసజ్జతేన్ద్రియార్థేషు నిరహంమతిరర్కవత్ ॥ 52**

పృథుమహారాజు భగవానునకు కర్మఫలము నర్పించి, కర్మాసక్తిని వదలి, సమాహితచిత్తముతో ప్రకృతికంటె పరుడయినభగవానుని కర్మాధ్యక్షునిగ భావించి కర్తృత్వాద్యభిమానమును విడచెను. అతడు సామ్రాజ్య లక్ష్మితో గృహమున ఉండియు, సూర్యునివలె అంతట పర్యటించుచున్నను ఎప్పుడును విషయములయందా సక్తుడు కాలేదు.

**ఏవమధ్యాత్మయోగేన కర్మాణ్యనుసమాచరన్ ।**
**పుత్రానుత్పాదయామాస పంచార్చిష్యాత్మసమ్మతాన్ ।**
**విజితాశ్వం ధూమకేశం హర్యక్షం ద్రవిణం వృకమ్ ॥ 53**

పృథుమహారాజిట్లు భగవానునకు కర్మలనర్పించి నిరంతరము యోగ్యములగు కర్మల ననుష్ఠించుచుండెను. ఆయన తన భార్యయగు అర్చివలన విజితాశ్వుడు, హర్యక్షుడు, ద్రవిణుడు, ధూమకేశుడు, వృకుడు ననుఆత్మసదృశులగు ఐదుగురుపుత్రులను కనెను.

**సర్వేషాం లోకపాలానాం దధారైకః పృథుర్గుణాన్ ।**
**గోపీథాయ జగత్సృష్టేః కాలే స్వే స్వే ఽచ్యు తాత్మకః ॥ 54**

అచ్యుతాత్మకు డగుపృథువు జగత్తులో సృష్టిని రక్షించుటకై తగిన సమయమున అవతరించి సర్వలోకపాలురగుణములను ఒక్కడే ధరించెను.

**మనోవాగ్వృత్తిభిః సౌమ్యైర్గుణైః సంరంజయన్ ప్రజాః ।**
**రాజేత్యధాన్నామధేయం సోమరాజ ఇవాపరః ॥ 55**

ఆయన హితచింతాదిరూపమనోవృత్తిద్వారా, ప్రియభాషణాదిరూప వాగ్వృత్తిద్వారా, మనోహరము లగుగుణములద్వారా ప్రజలను రంజింపజేసి "ద్వితీయచంద్రు"డను పేరును ధరించెను.

*చ॥ సరసవచోర్థ సత్పురుషసంఘసమంచితగేయమానసు*
*స్థిరవరకీర్తిపూరము సుధీజనకర్ణములందు నించి తా*
*నిరుపమసౌమ్యభాషణమనీషలచేతఁ బ్రజానురక్తుఁడై*
*ధరణిని రాజనామమునఁ దాఁదగు రెండవచంద్రుఁడోయనన్. (4-644)*

**సూర్యవద్విసృజన్ గృహ్ణన్ ప్రతపంశ్చ భువో వసు ।**
**దుర్ధర్షస్తేజసేవాగ్నిర్మహేన్ద్ర ఇవ దుర్జయః ॥ 56**

పృథుమహారాజు తగువిధముగ ధనాదులను గ్రహించుచు, తగిన సమయమున వానిని దానముచేయుచు,పృథివియందు సూర్యునివలె విరాజిల్లెను. ఆయన అగ్నివలె దుర్ధర్షమగుతేజస్సుగలవాడు, మహేంద్రునివలె దుర్జయ మగుబలము కలవాడు అయ్యెను.

**తితిక్షయా ధరిత్రీవ ద్యౌరివాభీష్టదో నృణామ్ ।**
**వర్షతిస్మ యథాకామం పర్జన్య ఇవ తర్పయన్ ॥ 57**

ఆయన పృథివివలె క్షమాశీలుడు, స్వర్గమువలె సర్వలోకాభీష్టప్రదుడు. మేఘ మవసర మున్నంతవఱకు వర్షించి జనులందఱకు తృప్తిని గలిగించునట్లు ఆయనగూడ ప్రజల యవసరముల దీర్చి వారికి సంతోషమును గలుగజేయుచుండును.

**సముద్ర ఇవ దుర్బోధః సత్త్వేనాచలరాడివ ।**
**ధర్మరాడివ శిక్షాయామాశ్చర్యే హిమవానివ ॥ 58**

సముద్రమువలె గంభీరు డగుటవలన ఆయనయభిప్రాయము నెవ్వరును ఎఱుంగజాలరు. ఆయన సుమేరువువలె స్థిరమైనవాడు, దండించుటయందు యమధర్మరాజు వంటివాడు, విస్మయజనకత్వమున హిమాలయమువంటివాడు.

కుబేర ఇవ కోశాఢ్యో గుప్తార్థో వరుణో యథా ।
మాతరిశ్వేవ సర్వాత్మా బలేన మహసౌజసా ॥ 59

పృథుమహారాజు కుబేరునివలె ధనవంతుడు, గుప్తార్థమును సంరక్షించుటయందు వరుణినివంటివాడు, శరీరమున ఇంద్రియబలమునందు సర్వత్ర గమనముగల వాయువు వంటివాడు.

అవిసహ్యతయా దేవో భగవాన్ భూతరాడివ ।
కందర్ప ఇవ సౌందర్యే మనస్వీ మృగరాడివ ॥ 60

ఆయన పరాక్రమమున సాక్షాత్తుగ రుద్రుడు, సౌందర్యమున మన్మథునివంటివాడు, సింహమువలె భయరహితుడు.

వాత్సల్యే మనువన్నృణాం ప్రభుత్వే భగవానజః ।
బృహస్పతిర్బ్రహ్మవాదే ఆత్మవత్త్వే స్వయం హరిః ॥ 61

ఆయన వాత్సల్యమున మనువు, ప్రభుత్వమున బ్రహ్మ, బ్రహ్మతత్త్వ విచారమున సాక్షాత్తుగ బృహస్పతి, భగవానునివలె జితేంద్రియుడునయ్యెను.

భక్త్యా గో గురువిప్రేషు విష్వక్సేనానువర్తిషు ।
హ్రియా ప్రశ్రయశీలాభ్యామాత్మతుల్యః పరోద్యమే ॥ 62

ఆయన గో గురు విప్ర వైష్ణవులయందు భక్తిగలవాడు, లజ్జాశీలుడు, వినయము సుఖము గలవాడు. పరోపకారమున ఆత్మతుల్యుడు అనగా ఆయన కాయనే సాటి.

కీర్త్యోర్ధ్వగీతయా పుంభిస్త్రైలోక్యే తత్ర తత్ర హ ।
ప్రవిష్టః కర్ణరన్ధ్రేషు స్త్రీణాం రామః సతామివ ॥ 63

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే పృథుచరితే కుమారోపదేశో
నామ ద్వావింశోఽధ్యాయః ॥

రామచంద్రుని కీర్తి సత్పురుషులకర్ణ రంధ్రములలో ప్రవేశించినట్లు ఈపృథుమహారాజు కీర్తియు మూడులోకములలోని పురుషుల ద్వారా ఉచ్చైస్స్వరముగ కీర్తింపబడినదై స్త్రీలకర్ణ రంధ్రములయందు ప్రవేశించెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని ఇరువదిరెండవ అధ్యాయము సమాప్తము.

# ఇరువదిమూడవ అధ్యాయము

## పృథుచక్రవర్తి తపస్సు : పరలోకగమనము

కథాసారము :- ఈ యధ్యాయమున పృథువు భార్యతో గూడ వనమునకు వెడలుట, భక్తియోగసమాధి ద్వారా విమానము నధిరోహించుట అనువిషయములు వర్ణితములైనవి.

పృథుమహారాజు తపోవనమునకు వెడలి వానప్రస్థా శ్రమమునకు దగిన ఉగ్రతపస్సున ప్రవృత్తుడయ్యెను. శ్రీకృష్ణు నారాధించుకోరికతో తత్ప్రతికూల మగుసర్వవిషయములను విడచి, తదనుకూల మగువిషయములను స్వీకరించి భక్తిమార్గ విహిత మగుతపస్సు చేయుట ద్వారా అతని కర్మఫలము వినష్టమయ్యెను, హృదయము నిర్మలమయ్యెను. భగవన్మంత్రాది జపప్రభావముచే ఆతని సాంసారిక బంధనములు ఛిన్నములయ్యెను. అప్పుడాయన సనత్కుమారు డుపదేశించిన అధ్యాత్మయోగము నవలంబించి భగవద్భజనమున ప్రవృత్తుడయ్యెను. త్వరలోనే ఆయనకు భగవానునియందు ఐకాంతికభక్తి కలిగినది. హృదయమునం దున్నసర్వసంశయములు తొలగెను. శ్రీహరికథ యందు ఆసక్తి కలుగనంతవఱకు కేవలము యోగాదులద్వారా అజ్ఞానమునుండి ముక్తిబొందజాలడు. పృథువుపత్ని యగు అర్చికూడ సంపూర్ణముగ భర్త ననుగమించెను. పృథుమహారాజు భక్తి యోగసమాధిస్థుడై తనకళేబరమును పరిత్యజింపగా అర్చిదేవి పర్వతసానువునం దొకచితిని పేర్చుకొని దానిపై భర్తశరీరము నుంచి ముమ్మారు దానికి ప్రదక్షిణ మాచరించి చితాగ్నియందు ప్రవేశించెను. పిమ్మట తనస్వామితో గలసి ఊర్ధ్వలోకమునకు వెడలెను. మైత్రేయమహాముని విదురున కిట్లు పృథుమాహాత్మ్యమును వివరించెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

దృష్ట్వాత్మానం ప్రవయసమేకదా వైన్య ఆత్మవాన్ ।
ఆత్మనా వర్ధితాశేష స్వానుసర్గః ప్రజాపతిః ॥ 1

జగతస్తస్థుషశ్చాపి వృత్తిదో ధర్మభృత్సతామ్ ।
నిష్పాదితేశ్వరాదేశో యదర్థమిహ జజ్ఞివాన్ ॥ 2

ఆత్మజేష్వాత్మజాం న్యస్య విరహాద్రుదతీమివ ।
ప్రజాసు విమనఃస్వేకః సదారోఽగాత్తపోవనమ్ ॥ 3

మైత్రేయుడు పలికెను :- విదురా! ఆత్మవేత్తయు, ప్రజాపతియు, వేనవందనుడు అగుపృథువు అన్నాదిసృష్టి, పురగ్రామాదిసృష్టి అనేకవిధముల వృద్ధిచెందుటయు పిమ్మట తాను వృద్ధుడగుటయు చూచి యిట్లాలోచించెను - "నేను భూమండలమునం దున్నస్థావర జంగమములకు ఆహారమును నిర్ణయించితిని. సత్పురుషులకు ధర్మరక్షకునిగ పనిజేసితిని. పరమేశ్వరుని ప్రజాపాలనాదియాదేశములను నెఱవేర్చుటకై నే నీభూమండలమున అవత రించితిని. ఆయనయాదేశము లన్నియు నెఱవేర్పబడినవి". పృథుమహారాజిట్లాలోచించి దుహితృస్వరూపిణి యగుధరిత్రిని తనపుత్రుని హస్తములందుంచి భార్యామాత్రుడై తపోవనమునకు వెడలెను. ఆయనయెడబాటుచే పృథివి దుఃఖింపసాగెను. ప్రజలు కలత చెందిరి.

తత్రాప్యదాభ్యనియమో వైఖానససుసమ్మతే ।
ఆరబ్ధ ఉగ్రతపసి యథా స్వవిజయే పురా ॥ 4

అఖండవ్రతు డగుపృథువు పూర్వమున పృథివిని జయించుట కెట్టి ప్రయత్నముచేసెనో ఇప్పుడు వనమునకు వెడలియు అట్టి ప్రయత్నముతోనే వానప్రస్థులకు సమ్మత మగు ఉగ్రతపస్సును జేయసాగెను.

కన్దమూలఫలాహారః శుష్కపర్ణాశనః క్వచిత్ ।
అబ్భక్షః కతిచిత్పక్షాన్ వాయుభక్షస్తతః పరమ్ ॥ 5

కొన్నిదినములు పృథువు కందమూలఫలములను, కొన్నిదినములు శుష్కపత్రములను ఆహారముగ గొనుచు గొన్నిదినములు కేవలము జలములను త్రావుచు చివరకు వాయువును మాత్రము స్వీకరించుచు తపస్సు చేయసాగెను.

గ్రీష్మే పంచతపా వీరో వర్షాస్వాసారషాన్మునిః ।
ఆకంఠమగ్నః శిశిరే ఉదకే స్థండిలేశయః ॥ 6

తితిక్షుర్యతవాగ్దాన్త ఊర్ధ్వరేతా జితానిలః ।
ఆరిరాధయిషుః కృష్ణమచరత్తప ఉత్తమమ్ ॥ 7

గ్రీష్మకాలమున ఆయన పంచాగ్నులను సేవించెను, వర్షాకాలమున ఆచ్ఛాదన లేనిప్రదేశమున నుండి వర్షధారలను సహించెను. శీతకాలమున కంఠమువఱకు నీటిలో నుండెను. భూమియందు శయనించెను. ఆయన సహిష్ణువు, మౌనియు, జితేంద్రియుడు, ఊర్ధ్వరేతస్కుడు, జితశ్వాసుడు నై విష్ణుభగవాను నారాధించుటకై అత్యుత్తమ మగుతపస్సును జేసెను.

తేన క్రమానుసిద్ధేన ధ్వస్తకర్మామలాశయః ।
ప్రాణాయామైః సన్నిరుద్ధషడ్వర్గశ్ఛిన్న బన్ధనః ॥ 8

సనత్కుమారో భగవాన్ యదాహాధ్యాత్మికం పరమ్ ।
యోగం తేనైవ పురుషమభజత్పురుషర్షభః ॥ 9

ఇట్టి తపఃప్రభావముచే క్రమముగ కర్మఫలము నశింపగా పృథువు యొక్క హృదయము నిర్మలమయ్యెను. ప్రాణాయామము అనగా భక్తి మార్గవిహిత భగవన్మంత్రాదిజపఃప్రభావముచే ఆయన కామక్రోధాదులను చక్కగ నిగ్రహించెను, సంసారబంధనములు ఛిన్నములయ్యెను. అప్పుడు పురుషశ్రేష్ఠ డగుపృథువు భగవాను డగుసనత్కుమారు డుపదేశించిన పరమోత్కృష్ట మగుఆధ్యాత్మయోగము ననుసరించి పరమపురుషుడగు శ్రీహరిని భజింప ప్రవృత్తుడయ్యెను.

భగవద్ధర్మిణః సాధోః శ్రద్ధయా యతతస్సదా ।
భక్తిర్భగవతి బ్రహ్మణ్యనన్య విషయాభవత్ ॥ 10

భగవదారాధనాతత్పరుడు, సజ్జనశ్రేష్ఠుడు అగుపృథువు ఇట్లుశ్రద్ధతో ఎల్లప్పుడు భగవత్సేవ యందు ప్రయత్నపరుడై యుండుటచే త్వరలోనే వానికి పరబ్రహ్మమునం దవ్యభిచారిణీ యగుభక్తి కలిగెను.

తస్యానయా భగవతః పరికర్మశుద్ధ -
సత్వాత్మనస్తదనుసంస్మరణానుపూర్వ్యా ।
జ్ఞానం విరక్తిమదభూన్నిశితేన యేన
చిచ్ఛేద సంశయపదం నిజజీవకోశమ్ ॥ 11

భగవానునిపరిచర్యవలన పృథువుయొక్కహృదయము నిర్మలమయ్యెను. ఆయన అనుక్షణము భగవంతుని శరణుజొచ్చుటద్వారా భక్తి రసాస్వాదనమున పరితృప్తుడయ్యెను. ఈవిధముగ తీవ్ర మగుభక్తియోగ ప్రభావముచే సంశయమూల మగు ఆయనహృదయగ్రంథి ఛిన్నము కాగా అతడు వైరాగ్యయుక్తమగు భగవద్జ్ఞానమును పొందెను.

ఛిన్నాన్యధీరధిగతాత్మగతిర్నిరీహ -
స్తత్తత్యజేఽచ్ఛినదిదం వయునేన యేన ।
తావన్న యోగగతిభిర్యతిరప్రమత్తో
యావద్గదాగ్రజకథాసు రతిం న కుర్యాత్ ॥ 12

దేహాత్మబుద్ధి తొలగగా ఆయన ఆత్మతత్త్వమును తెలిసికొనెను. దానివలన ఆయనకు అణిమాదియోగైశ్వర్యప్రాప్తి విషయమున ఇక యెట్టి స్పృహయు లేకపోయెను. అప్పు

డాయన పూర్వమున ఏజ్ఞానముద్వారా తనహృదయగ్రంధిని ఛేదించెనో దానిని గూడ పరిహరించెను. ఏలయన, ముముక్షు వగుమానవుడు గదాగ్రజు డగుశ్రీహరి కథయందా సక్తిని పొందనంతవఱకు కేవలము యోగాదులద్వారా ఇతరవిషయములయందు అనాసక్తుడు కాజాలడు (అనగా ఆసక్తు డగును).

**ఏవం స వీరప్రవరః సంయోజ్యాత్మానమాత్మని ।**
**బ్రహ్మభూతో దృఢం కాలే తత్యాజ స్వం కలేవరమ్ ॥ 13**

ఇట్లు వీరశ్రేష్ఠు డగుపృథుమహారాజు స్వరూపసిద్ధిని పొంది దేహత్యాగకాలమున భక్తి యోగము నవలంబించి పరమాత్మ యగుభగవానుని యందు మనస్సు నుంచి తనకళేబరమును పరిత్యజించెను.

**సంపీడ్య పాయుం పార్ష్ణిభ్యాం వాయుముత్సారయన్ శనైః ।**
**నాభ్యాం కోష్ఠేష్వవస్థాప్య హృదురఃకంఠశీర్షణి ॥ 14**

**ఉత్సర్పయంస్తుతం మూర్ధ్ని క్రమేణావేశ్య నిస్పృహః ।**
**వాయుం వాయౌ క్షితౌ కాయం తేజస్తేజస్య యూయుజత్ ॥ 15**

మొదట ఆయన చీలమండలచే గుదప్రదేశమును బంధించి మూలాధారమునుండి ప్రాణవాయువును మెల్లమెల్లగ పైకి గొనిపోయి నాభిదేశమున మణిపూరకచక్రమున నిలిపెను. పిమ్మట అచటనుండి హృద్దేశమున ఆనాహతచక్రమునందు, అచటినుండి కంఠమునకు దిగువ భాగమున విశుద్ధచక్రమునందు, పిమ్మట దానికి ముందుభాగమునందు, అనంతరము భ్రూమధ్యమున ఆజ్ఞాచక్రమునందు నిలిపి, చివర కచటనుండి దానిని క్రమముగ బ్రహ్మరంధ్రమున నిలిపెను. అనంతరము నిస్పృహు డగునీపృథువు దేహారంభకము లగుపంచభూతములను విభజించి దేహమునం దున్నప్రాణ వాయువును వాయువునందు, పార్థివదేహగత మగుకఠినభాగమును పృథివి యందును, తేజస్సును అగ్నియందును లయము చేసెను.

**ఖాన్యాకాశే ద్రవం తోయే యథాస్థానం విభాగశః ।**
**క్షితిమంభసి తత్తేజస్యదో వాయౌ నభస్యముమ్ ॥ 16**

**ఇంద్రియేషు మనస్తాని తన్మాత్రేషు యథోద్భవమ్ ।**
**భూతాదినామూన్యుత్ క్షిప్యమహత్యాత్మని సన్దధే ॥ 17**

పిమ్మట అతడు ఇంద్రియములను ఆకాశమునందు, శరీరగత మగు జలాంశను జలమునందు యథాస్థానమున విభాగానుసారముగ గూర్చెను. అనంతర మాయన ఈ

మహాభూతములయుత్పత్తిక్రమము ననుసరించి పృథివిని జలమునందు, జలమును తేజస్సునందు, తేజస్సును వాయువునందు, వాయువును ఆకాశమునందు లయముచేసి, మనస్సును ఇంద్రియములయందు, ఇంద్రియములను వాని కుత్పత్తిస్థానము లగుతన్మాత్రల యందు ప్రవేశపెట్టెను. మిగిలిన తన్మాత్రలను అహంకారమునందు, ఆయహంకారమును మహత్తత్త్వమునందు ప్రవేశపెట్టెను.

**తం సర్వగుణవిన్యాసం జీవే మాయామయే న్యధాత్ ।**
**తం చానుశయమాత్మస్థమసావనుశయీ పుమాన్ ।**
**జ్ఞానవైరాగ్యవీర్యేణ స్వరూపస్థోఽజహాత్ప్రభుః ॥ 18**

అనంతరము సర్వగుణాధార మగుఆమహత్తత్త్వమును అవ్యక్త ప్రధానమునందు, ప్రధానమును జీవోపాధియందు అనగా లింగశరీరమందు నిలిపెను. పృథువు పూర్వమున లింగశరీరాభిమాని యగుజీవుడయియుండెను. అతడే యిపుడు జ్ఞానవైరాగ్య ప్రభావములచే భగవత్పార్షదదేహమును పొంది యాలింగశరీరమును త్యజింపగల్గెను.

**అర్చిర్నామ మహారాజ్ఞీ తత్పత్న్యనుగతా వనమ్ ।**
**సుకుమార్యతదర్హా చ యత్పద్భ్యాం స్పర్శనం భువః ॥ 19**

పృథుమహారాజుభార్యయు, మహారాణియు నగు అర్చిగూడ ఆయనతో పాటు వనము నకు వెడలెను. ఆమె మిగుల సుకుమారి, పాదములతో భూమిని స్పృశించుటకుగూడ యోగ్యురాలు కాదు.

**అతీవ భర్తుర్వ్రతధర్మనిష్ఠయా**
**శుశ్రూషయా చార్ష దేహయాత్రయా ।**
**నావిన్దతార్తిం పరికర్శితాపి సా**
**ప్రేయస్కరస్పర్శనమాననిర్వృతిః ॥ 20**

తన భర్తయొక్క భూమిశయనాదికఠోరవ్రత ధర్మములయందు ఆమె కూడ చాల నిష్ఠకలిగియుండెను. భర్తసేవచేత, ఋషులవలె దేహయాత్రను నిర్వహించుటచేత ఆమె మిగుల కృశించిపోయెను. కాని ప్రియతముని కరస్పర్శవలన, మధురసంభాషణమువలన గలిగినయానందముచే ఆమె కెట్టిక్లేశానుభూతియు కలుగలేదు.

**దేహం విపన్నాఖిలచేతనాదికం**
**పత్యుః పృథివ్యా దయితస్య చాత్మనః ।**
**ఆలక్ష్య కించిచ్చ విలప్య సా సతీ**
**చితామథారోపయదద్రిసానుని ॥ 21**

పతిపరాయణ యగుఅర్చి పృథివీపతియు, తన కతిప్రియతముడును నగుభర్త యొక్క దేహమున చేతనక్రియ విలుప్త మగుట చూచెను. అప్పు డామె కొలదిగ విలపించి కొండచఱియలో నొకచితిని బేర్చి దానిపై భర్తకళేబరము నుంచెను.

విధాయ కృత్యం హ్రదినీజలాప్లుతా
దత్త్వోదకం భర్తురుదారకర్మణః ।
నత్వా దివిస్థాంస్త్రిదశాంస్త్రిః పరీత్య
వివేశ వహ్నిం ధ్యాయతీ భర్తృపాదమ్ ॥ 22

పిమ్మట ఆ సమయమునకు తగిననిత్యకర్మల నొనరించి సరోవర జలమున స్నాన మాచరించి యుదారకీర్తి గల భర్తకు ఉదకము నిచ్చెను. అంతరిక్షవాసు లగుదేవతలకు నమస్కరించి భర్తపదయుగళమును స్మరించుచు ముమ్మారు ప్రదక్షిణ మాచరించి చితాగ్ని యందు ప్రవేశించెను.

విలోక్యానుగతాం సాధ్వీం పృథుం వీరవరం పతిమ్ ।
తుష్టువుర్వరదా దేవైర్దేవపత్న్యః సహస్రశః ॥ 23

వీరవరు డగు తనపతిని అనుసరించు ఆసాధ్విని జూచి, వరము లిచ్చుటయందు సమర్థు లగువేలకొలదిదేవతలు, దేవపత్నులు పరమానందమును పొందిరి.

కుర్వత్యః కుసుమాసారం తస్మిన్ మన్దరసానుని ।
నదత్స్వమరతుర్యేషు గృహన్తి స్మ పరస్పరమ్ ॥ 24

దేవపత్ను లామందరపర్వతముయొక్క సానువులయందు దుందుభి నాదములతో గూడ పుష్పవృష్టిని గురిపించుచు నిట్లుపలికిరి,

## శ్రీ దేవ్య ఊచుః

అహో ఇయం వధుర్ధన్యా యా చైవం భూభుజాం పతిమ్ ।
సర్వాత్మనా పతిం భేజే యజ్ఞేశం శ్రీర్వధూరివ ॥ 25

దేవపత్నులు పలికిరి :- ఆహా! ఆమె మిగుల ధన్యురాలుగదా! యజ్ఞేశ్వరు డగుశ్రీహరికి ప్రియపత్ని యగు లక్ష్మివలె తనపతియు, రాజాధిరాజును అగుపృథువును సర్వాంతః కరణముతో సేవించినది.

సైషా నూనం వ్రజత్యూర్ధ్వమను వైన్యం పతిం సతీ ।
పశ్యతాస్మానతీత్యార్చిర్దుర్విభావ్యేన కర్మణా ॥ 26

పతివ్రత యగు-ఈయర్చిదేవి దుర్విభావ్య మగు స్వకర్మను సాధించి తనపతి యగు పృథువు ననుసరించి, మనలను అతిక్రమించి వైకుంఠమున కభిముఖముగ వెడలుచున్నది, చూడుడు.

తేషాం దురాపం కిమ్వ్యన్యన్మర్త్యానాం భగవత్పదమ్ ।
భువి లోలాయుషో యే వై నైష్కర్మ్యం సాధయన్త్యుత ॥ 27

భూమండలమున తమజీవితములు మిగుల చంచల మయ్యును మానవులు జ్ఞానముద్వారా భగవానుని పొందుచున్నారు. అట్టి మానవుల కితర దేవాదిపదము లెట్లు దుర్లభము లగును.

*కం. పరికింపఁగ నేమనుజుఁడు*
*హరిపదమును బొందఁ జేయునట్టివివేక*
*స్ఫురణం దనర్చువానికిఁ*
*బరువడి నిలఁ బొందరానిపదముం గలదే.* (4-663)

స వంచితో బతాత్మధ్రుక్ కృచ్ఛ్రేణ మహతా భువి ।
లబ్ధ్వాపవర్గ్యం మానుష్యం విషయేషు విషజ్జతే ॥ 28

మిగులకష్టముతో భూలోకమున మోక్షమునకు ద్వారమువంటి దగు మానవశరీరమును పొందియు విషయములయం దాసక్తుడై యున్నవాడు నిజముగ ఆత్మద్రోహియగును. దానివలన అతడు మోసపోవును.

*తే॥ అట్టియపవర్గసాధన మైనమనుజ*
*భావ మొందియు విషయసంబద్ధుఁ డగుచు ।*
*వసుధ నెవ్వఁడు వర్తించువాఁడు ధరణి*
*ననయము నిజాత్మవంచకుఁ డనఁగఁ బరఁగు.* (4-664)

## శ్రీ మైత్రేయ ఉవాచ

స్తువతీష్వమరస్త్రీషు పతిలోకం గతా వధూః ।
యం వా ఆత్మవిదాం ధుర్యో వైన్యః ప్రాపాచ్యుతాశ్రయః ॥ 29

మైత్రేయుడు పలికెను :- దేవతాస్త్రీ లిట్లు స్తుతించుచుండగా పృథుపత్ని యగు అర్చియు ఆత్మవేత్తలలో శ్రేష్ఠుడు, భగవద్భక్తుడు నగు పృథువు వెడలిన లోకమునకే వెడలెను.

ఇత్థం భూతానుభావోఽసౌ పృథుః స భగవత్తమః ।
కీర్తితం తస్య చరితముద్దామచరితస్య తే ॥ 30

విదురా! ఇట్లలౌకిక ప్రభావసంపన్నుడు, మహాభాగవతుడు, ఉదార చరితుడు నగు పృథువుచరిత్రమును నీకు వివరించితిని.

య ఇదం సుమహత్పుణ్యం శ్రద్ధయావహితః పఠేత్ ।
శ్రావయేచ్ఛృణుయాద్వాపి స పృథోః పదవీ మియాత్ ॥ 31

ఏకాగ్రచిత్తముతోను, శ్రద్ధతోను పృథువుయొక్క యీపరమపవిత్ర చరిత్రమును స్వయముగ పఠించినను లేదా ఇతరులకు వినిపించినను లేక తాను వినినను మానవుడు పృథువుస్థానమును పొందును.

బ్రాహ్మణో బ్రహ్మవర్చస్వీ రాజన్యో జగతీపతిః ।
వైశ్యః పఠన్ విట్పతిః స్యాచ్ఛూద్రః సత్తమతా మియాత్ ॥ 32

ఈచరిత్రమును పఠించి బ్రాహ్మణుడు బ్రహ్మతేజస్సును, క్షత్రియుడు పృథివీపతిత్వమును, వైశ్యుడు వ్యాపారులలో ప్రధానత్వమును, శూద్రుడు స్వజాతివారిలో శ్రేష్ఠత్వమును పొందును.

త్రిఃకృత్వ ఇదమాకర్ణ్య నరో నార్యథవాదృతా
అప్రజః సుప్రజతమో నిర్ధనో ధనవత్తమః ।
అస్పష్టకీర్తిః సుయశా మూర్ఖో భవతి పండితః ॥ 33

ఈయాఖ్యానమును ముమ్మారు శ్రద్ధతో వినినచో పుత్రహీను డగు మానవుడు లేదా స్త్రీ సత్పుత్రుని పొందును. నిర్ధనుడు ధనవంతుడు, యశోహీనుడు విపులకీర్తిశాలియు, మూర్ఖుడు పండితుడును అగును,

ఇదం స్వస్త్యయనం పుంసామమంగల్యనివారణమ్ ।
ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం కలిమలాపహమ్ ॥ 34

ఈయాఖ్యానము మానవునకు మంగళస్వరూపము, అమంగళనివారకము, ధనప్రాపకము, యశోవర్ధకము, ఆయుర్వృద్ధికరము, కలిదోషనాశకము నైయున్నది.

ధర్మార్థకామమోక్షాణాం సమ్యక్సిద్ధిమభీప్సుభిః ।
శ్రద్ధయైతదనుశ్రావ్యం చతుర్ణాం కారణం పరమ్ ॥ 35

ధర్మార్థకామమోక్షములను గోరువాడు ఆనాల్గింటికి మూల మగు పృథుచరితమును శ్రద్ధతో మాటిమాటికి శ్రవణము చేయవలెను.

**విజయాభిముఖో రాజా శ్రుత్వైతదభియాతి యాన్ ।**
**బలిం తస్మై హరన్త్యగ్రే రాజానః పృథవే యథా ॥** 36

ఈ చరిత్రను విని జయమును పొందునుద్దేశ్యముతో ఏరాజు ఏ దేశమునకు వెడలునో అదేశాధిపతులు పూర్వము తాము పృథువునకు ఏవిధముగ కానుకలు సమర్పించిరో ఆవిధముగ ఆరాజునకుగూడ గానుకలను సమర్పింతురు.

**ముక్తాన్యసంగో భగవత్యమలాం భక్తిముద్వహన్ ।**
**వైన్యస్య చరితం పుణ్యం శృణుయాచ్ఛ్రావయేత్పఠేత్ ॥** 37

దుష్టసాంగత్యమును, ఫలాభికాంక్షను వదలి భగవానునియందు నిర్మల మగుభక్తి గలవాడయి పృథువు యొక్క ఈపవిత్రచరిత్రను శ్రవణము కీర్తనము చేయవలెను.

**వైచిత్రవీర్యాభిహితం మహన్మాహాత్మ్యసూచకమ్ ।**
**అస్మిన్ కృతమతిర్మర్త్యః పార్థవీం గతిమాప్నుయాత్ ॥** 38

విచిత్రవీర్యునికుమారుడ వగువిదురా! నేను నీకు భగవద్భక్తుల మాహాత్మ్యమును సూచించు ఈపృథుచరితమును జెప్పితిని. దీనియందు బుద్ధిని స్థిరపఱచినమానవుడు పృథువు వెడలిన స్థానమును పొందును.

**అనుదినమిదమాదరేణ శృణ్వన్**
**పృథుచరితం ప్రథయన్ విముక్తసంగః ।**
**భగవతి భవసిన్ధుపోతపాదే**
**స చ నిపుణాం లభతే రతిం మనుష్యః ॥** 39

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే పృథుచరితం నామ
త్రయోవింశోఽధ్యాయః ॥

ఫలాభిసంధిని పరిత్యజించి శ్రద్ధతో నిత్యము ఈపృథుచరితమును శ్రవణము కీర్తనము చేయువ్యక్తి యీసంసారసాగరమును తరింపజేయునౌక వంటి భగవత్పాదపద్మముల యందు ప్రగాఢ మగుభక్తి గలవా డగును.

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని ఇరువదిమూడవ
అధ్యాయము సమాప్తము.

18

# ఇరువదినాలుగవ అధ్యాయము

## పృథుచక్రవర్తి వంశపరంపర : ప్రచేతసులకు రుద్రదేవుడు ఉపదేశించుట

కథాసారము :- ఈ యధ్యాయమున పృథువునకు మునిమనుమ డగుప్రాచీన బర్హివలన ప్రచేతసులు జన్మించుట, వారికి రుద్రు డుపదేశించుట యనువిషయములు వర్ణింపబడినవి.

పృథువుపుత్రు డగువిజతాశ్వు డింద్రునికడ అంతర్ధాన విద్య నేర్చి అంతర్ధాను డనుప్రసిద్ధి పొందెను. అతడు శిఖండిని యనుభార్యవలన పావకుడు, పవమానుడు, శుచి యను మువ్వురు పుత్రులను; నభస్వతి యను భార్య వలన హవిర్ధానుడనునొకపుత్రుని గనెను. హవిర్ధానునిభార్య యగుహవిర్ధాని బర్హిషదుడు, గయుడు, శుక్లుడు, కృష్ణుడు, సత్యుడు, నిజవ్రతుడు అను ఆర్గురుపుత్రులను ప్రసవించెను. బర్హిషదుడు యజ్ఞముల నొనరించి పృథివీతలమును ప్రాచీనాగ్రములు గల కుశలద్వారా కప్పి ప్రాచీనబర్హి యను ప్రసిద్ధిని పడసెను. ప్రాచీనబర్హి శతద్రుతి యనుభార్యవలన పదుగురుపుత్రులను గనెను. వారే ప్రచేతసు లనిపిలువబడిరి. ప్రచేతసులు శివోపదేశము ననుసరించి పదివేలసంవత్సరములు భగవానుని గూర్చి తపస్సుచేసిరి.

విదురు డడుగగా మైత్రేయమహాముని, ప్రచేతసులు రుద్రునివలన పొందిన ఉపదేశములను గూర్చి వివరించెను. వైష్ణవశ్రేష్ఠు డగురుద్రుడు ప్రచేతసులతో నిట్లుపలికెను - "విష్ణు భగవానునిభక్తులే తనకిష్టులు. స్వధర్మనిష్ఠు లగువ్యక్తులు నూఱు జన్మములలో బ్రహ్మత్వమును, పిమ్మట విష్ణుభక్తుడగు రుద్రుని సాక్షాత్కారమును పొందుదురు. కాని భక్తులు వెంటనే విష్ణువుయొక్క పరమపదమును పొందుదురు. పిమ్మట రుద్రుడు విష్ణుభగవానుని స్తుతించి యిట్లుపలికెను - "విష్ణువే భగవానుడు. ఆయనయె కర్మఫలదాత, సర్వజ్ఞుడు. ఆయన దత్తాత్రేయాద్యవతారముల ద్వారా తత్తదధికారవ్యక్తులకొఱకై కుంఠధర్మమును, తన యధోక్షజ భగవత్స్వరూపము ద్వారా వైకుంఠధర్మమును ప్రవర్తింపజేసెను. వైష్ణవశ్రేష్ఠు డగురుద్రుడు శుద్ధభక్తులకు ప్రియుడగు విష్ణువు యొక్క సచ్చిదానంద స్వరూపమును దర్శించుటకై ప్రార్థించెను. శంభువు భగవద్భక్తులసాంగత్యమును పొందినచో మర్త్యలోక సుఖముల నట్లుండనీయుము స్వర్గాదిసుఖములను, చివరకు మోక్షవాంఛనుగూడ తుచ్ఛముగ భావించును. ఆయన భాగవతుల సాంగత్యమును బొందుటకై భగవానుని ప్రార్థించెను.

ఇట్లు బహువిధము లగువాక్కులచే విష్ణుగుణములను వర్ణించెను. భక్తితో నిట్లు స్తుతించి హరిని ఆరాధింపవలసినదిగా ప్రచేతసుల కుపదేశించెను. ఈస్తోత్రరత్నము అశేషశుభము లకు కల్ప వృక్షమువంటిది.

## శ్రీ మైత్రేయ ఉవాచ

విజితాశ్వోఽధిరాజాసీత్పృథుపుత్రః పృథుశ్రవాః ।
యవీయోభ్యోఽదదాత్కాష్ఠా భ్రాతృభ్యో భ్రాతృవత్సలః ॥ 1

మైత్రేయుడు పలికెను:- పృథువు వైకుంఠమునకు వెడలగా అతనిపుత్రుడు, మహాయశస్వియు నగువిజితాశ్వుడు పుడమితే డయ్యెను, ఆతడు విశేషముగ భ్రాతృవత్సలు డయ్యెను. అందువలన ఆయన తన నల్వురుసోదరులకు నాలుగుదిక్కుల నిచ్చెను.

హర్యక్షాయాదిశత్ప్రాచీం ధూమ్రకేశాయ దక్షిణామ్ ।
ప్రతీచీం వృకసంజ్ఞాయ తుర్యాం ద్రవిణసే విభుః ॥ 2

ఆయన హర్యక్షునకు తూర్పుదిక్కును, ధూమ్రకేశునకు దక్షిణ దిక్కును, వృకునకు పశ్చిమదిక్కును, ద్రవిణునకు ఉత్తరదిక్కును నిచ్చెను.

అన్తర్ధానగతిం శక్రాల్లబ్ధ్వాన్తర్ధానసంజ్ఞితః ।
అపత్యత్రయమాధత్త శిఖండిన్యాం సుసమ్మతమ్ ॥ 3

పృథునందను డగువిజితాశ్వుడు ఇంద్రునివలన అంతర్ధానవిద్యను పొంది "అంతర్ధాను" డనునామమును పొందెను. ఆయన "శిఖండిని" యనుభార్య వలన తనతో సమానులగు ముప్వురుపుత్రులను గనెను.

పావకః పవమానశ్చ శుచిరిత్యగ్నయః పురా ।
వశిష్ఠశాపాదుత్పన్నాః పునర్యోగగతిం గతాః ॥ 4

వారు పావకుడు, పవమానుడు, శుచి యనువారు. వీరు ముప్వురు పూర్వజన్మమున మూడగ్నులై యుండిరి. వశిష్ఠఋషిశాపమువలన విజితాశ్వునకు పుత్రరూపముతో జన్మించిరి. కాని యోగబలముచే మరల అగ్నిత్వమును పొందిరి.

అన్తర్ధానో నభస్వత్యాం హవిర్ధానమవిన్దత ।
య ఇన్ద్రమశ్వహర్తారం విద్వానపి న జఘ్నివాన్ ॥ 5

అంతర్ధానునకు "నభస్వతి" యను నొక భార్య యుండెను. ఆమె వలన అతడు "హవిర్ధాను" డనునొకపుత్రుని గనెను. అంతర్ధానుడు (విజితాశ్వుడు) పితృయజ్ఞాశ్వమును

హరించినవా డనియెఱింగియు ఇంద్రుని సంహరింపలేదు. అందులకు ఇంద్రుడు సంతుష్టుడై వానికి అంతర్ధానవిద్యను బోధించెను.

రాజ్ఞాం వృత్తిం కరాదానదండశుల్కాదిదారుణామ్ ।
మన్యమానో దీర్ఘసత్రవ్యాజేన విససర్జహ ॥ 6

ఆయంతర్ధానుడు పన్ను తీసికొనుట, దండనమును విధించుట మున్నగురాజుల వృత్తులు ఇతరులకు కష్టములను కలిగించు నవియనిభావించి దీర్ఘకాలవ్యాపి యగునొక యజ్ఞమును చేయునెపముతో తనవృత్తిని విడిచి పెట్టెను.

తత్రాపి హంసం పురుషం పరమాత్మానమాత్మదృక్ ।
యజం స్తల్లోకతామాప కుశలేన సమాధినా ॥ 7

ఆత్మదర్శి యగుఅంతర్ధాను డాయజ్ఞమున భక్తులక్లేశముల నపహరించుపురుషోత్తము నర్చించి పుణ్యరూప మగుసమాధియోగముతో భగవల్లోకమును పొందెను.

హవిర్ధానాద్ధవిర్ధానీ విదురాసూత షట్ సుతాన్ ।
బర్హిషదం గయం శుక్లం కృష్ణం సత్యం జితవ్రతమ్ ॥ 8

విదురా! హవిర్ధానునిభార్య యగుహవిర్ధాని బర్హిషదుడు, గయుడు, శుక్లుడు, కృష్ణుడు, సత్యుడు, జితవ్రతుడు అనునార్గురుపుత్రులను గనెను.

బర్హిషత్సుమహాభాగో హావిర్ధానిః ప్రజాపతిః ।
క్రియాకాండేషు నిష్ణాతో యోగేషు చ కురూద్వహ ॥ 9

కురుశ్రేష్ఠుడ వగువిదురా! వీరిలో మహాత్ము డగుబర్హిషదుడు యజ్ఞాదికర్మకాండల యందును, యోగాభ్యాసమునందును నిపుణు డైయుండెను. వానికి ప్రజాపతిపదవి లభించెను.

యస్యేదం దేవయజనమనుయజ్ఞం వితన్వతః ।
ప్రాచీనాగ్రైః కుశైరాసీదాస్తృతం వసుధాతలమ్ ॥ 10

అత డొకప్రదేశము తరువాత మఱియొకప్రదేశమున వరుసగ ఎన్నియో యజ్ఞములను చేసెను. దానివలన ఈభూమియంతయు పూర్వాగ్ర కుశలద్వారా ఆచ్ఛాదిత మయ్యెను దానిచే ఆయన "ప్రాచీనబర్హి" యని కీర్తింపబడెను.

సాముద్రీం దేవదేవోక్తాముపయేమే శతద్రుతిమ్
యాం వీక్ష్య చారుసర్వాంగీం కిశోరీం సుష్ఠ్వలంకృతామ్ ।
పరిక్రమన్తీముద్వాహే చకమేఽగ్నిః శుకీమివ ॥ 11

విదురా! మహాత్ము డగుప్రాచీనబర్హి బ్రహ్మయొక్క ఆదేశము ననుసరించి సముద్ర కన్య యగుశతద్రుతిని పరిణయమాడెను. సర్వాంగసుందరియు, నవయౌవనసంపన్నయు అగుశతద్రుతి సుందరము లగు నాభరణములచే భూషితయై వివాహకాలమున అగ్నికి ప్రదక్షిణము చేయుచుండెను. అప్పు డగ్ని పూర్వము సుందరి యగుశుకిని అభిలషించినట్లు ఆ శతద్రుతిని గూడ అభిలషించెను.

**విబుధాసురగన్ధర్వమునిసిద్ధనరోరగాః ।**
**విజితాః సూర్యయా దిక్షు క్వణయన్త్యైవ నూపురైః ॥ 12**

నవవివాహిత యగు ఆసముద్రకన్య నూపురధ్వనులచే నలుదిక్కుల నున్నసురలను, అసురులను, గంధర్వులను, మునులను, సిద్ధులను, మనుష్యులను, ఉరగులను జయించెను.

**ప్రాచీనబర్హిషః పుత్రాః శతద్రుత్యాం దశాభవన్ ।**
**తుల్యనామవ్రతాః సర్వే ధర్మస్నాతాః ప్రచేతసః ॥ 13**

శతద్రుతివలన ప్రాచీనబర్హికి పదుగురుపుత్రులు గలిగిరి. వారందఱు ధర్మపరాయణులు, సదాచారులు, తమతమనామములకు దగిన యాచారములు గలవారైరి. వారందఱు "ప్రచేతసు" లని ప్రసిద్ధివడసిరి.

**పిత్రాదిష్టాః ప్రజాసర్గే తపసేఽర్ణవమావిశన్।**
**దశవర్ష సహస్రాణి తపసార్చం స్తపస్పతిమ్ ॥ 14**

**యదుక్తం పథి దృష్టేన గిరీశేన ప్రసీదతా ।**
**తద్ధ్యాయన్తో జపన్తశ్చ పూజయన్తశ్చ సంయతాః ॥ 15**

ప్రచేతసులు తండ్రియాదేశము ననుసరించి ప్రజాసృష్టి చేయవలయు ననుకోరికతో తపస్సునకై సముద్రమున ప్రవేశించి, పదివేలసంవత్సరములు తపస్సుచేసి, శ్రీహరి అర్చన యందు ప్రవృత్తులయిరి. మార్గమున వారికి శివుడు ప్రత్యక్షమయ్యెను. ప్రసన్నుడై ఆయన తమ కుపదేశించిన విషయములను విని ప్రచేతసులు జితేంద్రియులయి కేవల మాశ్రీహరి ధ్యానము, జపము, పూజ చేయసాగిరి.

## శ్రీ విదుర ఉవాచ

**ప్రచేతసాం గిరిత్రేణ యథాసీత్పథిసంగమః ।**
**యదుతాహ హరః ప్రీతస్తన్నో బ్రహ్మన్ వదార్థవత్ ॥ 16**

విదురుడు పలికెను :- మహాత్మా! మార్గమధ్యమున ప్రచేతసులకు శివునితో గలిగిన సమాగమమును, ప్రసన్నుడయి ఆయన వారి కుపదేశించిన విషయములను ఉన్నదియున్న ట్లుగ వివరింపుము.

సంగమః ఖలు విప్రర్షే శివేనేహ శరీరిణామ్ ।
దుర్లభో మునయో దధ్యురసఙ్గాద్యమభీప్సితమ్ ॥ 17

ఆత్మారామోఽపి యస్త్వస్య లోకకల్పస్య రాధసే ।
శక్త్యా యుక్తో విచరతి ఘోరయా భగవాన్ భవః ॥ 18

మైత్రేయమహర్షీ! శివునితోడి సమాగమము దేహధారులకు మిగుల కష్టసాధ్యమైన విషయము. ఇక యితరులవిషయము చెప్పనదేమి? మునులుగూడ సర్వవిధములగు ఆసక్తులను విడచి ఆయనను పొందుటకు నిరంతరము ధ్యానించుచుందురు, కాని సహజముగ పొందలేరు. ఐశ్వర్యవంతు డగుమహాదేవుడు లోకసృష్టిని రక్షించుటకై ప్రళయము నకు హేతుభూత మైనదియు, భయంకర మైనదియు నగుశక్తితో గూడియుండును. (వాస్తవముగ ఆయన పరమాత్మ యగుశ్రీహరి సేవానందమునందే నిమగ్నుడై యుండును.)

## శ్రీ మైత్రేయ ఉవాచ

ప్రచేతసః పితుర్వాక్యం శిరసాదాయ సాధవః ।
దిశం ప్రతీచీం ప్రయయుస్తపస్యాదృతచేతసః ॥ 19

మైత్రేయుడు పలికెను :- విదురా! సాధువు లగుప్రచేతసులు పితృవాక్కును శిరసా వహించి తపస్సుకొఱకై పరమోత్సాహముతో పశ్చిమ దిక్కుగా వెడలిరి.

సముద్రముపవిస్తీర్ణమపశ్యన్ సుమహత్సరః ।
మహన్మన ఇవ స్వచ్ఛం ప్రసన్నసలిలాశయమ్ ॥ 20

నీలరక్తోత్పలాంభోజకల్హారేన్దీవరాకరమ్ ।
హంససారసచక్రాహ్వకారణ్డవనికూజితమ్ ॥ 21

మత్తభ్రమరసౌస్వర్యహృష్టరోమలతాఙ్ఘ్రిపమ్ ।
పద్మకోశరజో దిక్షు విక్షిపత్పవనోత్సవమ్ ॥ 22

కొలదిదూరము వెడలి వారొక గొప్పసరోవరమును జూచిరి. ఆ సరోవరము సముద్రము వలె విస్తృతముగను, మహాత్ములనిర్మలాంతఃకరణమువలె స్వచ్ఛముగను నుండెను. దాని

యందలి సలిలరాశి మిగుల నిర్మలముగ నుండుటచే మత్స్యాదులు సంతోషముగ విహరించుచుండెను. దాని యందు నీలోత్పలములు (నల్లకలువలు), రక్తోత్పలములు (ఎఱ్ఱకలువలు) కమలములు, కల్హారములు, ఇందీవరములు, పద్మములు ప్రస్ఫుటితములై యుండెను. హంసలు, సారసములు, చక్రవాకములు, కారండవములు మున్నగు జలచర పక్షులు నిరంతరము క్రీడోన్మత్తములై యాప్రదేశమును తమకూజనముల ద్వారా ముఖరితము చేయుచుండెను. ఈసరోవరతీరమున వివిధము లగువృక్షములు, లతలు మధుమత్తమధుకర మధురస్వర శ్రవణముచే పులకితములగు చుండెను. అచట వాయువు అన్నిదిక్కులకు పద్మపరాగమును వెదజల్లుచు ఆనందప్రవాహమును విస్తరింపజేయు చుండెను.

తత్ర గాన్ధర్వమాకర్ణ్య దివ్యమార్గమనోహరమ్ ।
విసిస్మ్యూ రాజపుత్రాస్తే మృదంగపణవాద్యను ॥ 23

విదురా! రాజకుమారు లగు ఈప్రచేతసు లాప్రదేశమున మృదంగ పణవాదివాద్యములను వినిరి. అనంతరము మనోహర మగుదివ్యగానధ్వని వారికర్ణ రంధ్రములలో ప్రవేశించెను. దానివలన వారు పరమాశ్చర్యమగ్నులయిరి.

తర్హ్యేవ సరసస్తస్మాన్నిష్క్రామన్తం సహానుగమ్ ।
ఉపగీయమానమమరప్రవరం విబుధానుగైః ॥ 24

తప్త హేమనికాయాభం శితికంఠం త్రిలోచనమ్ ।
ప్రసాదసుముఖం వీక్ష్య ప్రణేముర్జాతకౌతుకాః ॥ 25

పిమ్మట వారు తప్తకాంచనసన్నిభుడు, నీలకంఠుడు, భక్తానుగ్రహసుముఖుడు, దేవతాశ్రేష్ఠుడు, త్రిలోచనుడు అగుశంకరుడు అనుచరవర్గముతో గూడి ఆ సరోవరమునుండి బయటకు వచ్చుట చూచిరి. గంధర్వాదిదేవతలు స్తుతించుచు ఆయన ననుసరించుచుండిరి. ప్రచేతసు లిదిచూచి మిగుల కుతూహలవిశిష్టులై, దేవాదిదేవు డగుఆమహాదేవునకు ప్రణమిల్లిరి.

మ. *కని రాతాపసపుంగవుల్ దివిజలోకశ్రేష్ఠునిం దప్తకాం*
*చనవర్ణున్ సనకాదియోగిజనభాస్వద్గీయమానున్ ద్రిలో*
*చనుభక్తానుగుణానుగున్ సుమహితైశ్వర్యున్ బ్రసాదాభిశో*
*భనవక్త్రున్ నిహతాఘకర్తృజనసంపద్భద్రునిన్ రుద్రునిన్* (4-695)

స తాన్ ప్రపన్నార్తిహరో భగవాన్ ధర్మవత్సలః ।
ధర్మజ్ఞాన్ శీలసంపన్నాన్ ప్రీతః ప్రీతానువాచ హ ॥ 26

ఆశ్రితజనులసంతాపహారియు, భక్తవత్సలుడు, ఐశ్వర్యశాలియు నగు శంభువు సంతుష్టుడై ధర్మజ్ఞులు, సచ్చరిత్రులు, హృష్టచిత్తులు నగు ప్రచేతసులతో నిట్లు పలికెను.

## శ్రీరుద్ర ఉవాచ

యూయం వేదిషదః పుత్రా విదితం వశ్చికీర్షితమ్ ।
అనుగ్రహాయ భద్రం వ ఏవం మే దర్శనం కృతమ్ ॥ 27

రుద్రుడు పలికెను :- మీరు బర్హిషదుని పుత్రులు, నేను మీసంకల్పము నెఱింగితిని. మీకు శుభ మగుగాక! నేను మీపై దయజూపుటకే మీ కిట్టిదర్శనము నొసంగితిని.

యః పరం రహసః సాక్షాత్ త్రిగుణాజ్జీవసంజ్ఞితాత్ ।
భగవన్తం వాసుదేవం ప్రపన్నః స ప్రియో హి మే ॥ 28

రహస్యముకంటె రహస్య మైనవాడు, ప్రకృతిపురుషులకు నియామకు డైనవాడు నగు వాసుదేవభగవానునిచరణములను అనన్యభావముతో శరణు జొచ్చుడు. ఆయనయె నాకు ప్రియమైనవాడు.

స్వధర్మనిష్ఠః శతజన్మభిః పుమాన్
విరించతామేతి తతః పరం హి మామ్ ।
అవ్యాకృతం భాగవతోఽథ వైష్ణవం
పదం యథాహం విబుధాః కలాత్యయే ॥ 29

స్వధర్మనిష్ఠ డగుమానవుడు బహుజన్మలచే బ్రహ్మపదమును పొందును. అనంతరము నన్ను పొందును. కాని విష్ణుభక్తుడైనవాడు దేహాన్తమున ప్రపంచాతీతు డగువిష్ణువు యొక్క పదమును పొందును. రుద్రరూపుడ నగు నేను, ఈయాధికారికదేవతలు విష్ణుభక్తులమై లింగశరీరము నశింపగా ప్రపంచాతీత మగు వైష్ణవపదమును పొందెదము.

అథ భాగవతా యూయం ప్రియాః స్థ భగవాన్ యథా ।
న మద్భాగవతానాం చ ప్రేయానన్యోఽస్తి కర్హిచిత్ ॥ 30

మీరు విష్ణుభక్తులు, అందువలన భగవానునివలె మీరుకూడ నాకు ప్రియమైనవారే. భగవద్భక్తులకు గూడ నాకంటె అధికప్రియ మైనవ్యక్తి మఱియెవ్వడును లేడు.

**ఇదం వివిక్తం జప్తవ్యం పవిత్రం మంగలం పరమ్ ।**
**నిఃశ్రేయసకరం చాపి శ్రూయతాం తద్వదామి వః ॥ 31**

ఇపుడు నేను మీకు పవిత్రము, మంగళమయము, కల్యాణకారకము నగునొక స్తోత్రమును వినిపింతును. దీనిని మీరు శుద్ధభావముతో జపింపుడు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

**ఇత్యనుక్రోశహృదయో భగవానాహ తాఞ్ఛివః ।**
**బద్ధాంజలీన్ రాజపుత్రాన్ నారాయణపరం వచః ॥ 32**

మైత్రేయుడు పలికెను :- విదురా! ఐశ్వర్యశాలి యగుశంభు విట్లుదయాపరవశుడయి రాజపుత్రులకు నారాయణవిషయకము లగుమాటలను జెప్ప నారంభించెను. వారుగూడ దోసిలియొగ్గి శివునివాక్కులను శ్రవణముచేయ నారంభించిరి.

## శ్రీ రుద్ర ఉవాచ

**జితం త ఆత్మవిద్వర్య స్వస్తయే స్వస్తిరస్తు మే ।**
**భవతారాధసా రాద్ధం సర్వస్మా ఆత్మనే నమః ॥ 33**

రుద్రభగవానుడు విష్ణువును స్తుతించి పలుక నారంభించెను - "దేవా! నీవు ఉన్నత కోటికి జెందిన ఆత్మవేత్త లగుపురుషులకు ఆత్మానందమును గలుగజేయుచున్నావు. అందువలన నీవు సర్వోత్కృష్టుడవు. దానివలన నాకుగూడ ఆత్మానందము కలుగుగాక! నీ వెల్లపుడు ఆత్మానందమునందే యుందువు. నీవు సర్వులకు ఆత్మవు, సర్వమయుడవు, సర్వస్వరూపుడవు. అట్టినీకు నమస్కారము.

**నమః పంకజనాభాయ భూతసూక్ష్మేన్ద్రియాత్మనే ।**
**వాసుదేవాయ శాన్తాయ కూటస్థాయ స్వరోచిషే ॥ 34**

దేవా! నీనాభిదేశమునుండి సర్వలోకాత్మక మగుపద్మ ముత్పన్నమయ్యెను. నీవు పంచభూతములకు, తన్మాత్రలకు, ఇంద్రియములకు నియామకుడవు. చిత్తమున కధిష్ఠాతవు, శాంతుడవు, నిర్వికారుడవు, స్వప్రకాశస్వరూపుడవు. అట్టినీకు నమస్కారము.

**సంకర్షణాయ సూక్ష్మాయ దురన్తాయాన్తకాయ చ ।**
**నమో విశ్వప్రబోధాయ ప్రద్యుమ్నాయాంతరాత్మనే ॥ 35**

నీవు అవ్యక్తుడవు, అనంతుడవు. ముఖాగ్నిద్వారా నీవు త్రిలోకములను దహించుచుందువు. నీ వహంకారమున కధిష్ఠాత వగుసంకర్షణుడవు, విశ్వప్రకాశకుడవు, బుద్ధికధిష్ఠాత యగుప్రద్యుమ్నుడవు. అట్టి నీకు నమస్కారము.

నమో నమోఽనిరుద్ధాయ హృషీకేశేన్ద్రియాత్మనే ।
నమః పరమహంసాయ పూర్ణాయ నిభృతాత్మనే ॥ 36

నీ వింద్రియముల కధినాయకమైన మనస్సునకుగూడ అధిష్ఠాత వగు అనిరుద్ధుడవు. నీవు సూర్యస్వరూపుడవై నీతేజస్సుచే విశ్వవ్యాప్తుడవై యున్నావు. నీకు వృద్ధిక్షయములు లేవు. అట్టి నీకు మాటిమాటికి నమస్కరించుచున్నాను.

స్వర్గాపవర్గ ద్వారాయ నిత్యం శుచిషదే నమః ।
నమో హిరణ్యవీర్యాయ చాతుర్హోత్రాయ తన్తవే ॥ 37

నీవు స్వర్గమోక్షములకు ద్వారస్వరూపుడవు. నీవు నిత్య మంతఃకరణమున నుందువు. నీ వగ్నిస్వరూపుడవు, చాతుర్హోత్రకర్మలకు సాధనమయినవాడవు, నీ వీకర్మలను విస్తరింప జేయుదువు. అట్టినీకు నమస్కారము.

నమ ఊర్జ ఇషే త్రయ్యాః పతయే యజ్ఞ రేతసే ।
తృప్తిదాయ చ జీవానాం నమః సర్వరసాత్మనే ॥ 38

నీవు చంద్రరూపుడవు; అందువలన దేవతలకు, పితరులకు అన్న స్వరూపుడవు; జల రూపుడవు, అందువలన జీవులకు తృప్తినిచ్చునట్టివాడవు. నీవు వేదముల కధీశ్వరుడవు - హరుడవు. అట్టినీకు నమస్కారము.

సర్వసత్త్వాత్మదేహాయ విశేషాయ స్థవీయసే ।
నమస్త్రైలోక్యపాలాయ సహ ఓజో బలాయ చ ॥ 39

నీవు పృథివీరూపుడ వగువిరాట్పురుషుడవు. కనుక నీవు సర్వ ప్రాణులదేహ మైయున్నావు. నీవు వాయురూపుడవు. అందువలన దేహబలము, మనోబలము నీవే. అట్టినీకు నమస్కారము.

అర్థలింగాయ నభసే నమోఽన్తర్బహిరాత్మనే ।
నమః పుణ్యాయ లోకాయ అముష్మై భూరివర్చసే ॥ 40

నీవు పదార్థజ్ఞాపకుడవు, బాహ్యాభ్యంతరము లనువ్యవహారముల కాలంబనస్వరూపు డవు. ఆకాశముగూడ నీ స్వరూపమే. నీవు సర్వోత్తముడవు, ప్రచురజ్యోతి స్స్వరూపుడవు. అట్టినీకు నమస్కారము.

ప్రవృత్తాయ నివృత్తాయ పితృదేవాయ కర్మణే ।
నమోఽధర్మవిపాకాయ మృత్యవే దుఃఖదాయ చ ॥ 41

ప్రవృత్తినివృత్తికర్మలద్వారా లభించుదేవపితృలోకములు గూడ నీవే. అధర్మఫలస్వరూప మగుదుఃఖమును గలుగజేయు మృత్యువుగూడ నీవే. అట్టినీకు నమస్కారము.

**నమస్త ఆశిషామీశ మనవే కారణాత్మనే ।**
**నమో ధర్మాయ బృహతే కృష్ణాయాకుంఠమేధసే ।**
**పురుషాయ పురాణాయ సాంఖ్యయోగేశ్వరాయ చ ॥ 42**

దేవా! నీవు సర్వవాంఛల యొక్క, సర్వకర్మలయొక్క ఫలదాతవు, సర్వజ్ఞుడవు, పురాణపురుషుడవు, పద్మనాభరూపముతో నీనిట్టూర్పులనుండి ప్రవర్తిత మయినవేదము ద్వారా ధర్మమును ప్రవర్తింపజేసితివి. విస్తరించుస్వభావము గలధర్మముగూడ నీవే. నీవు కపిలదత్తాత్రేయాద్యవతారభేదము ద్వారా ఆయాయధికారవ్యక్తులకై సాంఖ్యయోగాది ధర్మములను ప్రవర్తింపజేసితివి. ఇంకను నీవు స్వయముగ కృష్ణస్వరూపముద్వారా పరబ్రహ్మరూపముతో కుంఠధర్మరహిత మగునధోక్షజజ్ఞానమును ప్రవర్తింపజేసితివి. అట్టి నీకు నమస్కారము.

**శక్తిత్రయ సమేతాయ మీఢుషేఽహంకృతాత్మనే ।**
**చేత ఆకూతిరూపాయ నమో వాచో విభూతయే ॥ 43**

నీవు అహంకారాత్ముడవు. కర్త, కర్మ, కరణము లను శక్తిత్రయ సంపన్నుడ వగు రుద్రుడవు. నీవు జ్ఞానక్రియారూపుడవు. నీనుండియే వాక్యములవివిధసృష్టి జరిగినది. అట్టి నీకు నమస్కారము.

**దర్శనం నో దిదృక్షూణాం దేహి భాగవతార్చితమ్ ।**
**రూపం ప్రియతమం స్వానాం సర్వేన్ద్రియ గుణాంజనమ్ ॥ 44**

దేవా! నీరూపము భగవద్భక్తులచే నిత్య మర్చితము, సమాదృతము నైనట్టిది, నీ భక్తులకు ప్రియతమ మైనది, సర్వేంద్రియవిషయములకు విషయస్వరూప మైనది. మేము నీయారూపమును దర్శింప నభిలషించుచున్నాము. మాకు నీదర్శన మిమ్ము.

**స్నిగ్ధప్రావృడ్ఘనశ్యామం సర్వసౌందర్యసంగ్రహమ్ ।**
**చార్వాయతచతుర్బాహుం సుజాతరుచిరాననమ్ ॥ 45**

నీ యీరూపము వర్షాకాలమందలి స్నిగ్ధమేఘమువలె శ్యామవర్ణము కలది, సర్వ సౌందర్యసారస్వరూపమయినది, సుందరములయిన విశాలము లయిన చతుర్భుజములు గలది, సుందరవదనముచే శోభిల్లునది.

పద్మకోశపలాశాక్షం సున్దరభ్రు సునాసికమ్ ।
సుద్విజం సుకపోలాస్యం సమకర్ణవిభూషణమ్ ॥ 46

నీ రూపము పద్మకోశమునకు నడుమగలపత్రములవంటి నేత్రములు గలది, మంచి కనుబొమలు గలది, సుందరమయిన నాసిక గలది, మంచి దంతములుగలది, మనోహరము లగుకపోలములతో గూడిన ముఖమండలము గలది. సమముగ నున్న కర్ణములె భూషణము లుగా గలది.

ప్రీతిప్రహసితాపాంగమలకైరుపశోభితమ్ ।
లసత్పంకజకింజల్కదుకూలం మృష్టకుండలమ్ ॥ 47

ప్రేమచే ప్రహసితము లగుక్రీగంటిచూపులుగలది, ముంగురులచే శోభిల్లునట్టిది, పద్మకేసరములవంటి పట్టువస్త్రముతో శోభిల్లునట్టిది, ఉజ్జ్వలము లైనకుండలములు గలది.

స్ఫురత్కిరీటవలయహారనూపురమేఖలమ్ ।
శంఖచక్రగదాపద్మమాలామణ్యుత్తమర్ధిమత్ ॥ 48

ప్రకాశించు కిరీటములు, వలయములు, హారములు, నూపురములు, మొలనూలు గలది; శంఖము, చక్రము, గద, పద్మము, వనమాల, మణులు మున్నగువానిచే అధికముగ శోభిల్లునది.

సింహస్కన్ధత్విషో బిభ్రత్ సౌభగగ్రీవకౌస్తుభమ్ ।
శ్రియానపాయిన్యాక్షిప్తనికషాశ్మోరసోల్లసత్ ॥ 49

పూరరేచకసంవిగ్నవలివల్గుదలోదరమ్ ।
ప్రతిసంక్రామయద్విశ్వం నాభ్యావర్తగభీరయా ॥ 50

శ్యామశ్రోణ్యధిరోచిష్ణుదుకూలస్వర్ణ మేఖలమ్ ।
సమచార్వఙ్ఘ్రిజఙ్ఘోరునిమ్నజానుసుదర్శనమ్ ॥ 51

పదాశరత్పద్మపలాశరోచిషా
నఖద్యుభిర్నోఽన్తరఘం విధున్వతా ।
ప్రదర్శయ స్వీయమపాస్త సాధ్వసం
పదం గురో మార్గగురు స్తమో జుషామ్ ॥ 52

ఈ శ్రీమూర్తికంఠమున కౌస్తుభమణి శోభిల్లుచున్నది. దాని సౌందర్యమును గూర్చి యికచెప్పునదేమి? సింహము యొక్క స్కంధమున పొడవయినకేసరములు వ్యాపించి యున్నట్లు ఆకౌస్తుభమణి అన్నివైపుల మనోహర మగుకాంతిని విస్తరింపజేసి విలసిల్లు చున్నది. ఆకౌస్తుభమణిశోభ ద్వారా వక్షస్థలము మిగులశోభిల్లుచున్నది. అది స్వర్ణ రేఖాంకిత మగు ఒరపిడిరాయినిగూడ తిరస్కరించుచున్నట్లుండెను.

త్రివళులు నిఃశ్వాసప్రశ్వాసములచే కంపితములై అశ్వత్థపత్రసదృశ మగుఉదరము నకు శోభను గలుగజేయుచున్నవి. ఆవర్తమువలె గంభీరముగ ఉన్ననాభిప్రదేశమును జూచిన దీనినుండియే యీవిశ్వ మంతయు వెలువడి మరల దానియందే ప్రవేశించు చున్నట్లు తోచుచున్నది. శ్యామవర్ణ మగునితంబము మనోహర మగుపీతాంబరముచే జుట్టబడియున్నది. దానియందు బంగారుమొలత్రాడు విరాజిల్లి యింకను దాని కెక్కువగ శోభను గలుగజేయుచున్నది. పాదములు, పిక్కలు, ఊరువులు పరస్పరము సమానములు సుందరములు. జానువు లున్నతములు కాకుండగ చూచుటకు అందముగనున్నవి. సుందరమయిన శరత్కాలపద్మపలాశముల వలె దీప్తిమంతము లగుపాదములయందు నఖరాజి శోభిల్లుచున్నది. వాని కాంతిద్వారా మావంటిజీవులలోని అజ్ఞానాంధకారము వినష్టమగుచున్నది. ఆయన శ్రీచరణములు ప్రోజ్జ్వలము లగుప్రదీపస్వరూపములు. వానివలన శరణు జొచ్చిన మానవులసంసారభయము తొలగును. దేవా! అజ్ఞానమున మునిగియున్న జీవులకు మార్గమును జూపించు గురుదేవుడవు. నీవు మాకు నీయీరూపమును ప్రదర్శింపుము.

**ఏతద్రూపమనుధ్యాయమాత్మశుద్ధిమభీప్సతా ।**
**యద్భక్తియోగోఽభయదః స్వధర్మమనుతిష్ఠతామ్ ॥ 53**

ఆత్మశుద్ధినిగోరు భక్తు డీరూపమును మాత్రము ధ్యానించును, కాని ప్రత్యక్షముగ దర్శింపజాలడు. ఆత్మధర్మము ననుష్ఠించుభక్తులకు ఈ రూపము భక్తి యోగ ప్రభావముచే అభయప్రదమగును.

**భవాన్ భక్తిమతా లభ్యో దుర్లభః సర్వదేహినామ్ ।**
**స్వారాజ్యస్యాప్యభిమత ఏకాన్తే నాత్మవిద్గతిః ॥ 54**

స్వర్గరాజ్యభోగముల ననుభవించు బ్రహ్మాదిదేవతలకు నీవు స్పృహణీయుడ వయ్యును స్వర్గాదులయందు విరక్తులై ఐకాంతికభక్తితో నిన్ను ఆరాధించు ఆత్మవేత్తల అధోక్షజ జ్ఞానమునకు గతివై యున్నావు. నీవు సర్వదేహులకు దుర్లభుడ వయ్యును నీభక్తులకు మాత్రము సులభుడవే.

తం దురారాధ్యమారాధ్య సతామపి దురాపయా ।
ఏకాన్తభక్త్యా కో వాంఛేత్పాదమూలం వినా బహిః ॥ 55

నీవు దురారాధ్యుడవు; ఐకాంతికభక్తి సత్పురుషులకుగూడ దుర్లభమే. నిన్నట్టి భక్తితో ప్రసన్నునిగ జేసి నీపాదపద్మ సేవను కాక ఇతరమగు బహిర్విషయములను గోరుమానవు డెవ్వడయిన నుండునా?

యత్ర నిర్విష్టమరణం కృతాన్తో నాభిమన్యతే ।
విశ్వం విధ్వంసయన్ వీర్యశౌర్యవిస్ఫూర్జితభ్రువా ॥ 56

కాలము శౌర్యపరాక్రములచే అదరునట్టి తనకనుబొమలద్వారా విశ్వమును విధ్వంసము చేయుట సత్యము. కాని నీపాదములను శరణుజొచ్చిన మానవునిపై అది తనయధికారమును జూపజాలదు.

చ॥ *ఎనసినభక్తియోగమున నే భవదీయపదాబ్జ మొందఁగా*
*ననయముఁ గోరువాఁడు చటులాగ్రహభీషణవీర్యశౌర్యత*
*ర్జనములచే ననూనగతి సర్వజగంబులు సంహరించు న*
*య్యనుపముఁ డైనకాలునిభయంబును బొందఁడు సుమ్ము కావునన్.*(4-713)

క్షణార్ధేనాపి తులయే న స్వర్గం నాపునర్భవమ్ ।
భగవత్సంగిసంగస్య మర్త్యానాం కిముతాశిషః ॥ 57

భగవత్సేవకులతోడి సాహచర్య మొక్క అర్ధక్షణకాలము లభించినను దానివలన మర్త్యలోకసుఖముల నట్లుండనీయుము, స్వర్గమును చివరకు మోక్షమును గూడ తుచ్ఛము గనే భావింతును.

కం॥ *హరి నీ భక్తులతోడను*
*నిరుపమగతిఁ జెలిమి సేయునిమిషార్ధముతో*
*సరి గాదు మోక్ష మనిన న*
*చిరశుభ మగుమర్త్యసుఖముఁ జెప్పఁగ నేలా.* (4-715)

అథానఘాఙ్ఘ్రేస్తవ కీర్తితీర్థయో -
రన్తర్బహిః స్నానవిధూతపాప్మనామ్ ।
భూతేష్వనుక్రోశసుసత్త్వశీలినాం
స్యాత్సంగమోఽనుగ్రహ ఏష నస్తవ ॥ 58

నీచరణములు పాపరాశిని నశింపజేయునట్టివి. లోపల నీకీర్తితీర్థము నందు, బయట గంగయందు స్నానములజేసి పాపములను క్షాళనమొనర్చిన వారు అనగా బాహ్యాభ్యంతరముల యందు శుచియైనవారు జీవులపై దయ, రాగద్వేషరహిత మగుచిత్తము, సరళత మున్నగు గుణములతో గూడినవారు నగునీభక్త జనులసాంగత్యము మా కెప్పుడును కలుగుగాక! అట్లయిన నాపై నీకనుగ్రహము గలదనుట కిదియే నిదర్శనము.

న యస్య చిత్తం బహిరర్థవిభ్రమం
తమోగుహాయాం చ విశుద్ధమావిశత్ ।
యద్భక్తియోగానుగృహీతమంజసా
మునిర్విచష్టే నను తత్ర తే గతిమ్ ॥ 59

సత్పురుషులయందలి భక్తియోగముచే అనుగృహీతము, విశుద్ధము నగు ఏమానవుని చిత్తము బాహ్యవిషయములయందు లగ్నము కాదో, అజ్ఞాన మనుగుహయందు లయమును పొందదో అట్టి మానవుడు అనాయాసముగ మననశీలుడయి నీతత్త్వమును పొందగలుగును.

చ. *సరసిజనాభ సత్పురుషసంగసమంచితభక్తియోగవి*
*స్ఫురణ ననుగ్రహింపఁబడి శుద్ధము నొందినవానిచిత్తమ*
*స్థిరబహిరంగముం గనదు చెందదు భూరితమస్స్వరూపసం*
*సరణగుహం జిరంబు గనఁ జాలు భవన్మహనీయతత్త్వమున్.* (4-718)

యత్రేదం వ్యజ్యతే విశ్వం విశ్వస్మిన్నవభాతి యత్ ।
తత్త్వం బ్రహ్మపరం జ్యోతి రాకాశ మివ విస్తృతమ్ ॥ 60

ఈవిశ్వమున కాధారస్వరూపు డగుభగవానునియందు చిదచిదాత్మక మగుసర్వ విశ్వము అవస్థిత మైయున్నది. ఆయనయె పరమాత్మస్వరూపముతో సర్వజగత్తులో వ్యాప్తుడయియున్నాడు. బ్రహ్మతత్త్వము పరమ జ్యోతిర్మయము, ఆకాశమువలె అపరిచ్ఛిన్నము నైయున్నది.

యో మాయయేదం పురురూపయాసృజద్ -
బిభర్తి భూయః క్షపయత్యవిక్రియః ।
యద్భేదబుద్ధిః సదివాత్మదుఃస్థయా
తమాత్మతన్త్రం భగవన్ ప్రతీమహి ॥ 61

దేవా! నీవు వికారరహితుడవు, బహురూపములుగల మాయచే ఈవిశ్వము యొక్క సృష్టిస్థితిలయముల జేయుచున్నావు. నీమాయయే ఇతర వ్యక్తులయందు భేదబుద్ధిని

కలిగించుచున్నది, కాని నీపైనగాని, నీభక్తుల పైనగాని అది తనసామర్థ్యమును జూపజాలదు. దేవా! నీవు స్వతంత్ర పురుషుడవు. దయజూపుము, దానివలన మేము నిన్ను తెలిసికొనగలము.

క్రియాకలాపైరిదమేవ యోగినః
శ్రద్ధాన్వితాః సాధు యజన్తి సిద్ధయే ।
భూతేన్ద్రియాన్తఃకరణోపలక్షితం
వేదే చ తన్త్రే చ త ఏవ కోవిదాః ॥ 62

నీవు భూతములకు ఇంద్రియములకు అంతఃకరణమునకు నియామకుడవైయున్నావు. భక్తియోగులు సిద్ధికై శ్రద్ధాన్వితచిత్తులై భక్తులద్వారా నీచిదానందస్వరూపమును సేవింతురు. వారే వేదమునందు, సాత్వత తంత్రమునందు పండితులు. కాని నీ యీ నిత్యస్వరూపము నాదరింపక కేవలము జ్ఞానమును బొందుటకు ప్రవృత్తులగువారు విజ్ఞులు కారు.

త్వమేక ఆద్యః పురుషః సుప్తశక్తి -
స్తయా రజస్సత్త్వతమో విభిద్యతే ।
మహానహం ఖం మరుదగ్ని వార్ధరాః
సురర్షయో భూతగణా ఇదం యతః ॥ 63

నీవే ఆదిపురుషుడవు; సృష్టికి పూర్వము నీమాయాశక్తి నిద్రించి యుండును. కాని కాలము ననుసరించి నీయామాయాశక్తి ప్రభావముచేతనే సత్త్వరజస్తమస్సు లనుమూడు గుణములు పరస్పరము విభిన్నము లగును. చివరకు దానినుండి మహత్తత్త్వము, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి, దేవతలు, ఋషులు, భూతములు, యితరప్రాణుల దేహములు, ఈ జగత్తు క్రమక్రమముగ సృష్టియగును.

సృష్టం స్వశక్త్యేదమనుప్రవిష్ట -
శ్చతుర్విధం పురమాత్మాంశకేన ।
అథో విదుస్తం పురుషం సన్త మన్త -
ర్భుఙ్క్తే హృషీకై ర్మధుసారఘం యః ॥ 64

ఇట్లు నీవు నీమాయాశక్తిచే చతుర్విధములగు (జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములు) శరీరములను సృష్టించి నీయేకాంశతో అంతర్యామిరూపముతో దానియందు ప్రవేశించియుందువు. పురము అనగా శరీరమున శయనించుటవలన పండితులు నిన్ను పురుషు డనిచెప్పుచున్నారు. కాని నీవు జీవుడవు కావు. తేనెటీగలు తాము

సృష్టిచేసిన మధువును గ్రావునట్లు అవిద్యచే ఆవృతుడయి జీవుడు క్షుద్రవిషయముల ననుభవించును.

స ఏష లోకానతిచండవేగో
వికర్షసి త్వం ఖలు కాలయా నః ।
భూతాని భూతైరనుమేయతత్త్వో
ఘనావలీర్వాయురివావిషహ్యః ॥ 65

ప్రభూ! ఈ విశ్వమును సృష్టించి దానిలో అంతర్యామిరూపముతో ప్రవేశించినవాడవు నీవే. నీ స్వరూప మలక్ష్యమయినది. నీ వేగ మతిప్రచండమయినది. సుదుస్సహ మగువాయువు మేఘరాశిని నలువైపుల పాఱద్రోలు నట్లు నీవు గూడ ప్రాణులద్వారా ప్రాణుల సంహరించు చున్నావు.

ప్రమత్తముచ్చైరితి కృత్యచిన్తయా
ప్రవృద్ధలోభం విషయేషు లాలసమ్ ।
త్వమప్రమత్తః సహసాభిపద్యసే
క్షుల్లేలిహానోఽహి రివాఖుమన్తకః ॥ 66

అత్యంతవిషయాసక్తు డగుమానవునిలోభము క్రమముగ వృద్ధిపొందుచుండును. దానివలన అతడేపని నెప్పుడు చేయవలయు ననుభావనతో మిగుల ప్రమత్తుడైయుండును. నీ వప్రమత్తుడవై అంతకస్వరూపముతో నాకలిగొనియున్నట్టియు చంచల మగుజిహ్వ గలదియు నగుసర్పము మూషికమును పట్టుకొనునట్లు ఈ జీవుల నందఱను అతర్కిత భావముతో ఆక్రమింతువు.

కస్త్వత్పదాబ్జం విజహాతి పండితో
యస్తేఽవమానవ్యయమాన కేతనః ।
విశంకయాస్మద్గురురర్చతి స్మయద్ -
వినోపపత్తిం మనవశ్చతుర్దశ ॥ 67

నీపట్ల అనాదరము చూపినమానవుడు నాశమును పొందును. నాశభయముతో లోకగురు వగుబ్రహ్మవఱకు నీచరణారవిందముల నర్చించుచుందురు. పదునలుగురు మనువులు గూడ దృఢవిశ్వాసముతో నిన్నే అర్చించుచుందురు. అట్టిచో నికపండితు డైనయేవ్యక్తి నీపాదపద్మములను పరిత్యజించును?

చ॥ *అనిశము నస్మదీయగురుఁ డైనసరోరుహసంభవుండు న*
*మ్మనువులు నాత్మసంశయము మాని భజించు భవత్పదాబ్జముల్*
*మనమున నిల్పి యుష్మదవమానమహోవ్యథఁ జెందునట్టిస*
*జ్జనుఁడు పరిత్యజించునె భుజంగమతల్పక భక్తకల్పకా.* (4-730)

అథ త్వమసి నో బ్రహ్మ పరమాత్మన్ విపశ్చితామ్ ।
విశ్వం రుద్రభయధ్వస్తమకుతశ్చిద్భయాగతి: ॥ 68

దేవా! ఈవిశ్వము రుద్రునిభయముతో విధ్వస్తమగుచున్నది. ఈ సమయమున నీవే మాకు గతివి. నీవు మాకు గతివి యైనచో ఇక యే వస్తువువలన గూడ మాకు భయము కలుగు ననుసందేహ ముండదు.

ఇదం జపత భద్రం వో విశుద్ధానృపనన్దనా: ।
స్వధర్మమనుతిష్ఠన్తో భగవత్యర్పితాశయా: ॥ 69

రాజకుమారులారా! మీరు విశుద్ధచిత్తముతో భగవానునకు మనస్సు నర్పించి భగవద్భక్తి ననుష్ఠించుచు ఈ స్తోత్రమును జపింపుడు. దీనివలననే మీకు శుభములు గలుగును.

తమేవాత్మానమాత్మస్థం సర్వభూతేష్వవస్థితమ్ ।
పూజయధ్వం గృణన్తశ్చ ధ్యాయన్తశ్చాసకృద్ధరిమ్ ॥ 70

ఆత్మయం దున్న హరి ఆంతర్యామిరూపముతో సర్వభూతముల యొక్క అంత: కరణమున అధిష్ఠించియున్నాడు. నిరంతర మాయన గుణములను గీర్తించుచు, స్మరించుచు ఆయననే ఆరాధింపుడు.

యోగాదేశముపాసాద్య ధారయన్తో మునివ్రతా: ।
సమాహితధియ: సర్వ ఏతదభ్యసతాదృతా: ॥ 71

మీరు నానుండి యీస్తోత్రమును పొంది మనస్సున నిలుపుకొనుడు. మునివ్రతులు, సంయతచిత్తులు నై ఆదరముతో నీస్తోత్రమును అభ్యసింపుడు.

ఇదమాహ పురాస్మాకం భగవాన్ విశ్వసృక్పతి: ।
భృగ్వాదీనామాత్మజానాం సిసృక్షు: సంసిసృక్షతామ్ ॥ 72

పూర్వకాలమున ఐశ్వర్యవంతు డగుబ్రహ్మ సృష్టిచేయదలచి నాకు సృష్టికార్యోన్ముఖు లగుభృగువు మున్నగునాత్మజులకు ఈ స్తోత్రమును బోధించెను.

తే వయం నోదితాః సర్వే ప్రజాసర్వే ప్రజేశ్వరాః ।
అనేన ధ్వస్తతమసః సిసృక్ష్మో వివిధాః ప్రజాః ॥ 73

ఈ ప్రజాపతులు, నేను బ్రహ్మచే ప్రజాసృష్టివిషయమున ప్రేరితులమై, యీస్తోత్ర ప్రభావముచే అజ్ఞానమును నాశనముచేసి వివిధ ప్రజాసృష్టుల నొనరించితిమి.

అథేదం నిత్యదా యుక్తో జపన్నవహితః పుమాన్ ।
అచిరాచ్ఛ్రేయ ఆప్నోతి వాసుదేవపరాయణః ॥ 74

అందువలన ఏకాగ్రచిత్తముతో విషయములయందు అనాసక్తుడై, వాసుదేవుని మాత్రమే ఆశ్రయించి నిత్య మీస్తోత్రమును జపించుమానవుడు వెంటనే శుభమును పొందగలసమర్థు డగును.

శ్రేయసామిహ సర్వేషాం జ్ఞానం నిశ్శ్రేయసం పరమ్ ।
సుఖం తరతి దుష్పారం జ్ఞాననౌర్వ్యసనార్ణవమ్ ॥ 75

ఈ లోకమున నున్నశ్రేయస్సు లన్నింటిలోను శుద్ధభగవద్ జ్ఞానమే అంతిమ శ్రేయస్సు. జ్ఞాన మను నౌక నాశ్రయించినవాడు దుస్తరము లగువాసనలచే నిండియున్న సంసార సాగరమును అనాయాసముగ దాటగలడు.

య ఇమం శ్రద్ధయా యుక్తో మద్గీతం భగవత్ స్తవమ్ ।
అధీయానో దురారాధ్యం హరిమారాధయత్యసౌ ॥ 76

నేను గానముచేసిన యీభగవత్స్తోత్రమును శ్రద్ధతో పఠించువాడు దురారాధ్యు డగుశ్రీహరిని గూడ అనాయాసముగ ప్రసన్నునిగ జేయగలడు.

విన్దతే పురుషోఽముష్మాద్యద్యదిచ్ఛత్యసత్వరన్ ।
మద్గీతగీతాత్సుప్రీతాచ్ఛ్రేయసా మేకవల్లభాత్ ॥ 77

మానవుడు స్థిరచిత్తముతో నేను గానముచేసిన యీస్తోత్రముద్వారా సర్వశ్రేయస్సులకు నైకాశ్రయు డగుభగవానుని సంతుష్టిపఱచి ఆయనను ఏఫలమునకై ప్రార్థించునో అది వానికి లభించును.

య ఇదం కల్య ఉత్థాయ ప్రాంజలిః శ్రద్ధయాన్వితః ।
శృణుయాచ్ఛ్రావయేన్మర్త్యో ముచ్యతే కర్మబంధనైః ॥ 78

ఉషఃకాలమున లేచి శ్రద్ధతో గూడినవాడయి దోసిలియొగ్గి యీస్తోత్రమును శ్రవణము చేసినను లేదా ఇతరులకు వినిపించినను మానవుడు సర్వ కర్మబంధనములనుండి ముక్తుడగును.

గీతం మయేదం నర దేవనన్దనాః
పరస్య పుంసః పరమాత్మనః స్తవమ్ ।
జపన్త ఏకాన్తధియస్తపో మహత్ -
చరధ్వమన్తే తత ఆప్స్యథేప్సితమ్ ॥ 79

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే రుద్రగీతం నామ
చతుర్వింశోఽధ్యాయః ॥

రాజకుమారులారా! పురుషోత్తముడు, పరమాత్మయు నగు శ్రీహరి యొక్క యీ స్తోత్రమును నేను మీకడ కీర్తించితిని. ఏకాగ్రచిత్తముతో దీనిని జపించుచు గొప్ప తపస్సు జేయుడు. దానివలన అంతమున మీ రభీష్ట ఫలమును పొందెదరు.

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణమందలి
చతుర్థస్కంధములోని ఇరువదినాల్గవ
అధ్యాయము సమాప్తము.





# ఇరువదియైదవ అధ్యాయము

## పురంజనోపాఖ్యాన ప్రారంభము

కథాసారము :- ఈయధ్యాయమున రుద్రునియుపదేశము ననుసరించి ప్రచేతసులు శ్రీహరితపస్సునందు ప్రవృత్తులు కాగా వారితండ్రి యగుప్రాచీనబర్హికడకు నారదుడు వచ్చుట, పురంజనకథ నెపముతో భగవత్సేవకు విముఖమైనదియు, భోగబుద్ధి సాంగత్యము వలన నవద్వారవిశిష్టమైనదియు నగు దేహమున కధీశ్వరు డుగమానవుని వివిధసంసార విషయములు వర్ణితములైనవి.

నారదుడు ప్రాచీనబర్హికడకు వచ్చి యిట్లు పలికెను- "కర్మలద్వారా యెప్పుడును నిశ్శ్రేయసము లభింపదు. గృహవ్రతులు కర్మాసక్తులై భార్యాపుత్రధనాదులయందు పారామార్థిక బుద్ధిని గలిగియుందురు. యజ్ఞాదులయందు సంహరింపబడిన పశువులు తమ్ము సంహరించినవానిపై బదులుదీర్చుకొనుటకు పొంచియుండును. ఈ ప్రసంగమున నారదుడు ప్రాచీనబర్హికి పురంజనోపాఖ్యానమును వివరించుచు నిట్లు పలికెను - "పురంజననామముతో నొకరాజు భూమిపై గల ప్రదేశము లన్నింటిని పర్యటించి కర్మకాండకు శ్రేష్ఠస్థాన మగుభారతవర్షమున నవ ద్వారయుక్తము, సర్వలక్షణసంపన్నము నగునొక్క పురమును జూచెను. పుర మనగ నేమియు లేదు, అది విషయభోగములకు నిలయ మగు మానవశరీరమె. ఆపురమునకు బయట ఉపవనస్థానీయములగు వివిధ విషయములు, తరులతాస్థానీయ మగురూపవైచిత్ర్యము, పక్షికూజనాదిస్థానీయ మగుశబ్దవైచిత్ర్యము అను నైదువిధము లగువైచిత్ర్యము లున్నవి. ఆ యుపవనమున పరమసుందరి యగు పదునాఱు సంవత్సరముల వయస్సుగల యొకకామిని ప్రవేశించెను. ఆమెయే భోగబుద్ధి. ఆమెకు ఇంద్రియముల నెడిపదుగురు భృత్యులు, ఇంద్రియవృత్తులను నూఱుగురు నాయికలు గలరు. పంచవృత్తు లను పంచముఖములు గల ప్రాణమను సర్పమే యీకాముక స్త్రీ శరీరమును రక్షించునట్టిది. ఈకాముకస్త్రీ రూపముచే పురమున కధీశ్వరుడగు పురంజనుడు ముగ్ధుడై స్వతంత్రేచ్ఛ ననుసరించి తనసంసార గతిని వరించెను. పురంజను డీకాముకురాలితో తననవద్వార విశిష్ట మగుపురమునుండి బహిర్గతుడై నూఱుసంవత్సరముల కాలము వివిధవిషయములయందు దిరిగెను. ఆ స్త్రీచేతిలో కీలుబొమ్మయై తననిజ స్వరూపమును మరచెను.

### శ్రీ మైత్రేయ ఉవాచ

ఇతి సందిశ్య భగవాన్ బార్హిషదై రభిపూజితః ।
పశ్యతాం రాజపుత్రాణాం తత్రైవాన్తర్దధే హరః ॥ 1

మైత్రేయుడు పలికెను :- భగవాను డగురుద్రుడు ప్రాచీనబర్హి తనయు లగుప్రచేతసుల కిట్లుపదేశింపగా వారుగూడ రుద్రుని పూజించిరి. అపుడు రుద్రుడు వారి యెదుటనే అంతర్హితుడయ్యెను.

రుద్రగీతం భగవతః స్తోత్రం సర్వే ప్రచేతసః ।
జపన్తస్తే తపస్తేపుర్వర్షాణామయుతం జలే ॥ 2

ప్రచేతసులు రుద్రభగవాను డుపదేశించిన యీస్తోత్రమును జపించుచు పదివేల సంవత్సరములకాలము నీటిలో నుండి తపస్సు చేయ నారంభించిరి.

ప్రాచీనబర్హిషం క్షత్తః కర్మస్వాసక్తమానసమ్ ।
నారదోఽధ్యాత్మతత్త్వజ్ఞ కృపాలుః ప్రత్యబోధయత్ ॥ 3

విదురా! ఆత్మతత్త్వజ్ఞుడు, కృపాళువు నగునారదుడు కర్మాసక్త మనస్కుడగు ప్రాచీన బర్హికి జ్ఞానము నుపదేశించెను.

శ్రేయస్త్వం కతమద్రాజన్ కర్మణాత్మన ఈహసే ।
దుఃఖహానిః సుఖావాప్తిః శ్రేయస్తన్నేహ చేష్యతే ॥ 4

(నారదు డడిగెను) రాజా! నీ వీకామ్యకర్మల ననుష్ఠించుట ద్వారా యేమిశ్రేయస్సు నభిలషించుచున్నావు? దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి యనునీరెండే శ్రేయస్సు లనిచెప్పబడినవి. కాని కర్మమార్గమున ఈరెండును లభింపవు.

## శ్రీ రాజోవాచ

న జానామి మహాభాగ పరం కర్మాపవిద్ధధీః ।
బ్రూహి మే విమలం జ్ఞానం యేన ముచ్యేయ కర్మభిః ॥ 5

ప్రాచీనబర్హి పలికెను :- మహాభాగా! నాబుద్ధి కర్మవిద్ధ మగుటచే నేను నా పరమ శ్రేయస్సున కుపాయమును తెలిసికొనజాలకున్నాను. ఇప్పుడు దేని వలన నే నీకర్మ బంధనములనుండి ముక్తుడను కాగలనో అట్టి నిర్మలజ్ఞానమును నాకు నీ వుపదేశింప వలెను.

గృహేషు కూటధర్మేషు పుత్రదారధనార్థధీః ।
న పరం విన్దతే మూఢో భ్రామ్యన్ సంసారవర్త్మసు ॥ 6

దేవా! గృహవ్రతు డగువ్యక్తి పుత్రకళత్రధనాదులనె పరమార్థములుగ భావించి మెలగుచుండును. దానివలన ఈమూఢుడు కామ్యకర్మల ననుష్ఠించుటయం దాసక్తుడయి సంసారమార్గమున సంచరించుచుండును. కాని యెప్పుడును పరమార్థమును పొందజాలడు.

## శ్రీ నారద ఉవాచ

భో భో ప్రజాపతే రాజన్ పశూఽ పశ్య త్వయాఽధ్వరే ।
సంజ్ఞపితాన్ జీవసంఘాన్ నిర్ఘృణేన సహస్రశః ॥ 7

నారదుడు పలికెను :- ప్రజాపాలకుడ వగురాజా! నీవు నిర్దయుడవయి ఈయజ్ఞమున వేలకొలదిపశువులను సంహరించితివి. అజీవుల నన్నింటిని జూడుము.

ఏతే త్వాం సంప్రతీక్షన్తే స్మరన్తో వైశసం తవ ।
సంపరే తమయః కూటైశ్ఛిన్దన్త్యుత్థితమన్యవః ॥ 8

రాజా! నీవు వానికి గలుగజేసినబాధను స్మరించుచు అవి క్రోధముతో ఉద్దీప్తము లగుచు, నీచావుకయి ప్రతీక్షించుచున్నవి. అవి లోహయంత్రమయ మగుశృంగముల ద్వారా త్వరలోనే నిన్ను ఛిన్నభిన్నము చేయును.

అత్ర తే కథయిష్యేఽ మునిమితిహాసం పురాతనమ్ ।
పురంజనస్య చరితం నిబోధ గదతో మమ ॥ 9

ఈ సంకటమును దొలగించునట్టిపురాతన మయినపురంజనుని ఇతిహాసమును జెప్పెదను. సమాహితచిత్తముతో దానిని శ్రవణముచేయుము.

ఆసీత్పురంజనో నామ రాజా రాజన్ బృహచ్ఛ్రవాః ।
తస్యావిజ్ఞాతనామాసీత్సఖాఽవిజ్ఞాతచేష్టితః ॥ 10

రాజా! పురంజననామముతో మహాయశస్వి యగునొకరా జుండెను. ఆయన కొకమిత్రు డుండెను. ఆయననామముగాని పనిగాని యెవ్వరికిని దెలియవు.

సోఽ న్వేషమాణః శరణం బభ్రామ పృథివీం ప్రభుః ।
నానురూపం యదావిన్దదభూత్స విమనా ఇవ ॥ 11

ఆ పురంజనుడు (లింగదేహాశ్రితు డగుజీవుడు) తనస్థూల దేహ మనుభవించుటకు దగినవస్తువు నన్వేషించుచు పృథివియంతట పర్యటించెను. కాని యెచ్చటను తనయభి లాషకు దగిన (సర్వవిషయభోగానుకూలమగు) వస్తువు లభింపకపోవుటచే అతడు మిగుల చింతాక్రాంతుడయ్యెను.

న సాధు మేనే తాన్సర్వా భూతలే యావతీః పురః ।
కామాన్ కామయమానోఽ సౌ తస్య తస్యోపపత్తయే ॥ 12

ఆయన విషయభోగలాలసచే భోగముల కాశ్రయస్వరూప మగు భూమండలములోని పురముల (దేహముల) నన్నింటిని అన్వేషించెను. కాని యేదియు తనవాంఛలను సిద్ధింప జేయునట్టిదిగ కనబడలేదు.

స ఏకదా హిమవతో దక్షిణేష్వథ సానుషు ।
దదర్శ నవభిర్ద్వార్భిః పురం లక్షితలక్షణామ్ ॥ 13

అనంతర మొకప్పు డతడు హిమవత్పర్వతమునకు దక్షిణముగా గల కర్మక్షేత్ర మగు భారతవర్షమున పర్యటించుచుండెను. అట్టిసమయమున అచట నవద్వారములతో గూడి నదియు, సర్వలక్షణసంపన్న మైనదియు నగు నొకపురము (మానవశరీరము) వానికి దృష్టి గోచరమయ్యెను.

ప్రాకారోపవనాట్టాలపరిఖైరక్షతోరణైః ।
స్వర్ణ రౌప్యాయసైః శృంగైః సంకులాం సర్వతో గృహైః ॥ 14

ఈపురము (దేహము), ప్రాకారములు (త్వక్కు), ఉపవనములు (బాహ్య విషయములు), అట్టాలికలు (ముఖము), అగడ్తలు (గుణత్రయము), గవాక్షములు (రోమకూపములు), బహిర్ద్వారములు (నేత్రములు) అనువానిచే శోభిల్లుచుండెను. స్వర్ణ రౌప్య (బంగారము, వెండి) లోహమయములగు (పిత్తకఫవాత త్రిధాతుకాత్మకములగు) శిఖరములతో గూడిన గృహములతో పరివ్యాప్త మైయుండెను.

నీలస్ఫటిక వైదూర్యముక్తామరకతారుణైః ।
క్లిప్తహర్మ్యస్థలీం దీప్తాం శ్రియా భోగవతీమివ ॥ 15

దేహరూప మగునాహర్మ్యము యొక్క లోపలిభాగములు నీలకాంతమణులు, స్ఫటికములు, వైడూర్యములు, ముత్యములు, మాణిక్యములు అనువానితో సమానములైన నాడీసమూహములచే నిర్మితములయ్యెను. అందువలన ఈపురము సౌందర్యమునందు నాగులకు రాజధాని యగుభోగవతివలె ప్రకాశించుచుండెను.

సభాచత్వరరథ్యాభిరాక్రీడాయతనాపణైః ।
చైత్యధ్వజపతాకాభిర్యుక్తాం విద్రుమవేదిభిః ॥ 16

సభాభవనము (పురంజను డనురాజు అనగా జీవుడు గూర్చుండు స్థాన మగు హృదయము), చతుష్పథము (తాలువులకు గ్రిందిభాగమున నున్న ముఖము, నాసిక, నయనములు, కర్ణములు అనునవి నాలుగుమార్గములు) మూడురాజపథములు (ఇడ, పింగళ, సుషుమ్నలు), క్రీడాస్థానములు (ఇంద్రియగోళకములు), హట్టములు అనగా

బజారులు (మనోగోళకము), విశ్రామస్థానములు (చిత్తమధ్యమము), ధ్వజపతాకములు (భగవద్వై ముఖ్యము లనుధ్వజదండములయందు లగ్నము లయియున్నపతాకము లను పంచవిధక్లేశములు), పగడములచే నిర్మితము లగువేదికలు (ఆధారచక్రాదులు) అచట శోభిల్లుచుండెను.

పుర్యాస్తు బాహ్యోపవనే దివ్యద్రుమలతాకులే ।
నదద్విహంగాలికులకోలాహలజలాశయే ॥ 17

ఆ నగరమునకు బయట దివ్యము లగు వృక్షములతోను, లతలతోను గూడిన ఒక సుందర మగునుపవనము (విషయవర్గము) ఉన్నది. దాని నడుమ నొకసరోవరము (రూప వైచిత్ర్యము) శోభిల్లుచుండెను. దానికి నలువైపుల అనేకము లగుపక్షులు వివిధము లగుధ్వనుల జేయుచుండెను. తుమ్మెదలు ఝంకారములు చేయుచుండెను (శబ్ద వైచిత్ర్యమును జేయుచుండెను).

హిమనిర్ఝరవిప్రుష్మత్కు సుమాకరవాయునా ।
చలత్ప్రవాళవిటపనలినీతటసంపది ॥ 18

సరోవరతటమున గలవృక్షములయందలి కొమ్మలు, ఆకులు వివిధ కుసుమము లలోని గంధముతోను, శీతలజలబిందువుల (రసము) తోను గూడి యున్న సుగంధవాయు తరంగములచే గదలుచుండెను. ఈ విధముగ అవి తటమున నున్నభూమికి శోభను జేకూర్చుచుండెను.

నానారణ్యమృగవ్రాతైరనాబాధే మునివ్రతైః ।
ఆహూతం మన్యతే పాన్థో యత్ర కోకిలకూజితైః ॥ 19

ఈస్థానమున వివిధము లగు క్రూరజంతువులు నివసించుచున్నను వాని స్వభావము మునులవలె హింసావిహీన మైయుండెను. (పురంజను డనుజీవుని పుణ్యమువలన వానికి భోగ్యవిషయము లన్నియు నిష్కంటకము లయ్యెను). అందువలన ఆ వనములోనికి ప్రవేశించుట వలన ఎవ్వనికిని ఎట్టికష్టమును గలుగుటలేదు. అచట మాటిమాటికి కోకిలలు కూయుచుండెను. దానిచే ఆ మార్గమున పయనించు బాటసారులు తమను అవి పిలచు చున్నట్లుగ భావింపసాగిరి. (పురంజను డనువిషయభోగముల ననుభవించుజీవుడు తన కుటుంబమునకు, బంధువులకు, బ్రాహ్మణాదులకు ఆతిథ్యాదులద్వారమున నిష్కంటకము లగు తన భోగవిషయములను విభజించి దేహ మనుపురమున విషయ భోగములనను భవించును).

యదృచ్ఛయాగతాం తత్ర దదర్శ ప్రమదోత్తమామ్ ।
భృత్యైర్దశభిరాయాన్తీ మేకైకశతనాయకైః ॥ 20

అనంతరము పురంజనుడు (జీవుడు) స్వేచ్ఛగ సంచరించుచు ఆయుద్యానవనమున ప్రవేశించినయొకసుందరిని (విషయవివేకములు గల బుద్ధిని) జూచెను. ఆ సుందరిని చుట్టిముట్టి పదుగురుసేవకులు (యింద్రియములు) ఉండిరి. వారిలో నొక్కొక్కరు నూఱుగురు నాయికలకు (వృత్తులకు) పతి యైయుండెను.

పంచశీర్షాహినా గుప్తాం ప్రతీహారేణ సర్వతః ।
అన్వేషమాణామృషభమప్రౌఢాం కామరూపిణీమ్ ॥ 21

సునాసాం సుదతీం బాలాం సుకపోలాం వరాననామ్ ।
సమవిన్యస్త కర్ణాభ్యాం బిభ్రతీం కుండలశ్రియమ్ ॥ 22

పిశంగనీవీం సుశ్రోణీం శ్యామాం కనకమేఖలామ్ ।
పద్భ్యాం క్వణద్భ్యాం చలతీం నూపురైర్దేవతామివ ॥ 23

స్తనౌ వ్యంజితకైశోరౌ సమవృత్తౌ నిరన్తరౌ ।
వస్త్రాన్తేన నిగృహ్ణన్తీం వ్రీడయా గజగామినీమ్ ॥ 24

తామాహ లలితం వీరః సవ్రీడస్మితశోభనామ్ ।
స్నిగ్ధేనాపాంగపుంఖేన స్పృష్టః ప్రేమోద్భ్రమద్భ్రువా ॥ 25

ఈ సుందరి పదునాఱుసంవత్సరముల వయస్సు గల యువతి (జీవమోహిని యగుఅవిద్యారూపబుద్ధి), నిత్యము వివిధము లగురీతులతో అలంకరించుకొనుచుండును, అనగా వివిధము లగువాసనలు గలది. ఈ స్త్రీరత్న మపుడు స్వామి (ఉపభోక్త)కై యన్వేషణ చేయుచు సంచరించుచుండెను. ఐదుశిరస్సులు (క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రత, నిరుద్ధము అనునైదువృత్తులు) గల యొకసర్పము (ప్రాణము) ద్వారపాలకునిరూపముతో ఈయువతీరత్నమును నలువైపులనుండి రక్షించుచుండెను. ఈమె యొక్క రూపలావణ్యాములను గూర్చి యికచెప్పునదేమి? ఆమెనాసిక (గంధజ్ఞానరూప మగు బుద్ధివృత్తినైపుణ్యము), పలువరుస (రసాస్వాదనచర్వణాసక్తము), కపోలయుగళము (బుద్ధియొక్క స్వచ్ఛతా ప్రతిపాదకము), ముఖము (బుద్ధియొక్క అగ్రభాగము) మిగులసుందరములుగను, ఉత్కృష్టములు గను నుండెను. సమముగ విన్యస్తము లయినకర్ణములచే గుండలముల శోభ (ప్రవృత్తి నివృత్తులను శాస్త్రార్థముల)ను ధరించియుండెను. ఆమె శ్యామలవర్ణము

గలది. (మేఘరూపమైన శ్యామలవర్ణము గలబుద్ధిమాలిన్యముచే జీవాత్మకు గనబడకుండగ కృష్ణసూర్యు డాచ్ఛాదనయోగ్యు డగును). ఆమె పిశంగ వర్ణవస్త్రమును ధరించియుండెను. (రజోగుణమయము లగు కర్మలచే ఆవృతమగుబుద్ధి). ఆమె పిఱుదులు మనోహరములు, బంగారుమొలనూలుచే జుట్టబడియుండెను. ఆమె తనపాదద్వంద్వముద్వారా (బద్ధ జీవుని బుద్ధి చాంచల్యము శాస్త్రములయందు చెప్పబడినది; దానిద్వారా) నూపురధ్వని చేయుచు సాక్షాత్తుగ దేవతాస్త్రీవలె అటునిటు (బుద్ధియొక్క అస్థిరతను ప్రదర్శించుచు) సంచరించుచుండెను. స్తనద్వయము (రాగద్వేషములు) ఈమె యొక్క నవయౌవనత్వమును సూచించుచున్నవి. అవి పరస్పరము సమముగను, గుండ్రముగను (పురుషమాత్రుని మోహింపజేయునట్లుగ) నుండి రెండింటినడుమ ఏమాత్రమును వ్యవధానము లేనట్లుగ శోభిల్లుచుండెను. (అనురాగద్వేషములరెండింటిలో నెట్టివ్యవధానము లేదు, రెండును ఏకకాలములోనే పుట్టును). అందువలన గజగామిని యగునాసుందరి లజ్జగలది యై వస్త్రాంచలముద్వారమున మాటిమాటికి ఆ స్తనములను గప్పుకొనుచుండెను (శిష్టజనులు లజ్జాకపటవినయములద్వారమున రాగద్వేషములను దాచుకొందురు.) ఈయువతి యొక్క స్నిగ్ధము లైనకటాక్షములు నిశిత బాణములవలె నుండెను. ఏలయన, ఆమె నేత్రముల ప్రాంతభాగములు అనగా క్రీగంటిచూపులు బాణమూలములవలె నుండెను. ఆమె ప్రేమతో త్రిప్పుకనుబొమ్మలు ధనుస్సులవలె నుండెను. వీరుడగు (భోగోత్సాహియగు) పురంజనుడు (జీవుడు) ఆ యువతి యొక్క కటాక్షబాణములచే గొట్టబడినవాడై లజ్జతోను, చిఱునవ్వుతోను, సులలితము లగుపలుకులతోను ఆమె నిట్లడిగెను. (అవిద్యావృత్తులద్వారమున జీవుడు తనయిచ్ఛచే నశించును, ఈశ్వరుడు అవిద్యావృత్తులద్వారమున జీవుని బలవంతముగ నాశనము చేయడు).

**కా త్వం కంజపలాశాక్షి కస్యాసీహ కుతః సతి ।**
**ఇమాముపపురీం భీరు కిం చికీర్షసి శంస మే ॥ 26**

తామరరేకులవంటి కన్నులు గలదానా! నీ వెవతెవు? ఎవరి పుత్రికవు? ఎచటి నుండి యిచటికి వచ్చితివి? భీరురాలా! నీ వీపురమునకు సన్నిహితమున నున్న యీయుద్యానవనములో ఏమిచేయదలంచుచున్నావు? ఈ విషయములను నాకు వివరింపవలసినది.

**క ఏతేఽనుపథా యే త ఏకాదశమహాభటాః ।**
**ఏతా వా లలనాః సుభ్రు కోఽయం తేఽహిః పురస్సరః ॥ 27**

సుందరము లయినకనుబొమ్మలు గలదానా? నిన్ననుసరించు ఈ వ్యక్తులలో (పదునొకం డింద్రియములలో) పదునొకండవవాడైన యీ మహాబలవంతు డగువ్యక్తి యెవరు? ఈ స్త్రీలు (ఇంద్రియవృత్తులు), నీ యెదుట నున్న యీసర్పము (ప్రాణము) ఎవరు?

త్వం హ్రీర్భవాన్యస్యథ వాగ్రమా పతిం
విచిన్వతీ కిం మునివద్రహో వనే ।
త్వదంఘ్రి కామాప్తసమస్తకామం
క్వ పద్మకోశః పతితః కరాగ్రాత్ ॥ 28

సుందరీ! నీవు లజ్జాదేవివా లేక భవానివా (సౌందర్యము) లేక లక్ష్మివా (మహాసంపత్తి విశిష్టవా), లేక సరస్వతివా (మహాబుద్ధిగలది)? మునులవలె నిగ్రహముగలదానవై నీ పతిని అన్వేషించుచు ఈ నిర్జనవన ప్రదేశమున (స్వమోహనప్రపంచమున) సంచరించుచున్నావా? ఆహా! నీచరణయుగళసేవచే నీపతి యొక్క సర్వవాంఛలు చరితార్థము లగునుగదా! నీకరాగ్రమునుండి లీలాకమలము (జీవునివివేకము) ఎచట పడిపోయినది? (ఇహలోకమున జనులు తమబుద్ధిబలమున కధీనులయి తమ్ము సౌందర్య విశిష్టులనియభిమానింతురు; స్వాతంత్ర్యమును దుర్వినియోగముచేయుట వలన వారు తమ వివేకమును పోగొట్టు కొందురు).

నాసాం వరోర్వన్యతమా భువి స్పృక్
పురీమిమాం వీరవరేణ సాకమ్ ।
అర్హస్యలంకర్తుమదభ్రకర్మణా
లోకం పరం శ్రీరివ యజ్ఞపుంసా ॥ 29

సుందరీ! ఈలజ్జామొదలైనవారిలో నీవు లేవు. నీ చరణములు భూమిని స్పృశించు చున్నవి. (దేవతలచరణము లెన్నడును భూమిని స్పృశింపవు). నే నొకవీరశ్రేష్ఠుడను, నాకర్మ లుత్కృష్టములు. అందువలన లక్ష్మి నారాయణునితో గలసి వైకుంఠము నలంకరించు నట్లు నీవును నాతో గలసి యీపురము నలంకరింపుము. (పురంజనుడు (జీవుడు) నారీ రూప మగుతనబుద్ధిని అభిమానించును, నిత్యానిత్యవివేకము కలుగగా అట్టి భోగబుద్ధిని పరిత్యజించి శుద్ధము అనగా సేవామయ మగు బుద్ధిద్వారమున అలంకృతుడగుట కభిలషించును).

యదేష తేఽపాంగవిఖండితేంద్రియం
సవ్రీడభావస్మితవిభ్రమద్భ్రువా ।
త్వయోపసృష్టో భగవాన్ మనోభవః
ప్రబాధతే మానుగృహాణ శోభనే ॥ 30

శోభనా! నీక్రీగంటిచూపులు నాచిత్తమును ఖండఖండములుగ జేసినవి, (అనగా ఖండజ్ఞానరూప మగుబుద్ధి నాచిత్తము నెల్లప్పుడు మథించుచున్నది). దానివలన ఇంకను

లజ్జతోగూడినవి, ప్రేమహాసోల్లసితము లైనవి యగునీకనుబొమలచే ప్రేరితుడయి శక్తిమంతుడగు నీమన్మథుడు (విషయవాసనలు) నాకు మిక్కిలి బాధను గలుగజేయుచున్నాడు. అందువలన సుందరీ! నాపై ననుగ్రహము జూపుము. (అనగా నీసోదరి యగు విద్యను జూపుము).

త్వదాననం సుభ్రు సుతారలోచనం
వ్యాలంబినీలాలకబృందసంవృతమ్ ।
ఉన్నీయ మే దర్శయ వల్గువాచకం
యద్వ్రీడయా నాభిముఖం శుచిస్మితే ॥ 31

చారుహాసినీ! సుందరము లగుకనుబొమలు, కనీనికలు గలనేత్రములతో గూడినదియు; దీర్ఘము లగునల్ల నిముంగురులచే సంవృతమైనదియు, మధురము లగువాక్కులు గలదియు అగునీముఖము లజ్జచే అవనత మయియున్నది. ఆ నీ వదనమును పైకెత్తి నాకు జూపుము. (స్మృతిభ్రష్టు డగు కాముకునిచాంచల్యము ప్రదర్శింపబడుచున్నది, - పురంజనుడు అనగా జీవుడవిద్యామోహితుడై చిన్మయజ్ఞానానందానుభవమునుండి వంచితుడగును. అవిద్య వానిని తనభోగమునందు నియమించును. అయోగ్యము లయిన ఆననము చూపుము మున్నగుమాటలు జీవునిభోగస్పృహను సూచించుచున్నవి).

## శ్రీ నారద ఉవాచ

ఇత్థం పురంజనం నారీ యాచమానమధీరవత్ ।
అభ్యనన్దత తం వీరం హసన్తీ వీర మోహితా ॥ 32

నారదుడు పలికెను :- రాజా! వీరు డగునాపురంజనుడు (భోగోత్సాహకారి యగు జీవుడు) ఇట్లధీరునివలె (వాస్తవముగ చిద్రూపత్వము వలన స్వరూపముచే అభీరుపై) ఆ సుందరి నిట్లు ప్రార్థింపగా ఆమె దానివలన మోహితఅయ్యెను. (అనగా విషయమాధుర్యమునందు జీవునిచిత్త మాకృష్టమయినట్లు, చిన్మాధుర్యమునందును ఆకర్షిత మగును.) ఆమె నవ్వుచు సాదరముగ నిట్లుపలికెను.

న విదామ వయం సమ్యక్కర్తారం పురుషర్ష భ ।
ఆత్మనశ్చ పరస్యాపి గోత్రం నామ చ యత్కృతమ్ ॥ 33

పురుషశ్రేష్ఠా! నాకు నితరునకు (నీకు) కర్త యెవరు? ఈ విషయము నాకు సరిగ తెలియదు. ఎవరివలన గోత్రనామము లుత్పన్నము లైనవో అదిగూడ దెలియదు. (ఎవని స్వరూపజ్ఞాన మావృతమైయున్నదో అత డెట్లు భగవానునిస్వరూపమును, జీవుని స్వరూపమును నెఱుంగును)?

**ఇహాద్య సన్తమాత్మానం విదామ న తతః పరమ్ ।**
**యేనేయం నిర్మితా వీర పురీ శరణమాత్మనః ॥ 34**

ఈ ప్రదేశము మానివాసస్థానము. ఈపుర దేహ మెవరిచే నిర్మింపబడినదో ఆ మహాత్ముని (ప్రజాపతిని) గుఱించిగాని, లేదా యీపురములో నున్న నన్నుగుఱించికాని యెఱుగను.

**ఏతే సఖాయః సఖ్యో మే నరా నార్యశ్చ మానద ।**
**సుప్తాయాం మయి జాగర్తి నాగోఽయం పాలయన్ పురీమ్ ॥ 35**

మానదా! ఈ పురుషులు స్త్రీలు నాసఖులు (ఇంద్రియములు, ఇంద్రియవృత్తులు) ఈ సర్పము (ప్రాణము) మాపురమును రక్షించునట్టిది. నేను నిద్రింపగా నీసర్పము మేలు కొని యీపురమును రక్షించును. (స్వప్నమున ఇంద్రియములు పనిచేయజాలవు, సుషుప్తి యందు మనస్సు, బుద్ధి లయము కాగా ప్రాణములు విరాజిల్లుచుండును).

**దిష్ట్యాగతోఽసి భద్రం తే గ్రామ్యాన్ కామానభీప్ససే ।**
**ఉద్వహిష్యామి తాంస్తేఽహం స్వబన్ధుభిరరిందమ ॥ 36**

శత్రుదమనా! నీవు నాయదృష్టమున నిచటికి వచ్చితివి. నీవు గూడ నావలె ఇంద్రియ సుఖములను గోరుచున్నట్లు నా కగపడుచున్నది. నేను నాసఖుల (ఇంద్రియముల, ఇంద్రియవృత్తుల) సాహాయ్యముచే దానిని సంపాదింతును. అందువలన నీకు శుభము కలుగుగాక!

**ఇమాం త్వమధితిష్ఠస్వ పురీం నవముఖీం విభో ।**
**మయోపనీతాన్ గృహ్ణానః కామభోగాన్ శతం సమాః ॥ 37**

ప్రభూ! నేను నీ కిచ్చుభోగములను చక్కగ ననుభవింపుము. నీవు నూఱుసంవత్సరముల కాలము (దేహమున ప్రవేశించినది మొదలుకొని మరణపర్యంతము గలమానవుని పరమాయుర్దాయము) నవద్వారసంపన్న మగునీపురమున నివసింపుము.

**కం ను త్వదన్యం రమయే హ్యరతిజ్ఞమకోవిదమ్ ।**
**అసంపరాయాభిముఖమశ్వస్తనవిదం పశుమ్ ॥ 38**

నీకంటె భిన్ను డయినఇతరపురుషుడు రతిసుఖము నెఱుంగడు. ఏసుఖముల ననుభవించుటకు నిషిద్ధము లేదో వారు వానిని గూడ అనుభవింపలేరు. కొందఱకు పరలోక విషయములయందు ఆలోచన యుండదు. "రే పేమిజరుగునో" యని వారొక్క మారును ఆలోచింపరు. అందువలన నేను నిన్ను విడచి పశుతుల్యు డగునేవ్యక్తితో విహరింతును?

ధర్మో హ్యత్రార్థకామౌ చ ప్రజానన్దోఽమృతం యశః ।
లోకా విశోకా విరజా యాన్న కేవలినో విదుః ॥ 39

ఈ గృహస్థాశ్రమమున ధర్మార్థకామములు, సంతానసుఖము, మోక్షము, యశస్సు, యాగము మున్నగువాని ద్వారమున లభించుశోకరాహిత్యము, దివ్యలోకములు నుండును. యతు లీవిషయము నేమాత్రమును నెఱుంగరు (అవిద్యాత్రివర్గముల మాహాత్మ్యమును గీర్తించి సాత్త్విక బుద్ధిని నిందింతురు).

పితృదేవర్షిమర్త్యానాం భూతానామాత్మనశ్చ హ ।
క్షేమం వదన్తి శరణం భవేఽస్మిన్ యద్గృహాశ్రమః ॥ 40

ఈ లోకమున పితరులకు, దేవతలకు, ఋషులకు, మానవులకు, సర్వప్రాణులకు, తనకు (దేహమునకు) ఆశ్రయము గృహస్థాశ్రమ మొక్కటియే యనిపండితులు చెప్పుచున్నారు.

కా నామ వీర విఖ్యాతం వదాన్యం ప్రియదర్శనమ్ ।
న వృణీత ప్రియం ప్రాప్తం మాదృశీ త్వాదృశం పతిమ్ ॥ 41

వీరుడా! నీవు విఖ్యాతుడవు, ఉదారచిత్తుడవు, ప్రియదర్శనుడవు, అందువలన నీవంటి ప్రియపతి లభించినపుడు నావంటిగుణజ్ఞ యగుయువతి మఱియేవ్యక్తినైన పతిగ స్వీకరింపగలదా?

కస్యా మనస్తే భువి భోగిభోగయోః
స్త్రియా న సజ్జేద్భుజయోర్మహాభుజ ।
యోఽనాథవర్గాధిమలం ఘృణోద్ధత -
స్మితావలోకేన చరత్యపోహితుమ్ ॥ 42

మహాభుజా! పృథివిలో ఏరమణిమనస్సు సర్పమువలె సుగఠితము లైననీభుజముల కాగిలిని గోరకుండగ నుండును? నీవు సాధారణవ్యక్తివి గావు. కరుణామృతపరిపూర్ణములు, మందహాసయుక్తములు నగునీయవలోకనములు అనాథజీవులమనోబాధను సంపూర్ణముగ తొలగించుటకై యన్వేషించుచున్నవి.

## శ్రీ నారద ఉవాచ

ఇతి తౌ దంపతీ తత్ర సముద్య సమయం మిథః ।
తాం ప్రవిశ్య పురీం రాజన్ ముముదాతే శతం సమాః ॥ 43

నారదుడు పలికెను :- రాజా! ఇట్లాదంపతు లచట పరస్పరము సంకేతముచేసికొని ఆపురమున ప్రవేశించి నూఱుసంవత్సరములకాలము ఆనందముతో గడిపిరి.

**ఉపగీయమానో లలితం తత్ర తత్ర చ గాయకైః ।**
**క్రీడన్ పరివృతః స్త్రీభిర్హ్రదినీమవిశచ్ఛుచౌ ॥ 44**

ఈ పురమునందలి ప్రతిస్థలములోను గాయకులు మనోహర మగు సంగీతముతో పురంజనునియశస్సును గానముచేయసాగిరి. పురంజనుడు గ్రీష్మకాలమున (సుషుప్తియందు) యువతీజనపరివృతుడయి సరస్సునందు (హృదయకోశమందు స్వప్నమున) నిమగ్నుడై క్రీడింపసాగెను.

**సప్తోపరి కృతా ద్వారః పురస్తస్యాస్తు ద్వే అధః ।**
**పృథగ్విషయగత్యర్థం తస్యాం యః కశ్చనేశ్వరః ॥ 45**

ఈపురమం దేయధీశ్వరు డయిన యుండినచో అతడు దానినుండి బహిర్గతుడై భిన్నభిన్నవిషయముల ననుభవింపజాలును. ఈయభిప్రాయముతో ఆపురమునకు పైన ఏడుద్వారములు (రెండుకన్నులు, రెండుముక్కులు, రెండుచెవులు, ముఖము - ఇవియేడు), క్రిందిభాగమున రెండు ద్వారములు (పాయూపస్థలు) ఉన్నవి.

**పంచ ద్వారస్తు పౌరస్త్యా దక్షిణైకా తథోత్తరా ।**
**పశ్చిమే ద్వే అమూషాం తే నామాని నృప వర్ణయే ॥ 46**

రాజా! ఈపైన ఉన్నయేడుద్వారములలో ఐదు తూర్పుదిక్కునను, ఒకటి దక్షిణమునను, ఇంకొకటి యుత్తరమువైపునను గలవు. వీనికి భిన్నముగ పశ్చిమదిక్కున మఱిరెండు ద్వారము లున్నవి. వానినామములను నీకు వేఱువేఱుగ వివరింతును.

**ఖద్యోతావిర్ముఖీ చ ప్రాగ్ద్వారావేకత్ర నిర్మితే ।**
**విభ్రాజితం జనపదం యాతి తాభ్యాం ద్యుమత్సఖః ॥ 47**

మిణుగురుపురుగువలె అల్పప్రకాశయుక్త మగువామనేత్రము, బహుప్రకాశయుక్త మగుదక్షిణనేత్రము అనురెండుద్వారములు గలవు. అవి యొకచో సంలగ్నము లైయున్నవి. తూర్పుదిక్కున నిర్మిత మగునాద్వార సాహాయ్యముచే ద్యుమనునకు (దర్శనేంద్రియమునకు) మిత్రు డగుపురంజనుడు (జీవుడు) "విభ్రాజిత" (రూప) మనుజనపదమునకు వెడలుచుండెను.

**నలినీ నాలినీ చ ప్రాగ్ద్వారావేకత్ర నిర్మితే ।**
**అవధూతసఖస్తాభ్యాం విషయం యాతి సౌరభమ్ ॥ 48**

ఆ పూర్వదిక్కున మఱిరెండుద్వారము లొకేచోట నిర్మితములయియుండెను. వానిలో నొకదాని పేరు "నలిని" (ఎడమముక్కు) రెండవ దానిపేరు "నాలిని" (కుడిముక్కు). "అవధూత" (ఘ్రాణేంద్రియము) అనుమిత్రునిసాహాయ్యముచే పురంజనుడు (జీవుడు) ఈ రెండుద్వారముల గుండా "సౌరభ" మను ప్రదేశమునకు వెడలుచుండెను.

**ముఖ్యా నామ పురస్తాద్ద్వాస్తయా పణబహూదనౌ ।**
**విషయౌ యాతి పురరాడ్రసజ్ఞ విపణాన్వితః ॥ 49**

తూర్పుదిక్కునకు నెదురుగా నొక ప్రధానద్వారా (ముఖ) మున్నది. పురమున కధీశ్వరుడు పురంజనుడు (దేహమునం దున్నచిదాభాసుడు మనోధర్మము గలజీవుడు). ఈ ద్వారముద్వారా రసజ్ఞ (రసన) విపణ (వాగింద్రియ)ములతో గూడి బహూదనము (వివిధాన్నములు) ఆపణము (భాషణము) నను ప్రదేశములకు వెడలుచుండెను.

**పితృహూర్నృప పుర్యాద్వార్దక్షిణేన పురంజనః ।**
**రాష్ట్రం దక్షిణపంచాలం యాతి శ్రుతధరాన్వితః ॥ 50**

రాజా! ఈపురమునకు దక్షిణదిక్కున గలద్వారము "పితృహూ" (దక్షిణకర్ణము). పురంజను డీద్వారమునుండి శ్రుతిధరునితో (శ్రవణేంద్రియముతో) గూడి దక్షిణపంచాల రాజ్యమునకు (కర్మకాండప్రతిపాదిత శాస్త్రమువైపు) వెడలుచుండెను.

**దేవహూర్నామ పుర్యాద్వారుత్తరేణ పురంజనః ।**
**రాష్ట్రముత్తరపంచాలం యాతి శ్రుతధరాన్వితః ॥ 51**

ఈ పురమునకుత్తర దిక్కున గల ద్వారము "దేవహూ" (వామకర్ణము). పురంజను డీద్వారముగుండా శ్రుతిధరునితో గలసి యుత్తరపంచాలరాజ్యమునకు (జ్ఞానకాండ ప్రతిపాదకశాస్త్రమువైపు) వెడలుచుండెను.

**ఆసురీనామ పశ్చాద్ద్వాస్తయా యాతి పురంజనః ।**
**గ్రామకం నామ విషయం దుర్మదేన సమన్వితః ॥ 52**

ఈపురమునకు పడమటిదిక్కున గలద్వారము "ఆసురి" (శిశ్నము). పురంజనుడు (జీవుడు) ఈద్వారమున దుర్మదుని (ఇంద్రియముల) సాహాయ్యముచే గ్రామక (గ్రామ్యజనోచిత మైనరతిసుఖ) మనుప్రదేశమునకు వెడలును.

**నిర్రుతిర్నామ పశ్చాద్ద్వాస్తయా యాతి పురంజనః ।**
**వైశసం నామ విషయం లుబ్ధకేన సమన్వితః ॥ 53**

పశ్చిమదిక్కున గలద్వారము "నిర్ఋతి". పురంజనుడు లుబ్ధకుని (పాయ్వింద్రియము) తో గూడి యాద్వారమున "వైశస" (పురీషమార్గ) మనువిషయము (దేశము) నకు వెడలును.

**అన్ధావమీషాం పౌరాణాం నిర్వాక్పేశస్కృతావుభౌ ।**
**అక్షణ్వతామధిపతిస్తాభ్యాం యాతి కరోతి చ ॥ 54**

మహారాజా! ఈపురవాసు లందఱిలో (ఇంద్రియములలో) పాదహస్తము లను నిరువురంధులు (ఛిద్రవిహీనులు) గలరు. ఈపురమున కధీశ్వరు డగుపురంజనుడు ఈరెండింద్రియములద్వారమున నడచుచున్నాడు, పనులజేయుచున్నాడు.

**స యర్హ్యన్తఃపురగతో విషూచీనాం సమన్వితః ।**
**మోహం ప్రసాదం హర్షం వా యాతి జాయాత్మజోద్భవమ్ ॥ 55**

ఆపురంజను డంతఃపురమున (హృదయమున) ప్రవేశించినపుడు విషూచినులతో పాటు (మనస్సుతో పాటు) భార్యా (బుద్ధి) పుత్రుల (ఇంద్రియ జనితసుఖముల) ద్వారమున బుట్టినమోహమును, ప్రసన్నతను, హర్షమును పొందును.

**ఏవం కర్మసు సంసక్తః కామాత్మావంచితోఽ బుధః ।**
**మహిషీయద్యదీహేత తత్తదేవాన్వవర్తత ॥ 56**

ఇట్లు భార్య (బుద్ధి) కొఱకు కర్మాసక్తుడయి వంచితుడు, మోహితుడు నగు పురంజనుడు (దేహబద్ధజీవుడు) తన భార్య చేయుపనుల ననుకరించుచుండును.

**క్వచిత్పిబన్త్యాం పిబతి మదిరాం మదవిహ్వలః ।**
**అశ్నన్త్యాం క్వచిదశ్నాతి జక్షత్యాం సహజక్షతి ॥ 57**

భార్య మద్యపానము చేయుచున్న పురంజనుడుగూడ మద్యపానము చేయును. మదవిహ్వలుడయి సర్వానుసంధానశూన్యు డగును. ఒకప్పుడు భార్య అన్నాదులను భుజించుచున్నచో పురంజనుడుగూడ నామెతో గలసి భుజించును. (జడప్రకృతియం దాసక్తుడయి జీవుడు ప్రాకృతాహంకార స్వరూపు డగుతన్ను ప్రకృతిగుణములకు, జేయ బోవుపనులకు కర్తయు భోక్తయు ననిభావించును).

**క్వచిద్గాయతి గాయన్త్యాం రుదన్త్యాం రోదితి క్వచిత్ ।**
**క్వచిద్ధసన్త్యాం హసతి జల్పన్త్యామనుజల్పతి ॥ 58**

భార్య గానముచేసిన తాను గానము చేయును, ఆమె యేడ్చిన తానేడ్చును, ఆమె నవ్విన తాను నవ్వును, ఆమె మాటలాడిన తాను మాటలాడును.

క్వచిద్ధావతి ధావన్త్యాం తిష్ఠన్త్యామనుతిష్ఠతి ।
అనుశేతే శయానాయామన్వాస్తే క్వచిదాసతీమ్ ॥ 59

ఒకప్పుడు భార్య పరుగిడిన తానును పరుగిడును, ఆమె నిలుచుండిన తాను నిలుచుండును. ఆమె శయనించిన తాను శయనించును. ఆమె కూర్చుండిన తాను కూర్చుండును.

క్వచిచ్ఛృణోతి శృణ్వన్త్యాం పశ్యన్త్యామనుపశ్యతి ।
క్వచిజ్జిఘ్రతి జిఘ్రన్త్యాం స్పృశన్త్యాం స్పృశతి క్వచిత్ ॥ 60

ఒకప్పుడు భార్య శ్రవణము చేయుచున్న తాను శ్రవణము చేయును. ఆమె చూచుచున్న తాను చూచును. ఆమె వాసనచూచుచున్న తాను వాసనచూచును. ఆమె స్పృశించిన తాను స్పృశించును.

క్వచిచ్చ శోచతీం జాయామనుశోచతి దీనవత్ ।
అనుహృష్యతి హృష్యన్త్యాం ముదితామనుమోదతే ॥ 61

ఆమె శోకించినచో పురంజను డనాథవలె దుఃఖించును. ఆమె యానందించిన తానానందించును. ఆమె సంతుష్టిచెందిన తాను సంతుష్టిచెందును.

విప్రలబ్ధో మహిష్యైవం సర్వప్రకృతివంచితః ।
నేచ్ఛన్ననుకరోత్యజ్ఞః క్లైబ్యాత్క్రీడామృగో యథా ॥ 62

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే పురంజనోపాఖ్యానే
పంచవింశో ఽధ్యాయః ॥

ఇట్లు మహారాణి (బుద్ధి) చే ప్రతారింపబడినవాడై పురంజనుడు జడమునందు తనయనాసక్త స్వరూపమునుండి (జీవాత్మయొక్క నిత్యస్వరూప మెప్పుడును జడమునందాసక్తము కాదు) వంచితుడయ్యెను. అప్పుడామూర్ఖుడయినదేహాసక్తజీవుడు క్రీడామృగమువలె పరవశుడై కోరిక లేకపోయినను స్త్రీయొక్క (బుద్ధియొక్క) కార్యము ననుకరించెను. (అనగా జీవుడు తన ప్రకృతి లేదా బుద్ధియొక్క ధర్మము తనపై నారోపించుకొనును).

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణమందలి చతుర్థస్కంధములోని
ఇరువదియైదవ అధ్యాయము
సమాప్తము

శ్రీ మధ్వాచార్యులు, తదనుయాయియైన శ్రీ విజయధ్వజతీర్థులు ఈయధ్యాయమున క్రిందిశ్లోకము నొకదానిని అధికముగ వ్రాసిరి. దానికి గూడ తాత్పర్యము వ్రాయబడు చున్నది-

**తేషాం పరివృఢో రాజన్ సర్వేషాం బలిముద్వహన్ ।**
**సస్త్రీకానాం సఖా తస్యా బహురూపేఽగ్రణీః స్త్రియః ॥**

ఆస్త్రీరత్నమునకు బహురూపధారి యగునొక ప్రధానసఖు డుండెను. అత డాస్త్రీ సహితు లగుపురుషులతో గలసి పూజోపహారాదుల నేర్పాటు చేయుచుండును.





# ఇరువదియాఱవ అధ్యాయము

## పురంజనుడు వేటాడుటకై వనమునకు వెడలుట : రాణి కుపితయగుట

కథాసారము :- ఈయధ్యాయమున పురంజనునివేట నెపముతో జీవునకు జాగ్రత్స్వప్నములను, సద్బుద్ధిని పరిత్యజించుటవలన గలుగుసంసారాసక్తి వర్ణితమయ్యెను.

కర్తృత్వాభిమాన మనుధనుస్సును ధరించి పురంజనుడు (జీవుడు) సద్బుద్ధి యను భార్యను పరిత్యజించి, పంచజ్ఞానేంద్రియము లనుపంచాశ్వసంయుక్త మగురథము నధిరోహించి పంచేంద్రియవిషయభోగ్యవిషయరూపమగు "పంచప్రస్థ" మను వనమునకు వెడలుట, రాగద్వేషాదులయం దభినివేశ మను బాణముద్వారా భోగ్యవిషయ మనువన్య పశువును సంహరించుట (భోగించుట), చివరకు తాను చేసినదుష్కర్మము జ్ఞప్తికి వచ్చుటచే వ్యాకులత యనునలసటను పొంది గృహమునకు దిరిగి వచ్చుట, ప్రాయశ్చిత్తమను స్నానమును జేయుట, అమేధ్య భోజనమును పరిత్యజించుట యనుయుక్తాహారాదులను స్వీకరించి ధర్మజ్ఞానాద్యుపదేశము లనుధూపచందనాదులద్వారమున భూషితుడై శయ్యయందు పరుండుట, ధర్మశీలబుద్ధి యను స్త్రీతో సహవాసము చేయగోరుట, భార్య కనబడకపోగా అంతఃకరణవృత్తి రూపిణు లగు అంతఃపురచారిణులను భార్యను గూర్చి యడుగుట, విష్ణుభక్తి యనుతల్లి ధర్మశీలబుద్ధి యను భార్యలేని దేహ మను గృహము నివసించుట కయోగ్యమయిన దని వారుపదేశించుట, అంతఃపురచారిణులు కటికనేలపై పరుండియున్న పురంజనిని చూపుట, దానిని చూచుటచే పురంజనుడు సద్బుద్ధి యను భార్య పాదయుగళమును స్పృశించుట అనగా అహంకారమున పరిత్యజించి సద్బుద్ధిని గౌరవించుట, ఒడిలోనికి దీసికొని అనగా సద్బుద్ధిని హృదయము నందు మరల నిలుపుకొని నానాభావములతో నామె నోదార్చుట, భార్యముఖమున వెనుకటివలె ప్రసన్నత కనబడకబోవుటచే దుఃఖమును వెల్లడిచేసి, క్షమాపణమును వేడుట, సంభోగముద్వారా ధన్యురాలుగా జేయుటకై యామె ననునయించుట యనువిషయము లీయధ్యాయమున వర్ణితములైనవి.

### శ్రీ నారద ఉవాచ

స ఏకదా మహేష్వాసో రథం పంచాశ్వమాశుగమ్ ।
ద్వీషం ద్విచక్రమేకాక్షం త్రివేణుం పంచబంధురమ్ ॥ 1

ఏకరశ్మ్యేకదమనమేకనీడం ద్వికూబరమ్ ।
పంచప్రహరణం సప్తవరూథం పంచవిక్రమమ్ ॥ 2

హైమోపస్కరమారుహ్య స్వర్ణవర్మాక్షయేషుధిః ।
ఏకాదశచమూనాథః పంచప్రస్థ మగాద్వనమ్ ॥ 3

నారదుడు పలికెను :- రాజా! ఒకప్పుడు ఆపురంజనుడు (జీవుడు) గొప్పధనుస్సును (కర్తృత్వభోక్తృత్వాద్యభినివేశమును) చేతితో బట్టుకొని స్వర్ణమయ మగుకవచమును (రజోగుణకృత మగుఆవరణమును) ధరించి, వీపున అక్షయతూణీరమును (అనంతభోగవాసనా రూప మగునహంకారోపాధిని) కట్టుకొని, యొకరథమున (స్వప్నదేహమున)గూర్చుండి "పంచప్రస్థ" మను (శబ్దాదిపంచవిషయములను) వనమునకు వెడలెను. ఇంద్రియాధిపతి యగుమనస్సు అను సేనాధిపతి పురంజనునివెంట వెడలెను. ఈ రథము ఐదశ్వముల (పంచజ్ఞానేంద్రియముల) తో గూడియుండుటవలన అది మిగుల శీఘ్రగామియై యుండెను. ఈ రథమునకు రెండుదండములు (అహంకారమమకారములు), రెండుచక్రములు (పాపపుణ్యములు), ఒక యిరుసు (ప్రధానము), మూడుధ్వజదండములు (త్రిగుణములు), ఐదు పగ్గములు (పంచప్రాణములు), ఒకకళ్ళెపుత్రాడు (మనస్సు), ఒక సారథి (బుద్ధి), ఒక్కరథికుడుమాత్రము కూర్చుండుస్థానము (హృదయము); రెండుయుగ (కాడి)బంధన స్థానములు (శోకమోహములు) గలవు. వీనిచే శబ్దాదిపంచవిషయములు ప్రక్షిప్తములగును. ఈ రథమున కేడు ఆవరణములు (సప్తధాతువులు) గలవు. ఇది యైదువిధము లగుగతులు గలది.

చచారో మృగయాం తత్ర దృప్త ఆత్తేషు కార్ముకః ।
విహాయ జాయామతదర్హాం మృగవ్యసనలాలసః ॥ 4

పురంజను డావనమునం దుండి పరిత్యజించుటకు దగనిభార్యను (వివేకవతి యగు బుద్ధిని) పరిత్యజించి వేటయందలి (విషయభోగముల యందలి) యాసక్తితో ధనుర్బాణములను (రాగద్వేషాదులను, నేను కర్తను, నేను భోక్తను అనుఅభినివేశమును) గ్రహించి గర్వితుడయి తిరుగజొచ్చెను.

ఆసురీం వృత్తిమాశ్రిత్య ఘోరాత్మా నిరనుగ్రహః ।
న్యహనన్నిశితైర్బాణైర్వనేషు వనగోచరాన్ ॥ 5

నిర్దయు డగుపురంజనుడు ఆసురీవృత్తి నవలంబించి భయంకర స్వరూపమును ధరించి వాడి యైనబాణముల (రాగద్వేషాదుల) చే అరణ్యమున (భోగముల కుపయోగ పడుప్రదేశమున) పంచరించువానిని (భోగ్య విషయములను) సంహరించెను (తనవిగా జేసికొనెను).

**తీర్థేషు ప్రతిదృష్టేషు రాజా మేధ్యాన్ పశూన్ వనే ।**
**యావదర్థమలం లుబ్ధో హన్యాదితి నియమ్యతే ॥ 6**

మాంసమునం దాసక్తుడగు (విషయాసక్తు) డగురాజు పశువును సంహరింపదలచినచో (విషయభోగమున కుద్యుక్తుడయినచో) అతడు శాస్త్రములయందు జెప్పబడిననియమముల ననుసరించి దానిని సంహరింప వలెను (విషయభోగముల ననుభవింపవలెను, కాని యిది విధికాదు, వృద్ధి పొందు భోగప్రవృత్తిని అదుపులో నుంచుటయే యుద్దేశ్యము). అన్ని వేళల పశువులను సంహరింపరాదు. కొన్నికొన్ని శ్రాద్ధములయందే సంహరింపవలెను. శ్రాద్ధాదులయందు విధియున్నను శాస్త్రోపదిష్టము లగుగొన్ని విశేషశ్రాద్ధములందే కాని, నిత్యశ్రాద్ధాదులయం దీనియమము లేదు. (కలికాలమున మానవులకు యజ్ఞపశువును తిరిగి బ్రతికించుశక్తిలేదు. అందువలన అప్పుడది విధికాదు). ఆసక్తు డగురాజునకు వేటాడు నియమమున్నను తగినదేశకాలములు అనగా వనమునందే దానికి విధి యున్నది. అవసర మున్నంతవఱకే దాని నాచరింపవలె ననిశాస్త్రము చెప్పుచున్నది. (అనగా జీవయాత్రకెంత యవసరమో అంతవరకే జీవుడు విషయములను సేవింపవలెనుగాని అధికముగ గ్రహింప రాదనిశాస్త్రము చెప్పుచున్నది).

**య ఏవం కర్మ నియతం విద్వాన్ కుర్వీత మానవః ।**
**కర్మణా తేన రాజేన్ద్ర జ్ఞానేన న స లిప్యతే ॥ 7**

రాజేంద్రా! ఏ మానవు డిట్లుపూర్వోక్తవిధానము నెఱింగి పరలోకార్థమై శాస్త్రనియమిత కర్మముల నాచరించునో (అనుభవించునో) అతడా యా కర్మలవలన లభించినజ్ఞానముచే ఆచరిత మగుఆకర్మద్వారా (సంసార బంధనములచే) బద్ధుడుగాడు.

**అన్యథా కర్మ కుర్వాణో మానారూఢో నిబధ్యతే ।**
**గుణప్రవాహపతితో నష్టప్రజ్ఞో వ్రజత్యధః ॥ 8**

ఏవ్యక్తి శాస్త్రనియమముల నుల్లంఘించి అభిమానయుక్తుడై కర్మముల నాచరించునో ఆ వ్యక్తి తాననుష్ఠించిన కర్మములద్వారముననే వినాశమును పొందును. అనంతరము గుణప్రవాహమున (సంసారమున) పతితుడయి నష్టజ్ఞానియగుటవలన నరకమును పొందును.

**తత్ర నిర్భిన్నగాత్రాణాం చిత్రవాజైః శిలీముఖైః ।**
**విప్లవోఽభూద్దుఃఖితానాం దుస్సహః కరుణాత్మనామ్ ॥ 9**

ఆ వనమున (విషయభోగస్థానమున) చిత్రము లైనఱెక్కలు గల పురంజనుని (జీవుని) బాణములచే (వివిధదోషయుక్తము లగునింద్రియములచే) భిన్నదేహములు

గలిగినట్టివియు, దుఃఖించుచున్నవియు నగుమృగముల (విషయసమూహముల) వినాశము దయార్ద్రహృదయులగు (పరదుఃఖ దుఃఖితులగు) సాధువులకు దుస్సహమయ్యెను. (అనగా సర్వవిషయములు కృష్ణనిత్యప్రీతికై నియుక్తము లైనచో ఆ విషయములకు సార్థకతగలుగును. కాని ఆవిషయముల దుర్వినియోగమును, వానివినాశమును జూచినచో వారిదయ ఉద్రిక్తమగును).

శశాన్ వరాహాన్ మహిషాన్ గవయాన్ రురుశల్యకాన్ ।
మేధ్యానన్యాంశ్చ వివిధాన్ వినిఘ్నన్ శ్రమ మధ్యగాత్ ॥ 10

ఆవనమున పురంజనుడు కుందేళ్ళను, వరాహములను, మహిషములను, గవయములను, రురుమృగములను, శల్యాకమృగములను, ఇంకను నితరము లగు యజ్ఞోపయుక్తము లగుపశువులను (స్వప్నమున నానావిధవిషయములను) సంహరించి (అనుభవించి) అలసిపోయెను.

తతః క్షుత్తృట్పరిశ్రాన్తో నివృత్తో గృహమేయివాన్ ।
కృతస్నానోచితాహారః సంవివేశ గతక్లమః ॥ 11

తరువాత పురంజనుడు (జీవుడు) ఆకలిదప్పులచే (దుష్కర్మములవలన పశ్చాత్తప్తుడయి) కాతరుడయి వేటనుండి (పాపకర్మనుండి) మరలి, గృహమునకు (ధర్మపథమునకు) దిరిగివచ్చెను. (ప్రాయశ్చిత్తముపిమ్మట స్నానముచేసి) సముచిత మగునాహారమును దీసికొని (అమేధ్యభక్షణమును పరిత్యజించి) శయ్యనాశ్రయించి యలసటను దీర్చికొనెను.

ఆత్మానమర్హయాంచక్రే ధూపాలేపస్రగాదిభిః ।
సాధ్వలంకృతసర్వాంగో మహిష్యామాదధే మనః ॥ 12

పిమ్మట పురంజనుడు ధూపము, గంధము, పుష్పమాలలు మున్నగు వానిద్వారా (ధర్మజ్ఞానవైరాగ్యాదినానావిధము లగుమంగళకరము లయిన యుపదేశములద్వారా) తన దేహము (అంతఃకరణము) నలంకరించుకొనెను (శోధించెను). చక్కగ సర్వాంగముల నలంకరించుకొని (శాస్త్రోపదేశములయందు చిత్తవృత్తుల నన్నింటిని నిలిపి) పట్టపురాణిపై (పూర్వావస్థను పొందినధర్మశీల యగుబుద్ధిపై) చిత్తమును నిలిపెను.

దృప్తో హృష్టః సుతృప్తశ్చ కన్దర్పాకృష్టమానసః ।
న వ్యచష్ట వరారోహాం గృహిణీం గృహమేధినీమ్ ॥ 13

భోజనముచే తృప్తుడు, ధూపచందనాదిలేపనములచే సంతుష్టుడు, అలంకారములచే భూషితుడు నై పురంజనుడు గర్వితుడయ్యెను. అందువలన మన్మథుడు వానిచిత్తము నాకర్షింపగా కామముచే ఆకృష్టచిత్తు డగునతడు (రాజసబుద్ధిచే ఆకృష్టచిత్తు డగుజీవుడు)

తనగృహకార్యముల నిర్వహించునుత్తమురా లగుభార్యను (పూర్వమున ధర్మమునందు ప్రోత్సాహపఱచినబుద్ధిని) కనజాలకపోయెను. (ఆగంతుక మగుపాపమువలన గలిగిన మనోమాలిన్యము నశింపకుండుటచే జీవుడు ప్రయత్నించినను వానికి ప్రాక్తన మగుధర్మ ప్రయోజకబుద్ధి శీఘ్రముగ కలుగదు).

**అన్తఃపురస్త్రియోఽ పృచ్ఛద్విమనా ఇవ వేదిషత్ ।**
**అపి వః కుశలం రామాః సేశ్వరీణాం యథా పురా ॥ 14**

ఓ ప్రాచీనబర్హీ! పురంజనుడు (జీవుడు) పట్టపురాణిని (ధర్మప్రయోజిక యగు బుద్ధిని) కనజాలకపోవుటచే ఉద్విగ్నుడయి అంతఃపురపరిచారికల (ఇంద్రియవృత్తి సమూహముల) నిట్లు ప్రశ్నించెను - "వనితలారా! మీయధీశ్వరి (సాత్వికబుద్ధి) తో గూడ కుశలముగనే యున్నారా?"

**న తథైతర్హి రోచన్తే గృహేషు గృహసంపదః ।**
**యది న స్యాద్గృహే మాతా పత్నీ వా పతిదేవతా ।**
**వ్యంగే రథ ఇవ ప్రాజ్ఞః కోనామాసీద్దీనదీనవత్ ॥ 15**

వనమునకు (శబ్దాదిభోగ్యవిషయములవైపు) పోవుటకు పూర్వము గృహసంపద నా కెట్లురుచికరముగ నుండెనో నే డట్లుకనబడుటలేదు. గృహమున (ఆత్మయందు) తల్లి (విష్ణుభక్తి), పతిపరాయణ యగుభార్య (ధర్మాభిముఖి యగుబుద్ధి) లేనిచో నెట్టిప్రాజ్ఞుడయినను అచటనేయుండి దుఃఖముల ననుభవింపగోరునా? చక్రములు, అశ్వములు లేనిరథమున ఏవ్యక్తియైనను సుస్థిరుడయి కూర్చుండగలుగునా?

**క్వ వర్తతే సా లలనా మజ్జన్తం వ్యసనార్ణవే ।**
**యా మాముద్ధరతే ప్రాజ్ఞాం దీపయన్తీ పదే పదే ॥ 16**

నా ప్రజ్ఞను వెలుగులోనికి దెచ్చినదియు, వ్యసనసాగరమున నిమగ్నమైనపుడు నన్ను మాటిమాటికి ఉద్ధరించినదియు నగునావనిత (వివేకాత్మికబుద్ధి) యెచట నున్నది?

## శ్రీ రామా ఊచుః

**నరనాథ న జానీమస్త్వత్ప్రియా యద్వ్యవస్యతి ।**
**భూతలే నిరవస్తారే శయానాం పశ్య శత్రుహన్ ॥ 17**

స్త్రీలు పలికిరి :- రాజా, నీప్రేయసి (వివేకాత్మిక యగుబుద్ధి) యేయభిప్రాయముతో నున్నదో మేమెఱుంగము. (మేము బుద్ధి నెఱుంగుదుము కాని దానిపనుల నెఱుంగము).

శత్రుదమనా! (పాపములను త్యజించినవాడా!) చూడుము, నీప్రేయసి (బుద్ధి) ప్రక్క కుండగనే భూమిపై పరుండియున్నది. (జీవుని హృదయమే వివేకవతి యగు బుద్ధికి )ప్పపర్యంకసదృశ మగువిశ్రామస్థలము, దానిని నుండి చ్యుతయై సద్బుద్ధి యావరణము ఁనిభూమిపై పడియుండెను.)

## శ్రీ నారద ఉవాచ

పురంజనః స్వమహిషీం నిరీక్ష్యావధూతాం భువి ।
తత్సంగోన్మథితజ్ఞానో వైక్లబ్యం పరమం యయౌ ॥ 18

నారదుడు పలికెను:- అప్పుడు పురంజనుడు (జీవుడు) తనభార్య (వివేకవతి యగుబుద్ధి) దేహముపై నెట్టియాదరము లేకుండగ నేలపై పడియుండుట చూచెను. ఆమె సాంగత్యముచే వివేకము నశించినవాడయి యతడు మిగుల కలతచెందెను.

సాన్త్వయన్ శ్లక్ష్ణయా వాచా హృదయేన విదూయతా ।
ప్రేయస్యాః స్నేహసంరంభలింగమాత్మని నాధ్యగాత్ ॥ 19

పరితప్తహృదయముతో (తన సద్బుద్ధిని విడచి అనుతప్తహృదయముతో) సుందరము, సుమధురము నగువాక్కులతో ప్రేయసిని యోదార్పసాగెను. కాని యామెప్రణయకోప చిహ్నములను తెలిసికొనజాలనివాడయ్యెను. (జీవుడు ప్రాక్తనబుద్ధియొక్క శైథిల్యమునకు కారణము తెలిసికొన జాలడు).

అనునిన్యేఽథ శనకైర్వీరోఽనునయకోవిదః ।
పస్పర్శ పాదయుగలమాహ చోత్సంగలాలితామ్ ॥ 20

పిమ్మట అనునయించుటయందు మిగుల నేర్పుగలపురంజనుడు తన భార్యను మెల్లమెల్లగ ఎన్నియోవిధముల అనునయించెను (నేటినుండి మరల నేనిక (జీవుడు) దుర్విషయభోగములయందు బుద్ధి నుంచను). మొదట పురంజనుడు భార్యయొక్క (సద్బుద్ధియొక్క) పాదములను స్పృశించెను. (తనయహంకారమును త్యాగముచేసి, సాధువులను గౌరవించెను). అనంతర మామెను ఒడిలోనికి దీసికొని (హృదయముకడకు దెచ్చి) ఆదరించుచు నిట్లుపలుకసాగెను.

## శ్రీ పురంజన ఉవాచ

నూనం త్వకృతపుణ్యాస్తే భృత్యా యేష్వీశ్వరాః శుభే ।
కృతాగస్స్వాత్మసాత్కృత్వా శిక్షాదండం న యుంజతే ॥ 21

పురంజనుడు పలికెను :- కల్యాణీ! (సద్బుద్ధీ!) అపరాధులయినను భృత్యులను "వీరు నావా" రని భావించి యజమానులు శిక్షింపనిచో ఆ సేవకులు నిజముగ దురదృష్టవంతులే యగుదురు.

పరమోఽ నుగ్రహో దండో భృత్యేషు ప్రభుణార్పితః ।
బాలో న వేద తత్తన్వి బన్ధుకృత్యమమర్షణః ॥ 22

కృశాంగీ! ప్రభువు సేవకులను శిక్షించినచో అది వారిపై గొప్ప అనుగ్రహమే యగును. దానివలన ఆభృత్యుడు కృద్ధుడయినచో అది వానిమూర్ఖతయే యగును. ఏలయన, అతడు తనహితముకోరుయజమాని యొక్క యుపకారమును తెలిసికొనిజాలడు. (నీ యీ దండనము నా కనుగ్రహమేయగును. దీనివలన నేనిక పాపమునం దాసక్తుడనుగాను).

చ॥ *రమణిరో భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్ స్వప*
*క్షముదలపోసి యుగ్రతరశాసనముం దెగి చేయరట్లుగా*
*క మనములోనికిన్కఁ దమకంబున నాజ్ఞ యొనర్చిరేని ని*
*క్కముగ ననుగ్రహించుటయ కాక తలంపఁగ నాజ్ఞ సేయుటే.* (4-788)

సా త్వం ముఖం సుదతి సుభ్ర్వనురాగ భార -
వ్రీడావిలంబవిలసద్ధసితావలోకమ్ ।
నీలాలకాలిభిరుపస్కృతమున్నసం నః
స్వానాం ప్రదర్శయ మనస్విని వల్గువాక్యమ్ ॥ 23

సుందరము లయినదంతములు గలదానా! మనోహరము లగుకనుబొమలచే శోభిల్లు దానా! మనస్వినీ! నీవు నా కధీశ్వరివి, నన్ను నీవానినిగా భావించి అనురాగభారము చేత, సిగ్గుచేత వంగినదియు, మధురమందహాసయుక్తమగునవలోకనములతో శోభిల్లు నదియు, నల్లనిముంగురు లను తుమ్మెదలచే పరివేష్టితమైనదియు, ఉన్నత మగునాసిక గలదియు, మనోజ్ఞము లగువాక్కులు గలదియు అగునీవదనకమలమును నాకు చూపుము. (అధ్యాత్మ పక్షమున సర్వవిధముల పురంజను (జీవున)కు బుద్ధి యనుకూలమై స్థిరముగ నుండుగాక యనుప్రార్థన సూచితమైనది).

మ॥ *సరసోదారసుధారసోపమవచశ్చాతుర్యసౌభాగ్య మై*
*హరినీలోపమకోమలాలకయుతం బై విభ్రమభ్రూలతా*
*పరిజుష్టస్మితసద్విలోకనము నైభాసిల్లుయుష్మన్ముఖాం*
*బురుహంబున్ భవదీయదాసునకుఁ బూఁబోఁడి కృపం జూపవే॥* (4-791)

తస్మిన్ దధే దమమహం తవ వీరపత్ని
యోఽ న్యత్ర భూసురకులాత్కృతకిల్బిషస్తమ్ ।
పశ్యే న వీతభయమున్ముదితం త్రిలోక్యా -
మన్యత్ర వై మురరిపోరితరత్ర దాసాత్ ॥ 24

సుందరీ! నేను వీరుడను (పుణ్యమయభోగములం దుత్సాహము గలవాడను). నీవు నా భార్యవు (బుద్ధివి). అందువలన నీ కెవరైన విరోధి ఉన్నను, అపరాధముచేసినవా డున్నను చెప్పుము. వానిని శిక్షింతును. అతడు బ్రాహ్మణుడు లేదా శ్రీకృష్ణుని దాసుడు అనగా వైష్ణవుడు కానిచో (బ్రాహ్మణునికోపము నుండి, వైష్ణవాపరాధమునుండి తప్పించు కొనుట బహుదుష్కరము) నేను వానిని తప్పక శిక్షింతును. కాని నీ కపకారముచేసి సంతోషముతో జీవింపజాలిన నిర్భయు డగుపురుషుడు మూడు లోకములలోగాని లేదా వానికి బయటగాని యున్నట్లు నా కగపడుటలేదు.

ఆధ్యాత్మికపక్షమున - ప్రాక్తనసంస్కారము లేదా పాపాచరణము వలన జీవునిసద్బుద్ధి భ్రంశమగును. దానివలన పుణ్యాత్ము డగుభోగియైన జీవుడు దానపుణ్యవ్రతాదులద్వారా తనదుర్బుద్ధిని శిక్షించుకొనును; కాని బ్రాహ్మణకోపము లేదా వైష్ణవాపరాధమువలన సద్బుద్ధి నశించును, దాని వలన వారికడ క్షమాపణమును గోరుట, వారికి ప్రసన్నతను కలుగజేయుట తప్ప పైన చెప్పబడినకోపము లేదా అపరాధమును పోగొట్టుటకు వేఱువిధమగు ఉపాయము లేదు.

వక్త్రం న తే వితిలకం మలినం విహర్షం
సంరంభభీమమవిమృష్టమపేతరాగమ్ ।
పశ్యే స్తనావపి శుచోపహతౌ సుజాతౌ
బింబాధరం విగతకుంకుమపంకరాగమ్ ॥ 25

సుందరీ! ఇంతకు పూర్వమెన్నడును తిలకము లేని నీ ముఖమును జూడలేదు. ఎప్పుడును నిట్టిహర్షరహితము, క్రోధమువలన భయంకరము, అనుజ్జ్వలము, ప్రేమశూన్యము నగు ముఖమును జూడలేదు. శోకమువలన గలిగిన బాష్పములచే నీ స్తనములు తడిసిపోయినవి. పూర్వ మెన్నడును నిట్లు చూడలేదు. వెనుకటివలె నీబింబాధరమునందు కుంకుమపంకతుల్యమగుతాంబూలరాగము యొక్క రక్తిమ లేదు. (ఇప్పుడు సద్బుద్ధి వెనుకటి వలె ప్రసన్నత లేదు).

తన్మే ప్రసీద సుహృద: కృతకిల్బిషస్య
స్వైరం గతస్య మృగయాం వ్యసనాతురస్య ।
కా దేవరం వశగతం కుసుమాస్త్రవేగ-
విస్రస్తపౌంస్నముశతీ న భజేత కృత్యే ॥ 26

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మ సూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే పురంజనోపాఖ్యానే
షడ్వింశోఽ ధ్యాయ: ॥

అందువలన నీ (సద్బుద్ధియొక్క) యనుమతి తీసికొనకుండగ నాస్వతంత్రేచ్ఛతో వేటయందలియాసక్తితో నీకపరాధము గావించితిని. అయినను ప్రియునిగా భావించి నాతప్పును మన్నించి నాకు ప్రసన్నురాలివికమ్ము. ఏ కాంతుడు ప్రియురాలికి ఆమె యభిలషించిన సుఖము నిచ్చుటకునుమ్ముఖు డగునో, ఏ కాంతుడు మన్మథబాణపీడితుడయి ధైర్యమును పోగొట్టుకొని ప్రియురాలునకు వశు డగునో, అట్టికాంతుని గామించు ఏయువతియైన కామము ననుభవించుటకు యోగ్య మైనదేశకాలములు లభించినచో అనుభవింపక యుండునా? (సాధ్వి యగుస్త్రీ అపరాధి యగుకాంతుని పరిత్యజింపనట్లు, ఓసద్బుద్ధీ! నీవుగూడ జీవుడ నగునన్ను పరిత్యజింపవలదు)

*కం॥ వనితాజనపరవశుఁ డై*
*మనసిజశర బాధ్యమానమానసుఁ డగువా*
*నినిఁ దగఁ గర్త వ్యార్థము*
*లను భజియింప తొలంగులలనలు గలరే.*

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని ఇరువదియాఱవ అధ్యాయము
సమాప్తము.



# ఇరువదియేడవ అధ్యాయము

## పురంజనునిపై చండవేగుడు దండెత్తుట; కాలకన్యచరిత్ర

కథాసారము :- ఈయధ్యాయమున భార్యాపుత్రులయం దాసక్తి కలిగియుండుటచే )రంజనునిఆత్మవిస్మృతి, కాలకన్యాదులయుపాఖ్యానము అనువానిద్వారమున జీవుని ꞉రారోగాది విషయములు వర్ణితములైనవి.

పురంజను డనుజీవునకు బుద్ధి యనుధర్మశీల యైనభార్యయందు మరల ఆసక్తి ꞉లుగుట, పత్నితో ధర్మకార్యనిర్వహణమను ఆలోచనకు వశుడై వివేకమును అనగా పరమార్థానుశీలనమనుప్రవృత్తిని నాశనముచేయుట, వైరాగ్యజ్ఞానయుక్త మగు భక్తి లేకపోయినచో దుర్లభ మగుతనమానవజీవితమును తెలిసికొనుసామర్థ్యము లేకపోవుట, దానివలన విషయభోగేచ్ఛ దినదినాభివృద్ధియగుట, నిత్యము క్రొత్తక్రొత్త భోగోపాయములను సృష్టించుట, భార్యభుజలత యనుఅవిద్య నాశ్రయించి పుణ్యాది ధర్మకార్యములను పరమపురుషార్థము లనిభావించుటవలన కృష్ణసంబంధజ్ఞానవిషయమును తెలిసి కొనజాలక పోవుట,క్రమముగ వయోవృద్ధి ననుసరించి పైనచెప్పబడినబుద్ధి యనుపత్ని నుండి వివేకనిర్ణయసంశయాదు లగుపదునొకండువందలమంది పుత్రులను, లజ్జ ఉత్కంఠత మున్నగునూటపదుగురు పుత్రికలను గనుట, పుత్రులను మతి ధృతిమున్నగు స్త్రీలతోను, కూతుండ్రను వినయప్రణయాదివరులతోను వివాహముచేయుట; కాలక్రమమున పురంజనునకు పుణ్యాచరణాదిపౌత్రు లావిర్భవించుట, వారిద్వారా పంచాలరాజ్య మనుశబ్దాది విషయములయందు పురంజనునివంశము వృద్ధిచెందుట, పురంజనునకు వివేకాదు లను పుత్రులయందు, అభిమానాదులను దాయాదులయందు, ఇంద్రియ ప్రాణాదులను భృత్య వర్గమునందు, ఆధారచక్రాదు లనుగృహములయందు, ఉదర మనుభాండారమునందు, శబ్దాదు లను విషయములయందు ఆసక్తి కలుగుట, పిమ్మట పశుహింసా బహుళము లగుయజ్ఞాదులద్వారా దేవతలను, పితరులను, భూతపతులను పూజించుటవలన, కర్మ కాండమునం దాసక్తి కలుగుటవలన ఆత్మహితసాధకము లగు భగవదారాధనాది కార్యముల యందు మనస్సు లగ్నము కాకపోవుట, కర్మవినిర్మిత మగుపురము అనగా దేహముపై కాలప్రభావము ననుసరించి నానా విధము లగుఆదివ్యాధులు వ్యాపించుట, కాలకన్య యగుజరయొక్కయుపాఖ్యానము మున్నగువిషయములు వర్ణితములైనవి.

భగవద్భ క్తుడగునారదుడు బ్రహ్మలోకమునుండి భూతలమునకు వచ్చుచుండగా ఈకాలకన్య నారదుని ప్రాకృతజీవునిగా భావించి వానికి భార్య కాదలచి తనకోరికను వెల్లడిచేసెను. కాని నారదు డీప్రస్తావనము నంగీకరింపకపోగా జర వానిని శపించుచు "నారదుడెచ్చటను స్థిరముగ నుండకుండుగాక" యనిపలికెను.పిమ్మట నారదునియాజ్ఞ ననుసరించి జర మృత్యువును పతిగా వరింపదలచగా, మృత్యువు జరతో కర్మవినిర్మిత ప్రాణిశరీరమును బలవంతముగ నాక్రమించి వానిని పతిగా జేసికొను మనిబోధించెను. ఈయుపాఖ్యానముద్వారమున, భగవద్భక్తులు జర ఆక్రమించుటకు దగ రనుట(ఏలయన, వారి దేహము ప్రాకృతజనులవలె కర్మవినిర్మితమైనదికాదు), ప్రాకృతవ్యక్తులే జర కాక్రమించు టకు యోగ్యులనుట, భక్తులు నారదునివలె నానాస్థానముల పర్యటించుచు హరికథమ కీర్తించుచుండుటయనువిషయము లుపదిష్టము లైనవి.

## శ్రీ నారద ఉవాచ

**ఇత్థం పురంజనం సధ్ర్యగ్వశమానీయ విభ్రమైః ।**
**పురంజనీ మహారాజ రేమే రమయతీ పతిమ్ ॥ 1**

నారదుడు పలికెను:- మహారాజా! పురంజని యిట్లుహావభావవిలాసములచే పురంజనుని సంపూర్ణముగ తనవశముచేసికొని, ఆపతికి అనురాగమును గలుగజేసి వానితో విహరింపసాగెను. (అధర్మమునందలి మతిని పరిత్యజించి జీవుడు వెనుకటివలె ధర్మబుద్ధియం దాస క్తుడయ్యెను).

**స రాజా మహిషీం రాజన్ సుస్నాతాం రుచిరాంబరామ్ ।**
**కృత స్వస్త్యయనాం తృప్తామభ్యనన్దదుపాగతామ్ ॥ 2**

రాజా! ఆపురంజనుడుగూడ సుస్నాతయు, సుందరము లగువస్త్రములు గలదియు, కుంకుమసింధూరాదులద్వారా మాంగళికము లగుశృంగారములను జేసికొని యేగుదెంచి నదియు (సద్బుద్ధి ప్రసన్నతను విశదము చేయునది), పానభోజనాదులద్వారా తృప్తి చెందినదియు, తనసమీపమునకు వచ్చినదియు నగుభార్య ననుభవించుటకై యామెను గ్రహించెను.

**తయోపగూఢః పరిరబ్ధకన్ధరో**
**రహోఽనుమన్త్రైరపకృష్టచేతనః ।**
**న కాలరంహో బుబుధే దురత్యయం**
**దివా నిశేతి ప్రమదాపరిగ్రహః ॥ 3**

ప్రియురాలు వానిని ఆలింగనముచేసికొనగా పురంజనుడుగూడ బాహు యుగళము ద్వారా ఆయువతికంఠము నాలింగనము చేసికొనెను. ఆరమణి యేకాంతముగ అనుకూలము లగురహస్యసంభాషణములు చేయుచుండగా (ధర్మకర్మములను నిర్వహించునాలోచన చేయుగా) పురంజనునిచైతన్యము(వివేకము) విలుప్తమయ్యెను. అందువలన ఆవనితతోగూడి క్రీడోన్మత్తుడయి యుండుటచే వానికి రేయింబవళ్ళజ్ఞానముగూడ లేకపోయెను. క్షణక్షణము వానియాయువు క్షీణించిపోసాగెను. కాని యతని కావిషయము తెలియకపోవుచుండెను. (జీవుడు బుద్ధితో ధర్మకర్మములను నిర్వహించునాలోచనచేసి వివేకము అనగా పరమార్థ శీలనప్రవృత్తిని పోగొట్టుకొనెను. వైరాగ్యయుక్త మగుభక్తి లేకపోవుటచే మానవజీవిత దుర్ల భత్వమును హృదయంగమము చేసికొనజాలడు).

శయాన ఉన్నద్ధమదో మహామనా
మహార్హతల్పే మహిషీభుజోపధిః ।
తామేవ వీరో మనుతే పరం యత-
స్తమోఽభిభూతో న నిజం పరం చ యత్ ॥ 4

(అందువలన మరణాదిభయములనుగూర్చి యాలోచింపక) పురంజనుడు(జీవుడు) భోగ్యవిషయములయందు ప్రతిదినము ప్రవృద్ధ మగుమదముగలవాడయ్యెను. భోగములకై నానావిధము లగుసంకల్పవికల్పముల జేయసాగెను. వీరు డగు(భోగములయం దుత్సాహము గలవాడగు)పురంజనుడు భార్యయొక్క భుజలతను(అవిద్యను)ఉపధానముగా (ఉపాధిగా) జేసికొని మహామూల్య మగుశయ్యపై (పుణ్యకర్మలయందు) శయనించి(మగ్నుడై) రతిక్రీడ యందు మత్తుడయ్యెను (అజ్ఞానముచే అభిభూతుడయ్యెను). ఆస్త్రీనె (ధర్మపత్ని సాంగత్య ముచే ధర్మాసక్తి వలన పుణ్యాదిధర్మకర్మములనె) పరమ పురుషార్థముగ భావించెను. కాని తనస్వరూపముయొక్క, పరమేశ్వరస్వరూపముయొక్క జ్ఞానమును(సంబంధజ్ఞానమును) పరమ పురుషార్థ మనిభావింపకపోయెను.

తయైవం రమమాణస్య కామకశ్మల చేతసః ।
క్షణార్థమివ రాజేన్ద్ర వ్యతిక్రాన్తం నవం వయః ॥ 5

రాజేంద్రా! ఇట్లాయువతితో కామక్రీడచేయుచు కామమోహితచిత్తుడగుపురంజనుని నవయౌవనము అర్ధక్షణమువలె తెలియకుండగనే గడచిపోయెను.

తస్యామజనయత్పుత్రాన్ పురంజన్యాం పురంజనః ।
శతాన్యేకాదశవిరాడాయుషోఽర్ధమథాత్యగాత్ ॥ 6

ఆపురంజనసమ్రాట్టు (దేహమున కేకచ్ఛత్రభోక్తాభిమానియు, గృహమేధధర్మపరాయణుడు నగు జీవుడు) భార్య యగుపురంజనివలన పదునొకండు వందలమంది పుత్రులను (వివేకనిర్ణయసంశయాదులను) గనెను. దానివలన వానిపరమాయుర్దాయములో సగభాగము గడచెను. (ఏబదిసంవత్సరముల వరకు గృహస్థ వ్యక్తులలో విషయభోగలంపటుత్వ మధికముగ గనబడును)

**దుహితౄర్దశోత్తరశతం పితృమాతృయశస్కరీః ।**
**శీలౌదార్యగుణోపేతాః పౌరంజన్యః ప్రజాపతే ॥ 7**

ప్రజాపతీ! ఆ పురంజనుడు పురంజనివలన నూటపదుగురుపుత్రికలను (లజ్జ, ఉత్కంఠ, చింత మున్నగువారిని) గనెను. ఈ కన్యక లందఱు తల్లిదండ్రులకు పేరుదెచ్చువారు, శీలవతులు, ఔదార్యాదిసద్గుణములు గల వారు నైయుండిరి.

**స పంచాలపతిః పుత్రాన్ పితృవంశవివర్ధనాన్ ।**
**దారైః సంయోజయామాస దుహితౄః సదృశైర్వరైః ॥ 8**

పంచాలపతి యగునాపురంజనుడు తనవంశగౌరవమునకై పుత్రులకు దగినయువతులతోను (మతి, ధృతి మున్నగువారితో) పుత్రికలకు దగినవరుల (వినయ ప్రణాయాదుల) తోను వివాహమొనర్చెను.

**పుత్రాణాం చాభవన్ పుత్రా ఏకైకస్య శతం శతమ్ ।**
**యైర్వై పౌరంజనో వంశః పంచాలేషు సమేధితః ॥ 9**

పురంజనునియాపుత్రులలో ఒక్కొక్కరికి నూఱుగురుచొప్పున కుమారులు (పుణ్యాచరణాదులు) జన్మించిరి. ఈ పుత్రపౌత్రులవలన పంచాలరాజ్యమునందు (శబ్దాది విషయముల యందు) పురంజనునివంశము వృద్ధిబొందెను.

**తేషు తద్రిక్థహారేషు గృహకోశానుజీవిషు ।**
**నిరూఢేన మమత్వేన విషయేష్వన్వబధ్యత ॥ 10**

పురంజను డాపుత్రుల (వివేకాదుల) యందు, తనదాయాదుల (అభిమానాదుల ) యందు, గృహమునందు (ఆధారాదిచక్రములయందు), కోశాగారమునందు (ఉదరము మున్నగువానియందు), భృత్యుల (ఇంద్రియప్రాణాదుల) యందు ప్రగాఢ మగుమమకారమును కలిగియుండి విషయముల (శబ్దాదుల) యందు మిగుల ఆసక్తుడయ్యెను.

**ఈజే చ క్రతుభిర్ఘోరైర్దీక్షితః పశుమారకైః ।**
**దేవాన్ పితౄన్ భూతపతీన్ నానాకామో యథా భవాన్ ॥ 11**

ప్రాచీనబర్హీ! పురంజనుడు నీవలె తనవాంఛలను సాధించుకొనుట యందు పట్టు దలగలవాడయి భయానకము, పశుహింసాప్రధానము నగు యజ్ఞములచే దేవతలను, పితృ దేవతలను, భూతపతులను (భైరవాదులను) అర్చింపసాగెను.

**యుక్తేష్వేవం ప్రమత్తస్య కుటుంబాసక్త చేతసః ।**
**ఆససాద స వై కాలో యోఽ ప్రియః ప్రియయోషితామ్ ॥ 12**

ఇట్టిభావముతో కుటుంబాసక్తచిత్తుడయి పురంజనుడు ఆత్మహిత సాధకము లగు భగవదారాధనకార్యములయందు శ్రద్ధగలవాడయ్యెను. కాని స్త్రీలంపటవ్యక్తుల కప్రియ మైనకాలము అనగా జర వచ్చి వానియెదుట నిలువబడెను.

**చణ్డవేగ ఇతి ఖ్యాతో గన్ధర్వాధిపతిర్నృప ।**
**గన్ధర్వాస్తస్య బలినః షష్ట్యుత్తరశతత్రయమ్ ॥ 13**

మహారాజా! చండవేగుడను (సంవత్సర మనుకాలము) ఒకగంధర్వ రాజుండెను. వానియధీనమున మూడువందలయరువదిమంది బలవంతులగు గంధర్వు (దివసము) లుండిరి.

**గన్ధర్వ్యస్తాదృశీరస్య మైథున్యశ్చ సితాసితాః ।**
**పరివృత్త్యా విలుంపన్తి సర్వకామవినిర్మితామ్ ॥ 14**

కృష్ణ (కృష్ణపక్ష) శుక్లపక్షము లనుగంధర్వ స్త్రీ (రాత్రు) లంతసంఖ్యలోనే యుండిరి. ఈగంధర్వులు దంపతు లయియుండి పరిభ్రమించుచు సర్వకామవినిర్మిత మగుపురమును (దేహమును) దోపిడిచేయుచుండిరి (పుట్టుక నుండి యారంభించి ప్రతిదినము ఆయుస్సును హరించుచుండెను).

**తే చణ్డవేగానుచరాః పురంజనపురం యదా ।**
**హర్తుమారేభిరే తత్ర ప్రత్యషేధత్ప్రజాగరః ॥ 15**

చండవేగునియనుచరు లగునీగంధర్వులు (దివసములు) పురంజనునిపురమును (దేహమును) దోపిడిచేయుచుండగా అప్పుడచ్చట నున్నపుర పాలకు డగు ఐదుతలలు గలవాగము (పంచప్రాణములు) వారిని నివారింప సాగెను.

**స సప్తభిః శతై రేకో వింశత్యా చ శతం సమాః ।**
**పురంజన పురాధ్యక్షో గన్ధర్వైర్యుయుధే బలీ ॥ 16**

బలవంతు డగుపురంజనపుర (దేహ) రక్షకుడు (ప్రాణములు) ఒంటరిగనే నూరు సంవత్సరములకాలము (మనుష్యపరిమాణాయుర్దాయకాలము) ఏడు వందలయిరువది మంది గంధర్వులతోను, గంధర్వస్త్రీలతోను (దివారాత్రములతో) యుద్ధముచేయసాగెను.

**క్షీయమాణే స్వసంబన్ధ ఏకస్మిన్ బహుభిర్యుధా ।**
**చిన్తాం పరాం జగామార్తః స రాష్ట్ర పురబాన్ధవః ॥ 17**

పిమ్మట పురరక్షకుడు (ప్రాణము) బహుసంఖ్యకసైన్యముల (దివారాత్రముల) తో బహుకాలమువరకు నొంటరిగ యుద్ధముచేసి క్షీణబలుడయ్యెను. అపుడు పురంజనుడు, తనబంధువులు, రాష్ట్రప్రజలు సర్వులు (శబ్దాదివిషయములు) పీడితులయి మిగుల చింతాకులులైరి. (ఏబదిమూడుసంవత్సరముల వఱకు ప్రాణములు పరాజయము నంద లేదు, అనంతరము మెల్లమెల్లగ పరాజయమును పొందినవి)

**స ఏవ పుర్యాం మధుభుక్పంచాలేషు స్వపార్షదైః ।**
**ఉపనీతం బలిం గృహ్ణన్ స్త్రీజితో నావిదద్భయమ్ ॥ 18**

పురంజను డింతకుపూర్వము తనపురమునందు (దేహమునందు), పంచాల దేశము నందు (బహిర్విషయములయందు) మధువును త్రాగువానివలె (మధువుతో సమానము లైనవిషయసుఖముల ననుభవించువానివలె)నివసించెను. వానియనుచరులు (ఇంద్రియ ములు) పంచాలరాజ్యమున నానాప్రదేశములనుండి బహువిధము లగుభోగసామగ్రులను దెచ్చి వానికిచ్చు చుండిరి. స్త్రీలంపటు డగు (కర్మమార్గమునకు సంబంధించిన భోగబుద్ధికి వశుడయి) పురంజనుడు ఆభోగవస్తువుల నన్నింటిని యనుభవించెను. అందువలన ఉత్తరకాలమున గలుగు నెట్టిభయమును గూర్చియు నెఱుంగక పోయెను. (ఇంద్రియముల ద్వారా విషయాసక్తుడయి జీవు డాయువు క్షీణించుచుండుట తెలిసికొనజాలడు).

**కాలస్య దుహితా కాచిత్త్రిలోకీం వరమిచ్ఛతీమ్ ।**
**పర్యటన్తీం న బర్హిష్మన్ ప్రత్యనన్దత కశ్చన ॥ 19**

ప్రాచీనబర్హీ! కాలకన్యక (జర) పతి నన్వేషించుచు మూడులోకములలోను తిరుగ జొచ్చెను. కాని యెవ్వరును ఆమెను భార్యగా నంగీకరించుట కిష్టపడలేదు.

**దౌర్భాగ్యేనాత్మనో లోకే విశ్రుతా దుర్భగేతి సా ।**
**యా తుష్టా రాజఋషయే వృతాదాత్పురవే వరమ్ ॥ 20**

తనదౌర్భాగ్యమువలన ఈకన్య లోకములో 'దుర్భగ' యనునామముతో ప్రసిద్ధికెక్కెను, రాజర్షి యగుపురువు దుర్భగను వరించుటవలన ఆరమణి సంతుష్టయై రాజర్షికి వరము నిచ్చెను.

**కదాచిదటమానా సా బ్రహ్మలోకాన్మహీం గతమ్ ।**
**వవ్రే బృహద్వ్రతం మాన్తు జానతీ కామమోహితా ॥ 21**

ఆ కాలకన్యక యొకప్పుడు కామాసక్తయై వరాన్వేషణార్థమై మూడులోకములలోను పర్యటించెను. అపుడు నేను బ్రహ్మలోకమునుండి భూతలమునకు వచ్చుచుంటిని. నన్ను నైష్ఠిక బ్రహ్మచారిగా నెఱింగియు కామాతుర యగునాకన్య తన్ను పత్నిగా వరించ మని ప్రార్థించెను. (భూతలమునకు వచ్చుట చూచి సామాన్యమానవు డనుభ్రమతో నైష్ఠిక బ్రహ్మచారియు, సన్న్యాసియు, మహాప్రభావశాలియు నగువ్యక్తి నెవ్వరినిగూడ జరవదలుట కంగీకరింపదు.)

**మయి సంరభ్య విపులమదాచ్ఛాపం సుదుస్సహమ్ ।**
**స్థాతుమర్హసి నైకత్ర మద్యాఞ్చావిముఖో మునే ॥ 22**

కాని నే నామెప్రార్థనము నంగీకరింపకపోవుటవలన ఆమె నాపై క్రుద్ధురాలయి యిట్లుశపించెను - "మునీ! నీవు నా ప్రార్థనము నంగీకరింపకపోయితివి. అందువలన నీ వెప్పుడును నొకస్థానమున స్థిరముగ నుండజాలవు". (నారదునియప్రాకృతదేహమున జర ప్రవేశించుట యసంభవము. ఆయన లోకోపకారార్థమై అంతట పర్యటనచేయుచుండును. ఇదియే శాపములోని తాత్పర్యము.)

**తతో విహత సంకల్పా కన్యకా యవనేశ్వరమ్ ।**
**మయోపదిష్టమాపాద్య వవ్రే నామ్నా భయం పతిమ్ ॥ 23**

పిమ్మట యీకాలకన్యకసంకల్పము నెఱవేరకపోవుటచే నాయుపదేశము ననుసరించి యామె "భయ" మనుయవనేశ్వరునికడకు (యవనశబ్దముచే ఆధివ్యాధులు, ఈశ్వర శబ్దముచే వానికధిపతి యగుమృత్యువు సూచితము) వెడలి వానిని పతిరూపమున ప్రార్థించెను.

**ఋషభం యవనానాం త్వాం వృణే వీరేప్సితం పతిమ్ ।**
**సంకల్పస్త్వయి భూతానాం కృతః కిల న రిష్యతి ॥ 24**

వీరుడా! నీవు యవనులలో (ఆధివ్యాధులలో) శ్రేష్ఠుడవు. నేను నిన్ను నాపతిగా వరించితిని. నిన్ను నమ్మి ప్రాణులు సంకల్పించినది యెప్పుడును విఫలము గాదుగదా! (భూతశబ్దమున కిచట భగవద్భక్తు డని యర్థము. భగవద్భక్తులసంకల్ప మెన్నడును నష్టము కాదు, "జమలభయము నశించుగాక" యనునారదునిసంకల్పము వేఱువిధముగగాదు. అందువలన మృత్యువా! నీవు నాకు పతివి కమ్ము, దానివలన నేను నిన్ననుభవింతును).

ద్వావిమావనుశోచన్తి బాలావసదవగ్రహౌ ।
యల్లోకశాస్త్రోపనతం న రాతి న తదిచ్ఛతి ॥ 25

లోకదృష్టి లేదా శాస్త్రదృష్టితో దానముచేయుటకు యోగ్య మయిన వస్తువును దానము చేయనివాడు, శాస్త్రదృష్టిచే అధికారి యైకూడ ఇట్టిదానమును తీసికొననివాడు - వీరిరువురు అజ్ఞులే. వారియభిప్రాయములు మంచివికావు. సజ్జను లీయుభయుల అజ్ఞానమును జూచి దుఃఖించుచుందురు.

అథో భజస్వ మాం భద్ర భజన్తీం మే దయాం కురు ।
ఏతావాన్ పౌరుషో ధర్మో యదార్తాననుకంపతే ॥ 26

అందువలన ఓభద్రుడా! నేను నిన్నభిలషించుచున్నాను. నీవు గూడ నన్ను సేవింపుము. నాపై దయచూపుము. ఆర్తునిపై దయచూపుటయె పురుషుని ధర్మము.

కాలకన్యోదితవచో నిశమ్య యవనేశ్వరః ।
చికీర్షుర్దేవగుహ్యం స సస్మితం తామభాషత ॥ 27

దేవతలకు గుహ్య మగుకార్యము నొకదానిని సాధించుటకై (సంసార చక్రప్రవర్తనము నకై) యవనేశ్వరుడు (మృత్యువు) కాలకన్య చెప్పినవాక్కులను విని మందహాసవదనముతో దానితో నిట్లుపలికెను.

మయా నిరూపితస్తుభ్యం పతిరాత్మా సమాధినా ।
నాభినన్దతి లోకోఽయం త్వామభద్రామ సమ్మతామ్ ॥ 28

నీకు కాబోవుభర్తను (నీయొక్క భోగస్థానమును) నే నాత్మసమాధి ద్వారమున ముందుగనే నిర్ణయించియున్నాను. అమంగళరూపిణివి, అప్రియవు నని నిన్నెవ్వడును అంగీకరింపడు.

త్వమవ్యక్తగతిర్భుంక్ష్వ లోకం కర్మవినిర్మితమ్ ।
యా హి మే పృతనాయుక్తా ప్రజానాశం ప్రణేష్యసి ॥ 29

అందువలన నీవు అవ్యక్తగతి గలదానవై కర్మవినిర్మిత మగు ప్రాణులశరీరములను బలాత్కారముగ నాక్రమించి యనుభవింపుము. ఇట్లు చేసిన సర్వులు నీకు పతులు లేదా భోగ్యవిషయములు నగుదురు. నీవు నా సేనతో (ఆధివ్యాధులతో) గూడి వెడలుము. నీవు తప్పక ప్రజలను నాశముచేయగలవు. (ఆధివ్యాధులతో గూడి జర ప్రజలను నాశము చేయుచుండును).

ప్రజ్వారోఽయం మమ భ్రాతా త్వం చ మే భగినీ భవ ।
చరామ్యుభాభ్యాం లోకేఽస్మిన్నవ్యక్తో భీమసైనికః ॥ 30

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే పురంజనోపాఖ్యానే
సప్తవింశోఽధ్యాయః ॥

ఈప్రజ్వారము (విష్ణుజ్వరము) నాసోదరుడు, నీవు (జర) నాకు సోదరివి. మీయిరువురితో గలసి నే నవ్యక్త గతిగలవాడనై సేనను దీసికొని సర్వలోకములలోను భయము గలుగజేయుచు విహరింతును.

(అధర్మవంశోద్భవు లగువ్యక్తులు సోదరిని భార్యగా జేసికొందురు. అందువలన నారదునిమాటను ప్రమాణముగా జేయుటకై ప్రజ్వారము జరకు పతియయ్యెను. జర నారదుని పతిగా అనగా తనకు భోగ్యవస్తురూపముగ మార్చలేకపోయినది. అట్లే యితరులగు భగవద్భక్తులచిదానందదేహమును గూడ అనుభవింపజాలదు. కర్మవినిర్మితశరీరమునె జర బలాత్కారముగ నాక్రమింపగలదు. భక్తులదేహము భగవానునియందు సమర్పితమగుటవలన అది కర్మవినిర్మిత మయినదికాదు. అందువలన అది యెప్పుడును జరకు భోగ్యవస్తువు కాజాలదు).

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని ఇరువదియేడవ అధ్యాయము
సమాప్తము.





# ఇరువదియెనిమిదవ అధ్యాయము

## పురంజనుడు స్త్రీగా జన్మించుట : అవిజ్ఞాతుని యుపదేశము ననుసరించి అతడు ముక్తుడగుట

కథాసారము :- ఈయధ్యాయమున విదర్భరాజపుత్రిక కథను చెప్పుసందర్భములో స్త్రీచింతనము ద్వారా పురంజనుడు స్త్రీత్వమును పొందుట, కృష్ణభక్తులసహవాసప్రభావముచే పురంజనునకు మరల స్వస్వరూపము లభించుట యనువిషయములు వర్ణింపబడినవి.

భక్తశ్రేష్ఠుడగునారదుడు ప్రాచీనబర్హికి పురంజనకథా నెపముతో అధ్యాత్మజ్ఞానము నుపదేశించుటకై యిట్లుచెప్పెను - ఒకప్పుడు ఆధివ్యాధు లను యవనసేన విష్ణుజ్వరము తోను, కాలకన్య యగుజరతోను గూడి భూమిపై సంచరించుచు పురంజనుని దేహ మను పురమును ముట్టడించెను. దానివలన పురంజనునిసిరి తొలగెను. పురంజను డిట్లు శ్రీ భ్రష్టు డయ్యును వివేకాదిరూపు లగుపుత్రులయొక్క, గాంభీర్యాదు లనుపౌత్రుల యొక్క, మన్వాదులైన అమాత్యులయొక్క ప్రతికూలాచారణమును, బుద్ధి యనుభార్యకు తనపై ప్రేమలేకపోవుటను చూచి, మన్త్రౌషధులద్వారా దానికి ప్రతీకారముజేయుట కెట్టియుపా యము తోచనివాడయ్యెను. పైగా కాలకన్య యగుజరయొక్క, యవనసేనయొక్క ఆక్రమణముచే తనపట్టణము నష్టమగుట చూచి అత డీదేహ మనుపట్టణమును విడచెను. మరణసమయమున పురంజనునకు తనపూర్వసఖుడు, పరమహితకారియు, పరమాత్మయు నగుభగవానునిస్మరణము కలుగలేదు. పురంజనునిచే యజ్ఞాదికర్మలయందు సంహరింప బడినపశువులు యమలోకమున పురంజనుని జూచి వానిపై పగదీర్చుకొనసాగినవి. స్త్రీని గురించి యాలోచించుచు దేహమును విడచుట వలన పురంజనునకు స్త్రీత్వము లభించెను. అతడు తనపుణ్య కర్మవశమున స్వర్గాదుల ననుభవించినపిమ్మట పరజన్మమున విదర్భ రాజసింహుని (అనగా) ఒకానొకకర్మిష్ఠుని గృహమున వానికి పుత్రికగా జన్మించెను. (పాండ్యదేశోద్భవుడగు) మలయధ్వజు డనుకృష్ణభక్తునితో నామెకు వివాహమయ్యెను. మలయ ధ్వజుడు విదర్భనందినివలన కృష్ణసేవాప్రవృత్తిరూపిణియు, అసితనయనయు నగుకన్యను, శ్రవణకీర్తనాదిభక్త్యంగము లనునేడుగురుపుత్రులను గనెను. ఈ యేడు గురుపుత్రులు జ్ఞానకర్మాదులను సర్వమతవాదములను జయించిరి. వారిలో నొక్కొక్కరికి అసంఖ్యసేవాభేదములు, తత్త్వభేదములు నను పెక్కండ్రు పుత్రులు జన్మించిరి. వారీ పృథివిని మన్వంతరకాలము వఱకును ఆపిమ్మట అనుభవింతురు. అగస్త్యుడు అనగా శుద్ధ మనస్సు మలయధ్వజుని ప్రథమకన్య యగుకృష్ణసేవాభిరుచిని స్వీకరించెను.

ఈకన్యకు "దృఢచ్యుతు" డను (భక్తితప్ప ఇతరసాధనములయం దిచ్ఛలేనివాడు) పుత్రుడు జన్మించెను. వానిపేరు "ఇధ్మవాహు" డగుటవలన అగస్త్యుడు "ఇధ్మవాహాత్మజు" డనునామముతో ప్రసిద్ధిచెందెను. పిమ్మట మలయధ్వజుడు శ్రవణకీర్తనాదు లనుపుత్రులలో శ్రవణాదిభక్తిరూపస్థానమును విభజించి కులాచలము లేదా భక్తిప్రద మగునేకాంత స్థానమున కృష్ణభజనమునకై వెడలుట కుద్యుక్తుడు కాగా వైదర్భియు శ్రవణకీర్తనాదు లను పుత్రులను, నిర్జన మగుభజనస్థాన మనుగృహమును, భజనానంద మనుభోగాదులను పరిత్యజించియు, మహాభాగవతగురు వనుపతియొక్క సేవకై పతి ననుసరించెను. వైరాగ్యయుక్త మగుభక్తి ద్వారా గురుదేవు డున్నంతవఱకు ఆయనను సేవించుచుండెను. గురువు పరమపదించినపిమ్మట ఆగురువు యొక్క గుణములను స్మరించుచు మిగుల కలత చెందగా వానిపూర్వసఖుడు అనగా జీవాత్మ కనాదిసహచరుడు, సేవ్యుడు నగుపరమేశ్వరుడు వచ్చి వాని కుపదేశించెను. అనాది బహిర్ముఖు డగుజీవుడు తనస్వాతంత్ర్యమును దుర్వినియోగపఱచుట వలన వానికెట్లు కృష్ణవిస్మృతి, స్థూలలింగ దేహము లభించు నను విషయమును చెప్పెను. జీవాత్మపరమాత్మలు సఖులవలె నొకేచోట యుందురు. పరమాత్మ యగుశ్రీకృష్ణునిసేవయే జీవాత్మయొక్క స్వరూపధర్మము, దానివలననే జీవునకు స్వరూపావస్థితి యనుముక్తి కలుగును.

## శ్రీ నారద ఉవాచ

సైనికాభయనామ్నో యే బర్హిష్మన్ దిష్టకారిణః ।
ప్రజ్వారకాలకన్యాభ్యాం విచేరురవనీమిమామ్ ॥ 1

నారదుడు పలికెను :- ప్రాచీనబర్హి! మృత్యువాజ్ఞ ననుసరించు (దురదృష్టఫలోత్పాదకులగు) సైనికులు (వ్యాధులు) లోకవినాశార్థమై ప్రజ్వారము (విష్ణుజ్వరము) తోను, కాలకన్యకతోను (జరతోను) గూడినవారయి ఈ పృథివియందు పర్యటింపసాగిరి.

త ఏకదా తు తరసా పురంజనపురీం నృప ।
రురుధుర్భౌమభోగాఢ్యాం జరత్పన్నగపాలితామ్ ॥ 2

రాజా! ఒకప్పుడు (దేహారంభక ప్రారబ్ధ మవసానము కాగా) ఈ సేన (ఆధివ్యాధులు) పార్థివభోగసంభారపరిపూర్ణము (శబ్దాదివిషయభోగయుక్తము) క్షీణబలము నగుసర్పము (ప్రాణము)చే రక్షిత మగుపురంజనునిపురమును (దేహమును) బలవంతముగ ఆక్రమించెను.

కాలకన్యాపి బుభుజే పురంజనపురం బలాత్ ।
యయాభిభూతః పురుషః సద్యో నిస్సారతామియాత్ ॥ 3

కాలకన్యక (జర) చే ఆక్రమింపబడినవాడయి జీవుడు వెంటనే నిర్జీవత్వమును పొందెను. ఆ కాలకన్యకయు బలవంతముగ పురంజనునిపురమును (దేహమును) తనయ ధీనములోనికి తీసికొనెను.

**తయోపభుజ్యమానాం వై యవనాః సర్వతో దిశమ్ ।**
**ద్వార్భిః ప్రవిశ్య సుభృశం ప్రార్దయన్ సకలాం పురీమ్ ॥ 4**

యవనులు (వ్యాధులు) కాలకన్యక (జర)చే పురంజనపురి (దేహము) అనుభవింప బడుట చూచి నలువైపుల నున్నద్వారముల (చక్షురాదిద్వారముల) సాహాయ్యముతో పట్టణములోనికి ప్రవేశించి దానిని నాశనముచేయసాగిరి. (జరాగ్రస్త మగుదేహమునందు చక్షురాదులద్వారా రోగాదులు ప్రవేశించి అంధత్వాదిబాధలను గలుగజేయును).

**తస్యాం ప్రపీడ్యమానాయామభిమానీ పురంజనః ।**
**అవాపోరువిధాంస్తాపాన్ కుటుంబీమమతాకులః ॥ 5**

మమకారముచే కలతచెందినవాడు, అభిమానముగలవాడు నగుపురంజనుడు బహు విధము లగుతాపములను పొందెను. (జీవుడు బాధాగ్రస్తుడయి దేహాత్మబుద్ధివలన తన్ను దుఃఖితునిగా భావించును.)

**కన్యోపగూఢో నష్టశ్రీః కృపణో విషయాత్మకః ।**
**నష్టప్రజ్ఞో హృతైశ్వర్యో గన్ధర్వై యవనైర్బలాత్ ॥ 6**

**విశీర్ణాం స్వపురీం వీక్ష్య ప్రతికూలాననాదృతాన్ ।**
**పుత్రాన్ పౌత్రానుగామాత్యాన్ జాయాం చ గతసౌహృదామ్ ॥ 7**

**ఆత్మానం కన్యయా గ్రస్తం పంచాలానరిదూషితాన్ ।**
**దురన్తచిన్తమాపన్నో న లేభే తత్ప్రతిక్రియామ్ ॥ 8**

కాలకన్యకయొక్క (జరయొక్క) కౌగిలింతచే పురంజనుని (దేహము యొక్క) సిరి భ్రష్టమయ్యెను. దీనుడు, విషయాసక్తుడు, హతబుద్ధియు నగుపురంజనుడు గంధర్వ (దివారాత్రముల) యవనాదుల (ఆధివ్యాధుల) చే బలవంతముగ ఆక్రమింపబడినవాడయి సమస్తైశ్వర్యములనుండి చ్యుతుడయ్యెను.

తనపురము (దేహము) యొక్కసమృద్ధి నష్ట మగుట యతడు కనుగొనెను. పుత్రులు (వివేకాదులు), పౌత్రులు (గాంభీర్యాదులు) పూర్వానుగతులగునమాత్యులు (మనస్సు దాని కధిష్ఠానదేవత లగుచక్రాదులు) ప్రతికూలురయిరి. భార్యయు (బుద్ధిగూడ) వానిపై

వెనుకటిప్రేమ చూపుటలేదు (అధ్యవసాయాదులు లేనిదయ్యెను). కాలకన్య (జర) వాని నాక్రమించెను. శత్రువులు (రోగాదులు) పంచాలరాజ్యమును (శబ్దాదివిషయములను) అక్రమించిరి. ఇదిచూచి పురంజనుడు దురంత మగుచింతయందు నిమగ్నుడయ్యెను. కాని యీకష్టముల నెదుర్కొనుటకు (మన్త్రౌషధముల ద్వారా నిరామయుడగుటకు) వాని కెట్టియుపాయము స్ఫురింపకపోయెను.

కామానభిలషయన్ దీనో యాతయామాంశ్చ కన్యయా ।
విగతాత్మగతిస్నేహః పుత్రదారాంశ్చ లాలయన్ ॥ 9

గన్ధర్వయవనాక్రాన్తాం కాలకన్యోపమర్దితామ్ ।
హాతుం ప్రచక్రమే రాజా తాం పురీమనికామతః ॥ 10

కాలకన్య (జర) యేభోగ్యవిషయములను (మధురభోజనాదులసారభాగమును) అనుభవించి పరిత్యజించునో సారహీనము లగునావస్తువులను (అగ్నిమాంద్యాది హేతువులను) అత డనుభవించుచుండెను. ఆత్మ యొక్క ఐహికపారలౌకికగతులనుండి, బంధుప్రేమ నుండి వంచితుడై పుత్రకళత్రాదులను లాలించుటయందు నిమగ్నుడయ్యెను. ఇంకను గంధర్వులు, యవనసేన ఆ పురము నాక్రమించెను. కాలకన్య దానిని ధ్వంసముచేసెను. అందువలన ఇష్టము లేకపోయినను దీనుడయి పురంజను డీపురమును విడువ వలసి వచ్చెను.

భయనామ్నోఽగ్రజో భ్రాతా ప్రజ్వారః ప్రత్యుపస్థితః ।
దదాహ తాం పురీం కృత్స్నాం భ్రాతుః ప్రియచికీర్షయా ॥ 11

భయము యొక్క జ్యేష్ఠసోదరు డగుప్రజ్వారము (విష్ణుజ్వరము) ఆపురమునకు వచ్చి సోదరునకు మేలుచేయవలయు ననుతలంపుతో ఆపురమును దగ్ధముచేయసాగెను (దేహమును నాశముచేయుటకు జ్వరము దేహమున భరింపరానివేడిమిని గలుగజేయును).

తస్యాం సన్దహ్యమానాయాం స పౌరః సపరిచ్ఛదః ।
కౌటుంబికః కుటుంబిన్యా ఉపాతప్యత సాన్వయః ॥ 12

ఈపుర మిట్లు దగ్ధమగుచుండగ పురంజన (జీవ) పురవాసులు (సప్త ధాతువులు) భృత్యుల (ఇంద్రియాదుల) తోను, కుటుంబముతోను, భార్యాపుత్రులతోను, పౌత్రాదుల తోను మిగుల సంతప్తులయిరి.

యవనోపరుద్ధాయతనో గ్రస్తాయాం కాలకన్యయా ।
పుర్యాం ప్రజ్వారసంసృష్టః పురపాలోఽన్వతప్యత ॥ 13

కాలకన్యక (జర) యీపురము (దేహము) నాక్రమించగా యవనసైన్యములు (ఆధివ్యాధులు) దానిలోని గృహములను (శరీరములను, నాడులు మున్నగు వానిని) ఆక్రమించినవి. ప్రజ్వారము దానిని దగ్ధముచేయుచుండెను. ఇది చూచి పురరక్షకుడు (పంచప్రాణములు) మిగుల శోకాతరు డయ్యెను.

న శేకే సో ఽవితుం తత్ర పురు కృచ్ఛ్రోరువేపథుః ।
గన్తుమైచ్ఛత్తతో వృక్షకోటరాదివ సానలాత్ ॥ 14

పురమున బహుక్లేశములు కలుగుటచే ఆపురపాలకుని (ప్రాణముల) శరీరము కంపింపసాగెను. అందువలన అతడు ఆపురమున నుండియు పురమును (దేహమును) రక్షింపజాలక పోయెను. అగ్నితో గూడిన చెట్టుయొక్క తొఱ్ఱలో నున్నసర్పము ఆవృక్షకోటరమునుండి మఱియొకచోటికి బోవుట కిష్టపడునట్లు పురమును రక్షించు నీసర్పము గూడ (ప్రాణములు గూడ) ఆ ప్రదేశమునుండి మఱియొకచోటికి పోదలంచెను. (జ్వరాదులచే పీడింపబడిన ప్రాణములు మానవశరీరమును విడచి మఱియొకయోని నాశ్రయించును).

శిథిలావయవో యర్హి గన్ధర్వైర్హృతపౌరుషః ।
యవనైరరిభిః కంఠే ఉపరుద్ధో రురోద హ ॥ 15

రాజా! గంధర్వులు (దివారాత్రములు) పురంజనునిపౌరుషమును అపహరించి వాని యవయవములను శిథిలమొనర్చిరి. యవనశత్రువులు (ఆధివ్యాధులు) వానికంఠము నాక్రమించిరి. అపుడు పురపాలకుడు (ప్రాణములు) గురుగుర యనుశబ్దము చేయసాగెను.

దుహితౄః పుత్రపౌత్రాంశ్చ యామి జామాతృపార్షదాన్ ।
స్వత్వావశిష్టం యత్కించిద్గృహకోశపరిచ్ఛదమ్ ॥ 16

అహం మమేతి స్వీకృత్య గృహేషు కుమతిర్గృహీ ।
దధ్యౌ ప్రమదయా దీనో విప్రయోగ ఉపస్థితే ॥ 17

భార్యతో నెడబాటు కలుగగా కుమతియు, గృహాసక్తుడు నగుపురంజనుడు మిగుల కాతరు డయ్యెను. గృహాదులయందు నేను నాది యను బుద్ధి గలవాడయి పుత్రికలు, పుత్రులు, పౌత్రులు, కోడండ్రు, అల్లుండ్రు, భృత్యులు, గృహము, కోశాగారము, వస్త్రాలంకారములు మున్నగువానిని గూర్చి చింతింపసాగెను.

లోకాన్తరం గతవతి మయ్యనాథా కుటుంబినీ ।
వర్తిష్యతే కథన్త్వేషా బాలకానమశోచతీ ॥ 18

(చింతకు విషయము చెప్పబడుచున్నది) - నేను లోకాంతరమునకు వెడలినచో నా యీభార్య అనాథయై, పుత్రపౌత్రాదులభారమును వహించి దుఃఖించుచు నెట్లుండగలదు?

న మయ్యనాశితే భుంక్తే నాస్నాతే స్నాతి మత్పరా ।
మయి రుష్టే సుసంత్రస్తా భర్త్సితే యతవాగ్భయాత్ ॥ 19

నేను భోజనము చేయనిచో నన్నాశ్రయించియున్న నాప్రియురాలు భోజనము చేయదు. నేను స్నానము చేయనిచో ఆమె స్నానముచేయదు. నేను క్రుద్ధుడ నయినచో ఆమె మిగుల భయముచెందును. నే నెప్పుడైన తిరస్కరించినచో ఆమె భయముతో నొక్కపలుకైనను పలుకదు.

ప్రబోధయతి మావిజ్ఞం వ్యుషితే శోకకర్శితా ।
వర్త్మైతద్గృహమేధీయం వీరసూరపి నేష్యతి ॥ 20

నేను వివేకభ్రష్టుడనైనచో ఆమె నాకు ప్రబోధముచేయును. నేను విదేశములకు వెడలినచో నావిరహముచే శోకాకులయగును. ఆమె వీరు లగుపుత్రులను గనినను నావి యోగముచే కాతరయై యెట్లీగృహధర్మమును నిర్వహింపదలచును? (దేహము వినష్టము కాగా మతికిగూడ మోహము కలుగును).

కథం ను దారకా దీనా దారికా వా పరాయణాః ।
వర్తిష్యన్తే మయి గతే భిన్ననావ ఇవోదధౌ ॥ 21

సముద్రమధ్యమున నౌక భగ్నము కాగా దానిలోని జనులు నిరాశ్రయులయి ఆపద పాలగునట్లు నేను పరలోకమునకు వెడలగా నితర మగు నాశ్రయము లేనినాపుత్రులు, కన్యకలు కాతరులయి యెట్లు జీవింతురు?

ఏవం కృపణయా బుద్ధ్యా శోచన్తమతదర్హణమ్ ।
గ్రహీతుం కృతధీరేనం భయనామాభ్యపద్యత ॥ 22

స్వరూపములో నున్నప్పుడు పురంజనుడు చైతన్యవస్తువు; అందువలన శోకాది ధర్మము లాయనకు తగవు. కాని యత డిట్లు మోహబుద్ధిగల వాడై దుఃఖించుచుండగా వానిని పట్టణమునుండి వెడలగొట్టనిశ్చయించుకొని "భయ"మనుమృత్యు వచటికి వచ్చెను.

పశువద్యవనై రేష నీయమానః స్వకం క్షయమ్ ।
అన్వద్రవన్ననుపథాః శోచన్తో భృశమాతురాః ॥ 23

యవనులు (యమదూతలు) వానిని పశువువలె బంధించి తమస్థానమునకు తీసికొని వెడలుచుండిరి. అపుడు పురంజనునియనుచరులు (ప్రాణములు, ఇంద్రియములు) మిగుల గలతచెంది దుఃఖించుచు వానివెంట పరుగిడిరి. (యమదూతలు జీవుని యమాలయ మునకు దీసికొనిపోవునపుడు ప్రాణాదులుగూడ వాని ననుసరించును).

**పురీం విహాయోపగత ఉపరుద్ధో భుజంగమః ।**
**యదా తమేవానుపురీ విశీర్ణా ప్రకృతిం గతా ॥** 24

యవనుల (ఆధివ్యాధుల) చే నాక్రమింపబడి పురమును రక్షించుసర్పము (ప్రాణము) పురమును (దేహమును) పరిత్యజించి బయటకు వెడలెను. తదనంతర మాపురము (స్థూలశరీరము) శిథిలమై పంచభూతములలో గలసి పోయెను.

**విక్రృష్యమాణః ప్రసభం యవనేన బలీయసా ।**
**నావిన్దత్తమసావిష్టః సఖాయం సుహృదం పురః ॥** 25

ప్రబలు డయినయవనుడు (యమదూతలు) పురంజనుని (జీవుని) బలవంతముగ బట్టుకొనెను. అపుడు అజ్ఞానాంధకారముచే నాక్రమింపబడి యుండుటవలన పురంజనుడు తనకు పూర్వసఖుడు, పరమహితైషియు నగు పరమేశ్వరుని స్మరింపలేకపోయెను.

**తం యజ్ఞపశవో ఽనేన సంజ్ఞప్తా యే ఽదయాలునా ।**
**కుఠారైశ్ఛిచ్ఛిదుః క్రుద్ధాః స్మరన్తో ఽమీవమస్యతత్ ॥** 26

పురంజనుడు నిర్దయుడయి యేయజ్ఞపశువులను జంపెనో అవియమాలయమునకు వెడలిన యాపురంజనుని జూచి నిష్ఠుర మగువానియాచరణమును స్మరించి కోపించినవియై గొడ్డళ్ళచే వానిని ఛిన్నభిన్నము చేయసాగినవి.

**అనన్తపారే తమసి మగ్నో నష్టస్మృతిః సమాః ।**
**శాశ్వతీరనుభూయార్తిం ప్రమదాసంగదూషితః ॥** 27

**తామేవ మనసా గృహ్ణన్ బభూవ ప్రమదోత్తమా ।**
**అనన్తరం విదర్భస్య రాజసింహస్య వేశ్మని ॥** 28

స్త్రీ ప్రసంగమువలన గలిగినదోషముచేత, అధిక మగుఅంధకారముచేత ఆచ్ఛన్నుడగుట వలన వానిపూర్వస్మృతి నష్టమయ్యెను. అత డట్టియవస్థలో బహువత్సరములవఱకు యాతనల ననుభవించుచుండెను. ఆపురంజనుడు కామినిని స్మరించుచు దేహమును త్యజించెను. అందువలన యమయాతనల ననుభవించినపిమ్మట అతడు విదర్భరాజు యొక్క (విశిష్టము లగుదర్భల ద్వారా ఉపలక్షిత మగు అనగా కర్మిష్ఠు లగురాజులలో ఉత్తమవ్యక్తి యొక్క) గృహమున ఉత్తమస్త్రీరూపమున జన్మించెను. (స్త్రీచింతనముచే జీవునకు స్త్రీత్వము లభించును. దుఃఖాతిశయమువలన, మోహమువలన మృత్యుకాలమున సద్బుద్ధిత్యాగము అల్పకాలముకొఱకే యగును. వాస్తవములో పుణ్యకర్మలద్వారా లభించిన స్వర్గము ననుభవించుటవలన పుణ్యము క్షయము కాగా అట్టిధర్మబుద్ధివిశిష్టు డగువ్యక్తి ధార్మికగృహమున జన్మించును).

**ఉపయేమే వీర్యపణాం వైదర్భీం మలయధ్వజః ।**
**యుధి నిర్జిత్య రాజన్యాన్ పాణ్డ్యః పరపురంజయః ॥ 29**

విదర్భరాజకన్యక యొక్క వివాహమున పరాక్రమమె పణముగా నిర్దిష్టమయ్యెను. దానివలన పాండ్యదేశోద్భవుడు, శత్రుపురములను జయించువాడు నగుమలయధ్వజుడు యుద్ధమున సర్వరాజులను జయించి ఆవిదర్భ రాజపుత్రికను పరిణయమాడెను.

వివరణము:- విదర్భరాజకన్యయొక్క వివాహమున పరాక్రమమే (కృపాలక్షణ స్వభావమే) పణ (శుల్క) రూపమున నిర్దిష్టమయ్యెను. దానివలన పాండ్యదేశోద్భవుడు (పండాశబ్దముచే సదసద్వివేచనము లేదా వేదోజ్జ్వలబుద్ధి లేదా భగవద్భజనము వలననే జీవునకు పురుషార్థసిద్ధి కలుగును; ఇట్టి శాస్త్రయుక్తి మూలమున నిశ్చయాత్మక మైనబుద్ధి పండా యగును. అట్టిగుణమును పరిచయము చేయుస్థానము పాండ్యదేశము), పరపురం జయుడు (పరమాత్మయొక్కపురము లేదా వాసస్థలము లేదా శరీరమును అనగా దేహాత్మ బోధకమును జయింపగలిగినవాడు; లేదా పరశబ్దముచే విష్ణువుయొక్కపురమును లేదా వైకుంఠధామమును భక్తిద్వారమున జయించినవాడు; లేదా మతాంతరములవలన గలిగిన సందేహములను దీర్చునట్టివాడు), మలయధ్వజుడు (మలయపవనము అన్యవృక్షమును చందనవాసనాయుక్తముగ జేయునట్లు సాధువులుగూడ అన్యజీవుని భగవద్భక్తునిగ జేయుదురు - మలయతుల్యు రగుసాధువులలో ధ్వజమువలె శ్రేష్ఠుడయినవాడు; లేదా మలయపర్వతో పలక్షిత భూమండలమునకు సారభూత మగుభారతవర్షమందు ధ్వజమువలె శ్రేష్ఠుడు అనగా ప్రసిద్ధు డగు భగవద్భక్తుడు; లేదా మలయోపలక్షిత మగుదక్షిణదేశము । విష్ణుభక్తి ప్రధానము, ఆదేశమున ధ్వజమువలె సర్వజనుల దృష్టి నాకర్షించినవాడు అనగా విఖ్యాతు డగుభగవద్భక్తుడు), యుద్ధస్థలమున (శాస్త్రార్థసభయందు లేదా శాస్త్రయుక్తి యందు) రాజన్యవర్గమును (శుద్ధభక్తివ్యతీత మగుజ్ఞానకర్మయోగాదులు లేదా పరస్పర వివాదమానమతవాదములను లేదా పాపాపరాధకాలకర్మాదులను) ఓడించి (ఖండనము లేదా నిర్మూలనముచేసి) వైదర్భిని (కర్మకాండీయధర్మానుష్ఠాత యొక్క ఆత్మజను అనగా కర్మప్రవృత్తిని) వివాహముచేసికొనెను (దయతో శిష్యత్వము నంగీకరించెను అనగా కర్మ ప్రవృత్తి యొక్క కర్మభావమును తగ్గించి దానిని హరిసేవయందు నియమించెను).

**తస్యాం స జనయాంచక్ర ఆత్మజామసితేక్షణామ్ ।**
**యవీయసః సప్తసుతాన్ సప్తద్రవిడభూభృతః ॥ 30**

ఆమెవలన మలయధ్వజుడు శ్యామలోచన యగునొకకన్యను, ఆమె కంటె చిన్నవారైన యేడుగురుపుత్రులను గనెను. ఆ పుత్రులు పిమ్మట ద్రవిడదేశమునకు రాజులయిరి.

వివరణము:- ఆమలయధ్వజుడు (కృష్ణభక్తు డగుమహాభాగవతుడు) విదర్భరాజ పుత్రికవలన అసితలోచన యగునొకపుత్రికను (అసితమనగా శ్రీకృష్ణుని దర్శించుటకు తగినది అనగా కృష్ణసేవాప్రవృత్తి) ఆకన్యకంటె చిన్నవారయిన (అనంతరము కలిగిన అనగా సేవాప్రవృత్తి గలిగిన తరువాత కనబడిన భక్త్యంగములు, ఇవి నిష్కపటములు; కాని సేవా ప్రవృత్తి లేని భోగమునం దాసక్తము లయిన శ్రవణకీర్తనాదులు కేవలము ఆత్మేంద్రియ తర్పణా (తృప్తి) సక్తములు శుద్ధభక్తికి ప్రతికూలములు) ఏడు గురుపుత్రులను గనెను. (శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము నను నేడువిధము లగుభక్త్యంగములు; సఖ్యము, ఆత్మనివేదనము మొదట దుష్కరము లగుట వలన, ఈసప్తవిధ భక్త్యంగములను సాధనచేయుచున్నచో పిమ్మట సహజముగనే మిగిలిన రెండుభక్త్యంగములు ఆత్మవృత్తియం దావిర్భూతములగును). ఈయేడు గురుపుత్రులు ద్రవిడదేశమునకు భూపాలకులరూపముతో విరాజిల్లిరి. (అనగా జ్ఞానకర్మాదిసర్వమత వాదవిజేతలు శుద్ధభక్తిపరాయణులు; లేదా ద్రవిడదేశము శ్రవణకీర్తనాదిసప్తవిధభక్తుల ద్వారా సురక్షిత మయినదని చాలకాలమునుండి ప్రసిద్ధివహించియున్నది).

ఏకైకస్యాభవ న్తేషాం రాజన్నర్బుదమర్బుదమ్ ।
భోక్ష్యతే యద్వంశధరైర్మహీమన్వతరం పరమ్ ॥ 31

వారిలో (శ్రవణకీర్తనాదిభక్త్యంగములలో) ఒక్కొక్కరికి అర్బుదసంఖ్యలో (పదికోట్ల మంది) పుత్రులు జన్మించిరి. (శ్రవణాదిభక్త్యంగములలో నొక్కొక్కదానికి నామలీలాది భేదములద్వారా, నామాదులప్రత్యేకావతార భేదములద్వారా, అవతారములదాస్యసఖ్యాది సేవాభేదములద్వారా, తత్త్వ భేదములద్వారా లెక్కలేనన్నివిధము లున్నవి). వారివంశీయు లీపృథివిని మన్వంతరకాలమువఱకును, తదనంతరముగూడ ననుభవింతురు. (శ్రవణాది వివిధభక్తి విశేషములనుండి వివిధము లగుశుద్ధవైష్ణవసంప్రదాయములు ప్రకటితములగును. అవి కర్మజ్ఞానోపధర్మకపటధర్మములనుండి, అవిద్యా కామకర్మలనుండి పృథివియందలి జీవులను రక్షించును.)

అగస్త్యః ప్రాగ్దుహితరముపయేమే ధృతవ్రతామ్ ।
యస్యాం దృఢచ్యుతో జాత ఇధ్మవాహాత్మజో మునిః ॥ 32

అగస్త్యుడు మలయధ్వజుని ప్రథమపుత్రికను వివాహమాడెను. ఆమె వ్రతశీల. ఆమె వలన అతనికి దృఢచ్యుతు డనుకుమారుడు కలిగెను. అతడు ఇధ్మవాహు డనుపేరుతో ప్రసిద్ధికెక్కెను.

వివరణము :- అగస్త్యుడు (మనస్సు) మలయధ్వజుని (కృష్ణభక్తుని) ప్రథమపుత్రికను (కృష్ణసేవారుచిని) పరిణయమాడెను (మనస్సును శ్రీకృష్ణునిపాదపద్మములయందు దృఢ మగుప్రేమచే బంధించెను). ఈ కన్య నైష్ఠికవ్రతపరాయణ (శమదమాదివ్రతయుక్త);

ఈమెవలన "దృఢచ్యుతు" డను (సత్యాదిలోకములనుండి చ్యుతి లేనివాడు లేదా ఇహా ముత్ర భోగములయందు విరక్తుడు లేదా జ్ఞానాదులవలన, తత్సాధ్యము లగుమోక్షాదులనుండి చ్యుతుడయినవాడు అనగా శుద్ధమనస్సుయొక్క లేదా ఆత్మవృత్తియొక్క కృష్ణసేవారుచి యందేకాంత మగుఆసక్తి యుండుటవలన ఇతరము లగుసాధ్యసాధనస్పృహ లేనివాడు నగు) నొకముని జన్మించెను. వీనికి ఇధ్మవాహు డనుపేరు కలిగెను. అందువలన అగస్త్యుడు ఇధ్మవాహాత్మజుడను పేరుతో ప్రసిద్ధికెక్కెను.

**విభజ్య తనయేభ్యః క్ష్మాం రాజర్షిర్మలయధ్వజః ।**
**ఆరిరాధయిషుః కృష్ణం స జగామ కులాచలమ్ ॥ 33**

పిమ్మట రాజర్షి యగు అమలయధ్వజుడు (గురురూపుడు కృష్ణభక్తుడు మహాభాగవతుడు) శ్రీకృష్ణుని యారాధించు నిచ్చతో తనపుత్రులలో (శ్రవణకీర్తనాదిభక్త్యంగములలో) పృథివిని పంచెను (శ్రవణాదిభక్తి భేదవ్యవస్థ చేసెను). అనంతరము తాను కులాచలమునకు (భక్తి ప్రదమగు నేకాంత ప్రదేశము లేదా వేంకటాద్రికి) వెడలెను.

**హిత్వా గృహాన్ సుతాన్ భోగాన్ వైదర్భీ మదిరేక్షణా ।**
**అన్వధావత పాణ్డ్యేశం జ్యోత్స్నేవ రజనీకరమ్ ॥ 34**

వెన్నెల చంద్రుని అనుసరించునట్లు మదిరేక్షణ యగువిదర్భనందినియు గృహమును, పుత్రులను, భోగసామగ్రిని పరిత్యజించి పాండ్యరాజు ననుసరించెను.

**తత్ర చన్ద్రవసా నామ తామ్రపర్ణీ వటోదకా ।**
**తత్పుణ్యసలిలైర్నిత్యముభయత్రాత్మనో మృజన్ ॥ 35**

**కన్దాష్టిభిర్మూలఫలైః పుష్పపర్ణైస్తృణోదకైః ।**
**వర్తమానః శనైర్గాత్రకర్శనం తప ఆస్థితః ॥ 36**

ఆకులాచలమునందు చంద్రవస, తామ్రపర్ణి, వటోదకము అనుసెలయేరులు ప్రవహించుచుండును. మలయధ్వజుడు ప్రతిదిన మానదులపుణ్య సలిలములలో స్నానము చేసి బాహ్యాభ్యంతరమలమును పోగొట్టుకొని కందమూలఫలములను, పుష్పములను, తృణములను భుజించి, జలములను మాత్రము త్రావి తపస్సు చేయసాగెను. దానివలన మెల్లమెల్లగ వానిశరీరము కృశించిపోయెను.

**శీతోష్ణవాతవర్షాణి క్షుత్పిపాసే ప్రియాప్రియే ।**
**సుఖదుఃఖే ఇతి ద్వన్ద్వాన్యజయత్సమదర్శనః ॥ 37**

సమదర్శి యగుమలయధ్వజుడు శీతోష్ణములు, వాతవర్షములు, ఆకలిదప్పులు, ప్రియాప్రియములు, సుఖదుఃఖములు మున్నగుద్వంద్వధర్మముల నన్నింటిని జయించెను.

**తపసా విద్యయా పక్వకషాయో నియమైర్యమైః ।**
**యుయుజే బ్రహ్మణ్యాత్మానం విజితాక్షానిలాశయః ॥ 38**

తపస్సు ఉపాసన, యమనియమములు మున్నగువానిచే వానికామాది వాసనలు దగ్ధము లయ్యెను. అప్పు డతడు ఇంద్రియములను, ప్రాణములను, చిత్తమును జయించి ఆత్మను పరబ్రహ్మమునందు నియమించెను.

**ఆస్తే స్థాణురివైకత్ర దివ్యం వర్షశతం స్థిరః ।**
**వాసుదేవే భగవతి నాన్యద్వేదోద్వహన్ రతిమ్ ॥ 39**

ఇట్లతడు స్థాణువువలె స్థిరుడయి నూఱుదివ్యవర్షము లొకేచోట నివసించి వాసుదేవభగవానునియందు ప్రేమగలవాడయి తద్భిన్నము లగు నితరవిషయములయందు జ్ఞానము లేనివాడయ్యెను.

**స వ్యాపకతయాత్మానం వ్యతిరిక్తతయాత్మని ।**
**విద్వాన్ స్వప్న ఇవామర్శ సాక్షిణం విరరామ హ ॥ 40**

స్వప్నమున 'నాశిరస్సు ఛిన్నమయ్యె' నను ప్రతీతివలన తన్ను దేహము కంటె భిన్న మనిభావించునట్లు అతడు (మలయధ్వజుడు) తనశరీరమునందున్న దేహాతిరిక్త మగు దేహాదులప్రకాశ మగునాత్మను ద్రష్టగా భావించి యితరవస్తువులతత్త్వమును తెలిసికొనుట విరమించెను.

**సాక్షాద్భగవతోక్తేన గురుణా హరిణా నృప ।**
**విశుద్ధజ్ఞానదీపేన స్ఫురతా విశ్వతోముఖమ్ ॥ 41**

**పరే బ్రహ్మణి చాత్మానం పరంబ్రహ్మ తథాత్మని ।**
**వీక్షమాణో విహాయేక్షామస్మాదుపరరామ హ ॥ 42**

రాజా! స్వయముగ భగవానుడె గురురూపముతో వాని (మలయధ్వజుని) హృదయమున విశుద్ధజ్ఞానమును ప్రకాశింపజేసెను. దానివలన అంతట వాని కాజ్ఞానమే పరిస్ఫురితమయ్యెను. దాని ప్రభావముచే అతడు ఆశ్రయతత్త్వ మగుపరబ్రహ్మమునం దాశ్రితతత్త్వ మగుజీవాత్మ యొక్క, శుద్ధజీవాత్మయందు పరబ్రహ్మముయొక్క అధిష్ఠానమును దర్శించి సంసారము నుండి ముక్తుడయ్యెను.

**పతిం పరమధర్మజ్ఞం వైదర్భీ మలయధ్వజమ్ ।**
**ప్రేమ్ణా పర్యచరద్ధిత్వా భోగాన్ సా పతిదేవతా ॥ 43**

పతిదేవత (గురుదేవతాత్ముడగుశిష్యుడు) అగుఆవిదర్భనందిని సర్వభోగవిలాసము లను పరిత్యజించి భక్తియుక్త మగువైరాగ్యము నవలంబించి పరమధర్మజ్ఞు డగుమలయ ధ్వజుని (శబ్దబ్రహ్మమునందు, పరబ్రహ్మమునందు నిష్ణాతు డగుసద్గురువును) భక్తితో సేవింపసాగెను.

**చీరవాసా వ్రతక్షామా వేణీభూతశిరోరుహా ।**
**బభావుపపతిం శాన్తా శిఖాశాన్తమివానలమ్ ॥ 44**

జీర్ణవస్త్రములను ధరించి, నిరాహారాదివ్రతము లనుష్ఠించుటవలన ఆమెశరీరము క్షీణించిపోయెను. తైలసంస్కారము లేకపోవుటచే ఆమె కేశకలాపము జడలుగట్టి వ్రేలాడ సాగెను. ఆమె భర్తృసన్నిధానమున నిర్ధూమ మగునగ్ని ననుసరించుజ్వాలవలె విశుద్ధభావమున నుండసాగెను.

**అజానతీ ప్రియతమం యదోపరతమంగనా ।**
**సుస్థిరాసనమాసాద్య యథాపూర్వముపాచరత్ ॥ 45**

ఆవిదర్భరాజకుమారి ప్రపంచలీలను త్యజించిన ప్రియతమునిగూర్చి తెలిసికొనజాల నదియై సుస్థిరాసనమున నుండి పూర్వమువలె పతిసేవ చేయసాగెను.

**యదా నోపలభేతాఙ్ఘ్రావూష్మాణం పత్యురర్చతీ ।**
**ఆసీత్సంవిగ్నహృదయా యూథభ్రష్టా మృగీ యథా ॥ 46**

పతియొక్కచరణముల సేవించుచుండగా నామెకు వానిపాదములయం దుష్ణత లభింపకపోయెను. అప్పు డామె గుంపునుండి తప్పిపోయిన హరిణమువలె దుఃఖింప సాగెను.

**ఆత్మానం శోచతీ దీనమబన్ధుం విక్లవాశ్రుభిః ।**
**స్తనావాసిచ్య విపినే సుస్వరం ప్రరురోద సా ॥ 47**

ఆవిదర్భరాజకుమారి అడవిలో తనవైధవ్యదశను తలంచుకొని శోకించుచు అశ్రు ధారలచే స్తనయుగళమును తడుపుచు ఉచ్చైస్స్వరముతో విలపింపసాగెను (పతియొక్క యెడబాటుచే దుఃఖించు పతివ్రత యగుస్త్రీవలె గురువు పరలోకగతుడు కాగా శిష్యుడు వానివియోగముచే కాతరుడై "యిక ఇపుడు నన్నెవరు శాసింతురు, రక్షింతురు" అనిపలుకుచు విలపించును).

**ఉత్తిష్ఠోత్తిష్ఠ రాజర్షే ఇమాముదధిమేఖలామ్ ।**
**దస్యుభ్యః క్షత్రబన్ధుభ్యో బిభ్యతీం పాతుమర్హసి ॥ 48**

రాజర్షీ! లెమ్ము, లెమ్ము, చూడుము, జలధివేష్టిత మగునీధరిత్రి అధార్మికు లగు దస్యులయొక్క, క్షత్రియులయొక్క భయముచే భీతమైనది. దానిని ఉద్ధరించుట నీ కర్తవ్యము. (ఆధ్యాత్మపక్షమున -"గురుదేవా! ఈపృథివి అనగా నీచే ప్రవర్తిత మైనశ్రవణాది భక్తిగతి శుద్ధభక్తివిరోధ మతవాదరూపు లగుదస్యులద్వారా ఆచ్ఛన్నమయ్యెను).

**ఏవం విలపతీ బాలా విపినే ఽనుగతా పతిమ్ ।**
**పతితా పాదయోర్భర్తురుదత్యశ్రుణ్యవర్తయత్ ॥ 49**

పతి ననుసరించు పతివ్రత యగునావిదర్భరాజకుమారి నిర్జనవనమున నిట్లు విలపించుచు భర్త పాదములపై బడి కన్నీటిని విడువసాగెను.

**చితిం దారుమయీం చిత్వా తస్యాం పత్యుః కలేవరమ్ ।**
**ఆదీప్య చానుమరణే విలపన్తీ మనో దధే ॥ 50**

పిమ్మట ఆమె దారుమయ మగుచితిని ఏర్పాటుచేసి దానియందు పతిశరీరము నుంచి అగ్నిని రగిలించెను. తాను విలపించుచు భర్త ననుసరింప సంకల్పించెను .

వివరణము :- గురువు పరమపదించినపిమ్మట ఆయన దేహమున కంత్యక్రియ లొనర్చి శిష్యు డాయనగుణానుస్మరణమయ మగుశోకదావాగ్నిచే దగ్ధదేహుడై తన జీవితముపై నాసక్తిని విడచి నిత్యధామమునందు గురువు యొక్క నిత్యసేవను పొందుటకై వ్యాకులు డగును.

**తత్ర పూర్వతరః కశ్చిత్సఖా బ్రాహ్మణ ఆత్మవాన్ ।**
**సాన్త్వయన్ వల్గునా సామ్నా తామాహ రుదతీం ప్రభో ॥ 51**

ప్రభూ! అచటి కాసమయమున స్వరూపయుక్తు డగునొకపూర్వసఖుడు (అనాదియు, ఈశ్వరుడు నగుపరమాత్మ) బ్రాహ్మణరూపముతో వచ్చి విలపించుచున్న ఆవైదర్భిని (గురుగత ప్రాణు డగుశిష్యుని) మనోహరము లగుప్రియవాక్కులతో నోదార్చి యిట్లు పలికెను.

## శ్రీ బ్రాహ్మణ ఉవాచ

**కా త్వం కస్యాసి కో ఽవాయం శయానో యస్య శోచసి ।**
**జానాసి కిం సఖాయం మాం యేనాగ్రే విచచర్థ హ ॥ 52**

బ్రాహ్మణుడు పలికెను :- నీ వెవరు? ఎవరిదానవు? నీ వీ శయనించియున్న పురుషునికై యేల దుఃఖించుచున్నావు? ఇత డెవరు? నన్ను నీ వెరుగుదువా? నేను స్నేహితుడను. పూర్వము నీవు నాతో సఖ్యసుఖము ననుభవించితివి.

వివరణము :-(గురుభక్తుడు, సంసారవిరక్తుడు, విశుద్ధాంతః కరణుడు నగుశిష్యునకు, అంతర్యామి యగుపరమాత్మ దయతో నావిర్భవించి జీవునిస్వరూపమును, భగవదభిన్న ప్రకాశ మగుగురుదేవుని స్వరూపమును, భగవత్స్వరూపమును దెలిపి, వానిహృదయమున శాంతిని నెలకొల్పును).

**అపి స్మరసి చాత్మానమవిజ్ఞాతసఖం సఖే ।**
**హిత్వా మాం పదమన్విచ్ఛన్ భౌమ భోగరతో గతః ॥ 53**

మిత్రుడా! నీవు నన్నెఱుగకపోయినను ఎప్పుడయిన నీకిట్టి సఖుడెవ్వడయిన (జీవునకు సేవ్యుడయినపరమాత్మ) ఉన్నట్లు జ్ఞాపక మున్నదా? నీవు నన్ను పరిత్యజించి (స్వాతంత్ర్య మును దుర్వినియోగముచేయుట వలన కృష్ణసేవను మఱచి) నీభోగస్థానమును (దేవ మనుష్యులకు భోగయోగ్యస్థల మగుశరీరమును) అన్వేషింపదలచి ప్రాకృతభోగములయందు (శబ్దాది విషయములయందు) ఆసక్తుడవైతివి.

**హంసావహం చ త్వం చార్య సఖాయౌ మానసాయనౌ ।**
**అభూతామన్తరావౌకః సహస్రపరివత్సరాన్ ॥ 54**

ఆర్యా! నేను నీవు హంసలము (జీవాత్మపరమాత్మలను రెండుశుద్ధ పక్షులు). మన యిరువురము మానససరోవరమున (హృదయమున) కలిసి నివసించుచుందుము. మనము గృహము (ప్రాకృతస్థూలశరీరము) లేకుండగనే వేయిసంవత్సరముల కాలము (మహా ప్రళయము) వఱకు నివసించితిమి.

**స త్వం విహాయ మాం బన్ధో గతో గ్రామ్య మతిర్మహీమ్ ।**
**విచరన్ పదమద్రాక్షీః కయాచిన్నిర్మితం స్త్రియా ॥ 55**

సఖుడా! హంస వైనను (స్వరూపముగ శుద్ధుడవైనను) నీవు (అనాది బహిర్ముఖత్వ ముచే స్వాతంత్ర్యమును దుర్వినియోగపఱచుటవలన) ప్రాకృత విషయముల ననుభవింప దలచి నన్ను (నిత్యభజనీయు డగుపరమాత్మను) పరిత్యజించి ప్రపంచములోనికి వచ్చితివి, వాసస్థానము నన్వేషించుచు (లింగ శరీరవాంఛను తీర్చుకొనుట కుపయోగపడుస్థూల శరీరము ననుసంధానము చేయుచు) ఒకానొక స్త్రీ (ప్రకృతి) నిర్మించిన యొకపురమును (మానవదేహమును) దర్శించితివి.

**పంచారామం నవద్వారమేకపాలం త్రికోష్ఠకమ్ ।**
**షట్కులం పంచవిపణం పంచప్రకృతి స్త్రీధవమ్ ॥ 56**

**పంచేన్ద్రియార్థా ఆరామా ద్వారః ప్రాణా నవ ప్రభో ।**
**తేజో ఽవన్నాని కోష్ఠాని కులమిన్ద్రియసంగ్రహః ॥ 57**

**విపణస్తు క్రియాశక్తి ర్భూతప్రకృతిరవ్యయా ।**
**శక్త్యధీశః పుమానత్ర ప్రవిష్టో నావబుధ్యతే ॥ 58**

ఆపురమునకు (మనుష్యశరీరమునకు) ఐదు ఉపవనములు, తొమ్మిదిద్వారములు, ఒకరక్షకుడు (ప్రాణము), మూడు ప్రహరీలు, ఆఱువైశ్యకులములు, ఐదు హట్టములు (అంగళ్లు), ఐదు ఉపాదానములు గలవు. దాని యజమానురాలొక స్త్రీ.

సఖా! పంచేంద్రియముల విషయములు దాని యుపవనములు : తొమ్మిది ప్రాణ చ్ఛిద్రములు (రెండుచక్షువులు, రెండునాసికలు, రెండుకర్ణములు, ముఖము, పాయువు, ఉపస్థ) తొమ్మిదిద్వారములు; తేజస్సు, జలము, పృథివి యనునవిమూడును దానికోష్ఠములు (ప్రహరీలు). మనస్సు, పంచజ్ఞానేంద్రియములు అనునవి ఆఱుకులములు; అయిదు క్రియాశక్తులు లేదా కర్మేంద్రియములు దాని ఐదుహట్టములు (అంగళ్ళు); మహాప్రళయము వఱకు నుండు పంచమహాభూతములు దానిమైదు ఉపాదానములు. పురుషుడే (అణు చైతన్యజీవాత్మ) మాయాకార్యభూత మగుబుద్ధికి వశుడయి యాపురమున ప్రవేశించి యాత్మస్వరూపమును దెలిసికొనజాలకపోయెను.

**తస్మిం స్త్వం రామయా స్పృష్టో రమమాణోఽ శ్రుత స్మృతిః ।**
**తత్సంగాదీదృశీం ప్రాప్తో దశాం పాపీయసీం ప్రభో ॥ 59**

నీ వీదేహరూప మగుపురమునందు విషయబుద్ధి యనుస్త్రీ ద్వారా తిరస్కృతుడవయి దానియందే (విషయములయందే) ఆసక్తుడ వైతివి. అందువలననే నీకు భగవద్విస్మృతి కలిగినది. దాని సాంగత్యమువలననే నీ కిట్టిపాపభూయిష్ఠ మగుదశ కలిగినది.

**న త్వం విదర్భదుహితా నాయం వీరః సుహృత్తవ ।**
**న పతిస్త్వం పురంజన్యా రుద్ధో నవముఖే యయా ॥ 60**

నీవు విదర్భరాజునకు (ప్రాకృతజీవునకు) పుత్రికవు కావు (కాని భగవచ్ఛక్తిరూపుడ వగుజీవుడవు). ఈమలయధ్వజుడుగూడ నీకు మేలుచేయుపతి కాడు (నేనే యీ మలయ ధ్వజునిరూపముతో నీకు గురువునయి నా భక్తిని యుపదేశించి నీకు మిత్రుడు చేయదగినపని చేసితిని). ఏ పురంజనినిద్వారా నీవు నవద్వారపురమున (దేహమున) బంధితుడ వయితివో నీవు గూడ ఆపురంజనికి పతివి కావు (కాని యవిద్యకు వశు డయినవాడు, చేతనము యుడు నగు జీవుడే యామెకు పతి యైయున్నాడు).

**మాయా హ్యేషా మయా సృష్టా యత్పుమాంసం స్త్రియం సతీమ్ ।**
**మన్యసే నోభయం యద్వై హంసౌ పశ్యావ్య నౌగతిమ్ ॥ 61**

నీవు ఏయాత్మను ఒకప్పుడు పురుష డనియు, ఒకప్పుడు స్త్రీ యనియు, ఒకప్పుడు నపుంసక మనియు భావించుచున్నావో దానికి కారణము మాయ. అది నా శక్తియే.

వాస్తవములో మనము (జీవుడు భగవానుడు) ఇరువురము శుద్ధులమె అనగా చిన్మయులమె. మనస్వరూపమును వర్ణింతును, నీవు దానిని పొందుము.

**అహం భవాన్ న చాన్యస్త్వం త్వమేవాహం విచక్ష్వభోః ।**
**న నౌ పశ్యన్తి కవయశ్ఛిద్రం జాతు మనాగపి ॥ 62**

నేను పరమాత్మను, నీవు జీవుడవు. నా చైతన్యస్వరూపముకంటె నీవు భిన్నుడవు కావు. అందువలన స్వరూపమున నీవు నాకంటె నభిన్నుడవు, దానిని విశేషముగ నాలోచించి చూడుము. తత్త్వవేత్తలు మనయొక్క (జీవభగవానుల) నడుమ యేమాత్రమును భేదమును జూడరు.

**యథా పురుష ఆత్మానమేకమాదర్శ చక్షుషోః ।**
**ద్విధాభూతమవేక్షేత తథైవా న్తరమావయోః ॥ 63**

పురుషుడు మణిమయ మగుదర్పణమునందు ప్రతిబింబించిన తన దేహమును తనకంటె అభిన్న మైనదిగ దర్శించును, కాని యితరుల కనులకు ఇరువురుపురుషులగ గనబడును. అట్లే ఉపాధిధర్మమునందలి లిప్తాలిప్తధర్మభేదముచే మననడుమ (జీవ భగవానులనడుమ) పార్థక్య ముండును.

**ఏవం స మానసో హంసో హంసేన ప్రతిబోధితః ।**
**స్వస్థ స్తద్వ్యభిచారేణ నష్టామాప పునః స్మృతిమ్ ॥ 64**

ఇట్లు మానస సరోవరమునం దున్న యొకహంస (జీవుడు) మఱియొక హంస అనగా పరమాత్మచే ప్రబోధితయై తనకు భగవద్విముఖత్వమువలన నశించిన స్మృతిని మరల పొందెను.

**బర్హిష్మన్నేతదధ్యాత్మం పారోక్ష్యేణ ప్రదర్శితమ్ ।**
**యత్పరోక్షప్రియో దేవో భగవాన్ విశ్వభావనః ॥ 6**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కన్ధే పురంజనోపాఖ్యానే
అష్టావింశోఽ ధ్యాయః ॥

ప్రాచీనబర్హీ! విశ్వభావను డగు భగవానుడు పరోక్షప్రియుడని పురంజనునియుపాఖ్యానము నెపముతో నీకు నే నీయాత్మతత్త్వజ్ఞానము నుపదేశించితిని. (దీనిని వేఱువిధముగ భావింపవలదు).

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని ఇరువదియెనిమిదవ అధ్యాయము
సమాప్తము

# ఇరువదితొమ్మిదవ అధ్యాయము

## పురంజనోపాఖ్యానతాత్పర్యము

కథాసారము :- ఈ యధ్యాయమున పరోక్ష మగు ఉపాఖ్యానము యొక్క అర్థము ద్వారా పురంజనో పాఖ్యానతాత్పర్యము నుపసంహారము చేయుట, స్త్రీ సాంగత్యము వలన స్త్రీత్వమును పొందినజీవుడు మరల భగవద్భక్తులయొక్క, భగవానుని యొక్క సాంగత్యముచే సంసారమునుండి ముక్తిపొందుట యను విషయములు కీర్తింపబడెను.

ప్రాచీనబర్హి నారదుని పురంజనోపాఖ్యాన తాత్పర్యమడుగగా నారదు డాయనకు పురంజనోపాఖ్యానమందలి యొక్కొక్కకథ యొక్క తాత్పర్యమును విడివిడిగ జెప్పెను. జీవుని కర్మానుసారముగ ఉచ్చనీచము లగునానావిధ యోనులలో దిరుగుట యను విషయము నుదహరించి, కేవలము కర్మద్వారా త్రితాపముల కాత్యంతిక ప్రతీకారము కలుగుజాల దనువిషయము నొకదృష్టాంతముద్వారా తెలిపెను. బరువును మోయుపురుషుడు తనశిరోబాధ, అలసట తగ్గుటకై తలపై నున్న బరువును బుజముమీద నుంచుకొని అలసటను పోగొట్టుటకు ప్రయత్నించును. జీవుని దుఃఖప్రతీకారచేష్టయు నట్లేయుండును. స్వప్న దృష్టము లగునానావిధదుఃఖములు జాగ్రదావస్థలేనిదె తొలగవు. అట్లే జీవునియనర్థ నివృత్తియు వాసుదేవునియందు పరమ భక్తియు లేకుండగ కర్మజ్ఞానయోగాదు లైన ఇతరోపాయముల వేనిచే నైనను వానికి క్షేమము కలుగదు. సత్పురుషులు చెప్పిన హరి కథాపీయూషవాహినిని సేవించుటవలననే జీవుడు ఆకలి, దప్పిక, శోకము, మోహము, భయము మున్నగు త్రితాపములనుండి ఆనుషంగిక భావముతో ఉద్ధరింపబడి, జీవుని పరమప్రయోజన మగుభగవత్ప్రేమను పొందును. కర్మకాండ యెప్పుడును నిజమైన వేద తాత్పర్యము కాదు. వాసుదేవుడొక్కడే వేదప్రతిపాద్యు డగుపురుషుడు. స్వరూపమున అందఱకు నిత్యభగవల్లోకమునందునికి యున్నది. స్వర్గాద్యనిత్య లోకములు నిత్యస్వరూపు నకు పొందదగినస్థానములు గావు. హరిని సంతోషపెట్టు కార్యములె జీవుడు చేయదగిన కార్యములు. దేనిచే శ్రీహరియందు మతి కలుగునో అదియే విద్య. శ్రీహరియె యేకైక శరణ్యుడు. ఆత్మభావితు డగుభగవానుడు ప్రపన్ను డగుజీవునిపై కృపజూపినపుడు, కృపాపాత్రుడగునా జీవుడు లౌకిక వైదికనిష్ఠలపట్ల ఆసక్తిని విడువసమర్థుడగును. విద్వాంసు డైనవాడే గురువు. గృహవ్రతధర్మమునం దాసక్తిని విడచి శ్రీహరి యందు చిత్తమును నిలుపుటయె జీవునికర్తవ్యము. గురుబ్రువు లీయాత్మతత్త్వమును తెలిసికొనలేరు. సద్గురువె జీవునిసంశయములను ఛేదింపగలుగును. వాసనామయ మగులింగ దేహమె జీవుని విషయభోగములకు గారణము. స్థూలదేహవినాశము వలననె లింగదేహమునకు నాశము

కలుగదు. లింగదేహము యొక్క నానావిధము లగుఅభిమానములవలన జీవుడు కర్మఫల బాధ్యుడయి నానావిధయోనులలో తిరుగుచుండును. లింగదేహము జీవునిహర్ష శోక భయదుఃఖములకు కారణము. మనస్సే జీవునిసంసారప్రాప్తికి కారణము. జగత్తులోని జీవులు మనోధర్మము లన్నింటియం దాసక్తులై యుందురు. దేహాంతరమును పొందక పోయినంతవఱకు మనోధర్మి యగుజీవుడు పూర్వ దేహమునందలి యభిమానమును విడువడు. మహాభాగవతుడగునారదుడు ప్రాచీనబర్హికి జీవేశ్వరతత్త్వసంబంధము నుపదేశించి వెడలిపోయెను. ప్రాచీనబర్హి సర్వదుఃఖములను విడచి, కపిలాశ్రమమునకు వెడలి భక్తి యోగము నాశ్రయించి, భగవంతు నారాధించి, భగవత్స్వారూప్యమును పొందెను.

## శ్రీ ప్రాచీన బర్హిరువాచ

**భగవం స్తే వచోఽ స్మాభిర్నసమ్యగవగమ్యతే ।**
**కవయస్తద్విజానన్తి న వయం కర్మమోహితాః ॥ 1**

ప్రాచీనబర్హి పలికెను :- దేవా! మేము నీవాక్కులలోని తాత్పర్యమును చక్కగ తెలిసికొనలేకపోయితిమి. పండితులే దీనిని తెలిసికొన గలుగుదురు. మేము కర్మాసక్తచిత్తులము. అందువలన నీవు చెప్పిన విషయములతాత్పర్యమును హృదయం గమముచేసికొనుట మాకు సాధ్యము కాలేదు.

## శ్రీ నారద ఉవాచ

**పురుషం పురంజనం విద్యాద్యద్వ్యనక్త్యాత్మనః పురమ్ ।**
**ఏకద్విత్రిచతుష్పాదం బహుపాదమపాదకమ్ ॥ 2**

నారదుడు పలికెను :- పురంజనుని పురుషుడు అనగా జీవుడని తెలిసికొనుము. పురుషుడు తనకర్మల ననుసరించి ఏకపదము, ద్విపదము, త్రిపదము, చతుష్పదము, బహుపదము, పదశూన్యము నగు తన పురమును అనగా శరీరమును ప్రకటించుటవలన వానిని పురంజను డందురు.

**యోఽవిజ్ఞాతాహృతస్తస్య పురుషస్య సఖేశ్వరః ।**
**యన్న విజ్ఞాయతే పుంభిర్నామభిర్వాక్రియాగుణైః ॥ 3**

ఎవనిని నే నవిజ్ఞాతశబ్దముచే పిలచితినో యతడె యాపురుషునిసఖుడగు ఈశ్వరుడు. పురుషులు నామగుణ క్రియాదులద్వారా యీశ్వరునిస్వరూపమును తెలిసికొనలేకపోవుట వలన ఆయన అవిజ్ఞాతశబ్దముచే చెప్పబడినాడు.

**యదా జిఘృక్షన్ పురుషః కార్త్స్న్యేన ప్రకృతేర్గుణాన్ ।**
**నవద్వారం ద్విహస్తాఙ్ఘ్రిం తత్రామనుత సాధ్వితి ॥ 4**

జీవుడు ప్రకృతిగుణములను సంపూర్ణముగ అనుభవింపదలంచినపుడు పూర్వోక్తము లగు దేహములలో నవద్వారములతోను, రెండుహస్తములతోను, రెండుపాదములతోను గూడినదేహమునే ఉపయోగ మైనదని తెలిసికొనవలెను.

**బుద్ధిస్తు ప్రమదాం విద్యాన్మమాహమితి యత్కృతమ్ ।**
**యామధిష్ఠాయ దేహేఽస్మిన్ పుమాన్ భుంక్తేఽక్షభిర్గుణాన్ ॥ 5**

నే నెవరిని "ప్రమద" యని చెప్పితినో ఆమెను "బుద్ధి" లేదా "అవిద్య" యని తెలిసికొనుము. అవిద్యారూప మగునీబుద్ధి నాధారముగ జేసికొనియె యీ దేహమునందు జీవుడు "నేను, నాది" యనియభిమానపడును, ఇంద్రియములచే రూపరసాది విషయముల ననుభవించుటకు ప్రయత్నించును.

**సఖాయ ఇంద్రియగణా జ్ఞానం కర్మ చ యత్కృతమ్ ।**
**సఖ్యస్తద్వృత్తయః ప్రాణః పంచవృత్తిర్యథోరగః ॥ 6**

ఇంద్రియములె పురంజనునిమిత్రులు. వానిద్వారమున జ్ఞానకర్మలు సంపాదింపబడును. ఇంద్రియవృత్తులు పురంజనుని స్నేహితురాండ్రు. నేను నీకు పంచశిరములు గలిగినసర్పమును గూర్చి చెప్పితిని. పంచవృత్తులు గలిగినప్రాణమే ఆసర్పము.

**బృహద్బలం మనో విద్యాదుభయేంద్రియనాయకమ్ ।**
**పంచాలాః పంచవిషయా యన్మధ్యే నవఖం పురమ్ ॥ 7**

పదునొకండుగురుమహాభటులకు నాయకు డనుదానిచే నేది చెప్పబడినదో దానిని జ్ఞానకర్మము లను ఉభయేంద్రియముల కధీశ్వరమైనది మహాబలవంతమైనది యగుమన స్సనితెలిసికొనుము. పంచాలశబ్దముచే రూపరసాదిపంచవిషయములు, ఈ పంచవిషయముల యొక్క లేదా పంచాల రాజ్యముయొక్క నడుమ నవద్వారయుక్తమగుపురము అనగా దేహము విరాజిల్లుచున్నది.

**అక్షిణీ నాసికే కర్ణౌ ముఖం శిశ్నగుదావితి ।**
**ద్వే ద్వే ద్వారౌ బహిర్యాతి యస్తదింద్రియ సంయుతః ॥ 8**

రెండునేత్రములు, రెండుముక్కులు, రెండుచెవులు - ఈ రెండు రెండుద్వారము లొకేచోట నిర్మితములైనవి. నోరు, శిశ్నము, పాయువు ననునవి వేఱువేఱుద్వారములు.

ఇంద్రియసంయుక్తు డగుజీవు డీద్వారములసాహాయ్యముతో బహిర్దేశమునకు వెడలును. అనగా రూపరసాది బాహ్యవిషయములను గ్రహించును.

**అక్షిణీ నాసికే ఆస్యమితి పంచపుర: కృతాః ।**
**దక్షిణా దక్షిణః కర్ణ ఉత్తరా చోత్తరః స్మృతః ।**
**పశ్చిమే ఇత్యథో ద్వారౌ గుదం శిశ్నమిహోచ్యతే ॥ 9**

రెండుచక్షువులు, రెండుకర్ణములు, నోరు అనుపంచద్వారములు పురమునకు పూర్వ భాగమున నున్నవి. దక్షిణకర్ణము దక్షిణద్వార మనియు, వామకర్ణ ముత్తరద్వార మనియు చెప్పబడినది. పశ్చిమద్వారములుగా జెప్పబడిన పాయూపస్థ లీపురమునకు గ్రిందిభాగమున నున్నవి.

**ఖద్యోతావిర్ముఖీ చాత్ర నేత్రే ఏకత్ర నిర్మితే ।**
**రూపం విభ్రాజితం తాభ్యాం విచష్టే చక్షుషేశ్వరః ॥ 10**

"ఖద్యోతము, ఆవిర్ముఖి" యనిచెప్పబడినఆరెండుద్వారము లీశరీరమునందు ఒకేచోట నిర్మితము లైనచక్షుర్ద్వయము లనితెలిసికొనవలెను. "విభ్రాజిత" మను ఏజన పదము యొక్క విషయము పూర్వమందుజెప్పబడినదో దానిని "రూప" మని తెలిసికొనుము. ("ద్యుమను" డనుసఖుడుగా చెప్పబడినది చక్షురింద్రియము, ద్యుమనునకు సఖుడు పురంజనుడు, ఇంద్రియముల కధీశ్వరుడు జీవుడు) జీవుడు రెండునేత్రములద్వారా రూపమును దర్శించును.

**నలినీ నాలినీ నాసే గన్ధః సౌరభ ఉచ్యతే ।**
**ఘ్రాణోఽవధూతో ముఖ్యాస్యం విపణో వాగ్రసవిద్రసః ॥ 11**

"నలిని, నాలిని" యనిచెప్పబడిన రెండుద్వారములు రెండునాసికలుగా నెఱుంగుము. "సౌరభదేశ" మని చెప్పబడినదానిని గంధముగా నెఱుంగవలెను. 'అవధూత' శబ్దముద్వారా ఘ్రాణేంద్రియము చెప్పబడినది. 'ముఖ్య'మని యేద్వారము చెప్పబడినదో దానియర్థము 'నోరు'గా నెఱుంగవలెను. 'విపణ' శబ్దముచే వాగింద్రియము, 'రసవిత్' శబ్దముచే 'రసనేంద్రియము' అనియెఱుంగ వలెను.

**ఆపణో వ్యవహారోఽత్ర చిత్రమన్నో బహూదనమ్ ।**
**పితృహూర్దక్షిణః కర్ణ ఉత్తరో దేవహూః స్మృతః ॥ 12**

ఈపురమునందు "ఆపణ" శబ్దమున కర్థము భాషణము, "బహూదన" శబ్దమున కర్థము విచిత్రాన్నము అనిచెప్పబడినవి. "పితృహూ" శబ్దముచే దక్షిణకర్ణము, "దేవహూ" శబ్దముచే వామకర్ణము అనిచెప్పబడినవి.

ప్రవృత్తం చ నివృత్తం చ శాస్త్రం పంచాలసంజ్ఞితమ్ ।
పితృయానం దేవయానం శ్రోత్రాచ్ఛ్రుతధరాద్వ్రజేత్ ॥ 13

"పంచాల" మనుశబ్దముచే ఏశాస్త్రవిషయము చెప్పబడినదో అది ప్రవృత్తి విషయక శాస్త్రము. "దక్షిణపంచాల" శబ్దముచే దక్షిణమార్గీయము లేదా కర్మకాండాత్మకశాస్త్రము, ఉత్తరపంచాలశబ్దముచే నివృత్తిప్రతిపాదకమైన జ్ఞాన కాండీయశాస్త్రము చెప్పబడినది. శబ్ద గ్రాహక మగుశ్రవణేంద్రియముద్వారా పురుషు డీరెండుశాస్త్రములను శ్రవణముచేసి పితృలోకమును పొందించు పితృయానమును, దేవలోకమును పొందించుదేవయానమును పొందును. శ్రుతధరశబ్దముచే శ్రోత్రేంద్రియమని తెలియదగును.

ఆసురీ మేఢ్రమర్వాగ్ద్వార్వ్యవాయో గ్రామిణాం రతిః ।
ఉపస్థో దుర్మదః ప్రోక్తో నిరృతిర్గుద ఉచ్యతే ॥ 14

పురమున కధోభాగమునగల "ఆసురి" యను నేద్వారమును గూర్చి నేను వివరించితినో అది "మేఢ్రము". అజ్ఞాను లగువ్యక్తులరతినె స్త్రీ సంగమమువలన గలిగినసుఖ మని తెలిసి కొనుము. 'దుర్మద' శబ్దముచే ఉపస్థేంద్రియము, 'నిరృతి' శబ్దముచే మలద్వారము నని చెప్పబడినవి.

వైశసం నరకం పాయుర్లుబ్ధకోఽన్ధౌ తు మే శృణు ।
హస్తపాదౌ పుమాంస్తాభ్యాం యుక్తో యాతి కరోతి చ ॥ 15

"పురంజనుడు వైశసమునకు వెడలె"నని పూర్వమున ఏది చెప్పబడినదో దానిద్వారా 'అతడు నరకమునకు వెడలె'నని తెలిసికొనవలెను. (లుబ్ధకునితో గలిసి వెడలు నను వాక్యమునందలి) 'లుబ్ధక' శబ్దముద్వారా 'పాయు' వని యెఱుంగుము. వెనుక చెప్పబడిన రెండుద్వారములను హస్తపాదములని తెలిసికొనుము. పురుషు డీరెండింద్రియములతో (హస్తపాదములతో) గూడినవాడై గమనాగమనములను, కర్మలను చేయును.

అన్తఃపురం చ హృదయం విషూచిర్మన ఉచ్యతే ।
తత్ర మోహం ప్రసాదం వా హర్షం ప్రాప్నోతి తద్గుణైః । 16

'అంతఃపుర', శబ్దము యొక్క అర్థము 'హృదయము'. 'విషూచి' (అంతటకు వెడలు నది) యనుశబ్దముచే "మన" స్సనిచెప్పబడినది. మనోమధ్యమున పురుషు డీమనోగుణముల ద్వారా మోహము, ప్రసన్నత లేదా హర్షాదులను బొందును.

యథా యథా విక్రియతే గుణాక్తో వికరోతి వా ।
తథా తథోపద్రష్టాత్మా తదవృత్తీరనుకార్య తే ॥ 17

వెనుక ఏపట్టపురాణివిషయము చెప్పబడినదో దానియర్థము బుద్ధి ఈ బుద్ధి స్వప్న జాగ్రదవస్థలయందే యే వికారములను గలిగించునో, బుద్ధిగుణములయం దాసక్తుడగు జీవుడు ద్రష్టమాత్రస్వరూపమునం దాబుద్ధి నట్లే అనుకరించును.

దేహో రథస్త్విన్ద్రియాశ్వాః సంవత్సరరయోఽ గతిః ।
ద్వికర్మచక్రస్త్రిగుణధ్వజః పంచాసుబన్ధురః ॥ 18

మనోరశ్మిర్బుద్ధిసూతో హృన్నీడో ద్వన్ద్వకూబరః ।
పంచేన్ద్రియార్థప్రక్షేపః సప్తధాతువరూథకః ॥ 19

ఆకూతిర్విక్రమో బాహ్యో మృగతృష్ణాం ప్రధావతి
ఏకాద శేన్ద్రియచమూః పంచసూనా వినోదకృత్ ।
సంవత్సరశ్చణ్డవేగః కాలో యేనోపలక్షితః ॥ 20

వెనుక ఏ రథవిషయము చెప్పబడినదో దేహమే యారథము, ఇంద్రియములే దాని గుఱ్ఱములు, సంవత్సరమువలె దానిగతి అప్రతిహతము, కాని వాస్తవికముగ దానికి గమనము లేదు. పాపపుణ్యములె దానిరెండుచక్రములు, గుణత్రయమె దానిధ్వజదండము, పంచప్రాణములె దానిపంచబంధనములు, మనస్సే పగ్గము, బుద్ధియె సారథి, హృదయమె రథి కూర్చుండు స్థానము, సుఖదుఃఖము లనుద్వంద్వములు లేదా శోకమోహములు యుగబంధనస్థానములు, పంచేంద్రియములయొక్క శబ్దాదివిషయములు దానిచే ప్రక్షిప్తము లైనవి, సప్తధాతువులె రథమునకు గలసప్తావరణములు, పంచకర్మేంద్రియములె దాని బాహ్యవిక్రమము, పదునొకం డింద్రియములె ఆపురుషునిసేన, వానిలో పంచజ్ఞానేంద్రియములద్వారా అతడు విషయములను సేవించును. ఆజీవు డీరథముపై నధిష్ఠించి మృగతృష్ణారూప మగువేటయందు అనగా మిథ్యాభూతము లగువిషయముల యందు పరుగిడును.

తస్యాహానీహ గన్ధర్వా గన్ధర్వ్యో రాత్రయః స్మృతాః ।
హరన్త్యాయు పరిక్రాన్త్యా షష్ట్యుత్తరశతత్రయమ్ ॥ 21

(చండవేగ మనునేకాలముయొక్క విషయము చెప్పబడినదో అది సంవత్సరము). సంవత్సరమునందలి దివసములె ఉపాఖ్యానమున "గంధర్వులు", రాత్రులు "గాంధర్వికలు' వనిచెప్పబడినవి. ఈమూడువందల అఱువది దివారాత్రములు పరిభ్రమించుచు పురుషుని ఆయుస్సును హరించుచుండును.

కాలకన్యా జరా సాక్షాల్లోకస్తాం నాభినన్దతి ।
స్వసారం జగృహే మృత్యుః క్షయాయ యవనేశ్వరః ॥ 22

వెనుక యేకాలకన్యను గూర్చి చెప్పితినో అది "జర" యని భావింపవలెను. ప్రాణులు జరను సాక్షాత్తుగ స్వీకరింపదలచరు. యవనేశ్వరుడగు మృత్యువు లోకవినాశార్థమై దానిని తన సోదరిరూపముతో స్వీకరించెను.

ఆధయో వ్యాధయస్తస్య సైనికా యవనాశ్చరాః ।
భూతోపసర్గాశురయః ప్రజ్వారో ద్వివిధో జ్వరః ॥ 23

ఏవం బహువిధైర్దుఃఖైర్దైవభూతాత్మసంభవైః ।
క్లిశ్యమానః శతం వర్షం దేహే దేహీ తమోవృతః ॥ 24

ప్రాణేన్ద్రియమనోధర్మానాత్మన్యధ్యస్య నిర్గుణః ।
శేతే కామలవాన్ ధ్యాయన్ మమాహమితి కర్మకృత్ ॥ 25

ఆయవనేశ్వరుని యాజ్ఞ ననుసరించు సేవకులు యవనసేనగా చెప్పబడిరి. మానసిక శారీరికబాధలనె యవనసేన యనియెఱుంగవలెను. శీతోష్ణభేదములచే రెండువిధములుగ నున్నజ్వరమె ప్రజ్వారము. దాని వేగము పీడాకాలమున ప్రాణుల మృత్యువునకు కారణ రూపమగును. ఇట్టి బహువిధములగు ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతిక దుఃఖములద్వారా పరిక్లిష్టుడై అజ్ఞానావృతుడగు జీవుడు వాస్తవముగ తాను నిర్గుణు డైనను జీవాత్మస్వరూపముతో ప్రాణధర్మములను క్షుత్పిపాసాదులను, ఇంద్రియ ధర్మములగు అంధత్వాదులను, మనో ధర్మములగు కామాదులను తనయం దారోపించుకొని దేహాదుల యందు నేను, నాది యను బుద్ధితో విషయములను చింతించుచు తుచ్ఛము లగు కర్మలయందు ప్రవృత్తుడై యీ దేహము నందు నూఱు సంవత్సరములకాలము వాసము చేయును.

యదాత్మానమవిజ్ఞాయ భగవన్తం పరం గురుమ్ ।
పురుషస్తు విషజ్జేత గుణేషు ప్రకృతేః స్వదృక్ ॥ 26

గుణాభిమానీ స తదా కర్మాణి కురుతేఽవశః ।
శుక్లం కృష్ణం లోహితం వా యథా కర్మాభి జాయతే ॥ 27

జీవుడు వాస్తవముగ స్వప్రకాశస్వభావు డయ్యును పరమగురువు, సర్వజ్ఞాన ప్రకాశకుడు, పరమాత్మస్వరూపుడు నగు భగవానుని పొందజాలక ప్రకృతియొక్క గుణములయందు మిగుల ఆసక్తుడై యుండును. అపుడు ప్రాకృతగుణాభిమానమువలన దేహాదిపరతంత్రుడై ఒకప్పుడు పుణ్యజనకములగు సాత్త్వికకర్మలను, ఒకప్పుడు తాపజనకములగు తామసిక కర్మలను, ఒకప్పుడు రాజసకర్మలను జేయును. ఏవిధములగు కర్మలను చేయునో ఆయా కర్మల ననుసరించి తదనురూపములగు జన్మలను పొందును.

శుక్లాత్ప్రకాశభూయిష్ఠాం ల్లోకానాప్నోతికర్హి చిత్ ।
దుఃఖోదర్కాన్ క్రియాయాసాంస్తమః శోకోత్కటాన్ క్వచిత్ ॥ 28

సాత్త్వికములు లేదా పుణ్యజనకములు నగు గర్మల జేయువారు ప్రకాశబహుళములు, జ్యోతిర్మయములు నగు దేవాదిలోకములను పొందుదురు. రాజసికకర్మల జేయువారు దుఃఖము ఉత్తరఫలముగా గల మనుష్యాదిలోకములను పొందుదురు. ఆలోకముల యందు పనిచేయుచున్నచో అనేకములగు కష్టములు గలుగును. తామసికకర్మల జేయువారు ఉత్కటము లగు శోకమోహాది ప్రధానములగు తిర్యగాదిలోకములను పొందుదురు.

క్వచిత్పుమాన్ క్వచిచ్చ స్త్రీ క్వచిన్నోభయమన్ధధీః ।
దేవో మనుష్యస్తిర్యగ్వా యథాకర్మగుణం భవః ॥ 29

అజ్ఞానముచే నావరింపబడిన బుద్ధిగల జీవు డొకప్పుడు పురుషుడు, ఒకప్పుడు స్త్రీ ఒకప్పుడు నపుంసకుడు, ఒకప్పుడు దేవత, ఒకప్పుడు మనుష్యుడు, ఒకప్పుడు తిర్యక్కునై జన్మించును. కర్మలయొక్క గుణముల ననుసరించియే జన్మించును.

క్షుత్పరీతో యథా దీనః సారమేయో గృహం గృహమ్ ।
చరన్ విన్దతి యద్దిష్టం దణ్డమోదనమేవ వా ॥ 30

తథా కామాశయో జీవ ఉచ్చావచపథాభ్రమన్ ।
ఉపర్యధో వా మధ్యే వా యాతి దిష్టం ప్రియాప్రియమ్ ॥ 31

ఆకలిచే పీడింపబడిన కుక్క ఇంటింటికి తిరిగి తన ప్రారబ్ధము ననుసరించి యొకచోట కఱ్ఱదెబ్బలను దినును, ఒకచోట ఒక్కముద్ద అన్నమును పొందును. అట్లే కోరికలు నిండినమనస్సు గల జీవుడు గూడ ఉచ్చనీచము లగు వివిధమార్గములలో భ్రమించుచు దేవాది ఊర్ధ్వలోకములను, నరకాద్యధోలోకములను లేదా మనుష్యాది మధ్యలోకములను పొంది సుఖదుఃఖరూపభోగముల ననుభవించును.

దుఃఖేష్వేకతరేణాపి దైవభూతాత్మ హేతుషు ।
జీవస్య న వ్యవచ్ఛేదః స్యాచ్చేత్తత్తత్ప్రతిక్రియా ॥ 32

ఆయా దుఃఖముల ప్రతీకారముల కుపాయములు శాస్త్రాదుల యందు జూపబడినను ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము నను ఈ మూడు విధములగు దుఃఖములలో ఒక్కదుఃఖమునుండియు జీవుడు బయటపడజాలడు.

యథా హి పురుషో భారం శిరసా గురుముద్వహన్ ।
తం స్కన్ధేన స ఆధత్తే తథా సర్వాః ప్రతిక్రియాః ॥ 33

పురుషుడు తలపై నెక్కువబరువును మోయుచు మిగుల అలసట చెందును. అపుడు తలనొప్పిని తగ్గించుకొనుటకై ఆబరువును బుజముపై నుంచుకొని అలసటను దగ్గించు కొనుటకు ప్రయత్నించును. అట్లే యేకొలదికష్టముకైనను ప్రతీకార ముండును, దాని వలన ఐకాంతికదుఃఖమేమాత్రమును నివృత్తిచెందదు.

**నైకాన్తతః ప్రతీకారః కర్మణాం కర్మ కేవలమ్ ।**
**ద్వయం హ్యవిద్యోపసృతం స్వప్నే స్వప్న ఇవానఘ ॥ 34**

అనఘా! కేవలకర్మ అనగా కృష్ణసంబంధ జ్ఞానరహిత మగుకర్మ దుఃఖమున కాత్యంతిక ప్రతీకారము కాదు. ఏలయన దుఃఖము, తన్నివారకమగుకర్మ రెండును అవిద్యాజనితములె. స్వప్నావస్థయందు దృష్టములగు స్వప్నములకు అనగా స్వాప్నికదుఃఖములకు జాగరణము తప్ప మఱియొకప్రతీకారము లేదు. అట్లే అవిద్యాదశయందు మోహమువలన దుఃఖ ప్రతీకారార్థమై చేయబడుకర్మలవలన విఘ్నములకు, మరల దురాచారమునకు అవకాశ ముండుటవలన దానిద్వారా సంపూర్ణముగ దుఃఖములు తొలగవు.

**అర్థే హ్యవిద్యమానేఽ పి సంసృతిర్న నివర్తతే ।**
**మనసా లిఙ్గరూపేణ స్వప్నే విచరతో యథా ॥ 35**

ఉపాధిభూతమగు (దుఃఖహేతువగు) మనస్సుద్వారా స్వప్నమున విహరించు స్వభావము గలపురుషునకు వ్యాఘ్రసర్పచోరాది వస్తువులు నిజముగ లేకపోయినను ఆ వ్యాఘ్రాదుల దర్శనమువలన గలిగినదుఃఖములు జాగరణముద్వారా కాక ఇతరో పాయములచే నివృత్తములు గావు; అట్లే అవిద్యానివృత్తి కానిదె ప్రాకృతకర్మద్వారా సంసార నివృత్తి కాజాలదు.

**అథాత్మనోఽ ర్థభూతస్య యతోఽ నర్థపరంపరా ।**
**సంసృతిస్తద్వ్యవచ్ఛేదో భక్త్యా పరమయా గురౌ ॥ 36**

**వాసుదేవే భగవతి భక్తియోగః సమాహితః ।**
**సధ్రీచీనేన వైరాగ్యం జ్ఞానం చ జనయిష్యతి ॥ 37**

అందువలన పురుషార్థస్వరూపు డగుజీవాత్మకు అజ్ఞానమువలన జనన మరణాది దుఃఖలక్షణాత్మక మగుసంసారగతి కలుగును. ఏకైకపరమగురువగు వాసుదేవుని యందలి పరమభక్తి ద్వారానే ఆయజ్ఞానము పూర్తిగ నశించును. భగవాను డగువాసుదేవునియందే పరిపూర్ణ మగుభక్తియోగము (కృష్ణేంద్రియములకు సంతుష్టిని గలుగజేయుటకే కాని ఆత్మేంద్రియ తృప్తికై కాదు) అనుష్ఠింపబడినచో సంపూర్ణముగ కృష్ణేతరవిషయముల యందు వైరాగ్యము, భగవద్జ్ఞానము (భేదరహితజ్ఞానముకాదు) ఆవిర్భవించును.

సోఽచిరాదేవ రాజర్షే స్యాదచ్యుతకథాశ్రయః ।
శృణ్వతః శ్రద్దధానస్య నిత్యదా స్యాదధీయతః ॥ 38

రాజర్షీ! శ్రద్ధాన్వితుడై నిరంతరము హరికథాశ్రవణమును, భగవద్ధర్మపరిశీలనమును చేసినమానవునియందు భగవాను డగుఅచ్యుతుని కథ నాశ్రయించు నాభక్తియోగము స్వల్ప కాలములోనే ఆవిర్భవించును.

యత్ర భాగవతా రాజన్ సాధవో విశదాశయాః ।
భగవద్గుణానుకథనశ్రవణవ్యగ్రచేతసః ॥ 39

తస్మిన్ మహన్ముఖరితామధుభిచ్చరిత్ర -
పీయూష శేషసరితః పరితః స్రవన్తి ।
తా యే పిబన్త్యవితృషో నృపగాఢకర్ణై -
స్తాన్ న స్పృశన్త్యశనతృడ్భయశోకమోహాః ॥ 40

రాజా! ఏ ప్రదేశమున సదాచారసంపన్నులు, విశుద్ధచిత్తులు, భగవద్గుణానువాదశ్రవణ కీర్తనములయందు వ్యాకులితచిత్తులు అగుభాగవతులుందురో ఆప్రదేశమున మహాత్ముల ముఖవిగళిత మగు మధురిపుని చరితామృతధారావాహిని యగు సరిత్తు నలుదిక్కుల ప్రవహించును. అతృప్తములు, అభినివిష్టములు అగుకర్ణపుటములద్వారా ఆపీయూషవాహిని యగు స్రోతస్వినిని సేవించువారిని ఆకలిదప్పులు, భయశోకములు, మోహము స్పృశింప జాలవు.

ఏతైరుపద్రుతో నిత్యం జీవలోకః స్వభావజైః ।
న కరోతి హరేర్నూనం కథామృతనిధౌ రతిమ్ ॥ 41

స్వభావజము లగుఆక్షుత్పిపాసాదులచే పీడింపబడినవాడై జీవుడు హరికథామృత సింధువునం దాసక్తిని చూపడు.

ప్రజాపతిపతిః సాక్షాద్భగవాన్ గిరిశో మనుః ।
దక్షాదయః ప్రజాధ్యక్షా నైష్ఠికాః సనకాదయః ॥ 42

మరీచిరత్ర్యఙ్గిరసౌ పులస్త్యః పులహః క్రతుః ।
భృగుర్వసిష్ఠ ఇత్యేతే మదన్తా బ్రహ్మవాదినః ॥ 43

అద్యాపి వాచస్పతయస్తపో విద్యాసమాధిభిః ।
పశ్యన్తోఽపి న పశ్యన్తి పశ్యన్తం పరమేశ్వరమ్ ॥ 44

ప్రజాపతులకుగూడ పతి యగువాడు, సాక్షాత్తుగ పరమైశ్వర్యశాలియు నగుబ్రహ్మ, మహాదేవుడు, మనువు, దక్షుడు మున్నగు ప్రజాపతులు, ఊర్ధ్వరేతస్కు లగుసనకాదులు, మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వశిష్ఠుడు, నావంటియితరబ్రహ్మవాదు లగుపురుషులు, వాచస్పతులు తపస్సు, విద్య, సమాధి మున్నగునుపాయములచే ఎల్లప్పుడు అన్వేషించియు నేటివఱకును సర్వసాక్షి యగుపరమేశ్వరుని తెలిసికొనలేకపోయిరి.

శబ్దబ్రహ్మణి దుష్పారే చరన్త ఉరు విస్తరే ।
మన్త్రలింగైర్వ్యవచ్ఛిన్నం భజన్తో న విదుః పరమ్ ॥ 45

అపారము, అనంతము నగుశబ్దబ్రహ్మమునందు సంచరించినను, వేదమంత్రార్థముల ననుసరించి వజ్రహస్తాదిచిహ్నధారి యగునింద్రుడు మున్నగుదేవతల నుపాసించియు మేము పరమపురుషు డగుపరమేశ్వరుని తత్త్వము నెఱుంగజాలమైతిమి.

యదా యస్యానుగృహ్ణాతి భగవానాత్మభావితః ।
స జహాతి మతిం లోకే వేదే చ పరినిష్ఠితామ్ ॥ 46

పరిపూర్ణమగునైశ్వర్యము గలభగవానుడు జీవాత్మయొక్క ఆత్మసమర్పణమునకు ప్రసన్నుడై లేదా ఆత్మవృత్తిచే సేవితుడై వానిపై కృపజూపినచో ఆభక్తుడు లౌకికవ్యవహారమునందు, వేదప్రతిపాదిత మగుకర్మ కాండమునందు ఆసక్త మగుమతిని పరిత్యజించును.

తస్మాత్కర్మసు బర్హిష్మన్నజ్ఞానాదర్థకాశిషు ।
మార్థదృష్టిం కృథాః శ్రోత్రస్పర్శిష్వస్పృష్టవస్తుషు ॥ 47

ప్రాచీనబర్హీ! అందువలన అజ్ఞానమువలన పరమార్థరూపమున ప్రకాశమానములు, కేవలము శ్రవణాభిరామములు, సహజముగ వాస్తవ వస్తువుతో గూడ సంపర్కమాత్ర రహితములు అగుకర్మలయందు పరమార్థ బుద్ధి కలిగియుండరాదు.

స్వం లోకం న విదుస్తే వై యత్ర దేవో జనార్దనః ।
ఆహుర్ధూమ్రధియో వేదం సకర్మకమతద్విదః ॥ 48

మలినబుద్ధులుగలవారే వేదమును కర్మపర మని చెప్పుచున్నారు. నిశ్చయముగ వారికి వేదతాత్పర్య మవగతము కాలేదు. ఏలయనగా, జనార్దనభగవానుడు విరాజిల్లు వైకుంఠాదిలోకములు స్వస్వరూపముచే పొందదగిన వని వా రెఱుంగజాలరు.

ఆస్తీర్య దర్భైః ప్రాగగ్రైః కార్త్స్న్యేన క్షితిమండలమ్ ।
స్తబ్ధో బృహద్వధాన్మానీ కర్మ నావైషి యత్పరమ్ ।
తత్కర్మ హరితోషం యత్ సా విద్యా తన్మతిర్యయా ॥ 49

రాజా! పూర్వాగ్రము లగు దర్భలద్వారా సమగ్రపృథ్వీమండలము ఆచ్ఛాదనము చేసి, చాలపశువులను వధించి నిన్ను నీవు మహాయజ్వ యని అభిమానపడుచున్నావు. దాని వలన నీవు డాంబికుడవై భగవదారాధన లక్షణము, హరిసేవాను కూలము నగు కర్తవ్యమును పరమకర్తవ్యమని తెలిసికొనుటలేదు. దేనిద్వారా హరికి సంతుష్టి కలుగునో అదియే జీవుని యేకైకకర్తవ్యము. దేనిచే శ్రీహరియందు బుద్ధి కలుగునో అదియే విద్య.

హరిర్దేహభృతామాత్మా స్వయం ప్రకృతిరీశ్వరః ।
తత్పాదమూలం శరణం యతః క్షేమో నృణామిహ ॥ 50

శ్రీహరి దేహధారు లగు జీవుల హృదయాంతర్యామి యగు పరమాత్మ. ఆయన యొక్కడే సర్వులకు కారణుడు, నియంత. అందువలన ఈ సంసారమున ఆయన పాదములె మానవుల కేకైక మగు ఆశ్రయ తత్త్వవస్తు వైయున్నవి. శ్రీహరిచరణాశ్రయము వలననే జీవునకు సర్వవిధము లగు శుభములు కలుగును.

స వై ప్రియతమశ్చాత్మా యతో న భయమణ్వపి ।
ఇతి వేద స వై విద్వాన్ యో విద్వాన్ స గురుర్హరిః ॥ 51

భగవత్పూజనమున భయ మేమాత్రము నుండదు. భగవానుడె సర్వజీవులకు ప్రియతమ మగు ఆత్మ యైయున్నా డనియెఱుంగవలెను. ఆయనయె విద్వాంసుడు; విద్వాంసుడైన వాడె గురువు. గురువైనవాడు హరికంటె అభిన్ను డగును.

## శ్రీ నారద ఉవాచ

ప్రశ్న ఏవం హి సంఛిన్నో భవతః పురుషర్షభ ।
అత్ర మే వదతో గుహ్యం నిశామయ సునిశ్చితమ్ ॥ 52

నారదుడు పలికెను :- పురుషశ్రేష్ఠా! నీ వడిగినప్రశ్నకు సమాధానము చెప్పితిని. ఇపుడు సాధుసమ్మతము, వేదగుహ్యము నగు మఱియొక విషయమును జెప్పుచున్నాను, వినుము.

క్షుద్రం చరం సుమనసాం శరణే మిథిత్వా
రక్తం షడఙ్ఘ్రిగణసామసు లుబ్ధకర్ణమ్ ।
అగ్రే వృకానసుతృపోఽవిగణయ్య యాన్తం
పృష్ఠే మృగం మృగయ లుబ్ధకబాణభిన్నమ్ ॥ 53

ఒకహరిణము తన భార్యతోగూడి మదించినదియై పుష్పోద్యానము నందు విహరించుచు లేఁబచ్చికలను దినుచుండెను. దాని చెవులు భ్రమరముల మధురఝంకార ములయందు లగ్నములై యుండెను. దానియెదుటనె అన్యజీవుల మాంసాదులతో తమ పొట్టనింపుకొను తోడేళ్లు పొంచియుండెను. చంపుటకై వేటకాడు వెనుకనుండి దానిపై బాణమును విడచెను. కాని హరిణమున కిది యేదియు తెలియదు. ఒక్కమాఱు నీవిట్టి హరిణము యొక్క పరిస్థితిని గూర్చి యాలోచింపుము.

**సుమనస్సమధర్మాణాం స్త్రీణాం శరణ ఆశ్రమే పుష్ప మధుగన్ధవత్ క్షుద్రతమం కామ్యకర్మవిపాకజం కామసుఖలవం జైహ్వ్యౌపస్థ్యాది విచిన్వన్తం, మిథునీభూయ తదభినివేశిత మనసం, షడఙ్ఘ్రిగణసామగీతవదతిమనోహర వనితాదిజనాలాపే ష్వతితరామతిప్రలోభితకర్ణమగ్రే వృకయూథవదాత్మన ఆయుర్హరతోఽ హోరాత్రాన్తాన్ కాలలవ విశేషానవిగణయ్య గృహేషు విహరన్తం, పృష్ఠత ఏవ పరోక్షమనుప్రవృత్తో లుబ్ధకః కృతాన్తోఽ న్తశ్శరేణ యమిహ పరా విధ్యతి తమిమమాత్మాన మహో రాజన్ భిన్నహృదయం ద్రష్టుమర్హసీతి యథా మృగయుహతం మృగమితి ॥ 54**

మొదట సుఖప్రదము చివరకు దుఃఖప్రదము నగు పుష్పధర్మమువంటి ధర్మము గల స్త్రీల వలన నేర్పడు గృహస్థాశ్రమమునందు పుష్పములలోని మధుగంధమువలె మిగుల తుచ్ఛమైన, కామ్యకర్మఫలరూపమైన కామసుఖలేశమును జిహ్వేంద్రియ ఉపస్థేంద్రియాదు లతో అన్వేషించుచున్నవాడు, మిథునధర్మముతో ఆకామసుఖలేశమునందు ఆసక్తి గల వాడు, తుమ్మెదల ఝంకారమువలె మిగుల మనోహరము లగు స్త్రీపుత్రాదుల యాలాపముల యందు పమధికముగ ఆసక్తమగు కర్ణేంద్రియముగలవాడు, ఎదుట తోడేళ్ళ గుంపువలె తనయాయువు నపహరించు రేయింబవళ్ళనెడు కాలవిశేషమును లెక్కింపక గృహము లందే విహరించుచున్నవాడు, పొంచియుండి బాణము నెక్కుపెట్టి వెంబడించు యముడను వ్యాధుడు తన్ను జంపుననీ తెలిసికొనజాలనివాడు, నిర్భిన్నహృదయుడు నగు మానవుని వేటకానిచే హత మగు మృగమువలె భావింపుము.

**స త్వం విచక్ష్య మృగచేష్టితమాత్మనోఽన్త -**
**శ్చిత్తం నియచ్ఛ హృది కర్ణధునీం చ చిత్తే ।**
**జహ్యఙ్గనాశ్రమమసత్తమయూథగాథం**
**ప్రీణీహి హంసశరణం విరమ క్రమేణ ॥ 55**

రాజా! నీవు మృగముయొక్క పరిస్థితిని విచారించి ఆత్మయందు చిత్తమును ప్రవేశ పెట్టుము; శ్రవణానందదాయనియు, కలస్వనయు నగు నదీప్రవాహస్వరూపమగు కర్మ

కాండయొక్క ఫలశ్రుతియందు ఆసక్తిని విడువుము. కాముకుల అసత్ప్రల్లాపములచే ప్రతిధ్వనించు గృహస్థాశ్రమమును పరిత్యజించి శుద్ధజీవుల ఏకమాత్రాశ్రయు డగు శ్రీహరిపై ప్రేమను జూపుము. క్రమముగ సంసారప్రవృత్తినుండి నివృత్తుడ వగుదువు.

## శ్రీ రాజోవాచ

**శ్రుతమన్వీక్షితం బ్రహ్మన్ భగవాన్ యదభాషత ।**
**నైతజ్జానన్త్యుపాధ్యాయాః కిం న బ్రూయుర్విదుర్యది ॥ 56**

రాజు పలికెను :- మహాత్మా! నారదా! నీవు చెప్పినదానిని నేను విని, దానిని గూర్చి విశేషముగ నాలోచించితిని. నాకు కర్మనుగూర్చి ఉపదేశించు ఈయాచార్యులకు దీని విషయము తెలియదు. వారి కీవిషయము తెలిసియున్నచో నా కేలయుపదేశింపరు?

**సంశయోఽత్ర తు మే విప్ర సంఛిన్నస్తత్కృతో మహాన్ ।**
**ఋషయోఽపి హి ముహ్యన్తి యత్ర నేన్ద్రియ వృత్తయః ॥ 57**

విప్రుడా! నాకు కర్మ నుపదేశించిన గురువులవాక్కులతో నీ వాక్కులకు విరోధము కలుగుటచే భక్తి జ్ఞానవైరాగ్య విషయములయందు నాకు గలిగిన గొప్ప సంశయమును నీవు విశేషముగ ఛేదించితివి. ఆ విషయమున జితేంద్రియు లగు ఋషులకుగూడ మోహము కలుగును.

**కర్మాణ్యారభతే యేన పుమానిహ విహాయ తమ్ ।**
**అముత్రాన్యేన దేహేన జుష్టాని స యదశ్నుతే ॥ 58**

జీవు డీలోకమున ఏదేహముద్వారా కర్మల జేయునో దాని నీలోకమునందే పరిత్యజించి కర్మానుసారముగ స్వర్గనరకములయందు భిన్నదేహములను పొంది కర్మఫలము ననుభవించును.

**ఇతి వేదవిదాం వాదః శ్రూయతే తత్ర తత్ర హ ।**
**కర్మ యత్క్రియతే ప్రోక్తం పరోక్షం న ప్రకాశతే ॥ 59**

మానవుడు చేయు వేదోక్త కర్మలు పరక్షణమందె నశించునని వేదవేత్తలు పలుకుచున్నారు. అందువలన వాని ఫలభోగ మెట్లుసంభవమగును?

## శ్రీ నారద ఉవాచ

**యేనైవారభతే కర్మ తేనైవాముత్ర తత్పుమాన్ ।**
**భుఙ్క్తే హ్యవ్యవధానేన లింగేన మనసా స్వయమ్ ॥ 60**

నారదుడు పలికెను:- జీవుడు స్థూలదేహముతో చేయుసమస్త కర్మలకు మూల కారణము వాసనామయ మగు లింగదేహమే. స్థూలదేహము వినష్టమైనను లింగదేహము నాశముకాదు. ఆలింగదేహమె స్వర్గనరకాదులయందు ఫలము ననుభవించును.

**శయానమిమముత్సృజ్య శ్వసన్తం పురుషో యథా ।**
**కర్మాత్మన్యాహితం భుఙ్క్తే తాదృశేనేతరేణ వా ॥ 61**

(లింగదేహమునం దెట్లు విషయభోగములు గలుగునో, దానికి సమాధానము చెప్పబడుచున్నది). జాగ్రద్దేహాభిమానమును పరిత్యజించి స్వప్నావస్థయందు జీవుడు మనః కల్పితములగు దేవమనుష్యదేహముల యందు లేదా పశుదేహములయందు విషయముల ననుభవించును. అట్లే స్వర్గాదిలోకములయందును జీవుడు కర్మఫలానుసారముగ స్వప్న సదృశములగు దేహములను పొందును.

**మమైతే మనసా యద్యదసావహమితి బ్రువన్ ।**
**గృహ్ణీయాత్తత్పుమాన్ రాద్ధం కర్మ యేన పునర్భవః ॥ 62**

నేను బ్రాహ్మణుడను నేను క్షత్రియుడను అను దేహాత్మాభిమానము గల జీవుడు "ఈ కర్మ నాకు హితమును గలుగజేయునది" యని భావించి యే కర్మల జేయునో అవి నశించినను కర్మఫలదాత యగు ఈశ్వరునినుండి యతడు తగినకర్మఫలమును పొందును. కర్మాభిమానముచే జీవునకు పునర్జన్మ కలుగును.

**యథానుమీయతే చిత్తముభయైరిన్ద్రియేహితైః ।**
**ఏవం ప్రాగ్దేహజం కర్మ లక్ష్యతే చిత్తవృత్తిభిః ॥ 63**

జ్ఞానకర్మేంద్రియముల రెండింటిపనులద్వారా చిత్త మూహింపబడునట్లు చిత్త వృత్తి చే పూర్వదేహజము లగు కర్మములు ఊహింపబడును.

**నానుభూతం క్వచానేన దేహేనాదృష్టమశ్రుతమ్ ।**
**కదాచిదుపలభ్యేత యద్రూపం యాదృగాత్మని ॥ 64**

ఈ దేహముచే ఏవస్తువు పూర్వ మెన్నడును అనుభూతము కాలేదో, ఏ వస్తువు ఎన్నడును చూడబడలేదో, వినబడలేదో అది అప్పుడప్పుడు స్వప్నమనోరథాదులయందు స్ఫురించుచుండును.

**తేనాస్య తాదృశం రాజన్ లింగినో దేహసంభవమ్ ।**
**శ్రద్ధత్స్వాననుభూతోఽర్థో న మనః స్ప్రష్టుమర్హతి ॥ 65**

అందువలన రాజా! వాసనామయ మగు లింగదేహము నాశ్రయించిన జీవునకు అట్టియనుభూతి పూర్వదేహసంబంధమువలననె కలుగునని భావింపుము. పూర్వ మను భూతము కానిది మనస్సులో స్ఫురింపదు.

మన ఏవ మనుష్యస్య పూర్వరూపాణి శంసతి ।
భవిష్యతశ్చ భద్రం తే తథైవ న భవిష్యతః ॥ 66

రాజా! నీకు శుభమగుగాక! మనస్సే జీవుని ఉగ్రశాంతాది స్వభావముల ననుసరించి "ఇది పూర్వమునం దిట్లుండెను, పిమ్మట ఇట్లుండును లేదా ఉండదు" అని పూర్వాపర రూపములను వెల్లడించునది యైయున్నది.

అదృష్టమశ్రుతం చాత్ర క్వచిన్మనసి దృశ్యతే ।
యథా తథానుమన్తవ్యం దేశకాలక్రియాశ్రయమ్ ॥ 67

నిద్రాదోషముచే పర్వతముపై సముద్రము, పగటియందు నక్షత్రములు మున్నగు అసంభవములగు విస్మయాధులు కలుగునట్లు అప్పుడప్పుడు అదృష్టములు, అశ్రుతములు నగు విషయములుగూడ మనస్సులో ఉదయించినచో అవి దేశకాలక్రియలవలననే కలిగిన వని భావింపవలెను.

సర్వే క్రమానురోధేన మనసీంద్రియగోచరాః ।
ఆయాన్తి బహుశో యాన్తి సర్వే సమనసో జనాః ॥ 68

బహుజన్మలసంస్కారవిశిష్ట మగు మనస్సు సర్వజీవులకు ఉన్నది. శబ్దాదులైన యింద్రియభోగ్యవిషయములు పాపపుణ్యాదికర్మఫలానుసారముగ బహువిధములు. మనస్సులో సర్వవిషయములు స్ఫురించుచుండును. విస్మృతము లగుచుండును.

సత్త్వైకనిష్ఠే మనసి భగవత్పార్శ్వవర్తిని ।
తమశ్చన్ద్రమసీ వేదముపరజ్యావభాసతే ॥ 69

శుద్ధసత్త్వైకనిష్ఠము, భగవద్ధ్యానపరము నగు చిత్తమునందు ఈ పరిదృశ్యమాన మగు జగత్తు ప్రకాశమును పొందును. అనగా భగవానుడు సమగ్రవిశ్వమును దర్శించునట్లు భగవదిచ్ఛచే ఆయన భక్తులుగూడ సమగ్ర విశ్వమును దర్శింతురు. అట్టి ప్రతీతి సార్వకాలికము కాకపోయినను గ్రహణకాములమున చంద్రునితో రాహువు గలియునట్లు అప్పుడప్పుడు కలుగును.

౭౦ నాహం మమేతి భావోఽయం పురుషే వ్యవధీయతే ।
యావద్బుద్ధిమనోఽక్షార్థగుణవ్యూహో హ్యనాదిమాన్ ॥ 70

బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, విషయములు (పంచతన్మాత్రలు), గుణములు అనువానియొక్క పరిణామ మగు లింగదేహ మున్నంతవఱకు జీవునకు "నేను, నాది" యను స్థూల దేహసంబంధభావము తొలగదు.

సుప్తిమూర్ఛోపతాపేషు ప్రాణాయనవిఘాతతః ।
నేహతేఽ హమితి జ్ఞానం మృత్యుప్రజ్వారయోరపి ॥ 71

నిద్ర, మూర్ఛ, ఉపతాపము అనగా ఆత్యంతికక్లేశము, మృత్యుకాలము, ప్రబలజ్వరావస్థ యనువానియందు జీవునిజ్ఞానము మిగుల సంకుచిత మగును. అప్పుడు ఈ దేహమే నే నను జ్ఞానము స్ఫురింపదు.

గర్భే బాల్యేఽ ప్యపౌష్కల్యాదేకాదశవిధం తదా ।
లిఙ్గం న దృశ్యతే యూనః కుహ్వాం చన్ద్రమసో యథా ॥ 72

యువకునకు పదునొకం డింద్రియములద్వారా లింగదేహము వ్యక్తమగునట్లు గర్భబాల్యావస్థలయం దట్టి యింద్రియవర్గము అమావాస్యయందలి చంద్రకళవలె అసంపూర్ణముగ ఉండును. అందువలన అట్టిభావము వెల్లడికాదు.

అర్థే హ్యవిద్యమానేఽ పి సంసృతిర్న నివర్తతే ।
ధ్యాయతో విషయానస్య స్వప్నే అనర్థాగమో యథా ॥ 73

(లింగశరీరమునందు) విషయములను ధ్యానించుపురుషునకు స్వప్నావస్థయందు విషయాదులు లేకపోయినను విషయగ్రహణరూప మగుఅనర్థముకలుగును, అట్లే లింగ దేహము లేకపోయినను (దాని సంకోచావస్థయందును) జీవునకు సంసారము నుండి ముక్తికలుగదు (సంసారరూప మగుఅనర్థ ముండును).

ఏవం పంచవిధం లిఙ్గం త్రివృత్ షోడశవిస్తృతమ్ ।
ఏష చేతనయా యుక్తో జీవ ఇత్యభిధీయతే ॥ 74

పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియములు అనుపదునాఱు వికారములచే విస్తృతము, త్రిగుణాత్మకము నగు లింగదేహము చైతన్యముతో గూడియున్నచో దానిని జీవుడందురు.

అనేన పురుషో దేహానుపాదత్తే విముంచతి ।
హర్షం శోకం భయం దుఃఖం సుఖం చానేన విన్దతి ॥ 75

ఈ లింగదేహముచేతనే దేహి స్థూలదేహములను గ్రహించును, పరిత్యజించును. దీనివలననే (స్థూలదేహమువలననె) హర్షము, శోకము, భయము, దుఃఖము, సుఖము మున్నగువానిని పొందును.

## శ్రీ మైత్రేయ ఉవాచ

భాగవతముఖ్యో భగవాన్ నారదో హంసయోర్గతిమ్ ।
ప్రదర్శ్య నృపమామన్త్ర్య సిద్ధలోకం తతోఽగమత్ ॥ 80

మైత్రేయుడు పలికెను :- విదురా! మహాభాగవతు డగునారదుడు ఇట్లు జీవుని యొక్క జీవేశ్వరునియొక్క స్వరూపము నుపదేశించి రాజుకడ సెలవుతీసికొని సిద్ధలోకము నకు వెడలెను.

ప్రాచీనబర్హీ రాజర్షిః ప్రజాసర్గాభిరక్షణే ।
ఆదిశ్య పుత్రానగమత్తపసే కపిలాశ్రమమ్ ॥ 81

రాజర్షి యగుప్రాచీనబర్హియు ప్రజాసృష్టిని కాపాడవలసినదిగా తనపుత్రులకు చెప్పు డని మంత్రులతో చెప్పి తపస్సుకొఱకై కపిలాశ్రమమునకు వెడలెను.

తత్రైకాగ్రమనా ధీరో గోవిన్దచరణాంబుజమ్ ।
విముక్తసంగోఽనుభజన్ భక్త్యా తత్సామ్యతామగాత్ ॥ 82

ప్రాచీనబర్హి కపిలాశ్రమమున జితేంద్రియుడై సర్వదుస్సంగములను బరిత్యజించి ఏకాగ్రచిత్తముతో భక్తితో భగవానుని పాదపద్మములను అనుక్షణము భజించుచు భగవత్సారూప్యమును పొందెను.

ఏతదధ్యాత్మపారోక్ష్యం గీతం దేవర్షిణానఘ ।
యః శ్రావయేద్యః శృణుయాత్సలింగేన విముచ్యతే ॥ 83

విదురా! దేవర్షి యగునారదుడు ఉపాఖ్యానము వెపముతో ఏయాత్మతత్త్వమును కీర్తించెనో, దాని నెవరు విందురో లేదా మఱియొకనికి వినిపింతురో వారిరువురు సంసార మూలమున వాసనామయ మగు లింగదేహమునుండి ముక్తులగుదురు.

ఏతన్ముకున్దయశసా భువనం పునానం
దేవర్షి వర్యముఖనిస్సృతమాత్మశౌచమ్ ।
యః కీర్త్య మానమధిగచ్ఛతి పారమేష్ఠ్యం
నాస్మిన్ భవే భ్రమతి ముక్తసమస్తబన్ధః ॥ 84

దేవర్షి యగు నారదునిముఖమునుండి బయల్వెడలిన ఈయుపాఖ్యానము ముకుందునియశస్సుచే పరిపూర్ణమైనది. అందువలన ఇది త్రిభువనములను పవిత్రము చేయును. ఇది చిత్తసంశోధకము, పరమాత్మ పదప్రాపకము. దీనిని గీర్తించినవాడు సర్వ బంధనములనుండి ముక్తుడగును. ఇక అత డీసంసారములోనికి రాడు.

**అధ్యాత్మపారోక్ష్యమిదం మయాధిగతమద్భుతమ్ ।**
**ఏవం స్త్రియాశ్రయః పుంసశ్ఛిన్నోఽముత్ర చ సంశయః ॥ 85**

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే ప్రాచీనబర్హిర్నారద సంవాదో
నామ ఏకోనత్రింశోఽధ్యాయః॥

అతిచమత్కారము, ఉపాఖ్యానపుమిషతో వర్ణితము నగు ఈయధ్యాత్మతత్త్వోప దేశమును గురుకృపవలన నేను పొందితిని. దీనిచే స్త్రీ బుద్ధి యుక్తుడగు మానవుని అహంకారము నశించును. స్వర్గాదిలోకములయందు కర్మఫలభోగము కలుగు నను సందేహముగూడ తొలగును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థస్కంధములో
ప్రాచీన బర్హిర్నారద సంవాద మను ఇరువదితొమ్మిదవ
అధ్యాయము సమాప్తము.



29వ అధ్యాయములోని 45వ శ్లోకమునకు పిమ్మట పదరత్నావళి టీకయందు శ్రీమన్మధ్వాచార్యానుయాయులైన శ్రీమద్విజయధ్వజతీర్థ డీరెండుశ్లోకములను అధిక పాఠములుగా చెప్పియున్నాడు.

**సర్వేషామేవ జన్తూనాం సతతం దేహపోషణే ।**
**అస్తి ప్రజ్ఞా సమాయత్తా కో విశేషస్తదా నృణామ్ ॥ 1**

సర్వజంతువులకు నెల్లపుడు తమదేహములను పోషించుకొను ప్రయత్నముండును. హరివిముఖు లగు మనుష్యులకు ఆజంతువులకు నీ విషయములో భేద మేమియున్నది?

**లబ్ధ్వేహాన్తే మనుష్యత్వం హిత్వా దేహాద్యసద్గ్రహమ్ ।**
**ఆత్మసృత్యా విహాయేదం జీవాత్మా స విశిష్యతే ॥ 2**

బహుజన్మలపిమ్మట పరమార్థసాధక మగు మానవజన్మను పొంది యేమానవు డీ స్థూలలింగదేహమువందు "నేను, నాది" యను వ్యర్థమైన పట్టుదలను విడచునో అతడు ఆత్మజ్ఞాన ప్రభావముచే ఆ దేహమును పరిత్యజించి బ్రహ్మముకంటె పృథగ్భావమున నుండును.

4-29, 79 శ్లోకములక్రిమ్మట పదరత్నావళీటీకయందు శ్రీమద్విజయధ్వజుడు అధిక పాఠములుగ నీరెండుశ్లోకములను ఉదహరించినాడు :-

భక్తిః కృష్ణే దయా జీవేష్వకుంఠజ్ఞానమాత్మని ।
యదిస్యాదాత్మనో భూయాదపవర్గస్తు సంసృతేః ॥ 1

జీవునకు కృష్ణునియందు భక్తి, జీవునియందు దయ, ఆత్మతత్త్వ జ్ఞానము అనగా స్వస్వరూపోపలబ్ధి కలిగినచో దానివలన అతడు సంసారమునుండి ముక్తుడగును.

అదృష్టం దృష్టవన్నఙ్క్ష్యేద్భూతం స్వప్నవదన్యథా ।
భూతం భవద్భవిష్యచ్చ సుప్తం సర్వరహో రహః ॥ 2

అదృష్టము అనగా స్వర్గాదిసుఖములుగూడ దృష్టములు అనగా లౌకిక సుఖమువలె నశ్వరములు, స్వప్నమువలె అనిత్యములు. ఈ జగత్తులో ఉత్పన్నమైనది, కాబోవునది, అగు చున్నది సర్వము స్వప్నసదృశమే. ఇదియె సర్వశాస్త్రములలోని దృఢరహస్యము.





# ముప్పదియవ అధ్యాయము

## ప్రచేతసులకు విష్ణుభగవానుడు వరముల నిచ్చుట

కథాసారము :- ఈ యధ్యాయమున భగవానుని వలన వరములను పొందినపిమ్మట ప్రచేతసులు గృహమునకు తిరిగి వెడలుట, వృక్ష ప్రదత్త యగుకన్యను పాణిగ్రహణము చేసికొనుట, రాజ్యపాలనము చేయుట యనువిషయములు వర్ణింపబడినవి.

ప్రచేతసులు సముద్రగర్భమున రుద్రగీతముచేత, తపస్సుచేత శ్రీహరి భగవానునకు సంతోషమును గలుగజేసిరి. గరుడవాహను డగుభగవానుడు వారికి వరముల నిచ్చి, ప్రజాసృష్టికై "ప్రమ్లోచ" యను అప్సరసవలన గలిగిన "మారిష" యను కన్యను పాణిగ్రహణము చేసికొనవలసినదిగా ఆదేశించెను. భగవదాదేశమును పాలించి వారు భగవానునియందవిచలమగు భక్తి గలవారైరి. భగవానుని యాదేశమును పాలించుట యనుభగవదర్పితకర్మ యెప్పుడును బంధనములకు గారణము కాదు. శ్రవణకీర్తనకారి యగుభగవద్భక్తుని హృదయమున భగవానుడు స్వయముగ ఆవిర్భవించును. దానివలన శోకమోహాదులు వారిని బాధింపవు.

పిమ్మట ప్రచేతసులు విశుద్ధసత్త్వుడు, పరమానందమయుడు, సర్వాంతర్యామియు, పరమపురుషుడు అగువాసుదేవుని స్తుతించి "కృష్ణేంద్రియప్రీతి" యనువరమును ప్రార్థించెను. పారిజాతవృక్షము సులభముగ లభించినచో సారగ్రాహియగు మధుకరము మఱియొక వృక్షమును సేవింపనట్లు ప్రచేతసులుగూడ భగవానునిపాదపద్మములకంటె నితరమైన దానిని కోరలేదు. భగవద్భక్తులతోడిసాంగత్య మల్పకాలమైనను జీవున కంతులేని శుభమును గలుగజేయును. దానితో స్వర్గమోక్షములుగూడ సాటిరావు. భగవద్భక్తుల ముఖనిస్సృతమైన శుద్ధకీర్తనశ్రవణములవలన జీవుని భోగపిపాస శాంతించును. త్యాగుల కేకైకగతి భగవానుడే. వైష్ణవశ్రేష్ఠు డగుశంభువు మున్నగు ఆయన భక్తులె భవరోగమున కేకమాత్రచికిత్సకు లని భావించి ప్రచేతసులు భగవద్భక్తసాంగత్య మనువరమును గోరిరి. పిమ్మట మైత్రేయుడు విదురునకు ప్రచేతసులక్రోధాగ్నిచే వృక్షములు దగ్ధములగుట, "మారిష" యనుకన్యను వారు వివాహమాడుట, శివాపరాధమువలన దక్షుడు మారిషకు జన్మించుట మున్నగు విషయములను చెప్పెను.

### శ్రీ విదుర ఉవాచ

**యే త్వయాభిహితా బ్రహ్మన్ సుతాః ప్రాచీనబర్హిషః ।**
**తే రుద్రగీతేన హరిం సిద్ధిమాపుః ప్రతోష్య కామ్ ॥** 1

విదురుడు పలికెను :- మహాత్మా! నీవు ప్రాచీనబర్హి కుమారుల కథను వెనుక చెప్పితివి. వారు 'రుద్రగీత' మను స్తోత్రముద్వారా శ్రీహరిని సంతుష్టిపఱచి యెట్టి ప్రయోజనమును పొందిరి?

కిం బార్హస్పత్యేహ పరత్ర వాథ
కైవల్యనాథప్రియపార్శ్వవర్తిన: ।
ఆసాద్య దేవం గిరిశం యదృచ్ఛయా
ప్రాపు: పరం నూనమథ ప్రచేతస: ॥ 2

బృహస్పతి శిష్యుడ వగు నుద్ధవా! ఆ ప్రచేతసులు స్వేచ్ఛగ దేవాదిదేవుడగు శ్రీరుద్రుని పొంది ముకుందప్రియుడగు గిరీశుని యనుగ్రహ భాజనరూపముతో నిశ్చయముగ పరమపదమును పొందిరి. కాని దీనికి పూర్వము వా రీ లోకమున లేదా పరలోకమున నెట్టిఫలమును పొందిరో దానిని వివరింపుము.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ప్రచేతసోఽ న్తరుదధౌ పితురాదేశకారిణ: ।
జపయజ్ఞేన తపసా పురంజనమతోషయన్ ॥ 3

మైత్రేయుడు పలికెను :- ప్రచేతసులు తండ్రియాజ్ఞానుసారము ప్రజాసృష్టి చేయు కోరికతో సముద్రగర్భమున రుద్రగీతజప మను యజ్ఞము ద్వారా, తపస్సుద్వారా శ్రీహరిని సంతుష్టిపఱచిరి.

దశవర్షసహస్రాంతే పురుషస్తు సనాతన: ।
తేషామావిరభూత్కృచ్ఛ్రం శాన్తేన శమయన్ రుచా ॥ 4

ప్రశాంత మగు తన కాంతిద్వారా ప్రచేతసుల తప:క్లేశమును పోగొట్టి సనాతనుడగు విష్ణుభగవానుడు పదివేలసంవత్సరములపిమ్మట వారికి ప్రత్యక్షమయ్యెను.

సుపర్ణస్కన్ధమారూఢో మేరుశృంగమివాంబుద: ।
పీతవాసా మణిగ్రీవ: కుర్వన్ వితిమిరా దిశ: ॥ 5

కాశిష్ణునా కనకవర్ణ విభూషణేన
భ్రాజత్కపోలవదనో విలసత్కిరీట: ।
అష్టాయుధైరనుచరైర్మునిభి: సురేన్ద్రై -
రాసేవితో గరుడకిన్నరగీతకీర్తి: ॥ 6

పీనాయతాష్టభుజమండలమధ్యలక్ష్మ్యా
స్పర్ధత్ శ్రియా పరివృతో వనమాలయాద్య: ।
బర్హిష్మత: పురుష ఆహ సుతాన్ ప్రపన్నాన్
పర్జన్యనాదరుతయా సఘృణావలోక: ॥ 7

వెంటనే ఆయన గరుడవాహనారూఢుడై సుమేరుశిఖరమునందున్న జలధరమువలె శోభిల్లుచుండెను. ఆయన కటిప్రదేశమున పీతవసనమును, కంఠమున కౌస్తుభమణిని ధరించియుండెను. ఈ స్వప్రకాశపురుషుని అవయవకాంతి దశదిశలయందలి యంధకారమును పోగొట్టి దిగ్దిగంతములను ప్రకాశింపజేయుచుండెను. ఆయన కర్ణములయందు సముజ్జ్వలములగు స్వర్ణభూషణములు ప్రకాశించుచుండెను. వానిద్వారా కపోలములు, ముఖము దీప్తిమంతములైయుండెను. శిరస్సున కిరీటశోభ విస్తరించుచుండెను. అష్టవిధములగు అస్త్రములు, అనుచరులు, మునులు, సురేంద్రులు సంపూర్ణముగ ఆయనను సేవించుచుండిరి. గరుడుడు స్వయముగ కిన్నరస్వరూపుడై ఱెక్కలచప్పుడులద్వారా ఆయనకీర్తిని గానముచేయుచుండెను. ఆయన కంఠదేశమున వనమాల వ్రేలాడుచుండెను. అది స్థూలము, ఆయతము అనగా ఆజానులంబితమై అష్టభుజములనడుమ నున్న లక్ష్మియొక్క శోభను తిరస్కరించుచుండెను. ఇట్టి వనమాలద్వారా విభూషితుడై కరుణావలోకనవిశిష్టుడు, ఆద్యుడునగు శ్రీహరి శరణాగతులగు ప్రాచీనబర్హి పుత్రులతో జలదగంభీరస్వరమున నిట్లుపలుకసాగెను.

## శ్రీ భగవానువాచ

**వరం వృణీధ్వం భద్రం వో యూయం మే నృపనన్దనాః ।**
**సౌహార్దేనాపృథగ్ధర్మాస్తుష్టోఽహం సౌహృదేన వః ॥ 8**

భగవానుడు పలికెను :- రాజకుమారులారా! మీరు పరస్పరము సౌహార్దకారణమున ఏకధర్మవిశిష్టులైయున్నారు, నేను మీ సౌహార్దమును జూచి సంతుష్టుడనైతిని. మీకు శుభమగుగాక! వరము నడుగుడు.

**యోఽనుస్మరతి సన్ధ్యాయాం యుష్మాననుదినం నరః ।**
**తస్య భ్రాతృష్వాత్మసామ్యం తథా భూతేషు సౌహృదమ్ ॥ 9**

ప్రతిదినము సంధ్యాకాలమున మిమ్ము స్మరించు మానవుడు సోదరులను, సర్వప్రాణులను తనతో సమానులుగ భావించును. వారిపై ప్రేమ గలిగియుండును.

**యే తు మాం రుద్రగీతేన సాయం ప్రాతః సమాహితాః ।**
**స్తువన్త్యహం కామవరాన్ దాస్యే ప్రజ్ఞాం చ శోభనామ్ ॥ 10**

ఏకాగ్రచిత్తముతో సాయంప్రాతఃకాలములయందు రుద్రగీతముచే నన్ను స్తుతించువారికి నేను వారభిలషించినవరములను, వారుద్ధరింపబడుటకుపయోగపడు ప్రజ్ఞను, బుద్ధిని ఇవ్వగలను.

**యద్యూయం పితురాదేశమగ్రహీష్ట ముదాన్వితాః ।**
**అథో వ ఉశతీ కీర్తిర్లోకాననుభవిష్యతి ॥ 11**

మీరు హర్షయుక్తచిత్తముతో పితృాజ్ఞను పరిపాలించితిరి. ఆకారణమున మీ కమనీయ మగు కీర్తి సర్వలోకములయందు చక్కగ వ్యాప్తమగును.

భవితా విశ్రుతః పుత్రోఽనవమో బ్రహ్మణో గుణైః ।
య ఏతామాత్మవీర్యేణ త్రిలోకీం పూరయిష్యతి ॥ 12

మీ కొకపుత్రుడు కలుగును. ఆపుత్రుడు గుణములయందు బ్రహ్మకంటె ఏయంశలో గూడ తక్కువగ నుండడు. అందువలన ఆ పుత్రుడు జగత్తులో విశేషముగ ప్రఖ్యాతి నొందును. అతని యాత్మవీర్యము (సంతానము) చే మూడులోకములు నిండిపోగలవు.

కణ్డోః ప్రమ్లోచయా లబ్ధా కన్యా కమలలోచనా ।
తాం చాపవిద్ధాం జగృహుర్భూరుహా నృపనన్దనాః ॥ 13

రాజకుమారులారా! ప్రమ్లోచ యను అప్సరస కండుఋషివలన కమలనయన యగు ఒకపుత్రికను గని యామెను వృక్షములయందు పరిత్యజించి వెడలిపోయెను. వృక్షములా పరిత్యక్తయైన కన్యను గ్రహించినవి.

క్షుత్క్షామయా ముఖే రాజా సోమః పీయూషవర్షిణీమ్ ।
దేశినీం రోదమానాయా నిదధే స దయాన్వితః ॥ 14

అనంతర మా బాలిక ఆకలిచే పీడితయై యేడ్వసాగెను. అపుడు వనస్పతుల కధిపతి యగు చంద్రుడు దయగలవాడై యామెనోటియందు అమృతవర్షిణి యగు చూపుడు వ్రేలి నుంచి యాకన్యను పెంచసాగెను.

ప్రజావిసర్గ ఆదిష్టాః పిత్రా మామనువర్తతా ।
తత్ర కన్యాం వరారోహాం తాముద్వహత మా చిరమ్ ॥ 15

నాయాజ్ఞ ననుసరించు మీతండ్రి యగు ప్రాచీనబర్హి మిమ్ము ప్రజాసృష్టివిషయమున ఆదేశించెను. అందువలన ఆయుద్దేశ్యమును సాధించుటకై శీఘ్రముగ ఆవరాంగనను పరిణయమాడుడు.

అపృథగ్ధర్మశీలానాం సర్వేషాం వః సుమధ్యమా ।
అపృథగ్ధర్మశీలేయం భూయాత్పత్న్యర్పితాశయా ॥ 16

మీ సోదరులలో నందఱు ఒకేధర్మము, శీలము గల్గవారు. ఈ కన్య కూడ మీకు మనస్సు నర్పించినది. అందువలన ధర్మమునందును, నడవడియందును మీ కనురూప యైన యీ సుందరి మీకు భార్య యగుగాక!

దివ్యవర్ష సహస్రాణాం సహస్రమహతౌజసః ।
భౌమాన్ భోక్ష్యథ భోగాన్ వై దివ్యాంశ్చానుగ్రహాన్మమ ॥ 17

మీరు నాయనుగ్రహముచే సహస్రదివ్యవర్షములు అప్రతిహత మగు ప్రభావసంపన్నులై పార్థివములు దివ్యములు నగు భోగముల ననుభవింతురు.

అథ మయ్యనపాయిన్యా భక్త్యా పక్వగుణాశయాః ।
ఉపయాస్యథ మద్ధామ నిర్విద్య నిరయాదతః ॥ 18

పిమ్మట నాయందలి అవ్యభిచారిణి యగు భక్తి యొక్క ప్రభావముచే మీ చిత్తము లోని కామాదిమాలిన్యములు దగ్ధములగును. అప్పుడు మీరు స్వర్గమర్త్యలోక భోగరూప నరకమునుండి నివృత్తులై నా నిత్యధామమునకు వెడలుదురు.

గృహేష్వావిశతాం చాపి పుంసాం కుశలకర్మణామ్ ।
మద్వార్తా యాతయామానాం న బన్ధాయ గృహా మతాః ॥ 19

కుశలకర్ములు అనగా నేనే (భగవంతుడె) సర్వకర్మల కేకైకఫల భోక్త అని భావించి నాకు సమస్తకర్మఫలముల నర్పించువారు, నా ప్రసంగములచే కాలము గడుపువారు నగు మానవులు గృహస్థాశ్రమమం దున్నప్పటికిని గృహము వారి బంధనమునకు గారణముకాదు.

చ॥ *అరయ గృహస్థులయ్యును మదర్పితకర్ములు నస్మదీయసుం*
*దరచరితామృతశ్రవణతత్పరమానసయాతయాములున్*
*సరసగుణాఢ్యులై తనరు సాధుల కీగృహముల్ దలంపదు*
*ష్కరభవబంధ హేతువులు గావు నృపాత్మజులార యెన్నఁడున్.* (4-912)

నవ్యవద్ధృదయే యజ్జ్ఞో బ్రహ్మైతద్బ్రహ్మవాదిభిః ।
న ముహ్యన్తి న శోచన్తి న హృష్యన్తి యతో గతాః ॥ 20

ఏలయన, నాకథలను శ్రవణముచేయు పురుషులహృదయముల యందు ప్రతి పదములోను నవనవాయమానరూపముతోనేను ఆవిర్భవింతును. నా యీ స్వరూపమును బ్రహ్మవాదులు బ్రహ్మమని చెప్పుచుందురు. నన్ను పొందినచో మానవులు శోక మోహ హర్షములచే అభిభూతులు కారు.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఏవం బ్రువాణం పురుషార్థభాజనం
జనార్దనం ప్రాంజలయః ప్రచేతసః ।
తద్దర్శనధ్వస్తతమోరజోమలా
గిరా గృణన్ గద్గదయా సుహృత్తమమ్ ॥ 21

మైత్రేయుడు పలికెను :- భగవాను డిట్లు పలుకగా, పురుషార్థ ప్రదాతయు పరమహిత కారియు నగుజనార్దనునకు దోసి లొగ్గి ప్రచేతసులు గద్గదస్వరముతో ఆయనను స్తుతింపసాగిరి. భగవద్దర్శనప్రభావముచే పూర్వమే ఆప్రచేతసులరజస్త మోగుణములు తొలగెను.

## శ్రీ ప్రచేతస ఊచుః

నమో నమః క్లేశవినాశనాయ
నిరూపితో దారగుణాహ్వయాయ ।
మనోవచోవేగపురోజవాయ
సర్వాక్షమార్గైరగతాధ్వనే నమః ॥ 22

ప్రచేతసులు పలికిరి :- దేవా! సర్వక్లేశములను తొలగించువాడవు నీవే. నీయుదార గుణములు, నామములు మంగళదాయకము లని నిరూపింపబడినవి. ప్రాకృతేంద్రియము లచే నీమార్గమును తెలిసికొనుటకు వీలుపడదు. అట్టినీకు మేము మాటిమాటికి నమస్కరించు చున్నాము.

శుద్ధాయ శాన్తాయ నమః స్వనిష్ఠయా
మనస్యపార్థం విలసద్ద్వయాయ ।
నమో జగత్ స్థానలయోదయేషు
గృహీతమాయాగుణవిగ్రహాయ ॥ 23

నీ యం దేకాంతనిష్ఠ గలిగినచో వివిధభోగసుఖములకు నిలయమైన ద్వైతము అనగా ప్రపంచము నిరర్థకమైనదిగ తోచును. నీ వట్టివిశుద్ధ సత్త్వస్వరూపపరమానంద విగ్రహుడవు. నీవు జగత్తు యొక్క సృష్టిస్థితిలయములకు గారణమైన (బహిరంగశక్తి వైభవముచే) మాయిక గుణముల నంగీకరించి బ్రహ్మాదిమూర్తులుగా వెల్లడియైతివి. అట్టినీకు మాటి మాటికి నమస్కారము.

నమో విశుద్ధసత్త్వాయ హరయే హరిమేధసే
వాసుదేవాయ కృష్ణాయ ప్రభవే సర్వసాత్వతామ్ ॥ 24

నీవు విశుద్ధసత్త్వస్వరూపుడవు. విష్ణుదేవా! నిన్ను దెలిసికొన జాలినచో జీవునకు సంసారనివృత్తి కలుగును. వాసుదేవుడవు, శ్రీకృష్ణుడవు, సమస్తభక్తులకు యాదవులకు పాలకుడవు నగు నీకు నమస్కారము.

నమః కమలనాభాయ నమః కమలమాలినే ।
నమః కమలపాదాయ నమస్తే కమలేక్షణే ॥ 25

కమలము నాభియందుగలవాడవు, కమలములు మాలగా గలవాడవు, కమలముల వంటి పాదములు గలవాడవు, కమలములవంటి నేత్రములు గలవాడవు నగునీకు నమస్కారము.

నమః కమలకింజల్కపిశంగామలవాససే ।
సర్వభూతనివాసాయ నమోఽ యుఙ్క్ష్మ హి సాక్షిణే ॥ 26

కమలమునందలి కేసరములవలె నిర్మలము పచ్చనివర్ణము గలవస్త్రమును ధరించిన వాడవు, సర్వప్రాణుల కాధారస్వరూపుడవు, సర్వసాక్షివి యగునీకు నమస్కరించు చున్నాము.

ఉ॥ *తోయరుహోదరాయ భవదుఃఖహరాయ నమో నమః పరే*
*శాయ సరోజకేసరపిశఙ్గవినిర్మలదివ్యభర్మవ*
*స్త్రాయ పయోజసన్నిభపదాయ సరోరుహమాలికాయ కృ*
*ష్ణాయ పరాపరాయ సుగుణాయ సురారిహరాయ వేధసే.* (4-920)

రూపం భగవతాత్వేతదశేషక్లేశసంక్షయమ్ ।
ఆవిష్కృతం నః క్లిష్టానాం కిమన్యదనుకంపితమ్ ॥ 27

అవిద్య, అస్మితము మున్నగు క్లేశములచే పీడితుల మగు మాక్లేశముల నన్నింటిని నాశనముజేయుటకు నీ వీయశేషక్లేశసంక్షయకరమూర్తిని ప్రకటించితివి. ఇంతకంటె నెక్కువ కృప మాపై నింకేమి యుండును?

ఏతావత్త్వం హి విభుభిర్భావ్యం దీనేషు వత్సలైః ।
యదనుస్మర్యతే కాలే స్వబుద్ధ్యాభద్రరన్ధన ॥ 28

అమంగళములను నాశముచేయువాడా! దీనులపై దయజూపుట యందు సమర్థు లగుపురుషులు ఆయాసమయములయందు ఆ దీనజనులను "వీరు మావా"రనిస్మరించుట వారికి భావ్యమైయున్నది.

ఉ॥ *భూరిశివేతరాపహవిభూతిసమేత మహాత్మ దీనర*
*క్షారతి నొప్పనీవు చిరకాలమునన్ సుఖవృత్తి వీరు మా*
*వార లటంచు బుద్ధి ననవద్య తలంచినయంతమాత్ర స*
*త్కారమె చాలు నట్లగుట గా కిటు సన్నిధి వైతి వీశ్వరా* (4-923)

యేనోపశాన్తిర్భూతానాం క్షుల్లకానామపీహతామ్ ।
అన్తర్హితోఽ న్తర్హృదయే కస్మాన్నో వేద నాశిషః ॥ 29

ఏలయన, యజమాని యిట్లు భృత్యులను స్మరించినచో దానిద్వారా ఆసర్వప్రాణుల క్లేశములు నివృత్తి యగును. నీ వతిక్షుద్రులు, తుచ్ఛులు నగుజీవులయంతఃకరణముల యందు అంతర్యామిరూపముతో నుండి వారు కోరు విషయములను తెలిసికొనుచుందువు. ఇక మేము కోరువిషయములను తెలిసికొనకుండగ నెట్లుండగలవు?

అసావేవ వరోఽస్మాకమీప్సితో జగతః పతే ।
ప్రసన్నో భగవాన్ యేషామపవర్గగురుర్గతిః ॥ 30

జగత్పతీ! భక్తియోగపథప్రదర్శకునకు, జీవునకు పరమపురుషార్థమ వగు నీవు మాకు ప్రసన్నుడవైతివి. అందువలన మాయభీష్టవరములు నీయనుగ్రహమువలనకాక మఱి దేని వలనను నెఱవేరవు.

వరం వృణీమహేఽథాపి నాథ త్వత్పరతః పరాత్ ।
న హ్యన్తో యద్విభూతీనాం సోఽనన్త ఇతి గీయసే ॥ 31

నాథా! అయినను సర్వకారణములకు కారణుడవు, పరాత్పరపురుషుడవు నగు నిన్ను మే మొక్కవరమును కోరుచున్నాము. ఏలయన, నీవిభూతి కంతము లేకపోవుటచే నీవు 'అనంతుడ' వని కీర్తింపబడుచున్నావు.

పారిజాతేఽఞ్జసా లబ్ధే సారఙ్గోఽన్యన్న సేవతే ।
త్వదఙ్ఘ్రిమూలమాసాద్య సాక్షాత్కిం కిం వృణీమహి ॥ 32

ప్రభూ! అనాయాసముగ పారిజాతము లభించినచో మకరందమును మాత్రము గ్రహించుమధుకరము (సులభమైనను) మఱియొకవృక్షమును సేవింపదు. అట్లే సాక్షాత్తుగ నీపాదమూలమును పొంది మేముగూడ నీపాద పద్మమకరందమును దప్ప మఱిదేనిని గూడ ప్రార్థింపము (కోరము).

*చ॥ పూని భవత్పదాంబురుహమూలనివాసుల మైనమేము మే*
*ధానిధి నీవిలోకనము(దక్క(గ నన్యము( గోర నేర్తుమే*
*మానితపారిజాతకుసుమస్ఫుటనవ్యమరందలుబ్ధశో*
*భానయశాలి యైనమధుపంబు భజించునె యన్యపుష్పముల్* (4-927)

యావత్తే మాయయా స్పృష్టా భ్రమామ ఇహ కర్మభిః ।
తావద్భవత్ప్రసఙ్గానాం సఙ్గః స్యాన్నో భవే భవే ॥ 33

నీమాయామోహితులమై మేము మాకర్మల ననుసరించి సంసారమున ఎంతవఱకు సంచరించుదుమో యంతవఱకు మాకు జన్మజన్మలలోను నీగుణములను కీర్తించు భగవద్భక్తులసాంగత్యము లభించుగాక!

తులయామ లవేనాపి న స్వర్గం నాపునర్భవమ్ ।
భగవత్సఙ్గిసఙ్గస్య మర్త్యానాం కిముతాశిషః ॥ 34

భగవద్భక్తులతోడిసాంగత్యము కొలదికాలమైనను అది జీవున కంతులేని శుభము లను కలుగజేయును. దానితో స్వర్గముగాని, చివరకు మోక్షముగాని సాటిరావు. మరణ ధర్మశీలు రగు ప్రాకృతమానవులరాజ్యభోగాదిసుఖముల విషయ మికచెప్పనదేమి?

యత్రేడ్యన్తే కథా మృష్టాస్తృష్ణాయాః ప్రశమో యతః ।
నిర్వైరం యత్ర భూతేషు నో ద్వేగో యత్ర కశ్చన ॥ 35
యత్ర నారాయణః సాక్షాద్భగవాన్ న్యాసినాం గతిః ।
ప్రస్తూయతే సత్కథాసు ముక్తసఙ్గైః పునః పునః ॥ 36

భగవద్భక్తుల సమాజమున నీ విశుద్ధమగు కథ కీర్తింపబడును. ఆ కథను వినినచో భోగేచ్ఛ యను తృష్ణ శాంతించును. దానివలన ఏప్రాణిపట్లను వైరభావముగాని, ఉద్వేగము గాని కలుగదు. ముక్తసంగులు అనగా నిరపేక్షులగు సాధువు లా స్థానమున సత్కథా ప్రసంగములచే సాక్షాత్తుగ నారాయణుని మాటిమాటికి కీర్తించుచుందురు. ఆయనయె సర్వఫలత్యాగుల కేకైక మగుగతి యైయున్నాడు.

తేషాం విచరతాం పద్భ్యాం తీర్థానాం పావనేచ్ఛయా ।
భీతస్య కిం న రోచేత తావకానాం సమాగమః ॥ 37

దేవా! ఆ నీ భక్తులు తీర్థములను గూడ పవిత్రము చేయుటకై పాదములతో దిరుగు చుందురు. అందువలన సంసారభీతుడగు నేవ్యక్తి వారి సాంగత్యమున అభిరుచిని వెల్లడింపడు?

వయన్తు సాక్షాద్భగవన్ భవస్య
ప్రియస్య సఖ్యుః క్షణసంగమేన ।
సుదుశ్చికిత్స్యస్య భవస్య మృత్యో
ర్భిషక్తమం త్వాద్య గతిం గతాః స్మ ॥ 38

దేవా! నీకు ప్రియతము డగు శంభువుతోడి క్షణకాల మాత్రసాంగత్యప్రభావముచే చికిత్సచేయుటకు అలవికాని సంసారమునకు, జననమరణరూప మగు రోగములకు సద్వైద్యస్వరూపుడ వగు నిన్ను నేడు మేము పరమాశ్రయరూపమున పొందితిమి.

యన్నః స్వధీతం గురవః ప్రసాదితా
విప్రాశ్చ వృద్ధాశ్చ సదానువృత్త్యా ।
ఆర్యా నతాః సుహృదో భ్రాతరశ్చ
సర్వాణి భూతాన్యనసూయయైవ ॥ 39

యన్నః సుతప్తం తప ఏతదీశ
నిరన్ధసాం కాలమదభ్రమప్సు ।
సర్వం తదేతత్పురుషస్య భూమ్నో
వృణీమహే తే పరితోషణాయ ॥ 40

దేవా! మేము చక్కగ వేదముల నధ్యయనముచేసితిమి. శుద్ధమగు భావముతో గురువులకు, విప్రులకు, వృద్ధులగు పూజ్యులకు నమస్కరించితిమి. సుహృజ్జనులను, సోదరులను, ప్రాణులను హింసింపలేదు. ఆహారాదులను పరిత్యజించి జలమున బహు కాలము నివసించి ఘోరమగు తపము నొనరించితిమి. అట్టి సదాచారములచే నీకు సంతోషము కలుగుగాక! ఇదియే మేము కోరువరము.

మనుః స్వయంభూర్భగవాన్ భవశ్చ
యేఽన్యే తపోజ్ఞానవిశుద్ధసత్త్వాః ।
అదృష్టపారా అపి యన్మహిమ్నః
స్తువన్త్యథో త్వాత్మసమం గృణీమః ॥ 41

తపస్సు, జ్ఞానము మున్నగువానిద్వారా విశుద్ధచిత్తు లగు యోగులు, మనువులు, స్వయంభువుడు, శివుడు - అనువారుగూడ నీమహిమయొక్క అంతమును తెలిసికొన లేనివారై తమతమ సాధ్యము ననుసరించి నిన్ను స్తుతించిరి. అందువలన మేముగూడ తగినవిధముగ నిన్ను స్తుతించుచున్నాము.

నమస్సమాయ శుద్ధాయ పురుషాయ పరాయ చ ।
వాసుదేవాయ సత్త్వాయ తుభ్యం భగవతే నమః ॥ 42

ప్రభూ! నీకు శత్రువు మిత్రువు ఎవ్వడు లేకపోవుటవలన నీ వంతట సమానుడవై యున్నావు. నీవు శుద్ధుడవు, పరమపురుషుడవు, విశుద్ధసత్త్వమూర్తివి, భగవానుడవు, వాసుదేవుడవు. అట్టి నీకు నమస్కారము.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఇతి ప్రచేతోభిరభిష్టుతో హరిః
ప్రీతస్తథేత్యాహ శరణ్యవత్సలః
అనిచ్ఛతాం యానమతృప్త చక్షుషాం
యయౌ స్వధామానపవర్గ వీర్యః ॥ 43

మైత్రేయుడు పలికెను :- విదురా! శరణాగతపాలకుడగు శ్రీహరి యిట్లు ప్రచేతసులచే పూజితుడై సంతోషముతో "మీరు కోరినట్లే యగుగాక" యని పలికెను. పిమ్మట అకుంఠ ప్రభావముగల ఆ శ్రీహరి భగవానుడు తృప్తిచెందని నేత్రములు గల ప్రచేతసుల కిష్టము లేకపోయినను తననిలయమునకు వెడలెను.

అథ నిర్యాయ సలిలాత్ ప్రచేతస ఉదన్వతః ।
వీక్ష్యాకుప్యన్ ద్రుమైశ్ఛన్నాం గాం గాం రోద్ధు మివోచ్ఛ్రితైః ॥ 44

పిమ్మట ప్రచేతసులు సముద్రజలములనుండి బయల్వెడలి చూడగా వృక్షము లన్నియు ఉన్నతములై స్వర్గము నడ్డగించుటకు సిద్ధముగ నుండెను. ఆ వృక్షాదులద్వారా భూమండలము కప్పబడిపోయెను. ఇది చూచి వారు మిగుల క్రోధము గలవారైరి.

తతో ఽ గ్నిమారుతౌ రాజన్నాముంచన్ముఖతో రుషా ।
మహీం నిర్వీరుధం కర్తుం సంవర్తక ఇవాత్యయే ॥ 45

రాజా! ప్రళయకాలమందు రుద్రుడు తన ముఖమునుండి అగ్నిని బహిర్గతము చేయునట్లు ప్రచేతసులుగూడ మహీమండలమును తరులతాశూన్యముగ జేయు నుద్దేశ్యముతో క్రోధపూర్ణ మగుముఖమునుండి అగ్నిని, అగ్నిసఖుడగు వాయువును పరి త్యజింప నారంభించిరి.

భస్మసాత్క్రియమాణాం స్తాన్ ద్రుమాన్ వీక్ష్య పితామహః ।
ఆగతః శమయామాస పుత్రాన్ బర్హిష్మతో నయైః ॥ 46

పృథ్విపై గల సర్వవృక్షములు భస్మ మగుటచూచి పితామహుడగు బ్రహ్మ అచటికి వచ్చి ప్రచేతసులను తగువిధము లగు మాటలతో శాంతపఱచెను.

తత్రావశిష్టా యే వృక్షా భీతా దుహితరం తదా ।
ఉజ్జహ్రుస్తే ప్రచేతోభ్య ఉపదిష్టాః స్వయంభువా ॥ 47

వశింపగా మిగిలిన వృక్షములు భయపడినవై బ్రహ్మయొక్క ఉపదేశము ననుసరించి ప్రచేతసులకు తమ యాకన్య నిచ్చినవి.

తే చ బ్రహ్మణ ఆదేశాన్మారిషాముపయేమిరే ।
యస్యాం మహదవజ్ఞానాదజన్యజనయోనిజః ॥ 48

బ్రహ్మయాదేశము ననుసరించి ప్రచేతసులు వృక్షములచే నీయబడిన మారిష యను ఆకన్యను పరిణయమాడిరి. బ్రహ్మపుత్రు డగుదక్షుడు శివాపరాధముచేత మారిషకు కుమారునిగా జన్మించెను, అనగా గర్భవాసదుఃఖము ననుభవించెను.

చాక్షుషే త్వన్తరే ప్రాప్తే ప్రాక్సర్గే కాలవిద్రుతే ।
యః ససర్జ ప్రజా ఇష్టాః స దక్షో దైవచోదితః ॥ 49

చాక్షుషమన్వంతరమున పూర్వదేహము కాలవశమున నశింపగా ఈశ్వరునిచే ప్రేరితుడై తానభిలషించిన పెక్కండ్రు ప్రజలను సృష్టిచేసిన వాడు దక్షుడే. (పంచమమన్వంతరావసానమున కాలవశముచే ప్రాచీనసృష్టి నశించెను. దక్షుడు స్వాయంభువమన్వంతరమున జన్మించి ఐశ్వర్యమును పొందు నభిలాషతో పంచమమన్వంతరమువఱకు తపస్సు చేసెను. ఆఱవ మన్వంతరము అనగా చాక్షుషమన్వంతరమునందు తనకు ఫలము కలిగె నని తెలిసికొనెను.)

యో జాయమానః సర్వేషాం తేజస్తేజస్వినాం రుచా ।
స్వయోపాదత్త దాక్ష్యాచ్చ కర్మణాం దక్షమబ్రువన్ ॥ 50

తం ప్రజాసర్గరక్షాయామనాదిరభిషిచ్య చ ।
యుయోజ యుయుజేఽన్యాంశ్చ స వై సర్వ ప్రజాపతీన్ ॥ 51

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రాభాష్యే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యాం చతుర్థస్కన్ధే
ప్రచేతసాంచరితే త్రింశోఽధ్యాయః ॥

దక్షుడు జన్మించి తన ప్రభావముచే తేజస్వుల తేజస్సును కప్పివేసెను. సర్వకర్మలలో మిగుల నిపుణుడయ్యెను. అందువలన ఆయనను జనులు దక్షు డని పిలువసాగిరి. బ్రహ్మ ఆదక్షునె అభిషిక్తునిగా జేసి ప్రజాసృష్టికార్యమునందు, రక్షణాదికార్యమునందు నియమించెను. పిమ్మట అతడు (దక్షుడు) మరీచిప్రభృతు లగు ఇతరప్రజాపతులను ప్రజారక్షణాది కార్యములయందు నియమించెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి చతుర్థ
స్కంధములోని ముప్పదియవ అధ్యాయము
సమాప్తము.

# ముప్పదియొకటవ అధ్యాయము

## నారదుడు ప్రచేతసుల కుపదేశించుట; పిమ్మట వారు పరమపదమును బొందుట

కథాసారము:- ఈ యధ్యాయమున పుత్రుడగు దక్షునకు రాజ్యభారము నప్పగించి ప్రచేతసులు వనమునకు వెడలుట, నారదుడు బోధించిన భక్తియోగము ననుసరించి వారు ముక్తిని బొందుట యనువిషయములు వర్ణింపబడినవి.

మైత్రేయమహాముని విదురునకు ప్రచేతసనారదసంవాద వర్ణనోపక్రమ ప్రసంగమున ఇట్లుచెప్పెను, - సహస్రదివ్యవర్షముల పిమ్మట ప్రచేతసులకు దివ్యజ్ఞానము కలుగగా వారు గృహమును విడచి సముద్రతటమున ఋషులు సిద్ధిపొందిన "జాజలి" యనుప్రదేశమునకు వెడలిరి. మనస్సును నిగ్రహించుకొని భగవచ్చింతనము చేయుచుండగ దేవర్షి యగునారదుడు వారికి దర్శన మిచ్చి యీవిధముగ నుపదేశించెను - "జన్మకర్మములచేత, ఆయువుచేత, వాక్కులచేత శ్రీహరిని సేవింపనిచో అవి వ్యర్థమేయగును. శౌక్ర సావిత్ర దైక్షజన్మలు, వేద ప్రతిపాద్యకర్మలు, దేవతలవంటిదీర్ఘాయువు, వేదాంతాదిశ్రవణము, తపస్సు, శాస్త్రవ్యాఖ్యా నాదివాక్యవిన్యాసములు, అవధారణ సామర్థ్యము, నిపుణమగుబుద్ధి, బలము, ఇంద్రియ పాటవము, అష్టాంగయోగము, ఆత్మజ్ఞానము, సన్న్యాసము, వేదాధ్యయనము, వ్రతములు, వైరాగ్యము, సమస్తశ్రేయస్సాధనములు మున్నగున వన్నియు శ్రీహరిసేవ లేనిదె నిష్ఫలముల గును. శ్రీహరి యొక్కడే సేవింపదగినవాడు. వృక్షమూలమును దడుపుటచేత సమస్త వృక్షము, ప్రాణముల కాహారము నిడుటచేత సర్వేంద్రియములు తేజస్సుగలవి యగును. అట్లే శ్రీకృష్ణుని సేవవలననె సర్వదేవతలను, పితృదేవతలను పూజించినట్లగును. వారిని వేఱు వేఱుగ పూజింప నవసరములేదు. భగవానుడె సర్వకారణకారణుడు. శ్రీహరి భక్తవశుడు. ఆయన దుష్టుల పూజను స్వీకరింపడు. అకించను లగువ్యక్తులకు ఏకైక ధనము శ్రీహరియె. ఆయన వారినె చక్కగ ప్రేమించును. అకించనులగు సాధువులను తిరస్కరించువారిపూజను ఆయన స్వీకరింపడు. సాధువు లెన్నడును భక్తవత్సలు డగు శ్రీహరిని ఏ మాత్రమును పరిత్యజింపరు". ప్రచేతసులు నారదు డుపదేశించిన విష్ణు కథలను విని ఆశ్రీహరినె చింతించుచు విష్ణులోకమునకు వెడలిరి.

### శ్రీ మైత్రేయ ఉవాచ

తత ఉత్పన్నవిజ్ఞానా ఆశ్వధోక్షజభాషితమ్ ।
స్మరన్త ఆత్మజే భార్యాం విసృజ్య ప్రావ్రజన్ గృహాత్ ॥ 1

మైత్రేయుడు పలికెను :- దివ్యసహస్రవర్షములపిమ్మట ప్రచేతసులకు దివ్యజ్ఞానము కలిగెను. అప్పుడు వారు అధోక్షజభగవానునివాక్కులను స్మరించి భార్యను పుత్రున కప్పగించి శీఘ్రముగ గృహమును విడచి వెడలిపోయిరి.

**దీక్షితా బ్రహ్మసత్రేణ సర్వభూతాత్మమేధసా ।**
**ప్రతీచ్యాం దిశి వేలాయాం సిద్ధోఽ భూద్యత్ర జాజలిః ॥ 2**

బ్రహ్మవిచారముద్వారా సర్వభూతములయందు పరమాత్మదర్శనమగును, అట్టి జ్ఞానమును సాధించుటకు కృతసంకల్పుడై పూర్వసముద్రతటమున "జాజలి" యను ఋషి సిద్ధిబొందెను. ఆస్థలమునకు వారు వెడలిరి.

**తాన్ నిర్జితప్రాణమనోవచోదృశో**
**జితాసనాన్ శాన్తసమానవిగ్రహాన్ ।**
**పరేఽ మలే బ్రహ్మణి యోజితాత్మనః**
**సురాసురేడ్యో దదృశే స్మ నారదః ॥ 3**

ప్రచేతసులు ప్రాణమనోవాక్కులను బాహ్యదృష్టిని నిగ్రహించి, ఆసనమును జయించి విషయములనుండి ఉపరతులు ఋజుభావమునం దుపవిష్టులునై సర్వోత్తమము, నిర్మలము నగుబ్రహ్మమునం దాత్మను నిలిపి యుంచిరి. ఇట్టి సమయమున సురాసుర పూజితు డగునారదు డచటికి వచ్చి వారికి దర్శన మిచ్చెను.

**తమాగతం త ఉత్థాయ ప్రణిపత్యాభివాద్య చ ।**
**పూజయిత్వా యథాదేశం సుఖాసీనమథాబ్రువన్ ॥ 4**

అనంతర మాప్రచేతసులు నారదునిరాకను జూచి లేచి యథావిధిగ అభివాదనము చేసి పూజించిరి. సుఖాసీనుడై యున్న ఆయనతో వారిట్లు పలికిరి.

**శ్రీ ప్రచేతస ఊచుః**

**స్వాగతం తే సురర్షేఽ ద్య దిష్ట్యా నో దర్శనం గతః ।**
**తవ చంక్రమణం బ్రహ్మన్న భయాయ యథా రవేః ॥ 5**

ప్రచేతసులు పలికిరి :- దేవర్షీ! మహాత్మా! నీకు స్వాగతము. నే డదృష్టమువలన మాకు నీదర్శనమైనది. సూర్యునిసంచారము మానవులచోరాదిభయనివృత్తికొఱ కైనట్లు నీవు గూడ లోకముల కభయ మిచ్చుటకే సంచరించుచుందువు.

**యదాదిష్టం భగవతా శివేనాధోక్షజేన చ ।**
**తద్గృహేషు ప్రసక్తానాం ప్రాయశః క్షపితం ప్రభో ॥ 6**

ప్రభూ! ఐశ్వర్యశాలియగు (భగద్భక్తుడగు) శివుడు శ్రీహరి మా కుపదేశించినవిషయము లను మేము గృహాసక్తులమై మఱచితిమి.

తన్నః ప్రద్యోతయాధ్యాత్మజ్ఞానం తత్త్వార్థదర్శనమ్ ।
యేనాఞ్జసా తరిష్యామో దుస్తరం భవసాగరమ్ ॥ 7

తత్త్వజ్ఞాన ప్రదీప మగు అధ్యాత్మజ్ఞానమును ప్రకాశింపజేయుము. దానిచే మేము దుస్తర మగుభవసాగరమును అనాయాసముగ తరింపగలము.

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఇతి ప్రచేతసాం పృష్టో భగవాన్ నారదో మునిః ।
భగవత్యుత్తమః శ్లోక ఆవిష్టాత్మాబ్రవీన్నృపాన్ ॥ 8

మైత్రేయుడు పలికెను :- విదురా! ఇట్లు ప్రచేతసులచే అడుగబడినవాడై ఉత్తమశ్లోకు డగుభగవానునియం దాసక్తచిత్తు డగునారదుడు ఆరాజపుత్రులతో నిట్లుపలికెను.

## శ్రీ నారద ఉవాచ

తజ్జన్మ తాని కర్మాణి తదాయుస్తన్మనో వచః ।
నృణాం యేన హి విశ్వాత్మా సేవ్యతే హరిరీశ్వరః ॥ 9

నారదుడు పలికెను :- ఏజన్మచే విశ్వాత్ముడు, ఈశ్వరుడు నగు శ్రీహరి సేవింప బడునో మానవులయాజన్మము, కర్మలు, ఆయువు, మనస్సు, వాక్కు సఫలము లగును.

వివరణము :- మానవుని ఏజన్మద్వారా విశ్వాత్ము డగు శ్రీహరి సేవింపబడునో ఆ జన్మమె "జన్మ" మగును. ఏకార్యముచే శ్రీహరి సేవింపబడునో అదియె యేకైక మగుకృత్యము. ఏఆయువుచే శ్రీహరి సేవ యగునో అదియే పరమాయు వగును, దేనిచే విశ్వాత్ముడు, పరమేశ్వరుడు నగుశ్రీహరి సేవింపబడునో ఆ మనస్సే శుద్ధమనస్సు, ఆవాక్కే నిజమైన వాక్కు అగును.

కిం జన్మభిస్త్రిభిర్వేహ శౌక్రసావిత్రయాజ్ఞికైః ।
కర్మభిర్వా త్రయీప్రోక్తైః పుంసోఽపి విబుధాయుషా ॥ 10

మానవునకు మూడుజన్మములు గలవు - పరిశుద్ధు లగుతల్లిదండ్రుల వలన గలిగినది శౌక్రజన్మ; ఉపనయనముద్వారా కలిగినది సావిత్రజన్మ; సర్వేశ్వరు డగువిష్ణువు నారాధించుట యనుయజ్ఞదీక్షద్వారా గలిగినది యాజ్ఞికము లేదా దైక్షజన్మ. కాని శ్రీహరి

ంవ లేనిదె యీమూడుజన్మలవలన ఏమిఫలము కలుగును? హరిసేవవలన కాక వేద
ప్రతిపాద్యము లగు కర్మలవలన, దేవతలవంటిదీర్ఘాయువువలన ఏమిఫలము కలుగును?

**శ్రుతేన తపసా వా కిం వచోభిశ్చిత్తవృత్తిభిః ।**
**బుద్ధ్యా వా కిం నిపుణయా బలేనేన్ద్రియరాధసా ॥ 11**

శ్రీహరి సేవవలనకాక వేదాంతాదిశ్రవణము, తపస్సు, శాస్త్రవ్యాఖ్యాదివాగ్విలాసములు, నానావిధశాస్త్రార్థములను జ్ఞాపకముంచుకొనుశక్తి, నిపుణమగుబుద్ధి, బలము, ఇంద్రియ పటుత్వము అనువానివలన నేమిఫలముకలుగును?

**కిం వా యోగేన సాంఖ్యేన న్యాసస్వాధ్యాయయోరపి ।**
**కిం వా శ్రేయోభిరన్యైశ్చ న యత్రాత్మప్రదో హరిః ॥ 12**

ప్రాణాయామాదులైన అష్టాంగయోగములు, దేహాదులకంటె వ్యతిరిక్తమైన ఆత్మ జ్ఞానము, ఇవియేకాక సన్న్యాసము, వేదాధ్యయనము, వ్రతములు, వైరాగ్యము మున్నగు నితరము లైనశ్రేయస్సాధనములు శ్రీహరి యింద్రియములకు సంతుష్టిని గలుగజేయనిచో (జీవునియింద్రియములకు మాత్రమే తృప్తిని గలిగించుచున్నచో) వానివలన నేమిఫలము కలుగును?

**శ్రేయసామపి సర్వేషామాత్మా హ్యవధిరర్థతః ।**
**సర్వేషామపి భూతానాం హరిరాత్మాత్మదః ప్రియః ॥ 13**

అన్నివిధము లగు శ్రేయస్సులకు పరాకాష్ఠయైనది పరమార్థముగ ఆత్మ యొక్కటియె. ఇది నిశ్చితమైనవిషయము. సర్వప్రాణుల కాత్మ శ్రీహరి. ఆయనయె జీవులకు నిత్య స్వరూ పప్రకాశకుడు, ఆత్మజ్ఞానప్రదుడు, పరమానందస్వరూపుడు నైయున్నాడు. (అవిద్యను బోగొట్టుట చేత స్వరూపాతివ్యంజకుడు, ఐశ్వర్యరూపముచే బలిప్రభృతులకువలె ఆత్మప్రదుడు, పరమానందరూపు డగుటవలన ప్రియుడును ఐయున్నాడు).

**యథా తరోర్మూలనిషేచనేన**
**తృప్యన్తి తత్ స్కన్ధభుజోపశాఖాః ।**
**ప్రాణోపహారాచ్చ యథేన్ద్రియాణాం**
**తథైవ సర్వార్హణమచ్యుతేజ్యా ॥ 14**

వృక్షమూలమును బాగుగ నీటితో తడిపినచో దానిస్కంధము, శాఖలు, ఉపశాఖలు, పత్రములు, పుష్పములు మున్నగునవన్నియు తృప్తిచెందును. (మూలమునందుకాక విడి విడిగ విభిన్నస్థానములను నీటితో తడిపిన తృప్తిచెందవు). ప్రాణముల కాహార మిడిన

సమస్తము లగు నింద్రియములు తృప్తిచెందును. (కాని యింద్రియసమూహములకు వేఱు వేఱుగ అన్నమును రుద్దినచో తృప్తికలుగదు). అట్లే కృష్ణు నొక్కనిని పూజించుటద్వారానే సర్వదేవతలను, పిత్రాదిదేవతలను పూజించినట్లగును. (వారిని వేఱువేఱుగ పూజింప నవసరము లేదు).

మ॥ *కమలాధీశ్వరుఁ బూజ సేయుట సమగ్రప్రీతిఁ బ్రాణోపహా*
*రము సర్వేంద్రియతృప్తి హేతువును సర్వక్ష్మాజమూలాభిషే*
*కము శాఖాభుజపుష్టిదంబు నగు రేఖన్ సర్వదేవార్చన*
*క్రమ మై యొప్పు ధరావరేణ్యసుతులారా బుద్ధి నూహించినన్.* (4-954)

యథైవ సూర్యాత్ప్రభవన్తి వారః
పునశ్చ తస్మిన్ ప్రవిశన్తి కాలే ।
భూతాని భూమౌ స్థిరజఙ్గమాని
తథా హరావేవ గుణప్రవాహః ॥ 15

వర్షాకాలమున నీరు సూర్యునినుండి ఉత్పన్నమై మరల (గ్రీష్మకాలమున) ఆసూర్యుని యందే ప్రవేశించును. స్థావరజంగమాది ప్రాణులు పృథివినుండి ఉత్పన్నములై మరల యాపృథివియందే లయమగును. అట్లే గుణమయ మగుప్రపంచము ప్రళయకాలమున భగవానునియందే లయముచెందును.

ఏతత్పదం తజ్జగదాత్మనః పరం
సకృద్విభాతం సవితుర్యథా ప్రభా ।
యథాఽసవో జాగ్రతి సుప్తశక్తయో
ద్రవ్యక్రియాజ్ఞానభిదాభ్రమాత్యయః ॥ 16

సూర్యరశ్మి సూర్యునికంటె భిన్నము కానట్లు ఈవిశ్వము గూడ పరమాత్మయొక్క పరమపదము అనగా పరమాత్మనుండి యుత్పన్న మగుట వలన ఆయనకంటె అభిన్నము (వాస్తవములో ఈవిశ్వము భగవానునికంటె భిన్న మయినతత్త్వము కాదు, ఆయన మాయా శక్తి యొక్క పరిణామము). ఇంద్రియములు జాగ్రదవస్థయందు నానాకార్యములచే వ్యాపృతములై యుండును, నిద్రావస్థయందు వానినుండి నివృత్తములగును. అట్లే సృష్టి కాలమున ఈవిశ్వము భగవానునికంటె భిన్నముగ గనబడినను ఇంద్రియాది పంచభూతాత్మక మగుఈదేహమునందు ఆత్మబుద్ధి తొలగినచో ఇట్టిభేదభ్రమ గూడ నశించును.

యథా నభస్యభ్రతమః ప్రకాశా
భవన్తి భూపా న భవన్త్యనుక్రమాత్ ।
ఏవం పరే బ్రహ్మణి శక్తయస్త్వమూ
రజస్తమస్సత్త్వమితి ప్రవాహః ॥ 17

ప్రచేతసులారా! ఆకాశమున నొకప్పుడు మేఘములు, ఒకప్పుడంధకారము, ఒకప్పుడు వెలుగు పర్యాయక్రమమున గలుగునట్లు పరబ్రహ్మమువందు రజస్తమస్సత్త్వరూప మగు శక్తిప్రవాహము పర్యాయక్రమమున ప్రకాశితము, లీనము వగును.

తేనైకమాత్మానమశేష దేహినాం
కాలం ప్రధానం పురుషం పరేశమ్ ।
స్వతేజసా ధ్వస్తగుణప్రవాహ -
మాత్మైకభావేన భజధ్వమద్ధా ॥ 18

ఆయన సర్వకారణకారణుడు, ఆయనయె సర్వదేహులకు ఆత్మయు, నిమిత్తము, ఉపాదానకారణము నైయున్నాడు. ఆయన తనశక్తి ప్రవాహముచే గుణప్రవాహరూప మగు సంసారమునుండి నిర్ముక్తుడు అనగా మాయాధీశు డైయున్నాడు. ఆపరమపురుషు డగు పరమేశ్వరుని ఆత్మకంటె అభిన్న మనుజ్ఞానముతో సాక్షాద్భావమున సేవింపుడు.

దయయా సర్వభూతేషు సన్తుష్ట్యా యేన కేన వా ।
సర్వేన్ద్రియోపశాన్త్యా చ తుష్యత్యాశు జనార్దనః ॥ 19

సర్వభూతములయందు దయచూపుట, లభించినదానితో సంతృప్తిచెందుట, విషయములనుండి సమస్తేంద్రియములను నిగ్రహించుట - అనువానిచే భగవాను డగు జనార్దనుడు శీఘ్రముగ ప్రసన్నుడగును.

అపహతసకలైషణామలాత్మ
న్యవిరతమేధితభావనోపహూతః ।
నిజజనవశగత్వమాత్మనోఽయం
న సరతి ఛిద్రవదక్షరం సతాం హి ॥ 20

సర్వవాసనానిర్ముక్త మగుసత్పురుషులశుద్ధమనస్సునందు శ్రీహరి నిరంతరభావన ద్వారా ఆహూతుడై వసించును. శ్రీహరి తనభక్తులకు వశుడై ఆకాశమువలె ఆ స్థానము నుండి మఱియొకచోటికి వెడలడు.

న భజతి కుమనీషిణాం స ఇజ్యాం
హరిరధనాత్మధనప్రియో రసజ్ఞః ।
శ్రుతధనకులకర్మణాం మదైర్యే
విదధతి పాపమకించనేషు సత్సు ॥ 21

(శ్రీహరి సత్పురుషులకు వశ్యుడగును, అసత్పురుషులపూజను గ్రహింపడు, ఆ విషయమే చెప్పబడుచున్నది). ధనహీనులు అనగా అకించను లగువ్యక్తులకు భగవానుడే యేకైక మగుధనము. శ్రీహరి వారికే ప్రియుడు. వారు భక్తినే సుఖప్రద మనిభావింతురు. అందువలన పాండిత్యము, ధనము, ఆభిజాత్యము, కర్మలు అనువానియహంకారముచే మత్తులై మానవులు అకించను లగుసాధువులను తిరస్కరింతురు. అట్టివారిపూజ నెప్పుడును శ్రీహరి స్వీకరింపడు.

శ్రియమను చరతీం తదర్థినశ్చ
ద్విపదపతీన్ విబుధాంశ్చ యః స్వపూర్ణః ।
న భజతి నిజభృత్యవర్గతన్త్రః
కథమముముద్విసృజేత్పుమాన్ కృతజ్ఞః ॥ 22

తనచే తాను పరిపూర్ణు డైనను తనభక్తులకు వశుడైయున్నవాడు, నిరంతరము సేవించు లక్ష్మీదేవిని, శ్రేయఃకాము లగునరేంద్రులను, దేవతలను అనుసరింపనివాడు, భక్తవత్సలుడు అగుభగవాముని కృతజ్ఞు డగుపురుషుడు కొలదిసేపైనను నెట్లుపరిత్యజింప గలడు?

## శ్రీ మైత్రేయ ఉవాచ

ఇతి ప్రచేతసో రాజన్నన్యాశ్చ భగవత్కథాః ।
శ్రావయిత్వా బ్రహ్మలోకం యయౌ స్వాయంభువో మునిః ॥ 23

మైత్రేయుడు పలికెను :- రాజా! (విదురా!) బ్రహ్మతనయుడగు నారదమునీంద్రుడిట్టి భగవత్కథల నెన్నింటినో ప్రచేతసులకు వినిపించి పిమ్మట బ్రహ్మలోకమునకు వెడలెను.

తేఽ పి తన్ముఖనిర్యాతం యశో లోకమలాపహమ్ ।
హరేర్నిశమ్య తత్పాదం ధ్యాయన్తస్తద్గతిం యయుః ॥ 24

ప్రచేతసులుగూడ నారదముఖమునుండి వెలువడి మోహమును నాశము చేయునట్టి శ్రీహరిగుణానువాదమును (కథలను) విని, శ్రీహరిచరణములను ధ్యానించుచు విష్ణు లోకమునకు వెడలిరి.

ఏతత్తేఽ భిహితం క్షత్తర్యన్మాం త్వం పరిపృష్టవాన్ ।
ప్రచేతసాం నారదస్య సంవాదం హరికీర్తనమ్ ॥ 25

వత్సా! విదురా! నీవు నన్నడిగిన నారదప్రచేతససంవాద మను హరికీర్తనవిషయక మగుఆఖ్యానమును నీకు వివరించితిని.

## శ్రీ శుక ఉవాచ

య యేష ఉత్తానపదో మానవస్యానువర్ణితః ।
వంశః ప్రియవ్రతస్యాపి నిబోధ నృపసత్తమ ॥ 26

శుకుడు పలికెను :- రాజశ్రేష్ఠా! (పరీక్షిన్మహారాజా!) స్వాయంభువమనుపుత్రు డగు ఉత్తానపాదునివంశము వర్ణితమైనది; ఇపుడు ప్రియవ్రతుని (మనువురెండవపుత్రుని) వంశమును వర్ణింతును వినుము.

యో నారదాదాత్మవిద్యామధిగమ్య పునర్మహీమ్ ।
భుక్త్వా విభజ్య పుత్రేభ్య ఐశ్వరం సమగాత్పదమ్ ॥ 27

ప్రియవ్రతుడు నారదునివలన ఆత్మవిద్యను పొంది, పిమ్మట పృథివిని పాలించెను. అనంతరము పుత్రులకు రాజ్యము నిచ్చి అత డనాయాసముగ పరమేష్ఠిపదమును పొందెను.

ఇమాం తు కౌషారవిణోపవర్ణితాం
క్షత్తా నిశమ్యాజితవాదసత్కథామ్ ।
ప్రవృద్ధభావోఽ శ్రుకలాకులో మునే -
ర్దధార మూర్ధ్నా చరణం హృదా హరేః ॥ 28

మైత్రేయుడు చెప్పిన భగవన్మాహాత్మ్యమునకు సంబంధించినసత్కథను విని విదురుడు భగవద్భావముచే విహ్వలు డయ్యెను. ప్రేమాశ్రువులచే గలతచెందిననేత్రములు గలవాడై హృదయమునుండి శ్రీహరిచరణములను, శిరస్సున గురువరు డగు మైత్రేయముని పదకమలములను నిలుపుకొనెను.

## శ్రీ విదుర ఉవాచ

సోఽ యమద్య మహాయోగిన్ భవతా కరుణాత్మనా ।
దర్శితస్తమసః పారో యత్రాకించనగో హరిః ॥ 29

విదురుడు పలికెను :- మహాయోగీ! నేడు దయగలవాడ వగు నీవు నాకు సంసార సముద్రముయొక్క ఆవలియొడ్డును జూపితివి. అచట అకించను లగుభక్తుల సర్వస్వమగు శ్రీహరి విరాజిల్లుచుండును.

## శ్రీ శుక ఉవాచ

**ఇత్యానమ్య తమామన్త్ర్య విదురో గజసాహ్వయమ్ ।**
**స్వానాం దిదృక్షుః ప్రయయౌ జ్ఞాతీనాం నిర్వృతాశయః ॥ 30**

శుకదేవుడు పలికెను :- ఈవిధముగ పలికి విదురు డానందపూర్ణ చిత్తుడై సాష్టాంగ నమస్కారముచేసి ఆ మునికడ సెలవు తీసికొని తన జ్ఞాతులను దర్శింప నిచ్ఛ గలవాడై హస్తినాపురమునకు వెడలెను.

**ఏతద్యః శృణుయాద్రాజన్ రాజ్ఞాం హర్యర్పితాత్మనామ్ ।**
**ఆయుర్ధనం యశః స్వస్తిగతిమైశ్వర్యమాప్నుయాత్ ॥ 31**

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
చతుర్థస్కంధే ప్రాచేతసోపాఖ్యానం
నామ ఏకత్రింశోఽధ్యాయః ॥

రాజా! శ్రీహరియందు మనస్సు నుంచిన ప్రచేతసుల యాపవిత్ర చరిత్రమును శ్రవణము చేసిన మానవుడు దీర్ఘాయువును, యశస్సును, శుభమును, ఐశ్వర్యమును, వైకుంఠము మున్నగులోకములను పొందును.

ఇతి బ్రహ్మసూత్రాభాష్యము, పారమహంససంహిత, వైయాసిక్యము నగు
శ్రీమద్భాగవతమహాపురాణమందలి చతుర్థ స్కంధములోని
ప్రాచేతసోపాఖ్యాన మను ముప్పదియొకటవ
అధ్యాయము సర్వము సంపూర్ణము.

❀ ❀ ❀

ఈ యధ్యాయమున శ్రీమన్మధ్వాచార్యానుయాయి యగు శ్రీవిజయధ్వజుడు పదరత్నావళి యనువ్యాఖ్యానమందు ఇంకను కొన్ని శ్లోకములను ప్రక్షిప్తముగ ఉదహరించినాడు. వానికి గూడ నిచట తాత్పర్యము వ్రాయబడుచున్నది.

నిరస్తసంకల్పవికల్పమద్వయం
ద్వయాపవాదోపరమోపలంభనమ్ ।
అనాదిమధ్యాన్తమజస్రనిర్వృతిం
సంజ్ఞప్తిమాత్రం భజతాముయా దృశా ॥ 1

జీవునిసంకల్పవికల్పాత్మక మగుమనోధర్మమును నశింపజేయువాడు, తనతో సమానుడుగాని తనకంటె అధికుడుగాని లేనివాడు, భేదాపవాద హస్తమునుండి రక్షింపబడి నచో (అనగా నిర్భేదబ్రహ్మానుసంధానమున తత్పరు లగుకేవలాద్వైతవాదులు తమయుద్దేశ్య సిద్ధికై ప్రతికూలజ్ఞానముతో శుద్ధద్వైతమును అనగా పంచవిధభేదములయొక్క (ఈశ్వరుని యందు జీవుని యందు భేదము, ప్రతిజీవునియందు భేదము, జీవునియందు జడమునందు భేదము, ప్రతిజడమునందు భేదము, జడమునందు ఈశ్వరునియందు భేదము) జ్ఞానమును నిందించుకుతర్కులు నశించినచో) దర్శనమిచ్చువాడు, ఆదిమధ్యాంతములు లేనివాడు, నిత్యానందస్వరూపుడు, విజ్ఞానఘనానందమయుడు అగుపురుషుని మహోధర్మముక్తు లగుభక్తులు సేవించుచుందురు.

భవతాం వంశధుర్యోఽ భూద్ధ్రువశ్చిత్రరథః స్వరాట్ ।
గురుదారవచోబాణైర్నిర్భిన్నహృదయోఽ ర్భకః॥ 2

త్యక్త్వా స్త్రైణం చ తం గచ్ఛన్ దృష్ట్వో మే పథ్యుదారధీః ।
పంచవర్షో మదాదేశైః సంరాధ్య పురుషేశ్వరమ్ ॥ 3

తత్పరం సర్వధిష్ణేభ్యో మాయాధిష్ఠితమారుహత్ ।
మునయోఽ ద్యాప్యుదీక్షన్తే పరం నాపురవాఙుఖాః ॥ 4

మీవంశమున చిత్రరథు డనునామముగలవాడు, రాజచక్రవర్తియు, భక్తశ్రేష్ఠుడు నగుధ్రువు డావిర్భవించెను. బాల్యకాలమున సవతితల్లి పరుషవాక్కులను విని మిగుల వ్యథితుడై సరళచిత్తుడు, ఐదువత్సరముల వయస్సుగలవాడు నగుధ్రువుడు భార్యావశుడైన తనతండ్రిని విడచి వనమునకు వెడలెను. మార్గమధ్యమున నాదర్శన మయ్యెను. నాయుపదేశము ననుసరించి అతడు పరమపురుషు డగుభగవాను వారాధించి ధ్రువలోక మునుపొందెను. అది సర్వలోకములకంటె శ్రేష్ఠమైనది, విష్ణుసాన్నిధ్యమున నుండునది. దానికి క్రిందిలోకములలో నున్నమునులు ఆలోకమును పొందుట కెన్నియోప్రయత్నములు చేసిరి. కాని నేటికిని దానిని పొంద జాలకపోయిరి.

తం యూయం సర్వభూతానామన్తర్యామిణమీశ్వరమ్ ।
రుద్రాదిష్టోపదేశేన భజధ్వం భవముక్తయే ॥ 5

మీరు సంసారబంధనములనుండి ముక్తులగుటకై మహాదేవుని యుపదేశము నను సరించి ఆధ్రువునిచే సేవింపబడువాడు, సర్వాంతర్యామియు నగుభగవానుని సేవింపుడు.

# చతుర్థస్కంధ శ్లోకానుక్రమణిక

## ఖ



## గ

# చతుర్థ స్కంధములో ఉదహరింపబడిన పోతనామాత్యుని పద్యములు.



# పంచమ స్కంధము

# విషయ సూచిక

# అవతరణిక

లేక లేక యశోదమ్మకు శ్రీకృష్ణుడు జన్మించినట్లు, శ్రీకృష్ణుని కృపవలన, అనేక సాధనల ఫలముగా భాగవత భగవానుని వాభీష్టలమగు శ్రీమద్భాగవతములోని పంచమ స్కంధము ప్రకాశితమైనది. "శ్రేయాంసి బహువిఘ్నాని' అని శాస్త్రములు చెప్పుచున్నవి కదా! నాస్తికత్వము పెచ్చు పెరుగుచున్న, ఇంద్రియతృప్తికరమైన నవలలు చదువుకొన వలెనను కుతూహలముమానవులలో విరివిగా అభివృద్ధిచెందుచున్న ఈ కాలములో పార మార్థిక గ్రంథములను ప్రకాశింపచేయుట యందలి కష్టములు పారమార్థికులకే తెలియును. కాగితము సకాలములో చాలినంత లభింపకుండుట, ధరలు ఆకాశమంటియుండుట యివన్నియు నీలాగున నుండగా గుంటూరు పట్టణములో ముద్రాణాయంత్ర కార్మికుల సమ్మె అవాంతరముగా వచ్చిపడుట మున్నగు కారణములచేత ఈ గ్రంథము సకాలములో ముద్రించలేక పోయితిమి. ఇన్ని కష్టములననుభవించి మీరెందులకు శ్రీమద్భాగవత గ్రంథమును ప్రచురించుటకు ప్రయత్నము చేయుచున్నారు? అని కొందఱు ప్రశ్నింప వచ్చును. దీనికి సమాధానము శ్రీమద్భాగవతమే ఇట్లు చెప్పుచున్నది -

"సర్వవేదాంత సారం హి శ్రీ భాగవత మిష్యతే ।
తద్రసామృత తృప్తస్య నాన్యత్ర స్యాద్రతిః క్వచిత్ ॥"

అనగా సర్వవేదాంతసారమే శ్రీ భాగవతమని చెప్పవచ్చును. దీని రసామృతముచే సంతృప్తిచెందినవారికి నితర శాస్త్రములయందు ఆసక్తి యుండదు. పోతనామాత్యుడుగూడ

సీ॥ మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు

తే॥ నంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల! మాటలు వేయునేల!

ఈ పద్య భావార్థము చేత పై విషయమునే స్పష్టపరచినాడు.

శ్రీ చైతన్యమహాప్రభువు తమ జీవితములో శ్రీమద్భాగవత రసమును ఆస్వాదించి, దానినే ప్రమాణ గ్రంథముగా అంగీకరించిరి. అందువలన మేము గూడ శ్రీమద్భాగవత గ్రంథమును పరిశీలించుటకే జీవితము నంకితము జేయుటకు సంకల్పించు కొంటిమి.

రుచి కలిగిన విషయమును విడచి పెట్టలేక పోవుటవలన జీవులు పెక్కువిధములైన కష్టముల పాలగుదురు. అటులనే మేము గూడ భాగవత ప్రచురణ విషయములో ఎన్ని కష్టములు కలిగినను వానిని సహించెదము.

ఈ శ్రీమద్భాగవత పంచమ స్కంధములో ఇరువదియారు అధ్యాయములు గలవు. ఇందులోని ప్రియవ్రత చరిత్రము భక్తి పరమైన గృహస్థులకు భగవత్ప్రాప్తి అగుననియు, అగ్నీధ్రుని చరిత్రము స్త్రీ చింతనాపరతులైన భోగులకు స్త్రీ దేహము ప్రాప్తించు ననియు; నాభిరాజు చరిత్రమువలన భౌతిక వస్తువులను కోరినదైనను భగవదారాధన చేసినచో భగవద్దర్శనము, భగవత్సేవా భాగ్యము కలుగుననియు, రాజాభరతుని చరిత్రము సర్వసంగ పరిత్యాగము చేసికూడ చివరకు ఏదేని ఒకవస్తువు పై గాని, ప్రాణిపైగాని ఆసక్తి కలిగియున్నచో అట్టి రూపమును పొందుదురనియు, జడ భరతుని చరిత్రము ఎంతటి జ్ఞానియైనను, విజ్ఞానియైనను, నిరాడంబరముగా జీవితమును గడపలేనిచో శాశ్వతమైన సుఖ శాంతులు వారికి ప్రాప్తించవనియు, నిశ్చల భక్తులను భగవంతుడే రక్షించుననియు, జడభరత రాజా రహూగణ సంవాదము భక్తులను గుర్తించుట మిక్కిలి కష్టతమమైన విషయమనియు, మహాభాగవతులైన వారికి తమవలన అపచారము జరిగినప్పుడు పశ్చాత్తప్తులై వారిని క్షమాభిక్షనర్థించ వలెననియు, భవాటవీవర్ణనము వలన సంసారములో నున్నప్పుడు దుఃఖమును, కష్టమును కలిగించునట్టి వస్తువులను వ్యక్తులను గుర్తించి యట్టివారికి దూరముగా మెలగుచుండ వలెననియు, భూగోళ ఖగోళ పాతాళముల వర్ణనము స్థావర, జంగమముల పరిచయము తెలిసికొనవలెననియు, ఆయా వర్షములలోని లోకములలోని వారుకూడ శుద్ధ భక్తితో భగవదారాధన చేయుచున్నారనియు అనగా ప్రతి జీవులు కూడ భగవంతుని ఆయా అవతారములను ఆరాధించుచున్నారనియు, చివరకు నరకవర్ణనము సంసారములో పెక్కు కష్టముల ననుభవించు పరిస్థితులుగలవనియు ఆయా కార్యములను

గావించినచో ఆయా కష్టములను తప్పక అనుభవింప వలెననియు, అందువలన ఆయా కార్యముల నుండి విరతి చెందియుండవలెననియు మనకు బోధించు చున్నవి.

శుద్ధభక్తులు ఆస్వాదింపదగిన లీలలు దశమస్కంధములోనున్నవి. వానిని శుద్ధభక్తులై ఆస్వాదింపవలెను. అట్టి శుద్ధభక్తుల లక్షణము లీ స్కంధము మనకు నొక్కి చెప్పుచున్నది. దీనికై గ్రంథములోని క్రింద వ్రాయబడిన శ్లోకములను పరిశీలింపవలెను.

"పుత్రాంశ్చ శిష్యాంశ్చ ......... హి గర్తే॥" భా॥ 5-5-15

"గురుర్న స స్యాత్ .....యః సముపేత మృత్యుమ్ ॥" భా॥ 5-5-18

"యస్యాస్తి భక్తి.... ధావతో బహిః ॥" భా॥ 5-18-12

"సవై పతిః స్యాదకుతో భయం.... మన్యతే పరమ్ ॥" భా॥ 5-18-20

తాము స్వయముగా భగవంతుని ఆశ్రయించి సేవించినచో ఎట్టి భయములేకుండ యుండవచ్చుననియు, ఇతరులను సేవించుట భయకారణమనియు, భగవంతుని సేవించు విషయమున ప్రోత్సాహము కలిగించువారే స్వజనబాంధవులనియు ఇతరులు కారనియు పై శ్లోకములోని భావము.

ఇట్టి మహద్గ్రంథము ఈ శ్రీకృష్ణజయంతి దినమున ప్రకాశితమగుట చూచి మా హృదయమునకు మిక్కిలి సంతోషముకలుగు చున్నది. ఈ సద్గ్రంథ ముద్రణమునకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారులు, తిరుమల తిరుపతి దేవస్థానము నుండి 5000 రూప్యములు సాహాయ్యముచేసిరి. అచిరకాలములోనే దశమస్కంధము కూడ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి సాహాయ్యముతో ప్రకాశిత మగును. దీనికై వారికి మేమెంతయో కృతజ్ఞులమై యున్నాము.

ఈ గ్రంథమునకు భారతప్రభుత్వమువారు మొదట కొంత, చివరకు కొంత తగ్గింపు వెలకు తెల్లకాగితమును అందించిరి. వారికి మాధన్యవాదములు!

శ్రీ చైతన్య మఠ ప్రతిష్ఠాత లగు శ్రీ శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతి ఠాకురులు సంస్కృత భాషనుండి వంగభాషలోనికి అనువదించిన దానిని శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రి 'భాషాప్రవీణ' గారు సరళగ్రాంథిక భాషలోనికి ఆంధ్రీకరించి ఆంధ్రపాఠకలోకమున కెంతయు మేలు కలుగ చేసినారు. వారికి ప్రేమాధిదేవమూర్తులైన శ్రీ శ్రీ రాధాకృష్ణులు సర్వసుఖములను జేకూర్చుదురు గాక!

బుధజన విధేయుడు,

గుంటూరు,

23-8-81

శ్రీ భక్తి విజయ విష్ణు

# విన్నపము

శ్రీమద్భాగవతము భాగవతధర్మమునకు సర్వోత్కృష్టగ్రంథము. ఇది దానిలోని యైదవస్కంధము. ఈ స్కంధములో ముఖ్యముగ మనువు రెండవ కుమారు డైన ప్రియవ్రతుని చరిత్ర, వాని కుమారుడైన ఆగ్నీధ్రుడు, వాని పుత్రు డైన నాభి, వాని పుత్రు డైన ఋషభదేవుడు, వాని పుత్రుడైన భరతుడు మున్నగువారిచరిత్రలు వివరింపబడినవి. అనంతరము భూగోళము, గంగావివరణము, శంకరు డొనరించిన సంకర్షణస్తుతి, విభిన్న వర్షములు, ద్వీపములు, శిశుమారచక్రము, గ్రహములయునికి, లోకాలోక పర్వతములు, విభిన్నవరకములు మున్నగువిషయములు విపులముగ వర్ణింపబడినవి.

ప్రియవ్రతునిచరిత్రమున బ్రహ్మదేవుడు ప్రియవ్రతునకు చేసిన ఉపదేశము చాల విశిష్టమైనది. గృహస్థాశ్రమ మొకకోటవంటిది. దానిలో నుండియే మానవుడు అంతశ్శత్రువు లైన కామక్రోధలోభమోహ మదమాత్సర్యములతో పోరాడుట ఉత్తమమైనపని. అందువలన వివాహము చేసికొనవలెను. వివాహము లేనిదె అజితేంద్రియులకు వికారవాసనలు నశింపవు. కొలదికాలము సంసారసుఖములను అనుభవించిన పిమ్మట పరమాత్మను ఆరాధింపవలెను. బ్రహ్మదేవుని యుపదేశము ననుసరించి ప్రియవ్రతుడు వివాహము చేసికొని సంతానమును గనెను.

ప్రియవ్రతుని పుత్రుడైన ఆగ్నీధ్రుడు తండ్రితరువాత సింహాసనమెక్కెను. వానిచిత్తము పూర్వచిత్తి యను అప్సరసయందు లగ్నమయ్యెను. చిత్తమున నుండు పూర్వ జన్మవాసనయె పూర్వచిత్తి. పూర్వ జన్మవాసన త్వరగ తొలగదు. విస్మృతమయ్యును పూర్వ వాసన స్మరణకు వచ్చుచుండుటయే పూర్వచిత్తి.

ఆగ్నీధ్రునిపుత్రుడు నాభి, వానిపుత్రుడు ఋషభదేవుడు. ఋషభదేవుడు జ్ఞానావ తారము. జ్ఞాను లగుపరమహంసలప్రవర్తన ఎట్లుండునో తెలియజెప్పుటకే భగవానుడు ఋషభదేవునిరూపమున జన్మించెను. ఋషభుడనగా సర్వశ్రేష్ఠుడు. మానవజీవితము భోగములకొఱకు గాక తపశ్చర్యకొఱకే యని అతడు పలుమారు లుపదేశించెను.

ఋషభదేవునిపుత్రుడు భరతుడు. ఈయన పేరుమీదనె మనదేశమునకు భారత దేశ మను పేరు వచ్చినది. తండ్రితరువాత భరతుడు రాజ్యమునకు వచ్చెను. అతడు గొప్ప భగవద్భక్తుడు. యౌవనకాలమందె విషయ సుఖములను వదలెను. విషయములను బుద్ధి పూర్వకముగాక బలవంతముగ వదలినచో దుఃఖము కలుగును. అట్లుకాక బుద్ధిపూర్వకముగ వదలినచో శాంతి లభించును. మాయగతి చాలవిచిత్రమైనది. భరతునివంటి భగవద్భక్తుని,

వైరాగ్యసంపన్నునిగూడ ఆ మాయ లోబరచుకొనినది. దానిచే హరిణ జన్మ మెత్తవలసి వచ్చెను. అయినను పూర్వజన్మస్మృతి నశింపలేదు. హరిణజన్మముపిమ్మట అతడు బ్రాహ్మణజన్మ మెత్తెను. ఈ జన్మమున భరతుడు ప్రవర్తించినతీరు మిక్కిలి విశిష్టమైనది. ఆయన రహూగణరాజునకు చేసినయుపదేశము అసామాన్య మైనది. ఈ స్కంధములో అది తలమానిక మైనఘట్టము.

ప్రియవ్రత రాజవంశచరిత్ర పదునైదవ అధ్యాయమువఱకు సాగును. ఇక ఇక్కడి నుండి భూగోళవిషయము ప్రారంభమగును. భాగవతగ్రంథమున సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతి, మన్వంతరము, ఈశానుకథ, నిరోధము ,ముక్తి, ఆశ్రయతత్త్వము అనుపదిలక్షణములు వివరింపబడినవి. వీనిలోని స్థాన మనులక్షణము ప్రస్తుతస్కంధమున వివరింపబడినది. "స్థితిర్వైకుంఠవిజయః" అని భాగవతమున స్థానలక్షణము చెప్పబడినది. అనగా నాశమువైపునకు పోవుసృష్టిని మర్యాదలో నుంచుటచే విష్ణుభగవానున కేశ్రేష్ఠత సిద్ధ మగుచున్నదో దానినామము స్థానము. సృష్టివర్ణనమునకు తరువాత దానిస్థితివర్ణన జరగ వలెను. అనగా నొకబ్రహ్మాండములో ఎన్నిలోకములు, వానిలో నే యే మర్యాదలు ఉన్నవి, లోకముల విస్తార మెంత, వానిధారణ ఎట్లుండును మున్నగువిషయములు స్థానప్రకరణమున ఉండును. ఈ స్కంధములోని పదునాలుగవ అధ్యాయమున ఈ లోకములవర్ణన మున్నది. 19వ అధ్యాయమున భారతవర్షవర్ణన మున్నది. భాగవతమున మూడువిధము లగుస్థితులు వర్ణింపంబడినవి. 1. పృథ్వీలోకస్థితి 2. ఊర్ధ్వలోకస్థితి 3. అధోలోకస్థితి.

ఇరువదియాఱవ అధ్యాయమున మానవులు ఏపాపకర్మలవలన ఏ యే నరకము లను పొందుదురో చెప్పబడినది. ఇట్టి నరకములు మొత్తము ఇరువదియెనిమిది. వీని వర్ణనము విపులముగ గలదు.

ప్రస్తుతపంచమస్కంధము భగవానునకు నాభివంటిది. దీనిలో ఇరువదియాఱు (26) అధ్యాయములు, 664 గద్యపద్యములు గలవు. వెనుకటిస్కంధములలోవలె దీనిలో గూడ మొదట స్కంధకథాసారము, పిమ్మట అధ్యాయకథాసారము, తరువాత ప్రతిశ్లోకము నకు తాత్పర్యము వ్రాయబడినవి. కొన్నిశ్లోకముల కచ్చటచ్చట విశేష వివరణములుగూడ నీయబడినవి. పుస్తక ప్రారంభమున వ్యాసమహర్షికృత బ్రహ్మసూత్రములు 28 వానికి వ్యాఖ్యానరూపములైన 35 పంచమస్కంధ శ్లోకములు ప్రత్యేకముగ నీయబడినవి.

ప్రభుపాద శ్రీశ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీగోస్వామిఠాకురులు వంగభాషలో చేసిన అనువాదము ననుసరించి, వారి సంస్కృతాన్వయముననుసరించి నే నీయనువాదము చేసితిని.

నిత్యలీలాప్రవిష్టులగు ఓంవిష్ణుపాద శ్రీశ్రీమద్భక్తివిలాసతీర్థ గోస్వామిమహారాజుగారి యనుగ్రహమునకు పాత్రులగు త్రిదండిస్వామి శ్రీ భక్తికమలపద్మనాభమహారాజు, త్రిదండి స్వామి శ్రీ భక్తివిజయ విష్ణు మహారాజు, త్రిదండిస్వామి శ్రీ భక్తిసుధీరదామోదరమహారాజుగార్ల ప్రోత్సాహముచే నా కీభాగతానువాద సేవా భాగ్యము కలిగినది. ముఖ్యముగ శ్రీ భక్తివిజయ విష్ణు మహారాజుగారు ముద్రణకు పూర్వ మీయనువాదమును శ్రద్ధగ విని అచ్చటచ్చట తగినసలహాల నిచ్చి తోడ్పడిరి. పై మువ్వురికి నాసాష్టాంగ నమస్కారములు.

అనువాదమున దోషము లున్న మన్నింపవలసినదిగా పాఠకులను ప్రార్థించుచున్నాను.

ఇట్లు

భక్తజనవిధేయుడు

**జన్నాభట్ల వాసుదేవశాస్త్రి**

గుంటూరు

**23-8-81**

# బ్రహ్మసూత్రములు - వానికి వ్యాఖ్యాన రూపములైన పంచమస్కంధములోని శ్లోకములు

**అవ్యక్తద్ధర్మోపదేశాత్ - (1-1-20)**
ఇత్థం ధృతభగవద్వ్రత - (7-13)
పరో రజః సవితుర్జాతవేదో - (7-14)
**భేదవ్యపదేశాచ్చాన్యః - (1-1-21)**
స్వరేతసాఽదః పునరావిశ్య చష్టే - (7-14 - తృ.పా.)
**ప్రాణస్తథానుగమాత్ - (1-1-28)**
ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమః - (18-25)
**న వక్తురాత్మోపదేశాదితి చేధ్యాత్మ సంబంధ భూమా హ్యస్మిన్ - (1-1-29)**
అన్తర్బహిశ్చాఖిలలోకపాలకై - (18-26)
యం లోకపాలాః కిల మత్సరజ్వరా - (18-27)
**వివక్షితగుణోపపత్తేశ్చ - (1-2-2)**
యత్తద్విశుద్ధానుభవమాత్రమేకం - (9-4)
**స్థావాదివ్యపదేశాచ్చ - (1-2-14)**
ఏతదుహైవ భగవతో విష్ణోః - (23-8)
**సుఖవిశిష్టాభిధానాదేవ చ - (1-2-15)**
గ్రహర్క్షతారామయమాధిదైవికం - (23-8)
**సామర్థ్యమాణమనమానం స్యాదితి - (1-2-26)**
ఏకః పృథక్ నామభిరాహుతో ముదా - (19-25 తృ.పా.)
**ప్రసిద్ధేశ్చ - (1-3-17)**
హరిర్హి సాక్షాద్భగవాఞ్ఛరీరిణా - (18-13)
**వదతీతిచేన్న ప్రజ్ఞోహి ప్రకరణాత్ (1-4-5)**

క్షేత్రజ్ఞ ఆత్మా పురుషః పురాణః ... - (11-13)

యథావిలః స్థావరజఙ్గమానా -(11-14)

**ఏతేవ శిష్టా పరిగ్రహా అపివ్యాఖ్యాతా - (2-1-12)**

ఏవం నిరుక్తం క్షితిశబ్ద వృత్తం - (12-9)

ఏవం కృశం స్థూలమణుర్బృహద్య - (12-10)

జ్ఞానం విశుద్ధం పరమార్థ మేకం - (12-11)

**మహద్దీర్ఘబద్వా హ్రస్వపరిమణ్డలాభ్యామ్ - (2-2-11)**

యేషాం సమూహేన కృతోవిశేషః

**సమవాయాభ్యాముపగమాచ్చసామ్యా దనవస్థితేః - (2-2-13)**

ఏవం నిరుక్త క్షితిశబ్దవృత్త - (12-9)

**నిత్యమేవ చ భావాత్ - (2-2-14)**

ఏవం కృశం స్థూలమణుబృహద్యద్ - (12-10)

**రూపాదిమత్వాచ్చ విపర్యయో దర్శనాత్ - (2-2-15)**

యదా క్షితావేవ చరాచరస్య - (12-8)

**ఉభయథా చ దోషాత్ - (2-2-16)**

ఏవం నిరుక్తం క్షితి శబ్ద వృత్త - (12-9)

**సముదాయ ఉభయ హేతుకేఽపి తదప్రాప్తిః - (2-2-18)**

ఏవం నిరుక్తం క్షితిశబ్దవృత్త - (12-9)

**ఏవం చాత్మాకార్త్స్న్యమ్ - (2-2-34)**

క్షేత్రజ్ఞ ఏతా మనసో విభూతీ - (11-21)

**త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్ - (3-1-2)**

ఆపఃపురుష వీర్యాస్త పునస్తే ర్భూర్భువః స్వరః - (21-23)

**అపి సప్త - (3-1-16)**

తత్ర హైకే నరకానేకవింశతం గణయన్తి - (26-7)

తత్రాపి చ తద్వ్యాపారాదవిరోధః - (3-1-17)

యత్ర హ వావ భగవాన్ పిత్రురాజో - (26-6)

అన్యథాత్వం శబ్దాదితి చేన్నావిశేషాత్ - (3-3-7)

క్షేత్రజ్ఞ ఆత్మా పురుషః పురాణః - (11-13)

యథానిలః స్థావర జఙ్గమానాం - (11-14)

యావదధికారమవస్థితిరాధికారికాణామ్ - (3-3-33)

ఏతే వయం యస్య వశే మహాత్మనః - (17-23)

అనుబన్ధాదిభ్యః - (3-3-51)

రహూగణైత త్తపసా న యాతి - (12-12)

ఆచారదర్శనాత్ - (3-4-3)

ఇతి హ వావ స జగతీపతిరీశ్వరేచ్ఛయా - (1-23)

కృత్స్నభావాత్ తు గృహిణోపసంహారః - (3-4-48)

భయం ప్రమత్తస్య వనేష్వపి స్యాత్ - (1-17)

యః షట్సపత్నాన్ విజిగీషమాణో - (1-18)

బ్రహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః (4-4-5)

మునీనామనవరతపరిగుణిత -

ఏవమప్యుపన్యాసాత్ పూర్వభావాదవిరోధం బాదరాయణః - (4-4-7)

నమో నమః కారణవిగ్రహాయ - (12-1)



# పంచమస్కంధ కథాసారము

స్వాయంభువమనువుయొక్క రెండవకుమారు డైన ప్రియవ్రతుని వంశచరిత్ర వర్ణింప బడుచున్నది. పరీక్షిన్మహారాజు మొదట ప్రియవ్రతునిజ్ఞాననిష్ఠను, పిమ్మట విషయభోగమును, చివరకు మోక్షప్రాప్తిని విని, "భగవద్భక్తులకు విషయాసక్తి యెట్లు కలుగు" నని శుకమహర్షిని ప్రశ్నించెను. దానికి శుక మహర్షి యిట్లుసమాధాన మిచ్చెను. "భగవద్భక్తి అప్రతిహత మైనది. జితేంద్రియు డగువ్యక్తికి గృహస్థాశ్రమము ఎట్టి యనిష్టము చేయజాలదు. జితేంద్రియుడు కానివాడు వనమునకు వెడలినను ప్రాపంచిక వాసనలనుండి నివృత్తుడు కాడు. మనువు వనమునకు వెడలగా ప్రియవ్రతుడు బ్రహ్మదేవునియాదేశము ననుసరించి రాజ్యభారమును స్వీకరించెను. ఆయనకు పదుగురు పుత్రులు, ఒక పుత్రిక కలిగిరి. ఆతనిరథాగ్రచక్రము నుండియే సప్తద్వీపములు, వానికి పరిఖాస్వరూపము లగు సప్తసముద్రములు ఏర్పడినవి. ఆతనిముప్పురుపుత్రులు తురీయాశ్రమము నవలంబింపగా మిగిలిన యేడుగురుపుత్రులు ఏడుద్వీపములకు అధిపతులైరి. రెండవభార్యవలన గలిగిన ఆతని ముప్పురు పుత్రులు మన్వంతరాధిపతులైరి.

ప్రియవ్రతమహారాజు నారదోపదేశము ననుసరించి పరమార్థసాధనమున ప్రవృత్తుడు కాగా ఆతనిపుత్రుడగు ఆగ్నీధ్రుడు రాజపదవి నధిష్ఠించెను. అతడు పుత్రులను గోరి తపస్సు చేయగా బ్రహ్మ వానికడకు "పూర్వచిత్తి" యను అప్సరను బంపెను. ఆగ్నీధ్రు డాయప్సరవలన తొమ్మండు గురుపుత్రులను గనెను. వారిని తొమ్మిదివర్షములకు అధిపతుల జేసెను. ఆగ్నీధ్రుడు భోగములయందు తృప్తిచెందక యెల్లపుడు ఆయప్సరసను గూర్చి చింతించు చుండుటచే మరణించిన పిమ్మట అతడు అప్సరసలోకమునకు వెడలెను.

ఆతని పుత్రుడగు నాభి పుత్రకాంక్షగలవాడై యజ్ఞముల నొనరించి యజ్ఞేశ్వరు డగుహరిని ఆరాధింపగా భగవానుడు తనయంశము ననుసరించి నాభికి పుత్రరూపమున అవతరించెను. రూపములోను, గుణములోను ఆయనతో సమాను డెవ్వడును లేకపోవుటచే వానికి 'ఋషభు' డనుపేరు కలిగెను. అతడు లోకశిక్షార్థము గురుకులమున నివసించెను. గుర్వాజ్ఞ ననుసరించి సమావర్తనము వెలపుకొని ఇంద్రదత్త యగు 'జయంతి' యను నామెవలన అతడు నూఱుగురుకుమారులను గనెను. వారిలో జ్యేష్ఠుడు భరతుడు. మిగిలిన వారిలో తొమ్మండుగురు మహాభాగవతులు. మలమును భుజించు సూకరములుగూడ విషయముల ననుభవించు చుండును. కాని మానవుల కర్తవ్య మదికాదు. సర్వభూత హితరతులు దేహగేహాదులయం దాసక్తిశూన్యులు నై మహాత్ములను సేవించిన ముక్తిని పొందుదురు. స్త్రీ సాంగత్యమువలన సంసారబంధనము గలుగును. భక్తి మార్గము నుపదేశించి

సంసారమునుండి విడివడుటకు ప్రయత్నింపనివారు తండ్రి తల్లి దైవము గురువు బంధువు అని చెప్పబడ జాలరు. పరమహంస యగు గురుదేవుని యందు, భగవానుని యందు భక్తి, సుఖదుఃఖాదులను సహించుట, తృష్ణారాహిత్యము, సర్వత్రసమదర్శనము, కృష్ణుని గుఱించి సర్వకర్మలు చేయుట, దేహగేహాదులయం దాసక్తి లేకపోవుట, వ్యర్థసంభాషణమును వర్జించుట అనువానివలన ఆత్మజ్ఞానము కలుగును. జ్ఞానాగ్ని ద్వారా కర్మబీజ మగుఅవిద్య నశించును. మనస్సే మానవుని కామక్రోధాదులకు దాసునిగా నొనర్చును. భక్తి సుదుర్లభము. ముక్తి సిద్ధ్యాదివాసనలను విడచి భక్తినిమాత్ర మనుసరించు వానికి భగవానుడు భక్తిని గలుగజేయును. ఆయన పారమహంస్యలీలను శ్రవణము చేసి జైనరాజగు అర్హతుడు దానిని తెలిసికొనెను. పిమ్మట దైవీమాయచే ప్రేరితుడై పాషండధర్మమును ప్రవర్తిల్లజేసెను. ఆయన దావానలమున దేహమును త్యజించి యోగులకు దేహత్యాగము చేయువిధానమును బోధించెను.

ఋషభదేవుని అభిప్రాయానుసారముగ భరతుడు రాజ్యమును స్వీకరించి యజ్ఞానుష్ఠానము ద్వారా యజ్ఞేశ్వరుడగు శ్రీహరియందు ప్రేమను గలిగియుండి తరువాత మలముక్తుడై వాసుదేవునియందు దృఢభక్తి కలిగియుండెను. రాజ్యభోగాది ప్రారబ్ధకర్మలు సమాప్తము కాగా ఆయన పులహాశ్రమమునకు వెడలి విష్ణ్వారాధనమున నియుక్తుడయ్యెను.

ఒకనాడు నదియందు స్నానముచేసి ప్రణవజపము చేసికొనుచుండెను. అంతలో పూర్ణగర్భముతో నున్న ఒకలేడి యచటికి వచ్చి నీటిని త్రాగుచుండెను. హఠాత్తుగ సింహ గర్జనము వినబడుటచే భయవిహ్వల యై లంఘించి యావలి తీరమునకు వెడలుచుండగా దాని గర్భస్థ శిశువు జలమున బడెను. లేడి తీరమున బడి ప్రాణములను వదలెను. మహారాజు దయాపరవశుడై తల్లిలేని యాశిశువును తనయాశ్రమమునకు దెచ్చి లాలనపాలన చేయసాగెను. క్రమముగ ఆశిశువుపై అత్యాసక్తి కలిగి యుండుట వలన సాధనను భజనము విడచి దానిసేవయందే సంపూర్ణముగ నిమగ్ను డయ్యెను. అకస్మాత్తుగ నొకదినమున ఈ మృగశిశువు కనబడక పోవుటచే 'అయ్యో! మృగము, అయ్యో! మృగము' అనుచు ప్రాణ త్యాగము చేసెను. మరణ సమయమున మృగమునే చింతించు చుండుటవలన పరజన్మమున మృగత్వమును బొందెను. కాని వెనుకటి సుకృతివలన పూర్వస్మృతి నశింపలేదు. ఆత్మకృత మగు వికర్మమునకై విలపించుచు మృగమాతను త్యజించి యెల్లపుడు హరినామముఖరిత మగు పులస్త్యాశ్రమమునకు వెడలెను. కర్మక్షయము కాగా మృగదేహమును విడచి సర్వగుణసంపన్ను డగు బ్రాహ్మణునకు పుత్రరూపమున జన్మించెను. పూర్వజన్మకథ గుర్తుండుటచే వెనుకటి సాంగత్యదోషము వలన మరల అధఃపతనము సంభవించు నను భయముచే లోకుల దృష్టిలో జడునివలెను, ఉన్మత్తునివలెను మెలగుచు ఎల్లపుడు హరినామచింతనమున మగ్ను డయ్యెను. భగద్విముఖు లగు వారితో గలిసెడివాడు గాడు.

ఉన్మత్తుడని భావించి జనులు వానిపట్ల అన్యాయముగా వ్యవహరించినను అత డెప్పుడును వానిని పట్టించుకొనెడివాడు గాడు. తండ్రి మరణించిన పిమ్మట సవతితల్లి కొడుకులు వానిని హీనమైన పనుల యందు నియమించుచుండిరి. హీన మైనభోజనమును పెట్టుచుండిరి. దానివలన గూడ అతడు చలించెడి వాడు గాడు. ఒకనాడు పైరును కాపలాగాయుటకై నియమించిరి. ఆసమయమున అర్ధరాత్రమున కొందఱు దొంగలు వానిని దీసికొనివెడలి భద్రకాళికి బలియిచ్చుట కుద్యుక్తులు కాగా దేవి భగవద్భక్తుని పట్ల జరుగు అత్యాచారమునకు క్రుద్ధురాలై దొంగలను సంహరించెను.

దేవీప్రతిమ దగ్గరనుండి తిరిగివచ్చునపుడు రహూగణ రాజు పల్లకి మోయుబోయీ లలో నొకడు తగ్గిపోవుటచే రాజ సేవకులు దైవవశమున ఆప్రదేశమున నున్న భరతుని యా కార్యమునకై నియోగించిరి. అతడు ప్రాణిహింసా భయముచే జాగ్రత్తగ అడుగులు వేయుచుండెను. అందువలన ఇతరులైన బోయీలతో గలసి నడువలేక పోవుచుండెను. పల్లకి అటునిటు ఊగుచుండెను. రహూగణరాజు క్రుద్ధుడై పరుషవాక్కులను ప్రయోగింపగా భరతుడు తత్త్వపూర్ణము లైన వాక్కుల ద్వారా రహూగణరాజునకు తత్త్వము నుపదేశించెను. రాజునకు చైతన్యోదయము కలుగగా అతడు భరతుని మహాభాగవతునిగా భావించి అతనిని శరణు పొందెను.

మహర్షి యగుభరతుడు రాజున కున్న వైరాగ్యము దృఢ మగుటకై భవాటవిని వర్ణింపగా తత్త్వజ్ఞానమును బొంది రహూగణరాజు దేహమునం దాత్మబుద్ధిని విడచెను. తన యపరాధమును క్షమింపవలసినదిగా గోరెను.

రూపకభావముతో వర్ణింపబడిన భవాటవి పరీక్షిన్మహారాజునకు బోధపడక పోవుటచే శుకమహర్షి ఆయనకు ప్రకృతార్థమును వర్ణించెను. సంసారానుభూతికి ద్వారస్వరూపము లగు పంచజ్ఞానేంద్రియములు, మనస్సు దస్యులవలె అజితేంద్రియు లగు వ్యక్తులను విషయ భోగములయందు నిమగ్నులుగ జేసి భగవదారాధనారూప మగు పరమధనము నపహరించును. కుటుంబము లోనివారు వృకశృగాలాదులవలె యత్నపూర్వకముగ రక్షింపబడిన పురుషుని ద్రవ్యము నపహరించి తమభోగములకు వ్యయము చేయుదురు. గృహస్థాశ్రమము కర్మక్షేత్రము. దానివలన కర్మబీజము సంపూర్ణముగ నశింపదు. తాత్కాలిక మైన ఇంద్రియసుఖముచే ప్రమత్తులు గృహాసక్తులు నగు వ్యక్తులు అసత్కర్మముల యందు రతులై భగవత్పాదపద్మములను మఱతురు. కర్మకు సాక్షిస్వరూపులుగ నున్న దేవతలను వారు చూడలేకపోవుచున్నారు. వారు అసత్సాంగత్యముచే పాషండమతము నాశ్రయించినచో ఈకాలమునందు పరకాలమునందును కష్టమును బొందుదురు .అర్థనిమిత్త మై జీవులు ఆత్మీయులకుగూడ క్లేశములను గలిగించుటకు వెనుకాడరు. కుటుంబ పోషణమున నిమగ్నులై అశాంతితో కాలమును గడుపుదురు.

ప్రియవ్రతుని పౌత్రులు ఆధిపత్యమును వహించిన నవవర్షములు జంబూద్వీపము లోనివే. తద్భిన్న మైన భూమండలమున ఇంకను ఆఱుద్వీపము లున్నవి. జంబూద్వీపము పదిలక్షల యోజనముల వైశాల్యము గలది. జంబూద్వీపములోని ప్రతివర్షము యొక్క పరిమాణము (భద్రాశ్వకేతుమాలవర్షములు కాక) తొమ్మిది వేల యోజనములు. సరిహద్దును నిర్దేశించు ఎనిమిది పర్వతముల ద్వారా తొమ్మిది వర్షములు విభజింప బడినవి. విష్ణుపాదోద్భవ యగుగంగ ప్రతివర్షమునందును బహుధారలతో ప్రవహించు చుండును. భారతవర్షమే కర్మక్షేత్రము. మిగిలిన యెనిమిది వర్షములు స్వర్గసుఖభోగులకు భోగస్థానములు. తొమ్మిది వర్షములలో శ్రీహరి నానారూపములతో విరాజిల్లుచు పూజింప బడుచుండును.

ఇలావృతవర్షమున వైష్ణవప్రవరు డగు శంభువు పార్వత దేవితో గూడి శ్రీహరియొక్క సంకర్షణమూర్తి నుపాసించు చుండును. అచటికి ఇతర పురుషులు వెడలినచో భవానీ శాపముచే స్త్రీత్వమును పొందుదురు.

భద్రాశ్వవర్షమున కధిపతి భద్రశ్రవుడు. ఇతడు భగవానుని హయగ్రీవమూర్తిని ఉపాసించు చుండును. హరివర్షమున నృసింహభగవానుడు నివసించు చుండును.

కేతుమాల వర్షమున భగవానుడు కామదేవమూర్తితో విరాజిల్లుచుండును. రమ్యక వర్షమున మనువు మత్స్యదేవుని ఉపాసించు చుండును.

హిరణ్మయవర్షమున భగవానుడు కూర్మమూర్తితో విరాజిల్లు చుండును. ఉత్తర కురువర్షమున శ్రీవరాహదేవుడు కురుఖండవాసులకు ఉపాస్యరూపముతో నుండును.

కింపురుషవర్షవాసులు రామచంద్రుని ఉపాసించు చుందురు.

దేవర్షి యగునారదుడు భారతవర్షములోని ప్రజలతో గూడి పరమపురుష డగుభగవాను నుపాసించు చుండును. ఈ వర్షము ఇతర వర్షములకంటెను బ్రహ్మలోకము కంటెను శ్రేష్ఠ మైనది. ఏలయన బ్రహ్మలోకమునుండి గూడ జీవునకు పునరావృత్తి యుండును, కాని ఇచట తమ ధర్మమును, ఆశ్రమమును విష్ణువునకు సమర్పించినచో నిక పునరావృత్తి యుండదు. ఈ భారతవర్షమున జన్మించి భగవత్సేవ చేయని వారి యవస్థ చాల శోచనీయ మైనది.

ప్లక్ష శాల్మలి కుశ క్రౌంచ శాక పుష్కరద్వీపముల నొక్కొక్క దానిలో ఏడువర్షము లున్నవి. అన్ని ద్వీపములు ఒక్కొక్కసముద్రముచే పరివేష్టి తములై యున్నవి. ప్రతి వర్షమునందును విష్ణుభగవానుడు విభిన్నరూపములతో పూజింపబడుచుండును.

భూర్భువర్లోకముల అంతస్థలమున సూర్యదేవుడున్నాడు. ఈ స్థానము యొక్క పరిమాణము ఇరువది యైదుకోట్ల యోజనములు. సౌరరథము యొక్క సంవత్సర మనుచక్రమున కాల చక్రము ప్రతిష్ఠిత మైయున్నది. అనుష్టుప్పు మున్నగు ఏడు ఛందస్సులు సూర్యునియశ్వములు. అవి తొమ్మిదిలక్షల యోజనముల పరిమితిగల కాడియందు

అరుణునిచే గూర్చబడిన వై ఆదిత్యుని మోయుచుండును. ఆదిత్య దేవుడు తొమ్మిదికోట్ల యేబది యొక్క లక్షల యోజనములు పరిమితిగాగల భూమండలమున ప్రతిక్షణము రెండువేల యోజనములకంటె అధిక దూరము తిరుగుచుండును.

సూర్యమండలమునకు లక్షయోజనములపైన చంద్రగ్రహ మున్నది. దానికి ఒక్కొక్క రెండు లక్షలయోజనములపైన ఇతరగ్రహము లుండును గ్రహములకు పైభాగమున సప్తర్షి మండలమునుండి పదుమూడులక్షల యోజనముల దూరమున విష్ణువుయొక్క పరమపద మున్నది. అచట ఇంద్రుడు, కశ్యపుడు, ప్రజాపతి, అగ్ని, ధర్మదేవత మున్నగు వారిద్వారా సమ్మానితుడై ధ్రువుడు నివసించు చుండును. కాలచక్రస్థ మగు జ్యోతిర్గణములు ధ్రువునకు నలువైపుల తిరుగుచుండును.

సూర్యచంద్ర మండలములకు క్రింద రాహువను గ్రహ ముండును. సూర్యచంద్రుల అంతరాళమున రాహువు యొక్క యునికినె గ్రహణమందురు. ఋజువక్ర భావములతో అది యుండుటను బట్టి సర్వగ్రాసము, అర్ధగ్రాసము జరుగు చుండును. రాహు గ్రహమునకు పదిలక్షల యోజనముల దిగువన సిద్ధులు, చారణులు, విద్యాధరులు, యక్షులు, రాక్షసులు నివసించు చుందురు. వానికి క్రింద పృథివి, పృథివికి దిగువభాగమున ఒక్కొక్క పదిలక్షల యోజనముల దూరముతో సప్త పాతాళము లున్నవి. అచట సూర్యునివెలుగు ప్రవేశింపక పోయినను నాగుల శిరస్సులపై మన్న మణుల కాంతివలన అంధకారము తొలగుచుండును. అతలమున మయదానవుని పుత్రుడగు బలుడు ఉండును. వితలమున హరగౌరుల నివాస స్థానమున్నది. సుతలమున మహాభాగవతు డగుబలి యుండును. తలాతలమున మయదానవు డుండును. దానికి దిగువన ఉన్న మహాతలమునందు, రసాతల పాతాళములయందు సర్పములు నివసించు చుండును.

పాతాళమునకు మూలమున అనంతదేవుడు విరాజిల్లు చుండును. ఆయన పడగల యందు సమస్త బ్రహ్మాండము ఆవగింజవలె నుండును. ఆయన లలాటము నుండియె సంహారకారి యగురుద్రు డవతరించినాడు. ఈయనంత దేవుడు సర్వజీవులను చక్కగ ఆకర్షించుటచే ఆయనకు సంకర్షణు డనుపేరు కలిగినది. ఆయన ఈక్షణ ప్రభావముచే ప్రకృతి యొక్క గుణత్రయము సృష్టిస్థితి పాలనాదికార్యముల నిర్వహింప సమర్థ మగుచున్నది. ఆయన ప్రభావమున కంతము లేదు.

ప్రకృతిగుణములచే బద్ధుడై జీవుడు తాను కర్త యని యభిమానపడి తాను చేసిన కర్మముల ఫలమును పరలోకమున అనుభవించును. అధార్మికులు చేయు విభిన్నములగు కర్మముల ఫలముచే విభిన్నములగు నరకములు వారికి లభించును. అవి విపులముగ శ్రీ మద్భాగవతమున వర్ణింపబడినవి.



శ్రీ శ్రీ గురు గౌరాంగౌ జయతః

# శ్రీమద్భాగవతము

# పంచమ స్కంధము

## మొదటి అధ్యాయము

### ప్రియవ్రతుని చరిత్ర

కథాసారము :- ఈయధ్యాయమున మహాజ్ఞాని యగు ప్రియవ్రతుని రాజ్యభోగము, పిమ్మట ఆయనజ్ఞాననిష్ఠ మున్నగు అద్భుత విషయములు వర్ణితములైనవి.

ప్రియవ్రతుడు ప్రథమమున జ్ఞాననిష్ఠు డైయుండుట, పిమ్మట రాజ్యము ననుభవించుట, తదనంతరము విషయాసక్తిని వదలి మోక్షమును పొందుట మున్నగు విషయములను విని పరీక్షిన్మహారాజు మిగుల ఆశ్చర్యచకితు డయ్యెను. ఎవరిపాద పద్మచ్ఛాయచే విషయాసక్తి నశించునో అట్టి భగవానుని భక్తులకెట్లు విషయములయం దాసక్తి కలుగును? ఈవిషయమున సందేహము కలవాడై పరీక్షిత్తు శుకమహర్షిని ప్రశ్నించెను. దానికి సమాధానముగ శుకు డిట్లు పలికెను :- "భగవద్భక్తి యప్రతిహతమైనది, అందువలన విఘ్నాదులద్వారా యెట్టి బాధయు కలుగదు. ప్రియవ్రతుడు నారదమహర్షి కృపచే ఆత్మజ్ఞానమును పొందెను. దానివలన ఆయన మొదట అనిత్యము లగు రాజ్యభోగాదులను స్వీకరించుట కంగీకరింపలేదు. కాని యింద్రాది దేవసేవితుడు జగద్గురువు నగు బ్రహ్మయొక్క యాదేశము ననుసరించి రాజ్యభారమును స్వీకరించెను.

జగత్తంతయు భగవదధీన మైయున్నది. ముకుత్రాళ్లు వేయబడిన వృషభమువలె మాయయొక్క సత్త్వరజస్తమో గుణమయ మగురజ్జువుచే బద్ధుడై జీవుడు వర్ణాశ్రమోచితము లగు కర్మల నాచరించును. ఇంకను ఫలభోగమునందు జీవునకు స్వేచ్ఛ యున్నట్లగ పడదు. ఏలయన, జీవుడు కర్మఫలానుసారముగ భగవద్దత్త మగుశరీరమును పొంది సుఖదుఃఖాది భోగముల ననుభవించును. జితేంద్రియుడు కానివ్యక్తి వనమునకు వెడలినను సంసార వాసనలనుండి వివృత్తుడు కాడు. భగవత్ప్రతివిశిష్టుడు, జితేంద్రియుడు నగు మానవునకు గృహస్థాశ్రమ మెట్టియనిష్టమును గలుగ జేయదు. గృహస్థాశ్రమము ఆఱుగురు

శత్రువులను జయించుటకు దుర్గము వంటిది. ఆఱుగురు శత్రువులు జయింపబడినచో గృహమునందుగాని, వనమునందు గాని మఱియే ప్రదేశమునందుగాని యున్నను బాధ కలుగదు.

బ్రహ్మయొక్క యాదేశము ననుసరించి ప్రియవ్రతుడు రాజ్యభారమును స్వీకరింపగా వానితండ్రి యగుమనువు వనమునకు వెడలెను. ప్రియవ్రతుడు విశ్వకర్మపుత్రిక యగు "బర్హిష్మతి" ని పరిణయమాడి యామెవలన "ఆగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహువు, మహావీరుడు, హిరణ్యరేతసుడు, ఘృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిథి, వీతిహోత్రుడు, కవి" యను పదుగురుపుత్రులను, "ఊర్జస్వతి" యనుపుత్రికను గని వేలకొలది సంవత్సరములు రాజ్యము ననుభవించెను.

ఆయన రథాగ్రచక్రముమండియే సప్తద్వీపములు వానికి పరిఖాస్వరూపము లగు సప్తసముద్రములు బయల్వెడలెను. ప్రియవ్రతుని పదుగురుపుత్రులలో కవి, మహావీరుడు, సవనుడు అనువీముగ్వురు చతుర్థాశ్రమము నవలంబించిరి. మిగిలిన యేడు గురుపుత్రులు సప్తద్వీపముల కధీశ్వరు లైరి. ప్రియవ్రతుని రెండవభార్యకు "ఉత్తముడు, రైవతుడు, తామసుడు" అను ముగ్వురు పుత్రులు జన్మించిరి. వీరు మన్వంతరాధిపతులు. పిమ్మట శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు 'నారదునియుపదేశము ననుసరించి ప్రియవ్రతుడు మోక్షమును పొందుట' యను విషయమును జెప్పెను.

## శ్రీరాజోవాచ

**ప్రియవ్రతో భాగవత ఆత్మారామః కథం మునే ।**
**గృహేఽరమత యన్మూలః కర్మబన్ధః పరాభవః ॥ 1**

పరీక్షిన్మహారాజు పలికెను :- మహామునీ! భగవద్భక్తుడు, ఆత్మారాముడు నగు ప్రియవ్రతుడు గృహస్థాశ్రమమునం దెట్లాసక్తు డయ్యెను? ఆ గృహస్థాశ్రమమున జిక్కుకొనిన మానవునకు స్వరూపవిస్మృతి, కర్మ బంధనములు గలుగును గదా!

**న నూనం ముక్త సంగానాం తాదృశానాం ద్విజర్షభ ।**
**గృహేష్వభినివేశోఽయం పుంసాం భవితుమర్హతి ॥ 2**

ద్విజశ్రేష్ఠా! ఆత్మారాములు, ఫలాసక్తిరహితులు నగు మానవుల కట్లు గృహములయం దభినివేశము కలుగుట తగదు.

**మహతాం ఖలు విప్రర్షే ఉత్తమః శ్లోకపాదయోః ।**
**ఛాయానిర్వృతిచిత్తానాం న కుటుంబే స్పృహామతిః ॥ 3**

బ్రహ్మర్షీ! ఎవరిచిత్తము కామాదిసంతాపములను హరించునట్టి పవిత్రకీర్తిగల భగవానుని పాదయుగళచ్ఛాయయందు ప్రశాంతముగ నుండునో అట్టి మహాత్ములచిత్తము విశ్చయముగ పుత్రకళత్రాదులయం దాసక్తి గలిగియుండదు.

సంశయోఽయం మహాన్ బ్రహ్మన్ దారాగార సుతాదిషు ।
సక్తస్య యత్సిద్ధిరభూత్కృష్ణే చ మతిరచ్యుతా ॥ 4

మహర్షీ! భార్యాపుత్రగృహాదులయం దాసక్తు డగు వ్యక్తికి (ప్రియవ్రతునకు) భగవత్సామీప్యాదిరూప మగు సిద్ధియు, శ్రీకృష్ణునియం దవిచ్ఛిన్న మగు మతియు ఎట్లు గలిగినవి? ఈ విషయమున నాకు గొప్ప సంశయము కలిగినది.

## శ్రీశుక ఉవాచ

బాఢముక్తం భగవత ఉత్తమశ్లోకస్య శ్రీమచ్చరణారవిన్దమకరన్దరస ఆవేశిత చేతసో భాగవత పరమహంసదయిత కథాం కించిదన్తరాయవిహతాం
స్వాం శివతమాం పదవీం న ప్రాయేణ హిన్వన్తి ॥ 5

శుకదేవుడు పలికెను :- రాజా! నీవు పలికినది సత్యమే. కాని ఉత్తమశ్లోకు డగు శ్రీహరియొక్క పరమశోభాయుక్తము లగు పాద పద్మముల మకరందరసమున ఆవిష్టచిత్తు లగువారు భాగవత పరమ హంసలకు ప్రాణములకంటెను ప్రియు డగు వాసుదేవుని కథనే పరమ కల్యాణరూపపదవి యని స్థిరపఱచుకొనిరి. సంసార భోగాదిరూపము లగు విఘ్నముల ద్వారా ఏమాత్రము ఆటంకము కలుగుచున్నను వా రా మంగళమయమగు పదవిని మాత్రము పరిత్యజింపరు.

యర్హి వావ హ రాజన్ స రాజపుత్రః ప్రియవ్రతః పరమ భాగవతో నారదస్య చరణోపసేవయాఽఞ్జసావగతపరమార్థసతత్త్వో బ్రహ్మసత్రేణ దీక్షిష్యమాణోఽవనితలపరిపాలనా యామ్నాత ప్రవరగుణగణైకా న్తభాజనతయా స్వపిత్రోపా మన్త్రితో భగవతి వాసుదేవ ఏవావ్యవధానసమాధి యోగేన సమావేశితసకల కారకక్రియా కలాపో నైవాభ్యనన్దద్యద్యపితద ప్రత్యామ్నాతవ్యం తదధికరణ ఆత్మనోఽన్యస్మాదసతోఽపి పరాభవ
మన్వీక్షమాణః ॥ 6

రాజా! మనుపుత్రు డగు ఆ ప్రియవ్రతుడు దేవర్షి యగు నారదుని చరణసేవవలన అనాయాసముగ తత్త్వజ్ఞానముతో గూడ పరమ పురుషార్థమును పొంది పరమభాగవతు డయ్యెను. ఆయన ఆత్మతత్త్వ ధ్యానముచే దివ్యజ్ఞానరూప మగు దీక్షను పొంది పిమ్మట

సచ్చిదానంద లక్షణయుక్తమగు వాస్తవ వస్తుతత్త్వసంబంధ మగు జ్ఞానమును పొందుటకు సంకల్పించెను. అపుడు తండ్రి యగు మనువు వానికి (ప్రియవ్రతునకు) శాస్త్రోక్తము లగు ఉత్తమగుణముల నవలంబించి రాజ్యమును పాలింపవలసిన దని జెప్పెను. కాని ఆయన దాని నంగీకరింపలేదు. ఏలయన, ఆయన ఏకాగ్రచిత్తముతో సర్వేంద్రియములను, వాని వ్యాపారములను భగవాను డగు వాసుదేవున కర్పించెను. తండ్రియాజ్ఞను మీరుట యుచితము కాకపోయినను రాజ్యాధికారమున అసద్వస్తువులవలన కలుగు కామక్రోధాదులయెదుట తన పరాభవమును స్వీకరింపవలసివచ్చు నని యాలోచించి యతడు తన తండ్రియాజ్ఞను పాలింపలేదు.

**అథ హ భగవానాదిదేవ ఏతస్య గుణవిసర్గస్య పరిబృంహణా మధ్యానవ్యవసిత సకల జగదభిప్రాయ ఆత్మయోనిరఖిల నిగమనిజ గణపరివేష్టితః స్వభవనాదవ తతార ॥ 7**

పిమ్మట సత్త్వాదిగుణములచే వివిధసర్గములను సృష్టించినవాడు, ఈ జగదభివృద్ధి విషయమై యెల్లపు డాలోచించు సర్వజగదభిప్రాయమును తెలిసికొనినవాడు, ఐశ్వర్యశాలియు, దేవుడు నగు బ్రహ్మ మూర్తిమంతము లగు నిఖిలవేదములతోను, స్వజను లగు మరీచ్యాది ఋషులతోను పరివృతుడై సత్యలోకమునుండి ప్రపంచమున అవతరించెను.

**స తత్ర తత్ర గగనతల ఉడుపతిరివ విమానావలిభిరను పథమమరపరివృఢైరభి పూజ్యమానః పథి పథి చ వరూథశః సిద్ధగన్ధర్వ సాధ్యచారణమునిగణైరుపగీయమానో గన్ధమాదన ద్రోణీ మవభాస యన్నుపససర్ప ॥ 8**

ఆయన (బ్రహ్మ) అవతరించునపుడు ఆయా స్థానములలో ఆకాశ మార్గమున చంద్రునివలె ఆయనప్రభ ప్రకాశింపజొచ్చెను. త్రోవలో విమానచారు లగు దేవతాశ్రేష్ఠులు ఉపచారములతో ఆయనను పూజింప సాగిరి. సిద్ధులు, గంధర్వులు, సాధ్యులు, చారణులు, మునులు ఆయన యశస్సును గానముచేయసాగిరి. ఇట్లంతట సంపూజితు డగుచు బ్రహ్మ గంధమాదనపర్వతగుహాలను ప్రకాశింపజేయుచు అవతరించెను.

**తత్ర హ వా ఏనం దేవర్షిర్హంసయానేన పితరం భగవ న్తం హిరణ్యగర్భముపల భమానః సహసైవాభ్యుత్థాయార్హణేన సహ పితాపుత్రాభ్యామ హితాఞ్జలిరుపతస్థే ॥ 9**

(అపుడు వారదు డా గుహలో ప్రియవ్రతునకు ఆత్మతత్త్వోప దేశము చేయుచుండెను. మనువుకూడ తన పుత్రుని దీసికొని వెడలుటకై యచటికి వచ్చియుండెను). ఆ సమయమున

దేవర్షి యగు నారదుడు హంసయానమును జూచి తన తండ్రి యగు బ్రహ్మదేవుడు వచ్చుచున్నా డని భావించెను. అందువలన ఆయన ససంభ్రమముగ ఆ క్షణమందె ఆసనము నుండి లేచి మనువుతోడను ప్రియవ్రతునితోడను గూడి అంజలిబద్ధుడై బ్రహ్మను స్తుతింప సాగెను.

**భగవానపి భారత తదుపనీతార్హణః సూక్తవాక్యేనాతితరాముదిత గుణగణావతార సుజయః ప్రియవ్రతమాదిపురుషస్తం సదయహాసావలోక ఇతి హోవాచ ॥ 10**

భారతా! చక్కగ పూజించి నారదుడు మధురవాక్కులతో బ్రహ్మ యొక్క గుణములను, యశస్సును, సర్వోత్కృష్ట విషయమును వర్ణించెను. అప్పు డాదిపురుషు డగు బ్రహ్మ ప్రసన్నహాసావలోకనముతో ప్రియవ్రతుని గూర్చి యిట్లు పలుకసాగెను.

**శ్రీభగవానువాచ**

**నిబోధ తాతేదమృతం బ్రవీమి**
**మాసూయితుం దేవమర్హస్య ప్రమేయమ్ ।**
**వయం భవస్తే తత ఏష మహర్షి -**
**ర్వహామ సర్వే వివశా యస్య దిష్టమ్ ॥ 11**

ఐశ్వర్యశాలి యగు బ్రహ్మపలికెను :- వత్సా! ప్రియవ్రతా! రుద్రుడు, నీతండ్రి, నీ గురు వగు ఈ నారదుడు, నేను అందఱము అస్వతంత్రులమై పరమేశ్వరునాజ్ఞను పరిపాలించు చుందుము. ఇంద్రియజ్ఞానా తీతుడగు భగవానుని దోషారోపణముద్వారా దర్శించుట నీకు తగదు. నేను నీ కీ షత్యమును చెప్పితిని, సావధానముగ వినుము.

**న తస్య కశ్చిత్తపసా విద్యయా వా**
**న యోగవీర్యేణ మనీషయా వా ।**
**నైవార్థధర్మైః పరతః స్వతో వా**
**కృతం విహన్తుం తనుభృద్విభూయాత్ ॥ 12**

ఏజీవు డైన తపోజ్ఞానములచేత గాని, యుత్తమ మగు యోగప్రభావము చేతగాని, సామాదిబుద్ధిబలము చేతగాని, అర్థధర్మములచేతగాని లేదా బలమగు నితర వస్తువు నాశ్రయించుట చేతగాని, తన శక్తిచేతగాని యీపరమేశ్వరుని కృతకార్యమును అన్యథా చేయుటకు సమర్థుడు కాడు.

భవాయ నాశాయ చ కర్మ కర్తుం
శోకాయ మోహాయ సదా భయాయ ।
సుఖాయ దుఃఖాయ చ దేహయోగ -
మవ్యక్తదిష్టం జనతాఙ్గ ధత్తే ॥ 13

వత్సా! జీవులు పుట్టుక, నాశము, శోకము, మోహము, భయము, సుఖము, దుఃఖము అనువానిపై కర్మల చేయుచు నెల్లప్పుడు ఈశ్వరదత్త మగు దేహసంబంధమును పొందుచుందురు. (దానిని అన్యథాచేయుట కెవ్వరును సమర్థులుకారు).

యద్వాచి తన్త్యాం గుణకర్మనామభిః
సుదుస్తరైర్వత్స వయం సుయోజితాః ।
సర్వే వహామో బలిమీశ్వరాయ
ప్రోతా నసీవ ద్విపదే చతుష్పదః ॥ 14

వృషభములు మున్నగు చతుష్పాదప్రాణులు ముకుత్రాళ్ళచే గట్టి వేయబడినవై ద్విపాదు లగు మనుష్యుల యిష్టము ననుసరించి వారిపనులను జేయుచుండును. అట్లె మేముగూడ భగవానుని వాక్కులనెడు వేదలక్షణ రజ్జువులయందు గుణకర్మనామములచే (సత్త్వాది గుణములచేత, ఆయా గుణభేదములవలన తమతమ వర్ణాశ్రమములకు దగిన కర్మల చేత, తన్నిబంధనములగు బ్రాహ్మణక్షత్రియాదు లను నామములచేత) గట్టిగ గట్టివేయబడి భగవానుని యిచ్ఛానుసారముగ గర్మలజేయుచున్నాము.

ఈశాభిసృష్టం హ్యవరున్ధ్మహేఽఙ్గ
దుఃఖం సుఖం వా గుణకర్మసఙ్గాత్ ।
ఆస్థాయ తత్తద్యదయుఙ్క్త నాథ -
శ్చక్షుష్మతాన్ధా ఇవ నీయమానాః ॥ 15

ప్రియవ్రతా! కర్మఫలప్రదాత యగు భగవానుడు గుణానురూపము లగు కర్మల ననుసరించి మన కే యే దేవతిర్యగాది శరీరముల నిచ్చెనో ఆ యా దేహములను స్వీకరించి కన్నులు గలవానిచే గొనిపోబడు గ్రుడ్డివానివలె మనముగూడ ప్రయోజకకర్త యగు ఈశ్వరు డిచ్చిన సుఖదుఃఖముల ననుభవించుచున్నాము.

ముక్తోఽపి తావద్బిభృయాత్స్వ దేహ -
మారబ్ధమశ్నన్నభిమానశూన్యః ।
యథానుభూతం ప్రతియాతనిద్రః
కిం త్వన్యదేహాయ గుణాన్న వృఙ్క్తే ॥ 16

మానవుడు నిద్రనుండి మేల్కొని స్వప్నదృష్టవిషయములను స్మరించునట్లు ఆత్మవేత్త యగు పురుషుడు గూడ కర్తృత్వభోక్తృత్వాది బుద్ధి రహితుడై ప్రారబ్ధకర్మ యున్నంతవఱకు ప్రారబ్ధమును (ప్రాక్తన కర్మోపస్థాపితము లగు సుఖదుఃఖములను) అనుభవించును. కాని ఏ గుణ కర్మలచేత, వాసనలచేత దేహాంతరము లభించునో వాని నతడు సేవింపడు.

భయం ప్రమత్తస్య వనేష్వపి స్యాద్ -
యతః స ఆస్తే సహషట్సపత్నః ।
జితేన్ద్రియస్యాత్మరతేర్బుధస్య
గృహాశ్రమః కిం ను కరోత్యవద్యమ్ ॥ 17

జితేంద్రియుడు కాని పురుషుడు వనమునకు వెడలినను వానికి ద్వితీయాభినివేశము వలన గలిగిన భయము లేదా సంసారము కలుగవచ్చును. ఏలయన, అతడు మనస్సు, బుద్ధీంద్రియపంచకము అను నీ యాఱుగురు శత్రువులతో సంబంధము కలిగియుండును. ఇంద్రియములను జయించినవాడు, పరమాత్మయం దాసక్తిగలవాడు నగుజ్ఞానికి గృహస్థాశ్రమ మెట్లపకారము గలిగించును?

యః షట్సపత్నాన్ విజిగీషమాణో
గృహేషు నిర్విశ్య యతేత పూర్వమ్ ।
అత్యేతి దుర్గాశ్రిత ఊర్జితారీన్
క్షీణేషు కామం విచరేద్విపశ్చిత్ ॥ 18

శత్రువులతో సమానము లైన మనస్సును, పంచజ్ఞానేంద్రియములను జయింపదలచినవాడు మొదట తన గృహస్థాశ్రమమునందే యుండి వానివిషయమై యత్నింపవలెను. శత్రువర్గము జయింపబడినచో పిమ్మట దుర్గమునందుగాని, దానికంటె భిన్నమగు ఇతరప్రదేశములలోగాని స్వేచ్ఛగ దిరుగవచ్చును. అట్లే బుద్ధిమంతు డగు మానవు డాఱుగురు శత్రువులను జయించి యనంతరము గృహమునందుగాని, వనమునందు గాని లేదా మఱియేప్రదేశమం దైనగాని యిష్టమువచ్చినట్లు సంచరింప వచ్చును. ఏలయన, పురుషుడు మొదట కోట నాశ్రయించియే ప్రబలురగు శత్రువులను జయించును గదా!

త్వం త్వబ్జనాభాఙ్ఘ్రి సరోజకోశ -
దుర్గాశ్రితో నిర్జితషట్సపత్నః ।
భుఙ్క్ష్వేహ భోగాన్ పురుషాతిదిష్టాన్
విముక్తసఙ్గః ప్రకృతిం భజస్వ ॥ 19

పద్మనాభు డగు శ్రీమన్నారాయణుని పాదపద్మకోశ మను దుర్గము నాశ్రయించి నీ వాయాఱుగురు శత్రువులను జయించితివి. అందువలన నిపుడు గృహస్థాశ్రమమున

నుండి నీ ప్రభు విచ్చిన భోగముల ననుభవింపుము. పిమ్మట పుత్రకళత్రాదుల సాంగత్యమును పరిత్యజించి వనమునకు వెడలి శ్రీహరిని యారాధింపుము.

## శ్రీ శుకఉవాచ

**ఇతి సమభిహితో మహాభాగవతో భగవతస్త్రివ నగురోరను శాసనమాత్మనో లఘుతయా వనతశిరోధరో బాఢమితి సబహుమానము వాహ ॥ 20**

శుకుడు పలికెను :- బ్రహ్మచే ఇట్లాదేశింపబడినవాడై పరమభక్తుడగు ప్రియవ్రతుడు తనయల్పజ్ఞత వలన మూడులోకములకు గురు వగు బ్రహ్మయొక్క అనుజ్ఞను (నీ యాదేశమును నెఱవేర్తునని) అవనతమస్తకుడై స్వీకరించెను.

**భగవానపి మనువా యథావదుపకల్పితాపచితిః ప్రియవ్రతనారద యోరవిషమమభిసమీక్షమాణయోరాత్మనమవస్థాన మవాఙ్మనసం క్షయమవ్యవహృతం ప్రవర్తయన్నగాత్ ॥ 21**

పిమ్మట మనువుచే యథావిధిగ సత్కరింపబడినవాడై ఐశ్వర్య శాలి యగు బ్రహ్మకూడ ప్రియవ్రతనారదుల యెదుటనే అంతర్హితుడై తన నిలయమునకు వెడలెను. ఆయన ధామము మనస్సునకుగాని, వాక్కులకుగాని అగోచరము, వ్యవహారాతీతము నైయున్నది. (ప్రియవ్రతుని యోగభ్రంశమువలన, నారదుని శిష్యనాశమువలన వారిరువురు తాను వెడలి పోవునపుడు తనపై కుటిలదృష్టి నుంచెడివారే యని బ్రహ్మ భావించెను. కాని యది జరుగలేదు). ప్రియవ్రతనారదు లిరువురు విషమముకాని అక్షుణ్ణమైన దృష్టితో బ్రహ్మను దర్శింపసాగిరి. కాని 'నివృత్తు డగు ప్రియవ్రతుని మరల ప్రవృత్తి మార్గమున ప్రవేశ పెట్టితినిగదా' యని బ్రహ్మ విషణ్ణుడయ్యెను. (వ్యవహారాతీత మగు స్వరూపమును జింతించుచు అంతర్హితుడయ్యెను.)

**మనురపి పరేణైవ ప్రతిసన్ధితమనోరథః సురర్షివరాను మతేనాత్మ జమఖిలధరామణ్డలస్థితిగుప్తయ ఆస్థాప్య స్వయమతివిషమవిషయ విషజలాశయాశాయా ఉపరరామ ॥ 22**

పుత్రుని రాజ్యమునం దభిషిక్తునిగ జేసి తాను వనమునకు వెడల వలయు నని మనువు భావించెను. బ్రహ్మ ఆయన యా మనోవాంఛను నెఱవేర్చెను. అపుడు మనువుకూడ దేవర్షి యగు నారదునియనుజ్ఞ ననుసరించి సర్వభూమండలమును పాలించుటకు, రక్షించుటకు తన పుత్రుడగు ప్రియవ్రతునకు రాజ్య మప్పగించి తాను అతివిషమవిషయ పరిపూర్ణ మగు సంసారకాసారము నందలి భోగవాసనలనుండి నివృత్తుడయ్యెను.

ఇతి హ వావ స జగతీపతి రీశ్వరేచ్ఛయా ధినివేశితకర్మాధి కారోఽఖిల జగద్బన్ధ ధ్వంసన పరానుభావస్య భగవత ఆదిపురుషస్యాఙ్ఘ్రియుగలానవరత ధ్యానానుభావేన పరిరన్ధిత కషాయాశయోఽవదాతోఽపి మానవర్ధనో మహతాం మహీతలమను శశాస ॥ 23

ఇట్లు భూపతి యగు ఆ ప్రియవ్రతుడు ఈశ్వరునియిచ్ఛ ననుసరించి రాజ్యభారమును వహించెను. సర్వజగత్తును బంధనములనుండి విడిపించుట యందు గొప్ప ప్రభావము గలవాడు ఆదిపురుషుడు నగు భగవానుని చరణయుగళమును నిరంతరము ధ్యానించు చుండుటవలన ప్రియవ్రతుని విషయరాగాదిమలము పూర్వమే దగ్ధ మయ్యెను. వాని చిత్తము మిగుల పరిశుద్ధమయ్యెను. అయినను బ్రహ్మాదిమహాత్ముల గౌరవమును వృద్ధి చేయుటకై ఆయన భూమండలమును పరిపాలింప బ్రవృత్తుడయ్యెను.

మ॥ *ధరణీవల్లభుఁ డాప్రియవ్రతుఁడు మోదం బందుచున్ లీలనీ*
*శ్వరవాక్యంబునఁ గర్మతంత్ర పరుఁడై సంగంబులం బాపుశ్రీ*
*హరిపాదాంబుజచింతనం దగిలి నిత్యానందముం బొంది దు*
*ర్భరరాగాదులఁ బాఱఁదోలి ప్రజలం బాలించెనత్యున్నతిన్.* (5-15)

అథ హ దుహితరం ప్రజాపతేర్విశ్వకర్మణ ఉపయేమే బర్హిష్మతీం నామతస్యాము హవావ ఆత్మజానాత్మసమానశీలగుణకర్మరూపవీర్యోదారాన్ దశ భావయామ్బభూవ కన్యాం చ యవీయసీమూర్జస్వతీం నామ ॥ 24

పిమ్మట ప్రియవ్రతుడు ప్రజాపతి యగు విశ్వకర్మపుత్రికయైన 'బర్హిష్మతి' యను నామెను పరిణయమాడెను. ఆమెవలన తనతోసమానులగు శీలగుణరూప పరాక్రమములు గల పదుగురు పుత్రులను, 'ఊర్జస్వతి' యను నొక పుత్రికను గనెను. ఈ కన్య అందఱి కంటె చిన్నది.

ఆగ్నీధ్రేధ్మజిహ్వాయజ్ఞ బాహుమహావీరహిరణ్య రేతో ఘృతపృష్ఠసవన మేధాతిథి వీతిహోత్రకవయ ఇతి సర్వ ఏవాగ్నినామానః ॥ 25

(ఆ పదుగురు పుత్రుల నామము లీక్రింది విధముగ నున్నవి). ఆగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహువు, మహావీరుడు, హిరణ్యరేతసుడు, ఘృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిథి, వీతిహోత్రుడు, కవి, వీరందఱకు అగ్నిగణముల నామములే యుంచబడినవి.

ఏతేషాం కవిర్మహావీరః సవన ఇతి త్రయ ఆసన్నూర్ధ్వ రేతసః, త ఆత్మవిద్యాయామర్భ భావా దారభ్య కృతపరియచయాః పారమహంస్యమేవా శ్రమమభజన్ ॥ 26

వీరిలో కవి, మహావీరుడు, సవనుడు అనుముప్వురు ఊర్ధ్వరేతస్కు లైరి. వారు బాల్యము నుండియు బ్రహ్మవిద్యయందు పరినిష్ఠితులై పారమ హంస్యాశ్రమమునే (సన్న్యాసాశ్రమమునే) స్వీకరించిరి.

**తస్మిన్ను హ వా ఉపశమసీలాః పరమఋషయః సకలజీవ నికాయావాసస్య భగవతో వాసుదేవస్య భీతానాం శరణ భూతస్య శ్రీమచ్చరణారవిన్దావిరతస్మరణా విగలిత పరమభక్తి యోగాను భావేన పరిభావితాన్తర్హృదయాధిగతే భగవతి సర్వేషాం భూతానా మాత్మభూతే ప్రత్యగాత్మన్యేవాత్మనస్తాదాత్మ్యమవిశేషేణ సమీయుః ॥ 27**

కవి, మహావీరుడు, సవనుడు అను ముప్వురు సన్న్యాసాశ్రమమునం దుండి జితేంద్రియులు, పరమఋషులై నిఖిలజీవుల కాశ్రయుడు, భవభయపీడితు లగు జనుల కేకైకరక్షకుడు నగు వాసుదేవుని పాదపద్మముల ననుక్షణము ధ్యానింపసాగిరి. అవిచ్ఛిన్న మగు పరమభక్తి యోగ ప్రభావముచే వారియంతఃకరణము నిర్మల మయ్యెను. భక్తియోగ పరిభావితము విశుద్ధము నగు హృదయమున చిదచిత్తుల ఆశ్రయస్వరూపు డగు అనగా చిదచిచ్ఛక్తివిశిష్టు డగు భగవాను డావిర్భవించుటవలన వా రౌపాధిక (దేహమనస్సుల) ధర్మమును పరిత్యజించి భగవత్సాధర్మ్యమును పొందిరి.

**అన్యస్యామపి జాయాయాం త్రయః పుత్రా ఆసన్ ఉత్తమస్తామసో రైవత ఇతి మన్వన్తరాధిపతయః ॥ 28**

ప్రియవ్రతుడు తన రెండవభార్యవలన ఉత్తముడు, తామసుడు, రైవతుడు అను ముగ్గురు పుత్రులను గనెను. ఈ ముప్వురు మూడు మన్వంతరముల కధిపతులైరి.

**ఏవముపశ మాయనేషు స్వతనయేష్వథ జగతీపతిర్జగతీ మర్బుదాన్యేకాదశ పరివత్సరాణామవ్యాహతాఖిలపురుష కారసార సమ్భృతదోర్దణ్డయుగలాపీడితమౌర్వీగుణ స్తనితవిరమితధర్మ ప్రతిపక్షో బర్హిష్మత్యాశ్చానుదివమేధమానప్రమోదప్రసరణ యౌషిణ్య వ్రీడా ప్రముషితహాసావలోకరుచిరక్ష్వేల్యాదిభిః పరాభూయమానవివేక ఇవానవ బుధ్యమాన ఇవ మహామనా బుభుజే ॥ 29**

ఇట్లు తనపుత్రులు సన్న్యాసాశ్రమమును స్వీకరింపగా మనస్వియగు ప్రియవ్రతుడు పదునొకం డర్బుదసంవత్సరములు పృథివిని పాలించెను. ఆయన బాహుదండములు అవ్యాహతము లగు బలపౌరుషము లతో నిండి యున్నవి. ఆయన వానిచే ధనుష్టంకారము

చేయగా ధర్మవ్యతిరేకు లగు మానవులు (ఆ ధ్వనిని విని యుద్ధవ్యతిరేకులై) కనబడకుండగ పోయిరి. ఆయన విషయభోగముల యందును మిగుల నైపుణ్యము గలవాడే, పతిదర్శనము వలన ప్రతిదినము వృద్ధిపొందు బర్హిష్మతి యొక్క హర్షములు, అభిగమనాది విలాసములు, స్త్రీజనోచితశృంగారజనితము లైన సుఖానుభవప్రదర్శనములు, తజ్జన్యములైన లజ్జాసంకోచముల వలన గలిగిన మందహాస కటాక్ష విక్షేపములు, మనోముగ్ధకరము లగు పరిహాస వాక్యాది ప్రయోగములు మున్నగు వానిద్వారా ప్రియవ్రతుని వివేకజ్ఞానము తిరస్కృత మయ్యెను. అందువలన విషయాసక్తిచే అతడు తనస్వరూపమును మఱచి నట్లుగ గనబడెను.

**యావదవభాసయతి సురగిరమనుపరిక్రామన్ భగవానాదిత్యో వసుధాతల మర్ధేనైవ ప్రతపత్యర్ధే నాచ్ఛాదయతి తదా హి భగవదుపాసనోప చితాతిపురుషప్రభావస్తదనభినన్దన్ సమజవేన రథేన జ్యోతిర్మయేన రజనీమపి దినం కరిష్యామీతి సప్త కృతత్వ స్తరణి మనుపర్య క్రామద్ద్వితీయ ఇవ పతఙ్గఃఏవం కుర్వాణం ప్రియవ్రత మాగత్య చతురాననస్త వాధికారోఽయం న భవతీతి నివారయామాస ॥ 30**

తేజస్వి యగు ప్రభాకరుడు లోకాలోకపర్వతమువఱకు కిరణములను ప్రసరింప జేసి మేరువునకు ప్రదక్షిణము చేయును, అపుడు భూమిలోని సగము భాగము వెలుగుతోను సగము భాగము చీకటితోను ఆవరించియుండును. ఇపుడు ప్రియవ్రత మహారాజున కది రుచింపకపోవుటచే అతడు అంధకారావరణము పట్ల అయిష్టతను వెల్లడి చేసి 'నా ప్రభావముచే రాత్రిని పగటిగ మార్చివేయుదు' నని ప్రతిజ్ఞచేసెను. ఈయభిప్రాయముచే అతడు సూర్య రథమువలె సమానమైన వేగముగల తన జ్యోతిర్మయ రథము నధిరోహించి రెండవ సూర్యునివలె ఏడుమారులు దివాకరునకు ప్రదక్షిణము చేసెను. భగవదుపాసనా ప్రభావముచే ఆయన అలౌకిక ప్రభావము వృద్ధి పొందెను. అందువలన ఇట్టిపని జేయుట ఆయన విషయమున అసంభవముకాదు. కాని ఆయన యిట్లు సూర్యునిచుట్టు పరిభ్రమించు చుండగా బ్రహ్మ ఆయనకడకు వెడలి 'వత్సా! ఇది నీయధికారాంతర్గత మగుపని కా' దని పలికెను.

**యే వా ఉహ తద్రథచరణనేమికృతాః పరిఖాతాస్తే సప్త సిన్ధవ ఆసన్ యత ఏవ కృతాః సప్త భువో ద్వీపాః ॥ 31**

ప్రియవ్రతుని రథచక్రముల ద్వారా యేడుగాడులు పడినవి. ఇవియే సప్తసముద్రములుగ ప్రసిద్ధిచెందినవి. ఈ సముద్రములవలననే పృథ్వి యందు సప్తద్వీపము లేర్పడినవి.

**జమ్బు ప్లక్ష శాల్మలి కుశ క్రౌఞ్చ శాకపుష్కరసంజ్ఞాస్తేషాం పరిమాణం పూర్వస్మాత్పూర్వస్మాదుత్తరో యథాసంఖ్యం ద్విగుణమానేన బహిః సమన్తత ఉపక్లప్తాః ॥** 32

ఆ సప్తసముద్రముల ద్వారా యేర్పడిన భూమియందలి యేడుద్వీపములు - జంబు ప్లక్ష శాల్మలి కుశ క్రౌంచ శాక పుష్కరము లనునవి. (రాజా!) ఆ ద్వీపములలో ఒకదానికంటె నొకటి రెండు రెట్లు పరిమాణమున నున్నవి. ఈ ద్వీపము లొక్కొక్కటి సముద్రమునకు బయట నలువైపుల వ్యాపించి యున్నవి.

**క్షారోదేక్షురసోసురోదఘృతోదక్షీరోదదధిమణ్డోద శుద్ధోదాః సప్త జలధయః సప్తద్వీపపరిఖా ఇవాభ్యంతరద్వీప సమానా ఏకైకశ్యేన యథానుపూర్వం సప్తస్వపి బహిర్ద్వీ పేషు పృథక్పృథక్పరిత ఉపకల్పితాః। తేషు జంబ్వాదిషు బర్హిష్మతీ పతిరనువృత్తా నాత్మజానాగ్నీ ధ్రేధ్మజిహ్వ యజ్ఞబాహు హిరణ్యరేతో ఘృతపృష్ఠ మేధాతిథివీతిహోత్ర సంజ్ఞాన్ యథాసంఖ్యే నైకైక స్మిన్నేకమేవాధిపతిం విదధే ॥** 33

(ఒక్కొక్క సముద్రమునకు బయట ఒక్కొక్కద్వీప మున్నట్లు ఒక్కొక్క ద్వీపమునకు బయట ఒక్కొక్క సముద్రమున్నది. ఈ సముద్రములను గూర్చి చెప్పెదను వినుము) లవణము, ఇక్షు, సుర, ఘృతము, దధి, దుగ్ధము, జలము అనునీయేడు విధము లగుజలములతో నిండిన సప్తసముద్రము లీ సప్తద్వీపములకు పరిఖలవలె నుండెను. ఈ సముద్రములచే పరివేష్టితము లగు ఆద్వీపముల పరిమాణము ఆ సముద్రముల పరిమాణముతో సమానముగ నుండెను. ఈ సముద్రము లన్నియు వేఱువేఱుగ ఆద్వీపము లను బయటనుండి వ్యాపించి యున్నవి. బర్హిష్మతిపతి యగు ప్రియవ్రతుడు తన యాజ్ఞానువర్తు లగు ఆగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహువు, హిరణ్యరేతసుడు, ఘృతపృష్ఠుడు, మేధాతిథి, వీతిహోత్రుడు అనునేడుగురు పుత్రులలో ఒక్కొక్కని సప్తద్వీపములలో ఒక్కక్కదానికి రాజుగా జేసెను.

**దుహితరం చోర్జస్వతీం నామోశనసే ప్రాయచ్ఛద్యస్యా మాసీద్దేవయానీ నామ కావ్యసుతా ॥** 34

ప్రియవ్రతుడు తనపుత్రిక యగు ఊర్జస్వతి యనునామెను శుక్రాచార్యున కిచ్చి వివాహము చేసెను. ఈమె వలన ఆ శుక్రాచార్యుడు దేవయాని యనునొక పుత్రికను గనెను.

నైవం విధః పురుషకార ఉరుక్రమస్య
పుంసాం తదఙ్ఘ్రి రజసా జితషడ్గుణానామ్ ।
చిత్రం విదూరవిగతః సకృదాదదీత
యన్నామధేయమధునా స జహాతి బన్ధమ్ ॥ 35

మహారాజా! విచిత్రశక్తి గలభగవానునిభక్తులు భగవత్పాదరజము ద్వారా షడ్గుణములను జయించిరి. వారి కిట్టి పౌరుష ముండుట ఆశ్చర్యకర మేమియుగాదు. ఏలయన, అంత్యజు డైనను ఒక్కమారు భగవన్నామమును స్వీకరించినచో అతడు వెంటనే అవిద్యాబంధనముల నుండి ముక్తుడగును.

*కం॥ హరిసేవ నాప్రియవ్రతుఁ*
*డరయఁగఁ గైవల్యపదవి నందుట యరుదే*
*ధరఁ జండాలుం డైనను*
*హరినామస్మరణఁ జెందు నవ్యయపదమున్.* (5-23)

స ఏవమపరిమితబలపరాక్రమ ఏకదా తు దేవర్షి చరణాను శయనానుపతిత గుణవిసర్గ సంసర్గేణా నిర్వృతమివాత్మానం మన్యమాన ఆత్మనిర్వేద ఇదమాహ ॥ 36

ఇట్లమితబలవీర్య సంపన్ను డగుప్రియవ్రతు డొకప్పుడు దేవర్షి యగు నారదుని చరణముల నాశ్రయించినందులకు ఫలముగ రాజ్యాదిభోగములను ప్రాపంచిక రూపముతో ననుభవించి, వాని సాంగత్యమువలన తన్ను ఆనందరహితునిగ భావించి, నిర్వేదగ్రస్తుడై యిట్లు పలుక సాగెను.

అహో అసాధ్వనుష్ఠితం యదభినివేశితోఽహమిన్ద్రియై రవిద్యా రచితవిషమ విషయాన్ధకూపే తదలమలమముష్యా వనితాయా వినోదమృగం మాం ధిగ్ధిగితి గర్హయాంచకార ॥ 37

ఆహా ! నే నెట్టి అన్యాయకార్య మొనరించితిని. ఇంద్రియములు ఇన్నినాళ్ళు నన్ను అవిద్యావిరచిత విషమవిషయాంధకూపమున బడవేసి యుంచినవిగదా? విషయములు యథేష్టముగ ననుభవింపబడినవి. కాని వానివలన నెట్టిప్రయోజనము లేదు. నే నీస్త్రీచేతిలో ఆటబొమ్మవలె నై పడియుంటిని. ఎంతధిక్కారము ! ఇట్టి భావముతో ప్రియవ్రతుడు తన్ను నిందించు కొనసాగెను.

పరదేవతాప్రసాదాదిధి గతాత్మ ప్రత్యవమర్శేనానుప్రవృత్తేభ్యః స్వ పుత్రేభ్య ఇమాం యథాదాయం విభజ్య భుక్తభోగాం చ మాహిషీం మృతకమివ సహమహా విభూతి మపహాయ స్వయం నిహిత నిర్వేదో హృది గృహీతహరి విహారాను భావో భగవతో నారదస్య పదవీం పునరేవానుససార ॥ 38

పరమపురుషు డగు భగవానుని కృపచే నాతనికి స్వరూపజ్ఞాన ముద్బుద్ధ మయ్యెను. ఆయన హృదయమున విషయతృష్ణ తొలగుటవలన, శ్రీహరి విహారచింతన ముదయించుట వలన వానికి త్యాగసామర్థ్యము కలిగెను. అందువలన నతడు త న్ననుసరించుపుత్రులకు పృథివిని తగినవిధముగ విభజించి యిచ్చి భుక్తభోగములను, సామ్రాజ్యలక్ష్మిని, తన భార్యను మృతదేహమువలె పరిత్యజించి మరల నారదమహర్షి యుపదేశించిన మార్గము ననుసరించెను.

తస్య హ వా ఏతే శ్లోకాః :-

ప్రియవ్రతకృతం కర్మ కో ను కుర్యాద్వినేశ్వరమ్ ।
యో నేమి నిమ్నైరకరోచ్ఛాయాం ఘ్నన్ సప్త వారిధీన్ ॥ 39

రాజా ! ఆ ప్రియవ్రతుని మహిమను గురించి చెప్పు ఈశ్లోకములు పూర్వ కాలమునుండియు వ్యవహారములో నున్నవి. (చెప్పుచున్నాను, వినుము). ప్రియవ్రతుడు చేసిన కర్మలను ఒక్క యీశ్వరుడు తప్ప మఱియెవ్వరును చేయజాలరు. ప్రియవ్రతు డంధకారమును నాశనము చేయుటకై పరిభ్రమణము చేయుచు చేయుచు తనరథ చక్రములచే ఏడు సముద్రముల నేర్పఱచెను.

భూసంస్థానం కృతం యేన సరిద్గిరివనాదిభిః ।
సీమా చ భూతనిర్వృత్త్యైద్వీపే ద్వీపే విభాగశః ॥ 40

ఆ ప్రియవ్రతుడు ప్రాణులసుఖమునకై ద్వీపములను సృష్టించి యిచ్చెను. (జీవులలో పరస్పరము వివాదము కలుగకుండుటకై యేర్పాటు చేసెను). ప్రతి ద్వీపము నందును నదులు, పర్వతములు, వనములు మున్నగు వానిద్వారా హద్దుల నేర్పాటు చేసెను.

భౌమం దివ్యం మానుషం చ మహిత్వం కర్మయోగజమ్ ।
యశ్చక్రే నిరయౌపమ్యం పురుషానుజనప్రియః ॥ 41

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే ప్రియవ్రత విజయే
ప్రథమోఽధ్యాయః ॥

పరమపురుషు డగు భగవానుని అనుసరించు జనులే ప్రియవ్రతునకు ప్రియులైరి. అందువలన ఆయన కర్మజము, యోగజము, స్వర్గజము, మర్త్యలోకజము అగుసర్వవైభవములను నరకతుల్యములుగ భావించెను.

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమందలి పంచమస్కంధములో
ప్రియవ్రతవిజయ మను మొదటి అధ్యాయము
సంపూర్ణము.





# రెండవ అధ్యాయము

## ఆగ్నీధ్ర చరిత్రము

కథాసారము :- ఈ యధ్యాయమున ఆగ్నీధ్రుని చరిత్రము వివరింప బడినది.

తనతండ్రి యగు ప్రియవ్రతుడు పరమార్థమును సాధించుటకు ప్రవృత్తుడు కాగా ఆగ్నీధ్రుడు తండ్రియాదేశము ననుసరించి జంబూద్వీపవాసు లగుజనులను ధర్మానుసారముగ పుత్రులవలె పాలింపసాగెను. అత డొకప్పుడు పుత్రులను వాంఛించి మందర పర్వత గుహలో తపస్సు చేయసాగెను. ఐశ్వర్యశాలి యగుబ్రహ్మ వాని తపస్సునకు గలకారణమును తెలిసికొని పూర్వచిత్తి యనునొక యప్సరసను ఆగ్నీధ్రునికడకు బంపెను. ఆమె ఆగ్నీధ్రుని యాశ్రమమందలి ఉద్యానవన సమీపమునకు వచ్చి శృంగార భావసూచకము లగునానా విధము లగుహావభావాదులను వెల్లడించు చుండెను. ఆగ్నీధ్రు డామెను జూచి మిగుల మోహితు డయ్యెను. ఆ యప్సరస హావభావములు, లజ్జ, మధురవాక్కులు, వయనాద్యవయములు ఆగ్నీధ్రుని నేత్రములను మనస్సును హరించెను. ఆగ్నీధ్రుడు గ్రామ్యవైదగ్ధ్యము నందును మిగుల నిపుణుడై యుండెను. అందువలన ఆయచ్చరయు ఆగ్నీధ్రునిరసపూర్ణము లగువాక్కులకు సంతుష్టయై ఆతనిని భర్తగా వరించెను. బహు వర్షముల వఱకు ఆతనితో రాజ్యసుఖాదుల ననుభవించి మరల స్వస్థానమునకు వెడలెను.

ఆగ్నీధ్రు డాయప్సరసవలన నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అనుతొమ్మండుగురు పుత్రులను గనెను. వారికి వారివారి నామముల ననుసరించి తొమ్మిదివర్షములను విభజించి యిచ్చెను. ఆగ్నీధ్రుడు భోగముల యందు తృప్తి నొందక యెల్లపుడు అప్సరసనుగూర్చి యాలోచించు చుండుట వలన మరణించిన పిమ్మట వానికి అప్సరోలోకము కలిగెను. తండ్రి మరణానంతరము వాని తొమ్మండుగురు పుత్రులు మేరు దేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్ర లత, రమ్య, శ్యామ, నారి, భద్ర, దేవదీధితి యను మేరువుయొక్క తొమ్మండుగురు కన్యలను వివాహ మాడిరి.

### శ్రీ శుక ఉవాచ

**ఏవం పితరి సంప్రవృత్తే తదనుశాసనే వర్తమాన ఆగ్నీధ్రో జమ్బూద్వీపౌకసః ప్రజా ఔరసవద్ధర్మావేక్షమాణః పర్యగోపాయత్ ॥ 1**

శుకదేవుడు పలికెను :- రాజా ! తండ్రి యగు ప్రియవ్రతుడు పూర్వోక్త మగుజ్ఞానము నవలంబించి రాజ్యపాలనాది కార్యములనుండి నివృత్తుడయ్యెను. ఆయన యాజ్ఞననుసరించి

అతని కుమారు డగు ఆగ్నీధ్రుడు రాజ్యకార్యప్రవృత్తుడై ధర్మపూర్వకముగ జంబూద్వీప వాసులను సంతానమువలె పరిపాలింప సాగెను.

స చ కదాచిత్ పితృలోకకామః సురవరవనితాక్రీడా చల ద్రోణ్యాం భగవన్తం విశ్వసృజాం పతిమాభృత పరిచర్యోపకరణ ఆత్మైకాగ్ర్యేణ తపస్వీ ఆరాధయాం బభూవ ॥ 2

అయ్యాగ్నీధ్రుడు ఒకప్పుడు పితృలోకమును పొందించు పుత్రులను గోరినవాడై దేవతా స్త్రీలకు క్రీడాస్థల మగు మందరపర్వతగుహ నాశ్రయించెను, అచట పుష్పాది పూజాద్రవ్యములను సేకరించి తపస్సు చేయుటయం దాసక్తుడై యేకాగ్రచిత్తముతో ఐశ్వర్యశాలి యగుబ్రహ్మ నారాధింప సాగెను.

తదుపలభ్య భగవానాదిపురుషః సదసి గాయన్తీం పూర్వచిత్తిం నామాప్సర మభియాపయామాస ॥ 3

ఆదిపురుషుడు, ఐశ్వర్యశాలియు నగుబ్రహ్మ ఆగ్నీధ్రుని తపస్సును గూర్చి తెలిసికొని దేవసభయందు గానముచేయు 'పూర్వచిత్తి' యను అప్సరసను సంభోగార్థమై వానికడకు పంపెను.

సా చ తదాశ్రమోపవనమతిరమణీయం వివిధ నిబిడ విటపి విటపనికర సంశ్లిష్టపురటలతారూఢస్థల విహఙ్గమమిథునైః ప్రోచ్యమానశ్రుతిభిః ప్రతిబోధ్యమానసలిల కుక్కుట కారణ్డవ కలహంసాదిభిర్విచిత్రముప కూజితా మలజలాశయ కమలాకరముపబభ్రామ ॥ 4

ఆపూర్వచిత్తి ఆగ్నీధ్రుని యాశ్రమమునకు సమీపమున నున్న ఉప వనమున సంచరించు చుండెను. ఆయుద్యానవనము మిగుల రమణీయముగ నుండెను. అచట దట్టము లైన నానాజాతీయము లగుతరువులశాఖలు స్వర్ణ లతలచే వ్యాప్తము లైయుండెను. వాని పైన మయూరాది స్థలవిహంగమ మిథునములు షడ్జాదిమధుర స్వరములతో ధ్వనిచేయు చుండెను. వానిని విని జలకుక్కుటములు, కారండవములు, హంసలు మున్నగు జలచర పక్షులు మేలు కొని విచిత్రము లగుధ్వనుల జేయసాగినవి. వానిచే నచట నున్న కమల శోభితము లగు నిర్మల జలాశయములె కోలాహలము చేయుచున్నట్లు తోచు చుండెను.

తస్యాః సులలితగమన పదవిన్యాస గతివిలాసాయాశ్చానుపదం ఖణఖణాయమానరుచిరచరణాభరణ స్వనముపాకర్ణ్య నర దేవకుమారః సమాధి యోగేనామీలితనయననలినముకుల యుగలమీషద్వికచయ్య వ్యచష్ట ॥ 5

ఆపూర్వచిత్తి యొక్క సుందరగమనమున పాదవిక్షేపాది శృంగారలక్షణములు శోభిల్లుచుండెను. ప్రతిపాద విక్షేపము నందును మనోహరముగ నూపురాది చరణాభరణములు ధ్వనించు చుండెను. వానిని విని రాజకుమారుడగు ఆగ్నీధ్రుడు ధ్యాననిమీలితము లగు తననయన కమలములను కొలదిగ తెరచి చూడసాగెను.

**తామేవావిదూరే మధుకరీమివ సుమనస ఉపజిఘ్రన్తీం దివిజమనుజ మనోనయనాహ్లాదదుఘైర్గతివిహారవ్రీడా వినయావలోక సుస్వరాక్షరావయ వైర్మనసిన్నృణాం కుసుమాయుధస్య విదధతీం వివరం నిజముఖవిగలితామృతాసవ సహాసభాషణామోదమదాన్ధ మధుకరనికరోపరోధేన ద్రుతపద న్యాసేన వల్గుస్పన్దన స్తనకలశకబరభారరశనాం దేవీం తదవలోకనేన వివృతావసరస్య భగవతో మకరధ్వజస్య వశముపనీతో జడవదితి హోవాచ ॥ 6**

ఆయప్సరస ఆడతుమ్మెదవలె పుష్పములకడకు వెడలి వాని నాఘ్రాణించు చుండెను. దేవతల యొక్క, మానవుల యొక్క మనస్సును నేత్రములను ఆనందపఱచునట్టి యామెనడక, విహారము, లజ్జ, వినయముతో గూడిన దృష్టులు, మధురకంఠస్వరము, వాక్కులు, నేత్రాద్యవయవములు మానవుల మనస్సులలోనికి మన్మథుడు ప్రవేశించుటకు ద్వారముగా జేసెను. తుమ్మెదలు ఆమె ముఖమునుండి బయల్వెడలు అమృత తుల్యములు, మధురమగు మధువుతో సమానమగు మాదకత్వవ్యంజకములు నగుహాసనహిత వాక్కులయందు మదించినవియు, నిశ్వాసగంధముచే మదాంధములు నై ఆమెను జుట్టుముట్టి యుండెను. దానివలన ఆయువతి భయముచే కలత చెందినదియై శీఘ్రముగ నడచుచుండగ ఆమె స్తనకలశములు, జుట్టుముడి, మొలనూలు అతిసుందరముగ గంపించు చుండెను. ఆ సుందరిని దర్శించిన మాత్రముననే ఆగ్నీధ్రుడు ముగ్ధుడై మన్మథునకు వశుడయ్యెను. ఆయన జడునివలె నష్టజ్ఞానియై ఆమె నొకప్పుడు స్త్రీగను, ఒకప్పుడు పురుషుని గను సంబోధించుచు పలుకసాగెను.

**కా త్వంచికీర్షసి చ కిం మునివర్య శైలే**
**మాయాసి కాపి భగవత్పర దేవతాయాః ।**
**విజ్యే బిభర్షి ధనుషీ సుహృదాత్మనోఽర్థే**
**కింవా మృగాన్ మృగయసే విపినే ప్రమత్తాన్ ॥ 7**

(ఆగ్నీధ్రుడు పలికెను) మునివర్యా ! నీ వెవరవు ? ఈ పర్వతమున నీ వేమి చేయదలంచు చున్నావు? నీవు బ్రహ్మాదిదేవతల కుపాస్య దేవు డైన భగవానుని మాయవా?

(కనుబొమల యందు దృష్టి నిలిపి) సఖుడా! నీవు అల్లెత్రాడు లేనియీరెండు ధనుస్సులను ఏల ధరించితివి? లేక కామాతుర మృగములవలె జితేంద్రియులము కాని మావంటివారిని వశము చేసికొను ఉద్దేశ్యముతో ధరించితివా ?

బాణావిమౌ భగవత: శతపత్రపత్రౌ
శాన్తావపుంఖరుచిరావతితిగ్మదన్తౌ
కస్మై యుయుఙ్క్షసి వనే విచరన్న విద్మ:
క్షేమాయ నో జడధియాం తవ విక్రమో஽స్తు ॥ 8

(కటాక్షములపై దృష్టి నుంచి) నీనేత్రములు రెండును శతదళ పద్మములు, పక్ష్మయుగళము ఆ పద్మముల పత్రముల వంటివి. ఈ రెండును శృంగార భావము వలన అలసము లైనవి. ఇంకను నీ నేత్రములయందలి కటాక్షరూపబాణములు పుంఖ (బాణములకు పరభాగములందున్న దీర్ఘ శలాకలు) రహితములై మిగుల శోభిల్లుచున్నవి. కాని వాని యగ్రభాగములు మిగుల తీక్ష్ణములుగ అగపడుచున్నవి. ఈవనమున సంచరించుచు ఈ బాణముల నెవరిపైన వేయదలంచు చున్నావు? ఏమైనగానిమ్ము, నీ యీ పరాక్రమము మావంటి మందబుద్ధులకు సుఖప్రద మగుగాక యని కోరు చున్నాను.

శిష్యా ఇమే భగవత: పరిత: పఠన్తి
గాయన్తి సామ సరహస్యమజస్రమీశ ।
యుష్మచ్ఛిఖా విలులితా: సుమనో஽భివృష్టీ:
సర్వే భజన్త్యృషిగణా ఇవ వేదశాఖా: ॥ 9

(ఆ యప్సరసశరీరపరిమళమునందు లుబ్ధములై అనుగమించు చున్న కొన్ని భ్రమరములను జూచి యిట్లు పలుకసాగెను) ప్రభూ! మహామహిమ కల నీ యీశిష్యులు నిన్ను నలువైపుల పరివేష్టించి వేదాంగములతో గూడ సామవేదమును గానము చేయుచున్నట్లుండెను. ఋషులు వేదశాఖలను సేవించువట్లు నీశిష్యులు గూడ నీ శిఖనుండి జారిన పుష్పవృష్టిని సేవించు చున్నవి.

*చ॥ చెదరఁగ వేదముల్ సదువుశిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స*
*మ్మదమున నంతలోఁ గురియుమాడ్కిని మన్మథసామ గానముల్*
*సదివెడు శిష్యులో యనఁగ షట్పదపంక్తులు సేరి మ్రోయఁగాఁ*
*బదపడి మీఁద రాలుఁ గచభారమునందుల జాలుక్రొవ్విరుల్.* (5-1-30)

వాచం పరం చరణపంజరతిత్తిరీణాం
బ్రహ్మన్నరూపముఖరాం శృణవామ తుభ్యమ్ ।
లబ్ధాకదంబరుచిరంకవిటంకబింబే
యస్యామలాతపరిధిః క్వచవల్కలం తే ॥ 10

(నూపురధ్వనిని విని పలుకుచున్నాడు) మహాత్మా ! (అనగా తపో యోగాదిబలముచే బలవంతుడు) నీచరణములయం దున్ననూపురములలో తిత్తిరపక్షి యున్నట్లు తెలియు చున్నది. నేను దానిని జూడలేదు, అయినను దానివాక్కులు నాకు వినబడుచున్నవి. (ఆ యప్సరస ధరించిన వస్త్రము సూక్ష్మమైనది, పచ్చనిది. అది కటి ప్రదేశమున సంలగ్న మై వెల్లడిచేయు లావణ్యమును జూచి పలుకుచున్నాడు) - సుందర మైననితంబ మండలము కలదానా ! నీకటి ప్రదేశము శ్యామవర్ణము కలది యైనను కడిమిపుష్పమువలె పీతవర్ణము దాని కెట్లు కలిగినది? (మేఖలను జూచి) అలాతచక్రమువలె వలయాకారములో నున్న ఆ రేఖ లేమి ? (పరిధేయవసనమును) నితంబ కాంతిరూపమున భావించి ఆమె వస్త్రముమ జూడకయే అడుగు చున్నాడు) నీ వల్కలము (పరిధేయవస్త్రము) లెక్కడ !

కిం సంభృతం రుచిరయోర్ద్విజ శృంగయోస్తే
మధ్యే కృశో వహసి యత్ర దృశిః శ్రితా మే ।
పఙ్కో ఽరుణః సురభిరాత్మవిషాణ ఈదృగ్ -
యేనాశ్రమం శుభగ మే సురభీ కరోషి ॥ 11

(స్తనద్వయముమ లక్ష్యముగా జేసి) ద్విజుడా ! శృంగములవలె ఉన్నతములు, మిగుల మనోహరములు నగునీ యీ రెండు స్తనముల నడుమ ఏమియున్నది? నీ నడుము మిగుల కృశించి యున్నది. అయినను నీ వీరెంటిని మిగుల కష్టముతో ధరించు చున్నావు. నాదృష్టి యీరెంటిపైన లగ్నమై యున్నది. (స్తనగత మైనకుంకుమమును లక్ష్యముగాజేసి, శృంగములవలె ఉన్నతములైన నీ స్తనయుగళమునం దగపడు) అరుణ వర్ణ సుగంధ పంకము అనగా కుంకుమాద్యంగరాగము ఎచటనుండి నీకు లభించినది? సుందరీ ! నీ యీ యంగరాగపరిమళము ద్వారా నా యీ యాశ్రమ మంతయు సువాసిత మగుచున్నది.

లోకం ప్రదర్శయ సుహృత్తమ తావకం మే
యత్రత్య ఇత్థమురసావయవావపూర్వౌ ।
అస్మద్విధస్య మన ఉన్నయనౌ బిభర్తి
బహ్వద్భుతం సరసరాససుధాది వక్త్రే ॥ 12

సుహృద్వరా ! నీవాస స్థానమును నా కొక్కమారు చూపింపుము. అచటి జనులు వక్షఃస్థలము ద్వారా అపూర్వావయవములను ధరించు చున్నారు. వానిని చూచిన మావంటి వారి మనస్సు నేత్రములు రెండును కలత చెందును. ఇంకను వారిముఖము నందు మధురము లగునాలాపములు మందహాసములు మున్నగు విలాసములతో పాటు ఎంతయో అధరామృత మున్నది.

కా వాత్మవృత్తిరదనాద్ధవిరఙ్గ వాతి
విష్ణోః కలాస్య నిమిషోన్మకరౌ చ కర్ణౌ ।
ఉద్విగ్నమీనయుగలం ద్విజపఙ్క్తి శోచి -
రాసన్న భృఙ్గనికరం సర ఇన్ముఖం తే ॥ 13

సఖుడా ! నీ వెట్టియాహారమును స్వీకరించి ప్రాణముల నిలుపు కొనుచున్నావు ? తాంబూలాది చర్వణముచే నీ ముఖమునుండి వెలువడు సుగంధము వలన యజ్ఞసంబంధమగు నేదియో పవిత్ర ద్రవ్యమును భుజించు చుందు వని తెలియుచున్నది. ఏలయన, నీవు విష్ణుకళవు (యజ్ఞాదులయందే కైకభోక్త యగువిష్ణువు యజ్ఞనైవేద్యమును దప్ప ఇతర మైన ద్రవ్యమును దేనినిగూడ భుజింపడు. నీ వా శేషమును స్వీకరింతువు). నీ ముఖమండలము సరోవరమువలె శోభిల్లు చున్నది. నీ కర్ణముల యందు విరాజిల్లు రత్నఖచితములు, మకరాకృతులు నగు కుండలములు నిర్నిమేష నేత్రములు గల రెండు మకరముల వలె నున్నవి. నీ నేత్రములు మీనములవలె చంచలములుగ నున్నవి. అందువలన నీ ముఖసరోవరమున రెండు అనిమిషము లగు మకరములు, చంచలమీనములు విహరించు చున్నవి. అచట నీదంత పంక్తి రాజహంసవలె శోభిల్లు చున్నది. కేశకలాపము పరిమళము నందాసక్తి గొనిన అళికులము వలె ఉన్నది.

యోఽసౌ త్వయా కరసరోజహతః పతంగో
దిక్షు భ్రమన్ భ్రమత ఏజయతేఽక్షిణీ మే ।
ముక్తం న తే స్మరసి వక్తజటావరూథం
కష్టోఽనిలో హరతి లంపట ఏష నీవీమ్ ॥ 14

నీకరకమలములచే గొట్టబడిన కందుకము నలువైపులకు వెడలుచు భ్రాంతచిత్తుడ వగువానయనములను చంచలములుగా చేయుచున్నది. విడివడిన నీకుటిల కేశకలాపము నేల మరల ముడివేసికొనుటలేదు? ఈ ధూర్తపవనము నీయం దాసక్తమై నీపోకముడివి పడలింప చేయుచున్నది. అది కూడ నిన్నే స్మరించుటలేదు కదా !

చ॥ *కరువలిఁ బాయువస్త్రమును గట్ట నెఱుంగవు చూడ్కి దిక్కులం*
*బరపుచుఁ జంచరీకముల భాతిఁ జెలంగెడు కందరంబునం*
*బొరలెడుముక్త కేశభరముం దుఱుమంగఁ దలంప నిప్పడి*
*ట్ల రుదుగ రత్నకందుకవిహారము సల్పెదుసంభ్రమంబునన్.* (5-1-39)

**రూపం తపోధన తపశ్చరతాం తపోఘ్నం**
**హ్యేతన్ను కేన తపసా భవతోపలబ్ధమ్ ।**
**చర్తుం తపోఽర్హసి మయా సహ మిత్ర మహ్యం**
**కిం వా ప్రసీదతి స వై భవభావనో మే ॥ 15**

తపోధనా ! తాపసులతపస్సునకు విఘ్నమును గలుగజేయు నీరూపమును నీవే తపస్సు చేసి పొందితివి. మిత్రుడా! నాతో గలసి తపస్సు చేయుటకు దగియున్నావు. లేదా విశ్వస్రష్ట యగుబ్రహ్మ నాకు ప్రసన్నుడై నిన్ను నాకు భార్యగ జేయుగాక !

**న త్వాం త్యజామి దయితం ద్విజదేవదత్తం**
**యస్మిన్ మనో దృగపి నో న వియాతి లగ్నమ్ ।**
**మాం చారు శృఙ్గ్యర్హసి నేతుమనువ్రతం తే**
**చిత్తం యతః ప్రతిసరన్తు శివాః సచివ్యః ॥ 16**

ద్విజదేవు డగు బ్రహ్మ నిన్ను నా కిచ్చినాడు, నేను నిన్ను వదలను. నీయందు నామనస్సు, నయనములు లగ్నము లై దానినుండి మరలుట లేదు. సుందరము లైన శృంగములు గలవాడా ! నేను నీయనుచరుడను, నీ కిష్టమున్నచోటికి నన్ను తీసికొని వెడలుము. నీ సఖులు గూడ అనుకూలురై నన్ను అనుసరింతురుగాక !

## శ్రీ శుక ఉవాచ

**ఇతి లలనానునయాతి విశారదో గ్రామ్యవైదగ్ధ్యయా పరిభాషయా తాం విబుధవధూం విబుధమతిరధిసభాజయా మాస ॥ 17**

శుకుడు పలికెను :- రాజా ! ఆగ్నీధ్రుడు దేవతలతో సమానుడగు బుద్ధిమంతుడు. స్త్రీవశీకరణాది విషయము లందును మిగుల నిపుణుడు. ఆయన విషయ భోగముల యందలి నైపుణ్యముతో గూడిన పరిహాస వాక్కులచే దేవతా స్త్రీ యగుపూర్వచిత్తిని గొప్పగా గౌరవించెను.

**సా చ తతస్తస్య వీరయూథపతేర్బుద్ధి శీలరూప విద్యా వయః శ్రియౌదార్యేణ పరాక్షిప్త మనాస్తేన సహాయుతాయుత పరివత్సరోపలక్షణం కాలం జంబూద్వీపపతినా భౌమస్వర్గ భోగాన్ బుభుజే ॥ 18**

అనంతరము వీరశ్రేష్ఠ డగుఆగ్నీధ్రునివిద్య, బుద్ధి, వయస్సు, రూపము, స్వభావము, సంపద, ఔదార్యము అనువానిని చూచి పూర్వచిత్తి యాకర్షితురాలయ్యెను. ఆమె జంబూద్వీపాధిపతి యగుఆగ్నీధ్రునితో వేల కొలది సంవత్సరములు పార్థివ స్వర్గసౌఖ్యముల ననుభవించెను.

**తస్యాము హ వా ఆత్మజాన్ స రాజవర్య ఆగ్నీధ్రో నాభికింపురుష హరివర్షేలా వృతరమ్యకహిరణ్మయకురు భద్రాశ్వ కేతుమాలసంజ్ఞాన్ నవపుత్రానజనయత్ ॥ 19**

రాజశ్రేష్ఠుడగుఆగ్నీధ్రుడు పూర్వచిత్తివలన నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు నను తొమ్మండుగురు పుత్రులను గనెను.

**సా తు సూత్వాథ సుతాన్న వానువత్సరం గృహ ఏవాపహాయ పూర్వచిత్తిర్భూయ ఏవాజం దేవముపతస్థే ॥ 20**

అనంతరము పూర్వచిత్తి ప్రతిసంవత్సర మొక్కొక్కని చొప్పున తొమ్మండుగురు పుత్రులను గనినది. వారిని గృహమునందే విడచి మరల బ్రహ్మోపాసనము నందు ప్రవృత్తయయ్యెను.

**ఆగ్నీధ్రసుతాస్తే మాతురనుగ్రహాదౌత్పత్తికేనైవ సంహననబలోపేతాః పిత్రా విభక్తా ఆత్మతుల్యనామాని యథా విభాగం జంబూద్వీపవర్షాణి బుభుజుః ॥ 21**

పూర్వచిత్తి యొక్క యా తొమ్మండుగురు పుత్రులు మాతృస్తన్యమును ద్రావి దృఢమైన అవయవములు గలవారు, బలవంతులునైరి. తండ్రి యగునాగ్నీధ్రుడు పుత్రులకు వారి నామముల ననుసరించి జంబూ ద్వీపమం దున్న వర్షములను విభజించి యిచ్చెను. వారుగూడ తమతమ భూఖండములను పాలింప సాగిరి.

**ఆగ్నీధ్ర రాజాతృప్తః కామానామ ప్సరసమేవానుదిన మధిమన్య మానస్తస్యాః సలోకతాం శ్రుతిభిరవారున్ధ యత్ర పితరో మాదయన్తే ॥22**

రాజగుఆగ్నీధ్రుడు విషయభోగముల యందు తృప్తి చెందలేదు. అత డనుక్షణ మాయప్సరసనె చింతించు చుండెను. అందువలన వేదోక్తమగు ఫలము ననుసరించి అత డాయప్సరసలోకమును పొందెను. ఆలోకమున పితృదేవతలు ఆనందము ననుభవించు చుందురు.

సమ్ప రేతే పితరి నవ భ్రాతరో మేరుదుహితౄర్మేరు దేవీం ప్రతిరూపాముగ్రదంష్ట్రీంలతాం రమ్యాం శ్యామాం నారీం భద్రాం దేవదీధితి మితి సంజ్ఞా నవోదవహన్ ॥ 23

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే ఆగ్నీధ్రవర్ణనం నామ
ద్వితీయోఽధ్యాయః ॥

తండ్రి పరలోకమునకు వెడలగా నాభి మున్నగు తొమ్మండుగురు సోదరులు మేరువు యొక్క తొమ్మండుగురు పుత్రికలను వివాహమాడిరి. వారు మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్ర, లత, రమ్య, శ్యామ, నారి, భద్ర, దేవదీధితి యనువారలు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
ఆగ్నీధ్రవర్ణన మను రెండవ అధ్యాయము
సంపూర్ణము



# మూడవ అధ్యాయము

## నాభి చరిత్రము

కథాసారము :- ఈ యధ్యాయమున ఆగ్నీధ్రుని పుత్రుడగు నాభియనునాని మంగళమయ మగుచరితము వర్ణింప బడినది.

నాభి పుత్రుని వాంఛించి భార్యతోగూడ యజ్ఞము ననుష్ఠించి యజ్ఞేశ్వరోపాసనమందు ప్రవృత్తుడయ్యెను. భక్త వత్సలు డగుభగవానుడు నాభియొక్క భక్తికి సంతుష్టుడయి చతుర్భుజ రూపమున ప్రకటుడయ్యెను. ఋత్విక్కు లాయన నిట్లు స్తుతింపసాగిరి -

"సంసారాసక్తులగువ్యక్తులు జడము లగు తమజిహ్వలచే భగవానుని నామరూపాదులను చక్కగ కీర్తింప జాలరు. వారు కేవలము ఆంశికభావముతో భగవానుని నామరూపాదులను కీర్తింతురు. యజ్ఞాదుల ద్వారా భగవానున కెట్టి ప్రయోజనము సిద్ధింపదు. కాని సకామోపాసకులు ఫలమును గాంక్షించి యజ్ఞముల నొనర్చెదరు. భగవానుడు కూడ ఆయజ్ఞాదులకు బాధ్యుడై ఇతర సాపేక్షవ్యక్తులకు వలె గనబడును." ఋత్విక్కు లిట్లు భగవానుని స్తుతించి ఆయనవంటి పుత్రు నీయవలసినదిగా గోరిరి. అద్వితీయు డగు భగవానుడు నిజాంశతో నాభిపత్ని యగు మేరు దేవికి ఋషభ దేవరూపముతో జన్మించెను.

### శ్రీ శుక ఉవాచ

**నాభి రపత్యకామో౽ ప్రజయా మేరుదేవ్యా భగవన్తం యజ్ఞపురుష మవహితాత్మా౽ యజత ॥ 1**

శుకుడు పలికెను : ఆగ్నీధ్రునిపుత్రు డగునాభి పుత్రకాముడై అపత్యరహిత యగుమేరు దేవితో గూడి సంయతచిత్తుడై యజ్ఞేశ్వరు డగు విష్ణుభగవానుని ఉద్దేశించి యజ్ఞము చేసెను.

**తస్య హ వావ శ్రద్ధయా విశుద్ధభావేన యజతః ప్రవర్గ్యేషు ప్రచరత్సు ద్రవ్యదేశ కాల మన్త్రర్త్విగ్దక్షిణా విధాన యోగోపపత్త్యా దురధిగమో ౽ పి భగవాన్ భాగవతవాత్సల్య తయా సుప్రతీక ఆత్మానమపరాజితం నిజజనాభి ప్రేతార్థవిధి త్సయా గృహీతహృదయో హృదయంగమం మనోనయనానన్ద నావయవాభి రామమావిశ్చకార ॥ 2**

భగవానుడు ద్రవ్యము, దేశము, కాలము, మంత్రము, ఋత్విక్కు, దక్షిణ, విధి యనునీయేడు యజ్ఞ సాధనముల ద్వారా లభింపడు. అయినను ఆయన భక్తవత్సలుడే.

అందువలన నాభిరాజు విశుద్ధభావముతో శ్రద్ధతో యజ్ఞకార్యమున ప్రవృత్తుడై 'ప్రవర్గ్య' మను కర్మ నారంభించెను. అపుడు భక్తవాత్సల్యమువలన భగవానుడు తన మంగళమయ మగు శ్రీమూర్తిని వెల్లడిచేసెను. తనభక్తు లభిలషించినదానిని నెఱవేర్చు నుద్దేశ్యముతో భగవానుడు ఆకృష్టచిత్తుడై స్వతంత్రము, భక్తసుఖకరము, భక్తనయన మానస వినోదకారియు నగుతన శ్రీమూర్తిని ప్రకటించెను.

**అథ హ తమావిష్కృత భుజయుగలద్వయం హిరణ్మయం పురుష విశేషం కపికౌశేయాంబర ధరమురసి విలసచ్ఛ్రీవత్సలలామం దరవరవనరుహ వనమాలా చ్ఛూర్య మృతమణిగదాదిభి రుపలక్షితం స్ఫుటకిరణ ప్రవరమణిమయమకుట కుండల కటకకటిసూత్రహారకేయూరనూపు రాద్యఙ్గ భూషణ విభూషిత మృత్విక్సద స్యగృహపతయోఽధనా ఇవోత్తమ ధనముపలభ్య సబహుమాన మర్హణేనావనతశీర్షాణ ఉపతస్థుః ॥ 3**

(నాభిరాజునకు యజ్ఞేశ్వరు డగువిష్ణువు చూపిన తనరూప మీక్రింది విధముగ నున్నది) - ఆ శ్రీమూర్తి చతుర్భుజములు గలిగియుండెను. అది తేజోమయు డగుపురుషోత్తమరూపముతో ఆవిర్భవించెను. ఆ మూర్తి కటి ప్రదేశమున పీతవర్ణ మగుపట్టు వస్త్రము వేష్టిత మైయుండెను. వక్షస్థలమున శ్రీవత్సచిహ్నము శోభిల్లుచుండెను. ఆ యా అవయవముల యందు శంఖము, పద్మము, వనమాల, చక్రము, కౌస్తుభమణి, గద మున్నగునవి లక్షితమగుచుండెను. స్ఫుటములైన కిరణములచే విరాజిల్లు రత్నమయ మకుటములు, కుండలములు, కటకములు (వలయములు), కటిసూత్రములు, హారములు, కేయూరములు, నూపురములు మున్నగు ఆభూషణములు శరీరమునందు శోభిల్లుచుండెను. నిర్ధను లగు మానవులు అపార ధనరాసులను పొంది దానిని గౌరవించునట్లు ఋత్విక్కులు, సదస్యులు, యజమాని యగు నాభి మున్నగు వారందఱు ఇట్టి భగవన్మూర్తిని దర్శించి అత్యంతాదరముతో నతమస్తకులై పూజోపహారములతో ఆయనను పూజించిరి.

## శ్రీ ఋత్విజ ఊచుః

**అర్హసి ముహురర్హత్తమార్హణమస్మాకమనుపథానాం నమో నమ ఇత్యేతావత్సదుపశిక్షితం కోఽర్హతి పుమాన్ ప్రకృతి గుణవ్యతికరమతిరనీశ ఈశ్వరస్య పరస్య ప్రకృతిపురుష యోరర్వాక్త నాభిర్నామరూపాకృతి భీరూపనిరూపణమ్ । సకల జననికాయవృజిన నిరసన శివతమప్రవరగుణగణైక దేశకథనా దృతే ॥ 4**

ఋత్విక్కులు పలికిరి : పూజ్యతముడా! మేము నీభృత్యులము. అందువలన నీవు పరిపూర్ణుడ వైనను మాపూజను స్వీకరించుట నీకు దగినదే. మేము (నీస్వరూప విషయము

నేమాత్రము నెఱుంగము) సజ్జనుల నుండి 'మాటి మాటికి నీకు నమస్కారము' చేయవలయు ననువిషయమును మాత్రమే నేర్చితిమి. జీవుని బుద్ధి ప్రకృతి గుణముల యం దాసక్త మైయున్నది. అందువలన జీవు డెప్పుడును ప్రభువు కాదు. కాని నీవు ప్రకృతిపురుషుల కంటె అతీతుడవు - గుణాతీతుడవు, పరమేశ్వరుడవు. నీనామ రూపములు, ఆకారము అప్రాకృతములు, అధోక్షజములు. ప్రపంచాంతర్గతము లగు నామరూపములయొక్క, ఆకారము యొక్క సాదృశ్యమున ఏవ్యక్తి యైనను నీయప్రాకృతస్వరూపమును నిజముగ ప్రతిపాదన చేయగలడా ? అప్పుడు నిఖిలలోకముల కల్మషమును నాశనము చేయు నీ కల్యాణతమము లగు శ్రేష్ఠగుణములలో ఏకదేశ మాత్రమును గీర్తించుట తప్ప జీవున కిక యెట్టి సామర్థ్యమును లేదు.

**పరిజనానురాగవిరచితశబలసంశబ్దసలిలసితకిసలయతులసికాదూర్వాఙ్కురైరపి సంభృతయా సపర్యయా కిల పరమ పరితుష్యసి ॥5**

పరిపూర్ణ మైనస్వరూపము గలవాడా! నీభక్తులనురాగముగల వారై గద్గదవాక్కులతోను, జలములతోను, శుద్ధపల్లవములతోను, తులసీ దూర్వాంకురములతోను నిన్ను పూజించు చున్నారు. నీవు నిజముగ ఆ పూజచే విశేషముగ సంతుష్ట డవగుచున్నావు.

**అథానయాపి న భవత ఇజ్యయోరుభారభరయా సముచితమర్థమిహోపలభామహే ॥ 6**

మే మనురాగము లేకుండగ ద్రవ్య కాలాదు లనెడు అనేకము లగుఅంగములచే సమృద్ధము లగు యజ్ఞములను జేయుచున్నాము. వానివలన నీ కెట్టి ప్రయోజనమునులేదు.

**ఆత్మన ఏవానుసవనమఞ్జసా వ్యతిరేకేణ బోభూయ మానాశేషపురుషార్థస్వరూపస్య కిన్తు నాథాశిష ఆశాసానా నామేతదభిసంరాధనమాత్రం భవితుమర్హతి ॥ 7**

ఏ పురుషార్థములు సాక్షాత్తుగను, స్వతస్సిద్ధముగను, అప్రతిహతమగు గతితోను ప్రతిక్షణము ఉత్పన్నము లగుచున్నవో ఆ యశేష పురుషార్థ రూప మగుఆనందమే నీస్వరూపము. కాని నాథా! మేము భోగముల గోరుచున్నాము. అందువలన మావంటి సకామవ్యక్తుల యొక్క యీపూజాదు లన్నియు సర్వపురుషార్థప్రదుడ వగునీయనుగ్రహమును పొందుటలో నిమిత్తమాత్రములే యగుచున్నవి. అనగా సకామపూజాదులద్వారా భగవానుని ప్రయోజన మేదియు సాధింపబడకపోయినను అది సకామవ్యక్తుల కోరికలను పూర్తిచేయు నిమిత్తమే యైయున్నది.

**తద్యథా బాలిశానాం స్వయమాత్మనః శ్రేయః పరమ విదుషాం పరమ పరమపురుష ప్రకర్ష కరుణయా స్వమహిమానం చాపవర్గాఖ్యముపకల్పయిష్యన్ స్వయం నాపచిత ఏవేతరవది హోపలక్షితః ॥ 8**

పరాత్పరపురుషా! మేము ధర్మవిషయమున అనభిజ్ఞులము, మూర్ఖులము. ఏలయన, మేము మాపరమ శ్రేయస్సు నెఱుంగము. ఇట్టి మాకు నీవు దయతో అపవర్గ మనునీమాహాత్మ్యమును, మేము కోరిన వస్తువును కలుగజేయుటకై పూజింపబడకపోయినను పూజను కోరుచున్న వానివలె నీయజ్ఞమునకు స్వయముగ వచ్చి మాకు దర్శన మొసంగితివి.

**అథాయమేవ వరో హ్యర్హత్తమ యర్హి బర్హిషి రాజర్షేర్వరదర్షభో భవాన్ నిజపురుషే క్షణవిషయ ఆసీత్ ॥ 9**

పూజ్యతముడా! నీవు వరదులలో సర్వశ్రేష్ఠుడవు. అందువలన నీవు వరము విచ్చుటకే ఆవిర్భవించితివి. అయినను నీవు నాభియజ్ఞమున నీభక్తుల మగుమాకు దర్శన మిచ్చితివి. అదియే మాపక్షమున గొప్ప వరమైనది.

**అసఙ్గనిశితజ్ఞానానలవిధూతాశేషమలానాం భవత్స్వభావానామాత్మారామాణాం మునీనామనవరత పరిగుణితగుణగణ పరమమఙ్గళాయన గుణగణకథనోఽపి ॥ 10**

ప్రభూ! మునులు నిరంతరము నీగుణముల నభ్యసించు చుందురు. నీ వట్టిగుణములు గలవాడవు. వైరాగ్యముచే నిశిత మగుజ్ఞాన మను అనలముచే అశేష మలములను దగ్ధ మొనరించినవారు, నీవంటిస్వభావమును పొందినవారు, ఆత్మారాములు నగునామునులకు గూడ నీకీర్తనమే పరమ మంగళనికేతనమైనది.

**అథ కథంచిత్ స్ఖలనక్షుత్పతనజృమ్భణదురవస్థానాదిషు వివశానాం నః స్మరణాయ జ్వరమరణదశాయామపి సకలకశ్మల నిరసనాని తవ గుణకృత నామధేయాని వచనగోచరాణి భవన్తు ॥ 11**

(నీ దర్శనమును పొంది మేము కృతార్థుల మైతిమి. అయినను ఒకదానిని ప్రార్థించు చున్నాము). మేము దుర్మార్గగాములము, క్షుధార్తులము, పతితులము, అజ్ఞానముచే నావరింప బడినవారము, దురవస్థాగ్రస్తులము లేదా పీడితులము, మృత్యుగ్రస్తులము నై నిన్ను స్మరింపలేక పోవుచున్నాము. అయినను సర్వపాప వినాశకుడ వగునీభక్త వాత్సల్యాది గుణములచే చేయబడు నామములు మాయుచ్చారణమునకు విషయము లగుగాక!

**కిం చాయం రాజర్షిరపత్యకామః ప్రజాం భవాదృశీ మాశాసాన ఈశ్వర మాశిషాం స్వర్గాపవర్గయోరపి భగవన్త ముపధావతి ప్రజాయామర్థప్రత్యయో ధనదమివాధనః ఫలీ కరణమ్ ॥ 12**

కాని సంతానమునందే పురుషార్థబుద్ధి గల రాజర్షి యగునాభి పుత్రులను కాంక్షించినవాడై నీవంటిపుత్రులను గోరుచున్నాడు. అందువలన నిర్ధను డగువ్యక్తి తుషాకణమును

(పరిపాట్టును) మాత్ర మాశించి కుబేరునికడకు పరుగిడునట్లు నాభిరాజుగూడ పుత్రుని పొందు నభిలాష గలవాడై సకలాభీష్టములకు, స్వర్గాపవర్గములకు నధీశ్వరుడవు, భగవానుడవు నగునిన్ను ఆరాధించు చున్నాడు.

**కో వా ఇహ తేఽపరాజితోఽపరాజితయా మాయయానవసిత పదవ్యానావృతమతిర్విషయ - విషరయానావృత ప్రకృతిర నుపాసిత మహచ్చరణః ॥ 13**

ప్రభూ ! మహాజనులచరణములను సేవింపకుండగ ఈసంసారమున నీ మాయశక్తిచే నావరింపబడనిమతి గలవాడు, వశుడు కానివాడు, విషయవిషవేగముచే ఆచ్ఛాదితము కానిస్వభావము కలవాడు నగు మానవుడెవడైన ఉన్నాడా? నీ మాయ జయింప శక్యము కానిది. దాని గమనము నెవ్వడును దెలిసికొన జాలడు.

**యదుహ వావ తవ పునరదభ్రకర్తరిహ సమాహూత స్తదర్థధియాం మన్దానాం నస్తద్యద్దేవ హేలనం దేవదేవార్హసి సామ్యేన సర్వాన్ ప్రతివోఢు మవిదుషామ్ ॥ 14**

బహుకార్యకారీ ! మేము సంతానమునందే పురుషార్థబుద్ధి నుంచినవారము, మందమతులము, ప్రకృత - స్వార్థవిషయమునం దనభిజ్ఞులము. మేము ని న్నీ సామాన్య యజ్ఞమునం దాహ్వానించి అవమానించితిమి. దేవాది దేవా ! దానికై నీవు నీసమదృష్టిచే మమ్ము క్షమింపుము.

## శ్రీ శుక ఉవాచ

**ఇతి నిగదేనాభిష్టూయమానో భగవాననిమిషర్షభో వర్షధరాభివాదితర్త్వి గభివన్దితచరణః సదయమిదమాహ ॥ 15**

శుకుడు పలికెను : భారతవర్షాధిపతి యగునాభిచే సమ్మానితులగు ఋత్విక్కులు ఇట్లుగద్యాత్మక స్తోత్రముతో స్తుతించి పాదాభివందన మాచరించిరి. దేవతాశ్రేష్ఠు డగు భగవానుడు సంతుష్టుడై దయతో నిట్లు పలికెను.

## శ్రీ భగవానువాచ

**అహో బతాహమృషయో భవద్భిరవితథగీర్భిర్వరమసులభమభి యాచితో యదముష్యాత్మజో మయా సదృశో భూయా దితి మమాహ మేవాభిరూపః కైవల్యాత్ అథాఽపి బ్రహ్మ వాదో న మృషా భవితు మర్హతి మమైవ హి ముఖం యద్ద్విజ దేవకులమ్ ॥ 16**

భగవానుడు పలికెను : ఋషులారా ! నేను మీపట్ల సంతుష్టుడ నైతిని. మీది సత్యవాక్కు. మీ రీనాభికి నావంటిపుత్రుడు కలుగుగాక యని ఆశీర్వదింప వలసినదిగా వరమడుగు చున్నారు. కాని యిది దుర్లభము. ఏలయన, నే నద్వితీయపురుషుడను. నావంటి వాడను నేనే. మఱియెవ్వడును నాతో సమానుడు కాజాలడు. ఏమైన గానీయుడు, ద్విజులలో తపో విద్యాదులచే విలసిల్లువారే నాకు ముఖమైయున్నారు, కావున వారి వాక్కు మిథ్యయగుట ఉచితము కాదు.

**తత్రాగ్నీధ్రయేఽ ంశకలయావతరిష్యామ్యాత్మతుల్యమనుప లభమానః ॥17**

నాతో సమాను డగుపురుషు డెవ్వడు నాకు గనుపింపలేదు. అందువలన నేనే అంశకళల ద్వారా ఆగ్నీధ్రపుత్రు డగునాభివలన మేరుదేవికి పుత్రరూపమున అవతరింతును.

## శ్రీ శుకఉవాచ

**ఇతి నిశామయన్త్యా మేరుదేవ్యాః పతిమభిధాయాన్త ర్దధే భగవాన్ ॥18**

శుకుడు పలికెను : భగవాను డిట్లునాభిరాజుతో పలికి యంతర్హితు డయ్యెను. నాభిపత్ని యగు మేరుదేవి భర్తప్రక్కనే యుండెను. అందువలన ఆమె భగవానుడు పలికిన విషయము నంతటిని వినినది.

**బర్హిషి తస్మిన్నేవం విష్ణుదత్త భగవాన్ పరమర్షిభిః ప్రసాదితో నాభేః ప్రియచికీర్షయా తదవరోధాయనే మేరుదేవ్యాం ధర్మాన్ దర్శయితుకామో వాతవసనానాం శ్రమణానా మృషీణామూర్ధ్వమన్థినాం శుక్లయా తనువా వతతార ॥ 19**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే ఋషభదేవావిర్భావో
నామ తృతీయోఽధ్యాయః ॥

పరీక్షిన్మహారాజా ! భగవాను డాయజ్ఞమున ఋషిశ్రేష్ఠులచే పైన చెప్పబడినవిధమున నారాధింప బడినవాడై నైష్ఠిక బ్రహ్మచారుల, సన్న్యాసుల, వానప్రస్థుల, యాజ్ఞికు లగుగృహస్థుల (తమ యాచారములద్వారా) ధర్మములను ప్రదర్శించుటకు, నాభిరాజునకు ప్రియము చేకూర్చుటకు, వాని యంతఃపురమున మహారాణి యగు మేరుదేవికి శుద్ధసత్త్వరూప మూర్తితో ఆవిర్భవించెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
ఋషభదేవావిర్భావమను మూడవ అధ్యాయము
సంపూర్ణము.

# నాలుగవ అధ్యాయము

## ఋషభదేవుని రాజ్యపాలనము

కథాసారము:- ఈయధ్యాయమున ఋషభదేవుని నూఱుగురుకుమారుల రాజ్యము, వారి రాజ్యకాలము, ప్రజల యానందము వర్ణితమైనది.

భగవానుడు తనయంశతో నాభికి పుత్రరూపమున అవతరించుట వలన తేజస్సు, ప్రభావము, శక్తి, ఉత్సాహము, కాంతి మున్నగుగుణములలో ఆయనతో సమానుడు మఱి యొకడు లేకుండెను. అందుచే తండ్రి యగునాభి వానికి "ఋషభు" డని పేరిడెను. ఋషభ దేవుని ప్రభావము సాటిలేనిది. ఆయన యోగమాయచే "యజనాభ" మను మండలమును వృష్టి సమన్వితముగ జేసి యింద్రుని గర్వ మడంచెను.

నాభి తనవాసనానుసారమున భగవానుని పుత్రరూపమున పొంది అనురాగముతో వానిని పెంచసాగెను. పిమ్మట ఋషభదేవునకు రాజ్యము అప్పగించి భార్యాసహితుడై బదరి కాశ్రమమున వాసుదేవోపాసనయందు ప్రవృత్తుడయ్యెను. ఋషభదేవుడు లోకశిక్షార్థమై గురుకులమున గొన్ని దినము లుండెను; పిమ్మట గుర్వాజ్ఞననుసరించి సమావర్తన మాచరించి యింద్రదత్త యగు "జయంతి" యనుకన్యను పరిణయమాడి, యామెవలన నూఱుగురుపుత్రులను గనెను. వారిలో భరతుడు జ్యేష్ఠుడు. వానివలననే యీవర్షమునకు "భారత వర్ష" మనుపేరు కలిగినది. మిగిలిన పుత్రులలో కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, మలయుడు, కేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృక్కు, విదర్భుడు, కీకటుడు అనునీ తొమ్మండుగురు జ్యేష్ఠులు. మిగిలినవారిలో కవి, హవి, అంతరీక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రుమిళుడు, చమసుడు, కరభాజనుడు అను తొమ్మండుగురు భాగవత ధర్మమును వెల్లడి చేసిరి. వీరు మహాభాగవతులు. వీరిచరిత్ర ఏకాదశ స్కంధమున వసుదేవనారదసంవాదము నందు వర్ణింప బడినది. ఋషభదేవుడు లోకోపదేశార్థమై తాను బహు యజ్ఞముల నొనరించెను. అతడు తన పుత్రులకు ప్రజాపాలనము గూర్చి మంచి శిక్షణ నిచ్చెను.

### శ్రీ శుక ఉవాచ

**అథ హ తముత్పత్త్యైవాభివ్యజ్యమానభగవల్లక్షణం సామ్యోపశమ వైరాగ్యైశ్వర్య మహావిభూతి భిరనుదిన మేధమా నానుభావం ప్రకృతయః ప్రజా బ్రాహ్మణా దేవతాశ్చావని తలసమవనాయాతితరాం జగృధుః ॥ 1**

శుకుడు పలికెను : జన్మించినప్పుడే నాభినందనుని పాదతలముల యందు ధ్వజ వజ్రాంకుశాదు లైన భగవచ్చిహ్నములు అంకితము లైయుండెను. అంతరమున సర్వభూతముల యందు సమత్వము, శాంతము, జితేంద్రియత్వము, విషయవితృష్ణ, అలౌకిక సామర్థ్యము మున్నగు సర్వసంపదలతో గూడ ప్రతిదిన మాయన ప్రభావము వృద్ధి పొందసాగెను. అందువలన ప్రజలు, బ్రాహ్మణులు, దేవతలు, అమాత్యాదులు సర్వులు 'ఈ బాలుడు భూమండలమును పరిపాలించుగాక' యని అభిలషించిరి.

**తస్య హ వా ఇత్థం వర్ష్మణా వరీయసా బృహత్ శ్లోకేన చౌజసా బలేన శ్రియా యశసా వీర్యశౌర్యాభ్యాం చ పితా ఋషభః ఇతీదం నామ చకార ॥2**

ఆ నాభినందనుడు సత్త్వప్రధానుడు, కవులు వర్ణింపదగిన విపుల గుణ సంపన్నుడు; శ్రేష్ఠతమదేహుడు; తేజస్సు, వీర్యము, శోభాతిశయిత్వము, కీర్తి, ప్రభావము, ఉత్సాహము మున్నగు గుణముల వలన అతనిని మహా పురుషునిగ భావించి నాభిరాజు వానికి 'ఋషభు' డని పేరిడెను.

**యస్య హి ఇన్ద్రః స్పర్ధమానో భగవాన్ వర్షే న వవర్ష తదవధార్య భగవానృషభదేవో యోగేశ్వరః ప్రహస్యాత్మ యోగమాయయా స్వం వర్షమజనాభం నామాభ్యవర్షత్ ॥ 3**

(ఋషభునితో విరోధము పూని) ఒకప్పుడు ఐశ్వర్యశాలి యగు ఇంద్రుడు ఋషభదేవుని రాజ్యమున వర్షమును గురిపింపలేదు. అపుడు యోగేశ్వరు డగు ఋషభదేవుడు ఇంద్రుని యభిప్రాయము నెఱింగి (తిరస్కార సూచకముగ) నవ్వి తన శక్తి ప్రభావము చేతనే తన అజనాభమను మండలమును వర్షముచే సంపూర్ణముగ తడిపెను.

**నాభిస్తు యథాభిలషితం సుప్రజస్త్వమవరుధ్యాతిప్రమోదభరవిహ్వలో గద్గదాక్షరయా గిరా స్వైరం గృహీత వరలోక స్వధర్మం భగవన్తం పురాణ పురుషం మాయా విలసితమతి ర్వత్స తాతేతి సానురాగము పలాలయన్ పరాం నిర్వృతిముప గతః ॥ 4**

నాభిరాజు గూడ తనయభీష్టమునకు తగినసత్పుత్రులను పొంది అధికానందముతో విహ్వలచిత్తు డయ్యెను. పురాణపురుషు డగు నీభగవానుడు స్వేచ్ఛగ (తనయచింత్యశక్తి ప్రభావముచేత, భక్తవాత్సల్యము వలన) వరలోకమునకు సమాన మగు ధర్మములను స్వీకరించె (ప్రకటించె) నో ఆ భగవానునే తన్మాయాప్రభావముచే మోహితుడై 'వత్సా! కుమారా !' యని గద్గదాక్షర సంయుక్తము లగు వాక్కులతో అనురాగముతో లాలన పాలనముల జేయుచుండెను. దానిద్వారానే పరమానందమును పొందుచుండెను.

**విదితానురాగ మాపౌర ప్రకృతి జనపదో రాజా నాభి రాత్మజం సమయ సేతురక్షా యామభిషిచ్య బ్రాహ్మణేషూపనిధాయ సహ మేరుదేవ్యా విశాలాయాం ప్రసన్న నిపుణేన తపసా సమాధియోగేన నరనారాయణాఖ్యం భగవన్తం వాసుదేవ ముపాసీనః కాలేన తన్మహిమానమవాప ॥ 5**

నాభిరాజు పౌరులయభిప్రాయమునే ప్రమాణముగ భావించు చుండెను. అందువలన తన పుత్రునిపై పురవాసులకు, మంత్రులకు అనురాగ ముండుట తెలిసికొనినవాడై ఆయన ఆత్మజు డగుఋషభుని ధర్మమర్యాదరక్షణార్థమై రాజ్యమునం దభిషిక్తునిగజేసి, బ్రాహ్మణుల కప్పగించి పిమ్మట తాను భార్య యగుమేరుదేవితో గూడి బదరికాశ్రమమునకు వెడలి, యచట భగవత్ప్రసన్నకారక మగుతీవ్రతపమునందు, సమాధియోగముచే నరనారాయణాఖ్యు డగువాసుదేవుని యుపాసనమునందు ప్రవృత్తుడయ్యెను. తగిన సమయమున భగవన్మహి మాక్షేత్ర మగు వైకుంఠధామమునకు వెడలెను.

యస్య హ పాణ్డవేయ శ్లోకావుదాహరన్తి ।

**కో ను తత్కర్మ రాజర్షేర్నాభేరన్వాచరేత్పుమాన్ ।**
**అపత్యతామగాద్యస్య హరిః శుద్ధేన కర్మణా ॥ 6**

పాండునందనా! ఈ నాభిరాజు యొక్క యశస్సును వర్ణించు రెండు శ్లోకములు పఠింప బడుచున్నవి -

రాజర్షి యగు నాభి యొనరించిన ఉదారకర్మల నాచరించు మానవుడు మఱియెవ్వ డున్నాడు? ఆయన చేయు విశుద్ధ యజ్ఞానుష్ఠానములచే ఆకృష్టుడై శ్రీహరి స్వయముగ ఆయనకు పుత్రుడయ్యెను.

**బ్రహ్మణ్యోఽన్యః కుతో నాభేర్విప్రా మంగలపూజితాః ।**
**యస్య బర్హిషి యజ్ఞేశం దర్శయామాసురోజసా ॥ 7**

రాజర్షి యగునాభితప్ప ఆయనతో సమాను డగుబ్రాహ్మణభక్తుడు మఱియొకడేడి? ఆయన చేసిన యజ్ఞమున దక్షిణాదులద్వారా పూజితులై బ్రాహ్మణులు ఆయనకు మంత్రబలముచే యజ్ఞేశ్వరు డగుభగవానుని దర్శనము చేయించిరి.

**అథ హ భగవానృషభదేవః స్వం వర్షం కర్మక్షేత్ర మనుమన్యమానః ప్రదర్శిత గురుకులవాసో లబ్ధవరైర్గురుభిరనుజ్ఞాతోగృహ మేధినాం ధర్మాననుశిక్షమాణో జయన్త్యామింద్ర దత్తాయాముభయలక్షణం కర్మసమామ్నా యామ్నాత మభి యుఞ్జన్నా త్మజానామాత్మ సమానానాం శతం జనయామాస ॥ 8**

పిమ్మట తండ్రి గతింపగా ఋషభదేవుడు తన మండలమును (అజనాఖండమును) కర్మానుష్ఠానభూమిగా దెలిసికొని గృహధర్మముల నాచరించి జీవులకు బోధించుటకై గురుకుల వాసమును ప్రదర్శించెను. (అనగా ఋషభదేవునకు గురుకులవాసాదు లేవియు అవసరము లేకుండెను. ఏలయన, ఆయన పురాణపురుషు డగుభగవానుడు; కాని 'తా నాచరించి ధర్మమును జీవులకు బోధింపవలెను' అను న్యాయము నవలంబించి గృహస్థ ధర్మమును స్వీకరించువాడు ప్రథమమున గురుకులమున నివసించి బ్రహ్మచర్యాదులను పాలింపవలెను. ఈ విషయమును గృహస్థులకు తెలియ జెప్పుటకై ఆయన గురుకుల వాసమును స్వీకరించెను). పిమ్మట దక్షిణల నిచ్చి గురువులయాదేశమును పొంది శాస్త్రవిహితము లగు శ్రౌతస్మార్త కర్మల ననుష్ఠింప సాగెను. ఇంద్రప్రదత్తయగు 'జయంతి' యనునామెను భార్యగా స్వీకరించి యామెవలన ఆత్మతుల్యు లగునూఱుగురు పుత్రులను గనెను.

**యేషాం ఖలు మహాయోగీ భరతో జ్యేష్ఠః శ్రేష్ఠగుణ ఆసీద్యేనేదం వర్షం భారతమితి వ్యపదిశన్తి ॥ 9**

ఋషభదేవుని పుత్రులలో శ్రేష్ఠుడు, గుణసంపన్నుడు, మహాయోగియు నగుభరతుడు జ్యేష్ఠుడు. ఆయన నామము ననుసరించి యీవర్షమును 'భారతవర్ష' మని జనులు పిలచు చున్నారు.

**తమను కుశావర్త ఇలావర్తో బ్రహ్మావర్తో మలయః కేతుర్భ ద్రసేన ఇన్ద్రస్పృగ్విదర్భః కీకట ఇతి నవ నవతి ప్రధానాః ॥ 10**

ఆ భరతుని కనిష్ఠసోదరులు తొంబది తొమ్మదిమందిలో కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, మలయుడు, కేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృక్కు, విదర్భుడు, కీకటుడు అనుతొమ్మండుగురు జ్యేష్ఠులు.

**కవిర్హవిరన్తరీక్షః ప్రబుద్ధః పిప్పలాయనః ।**
**ఆవిర్హోత్రోఽథ ద్రుమిలశ్చమసః కరభాజనః ॥**
**ఇతి భాగవత ధర్మదర్శనా నవ మహాభాగవతా స్తేషాం సుచరితం భగవన్మహిమో బృంహితం వసుదేవనారదసంవాద ముపశమాయనము పరిష్టాద్వర్ణయిష్యామః ॥ 11**

వీరిలో తరువాతివా రైనకవి, హవి, అంతరీక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రుమిళుడు, చమసుడు, కరభాజనుడు అనుతొమ్మండుగురు మహాభాగవతులు. ఈ మహాభాగవతుల చరిత్ర భగవాను డగు వాసుదేవుని మహిమచే పరిపుష్టము, సుశోభితము నై యున్నది. చిత్తమునకు శాంతిని గలుగ జేయువీరి యాచరితమును (ఏకాదశస్కంధమున) వాసు దేవ నారదసంవాదమున వర్ణింతును.

యవీయాంస ఏకాశీతిర్జాయన్తేయాః పితురాదేశకరా మహాశాలీనా
మహాశ్రోత్రియా యజ్ఞశీలాః కర్మవిశుద్ధా బ్రాహ్మణా బభూవుః ॥ 12

(పైన చెప్పబడిన పందొమ్మిదిమంది పుత్రులలో) కనిష్ఠులు, ఋషభునకు జయన్తివలన గలిగినఎనుబదియొక్కమంది పుత్రులు తండ్రి యగు ఋషభదేవుని యాజ్ఞ ననుసరించువారు, వినీతులు, వేదనిపుణులు, యజ్ఞపరాయణులు, సదాచారరతు లగు బ్రాహ్మణులు లైరి.

భగవానృషభసంజ్ఞ ఆత్మతన్త్రః స్వయం నిత్యనివృత్తా నర్థపరంపరః
కేవల ఆనన్దానుభవ ఈశ్వర ఏవ విపరీతవత్కర్మాణ్యారభమాణః
కాలేనానుగతం ధర్మమాచరణేనోపశిక్షయన్నతద్విదాం సమ ఉపశాన్తో మైత్రః
కారుణికో ధర్మార్థ యశః ప్రజానన్దామృతావరోధేన గృహేషు లోకం నియ
మయత్ ॥ 13

ఋషభుడు భగవంతుని యావేశావతారము ; ఆయన స్వతంత్రపురుషుడు, అద్వితీయ సచ్చిదానంద స్వరూపుడు. ఆయన యందు జననమరణాదులైన అనర్థ పరంపరలు ఏకాలమునందును లేవు. ఆయన రాగలోభాది దోష రహితుడు, సర్వభూతములయందు సమదృష్టి గలవాడు, పరదుఃఖదుఃఖితుడు. సర్వజీవులకు శుభముల గలిగించు వాడు. ఇట్టి పురుషుడు స్వయముగ ఈశ్వరుడై యుండియు అనీశ్వరునివలె వర్ణాశ్రమధర్మాదిరూప కర్మల జేయసాగెను. దీనికి కారణ మేమియన, కాలవశమున నష్టప్రాయ మైన ధర్మమును తా నాచరించి అనభిజ్ఞు లగుజనులకు బోధించుటకే. ఇట్టి బోధ ద్వారా ఆయన ధర్మార్థములను, యశస్సును, సంతానమును, భోగములను, మోక్షమును సంగ్రహించుటకై మనుష్యులను గృహస్థాశ్రమమున నియమించెను. అనగా గృహస్థాశ్రమమున మానవు డెట్లు ఇంద్రియ నిగ్రహుడు, హరిసేవాపరాయణుడు నై యుండవలెనో యనుదాని కాదర్శమును జూపెను.

యద్యచ్ఛీర్షణ్యాచరితం తత్తదనువర్త తే లోకః ॥ 14

శ్రేష్ఠపురుషు లాచరించిన ధర్మములనె ఇతర జను లనుసరింతురు.

యద్యపి స్వవిదితం సకలధర్మం బ్రాహ్మం గుహ్యం బ్రాహ్మణైర్దర్శిత
మార్గేణ సామాదిభిరుపాయైర్జనతామను శశాస ॥ 15

ఋషభదేవుడు సకల ధర్మప్రతిపాదక మగు వేదరహస్యమును స్వయముగ దెలిసికొనిన వాడైనను ఆయన బ్రాహ్మణులచే ప్రదర్శిత మగు మార్గము ద్వారమున సామాద్యుపాయముల నవలంబించి ప్రజలను శాసింప సాగెను.

ద్రవ్య దేశకాలవయః శ్రద్ధర్త్విగ్వివిధోద్దేశోపచితైః ।
సర్వైరపి క్రతుభిర్యథోపదేశం శతకృత్వ ఇయాజ ॥ 16

ఆయన సర్వవిధము లగుయజ్ఞముల ద్వారా నూఱుమారులు యథావిధిగ యజ్ఞేశ్వరుడగువిష్ణువు వారాధించెను. ఆత డొనరించిన యాయజ్ఞములు వ్రీహియవాది ద్రవ్యములచేత, పుణ్యస్థానములు వసంతాదిశ్రేష్ఠకాలములు యౌవనము శ్రద్ధ ఋత్విక్కులు మున్నగు వానిచేత, యజ్ఞేశ్వరుడగు విష్ణువు ఉచ్ఛిష్టమును భుజించు విభిన్న దేవతల నుద్దేశించుట చేత మిగుల సంపన్నములయ్యెను.

భగవతర్ష భేణ పరిరక్ష్యమాణ ఏతస్మిన్ వర్షే న కశ్చన పురుషో వాంఛత్యవిద్య మానమివాత్మనో ఽ న్యస్మాత్కథంచన కిమపి కర్హిచిదవేక్షతే భర్తర్యనుసవనం విజృమ్భితస్నేహాతిశయ మన్త రేణ ॥ 17

ఒకడు మఱియొకనిని ఆకాశకుసుమాదులవలె అస్తిత్వశూన్యము లైన యేవస్తువులను గోరనట్లు ఋషభదేవు డీభారతవర్షమును బరిపాలించు చున్నపు డిచట నున్న యే వ్యక్తియు స్వార్థమునకై మఱియొకనిని ఎప్పుడును ఏవస్తువు కొఱకును యాచింపలేదు. ఏలయన, తమ ప్రభువుపై ప్రతిదినము వృద్ధిపొందుననురాగము దప్ప మఱియే కోరికయు వారికి లేదు (అనగా ఇతరమైన కోరిక వారి దృష్టిలో ఆకాశపుష్పము వంటిది).

స కదాచిదటమానో భగవానృషభో బ్రహ్మావర్తగతో బ్రహ్మర్షి ప్రవరసభాయాం ప్రజానాం నిశామయన్తీనామాత్మ జానవహితాత్మనః ప్రశ్రయప్రణయభరసు యన్త్రితానప్యు పశిక్షయ న్నితి హోవాచ ॥ 18

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే ఋషభదేవానుచరితే
చతుర్థోఽధ్యాయః ॥

ఒకప్పు డాఋషభదేవుడు పర్యటించుచు బ్రహ్మావర్తమునకు జేరు కొనెను. అచట బ్రహ్మర్షుల సభలో తనపుత్రులు (బ్రహ్మర్షుల నుండి) ఉపదేశములను వినుచుండిరి. వారు సంయతచిత్తులు, ప్రణయ వినయాది గుణాన్వితులు అయ్యును తండ్రి పుత్రులను ప్రజాపాలన విధానమును బోధించుటకై యీక్రిందివిధముగ తత్త్వోపదేశము చేసెను.

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమందలి పంచమస్కంధములో
నాల్గవ అధ్యాయము
సంపూర్ణము.

# ఐదవ అధ్యాయము

## ఋషభుడు తనపుత్రులకు మోక్షధర్మాదుల నుపదేశించి తాను అవధూతవృత్తిని స్వీకరించుట

కథాసారము :- ఈయధ్యాయమున ఋషభదేవుడు తన కుమారులకు మోక్ష ధర్మములను, శీతోష్ణాదిద్వంద్వ ధర్మములను పరిత్యజించి పారమహంస్య ధర్మములను స్వీకరింపవలసినది యనిబోధించిన విషయము వర్ణింపబడినది.

మలమును భుజించు సూకరములును విషయముల ననుభవించును, కాని మనుష్యుల కర్తవ్య మిదియేకాదు. వారిపక్షమున భగవదుపాస నారూప మగుతపస్సే సర్వోత్కృష్టమైనది. దానిచే చిత్తము నిర్మలమై బ్రాహ్మీస్థితిని పొందును. మహాత్ముల సేవయే ముక్తికి ద్వారస్వరూపము. స్త్రీసహవాసుల తోడిసాంగత్యము వలన సంసారము లభించును. సర్వభూత హితరతులు దేహగేహాదులయందు ఆసక్తి శూన్యులు నగు వ్యక్తులె మహనీయులు. ఇంద్రియ పరాయణు లగువ్యక్తులు అకర్మవికర్మలయం దాసక్తులై ఆత్మతత్త్వమును తెలిసికొన జాలరు. పరమహంస యగు గురు దేవునియందు, భగవానుని యందు భక్తి, వితృష్ణ, సుఖదుఃఖాదిద్వంద్వ సహిష్ణుత, సర్వత్ర సమదర్శనము, తత్త్వజిజ్ఞాస, కృష్ణు నుద్దేశించి సర్వకార్యము లొనరించుట, దేహగేహాదులయందు ఆసక్తి లేకపోవుట, వృథావాక్యాలాపములను విడచుట మున్నగు వానిద్వారా ఆత్మ జ్ఞానము లభించును. జ్ఞానవంతు డగుఏవ్యక్తియైన అతత్త్వజ్ఞులు, కర్మమూఢులు నగువ్యక్తులకు బుద్ధి భేదమును గలుగ జేసి వారిని కర్మల యందు నియమింప రాదు. భక్తిమార్గము నుపదేశించి జీవుని సంసారమునుండి విడిపింప జాలని గురువు, తండ్రి, తల్లి, దేవత తత్పదవాచ్యులు కాజాలరు. ఋషభ దేవుడు పుత్రులకు వారి జ్యేష్ఠ సహోదరుడగు భరతుని సేవింపవలసినదిగ ఉపదేశించి స్థావరజంగమ జీవులలో శమదమాది గుణ సంపన్నులగు బ్రాహ్మణుల శ్రేష్ఠత, జీవులను గౌరవించుటయె భగవానుని పూజ, తద్ద్వారాముక్తి కలుగుట మున్నగు విషయములను వివరించెను.

పిమ్మట శుకదేవుడు పరమభాగవతు డగుభరతముని చరితమును వర్ణించి లోకశిక్షార్థమై ఋషభదేవుని యోగానుష్ఠానవిషయమును వివరించెను.

## శ్రీ ఋషభ ఉవాచ

నాయం దేహో దేహభాజాం నృలోకే
కష్టాన్ కామానర్హతే విడ్భుజాం యే ।
తపో దివ్యం పుత్రకా యేన సత్త్వం
శుధ్యేద్యస్మాద్బ్రహ్మసౌఖ్య స్త్వనన్తమ్ ॥ 1

ఋషభుడు పలికెను ; పుత్రులారా! ఈజగత్తులో మానవదేహమును పొంది దుఃఖప్రదములగు విషయముల ననుభవించుట తగదు. ఇట్టి విషయభోగములు మలమును భుజించు శునకసూకరముల యందును గలవు. భగవత్సేవాపరుడు అప్రాకృతతపస్సు చేయుటయే ఉచితము. దానిచే అంతఃకరణము నిర్మలమగును. హృదయము నిర్మలమైనచో సవిశేషనిర్విశేష భేదముతో ద్వివిధ మగుబ్రహ్మానందము లభించును. అది యపారము అనగా విషయభోగాదులవలె పరిమిత మైనది కాదు.

మహత్సేవాం ద్వారమాహుర్విముక్తే
స్తమోద్వారం యోషితాం సఙ్గి సఙ్గమ్ ।
మహాన్తస్తే సమచిత్తాః ప్రశాన్తా
విమన్యవః సుహృదః సాధవో యే ॥ 2

పండితులు బ్రహ్మోపాసక భగవదుపాసక భేదముతో రెండువిధముల నున్నారు. వారు బ్రహ్మసాయుజ్యము, భగవానునిపార్షదత్వము అను రెండువిధము లగుముక్తులను పొందుటకు ఉపాయము మహత్సేవ యనియు, నరకమునకు ద్వారమువంటిది స్త్రీ సహవాసుల సాంగత్య మనియు భావింతురు. సమదర్శులు, భగవానునియందు నిష్ఠ గలవారు, క్రోధరహితులు, సర్వభూత హితాసక్తులు, అదోషదర్శులు నగుమానవులె మహాత్ము లనియు తెలిసి కొనుము. (భగవన్నిష్ఠయే భగవదుపాసకు లగుమహాత్ముల విశిష్టత).

యే వా మయీ శే కృతసౌహృదార్థా
జనేషు దేహమ్భరవార్తికేషు ।
గృహేషు జాయాత్మజరాతిమత్సు
న ప్రీతియుక్తా యావదర్థాశ్చ లోకే ॥ 3

సర్వేశ్వరుడ నగునాయందు సౌహృదృము (స్నేహము) నుంచి నాపై ప్రేమనె యేకైక పురుషార్థముగ తలంచువారును, అనగా భగవత్ప్రీతిని దప్ప ఇతరవస్తువును పురుషార్థముగ తలంపనివారును, భోజనపానాదుల యందాసక్తులగు విషయుల అసత్ప్రల్లాపములయందు, ధనజనస్త్రీపుత్రగృహాదులయందు ప్రేమను చూపనివారును, ఇహలోకమందు శరీర నిర్వహణమునకు లభించిన ధనమును దప్ప అధికధనమును గోరనివారును అగువ్యక్తులె మహాత్ములు.

నూనం ప్రమత్తః కురుతే వికర్మ
యదిన్ద్రియప్రీతయ ఆప్నోతి ।
న సాధు మన్యే యత ఆత్మనోఽ య
మసన్నపి క్లేశద ఆస దేహః ॥ 4

ఇంద్రియభోగోద్దేశ్యముతో వ్యాపృతుడై యున్నజీవుడు ప్రమత్తుడై నిజముగ పాపాదికార్యములయందు ప్రవృత్తుడగును. ఇంద్రియతృప్తి మూలకము లగుఆపాపకర్మల వలన కష్టప్రదమగు నీదేహ ముత్పన్నమైనది. వాస్తవముగ జీవునకు ప్రాకృతదేహము లేదు. అందువలన మరల ఆక్లేశము లన్నింటియుత్పత్తికి గారణ మైనవికర్మాదుల ప్రయత్నము మంచిదని నేను అంగీకరింపను.

పరాభవస్తావదబోధజాతో
యావన్న జిజ్ఞాసత ఆత్మతత్త్వమ్ ।
యావత్క్రియాస్తావదిదం మనో వై
కర్మాత్మకం యేన శరీరబన్ధః ॥ 5

ఆత్మతత్త్వమును తెలిసికొనుట కిష్టపడనంతవఱకు జీవున కవిద్యా జనితక్లేశము లుండును. పాపపుణ్యాదికర్మలయం దాసక్తి యున్నపుడు మనస్సుగూడ కర్మాత్మక స్వభావమును పొందును. దానివలన దేహబంధనములు కలుగును.

ఏవం మనః కర్మవశం ప్రయుంక్తే
అవిద్యయాత్మన్యుపధీయమానే ।
ప్రీతిర్న యావన్మయి వాసుదేవే
న ముచ్యతే దేహయోగేన తావత్ ॥ 6

(మనస్సు ఎట్లు కర్మాత్మక మగునో యనువిషయము చెప్పబడుచున్నది. ) వెనుక జెప్పినవిధమున జీవునకుగల జీవాత్మపరమాత్మవివేకము అవిద్యచే ఆచ్ఛాదిత మైనచో

మనస్సు కర్మాధీనమై పురుషుని కర్మనిష్ఠునిగ జేయును. అందువలన సర్వేశ్వరుడను, వాసుదేవుడను అగునాయందు ప్రీతి కలుగనంతవరకు జీవునకు దేహబంధనముల నుండి ముక్తి కలుగదు.

యదా న పశ్యత్యయథా గుణేహాం
స్వార్థే ప్రమత్తః సహసా విపశ్చిత్ ।
గతస్మృతిర్విన్దతి తత్ర తాపా
నాసాద్య మైథున్యమగారమజ్ఞః ॥ 7

జ్ఞాని యయ్యును జీవు డెంతవఱకు ఇంద్రియభోగలక్షణ ప్రవృత్తిని అనర్థ మనిభావింపడో అంతవఱకు నతడు స్వస్వరూపవిస్మృతి వలన మైథున సుఖప్రధాన మగు గృహమును పొంది యచట నానావిధము లగు క్లేశముల ననుభవించు చుండును.

పుంసః స్త్రియా మిథునీభావమేతం
తయోర్మిథో హృదయగ్రన్థిమాహుః ।
అతో గృహక్షేత్రసుతాప్తవిత్తై -
ర్జనస్య మోహోఽ యమహం మమేతి ॥ 8

పురుషుడు స్త్రీతో గలియగా ఏభావము కలుగునో అదియె వారి పరస్పర హృదయగ్రన్థి స్వరూప మని చెప్పబడినది. దానివలననే జీవునకు దేహగేహ ధనపుత్రాదులయందు 'నేను, నాది' యను బుద్ధిరూప మోహము కలుగును.

యదా మనో హృదయగ్రన్థిరస్య
కర్మానుబద్ధో దృఢ ఆశ్లథేత ।
తదా జనః సంపరివర్తతేఽ స్మా-
న్ముక్తః పరం యాత్యతిహాయ హేతుమ్ ॥ 9

కర్మఫలజనితములు, సుదృఢములు నగు మానవుల హృదయగ్రన్థు లెపుడు శిథిల మగునో అపుడు పురుషుడు స్త్రీ సాంగత్యమునుండి విరతుడై సంసారమూలమగు 'నేను, నాది' యను అహంకారమును పరిత్యజించి విముక్తుడై పరమపదమును పొందును.

హంసే గురౌ మయి భక్త్యానువృత్త్యా
వితృష్ణయా ద్వన్ద్వతితిక్షయా చ ।
సర్వత్ర జన్తోర్వ్యసనావగత్యా
జిజ్ఞాసయా తపసేహానివృత్త్యా ॥ 10

మత్కర్మభిర్మత్కథయా చ నిత్యం
మద్దేవసంగాద్గుణకీర్తనాన్మే ।
నిర్వైరసామ్యోపశమేన పుత్రా
జిహాసయా దేహగేహాత్మబుద్ధేః ॥ 11

అధ్యాత్మయోగేన వివిక్తసేవయా
ప్రాణేన్ద్రియాత్మాభిజయేన సధ్ర్యక్ ।
సచ్ఛ్రద్ధయా బ్రహ్మచర్యేణ శశ్వ -
దసప్రమాదేన యమేన వాచామ్ ॥ 12

సర్వత్ర మద్భావవిచక్షణేన
జ్ఞానేన విజ్ఞానవిరాజితేన ।
యోగేన ధృత్యుద్యమసత్త్వయుక్తో
లింగం వ్యపోహేత్కుశలోఽహమాఖ్యమ్ ॥ 13

పుత్రులారా! పరమహంస యగుగురుదేవుని యందు నాయందును ఏకాంత భక్తి కలిగియుండుట, విషయభోగాదులయందు తృష్ణ లేకుండుట, శీతోష్ణాదిద్వంద్వములను సహించుట, ఇహపర లోకముల యందు సర్వజీవుల సుఖదుఃఖాదులను గూర్చి యాలోచించుట, తత్త్వాతత్త్వములను జర్చించుట, ఏకాదశ్యాదివ్రతముల ననుష్ఠించుట, కామ్యకర్మలను పరిహరించుట, నాయారాధన మనుకర్మల నొనరించుట, మద్విషయములు గలిగిన కథలను జెప్పి కొనుట, నాభక్తులతో నిత్యము సాంగత్యము కలిగియుండుట, నాగుణములను గీర్తించుట, సర్వభూతముల యందు సమదృష్టి కలిగియుండుట, వైర భావమును విడచుట, క్రోధశోకాదులచే అభిభూతుడు కాకుండుట, దేహగేహముల యందాత్మబుద్ధిని విడచుట, అధ్యాత్మశాస్త్రము నభ్యసించుట, నిర్జనప్రదేశమున నివసించుట, సరి యగువిధమున ప్రాణములను మనస్సును ఇంద్రియములను నిగ్రహించుట, శాస్త్రాదులయందు శ్రద్ధ చూపుట, బ్రహ్మచర్యమును నిర్వహించుట, నిరంతరము కర్తవ్యకర్మల నొనరించుట, వృథావాక్యాలాపములను విడచుట, అంతట నన్ను గూర్చి యాలోచించుట యందే నైపుణ్యము గలిగియుండుట, విజ్ఞానసమన్వితమగుజ్ఞానము గలిగి యుండుట, యోగము నవలంబించుట అనువాని ద్వారా ధైర్యయత్నవివేక యుక్తుడై మానవుడు సంసారమూలక మగు అహంకారోపాధిని నిరసింప వలెను.

కర్మాశయం హృదయగ్రన్థిబన్ధ -
మవిద్యయాసాదితమప్రమత్తః ।
అనేన యోగేన యథోపదేశం
సమ్యగ్వ్యపోహ్యోపరమేతయోగాత్ ॥ 14

నే నుపదేశించినవిధముగ సావధానుడవై ఆయుపాయము ద్వారా అవిద్యాజనితము, కర్మవాసనారూపము నగుహృదయగ్రంథిని చక్కగ ఛేదించి ఆయుపాయము నుండియు విరతుడవు కావలెను. (అనగా దాని యందు గూడ ఆసక్తుడవు కావలదు).

పుత్రాంశ్చ శిష్యాంశ్చ నృపో గురుః పితా
మల్లోకకామో మదనుగ్రహార్థః ।
ఇత్థం విమన్యురనుశిష్యాదతజ్ఞా -
న్న యోజయేత్కర్మసు కర్మమూఢాన్ ।
కం యోజయన్ మనుజోఽ ర్థం లభేత
నిపాతయన్నష్టదృశం హి గర్తే ॥ 15

నాలోకమును, నాకృపను కోరుచున్న తండ్రి పుత్రులకు, గురువు శిష్యులకు, రాజు ప్రజలకు ఈ విధములైన బోధలనె బోధింప వలెను. ఉపదిష్టు డగువ్యక్తి ఉపదేశమునకు దగినట్లుగ పనిచేయక పోయినను వానిపై కోపింపరాదు. కర్మవిమూఢచిత్తులు, అతత్త్వజ్ఞులు నగు వ్యక్తులను గూడ కర్మలయందు నియమింపరాదు. మానవులు మోహాంధవ్యక్తులను కామ్యకర్మలయందు నియమించి సంసారకూపమున బడవేసినచో వారి కేమి పురుషార్థము లభించును? గోతివైపు వెడలుచున్నయంధుని జూచి 'ఆమార్గమునే వెడలు' మని చెప్పి వానిని గుంటలో బడవేసినచో అధర్మమే లభించును. అట్లే కర్మాంధు డగువ్యక్తిని కర్మలయందు నియమించినచో భగవచ్చరణముల కపరాధముచేసినట్లగును.

లోకస్స్వయం శ్రేయసి నష్టదృష్టి -
ర్యోఽ ర్థాన్ సమీహేత నికామకామః ।
అన్యోఽ న్యవైరః సుఖలేశహేతో
రనన్తదుఃఖం చ న వేద మూఢః ॥ 16

స్వయముగ తన శ్రేయస్సును పొందునుపాయమును దెలిసికొనని మానవుడు మిగుల కామాసక్తుడై వివిధభోగవిషయములను నిరంతరము అభిలషించు చుండును.

అట్టి మూఢుడు సామాన్యము లగుఇంద్రియసుఖములకై పరస్పరము వైరముగలవా డగుచు, దానివలన గలుగు క్లేశముల నెఱుంగజాలడు.

క స్తం స్వయం తదభిజ్ఞో విపశ్చి -
దవిద్యాయామన్తరే వర్తమానమ్ ।
దృష్ట్వా పునస్తం సఘృణః కుబుద్ధిం
ప్రయోజయేదుత్పథగం యథాన్ధమ్ ॥ 17

జ్ఞానవంతుడు, దయాశీలుడు, పండితుడు వగువ్యక్తి యెవ్వడైన అజ్ఞానమువలన గలుగు సంసారమున పతితుడై యున్న కుబుద్ధియు, సంసారాసక్తుడు వగుజీవుని దుష్టమార్గమున పయనించుట చూచి మరల దానియందే నియమించునా ? అపమార్గమున పయనించు అంధుని జూచి యామార్గము నందే నడువు మనియెవ్వడైన చెప్పునా ? అనగా ఎవ్వడును అట్లుచెప్పడని యర్థము.

గురుర్న స స్యాత్ స్వజనో న స స్యాత్
పితా న స స్యాజ్జననీ న సా స్యాత్ ।
దైవం న తత్ స్యాన్న పతిశ్చ స స్యా -
న్న మోచయేద్యః సముపేతమృత్యుమ్ ॥ 18

భక్తిమార్గోపదేశముద్వారా సముపస్థితమైన మృత్యురూప సంసారము నుండి ముక్తి పొందింప జాలని గురువు గురువు కాదు, స్వజనుడు స్వజనుడు కాదు, తండ్రి తండ్రికాదు అనగా అతడు పుత్రోత్పత్తివిషయమై ప్రయత్నము చేయుట తగదు. ఆతల్లి తల్లికాదు, అనగా ఆతల్లి గర్భము ధరింప నవసరము లేదు. ఆదేవత దేవతకాదు, అనగా జీవుని సంసారమునుండి ముక్తిపొందింప జాలని దేవతలు మానవులనుండి పూజను గ్రహించుట తగదు. ఆభర్త భర్తగాడు, అనగా అట్టివానిని పాణిగ్రహణము చేయుట తగదు.

(అనగా జీవులను భగవద్వైముఖ్యము వలన గలిగిన అనర్థముల నుండి కాపాడని గురువు మున్నగువారిని పరిత్యజింపవలెను. పూర్వకాలమున మహాత్ము డగుబలి తనగురు వగు శుక్రాచార్యుని, విభీషణుడు తన యన్న యగురావణుని, ప్రహ్లాదుడు తనతండ్రి యగు హిరణ్యకశిపుని, భరతుడు తనతల్లి యగుకైకేయిని, ఖట్వాంగరాజు దేవతలను, బ్రాహ్మణ పత్నులు యాజ్ఞికు లగుతమ భర్తలను వారి భగవద్విముఖతవలన దుష్టులుగ భావించి వారిని పరిత్యజించిరి).

ఇదం శరీరం మమ దుర్విభావ్యం
సత్త్వం హి మే హృదయం యత్ర ధర్మః ।
పృష్ఠే కృతో మే యదధర్మ ఆరా -
దతో హి మామృషభం ప్రాహురార్యాః ॥ 19

నా యీ మానవశరీర మవితర్క్యము (అనగా నే నీశరీరమును స్వేచ్ఛగ గ్రహించితిని, ఇది ప్రాకృత జీవునివలె కర్మాధీనము కాదు). నా హృదయము విశుద్ధసత్త్వాత్మకము : దానియందు మత్ప్రాపక మగుభక్తి యోగలక్షణధర్మ మున్నది. నే నధర్మమును దూరమునుండియె పరిత్యజించితిని, అందువలన ఆర్యులు నన్ను ఋషభు డనియందురు.

తస్మాద్భవన్తో హృదయేన జాతాః
సర్వే మహీయాంసమముం సనాభమ్ ।
అక్లిష్టబుద్ధ్యా భరతం భజధ్వం
శుశ్రూషణం తద్భరణం ప్రజానామ్ ॥ 20

మీ రందఱు నాయౌరసపుత్రులు. అందువలన మీరు మాత్సర్యాదులను విడచి మీజ్యేష్ఠసోదరు డగునీభరతుని సేవింపుడు. భరతుని సేవించిన నన్ను సేవించినట్లు, ప్రజలను పరిపాలించినట్లు కాగలదు.

భూతేషు వీరుద్భ్య ఉదుత్తమా యే
సరీసృపాస్తేషు సబోధనిష్ఠాః ।
తతో మనుష్యాః ప్రమథాస్తతోఽపి
గన్ధర్వసిద్ధా విబుధానుగా యే ॥ 21

దేవాసురేభ్యో మఘవత్ప్రధానా
దక్షాదయో బ్రహ్మసుతాస్తు తేషామ్ ।
భవః పరః సోఽథ విరించవీర్యః
స మత్పరోఽహం ద్విజదేవ దేవః ॥ 22

చేతనాచేతనపదార్థములలో వృక్షాదిస్థావరములు, వానికంటె సరీసృపములు, వానికంటె పశ్వాదులు, వానికంటె మానవులు శ్రేష్ఠులు. మానవుల కంటె దేవయోనిత్వము వలన ప్రేతాదులు, వానికంటె గంధర్వులు, వారి కంటె సిద్ధులు, వారికంటె కిన్నరులు, వారికంటె అసురులు, వారికంటె దేవతలు శ్రేష్ఠులు. దేవతలలో ఇంద్రుడు సర్వప్రధానుడు, ఇంద్రుని

కంటె బ్రహ్మపుత్రు లగు దక్షాదులు శ్రేష్ఠులు. వారిలో శంకరుడు సర్వప్రధానుడు. శంకరుడు బ్రహ్మబలముతో బలవంతు డై యున్నాడు. అందువలన ఆయనకంటె బ్రహ్మ శ్రేష్ఠుడు, ఆ బ్రహ్మ నాయధీనమున నున్నాడు. అందువలన నేను వానికంటెను శ్రేష్ఠుడను. ద్విజశ్రేష్ఠు లగు బ్రాహ్మణులు నాకును పూజ్యులే.

న బ్రాహ్మణైస్తులయే భూతమన్యత్
పశ్యామి విప్రాః కిమతఃపరం ను
యస్మిన్ నృభిః ప్రహుతం శ్రద్ధయాహ -
మశ్నామి కామం న తథాగ్ని హోత్రే ॥ 23

విప్రులారా ! నే నేప్రాణినిగూడ బ్రాహ్మణునితో సమముగ లెక్కింపను. అందువలన బ్రాహ్మణుని కంటె శ్రేష్ఠుడు నా కెవ్వడును గనుపించుట లేదు. ఈరహస్యము నెఱింగిన మనుష్యులు బ్రాహ్మణముఖమున శ్రద్ధతో విధిపూర్వకముగ విడిన అన్నాదులవలన నాకు తృప్తి కలుగును. అగ్నిహోత్రాదులయం దిడిన అన్నాదులను నే నంతగా తృప్తిగ స్వీకరింపను.

ధృతా తనూరుశతీ మే పురాణీ
యేనేహ సత్త్వం పరమం పవిత్రమ్ ।
శమో దమః సత్యమనుగ్రహశ్చ
తపస్తితిక్షానుభవశ్చ యత్ర ॥ 24

వేదము లన్నియు నారూపములె. ఇహలోకమున బ్రాహ్మణులు విశుద్ధ మగునా యా వేదమయమూర్తిని ధరియించి యుందురు. పరమ పవిత్ర మగుసత్త్వగుణము, శమము (అంతరింద్రియ నిగ్రహము), దమము (బాహ్యేంద్రియ నిగ్రహము), సత్యము, అనుగ్రహము, తపస్సు, సహిష్ణుత, అనుభవము అనగా వేదార్థ జ్ఞానము అనునీ యెనిమిది గుణములు బ్రాహ్మణులలో విరాజిల్లు చుండును. (అందువలన ఇట్టిగుణములు గలబ్రాహ్మణుల కంటె శ్రేష్ఠు లైనవా రెవరున్నారు?)

మత్తోఽ ప్యనన్తాత్పరతః పరస్మాత్ -
స్వర్గాపవర్గాధిపతేర్న కించిత్ ।
యేషాం కిముస్యాదిత రేణ తేషా -
మకించనానాం మయి భక్తిభాజామ్ ॥ 25

నే ననంతశక్తియుక్తుడను, బ్రహ్మాదులకంటెను శ్రేష్ఠుడను, స్వర్గాప వర్గముల కధిపతిని. అట్టి నానుండి కోరదగిన దేదియు బ్రాహ్మణులకులేదు. వా రకించనులు, కేవలము

నాయందే భక్తిని గలిగియుందురు. రాజ్యాదు లైన యితర వస్తువుల ద్వారా వారి కేప్రయోజనము సిద్ధించును?

సర్వాణి మద్ధిష్ణ్యతయా భవద్భి -
శ్చరాణి భూతాని సుతా ధ్రువాని ।
సమ్భావితవ్యాని పదే పదే వో
వివిక్తదృగ్భిస్తదు హార్హణం మే ॥ 26

పుత్రులారా! స్థావరజంగమాదులకు, సర్వభూతములకు నేనే యధిష్ఠానముగ నున్నా నని భావించి మాత్సర్యాదులను విడచి వానిని గౌరవించిన నన్ను గౌరవించినట్లే యగును.

మనో వచో దృక్కరణే హితస్య
సాక్షాత్కృతం మే పరిబర్హణం హి ।
వినా పుమాన్ యేన మహావిమోహాత్
కృతాన్తపాశాన్న విమోక్తుమీశేత్ ॥ 27

నాయారాధనమె మనస్సునకు, చక్షువులకు, వాక్కులకు, ఇతరము లగునింద్రియ వ్యాపారములకు సాక్షాత్తుగ ఫల మైయున్నది. నాయారాధనము లేనిదె జీవుడు యమపాశముల నుండి ముక్తి పొందజాలడు.

## శ్రీ శుకఉవాచ

ఏవమనుశాస్యాత్మజాన్ స్వయమనుశిష్టానపి లోకాను శాసనార్థం మహానుభావః పరమ సుహృద్భగవానృషభాపదేశ ఉపశమశీలానాముపరత కర్మణాం మహామునీనాం భక్తిజ్ఞాన వైరాగ్య లక్షణం పారమహంస్య ధర్మముప శిక్షమాణః స్వతనయశత జ్యేష్ఠం పరమభాగవతం భగవజ్జన పరాయణం భరతం ధరణి పరిపాలనాయాభిషిచ్య స్వయం భవన ఏవోర్వరితశరీరమాత్ర పరిగ్రహ ఉన్మత్త ఇవ గగనపరిధానః ప్రకీర్ణకేశ ఆత్మన్యా రోపితాహవనీయో బ్రహ్మావర్తాత్ ప్రవవ్రాజ ॥ 28

శుకుడు పలికెను : మహానుభావుడు, పరమబంధువు, భగవానుడు నగు ఋషభదేవుని పుత్రులు స్వయముగ సుశిక్షితులైరి. అయినను ఆయన లోకశిక్షార్థమై వారికి బోధించి వాసనారహితులు, కర్మగ్రంథిశూన్యులు నగు మహా మునుల భక్తిజ్ఞానవైరాగ్య లక్షణ మగు పారమహంస్యధర్మమును బోధించునుద్దేశ్యముతో తననూటుగురుపుత్రులలో సర్వజ్యేష్ఠుడు,

పరమభాగవతుడు, భగవజ్జనపరాయణుడు నగుభరతుని పృథ్వీపాలన నిమిత్తమై రాజ్యమునం దభిషిక్తునిగ జేసెను. తాను గృహమునం దున్నపుడె వస్త్రాభూషణాదుల నన్నింటిని పరిత్యజించి శరీరమాత్రమును పరిగ్రహించి ఉన్మత్తునివలె వాతవసనుడు, విముక్త కేశుడు నై ఆవహనీయాగ్నిని తన యందే నిలుపుకొని బ్రహ్మావర్తమును విడచి వెడలెను.

**జడాన్ధమూకబధిరపిశాచోన్మాదకవదవధూతవేషోఽభి భాష్యమాణోఽపి జనానాం గృహీతమౌనవ్రతస్తూష్ణీం బభూవ ॥ 29**

అవధూతవేషమును స్వీకరించి ఆయన జనులలో జడునివలె, అంధునివలె, మూగివానివలె, చెవిటివానివలె, పిశాచమువలె ఉన్మత్తభావముతో నుండెను. వా రాయనను పలుకరించినను ఆయన మాత్రము మౌనము నవలంబించి యుండును. ఎవ్వరితోడను సంభాషించెడివాడు కాడు.

**తత్ర తత్ర పురగ్రామాకరఖేటవాటఖర్వటశిబిరవ్రజ ఘోషసార్థ గిరివనాశ్రమా దిష్వనుపథ మవనిచరాపసదైః పరిభూయమానో మక్షికాభిరివ వనగజ స్తర్జన తాడనావమేహనష్ఠీవనగ్రావశకృద్రజః ప్రక్షేపపూతివాతదురు క్తైస్తదవి గణయన్నే వాసత్సంస్థాన ఏతస్మిన్ దేహోపలక్షణే సదపదేశ ఉభయాను భవస్వరూపేణ స్వమహిమావస్థానేనా సమారోపితాహం మమాభి మానవత్వాద విఖణ్డితమనాః పృథివీమేకచరః పరిబభ్రామ ॥ 30**

ఆయన పురములు, గ్రామములు, గనులు, కృషీవల గ్రామములు, గిరితట గ్రామములు, పుష్పాదివాటికలు, శిబిరములు, గోనివాసములు, గొల్లపల్లెలు, యాత్రికులు కలియు స్థానములు, పర్వతములు, వనములు, ఋష్యాశ్రమములు మున్నగు నే యే ప్రదేశముల యందు సంచరించుచుండునో ఆయా ప్రదేశములయం దున్న దుష్టజనులు, అడవియేనుగును బాధించు నీగల వలె భయమును జూపుట, కొట్టుట, శరీరముపై మూత్రమును విడచుట, ఉమ్మివేయుట, రాళ్ళు విసరుట, మలమును విడచుట, దుమ్ము చల్లుట, అపానవాయువును విడచుట, దుర్వాక్యముల ప్రయోగించుట మున్నగువావి ద్వారా ఆయన ననేక విధముల బాధింపసాగిరి. అయినను ఆయన వానిని లెక్కజేయకుండెను. ఏలయన, ఆయన అచిద్వస్తుపరిణామ మగునీజడ దేహమునం దాత్మబుద్ధి భ్రమవిషయమువ చైతన్యమును పొంది స్వస్వరూపపరస్వరూపము లనురెండు స్వరూపానుభూతులతో గూడ తన మహిమయం దుండెను. అందువలన ఆయనకు దేహమునందు 'నేను, నాది' యనునభిమానము లేదు. ఆయన నిర్మలచిత్తముతో పృథివియంతట పర్యటింపసాగెను.

**అతిసుకుమార కరచరణోరస్థల విపులబాహ్వంసయుగలవదనాద్య వయవ విన్యాసః ప్రకృతి సుందర స్వభావ హాససుముఖో నవనలిన దలాయమాన**

**శిశిరతారారుణాయత నయన రుచిరః సదృశసుభగ కపోలకర్ణ కంఠనాసో విగూఢస్మితవదన మహోత్సవేన పురవనితానాం మనసి కుసుమశరాసనముపద ధానః పరాగవలమ్బ మానకుటిల జటిలకపిశ కేశభూరిభారో ఽ వధూతమలిన నిజశరీరేణ గ్రహగృహీత ఇవాదృశ్యత ॥ 31**

ఆయనకరములు, చరణములు, వృక్షస్థలము, విశాలబాహుయుగళము, స్కంధద్వయము, వదనము అవయవము లన్నియు మిగుల కోమలములుగను, ఉత్తమ రూపముతోను, ముఖమండలము స్వభావసిద్ధమగు హాసముతోను నిరంతరము శోభిల్లుచుండెను. నయనములు నూతన పద్మదళముల వలె విశాలములు, అరుణవర్ణములు గలవిగ్రమై యుండెను. వానియందలి తారకలు (కనిగ్రుడ్లు) చూచువారి సంతాపమును పోగొట్టు చుండెను, ఆయన కపోలములు, కర్ణములు, కంఠము, నాసికగూడ అట్లే సుందరముగ నుండెను. వదనమండలమున మందహాసము నిరంతరము విలసిల్లుచుండెను. దాని ద్వారా ఆయన పురవనితల మనస్సులలో కుసుమ శరాయుధుని (మన్మథుని) ఉద్దీపిత మొనరించు చుండెను. ఆయన ముఖమునకు ముందు కృష్ణవర్ణము, జటిలము, ఆకుంచితము నగు కేశకలాపము వ్రేలాడు చుండెను. అప్రయత్నముగ శరీరము మలిన మగుటచే అతడు గ్రహమావేశించిన వానివలె కనబడసాగెను.

**యర్హి వావ స భగవాన్ లోకమిమం యోగస్యాద్ధా ప్రతీపమివాచక్షాణ స్తత్ప్రతి క్రియాకర్మబీభత్సితమితి వ్రతమాజ గరమాస్థితః శయాన ఏవాశ్నాతి పిబతి ఖాదత్యవమే హతిశహదతి స్మ చేష్టమాన ఉచ్చరిత ఆదిగ్ధోద్దేశః ॥ 32**

భగవానుడగు ఋషభదేవుడు జనుల నందఱను యోగమునకు విరోధముగ నున్నట్లు భావించెను. ప్రతీకార రూపము లైనవారికర్మ లన్నియు మిగుల నిందితము లనియు తెలిసికొనెను. అప్పు డాయన 'అజగర' మున్రవతము నవలంబించి యొకప్రదేశమున శయనించి అచ్చటనే ఆహారపానీయములను స్వీకరించును. మలమూత్రములను పరిత్యజించును. వానియందే పొర్లాడు చుండును. దానివలన వానిశరీరము మల మూత్రములచే లిప్తమై యుండెను.

**తస్య హ యః పురీషసురభిసౌగన్ధ్యవాయుస్తం దేశం దశయోజనం సమన్తాత్ సురభిం చకార ॥ 33**

కాని అట్లయినను దానియం దెట్టిభీభత్సము వెల్లడియగుట లేదు. ఆ మలమునం దేమాత్రమును దుర్గంధము లేకుండెను. వాయువు ఋషభ దేవుని యాపురీష సౌరభముచే

సువాసితమై నలువైపుల పదియోజనముల వఱకు గల ప్రదేశమును సువాసిత మొనరించు చుండెను.

**ఏవం గోమృగకాకచర్యయా వ్రజం స్తిష్ఠన్నాసీనః శయానః కాకమృగగోచరితః పిబతి, ఖాదత్యవమేహతి స్మ ॥ 34**

ఇట్లు గోవులయొక్క, మృగములయొక్క, కాకుల యొక్క ఆచరణము లద్వారా ఆయన ఒకప్పుడు నడచును, ఒకప్పు డొకచోట నుండును, మఱియొకప్పుడు కూర్చుండును, ఇంకొకప్పుడు పరుండును. గోమృగ కాకములవలె మెలగుచు త్రాగును, భుజించును, మలమూత్రములను విడచును.

**ఇతి నానాయోగచర్యాచరణో భగవాన్‌కైవల్యపతి ర్ఋషభో ఽ విరతపరమ మహానన్దానుభవ ఆత్మని సర్వేషాం భూతానామాత్మభూతే భగవతి వాసుదేవే ఆత్మనో ఽ వ్యవధానానన్తరోదరభావేన సిద్ధసమస్తార్థపరిపూర్ణో యోగైశ్వ ర్యాణి వైహాయస - మనోజవాన్తర్ధాన పరకాయ ప్రవేశదూర గ్రహణాదీని యదృచ్ఛ యోగపతాని నాంజసా నృప హృదయే నాభ్యనన్దత్ ॥ 35**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే ఋషభదేవానుచరితే
పంచమోఽధ్యాయః ॥

రాజా ! ఋషభదేవుడు యోగులయాచరణమును జూపదలచి యిట్లు వివిధము లగుయోగముల ననుష్ఠించెను. వాస్తవముగ ఆయన ముక్తి కధీశ్వరుడు, ఉత్తరోత్తరము (నూఱురెట్లు) వృద్ధిపొందిన అఖండానందమయుడు నై యుండెను. సర్వభూతముల కాత్మయు, నిజాంశియు, భగవానుడు నగువాసుదేవునితో ఆయన కెట్టివ్యవధానము లేదా భేదము లేదు. అందువలన ఆయన పరిమితిలేని అశ్రుపులకాదిలక్షణములు గల ప్రేమలోభముచే పరిపూర్ణుడై సమస్త ఫలములను పొందెను. అంతరిక్షమున విహరించుట, మహావేగమున వెడలుట, అంతర్ధాన మగుట, పరకాయ ప్రవేశము, దూరదర్శనము మున్నగు యోగైశ్వర్యములు వానియంతట అవియే లభించినను ఆయన వాని నన్నింటిని అంగీకరింపలేదు.

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమందలి పంచమస్కంధములోని
యైదవ అధ్యాయము సంపూర్ణము.



# ఆఱవ అధ్యాయము

## ఋషభదేవుడు శరీరమును త్యజించుట

కథాసారము :- ఈ యధ్యాయమున ఋషభదేవుని దేహత్యాగవిధానము, దేహము దావానలముచే దగ్ధ మగునపుడు దానిపై నాసక్తి లేకపోవుట యనువిషయములు వర్ణితము లైనవి.

జ్ఞానాగ్నిచే కర్మబీజమైన అవిద్య నశింపగా యోగైశ్వర్యాదులు వానియంతటవియే ఉపస్థితములై యోగులకు యోగసాధనమున ఎట్టి విఘ్నములు కలిగింపజాలవు. అయినను మహాత్ములు యోగైశ్వర్యాదుల నాదరింపరు. మనస్సు మిగుల చంచలమైనది. దానిని విశ్వసించి మహాదేవుడు సౌభరి మున్నగు సమర్థు లగువ్యక్తుల బహుకాల తపస్సుగూడ వినష్ట మయ్యెను. మనస్సే యోగులను కామక్రోధాదులకు దాసులనుగా జేసి యోగభ్రష్టులనుగ జేయును. ఋషభదేవుడు యోగులకు దేహత్యాగ విధానమును బోధించు నుద్దేశ్యముతో తన దేహమును త్యజింపదలచినవాడై దక్షిణ కర్ణాటకమున కోంక వేంకట కుటకములు మున్నగు స్థానముల యందు సంచరించుచు కుటకాచలమునకు సమీపమున నున్న ఉపవనమునకు జేరి కొనెను. అచట దావానలము బయలుదేరి వానిదేహముతో పాటు సమస్త వనమును దగ్ధము చేసినది.

ఋషభ దేవుని పారమహంస్యలీలను శ్రవణము చేసి కోంక వేంకట కుటక దేశములకు రాజయిన "అర్హతుడు" వానిని తెలిసికొనెను. పిమ్మట మందమతి యగువారాజు ఆ భగవానుని దైవీమాయచే మోహితుడై స్వధర్మమును విడచి తనబుద్ధి బలముతో వేదవిరుద్ధము లగు జైనాది పాషండధర్మలమును ప్రవర్తింప జేసెను. ఋషభ దేవుడవతరించి మోక్ష ధర్మముల నుపదేశించి పాషండధర్మములను వినాశముచేసెను. పృథివిలో భారతవర్ష మత్యంతపుణ్యమయ మైనభూమి. అచట భగవానుడు స్వయముగ నవతరించెను. యోగు లేసిద్ధికై ప్రయత్నింతురో ఋషభదేవుడు వాని నన్నింటిని ఉపేక్షించెను. భగవద్భక్తి లాభమున పూర్ణభక్తు లెట్టిపురుషార్థము కలిగినను ఆదరింపరు. భక్తి మిగుల దుర్లభ మైనది. భగవానుడు భజనజేయువారికి ముక్తి యిచ్చినను భక్తిని మాత్ర మీయడు. కాని ముక్తివాసనను విడచి భక్తిని మాత్రము వాంఛించువారికి ఆయన భక్తినే యిచ్చును.

### శ్రీ రాజోవాచ

**న నూనం భగవ ఆత్మారామాణాం యోగసమీరిత జ్ఞానావభర్జిత కర్మ బీజానా మైశ్వర్యాణి పునః క్లేశదాని భవితు మర్హంతి యదృచ్ఛయోపగతాని॥1**

పరీక్షిన్మహారాజు పలికెను : దేవా! యోగముచే నుద్దీపిత మగు ఆత్మారాములజ్ఞానాగ్నిచే రాగాదికర్మబీజము లన్నియు దగ్ధము లగును. అపుడు వారికి యోగైశ్వర్యాదులు వానియంతట అవియే కలిగినను, అవి వారికి దుఃఖప్రదములు కావు (అనగా ఋషభదేవుడు వానిలో దేనిని గూడ అంగీకరింపలేదు).

## శ్రీ ఋషిరువాచ

సత్యముక్తం కి న్త్విహ వా ఏ కేన మనసో ద్ధావిశ్రమ్భ మనవస్థానస్య శఠకిరాత ఇవ సఙ్గచ్ఛన్తే ॥ 2

శుకదేవుడు పలికెను : రాజా! నీవు సత్యము పలికితివి. కాని ధూర్తు డగువ్యాధుడు మృగములను బంధించియు (అవి మరల పారిపోవు ననుభయముచే) వానిని పూర్తిగ విశ్వసింపడు. అట్లే ఈలోకమున మహాత్ములుగూడ చంచల మగుమనస్సును బాగుగ విశ్వసింపరు.

## తథా చోక్తమ్ -

న కుర్యాత్కర్హిచిత్ సఖ్యం మనసి హ్యనవస్థితే ।
యద్విశ్రమ్భాచ్చిరాచ్చీర్ణం చస్కన్ద తప ఈశ్వరమ్ ॥ 3

పండితులు పలికిరి : మనస్సునకు చాంచల్య మున్నచో ఎవ్వరితోను మైత్రి నెఱపవలదు. ఇట్టి మనస్సును విశ్వసించియె విష్ణువు యొక్క మోహిన్యవతార రూపాదులను దర్శించుట వలన మహాదేవుడు సౌభరి మున్నగు సమర్థు లగువ్యక్తుల బహుకాల తపస్సు గూడ వినాశమును పొందెను.

నిత్యం దదాతి కామస్య ఛిద్రం తమను యేఽరయః ।
యోగినః కృతమైత్రస్య పత్యుర్జాయేవ పుంశ్చలీ ॥ 4

దుష్టురా లైనభార్య జారునకు అనగా ఉపపతికి అవకాశమును గలుగజేసి తన భర్తప్రాణములను తీయించును. మనస్సును విశ్వసించిన యోగుల దుష్ట మైనమనస్సు గూడ కామమునకు, కామము ననుసరించు క్రోధాదుల కవకాశ మొసంగి యోగులను యోగభ్రష్టులునుగ జేయును.

కామో మన్యుర్మదో లోభః శోకమోహభయాదయః ।
కర్మబన్ధశ్చ యన్మూలః స్వీకుర్యాత్కోను తద్బుధః ॥ 5

దేని నిమిత్తముగ కామము, క్రోధము, మదము, లోభము, శోకము, మోహము, భయాదులు, కర్మబంధనములు కలుగునో అట్టి మనస్సు నేపండితుడు విశ్వసించును?

అథైవమఖిలలోకపాలలలామో విలక్షణైర్జడవదవధూత వేషభాషాచరిత్రైర విలక్షిత భగవత్ప్రభావో యోగినాం సామ్పరాయ విధిమనుశిక్షయన్ స్వకళేవరం జిహాసురాత్మన్యాత్మాన మసంవ్యవహితమనర్థాన్తరభావేన నిరీక్ష్యమాణ ఉపరతాను వృత్తిరుపరరామ ॥ 6

ఋషభదేవు డఖిలలోకపాలకులకు శిరోభూషణము వంటివాడు. అతడు అవధూతా చరితము లగు నానావిధ వేషభాషలను, వివిధములగు ఆచరణములను అవలంబించి జడపురుషునివలె నుండుటచే వానియైశ్వరీయ ప్రభావము లక్షితము కాలేదు. అతడు యోగులకు సాంపరాయవిధివి అనగా దేహత్యాగ ప్రక్రియను బోధించు నిమిత్తమై తన కళేబరమును త్యజింప దలచెను. అతడు తనయంశ యగు వాసుదేవునియందు తన్ను అనుక్షణము మాయావ్యవధాన రహితునిగను, అభిన్న రూపముతోను దర్శించుచు లింగదేహాభిమానమును పరిత్యజించెను. లింగదేహాభిమానమును పరిత్యజించిన పునరావృత్తి యుండదు. (ఋషభదేవుడు లోకశిక్షార్థమై యట్టి భావము ననుకరించెను).

తస్య హ వా ఏవం ముక్తలింగస్య భగవత ఋషభస్య యోగమాయా వాసనయా దేహ ఇమాం జగతీమభిమానా భాసేవ సంక్రమమాణః కోంకవేంకటకుటకాన్ దక్షిణకర్ణాటకాన్ దేశాన్ యదృచ్ఛయోపతః కుటకా చలోపవన ఆస్యే కృతాశ్మకవల ఉన్మాద ఇవ ముక్తమూర్ధజోఽ సంవీత ఏవ విచచార ॥ 7

ఋషభదేవుని మనస్సులో దేహాభిమానము లేకపోయినను నిజావతారలీలా ప్రకటవాసనా రూపసంస్కారము వలన వానిదేహ మీపృథ్వియందు సంచరింప సాగెను. ఇట్లు పర్యటించుచు ఆత డొకప్పుడు దక్షిణకర్ణాటక మందలి కోంక వేంకట కుటక ప్రభృతి దేశములను సంచరించుచు కుటకాచలమునకు సమీపమున నున్న ఉపవనమునకు జేరికొనెను. అచ్చట రాతి ముక్కలను నోటిలో పెట్టుకొనుచు ఉన్మాదునివలె జుట్టు విరబోసికొని దిగంబరుడై తిరుగసాగెను.

అథ సమీరవేగవిధూతవేణు వికర్షణజాతోగ్రదావానల స్తద్వనమా లేలిహానః సహ తేన దదాహ ॥ 8

చివరకు వాయువేగముచే ఆకాననమునం దున్న వెదురుచెట్లు ఒకదానితో నొకటి రాచుకొనుట వలన భయంకర మగుదావానలము ప్రజ్వరిల్లెను. అది ఆయనదేహముతో పాటు వనము నంతటిని భస్మము చేసినది.

**యస్య కిలానుచరితముపాకర్ణ్య కోంకవేంకటకుటకానాం రాజార్హన్నా మోపశిక్ష్య కలావధర్మ ఉత్కృష్యమాణే భవితవ్యేన విమోహితః స్వధర్మ పథమకుతో భయమపహాయ కుపథ పాషణ్డమసమంజసం నిజ మనీషయా మన్దః సంప్రవర్త యిష్యతే ॥ 9**

రాజా! ఋషభదేవుని ఆశ్రమాతీతపారమహంస్యలీలను శ్రవణము చేసి కోంకవేంకట కుటకదేశములకు జైనరా జైన అర్హతుడు స్వయముగ దానిని గ్రహించెను. ప్రాణుల పూర్వసంచిత పాపఫలముచే కలియుగమున అధర్మము ప్రబలము కాగా మందమతి యగు నా అర్హతుడు మూఢుడై నిర్భయముగ తనధర్మ మార్గమును పరిత్యజించి తనబుద్ధి ననుసరించి వేద విరుద్ధము లగుజైనాది పాషండధర్మరూపములైన అపమార్గములను ప్రవర్తింప జేయును.

**యేన హ వావ కలౌ మనుజాపసదా దేవమాయా విమోహితాః స్వవిధి నియోగ శౌచచారిత్ర్యవిహీనా దేవహేల నాన్యపవ్రతాని నిజనిజేచ్ఛయా గృహ్ణానా అస్నానానా చమనాశౌచకేశోల్లుఞ్చనాదీనీ కలినాధర్మబహులేనోపహత ధియో బ్రహ్మబ్రాహ్మణ యజ్ఞపురుషలోకవిదూషకాః ప్రాయేణ భవిష్యన్తి॥10**

దానివలన నరాధములు దైవీమాయచే మోహితులై తమతమ వర్ణాశ్రమములకు తగిన విధినిషేధాదులను, స్నానసంధ్యోపాసనారూప శౌచాచారములను పరిత్యజించి దైవతిరస్కారమును దుష్టవ్రతములను అనుష్ఠింతురు. స్నానము చేయకపోవుట, ఆచమనము చేయకపోవుట, అశుచిగ నుండుట, జుట్టు తీయించుట మున్నగు నానావిధాచారములను స్వేచ్ఛగ నాచరింతురు. అధర్మప్రధాన మగుకలిప్రభావముచే వారి బుద్ధి నష్టమగును. దానివలన వారు తఱచుగ వేదములను, బ్రాహ్మణులను, భగవానుని, భాగవతులను నిందింతురు.

**తే చ హ్యర్వాక్తనయా నిజలోకయాత్రయాన్ధపరం పరయాఽఽశ్వస్తాస్తమస్యన్ధే స్వయమేవ ప్రపతిష్య న్తి ॥ 11**

ఆ నరాధములు అజ్ఞానమయము, అవైదికము, స్వేచ్ఛాకృతము నగుప్రవృత్తినే విశ్వసించి దానిద్వారా ఘోర మగునరకమున ప్రవేశింతురు.

**అయమవతారో రజసోపప్లుతలోక కైవల్యోప విక్షణార్థః ॥ 12**

రజోగుణముచే నిండియున్న వ్యక్తులకు కైవల్యము నుపదేశించుటకే ఋషభదేవుని యీయవతారము వచ్చినది.

**తస్యానుగుణాన్ శ్లోకాన్ గాయ న్తి -**

అహో భువః సప్తసముద్రవత్యా
ద్వీపేషు వర్షేష్వధిపుణ్యమేతత్ ।
గాయన్తి యత్రత్యజనా మురారేః
కర్మాణి భద్రాణ్యవతారవన్తి ॥ 13

పండితులు ఋషభదేవుని గుణములను వర్ణించు నీశ్లోకములను పఠింతురు -

"ఆహా! సప్తసాగరవేష్టిత మగుపృథివి యందలి ద్వీపములలోను, వర్షములలోను ఈ భారతవర్షమే మిగుల పుణ్యవంతమైనది. ఇచట జనులు విష్ణుభగవానుని మంగళమయము లగు ఋషభాద్యవతారచరిత్రలను గానము చేయుచుందురు.

అహో ను వంశో యశసావదాతః
ప్రైయవ్రతో యత్ర పుమాన్ పురాణః ।
కృతావతారః పురుషః స ఆద్య -
శ్చచార ధర్మం యదకర్మ హేతుమ్ ॥ 14

ఆహా ! ప్రియవ్రతుని వంశకీర్తి యెంతనిర్మల మైనది? ఆ వంశమున పురాణ పురుషుడు, ఆదిదేవుడు నగుభగవానుడు అవతరించి నైష్కర్మ్య రూప మగుధర్మము నాచరించెను.

కో న్వస్య కాష్ఠామపరోఽనుగచ్ఛే -
న్మనోరథేనాప్యభవస్య యోగీ ।
యో యోగమాయాః స్పృహయత్యుదస్తా
హ్యసత్తయా యేన కృతప్రయత్నాః ॥ 15

మఱి యే యోగి యైన మనస్సు ద్వారాకూడ జన్మరహితుడు, భగవానుడు నగునా ఋషభదేవుని మార్గమున పయనించగలడా ? ఋషభదేవు డేసిద్ధులను అసత్యము లని పరిత్యజించెనో వానిని పొందుటకై యోగులు నానావిధము లగు క్లేశముల ననుభవించు చుందురు.

ఇతి హ స్మ సకలవేదలోక దేవబ్రాహ్మణగవాం పరమ గురోర్భగవత ఋషభా ఖ్యస్య విశుద్ధాచరితమీరితం పుంసాం సమస్త దుశ్చరితాభిహరణం పరమమహామంగలాయన మిదమను శ్రద్ధయోపచితయామ శృణోత్యాశ్రావ యతి చావహితో భగవతి తస్మిన్ వాసుదేవ ఏకాన్తతో భక్తిరనయోరపి సమను వర్తతే ॥ 16

నిఖిలవేదములకు, లోకములకు, దేవతలకు, గోవులకు, బ్రాహ్మణులకు పరమగురు వగు ఈ ఋషభదేవుని పరమపవిత్ర చరిత్రమును గూర్చి నీకు వివరించితిని. అది జీవుల దుష్కర్మల నపహరించును. అందువలన ఇది పరమోత్కృష్టము లగుశుభములకు నిలయము. దీనిని శ్రద్ధతోడ మనోయోగముతోడ శ్రవణముచేయువాడు లేదా యితరులకు వినిపించువాడు ఇరువురు భగవాను డగువాసుదేవునియం దవ్యభిచారిణి అనగా శుద్ధభక్తి కలవా రగుదురు.

యస్యా మేవ కవయ ఆత్మానమవిరతం వివిధవృజిన సంసారపరితాపో
పతప్యమాన మనుసవనం స్నాపయన్తస్తయైవ పరయా నిర్వృత్యాహ్యపవర్గ
మాత్యన్తికం పరమ పురుషార్థ మపి స్వయమాసాదితం నో ఏవాద్రియన్తే
భగవదీయత్వేనైవ పరి సమాప్తసర్వార్థాః ॥ 17

వివిధ పాపపూర్ణ సంసారతాపములచే నిరంతరము పరితప్తులై ఆత్మ ననుక్షణము భగవద్భక్తి సుధారసముచే స్నానము చేయించుపండితు లగు వ్యక్తులు దానిద్వారానే పరమానందము ననుభవింతురు. పరమపురుషార్థ మగుముక్తి స్వయముగ ఉపస్థిత మైనను అనగా భగవానుడు వారికి దాని నిచ్చినను, వారు దానిపట్ల ఆదరము చూపరు. వారు భగవద్విషయిణి యగు భక్తిప్రభావముచే సకలపురుషార్థములను పొందుదురు.

రాజన్ పతిర్గురురలం భవతాం యదూనాం
దైవం ప్రియః కులపతిః క్వ చ కింకరో వః ।
అస్త్వేవమఙ్గ భగవాన్ భజతాం ముకున్దో
ముక్తిం దదాతి కర్హిచిత్ స్మ న భక్తియోగమ్ ॥ 18

రాజా ! భగవాను డగుముకుందుడు మీకు (పాండవులకు) యాదవులకు పాలకుడు, గురువు, ఉపాస్యుడు, బంధువు, కులపతియు నైయున్నాడు. అధిక మేల ? ఆయన అప్పుడప్పుడు (భక్తవాత్సల్యము వలన) మీకు (పాండవులకు) కింకరునివలె నుండి మీపనుల నొనర్చినాడు. తన్ను సేవించినవారికి ఆయన ముక్తి నిచ్చును. కాని భక్తి యోగము నెవ్వరికిని ఎప్పుడును ఈయడు.

నిత్యానుభూతనిజలాభనివృత్తతృష్ణః
శ్రేయస్యతద్రచనయా చిరసుప్తబుద్ధేః ।
లోకస్య యః కరుణయాభయమాత్మలోక -
మాఖ్యాన్న మో భగవతే ఋషభాయ తస్మై ॥ 19

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే ఋషభదేవానుచరితం
నామ షష్ఠోఽధ్యాయః ॥

ఋషభదేవుడు స్వస్వరూపము యొక్క నిత్యానుభవమునె పరమ లాభమని తెలిసికొనెను. దానివలన వాని అన్యపురుషార్థ లాభపిపాస తొలగెను. అనాత్మభూత మగు దేహము యొక్క వ్యాపారమునందాసక్తమై యెవరిబుద్ధి శ్రేయోలాభ విషయమున చిరప్రసుప్తమై యుండెనో, ఆయన (ఋషభ దేవుడు) అట్టివారికి కృపతో భయరహిత మగునాత్మ రూపమును అనగా భగవత్తత్త్వము నుపదేశించెను. నే నట్టిఋషభదేవునకు నమస్కరించు చున్నాను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
ఋషభ దేవచరిత మనుఆఅవ అధ్యాయము
సంపూర్ణము.





# ఏడవ అధ్యాయము

## భరతుని చరిత్రము

కథాసారము :- భరతరాజు రాజ్యముచేయుచు దీర్ఘ కాలవ్యాప్తమైన యజ్ఞము ద్వారా శ్రీహరిని ఆరాధించెను. ఆరబ్ధకర్మ పూర్తికాగా సంసారమును త్యజించి హరి క్షేత్రమునకు వెడలి శ్రీహరిని సేవించెను. ఈ విషయ మంతయు ఈయధ్యాయమున వర్ణింపబడెను.

తండ్రి యగు ఋషభదేవుని యభిప్రాయము ననుసరించి భరతుడు రాజ్యాభిషిక్తుడై విశ్వరూపుని కన్య యగు పంచజనిని పరిణయమాడి పృథివిని పరిపాలింపసాగెను. పూర్వ మీవర్షమునకు అజనాభ మనుపేరుండెను. అనంతరము భరతుని నామము ననుసరించి దీనికి భారతవర్ష మనునామము కలిగెను. పంచజని వలన భరతునకు సుమతి, రాష్ట్రభృత్తు సుదర్శనుడు, ఆవరణుడు, ధూమ్రకేతువు నను నైదుగురు పుత్రులు కలిగిరి. అతడు స్వధర్మమునం దుండి, తన పూర్వపురుషుల మార్గముననుసరించి స్వధర్మరతు లగుజనులను పరిపాలించు చుండెను. యజ్ఞము ద్వారా సర్వాశ్రయుడు సర్వేశ్వరుడు నగుయజ్ఞేశ్వరునకు ప్రీతిని గలుగ జేసెను. వాని యంతఃకరణము సర్వవిధమలముల నుండి ముక్తమై వాసుదేవుని యందు సుదృఢముగ లగ్నమయ్యెను.

శ్రీవత్స కౌస్తుభవనమాలాశంఖచక్ర గదాపద్మ శోభిత మగువాసుదేవుని యేరూపము నారదాది భక్తులహృదయమున నెల్లపుడు విరాజిల్లు చుండునో దాని నత డవగతము చేసికొనెను. అనంతరము రాజ్యభోగాదిప్రారబ్ధకర్మలు తగినసమయమున సమాప్తి కాగా అతడు తనసంతానమునకు రాజ్యము నప్పగించి పులహాశ్రమమునకు వెడలెను. అచట వనజాతము లగు వివిధ ద్రవ్యములతో వాసుదేవుని యర్చించుచు పరాభక్తిని పొందెను. వానికి వాసుదేవునియందు ప్రగాఢ మగుఅనురక్తి ప్రతిదినము వృద్ధిపొందుటచే హృదయము ప్రేమానందముచే పరిప్లుతమయ్యెను. దేహమున పులకాది ప్రేమలక్షణములు ప్రకాశితము లయ్యెను. అతడు జింకచర్మముతోడ, జటాకలాపము తోడ శోభిల్లుచు సూర్యమండలస్థుడు హిరణ్మయ పురుషుడు నగునారాయణుని ఋఙ్మంత్రములచే ఆరాధించెను.

## శ్రీ శుక ఉవాచ

**భరతస్తు మహాభాగవతో యదా భగవతావనితలపరి పాలనాయ సంచిన్తిత స్తదనుశాసనపరః పంచజనీం విశ్వరూప దుహితరముపయేమే ॥1**

శుకుడు పలికెను : రాజా ! పరమభాగవతుడగు ఋషభదేవుని సంకల్ప మాత్రముననే

(అనగా బ్రహ్మావర్తమునకు వెడలిన సమయమున ఋషభదేవుడు భరతుని రాజ్యపాలనాది కార్యముల యందు నియమింప సంకల్పించెను, తదనుసారముగ) పృథ్వీపాలన కార్యమున నియుక్తుడయ్యెను. తండ్రియాజ్ఞ ననుసరించి యతడు విశ్వరూపునిదుహిత యగుపంచజనిని పరిణయమాడెను.

**తస్యాముహ వా ఆత్మజాన్ కార్త్స్న్యేనానురూపా నాత్మనః పంచ జనయామాస। భూతాదిరివ భూతసూక్ష్మాణి సుమతిం రాష్ట్రభృతం సుదర్శన మావరణం ధూమ్రకేతుమితి ॥**

అహంకారమునుండి శబ్దస్పర్శాదు లైనసూక్ష్మభూతము లుత్పన్న మగునట్లు భరతుడుగూడ పంచజనివలన సర్వగుణములందు తనతోసమానులగు సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుడు, ఆవరణుడు, ధూమ్రకేతువు నను నైదుగురు పుత్రులను గనెను.

**అజనాభం నామైతద్వర్షం భారతమితి యత ఆరభ్య వ్యపదిశన్తి ॥3**

పూర్వమున యీవర్షమునకు 'అజనాభ' మనుపే రుండెను. భరతుడు రా జయిన పిమ్మట ఈవర్షమును పండితులు 'భారతవర్ష' మని పిలువసాగిరి.

**స చ బహువిన్మహీపతిః పితృపితా మహవదురువత్సలతయా స్వేస్వే కర్మణి వర్తమానాః ప్రజాః స్వధర్మమనువర్తమానాః పర్యపాలయత్ ॥ 4**

సర్వజ్ఞుడు, పృథివీపతియు నగుభరతుడు స్వధర్మమున నుండి తన పితృపితామహుల వలె పరమవాత్సల్యముతో స్వధర్మరతు లగుప్రజలను పరిపాలింప సాగెను.

**ఈజే చ భగవన్తం యజ్ఞక్రతురూపం క్రతుభిరుచ్చావచైః శ్రద్ధయాహృతాగ్ని హోత్రదర్శ పూర్ణమాస చాతుర్మాస్యపశు సోమానాం ప్రకృతి వికృతిభిరనుసవనం చాతుర్హోత్రవిధినా ॥ 5**

భరతుడు శ్రద్ధగలవా డై చిన్నయజ్ఞములను, పెద్దయజ్ఞములను ఎన్నింటినో చేసెను. అతడు అగ్నిహోత్రము, దర్శపౌర్ణ మాసములు, చాతుర్మాస్యములు చేసెను. అశ్వమేధాది పశుయజ్ఞములను ఒకప్పుడు సర్వాంగముగను, మఱియొకప్పుడు వికలాంగముగను ఒనరించెను. దానివలన చాతుర్హోత్రవిధితో పాటు నిరంతరము భగవానుని పూజింపసాగెను.

**సమ్ప్రచరత్సు నానాయాగేషు విరచితాఙ్గక్రియేష్వపూర్వం యత్తత్క్రియాఫలం ధర్మాఖ్యం పరే బ్రహ్మణి యజ్ఞపురుషే సర్వదేవతాఙ్గానాం**

మన్త్రాణామర్థ నియామకతయా సాక్షాత్కర్తరి పరదేవతాయాం భగవతి వాసుదేవ ఏవ భావయమాన ఆత్మనైపుణ్య మృదితకషాయో హవిష్వధ్వర్యుభి ర్గృహ్యమాణేషు స యజమానో యజ్ఞభాజో దేవాంస్తాన్ పురుషావయ వేష్వభ్యధ్యాయత్ ॥ 6

అంగక్రియానుష్ఠానమునకు పిమ్మట వివిధ యజ్ఞములు ప్రవర్తితములు కాగా 'ధర్మ' మనునపూర్వము పుట్టును, అదియే యీయజ్ఞాది కార్యముల ఫలము. ఈక్రియా ఫలము లన్నియు సాక్షాత్తుగ కర్తయు, పర దేవతయు నగువాసుదేవుని ప్రీతికొఱకే ఆయన యందు సమర్పితము లైనవి. ఏలయన, వాసుదేవుడే తత్తద్దేవతాప్రకాశము లగుమంత్రములకు ప్రతి పాద్యు లగుఇంద్రాదిదేవతలను నియమించువా డనిభరతుడు భావించు చుండెడివాడు. ఆలోచనారూప మగునిట్టి యాత్మనైపుణ్యముద్వారా వాని రాగాదులు క్షీణములయ్యెను. యాజ్ఞికులు ఆహుతినిచ్చుట కొఱకై హవిస్సును (యజ్ఞద్రవ్యమును) స్వీకరింపగా యజమాని యగుభరతుడు యజ్ఞభాగభాజనులగు ఇంద్రాది దేవతలను వాసుదేవుని చక్షువులు, బాహువులు మున్నగు అవయవరూపులునుగ ధ్యానించెను. అనగా 'ఇంద్రాయ స్వాహా' అను మంత్రముతో నేను భగవానుని బాహువులను, 'సూర్యాయ స్వాహా' అనుమంత్రముచే భగవానుని చక్షువులను పూజించుచున్నానని భావించుచుండెను.

వివరణము : 'నా కథయందు శ్రద్ధ లేదా వైరాగ్యము కలుగనంతవఱకు కర్మను చేయుచుండ వలెను' అనుభగవానుని వాక్కు ననుసరించి భగవత్కథయందు దృఢ మగుశ్రద్ధ కలవాడు, నిష్కాముడు, శుద్ధ భక్తి కధికారియు నగు భరతునకు కర్మకర్తృత్వము, ఫలభోక్తృత్వము నెట్లు సంగతమగును ? దానికి సమాధానము చెప్పబడుచున్నది - అంగ క్రియానుష్ఠానము పిమ్మట వివిధ యజ్ఞములు ప్రవర్తిల్లగా 'ధర్మ' మనుఅపూర్వ ముదయించును. అది వాసుదేవునియందే యున్నది. ఈ కర్మఫలము లన్నింటి లోను వా కాసక్తి లేదు. అది వాసుదేవునిప్రీతికై వాసుదేవునికే సమర్పిత మగునని భావించును.

మీమాంసకులమతములో కర్మఫలమపూర్వము, అది కర్తృనిష్ఠము, అనగా అది కర్మనుద్దేశించియే ఫలము నిచ్చును ; ఇంకను దేవతారాధన నిమిత్తమై ప్రవర్తిల్లు కర్మలు దేవతానిష్ఠములు. భరతుని కెట్టి కోరికలు లేకుండెను. అందువలన వానియజ్ఞాదికర్మలు దేవతానిష్ఠములు. సూర్య చంద్రాదిభేదముతో బహుదేవత లున్నను భరతుడు ఒక్కవాసుదేవునకే కర్మఫలమును సమర్పించెను; దానికి గారణ మేమి? దానికి సమాధానము చెప్పబడు చున్నది.

వాసుదేవుడే యేకైకయజ్ఞ ఫలభోక్త, ఆయనయె ఆ యా దేవతా ప్రకాశకమంత్రములకు ఉద్దిష్టార్థములుగ నున్న ఇంద్రాదిదేవతలకు నియామకుడు. యజ్ఞాదులయందును భరతునకు

కర్తృత్వభోక్తృత్వములు లేకుండెను. ఏలయన, అంతర్యామి యగువాసుదేవుడె సర్వ యజ్ఞప్రవర్తకుడు, సాక్షాత్తుగ కర్తయు, స్వతంత్రపురుషుడు నై యున్నాడు. అస్వతంత్రుడు, ప్రయోజ్యకర్తయు నగుయజమానునకు సాక్షాత్తుగ కర్తృత్వము లేదు. మహాభారత శాంతిపర్వమున విష్ణుసహస్ర నామస్తోత్రమునందు 'యజ్ఞభుగ్యజ్ఞ కృద్యజ్ఞః' అనగా యజ్ఞభోక్త, యజ్ఞకర్త, యజ్ఞము మున్నగు శబ్దములచే భగవన్నామ ముదహరింప బడినది. భగవానుడు స్వతంత్రకర్త అయ్యును జీవుని యజ్ఞానమువలననే 'నేను స్వతంత్రకర్త' ననుభావము కలుగును. అదియే కర్మబంధములకు గారణ మనితెలిసికొనవలెను. కర్తృత్వాద్యభిమాన శూన్యులు, కర్మఫలత్యాగులు నగుభక్తుల ప్రతినిధి ద్వారా సంపాదింప బడిన కర్మను శ్రద్ధారాహిత్యమువలన ఆకర్మము లేదా కర్మకారణము వని తెలిసికొనవలెను, గీతయందు (17-28) 'శ్రద్ధ లేకుండగ జేయబడు యజ్ఞము, దానము, తపస్సు అసత్యము'లని చెప్పబడెను. ఆ కర్మలన్నియు నిప్పుడు కాని, తరువాత కాని, మఱియెప్పుడైనగాని యుపకరింపవు. అందు వలన అంబరీషాది శుద్ధ భగవద్భక్తులు భగవానుని సేవయందే యెనిమిది జాములను గడిపిరి. అంతేకాక పితృపితామహులు పాలించు సదాచారములు, అనుష్ఠించు యజ్ఞాది కర్మలు వారు ప్రతినిధులద్వారానే చేయించుచుండెడివారని వినబడు చున్నది. అందువలన శుద్ధభక్తులు ప్రతినిధుల ద్వారా కర్మల చేయించుట దూషణీయము కాదు.

కర్మజన్య మగునదృష్టమునె "అపూర్వ" మందురు. శాబ్దబోధకు పూర్వ ముండని యదృష్టము 'అపూర్వము'. ధర్మకార్యములు లేదా పాప కార్యములు చేయుటవలననే వానికి స్వర్గము లేదా నరకము కలుగదు. ఇచట కర్మవేత్తలు తత్తత్కర్మజన్య ఫలమునకు ద్వారస్వరూపమగు 'అపూర్వమును' (అదృష్టమును) కల్పించు చుందురు. వారిమతము ననుసరించి ఆయా 'యపూర్వము' ల నుండియె తగిన కాలమున ఫల ముత్పన్న మగును. స్మృతివేత్తలు రెండువిధములగు 'అపూర్వముల' నంగీకరించిరి. (1) కలికాపూర్వము (2) పరమాపూర్వము. మీమాంసకులు మూ డపూర్వముల నంగీకరించిరి. (1) ప్రధానాపూర్వము లేదా పరమాపూర్వము, (2) అంగాపూర్వము, (3) కలికాపూర్వము, వివరణమునకై మీమాంసా గ్రంథములను జూడవలెను.

భక్తులు భగవాను నుద్దేశించియె సర్వకార్యముల నొనరింతురు. వా రాచరించిన కర్మ లన్నియు కర్మమీమాంసకులవలె నశ్వర మగుఅపూర్వమును పొందవు. గీతయం దీవిషయ మిట్లు చెప్పబడినది. (4-23) -

**గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః।**
**యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥**

"ఆసక్తి లేనివాడును, ముక్తుడును, జ్ఞానముచే వెలయుచిత్తము గలవాడును, యజ్ఞము కొఱకు కర్మ నాచరించువాడును అగుమానవుని సర్వకర్మలు నశించును."

**ఏవం కర్మవిశుద్ధ్యావిశుద్ధసత్త్వస్యాన్తర్హృదయాకాశ శరీరే బ్రహ్మణి భగవతి వాసుదేవే మహాపురుష రూపోపలక్షణే శ్రీవత్స కౌస్తుభవన మాలారిదరగదా దిభిరుప లక్షితే నిజపురుష హృల్లిఖితేనాత్మని పురుషరూపేణవిరోచమాన ఉచ్చైస్తరాం భక్తిరనుదిన మేధమానరయాజాయత ॥ 7**

ఇట్లు విశుద్ధ కర్మానుష్ఠానము వలన వాని హృదయము విశుద్ధమయ్యెను. వాసుదేవుని యందాయనకు భక్తి దినదినము వృద్ధికాజొచ్చెను. ఆ వసుదేవనందనుడె ఉపాసనాభేదముతో పరమాత్మ, బ్రహ్మము, భగవంతుడు అనుశబ్దములచే శబ్దితు డయ్యెను. యోగులు హృదయాభ్యంతరమున ఎవనిని ధ్యానించు చుందురో ఆయనయె పరమాత్మ; జ్ఞాను లెవని నుపాసింతురో ఆయనయె నిర్విశేషబ్రహ్మము; భక్తు లెవనిని భజింతురో ఆయనయె పూర్ణపురుషు డగువాసుదేవుడు. ఆయన రూపము శాస్త్రములలో ప్రసిద్ధముగ నున్నది. ఆయన శ్రీవత్సము, కౌస్తుభము, వనమాల, శంఖము, చక్రము, గద మున్నగువానిద్వారా శోభిల్లు చుండును. ఆయన భక్తు లగునారదాదుల హృదయమున చిత్రపటమువలె నిశ్చల మగుపురుషరూపముతో స్వయముగ ప్రకాశించు చుండును.

**ఏవం వర్షాయుత సహస్ర పర్యన్తావసిత కర్మనిర్వాణావసరోఽధిభుజ్యమానం స్వతనయేభ్యో రిక్థం పితృపైతామహం యథాదాయం విభజ్య స్వయం సకలసమ్పన్ని కేతాత్మనికే తాత్పులహాశ్రమం ప్రవవ్రాజ ॥8**

రాజర్షి యగుభరతుని రాజ్యభోగాది ప్రారబ్ధకర్మ సమాప్తికాల మొక కోటి సంవత్సరములని నిర్ణయింప బడినది. ఆ సమయము పూర్తికాగా అతడు పితృపితామహులకు సంబంధించిన ధనమును తనయధికారముచే పొంది యనుభవించెను. దానిని తగుపద్ధతిలో తనసంతానమునకు పంచి యిచ్చి, సకలసంపదల కాశ్రయభూత మగుతనభవనమును వదలి పులహాశ్రమమునకు వెడలెను.

**యత్ర హ వావ భగవాన్ హరిరద్యాపి తత్రత్యానాం నిజజనానాం వాత్సల్యేన సన్నిధాప్యత ఇచ్ఛారూపేణ ॥ 9**

ఆ పులహాశ్రమమున శ్రీహరి నేటికిని భక్తవాత్సల్యము వలన అచట నున్న భక్తుల యిచ్ఛ ననుసరించి శ్రీమూర్తిని ధరించి వారికి దర్శన మిచ్చు చుండును.

**యత్రాశ్రమపదాన్యుభయతో నాభిభిర్దృషచ్చక్రైశ్చక్రనదీ నామ**

సరిత్ప్రవరా సర్వతః పవిత్రీకరోతి ॥ 10

అచట సరిత్తులలో ఉత్తమ మైనగండకీనది శిలామధ్యగత చక్రము ద్వారా ఆశ్రమములను సంపూర్ణముగ పవిత్రము చేయుచుండును. ఆశిల లన్నింటిలో నొక్కక్కదానికి పైన క్రింద నాభి యుండును.

తస్మిన్ వావ కిల స ఏకలః పులహాశ్రమోపవనే వివిధ కుసుమ కిసలయతులసి కామ్బుభిః కన్దమూలఫలోపహారైశ్చ సమీహమానో భగవత ఆరాధనం వివిక్త ఉపరతవిషయాభి లాష ఉపసంభృతోపశమః పరాం నిర్వృతిమవాప ॥ 11

ఆపులహాశ్రమోపవనమున భరతు డేకాంతమున నుండి వివిధము లగుకుసుమములు, కిసలయములు, తులసి, జలము అనువానిద్వారా కందమూలఫల ప్రభృతివివిధ నైవేద్యముల ద్వారా భగవాను డగువాసుదేవు నర్చింప సాగెను. దానివలన వానిచిత్తము శుద్ధమయ్యెను; విషయాభిలాష నశించెను. అతడు శమగుణము నవలంబించి ప్రీతిలక్షణములు గల పరాభక్తిని పొందెను.

తయేత్థమవిరతపురుషపరిచర్యయా భగవతి ప్రవర్ధమా నానురాగభర ద్రుతహృదయశైథిల్యః ప్రహర్షవేగేనాత్మన్యుద్భి ద్యమానరోమపులకకులక ఔత్కంఠ్య ప్రవృత్త ప్రణయ బాష్ప నిరుద్ధావలోకనయన ఏవం నిజ రమణారుణచరణార విన్దాను ధ్యాన పరిచితభక్తి యోగేన పరిప్లుత పరమాహ్లాద గంభీర హృదయ హ్రదావగాఢధిషణస్తామపి క్రియమాణాం భగవత్స పర్యాం న సస్మార ॥ 12

మహాభాగవతు డగుభరతు డిట్లునిరంతరము భగవత్సేవయందు రతుడై యుండగా వాసుదేవునియందు వాని కనురాగము వృద్ధిచెందెను. దానిచే వానిహృదయము ద్రవించెను. ఇక వాతడు చేయవలసిన నిత్య కృత్యము లేవియు లేకపోయెను. వానిదేహమున రోమాంచము మున్నగు ప్రేమ లక్షణములు పొడసాగెను. ఉత్కంఠత వలన ఆనందాశ్రువు లుత్పన్నములై వానిదృష్టిని నిరోధించినవి. ఇట్లు తనప్రేమ నిచ్చు భగవానుని యరుణవర్ణము లైన పాదపద్మములను ధ్యానించుట వలన కలిగిన ప్రభావముచే భక్తియోగము వృద్ధి పొందెను. దానివలన వాని గంభీర హృదయ మను హ్రదము పరమానందవారిచే పరివ్యాప్త మయ్యెను. వాని మనస్సు అయ్యానందహ్రదమున నిమగ్నమయ్యెను. దానివలన అతడు చేయు భగవత్సేవను గూడ విస్మరించెను.

ఇత్థం ధృతభగవద్వ్రత ఐణేయాజినవాససాను సవనాభి షేకార్ద్రకపిశ కుటిల జటాకలాపేన చ విరోచమానః సూర్యర్చా భగవన్తం హిరణ్మయం

పురుషముజ్జిహానే సూర్యమండలే భ్యుపతిష్ఠన్నేతదు హోవాచ ॥ 13

ఇట్లు భగవద్వ్రతావలంబి యగుభరతుడు కృష్ణమృగచర్మమును ధరించు చుండెను. త్రికాల స్నానముచే తడియుట వలన వానికేశపాశము జడలు కట్టి శోభిల్లు చుండెను. సూర్యు డుదయింపగా సూర్యమండల మధ్య వర్తియు, హిరణ్మయపురుషుడు నగు నారాయణుని ఋజ్మంత్రములచే ఆరాధించుచు ఇట్లు ఉచ్చరింప సాగెను.

పరోరజః సవితుర్జాతవేదో
దేవస్య భర్గో మనసేదం జజాన ।
స్వ రేతసాఽదః పునరావిశ్య చష్టే
హంసం గృధ్రాణం నృషద్రిఙ్గిరామిమః ॥ 14

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే భరతచరితే భగవత్పరి
చర్యాయాం సప్తమోఽధ్యాయః ॥

విశుద్ధసత్త్వాత్మకుడు, జగత్ప్రకాశకుడు, భక్తాభీష్టప్రదాతయు నగు భగవానుడు తనతేజః ప్రభావముచే సంకల్ప మాత్రముననే యీవిశ్వమును సృష్టించెను. ఇంకను ఆయన అంతర్యామి రూపముతో జగత్తున ప్రవేశించి తనచిచ్ఛక్తిద్వారా ఫలకాంక్షు లగుజీవులకు దర్శన మిచ్చి వారిని పాలించు చుండును. నే నాబుద్ధివృత్తికి ప్రవర్తకు డగుభర్గదేవుని శరణుజొచ్చు చున్నాను.

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమందలి పంచమస్కంధములోని
యేడవ అధ్యాయము
సంపూర్ణము.



# ఎనిమిదవ అధ్యాయము

## భరతుడు మృగమోహమున జిక్కుకొని మృగముగా జన్మించుట

కథాసారము :- ఈయధ్యాయమున విష్ణ్వారాధన కాలమునందు అంతరాయ స్వరూపముగ మృగరక్షణము నందలి ఆసక్తిచే భరతునకు మృగత్వము లభించుట అను విషయము వర్ణింపబడెను.

ఒకప్పుడు భరతుడు మహానదియందు స్నానాదినిత్య కృత్యములను నెఱవేర్చి ప్రణవమును జపించు చుండెను. ఇంతలో పూర్ణ గర్భయు, పిపాసాతురయు నగునొకహరిణి జలపానము నందు రత యై యుండగా దానికి అకస్మాత్తుగ సింహగర్జనము వినబడెను. భయవిహ్వలయై యది దుముకుచు నదిని దాటెను. ఆసమయమున దానికి గర్భపాతమయ్యెను. గర్భస్థ శిశువు జలమున బడెను. హరిణి తీరమునకు వెడలి ప్రాణములను విడచెను. ఇదిచూచి మహారాజు దయాపరవశుడై మాతృవిహీనయు సహాయము లేనిదియు నగుమృగశిశువును ఆశ్రమములోనికి దీసికొని వెడలి ప్రయత్న పూర్వకముగ పోషించు చుండెను. క్రమముగ దానియం దాతడు మిగుల ఆసక్తు డయ్యెను. అప్పు డాతడు తనభగవద్ధ్యానాదుల నన్నింటిని మరచి దాని పోషణమునందు, పరిచర్యయందు పూర్తిగ నిమగ్నుడయ్యెను. అన్ని వేళలలోను ఆమృగము వానితో గూడియుండును. అదియే వానికి సేవ్యవస్తు చింతన విషయ మయ్యెను. ధ్యాన కాలమునందును వానినేత్రాదు లాసుకుమారమృగ శిశువునందే ఆకృష్టములై ఆ ధ్యానమును చంచలము చేయసాగినవి. ఇట్లు అచిరకాలములోనే అతడు తా నారంభించినకర్మదోషమువలన ఆత్మధర్మనుండి భ్రష్టుడయ్యెను. విడువరానిదైన సంసారమును త్యజించి వచ్చినను, సామాన్య మగు ఆమృగశిశువునం దాసక్తుడై యతడు యోగభ్రష్టు డయ్యెను. చివర కామృగశిశువు కనబడకుండగ పోయెను. దానియెడ బాటుచే అతడు శోకవిహ్వలుడై 'హా ! మృగమా ! హా ! మృగమా' యనుచు కాలవశమున మృత్యుముఖమున బడి, మృగచింతామగ్నుడై ప్రాణముల విడచెను. పరజన్మమున అతడు మృగత్వమును పొందెను. కాని పూర్వపుణ్య ఫలముచే వాని పూర్వస్మృతి నష్టము కాలేదు. అతడు తాను చేసిన వికర్మను, దానివలన గలిగిన ఈ అధఃపతనమును గూర్చి విలపింపసాగెను. మృగ మాతనిని విడచి మునిగణసేవితము, హరినామముఖరితము నగుఆపులస్త్యాశ్రమమునకు వెడలెను. కర్మ క్షయము కాగా తగిన సమయమున ఆస్థలమునందే యతడు ఆమృగశరీరమునుండి విముక్తుడయ్యెను.

## శ్రీ శుక ఉవాచ

ఏకదా తు మహానద్యాం కృతాభిషేకనైయమికా వశ్యకో బ్రహ్మాక్షర మభిగృణానో ముహూర్తత్రయముదకాన్త ఉపవివేశ ॥ 1

శుకుడు పలికెను : (మహారాజా!) ఒకనాడు భరతుడు మహానది యందు నిత్యనైమిత్తికకర్మలను, ఆవశ్యకము లగుకృత్యములను, స్నానాదులను పూర్తి చేసికొని ప్రణవమును జపించుచు మూడు ముహూర్తముల కాలమువఱకు నదీతీరమున గూర్చుండెను.

తత్ర తదా రాజన్ హరిణీ పిపాసయా జలాశయాభ్యాసమేకైవోపజగామ॥2

రాజా ! అపు డాప్రదేశమున ఒకహరిణము (ఆడులేడి) దప్పిక గొన్నదై ఒంటరిగ ఆజలాశయ సమీపమునకు వచ్చెను.

తయా పేపీయమాన ఉదకే తావదేవావిదూరేణ నదతో మృగపతే రున్నాదో లోకభయంకర ఉదపతత్ ॥ 3

అత్యాసక్తితో ఆహరిణము నీటిని త్రాగుచుండగా కొలదిదూరములో నొక మృగేంద్రము గర్జించెను. దానివలన లోకభయంకర మగుగొప్ప ధ్వని వ్యాపించెను. (దానిని విని హరిణము కంపింపసాగెను).

తముపశ్రుత్య సా మృగవధూః ప్రకృతివిక్లవా చకితనిరీక్షణా సుతరామపి హరిభయాభినివేశ్య వ్యగ్రహృదయా పరిప్లవ దృష్టిరగతతృషా భయాత్ సహసైవో చ్చక్రామ ॥ 4

హరిణము సహజముగ భీరువు, చకితనయన, భయంకర మగు ఆసింహగర్జనమును శ్రవణము చేయుటచే దాని కింకను మహద్భయము కలిగెను. దానివలన దాని హృదయము మిగుల కలతచెందెను. ఆ మృగమిటునటు భయచకిత మగుదృష్టిని సారించుచు దప్పిక తీరకపోయినను భయముతో దుమికి నదిని దాటెను.

తస్యా ఉత్పతన్త్యా అన్తర్వత్న్యా ఉరుభయావిగలితో యోనినిర్గతో గర్భః స్రోతసి నిపపాత ॥ 5

ఆ హరిణము పూర్ణగర్భిణియై యుండెను. అందువలన దుముకునపుడు మిగుల భయముచే దాని గర్భమునం దున్న సంతానము యోనినుండి నిర్గతమై నదీప్రవాహమున బడెను.

ఉత్త్రసవోత్సర్పణ - భయఖేదాతురా స్వగణేన వియుజ్యమానా కస్యాఞ్చిద్దర్యాం కృష్ణాసారసతీ నిపపాతాథ చ మమార ॥ 6

తనగుంపునుండి తప్పిపోయిన ఆకృష్ణ మృగవధువు గర్భపాతము చేత, దుముకుట చేత, భయజనిత మగుక్లేశముచేత పీడితయై ఒక పర్వత గుహలోనికి జొచ్చి చనిపోయెను.

తం త్వేణకుణకం కృపణం స్రోతసానూహ్యమాన మభివీక్ష్యాపవిద్ధం బన్ధురివాను కంపయా రాజర్షిర్భరత ఆదాయ మృతమాతరమిత్యాశ్రమ పదమనయత్ ॥ 7

రాజర్షి యగుభరతుడు నదీతీరమునకూర్చుండి స్వజనరహితము, దీనమునగు హరిణ శిశువు ప్రవాహమున కొట్టుకొని పోవుచుండగా చూచెను. వాని హృదయము కరుణచే ద్రవించెను. బంధువువలె ఆయన ఆమృగశిశువును ప్రవాహమునుండి బయటకు తీసెను. మాతృహీనగా భావించి దానిని తనయాశ్రమమునకు కొనిపోయెను.

తస్య హ వా ఏణకుణక ఉచ్చైరేతస్మిన్ కృత నిజాభి మానస్యాహరహస్త త్పోషణ పాలన - ప్రీణన లాలనానుధ్యానే నాత్మ నియమాః సహయమాః పురుషపరిచర్యాదయ ఏకైకశః కతిపయేనాహర్గణేన వియుజ్యమానాః కిల సర్వ ఏవో దవసన్ ॥ 8

ఈహరిణశిశువునందు భరతుని కతిశయ మగునాత్మీయాభిమానము కలిగెను. అందువలన ఆయన ఆహరిణశిశువును నిరంతరము తృణాదుల ద్వారా పోషించుచు, తోడేళ్ళు మున్నగువానిమండి రక్షించుచు, కండూయనాదుల ద్వారా దానికి ప్రీతిని గలుగజేయుచు, చుంబనాదులద్వారా దానిని లాలించుచు ఆ వ్యాపారములయందే ఆసక్తుడయ్యెను. దానివలన వాని స్నానాదినియమములు, అహింసాద్యాచరణములు, వానితో పాటు భగవత్పరిచర్యాదికార్యములు మున్నగు సర్వధర్మాచరణములు కొలది దివములలోనే ఉత్పన్నము లయ్యెను.

అహో బతాయం హరిణకుణకః కృపణ ఈశ్వర రథ చరణపరిభ్రమణ రయేన స్వగణ సుహృద్బన్ధుభ్యః పరివర్జితః శరణం చ మోపసాదితో మామేవ మాతాపితరౌ భ్రాతృ జ్ఞాతీన్ యౌథికాంశ్చైవోపేయాయ నాన్యం కంచన వేద మయ్యతివిశ్రబ్ధశ్చాత ఏవ మయా మత్పరాయణస్య పోషణ పాలన ప్రీణన లాలనమనసూయు నానుష్ఠేయం శరణ్యోపేక్షా దోషవిదుషా॥9

(భరతు డిట్లాలోచింపసాగెను) ఆహా ! ఆశ్రయము లేని యీ హరిణశిశువు కాలచక్ర పరిభ్రమణ వేగముచే స్వజనులనుండి, బంధువుల నుండి, సుహృదుల నుండి విడివడి నన్నాశ్రయించినది. నన్నే తల్లిగను, తండ్రిగను, సోదరునిగను, జ్ఞాతిగను, సహచరునిగను భావించు చున్నది. నాయందు దీనికి దృఢ మగువిశ్వాసము కలిగినది. ఇది నన్ను దప్ప మఱియెవ్వరిని యెఱుంగదు. అందువలన "దీనికారణమున నాప్రయోజనములు నశించు చున్న" వను అసూయాయుక్త మగుభావమును రానీయక దీనిలాలనము, పాలనము, పోషణము, తోషణము చేయుట నాకర్తవ్య మైయున్నది. ఈమృగశిశువు నన్ను మాత్రమే శరణు జొచ్చినది. శరణాగతులపట్ల నిరాదరణ జూపినందువలన గలుగు ప్రత్యవాయమును గూర్చి నాకు దెలియును. అందువలన ఈమృగశిశువు నుపేక్షించుట యెంతమాత్రము ఉచితము కాదు.

**నూనం హ్యార్యాః సాధవ ఉపశమశీలాః కృపణసుహృద ఏవంవిధార్థే స్వార్థానపి గురుతరానుపేక్షన్తే ॥ 10**

సంపూర్ణముగ బాహ్యవిషయముల యందు విరక్తులయ్యును, దీనజన బాంధవులు శిష్టులు నగుసజ్జనులు నిశ్చయముగ ఇట్లుశరణాగతరక్షణార్థమై గురుతర మగు స్వార్థమును గూడ ఉపేక్షింతురు.

**ఇతి కృతానుసఙ్గ ఆసనశయనాటనస్నానాశనాదిషు సహ మృగజహునా స్నేహానుబద్ధహృదయ ఆసీత్ ॥ 11**

ఇట్లత్యాసక్తుడై భరతుడు కూర్చుండుట, పరుండుట, తిరుగుట, స్నానము చేయుట, భుజించుట మున్నగు ప్రతికార్యములోను మృగశిశువు ప్రేమయందు బద్ధచిత్తుడై యుండెను.

**కుశకుసుమ సమిత్పలాశ ఫలమూలోదకాన్యాహరిష్యమాణో వృకశాలావృకాదిభ్యో భయమాశంసమానో యదా సహ హరిణకుణకేన వనం సమావిశతి ॥ 12**

భరతుడు దర్భలు, పుష్పములు, సమిధలు, పత్రములు, ఫలములు, మూలములు, జలములు మున్నగువానిని దెచ్చు నుద్దేశ్యముతో వనమునకు వెడలినచో తోడేళ్ళు కుక్కలు మున్నగు క్రూరజంతువులు వచ్చి మృగశిశువు నెక్కడ చంపునో యనుభయముచే దానిని వెంటనిడుకొనియే వనమునకు వెడలును.

**పథిషు చ ముగ్ధభావేన తత్ర తత్ర విషక్తమతిరతి ప్రణయభరహృదయః కార్పణ్యాత్ స్కన్ధేనోద్వహతి. ఏవ ముత్సఙ్గ ఉరసి చాధాయో పలాలయన్ముదం పరమామవాప ॥ 13**

భరతు డపుడు మార్గమున వెడలుచు ఈహరిణశిశువు యొక్క బాల్యసౌకుమార్యము లకు ముగ్ధుడు, ఆకృష్టచిత్తుడు, స్నేహవిహ్వలుడు నై దాని నొకప్పుడు భుజముల పై కెత్తుకొనును, ఒకప్పుడు ఒడిలో నుంచుకొనును, మఱియొకప్పుడు వక్షముపై నుంచుకొని మిగుల ఆదరముతో లాలించుచు పరమానందమును పొందుచుండును.

**క్రియాయామనిర్వర్త్యమానాయామన్తరాలేఽప్యుత్థాయోత్థాయ యదైనమభిచక్షీత, తర్హి వావ స వర్షపతిః ప్రకృతి స్థేన మనసా తస్మా ఆశిష ఆశాస్తే స్వస్తి స్తాద్వత్స తే సర్వత ఇతి ॥ 14**

ఆరంభించిన దేవపూజాదిలక్షణములు గలనిత్యనైమిత్తిక కర్మలను సమాప్తి చేయకుండగనే మధ్యమధ్య లేచుచు ఈహరిణశిశు వెచటికి వెడలినదో యనినిరీక్షించు చుండును. అది కనబడినపుడె వానిచిత్త మానందమును పొందెడిది. అతడు 'వత్సా! నీకన్ని విధముల శుభ మగుగాక' యని మనస్సులో ఆశీర్వదించుచుండును.

**అన్యదా భృశముద్విగ్నమనా నష్టద్రవిణ ఇవ కృపణః సకరుణమతితర్షేణ హరిణకుణక విరహ విహ్వలహృదయ సన్తాపస్తమేవానుశోచన్ కిల కశ్మలం మహదభిరంభిత ఇతి హోవాచ ॥ 15**

దైవవశమున అది కనబడకపోయినచో అతడు మిగుల ఉద్విగ్న చిత్తు డగు చుండును. ధనము నష్టము కాగా లోభి యగువ్యక్తి మోహగ్రస్తుడగునట్లు హరిణశిశువు కనబడకపోవుటచే వానిచిత్తము వ్యాకుల పడు చుండును. అత డధిక మగుఉత్సుకతవలన దాని వియోగముచే సంతాప గ్రస్తుడై దుఃఖించు చుండును.

**అపి బత స వై కృపణ ఏణబాలకో మృతహరిణీ సుతోఽహో మమానార్యస్య శఠకిరాత మతేరకృతసుకృతస్య కృతవిస్రమ్భ ఆత్మప్రత్యయేన తదవిగణయన్ సుజన ఇవాగమిష్యతి ॥ 16**

ఆహా ! చనిపోయిన ఆహరిణము యొక్క యీసంతానము నిజముగ ఆశ్రయము లేనిదే, నేను మిగుల అభద్రుడను, అదృష్టహీనుడను. నా బుద్ధి మూఢమైనది, వ్యాధునివలె మిగుల వంచనపరమైనది, క్రూరమైనది. అయినను ఈశిశువు నన్ను విశ్వసించినది. సుజను డగువ్యక్తి తనయంతః కరణమునందలి విశుద్ధ మగుభావము ద్వారా దుర్జనుడు చేసిన అపరాధములను మఱచి మరల మరల వానియందు నమ్మక ముంచి వానియింటికి వెడలును. అట్లే యీహరిణశిశువు గూడ తనచిత్త సారళ్యము ననుసరించి నాయప రాధములను లెక్కింపక మరల నాకడకు దిరిగి వచ్చునా?

**అపి క్షేమేణాస్మిన్నాశ్రమోపవనే శష్పాణి చరన్తం దేవగుప్తం ద్రక్ష్యామి॥17**

భగవత్కృపవలన రక్షింపబడినదియై యీహరిణశిశువు నిర్భయముగ లేతపచ్చికను తినుచు ఈయాశ్రమములో తిరుగుచుండుటను జూడగలనా ?

**అపి చ న వృకః సాలావృకోఽన్యతమో వా నైక చరో ఏక చరోవా భక్ష యతి ॥ 18**

తోడేలుగాని, కుక్కగాని, గుంపులుగ దిరుగుసూకరాదులుగాని ఒంటరిగ దిరుగు వ్యాఘ్రాదులుగాని దీనిని భక్షింపలేరుగదా ?

**నిమ్లోచతి హ భగవాన్ సకల జగత్ క్షేమోదయ స్త్రయ్యాత్మాద్యాపి వ మమ మృగవధూన్యాస ఆగచ్ఛతి ॥ 19**

ఎవనియుదయముచే సర్వలోకములకు శుభములు గలుగునో (కేవలము నా కే శుభములు కలుగుట లేదు) అట్టి వేదస్వరూపు డగు (కేవలము నేనే వేదోక్తదయా ధర్మవిముఖుడను) సూర్యదేవుడు ఈ అస్తాచలమునకు వెడలుచున్నాడు. ఆమృగవధువు తన యా శిశువును నాకడ నుంచి వెడలినది. ఆశిశువు ఇంకను నాసమీపమున కేలరాలేదు?

**అపి స్విదకృతసుకృత మాగత్య మాం సుఖయతి హరిణ రాజకుమారో వివిధ రుచిర దర్శనీయ నిజమృగదారక వినోదై రసన్తోషం స్వానామపనుదన్ ॥ 20**

ఆ హరిణ రాజకుమారుడు (అత్యాదరమువలన మృగశిశువును రాజపుత్రుని వలె దర్శించు చున్నాడు) తిరిగి వచ్చి మృగశిశువులకు స్వభావసులభములు మనోహరములు దర్శనీయములు వివిధములు నగుక్రీఢా విలాసముల ద్వారా నాశోకమును పోగొట్టి అకృతపుణ్యుడ నగునాకు సుఖమును గలిగించునా ?

**క్ష్వేలికాయాం మాం మృషా సమాధినామీలితదృశం ప్రేమ సంరంభేణ చకితచకిత ఆగత్య పృషదపరుష విషాణాగ్రేణ లుఠతి ॥ 21**

దానిక్రీడాసమయమున నేను అలీక (అసత్య)సమాధి నవలంబించి కన్నుల మూసికొని యుందును. అపు డది ప్రణయకోపమువలన చకితయై నలు వైపుల తిరుగుచు జలబిందువు వలె కోమల శృంగాగ్రముద్వారా నన్ను స్పృశించుచుండును.

**ఆసాదితహవిషి బర్హిషి దూషితే మయోపలబ్ధో భీత భీతః సపద్యు పరతరాస ఋషికుమారవదవహిత కరణకలాప ఆస్తే ॥ 22**

దర్భపై నేను యజ్ఞద్రవ్యము నుంచగా ఆమృగశిశువు క్రీడించుచు చాపల్యముతో దంతముల ద్వారా కుశలను గ్రహించి యజ్ఞద్రవ్యమును దూషితము చేయుచుండును. అపుడు నేను దాని నదలింపగా అది మిగుల భయపడినది యై వెంటనే ఆడుట వదలి విగ్రహముతో మునిబాలునివలె నుండెడిది.

కిం వా అరే ఆచరితం తపస్తపస్విన్యానయా యదియ మవని: సవినయ కృష్ణసార తనయ తనుతర సుభగశివతమా ఖరఖుర పదపంక్తిభిర్ద్రవిణ విధురాతురస్య కృపణస్య మమ ద్రవిణ పదవీం సూచయన్త్యాత్మానం చ సర్వత: కృతకౌతుకం ద్విజానాం స్వర్గాపవర్గ కామానాం దేవయజనం కరోతి ॥23

(ఇట్లెన్నియోవిధముల ప్రలపించుచు రాజర్షి యగుభరతుడు లేచి బయటకు వచ్చెను, మృగశిశువుపదచిహ్నముల జూచి యిట్లు పలుకసాగెను) ఆహా ! అదృష్టవంతురా లగు-ఈవసుంధర యెంతటితప మాచరించెనో తెలియకున్నది. ఏలయన, ఈధరిత్రి వినయము గల కృష్ణసార శిశువు యొక్క సూక్ష్మము, సుందరము, పరమమంగళస్వరూపము నగుకోమలఖుర (గిట్టల) చిహ్నములచే మృగధనవిరహ కాతరుడను, శోకగ్రస్తుడను నగు నాకు హరిణధనగమనమార్గములను చూపించుచున్నది. దానిద్వారా త న్నలంక రించుకొని స్వర్గాపవర్గములను గోరు ద్విజులకు యజ్ఞస్థలమును నిర్దేశించు చున్నది. (ఏ ప్రదేశమున గృష్ణమృగము సంచరించునో ఆప్రదేశము మిగుల పవిత్రము, యజ్ఞానుష్ఠానమునకు యోగ్యము నని శాస్త్రములు చెప్పుచున్నవి).

అపిస్విదసౌ భగవానుడు పతిరేనం మృగపతిభయాన్మృత మాతరం మృగబాలకం స్వాశ్రమ పరిభ్రష్టమనుకమ్పయాకృపణ జనవత్సల: పరిపాతి ॥ 24

(అనంతరము చంద్రు డుదయింపగా చంద్రునియందు మృగ చిహ్నమును జూచి భరతుడు దానినె తనమృగశిశు వనిభావించి యిట్లు పలుక సాగెను.) 'దీనజనవత్సలు' డగు సోమదేవుడు నాయాశ్రమములో విడువ బడినది, తల్లి లేనిది యగు-ఈమృగశిశువును సింహభయము వలన దయతో రక్షించుచున్నాడా !

కిం వాత్మజవిశ్లేషజ్వర దవదహన శిఖాభిరుపతప్యమాన హృదయ స్థలనలినీకం మాముపసృతమృగీతనయం శిశిరశాన్తాను రాగ గుణితనిజ వదనసలిలామృతమయ గభస్తిభి: సుధయతీతి చ ॥ 25

(అనంతరము చంద్రకిరణస్పర్శసుఖమును పొంది పలుకుచున్నాడు) ఈ మృగశిశువు నా కత్యంతప్రియ మైనది, నేను దానిని పుత్ర రూపముతో అంగీకరించితిని. దాని విరహజ్వర దావానలశిఖచే నాహృదయస్థలపద్మము విశీర్ణ మగుచున్నది. ఇది చూచి చంద్రుడు నాయందలియనురాగముచే శాంతము, సుశీతలము నగుతనవదన సలిల మనునమృతమయ మగుకిరణముల ద్వారా నాకు సుఖము కలుగుటకై ప్రయత్నించు చున్నాడు.

## శ్రీ శుక ఉవాచ

ఏవమఘటమాన మనోరథాకులహృదయో మృగదారకాభాసేన స్వారబ్ధ కర్మణా యోగారమ్భణతో విభ్రంశితః సయోగతాపసో భగవదారాధన లక్షణాచ్చ. కథమితరథా జాత్యన్తర ఏణకుణకు ఆసఙ్గః సాక్షాన్ని శ్రేయస ప్రతిపక్షతయా ప్రాక్పరిత్యక్తదుస్త్య జహృదయాభిజాతస్య తస్యైవమన్తరాయ విహతయోగారంభణస్య రాజర్షేర్భరతస్య తావన్మృగార్భక పోషణ పాలన ప్రీణన లాలనానుషఙ్గేణావిగణయత ఆత్మానమహి రివాఖుబిలం దురతిక్రమః కాలః కరాలరభస ఆపద్యత ॥ 26

శుకుడు పలికెను : రాజా ! ఇట్లసంభవము లగువివిధ మనోరథము లచే వ్యాకుల మైనభరతుని చిత్తము మృగశిశువు రూపమున ప్రతీత మగుతన ప్రారబ్ధ కర్మదోషముల వలననే యోగానుష్ఠానము నుండి, భగవదర్చనరూప మగు స్వధర్మమునుండి భ్రష్టమయ్యెను. అట్లు కానిచో పూర్వమున మోక్ష మార్గమున సాక్షాత్తుగ విఘ్నరూప మనితలంచి తనను౦డి పుట్టినవారు, దుస్త్యజులు నగుపుత్రాదులను విడచినవానికి అన్యజాతీయ మైన హరిణ శిశువునం దిట్టియాసక్తి యెట్లు కలిగినది ! ఆ మృగశిశువు యొక్క పోషణ తోషణ లాలన పాలనముల యందలి యభినివేశము వలన అతడు ఆత్మహిత చింతనమునం దుదాసీను డయ్యెను. మృగబాలకా సక్తిరూప మగువిఘ్నము లందు పడి యోగానుష్ఠాన భ్రష్టుడయ్యెను. ఇపుడు సర్పము మూషికాబిలమున ప్రవేశించినట్లు వారింపరాని కాలసర్పము వానిని సమీపించి యుండెను.

తదానీమపి పార్శ్వవర్తినమాత్మజమివానుశోచన్తమభివీక్షమాణో మృగ ఏవాభినివేశితమనా విసృజ్య లోకమిమం సహ మృగేణ కలేవరం మృతమను న మృత జన్మానుస్మృతిరితర వన్మృగశరీరమవాప ॥ 27

అప్పుడుగూడ ఆహరిణశిశువు వానికడ గూర్చుండి పుత్రునివలె దుఃఖించు చున్నట్లు అతడు దానిని స్మరించుచుండెను. వాని చిత్తము దానియందే లగ్న మైయుండెను. అందువలన అతడు భగవద్విముఖు డగుప్రాకృత పురుషునివలె మృగముతో పాటు ఈ సంసారమును మనుష్య దేహమును పరిత్యజించి పరజన్మమున మృగదేహమును పొందెను. భరతునిదేహము నశించెను. కాని వానిపూర్వ జన్మస్మృతి నశింపలేదు.

తత్రాపి హ వా ఆత్మనో మృగత్వకారణం భగవదా రాధన సమీహోను భావేనాను స్మృత్య భృశమనుతప్యమాన ఆహ ॥ 28

అందువలన ఆ మృగజన్మమునందును పూర్వజన్మ జాతమగు భగవదారాధన ప్రభావముచే అతడు తనమృగత్వప్రాప్తి కారణమును (అనగా పూర్వ జన్మము నందలి మృగాసక్తిరూప హరివైముఖ్యమును) స్మరించి మాటిమాటికి అనుతాపమును చెందుచు నిట్లు పలుకసాగెను.

**అహో కష్టం, భ్రష్టో హమాత్మవతామనుపథాద్యద్విముక్త సమస్త సంగ స్య వివిక్త పుణ్యారణ్య శరణస్యాత్మవత ఆత్మని సర్వేషామాత్మనాం భగవతి వాసుదేవే తదనుశ్రవణ మననసంకీర్తనారాధనానుస్మరణాభియోగేనా శూన్యసకలయామేన కాలేన సమావేశితం సమాహితం కార్త్స్న్యేన మనస్తత్తు పునర్మ మాబుధస్యారాన్మృ గసుతమను పరిసుస్రావ ॥ 29**

ఆహా ! ఎంతకష్టము ! నేను ధీరజనులమార్గము నుండి చ్యుతుడ నైతినిగదా ! ఏలయన, నేను భార్యాపుత్రుల సాంగత్యమును పరిత్యజించి నిర్జన మగుపుణ్యారణ్యము నాశ్రయించి జితేంద్రియుడ నైతిని. సర్వజీవుల కాత్మస్వరూపు డగువాసుదేవుని విషయ శ్రవణమననసంకీర్తనారాధన స్మరణాది భక్త్యంగముల యందలి అభినివేశము ద్వారా సమయము నంతటిని సఫలముగ జేసికొనుచు బహుదినములను గడిపి చిత్తమును ఆయనయందే నిలిపితిని. కాని మరల ఆమనస్సే మృగశిశువునం దభినివిష్టమై యోగమునుండి భ్రష్టమైనది.

**ఇత్యేవం నిగూఢనిర్వేదో విసృజ్య మృగీం మాతరం పునర్భగవత్ క్షేత్రము పశమశీలమునిగణదయితం సాలగ్రామం పులస్త్య పులహాశ్రమం కాలఞ్జ రాత్ప్రత్యాజగామ ॥ 30**

ఇట్లు మృగత్వమును పొందుటవలన ఆ భరతుని మనస్సు నిర్వేదమును పొందెను. కాని యతడు దానిని వెలితోపనీయలేదు. తన మృగీమాతను పరిత్యజించి యే కాలం జరపర్వతమున మృగరూపమున జన్మించెనో ఆ పర్వతము నుండి ఉపశమశీలము, మునిగణ ప్రియము, సాలగ్రామాఖ్యము, భగవత్క్షేత్రము నగుపులస్త్య పులహాశ్రమమునకు మరల వచ్చెను.

**తస్మిన్నపి కాలం ప్రతీక్షమాణః సఙ్గాచ్చ భృశముద్విగ్న ఆత్మసహచరః శుష్కపర్ణ వీరుధా వర్తమానో మృగత్వనిమి త్తావసానమేవ గణయన్ మృగశరీరం తీర్థోదకక్లిన్న ముత్ససర్జ ॥**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే ఆదిభరతచరితే
అష్టమోఽధ్యాయః

రాజర్షి యగుభరతు డయ్యాశ్రమమున మరల సాంగత్యదోష భయముచే ఉద్విగ్నుడై శుష్కపత్రతృణలతాదుల నాహారముగ స్వీకరించుచు ఏకాకిగనుండి మృగదేహావసాన కాలమును ప్రతీక్షింప సాగెను.. అనంతరము మృగాసక్తివలన గలిగిన దోషావసానకాల ముపస్థిత మయ్యెను. ఆలోచించి అచట నున్న తీర్థోదకమున తన కళేబరమును ముంచి ఆ మృగశరీరమును పరిత్యజించెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
ఆదిభరత చరిత్రమున ఎనిమిదవ యధ్యాయము
సంపూర్ణము.





# తొమ్మిదవ అధ్యాయము

## భరతుడు బ్రాహ్మణవంశమున జన్మించుట

కథాసారము :- ఈ యధ్యాయమున, ప్రారబ్దకర్మ వశమున మృగత్వప్రాప్తి పిమ్మట భరతుడు జడవిప్రరూపమున జన్మించుట, రాగాదిశూన్యుడగుట, చివరకు భద్రకాళి యెదుట బలికై పశువువలె తీసికొని రాబడినను నిర్వికారత్వమున నుండుట యనువిషయములు వర్ణింప బడినవి.

మృగదేహమునుండి ముక్తుడై భరతుడు సర్వగుణ సంపన్నుడు, భక్తుడు నగునొక బ్రాహ్మణుని కనిష్ఠపత్నికి పుత్రుడుగ జన్మించెను. ఈ జన్మమున భరతుడు తనపూర్వ జన్మకథను స్మరించి సాంగత్యదోషము వలన మరల పతనము కలుగునేమో నను భయముచే భగవద్విముఖు డగు నే వ్యక్తితోను సహవాసము చేయలేదు. దానినుండి యాత్మరక్షణమునకై లోకదృష్టిలో ఉన్మత్తునివలెను, జడునివలెను కనబడుచు హృదయమున భగవత్పాదపద్మములయందే ఏకాంతనిష్ఠ గలవాడై కాలమును గడుపసాగెను. భరతుని తండ్రి తనయునకు ఉపనయనాది సంస్కారముల నొనర్చి, వానికి స్వధర్మోచితము లగు శౌచాచారములను బోధించుటకు, వేదాధ్యయనము చేయించుటకు మిగుల ప్రయత్నించెను. భరతుడు సర్వ విషయములలోను తన్నుకర్మణ్యునిగను, పనికిరానివానినిగను జూపి ఆత్మ భావమునందే నిమగ్నుడయ్యెను.

అతడు ప్రకృతస్థుడు కా దనిభావించి ద్విపాద పశువులగు మానవులు వానిపట్ల క్రూరముగ వ్యవహరించిరి. క్రూరము లైన పనులను జేయింప దలపెట్టినను వానియందే అతడు తుష్టుడై యెవ్వరిపట్లకూడ ప్రతికూలాచరణము చేయక జీవితమును గడుపుచుండెను. తల్లిదండ్రులు మృతు లైనపిమ్మట వాని సవతి తల్లియు సవతి సోదరులు వానిపట్ల కుత్సితముగ వ్యవహరించిరి. క్రూరకార్యముల నొనరించిరి. అయినను అతడు ఎప్పుడును చలింపలేదు, ఆత్మవిస్మృతుడు కాలేదు. వారొకనాటి రాత్రివేళ భరతుని పొలమునకు కాపుగా నుంచిరి. అపుడు కొందరు దొంగలు వచ్చి తమనాయకుడు చేయు భద్రకాళి పూజలో బలి నిచ్చుటకై భరతుని తీసికొని వెడలిరి. దొంగలు దేవీప్రతిమ యెదుట వానిని బలియిచ్చుటకు సిద్ధ పడగా దేవి యపుడు భగవద్భక్తునిపట్ల జరుగునీయత్యాచారమునకు మిగుల క్రుద్ధురాలై ప్రతిమనుండి భయంకర రూపముతో బయల్వెడలి వారి ఖడ్గముతో వారినే సంహరించి భక్తుని రక్షించెను. భగవద్రక్షితులు, భగవద్గతచిత్తులు నగు భాగవతు లీవిధ మగుమహా భయంకర సంఘటనలు తటస్థించి నను అణుమాత్రము కూడ చలింపరు. వారికి అనిష్టముల జేయ దలచినవారు ఘోరవిపత్తులయందు జిక్కుకొందురు.

## శ్రీ శుక ఉవాచ

**అథ కస్యచిద్ద్విజవర స్యాఙ్గిరః ప్రవరస్య శమదమతపస్స్వాధ్యాయాధ్యయనత్యాగ సంతోషతితిక్షాప్రశ్రయ విద్యా నసూయాత్మ జ్ఞానానన్ద యుక్తస్యాత్మ సదృశ శ్రుతశీలా చార రూపౌ దార్యగుణా నవ సోదర్యా అఙ్గజా బభూవుః మిథునం చ యవీయస్యాం భార్యాయామ్ ॥ 1**

శుకదేవుడు పలికెను : రాజా ! అనంతరము ఆంగీరసగోత్రమున శమము, దమము, వేదాధ్యయనము, స్వాధ్యాయము, దానము, సంతోషము, సహనము, వినయము, విద్య, అనసూయ, ఆత్మజ్ఞానము, భక్తియోగము మున్నగు గుణములు గలవాడు, సమాధియుక్తుడు నగు నొక బ్రాహ్మణ శ్రేష్ఠు డుండెను. వానికి జ్యేష్ఠభార్యవలన తొమ్మండుగురు పుత్రులు జన్మించిరి. వీరు శాస్త్రజ్ఞానము, శీలము, ఆచారము, రూపము, గుణము, ఔదార్యము అనువాని యందు తండ్రితో సమానులైరి. ఆబ్రాహ్మణుని కనిష్ఠభార్య ఏకకాలమందే ఒక పుత్రుని, ఒక పుత్రికను గనినది.

**యస్తు తత్ర పుమాంస్తం పరమభాగవతం రాజర్షి ప్రవరం భరతముత్సృష్ట మృగశరీరం చరమశరీరేణ విప్రత్వం గతమాహుః ॥ 2**

వీరిరువురిలో పురుషుడు పరమభాగవతుడు రాజర్షి శిరోమణి యగు భరతుడే యనియు, అతడు మృగశరీరమును విడచి అంతిమజన్మమున బ్రాహ్మణత్వమును పొందె ననియు విజ్ఞులు చెప్పుచున్నారు.

**తత్రాపి స్వజనసఙ్గాచ్చ భృశముద్విజమానో భగవతః కర్మబన్ధ విధ్వంసన శ్రవణ స్మరణ గుణవివరణ చరణారవిన్ద యుగలం మనసా విదధదాత్మనః ప్రతిఘాతమాశంకమానో భగవదనుగ్రహేణానుస్మృతస్వపూర్వ జన్మావలి రాత్మాన మున్మత్త జడాన్ధబధిర స్వరూపేణ దర్శయామాస లోకస్య ॥ 3**

అందువలన భగవదనుగ్రహముచే భరతునకు వెనుకటి జన్మములోని వివరణము లన్నియు స్మృతిపథమునకు వచ్చెను. ఆభరతుడు బ్రాహ్మణత్వమును పొందియు పిమ్మట (భగవద్విముఖులగు) స్వజనుల సాంగత్యము వలన మరల తనకు పతనము కలుగు నని శంకించి యే భగవానుని గీర్తి శ్రవణస్మరణ కీర్తనముల ద్వారా కర్మజనితము లగు బంధనములు నాశమగునో అట్టి భగవానుని పాదపద్మములను మనస్సున నిలుపుకొని, తాను లోకమున ఉన్మత్తునివలె, జడునివలె, అంధునివలె, బధిరునివలె కనబడ సాగెను.

తస్యాపి హ వా ఆత్మజస్య స విప్రః పుత్రస్నేహాను బద్ధమనా ఆసమావర్తనాత్ సంస్కారాన్ యథోపదేశం విదధాన ఉపనీతస్య చ పునః శౌచాచమనాదీన్ కర్మనియ మాననభి ప్రేతానపి సమశిక్షయత్; అనుశిష్టేన హి భావ్యం పితుః పుత్రేణేతి ॥ 4

ఆవిప్రునిచిత్తము పుత్రస్నేహమునం దాసక్తమయ్యెను. అందువలన ఆయన బ్రహ్మచర్య సమాప్తిపర్యంతము సమస్త సంస్కారముల నొనరింపదలచి వానికి ఉపనయనకార్య మొనరించెను, మరల భరతున కిష్టము లేకపోయినను అతడు భరతునకు శౌచాచమనాదికర్మ నియమములను విశేషముగ బోధించెను.

స చాపి తదుహ పితృసన్నిధావేవాసధ్రీచీనమివ స్మ కరోతి. ఛందాంస్య ధ్యాపయిష్యన్ సహ వ్యాహృతిభిః స ప్రణవ శిరస్త్రిపదాం సావిత్రీం గ్రైష్మవాసన్తికాన్ మాసానధీయాన మప్యసమవేతరూపం గ్రాహయామాస ॥5

కాని యాభరతుడు పితృశిక్షానిర్బంధనివృత్తికై తండ్రి చెప్పిన శౌచాచమనాది విషయములను తండ్రి ఎదుటనె విరుద్ధముగ నాచరించును. అనగా దేనివలన తనతండ్రి తనను అకర్మణ్యునిగ భావించి తన విద్యాభ్యాస విషయమున పట్టుదలను విడచి పెట్టునో, దానిపై యతడు మలమూత్రములను విడచుటకు పూర్వమే మృత్తికాశౌచములను, ఆచమనాదులను చేయును, కాని మలమూత్రాదులను విడచిన పిమ్మట శౌచాదుల నాచరింపడు. భరతునితండ్రి అనంతరకాలమున భరతునకు వేదాధ్యయనము చేయింప వలె నని దలంచి మొదట వసంతగ్రీష్మఋతువులయందు (చైత్రాదులైనా నాలుగు మాసములయందు) ప్రణవవ్యాహృతులతో పాటు త్రిపాదగాయత్రిని బోధించుటకు ప్రయత్నించెను. కాని యా నాలుగు మాసములలోను అతడు భరతుని సిద్ధపఱచుటలో కృతకృత్యుడు కాలేక పోయెను.

ఏవం స్వతనుజ ఆత్మన్యనురాగావేశితచిత్తః శౌచాధ్యయనవ్రత నియమగు ర్వనల శుశ్రూషణాద్యౌపకుర్వాణక కర్మాణ్యనభియుక్తాన్యపి సమనుశిష్టేన భావ్యమిత్యసదాగ్రహః పుత్ర మనుశాస్య స్వయం తావదనధిగతమనోరథః కాలేనాప్రమత్తేన స్వయం గృహ ఏవ ప్రమత్త ఉపసంహృతః ॥ 6

ఇట్లాబ్రాహ్మణుడు తనపుత్రు డగు భరతుని ఆత్మస్వరూపునిగ భావించుట వలన ప్రేమాతిశయముచే వాని చిత్తము పుత్రునియందే లగ్న మయ్యెను. పుత్రుని సుశిక్షితునిగ

తప్పక చేయవలెనని అనుచిత మగు పట్టుదల గలవాడై పుత్రున కిష్టము లేకపోయినను తగిన కాలము వఱకు బ్రహ్మచర్యము, శౌచము, అధ్యయనము, వ్రతము, నియమములు, గురు శుశ్రూష, అగ్ని సేవనము మున్నగు కార్యములను పుత్రు డగు భరతునకు బోధింప యత్నించెను. కాని వాని ప్రయత్న మంతయు విఫలమయ్యెను. పుత్రుడు పండితుడు కావలె నని మనస్సులో పెంచుకొనిన ఆతని ఆశ పూర్తి కాకపోయెను. ఇట్లతడు గృహాసక్తుడై ఆత్మవిస్మృతు డయ్యెను. కాని మృత్యువునకు విస్మృతి లేదు. తగిన సమయము వచ్చి బ్రాహ్మణుని కబళించెను.

**అథ యవీయసీ ద్విజసతీ స్వగర్భజాతం మిథునం సపత్న్యా ఉపన్యస్య స్వయమను సంస్థయా పతిలోకమగాత్ ॥ 7**

అనంతరము (బ్రాహ్మణుడు పరలోకమునకు వెడలిన పిమ్మట) పతివ్రత యగు బ్రాహ్మణుని కనిష్ఠపత్ని తన గర్భసంజాత లగు కన్యను పుత్రుని సవతి కప్పగించి, సహగమనము చేసి పతిలోకమున కరిగెను.

**పితర్యుపరతే భ్రాతర ఏనమతత్ప్రభావవిదస్త్రయ్యాం విద్యాయామేవ పర్యవసిత మతయో న పరవిద్యాయాం జడమతిరితి భ్రాతురను శాసననిర్బన్ధాన్న్యవృత్సన్ ॥ 8**

తండ్రి పరలోకగతు డైనపిమ్మట భరతుని సోదరులు (తొమ్మండుగురు సవతి సోదరులు)భరతుడు జడమతి యని స్థిరపరచుకొని వాని విద్యాభ్యాసాది విషయమై తండ్రికి గల పట్టుదలను వారు వదలుకొనిరి. వారి బుద్ధి ఋక్సామయజుర్వేద ప్రతిపాద్య మగు కర్మకాండము నందే ఆసక్తమై యుండెను. కాని భగవద్భక్తిలక్షణ మగు పరవిద్యయందు ప్రవిష్టము కాలేదు. అందువలన వారు భరతుని ప్రభావమును (ఆత్మారామత్వమును) ఎఱుంగ జాలకపోయిరి.

**స చ ప్రాకృతైర్ద్విపద పశుభిరున్మత్త జడబధిరమూకేత్యభి భాష్యమాణో యదా తదనురూపాణి ప్రభాషతే కర్మాణి చ కార్యమాణః పరేచ్ఛయా కరోతి। విష్టితో వేతనతో వా యాచ్ఞయా యదృచ్ఛయా వోపసాదితమల్ప బహు మృష్టం కదన్నం వాభ్యవహరతి పరం నేన్ద్రియ ప్రీతినిమిత్తమ్ ॥ 9**

నీచప్రకృతులు, వివేకశూన్యులు, ద్విపాద పశుతుల్యులు నగు మానవులు భరతుని ఉన్మత్తుడు, జడుడు, బధిరుడు, మూగివాడు నని పలుకు చుండగ ఆతడుగూడ వారితోపాటు వారికి తగినవిధముగనే వ్యవహరింప నారంభించెను. అనగా వారి సంభాషణల

ననుసరించి ఆయన గూడ వారికడ ఉన్మత్తుడు, బధిరుడు మున్నగువారి వలె పలుకసాగెను. కొంద రేమైన పనుల చేయింప తలంపగా అతడు వారియిచ్ఛ ననుసరించి పనుల చేయును. వేతనము లేకుండగ పనిచేసి లభించిన ఆహార పదార్థమును లేదా వేతనము వలనగాని, యాచనద్వారా గాని, అదృష్టము వలన గాని లభించిన హీన మగు ఆహార పదార్థమును భుజించును. ఇంద్రియతృప్తికై అతడు దానిని స్వీకరింపడు.

**నిత్యనివృత్తనిమిత్త స్వసిద్ధవిశుద్ధా నుభవానన్దస్వాత్మలా భాధిగమః సుఖదుఃఖ యోర్ద్వన్ద్వనిమిత్తయోర సమ్భావిత దేహాభిమానః శీతోష్ణవాతవర్షేషు వృష ఇవానా వృతాఙ్గః పీనః సంహననాఙ్గః స్థణ్డిలసంవేశనానున్మర్దనా మజ్జనరజసా మహామణిరి వానభివ్యక్త బ్రహ్మవర్చసః కుపటావృత కటిరుపవీతేనోరుమసినా ద్విజాతిరితి బ్రహ్మబన్ధురితి సంజ్ఞయా తదజ్ఞజనావమతో విచచార ॥ 10**

అతడు పూర్వమే సుఖదుఃఖోత్పాదకములు, శుభాశుభములు నగు కర్మబంధనముల నుండి ముక్తుడై స్వతఃసిద్ధము, అప్రాకృతము నగు ననుభవానందముతో నిజాభీష్ట మగు శ్రీకృష్ణప్రతీతిని పొందెను. అందువలన సుఖదుఃఖాదులకు హేతువు లగు మానావమానాది ద్వంద్వముల వలన కలిగిన దేహాభిమానము వానికి లేదు. వాని శరీరము వృషభమువలె పుష్టముగను, అవయవములు దృఢముగను ఉండెను. అతడు శీతోష్ణవాతవర్షాదులయందు వస్త్రములతో శరీరమును గప్పుకొనడు. భూమిపై శయనించుటవలన, తైలసంస్కారము లేకపోవుటవలన, స్నానము చేయకపోవుటవలన వాని దేహము మలినమయ్యెను. వాని బ్రహ్మతేజము మహామణివలె బ్రచ్ఛన్నముగ నుండెను. కటి ప్రదేశమున చినిగిన వస్త్రము, వక్షస్థలమున మలినమైన యజ్ఞోపవీతము నుండుటవలన అజ్ఞులగు వ్యక్తులు వానిని బ్రహ్మణాధమునిగ భావించి యవమానించుచుండిరి. ఇట్లాతడు నవమానితు డగుచు బరిభ్రమించుచుండెను.

**యదా త పరత ఆహారం కర్మవేతనత ఈహమానః స్వభాతృభరపి కేదారకర్మణి నిరూపితస్తదపి కరోతి, కిన్తు సమం విషమం న్యూనమధికమితి వ వేద. కణపిణ్యాకఫలీకరణకుల్మాష స్థాలీపురీషాన్యప్యమృతవద భ్యవహరతి ॥ 11**

ఆతడు పరులకడ పనిచేసి బదులుగ నాహారమును మాత్రము పొంద నపేక్షించుట చూచి వాని సోదరులుగూడ ఆహారాశను జూపి వానిని పొలముపనిలో నియమించు నుండెడివారు. అతడుగూడ దానిని చేయుచుండెను. దాని బదులుగా గూడిన ఆహారము

సమతలముగ నున్నదా లేక మిట్టపల్లములుగ ఉన్నదా అను విషయ మాతని కేమియు తెలియకుండెను. వాని సోదరులు బియ్యపునూకను, నూవుపిండిని, తవుడును, పురుగుపట్టిన మినుమును, వంటపాత్రలలో నంటుకొనియున్న మాడు చెక్కలను వానికి ఆహారముగ పెట్టుచుందురు. అతడు దానిని అమృతము వలె స్వీకరించు చుండును.

**అథ కదాచిత్ కశ్చిద్వృషలపతి ర్భద్రకాళ్యై పురుషపశుమాలభతా పత్యకామః ॥ 12**

అనంతర మొకదినమున ఒకానొక శూద్రసామంతచోరరాజు పుత్ర వాంఛతో భద్రకాళికి నరపశువును బలిగా నీయ నుద్యుక్తుడయ్యెను.

**త స్య హ దైవవిముక్తస్య పశోః పదవీం తదనుచరాః పరిధావన్తో నిశి నిశీథసమయే తమసావృతా యామనధిగత పశవ ఆకస్మికేన విధినా కేదారాన్ వీరాసనేన మృగవారాహాదిభ్యః సంరక్షమాణమఙ్గిరః ప్రవరసుతమపశ్యన్ ॥13**

వానియాపురుషపశువు దైవవశమున బంధనములను త్రెంపుకొని పారిపోయెను. ఆ తస్కరరాజు యొక్క యనుచరు లాపశువు నన్వేషించుచు నలువైపుల పరుగిడిరి. కాని యెచ్చటను వారికి పశువు లభింపలేదు. తిరుగుచు తిరుగుచు వారు ఘోర మగునంధ కారముచే ఆచ్ఛన్న మగురాత్రి రెండుజాముల సమయమున ఒక పొలముకడకు చేరిరి. అచట అంగిరస గోత్రోద్భవు డగు బ్రాహ్మణ తనయు డొకమంచెపై గూర్చుండి మృగ వరాహాది పశువుల నుండి పొలమును రక్షించుచుండుట వారు చూచిరి.

**అథ త ఏనమనవద్య లక్షణమవమృష్య భర్తృకర్మ నిష్పత్తిం మన్యమానా బద్ధ్వా రశనయా చణ్డికాగృహముప నిన్యుర్ముదా వికసితవదనాః ॥ 14**

అనంతరము వా రా భరతుని సులక్షణ సంపన్నపురుష పశువుగ భావించి వానివలననే తమ ప్రభువుపని నెఱవేరగల దనినిశ్చయించి వానిని (భరతుని) త్రాటిచే బంధించి వికసితవదనులై చండికాలయమునకు గొని పోయిరి.

**అథ పణయస్తం స్వవిధినాభిషిచ్యాహతేన వాససా చ్ఛాద్యభూషణాలేప స్రక్తిలకాది భిరుపస్కృతం భుక్తవన్తం ధూపదీపమాల్యలాజకి సలయాంకుర ఫలోపహారోపేతయా వైశస సంస్థయా మహతా గీతస్తుతి మృదంగ పణవ ఘోషేణ చ పురుష పశుం భద్రకాల్యాః పురతఉపవేశయామాసుః ॥ 15**

పిమ్మట చోరు లాయంగిరసపుత్రు డగుభరతుని స్వకల్పిత మగువిధి ననుసరించి స్నానము చేయించి, నూతన వస్త్రములచే వానిదేహమును గప్పిరి. పశుయోగ్య

మగునలంకారములు, గంధము, తిలకము,చందనము, మాలలు మున్నగువాని ద్వారా అలంకరించి వానికి భోజనమిడిరి. భోజనాంతమున వారు ధూపము, దీపము, మాలలు, లాజలు, నూతనపత్రములు, దూర్వాంకురములు, ఫలములు మున్నగువాని ద్వారా హింసావిధివిహిత మగు పూజను పూర్తిచేసి, గీతస్తుతి మృదంగ పణవాదుల ధ్వనితోపాటు పురుషపశువును (భరతుని) అధోవధనునిగజేసి భద్రకాళి సమీపమునకు తీసికొని వెడలి గూర్చుండ బెట్టిరి.

**అథ వృషలరాజపణిః పురుషపశోరసృగాసవేన దేవీం భద్రకాలీం యక్ష్యమాణస్త దభిమన్త్రితమసిమతికరాలం నిశిత ముపాదదే ॥ 16**

అనంతరము చోరరాజు యొక్క ముఖ్యపౌరోహిత్యకర్మమున ఏచోరుడు నియుక్తుడయ్యెనో అత డాయుపకిల్పిత పురుషపశువు రక్త మనెడు మద్యమును భద్రకాళికి తర్పణము చేయదలచి భద్రకాళీమంత్రముచే అభిమంత్రించి భయంకరము నిశితము నైన ఖడ్గమును పట్టుకొనెను.

**ఇతి తేషాం వృషలానాం రజస్తమః ప్రకృతీనాం ధన మదరజ ఉత్సిక్తమనసాం భగవత్కలాధీర కులం కదర్థీకృత్యోత్ప థేన స్వైరం విహరతాం హింసావిహారాణాం కర్మాతి దారుణం యద్బ్రహ్మభూతస్య సాక్షాద్బ్రహ్మర్షి సుతస్య నిర్వైరస్య సర్వ భూతసుహృదః సునాయామప్యననుమతమాలభనం తదుపలభ్య బ్రహ్మతేజసాతిదుర్విషహేణ దన్దహ్యమానేన వపుషా సహసోచ్చచాట సైన దేవీ భద్రకాలీ ॥ 17**

ఆ దస్యుల ప్రకృతి రజస్తమోగుణములచే ఆచ్ఛన్న మైయుండెను. వారి మనస్సు ధనమదముచే మదించినది యై మర్యాదలేని దయ్యెను. అందువలన వారు భగవదంశ యుక్త మగు బ్రాహ్మణకులమును తుచ్ఛముగ జేసి స్వేచ్ఛాచారులై దుర్మార్గమున సంచరింప సాగిరి. హింసయే వారికి క్రీడోత్సవము. ఈకారణముల వలననే వారు వెనుక చెప్పబడిన కర్మలందు ప్రవృత్తులైరి. సర్వభూతహితుడు, శత్రుహీనుడు, భగవద్గతచిత్తుడు నగు బ్రహ్మర్షి నందనునివధ ఆపత్కాలిక లౌకికవధవిధికిగూడ ఆమోదము కాదు. అందువలన ఆ కాళికాదేవి ధర్మవిలోప సాధన ప్రయాసపరు లగు శూద్రుల అతి దారుణము, అకర్తవ్యము, బ్రహ్మహింసాత్మకము నగు భగవద్విరోధ విషయమును తెలిసికొనినది. ఆమె దేహము బ్రహ్మ తేజస్సుచే మిగుల సంతప్తమయ్యెను. ఆమె తన ప్రతిమను విడచి బయల్వెడలెను.

భృశమమర్షరోషా వేశ రభస విలసిత భ్రూకుటివిటప కుటిల దంష్ట్రారుణే క్షణాటో పాతిభయానకవదనా హన్తుకామేవేదం మహాట్టహాసమతి సంరంభేణ విముఞ్చన్తీ తత ఉత్పత్య పాపీయ సాం దుష్టానాం వృషలానాం తేనైవాసినా వివృక్ణశీర్ణ్ణాం గలాత్ స్రవన్తమసృగాసవమత్యుష్ణం సహగణేన నిపీయాతి పానమదవిహ్వాలోచ్చైస్తరాం స్వపార్షదై: సహజగౌ ననర్త చ విజహార చ శిర: కన్దుకలీలయా ॥ 18

మిగుల అసహిష్ణుతవలన క్రోధావేశమువలన ఆమె కనుబొమలు ముడివడినవి. కుటిల దంష్ట్రలు బహిర్గత ములయ్యెను. ఆరక్తము లగు లోచనములు ఘూర్ణితము లయ్యెను. దానివలన ఆమెముఖ మండలము భయంకరూపమును దాల్చి యుండెను. ఆమె యావిశ్వమును సంహరించుట కొఱకే అన్నట్లుగ క్రోధముతో అట్టహాసము చేయుచు విగ్రహమునుండి బయల్వెడలి పాపులు దుష్టులు నగుఆశూద్రులమస్తకములను వారియా ఖడ్గముచేతనే ఛేదించెను. తలలు తెగగా వారికంఠముల నుండి అత్యుష్ణ మగు రుధిర మను మద్యము బయల్వెడల సాగెను. భద్రకాళీదేవి డాకినీ మున్నగు తనసహచరులతో దానిని పానము చేయసాగెను. రక్తపానముచే ఉన్మత్త యై దేవి యపుడు తనపార్షదులతో పెద్దగ గానము, నృత్యము చేయుచు దస్యుల ఛిన్నమస్తకములతో కందుకక్రీడ చేయ వారంభించెను.

ఏవమేవ ఖలు మహదభిచారాతిక్రమ: కార్త్స్న్యే నాత్మనే ఫలతి ॥ 19

మహాత్ములకు చేయు హింసాత్మకాపరాధము ఈవిధముగ అభిచార యుక్తు లగు (అవిష్టకారులగు) మానవుల పట్లనే పూర్తిగ ఫలించును.

న వా ఏతద్విష్ణుదత్త మహదద్భుతం యదసంభ్రమ: స్వశిరశ్ఛేద ఆపతితేఽపి విముక్త దేహాద్యాత్మ భావసుదృఢ హృదయగ్రన్థీనాం సర్వసత్త్వ సుహృదాత్మనాం నిర్వైరాణాం సాక్షాద్భగవతా నిమిషారివరాయుధేనాప్రమత్తేన తైస్తైర్భావైరభి రక్ష్యమాణానాం తత్పాదమూల మకుతశ్చిద్భయము పృతానాం భాగవతపరమ హంసానామ్ ॥ 20

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే జడభరతచరితే
నవమోఽధ్యాయ: ॥

పరీక్షిన్మహారాజా! దేహాదులయందు భేదింపరాని ఆత్మాభిమాన మనుహృదయగ్రంథిని భేదించినవారు, సర్వప్రాణుల హితము నాకాంక్షించు మనస్సు గలవారు, ఎవ్వరికిని అపకారము చేయనివారు, సర్వసంహారక స్వరూపము సర్వశ్రేష్ఠము అరిస్వరూపము నగు సుదర్శన చక్రమును ధరించినవాడు, భక్త రక్షణకార్యమున ఎల్లప్పుడు అప్రమత్తుడు నగువిష్ణు భగవానునిచే శిష్టరక్షణ దుష్ట శిక్షణాది రూపములతో రక్షింపబడువారు, భయ నాశకము లగు భగవచ్చరణముల నాశ్రయించినవారు, భాగవతులు నగు ఆపరమహంసలు తమకు శిరశ్ఛేదన సమయము వచ్చినను కలత చెందరు. ఇది వారి విషయమున ఆశ్చర్యకరము కాదు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
జడభరతోపాఖ్యానమున తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.





# పదియవ అధ్యాయము

## జడభరతుడు రహూగణరాజు కలిసికొనుట

కథాసారము:- ఈయధ్యాయమున రహూగణ రాజుచే బలవంతముగ శిబికా వహనమున నియుక్తు డైనభరతముని రాజు యొక్క దుర్వాగ్వాదానువాదముచే వానికి చైతన్యమును గలుగ చేయుట, రాజు భరతుని ప్రసన్నునిగ చేయుట యను విషయములు వర్ణింపబడినవి.

సింధుసౌవీరదేశముల కధిపతి యగురహూగణుని శిబికను (పల్లకిని) మోయుపనికి యొక మనుష్యుడు తక్కువయ్యెను. వాని ప్రధాన శిబిక వాహకుడు అదృష్టమువలన లభించిన ద్విజశ్రేష్ఠ డైనభరతుని బలవంతముగ ఆ కార్యమునందు నియమించెను. అభిమానము లేనిభరతుడు గూడ ఏవిధముగను బదులు చెప్పక పల్లకిని మోయుటకు వెడలెను. కాని యతడు నడచునపుడు ప్రాణిహింస జరుగు ననుభయముచే ముందు కొలది దూరము చూచి పిమ్మట అడుగు వేయుచుండుట వలన మిగిలిన వాహకులతో సమానముగ తననడక సరిగ లేకుండెను. దాని వలన శిబిక అటునిటు ఊగసాగెను. రాజు విరక్తు డయ్యెను. నూతన వాహకు డగుభరతునే దోషిగ నెఱిగి క్రోధముతో శ్లేషవాక్కులతో వానిని నిందించెను. అయినను దేహాభిమాన శూన్యుడు, మానావమానసముడు నగుద్విజవరుడు మౌనియై వెనుకటి విధముగనె నడచుచుండెను. ఈమారు రాజు వానిని కటువాక్కులతో దండింతు నని భయపెట్టెను. అపుడు భరతుడు సమాధాన మిచ్చెను. రాజు యొక్క గర్వోక్తులలో నొక్కొక్క వాక్కును ఖండించుచు గంభీర మగుతత్త్వమును బోధించెను. అప్పు డభిమానమూఢు డగుమహీపతికి చైతన్యోదయ మయ్యెను. తా నజ్ఞానముతో నొక బ్రహ్మజ్ఞపురుషున కపరాధ మొనర్చినట్లు భావించి కాతరవచనములతో ఆతనిని స్తుతించెను. వాని వాక్కులలోని నిగూఢార్థమును తెలిసికొనుటకై తత్ప్రతివాదమునకు సవినయముగ స్వాభిమతమును వెల్లడిచేసి క్షమాపణమును గోరెను. అట్టి మహాభక్తుని పట్ల చేసిన యపరాధము శూలపాణివంటి శక్తివంతు డగుపురుషుని గూడ వెంటనే నాశనము చేయు నని యాత డంగీకరించెను.

### శ్రీ శుక ఉవాచ

**అథ సిన్ధుసౌవీరపతే రహూగణస్య వ్రజత ఇక్షుమత్యా స్తటే తత్కులపతినా శిబికా వాహకపురుషాన్వేషణ సమయే దైవేనోపపాదితః స**

ద్విజవర ఉపలబ్ధః ఏష పీవా యువా సంహననాఙ్గో గోఖరవద్ధురం వోఢుమల మితి పూర్వవిష్టిగృహీ తైస్సహ గృహీతః ప్రసభమతదర్హ ఉవాహ శిబికాం స మహానుభావః ॥ 1

శుకుడు పలికెను : రాజా ! పిమ్మట సింధుసౌవీరదేశాధిపతి యగు రహూగణుడు కపిలాశ్రమమునకు వెడలు చుండెను. వాని ప్రధానశిబిక వాహకుడు ఇక్షుమతీతీరమునకు జేరి మఱియొక శిబికవాహకుని (పల్లకి మోయువాని) కై యన్వేషించు చుండగ దైవవశమున వాని కచట ద్విజవరుడగు భరతుడు లభించెను. "ఇతడు యువకుడు, బలిసియున్నవాడు, దృఢమైన అవయవములు గలవాడు, ఎద్దువలె, గాడిదవలె బరువు మోయగల వాడు" నని తలంచి వానిని బలవంతముగ వెనుకటి బోయీలతోపాటు కలిపి పల్లకి మోయుటకు నియమించెను. మహానుభావు డగు భరతు డీపనికి ఉపయుక్తుడు కాకుండెను. అయినను అతడు దానియందు బలవంతముగ నియుక్తుడై పల్లకిని మోయసాగెను.

యదా హి ద్విజవరస్యేషు మాత్రావలోకానుగతే ర్నసమాహితా పురుషగతి స్తదా విషమగతాం స్వశిబికాం రహూగణ ఉపధార్య పురుషానధివహత ఆహ - హే వోఢారః సాధ్వతి క్రామత కిమితి విషమముహ్యతే యానమితి ॥ 2

పల్లకిని మోయునపుడు ద్విజవరు డగు భరతుడు ప్రాణిహింస జరుగు ననుభయముచే బాణపరిమిత స్థానమును జూచి పిమ్మట అడుగిడు చుండెను. దానివలన వాహకుల గమనము సమముగ లేకపోవుటచే పల్లకి అటునిటు ఊగజొచ్చెను. అదిచూచి రహూగణరాజు వాహకులతో (బోయీలతో) "ఓరీ ! ఏల యిట్లు విషమముగ పల్లకిని మోయుచున్నారు? జాగ్రత్తగ మోయు" డని పలికెను.

అథ త ఈశ్వరవచః సోపాలమ్భముపాకర్ణ్యోపాయాత్ తురీయాచ్ఛఙ్కి తమనసస్తం విజ్ఞాపయామ్బభూవుః ॥ 3

రాజు పలికిన తిరస్కారవాక్కులను విని వాహకులు తమ్ము రాజు దండించు ననుభయముతో ఆతని కిట్లు నివేదించిరి.

న వయం నరదేవ ప్రమత్తా భవన్నియమానుపథాః సాధ్వేవ వహామః, అయమధునైవ నియుక్తోఽపి న ద్రుతం వ్రజతి నానేన సహ వోఢుముహ వయం పారయామ ఇతి ॥ 4

రాజా ! మేము మాపనులయందు ప్రమత్తులుగ లేము. నీయాజ్ఞాను వర్తులమై చక్కగ పల్లకిని మోయుచున్నాము. కాని యిపుడు నియమింప బడినవ్యక్తి త్వరగ నడవకపోవుటచే మేము వీనితో గలపి పల్లకిని మోయలేకపోవుచున్నాము.

**సాంసర్గికో దోష ఏవ నూనమేకస్యాపి సర్వేషాం సాం సర్గికానాం భవితుమర్హతీతి నిశ్చిత్య కృపణవచో రాజా రహూగణ ఉపాసితవృద్ధోఽపి నిసర్గేణ బలాత్కృత ఈషదుత్థితమన్యు రవిస్పష్టబ్రహ్మతేజసం జాతవేదసమివ రజసా వృతమతిరాహ ॥ 5**

దండభయభీతు లగువాహకులకాతర వాక్కులను విని యొకనిసహ వాసదోషముచే అందఱు దోషు లగుదు రనిరహూగణుడు స్థిరపఱచు కొనెను. అతడు ఆర్యసేవాపరాయణుడు, పరమ ధార్మికుడు నయ్యును సహజము అనగా రాజస్వభావము వలన హఠాత్తుగ క్రోధోద్రేకుడయ్యెను. రజోగుణము నిండిన మతిగల రహూగణుడు నివురుగప్పిన నిప్పువలె ప్రచ్ఛన్న బ్రహ్మతేజస్సంపన్ను డగుభరతునితో నిట్లు పలికెను.

**అహో కష్టం భ్రాతర్వ్యక్తమురు పరిశ్రాన్తో దీర్ఘమధ్వాన మేక ఏవ ఊహివాన్ సుచిరం నాతిపీవా న సంహనాఙ్గోజరసా చోపద్రుతో భవాన్ సఖే నో ఏవాపర ఏతే సంఘట్టిన ఇతి బహు విప్రలబ్ధోఽప్యవిద్యయా రచిత ద్రవ్యగుణ కర్మాశయే స్వచరమక లేవరేఽవస్తుని సంస్థానవిశేషేఽహంమమేత్యన ధ్యారోపితమిథ్యాప్రత్యయో బ్రహ్మభూతస్తూష్ణీం శిబికాం పూర్వవదువాహ ॥ 6**

“అయ్యో ! ఎంత కష్టము ! సోదరా ! నీవు నిజముగ అత్యంతము శ్రమచెందితివి. ఒంటరిగ పల్లకి మోయుచు బహుదూరము నడచివచ్చితివి. వార్ధక్యము వలననే మిగుల శ్రమచెంద లేదుకదా ! సఖుడా ! నీశరీరము స్థూలముగ లేదు, అవయవము లన్నియు దృఢముగ లేవు. ఈవాహకు లందరు నీతోపాటు నడచుట లేదా?” రహూగణు డిట్లు పరిహాసముతో పలికినను, స్థూలలింగ దేహములయం దాత్మబుద్ధి లేని భరతుడు మౌనియై వెనుకటివలె పల్లని మోయసాగెను. ఏలయన, ఆయన మాయారచితము లైన ద్రవ్యముల (పంచమహాభూతముల) యందు, గుణములు (శబ్దాదుల) యందు, కర్మల (పాప పుణ్యాదుల) యందు, ఆశయాత్మకము (వాసనామయము) అయిన సూక్ష్మ శరీరమునందు లేదా హస్తపాదాద్యవయవయుక్తము అనాత్మము నగుస్థూల దేహమునందు ‘నేను నాది’ యను మిథ్యాజ్ఞానము నారోపించుట లేదు.

**అథ పునః స్వశిబికాయాం విషమగతాయాం ప్రకుపిత ఉవాచ రహూగణః కిమిదమరే త్వం జీవన్మృతోఽసి మాం కదర్థీకృత్య భర్తృశాసనమతిచరసి ప్రమత్తస్య చ తే కరోమి చికిత్సాం దణ్డపాణిరివ జనతాయా యథా స్వాం ప్రకృతిం భజిష్యసీతి ॥ 7**

అనంతరము పల్లకి మరల అటు నిటు ఊగుట చూచి రహూగణుడు మిగుల క్రోధావిష్టు డై యిట్లు పలికెను - 'ఓరీదుష్టా! నీవు చేయు నదేమి? నీవు జీవన్మృతుడ వై యున్నావా ? నేను నీప్రభువును. నీవు నన్ను తిరస్కరించి నాయాజ్ఞను పాటింప కున్నావు. అందువలన దండపాణి యగు యముడు జనులను శిక్షించునట్లు నేను నిన్ను శిక్షింతును. దానివలన ప్రకృతిస్థుడ వగుదువు. (అనగా సరియైన స్థితిలోనికి రాగలవు.)

**ఏవం బహ్వబద్ధమభిభాషమాణం నరదేవాభిమానం రజసా తమ సానువిద్ధేన మదేన తిరస్కృతాశేషభగవత్ప్రియనికేతం పణ్డితమానినం స భగవాన్ బ్రాహ్మణో బ్రహ్మభూత: సర్వభూతసుహృదాత్మా యోగేశ్వర చర్యాయాం నాతివ్యుత్ప న్నమతిం స్మయమాన ఇవ విగతస్మయ ఇదమాహ ॥ 8**

నరదేవాభిమాని యగు రహూగణుడు రజస్తమోగుణములచే వృద్ధి పొందినమదముచే భగవత్ప్రియనికేతనుడు, పరమభాగవతుడు నగు భరతుని తిరస్కరింప సాగెను. పండితాభిమాని యగు రహూగణుడు యోగులనడవడి నెఱుంగజాలడు. సర్వభూత సుహృదాత్ముడు, దేహాభిమాన రహితుడు నగు భరతుడు నిరహంకారముతో మందహాసము చేసి వానితో నిట్లు పలుకసాగెను.

## శ్రీ బ్రాహ్మణ ఉవాచ

**త్వయోదితం వ్యక్తమవిప్రలబ్ధం**
**భర్తుస్స మే స్యాద్యది వీర భార:**
**గన్తుర్యది స్యాదధిగమ్యమధ్వా**
**పీవేతి రాశౌ న విదాం ప్రవాద: ॥ 9**

వీరుడా ! నీవు పలికినది సత్యము, దానిలో వెట్టియాక్షేపము లేదు. ఏలయన, మోయునట్టి దేహమునకు గల భారము నా కున్నచో (ఆత్మ కున్నచో) దానివలన నీవు పలికిన పలుకు లన్నియు విరుద్ధములగును, కాని నేను దేహముకంటె భిన్నుడను. అందువలన వాహకుడనుగాను, నడచునట్టి దేహము యొక్క గమ్యస్థానము లేదా మార్గలాభము నాయాత్మ యొక్క యుద్దేశ్యమైనచో నాకు గమనము వలన క్లేశము కలుగును. కాని నాకట్టి యుద్దేశ్యమేదియు లేకపోవుటచే క్లేశముకూడ లేదు. ఇంకను నీవు నన్ను స్థూలముగ లేవని పలికితివి. అది మూర్ఖజనోచిత వ్యవహారము మాత్రము, ఇట్టి ప్రవాదము స్థూలదేహము పట్ల ప్రయుక్తమగును, కాని పండితు లిట్టి వాక్కులను ఆత్మోద్దేశ్య మని యెప్పుడును పలుకరు. అందువలన నా యీ దేహము స్థూలము, నేను స్థూలము కాను.

స్థౌల్యం కార్శ్యం వ్యాధయ ఆధయశ్చ
క్షుత్తృడ్భయం కలిరిచ్ఛా జరా చ ।
నిద్రా రతిర్మన్యురహంమదః శుచో
దేహేన జాతస్య హి మే న సన్తి ॥ 10

స్థూలము, కృశము, ఆధి (మానసికబాధ), వ్యాధి, క్షుధ, తృష్ణ, భయము, కలహము, విషయభోగవాసన, జర, నిద్ర, విషయాసక్తి, క్రోధము, దేహాత్మబుద్ధి, శోకము, మోహము - అనునవన్నియు దేహాభిమానముతో ఉత్పన్నములగును. అందువలన దేహాభిమాని యగు జీవునకే యీ స్థూలత్వము కృశత్వము మున్నగున వన్నియు ఉండును. కాని నాకు దేహాభిమానము లేదు. కావున నాయం దిట్టి స్థూలత్వకృశత్వాదులు లేవు.

జీవన్మృతత్వం నియమేన రాజ -
న్నాద్యన్తవద్యద్వికృతస్య దృష్టమ్ ।
స్వస్వామ్యభావో ధ్రువ ఈడ్య యత్ర
తర్హ్యుచ్యతేఽసౌ విధికృత్యయోగః ॥ 11

రాజా ! నీవు నన్ను జీవన్మృతుడ వనిపలికితివి. ఆవిషయమున చెప్పదగిన దేమనగా, కేవలము నేనే జీవన్మృతుడనుగాను, పరిణామశీలము లగు వస్తువుల కన్నింటికి ఆద్యంతము లున్నట్లుగ నాకు దోచుచున్నది. ఇంకను నీవు నన్ను "యజమాని యాదేశము నుల్లంఘించు చున్నా" వని పలికితివి, దానిని గూర్చియు జెప్పుచున్నాను, వినుము. పూజ్యుడా ! స్వామి భృత్యభావము లెవరిపక్షమునైన నిత్యమైనచో 'శిబికావహన కార్యమున వీనిని నియమింపుము' ఇట్టి యాదేశముగూడ ఉచితమే యైయుండెడిది. కాని కాలవశమున నీరాజ్యము నష్టము కావచ్చును, నాకు రాజ్యము లభింప వచ్చును, అట్లయిన సర్వము విపరీతమగును. అనగా నీకు స్వామిబుద్ధి నశించి భృత్యబుద్ధి, నాకు భృత్యబుద్ధి నశించి స్వామిబుద్ధి కలుగును.

విశేషబుద్ధేర్వివరం మనాక్చ
పశ్యామ యన్న వ్యవహారతోఽన్యత్ ।
క ఈశ్వరస్తత్ర కిమీశితవ్య -
మథాపి రాజన్ కరవామ కిం తే ॥ 12

రాజుగా నున్నంతవఱకు నేను నీకు ప్రభువునే యనిపలికినచో దానికి సమాధాన మేమియనగా, అట్టి 'నేను రాజును లేదా భృత్యుడను' ఇట్టిభేదబుద్ధి కవకాశము వ్యవహార జనితమే యగును. ఇదితప్ప నాకు మఱొకటి యేదియు కనబడుటలేదు. అట్లయినచో రా జెవ్వడు ? భృత్యు డెవ్వడు ? అయినను నీ కిట్టియభిమాన మున్నచో నేను నీ కేమి సవి చేయవలెనో చెపుము.

ఉన్మత్తమత్తజడవత్స్వసంస్థాం
గతస్య మే వీర చికిత్సితేన ।
అర్థః కియాన్ భవతా శిక్షితేన
స్తబ్ధప్రమత్తస్య చ పిష్టపేషః ॥ 13

ఓరీ ! నీవు మిగుల ఉన్మత్తుడవై యున్నావు, నిన్ను శిక్షింతును, దానివలన నీవు నీసహజ స్వభావమును పొందెద వని నాతో పలికితివి. రాజా! దానికి సమాధానము చెప్పెదను, వినుము. ఉన్మత్తునివలెను, మత్తుని వలెను, జడునివలెను ఉన్నను నేను బ్రహ్మాత్మనిష్ఠను పొందితిని. నన్ను శిక్షించిన నీ కెట్టిప్రయోజనము సిద్ధించును ? నీ దృష్టిలో నేను ప్రమత్తుడను, సంసారిని నై యున్నచో నీవు నాకు విధించు దండనము పిష్టపేషణము వలె విఫలమగును. అట్లు ప్రమత్తుని దండించిన వాని కెట్టియుపశమనము కలుగదు. ఇంకను వృద్ధియే యగును.

## శ్రీ శుక ఉవాచ

ఏతావదనువాదపరిభాషయా ప్రత్యుదీర్య స మునివర ఉపశమశీల ఉపరతానాత్మ్య నిమిత్త ఉపభోగేన కర్మారబ్ధం వ్యపనయన్ రాజయానమపి తథైవోవాహ ॥ 14

శుకుడు పలికెను :- రాజా ! రహూగణుడు పరమభాగవతునిగూర్చి యేయే తిరస్కార వాక్కులను పలికెనో శాంతచిత్తుడు, మునిశ్రేష్ఠుడు నగుభరతుడు ఆవాక్కుల కన్నింటికి విశేషార్థముల ద్వారా తగువిధముగ సమాధానముల నిచ్చెను. 'దేహాత్మబుద్ధికి కారణ మవిద్య, అది వానికి లేదు. దైన్యమువలన నేను భక్తుడ' నను అభిమానముగూడ వానికి లేకుండెను. అతడు సాధారణజీవునివలె 'నేను శిబికావాహనాది రూపభోగము ద్వారా ప్రారబ్ధకర్మ ఫలమును నశింపజేయుచున్నా' నని భావించి రాజు పల్లకిని మోయసాగెను.

స చాపి పాణ్డవేయ సిన్ధుసౌవీరపతిస్తత్త్వజిజ్ఞాసాయాం సమ్యక్శ్రద్ధయాధికృతాధికార స్తద్ధృదయగ్రన్థివిమోచనం ద్విజ వచ ఆశ్రుత్య బహుయోగగ్రన్థ సమ్మతం త్వరయావరుహ్య శిరసా తత్పాదమూలముపసృతః క్షమాపయన్ విగతనృప దేవస్మయ ఉవాచ ॥ 15

పాండవేయా ! నిజ మగుశ్రద్ధ ఉత్పన్న మగుటచే సింధుసౌవీర పతి యగు రహూగణుడు గూడ తత్త్వవిచారమున అధికారమును పొందెను. ద్విజశ్రేష్ఠ డగు భరతుడు

పలికిన బహుయోగశాస్త్ర సమ్మతములు, హృదయ గ్రంథిభేదకములు నగువాక్కులను వినుటచే వాని రాజ్యాభిమానము నశించెను. వెంటనే యతడు పల్లకినుండి దిగి శిరస్సు వంచి భరతుని పాదములకు నమస్కరించి క్షమింపవలసినదిగా గోరుచు నిట్లు పలుక సాగెను.

కస్త్వం నిగూఢశ్చరసి ద్విజానాం
బిభర్షి సూత్రం కతమోఽవధూతః ।
కస్యాసి కుత్రత్య ఇహాపి కస్మాత్
క్షేమాయ నశ్చే దసి నోత శుక్లః ॥ 16

మహాత్మా ! ప్రచ్ఛన్నభావముతో ఈసంసారమున సంచరించు నీ వెవడవు ? యజ్ఞోపవీతమును ధరించి యున్నావు కనుక ద్విజుడవా ; లేక నీవు దత్తాత్రేయాదులలో అవధూతవా (జ్ఞాననిష్ఠుడవా) ? నీ వేమహాత్ముని శిష్యుడవు? ఎచ్చట నివసించువాడవు ? ఇక్కడ కేమినిమిత్తమై వచ్చితివి ? నాక్షేమమును గోరి నీ విచ్చటకు వచ్చియుంటివా? అట్లయిన నీవు విశుద్ధ సత్త్వమయమూర్తి యైన నారాయణావతారి యగు కపిలుడవు కావు గదా !

నాహం విశఙ్కే సురరాజవజ్రా -
న్న త్ర్యక్షశూలాన్న యమస్య దణ్డాత్ ।
నాగ్న్యర్కసోమానిలవిత్తపాస్త్రా -
చ్ఛఙ్కే భృశం బ్రహ్మకులావమానాత్ ॥ 17

నేను దేవేంద్రుని వజ్రాయుధమునకు భయపడను. శూలపాణి యొక్క శూలమునకు గూడ భయపడను. యమదండమునకు లేదా అగ్ని సూర్యచంద్రవాయుకుబేరుల వలనగూడ నాకు భయము కలుగదు. కాని నేను బ్రహ్మజ్ఞవంశావమానరూప మగుఅపరాధమునకు మిగుల భయపడుదును.

తద్బ్రూహ్యసఙ్గో జడవన్నిగూఢ -
విజ్ఞానవీర్యో విచరస్యపారః ।
వచాంసి యోగగ్రథితాని సాధో
న నః క్షమన్తే మనసాపి భేత్తుమ్ ॥ 18

నీ విజ్ఞానవీర్యము అనగా విజ్ఞానసమన్విత మగు జ్ఞానప్రభావము ప్రచ్ఛన్న మై యున్నది. వాస్తవముగ నీవు సర్వజనసాంగత్యమును వదలి అచింత్యుడవు, అనంతమహిమా

విశిష్టుడవు నై జడునివలె ఏల సంచరించు చున్నావు? ఆవిషయమును దయయుంచి చెప్పుము. మహాత్మా! నీవు పలికిన యోగసమన్వితమ్ము లగు మాటలలోని అర్థమును నా మనస్సునకు పట్టించు కొనలేకపోయితిని.

అహం చ యోగేశ్వరమాత్మతత్త్వ -
విదాం మునీనాం ప్రవరం గురుం వై ।
ప్రష్టుం ప్రవృత్తః కిమిహారణం యత్
సాక్షాద్ధరిం జ్ఞానకలావతీర్ణమ్ ॥ 19

నేను నిన్ను యోగేశ్వరుడవు, ఆత్మతత్త్వజ్ఞుడవు, మునులకు పరమగురుడవు, జ్ఞాన ప్రదానార్థ మవనియం దవతరించినవాడవు, సాక్షాత్తుగ భగవదవతార మగుకపిల దేవుడవు వనితెలిసికొని, ఈ ప్రపంచమున జీవునకు శరణు డెవ డనియడుగుటకు ప్రవృత్తుడ నైతిని.

స వై భవాన్ లోకనిరీక్షణార్థ -
మవ్యక్తలిఙ్గో విచరత్యపిస్విత్ ।
యోగేశ్వరాణాం గతిమన్ధబుద్ధిః
కథం విచక్షీత గృహానుబద్ధః ॥ 20

నీ వా భగవదవతారుడ వగు గపిలదేవుడ వై యుండి సాధ్వసాధు పరీక్షార్థమై అలక్షిత స్వరూపుడ వై విహరించు చున్నావా? అట్లయినచో మావంటి వివేకరహితులు, గృహాసక్తులు వగు మానవులు నీవంటి యోగేశ్వరుల యాచరణము నేమియెఱుంగ గలరు ?

దృష్టః శ్రమః కర్మత ఆత్మనో వై
భర్తుర్గన్తుర్భవతశ్చానుమన్యే ।
యథాసతో దానయవాద్యభావాత్
సమూల ఇష్టో వ్యవహారమార్గః ॥ 21

"నాకు శ్రమలే" దని నీవు పలికితివి కాని ఆత్మ దేహముకంటె వేఱయినను దేహ యోగమువలన యుద్ధాదికర్మజనిత మగు శ్రమ ఆత్మ యందు లక్షిత మగును. అందువలన నీవు బరువును మోయుచు పయనించు చున్నపుడు నీకు నిజముగ శ్రమ కలిగినట్లు నా కనుమానము కలిగినది. ఇంకను నీవు "రాజభృత్యాది భేదబుద్ధి వ్యవహారము మాత్రమేగాని సత్యము కా" దని పలికితివి. కాని ఘటాదులు వ్యావహారికములు అనగా ప్రాపంచిక ద్రవ్యము లసత్యము లైనను వానిద్వారా జలగ్రహణాదికార్యము లెట్లు జరుగును ?అందువలన వ్యవహారమార్గము సత్య మనియే ప్రమాణమగు చున్నది.

స్థాల్యగ్ని తాపాత్పయసోఽపి తాప
స్తత్తాపత స్తణ్డులగర్భరన్ధిః ।
దేహేన్ద్రియాస్వాశయసన్నికర్షాత్
తత్సంసృతిః పురుషస్యానురోధాత్ ॥ 22

"స్థూలత్వాదులైన ఔపాధికధర్మములు నాకు లే" వని నీవు పలికితివి. అయినచో ఔపాధికధర్మము మిథ్యయా? అగ్నితాపముచే మట్టిపాత్ర, దానిలోని దుగ్ధము తప్త మగును. బయటి వేడిమిచే లోపల నున్న బియ్యపుగింజలు పచన మగును. ఇచట దీనిలోని యేభాగము గూడ మిథ్య కాదు. అగ్నిసంబంధముచే తండూలాదులు పచనమగునట్లు జీవుల దేహేంద్రియ సంబంధము వలన గలిన శ్రమాదులు క్లేశము లగును. వాస్తవముగనది ఔపాధికధర్మము వలననే కలుగును.

శాస్తాభిగోప్తా నృపతిః ప్రజానాం
యః కింకరో వైన పినష్టి పిష్టమ్ ।
స్వధర్మమారాధనమచ్యుతస్య
యదీహమానో విజహాత్యఘౌఘమ్ ॥ 23

రాజభృత్యాదిభావము నిత్యము కా దనినీవు పలికితివి. కాని యనిత్య మైనను ఎప్పు డేవ్యక్తి రాజగునో అప్పుడాతడు దుర్మార్గగాము లగు ప్రజలను శాసించి పాలించును. ఇంకను నీవు 'స్తబ్ధు డగుమానవునకు బోధించుట పిష్టపేషణమువంటిదే' యని పలికితివి. కాని అచ్యుత భగవానుని దాసు డైనవా డెప్పుడును విఫలకర్మ చేయడు. అనగా స్తబ్ధు డగు వ్యక్తికి బోధించి యాతని సబ్ధత్వమును పోగొట్టజాలక పోయినను సర్వులను శాసించు వాడగు భగవానుని యాదేశమును పాలించు వాని ప్రయత్న మెప్పుడును వ్యర్థము కాదు. విష్ణుభగవానునియారాధనమే స్వధర్మము. దానికై ప్రయత్నపరు డగువ్యక్తి సర్వపాపరాశిని ధ్వంసము చేయును.

తన్మే భవాన్ నరదేవాభిమాన -
మదేన తుచ్ఛీకృతసత్తమస్య ।
కృషీష్ట మైత్రీదృశమార్తబన్ధో
యయా తరే సదవధ్యానమంహః ॥ 24

నీవు పలికిన దంతయు నాపట్ల విపరీత మైనట్లుభావించు చున్నాను. దీనబాంధవా! నేను నరదేవాభిమానముచే మత్తుడ నై నీవంటిపరమభాగవతుని అవమానించితిని. మిగుల

అపరాధినైన నాపై దయజూపుము. నీకృపాదృష్టి ప్రసారముచే సాధువులకు జేసినఅవమానము వలన పుట్టిన పాపమునుండి ముక్తుడ నగుదును.

న విక్రియా విశ్వసుహృత్సఖస్య
సామ్యేన వీతాభిమతే స్తవాపి ।
మహద్విమానాత్ స్వకృతాద్ధిమాదృఙ్-
నఙ్‌క్ష్యత్యదరాదపి శూలపాణిః ॥ 25

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే జడభరత రహూగణసంవాదే
దశమోఽధ్యాయః ॥

ప్రభూ ! విశ్వబంధు వగు భగవానుడు నీకు సఖుడు. నీవు సమదృష్టి సంపన్నుడ వగుటచే నీ దేహమునందు గూడ నీ కాత్మబుద్ధి లేదు. నేను చేసిన యపకారము వలన నీయందెట్టి వికారము కలుగలేదు. అయినను ఒక మహాపురుషున కవమానము చేయుటచేత నావంటిపురుషుడు సాక్షాత్తుగ త్రిశూలపాణివలె సర్వసమర్థు డయ్యును త్వరలోనె నశించును. ఎట్టి సందేహము లేదు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
జడభరతరహూగణసంవాదమున పదియవ అధ్యాయము
సంపూర్ణము.



# పదునొకండవ అధ్యాయము

## రహూగణరాజునకు భరతు డుపదేశ మొనర్చుట

కథాసారము :- ఈ యధ్యాయమున రహూగణరాజునకు భరతముని పరమజ్ఞానము నుపదేశించుట యనువిషయము వర్ణింపబడినది.

ద్విజశ్రేష్ఠ డగుభరతుడు రహూగణరాజుతో నిట్లు పలికెను :- నీవు అజ్ఞుడ వై యుండియు విజ్ఞునివలె పలికి నీయవివేకమును వెల్లడి చేసితివి. విజ్ఞుడగు వాడు తన లోకవ్యవహార విషయము నంగీకరింపడు. లోకధర్మము మున్నగు కర్మకాండకు సంబంధించిన యజ్ఞ విషయకము లగువేదవాక్కులచే విశుద్ధ తత్త్వవాదము వెల్లడికాదు. మాయిక జీవుని మనస్సు సత్త్వాది గుణములచే శుభాశుభ కర్మలందే బద్ధమైయుండును. ఇట్లు ఈయింద్రియాధిపతి యగు మనస్సు నానాభావములచే జీవుని నానాయోనులయందు పడవేయును. సంసారమున వేలకొలది సుఖదుఃఖములను సృష్టించును. ఈ మనోధర్మమువలన జీవుడు లోకవ్యవహారముల యందు నిమగ్నమైయుండును. మనస్సు యొక్క యీ విషయాసక్తివలననే బంధనము కలుగును. వాని యందు అనాసక్తి కలిగిన ముక్తి లభించును. మనోవృత్తులు పదునొకండు విధములు, కొందఱు పండ్రెండువిధము లనివచింతురు. ఈపదునొకండు చిత్తవికారము లింకను శతసహస్రములుగ వృద్ధి పొందును. సర్వశక్తిమంతు డగుభగవానుని మాయాశక్తియే దానికి కారణము. భగవద్విముఖు లగుజీవుల మనస్సే మాయావశమున వివిధావస్థలచే ఈ వికారముల కన్నింటికి లోనైయుండును. మాయాముక్తు (క్షేత్రజ్ఞు) డగు శుద్ధజీవుడు వీని నన్నింటిని ప్రత్యక్షము చేసికొనును. జీవాత్మ పరమాత్మ భేదముచే క్షేత్రజ్ఞుడు రెండు విధములు. పరమాత్మయే పూర్ణతత్త్వము - వాసుదేవుడు. ఆయనయె సర్వభూతముల యందు ప్రవేశించి అన్నింటిని నియమించును. ఆయనయె సర్వజీవుల కాశ్రయుడు. అసత్సంగవర్జితుడు, విజితేంద్రియుడు నగుజీవుడె మాయాముక్తుడై ఆయనను తెలిసికొని సంసార సింధువు నతిక్రమించును. బహిర్విషయాకృష్ట మగునీమనస్సే సంసార తాపమునకు మూలము. మహాశత్రు వగు ఈమనస్సును జయింపనిచో తాపము నశింపదు. ఇది అవాస్తవ మైనను దీనిప్రభావ మసామాన్యము. దీని నుపేక్షించినచో నిది మహా బలము గలది యై జీవుని స్వరూపమును కప్పివేయును.

'నేను కృష్ణదాసుడను. కృష్ణసేవయే నా ధర్మము' ఈవిషయము నంతటిని పూర్తిగ మఱచి అది విషయసేవ యందే నిమగ్న మైయుండును. హరిగురుచరణ సేవ యను విశితఖడ్గమే ఈ మహాశత్రువును సంహరింప గలదు.

## శ్రీ బ్రాహ్మణ ఉవాచ

అకోవిదః కోవిదవాదవాదాన్
వదస్యథో నాతివిదాం వరిష్ఠః ।
న సూరయో హి వ్యవహారమేతం
తత్త్వావమర్శేన సహామనన్తి ॥ 1

బ్రాహ్మణుడు పలికెను : నీవు విజ్ఞుడవు కావు, పైగా విజ్ఞునివలె పలుకుచున్నావు. అందువలన నీవు విజ్ఞులలో శ్రేష్ఠుడవు కావు. ఏలయన, వివేకులు తత్త్వవిచారము ద్వారా స్వామిభృత్య భావము, సుఖదుఃఖములు మున్నగు లౌకిక వ్యవహారముల నంగీకరింపరు.

తథైవ రాజన్నురుగార్హమేధ
వితానవిద్యోరువిజృమ్భితేషు ।
న వేదవాదేషు హి తత్త్వవాదః
ప్రాయేణ శుద్ధో ను చకాస్తి సాధుః ॥ 2

రాజా ! ప్రభుభృత్యాది లౌకికవ్యవహారమునందు అధికతర మగు గృహస్థ సంబంధ మైన యజ్ఞవిషయక విద్యలో విలసిల్లు వేదవాక్యముల యందు రాగాదిరహిత మగుశుద్ధ తత్త్వవాదము నిశ్చితరూపముగ వెల్లడి కాదు.

న తస్య తత్త్వగ్రహణాయ సాక్షా
ద్వరీయసీరపి వాచః సమాసన్ ।
స్వప్నే నిరుక్త్యా గృహమేధిసౌఖ్యం
న యస్య హేయానుమితం స్వయం స్యాత్ ॥ 3

స్వప్నదృష్టాంతముద్వారా అనగా స్వప్నదృష్టమగుభోగ్యవస్తువు యొక్క మిథ్యాత్వము స్వయముగనె అనుభూత మగునట్లు గృహమేధి (గృహసంబంధమైనయజ్ఞాది కర్మలవలన గలుగు) సుఖ మెవరికి తుచ్ఛముగ బోధపడదో వానికి తత్త్వజ్ఞానమును గలిగించుటకై సర్వశ్రేష్ఠము లగువేదవాక్యములు గూడ సమర్థములు గావు.

(గృహస్థోచితము లైన యజ్ఞాదికర్మల వలన లభించు స్వర్గాదిసుఖము లెవనికి స్వప్నము వలె హేయములుగ తెలియబడవో వానికి తత్త్వజ్ఞానమును కలిగించుటకు సాక్షాత్తుగ ఉపనిషద్వాక్యములు గూడ సమర్థములు కావు.)

యావన్మనో రజసా పురుషస్య
సత్త్వేన వా తమసా వానురుద్ధమ్ ।
చేతోభిరాకూతిభిరాతనోతి
నిరంకుశం కుశలం చేతరం వా ॥ 4

సత్త్వరజస్తమోగుణముల కధీన మైయుండునంతవఱకు పురుషుని మనస్సు మదపుటేనుగు వలె స్వతంత్రమై జ్ఞానకర్మేంద్రియముల ద్వారా పాప పుణ్యములను లేదా మిశ్ర కర్మలను విస్తరింప జేయుచుండును.

స వాసనాత్మా విషయోపరక్తో
గుణప్రవాహో వికృతః షోడశాత్మా ।
బిభ్రత్పృథఙ్నామభి రూపభేద
మన్తర్బహిష్ట్వం చ పురైస్తనోతి ॥ 5

పాపపుణ్యాది వాసనాపూర్ణ మగుటచే ఆ మనస్సు కామక్రోధాదివికారగ్రస్తమై విషయాసక్తిచేత, మాయికము లైనసత్త్వరజస్తమోగుణముల చేత అటునిటు చలించుచుండును. పదునొకం డింద్రియములు, పంచమహా భూతములు - ఈ పదునాఱుకళలలో మనస్సు ప్రధానమైనది. ఈ మనస్సే భిన్నభిన్ననామములతో దేవతిర్యగాదివిభిన్నదేహములను ధరించును. దేహ ధారణము వలననే దానియుత్కృష్టాపకృష్టములు వెల్లడి యగును.

దుఃఖం సుఖం వ్యతిరిక్తం చ తీవ్రం
కాలోపపన్నం ఫలమావ్యనక్తి ।
ఆలింగ్య మాయారచితా న్తరాత్మా
స్వదేహినం సంసృతిచక్రకూటః ॥ 6

మాయారచిత మగుమనస్సు దేహియగు జీవుని ఆలింగనము చేసికొని సంసారచక్రమున పడవేసి, సుఖదుఃఖములు, మోహము, పాపపుణ్యములు మున్నగు కర్మములకు సంబంధించిన, కాలోచితములైన దుర్నివార్యము లైన ఫలములను సృష్టించును.

తావానయం వ్యవహారః సదావిః
క్షేత్రజ్ఞసాక్ష్యో భవతి స్థూలసూక్ష్మః ।
తస్మాన్మనో లింగమదో వదన్తి
గుణాగుణత్వస్య పరాపరస్య ॥ 7

మనస్సు జీవుని ఈ సంసారమున త్రిప్పునంతవఱకు జీవభోగ్యము లగునీ వ్యవహారములు స్థూలసూక్ష్మ భావముతో (అనగా నేను మనుష్యుడను, నేను దేవతను మున్నగు బహువిధము లైనస్థూలసూక్ష్మదేహములయందు ఆత్మాభిమాన రూపముతో) ఎల్లపుడు వెల్లడియగుచుండును. అందువలన ఉత్కృష్టనికృష్ట యోనులయందు జన్మించుటకు, బంధమోక్షములు గలుగుటకు మనస్సే కారణ మని పండితులు చెప్పు చున్నారు.

గుణానురక్తం వ్యసనాయ జన్తోః
క్షేమాయ నైర్గుణ్యమథో మనః స్యాత్ ।
యథా ప్రదీపో ఘృతవర్తిమశ్నన్
శిఖాః సధూమా భజతి హ్యన్యదా స్వమ్ ।
పదం తథా గుణకర్మానుబద్ధం
వృత్తీర్మనః శ్రయ తేఽన్యత్ర తత్త్వమ్ ॥ 8

జీవుని మనస్సు విషయములయం దాసక్త మైనచో అది వానిసంసార క్లేశములకు కారణ మగును. భోగములయం దనాసక్తియె వానిముక్తికి కారణ మగును. దీపాగ్ని ఘృతయుక్త మగువత్తిని దగ్ధము చేయునపుడు కృష్ణవర్ణ శిఖలను ధరించును. కాని యితర సమయముల యందు స్వస్వ రూపము శుభ్రదీప్తిచేతనే ప్రకాశించును. మనస్సు గూడ గుణకర్మముల యందు బద్ధమై నానావృత్తుల నాశ్రయించును, లేదా స్వస్వభావమునె అవలంబించి యుండును.

ఏకాదశాసన్ మనసో హి వృత్తయ
ఆకూతయః పంచధియోఽభిమానః ।
మాత్రాణి కర్మాణి పురం చ తాసాం
వదన్తి హైకాదశ వీర భూమీః ॥ 9

పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, అహంకారము అనువాని భేదముతో మనోవృత్తులు పదునొకండు విధములు. జ్ఞానవీరుడా! శబ్దాది పంచతన్మాత్రలు జ్ఞానేంద్రియములకు విషయములు. విసర్గాది పంచ వ్యాపారములు కర్మేంద్రియ విషయములు. దేహగేహాదులు అహంకార విషయములు. పండితు లీపదునొకండు విధములగు వృత్తులను గూర్చియె పలుకుదురు.

గన్ధాకృతిస్పర్శరసశ్రవాంసి
విసర్గరత్యర్త్యభిజల్పశిల్పాః ।
ఏకాదశం స్వీకరణం మమేతి
శయ్యామహం ద్వాదశమేక ఆహుః ॥ 10

శబ్దస్పర్శ రూపరసగంధము లను ఐదును జ్ఞానేంద్రియముల ద్వారా జ్ఞానాకారవృత్తికి విషయము లగును. ప్రజల్పము, శిల్పము, గతి, మల త్యాగము, స్త్రీ సంభోగము అనుఐదును కర్మేంద్రియములద్వారా కార్యాకార వృత్తికి విషయము లగును. వాని అను దేహగేహాద్యభిమానము పదునొకండు వృత్తులకు విషయ మగును. అహంకారమును (దేహమే నే నను బుద్ధిని) కొందఱు పండ్రెండవవృత్తి యని చెప్పుచున్నారు. అహంకార రూపమగు ఆ ద్వాదశ వృత్తికి విషయము శయ్య అనగా దేహము. వారిదృష్టిలో శయ్య (అహంకారముతో శయనించుటవలన శయ్య) అనుసంజ్ఞ గల దేహము పండ్రెండవ వృత్తికి విషయ మగును.

**ద్రవ్యస్వభావాశయకర్మకాలై**
**రేకాదశామీ మనసో వికారాః ।**
**సహస్రశః శతశః కోటిశశ్చ**
**క్షేత్రజ్ఞతో న మిథో న స్వతః స్యుః ॥ 11**

ద్రవ్యము అనగా విషయము, స్వభావము అనగా పరిణామ హేతువు, ఆశయము అనగా సంస్కారము, కర్మ అనగా అదృష్టము, గుణక్షోభకమగు కాలము - ఇవి నిమిత్తకారణములు. వీనివలననే ఈ పదునొకండు విధము లగుచిత్త వికారములు ప్రథమమున నూఱువిధములు, పిమ్మట వేయివిధములు, అటుపిమ్మట కోటివిధములు నైనవి. కాని యివి శత సహస్రవిధము లైనను స్వయముగగాని, పరస్పరముగ గాని కాక పరమేశ్వరుని అనంతశక్తుల వలననే అనంతము లగును.

**క్షేత్రజ్ఞ ఏతా మనసో విభూతీ**
**ర్జీవస్య మాయారచితస్య నిత్యాః ।**
**ఆవిర్హితాః క్వాపి తిరోహితాశ్చ**
**శుద్ధో విచష్టే హ్యవిశుద్ధకర్తుః ॥ 12**

భగవద్విముఖము లగు కర్మముల జేయువాడు, మాయారచితుడు నగు జీవోపాధి యొక్క మనస్సునకు అనేకవిభూతులు గలవు. ఇవి అనాది కాలము నుండియు ఉన్నవి. ఇవి జాగ్రత్స్వప్నములయందు ఆవిర్భవించును, సుషుప్తిసమాధ్యవస్థల యందు తిరోహితము లగును. సంసారముక్తుడు, క్షేత్రజ్ఞుడు నగుజీవుడు వీని యన్నింటికి ద్రష్ట యై యున్నాడు.

క్షేత్రజ్ఞ ఆత్మా పురుషః పురాణః
సాక్షాత్ స్వయంజ్యోతిరజః పరేశః ।
నారాయణో భగవాన్ వాసుదేవః
స్వమాయయాత్మన్యవధీయమానః ॥ 13

యథానిలః స్థావరజంగమానా-
మాత్మస్వరూపేణ నివిష్ట ఈశేత్ ।
ఏవం పరో భగవాన్ వాసుదేవః
క్షేత్రజ్ఞ ఆత్మేదమనుప్రవిష్టః ॥ 14

(జీవాత్మ పరమాత్మలభేదముతో క్షేత్రజ్ఞుడు రెండువిధములుగ నుండును. వారిలో జీవాత్మ విషయము చెప్పబడినది. ఇపుడు పరమాత్మ స్వరూపము వర్ణింపబడును.) అతడు ఆత్మ అనగా సర్వవ్యాపియు, జగత్కారణుడు, పూర్ణుడు, అపరోక్షుడు, స్వయంప్రకాశుడు, జన్మాది రహితుడు, బ్రహ్మాదులకు నీశ్వరుడు నై యున్నాడు. ఇంకను నతడు నారాయణుడు అనగా సర్వజీవుల కాశ్రయుడు. షడైశ్వర్యపూర్ణుడు, సర్వభూతములకు నివాస మగు వాసుదేవుడు. ఆయనయె తన మాయద్వారా జీవాత్మయందు వాని నియంతరూపముతో నుండును, వాయువు ప్రాణరూపముతో స్థావర జంగమాది సర్వభూతములలో ప్రవేశించి వానిని నియమించునట్లు క్షేత్రజ్ఞుడగు ఆత్మయు, పరమపురుషు డగు వాసుదేవుడు ఈ ప్రపంచమున ప్రవేశించి దానిపైన ఆధిపత్యమును వహింతురు.

న యావదేతాం తనుభృన్న రేన్ద్ర
విధూయ మాయాం వయునోదయేన ।
విముక్తసఙ్గో జితషట్సపత్నో
వేదాత్మతత్త్వం భ్రమతీహ తావత్ ॥ 15

నరనాథా! దేహధారి యగు జీవుడు సంగరహితుడు, జ్ఞానేంద్రియ మనోరూపు లగు ఆఱుగురుశత్రువులను జయించినవాడు నై జ్ఞానోద్రేకము ద్వారా మాయను నిరసించి ఆత్మతత్త్వమును తెలిసికొనజాలనంత వఱకు ఆ సంసారచక్రమున భ్రమించు చుండును.

న యావదేతన్మన ఆత్మలిఙ్గం
సంసారతాపావపనం జనస్య ।
యచ్ఛోకమోహామయరాగలోభ -
వైరానుబన్ధం మమతాం విధత్తే ॥ 16

ఆత్మోపాధి యగు మనస్సు జీవుని సంసారతాపమునకు మూలము. జీవుడు దాని వెఱుంగజాలనంత వఱకు సంసారమున భ్రమించుచుండును. ఏలయన, రోగము, శోకము, మోహము, రాగము, లోభము, వైరము వను వానితోగూడి మనస్సు బంధనములను, మమకారమును గలిగించును.

భ్రాతృవ్యమేనం తదదభ్రవీర్య -
ముపేక్షయాధ్యేధితమప్రమత్తః ।
గురోర్హ రేశ్చరణోపాసనాస్త్రో
జహి వ్యలీకం స్వయమాత్మమోషమ్ ॥ 17

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే బ్రాహ్మణరహూగణసంవాదే
ఏకాదశోఽధ్యాయః ॥

ఈ శత్రువు మిగుల ప్రబలమైనది. ఉపేక్షించినచో దీని పరాక్రమము పెరుగును. ఇది అవాస్తవ మైనను జీవుని స్వరూపమును గప్పి వేయును. రాజా ! హరిగురు చరణోపాసన యను అస్త్రము ద్వారా సావధానుడ వై నీవు దీనిని నాశనము చేయుము.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
బ్రాహ్మణరహూగణ సంవాదమున పదునొకండవ అధ్యాయము
సంపూర్ణము.

❀ ❀ ❀



# పండ్రెండవ అధ్యాయము

## రహూగణ రాజు ప్రశ్నించుట; భరతుడు ప్రత్యుత్తర మిచ్చుట

కథాసారము :- ఈయధ్యాయమున రహూగణ రాజు సందేహము గలవాడై మహర్షి యగుభరతుని మరల ప్రశ్నింపగా భరతు డారాజుసందేహమును నివారించుట యను విషయము వర్ణింప బడినది.

రహూగణరాజు కపటవేషధారియు, మహాత్ముడు నగు భరతుని ప్రభావము నెఱింగినవాడై ఆయన పాదములకు ప్రణమిల్లి తా నొనరించిన అపరాధమునకు మిగుల బాధ చెంది యిట్లు పలికెను - 'రాజు యొక్క యహంకార మనుసర్పవిషముచే నష్టప్రాయ మైనవాని వివేకము తనవాక్యామృతముచే రక్షింపబడెను. పిమ్మట బహువిషయములలో సందేహగ్రస్తు డైన నరపతి తాను తెలిసికొనదలచిన విషయములను, పిమ్మట అడుగుటకు సంకల్పించుకొనిన విషయములను ఆయనకు విన్నవించుకొని, ప్రస్తుతము ఆయన చెప్పిన దుర్బోధము లైన ఆధ్యాత్మికయోగముతో గూడిన వాక్కులను మరల సరళ భావముతో చెప్పవలసినదిగ ప్రార్థించెను. భరతుడు వచించిన గంభీరములు, తత్త్వపూర్ణములు నగువాక్కులలోని మర్మమును గ్రహింపలేని మహారాజు మనస్సు మిగుల కలత చెందెను. బ్రహ్మజ్ఞు డగుభరతుడు మరల యిట్లు పలికెను :- భూమిపై గల స్థావరజంగమములగు సర్వ పదార్థములు పార్థివవికారములె. రాజుగూడ తన దేహ మనునొక పార్థివవికారమునె 'నేను రాజు' ననుభావముతో అభిమానించు చున్నాడు. అతడు తవశిబిక వాహకులను బలవంతముగ నియమించి వారిపై మిగుల నిర్దాక్షిణ్యమును జూపుచున్నాడు. అతడు ప్రజారంజకు డగు రాజ శబ్దమునకు యోగ్యుడు గాడు. ఆత్మానాత్మ వివేకులలో గణ్యుడగుటకు యోగ్యుడు గాడు. అతడు మిగుల అజ్ఞాని. పృథివి యందలి సర్వవస్తువులు పార్థివవకారములు, పరిణామ శీలములు, నామమాత్రభిన్నములు. సర్వము అతిసూక్ష్మమగు పరమాణువు నందు లయ మగును. ఏదియు నిత్యము కాదు. విభిన్న ద్రవ్యములందు కల్పిత మగుభేదము మాయామాత్రము. అద్వయ జ్ఞానమె మాయాతీతము. సత్యము. ఈజ్ఞానమె బ్రహ్మము, పరమాత్మ, భగవానుడు అనుమూడు రూపములతో వెల్లడి యగును. దానిపరిపూర్ణ స్ఫూర్తియె భగవానుడు. ఆయన భక్తుల కుపాస్యు డగువాసుదేవుడు. ఆ భక్తుల పదరజముచే అభిషిక్తుడు కానిదే యెవ్వనికిని యే యుపాయము చేత గూడ భగవత్తత్త్వజ్ఞానము కలుగదు.

పిమ్మట భరతముని రాజునకు సంక్షేపముగ తనపూర్వాపర విషయమును పరిచయము చేసి, శ్రీహరియొక్క యర్చన ప్రభావముచే తనకు పూర్వస్మృతి స్థిరముగ నున్నట్లు, దాని వలన ఇపుడు తనకు దుస్సంగము కలుగు ననుభయముచే శ్రద్ధతో మెలగు చున్నట్లును వివరించెను. సాంగత్యప్రభావము హద్దులేనిది. సాధుసాంగత్యప్రభావముచేతనే ఈ జన్మము నందు జీవుడు భగవల్లీలాకథలను శ్రవణకీర్తనాదులు చేయుట ద్వారా సంసారమునుండి ఉత్తీర్ణుడై పరమపదమును పొందగలడు.

## శ్రీ రహూగణ ఉవాచ

నమో నమః కారణవిగ్రహాయ
స్వరూపతుచ్ఛీకృతవిగ్రహాయ ।
నమోఽవధూత ద్విజబన్ధులిఙ్గ
నిగూఢనిత్యానుభవాయ తుభ్యమ్ । 1

రహూగణుడు పలికెను : అవధూతా ! నీ వీశ్వరునికంటె అభిన్నమైన విగ్రహుడవు. నీ పరమానందమయ స్వరూప ప్రభావముచే సర్వశాస్త్ర వివాదములు తుచ్ఛములుగా చేయబడినవి. బ్రహ్మబంధువేషము ద్వారా నీవు కేవలము స్వానందానుభవమును దాచి యుంచితివి. నీకు ప్రణామము లర్పించు చున్నాను.

జ్వరామయార్తస్య యథాగదం సన్
నిదాఘదగ్ధస్య యథా హిమామ్భః
కుదేహమానాహివిదష్టదృష్టే-
ర్బ్రహ్మన్ వచస్తేఽమృతమౌషధం మే ॥ 2

మహాత్మా ! మలమూత్రాదిపూర్ణ మగుదేహమునం దున్న అభిమాన మను సర్పము నావివేకమును కాటువేసినది. ఈ యవస్థయందు నీ వాక్కులు జరారోగపీడితు డగు మానవునకు స్వాదు వైన ఔషధము వలె, నిదాఘపీడితు డగు మానవునకు సుశీతల మగు జలమువలె అమృతముతో సమాన మగు ఔషధస్వరూప మయ్యెను.

తస్మాద్భవన్తం మమ సంశయార్థం
ప్రక్ష్యామి పశ్చాదధునా సుబోధమ్ ।
అధ్యాత్మయోగగ్రథితం తవోక్త-
మాఖ్యాహి కౌతూహలచేతసో మే ॥ 3

నా కేవిషయములు సందేహములుగ నున్నవో వానిని నీకు పిమ్మట చెప్పగలను. ప్రస్తుతము నీవు అధ్యాత్మయోగముతో గూడిన ఏమాటలను పలికితివో అవి మిగుల దుర్బోధము లైయున్నవి. అవి వేనిచే సుందర రూపముగ బోధగమ్యము లగునో ఆవిధముగ చెప్పుము. నాచిత్తము మిగుల కుతూహలపడు చున్నది.

యదాహ యోగేశ్వర దృశ్యమానం
క్రియాఫలం సద్వ్యవహారమూలమ్ ।
న హ్యంజసా తత్త్వవిమర్శనాయ
భవానముష్మిన్ భ్రమతే మనో మే ॥ 4

యోగేశ్వరా ! నీవు దూరగమనాది క్రియాఫలము లైన యే శ్రమాదు లున్నవో అవి ప్రత్యక్షాదిప్రమాణములద్వారా అవగతమగు ననియు, కాని వానియస్తిత్వము వ్యవహార మూలక మనియు, అది ప్రస్తుతతత్త్వమును నిర్ణయించుటయందు సమర్థము కా దనియు పలికితివి, నీ యీ వాక్కులచే నామనస్సు చంచలమగుచున్నది.

## శ్రీ బ్రాహ్మణ ఉవాచ

అయం జనో నామ చలన్ పృథివ్యాం
యః పార్థివః పార్థివ కస్య హేతోః ।
తస్యాపి చాఙ్ఘ్ర్యోరధి గుల్ఫజఙ్ఘా
జానూరుమధ్యోరశిరోధరాంసాః ॥ 5

అంసేఽధి దార్వీ శిబికా చ యస్యాం
సౌవీరరాజేత్యపదేశ ఆస్తే ।
యస్మిన్ భవాన్ రూఢనిజాభిమానో
రాజాస్మి సిన్ధుష్వితి దుర్మదాన్ధః ॥ 6

బ్రహ్మజ్ఞు డగు భరతుడు పలికెను : పార్థివవికారములలో ఏది ఏకారణముచేత భూమిపై సంచరించునో అదియె ఆ భారవాహకాది నామములతో ప్రసిద్ధమైనది. (ఇంకను చలింపనివి. పాషాణాదినామము లతో ప్రసిద్ధిచెందినవి) సచలము లైన ఈ పార్థివవికారముల చరణముల పైభాగమున క్రమముగ చీలమండలు, పిక్కలు, మోకాళ్ళు, తొడలు, నడుము, వక్షస్థలము, కంఠము, స్కంధము (మూపు), ఇవియన్నియు నున్నవి. ఇంకను స్కంధములపై దారుమయ మగు పల్లకి, పల్లకిలో "సౌవీరరాజు" అను నామముతో ప్రసిద్ధిచెందిన

ఒకపార్థివవికారములు ఉన్నవి. వికారమయ మగు ఆదేహమునందె "నేను సింధుదేశపురాజు' నను దురభిమానముతో అంధుడ వైతివి.

శోచ్యానిమాం స్త్వం హ్యధికష్టదీనామ్
విష్ట్యా నిగృహ్ణాన్ నిరనుగ్రహోఽసి ।
జనస్య గోప్తాస్మి వికత్థమానో
న శోభసే వృద్ధసభాసు ధృష్టః ॥ 7

దీను లైన ఈమానవులకు పల్లకిని మోయుటవలన మిగుల కష్టము కలుగు చున్నది. వీరి యవస్థ శోచనీయము. నీవు వీరిని బలవంతముగ జీతము లేకుండగ శిబికావహనకార్యమున నియమించి బాధించు చున్నావు. అందువలన నీవు మిగుల నిర్దయుడవు. "సర్వరక్షకుడ" నని నీ వాత్మశ్లాఘచేసికొనుచుంటివి. అది యంతయు మిథ్యయే. నీవు మిగుల అజ్ఞానివి. ఆత్మానాత్మవివేకుల సభలో శోభిల్లుటకు యోగ్యుడవు కావు.

యదా క్షితావేవ చరాచరస్య
విదామ నిష్ఠాం ప్రభవం చ నిత్యమ్ ।
తన్నామతోఽన్యద్వ్యవహార మూలం
నిరూప్యతాం సత్క్రియయానుమేయమ్ ॥ 8

మనము పృథ్వియందు స్థావరజంగమములయుత్పత్తి వినాశములను చూచుచున్నాము. పృథివీ భిన్నము లైన యే పదార్థములకు గూడ వికారము లేదు. పృథివి కంటె అభిన్నము లైన పరిణామ స్వభావముగల వస్తువులన్నియు నామమాత్రభిన్నములు. అర్థక్రియలు అనగా జలానయనాది కార్యముల ద్వారా ఏవి సత్యము లనియూహింపబడు చున్నవో అవి యన్నియు వ్యవహారమునకు కారణ మైనపృథివిని విడచి ఇక యెట్లుండగలవు? దానిని నీవు నిర్ణయింపుము.

ఏవం నిరుక్తం క్షితిశబ్దవృత్త-
మసన్నిధానాత్పరమాణవో యే ।
అవిద్యయా మనసా కల్పితాస్తే
యేషాం సమూహేన కృతో విశేషః ॥ 9

అట్లయిన పృథివికి సత్యత్వ ముండునా ? క్షితిశబ్దవాచ్యము లగు సర్వపార్థివవస్తువులు నామమాత్రసత్యము లైనను మిథ్యగా నిరూపితము లైనవి. ఏలయన, అవి అతిసూక్ష్మము

్రైన పరమాణువుల యందు లయ మగును. ఇంకను పృథివికి కారణము లైన పరమాణువు ్నియు నిత్యములు కావు. కార్యముల కనుపపత్తి కలుగు నని వాదులు అజ్ఞతవలన నస్సుచే ఈ పరమాణువులను కల్పించిరి. అందువలన పరమాణువుల సమష్టిచే రచితము లైన ఘటపటాదులు గూడ నిత్యములు కావు.

ఏవం కృశం స్థూలమనుర్బృహద్య
దసచ్చ సజ్జీవమజీవమన్యత్ ।
ద్రవ్యస్వభావాశయకాలకర్మ
నామ్నాజయావేహి కృతం ద్వితీయమ్ ॥ 10

ఇట్లు పృథివివలె ఇతర వస్తువుల యందును స్థూలము, సూక్ష్మము, క్షుద్రము, బృహత్తు, కార్యము, కారణము, చేతనము, అచేతనము మున్నగు భేదములు కల్పితము లైయున్నవి. అవి ద్రవ్యము, స్వభావము, ఆశయము, కాలము, కర్మము అనునామములచే ప్రసిద్ధములు. ఇవి మాయాకృతము లనితెలిసికొనుము.

జ్ఞానం విశుద్ధం పరమార్థమేక
మనన్తరం త్వబహిర్బ్రహ్మ సత్యమ్ ।
ప్రత్యక్ప్రశాన్తం భగవచ్ఛబ్దసంజ్ఞం
యద్వాసుదేవం కవయో వదన్తి ॥ 11

అట్లయినచో సత్య మేది ? దానికి సమాధానము చెప్పబడుచున్నది. 'అద్వయజ్ఞానమే' సత్యము, విశుద్ధము (గుణాతీతము), పరమార్థము (మోక్షప్రదము), ఏకము (అద్వితీయము), సర్వవ్యాపకము, నిర్వికల్పము, (దీనిద్వారా అద్వయజ్ఞానము యొక్క ప్రథమస్ఫూర్తి యగు బ్రహ్మము లక్షిత మగును); ప్రత్యక్కు (సర్వజీవులలో విరాజిల్లునట్టిది), ప్రశాంతము (క్షోభశూన్యము), (దీనిద్వారా అద్వయజ్ఞానము యొక్క ద్వితీయస్ఫూర్తి యగు పరమాత్మ లక్షిత మగును); అజ్ఞానము యొక్క సంపూర్ణ స్ఫూర్తియె భగవానుడు. కవు లాయననె వాసు దేవు డనిచెప్పుచున్నారు. (ఆయనయె బ్రహ్మమునకు ప్రతిష్ఠ, ఆశ్రయము, పరమాత్మకు అంశి, భక్తుల కుపాస్య వస్తువు నైయున్నాడు).

రహూగణైతత్తపసా న యాతి
న చేజ్యయా నిర్వపణాద్గృహాద్వా ।
న ఛన్దసా నైవ జలాగ్నిసూర్యై
ర్వినా మహత్పాదరజోఽభిషేకమ్ ॥ 12

రహూగణ రాజా! మహాభాగవతపదరేణువుల యభిషేకము లేనిదే బ్రహ్మచర్యము, గార్హస్త్యము, వానప్రస్థము, సన్న్యాసము లేదా జలాగ్ని సూర్యాదిదేవతోపాసన మున్నగు వానిద్వారా భగవత్తత్త్వజ్ఞానము లభింపదు.

యత్రోత్తమః శ్లోకగుణానువాదః
ప్రస్తూయతే గ్రామ్యకథావిఘాతః ।
నిషేవ్యమాణోఽనుదినం ముముక్షో
ర్మతిం సతీం యచ్ఛతి వాసుదేవే ॥ 13

మహాభాగవతులసభలో విషయవార్తాప్రసంగవాశనము, భగవద్గుణాను కీర్తనము ప్రకృష్టరూపముగ జరుగును. వారి ముఖవివరములనుండి వెలువడు వాకథలను ఆదరముతో వినుచున్నచో ముముక్షువుల మోక్షవాసన వశించి వాసుదేవునియందు శుద్ధ మగురతి (ప్రేమ) ఉదయించును.

అహం పురా భరతో నామ రాజా
విముక్తదృష్టశ్రుతసఙ్గబన్ధః ।
ఆరాధనం భగవత ఈహమానో
మృగోఽభవం మృగసఙ్గాద్ధతార్థః ॥ 14

నేను పూర్వమున భరతు డను రాజు నైయుంటిని. దృష్టశ్రుతివిషయము లయం దాసక్తి యనుబంధనముల నుండి ముక్తుడనై భగవదారాధన మొనరించితిని. దైవవశమున ఒక మృగశిశువునం దాసక్తుడ నై యుండుటచే నాయుద్దేశ్యము విఫల మయ్యెను. నేను మృగరూపమున జన్మించితిని.

సా మాం స్మృతిర్మృగదేహేఽపి వీర
కృష్ణార్చన ప్రభవా నో జహాతి ।
అథో అహం జనసఙ్గాదసఙ్గో
విశఙ్కమానోఽవివృతశ్చరామి ॥ 15

వీరుడా! శ్రీహరియర్చనాప్రభావముచే ఆమృగశరీరము నందును నాపూర్వస్మృతి నన్ను విడువలేదు. దానివలన నేను జనసాంగత్యమునకు భీతుడ నై ఏకాకిగ, ప్రచ్ఛన్నముగ సంచరించు చున్నాను.

తస్మాన్నరోఽసఙ్గసుసఙ్గజాత
జ్ఞానాసినైవేహ వివృక్ణమోహః ।
హరిం తదీహాకథనశ్రుతాభ్యాం
లబ్ధస్మృతిర్యాత్యతిపారమధ్వనః ॥ 16

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్దే బ్రాహ్మణరహూగణసంవాదే
ద్వాదశోఽధ్యాయః ॥

మానవు డీ జన్మమందే పరమభాగవతల సాంగత్యము వలన గలిగిన జ్ఞాన మను ఖడ్గము ద్వారా అజ్ఞానమును ఛేదించి భగవద్గుణ కర్మాదిలీలలను శ్రవణ కీర్తనముల జేసి వానిస్మృతిని పొంది, సంసారమార్గము యొక్క ఆవలి యొడ్డునకు చేరును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
బ్రాహ్మణరహూగణ సంవాదమున పండ్రెండవ అధ్యాయము
సంపూర్ణము.





# పదుమూడవ అధ్యాయము

## భవాటవివర్ణనము : రహూగణరాజ సంశయనివారణము

కథాసారము :- ఈయధ్యాయమున వైరాగ్య దృఢత్వమువకై భరతమహర్షి భవాటవివి వర్ణించుట యను విషయము వర్ణింపబడినది.

భరతుడు రహూగణరాజుతో నిట్లుపలికెను :- 'ఈసంసారారణ్యము మిగుల దుస్తర మైనది. జీవుడు మాయావశమున దానియందు బద్ధుడై కర్మఫలము ననుభవించును. ఈయరణ్యమున షడింద్రియము లనుదస్యులు, పుత్రకళత్రాదులు మాంస శోణితములను భుజించు శృగాలకుక్కురములవంటివారు. వారే జీవునిధనమును, మనస్సును హరింతురు. దానివలన కామ్య కర్మమయ మగుగృహము తృణాచ్ఛాదిత మగుగుంటవలె సర్వనాశమునకు హేతు వగును. దానినానావిధ ప్రలోభములచే జీవుడు ముగ్ధుడై విపన్నుడగును. అనిత్యము లగు ధనజనాదులయం దాత్మబుద్ధి నుంచి నిత్యవస్తువు నందు లక్ష్య ముంచడు. ఈయరణ్యమున సంచరించు పథవిస్మృతు డగుజీవుడు క్రూర మృగపక్షులవంటి దుర్జనుల ద్వారా నానావిధములుగ పీడితు డగును. వివిధము లగునాకాంక్షలవలన అటునిటు పరుగిడుచు వృథాక్లేశముల ననుభవించును. ఒకప్పుడు క్షణకాల ముండు సుఖములచే సుఖి యగును. ఒకప్పుడు దారుణము లగుదుఃఖములయందు మగ్నుడగును. ఒకప్పుడు దురాశ వలన దుష్కర కర్మములయందు రతుడై వివిధ భావములచే అశాంతినే అనుభవించును. ఒకప్పుడు నిద్ర యనుసర్పవిషముచే విగతసంజ్ఞుడై శవమువలె పడి యుండును. ఒకప్పు డజ్ఞానమనునంధకూపమున పడి కింకర్తవ్యతామూఢు డగును. అచట కొందఱు పర దారాది రూపమధు లోభముచే అన్యాయపూర్వకముగ ఇతరుల యధికారములోనికి వెడలి నానావిధ దుఃఖముల ననుభవించు చుందురు. రోగము, శోకము, శీతము, గ్రీష్మము మున్నగు వానియందు, పరస్పరము దైవందినము లైన ఆదానప్రదానాది వ్యవహారములయందు బహువిధము లగు అసుఖములను, అసౌకర్యము లను సహించును. ఇ ట్లీ సంసారారణ్యమున తిరుగుచు జీవుడు కేవలము తాపమునే పొందును. ఒకయాధారమును వదలి మఱియొక క్రొత్త యాధారమును పట్టుకొని, ఒకచోట హతాశుడై ఇతరుల ఆశ్రయములో నుండి వ్యర్థసుఖముల గోరును. ఇట్టి యవస్థయం దీ మాయాబద్ధజీవుడు ఈసంసారమును తరించి భగవానుని పరమ పదమును ఎప్పుడును పొంద జాలడు. అనిత్యము లగు ఆ ధనజన విషయములందే మత్తుడై మృత్యు విషయమును మరచి పోవును. బహువిధ దుఃఖములను సహించియు కేవలము ప్రవృత్తి మార్గమునందే తిరుగును గాని భగవాను నెఱుంగ జాలడు.

రహూగణరాజు యొక్క అవస్థగూడ నే డిట్లేయుండెను. భరతుని ఈనిగూఢతత్త్వోపదేశముచే రాజునకు చైతన్యము కలిగెను. అత డిట్లు పలికెను :- "మాయాబద్ధ జీవుడు నీవంటి సాధువుల సాంగత్యము వలననే నిర్మలు డగును. నేనుగూడ నీ సాంగత్యము చేత కృతార్థుడ నైతిని. నామోహము నశించెను." పిమ్మట అతడు వానిని తనయపరాధమును క్షమింపవలసినదిగా కోరెను.

శుకుడు పరీక్షిన్మహారాజునకు భరతుడు చెప్పిన భవాటవిని వర్ణించెను. పరీక్షిత్తు దానిసరళార్థమును తెలిసికొనుటకై శుకదేవుని ప్రార్థించెను.

## శ్రీ బ్రాహ్మణ ఉవాచ

దురత్యయేఽధ్వన్యజయా నివేశితో
రజస్తమస్సత్త్వవిభక్తకర్మదృక్ ।
స ఏష సార్థోఽర్థ పరః పరిభ్రమన్
భవాటవీం యాతి న శర్మ విన్దతే ॥ 1

భరతుడు పలికెను : రాజా! ఈ సంసారమార్గ మతిదుస్తరము. జీవులు భగవానుని మాయచే దానియం దభినివిష్టులై సత్త్వరజస్తమోగుణము లచే విభక్తము లైన శుభాశుభ మిశ్రకర్మలనె కర్తవ్య మనిభావింతురు. ధర్మార్థకామములయం దాసక్తులై వణిజునివలె సుఖాశతో నలువైపుల తిరుగుచు భవాటవిని పొందుచుందురు. (కర్మఫలమును పొందుదురు). కాని సుఖమును పొందజాలరు.

యస్యామిమే షణ్నర దేవ దస్యవః
సార్థం విలుంపన్తి కునాయకం బలాత్ ।
గోమాయవో యత్ర హర న్తి సార్థికం
ప్రమత్తమావిశ్య యథోరణం వృకాః ॥ 2

రహూగణా! ఈ సంసారాటవియందు ఆఱుగురుదస్యులు గలరు. ఆ వణిజునిసారథి సత్పథము నుండి తొలగుట చూచి వారు వానిసంపదలను హరింతురు. (అనగా కుబుద్ధి విశిష్టులగు మానవులు సంపాదించిన ధనము ద్వారా భగవానుని సేవింపక యింద్రియములను తృప్తిపఱచు కొందురు.) ఇంకను తోడేళ్ళు మేకను హరించునట్లు భవాటవియందు శృగాలములవంటి పుత్ర కళత్రాదులు 'నీవు నాతండ్రివి, నీవు నాభర్తవు,' అనుభావముతో ఆవణిజుని గృహసదృశ మైన అంతఃకరణములో ప్రవేశించి, వాని చిత్తమును హరింతురు.

ప్రభూతవీరుత్తృణగుల్మగహ్వరే
కఠోరదంశైర్మశకైరుపద్రుతః ।
క్వచిత్తు గన్ధర్వపురం ప్రపశ్యతి
క్వచిత్క్వచిచ్చాశురయోల్ముకగ్రహమ్ ॥ 3

ఈవనమున అసంఖ్యతృణగుల్మలతాదులచే ఆచ్ఛన్న మగుగహ్వరము లున్నవి (అనగా కామ్యకర్మాదులద్వారా పరిపూర్ణ మగుగృహస్థాశ్రమ మున్నది). వణిజులవలె జీవు డచట దోమలవంటిదుర్జనుల ఉపద్రవములచే మిగుల పీడితు డగును. ఒకప్పుడు గంధర్వపురము వంటి దేహగేహాద్యనిత్యవస్తువులనె నిత్య మనిభావించును. ఒకప్పుడు మహావేగ వంతము, ఉల్కాకారము నగుపిశాచము (కొఱవిదయ్యము) తో సమాన మైన సువర్ణమునె ఉపాదేయ వస్తువుగ భావించును.

నివాసతోయద్రవిణాత్మబుద్ధి
స్తతస్తతో ధావతి భో అటవ్యామ్ ।
క్వచిచ్చ వాత్యోత్థితపాంసుధూమ్రా
దిశో న జనాతి రజస్వలాక్షః ॥ 4

రాజా ! గృహధనజల (జన) ములు మున్నగువానియందు ఆత్మ బుద్ధి నుంచి ఆ వణిజుడు ఆ భవాటయం దిటునటు పరుగిడుచుండును. ఒక చోట వానిచక్షువులు రజఃకణములచే వ్యాప్త మగుటవలన, చక్రవాతము (సుడిగాలి) చే నెగసిన ధూళిజాల మంతట వ్యాప్త మగుటవలన అతడు దిఙ్మండలమును తెలిసికొనజాలడు (అనగా స్త్రీ చక్రవాతము వంటిది, దాని నుండి బయల్వెడలిన పాంసురాశివంటి కందర్ప (మన్మథ) వేగముచే చిత్తమాక్రాంతము కాగా కామాంధు డగువ్యక్తి యేమియు నెఱుగజాలడు).

అదృశ్యఝిల్లీస్వనకర్ణశూల
ఉలూకవాగ్భిర్వ్యథితాన్తరాత్మా ।
అపుణ్యవృక్షాన్ శ్రయతే క్షుధార్దితో
మరీచితో యాన్యభిధావతి క్వచిత్ ॥ 5

ఒకచోట అట్టి కీచురాయి యొక్క కఠోర ధ్వనిచే చెవికి బాధ కలుగును. (అనగా దుర్జనుల పరోక్ష కటువాక్కుల ద్వారా వానికర్ణము బాధింపబడును). ఒకచోట గుడ్లగూబల కర్కశకంఠముచే వానియంతరాత్మ వ్యథిత మగును. (అనగా దుశ్శీలురు సాక్షాత్తుగా పలికిన అప్రియము లైనభాషణములచే వానికి మానసిక బాధ కలుగును). ఇంకను

ఒకచోట ఆ వణిజుడు క్షుధార్తుడై అధర్మవృక్షము నాశ్రయించును (అనగా జీవుడు భిక్షకై అధార్మికు లైన జనులను సేవించును). ఒకప్పుడు ఎండమావులయందు నీరు త్రాగు నాశతో దానివైపు పరుగిడును. (అనగా దరిద్రున కన్నాదుల నిడనిలోభి కడకు వెడలి యాచించిన క్లేశము మాత్రమే లభించును గాని భిక్ష యేమాత్రమును లభింపదు.)

క్వచిద్వితోయాః సరితోఽభియాతి
పరస్పరం వాలషతే నిరన్ధః ।
ఆసాద్య దావం క్వచిదగ్నితప్తో
నిర్విద్యతే క్వ చ యక్షైర్హృతాసుః ॥ 6

ఒకప్పుడు జలశూన్య మైన నదివైపునకు పరుగిడి దుఃఖమును పొందును (అనగా నీరు లేనినదిలో పడిన శరీరమునకు దెబ్బలు తగులుట యను కష్టమే మిగులునుగాని నీరు దొరకదు. అట్లే సంసారజీవుడు సుఖమునకై ఇహపర కాలములయందు దుఃఖప్రదము లగుపాషండమతముల నాశ్రయించును, వానివలన దుఃఖముతప్ప సుఖము కలుగదు). ఒకప్పుడు అన్నము లేనపుడు దాయాదులను యాచించును, ఇంకను ఒకప్పుడు దావాగ్నివంటి గృహమును పొంది శోకానలముచే సంతప్తుడు, విషణ్ణుడు నగును. ఒకప్పుడు యక్షులవంటి రాజులు ప్రాణములతో సమాన మైనవాని ధనము నపహరింతురు. అప్పు డతడా దుఃఖముచే మరణించువా డగును.

శూరైర్హృతస్వః క్వ చ నిర్విణ్ణచేతాః
శోచన్ విముహ్యన్నుపయాతి కశ్మలమ్ ।
క్వచిచ్చ గన్ధర్వపురం ప్రవిష్టః
ప్రమోదతే నిర్వృతవన్ముహూర్తమ్ ॥ 7

ఒకచోట బలవంతు డగువ్యక్తి వాని సర్వస్వమును హరించును. అప్పు డతడు మిగుల విషాదగ్రస్తు డగును, వానియన్నింటికై దుఃఖించుచు మూర్ఛితు డగును. ఒకచోట గంధర్వపురమువంటి పితృపుత్రాది సమాజమున ప్రవేశించి పరమశాంతిని పొందినవానివలె క్షణకాలము సుఖము ననుభవించును.

చలన్ క్వచిత్కణ్టకశర్కరాఙ్ఘ్రి –
ర్నగాన్ రురుక్షుర్విమనా ఇవాస్తే ।
పదే పదేఽభ్యన్తరవహ్నినార్దితః
కౌటుమ్బికః క్రుధ్యతి వై జనాయ ॥ 8

ఒకచోట పర్వతము నధిరోహింపదలచి వెడలుచుండును, అప్పుడు పాదుకాదులు లేకపోవుటచే వాని పాదములు ముండ్లు, రాళ్ళు మున్నగువానిచే బాధ చెందును. (అనగా జీవుడొకప్పుడు పర్వతారోహణము వలె శాస్త్రోదితము లైన, దుష్కరములైన కర్మముల ననుష్ఠింప దలంచును, కాని సహాయ సంపదలు లేకపోవుటచే ఆ కర్మానుష్ఠానమున బహు విఘ్నము లెదురగును. అపు డతడు 'నే నెట్లు ఈకార్యముల సాధింతు' ననుచింతచే వ్యాకులత చెంది ఎల్లప్పుడు అన్యమనస్కుడగును) ఒకప్పుడు కుటుంబమునం దాసక్తుడగు వ్యక్తి జఠరానలముచే పీడితు డై అనుక్షణము భార్యాపుత్రాదులపై కోపము చూపుచుండును.

క్వచిన్నిగీర్ణోఽజగరాహిణా జనో
నావైతి కించిద్విపినేఽపవిద్ధః ।
దష్టః స్మ శేతే క్వ చ దన్దశూకై -
రన్ధోఽన్ధకూపే పతితస్తమిస్రే ॥ 9

ఒకప్పు డజగర మావ్యక్తిని కాటువేసి చంపును. అప్పుడు వాడు వనములో విడువబడిన శవమువలె పడి యుండును. ఏమియు తెలిసికొన జాలడు. (అనగా అజగరసర్పమువలె నిద్రచే అభిభూతు డై మానవుడు సుఖదుఃఖాదులను వేనినిగూడ (అనుభవింపజాలడు). ఒకప్పుడు క్రూర జంతువులు వానిని అనేకవిధముల కఱచును. (అనగా దుర్జనులు నానావిధ బాధలను కలుగజేయుదురు). అప్పు డతడు వివేకరహితు డై గాఢతమస్సుచే ఆవృత మగుకూపమున బడును. అనగా దుఃఖాదులతో గూడిన మాయా మోహమున నిమగ్ను డై యుండును.

కర్హి స్మ చిత్ క్షుద్రరసాన్ విచిన్వం -
స్తన్మక్షికాభిర్వ్యథితో విమానః ।
తత్రాతికృచ్ఛ్రం ప్రతిలబ్ధమానో
బలాద్విలుమ్పన్త్యథ తాంస్తతోఽన్యే ॥ 10

అత డొకచోట కొలదిగ మధువును (పరదారలను) అన్వేషించుచు అచట తేనెటీగలచే కుట్టబడినవాడై (అనగా ఆస్త్రీల భర్తలచేత, అత్తమామ లైన బంధువులచేత కొట్టబడినవాడై) యాతనల ననుభవించును. ధనాదులను వ్యయ మొనర్చి బహుకష్టములతో కొలదిగ మధువును (పరస్త్రీసంభోగమును) పొందును. వానినుండి యితరు లామధువు నపహరింతురు. అతడు భోగముల ననుభవింపజాలడు.

క్వచిచ్చశీతాతపవాతవర్ష -
ప్రతిక్రియాం కర్తుమనీశ ఆస్తే ।
క్వచిన్మిథో విపణన్ యచ్చ కించి -
ద్విద్వేషమృచ్ఛత్యుత విత్తశాఠ్యాత్ ॥ 11

ఒకచోట శీతము, గ్రీష్మము, వాయువు, వర్షము మున్నగువానికి ప్రతీకారము చేయ జాలనివా డై దుఃఖితునివలె నుండును. ఒకచోట పరస్పరము క్రయవిక్రయాదుల నొనరించుచు స్వల్పముగ ధనమును అపహరించుచు ధనవంచనమువలన విద్వేషమును పొందును.

క్వచిత్క్వచిత్ క్షీణధనస్తు తస్మిన్
శయ్యాసనస్థానవిహారహీనః ।
యాచన్పరాదప్రతిలబ్ధకామః
పారక్యదృష్టిర్లభతేఽవమానమ్ ॥ 12

ఈ భవాటవియం దొకచోట ధనహీను డగువ్యక్తి శయ్య, ఆసనము, స్థానము (గృహాదులు), విహారసాధనములు లేకపోవుటచే ఇతరులను యాచించును. కాని తనవాంఛ నెఱవేఱనప్పుడు పరుల ధనము నపహరింపదలచును. దానివలన అవమానముల పాలగును.

అన్యోన్యవిత్తవ్యతిషఙ్గవృద్ధ -
వైరానుబన్ధో వివహన్ మిథశ్చ
అధ్వన్యముష్మిన్నురుకృచ్ఛ్రవిత్త -
బాధోపసర్గైర్విహరన్ విపన్నః ॥ 13

కొందఱు పరస్పరము ధనవినిమయాదులచే శత్రుత్వమును వృద్ధి పఱచుదురు. కొందఱు పరస్పరము వివాహాది విషయముల యందు సంబంధమును పెట్టుకొని ఈభవాటవియందు తిరుగుచుందురు. కఠోరపరిశ్రమ, ధనవ్యయము, భోగములు మున్నగువానిచే సంకటముల పాలగుదురు.

తాంస్తాన్ విపన్నాన్ స హి తత్ర తత్ర
విహాయ జాతం పరిగృహ్య సార్థః ।
ఆవర్తతేఽద్యాపి న కశ్చిదత్ర
వీరాధ్వనః పారముపైతి యోగమ్ ॥ 14

వీరుడా! జనులును మరణించినపిత్రాదులను పరిత్యజించి, నవజాత పుత్రాదులను గ్రహించి ఈభవాటవియందు సంచరింతురు. ఇట్లే సమర్థుడైన పురుషుడు గూడ భగవద్భక్తి సాధనమును, సంసారాతీతు డగు శ్రీహరిని వేటివఱకును పొందలేక పోయెను.

**మనస్వినో నిర్జితదిగ్గజేన్ద్రా**
**మమేతి సర్వే భువి బద్ధవైరాః ।**
**మృధే శయీరన్ న తు తద్వ్రజన్తి**
**యన్న్యస్తదణ్డో గతవైరోఽభియాతి ॥ 15**

బలవంతు లగువ్యక్తులు దిగ్గజములను జయించి 'ఈ భూమి నాది' యని అహంకరించి పరస్పరము శత్రుత్వమును వహించి యుద్ధమున ప్రాణములను త్యజింతురు. అందువలన నిర్వైరులగు సన్న్యాసులు పొందు పరమపదమును వారు పొందజాలరు.

**ప్రసజ్జతి క్వాపి లతాభుజాశ్రయ -**
**స్తదాశ్రయావ్యక్తపదద్విజస్పృహః ।**
**క్వచిత్కదాచిద్ధరిచక్రత స్త్రసన్**
**సఖ్యం విధత్తే బకకఙ్కగృధ్రైః ॥ 16**

ఒకప్పుడు లతలయొక్క కొమ్మల నాశ్రయించి, వాని పైనున్న పక్షుల అవ్యక్త మైనకలరవములను వినగోరును (అనగా స్త్రీ సాంగత్యమును, ఆ స్త్రీలవాక్కులను వినుట మున్నగు సుఖముల ననుభవించుచు పుత్ర ముఖమును దర్శింప నభిలషించును). ఒకప్పుడు అతడు సింహభయముచే భీతు డై కంకగృధ్రబకాదులతో సఖ్యము చేయును. (అనగా కాలచక్ర భయముచే భీతు డై వంచకులుకు బుద్ధి విశిష్టులు నగుపాషండులతో కలియును.)

**తైర్వంచితో హంసకులం సమావిశ -**
**న్నరోచయన్ శీలముపైతి వానరాన్ ।**
**తజ్జాతిరాసేన సునిర్వృతేన్ద్రియః**
**పరస్పరోద్వీక్షణవిస్మృతావధిః ॥ 17**

ఇంకను వారిచే వంచితు డై అతడు హంసకులమున ప్రవిష్టు డగును. (అనగా పాషండుల నాశ్రయించుటచే మంచి ఫలము కలుగ దని భావించి అతడు బ్రాహ్మణ కులమున మరల ప్రవేశించును). కాని వానికి వారియాచరణము గూడ అభీప్సితము కాకపోవుటచే అతడు వానరముల కడకు వెడలి తజ్జాతీయ మగుక్రీడద్వారా. తన

యింద్రియములను తృప్తిపఱచు కొనును. పరస్పరము ముఖావలోకనాదివిషయములచే మోహితుడై మరణకాలమును మఱచును. (అనగా బ్రాహ్మణుల విధి వ్యవస్థగూడ వాని కిష్టము కాకపోవుటచే అతడు చివరకు వానరులవంటి భ్రష్టాచారులు, శూద్రప్రాయులు నగుజనులతో కలియును. వారియభిప్రాయము విషయవ్యవహారముచే వ్యాపృత మగుటవలన సుఖము ననుభవించి మరణ విషయమును మఱచును).

ద్రుమేషు రంస్యన్ సుతదారవత్సలో
వ్యవాయదీనో వివశః స్వబన్ధనే ।
క్వచిత్ప్రమాదాద్గిరికన్దరే పతన్
వల్లీం గృహీత్వా గజభీత ఆస్థితః ॥ 18

వృక్షములవంటి దృష్టార్థవిషయములయందు అనగా గృహమున రమించుచు సంభోగేచ్ఛ వలన స్త్రీపాదతాడితుడు, స్వబంధనముచే వివశుడు అనగా దానిని విడచుట కసమర్థుడు నగును. ఒకచోట కొండగుహవలె మిగుల భయానక మగు రోగమున పతితుడగును. అచటనున్న ఏనుగుతో సమానమైన మృత్యువు యొక్క భయముచే లతవంటి ప్రాక్తనకర్మ నవలంబించి యుండును.

అతః కథంచిత్ స విముక్త ఆపదః
పునశ్చ సార్థం ప్రవిశత్యరిన్దమ ।
అధ్వన్యముష్మిన్నజయా నివేశితో
భ్రమన్ జనోఽద్యాపి న వేద కశ్చన ॥ 19

శత్రుదమనా! ఆపురుషుడు విపత్తుల నుండి చాలకష్టముతో బయట పడి పూర్వము వలె ప్రవృత్తిమార్గమునందే ప్రవిష్టుడగును. ఇట్లు భగవన్మాయద్వారా ప్రవృత్తిమార్గమున ప్రవిష్టు లైనవ్యక్తు లీ భవాటవియందు సంచరించు చుందురు. వారిలో నెవ్వడును నేటికిని భగవానుని తెలిసికొన జాలకపోయెను.

రహూగణ త్వమపి హ్యధ్వనోఽస్య
సన్న్యస్తదణ్డః కృతభూతమైత్రః ।
అసజ్జితాత్మాహరిసేవయా శితం
జ్ఞానాసిమాదాయ తరాతిపారమ్ ॥ 20

రహూగణరాజా ! నీవుగూడ మాయద్వారా ఈప్రవృత్తి మార్గము నందే ప్రవేశించి యున్నావు. ఇపుడు నీవు శిక్షించుట మున్నగు రాజవ్యవహారములను త్యజించి సర్వప్రాణుల

యందును మైత్రిని జూపుము. విషయాసక్తిని వదలి హరిసేవ ద్వారా పదును పెట్టబడిన జ్ఞాన మనుఖడ్గము యొక్క సాహాయ్యముచే మాయాపాశమును ఛేదించి సంసార మార్గమును తరించుము.

## శ్రీ రాజోవాచ

అహో నృజన్మాఖిలజన్మశోభనం
కిం జన్మభిస్త్వపరైరప్యముష్మిన్ ।
న యద్ధృషీ కేశయశః కృతాత్మనాం
మహాత్మనాం వః ప్రచురః సమాగమః ॥ 21

రహూగణ రాజు పలికెను : ఆహా ! ఈమానవజన్మ మెంతటి ఉత్కృష్టమైనది? స్వర్గమందలి దేవతల పుట్టుక గూడ దీనికంటె శ్రేష్ఠమైనది కాదు. స్వర్గమున దేవతారూపమున జన్మించిన ఏమిఫలము కలుగును? అచట హృషీకేశ భగవానుని యశస్సును కీర్తించుటచేత నిర్మల మైనచిత్తము గల నీవంటి మహాత్ముల సాంగత్యము లభింపదు గదా !

న హ్యద్భుతం త్వచ్చరణాబ్జరేణుభి -
ర్హతాంహసో భక్తిరధోక్షజేఽమలా ।
మౌహూర్తికాద్యస్య సమాగమాచ్చ మే
దుస్తర్కమూలోఽపహతోఽవివేకః ॥ 22

నీచరణధూళి లభించినంత మాత్రముననే జీవుడు పాపరహితుడై బ్రహ్మాదులకు గూడ దుర్లభ మగుశుద్ధభక్తిని పొందగలడు. ఇందులో నెట్టి విచిత్రమును లేదు. క్షణకాలము నీ సాంగత్యము వలన నాకు తర్కమునకు మూలకారణ మగుఅవివేకము అనగా సంసార మోహము నశించినది.

నమో మహద్భ్యోఽస్తు నమః శిశుభ్యో
నమో యువభ్యో నమ ఆ వటుభ్యః ।
యే బ్రాహ్మణా గామవధూతలిఙ్గా -
శ్చరన్తి తేభ్యః శివమస్తు రాజ్ఞామ్ ॥ 23

('అయ్యో! నిన్ను శిబికావాహకునిగ జేసి నేను మహాపరాధ మొనర్చితిని. నీవు స్వయముగ ఈ విషయమును తెలియజేయనిచో మావంటి యపరాధుల గతి యేమగు' ననియాలోచించి రహూగణరా జిట్లు పలికెను.) మహాత్ములకు, బాలకులకు, యువకులకు, క్రీడారతు లగు విప్రబాలకులకు, అవధూత వేషముతో పుడమిపై సంచరించు బ్రహ్మవేత్త

లగు బ్రాహ్మణులకు నానమస్కారములు. వారి కృపచే మావంటి యపరాధు లైన రాజులకు శుభము కలుగుగాక !

## శ్రీ శుక ఉవాచ

**ఇత్యేవముత్తరామాతః స వై బ్రహ్మర్షిసూతః సిన్ధుపతయ ఆత్మసతత్త్వం విగణ యతః పరానుభావః పరమకారుణికతయోపదిశ్య రహూగణేన సకరుణ మభివన్దిత చరణః పూర్ణార్ణవ ఇవ నిభృతకరణోర్మ్యా శయో ధరణి మిమాం విచచార ॥ 24**

శుకుడు పలికెను : ఉత్తర కుమారుడ వగు పరీక్షిన్మహారాజా! మహానుభావు డగు భరతుని మనస్సులో ఇంద్రియ తరంగముల వేగము శాంతించుటచే ఆయన యంతః కరణము పూర్ణసముద్రము వలె ప్రశాంతముగ నుండెను. సింధుసౌవీర దేశాధిపతి యగు రహూగణరాజు వాని నవమానించినను అతడు (భరతుడు) మిగుల దయగలవా డై రహూగణున కాత్మ తత్త్వము నుపదేశించెను. పిమ్మట రహూగణరాజు దైన్యముతో వాని చరణములకు నమస్కరించెను. అతడు వెనుకటి వలెనే పుడమిపై పర్యటింప సాగెను.

**సౌవీరపతిరపి సుజనసమవగత పరమాత్మ సతత్త్వ ఆత్మన్య విద్యాధ్యా రోపితాం చ దేహాత్మమతిం విససర్జ ఏవం హి నృప భగవదా శ్రితా శ్రితాను భావః ॥ 25**

సౌవీరదేశాధిపతి యగురహూగణరాజు పరమభాగవతు డగుభరతుని వలన పరమాత్మతత్త్వమును చక్కగ నెఱింగి అవిద్యాకల్పిత మగు దేహమునం దాత్మబుద్ధిని పరిత్యజించెను. రాజా ! భగవదాశ్రితు డగు భక్తుని చరణముల నాశ్రయించిన మహిమ వలననే జీవుల దేహాభిమానము వినష్టమగును.

## శ్రీ రాజోవాచ

**యో హ వా ఇహ బహువిదా మహాభాగవత త్వయాభి హితః పరోక్షేణ వచసా జీవలోకభవాధ్వా స హ్యార్యమనీషయా కల్పిత విషయో నాంజసా వ్యుత్పన్న లోకసమధిగమః. అథ తదేవైతద్దురధిగమం సమవేతానుకల్పేన నిర్దిశ్యతామితి ॥ 26**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే బ్రాహ్మణరహూగణసంవాదే
త్రయోదశోఽధ్యాయః ॥

పరీక్షిన్మహారాజు పలికెను : భాగవత శ్రేష్ఠా! నీవు సర్వజ్ఞుడవు, వణిజుని ఉదాహరణముగ రూపకవాక్యముల ద్వారా జీవుల సంసార మార్గమును కీర్తించితివి, దానివలన వివేకులు తమబుద్ధి బలముతో ఇంద్రియములను దొంగలవలెను, పుత్రకళత్రాదులను శృగాలాదుల వలెను తెలిసికొందురు. కాని యట్టి జ్ఞాన ముదయించుట శక్తిరహితుడు, అవ్యుత్పన్నుడు నగుమానవుని పక్షమున సహజము కాదు. ఇది మిగుల దుర్బోధ మైనది, అందువలన నీవు (వారిహితార్థమై) దీని ప్రకృతార్థమును వివరముగ చెప్పవలసినది.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
బ్రాహ్మణరహూగణ సంవాదమున పదుమూడవ అధ్యాయము
సంపూర్ణము.





# పదునాలుగవ అధ్యాయము

## భవాటవి వివరణము

కథాసారము :- ఈయధ్యాయమున రూపకభావముతో వర్ణితమైన భవాటవి యొక్క ప్రకృతార్థము చెప్పబడినది.

వణిజులు ధనసంపాదనార్థమై దుర్గమము లగుమార్గము లలో పయనించుచు ఘోరతర మగుకాననములలోనికి వెడలుదురు. అట్లే జీవుడు గూడ ప్రవృత్తిమార్గమున పయనించుచు భవాటవిని పొందును. శుభాశుభ కర్మఫలానుసారముగ దేవతిర్యగాది నానావిధ యోనులయందు సంచరించుచు సుఖదుఃఖాది కర్మఫలముల ననుభవించును. ఆత్యంతిక క్లేశనివృత్తి కుపాయ స్వరూప మగు భగవద్భక్తిని పొందజాలడు. పంచజ్ఞానేంద్రియములు, మనస్సు - ఈయాఱును సంసారానుభూతికి ద్వారము వంటివి. అవి దొంగలవలె ఇంద్రియ నిగ్రహుడు కాని వ్యక్తికి విషయభోగముల గలిగించి, భగవదారాధనా లక్షణ పరమధర్మ మను ధనమును హరించును. కుటుంబము తోడేళ్లవలె నక్కలవలె పురుష ప్రయత్నముచే సంరక్షింపబడు ద్రవ్యము నపహరించును. ఈ గృహస్థాశ్రమము కర్మక్షేత్ర స్వరూపము. దీనియందు కర్మబీజము పూర్తిగ నశింపదు. నీచవ్యక్తులు ఈగల దోమలవంటి వారు. దస్యులు (దొంగలు) ఎలుకల వంటివారు. వారు గృహాసక్తు డగువ్యక్తికి మిగుల కష్టములను గలుగజేసి వాని సంపదలను హరింతురు. అయినను అతడు అవిద్య వలన కామ్య కర్మములయం దాసక్తు డై గృహమును వదలడు. భగవత్పాద పద్మములను మరచి యింద్రియ సుఖములయందు రతు డగును. అసత్యవస్తువును సత్యముగా తలంచును. అప్పు డతడు తాత్కాలికము లగువింద్రియ సుఖములయందు ప్రమత్తుడై అసత్కార్యముల యందు రతు డగును వానికర్మలకు సూర్యచంద్రాది దేవతలు సాక్షిస్వరూపులుగ నుందురు. వాడుదానిని మోహాంధచక్షువులతో చూడలేడు. ఎప్పుడైన ఆ గృహాసక్తునకు క్షణిక వైరాగ్యము కలుగవచ్చును, కాని దేహమునం దభిమాన ముండుటచే వానియావైరాగ్యము నశించును. శత్రువులు చేయు దూషణము, రాజులు చేయు దూషణము గుడ్లగూబల యొక్క, కీచురాళ్ళ యొక్క ధ్వనులవలె మిగుల కఠోరముగ నుండును. దానివలన వారి (గృహాసక్తులగు మానవుల) యొక్క హృదయమునకు బాధ కలుగును. అసత్సాంగత్యము వలన జీవుని బుద్ధి భ్రష్టమగును. అప్పు డతడు పాషండమతమును ఆశ్రయించి ప్రస్తుత సమయములోను, అనంతర సమయములోను కష్టముల ననుభవించును. ఈ ప్రపంచమున ధనమునకై జీవుడు తనవారికి గూడ క్లేశములను గలిగించుటకు వెనుకాడడు. గృహము దావాగ్ని వంటిది, దీనిలో సుఖము స్వల్పముగ గూడ లేదు. రాక్షసుల వంటి రాజులు గృహవ్రతు డగువ్యక్తికి ప్రాణ తుల్యములు, ప్రియతమములు నగుధనాదుల నపహరింతురు. అప్పుడతడు జీవన్మృతుడై పడియుండును.

కర్మమార్గము పర్వతసదృశము. ఆ కర్మమార్గముల నన్నింటిని గడపదలచినది యై జీవుని చిత్తము తుచ్ఛము లగు కర్మలయం దాసక్తమగును. దానివలన వానికి సుఖము కలుగదు. కాని పర్వతారోహణమునకై ప్రయాసపడు వ్యక్తివలె అతడు కష్టములనే పొందును. ఒకప్పుడు గృహాసక్తు డగువ్యక్తి జఠరానలముచే పీడితు డై పుత్రునిపై పరివారముపై గోప మూనును.

నిద్ర అజగర మగుసర్పము వంటిది (కొండచిలువ వంటిది). అది జీవుని చేతన వృత్తిని గ్రసించును. సుఖదుఃఖాద్యనుభవమును చేయనీయదు. ఈభవాటవియందు జీవుడు ఇంద్రియ సుఖములకై పరధనాదుల నపహరించి కారాగారమున బద్ధుడగును. ఒకప్పుడు క్లేశనివారణమునకై యెక్కువగ చింతించు చుండును. ఒకప్పుడు ధనమును వినిమయము చేసి పరస్పరము శత్రుత్వమును పూనియుండును.

ఈసంసారము సుఖదుఃఖములతోను రాగద్వేషాదుల తోను నిండియుండును, కేవలము క్లేశమయ మైయుండును. స్త్రీసాంగత్యము వలన జీవుని బుద్ధి నష్టమైనచో వాని హృదయము స్త్రీకి విలాసభవన మగును.

కాల మను విష్ణుచక్రము బ్రహ్మాది స్తంబపర్యంతము గల సర్వజీవుల ఆయువును హరించును. దానినుండి బయటపడు నాశతో పాషండశాస్త్రముల నాశ్రయించువారికి శుభము కలుగదు. ఏలయన, పాషండులు స్వయముగ వంచితులు. వారు అన్యుల నెట్లు కాపాడగలరు? పాషండులు బ్రాహ్మణవంశాచారములను గౌరవింపరు. వారు విధవావివాహాది నిషిద్ధాచారములయందు నిమగ్నులై వానరజాతివలె కేవలము కుటుంబ పోషణమున లగ్నులై ఉందురు. శుకదేవుడు పరీక్షిన్మహారాజుతో ఇట్లు భవాటవి విషయమును విస్తృతముగ వివరించి చెప్పెను.

## స హోవాచ

**స ఏష దేహాత్మమానినాం సత్త్వాదిగుణవిశేషకల్పిత కుశలాకుశల సమవహార వినిర్మితవివిధదేహావలిభిర్వియోగ సంయోగాద్యనాది సంసారాను భవస్య ద్వారభూతేన షడింద్రియ వర్గేణ తస్మిన్ దుర్గాధ్వవదసుగమేఽధ్వన్యా పతిత ఈశ్వరస్య భగవతో విష్ణోర్వశవర్తిన్యా మాయయా జీవలోకోఽయం యథా వణిక్సార్థోఽర్థపరః స్వదేహ నిష్పాదిత కర్మానుభవః శ్మశానవదశివతమాయాం సంసారాటవ్యాం గతో నాద్యాపి విఫలబహుప్రతియోగేహస్తత్తాపో పశమనీం హరిగురుచరణారవిన్దమధుకరాను పదవీమవరున్ద్ధే ॥ 1**

పరీక్షిన్మహారాజు ఇట్లడుగగా పరమభాగవతు డగు శుకదేవుడు మిగుల సంతోషముతో చెప్ప నారంభించెను - 'మహారాజా! అర్థోపార్జనాపరు లగు వణిజులు ధనమునకై ముండ్లతో నిండిన దుర్గమమార్గమున పయనించుచు భయంకర మగువనములోనికి వెడలుదురు. అట్లే ఈ జీవులు మాయాధీశు డగు విష్ణుభగవానుని అధీనములో నున్నమాయ ద్వారా దుర్గమ మగు ప్రవృత్తిమార్గమున పయనించి ఈ భవాటవిని పొందుదురు. అందువలన వారు భగవదభిన్ను డైనగురుదేవుని పాదపద్మములను సేవించు సేవకులచే అనుష్ఠింపబడు భక్తిమార్గమున నేటివఅకును పొందలేకపోయిరి. దేహాత్మ బుద్ధివిశిష్టు లగువారు సత్త్వాదిగుణ విశేషముచే విభక్తమైన శుభాశుభములు, తదుభయ మిశ్రితములు నగుకర్మల ఫలముల ననుసరించి దేవతిర్యగాది బహువిధ దేహములను పొందుదురు. దానిద్వారమున సంయోగ వియోగములవలన కలిగిన సుఖదుఃఖాదిరూప మగు అనాది సంసారము ననుభవింతురు. పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు అనునీయాఱును సంసారానుభవమునకు ద్వార స్వరూపములు. వానిసాహాయ్యముచే జీవులు తమతమ దేహముల ద్వారా నిష్పాదిత మైన కర్మఫలముల ననుభవింతురు. మాయయొక్క అధీనములో నుండి వారు చేయు కర్మ లన్నియు నిష్ఫలములు లేదా బహువిఘ్నముల ద్వారా ప్రతిహతములు నగును. భగవదభిన్ను డగు గురుదేవుని పాదపద్మములను సేవించు మహాత్ముల పదవియే (భక్తియె) ఆధ్యాత్మికాది తాపత్రయములను వశింపజేయ కలదు. దానిని వారు పొందజాలరు.

**యస్యాముహ వా ఏతే షడింద్రియనామాన: కర్మణా దస్యవ ఏవ తే, తద్యథా పురుషస్య ధనం యత్కించద్ధర్మౌపయికం బహుకృచ్ఛ్రాధిగతం సాక్షాత్ పరమ పురుషారాధన లక్షణో యోఽసౌ ధర్మస్తన్తు సాంపరాయ ఉదా హరన్తి తద్ధర్మ్యం ధనం దర్శనస్పర్శన శ్రవణాస్వాదనావఘ్రాణ సంకల్ప సమవసాయగృహగ్రామ్యోపభోగేన కునాథస్యాజి తాత్మనో యథా సార్థస్య తథా విలుంపన్తి ॥ 2**

(ఇంద్రియములు దొంగలు అనువిషయము వివరింప బడుచున్నది) అసంయత చిత్తుడు, కుబుద్ధియు నగుమానవుడు బహుకష్టముచే సంపాదించిన ధర్మకారణ మైనధనమును ప్రసిద్ధు లగుచోరులు హరించుకొని పోవుదురు. అట్లే దొంగలవంటి యింద్రియములు తమతమ కర్మలు అనగా దర్శనము, స్పర్శనము, శ్రవణము, ఆస్వాదనము, ఆఘ్రాణము, వాసన, ప్రయత్నము అనువాని ద్వారా గృహోచితము లైన భోగముల ననుభవింపజేసి అజితేంద్రియుడు, కుబుద్ధియు నగువణిజుని (మానవుని) ధర్మ మనుధనమును అనగా పరమపురుషు డగుభగవానుని ఆరాధనలక్షణ మగుపారలౌకిక ధర్మ మను ధనమును అపహరింతురు.

**అథ చ యత్ర కౌటుంబికా దారాపత్యా దయో నామ్నా కర్మణా వృక శృగాలా ఏవానిచ్ఛతోఽ తికదర్యస్య కుటుంబివ ఉరణకవత్ సంరక్ష్యమాణం మిషతోఽపహరన్తి ॥ 3**

(రాజా !) ఈ సంసారమున కౌటుంబికులు పేరునకు మాత్రము భార్య బిడ్డలు. కాని పనికి తోడేళ్ళు నక్కలవంటివారు. తోడేళ్ళు పాలకులచే సంరక్షింపబడుచున్న మేకలను బలవంతముగ అపహరించును. అట్లే ఈదారాపుత్రులు మిగులలోభి యగు గృహస్థుచే ప్రయత్నపూర్వకముగ సంరక్షింప బడుధనమును వానియెదుటనే వాని కిష్టము లేకపోయినను అపహరింతురు.

**యథా హ్యనువత్సరం కృష్యమాణమప్యదగ్ధబీజం క్షేత్రం పునరేవావపన కాలే గుల్మతృణ వీరుద్భిర్గహ్వరమివ భవత్యేవమేవ గృహాశ్రమః కర్మక్షేత్రం యస్మిన్ న హి కర్మాణ్యుత్సీదన్తి యదయం కామకరణ్డ ఏష ఆవసథః ॥4**

ప్రతి సంవత్సరము కర్షకుడు కర్షణము (దున్నుట) మున్నగువాని ద్వారా గడ్డిమొక్కలను ఛేదించి పొలమును సరిచేయును. అయినను ఈ తృణాదుల బీజములు దగ్ధములు కావు. వపనకాలము (నాట్లు) పూర్తి యైన పిమ్మట పొలము మరల తృణగుల్మాదులద్వారా ఆచ్ఛన్న మై గహ్వరము (అడవి) వలె అగును. అట్లే యీ గృహస్థాశ్రమము కర్మక్షేత్రము వంటిది. దీనియందును కర్మ లొక్కమారే ఉత్పన్నములు కావు. ఏలయన, ఈ ఆశ్రమము కామ్యకర్మలకు భాండము వంటిది. కర్పూరభాండమున కర్పూరము లేకపోయినను దాని గంధము నశింపనట్లు వాసనాక్షయము కాకపోవుటచే కర్మలకు గూడ నాశము కలుగదు.

**తత్ర గతో దంశమశకసమాపసదైర్మనుజైః శలభ శకున్తతస్కర మూషి కాది భిరుప రుధ్యమానబహిః ప్రాణః క్వచిత్ పరివర్తమానోఽస్మిన్నధ్వన్య విద్యాకామకర్మభి రుపరక్త మనసానుపపన్నార్థం నరలోకం గన్ధర్వనగరము పపన్నమితి మిథ్యాదృష్టిరనుపశ్యతి ॥ 5**

ఒకప్పుడు గృహస్థాశ్రమమునందు రతు డగు మానవుని ఈగలు దోమలు వంటి నీచమానవులు, మిడతలు, పక్షులు, ఎలుకలు మున్నగువాని వంటి తస్కరులు మిగుల బాధించి వాని సంపదను హరింతురు. అయినను ఆత డీసంసారమార్గమునందే సంచరించు చుండును. అవిద్య కామము చేత, కర్మల చేత వాని చిత్తము నాక్రమించుటచే ఆతడు భ్రమలో పడి గంధర్వ పురమువలె అనిత్యము నాస్తవముగ అసత్యము నగు ఈ నరలోకమును ఎల్లపుడు సత్యముగ తలంచు చుండును.

**తత్ర చ క్వచిదాతపోదకనిభాన్ విషయానుపధావతి పానభోజన వ్యవాయాదివ్య సనలోలుపః ॥ 6**

ఒకప్పు డీ గంధర్వపురమున ఆవ్యక్తి పానము, భోజనము, స్త్రీ సాంగత్యము మున్నగు విషయవాసనలయం దాసక్తుడై ఎండమావుల యందలి నీరువంటి విషయముల వైపునకు పరుగిడును.

**క్వచిచ్చాశేషదోషనిషదనం పురీషవిశేషం తద్వర్ణగుణ నిర్మితమతిః సువర్ణముపా దిత్సత్యగ్ని కామకాతర ఇవోల్ముక పిశాచమ్ ॥ 7**

(ఇంకను ఒకప్పుడు) హింస, పరస్త్రీ గమనము, జూదము, మద్యపానము మున్నగు బహువిధములైన దోషములకు స్థాన మైన సువర్ణ మొక విధముగ మలమే. ఆ మలమువలె లోహితవర్ణము గల రజోగుణ మెవనిబుద్ధిని లోబఱచుకొనునో ఆవ్యక్తి దానిని పొందుట కిష్టపడును. చలిచే బాధపడు వ్యక్తి అగ్నితాపమును పొందదలచినవాడై అగ్నివలె మండుచున్న పిశాచమును (కొఱవిదయ్యమును) చూచి అగ్ని బుద్ధితో దాని వైపు పరుగిడును. అతడు గూడ అట్టి సువర్ణమును పొంద దలంచి ఆమలమువైపే పరుగిడును.

**అథ కదాచిన్ని వాసపానీయ ద్రవిణాద్య నేకాత్మో పజీవనా భినివేశ ఏతస్యాం సంసారాట వ్యామిత స్తతః పరిధావతి ॥ 8**

ఒకప్పుడు నివాసము, జలము, ధనము మున్నగు బహువిధములైన తన జీవనధారణోప యోగము లగు వస్తువులయం దభినివిష్టుడై మానవుడు ఈ సంసారాటవియందు ఇటునటు పరుగిడుచుండును.

**క్వచిచ్చ వాత్యౌపమ్యయా ప్రమదయారోహమారోపిత స్తత్కాలరజసా రజనీ భూత ఇవాసాధు మర్యాదో రజస్వలాక్షో దిగ్దేవతా అతిరజస్వలమతిర్న విజానాతి ॥ 9**

ఒకప్పుడు సుడిగాలివంటి యువతి యొడియందు గూర్చున్నచో ఆ సమయమున గలిగిన ధూళితో సమాన మైనకామవేగముచే వానివివేకము నష్టమగును. అతడు కామాంధు డై విధిమార్గము యొక్క మర్యాద నతిక్రమించును, అపుడు వానియీ మర్యాదాతిక్రమణము నకు సాక్షిస్వరూపులుగ చంద్రసూర్యాదులు, దిగ్దేవతలు నుందురు. తనమోహాంధకారావృత నేత్రములతో వారిని దర్శింపలేక పోవుచున్నాడు.

**క్వచిత్ సకృదవగతవిషయవైతథ్యః స్వయం పరాభి ధ్యానేన విభ్రంశిత స్మృతి స్తయైవ మరీచితోయప్రాయాంస్తా నే వాభిధావతి ॥ 10**

పురుషు డొకప్పుడు తనంతతాను ఒకటి రెండుమారులు విషయములు విఫలములు, దుఃఖజనకములు నని నిశ్చయించు కొనును; కాని దేహమునం దాత్మాభిమాన ముండుటచే వానియాస్మృతి నశించును. అప్పు డతడు ఎండమావుల యందు నీటివలె ఆవిషయములకై మరల పరుగిడును.

క్వచిదులూక ఝిల్లీస్వనవదతి పరుషరభసాటోపం ప్రత్యక్షం పరోక్షం వా రిపురాజకుల నిర్భర్త్సితేనా తివ్యథితకర్ణమూల హృదయః ॥ 11

ఒకప్పుడు గుడ్లగూబల యొక్క కీచురాళ్ళ యొక్క ధ్వనుల వంటి పరుష వాక్కులను ప్రయోగించుచు ఉత్సాహముతో గూడినవాడై గర్వముతో శత్రువులను, రాజులను ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని నిందించును. దానివలన వారిచెవులకు హృదయమునకు బాధ కలుగును.

స యదా దుగ్ధపూర్వసుకృత స్తదా కారస్కరాద్య పుణ్యద్రుమలతా విషోదపానవదు భ యార్థ శూన్య ద్రవిణాన్ జీవన్మృతాన్ స్వయం జీవన్ మ్రియమాణ ఉపధావతి ॥ 12

జీవుడు పూర్వసంచిత మగుపుణ్యఫలము ననుభవించి విషతిందుకము (ఒకావొక విషిద్ధవృక్షము) మున్నగు అపవిత్రము లైన వృక్షముల తోను, లతలతోను, విషకూపములతోను సమానము లైన ఐహికపార లౌకికము లను ఉభయార్థశూన్యము లైవధవముల నాశ్రయించును. వానికై స్వయముగ మృతప్రాయుడై జీవన్మృతు డగుధనికుని కడకు పరుగిడును అనగా వాని నాశ్రయించును.

ఏకదా అసత్ప్రసంగాన్నికృత మతిర్వ్యుదకస్రోతః స్ఖలనవదుభయతో ఽపి దుఃఖదం పాషణ్డమభియాతి ॥ 13

ఈ సంసారాటవియం దొక్కొక్కప్పుడు అసత్సాంగత్యముచేత జీవుని బుద్ధి వంచిత మగును. జలశూన్య మగు నదీగర్భమున పతితు డైనచో వెంటనే తలపగిలి పోవును. అనంతర మనేకక్లేశములు కలుగును. అట్లే వంచితు డగునీపురుషుడు వేదవిరుద్ధము లైన పాషండమతముల నాశ్రయించి ప్రస్తుత సమయములోను, అనంతర సమయములోను దుఃఖములను పొందును.

యదా తు క్షుత్పిపాసార్దితః పరబాధయావ్ద ఆత్మనే నోపనమతి తదా హి పితృపుత్ర బర్హిష్మతః పితృపుత్రాన్ వా స ఖలు భక్షయతి ॥ 14

ఈ సంసారమున మానవుడు మఱియొకనిని బాధించియు తనకు ప్రయోజనమును గలిగించు వస్తువును పొందజాలడు. అప్పు డతడు తండ్రి లేదా పుత్రులు మొదలగువారి కడ సామాన్య మగుగడ్డిపోచ వంటి యేవస్తువు ఉన్నను దానికై వారిని బాధించును.

**క్వచిదాసాద్య గృహం దావవత్ ప్రియార్థవిధురమసుఖోదర్కం శోకాగ్నినా దహ్యమానో భృశం నిర్వేదముపగచ్ఛతి ॥ 15**

ఈగృహము దావానలమువంటిది. దీనియందు సుఖము లేశమాత్రమును లేదు. దుఃఖమే దీనియంతిమ ఫలము. అనుకూలవస్తు వచట లేదు. జీవు డిట్టిగృహమును పొంది శోకానలముచే దగ్ధుడగును. ఒకప్పు డతడు "నేను మిగుల మందభాగ్యుడను, నా కెట్టి సుకృతియు లే" దని విషాదమును పొందును.

**క్వచిత్కాల విషమిత రాజకుల రక్షసాపహృత ప్రియతమధనాసుర్మృతక ఇవ విగత జీవలక్షణ ఆస్తే ॥ 16**

రాజులు రాక్షసుల వంటివారు, అప్పు డప్పుడు వారు ప్రతికూలురై ఇట్లు ప్రాణతుల్యము, ప్రియతమము నగుధనము నపహరింతురు. అప్పు డతడు సుఖదుఃఖానుభవాదిజీవన చిహ్నములు లేనివా డై మృతునివలె నుండును.

**కదాచిన్మ నోరథోపగత పితృపితామహాద్య సత్సదితి స్వప్న నిర్వృతిం క్షణమను భవతి ॥ 17**

ఒకప్పు డతడు పితృపితామహాదిమృత వ్యక్తులు పరలోకము నుండి తిరిగి వచ్చినట్లుగ భావించి క్షణకాలము స్వప్నసుఖము వంటి సుఖము ననుభవించును.

**క్వచిద్గృహాశ్రమ కర్మచోదనాతి భరగిరి మారురుక్షమాణో లౌకిక వ్యసన కర్షిత మనాః కంటకశర్కరాక్షేత్రం ప్రవిశన్నివ సీదతి ॥ 18**

గృహస్థాశ్రమమున అశ్వమేధాది యజ్ఞములు, వివాహము, ఉపనయనము మున్నగు కర్తవ్యకర్మల విధు లుండును. అవి అతివిస్తృతములు, పర్వతసదృశములు. ఈకర్మల నధిగమింప దలచి జీవుని చిత్తము అకించిత్కరము లౌకికము నగుకర్మకాండ వైపునకు ఆకృష్ట మగును. అప్పు డతడు పర్వతారోహణ ప్రయాసి యగువ్యక్తి పర్వతము నందలి కొనదేలిన రాళ్ళచేత, ముళ్ళచేత ఆవరింపబడిన ప్రదేశమునం దుండి కష్టములను పొందినట్లు దుఃఖముల ననుభవించును.

**క్వచిచ్ఛ దుస్సహేన కాయాభ్యన్తరవహ్నినా గృహీతసారః స్వకుటుంబాయ క్రుధ్యతి ॥ 19**

ఒకప్పు డతడు దేహమునం దున్న దుస్సహ మగు జఠరానలముచే పీడితు డై ధైర్యహీను డగును. దారాపుత్రాదు లైన ఆత్మీయులపై కోపమును జూపును.

**స ఏవ పునర్నిద్రాజగరగృహీతోఽన్ధే తమసి మగ్నః శూన్యారణ్య ఇవ శేతే నాన్యత్ కించన వేద శవ ఇవాపవిద్ధః. 20**

రాజా ! నిద్ర అజగరసర్పము వంటిది. ఆ సర్పము సంసారమార్గమున సంచరించు మానవుని కాటువేయును, అప్పు డతడు అజ్ఞానాంధకారమున నిమగ్ను డై నిర్జనారణ్యమున విడువ బడిన శవమువలె పడియుండి యేమియు నెఱుంగజాలడు.

**కదాచిద్భగ్న మానదంష్ట్రో దుర్జనదన్ద శూకైరలబ్ధ నిద్రాక్షణో వ్యథిత హృదయే నా నుక్షీయమాణ విజ్ఞానోఽన్ధకూపేఽన్ధవత్పతతి ॥ 21**

ఒకప్పుడు సర్పములవంటి రాక్షసులవంటి క్రూర స్వభావశిష్టు లగు దుర్జనుల ద్వారా వాని గర్వ మనుదంతము భగ్నమగును. దానివలన అతనికి విశ్రమించు నవకాశము కూడ లభింపదు. వాని హృదయము వ్యథిత మగును, ప్రతిదినము జ్ఞానము నశించు చుండును. అప్పుడతడు అంధునివలె మహా మోహాంధకూపమున పడును.

**కర్హి స్మ చిత్ కామమధులవాన్ విచిన్వన్ యదా పరదార పరద్రవ్యాణ్య వరున్ధానో రాజ్ఞా స్వామిభిర్వా నిహతః పతత్యపారే నిరయే ॥ 22**

జీవు డొకప్పుడు సామాన్యవిషయ సుఖము నన్వేషించుచు పరధనమును, పరస్త్రీలను అపహరింప మొదలిడును. రాజుచేత, గృహస్వామి చేత కొట్టబడిన వాడై అపార నరకమువంటి కారాగృహమున బంధింప బడును.

**అథ చ తస్మాదుభయథాపి హి కర్మాస్మిన్నాత్మనః సంసారా వపనము దాహరన్తి ॥ 23**

ఆకారణము వలన పండితులు ప్రవృత్తిమార్గమున జీవుని కర్మవే యిహలోక పరలోకముల యందు సంసారమునకు పుట్టుక స్థాన మనిచెప్పుచున్నారు.

**ముక్తస్తతో యది బన్ధా ద్దేవదత్త ఉపాచ్ఛినత్తి తస్మాదపి విష్ణుమిత్ర ఇత్య నవస్థితిః ॥ 24**

పురుషు డితరుల ద్రవ్యము నపహరించి ఏదియో నొక విధముగ బంధనము నుండి, తాడనముల నుండి ముక్తు డైనప్పటికిని మరల దేవదత్తు డను మఱియొక వ్యక్తి వానినుండి ఆవస్తువుల నన్నింటిని లాగికొనిపోవును. ఇంకను విష్ణుమిత్రుడు అనగా మఱియొక వ్యక్తి

దేవదత్తుని నుండి మరల ఆ యపహరింపబడిన ద్రవ్యమును హరించును. ఇట్లు ఒక హస్తము నుండి మఱియొక హస్తములోనికి వెడలును. అందువలన ఆ ధనము నెవ్వడును అనుభవింప జాలడు.

**క్వచిచ్చ శీతవాతాద్యనేకాధిదైవికాధి భౌతికాధ్యాత్మి కీయానాం దశానాం ప్రతి నివారణేఽకల్పో దురన్తచిన్తయా విషణ్ణ ఆస్తే ॥ 25**

పురుషు డొకప్పుడు శీతవాతాది బహువిధము లైన ఆధిదైవికములు, ఆధిభౌతికములు, ఆధ్యాత్మికములు నగు దుర్దశలకు ప్రతీకారము చేయజాలని వాడై దురంత మగుచింతచే విచారగ్రస్తుడై యుండును.

**క్వచిన్మిథో వ్యవహరన్ యత్కించిద్ధనమన్యేభ్యో వా కాకినికా మాత్రమ ప్యహరన్ యత్కించిద్వా విద్వేషమేతి విత్త శాఠ్యాత్ ॥ 26**

పరస్పరము ధనమును వినిమయము చేసికొని యొకడు మఱియొకని నుండి యొకపైసను లేదా దానికంటె స్వల్ప మైనయేదియోనొకదానినిఅపహరించి ధనవంచనము వలన విద్వేషమును పొందును.

**అధ్వన్యముష్మిన్నిమ ఉపసర్గాస్తథా సుఖదుఃఖరాగ ద్వేష భయాభిమాన ప్రమాదోన్మాద శోకమోహలోభమాత్సర్యేర్ష్యావమానక్షుత్పిపాసాధివ్యాధి జన్మజరామరణాదయః ॥ 27**

ఈ సంసారమున వెనుకచెప్పబడిన కష్టము లన్నియు నున్నవి. అంతేకాక సుఖము, దుఃఖము, రాగము, ద్వేషము, భయము, అభిమానము, ప్రమాదము, ఉన్మాదము, శోకము, మోహము, లోభము, మాత్సర్యము, ఈర్ష్య, అవమానము, క్షుధ, పిపాస (దప్పిక), ఆధి, వ్యాధి, జన్మ, జర (వార్ధక్యము), మృత్యువు మున్నగు బహువిధము లైన ఉపసర్గములు (విఘ్నములు) ఉన్నవి.

**అపి దేవమాయయా స్త్రియా భుజలతో పగూఢః ప్రసన్నవివేక విజ్ఞాన స్తద్విహార గృహారంభాకులహృదయస్తదాశ్రయావసక్త సుతదుహితృ కలత్ర భాషితావలోక విచేష్టితాప హృత హృదయ ఆత్మానమజితాత్మా పారేఽన్ధే తమసి ప్రహిణోతి ॥ 28**

ఒకప్పుడు దేవమాయారూపిణి యగుస్త్రీయొక్క బాహులతచే ఆలింగిత మైనచో జీవుని ఆత్మజ్ఞానరూప మగువివేకము, భగవదుపాసనాత్మక మగువిజ్ఞానము నశించును. అప్పుడు వాని హృదయము ఆ స్త్రీ యొక్క విలాస భవనమును నిర్మించుట యందు ఆసక్తి

చెంది యుండును; ఆ విలాసభవనము నం దాసక్తులగు కొడుకులు, కోడం(డ్రు, కూతుం(డ్రు మున్నగువారి ఆలాపముల చేత, అవలోకనములచేత, చేష్టలచేత వానిచిత్తము అపహృత మగును. అట్లే అజితాత్ము డగుజీవుడు తన్ను అపారమైన అంధకారముతో గూడిన నరకమున పడవేసి కొనుచున్నాడు.

కదాచిదీశ్వరస్య భగవతో విష్ణోశ్చక్రాత్ పరమాణ్వాదిద్విపర్థాపవర్గకాలోప లక్షణాత్ పరివర్తితేన వయసా రంహసా హరిత ఆబ్రహ్మతృణ స్తమ్బాదీనాం భూతానామ నిమిషతో మిషతాం విత్రస్తహృదయ స్తమేవేశ్వరం కాలచక్ర నిజాయుధం సాక్షాద్భగవన్తం యజ్ఞపురుషమనాదృత్య పాషణ్డదేవతాః కంకగృధ్ర బకకరటప్రాయా ఆర్యసమయ పరిహృతాః సాంకేత్యే నాభిదత్తే ॥ 29

పరమేశ్వరు డగువిష్ణుభగవానుని చక్రము పేరు హరిచక్రము. ఈ చక్రము పరమాణువుల నుండి ద్విపరార్థము వఱకు వ్యాప్త మైనకాల స్వరూపము. ఇది నిరంతరము తిరుగుచు బ్రహ్మ నుండి తృణగుల్మాది పర్యంతము గల సర్వప్రాణులను బాల్యయౌవనాది క్రమముతో నతిశీఘ్రముగ హరించును. ఎవ్వరును దానికి ప్రతీకారము చేయజాలరు. ఈ కాలచక్రము మిగుల మెలకువ గలిగి యుండును. అది భగవానుని స్వకీయాస్త్రము. కాల చక్రభీతు డగు జీవుడు చక్రాయుధుడు, సాక్షాత్తుగ భగవానుడు నగుయజ్ఞ పురుషుని తిరస్కరించి గ్రద్దలు,కొంగలు, కంకములు, కాకులు మున్నగువానివలె శిష్టాచారములు లేని పాషండదేవతలను (అనగా పాషండశాస్త్రవిహితు లైన ఉపాస్య దేవతలను) ప్రమాణ శూన్యములు అనగా కల్పితము లైన పాషండ శాస్త్రముల ననుసరించి ఆశ్రయించును. గ్రద్దలు, కొంగలు మున్నగునవి సింహమును చూచి భయపడు వ్యక్తిని రక్షింప జాలవు. అట్లే పాషండ దేవతలు కూడ కాలచక్రము నుండి జీవుని రక్షింప_జాలవు.

యదా తు పాషణ్డిభిరాత్మవంచితై స్తైరురువంచితో బ్రహ్మకులం సమావసం స్తేషాం శీలముపనయనాది శ్రౌతస్మార్త కర్మానుష్ఠానేన భగవతో యజ్ఞ పురుషస్యారాధన మేవ తదరోచయన్ శూద్రకులం భజతే నిగమాచారేఽ శుద్ధితో యస్య మిథునీభావః కుటుంబభరణం యథా వానరజాతేః ॥ 30

పాషండులు స్వయముగ వంచితులు, వారి నాశ్రయించిన పురుషుడు వారిచేత ఇంకను ఎక్కువగ వంచితు డై బ్రాహ్మణకులము నాశ్రయించును. కాని బ్రాహ్మణుల ఉపనయనాది శ్రౌతస్మార్త కర్మల ననుష్ఠించుట ద్వారా యజ్ఞపురుషుని ఆరాధనా రూప మగు ఆచరణము వానికి ప్రీతిని కలిగించదు. అప్పు డతడు శూద్రాచారముల ననుసరించును, శూద్రులు విధవా వివాహములు, మూల్యప్రదానాదుల ద్వారా వివాహము మున్నగు

నిగమోక్తము లైన నిషిద్ధాచారముల ననుసరించి స్త్రీసాంగత్యము చేయుదురు. వానర జాతివలె వారికి కుటుంబ పోషణము తప్ప అగ్నిహోత్రాది కర్మ లేవియు నుండవు.

తత్రాపి నిరవరోధః స్వైరేణ విహరన్నతికృపణబుద్ధి రన్యోన్య ముఖ నిరీక్షణాదినా గ్రామ్యకర్మణైవ విస్మృతకాలావధిః ॥ 31

ఆ వ్యక్తి శూద్రసమాజమున ప్రవేశించి నిరాటంకముగ సేచ్ఛగ సంచరించును; అతడు మిగుల మందబుద్ధి యై పరస్పరము ముఖావలోకనమును, గ్రామ్యకర్మలను చేసి తన మరణ కాలమును విస్మరించును.

క్వచిద్ద్రుమవదైహికార్థేషు గృహేషు రంస్యన్ యథా వానరః సుతదార వత్సలో వ్యవాయక్షణః ॥ 32

వానరులు వృక్షము పై క్రీడించుచు బోయవానివలలో చిక్కుకొని, తమ్ము తాము విడిపించుకొనలేక పడియుండును. అట్లే యీపురుషుడు కూడ ఐహిక సుఖములకు హేతుభూత మగు గృహమునం దాసక్తు డై దారాపుత్రాదుల యందు ప్రేమగలవా డై, మైథునోత్సవము నందు రతుడై సంసార బంధనములనుండి తన్ను తాను రక్షించు కొనజాలడు.

ఏవమధ్వన్యవరుంధానో మృత్యుగజభయాత్ తమసి గిరికన్దర ప్రాయే ॥33

ఈ సంసారమార్గమున పురుషుడు భగవదారాధనను పరిత్యజించి పాపాసక్తుడై ఆధ్యాత్మికాది తాపత్రయముల ననుభవించును; అపు డతడు మృత్యు వను ఏనుగువలని భయముచే భీతు డై కొండగుహల వంటి ఘోర మగునంధకారమున పతితు డగును.

క్వచిచ్ఛీత వాతాద్యనేకదైవికభౌతికాత్మీయానాం దుఃఖానాం ప్రతి వారణేఽకల్పో దుర న్తవిషయధిషణయా విషణ్ణ ఆస్తే ॥ 34

ఒకప్పుడు శీతవాతములు మున్నగు బహువిధము లైన ఆధి దైవికములు, ఆధి భౌతికములు, ఆధ్యాత్మికములు ననుదుఃఖములకు ప్రతీకారము చేయజాలనివా డై విషమము లగు విషయచింతలచే విచారగ్రస్తు డగును.

క్వచిన్మిథో వ్యవహరన్ యత్కించిద్ధనముపయాతి విత్తశాఠ్యేవ ద్వేషం గచ్ఛతి ॥ 35

ఒకప్పుడు పరస్పరము వినిమయము మున్నగు వ్యవహారముల చేయుచు వంచనము మున్నగు నుపాయముల ద్వారా పొందిన లాభము వలన పరస్పరము శత్రువులగుదురు.

క్వచిత్క్వచిత్ క్షీణధనః శయ్యాసనాద్యుపభోగ విహీనో యావదప్రతి లబ్ధమనో
రథోపగతాదానేఽవసితమతి స్తత స్తతోఽవమానాదీని జనాదభిలభతే ॥ 36

ఒక్కొక్కపు డతడు ధనహీనుడగుటచే శయ్య, ఆసనము మున్నగు భోగ వస్తువులు లేనివాడగును. అతడు మంచి ఉపాయములచే తన మనస్సున కిష్ట మగు వస్తువును పొందజాలడు. అపుడు అతడు మాయోపాయములచే పరుల ద్రవ్యములను హరింప తలపెట్టును. దానివలన లోకములో అవమానాదులను పొందును.

ఏవం విత్తవ్యతిషంగవివృద్ధ వైరానుబన్ధోఽపి పూర్వవాసనయా మిథ
ఉద్వహత్యథాపవహతి ॥ 37

అట్లు అర్థాసక్తిద్వారా పరస్పరము శత్రుభావాపన్నుడై కూడ పూర్వవాసనవలన పరస్పరము వివాహాది సంబంధములచే బద్ధు డగును. ఇంకను ఒకప్పుడు శత్రుత్వము వలన వారి పరస్పర సంబంధము తొలగును.

ఏతస్మిన్ సంసారాధ్వని నానాక్లేశోప సర్గబాధిత ఆపన్న విపన్నో యత్ర
యస్తముహ వావేతర స్తత్ర విసృజ్య జాతం జాతముపాదాయ శోచన్
ముహ్యన్ బిభ్యద్వివదన్ విపహన్ సంహృష్యన్ గాయన్ నహ్యమానః సాధు
వర్జితో నైవావ ర్తతేఽద్యాపి యత ఆరబ్ధ ఏష నరలోకసార్థ స్తమధ్వనః పార
ముపదిశన్తి ॥ 38

ఈ సంసారమార్గమున బహువిధము లగు క్లేశములు, ఉపసర్గలు (విఘ్నములు) మున్నగు వానిద్వారా పీడితు డై మానవుడు ఆపన్నుడు, విపన్నుడు నగును. అవ్యవ్యక్తి వానిని (విపన్న పిత్రాదిరూపు డగు మనుష్యుని) పరిత్యజించి, నవజాతవ్యక్తిని (పుత్రాదులను) స్వీకరించి యొకప్పుడు శోకించును, మఱియొకప్పుడు మోహమును పొందును, ఇంకను ఒకప్పుడు భీతు డగును. ఒకప్పుడు ఛీత్కారము చేయును, ఒకప్పుడు లాలనపాలనాదులను చేయును. ఒకప్పుడు హృష్టుడై గానము చేయును. ఇట్లు జీవుడు సంసారమున బద్ధు డగును. పరమేశ్వరుని పట్ల అనాదిబహిర్ముఖత్వము కలిగి యుండుటచే నిత్యబద్ధు లగు ఈజీవులు సంసారమార్గమున ప్రవృత్తు లైరి. సర్వ కారణకారణు డగు ఆ భగవానుని పదములను తత్త్వవేత్తలు సంసారమార్గమును తరింప చేయునట్టివని కీర్తింతురు. సాధు సాంగత్యవర్జితు లై కొందఱు నేటికిని సంసారమార్గమును దాటజాలక యున్నారు. అనగా నిత్య బద్ధు లగుజీవులు వైష్ణవ సాంగత్యమును విడచినచో ప్రవృత్తి మార్గమునుండి ముక్తులై భగవత్సేవను ఎప్పుడును పొందజాలరు.

**యదిదం యోగానుశాసనం న వా ఏతదవరున్ధతే యన్న్యస్తదణ్డా మునయ ఉపశమశీలా ఉపరతాత్మానః సమవగచ్ఛన్తి ॥ 39**

సర్వభూత సుహృదులు, శాంతచిత్తులు, జితేంద్రియులు నగు మునులు భగవంతుని పొందు నుపాయ మైన భక్తియోగమును అనాయాసముగ పొందుదురు. కాని సంసారాసక్తు లగువ్యక్తులు దానిని పొందజాలరు.

**యదపి దిగిభజయినో యజ్విన్నో యే వై రాజర్షయః కిన్తు పరం మృధే శయీరన్నస్యామేవ మమేయమితి కృత వైరానుబన్ధాయాం విసృజ్య స్వయముపసంహృతాః ॥ 40**

ఎల్లప్పుడు యోగయజ్ఞరతులు, దిగ్విజయులు నగు ఋషులు గూడ సంసారపారమును పొంది భగవానుని పొందలేక పోవుచున్నారు. ఏలయన, వారు (ఆరాజులు) 'ఈ భూమి నాది' యని అభిమానపడి పరస్పరము శత్రుత్వమును పూనుదురు, ఆభూమిని విడిచి స్వయముగ వినష్టు లై సమర రంగమున శయనింతురు.

**కర్మవల్లీమవలంబ్య తత ఆపదః కథంచిన్నరకాద్విముక్తః పునరప్యేవం సంసారాధ్వని వర్తమానో నరలోకసార్థముపయాతి, ఏవముపరి గతోఽపి ॥ 41**

ఇట్లు ప్రాణులు కర్మమార్గము నాశ్రయించి స్వర్గలోకమును పొందుదురు. నరక మను ఆపద నుండి యెట్లో ముక్తు లగుదురు. కాని ('క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' అనగా పుణ్యము క్షయము కాగా స్వర్గము నందున్న పురుషుడు మరల మర్త్యలోకమున ప్రవేశించు ననువాక్యము ననుసరించి) అట్టివారు కూడ మర్త్యలోకమునకు మరల తిరిగి వత్తురు.

## తస్యేదముపగాయన్తి

**ఆర్షభస్యేహ రాజర్షేర్మనసాపి మహాత్మనః ।**
**నానువర్త్మార్హతి నృపో మక్షికేవ గరుత్మతః ॥ 42**

మునిశ్రేష్ఠు డగుశుకుడు వెనుక చెప్పినవిధముగ భరతుడు వర్ణించిన విషయమును వ్యాఖ్యానించి ఆయన చేసిన పనులను సంక్షేపముగ పరిచయము చేయుచు పరీక్షిన్మహా రాజుతో నిట్లు పలికెను - 'మహారాజా ! ఈగలు పక్షిరా జగుగరుడుని మార్గము నను సరించుట కేవిధముగను సమర్థములు కావట్లు ఈపృథివిలోని యేరాజు కూడ నేటివరకు మనస్సు ద్వారా కూడ ఋషభనందనుడు, రాజర్షియు నగుభరతుని మార్గ మనుసరింపజాలక పోయిరని పండితులు రాజర్షి యగుభరతుని గూర్చి కీర్తించు చుందురు.

యో దుస్త్యజాన్ దారసుతాన్ సుహృద్రాజ్యం హృదిస్పృశః ।
జహౌ యువైవ మలవదుత్త మశ్లోకలాలసః ॥ 43

రాజర్షియగు ఆభరతుడు యౌవనముననే భగవద్భావమునం దాసక్తుడై మనోహరము లగు భార్యాపుత్ర మిత్రరాజ్యాది దుస్త్యజ విషయములను మలసదృశము లని (హీనమని) భావించి అనాయాసముగ పరిత్యజించెను.

యో దుస్త్యజాన్ క్షితిసుతస్వజనార్థదారాన్
ప్రార్థ్యాం శ్రియం సురవరైః సదయావలోకామ్ ।
నైచ్ఛన్నృపస్తదుచితం మహతాం మధుద్విట్
సేవానురక్తమనసామభవోఽపి ఫల్గుః ॥ 44

ఆయన విడువరాని రాజ్యమును, దారాపుత్రులను, ధనమును, దేవతలుగూడ ఎవరి యనుగ్రహమును సంపాదించుటకై తహతహలాడుచుందురో అట్టి లక్ష్మినిగూడ పరిత్యజించెను. ఇది ఆయనకు తగినపనియే. మధుసూదనుని చరణసేవకై వ్యాకులపడు చిత్తము కల మహాపురుషుల దృష్టిలో మోక్షముకూడ పనికిరానిదిగనే పరిగణింప బడును గదా!

యజ్ఞాయ ధర్మపతయే విధినైపుణాయ
యోగాయ సాంఖ్యశిరసే ప్రకృతీశ్వరాయ ।
నారాయణాయ హరయే నమ ఇత్యుదారం
హాస్యన్ మృగత్వమపి యః సముదాజహార ॥ 45

ఆ రాజర్షి యగుభరతుడు మృగశరీరమును విడచునపుడు 'యజ్ఞ స్వరూపుడు, యజ్ఞాదికర్మములకు ఫలదాతయు, ధర్మానుష్ఠానకర్తయు, సాక్షాత్తుగ అష్టాంగయోగ మూర్తియు, జ్ఞానమే యుత్తమఫలముగా గలవాడు, మాయాధీశ్వరుడు, సర్వ జీవాంత ర్యామియు, మనోహరుడు నగు ఆ భగవానునకు దాస్యభావముతో ఆత్మసమర్పణము చేయుచున్నా' నని యుచ్చరించెను.

య ఇదం భాగవతసభాజితావదాతగుణకర్మణో రాజర్షేర్భరతస్యాను చరితం స్వస్త్యయనమాయుష్యం ధన్యం యశస్యం స్వర్గ్యాపవర్గ్యం చాను శృణోత్యాఖ్యాస్యత్య భినన్దతి చ సర్వా హ్యేవాశిష ఆత్మన ఆశాస్తే న కాంచన పరత ఇతి ॥ 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే భరతోపాఖ్యానం నామ
చతుర్దశోఽధ్యాయః ॥

భాగవతులు రాజర్షి యగు భరతుని శుద్ధ గుణములను, కర్మలను గౌరవింతురు. మంగళ జనకము, పరమాయుర్వర్ధకము, ధనవృద్ధికరము, యశస్కరము, స్వర్గమోక్ష సాధకము నగు భరతుని చరిత్రమును శ్రవణకీర్తనములు చేసినవాడు లేదా ఆమోదించినవాడు సర్వాభీష్టఫలములను పొంద సమర్థుడగును. తనక్షేమమునకై ఇతరులనుండి ఏమాత్రముకూడ అపేక్షింపడు.

## ఈయధ్యాయమున వర్ణింపబడిన భవాటవి వివరణము

భవాటవి - సంసారమార్గము; వణిక్కులు - అర్థాసక్తు లగుజీవులు; ఆఱుగురు దస్యులు - చక్షువులు, కర్ణములు, నాసిక, జిహ్వ, త్వక్కు, మనస్సు అను ఆఱింద్రియములు. కునాయకము - కుబుద్ధి, అపహరణము - భగవానుని సేవించుట కుపయోగపడు ద్రవ్యములవలన తన యింద్రియము లను తృప్తిపఱచు కొనుట, వృకశృగాలములు - దారా పుత్రాదులు, తృణ గుల్మములు - కామ్యకర్మాదులు. గహ్వరము - గృహస్థాశ్రమము. దంశ మశకములు - దుర్జనులు. శలభశకుంతమూషికములు - చోరులు. గంధర్వ పురము - దేహగేహాదులు. ఉల్మూకాకారపిశాచము - సువర్ణము (పర ద్రవ్యము). నివాస జలధనములు - తనకు భోగ్యము లగు ద్రవ్యములు. చక్రవాతము - స్త్రీ. ధూళి - కందర్పవేగము. దిక్కు - దిగ్దేవత. ఝిల్లి (కీచు రాయి) - పరోక్షమున కటూక్తులు పలుకునది. ఉలూకము - ప్రత్యక్షమున కటూక్తులు పలుకునది. అపుణ్య వృక్షము - అధార్మిక లోకము. జల శూన్యనది - ఈ కాలములోను, అనంతర కాలమునందును దుఃఖప్రదు లగు పాషండులు. రాక్షసులు - రాజులు. మహాపర్వతము - పుత్ర పుత్రికాదుల వివాహరూపకర్మ. కంటకాది విద్ధము - సహాయాదులు లేకపోవుటచే బహువిఘ్నములతో కూడినది. అజగర సర్పము - నిద్ర. అంధకూపము, తమిస్రము - దుఃఖమయము. క్షుద్ర రసము - పరదారాగమనాదులు. మక్షిక - భర్త, శ్వశురప్రభృతులు. లత - స్త్రీ; సింహము - కాలచక్రము. బకకాక గృధ్రములు - క్షుద్రులు, విష్ఠురులునగు పాషండులు కల్పించిన దేవతలు. హంస - బ్రాహ్మణులు. వానరము -భ్రష్టాచారి యగు శూద్రుడు. వానరజాతీయ క్రీడ - భోజనము. పానము, స్త్రీ సాంగత్యాదులు. వృక్షములు - దృష్టార్థములు, గృహములు. హస్తి (ఏనుగు) - మృత్యువు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
భరతోపాఖ్యాన మను పదునాల్గవ అధ్యాయము
సంపూర్ణము.



# పదునైదవ అధ్యాయము

## భరతవంశ వర్ణనము

ఈ యధ్యాయమున భరతవంశరాజుల విషయము కీర్తింపబడినది.

కథాసారము :- భరతుని పుత్రు డగు సుమతిగూడ ఋషభదేవుని జీవన్ముక్తి మార్గము ననుసరించుట చూచి కొందఱు వేదవిముఖు లగు పాషండులు "కలికాలమున ఇతడే సాక్షాత్తుగ బుద్ధరూపముతో అవతరించినా" డని కల్పన చేయుదురు. ఈ సుమతి పుత్రుడు దేవతాజిత్తు, ఆతని పుత్రుడు దేవద్యుమ్నుడు, వానిపుత్రుడు పరమేష్ఠి, వానిపుత్రుడు ప్రతీహుడు. ప్రతీహుడు విష్ణుభక్తు డయ్యెను. ప్రతీహునకు ప్రతిహర్త, ప్రస్తోత, ఉద్గాత యను ముగ్గురు పుత్రులు గలరు. ప్రతిహర్తపుత్రుడు ఉద్గీయుడు, వానిపుత్రుడు ప్రస్తావుడు. వాని కుమారుడు విభుడు. వాని కుమారుడు పృథుసేనుడు. వాని పుత్రుడు నక్తుడు. నక్తుని భార్య యగు ఋతికి పుణ్యకీర్తియు, రాజర్షిశ్రేష్ఠుడు నగు గయు డావిర్భవించెను. గయుడు విష్ణువు అంశతో నుద్భవించి, విష్ణువు నందు భక్తికలిగియుండి మహాపురుష పదవిని పొందెను. ఆయన విష్ణుభక్తి పరాయణు డగు రాజయ్యెను. గయునకు చిత్రరథుడు, సుమతి, అవిరోధనుడు అను ముప్వురు పుత్రులు జన్మించిరి. చిత్రరథుని పుత్రుడు సమ్రాట్టు. సమ్రాట్టుని పుత్రుడు మరీచి, వానిపుత్రుడు బిందు మానుడు. బిందుమానుని పుత్రుడు మధుడు, మధుపుత్రుడు వీరవ్రతుడు. వానికి మంథుడు, ప్రమంథుడు నను ఇరువురు పుత్రులు జన్మించిరి. మంథునికొమరుడు భౌవనుడు. భౌవనునిసుతుడు త్వష్ట. త్వష్ట తనయుడు విరజుడు తనవంశమును ఉజ్జ్వలము చేసెను. విరజునకు నూఱుగురు సుతులు, ఒక సుతయు జన్మించిరి. వారిలో శతజిత్తు అను కొమరుడు సర్వశ్రేష్ఠుడు.

## శ్రీ శుక ఉవాచ

**భరతస్యాత్మజః సుమతిర్నామాభిహితో యముహ వావ కేచిత్ పాషణ్డిన ఋషభ పదవీమనువర్తమానం చానార్యా అవేదసమామ్నాతాం దేవతాం స్వమనీషయా పాపీయస్యా కలౌ కల్పయిష్యన్తి ॥ 1**

శుకుడు పలికెను : భరతుని పుత్రుడు సుమతి నామముతో అభిహితు డయ్యెను. ఇతడు ఋషభదేవునిపదవిని (జీవన్ముక్తిమార్గమును) అనుసరించుట చూచి కొందఱు వేదాచార విముఖు లగుదుర్జనులు పాపాచరణ తత్పరము, అవిశుద్ధము నగు తమబుద్ధి ద్వారా వీనిని కలియుగమున వేదప్రతి పాద్యము గాని బౌద్ధదేవతా రూపముతో కల్పింతురు.

అనగా బుద్ధుడే సాక్షాత్తుగ వీనిరూపమున అవతరించినా డనితమమనోధర్మము ద్వారా ఆలోచించు చుందురు.

తస్మాద్వృద్ధసేనాయాం దేవతాజిన్నామ పుత్రోఽభవత్ ॥ 2

ఆ సుమతివలన అతని భార్య యగువృద్ధ సేనకు దేవతాజిత్తు అనునొక పుత్రుడు జన్మించెను.

అథాసుర్యాం తత్తనయో దేవద్యుమ్నస్తతో ధేను మత్యాం సుతః పరమేష్ఠీ తస్య సువర్చలాయాం ప్రతీహ ఉపజాతః ॥ 3

పిమ్మట ఆసురి యనుభార్య వలన దేవతాజిత్తునకు దేవద్యుమ్ను డను నొక కుమారుడు జన్మించెను. దేవద్యుమ్ను నకు తన భార్యయైన ధేనుమతి వలన పరమేష్ఠి యను నొక తనయుడు జన్మించెను. పరమేష్ఠికి సువర్చల యను భార్యవలన ప్రతీహు డను కొమరుడు జన్మించెను.

య ఆత్మవిద్యామాఖ్యాయ స్వయం సంశుద్ధో మహా పురుషమనుసస్మార ॥ 4

ప్రతీహు డాత్మవిద్యను పరిశీలించి, పవిత్రుడై మహాపురుషుడగు విష్ణువును పొందెను.

ప్రతీహాత్ సువర్చలాయాం ప్రతిహర్త్రాదయస్త్రయ ఆసన్నిజ్యాకోవిదాః సూనవః ప్రతిహర్తుః స్తుత్యామజభూమా నావజనిషాతామ్ ॥ 5

ప్రతీహునివలన సువర్చల యను తత్పత్నికి ప్రతిహర్త, ప్రస్తోత, ఉద్గాత (యజ్ఞనిపుణుడు) అనుమువ్వురు పుత్రులావిర్భవించిరి. స్తుతి యను భార్యకు ప్రతిహర్తవలన అజుడు, భూముడు అనునిరువురు కొమరులు కలిగిరి.

భూమ్న ఋషికుల్యాయాముద్గీథస్తతః ప్రస్తావో దేవకుల్యాయాం ప్రస్తావాద్వి రుత్సాయాం హృదయజ ఆసీద్విభుః విభో రత్యాం చ పృథు షేణ స్తస్మాన్నక్త ఆకూత్యాం జజ్ఞే. నక్తాద్ద్రుతిపుత్రో గయో రాజర్షిప్రవర ఉదార శ్రవా అజాయత. యః సాక్షాద్భగవతో విష్ణోర్జగాద్రిరక్షిషయా గృహీత సత్త్వస్య కలాత్మవత్వాది లక్షణేన మహాపురుషతాం ప్రాప్తః ॥ 6

భూముని వలన వానిభార్య యగు ఋషికుల్యకు ఉద్గీథు డను నొక తనయుడు, ఉద్గీథుని వలన దేవకుల్యకు ప్రస్తావుడు, ప్రస్తావుని వలన విరుత్సకు విభు డను పుత్రుడు, విభుని వలన రతికి పృథుసేనుడు, పృథుసేనుని వలన ఆకూతికి నక్తుడు, నక్తుని వలన ఋతి యనునామెకు పుణ్యకీర్తియు, రాజర్షి శ్రేష్ఠుడు వగు గయుడు జన్మించిరి.

జగత్పాలమునకై నిత్యము సత్త్వ గుణము నాశ్రయించి యున్న ఆవిష్ణు భగవానుని యంశయే ఆ గయుడు. అందువలననే అతడు భగవద్జ్ఞానాది లక్షణముల ద్వారా మహాపురుషత్వమును (సర్వజన శ్రేష్ఠత్వమును) పొందెను.

**స వై స్వధర్మేణ ప్రజాపాలన పోషణ ప్రీణనోప లాలనాను శాసనలక్షణేనే జ్యాదినా చ భగవతి మహాపురుషే పరావరే బ్రహ్మణి సర్వాత్మనార్పిత పరమార్థ లక్షణేన బ్రహ్మ విచ్చరణాను సేవయాపాదిత భగవద్భక్తి యోగేన చాభీక్ష్ణశః పరిభావిత విశుద్ధ మతిరుప రతానాత్మ్య ఆత్మని స్వయము పలభ్యమాన బ్రహ్మాత్మానుభవోఽపి నిరభిమాన ఏవావని మజూగుపత్ ॥ 7**

(రాజధర్మములు రెండు విధములు - రాజ్యమునం దభిషిక్తుడగుటచే ప్రజాపాలన చేయుట యనునది యొకవిధ మగుధర్మము, గృహస్థాశ్రమమునం దుండుటచే యజ్ఞానుష్ఠానాదుల నొనరించుట అనునది యొకవిధ మైన ధర్మము) ఆ గయుడు ప్రజాపాలనము (దుర్జనుల నుండి రక్షించుట), పోషణము (అన్నాదిభోగములను సంపాదించుట ద్వారా పుష్టి చేయుట), ప్రీణనము (ప్రియవస్తువుల నిచ్చుట ద్వారా సంతోషమును కలుగజేయుట), ఉపలాలనము (మధుర వాక్యాదుల ద్వారా హర్షమును గలిగించుట), అనుశాసనము (శిక్షాద్వారా సన్మార్గమున ప్రవర్తింపజేయుట) ఈ లక్షణములతో కూడిన రాజధర్మములు, యజ్ఞయాగాదులైన గృహస్థాశ్రమోచిత ధర్మములు. అనునీ రెండు విధము లగు ధర్మములను సర్వాత్ముడు, పరమపురుషుడు, పరావరుడు (బ్రహ్మాది శ్రేష్ఠ పురుషుల కంటెను పరమశ్రేష్ఠుడు), పరబ్రహ్మము నగువాసుదేవుని యందు మనోవాక్కాయముల ద్వారా సమర్పించుటచే అవివానికి పరమార్థ స్వరూపము లయ్యెను. అందువలన భగవానుని యందు పూర్తిగ శరణుజొచ్చుట యనుపరమార్థ లక్షణయుక్త మగుధర్మము, బ్రహ్మవేత్తలగుభాగవతుల చరణసేవాసంపాదిత మగు భక్తి యోగము - అను ఈ రెండింటిద్వారా నిరంతరము వానిబుద్ధి పరిమార్జితము, విశుద్ధము నగుటచే వాని దేహాత్మజ్ఞానము నశించెను. అతడు చిత్తమున స్వయముగనే ప్రకాశించు బ్రహ్మమునందు ఆత్మానుభవమును పొందుచుండెను. అయినను అతడు అనాసక్త భావముతోనే సమస్తపృథివిని పాలించుచుండెను.

**తస్యేమా గాథాః పాణ్డవేయ పురావిద ఉపగాయన్తి ॥ 8**

పాండవేయా ! పురాణవేత్త లగుపండితులు ఆయన యీ మాహాత్మ్యమును గూర్చి కీర్తించు చుందురు.

గయం నృపః కః ప్రతియాతి కర్మభి -
ర్యజ్వాభిమానీ బహువిద్ధర్మగోప్తా ।
సమాగతశ్రీః సదసస్పతిః సతాం -
సత్సేవకోఽన్యో భగవత్కలామృతే ॥ 9

శ్రుతి విహితము లగుయజ్ఞముల నొనరించుచున్నవాడు, మనస్వియు, బహుశాస్త్రజ్ఞుడు, ధర్మరక్షకుడు, శ్రీమంతుడు, సజ్జనసమాజమునకు పతియు, సాధుసేవకుడు, సర్వగుణ సంపన్నుడు, భగవదంశుడు నగునా గయుడు తప్ప కర్మలలో వానితో సమాను డైనరాజు మఱియెవ్వ డున్నాడు?

యమభ్యషించన్ పరయా ముదా సతీః
సత్యాశిషో దక్షకన్యాః సరిద్భిః ।
యస్య ప్రజానాం దుదుహే ధరాశిషో
నిరాశిషో గుణవత్సస్నుతోధాః ॥ 10

సాధ్వీమణు లగుదక్షునియొక్క (శ్రద్ధ, మైత్రి, దయ మున్నగు) పుత్రికలయాశీర్వాదము వ్యర్థము కాదు. వారు పరమసంతోషముతో నదీజలములతో నొకచోట గయున కభిషేక మొనర్చిరి. వాని గుణము లనువత్సను జూచి గో వను పృథివి యొక్క స్తనముల నుండి దుగ్ధములు స్రవించు చుండెడివి. పృథివి (వాని ప్రజాపాలనాది గుణములను చూచి స్వయముగనే) సర్వాభీష్టములను పూర్తిచేయు చుండెడిది.

ఛన్దాంస్యకామస్య చ యస్య కామాన్
దుదూహురాజహ్రురథో బలిం నృపాః ।
ప్రత్యంచితా యుధి ధర్మేణ విప్రా
యదాశిషాం షష్ఠమంశం పరేత్య ॥ 11

గయమహారాజున కెట్టికోరికయు లేకపోయినను సర్వవేదములు వేదవిహిత కర్మలను, వివిధ భోగములను వానికై పితికినవి. రాజులు గయుని ధర్మయుద్ధమునకు సంతుష్టులై వానికి కానుకల నొసంగిరి. బ్రాహ్మణులు దక్షిణాదులచే పూజితులై పరలోకమున అనుభవించు నిమిత్తమై వానికి తమతమ ధర్మములలోని ఆఱవ భాగమును దానము చేసిరి.

యస్యాధ్వరే భగవానధ్వరాత్మా
మఘోని మాద్యత్యురుసోమపీథే ।
శ్రద్ధావిశుద్ధాచలభక్తియోగ
సమర్పితేజ్యాఫలమాజహార ॥ 12

మహారాజగు గయుని యజ్ఞమున అధికముగ సోమపానము జరుగు చుండెడిది. ఇంద్రు డాయజ్ఞమున సోమపానముచేసి మిగుల మత్తు డగు చుండును. యజ్ఞమూర్తి యగు విష్ణు భగవానుడు సాక్షాత్తుగ అవతరించి శ్రద్ధాయుక్తము, నిర్మలము, దృఢము నగు భక్తితో సమర్పింపబడిన యజ్ఞఫలమును పరమాదరముతో స్వీకరించు చుండును.

యత్ప్రీణనాద్బర్హిషి దేవతిర్య -
జ్మనుష్యవీరుత్తృణమావిరించాత్ ।
ప్రీయేత సద్యః స హ విశ్వజీవః
ప్రీతిః స్వయం ప్రీతిమగాద్గయస్య ॥ 13

సర్వాత్ము డగుభగవానుడు సంతుష్టు డైనచో దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, లతలు, తృణములు, మున్నగు ఆబ్రహ్మస్తంబపర్యంతము గల నిఖిల జగత్తునకు సద్యస్సంతోషము కలుగును. సర్వాంతర్యామియు, సహజముగనే ఆనందస్వరూపుడు నగునా విష్ణు భగవానుడు గయుని యజ్ఞమున 'సంతుష్టుడ నైతి' నని స్వయముగ చెప్పినాడు.

గయాద్గాయన్త్యాం చిత్రరథః సుగతిరవిరోధన ఇతి త్రయః పుత్రా బభూవుః. చిత్రరథా దూర్ణాయాం సమ్రాడజనిష్ట ॥ 14

తత ఉత్కలాయాం మరీచిర్మరీచేర్బిన్దుమత్యాం బిన్దు మానుదపద్యత. తస్మాత్స రఘాయాం మధునామాభవత్. మధోః సుమనసి వీరవ్రతస్తతో భోజాయాం మన్థు ప్రమన్థూ జజ్ఞాతే, మన్థోః సత్యాయాం భౌవనస్తతో భూషణాయాం త్వష్టాజనిష్ట, త్వష్టుర్విరోచనాయాం విరజః విరజస్య శతజిత్ప్రవరం పుత్రశతం కన్యా చ విషూచ్యాం కిలాజాయత ॥ 15

గయునివలన గాయంతికి చిత్రరథుడు, సుగతి, అవిరోధనుడు అను ముగ్గురు సుతులు జన్మించిరి. చిత్రరథునివలన ఊర్ణ యనునామెకు సమ్రాట్టు అనువాడు జన్మించెను. సమ్రాట్టుభార్య ఉత్కల. ఆమెకు మరీచి జన్మించెను. మరీచివలన బిందుమతికి బిందుమాను డనునొక పుత్రుడు జన్మించెను. బిందుమాను భార్య సరఘ. సరఘకు మధునుడు జన్మించెను. మధునకు సుమన యనునామె వలన వీరవ్రతుడు జన్మించెను. వీరవ్రతునకు భోజ యనుభార్య వలన మంథుడు, ప్రమంథుడు అనునిరువురు పుత్రులు జన్మించిరి. మంథునకు సత్యయను భార్యవలన భౌవనుడను పుత్రుడు జన్మించెను. భౌవనుని వలన భూషణ యనునామెకు త్వష్ట జన్మించెను. విరోచన వలన త్వష్టకు విరజు డను నొక

పుత్రుడు జన్మించెను. విరజుని భార్య విషూచి. ఆమెకు విరజుని వలన నూఱుగురు పుత్రులు, ఒక పుత్రిక జన్మించిరి. వారిలో శతజిత్తు శ్రేష్ఠుడు.

## తత్రాయం శ్లోకః

ప్రైయవ్రతం వంశమిమం విరజశ్చరమోద్భవః ।
అకరోదత్యలం కీర్త్యా విష్ణుః సురగణం యథా ॥ 16

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే ప్రియవ్రతవంశానుకీర్తనం నామ
పంచదశోఽధ్యాయః ॥

విరజుని గుణకీర్తన విషయమున ఈశ్లోక మొకటి చెప్పబడినది. విష్ణువు తన ప్రభావముచే దేవతల నలంకరించినట్లు విరజుడుకూడ ప్రియ వ్రతుని వంశమున జన్మించి తనకీర్తిద్వారా ఆవంశమును అలంకరించెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
ప్రియవ్రతవంశానుకీర్తన మను పదునైదవ అధ్యాయము
సంపూర్ణము.





# పదునాఱవ అధ్యాయము

## భూగోళ వర్ణనము

ఈయధ్యాయమున ప్రియవ్రతరాజు యొక్క చరిత్రను వివరించు సందర్భములో శైలవర్షముల నడుమ నున్న సుమేరు పర్వతముయొక్క, జంబూద్వీపము యొక్క పరిమాణము వర్ణింప బడినది.

కథాసారము:- ఈ భూమండల మొకపద్మము వంటిది. సప్తద్వీపములు దానికోశములు. జంబూద్వీప మీకోశముల నడుమ నున్నది. ఇంకను దాని మధ్యభాగమున సువర్ణమయమగు సుమేరు పర్వతమున్నది. దాని యౌన్నత్యము ఎనుబదినాలుగువేల యోజనములు. క్రింద పదునాఱువేల యోజనములు ప్రవేశించి యున్నది. పైభాగమున ముప్పది రెండువేల యోజనములు, పాదదేశమున పదునాఱువేల యోజనములు విస్తృతముగ నున్నది. ఈ శైలరాజము పృథ్వి యనుపద్మమునకు కర్ణికరూపమున నున్నది. ఇలావృత వర్షమునకు దక్షిణమున హిమవంతము, హేమకూటము, నిషధము; ఉత్తరమున నీలశ్వేత శృంగములను పర్వతములు గలవు. ఇవియన్నియు భారతాది వర్షములకు హద్దును నిరూపించు పర్వతములు. ఇట్లు తూర్పున, పశ్చిమమున మాల్యవంతము, గంధమాదనము అనురెండు పర్వతములు గలవు. సుమేరువునకు నలువైపుల మందరము, మేరుమందరము, సుపార్శ్వము, కుముదము అనునాలుగు పర్వతములు గలవు. వీనిలో ఒక్కొక్క దానియొక్క విస్తారము, ఔన్నత్యము పదివేల యోజనములు. ఈనాలుగు పర్వతములయందు పదునొకండు వందల యోజనముల ఎత్తు గల ఆమ్ర జంబు కదంబ వటము లను నాలుగు వృక్షములు; దుగ్ధపూరితము, మధుపూరితము, ఇక్షురసపూరితము, విశుద్ధజల పూరితము, సర్వసిద్ధి ప్రదము నగునాలుగుహ్రదములు; నందనము, చిత్రరథము, వైభ్రాజికము, సర్వతోభద్రము ననునాలుగు దేవోద్యానములు గలవు. సుపార్శ్వపర్వత పార్శ్వదేశమున మహా కదంబ మను ప్రసిద్ధ వృక్షము కలదు. దాని కోటరము (తొఱ్ఱ) నుండి పంచవ్యామ పరిమిత మగు (రెండుచేతులు చాచినచో నడుమ గల పరిమాణమును వ్యామ మందురు) ఐదు మధుధారలు బయల్వెడలుచుండును. అట్లే కుముద మను పర్వతమున శతవల్శ మను వటవృక్ష మున్నది. దాని స్కంధమునుండి కొన్ని నదములు ప్రవహించుచుండును. ఆ నదములు దధి దుగ్ధాది ద్రవ్యములను కావలసినంతగ నిచ్చును. సుమేరువునకు నలువైపుల కురంగము, కురరము, కుసుంభము, వైకంకము, త్రికూటము మున్నగు నిరువది పర్వత శ్రేణులు కర్ణికల వలె సుమేరువునకు కేసర స్వరూపముతో శోభను పెంచు

చుండును. సుమేరువునకు తూర్పుదిక్కున జఠరము, దేవకూటము; పశ్చిమమున పవనము, పారియాత్రము; దక్షిణమున కైలాసము, కరవీరము; ఉత్తరమున త్రిశృంగము, మకరము వను పర్వతములు కలవు. వీనిలో నొక్కొక్కదాని పరిమాణము పదునెనిమిది వేల యోజనములపొడవుగను, రెండువేల యోజనముల వెడల్పుగను, ఎత్తుగను ఉన్నవి. ఈ సుమేరు పర్వతమునకు పైన పదివేల యోజనముల పరిమితమున బ్రహ్మపురి యున్నది. బ్రహ్మపురమునకు నలువైపుల ఇంద్రాదిలోకపాలురపురము లున్నవి. వీనిపరిమాణము బ్రహ్మపురము యొక్క పరిమాణమున నాలుగవ వంతు మాత్రమే యుండును.

## శ్రీ రాజోవాచ

**ఉక్తస్త్వయా భూమండలాయామవిశేషో యావదాదిత్యస్తపతి యత్ర యత్ర చాసౌ జ్యోతిషాం గణైశ్చన్ద్రమా వా సహ దృశ్యతే ॥ 1**

పరీక్షిన్మహారాజు పలికెను :- మహాత్మా ! ఎంతదూరము సూర్యుని ప్రకాశ ముండునో, ఏ యే స్థానములలో చంద్రుడు శుక్ల కృష్ణపక్షములలో నక్షత్రములతో గూడ కనబడుచుండునో అంతవరకు భూమి విస్తరించియున్న దని నీవు చెప్పియున్నావు.

**తత్రాపి ప్రియవ్రతరథచరణపరిఖాతైః సప్తభిః సప్త సిన్ధవ ఉపక్లప్తాః. యత ఏతస్యాః సప్తద్వీపవిశేషవికల్ప స్త్వయా భగవన్ ఖలు సూచితః. ఏత దేవాఖిలమహం మానతో లక్షణతశ్చ సర్వం విజిజ్ఞాసామి ॥ 2**

దేవా ! పృథివియందు ప్రియవ్రతరాజు యొక్క రథచక్రముచే ఏడు పరిఖల ద్వారా సప్తసాగరములు రచితము లైనవి. ఈ సప్తసముద్రముల వలననే పృథివి నడుమ సప్త ద్వీపములను, వానినామములను, పరిమాణములను, లక్షణాది భేదములను సామాన్య భావముతో నీవు చెప్పితివి. ఇపుడు నేను ఈ సర్వద్వీపముల పరిమాణ లక్షణములతో పాటు విశేష వివరణమును తెలిసికొన గోరుచున్నాను.

**భగవతో గుణమయే స్థూలరూప ఆవేశితం మనో హ్యగుణేఽపి సూక్ష్మతమ ఆత్మజ్యోతిషి పరే బ్రహ్మణి భగవతి వాసుదేవాఖ్యే క్షమమావేశితుం తదుహైతద్గురోఽర్హ స్యనువర్ణయితుమితి ॥ 3**

భగవానుని గుణమయ మగు స్థూలస్వరూపమునందు అనగా విరాడ్విగ్రహమునందు నివేశిత మగు మనస్సు శుద్ధసత్త్వమయుడు, అప్రాకృతుడు, స్వప్రకాశుడు, పరబ్రహ్మము నగు వాసుదేవునియందు ప్రవేశింప సమర్థమగును. గురువర్యా ! నీ వా బ్రహ్మాండాత్మక మగు స్థూలస్వరూపము యొక్క విషయమును వర్ణింపుము.

## శ్రీ ఋషిరువాచ

న వై మహారాజ భగవతో మాయాగుణవిభూతేః స్థావిశేషాణాం నామరూపతః కాష్ఠాం వచసా మనసా వాధి గన్తుమలం విబుధా యుషాపి పురుషస్తస్మాత్ ప్రాధాన్యేనైవ భూగోలవిశేషం నామరూపమావలక్షణతో వ్యాఖ్యాస్యామః ॥ 4

ఋషిశ్రేష్ఠు డగుశుకదేవుడు పలికెను :- రాజా ! భగవానుని సత్త్వాదిగుణ పరిణామ రూపము, బ్రహ్మాండాత్మకము నగుమాయయొక్క విభూతికి అంతము లేదు, మానవుడు దేవతల ఆయుర్దాయమును పొందినను వాక్కులద్వారా, మనస్సు ద్వారా ఆవిభూతిలో నున్న లోకముల నామరూపముల యొక్క అంతమును తెలిపి కొనజాలడు. అందువలన నేను కేవలము ప్రధానద్వీపముల నామములను, సన్నివేశములను, పరిమాణములను, చిహ్నములను ఉదహరించి భూగోళమును వర్ణింతును.

యో వాయం ద్వీపః కువలయకమలకోశాభ్యన్తర కోశో నియుతయోజన విశాలః సమవర్తులో యథా పుష్కర పత్రమ్ ॥ 5

భూమండల మొకపద్మమువంటిది. సప్తద్వీపములు దానికోశము వంటివి. జంబూద్వీప మీకోశము యొక్క నడుమ నున్నది. ఈజంబూ ద్వీపము యొక్క విస్తారము పదిలక్షల యోజనముల పరిమితము గలది. అది పద్మపత్రమువలె సమవర్తులాకారమున నున్నది.

యస్మిన్ నవ వర్షాణి నవయోజన సహస్రాయామాన్యష్టభిర్మర్యాదాగిరిభిః సువిభక్తాని భవన్తి ॥ 6

ఈజంబూద్వీపమున తొమ్మిది వర్షములున్నవి (భద్రాశ్వకేతుమాల వర్షములుకాక) ప్రతివర్షము యొక్క పరిమాణము తొమ్మిదివేల యోజనములు. పరిహద్దలను నిర్ణయించు ఎనిమిది పర్వతముల ద్వారా ఈ తొమ్మిది వర్షములు సుందరముగ విభక్తములై ఉన్నవి.

ఏషాం మధ్యే ఇలావృతం నామాభ్యంతరవర్షం యస్య నాభ్యామవస్థితః సర్వతః సౌవర్ణఃకులగిరిరాజో మేరుర్ద్వీపాయామసముచ్ఛ్రాయః కర్ణికాభూతః కువలయకమలస్య మూర్ధని ద్వాత్రింశత్సహస్రయోజనవితతో మూలే షోడశసహస్రం తావతాన్తర్భూమ్యాం ప్రవిష్టః ॥ 7

ఈ తొమ్మిదివర్షములలో ఇలావృత మనువర్షము నడుమ నున్నది. ఈవర్షములో కులాచల శ్రేష్ఠము, సువర్ణమయము నగు సుమేరుపర్వతము కలదు. ఈ మేరువు యొక్క

విస్తారము జంబూద్వీపముయొక్క విస్తారముతో సమానము అనగా లక్షయోజనములు కలదు. ఈపర్వతము భూమండలమను పద్మమునకు కర్ణికవలె నున్నది. దాని శిరోభాగము ముప్పది రెండువేల యోజనములు, పాదదేశము పదునాఱువేల యోజనముల విస్తృతము. పృథివి యందు అది పదునాఱువేలయోజనముల వఱకు ప్రవేశించియున్నది (అందువలన పృథివి నుండి బయట ఎనుబది నాలుగువేల యోజనముల ఎత్తుగ అది యగుపడును).

**ఉత్తరోత్తరేణేలావృతం నీలః శ్వేతః శృంగవానితి త్రయో రమ్యక హిరణ్మయ కురూణాం వర్షాణాం మర్యాదా గిరయః ప్రాగాయతా ఉభయతః క్షారోదావధయోద్వి సహస్ర యోజనపృథవ ఏకైకశః పూర్వస్మాత్ పూర్వ స్మాదుత్తర ఉత్తరో దశాంశాదికాంశేన దైర్ఘ్య ఏవ హ్రసన్తి ॥ 8**

ఇలావృత వర్షమునకు ఉత్తరమున నీలము, శ్వేతము, శృంగవంతము అనుమూడు పర్వతములు క్రమముగ రమ్యక హిరణ్మయ కురు వర్షము లనుమూడింటిని విభక్తము చేయుచున్నది. ఈ మూడు పర్వతములు తూర్పుదిక్కున దీర్ఘములు, తూర్పు పడమరల యందు లవణ సముద్రము వఱకు విస్తృతములు నై యున్నవి. వీనివిస్తారము రెండు వేల యోజనముల పరిమితము. పూర్వపర్వతముల కంటె అవంతర పర్వతములు కేవలము దైర్ఘ్యమునందు ఏకాదశాంకము తక్కువ (ఉన్నతత్వములోను, విస్తారములోను తక్కువ కాదు).

**ఏవం దక్షిణేనేలావృతం నిషధో హేమకూటో హిమాలయ ఇతి ప్రాగాయతా యథా నీలాదయోఽయుతయోజనోత్సేధా హరివర్షకింపురుష భారతానాం యథాసంఖ్యమ్ ॥ 9**

ఇట్లు ఇలావృత వర్షమునకు దక్షిణమున నిషధము, హేమకూటము, హిమాలయము నను మూడు పర్వతములు క్రమముగ విరాజిల్లు చున్నవి. ఈ మూడు పర్వతములు నీలాదుల వలె పూర్వదిక్కున ఆయతములు, పదివేల యోజనముల ఉన్నతములు నై యున్నవి. ఇవి క్రమముగ హరివర్ష కింపురుష భారతవర్షములకు సరిహద్దును నిర్దేశించు పర్వతము లై యున్నవి.

**తథైవేలావృతమపరేణ పూర్వేణ చ మాల్యవద్గంధ మాదనావానీల నిషధాయతౌ ద్విసహస్రం పప్రథతుః కేతుమాల భద్రాశ్వయోః సీమానం విదధాతే ॥ 10**

ఇట్లు ఇలావృత వర్షమునకు పశ్చిమమునందు, తూర్పుదిక్కునందు క్రమముగ మాల్యవంతము, గంధమాదనము అను రెండు సరిహద్దు పర్వతములు గలవు. ఈపర్వతములు రెండును ఉత్తరమున నీలము, దక్షిణమున నిషధము అనుపర్వతముల వఱకు పొడవుగను, రెండువేల యోజనముల విస్తీర్ణము గలిగియున్నవి. ఇవి కేతుమాల భద్రాశ్వ వర్షములకు హద్దును నిర్దేశించు చున్నవి.

మన్దరో మేరుమన్దరః సుపార్శ్వః కుముద ఇత్యయుత యోజనవిస్తారో
న్నాహా మేరోశ్చతుర్దిశమ వష్టంభగిరయ ఉపక్లప్తాః ॥ 11

సుమేరువునకు నలుదిక్కుల మందరము, మేరుమందరము, సుపార్శ్వము, కుముదము నను నాలుగు పర్వతములు మేఖలము (మొలనూలు) వలె నలంకృతము లై యున్నవి. ఈ నాలుగు పర్వతములలో నొక్కొక్క దానియొక్క విస్తారము, ఔన్నత్యము పదివేలయోజనము లున్నది.

చతుర్వే తేషు చూతజంబూకదంబన్య గ్రోధాశ్చత్వారః పాదపప్రవరాః
పర్వతకేతవ ఇవాధిసహస్రయోజనోన్నాహాస్తావ ద్విటపవితతయః శతయోజన
పరిణాహాః ॥ 12

ఈ నాలుగుపర్వతములయందు ఆమ్రము, జంబువు, కదంబము, వటము నను నాలుగువృక్షరాజములు పర్వతములకు నాలుగుధ్వజములవలె నున్నవి. ఈ వృక్షముల విస్తారము శతయోజనములలోను, ఔన్నత్యము పదునొకండు వందలయోజనములలోను నున్నది. వానికొమ్మలు గూడ పదునొకండువందలయోజనముల విస్తృతములో నున్నవి.

హ్రదాశ్చత్వారః పయోమధ్విక్షురసమృష్టజలాః యదుపస్పర్శిన
ఉపదేవగణా యోగైశ్వర్యాణి స్వాభావికాని భరతవర్షభ ధారయన్తి. 13

దేవోద్యానాని చ భవన్తి చత్వారి నన్దనం చైత్రరథం వైభ్రాజకం
పర్వతోభ ద్రమితి ॥ 14

భరతశ్రేష్ఠా! ఈనాలుగు పర్వతముల యందు నాలుగు హ్రదము లున్నవి. వానిలో మొదటిది దుగ్ధపూరితము, రెండవది మధుపూరితము, మూడవది ఇక్షురసపూరితము, నాలుగవది విశుద్ధజలపూరితము. సిద్ధచారణాదు లైన ఉపదేవతలు వానిని సేవించి అనాయాసముగ అణిమాదు లైన యోగైశ్వర్యములను పొందు చుందురు. అచట నందనము, చిత్రరథము, వైభ్రాజకము, సర్వతోభద్రము అను నాలుగు దేవతోద్యానములు గూడ నున్నవి.

యేష్వమరపరివృఢాః సహ సురలలనాలలామయూథ పతయ
ఉపదేవగణై రుపగీయమాన మహిమానః కిల విహరన్తి ॥ 15

అమరవరులు ప్రధానసురవనితలకును భూషణములవంటి వారైన లలనామణులతో (తమ తమ ప్రియురాండ్రతో) గూడి ఈయుద్యానములలో విహరించు చుందురు. అపుడు గంధర్వులు వారిమహిమను గానము చేయు చుందురు.

మన్దరోత్సంగ ఏకాదశశతయోజనోత్తుంగ దేవచూతశిరసో గిరిశిఖర
స్థూలాని ఫలాన్యమృతకల్పాని నిపతన్తి ॥ 16

మందరపర్వతమునకు క్రిందిభాగమున పదునొకండువందలయోజనముల ఉన్నతమున దేవచూత మనునొక ఆమ్రవృక్షము (మామిడిచెట్టు) కలదు. దానిశిరస్సు నుండి గిరిశృంగములవలె స్థూలములు, అమృతతుల్యములు (సుమధురములు) వగు ఫలములు పడుచుండును.

తేషాం విశీర్యమాణానామతిమధురసురభిసుగన్ధిబహులారుణరసోదే
నారుణోదా నామ నదీ మన్దరగిరిశిఖరాన్ని పతన్తీ పూర్వేణేలావృతము
పప్లావయతి ॥ 17

ఈ ఫలము లన్నియు ఎత్తునుండి పడి పగులును, అపుడు వానినుండి అతిమధురము, సువాసనయుక్తము, అరుణవర్ణము నగురసము అధికముగ నిర్గతమై ఇతరవస్తువుల యొక్క సౌరభముతో మిగుల సువాసితమయ్యెను. ఆ రసము జలమువలె ప్రవహించి అరుణోద అమనొకనది యయ్యెను. ఈ నది మందరపర్వతశిఖరమునుండి బయల్వెడలి తూర్పుదిక్కున ఇలా వృతవర్షమువఱకు వ్యాపించి ప్రవహించుచున్నది.

యదుపజోషణాద్భవాన్యా అనుచరీణాం పుణ్యజన వధూనామవ
యవస్పర్శ సుగన్ధవాతో దశయోజనం సమన్తా దమువాసయతి ॥ 18

అరుణోద అనునానదియందలిరసమును సేవించుటచే భవాని యొక్క అనుచరులైన యక్షకాంతలశరీరములనుండి సుగంధము పుట్టుచున్నది. వాయువు సుగంధయుతము లైనవారియవయవముల స్పర్శముచే సువాసితమై నలుదిక్కులను పదియోజనములవఱకు సువాసితముచేయుచున్నది.

ఏవం జంబూఫలానామత్యుచ్చనిపాతవిశీర్ణానామనస్థి ప్రాయాణామిభ
కాయ నిభానాం రసేన జంబూనదీ నామ నదీ మేరుమన్దరశిఖరాదయు తయోజనా
దవనితలే నిపతన్తీ దక్షిణే నాత్మానం యావదిలావృతముపస్యన్దతి ॥ 19

ఇట్లు జంబూవృక్షము (నేరేడుచెట్టు) యొక్కఫలము లన్నియు గజశరీరమువలె నుండును. వీనిలోని బీజము లతిస్వల్పములు. ఈ ఫలములన్నియు ఎత్తునుండి పడి పగులుటచే వానిరసముతో జంబూనది యనునొకనది యయ్యెను. జంబూనది మేరు పర్వతమునకు పదియోజనముల యెత్తులో నున్నశిఖరములనుండి భూమియందు పడి తన కుత్పత్తిస్థాన మగు ఇలా వృతమునకు దక్షిణభాగమునుండి ఆరంభించి ఇలావృతవర్ష మంతట వ్యాపించి ప్రవహించుచుండును.

**తావదుభయోరపి రోధసో ర్యామృత్తికా తద్రసేనాను విధ్యమానా వాయ్వర్క సంయోగవిపాకేన సదామరలోకాభరణం జాంబూనదం నామ సువర్ణం భవతి ॥ 20**

**యదుహ వావ విబుధాదయః సహ యువతిభిర్ముకుట కటకకటి సూత్రాద్యా భరణరూపేణ ఖలు ధారయన్తి ॥ 21**

ఈనదియొక్క రెండుతీరములయందలిమృత్తిక దీనిరసముచే తడిసి వాయుసూర్య సంయోగములచే పరిపక్వము కాగా జాంబూనద మనుపేరుతో సువర్ణ మగును. ఈ సువర్ణముతో దేవతల కలంకారములు నిర్మితము లగుచుండును. దేవతలు స్త్రీలతో కలసి యీసువర్ణముచే నిర్మితములైన కిరీటములు, కంకణములు, కటిసూత్రములు మున్నగు నలంకారములను ధరింతురు.

**యస్తు మహాకదమ్బః సుపార్శ్వ పార్శ్వ నిరూఢ స్తస్య కోటరేభ్యో వినిస్సృతాః పంచాయా మపరిణాహాః పంచ మధుధారాః సుపార్శ్వశిఖరాత్ పతన్త్యో ఽపరేణాత్మానమిలావృత మను మోదయన్తి ॥ 22**

సుపార్శ్వపర్వతమునకు ప్రక్కభాగమున మహాకదంబ మనుప్రసిద్ధ వృక్షమున్న'. దాని తొఱ్ఱనుండి యైదుమధుధారలు బయల్వెడలుచుండును. వీనిలో నొక్కొక్క దాని పరిమాణ మైదువ్యామములు (రెండుచేతులను చాచిన వాని నడుమనుండు పరిమాణమును వ్యామమందురు) ఈ యైదుధారలు సుపార్శ్వపర్వతము పైభాగమునుండి పడి తమతమ ఉత్పత్తి స్థానముల పశ్చిమభాగమునుండి యారంభించి ఇలావృత్తవర్షము నంతటిని సువాసితము చేయును.

**యా హ్యుపయుంజానానాం ముఖనిర్వాసితో వాయుః సమన్తాచ్ఛతయోజన మనువాసయతి ॥ 23**

ఈ యైదుమధుధారలను ఎవరు సేవింతురో వాయువు వారిముఖ నిస్సృతగంధముచే సువాసితమై నలువైపుల నూఱుయోజనములపర్యంతము సురభితముచేయును.

**ఏవం కుముదనిరూఢో యః శతవల్శో నామ వట స్తస్య స్కన్ధేభ్యో నీచీనాః పయోదధిమధుఘృతగుడాన్నాద్యమ్బర శయ్యాసనాభరణాదయః సర్వ ఏవ కామదుఘా నదాః కుముదా గ్రాత్ పతన్తస్తముత్త రేణేలావృతము పయోజయన్తి ॥ 24**

ఇట్లు కుముదపర్వతమునందు శతవల్శ (శతస్కంధ) మను ప్రసిద్ధి చెందిన వట వృక్షము కలదు. దాని స్కంధమునుండి (మొదలునుండి) కొన్ని నదములు ప్రవహించు చున్నవి. అవి అధోముఖముగ కుముదపర్వతము యొక్క శిఖరము నుండి పడుచుండును. ఉత్తరదిక్కుగా ప్రవహించి ఇలా వృతవర్షవాసు లగుజనులకు మహోపకారమును గలుగ జేయుచున్నవి. ఈ సమస్తనదములు దధి దుగ్ధ మధు ఘృత గుడ అన్న వస్త్ర శయ్య ఆసనా భరణాదిసమస్తాభిలషిత ద్రవ్యముల నుత్పత్తి చేయుచున్నవి.

**యానుపజుషాణానాః న కదాచిదపి ప్రజానాం వలీపలిత క్లమస్వేద దౌర్గన్ధ్యజ రామయాపమృత్యుశీతోష్ణవైవర్ణ్యో పసర్గా దయస్తాపవిశేషా భవన్తి యావజ్జీవం సుఖం నిరతిశయమేవ ॥ 25**

ఈనదములనుండి ఉత్పన్నములైన దుగ్ధాదిద్రవ్యములను సేవించు ప్రజల కెప్పుడును చర్మము ముడతలు పడుట, వెంద్రుకలు నెఱయుట, అలయుట, శరీరమునుండి చెమట స్రవించుట, దుర్గంధము బయల్వెడలుట, వార్ధక్యము, రోగము, అపమృత్యువు, శీతాతప బాధ, వైవర్ణ్యము, ఉపసర్గ మున్నగువానివలన సంతాపము కలుగదు. పైగా జీవితాంతము సుఖముగ కాలమును గడుపుచుందురు.

**కురంగ కురర కుసుమ్భ వైకఙ్క త్రికూట శిశిరపతంగ రుచక నిషధ శితివాస కపిల శంఖ వైదూర్య జారుధి హంసర్షభ నాగ కాలంజర నీరదా దయో వింశతిగిరయో మేరోః కర్ణికాయా ఇవ కేసరభూతా మూలదేశే పరిత ఉపక్లప్తాః ॥ 26**

కురంగము, కురరము, కుసుంభము, వైకంకము, త్రికూటము, శిశిరము, పతంగము, రుచకము, నిషధము, శితివాసము, కపిలము, శంఖము, వైడూర్యము, జారుధి, హంసము, ఋషభము, నాగము, కాలంజరము, నీరదము మున్నగునిరువదిపర్వతములు సుమేరు పర్వతముల యొక్క మూలదేశమున నలువైపుల విరచితములై యున్నవి. దానివలన ఈ పర్వతము లన్నియు కర్ణికాస్వరూప మగుసుమేరుపర్వతమునకు కేసరములవలె నుండెను.

జఠర దేవకూటౌ మేరుం పూర్వేణాష్టాదశయోజనసహస్రముదగాయతౌ ద్విసహ స్రం పృథుతుంగౌ భవతః. ఏవమపరేణ పవనపారియాత్రౌ దక్షిణేన కైలాసకరవీరౌ ప్రాగాయతౌ । ఏవముత్తరతస్త్రిశృంగమకరౌ ।అష్టాభిరేతైః పరిసృతోఽగ్నిరివ పరితశ్చకాస్తి కాంచనగిరిః ॥ 27

సుమేరుపర్వతమునకు పూర్వమున జఠరము, దేవకూటము అను రెండుపర్వతము లున్నవి. ఈ పర్వతములు రెండును ఉత్తరదక్షిణముల యందు పదునెనిమిది వేల యోజనముల పొడవు, రెండువేల యోజనముల వెడల్పు, ఎత్తు కలిగియున్నవి. ఇట్లు సుమేరువునకు పశ్చిమదిక్కున పవనము పారియాత్రము అనుపర్వతము లున్నవి. ఇవి రెండును ఉత్తరదక్షిణముల యందు పదునెనిమిది వేలయోజనములపొడవు; విస్తారము నందు, ఔన్నత్యమునందు రెండువేల యోజనములు ఉన్నవి. ఇంకను సుమేరువునకు దక్షిణమున కైలాసము, కరవీరము ననుపర్వతము లున్నవి. ఈ పర్వతములు రెండును తూర్పుపడమరలయందు పదునెనిమిదివేల యోజనములపొడవు, రెండువేలయోజనముల వైశాల్యము, ఎత్తు కలిగిఉన్నవి. ఇట్లు ఉత్తరదిక్కున త్రిశృంగము, మకరము ననుపర్వతము లున్నవి. ఈ పర్వతములు రెండును తూర్పుపడమరలయందు పదునెనిమిది వేల యోజనములపొడవు, రెండువేల యోజనములవైశాల్యము, ఔన్నత్యముకలిగియున్నవి. ఈయెనిమిది పర్వతములచే పరివేష్టిత మైకాంచన గిరి అనగా సుమేరుపర్వతము సంపూర్ణముగ అగ్నివలె ప్రకాశించుచుండును.

మేరోర్మూర్ధని భగవత ఆత్మయోనేర్మధ్యత ఉపక్లప్తాం పురీమయుత యోజన సాహస్రీం సమచతురస్రాం శాతకౌమ్భీం వదన్తి ॥ 28

ఈ పర్వతమునకు పైన నడుమభాగమున బ్రహ్మదేవునిపురము నిర్మితమై యుండును. దాని పరిమాణము సహస్రాయుతయోజనములు, ఈ పురము సువర్ణనిర్మితము, వలు వైపుల సమానము. పండితు లీపురమును 'శాతకౌంభీపురి' మని పలుకుచుందురు.

తామనుపరితో లోకపాలానామష్టానాం యథాదిశం యథారూపం తురీయ మానేన పురోఽష్టావుపక్లప్తాః ॥ 29

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే భువనకోశవర్ణనే
షోడశోఽధ్యాయః ॥

ఈ బ్రహ్మపురమునకు నలువైపుల తూర్పుమున్నగు దిక్కులయందు క్రమముగ ఇంద్రుడు మున్నగు ఎనమండుగురులోకపాలురకు ఎనిమిది పురములు రచితములై యున్నవి. ఈ పురములలో ఒక్కొక్కదానిపరిమాణము బ్రహ్మపురపరిమాణములో చతుర్థాంశము.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములోని
భువనకోశవర్ణన మను పదునాఱవ అధ్యాయము
సంపూర్ణము.





# పదునేడవ అధ్యాయము

## గంగానది వివరణము : శంకరు డొనరించిన సంకర్షణ స్తవము

కథాసారము :- - ఈ యధ్యాయమున ఇలావృతవర్షమునకు నలువైపుల గంగయొక్క గమనము, వైష్ణవప్రవరు డగురుద్రు డొనరించిన సంకర్షణ స్తవము వర్ణింపబడినది.

విష్ణువు బలిచక్రవర్తి యజ్ఞమున త్రివిక్రమ మూర్తిని ధరించి రెండడుగులతో త్రిభువనముల నాక్రమించెను. అప్పుడాయన వామపాదాంగుష్ఠముయొక్క దెబ్బచే బ్రహ్మాండ కటాహముయొక్క పైభాగము విదీర్ణమై ఒక రంధ్ర మేర్పడెను. ఆ రంధ్రముమండి యొక జలధార బయల్వెడలి విష్ణుభగవానుని పాదపద్మములను తడుపుచు సహస్రయుగపరిమిత మగు కాలము స్వర్గశిరోభాగమున ప్రవహించెను. విష్ణుపదమే స్వర్గముయొక్క శిరోభాగము. ఈ జలధారయె విష్ణుపాదోద్భవయు, భువనపావనియు నగు గంగ. దానికి భాగీరథి, జాహ్నవి మున్నగు అనేకనామములు గలవు. విష్ణుపదమునం దున్న ధ్రువుడు, సప్తర్షులు ఈ పవిత్రధారను నిరంతరము మస్తకమున ధరించుచుందురు. వారు సర్వాత్ముడగు శ్రీహరి యొక్క పాదపద్మములయందే ఎల్లపుడు భక్తియోగయుక్తులై ఇతరములైన సుఖైశ్వర్యముల నన్నింటిని తుచ్ఛముగ భావించిరి. హరిపాదపద్మప్రసూత యగు గంగా నది ఆకాశపథమున చంద్రమండలమును ప్లావిత మొనర్చి మొదట సుమేరుశిరమున బ్రహ్మనిలయమునందు పడెను. అచట నాలుగుధారలుగ విభక్తమై సీత, అలకనంద, సంక్షు, భద్ర యను నాలుగు నామములతో సాగరమున ప్రవేశించెను. సీత శేఖరగంధ మాదనపర్వతములమీదుగా భద్రాశ్వవర్షమునడిమిగుండా లవణసముద్రమున ప్రవేశించెను. సంక్షు మాల్యవంతపర్వతము మీదుగా కేతుమాలవర్షమున ప్రవహించి పశ్చిమసముద్రమున ప్రవేశించెను.

భద్ర సుమేరు కుముద నీల శ్వేత శృంగపర్వతముల మీదుగా ఉత్తరకురు దేశమున వ్యాపించి ఉత్తరమున లవణ సాగరమున ప్రవేశించెను. అలకనంద బ్రహ్మలయమునకు దక్షిణమున అనేకపర్వతముల నధిగమించుచు హేమకూట హిమకూటములమీదుగా భారతవర్షమున వ్యాపించి దక్షిణలవణ సముద్రమున ప్రవేశించెను.

ఇంకను ఎన్నియో నదీనదములు ప్రతివర్షమునందును బహుధారలతో ప్రవహించు చుండును. భారతవర్షము కర్మక్షేత్రము. మిగిలిన ఎనిమిది వర్షములు స్వర్గసుఖము నను

భవించు వారికి భోగస్థానములు. అవి నానావిధశోభాసౌందర్యములతోను, సుఖైశ్వర్యముల తోను సమృద్ధము లైనవి. ఈ స్థలములలో దేవతలు వివిధము లగు ఆనందములతో విహరించుచుందురు. ఈ తొమ్మిదివర్షములలోను శ్రీహరి నానారూపములతో ప్రకటు డై జీవులపై కృపజూపును. ఇలా వృతవర్షమున భగవానుడగు భవుడొక్కడే పురుషుడు. ఆయన అచట సఖీ పరివేష్టిత యగు భవానితో విరాజిల్లుచుండును. భవాని శాపముచే అచటికి అన్యపురుషులు వెడలిన స్త్రీత్వమును పొందుదురు. ఈ ప్రదేశమున భవుడు శ్రీహరియొక్క సంకర్షణమూర్తిని సేవించుచుండును. నానారూపములతో ఆయనను స్తుతించి సదానందముతో విహరించుచుండును. ఆయన యిట్లు పలికెను :- 'శ్రీహరీ! నీవు నీ భక్తుల సంసారపాశములను త్రెంపుదువు, అభక్తుల కెల్లపుడును సంసారబంధవము లను గలుగ జేయుదువు. నీకృప లేనిదే యెవ్వరును ఏయుపాయముతో గూడ మాయ నుండి విడివడజాలరు.'

## శ్రీ శుక ఉవాచ

**తత్ర హ భగవతః సాక్షాద్యజ్ఞలింగస్య విష్ణోర్విక్రమతో వామపాదాఙ్గుష్ఠనఖ నిర్భిన్నో ర్ధ్వాణ్డకటాహవివరేణా న్తఃప్రవిష్టా యా బాహ్యజలధారా తచ్చరణపఙ్క జావనే జనారుణకిఞ్జల్కో పరఞ్జితాఖిలజగదఘమలాపహోపస్పర్శనామలా సాక్షాద్భ గవత్పదీత్యనుపలక్షిత వచోఽభిధీయ మానాతి మహతా కాలేన యుగ సహస్రోప లక్షణేన దివో మూర్ధన్యవత తార యత్తద్విష్ణుపదమాహుః ॥ 1**

శుకుడు పలికెను :- రాజా! యజ్ఞమూర్తియు సాక్షాత్తుగ భగవానుడు నగువిష్ణువు బలి చక్రవర్తి చేయు యజ్ఞమునకు వెడలి, త్రివిక్రమమూర్తిని ధరించి, దక్షిణచరణముద్వారా భూమి నాక్రమించి పైకి వామపాదము నెత్తుచుండగా అపు డాయనవామపాదాంగుష్ఠనఖముచే అండకటాహము యొక్క పైభాగము భిన్నమయ్యెను. దానివలన అచట ఒకగర్త మేర్పడెను. ఆగర్తము (గుంట) ద్వారా పృథివ్యాద్యష్టావరణములకు బహిర్భూత మైన కారణార్ణవసంబంధ మైన ఒకచిన్మయజలధార లోపల ప్రవేశించెను. ప్రక్షాళనమువలన భగవానుని పాదపద్మము లనుండి బయల్వెడలిన అరుణవర్ణకుంకుమమే కింజల్కస్వరూపముతో ఈ జలధారకు శోభను చేకూర్చుచున్నది. ఈధార స్పర్శమాత్రముననె బ్రహ్మాండము యొక్క పాపరాశిని క్షాళనముచేయగలుగుచున్నది. కాని అదిమాత్రము మిగుల నిర్మలమే. భూమండలమునం దవతరించుటకు పూర్వ మీధార సాక్షాత్తుగ భగవానుని పాదపద్మములనుండి బయల్వెడ లుటచే 'విష్ణుపది' అను పేరుతో కీర్తింపబడెను. జాహ్నవి, భాగీరథి మున్నగు భిన్నసంజ్ఞలు అప్పుడు లేవు. వేల కొలదియుగములదీర్ఘకాలము గడచినపిమ్మట ఈధార ధ్రువలోకమున అవతరించెను. పండితు లాధ్రువలోకమునె 'విష్ణుపద' మని కీర్తించుచుందురు.

యత్ర హ వావ వీరవ్రత ఔత్తానపాదిః పరమభాగవతోఽస్మత్కులదేవతాచరణారవిన్దోదకమితి యామనుసవన ముత్కృష్యమాణభగవద్భక్తియోగేన దృఢం క్లిద్యమానా న్తర్హృదయ ఔత్కంఠ్యావివశామీలితలోచనయుగలకుట్మల విగలి తామల బాష్పకలయాభివ్యజ్యమానరోమపులకకులకోఽధునాపి పరమాదరేణ శిరసా బిభర్తి ॥ 2

దృఢసంకల్పుడు, ఉత్తానపాదతనయుడు, పరమభాగవతుడు నగుధ్రువు డావిష్ణులోకమునమండి 'ఇది మాకులదేవత యగువిష్ణుభగవానుని చరణోదక' మనిభావించి ఇప్పుడు గూడ పరమాదరముతో శిరముతో ఈ జలధారను (గంగను) ధరించుచుండును. ఆ మహాత్ముని (ధ్రువుని) హృదయము ప్రతిక్షణము వృద్ధిపొందు భక్తియోగముచే మిగుల ఆర్ద్రమగు చుండును. ఉత్కంఠతవలన వివశము, ఈషన్నిమీలితలోచవకుట్మపలముల నుండి నిర్మలము అనగా కాపట్యము లేనిబాష్పధార ప్రవహించుచుండును. సర్వశరీరము పులకాంకితమగుచుండును.

తతః సప్తర్షయస్తత్ప్రభావాభిజ్ఞా ఇయం నను తపస ఆత్యన్తికీ సిద్ధిరేతావతీతి భగవతి సర్వాత్మని వాసుదేవేఽనుపరతభక్తియోగలాభేనైవో పేక్షితాన్యార్థాత్మగతయో ముక్తి మివాగతాం ముముక్షవ ఇవ సబహుమానమద్యాపి జటాజూటై రుద్వహన్తి. 3

సప్తర్షులు గంగాప్రభావమును జక్కగ తెలిసికొనినవారై 'ఈమెయె తపస్సువ కాత్యంతిక సిద్ధి యనియు, ఇంతకన్న మించినదేదియు లేదనియు' నిశ్చయించుకొని వేటివఅకును ఈవారిధారను తమతమజడలద్వారా ధరించుచున్నారు. వారు సర్వాత్ము డగువాసుదేవుని పై అవిచ్ఛేద్య మగుభక్తి యోగమును కలిగియుండి ఇతర పురుషార్థములు, ఆత్మజ్ఞానము మున్నగు వాని నుపేక్షించిరి. ముముక్షువులు ముక్తిని గౌరవించినట్లు వారు (సప్తర్షులు) విష్ణుపాదపద్మోద్భవ యగుగంగనే పరమాదరముతో అంగీకరింతురు.

తతోఽనేకసహస్రకోటివిమానానీకసంకులదేవయానేనావతరన్తీన్దుమండ లమావార్య బ్రహ్మసదనే నిపతతి ॥ 4

ఈధార సప్తర్షిమండలమునుండి అనంతకోటివిమాన సమూహములచే సంకులమైన ఆకాశమార్గముద్వారా క్రిందకు దిగినది, పిమ్మట చంద్రలోకమును ముంచివేసి మేరు పర్వతశిఖరమున నున్న బ్రహ్మసదనమున పతితమయ్యెను.

**తత్ర చతుర్ధా విద్యమానా చతుర్భిర్నామభిశ్చతుర్దిశ మభిస్యన్దన్తీ నదనదీపతిమే వాభినివిశతి, సీతాలకనన్దా వంక్షుర్భద్రేతి ॥ 5**

అచట నాలుగుధారలుగ విభక్తయై నాలుగు వేఱువేఱునామములతో నలువైపుల వెడలి సరిత్పతి యగుసముద్రమునందు ప్రవేశించెను. ఈ నాలుగుధారలనామములు వరుసగ సీత, అలకనంద, వంక్షు, భద్ర అనునవి.

**సీతా తు బ్రహ్మసదనాత్ కేశరాచలాదిశిఖరేభ్యోఽధోఽధః ప్రస్రవంతీ గన్ధమాదన మూర్ధసు పతిత్వాన్తరేణ భద్రాశ్వం వర్షం ప్రాచ్యాం దిశి క్షార సముద్రమభి ప్రవిశతి ॥ 6**

వానిలో సీత బ్రహ్మసదనమునుండి బహిర్గత యై మిగుల యున్నతము లైనకేసరాచల ప్రధానశిఖరములపై పడుచుండును. పిమ్మట యా శృంగములనుండి క్రమముగ క్రిందకు ప్రవహించి గంధమాదనపర్వతము పై భాగమున పడెను. అనంతరము భద్రాశ్వ వర్షము నడుమనుండి లవణ సముద్రములోనికి ప్రవేశించెను.

**ఏవం మాల్యవచ్ఛిఖరాన్నిష్పతన్తీ తత అనుపరతవేగా కేతుమాలమభి వంక్షుః ప్రతీచ్యాం దిశి సరిత్పతిం ప్రవిశతి ॥ 7**

ఇట్లు వంక్షునది మాల్యవంతపర్వతశిఖరప్రదేశమునుండి పడి దాని క్రిందిభాగము నకు ప్రవహించినది, అప్రతిహతవేగముతో కేతుమాలవర్షమును ప్లావిత మొనరించుచు పశ్చిమదిక్కున సముద్రములో ప్రవేశించెను.

**భద్రా చోత్తరతో మేరుశిరసో నిపతితా గిరిశిఖరాద్గిరి శిఖరమతిహాయ శృంగవతః శృంగాదధః స్యన్దమానా ఉత్తరాంస్తు కురూనభిత ఉదీచ్యాం దిశి లవణా ర్ణవమభిప్రవిశతి ॥ 8**

భద్ర యనుధార ఉత్తరదిక్కున సుమేరుశిఖరమునుండి పడినదియై కుముద పర్వత శిఖర ప్రదేశమునుండి పైకివెడలి నీలగిరిశిఖరమునందు, అచటి నుండి బయలుదేరి శ్వేత పర్వతశిఖరమునందు పడి అచటినుండి బయలుదేరి శృంగవంతపర్వతశిఖరమునుండి క్రిందకు ప్రవహించి ఉత్తరకురుదేశమున వ్యాపించి యుత్తరదిక్కున లవణసముద్రము లోనికి ప్రవేశించెను.

**తథైవాలకనన్దా దక్షిణేన బ్రహ్మసదనాద్బహూని గిరికూటాన్యతిక్రమ్య హేమకూట హిమకూటాన్యతిరభసతర రంహసా లుఠన్తీ భారతమభివర్షం దక్షిణస్యాందిశి లవణ జలధి మభిప్రవిశతి (యస్యాం స్నానార్థంచాగచ్ఛతః**

ఇట్లు అలకనందయు దక్షిణదిక్కుగుండా బ్రహ్మసదనమునుండి పతితయై ఎన్నియో పర్వతశిఖరముల నతిక్రమించి అస్ఖలిత మగుతీవ్ర వేగముతో హేమకూటహిమకూటముల మీద నుండి దుముకుచు భారతవర్షమున వ్యాపించి దక్షిణదిక్కున లవణసముద్రమున ప్రవేశించుచున్నది. దీనియందు స్నానార్థమై యేతెంచు పురుషులకు అడుగడుగున అశ్వ మేధరాజ సూయాదియజ్ఞ ఫలము కలుగుట దుర్లభముకాదు.

**అన్యే చ నదా నద్యశ్చవర్షే వర్షే సన్తి బహుశో మేర్వాదిగిరిదుహితరః శతశః ॥10**

ఇతరములైన ఎన్నియో నదీనదములుగూడ సుమేరువు మున్నగు పర్వతములనుండి బయల్వెడలి ప్రతివర్షమునందును వందలకొలది ధారలతో ప్రవహించుచుండును.

**తత్రాపి భారతమేవ వర్షం కర్మక్షేత్రమన్యాన్యష్ట వర్షాణి స్వర్గిణాం పుణ్య శేషోప భోగస్థానాని భౌమస్వర్గపదాని వ్యపదిశన్తి ॥ 11**

సర్వవర్షములలో ఈ భారతవర్షమే కర్మక్షేత్ర మనిచెప్పబడుచున్నది. ఇతరములైన ఎనిమిదివర్షములు స్వర్గవాసు లైనపుణ్యాత్ములకు పుణ్యశేషోపభోగస్థానములు. దివ్యస్వర్గము, భౌమస్వర్గము, బిలస్వర్గము నని స్వర్గములు మూడువిధములు. వానిలో భౌమస్వర్గమునందే ఈ అష్టవర్షములున్న వనిపండితులు చెప్పుచున్నారు.

**ఏషు పురుషాణామయుతపురుషాయుర్వర్షాణాం దేవ కల్పానాం నాగా యుత ప్రాణానాం వజ్రసంహనన బలవయో మోదప్రముదిత మహాసౌరత మిథునవ్యవాయా పవర్గవర్ష ధృతైకగర్భకళత్రాణాం త్రేతాయుగసమః కాలో వర్తతే ॥ 12**

ఈ యష్టవర్షములలో నివసించు మానవులపరమాయువు మనుష్య ప్రమాణము ననుసరించి పదివేలసంవత్సరములు. వారు దేవతుల్యులు. వారు పదివేలయేనుగులబలము గలవారు. వారిశరీరము వజ్రమువలె దృఢమైనది. వారు యౌవనబలహర్ష సంపన్నులు. స్త్రీపురుషు లట్టిశరీరములతో పరమానందముగ సాంగత్యసుఖము ననుభవించుచుందురు. భోగములు పూర్తికాగా అనంతరము వారి పరమాయు వొకసంవత్సరముమాత్రము మిగులును. వారిస్త్రీ లొకమారు గర్భమును దాల్తురు. అందువలన అచట నేటికిన త్రేతాయుగమే ప్రవర్తిల్లుచున్నది.

**యత్ర హ దేవపతయః స్వైః స్వైర్గణనాయకైర్విహిత మహార్హణాః సర్వర్తుకుసుమస్త బకఫలకిసలయశ్రియా నానమ్యమాన విటపలతావిటపి భిరుపశుమ్భ మానరుచిరకాన నాశ్రమాయతన వర్షగిరిద్రోణీషు తథా చామల**

**జలాశయేషు వికచవివిధనవవనరుహా మోదప్రముదితరాజహంస కలహంస జలకుక్కుట కారణ్డవసారస చక్రవాకాదిభిర్మధు కరనికరా కృతిభిరుప కూజితేషు జలక్రీడాదిభిర్విచిత్రవినోదైః సులలితసురసున్దరీణాం కామకలిల విలాసహాసలీలావలోకాకృష్టమనోదృష్టయః స్వైరం విహరన్తి ॥ 13**

ఈ వర్షములలో సర్వఋతువులయందు పుష్పగుచ్ఛఫలకిసలయభారముచే అవనతములైన వృక్షములచేత, తదాశ్రితములైన లతాసమూహముల చేత శోభిల్లు కానన ములు, వానిలో ఆశ్రమములు శోభిల్లుచున్నవి. అచట వర్షములకు హద్దులను నిర్ణయించు రెండుపర్వతములనడుమ జలాశయములున్నవి. వానియందు ప్రస్ఫుటితము లగునానావిధ నూతనపద్మములసౌరభములచే పరిమళించినవై రాజహంసలు, కలహంసలు, జలకుక్కుట ములు, కారణ్డవములు, సారసములు, చక్రవాకములు మున్నగుపక్షులు ,మధుకరనికరములు, నానావిధశబ్దముల జేయుచుండును. ఇట్టి యుద్యానవనములలో నిర్మల జలాశయములలో వర్షవాసులగుదేవపతులు పరమానందముతోడ క్రీడించుచుందురు. అపుడు సుందరు లగుసురాంగనలకామక్షుబ్ధవిలాసహాస కటాక్షావలోకనములచే వారి (దేవతల) మనస్సు నయన ములు ఆ కృష్టము లగుచుండును. ఆ దేవపతుల భృత్యులు వారిని స్రక్చందనప్రభృతి బహువిధము లగునుపచారములతో సేవించుచుందురు.

**నవస్వపి వర్షేషు భగవాన్ నారాయణో మహాపురుషః పురుషాణాం తదనుగ్రహా యాత్మ తత్త్వవ్యూహేనాత్మ నాద్యాపి సన్నిధీయతే ॥ 14**

తొమ్మిదివర్షములలోను పరమపురుషు డగునారాయణుడు తనభక్తుల ననుగ్రహించు టకై తనసంకర్షణాదివ్యూహతత్త్వములతోపాటు నేటికిని సన్నిహితుడగుచున్నాడు.

**ఇలావృతే తు భగవాన్ భవ ఏక ఏవ పుమాన్, న హ్యన్యస్తత్రాపరో నిర్వి శతి భవాన్యాః శాపనిమిత్తజ్ఞః। యత్ప్రవేష్టుః స్త్రీభావస్తత్పశ్చాద్వక్ష్యామః ॥ 15**

ఇలావృతవర్షమున ఐశ్వర్యశాలి యగుశివుడె యేకైకపురుషుడు. అచట మఱియొక పురుషుడు లేడు. భవానీ శాపవృత్తాంతము నెఱింగినవా రెప్పుడును అచటికి వెడలరు. ఆ విషయము నెఱుంగనివారు ప్రవేశించినచో వెంటనే స్త్రీత్వమును పొందుదురు. ఈశాపమును గురించి తరువాత (నవమస్కంధమున) వివరింతుము.

**భవానీనాథైః స్త్రీగణార్బుదసహస్రై రవరుధ్యమానో భగవతశ్చతుర్మూర్తే ర్మహాపురు షస్య తురీయాం తామసీం మూర్తిం ప్రకృతిమాత్మనః సంకర్షణ సంజ్ఞామాత్మసమాధి రూపేణ సన్నిధాప్యైతదభిగృణన్ భవ ఉపధావతి ॥ 16**

ఈవర్షమున భగవాను డగుభవుడు భవానియొక్క అర్బుదసహస్ర పరిచారికలచే సేవింపబడుచుండును. వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ సంకర్షణు లనునారాయణుని నాలుగు మూర్తులలో నాలుగవమూర్తినామము సంకర్షణుడు. శుద్ధచిన్మయ మయ్యును జగత్సం హారాదితామసిక కార్యములవలన ఈ మూర్తి వ్యావహారికదృష్టితో 'తామసి' యనిచెప్ప బడును. భవు డామూర్తిని తనకు అంశి లేదా మూలకారణ మనియెఱింగి దానియందు చిత్తమును ప్రవేశపెట్టి ఈమంత్రమును జపించుచు ఉపాసించుచుండును.

## శ్రీభగవానువాచ

**ఓం నమో భగవతే మహాపురుషాయ సర్వగుణసంఖ్యానాయానన్తాయా వ్యక్తాయ నమ ఇతి ॥ 17**

ఐశ్వర్యశాలి యగుభవు డీమంత్రముతో సంకరణ్షుని స్తుతించుచుండును;- ప్రణవము నుచ్చరించి నేనామహాపురుషు డగుభగవానునకు నమస్కరించుచున్నాను. ఆయన సర్వ గుణప్రకాశకుడు, కాని స్వయముగ అప్రమేయుడు, అనంతుడు.

**భజే భజేన్యారణపాదపంకజం**
**భగస్య కృత్స్నస్య పరం పరాయణమ్ ।**
**భక్తేష్వలం భావితభూతభావనం**
**భవాపహం త్వా భవభావమీశ్వరమ్ ॥ 18**

సేవింపదగినదేవా ! నీవు పరమేశ్వరుడవు. అభయము లగునీపాద పద్మములు భక్తులభయమును నశింపజేయును. నీవు ఐశ్వర్యాదిషడ్గుణములకు శ్రేష్ఠమైన ఆశ్రయస్థలము వై యున్నావు. నీవు నీభక్తులయెదుట భక్తపాలకస్వరూప మగునిజరూపమును ప్రకటింతువు. ప్రభూ ! నీవు భక్తుల సంసారమును నశింపజేయుచుందువు. అభక్తులకు సంసారాసక్తిని గలుగజేయుచుందువు. పరమేశా ! నేను నిన్ను సేవించుచున్నాను.

**న యస్య మాయాగుణచిత్తవృత్తిభి -**
**ర్నిరీక్షతో హ్యణ్వపి దృష్టిరజ్యతే ।**
**ఈశే యథా నోఽజితమన్యురంహసాం**
**కస్తం న మన్యేత జిగీషురాత్మనః ॥ 19**

నేను క్రోధవేగమును జయింపజాలకున్నాను. అందువలన నాదృష్టిరాగద్వేషాదులద్వారా మాయికవిషయములయందు లగ్న మగునట్లు, పరమేశ్వరుడు శాసనము చేయునిమిత్తమై

విశ్వము నీక్షించినను ఆయనదృష్టి నావలె ఈమాయికవిషయములయం దణుమాత్రము గూడ లగ్నము కాదు. అందువలన ఇంద్రియజయాభిలాషి యగుముముక్షు వెవ్వ డైనను ఆ భగవంతుని సేవింపకుండునా ?

అసద్దృశో యః ప్రతిభాతి మాయయా
క్షీబేవ మధ్వాసవతామ్రలోచనః ।
న నాగవధ్వోఽర్హణ ఈశిరే హ్రియా
యత్పాదయోః స్పర్శనధర్షితేన్ద్రియాః ॥ 20

అసద్దృష్టి గలమానవునియెదుట మధువును ఆసవమును పానము చేయుటవలన రక్తనేత్రుడు, వివేకహీనుడు, ఉన్మత్తుడు నగుపురుషునివలె భయంకరమూర్తితో గనబడుదువు (వాస్తవముగ అతడు స్వయముగ నిత్యానందస్వరూపుడు, బద్ధజీవునివలె వానికి వివేకాదులు లేకుండగపోవవు), అర్చనసమయమున ఎవరిపాదస్పర్శమువలననె నాగవధువులు ముగ్ధమన స్కులై యుందురో, లజ్జవలన ఇంకను అన్యోన్యము లైన అంగముల నర్చనచేయజాలకపోవు చున్నారో అట్టి భగవాను నెవరు ఆదరింపక నుందురు?

యమాహురస్య స్థితిజన్మసంయమం
త్రిభిర్విహీనం యమనన్తమృషయః ।
న వేద సిద్ధార్థమివ క్వచిత్ స్థితం
భూమణ్డలం మూర్ధసహస్రధామసు ॥ 21

ఋషు లెవనిని విశ్వముయొక్కసృష్టిస్థితిలయములకు కారణుడనియు, స్థిత్యాది (సత్త్వాది) గుణరహితుడనియు చెప్పుచున్నారో, ఎవనిని అనంతు డనిపిలచుచున్నారో ఆ యనంతదేవుని సహస్రఫణరూప మగు ధామముయొక్క ఏకదేశమున నొక ఆవగింజవలె నున్న భూమండలము ఆయన లెక్కలోనికి రాదు. ఆ యనంతదేవుని ఎవరాదరింపరు?

యస్యాద్య ఆసీద్గుణవిగ్రహో మహాన్
విజ్ఞానధిష్ణ్యో భగవానజః కిల ।
యత్సంభవోఽహం త్రివృతా స్వతేజసా
వైకారికం తామసమైన్ద్రియం సృజే ॥ 22

ఏతే వయం యస్య వశే మహాత్మనః
స్థితాః శకున్తా ఇవ సూత్రయన్త్రితాః ।
మహానహం వైకృతతామసైన్ద్రియాః
సృజామ సర్వే యదనుగ్రహాదిదమ్ ॥ 23

సంకర్షణునినుండి బుద్ధి కాశ్రయస్వరూపుడు, రజోగుణప్రధానుడు, మహత్తత్త్వ శరీరముగలవాడు నగుబ్రహ్మ ఉదయమగుచుండును. ఆబ్రహ్మవలన అహంకారతత్త్వ రూపుడ నగునేను (రుద్రుడు) జన్మించి త్రిగుణాత్మక మగునాతేజోబలముచే దేవతా వర్గమును, పంచభూతములను, ఇంద్రియములను సృష్టించితిని. ఆమహాత్మునకు వశులమై ఆయనయను గ్రహముచే దేవతలు, భూతములు, ఇంద్రియములు, బ్రహ్మ, రుద్రుడవగునేమ - అందఱము త్రాటిచే గట్టబడినపక్షులవలె నియమితుల మై యీ విశ్వమును సృష్టింప సమర్థుల మైతిమి. భగవాను డగునాయనంతునకు నమస్కరించుచున్నాను.

యన్నిర్మితాం కర్హ్యపి కర్మపర్వణీం
మాయాం జనోఽయం గుణసంగమోహితః ।
న వేద నిస్తారణయోగమంజసా
తస్మై నమస్తేవిలయోదయాత్మనే ॥ 24

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే భువనకోశే
సప్తదశోఽధ్యాయః ॥

ఆయనచే నిర్మిత మగుమాయ మమ్ము కర్మబంధనములచే బంధించుచున్నది. మాయావిమోహితు లగుమావంటివ్యక్తులు ఆయనదయ లేనిదే దానిని తరించు ఉపాయము నెఱుంగజాలకపోవుచున్నారు. ఆయనవలననే ఈవిశ్వమునకు సృష్టియు, నాశము కలుగుచున్నవి. సర్వకారణకారణు డగుఆభగవానునకు నమస్కరించుచున్నాను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
పదునేడవ అధ్యాయము
సంపూర్ణము.



# పదునెనిమిదవ అధ్యాయము

## విభిన్నవర్షముల వర్ణనము

కథాసారము :- ఈ యధ్యాయమున భద్రాశ్వాదులైన ఆఱువర్షములలో భద్రశ్రవుడు మున్నగువారికి ఉపాస్యులైన హయశీర్షాదుల విషయము వర్ణింపబడినది.

ఈ భద్రాశ్వవర్షమున కధిపతి భద్రశ్రవుడు. అతడీవర్షమున ప్రధానసేవకులతో గూడి హయగ్రీవమూర్తిని ఉపాసించుచుండును. కల్పాంతమున దైత్యరూపులగు అజ్ఞానులు వేదముల నపహరింపగా శ్రీహరి హయగ్రీవమూర్తిని ధరించి వేదముల నుద్ధరించి, వానిని బ్రహ్మదేవున కిచ్చును.

హరివర్షమున ప్రహ్లాదాదిమహాభాగవతుల కుపాస్యరూపముగ నృసింహదేవు డవతరించెను. నృసింహావతరణమునకు గల కారణము సప్తమస్కంధమున వర్ణితమైనది. ఈవర్షవాసులగు మానవులు నృసింహ దేవునికడ విషయాసక్తి రాహిత్యమును, భగవానుని యందు అహైతుకభక్తిని ప్రార్థించుచు నిరంతరము ఆయన నుపాసించుచుందురు.

భగవద్భక్తుల సాంగత్యమువలననే భగవానుని ప్రభావము నెఱుగనగును. దీనికి గంగాదితీర్థసేవలకంటె భగవద్భక్తి శ్రేష్ఠతయే శాస్త్రములయందు కీర్తిత మైనది. భగవద్భక్తుల హృదయమున జ్ఞానవైరాగ్యాదిగుణములతో పాటు సర్వదేవతలకు స్థాన ముండును. భక్తులు కానివారిహృదయమున మహద్గుణము లుండజాలవు. వారిహృదయ మెల్లపుడు బహిర్విషయములయం దాసక్త మైయుండును. భగవానుడొక్కడె సర్వభూతాంతరాత్మ, ఇష్టదేవుడు నై యున్నాడు. ఆయనయందలి ఆసక్తియె సర్వశాస్త్రముల ముఖ్యతాత్పర్యము. కాని శాస్త్రాదులను జదివియు భగవానునియం దాసక్తిని కలిగియుండనివాని శాస్త్రాభ్యాసజనిత పరిశ్రమ యంతయు వ్యర్థమే యగు నని తెలిసికొనవలెను. అందువలన రాగతృష్ణ మున్నగు క్లేశములకు మూలకారణ మగు గృహాదుల యం దాసక్తిని పరిత్యజించి భగవదుపాసనచేయుటయే జీవుని కర్తవ్యము.

కేతుమాలవర్షమున భగవానుడు మనోహర మగు కామదేవరూపమును ప్రకటించి విరాజిల్లుచుండును. ఈవర్షమున లక్ష్మీదేవి రేయింబవళ్ళు తత్తదధిష్ఠాత్రు దేవతలతో గలిసి సాహసమునకు తేజస్సునకు బలమునకు ఏకమాత్రకారణుడు, షోడశకళాపరిపూర్ణుడు నగు హృషీకేశుని సేవించుచుండును. భగవానుడె సర్వవిధభయములనుండి జీవుని రక్షింప గలడు. కనుక ఆయనయే పతిశబ్దవాచ్యుడు.

రమ్యకవర్షమున మనువు నేటివఱకును శుద్ధసత్త్వస్వరూపుడు, నిఖిలబ్రహ్మాండములకు నియంతయు, ఇంద్రాదిలోకపాలురకుగూడ పాలకుడు నగు మత్స్యరూపుని ఉపాసించు చుండును.

హిరణ్మయవర్షమున విష్ణుభగవానుడు కూర్మరూపమును ధరించి విరాజిల్లుచుండును. ఈ వర్షమున అర్యముడు వర్షవాసు లగు మానవులతోగూడి ఈమూర్తిని ఉపాసించు చుండును.

ఉత్తరకురువర్షమున శ్రీహరిభగవానుడు వరాహరూపమును ధరించి కురుఖండవాసుల కుపాస్యరూపమున విరాజిల్లుచుండును.

## శ్రీశుక ఉవాచ

**తథా చ భద్రశ్రవా నామ ధర్మసుతస్తత్కులపతయః పురుషా భద్రాశ్వవర్షే సాక్షాద్భగవతో వాసుదేవస్య ప్రియాం తనుం ధర్మమయీం హయశీర్షాభిధానాం పరమేణ సమాధినా సన్నిధాప్యేదమభిగృణన్త ఉపధావన్తి ॥ 1**

శుకుడు పలికెను : ఇట్లు భద్రాశ్వవర్షమున ధర్మసుతు డగుభద్రశ్రవుడు, ఆతనిప్రధాన సేవకులు నివసించుచుందురు. వారు సాక్షాత్తుగ వాసుదేవున కతిప్రియము, ధర్మమయము నగుహయగ్రీవరూపమును పరమ సమాధియోగముతో హృదయమున నిలుపుకొని చెప్పబోవుమంత్రముతో స్తుతించుచుందురు.

## శ్రీభద్రశ్రవస ఊచుః

**ఓం నమో భగవ తే ధర్మాయాత్మ విశోధనాయ నమ ఇతి ॥ 2**

భద్రశ్రవుడు, తదనుచరులు పలికిరి : మేము ధర్మదేవునకు నమస్కరించుచున్నాము. ఆయన జీవులయవిద్యారూప మగుమాలిన్యమును పోగొట్టి విశేషముగ ఆత్మశోధనము చేయును, అట్టిభగవానునకు నమస్కరించుచున్నాము.

**అహో విచిత్రం భగవద్విచేష్టితం**
**ఘ్నన్తం జనోఽయం హి మిషన్ న పశ్యతి ।**
**ధ్యాయన్నసద్యర్హి వికర్మ సేవితుం**
**నిర్హృత్య పుత్రం పితరం జిజీవిషతి ॥ 3**

ఆహా! ఎంతటి యాశ్చర్యము! ఈమానవులు ప్రాణముల నపహరించుమృత్యువును జూచియు చూడనట్లే యున్నారు. మరణించినతండ్రిని లేదా పుత్రులను దహనముచేసియు

వారు (జీవించినతండ్రి లేదా కొడుకులు) వారియొక్క (మరణించినతండ్రి లేదా కొడుకుల యొక్క) ధనముద్వారానే తుచ్ఛవిషయసుఖముల ననుభవింపవలయు నను ఆశతో జీవింపగోరు చున్నారుగదా !

వదన్తి విశ్వం కవయః స్మ నశ్వరం
పశ్యన్తి చాధ్యాత్మవిదో విపశ్చితః ।
తథాపి ముహ్యన్తి తవాజ మాయయా
సువిస్మితం కృత్యమజం నతోఽస్మి తమ్ ॥ 4

అజుడా ! వేదాంతవిద్య నభ్యసించుజ్ఞానులు, వివేకముగలవారు విశ్వమును నశ్వర మనికీర్తించుచుందురు, సమాధిసమయమున దాని నశ్వరత్వమును ప్రత్యక్షరూపమున అనుభవింతురు. అయినను నీమాయచేత జనులు మోహితులగుచున్నారు, అది నీలీలయే. ప్రభూ! నీమాయ మిగుల చమత్కారమైనది. అట్టినీకు నమస్కరించుచున్నాను.

విశ్వోద్భవస్థాననిరోధకర్మ తే
హ్యకర్తురంగీకృతమప్యపావృతః ।
యుక్తం న చిత్రం త్వయి కార్యకారణే
సర్వాత్మని వ్యతిరిక్తే చ వస్తుని ॥ 5

నీవు నిరావరణుడవు, అకర్తవు అయ్యును వేదములో విశ్వము యొక్క సృష్టిస్థితి లయములు నీవలననే జరుగుచున్న వనిచెప్పబడినది. దానిలో నాశ్చర్య మేదియు లేదు. అది యుపయుక్తమే యైనది. నీయచింత్యశక్తివలన సర్వము సంభవమే, నీవు కార్యమునకు గారణుడవు, సర్వుల కాత్మవు, అయినను అన్నింటికంటె అభిన్నుడవు నై యున్నావు. ఇది నీయచింత్యశక్తి పరిచయమే.

వేదాన్ యుగాన్తే తమసా తిరస్కృతాన్
రసాతలాద్యో నృతురంగవిగ్రహః ।
ప్రత్యాదదే వై కవయేఽభియాచతే
తస్మై నమస్తేఽవితథేహితాయ ॥ఇతి॥ 6

కల్పాంతసమయమున దైత్యరూప మగుఅజ్ఞానము వేదముల నపహరింపగా నీవు హయగ్రీవమూర్తిని ధరించి రసాతలమునుండి వాని నుద్ధరించితివి. బ్రహ్మ ప్రార్థింపగా ఆవేదముల నన్నింటిని ఆయనకు సమర్పించితివి. సత్యసంకల్పుడ వగునీకు నమస్కరించు చున్నాను.

హరివర్షే చాపి భగవాన్ నరహరిరూపేణాస్తే తద్రూప గ్రహణ నిమిత్తముత్తర త్రాభిధాస్యే । తద్దయితం రూపం మహాపురుషగుణభాజనో మహాభాగవతో దైత్య దాన వకులతీర్థీకరణ శీలాచరిత: ప్రహ్లాదో వ్యవధానా నన్యభక్తియోగేన సహ తద్వర్షపురు షైరుపాస్తే ఇదం చోదాహరతి ॥ 7

(శుకదేవుడు పలికెను : రాజా!) హరివర్షమునందును భగవానుడు నృసింహరూపముతో నుండును. భగవాను డేకారణముచే నృసింహరూపమును ధరించెనో ఆవిషయము పిమ్మట (సప్తమస్కంధమున) వర్ణింతును. మహాపురుషులగుణముల కాశ్రయుడు, భాగవత శ్రేష్ఠుడు, దైత్యదానవకులమునకు (తనక్షేమమును వాంఛించువ్యక్తిమాత్రునకు) పవిత్రతను సాధించు చరిత్రగలవాడు. నగుప్రహ్లాదుడు ఆ వర్షవాసు లగుపురుషులతోపాటు అవిచ్ఛిన్నము, అవ్యభిచారియు నగు భక్తియోగముద్వారా ఆ ప్రియవిగ్రహమును (ప్రహ్లాదున కభీష్ట మగుసింహమూర్తిని) ఆరాధించును. క్రింద చెప్పబోవు మంత్రస్తోత్రాదులను జపించును, పఠించును.

ఓం నమో భగవతే శ్రీనరసింహాయ నమస్తేజస్తేజసే ఆవిరావిర్భవ వజ్రనఖ వజ్రదంష్ట్ర కర్మాశయాన్ రన్ధయ రన్ధయ తమో గ్రస గ్రస ఓం స్వాహా అభయమభయమాత్మని భూయిష్ఠా: ఓం క్ష్రౌమ్ ఇతి ॥ 8

శ్రీనృసింహదేవునకు నమస్కారము. ఆయన తేజస్సులకుగూడ తేజస్వియి యున్నాడు. వజ్రనఖా! వజ్రదంష్ట్రా! మాకర్మవాసనల నన్నింటిని దగ్ధముచేయుము, అజ్ఞానాంధకారమును నాశముచేయుము. నీవలన మా యాత్మలయం దభయము కలుగుగాక !

స్వస్త్యస్తు విశ్వస్య ఖల: ప్రసీదతాం
ధ్యాయన్తు భూతాని శివం మిథో ధియా ।
మనశ్చ భద్రం భజతాదధోక్షజే
ఆవేశ్యతాం నో మతిరప్యహైతుకీ ॥ 9

సర్వజగత్తునకు శుభము కలుగుగాక! దుష్టు లగువ్యక్తులు అనుకూలు రగుదురుగాక! ప్రాణులు (బుద్ధియోగముతో) పరస్పరము శుభచింతకు లగుదురుగాక ! వారిమనస్సు శుభమును (ఉపశమాదులను) భజించు గాక! మాబుద్ధి నిష్కామ మై అధోక్షజు డగుశ్రీహరి యందు ప్రవేశించు గాక !

మాగారదారాత్మజవిత్తబన్ధుషు
సఙ్గో యది స్యాద్భగవత్ప్రియేషు నః
యః ప్రాణవృత్త్యా పరితుష్ట ఆత్మవాన్
సిధ్యత్యదూరాన్న తథేన్ద్రియప్రియః ॥ 10

ప్రభూ ! ఏ విషయమునందును మా కాసక్తి కలుగకుండుగాక ! ఆసక్తి కలిగినచో గృహము, భార్య, పుత్రుడు, విత్తము, బంధువులు అను వానియందుగాక భగవత్ప్రియు లగుపురుషులయందే కలుగుగాక! ఆత్మతత్త్వవేత్త యగుమానవుడు కేవలము ప్రాణధార ణోపయోగ మగునాహారముచేత పరితుష్టుడగును. శీఘ్రముగనే అతడు కృతకృత్యు డగును. గృహాదివిషయాసక్తు డగువ్యక్తి అట్లుకాలేడు.

యత్సఙ్గలబ్ధం నిజవీర్యవైభవం
తీర్థం ముహుః సంస్పృశతాం హి మానసమ్।
హరత్యజోఽన్తః శ్రుతిభిర్గతోఽఙ్గజం
కో వై న సేవేత ముకున్దవిక్రమమ్ ॥ 11

భగవత్ప్రియులసాంగత్యమువలననే ముకుందునిపరాక్రమకథను తెలిసికొనగలుగును. ముకుందునియావీర్యవైభవమున అసాధారణ మగుసామర్థ్యమున్నది. కర్ణాదీంద్రియముల ద్వారా ఆయనను నిరంతరము సేవించు మానవులలోనికి ప్రవేశించి వారిమనోమాలిన్యమును నాశముచేయును. గంగాదితీర్థములను మాటిమాటికి సేవించిన కేవలము అంగజమలము నశించును, కాని యితరవాసనారూప మగు అనర్థము నాశముకాదు. అందువలన వివేకి యగు ఏవ్యక్తి యాభగవద్భక్తులను సేవింపకుండగ నుండును?

యస్యాస్తి భక్తిర్భగవత్యకించనా
సర్వైర్గుణైస్తత్ర సమాసతే సురాః ।
హరావభక్తస్య కుతో మహద్గుణా
మనోరథేనాసతి ధావతో బహిః ॥ 12

విష్ణుభగవానునిపై నిష్కామ సేవాప్రవృత్తి గల మానవులయందే ధర్మజ్ఞాన వైరాగ్యాది సర్వగుణములతో పాటు దేవతలు గూడ చక్కగ నివసించుచుందురు. హరిభక్తి విహీను డగుమానవుడు అన్యాభిలాషయందు కర్మజ్ఞాన యోగములయందు రతుడు లేదా గృహాదు లయం దాసక్తుడు నై యుండును. అందువలన వానికి హరియందు కేవలభక్తి లేదు. మనోధర్మముద్వారా అతడు అసత్యము లైన బహిర్విషయములవైపు పరుగిడును. దానివలన వానియందు మహద్గుణములకు స్థాన మెచట నుండును?

హరిర్హి సాక్షాద్భగవాన్ శరీరిణా -
మాత్మా ఝషాణామివ తోయమీప్సితమ్ ।
హిత్వా మహాం స్తం యది సజ్జతే గృహే
తదా మహత్త్వం వయసా దమ్పతీనామ్ ॥ 13

జలము మత్స్యముల కభీష్ట మైనవస్తు వైనట్లు సాక్షాత్తుగ విష్ణుభగవానుడుగూడ ప్రాణుల కాత్మ యైయున్నాడు. మహద్వ్యక్తిగూడ ఆ శ్రీహరిని పరిత్యజించి గృహమునం దాసక్తు డైనచో (శూద్రాదిజాతుల యందును) స్త్రీపురుషులలో కేవలము వయస్సుద్వారా ఏమహత్త్వము ప్రసిద్ధముగ నుండునో ఆతడుగూడ ఆతుచ్ఛ మగుపార్థివమహత్త్వమునె కలిగియుండును. జ్ఞానాదులద్వారా యథార్థ మగుమహత్త్వము వానియందు కొలదిగగూడ నుండదు.

తస్మాద్రజోరాగవిషాదమన్యు -
మానస్పృహాభయదైన్యాధిమూలమ్ ।
హిత్వా గృహం సంసృతిచక్రవాలం
నృసింహపాదం భజతాకుతోభయమ్ ।ఇతి॥ 14

అందువలన అసురులారా! మీరు గృహమును పరిత్యజించి అకుతోభయ మగు నృసింహదేవునిచరణారవిందమును సేవింపుడు. ఆగృహమే (గృహాసక్తియె) రాగము, తృష్ణ, విషాదము, క్రోధము, మానము, స్పృహ, భయము, దైన్యము మున్నగువానికి మూల కారణము. అందువలన అది-జననమరణాది సంసారచక్రమునకు ఆలవాలమువంటిది.

**కేతుమాలేఽపిభగవాన్కామదేవ స్వరూపేణ లక్ష్మ్యాః ప్రియచికీర్షయా ప్రజాపతేర్దు హితౄణాం పుత్రాణాం చ తద్వర్ష పతీనాం పురుషాయుషాహో రాత్ర పరిసంఖ్యానానాం యాసాం గర్భా మహాపురుషమహాస్త్రతేజసోద్వేజిత మనసాం విధ్వస్తా వ్యసవః సంవత్సరాన్తే వివతన్తి ॥ 15**

రాజా! కేతుమాలవర్షమునందును విష్ణుభగవానుడు కామదేవస్వరూపముతో లక్ష్మికిని, విష్ణుచక్రతేజముచే ఉద్వేగముచెందగా తమగర్భములు సంవత్సరాంతమున విధ్వంసమై అసువులు వెడలిపడగా భీతిల్లు సంవత్సర పుత్రిక లైన రాత్ర్యభిమానదేవతలకును, సంవత్సరపుత్రు లైనదివసాభిమానసురులకును, ముప్పదియాఱువేలసంఖ్యాకు లైన తద్వర్ష పతులకును ప్రియము చేకూర్పదలచి విరాజిల్లుచుండును.

అతీవ సులలితగతి విలాసవిలసిత రుచిరహాసలేశావలోక లీలయా కించిదుత్తంభితసుందర భ్రూమండల సుభగవదనారవిన్ద శ్రియా రమాం రమయన్నిన్ద్రియాణి రమయతే ॥ 16

పైన జెప్పబడినవర్షమును భగవాను డగుప్రద్యుమ్నుడు మిగుల లలితమైనగతివిలాసముతోను, సుందరము మృదుమధురము నగునవ్వుతోను అవలోకనలీలను వెల్లడిచేసి భ్రూమండలమును గొలదిగ పైకెత్తుచు వదనకమలశోభద్వారా రమాదేవి కానందమును గలుగజేయుచు, తన ఇంద్రియములను చరితార్థము చేసికొనుచుండును.

తద్భగవతో మాయామయం రూపం పరమసమాధియోగేన రమాదేవీ సంవత్సరస్య రాత్రిషు ప్రజాపతేర్దుహితృభిరుపేతాహస్సు చ తద్భర్తృభిరుపాస్తే ఇదం చోదాహరతి ॥ 17

లక్ష్మీదేవి సంవత్సరమధ్యమున రాత్రియందు రాత్రి కధిష్ఠానదేవతలతోను, పగటియందు దివసాధిష్ఠానదేవతలతోను గలసి పరమసమాధియోగముతో భగవానునియాకృపామయరూపము నుపాసించుచు ఈక్రిందిమంత్రాదుల నుచ్చరించును.

ఓం హ్రాం హ్రీం హ్రూం ఓం నమో భగవతే హృషీకేశాయ సర్వగుణ విశేషవిలక్షితాత్మనే ఆకూతీనాం చిత్తీనాం చేతసాం విశేషాణాం చాధిపతయే షోడశకలాయ ఛన్దోమయాయాన్నమయాయామృతమయాయ సర్వమయాయ సహసే ఓజసే బలాయ కాన్తాయ కామాయ నమస్తే ఉభయత్ర భూయాత్ ఇతి ॥ 18

భగవాను డగుహృషీకేశునకు నమస్కరించుచున్నాను. సర్వశ్రేష్ఠవస్తువుద్వారా ఆయన ఆత్మలక్షితమగును. ఆయన క్రియాజ్ఞానచిత్తములకు, తత్తద్విషయములకు అధిపతి. పదునొకం డింద్రియములు, ఐదువిషయములు అను నీపదునాఱుపదార్థములు ఆయన యంశములు. ఆయన వేదమయుడు, అన్నమయుడు (పరమానందప్రకాశతత్త్వమునకు హేతువు), అమృతమయుడు, సర్వమయుడు, ఆయన సాహసము, తేజస్సు, బలము అనువానికి గారణుడు. అందువలన ఇదియంతయు ఆతనిస్వరూపమే. ఆయనయే కాంతుడు, కామము. నే నాయనకు నమస్కరించుచున్నాను. ఆయన నా కిహలోకములయందు అనుకూలు డగుగాక!

స్త్రియో వ్రతైస్త్వా హృషీకేశ్వరం స్వతో
హ్యారాధ్య లోకే పతిమాశాసతేఽన్యమ్ ।
తాసాం న తే వై పరిపాన్త్యపత్యం
ప్రియం ధనాయూంషి యతోఽస్వతన్త్రాః ॥ 19

ప్రభూ! నీవు స్వయముగ ఇంద్రియములకు స్వామివై యున్నావు. సంసారమున ఏ స్త్రీలు వ్రతాదులద్వారా ని న్నారాధించి యితరుని పతిగా కోరుచున్నారో వారియాపతులు వారిప్రియపుత్రులను, ధనమును, పరమాయువును ఏమాత్రము రక్షింపజాలరు. ఏలయన, వారు పరతంత్రులు అనగా కాలకర్మగుణాదుల కధీనులై యున్నారు.

స వై పతిః స్యాదకుతోభయః స్వయం
సమన్తతః పాతి భయాతురం జనమ్ ।
స ఏక ఏవేతరథా మిథో భయం
నై వాత్మలాభాదధి మన్యతే పరమ్ ॥ 20

తాను స్వయముగ నిర్భయు డగుచు భయాతురు లగుజనులను సర్వవిధముల రక్షించువాడే పతి. అందువలన నీవు మాత్రమే సర్వులకు పతివై యున్నావు. నీవు తప్ప మఱి యెవ్వడును పతి కాజాలడు. నీవు పతివి కానిచో అన్యునివలన నీకు భయము కలిగి యుండెడిది. పరమాత్మస్వరూపుడవగునీ సేవకంటె ఇతరమైన శ్రేష్ఠవస్తు వేదియు లేదని శాస్త్రజ్ఞులు తలంచుచున్నారు.

యా తస్య తే పాదసరోరుహార్హణం
నికామయేత్ సాఖిలకామలమ్పటా ।
తదేవ రాసీప్సితమీప్సితోఽర్చితో
యద్భగ్నయాచ్ఞా భగవన్ ప్రతప్యతే ॥ 21

దేవా! ఏకాంతభావముతో ఏకైక పతిస్వరూపుడ వగునీపాదపద్మముల పరిచర్యను మాత్రము కాంక్షించి యేస్త్రీ నిన్ను సేవించునో ఆస్త్రీయే నిజముగ సర్వకామవిషయముల యం దాసక్తయై సర్వకామము లను పొందగలదు. కాని నీ యైకాంతికపరిచర్యముగాక ఫలవిషయమును వాంఛించి ని న్నర్చించు స్త్రీకి నీ వామె కోరుకొనుఫలమును మాత్రమే ఇత్తువు. భోగావసానమున ఆ ఫలము నష్టమగును. దానివలన ఆమె అనుతాపమును పొందును. అందువలన నిట్టి ఫలవాంఛ కెట్టిసార్థకతయు నుండదు.

మత్ప్రాప్తయేఽజేశసురాసురాదయ -
స్తప్యన్త ఉగ్రం తప ఐన్ద్రియేధియః ।
ఋతే భవత్పాదపరాయణాన్న మాం
విన్దన్త్యహం త్వద్ధృదయా యతోఽజిత ॥ 22

అజితుడా! ఇంద్రియ సుఖభోగవిషయములచే ఆవిష్టచిత్తు లగుబ్రహ్మ, రుద్రుడు, ఇతరదేవతలు, అసురులు నన్ను పొందుటకై యుగ్రమైనతపస్సు చేయుచుందురు. కాని నీపాదానురక్తి లేనిదె వారు నాకటాక్ష విలసిత మగుఐశ్వర్యమును పొందజాలరు. నీయందే నాహృదయము నిహితమై యున్నది. అందువలన నేను నీభక్తులనె అనుగ్రహించుచుందును. ఇతరులు నాయనుగ్రహమును పొందజాలరు.

స త్వం మమాప్యచ్యుత శీర్ష్ణి వన్దితం
కరాంబుజం యత్ త్వదధాయి సాత్వతామ్ ।
బిభర్షి మాం లక్ష్మ వరేణ్య మాయయా
క ఈశ్వరస్యేహితమూహితుం విభుః ॥ఇతి॥ 23

అచ్యుతా! నీకరకమలమునుండియే సర్వకామములు వర్షించుచుండును. కనుకనే సాధువులు దానికి నమస్కరింతురు. నీవు భక్తుల శిరముపై ఆకరకమలము నుంచుచుందువు. దయతో నాశిరముపైగూడ ఆ నీకరకమలము నుంచుము. వరేణ్యుడా! నీవు కేవలము కాపట్యముచేతనే నన్ను కనకరేఖాచిహ్నరూపముతో వక్షస్థలమున ధరించుచుందువు అనగా నీవు కేవలము బయటకు మాత్రము నాపై ఆదరము చూపుచున్నావు. లోపల భక్తులపై పరమకృపను చూపుచున్నావు. నీ వీశ్వరుడవు. నీయాశయము నెవరు తెలిసికొనజాలుదురు?

రమ్యకే చ భగవతః ప్రియతమం మాత్స్యమవతార రూపం తద్వర్ష పురుషస్య మనోః ప్రాక్ ప్రదర్శితమ్। స ఇదానీమపి మహాభక్తియోగేనారాధయతీదం చోదాహరతి ॥ 24

రమ్యకవర్షమున తదధిపతి యగుమనువునకు పూర్వము (చాక్షుషమన్వంతరాంతమున ప్రళయమునందు) భగవానుడు తనమత్స్యావతారరూప మగు అతిప్రియరూపమును ప్రదర్శించెను. ఆమనువు నేటికిని ఏకాంత భక్తితో ఆమత్స్యావతారస్వరూపము నారాధించుచు ఈక్రిందిమంత్రమును జపించుచుండును.

ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమః; సత్త్వాయ ప్రాణాయౌజసే సహసే బలాయ మహామత్స్యాయ నమ ఇతి ॥ 25

శుద్ధసత్త్వస్వరూపు డగుభగవానునకు నమస్కరించుచున్నాను. ఆయన ప్రాణములు, బలము, సాహసము, సామర్థ్యము మున్నగువానికి నియంత యగుటచే తత్స్వరూపముతో జెప్పబడుచున్నాడు, ఆమత్స్యావతారు డగుభగవానునకు నమస్కరించుచున్నాను.

అన్తర్బహిశ్చాఖిలలోకపాలకై -
రదృష్టరూపో విచరస్యురుస్వనః ।
స ఈశ్వరస్త్వం య ఇదం వశేఽనయ -
న్నామ్నా యథా దారుమయీం నరః స్త్రియమ్ ॥ 26

దేవా! లోకమున మానవుడు కాష్ఠమయ మగుస్త్రీని వశముచేసికొనునట్లు ఎవరు బ్రాహ్మణాదినామములద్వారా ఈవిశ్వమును తనవశముచేసి కొనుచున్నాడో ఆ ఈశ్వరుడవు నీవే. నీవు నిఖిలజీవుల లోపల బయట విహరించుచున్నావు. ఇంకను లోకపాలకులుగూడ నీస్వరూపమును సందర్శింపజాలరు. కాని నీవేదాత్మకనామము మిగుల గొప్పది.

యం లోకపాలాః కిల మత్సరజ్వరా
హిత్వా యతన్తోఽపి పృథక్సమేత్య చ ।
పాతుం న శేకుర్ద్విపదశ్చతుష్పదః
సరీసృపం స్థాణు యదత్ర దృశ్యతే ॥ 27

ప్రభూ ! ఇంద్రాదిలోకపాలకులు మాత్సర్యజ్వరముతో అభిభూతులై యున్నారు. నిన్ను విడచి వారు వేరుగగాని లేదా కలిసిగాని ప్రయత్నించినను ద్విపదచతుష్పదులను లేదా స్థావరజంగమప్రభృతిపరిదృశ్య మానము లైన ఏవస్తువులనుగూడ పాలింపజాలరు. నీవు ప్రాణరూపముతో పాలకుడవు, పరమేశ్వరుడవు నై యున్నావు.

భవాన్ యుగాన్తార్ణవ ఊర్మిమాలిని
క్షోణీమిమామోషధివీరుధాం నిధిమ్ ।
మయా సహోరు క్రమతేఽజ ఓజసా
తస్మై జగత్ప్రాణగణాత్మనే నమః ॥ఇతి॥ 28

ప్రభూ! ఈవసుంధర ఓషధులకు, లతలకు ఆశ్రయ మైయున్నది. అందువలన పృథివి ప్రళయకాలమున ఉత్తుంగతరంగమాలాసంకుల మగు సాగరమున నిమగ్న మైనప్పుడు నాతో (మనువుతో) పాటు ఈపృథివిని ధరించి ప్రబలవేగముతో అజస్వరూపుడ వగునీవు సంచరించుచుందువు. జగత్తులోని ప్రాణులకు నియంత వగునీకు నమస్కరించుచున్నాను.

హిరణ్మయేఽపి భగవాన్ నివసతి కూర్మతనుం బిభ్రాణస్తస్య తత్ప్రియ తమాం తనుమర్యమా సహ వర్షపురుషైః పితృగణాధిపతిరుపధావతి మన్త్రమిమం చానుజ పతి ॥ 29

హిరణ్మయవర్షమునందును విష్ణుభగవానుడు కూర్మశరీరమును ధరించి నివసించుచుండును. పితృగణాధిపతి యగు అర్యముడు తద్వర్షవాసులగు పురుషులతో గూడి ప్రియతమ మగుభగవానునియామూర్తిని ఉపాసించుచు ఈక్రిందిమంత్రమును నిరంతరము జపించుచుండును.

ఓం నమో భగవతేఽకూపారాయ సర్వసత్త్వగుణ విశేషణాయ నమోఽనుప లక్షితస్థానాయ నమో వర్ష్మణే నమో భూమ్నే నమోఽవస్థానాయ నమస్తే ॥ఇతి ॥ 30

భగవాను డగుకూర్మదేవునకు నమస్కారము. సర్వసత్త్వగుణములు నీవిగ్రహము అనగా నీవు శుద్ధసత్త్వమూర్తివి; (జలచరత్వమువలన) నీ స్థానము నెవ్వరును చూడజాలరు. అట్టినీకు నమస్కారము. కాలముద్వారా నీ కవచ్ఛేదము కలుగదు, అట్టినీకు నమస్కారము. సర్వగతుడవు, సకలా ధారుడవు నగునీకు నమస్కారము.

యద్రూపమేతన్నిజమాయయార్పిత -
మర్థస్వరూపం బహురూపరూపితమ్ ।
సంఖ్యా న యస్యాస్త్యయథోపలమ్భనాత్
తస్మై నమస్తేఽవ్యపదేశరూపిణే ॥ 31

దేవా! నీమాయాశక్తిచే ప్రకటితము, పరిదృశ్యమానము, పృథివ్యాదినానావిధ రూపములచే నిరూపితము నగుసర్వము నీ నిజరూపము కాదు. అందువలన నీ యీ విరాడ్రూపము కల్పితము. నీ యీ రూపము లన్నియు బహురూపములుగ నిరూపింపబడుటవలన వాని సంఖ్యను నిర్ణయించుట అసాధ్యము. నీ నిత్యరూపము నెవ్వడును చక్కగ వ్యక్తము చేయజాలడు. అందువలన నీకు నమస్కరించుచున్నాను.

జరాయుజం స్వేదజమణ్డజోద్భిదం
చరాచరం దేవర్షిపితృభూతమైన్ద్రియమ్ ।
ద్యౌః ఖం క్షితిః శైలసరిత్సముద్ర -
ద్వీపగ్రహర్క్షేత్యభిధేయ ఏకః ॥ 32

దేవా! జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు మున్నగుచరాచరములు, దేవతలు, ఋషులు, పితరులు, భూతములు, ఇంద్రియములు, స్వర్గము, అన్తరిక్షము, భూలోకము, శైలములు, నదులు, సముద్రములు, ద్వీపములు, గ్రహములు, నక్షత్రములు అనునవియన్నియు ప్రకృతివలన గలిగిన నీనామములె. వానిచేత చెప్పబడువాడవు నీవే. నీ వద్వయవస్తు వై యున్నావు. నీకంటె రెండవవస్తువు లేదు. అనగా ఈవిశ్వమనిత్య మైనను మిథ్య కాదు. ఇది నీప్రాకృతరూపము. (కనుకనే శ్రుతి యందు "సర్వం ఖల్విదం బ్రహ్మ" పరిదృశ్యమాన మగునది యంతయు విద్వత్ప్రతీతియందు బ్రహ్మ మనిచెప్పబడుచున్నది. ఈశ్లోకముద్వారా ప్రపంచముయొక్క మిథ్యాత్వవాదము ఖండిత మగుచున్నది.)

యస్మిన్నసంఖ్యేయవిశేషనామ -
రూపాకృతౌ కవిభిః కల్పితేయమ్ ।
సంఖ్యా యయా తత్త్వదృశాపనీయతే
తస్మై నమః సాంఖ్యనిదర్శనాయ తే ॥ఇతి॥ 33

ప్రభూ! నీనామరూపాకృతులలో గలభేదము లెక్కింపరానిది. అయినను కపిలాది పండితులు చతుర్వింశత్యాదితత్త్వసంఖ్యను గల్పించిరి. ఏ తత్త్వజ్ఞానముచేత ఆ సంఖ్య తొలగునో ఆ సాంఖ్యసిద్ధాంతస్వరూపుడవు నీవే. అనగా నీవే సాంఖ్యజ్ఞానమున కుద్దిష్ట విషయ మై యున్నావు. నిరీశ్వరులగుకపిలాదిసాంఖ్యకారులు నీస్వరూపవిషయము నెఱుంగని వారై కేవలము సంఖ్యాగణనమునందే మగ్నులై యున్నారు. అట్టి నీకు నమస్కారము.

**ఉత్తరేషు చ కురుషు భగవాన్ యజ్ఞపురుషః కృత వరాహరూప ఆస్తే। తం తు దేవీ హైషా భూః సహ కురుభిరస్ఖలితభక్తియోగేనోపధావతి। ఇమాం చ పరమాముపనిషదమావర్తయతి ॥ 34**

రాజా! ఉత్తరకురువర్షమున భగవాను డగుయజ్ఞపురుషుడు వరాహ రూపమును ధరించి విరాజిల్లుచుండును. ఈ పృథివీదేవి కురుఖండవాసులతో గలసి అవిచలిత మగు భక్తియోగముతో ఆయన నారాధించుచు ఈపరమోపనిషత్తును ఆవృత్తిచేయుచుండును.

**ఓం నమో భగవతే మన్త్రతత్త్వలింగాయ యజ్ఞక్రతవే మహాధ్వరావయవాయ మహాపురుషాయ నమః కర్మశుక్లాయ త్రియుగాయ నమస్తే ॥ఇతి॥ 35**

నేను భగవాను డగుమహాపురుషునకు నమస్కరించుచున్నాను. మంత్రముద్వారానే నీతత్త్వము తెలియబడును. నీవు యజ్ఞరూపుడవు, క్రతురూపుడవు. అందువలన మహాయజ్ఞము లన్నియు నీయవయవస్వరూపములే. నీవు యజ్ఞాధిష్ఠాతవు, శుద్ధసత్త్వ స్వరూపుడవు.

కలియుగమున నీవు ఛన్నావతారుడ వగుటచే "త్రియుగ" నామముతో చెప్పబడుదువు. లేదా నీవు త్రియుగశ్లైశ్వర్యవిశిష్టుడవు అనగా షడైశ్వర్యశాలి వగుటచే నీ నామము 'త్రియుగము'. అట్టి నీకు నమస్కారము.

యస్య స్వరూపం కవయో విపశ్చితో
గుణేషు దారుష్వివ జాతవేదసమ్ ।
మథ్నన్తి మథ్నా మనసా దిదృక్షవో
గూఢం క్రియార్థైర్నమ ఈరితాత్మనే ॥ 36

కాష్ఠములయందు ప్రవేశించిన అగ్ని వెల్లడికాదు, కాని అభిజ్ఞుల మంథనప్రభావముచే ఆయగ్నిప్రకాశితమగును. అట్లే తత్త్వవేత్తలు, నిపుణులు నిన్ను దర్శింపవలె ననితలంచి దేహేంద్రియములలో నిన్ను అన్వేషించుచుందురు. కాని వివేకసాధనము, మనస్సు, కర్మము, కర్మఫలము అనువానిద్వారా నీస్వరూపము వెల్లడికాదు. నీవు స్వప్రకాశవస్తు వై యున్నావు. నీ స్వరూపదర్శనము నభిలషించు మానవులసాధనప్రయత్నము అనగా అన్వేషణప్రవృత్తి దర్శనముచే నీవు నీపరమాత్మస్వరూపమును వెల్లడిచేయుదువు. అట్టినీకు నమస్కారము.

ద్రవ్యక్రియాహేత్వయనేశకర్తృభి -
ర్మాయాగుణైర్వస్తునిరీక్షితాత్మనే ।
అన్వీక్షయాంగాతిశయాత్మబుద్ధిభి -
ర్నిర స్తమాయాకృతయే నమో నమః ॥ 37

శబ్దాదివిషయములు, ఇంద్రియవ్యాపారములు, వాగాదీంద్రియదేవతలు, దేహము, కాలము, అహంకారము అనునవన్నియు మాయాకార్యములే. ఈమాయికకార్యదర్శనమున కార్యకారణరూపముతో లక్షితమగువస్తువు నీవే యైయున్నావు. నీవే పరమాత్మవు. నీయా స్వరూపము మాయా సంబంధశూన్యము. తత్త్వవిచారముద్వారా, యమనియమాదుల ద్వారా నిరోధింపబడు బుద్ధివృత్తి కలవారే నీ యా రూపమును దర్శింతురు. అట్టి నీకు నమస్కారము.

కరోతి విశ్వస్థితిసంయమోదయం
యస్యేప్సితం నేప్సితమీక్షితుర్గుణైః ।
మాయా యథా యో భ్రమ తే తదాశ్రయం
గ్రావ్ణో నమస్తే గుణకర్మసాక్షిణే ॥ 38

దేవా! జగత్తుయొక్క సృష్టిస్థితిలయములు నీ కిష్టములు కావు. కాని యిష్టము లేక పోయినను జీవునికై నీవు ఆకార్యముల నన్నింటిని చేయు చుందువు. ప్రకృతి జడరూప మైనను నీ ఈక్షణములచే చాలితమై నీసత్త్వరజస్తమోగుణములచే ఈజగత్తు యొక్క సృష్ట్యాదికార్యములను జేయుచుండును. జడరూపిణీ యగు ప్రకృతిచే నెట్లుసృష్టియగును? దానికి సమాధానము చెప్పబడుచున్నది - లోహమము అయస్కాంతముద్వారా ఆకర్షింపబడి దాని కెదురుగ బోవునట్లు మాయకూడ నీఈక్షణప్రభావముచే సృష్ట్యాది కార్యముల నొనర్చుచుండును. అందువలన గుణకర్మలకు సాక్షిస్వరూపుడవగు నీకు నమస్కరించు చున్నాను.

ప్రమథ్య దైత్యం ప్రతివారణం మృధే
యో మాం రసాయా జగదాదిసూకరః ।
కృత్వాగ్రదంష్ట్రే నిరాగాదుదన్వతః
క్రీడన్నివేభః ప్రణతాస్మి తం విభుమ్ ॥ఇతి॥ 39

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే భువనకోశే వర్షదేవస్తుతిర్నామ
అష్టాదశోఽధ్యాయః ॥

ఏనుగు దంష్ట్రాగ్రముచే తామరతూడును పెకలించి క్రీడించుచు జలాశయమునుండి బహిర్గత మైనట్లు నీవుకూడ ఆదివరాహరూపముతో ప్రతిద్వంద్వి యగు గజమువలె హిరణ్యాక్షుని వధించి దంష్ట్రాగ్రమున రసాతలగత మగుపృథివిని ధరించి ప్రళయసముద్రము నుండి బయల్వెడలితివి.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
పదునెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

# పందొమ్మిదవ అధ్యాయము

## కింపురుషభారతవర్షముల వర్ణనము

కథాసారము :- ఈ యధ్యాయమున కింపురుషవర్షము నందు భగవాను డగు రామ చంద్రునియొక్క, భారతవర్షము యొక్క శ్రేష్ఠత్వము వర్ణితమైనది.

కింపురుషవర్షమున తత్తద్వర్షవాసు లగు మానవులు పరమభక్తితో హనుమంతునితో పాటు విశుద్ధసత్త్వమయ మూర్తియు, ప్రాకృతనామరూపవివర్జితుడు, సాధుజనపరిత్రాణుడు, అసాధువులగు రాక్షసులకులమును నాశముచేయుటకై యవతరించినవాడు, మానవరూప ధారియునగు రామచంద్రుని ఉపాసించుచుందురు. ప్రాకృతజన్మము, ఐశ్వర్యము, పాండిత్యము లేదా సౌందర్యము భగవత్ప్రీతికి కారణములు గావు. నిష్కపటులై శరణు జొచ్చినవారిపై భగవానుడు దయజూపును.

దేవర్షి యగు నారదుడు సాక్షాత్తుగ భగవత్కథితమైన పాంచరాత్ర మను సాత్వత తంత్రమును సావర్ణిమనువున కుపదేశించునుద్దేశ్యముతో భారతవర్ష వాసులగు ప్రజలతో పాటు పరమభక్తితో అకించనులకు పరమధనము, ఆత్మారాములగు జనులకుగూడ ఉపాస్యుడు, సృష్టిస్థితిలయకర్తయు, పరమపురుషుడు నగు భగవానుని ఉపాసించు చుండును. ఈ భారతవర్ష మునందును ఇతర వర్షములవలె బహువిధములగు నదులు, పర్వతములు గలవు. అయినను ఈ వర్షమునందలి గొప్పతన మేమియనగా, ఇచట వర్ణాశ్రమధర్మములు చక్కగ పాలింపబడుచుండును. తద్వారా వారికి క్రమముగ సాధుసాంగత్యము, అపవర్గము లేదా భగవద్భక్తి సులభమగును. సాధుసాంగత్యమువలన జీవునియనర్థములు నశింపగా సర్వభూతాధివాసు డగు వాసుదేవుని యహైతుకభక్తి వానికి లభించును. ఇదియే అపవర్గము. అందులకై భారతవర్షముయొక్క, తద్వర్ష వాసులయొక్క శ్రేష్ఠత్వవిషయమును దేవతలుగూడ కీర్తించుచుందురు. స్వర్గమును గూర్చి చెప్పునదేమి? ఈ వర్షము బ్రహ్మలోకముకంటెను మిన్న; బ్రహ్మలోకము నుండి జీవునకు పునరావృత్తి యున్నది. కాని ఈ వర్షవాసులగు పురుషులు తమతమ వర్ణాశ్రమధర్మములను విష్ణుభగవా నున కర్పించి యేగతిని పొందుదురో దానివలన వారికి యిక పునరావృత్తి కలుగదు. భక్తులముఖనిస్సృత మైన భగవత్కథామృతము లేనిప్రదేశము బ్రహ్మలోక మైనను పండితుల కాప్రదేశ మాశ్రయింపయోగ్యము కాదు. ఇట్లు భారతవర్షమున జన్మించియు భగవత్సేవ నుండి విరతు లైన వారియవస్థ మిగుల శోచనీయ మగును. ఈ వర్షమున ఎవరైన సామాన్య మగుకోరిక నుద్దేశించి కృష్ణభజనము చేసినచో, వారుగూడ సాధుసాంగత్యమున క్రమముగ నిష్కామోపాసనను పొంది భగవాముని

పాదపల్లవములను పొందుదురు. అనంతరము శుక దేవుడు పరీక్షిన్మహారాజునకు జంబూద్వీపములో నున్న ఎనిమిది ఉపద్వీపముల విషయమును వివరించెను.

## శ్రీ శుక ఉవాచ

కింపురుషే వర్షే భగవన్తమాదిపురుషం లక్ష్మణాగ్రజం సీతాభిరామం రామం తచ్చరణసన్నికర్షాభిరతః పరమభాగవతో హనుమాన్ సహ కింపురుషైరవిరతభక్తి రుపాస్తే ॥ 1

శుకుడు పలికెను : రాజా! కింపురుషవర్షమున జగత్కారణ భూతుడు, లక్ష్మణాగ్రజుడు, సీతాపతియు నగుశ్రీరామచంద్రభగవానుని చరణసన్నిధియందు ఏకాగ్రచిత్తముతో ఉపవిష్టుడు, పరమభాగవతుడు నగుహనుమానుడు అప్రతిహత మగుభక్తితో కింపురుషవర్షవాసులతో గూడి ఆయన నుపాసించుచుండును.

ఆర్ష్టి షేణేన సహ గన్ధర్వైరనుగీయమానాం పరమ కల్యాణీం భర్తృ భగవత్కథాం సముపశృణోతి స్వయం చేదం గాయతి ॥ 2

గంధర్వులు గానముచేయు రామచంద్రునికల్యాణమయ మగుచరితమును హనుమంతుడు కింపురుషపతి యగు ఆర్ష్టిషేణునితోగూడి అతి శ్రద్ధగ విని ఈ క్రిందిమంత్రాదులను గానము చేయుచుండును.

వివరణము :

**వాసుదేవాదిరూపాణామవతారాః ప్రకీర్తితాః ।**
**విష్ణుధర్మోత్తరే రామలక్ష్మణాద్యాః క్రమాదమీ ॥**
**పాద్మే తు రామో భగవాన్ నారాయణ ఇతీరితః ।**
**శేషశ్చక్రం చ శంఖశ్చ క్రమాత్స్యుర్లక్ష్మణాదయః ॥**
**మధ్యదేశస్థితాయోధ్యాపురేఽస్య వసతిః స్మృతా ।**
**మహావైకుంఠలోకే చ రాఘవేన్ద్రస్య కీర్తితా ॥**

(లఘుభాగవతామృతము 20 - 22 శ్లో)

విష్ణుధర్మోత్తరపురాణమున రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నల్వురు వరుసగ వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనువారి యవతారములని కీర్తింపబడిరి. ఇంకను పద్మపురాణమున రామచంద్రుని నారాయణునియవతార మనియు, లక్ష్మణాదులు ముగ్వురు క్రమముగ శేషుడు, చక్రము, శంఖము అనువానియవతారము

లనియుకీర్తింపబడిరి. శ్రీలబలదేవ విద్యాభూషణుడు ఈగ్రంథమున పైనచెప్పబడిన శ్లోకమునకు టీకయందు "తదిదం కల్పభేదేనైవ సంభావ్యమ్ " (ఒకానొకకల్పమున వాసుదేవాదులు, మఱియొకకల్పమున నారాయణాదులు రామలక్ష్మణ ప్రభృతిరూపములతో అవతరింతురు) అనియుభయవాక్యములకు సామంజస్యమును గలుగజేసెను. రామచంద్రుని నివాసస్థలము మధ్యదేశమునం దున్న అయోధ్యాపురము, మహా వైకుంఠము.

**ఓం నమో భగవతే ఉత్తమశ్లోకాయ నమ ఆర్యలక్షణ శీలవ్రతాయ నమ ఉప శిక్షితాత్మన ఉపాసితలోకాయ నమః సాధువాదనికషణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహాపురుషాయ మహారాజాయ నమ ఇతి॥ 3**

నేను ప్రణవము నుచ్చరించి ఉత్తమశ్లోకు డగునాభగవానునకు నమస్కరించుచున్నాను. ఆయనయం దార్యులశ్రేష్ఠలక్షణములు, స్వభావము, ఆచరణము నున్నవి. ఆయన యెల్లపుడు సంయతచిత్తుడు, లోకరంజక నిమిత్తమై లౌకికాచరణముల ననుసరించువాడు నై ఉన్నాడు. ఆయన ఒరపిడిరాయివలె దయ మున్నగుసద్గుణములకు నిర్ణయస్థానము, అనగా సాధువులకు శిరోభూషణు డై యున్నాడు. ఆయన బ్రహ్మణ్యదేవుడు, మహాపురుషుడు, మహారాజు. ఆయనకు నా నమస్కారము.

**యత్తద్విశుద్ధానుభవమాత్రమేకం**
**స్వతేజసా ధ్వస్తగుణవ్యవస్థమ్ ।**
**ప్రత్యక్ప్రశాంతం సుధియోపలంభనం**
**హ్యనామరూపం నిరహం ప్రపద్యే ॥ 4**

ఆయన మాయాసంబంధశూన్యము, విశుద్ధము, అనుభవమాత్రము నగుస్వరూపము గలవాడు; వేదాంతశాస్త్రములయం దేకమాత్రుడుగ ప్రసిద్ధి చెందినవాడు, స్వరూపశక్తి ప్రభావముచే మాయికగుణములజాగ్రదాది వివిధావస్థలను నిరస్తము చేయువాడు, ఇంద్రియ దర్శనమునకు అవిషయమైన ప్రత్యక్స్వరూపము గలవాడు, మాయికచేష్టాశూన్యుడు, ప్రాకృత నామరూప వివర్జితుడు, కేవలము శుద్ధచిత్తముద్వారానే ఉపలభ్య మగుఅప్రాకృత స్వరూపము గలవాడు, అహంకారరహితుడు. మేము దృఢ మగుభావముతో సాక్షాత్తుగ పరబ్రహ్మస్వరూప మగు ఆశ్రీరామచంద్రుని శరణుజొచ్చు చున్నాము.

వివరణము: భగవానునిస్వరూపశక్తిప్రభావముచే త్రిగుణాత్మక మగుమాయ ఆయన నుండి దూరముగ తొలగియుండుటవలన ఆయన సర్వవిధముల మాయికము లైన ఉపద్రవములు లేనివాడు, కేవల మనుభవమాత్రుడు. తనకు కారణుడు తానే. ఆయన సర్వ దృశ్యములకంటె అనగా జడవస్తువులకంటె భిన్న మైనవాడు. శ్రుతి (శ్వేతాశ్వతరము 4-20)

ఇట్లు చెప్పినది - "ఈయనరూపము చక్షురాదీంద్రియములచే గ్రహింపబడునది కాదు. ఎవ్వరును ఆయనను చక్షువులద్వారా చూడజాలరు. హృదయమునం దున్న ఆ పరమేశ్వరుని శుద్ధబుద్ధిద్వారా, మనస్సుద్వారా ఇట్లు తెలిసికొనువారు అమృతమును అనగా ముక్తిని పొందుదురు." ముండకము (3-2-3), కఠము (2-23) ఇట్లు చెప్పుచున్నవి - "ఆత్మ (భగవానుడు) భక్తిచే పరితుష్టుడై యెవనిపై కృపజూపునో ఆయనయె దానిని [illegible]. ఆత్మ వానిసంబంధమువలననె తనతనువును వెల్లడిచేయును". ఈ శ్రుతివా[illegible] భగవానుడు శరీరము ధరించినా డనితెలియుచున్నది. అట్లయిన ఈభాగవ[illegible] సరించి ఆయనను 'అనాముడు', 'అరూపుడు' అన్నియెట్లు చెప్పగలము? దాని[illegible] చెప్పబడుచున్నది- 'ఆయన (భగవానున) కు ప్రాకృతనామముగాని రూపముగాని లేదు. ఛాందోగ్యోపనిషత్తులో (6-3-2) ఇట్లు వర్ణింపబడినది - "పేతాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి" అనగా 'అనేన' అనుశబ్దమును వేఱుగ నిర్దేశించుటవలన ఆత్మశబ్దముచే పరమాత్మ జీవశక్తిరూప ముగునంశ మనియు, ముగ్గురు దేవత లనగా తేజస్సు, వారి, మృత్తిక యనియు తెలిసికొనవలెను. 'ప్రవేశ' మనగా ఉపాధి యందభినివేశ మనియర్థము. ఇపుడు శ్రుతి కంతటికి ఇట్లు అర్థము చెప్పవలెను - "జీవ శక్తిరూప మగుఅంశముద్వారా తేజస్సు మున్నగుభూతత్రయము కలసి స్థూలోపాధి యందు అభినివిష్టమై విభిన్నము లగునామములతోను, విభిన్నము లగురూపములతోను వెల్లడియగును. ఈ శ్రుతివాక్యముచే జీవునిస్థూలోపాధియందు అహంతాదుల[illegible]వేశము, పరమాత్మ అంతర్యామిరూపముతో నుండుట, ఉపాధికృతము లగునామరూపములయం దనభినివేశము చెప్పబడినవి. అందువలన ఈభాగవత శ్లోకమున భగవానునకు ఉపాధికృత నామరూపాదులు లేవనిచెప్పబడిన 'అనామము', 'రూపము' అనునవి ఉచితమే యున్నవి. 'నిరహం' అనగా ఉపాధి, అనగా స్థూలదేహాదులయం దహంకారరహితుడు అనియర్థము చెప్పక సర్వవిధముల అహంకారరహితు డనిచెప్పిన పూర్వోక్తమైన ఛాందోగ్యశ్రుతిలోని 'వ్యాకరవాణీతి' అనుక్రియాపదప్రయోగము వ్యర్థమగును (శ్రీలజీవగోస్వామి). 'నిరహం' 'నిర్నిశ్చయేనాహం' అనగా దృఢమైనసత్తాకలిగిన నేను అనియర్థము (శ్రీలచక్రవర్తిఠాకూరులు).

మర్త్యావతార స్త్విహ మర్త్యశిక్షణం
రక్షోవధాయైవ న కేవలం విభోః ।
కుతోఽన్యథా స్యాద్రమతః స్వ ఆత్మనః
సీతాకృతాని వ్యసనానీశ్వరస్య ॥ 5

రాక్షసాధిపతి యగురావణుడు మనుష్యభిన్ను లగువ్యక్తుల కవధ్యుడగుటచే వానిని వధించుటకై శ్రీరామచంద్రుడు మానవాకారమున ప్రపంచమున అవతరించెను. కేవలము రావణవధయే ఆయనఈయవతారమునకు కారణము కాదు. స్త్రీ సాంగత్యాదికృత మగు

దుఃఖము వారింప నలవికా దను విషయమును మానవులకు బోధించుట అనునది వేఱొక కారణము. ఆయన విశ్వాత్ముడు, పరమేశ్వరుడు, స్వస్వరూపమునందే ఆనందము నను భవించుచుండును. ఆయన కిక సీతావియోగమువలన కలుగుదుఃఖము లేల యుండును?

న వై స ఆత్మాత్మవతాం సుహృత్తమః
సక్తస్త్రిలోక్యాం భగవాన్ వాసుదేవః ।
న స్త్రీకృతం కశ్మలమశ్నువీత
న లక్ష్మణం చాపి విహాతుమర్హతి ॥ 6

(రామలీల ప్రాకృతకామాద్యాసక్తుడగుబద్ధజీవునిలీల కాదు). ఆయన ముల్లోకములలో ఏ విషయమునందును ఆసక్తుడు కాలేదు, ఆయన ఆత్మవేత్త లగుభక్తులకాత్మ, పరమ బంధువు. ఆయన షడ్ఢైశ్వర్యపూర్ణుడగు వాసుదేవుడు. ఆయన సీతావియోగమువలన కలిగిన దుఃఖమును పొందుట గాని, లక్ష్మణుని, జగన్మాతయు లక్ష్మీస్వరూపిణియు నగు సీతాదేవిని పరిత్యజించుటగాని యెప్పుడును సంభవముకాదు.

న జన్మ నూనం మహతో న సౌభగం
న వాఙ్న బుద్ధిర్నాకృతిస్తోషహేతుః ।
తైర్యద్విసృష్టానపి నో వనౌకస -
శ్చకార సఖ్యే బత లక్ష్మణాగ్రజః ॥ 7

కులీనత (సత్కులమున జన్మించుట), సౌందర్యము, భాష, బుద్ధి, జాతి - ఇవియన్నియు మహానుభావు డగురామచంద్రునిప్రీతికి కారణములు కావు. చూడుము, మేము వనచరులము, మాకు జన్మము, సౌందర్యము, భాష మున్నగున వేమియు లేవు. అయినను లక్ష్మణాగ్రజు డగురామచంద్రుడు మాతో స్నేహము చేసెనుగదా!

సురోఽసురో వాథ నరోఽథ వానరః
సర్వాత్మనా యః సుకృతజ్ఞముత్తమమ్ ।
భజేత రామం మనుజాకృతిం హరిం
య ఉత్తరాననయత్ కోసలాన్ దివమ్ ॥ఇతి॥ 8

అందువలన దేవతలు, అసురులు, మనుష్యులు లేదా పశువులు, పక్షులు ఎవ్వరైనను సర్వవిధముల నరాకృతియు, పరబ్రహ్మము నగు శ్రీరామచంద్రుని భజింపవలెను. ఆయనను సేవించుట కెట్టికష్టములను పొందవలసినపని లేదు. ఆయన అత్యల్ప మగుభజనకే సంతుష్టు డగును. ఆయన అయోధ్యావాసు లగుప్రజల నందఱును వైకుంఠమునకు దీసి కొని పోయెను.

**భారతేఽపి వర్షే భగవాన్ నరనారాయణాఖ్య ఆకల్పాన్తముపచితధర్మ జ్ఞానవైరాగ్యైశ్వర్యోపశమోపరమాత్మోపలమ్భనమను గ్రహాయాత్మవతా మను కమ్పయా తపోఽవ్యక్త గతిశ్చరతి ॥ 9**

భగవానునిమాయ అచింత్య మైనది. ఆయన భారతవర్షమున (బదరికాశ్రమములో) నరనారాయణ రూపముతో అవతరించి ఆత్మతత్త్వవేత్త లగు భక్తుల కుపదేశించుటకై ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, ఇంద్రియనిగ్రహము, నిరహంకారము అనువానిద్వారా వృద్ధి పొందినవాడై కల్పము వఱకు తపస్సుజేసెను. ఇట్టి తపస్సుద్వారా ఆత్మసాక్షాత్కారము అనగా త్వంపదార్థమైన జీవసంబంధజ్ఞానము కలుగును.

**తం భగవాన్ నారదో వర్ణాశ్రమవతీభిర్భారతీభిః ప్రజాభిర్భగవత్ప్రోక్తాభ్యాం సాంఖ్యయోగాభ్యాం భగవదనుభావోప వర్ణనం సావర్ణేరుపదేక్ష్యమాణః పరమభక్తి భావేనోపసరతి, ఇదం చాభిగృణాతి ॥ 10**

పంచరాత్ర మనుసాత్వతతంత్రమున భగవత్ప్రోక్తములగు కర్మజ్ఞాన యోగాదులతో పాటు భగవానుని మహిమ వర్ణింపబడెను. ఆపంచరాత్రమును సావర్ణి యను మనువున కుపదేశింపబోవువా డగు నారదుడు భారతవర్షవాసులు, వర్ణాశ్రమ ధర్మావలంబులు నగు ప్రజలతోపాటు పరమభక్తితో నరనారాయణులను సేవించుచు ఈ వచనమును కీర్తించును.

**ఓం నమో భగవతే ఉపశమశీలాయోపరతానాత్మ్యాయ నమోఽకించన విత్తాయ ఋషిఋషభాయ నరనారాయణాయ పరమహంస పరమగురవే ఆత్మారామాధిపతయే నమో నమ ఇతి॥ 11**

ఋషిశ్రేష్ఠులగు ఆ నరనారాయణులకు నమస్కారము. వారు జితేంద్రియులు, నిరంహకారులు, నిష్కించనులకు ధనము, పరమహంసలు, మహాభాగవతులకు గురువులు, ఆత్మారాముల కధిపతులు. వారికి మాటిమాటికి నమస్కరించుచున్నాను.

## గాయతి చేదమ్

**కర్తాస్య సర్గాదిషు యో న బధ్యతే**
**న హన్యతే దేహగతోఽపి దైహికైః।**
**ద్రష్టుర్న దృగ్యస్య గుణైర్విదూష్యతే**
**తస్మై నమోఽసక్తవివిక్తసాక్షిణే ॥ 12**

దేవర్షి నారదుడింకను ఇట్లు కీర్తించుచుండును :- పరిదృశ్యమాన మగు ఈ ప్రపంచము యొక్క సృష్టిస్థితిలయములకు కర్త యయ్యును ఆయన కర్తృత్వాద్యభిమానశూన్యుడై యున్నాడు. దేహగతు డయ్యును క్షుత్పిపాసాదిదైహిక ధర్మములకు లోబడి యుండలేదు. ద్రష్ట అయ్యును దృశ్యవిషయముచే ఆయనదృష్టి దూషితము కాలేదు. అనాసక్తుడు, ప్రపంచ నివృత్తుడు, సాక్షిస్వరూపుడు నగు ఆ పరమాత్మకు నమస్కారము.

ఇదం హి యోగేశ్వర యోగనైపుణం
హిరణ్యగర్భో భగవాన్ జగాద యత్ ।
యదన్తకాలే త్వయి నిర్గుణే మనో
భక్త్యా దధీతోజ్ఝితదుష్కలేవరః ॥ 13

యోగేశ్వరా! ఆత్మవేత్త యగుబ్రహ్మ చెప్పిన యోగనైపుణ్య కథ ఈవిధముగ నున్నది.- యోగులు సంసారక్లేశములకు కారణస్వరూపమగు దేహాత్మాభిమానమును పరిత్యజించి అంత్యకాలమున భక్తియోగము ద్వారా నిర్గుణుడ వగునీయందు మనస్సు నుంతురు.

యథైహికాముష్మికకామలమ్పటః
సుతేషు దారేషు ధనేషు చిన్తయన్ ।
శఙ్కేత విద్వాన్ కుకలేవరాత్యయాద్-
యస్తస్య యత్నః శ్రమ ఏవ కేవలమ్ ॥ 14

ఐహికాముష్మికము లగు ఫలముల ననుభవించిన పిమ్మట అజ్ఞుడగు మానవుడు దారాపుత్ర ధనాదుల విషయమున చింతాగ్రస్తుడై మలమూత్రాదులచే నిండి కుత్సిత మైన కళేబరమును పరిత్యజించుటకు భయపడును. ఇక శాస్త్రవేత్త యగు మానవుడు గూడ అట్లే మృత్యుభయమునకు భయపడినచో వాని శాస్త్రాభ్యాసము కేవలము పరిశ్రమ మాత్రమే యగు నని చెప్పగవలెను.

తన్నః ప్రభో త్వం కుకలేవరార్పితాం
త్వన్మాయ యాహం మమతామధోక్షజ ।
భిన్ద్యామ యేనాశు వయం సుదుర్భిదాం
విధేహి యోగం త్వయి నః స్వభావమ్ ఇతి॥ 15

అందువలన ప్రభూ!అధోక్షజా! నీయందున్న చిత్తస్థైర్య లక్షణ మగు జ్ఞానయోగముమ నాకీయవలసినది. నీ మాయద్వారా మోహితుడనగు నా కాయోగప్రభావముచే మల

మూత్రాదులచే నిండిన ఈ దేహమునందు 'నేను,నాది' యనుబుద్ధి శీఘ్రముగనే నశించును. ఇది తప్ప మఱియే యుపాయము గూడ దానిని పోగొట్టజాలదు.

**భారతేప్యస్మిన్ వర్షే సరిచ్ఛైలాః సన్తి బహవః మలయో మంగలప్రస్థో మైనాకస్త్రికూట ఋషభః కుటకః కోల్లః సహ్యో దేవగిరిరృష్యమూకః శ్రీశైలో వేఙ్కటో మహేన్ద్రో వారిధారో విన్ధ్యః శుక్తిమానృక్షగిరిః పారిపాత్రో ద్రోణశ్చిత్ర కూటో గోవర్ధనో రైవతకః కకుభో నీలో గోకాముఖ ఇన్ద్రకీలః కామగిరిరితి చాన్యే శతసహస్రశః శైలాస్తేషాం నితమ్బప్రభవా నదా నద్యశ్చ సన్త్యసంఖ్యాతాః ॥ 16**

ఇలావృత వర్షమువలె ఈ భారతవర్షము నందును అనేక పర్వతములు, నదులు గలవు - మలయము, మంగళప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కూటకము, కోల్లము, సహ్యము, దేవగిరి, ఋష్యమూకము, శ్రీశైలము, వేంకటము, మహేంద్రము, వారిధారము, వింధ్యము, శుక్తిమంతము, ఋక్షగిరి, పారిపాత్రము, ద్రోణము, చిత్రకూటము, గోవర్ధనము, రైవతకము, కకుభము, నీలము, గోకాముఖము, ఇంద్రకీలము, కామగిరి ఇవికాక ఇంను వేలకొలది పర్వతములు గలవు. ఆపర్వతముల చరియల నుండి పుట్టిన నదీనదనము లెన్నియో గలవు.

**ఏతాసామపో భారత్యః ప్రజా నామభిరేవ పునన్తీనామాత్మనా చోపస్పృశన్తి - చన్ద్రవశా తామ్రపర్ణీ అవటోదా కృతమాలా వైహాయసీ కావేరీ వేణీ పయస్వినీ శర్కరావర్తా తుఙ్గభద్రా కృష్ణవేణ్యా భీమరథీ గోదావరీ నిర్వింధ్యా పయోష్ణీ తాపీ రేవా సురసా నర్మదా చర్మణ్వతీ అన్ధః శోణశ్చ నదౌ మహానదీ వేదస్మృతి ఋషికుల్యా త్రిసామా కౌశికీ మన్దాకినీ యమునా సరస్వతీ దృషద్వతీ గోమతీ సరయూరోఘవతీ సప్తవతీ సప్తవతీ సుషోమా శతద్రుశ్చన్ద్రభాగా మరుద్వృధా వితస్తా అసిక్నీ విశ్వేతి మహానద్యః ॥ 17**

వానిలో బ్రహ్మపుత్ర, శోణ అను రెండును నదములు. చంద్రవశ, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవ, సురస, నర్మద, చర్మణ్వతి, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసామ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయు, ఓఘవతి, షష్ఠవతి, సప్తవతి, సుషోమ, శతద్రు, చంద్రభాగ, మరుద్వృధ, వితస్త, అసిక్ని, విశ్వ అనునదులు సర్వప్రధానములు. భారతవర్ష వాసులు నామస్మరణమువనే పవిత్రము చేయు ఈ నదీనదముల జలములను మనస్సుతో స్మరించుటగాని లేదా శరీరముతో స్పృశించుట కాని చేయుచుందురు.

అస్మిన్నేవ వర్షే పురుషైర్లబ్ధజన్మభిః శుక్లలోహిత కృష్ణవర్ణేన స్వారబ్ధేన
కర్మణా దివ్యమానుష నారకగతయో బహ్వ్య ఆత్మన ఆనుపూర్వ్యేణ సర్వా
హ్యేవ సర్వేషాం విధీ యన్తే యథావర్ణ విధానమపవర్గశ్చాపి భవతి ॥ 18

ఈ వర్షమున జన్మించి మానవులు సత్త్వరజస్తమో బహుళములగు తమతమ కర్మఫలముల ననుసరించి క్రమముగ దివ్యములు, మానుషములు, నారకములు మున్నగు నానావిధములగు గతులను పొందుచుందురు. ఈ వర్షమున అందఱకు తమతమ కర్మా నుసారముగ గతులు కలుగును. తమతమ వర్షములు, ఆశ్రమోచితములైన ధర్మములు విష్ణువునకు సమర్పించిన క్రమముగ కర్మబంధనముల నుండి ముక్తి కలుగును.

యోఽసౌ భగవతి సర్వభూతాత్మన్యనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే
పరమాత్మని వాసుదేవేఽనన్యనిమిత్త భక్తియోగ లక్షణో నానాగతిని మిత్తావిద్యా
గ్రన్థిరన్ధన ద్వారేణ యదా హి మహాపురుష పురుషప్రసఙ్గః ॥ 19

(అపవర్గస్వరూప మెట్టిది, అది యెట్లు లభించును అనువిషయము చెప్పబడుచున్నది. జన్మ జన్మాంతరములయందు పరిపక్వమైన పుణ్య ఫలముచే ఏకాలమున భగవద్భక్తుని సాంగత్యము లభించునో అప్పుడు దేవపశుమనుష్యాది యోనులయందు జన్మించుటకు హేతువగు కామ్యకర్మాదులకు మూలమగు అవిద్యాగ్రంథి. ఛిన్న మగును. దానినికిఫలముగ సర్వభూతాత్ముడు, రాగాదిరహితుడు, వాక్కుల కగోచరుడు, ఆధారరహితుడు (తనకు తనే ఆశ్రయుడు), పరమాత్మయు నగు వాసుదేవుని యందు అవ్యాజమగు భక్తి కలుగును. అదియే అపవర్గము.

ఏతదేవ హి దేవా గాయన్తి -

అహో బతైషాం కిమకారి శోభనం
ప్రసన్న ఏషాం స్విదుత స్వయం హరిః ।
యైర్జన్మ లబ్ధం నృషు భారతాజిరే
ముకున్దసేవోపయికం స్పృహా హి నః ॥ 20

మానవజన్మమే సర్వపురుషార్థ సాధకమని దేవతలు గూడ కొనియాడు చుందురు. 'ఆహా! ఈ భారతవర్షమున బుట్టిన మానవులెంతటి మహాపుణ్య జనక మగు తపస్సు చేసియుండిరో గదా! లేనిచో స్వయముగ భగవంతుడగు శ్రీహరి యేవిధమగు సాధనయు లేకుండగ వీరికెట్లు ప్రసన్నుడయ్యెను? ఏలయన, ఈ భారతభూమియందు మానవ జన్మమును పొందుటకు మాకు కోరిక మాత్రమే యున్నది. కాని అది ఫలింపలేదు. వీరు

మాత్ర మాభారతదేశమున ముకుంద సేవోపయోగి యగు మానవయోనియందు జన్మించి యున్నారు.

కిం దుష్కరైర్నః క్రతుభిస్తపోవ్రతై -
ర్దానాదిభిర్వా ద్యుజయేన ఫల్గునా ।
న యత్ర నారాయణపాదపఙ్కజ -
స్మృతిః ప్రముష్టాతిశయే న్ద్రియోత్సవాత్ ॥ 21

దుష్కరము లగు యజ్ఞములు, తపస్సు, వ్రతములు, దానములు మున్నగువానికి ఫలముగ మాకు లభించిన స్వర్గమువలన ఏమి ప్రయోజన మున్నది. ఆప్రదేశమున శ్రీ నారాయణుని పాదపద్మస్మృతి అధికమగు విషయ భోగమువలన పూర్తిగ లుప్తమై యుండును.

కల్పాయుషాం స్థానజయాత్ పునర్భవాత్
క్షణాయుషాం భారతభూజయో వరః ।
క్షణేన మర్త్యేన కృతం మనస్వినః
సన్న్యస్య సంయాన్త్యభయం పదం హరేః ॥ 22

రెండు పరార్ధముల కాలము ఆయుష్మంతుడై బ్రహ్మలోకమును పొందుటకంటె అల్పాయుష్కుడై భారతభూమియందు జన్మించుట శ్రేష్ఠము. ఆబ్రహ్మలోకము నుండి గూడ తిరిగివచ్చుట సంభవము. మర్త్య వాసులదేహము క్షణభంగురము. పరమాయువు అల్పమైనను బుద్ధిమంతులగు మానవులు అల్పకాలమందే వారు చేయుకర్మలను శ్రీహరికి సమర్పించి ఆయన యభయపదమును పొందగలరు. ఆస్థానమునుండి యికవారికి పునరావృత్తి యుండదు.

న యత్ర వైకుంఠకథాసుధాపగా
న సాధవో భాగవతా స్తదాశ్రయాః ।
న యత్ర యజ్ఞేశమఖా మహోత్సవాః
సురేశలోకోఽపి న వై న సేవ్యతామ్ ॥ 23

ఏ స్థానమున భగవత్కథ యనెడు అమృతనదులు ప్రవహింపవో, ఏ ప్రదేశమున ఆ వైష్ణవీ నదీతటము నాశ్రయించిన భక్తుల కధిష్ఠానము లేదో, ఏ ప్రదేశమున నృత్యగీత వాద్యాది మహోత్సవములతో యజ్ఞేశ్వరుడగు శ్రీహరియొక్క సంకీర్తనయజ్ఞము జరుగదో ఆప్రదేశము బ్రహ్మలోకమైనను బుద్ధిమంతులు దాని నెప్పుడును ఆశ్రయింపరాదు.

ప్రాప్తా నృజాతి స్త్విహ యే చ జన్తవో
జ్ఞానక్రియాద్రవ్యకలాపసమ్భృతామ్ ।
న చేద్యతేరన్నపునర్భవాయ తే
భూయో వనౌకా ఇవ యాన్తి బన్ధనమ్ ॥ 24

ఈ భారతవర్షమున చక్షురాది జ్ఞానేంద్రియములను, వాగాదికర్మేంద్రియములను, క్షిత్యాదిద్రవ్య సంపత్పరి పూర్ణములగు (భగవద్భజనోప యోగ్యములైన) మానవదేహములను పొందియు ఏ మానవులు (జ్ఞానకర్మాదుల) బంధనములనుండి ముక్తులై భక్తియోగము నాశ్రయించుటకు ప్రయత్నింపరో వారు వనమున సంచరించు పక్షులవలె మరల బంధన దశను పొందుదురు. అనగా పాశబద్ధము లైన పక్షులు ఏదియే విధముగ ఒక్కమారు పాశముక్త మయ్యును అవి స్వయంకృతమగు అనవధానతా దోషముచే ఆవృక్షమునందే విహరించుచు మరల బద్ధదశను పొందును. అట్లే ఈ మానవులందఱు భారతభూమియందు భగవద్భక్తి లక్షణరూప మగు మోక్షమును పొందించు మానవజన్మను పొందియు తమతమ కర్మ దోషముల వలన మరల బద్ధదశను పొందుచున్నారు.

యైః శ్రద్ధయా బర్హిషి భాగశో హవి -
ర్నిరుప్తమిష్టం విధిమన్త్రవస్తుతః ।
ఏకః పృథఙ్నామభిరాహుతో ముదా
గృహ్ణాతి పూర్ణః స్వయమాశిషాం ప్రభుః ॥ 25

(భగవద్విభూతిబుద్ధితో విశ్వరూపము నుపాసించు ఉపాసకులు గూడ ధన్యులె. విశ్వరూపోపాసకులు ఇంద్రాదులైన విభిన్నదేవతలను భగవద భిన్నమైన అంగరూపముతో కల్పన చేయుదురు). వారు శ్రద్ధతో విధుల ద్వారా, మంత్రాదుల ద్వారా చరుపురోడాశాది భేదముతో హవిస్సులను ఆయా దేవతల నుద్దేశించి పరిత్యజించు చుందురు. ఆ హవిస్సు లను శ్రీహరి భిన్నభిన్నములైన అంగస్వరూపములైన ఇంద్రాది నామములతో ఆహూతుడై సంతోషముతో స్వీకరించును. ఆయన చతుర్విధ పురుషార్థముల నిచ్చుటలో సమర్థుడు, స్వయముగ పరిపూర్ణ స్వరూపుడైన భగవానుడయ్యును వాని నపేక్షింపడు.

సత్యం దిశత్యర్థితమర్థితో నృణాం
నైవార్థదో యత్పునరర్థితా యతః ।
స్వయం విధత్తే భజతామనిచ్ఛతా-
మిచ్ఛాపిధానం నిజపాదపల్లవమ్ ॥ 26

(సామాన్య మగుకోరికతో నెవ్వరైన కృష్ణభజనమునకు ప్రయత్నించినచో తద్భక్తుల సాంగత్యము వలన పూర్వోద్దిష్ట మగు వారి వాంఛ నశించును) ఆ సకామ భక్తులందఱు భగవాను నేమి ప్రార్థించినను ఆయన వారి కాప్రార్థిత విషయము నిచ్చును. ఇది సత్యము. కాని యేవిషయము వలన మాటిమాటికి కోరిక కలుగునో ఆయన ఆ విషయము నీయడు. ఆయన పాదపల్లవము ఇతరములగు వాంఛలను నశింప జేయునది. అట్టి పాదపల్లవమును పొందవలెననెడి తలంపుతో కాక ఇతరమైన వానికై పూజించినను అట్టివారి కాయన స్వయముగ ఆపాదపల్లవమునె ఇచ్చును.

యద్యత్ర నః స్వర్గసుఖావశేషితం
స్విష్టస్య సూక్తస్య కృతస్య శోభనమ్ ।
తేనాజనాభే స్మృతిమజ్జన్మ నః స్యాద్ -
వర్షే హరిర్యద్భజతాం శం తనోతి ॥ 27

అందువలన యజ్ఞములను, వేదాధ్యయనమును ఇంకను ఇతరములగు సత్కార్యములను చక్కగ అనుష్ఠించుటవలన గలుగు పుణ్యఫలముచే ఇప్పు డే స్వర్గసుఖము ననుభవించుచున్నామో, ఆపుణ్యము (సుకృతి) లో నేమిదైన మిగిలియున్నచో దానిద్వారా భారతవర్షమున మాకు హరిస్మరణోప యోగ మగు మానవజన్మము కలుగుగాక! ఇదియె మాప్రార్థన. శ్రీహరి భగవానుడు ఈవర్షమున ఆయనభక్తులకు శుభమును గలుగజేయుచుండునుగదా!

## శ్రీ శుక ఉవాచ

జమ్బూద్వీపస్య చ రాజన్నుపద్వీపానష్టౌ హైక ఉపదిశన్తి సగరాత్మజైరశ్వాన్వేషణ ఇమాం మహీం పరితోనిఖనద్భిరుపకల్పితాన్ ॥ 28

తద్యథా స్వర్ణప్రస్థశ్చన్ద్రశుక్ల ఆవర్తనో రమణకో మన్ద హరిణః పాంచజన్యః సింహలో లఙ్కేతి ॥ 29

శుకుడు పలికెను :- రాజా! కొందఱుపండితులు జంబూద్వీపమున ఎనిమిదియుపద్వీపము లున్నట్లు చెప్పుచున్నారు. సగరునిపుత్రులు అశ్వము నన్వేషించుచు పృథివి నలువైపుల త్రవ్వుటచే ఈ ద్వీపము లన్నియు విభజింపబడెను. ఈ ద్వీపములపేర్లు ఈ క్రిందివిధముగనున్నవి- స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందహరిణము, పాంచజన్యము, సింహళము, లంక.

ఏవం తవ భారతోత్తమ జమ్బూద్వీప వర్షవిభాగో యథోపదేశము
పవర్ణితః ॥ 30

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే జమ్బూద్వీపవర్ణనం
నామైకోనవింశోఽధ్యాయః ॥

భారతోత్తమా! జంబూద్వీపవర్ష విభాగమును గూర్చి నేను వినినదాని నంతటిని నీకు వివరించిచెప్పితిని.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
జంబూద్వీపవర్ణన మను పందొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

***



# ఇరువదియవ అధ్యాయము

## ప్లక్షము మున్నగు నాలుద్వీపములయొక్క లోకాలోకపర్వతముయొక్క వర్ణనము

కథాసారము :- ఈయధ్యాయమున ప్లక్షాదులైన ఆఱుద్వీపముల పరిమాణము, లోకాలోక పర్వతముయొక్కయునికి, దాని బాహ్యాభ్యంతరముల పరిమాణము వను విషయములు వర్ణింపబడినవి.

ప్లక్షద్వీపముయొక్క పరిమాణము జంబూద్వీపమునకు రెండురెట్లు. ఈ ద్వీపము లవణసముద్రముచే పరివేష్టిత మైయున్నది. ప్రియవ్రతుని పుత్రుడగు ఇధ్మజిహ్వుడు దీని కధిపతి. ఈద్వీపము సప్తవర్షములుగ విభక్త మైనది, ప్రతివర్షము నందుమ నొకపర్వతము ఒకనదియు నున్నవి. ద్వితీయ ద్వీపనామము శాల్మలీద్వీపము. ఈ ద్వీపము సురోద సముద్రముచే పరివేష్టితమైయున్నది. దీని విస్తారము ప్లక్షద్వీపమునకు రెండు రెట్లు అనగానాలుగులక్షలయోజనములు. ప్రియవ్రతుని పుత్రుడగు యజ్ఞవాహుడు ఈద్వీపమున కధిపతి, ప్లక్షద్వీపమువలె నీద్వీపము ఏడువర్షములుగ విభక్త మైనది. ప్రతి వర్షమునందుమ ఒక్కొక్కపర్వతము, ఒక్కొక్కమహానది యుండును. ఈవర్షవాసులు చంద్రాత్ముడగు భగవన్మూర్తి యుపాసకులు. మూడవది ఘృతోదసాగరముచే బరివేష్టిత మై యున్నది. వెనుకటి ద్వీపమువలె నిదియు సప్తవర్షములుగ విభక్తమైనది. కుశద్వీపమున కధిపతి ప్రియవ్రతుని పుత్రుడగు హిరణ్యరేతసుడు. కుశ ద్వీపమునందలి సప్త వర్షములలో నివసించు మానవులు అగ్ని రూపములో నున్న భగవన్మూర్తి నుపాసించుచుందురు. ఈద్వీపముయొక్క పరిమాణము సురోదసాగరమునకు రెండురెట్లు అనగా ఎనిమిదిలక్షల యోజనములు. చతుర్థ ద్వీపము క్రౌంచద్వీపము. ఇది క్షీరోదసముద్రముచే పరివేష్టితము. దీని పరిమాణము వెనుకటిద్వీపమునకు రెండురెట్లు అనగా పదునాఱులక్షలయోజనములు. ప్రియవ్రతుని పుత్రుడైన ధృతపృష్ఠుడు ఈ ద్వీపమున కధిపతి. ఈద్వీపముగూడ వెనుకట ద్వీపమువలె నేడు వర్షములుగ విభక్త మైనది. ప్రతి వర్షమునందుమ ఒకనది, ఒకపర్వతము ఉండును. ఈ వర్షవాసులు జలరూపుడగు భగవానునుపాసించుచుందురు. ఐదవద్వీపము శాకద్వీపము. దీనిపరిమాణము ముప్పది రెండు లక్షల యోజనములు. ఈద్వీపమున కధిపతి ప్రియవ్రతుని తనయుడగు మేధాతిథి. ఈద్వీపముదధిసముద్రముచే పరివేష్టితమై యున్నది. ఇది వెనుకటి ద్వీపమువలె నేడు వర్షములుగ విభక్తమైనది. ప్రతివర్షమునందుమ ఒక్కొక్క నదియు నొక్కొక్క పర్వతము నుండును. ఈవర్షవాసులు వాయురూపుడగు

భగవానునుపాసించుచుందురు. ఆఱవద్వీపము పుష్కరద్వీపము. ఇది స్వాదూదక సముద్రముచే బరివేష్టిత మైయుండును. దీని పరిమాణము వెనుకటిద్వీపమునకు రెండురెట్లు. ప్రియవ్రతునిపుత్రుడగు వీతిహోత్రుడీ ద్వీపమున కధిపతి. ఇది ప్రాక్పశ్చిమవర్షములుగ విభక్తమైనది. ఈరెండువర్షములకు సరిహద్దుపర్వత స్వరూపమున మానసోత్తర మను నొక పర్వత మున్నది. యీవర్షవాసులు స్వయంభూమూర్తియగు భగవానుని ఉపాసింతురు. పిమ్మట సూర్యాదులాలోకవిశిష్టము, ఆలోకవిహీనము నగు దేశములయందు రెండింటి నడుమ లోకాలోకపర్వతమున్నది. దాని పరిమాణము భూగోళములో నాలుగవభాగము అనగా పండ్రెండున్నరకోట్ల యోజనములు. నారాయణుడు తనషడైశ్వర్యములను విస్తరింపజేసి యీపర్వతమునందు ఉండును. యీపర్వతమునకు బయట ఆలోకవర్షమునకు పిమ్మట ముముక్షువులు చేరు ప్రదేశము గలదు. అదిపూర్తిగా విశుద్ధమైనది. బ్రహ్మాండమధ్యభాగమున సూర్యుడున్నాడు. భూర్లోకభువర్లోకముల మధ్యభాగమున అంతరిక్ష మున్నది. సూర్యగోళకము యొక్క అండగోళకముయొక్క పరిమాణము ఇరువదియైదుయోజనములు. సూర్యుడచేతన మగు నండమున ప్రవిష్టుడై దిక్కులు, ఆకాశము మున్నగువానిని విభజించుటచే మార్తండు డనియు, మహత్తత్త్వశరీరు డగు హిరణ్యగర్భునిమండి సముద్భవించుటవలన హిరణ్య గర్భుడనియు చెప్పబడుచున్నాడు.

## శ్రీ ఋషిరువాచ

**అతఃపరం ప్లక్షాదీనాం ప్రమాణలక్షణసంస్థానతో వర్షవిభాగ ఉపవర్ణ్యతే ॥1**

ఋషిశ్రేష్ఠుడగుశుకదేవుడు పలికెను:- అనంతరము ప్లక్షమున్నగు నాఱుద్వీపముల పరిమాణము, లక్షణములు, ఆకారము అనువానిద్వారావర్షములవిభాగము వర్ణించు చున్నాను.

**జమ్బూద్వీపోఽయం యావత్ప్రమాణవిస్తారస్తావతాక్షారోదధినా పరి వేష్టితో యథా మేరుర్జమ్బ్వాఖ్యేన। లవణో దధిరపి తతో ద్విగుణవిశాలేన ప్లక్షాఖ్యేన పరిక్షిప్తో యథా పరిఖా బాహ్యోపవనేన। ప్లక్షోజమ్బూప్రమాణో ద్వీపాఖ్యాతికరో హిరణ్మయ ఉత్థితో యత్రాగ్నిరుపాస్తే సప్తజిహ్వః। తస్యాధిపతిః ప్రియవ్రతాత్మజ ఇధ్మజిహ్వస్తం ద్వీపం సప్తవర్షాణి విభజ్య సప్తవర్షనామభ్య ఆత్మజేభ్య ఆకలయ్య స్వయమాత్మ యోగేనోపరరామ॥ 2**

సుమేరువు జంబూద్వీపముచే చుట్టబడినట్లు ఈజంబూద్వీపము లవణసముద్రముచే చుట్టబడియున్నది. జంబూద్వీపమువలె లవణసముద్రపరిమాణముకూడ లక్షయోజనముల

పరిమితము. ఇంకను పరిఖ బాహ్యోపవనముచే పరివేష్టిత మైనట్లు ఈలవణసముద్రముగూడ ప్లక్షద్వీపముచే పరివేష్టితమైయున్నది. ఈప్లక్షద్వీపము యొక్క విస్తారము లవణ సముద్రము నకు రెండురెట్లు అనగా రెండులక్షలయోజనములు. ఈద్వీపమున ప్లక్షమనునొక మహావృక్షము గలదు. ఈవృక్షము హిరణ్మయము. దానిపరిమాణము జంబువృక్షముతో సమానము. ఈవృక్షము యొక్క మూలమున ఏడుశిఖలు గల అగ్నియున్నది. ఈప్లక్ష వృక్షమువలననే యీద్వీపమునకు ప్లక్ష మనుపేరు కలిగినది. ఈద్వీపమున కధిపతి ప్రియవ్రతునికుమారు డగునిధ్మజిహ్వుడు. అత డీద్వీపమును తనయేడుగురు పుత్రుల నామముల ననుసరించి ఏడువర్షములుగ విభజించెను. ఒక్కొక్కవర్షమును ఒక్కొక్కపుత్రున కప్పగించి తాను భగవద్భక్తిని పొంది సంసారము నుండి ముక్తుడయ్యెను.

**శివం వయసం సుభద్రం శాన్తం క్షేమమమృతమభయమితి వర్షాణి। తేషు గిరయో నద్యశ్చ సప్తైవాభిజ్ఞాతా. మణికూటో వజ్రకూట ఇన్ద్రసేనో జ్యోతిష్మాన్ సువర్ణోహిరణ్యష్ఠీవో మేఘమాల ఇతి సేతుశైలాః। అరుణా నృమ్ణా ఆఙ్గిరసీ సావిత్రీ సుప్రభాతా ఋతమ్భరా సత్యమ్భరేతి మహానద్యః। యాసాం జలోపస్పర్శన విధూతరజస్తమసో హంసపతఙ్గోర్ధ్వాయన సత్యాఙ్గ సంజ్ఞాశ్చత్వారో వర్ణాః సహస్రాయుషో విబుధో పమసన్దర్శనప్రజననాః స్వర్గ ద్వారం త్రయ్యా విద్యయా భగవన్తం త్రయీమయం సూర్యమాత్మానం యజన్తే ॥** 3,4

ఏడుగురుపుత్రులనామముల ననుసరించి యేడుద్వీపములనామము లిట్లు గలవు:- శివము, వయసము, సుభద్రము, శాన్తము, క్షేమము, అమృతము, అభయము. ఈయేడు వర్షములలో నేడుపర్వతములు, ఏడునదులు ప్రసిద్ధిచెందినవి. మణికూటము, వజ్రకూటము, ఇంద్రసేనము, జ్యోతిష్మంతము, సువర్ణము, హిరణ్యష్ఠీవము, మేఘమాల. ఈయేడును ఏడువర్షములకు సరిహద్దుపర్వతములుగ నున్నవి. అరుణ, నృమ్ణ ఆంగిరసి, సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర అనునేడునదులున్నవి. ఈనదులలోని జలములను స్పృశించుటచేత, స్నానముచేయుటచేత, యీవర్షవాసులైన హంసపతంగోర్ధ్వాయన సత్య వర్ణములవారియొక్క రజస్తమోమలములు నశించును. వారు సహస్రాయువులగు చుందురు. వారిసౌందర్యము, సంతానోత్పాదనవిధానము దేవతలవలెనె యుండును. దేవతుల్య మైన యీవర్ణ చతుష్టయము వేదోక్తకర్మమార్గము నవలంబించి త్రయీమయుడు, స్వర్గద్వార భూతుడు, సూర్యాత్మస్వరూపుడు నగుభగవానునకు నమస్కరించుచుందురు.

**ప్రత్నస్య విష్ణో రూపం యత్ సత్యస్యర్తస్య బ్రహ్మణః।**
**అమృతస్య చ మృత్యోశ్చ సూర్యమాత్మానమీమహి ఇతి॥ 5**

మే మా పురాణపురుషుడు సర్వవ్యాపియు నగు విష్ణుభగవానుని ప్రతిమూర్తిస్వరూపుడగుసూర్యదేవుని శరణుపొందుచున్నాము. ఆయన అనుష్టింపదగినధర్మమునకు, గోచరించు ధర్మమునకు బ్రహ్మబోధక మగు వేదమునకు, శుభాశుభఫలములకు నధిపతి యై యున్నాడు.

**ప్లక్షాదిషు పంచసు పురుషాణామాయురిన్ద్రియమోజఃసహోబలం బుద్ధిర్విక్రమ ఇతి చ సర్వేషామౌత్పత్తికీ సిద్ధిరవిశేషేణ వర్తతే ॥ 6**

రాజా! ప్లక్షము మున్నగునైదుద్వీపములలో పరమాయువు, ఇంద్రియబలము, దేహబలము, సాహసము, బుద్ధి, పరాక్రమము, స్వభావసిద్ధ మగుబుద్ధి - అనునవి మానవు లందఱకు నొకేవిధముగ నుండును.

**ప్లక్షస్తు సమానేనేక్షురసోదేనావృతో యథా తథా ద్వీపోఽపి శాల్మలో ద్విగుణవిశాలః సమానేన సురోదేనావృతః పరివృఙ్క్తే॥ 7**

ప్లక్షద్వీపము తనతోసమాన మగు రెండులక్షలయోజనములవైశాల్యము గల ఇక్షుసముద్రముతో చుట్టబడి యున్నది. అట్లే ప్లక్షద్వీపమునకు రెండురెట్లు అగా నాలుగులక్షల యోజనములపరిమిత మగుశాల్మలీద్వీపము గూడ తనతోసమాన మగుసురాసాగరముతో పరివృతమై విరాజిల్లుచున్నది.

**యత్ర హ వై శాల్మలీ ప్లక్షాయామా। యస్యాం వావకిల నిలయమాహుర్భగవతశ్ఛన్దఃస్తుతః పతత్రిరాజస్య సా ద్వీపహూతయే ఉపలక్ష్యతే ॥ 8**

ఈశాల్మలీద్వీపమున నొకానొకశాల్మలీ (బూరుగు) వృక్షము గలదు. అది ప్లక్ష (జువ్వి) వృక్షమువలె విస్తీర్ణము అనగా శతయోజనముల స్థూలము, పదునొకండు యోజనముల ఉన్నతము నై యున్నది. ఈవృక్షము యొక్క నామము ననుసరించి ద్వీపమునకు శాల్మలి యనిపేరు కలిగెను. పండితు లీశాల్మలీవృక్షమునందు పక్షిరా జగుగరుడుడు నివసించుచుండునవిచెప్పుచుందురు. అచ్చట అతడు ఛందములు అనగా వేదమంత్రములచే విష్ణుభగవాముని స్తుతించుచుండును.

**తద్ద్వీపాధిపతిః ప్రియవ్రతాత్మజో యజ్ఞబాహుః స్వసుతేభ్యః సప్తభ్యస్తన్నామాని సప్తవర్షాణి వ్యభజత్-సురోచనం సౌమనస్యం రమణకం దేవబర్హం పారిభద్రమాప్యాయనమభిజ్ఞాతమితి ॥ 9**

తద్ద్వీపమున కధిపతి ప్రియవ్రతాత్మజు డగుయజ్ఞబాహువు. ఆయన ఈద్వీపమును తనయేడుగురుపుత్రులనామముల ననుసరించి యేడువర్షములుగ విభజించి ఒక్కొక్క పుత్రున కొక్కొక్కవర్షము నిచ్చెను. ఆ యేడు వర్షములనామము లిట్లున్నవి. సురోచనము, సౌమనస్యము, రమణకము, దేవబర్హము, పారిభద్రము, ఆప్యాయనము, అభిజ్ఞాతము.

**తేషు వర్షాద్రయో నద్యశ్చ సప్తైవాభిజ్ఞాతాః। సురసః శతశృఙ్గో వామదేవః కున్దః కుముదః పుష్పవర్షః సహస్రశ్రుతిరితి; అనుమతీ సినీవాలీ సరస్వతీ కూహూ రజనీ నన్దా రాకేతి ॥ 10**

ఈసురోచనాదిసప్తవర్షములలో సురసము, శతశృంగము,వామదేవము, కుందము, కుముదము, పుష్పవర్షము, సహస్రశ్రుతి యనునేడు పర్వతములు; అనుమతి, సినీవాలి, సరస్వతి, కుహు, రజని, నంద, రాక అనునేడునదులు ఉన్నవి.

**తద్వర్షపురుషాః శ్రుతిధరవీర్యధరవసున్ధరేషున్ధరసంజ్ఞాభగవన్తం వేదమయం సోమమాత్మానం వేదేన యజన్తే ॥ 11**

శ్రుతిధరులు, వీర్యధరులు, వసుంధరులు, ఇషుంధరులు మున్నగు నామములతో ప్రసిద్ధికెక్కిన ఈవర్షవాసులు వేదమయభగవదాత్మకు డగు చంద్రుని తమతమవర్ణములకు ఆశ్రమములకు తగినధర్మము ననుసరించి ఆరాధించుచుందురు.

**స్వగోభిః పితృదేవేభ్యో విభజన్ కృష్ణశుక్లయోః।**
**అన్తః ప్రజానాం సర్వాసాం రాజా నః సోమ ఆస్తు ॥ఇతి॥ 12**

వా రిట్లుస్తుతించుచుందురు :- శుక్ల కృష్ణములను రెండుపక్షములు దేవపితృగణముల కన్నాదుల నిచ్చుకాలము, సోముడు తనకిరణములద్వారా యీరెండుపక్షములను విభజించును. (దీనితాత్పర్య మేమియన శ్రాద్ధాదికర్మలయందు కాలాపేక్ష యుండును. ఆకాలమున 'స్వాహా; స్వధా' మున్నగుమంత్రముల నుచ్చరించి దేవలోకపితృలోకముల నుద్దేశించి హవ్యకవ్యాదుల నిచ్చుట నిషిద్ధము. చంద్రుడే ఆకాలమును విభజించువాడు). ఆయనయె సర్వప్రజకు రాజు. ఆయన మాకు ప్రసన్నుడగుగాక యని ప్రార్థించుచున్నాము.

**ఏవం సురోదార్బహిస్తద్ద్విగుణః సమానేనావృతో ఘృతోదేన యథాపూర్వః కుశద్వీపో యస్మిన్ కుశస్తమ్బో దేవకృతస్తద్ద్వీపాఖ్యాపవో జ్వలన ఇవాపరః స్వశష్పరోచిషా దిశో విరాజయతి ॥ 13**

సురాసముద్రమునకు బయట దాని (సురాసాగరము) యొక్క పరిమాణమునకు రెండురెట్లు అనగా ఎనిమిదిలక్షల యోజనముల వైశాల్యముతో కుశద్వీపమున్నది. వెనుక

చెప్పబడిన శాల్మలీద్వీపము తనతో సమానమైన సురాసముద్రముచే పరివృత మైయున్నట్లు ఈకుశద్వీపముగూడ తనతో సమాన మగుఘృతసాగరముచే పరివేష్టిత మైయున్నది. ఈకుశద్వీపమున నొకకుశస్తంబ మున్నది. ఈకుశ స్తంబము దేవతలచే నిర్మితమైనది. రెండవది అగ్నిస్వరూపము, మృదు వైన దానిశిఖాప్రభచే సర్వదిక్కులు ప్రజ్వరిల్లుచున్నవి. ఈకుశ స్తంబమువలననే కుశద్వీపమను నామము ఆద్వీపమునకు కలిగినది.

**తద్ద్వీపపతిః ప్రైయవ్రతో రాజన్ హిరణ్యరేతా నామ స్వం ద్వీపం సప్తభ్యః స్వపుత్రేభ్యో యథాభాగం విభజ్య స్వయం తప ఆతిష్ఠత్, వసు వసుదానదృఢరుచి నాభిగుప్తసత్యవ్రతవిప్రనామదేవనామభ్యః ॥ 14**

...రాజా! ప్రియవ్రతునితనయు డగుహిరణ్యరేతసుడు ఈద్వీపమున కధిపతి. ఆయన యాద్వీపమును ఏడుభాగములుగ విభజించి తనయేడుగురు పుత్రులకు నిచ్చి, తాను తపస్సునకు వెడలెను. హిరణ్యరేతసునియేడుగురు పుత్రులనామము లిట్లున్నవి :- వసువు, వసుదానుడు, దృఢరుచి, నాభిగుప్తుడు, సత్యవ్రతుడు, విప్రనాముడు, దేవనాముడు.

**తేషాం వర్షేషు సీమాగిరయో నద్యశ్చాభిజ్ఞాతాః సప్తసప్తైవ, బభ్రుశ్చతుః శృఙ్గః కపిలశ్చిత్రకూటో దేవానీక ఊర్ధ్వ రోమా ద్రవిణ ఇతి; రసకుల్యా మధు కుల్యా మిత్రవిన్దా శ్రుతవిన్దా దేవగర్భా ఘృతచ్యుతా మన్త్రమాలేతి ॥ 15**

ఈయేడువర్షములలో బభ్రువు, చతుఃశృంగము, కపిలము, చిత్రకూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము అనునేడుసరిహద్దు పర్వతములు; రసకుల్య, మధుకుల్య, మిత్రవింద, శ్రుతవింద, దేవగర్భ, ఘృతచ్యుత, మంత్రమాల అనునేడు ప్రసిద్ధనదులు గలవు.

**యాసాం పయోభిః కుశద్వీపౌకసః కుశలకోవిదాభియుక్తకులకసంజ్ఞా భగవన్తం జాతవేదః స్వరూపిణం కర్మకౌశ లేన యజన్తే ॥ 16**

కుశలము, కోవిదము, అభియుక్తము, కులకము ననుపేరుగల కుశద్వీపవాసులైన నాలుగువర్ణములవారు ఈనదీజలములలో స్నానాదుల నాచరించి పవిత్రులై భగవద్భజనానుకూల మగుకర్మనైపుణ్యముతో అగ్ని రూప మగుభగవద్రూపము నుపాసించుచున్నారు.

**పరస్య బ్రహ్మణః సాక్షాజ్జాతవేదోఽసి హవ్యవాట్ ।**
**దేవానాం పురుషాఙ్గాణాం యజ్ఞేన పురుషం యజ ॥ఇతి ॥ 17**

ఓ అగ్నీ ! నీవు సాక్షాత్తుగ పరమబ్రహ్మ మగుశ్రీహరికి అంగస్వరూపుడవు. నీ వా శ్రీహరికి యజ్ఞసంబంధ మైనద్రవ్యమును గొని పోవుదువు. అందువలన ఆపరమపురుషుడగు

భగవానున కంశస్వరూపులగునింద్రాది దేవతలకే హవ్యము నిచ్చుచున్నావో నీ వా దేవతల కంతర్యామియు అంశియు నగుభగవానునకే దానిని సమర్పింపు మనిప్రార్థించుచుందురు.

**తథా ఘృతోదాద్బహిః క్రౌంచద్వీపో ద్విగుణః సమానేన క్షీరోదేన పరిత ఉపక్లిప్తః, వృతో యథా కుశద్వీపో ఘృతోదేన। యస్మిన్ క్రౌంచనామా పర్వతరాజో ద్వీపనామ నిర్వర్తక ఆస్తే ॥** 18

ఘృతసముద్రమునకు బయట క్రౌంచద్వీప మున్నది. దానిపరిమాణము ఘృత సాగరమునకు రెండురెట్లు అనగా పదునాఱులక్షల యోజనములు. కుశద్వీపము ఘృత సాగరముచే పరివృత మైనట్లు క్రౌంచద్వీపముగూడ తనతోసమాన మగుక్షీరసాగరముద్వారా పరివేష్టిత మైయున్నది. ఈద్వీపమున క్రౌంచ మనునొక పర్వతరాజమున్నది. దాని నామముతోనే యీద్వీపమునకు క్రౌంచద్వీప మనుపేరు గలిగెను.

**యోఽసౌ గుహప్రహరణోన్మథితనితమ్బకుంజోఽపి క్షీరోదేనాభిషిచ్యమానో భగవతా వరుణేనాభిగుప్తో విభయో బభూవ ॥** 19

ఈక్రౌంచపర్వతము యొక్క తటప్రదేశము, అచట నున్న కుంజములు కార్తికేయుని అస్త్రములచే నష్టప్రాయము లయ్యెను. అయినను ఆపర్వతము తనకు నలువైపుల నున్న క్షీరసముద్రము యొక్క జలములచే తడుపబడి వరుణదేవునిచే రక్షితమై భయరహిత మైయుండెను.

**తస్మిన్నపి ప్రైయవ్రతో ఘృతపృష్ఠో నామాధిపతిః స్వే ద్వీపే వర్షాణి సప్త విభజ్య తేషు పుత్రనామసు సప్త ఋక్థాదీన్ వర్షపాన్ నివేశ్య స్వయం భగవాన్ భగవతః పరమకల్యాణయశస ఆత్మభూతస్య హరేశ్చరణారవిన్దముప జగామ ॥** 20

ఈద్వీపమున కధిపతి ప్రియవ్రతతనయు డగుఘృతపృష్ఠుడు, అతడు జ్ఞాని. ఈఘృతపృష్ఠుడుగూడ తనద్వీపమును తనయేడుగురుపుత్రులకు నేడు వర్షములుగ విభజించి యొక్కొక్కపుత్రున కొక్కొక్కవర్షము నిచ్చి తాను పరమకల్యాణగుణములు గల వాడు, ఆత్మస్వరూపుడు నగు శ్రీహరి యొక్క పాదపద్మములను శరణుజొచ్చెను.

**ఆమో మధురుహో మేఘపృష్ఠః సుధామా భ్రాజిష్ఠో లోహితార్ణో వనస్పతిరితి ఘృతపృష్ఠసుతాః। తేషాం వర్షగిరయః సప్త సప్తైవ నద్యశ్చాభిఖ్యాతాః- శుక్లో వర్ధమానో భోజన ఉపబర్హిణో నన్దో నన్దనః సర్వతోభద్ర ఇతి। అభయా అమృతౌఘా ఆర్యకా తీర్థవతీ రూపవతీ పవిత్రవతీ శుక్లేతి ॥** 21

ఆత్మ్మడు, మధురుహండు, మేఘపృష్ఠుడు, సుధాముడు, భ్రాజిష్ఠుడు, లోహితార్ణుడు, వనస్పతి యనువారు ఘృతపృష్ఠునియేడుగురుకొమాళ్ళు. ఈ యేడుగురు పుత్రుల నామముల ననుసరించు ఏడువర్షములలో శుక్లము, వర్ధమానము, భోజనము, ఉపబర్హణము, నందము, నందనము, సర్వతో భద్రము నను ఏడు సరిహద్దునిర్దేశకము లగుపర్వతములు; అభయము అమృతౌఘము, ఆర్యకము, తీర్థవతి, రూపవతి, పవిత్రవతి, శుక్లము ననుఏడు ప్రసిద్ధనదులు గలవు.

**యాసామమ్భః పవిత్రమమలముపయుంజానాః పురుషర్షభద్రవిణదేవక సంజ్ఞా వర్షపురుషా ఆపోమయం దేవమపాం పూర్ణేనాంజలినా యజన్తే ॥ 22**

ఈవర్షవాసులైన పురుషఋషభద్రవిణదేవకసంజ్ఞ లగునాలుగువర్ణములవారు ఈనదులలోనిపవిత్రజలములను సేవించుచుందురు. వారు జలపూర్ణము లైనదోసిళ్ళతో జలమయమూర్తి యగుభగవానుని సేవించుచుందురు.

**ఆపః పురుషవీర్యాః స్థ పునన్తీర్భూర్భువఃస్వరః ।**
**తానః పునన్త్వమీవఘ్నీః స్పృశతామాత్మనా భువః ॥ఇతి॥ 23**

ఓజలమా! మీకు భగవానునివలన సామర్థ్యము కలిగినది. అందువలన మీరు భూర్లోక భువర్లోక స్వర్లోకము లనుమూడింటిని పవిత్రము చేయుచున్నారు. ఇంకను మీరు మీస్వరూపములద్వారానే పాపములను హరించుచున్నారు. అందువలన మేము మిమ్ము స్పృశించుచున్నాము. మా శరీరములను పవిత్ర మొనరింపుడు.

**ఏవం పరస్తాత్ క్షీరోదాత్పరిత ఉపవేశితః శాకద్వీపో ద్వాత్రింశల్లక్షయోజనాయామః సమానేన దధిమణ్డోదేన పరివృతః;-యస్మిన్ హి శాకో నామ మహీరుహః స్వక్షేత్రవ్యపదేశకః; యస్యహ మహాసురభిగన్ధస్తద్ద్వీపమనువాసయతి ॥ 24**

ఈక్షీరసముద్రమునకు బయట శాకద్వీప మున్నది; ఈద్వీపము యొక్క వైశాల్యము ముప్పదిరెండులక్షలయోజనములు. వెనుక చెప్పబడిన క్రౌంచద్వీపము తనతోసమాన మగుక్షీరసాగరముచే పరివృతమైయున్నట్లు ఈశాకద్వీపముగూడ తనతోసమాన మగుదధి సముద్రముచే పరివేష్టిత మైయున్నది. ఈద్వీపమున శాక మను పేరుతో నొకమహావృక్షము కలదు; దాని పేరు ననుసరించి యీద్వీపమునకు శాకద్వీప మను పేరు వచ్చినది. ఈమహావృక్షము యొక్క సౌరభముతో ఈశాకద్వీపము సువాసిత మగుచుండును.

**తస్యాపి ప్రైయవ్రత ఏవాధిపతిర్నామ్నా మేధాతిథిః । సోఽపి విభజ్య సప్త వర్షాణి పుత్రనామాని తేషు స్వాత్మజాన్ పురోజవమనోజవ వేపమాన ధూమ్రానీకచిత్రరేఫ బహురూప విశ్వాధారసంజ్ఞాన్ నిధాప్యాధిపతీన్ స్వయం భగవత్యనన్త ఆవేశితమతి స్తపోవనం ప్రవివేశ ॥ 25**

ఈ ద్వీపమున కధిపతి ప్రియవ్రతతనయుడగు మేధాతిథి. అతడుగూడ ఈ ద్వీపమును తనయేడుగురుపుత్రులనామముల ననుసరించి యేడువర్షములుగ విభజించెను. పురోజవుడు, మనోజవుడు, వేపమానుడు, ధూమ్రానీకుడు, చిత్రరేపుడు, బహురూపుడు, విశ్వాధారుడు ననునీయేడుగురుపుత్రులలో ఒక్కొక్కని ఒక్కొక్కవర్షమున కధిపతినిగా జేసి తాను అనంతదేవుని పై మనస్సునుంచి తపస్సునకై తపోవనమునకు వెడలెను.

**ఏతేషాం వర్షమర్యాదాగిరయో నద్యశ్చ సప్త సప్తైవేశాన ఉరుశృఙ్గో బలభద్రః శతకేశరః సహస్రస్రోతో దేవపాలో మహానస ఇతి। అనఘాఽఽయుర్దా ఉభయస్పృష్టిరపరాజితా పంచపదీ సహస్రస్రుతిర్నిజధృతిరితి ॥ 26**

ఈయేడువర్షములలో ఈశానము, ఉరుశృంగము, బలభద్రము, శతకేసరము, సహస్రసోతము, దేవపాలము, మహానసము ననుఏడుసరిహద్దు పర్వతము లున్నవి. అనఘ, ఆయుర్ద, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచపది, సహస్రస్రుతి, నిజధృతి యను ఏడునదులు గలవు.

**తద్వర్షపురుషా ఋతవ్రత సత్యవ్రత దానవ్రతానువ్రత నామానో భగవన్తం వాయ్వాత్మకం ప్రాణాయామవిధూతరజస్తమసః పరమసమాధినా యజన్తే ॥ 27**

పైవర్షమున నివసించు ఋతవ్రత సత్యవ్రత దానవ్రతానువ్రతము లనునాలుగు వర్ణములవారు ప్రాణాయామాదులద్వారా రజస్తమస్సులను నాశముచేసి పరమసమాధి యోగముతో వాయురూపు డగుభగవామనారాధిచుచుందురు.

**అన్తః ప్రవిశ్య భూతాని యో బిభర్త్యాత్మకేతుభిః ।**
**అన్తర్యామీశ్వరః సాక్షాత్పాతు నో యద్వశే స్ఫుటమ్ ॥ 28**

(వారీ వాక్కుల నుచ్చరించుచుందురు) ప్రాణము అపానము మున్నగువృత్తిభేదము లతో ప్రాణులలో ప్రవేశించి సర్వభూతములను ధరించుచున్నవాడు, సర్వాంతర్యామియు, సాక్షాత్తుగ ఈశ్వరుడు, పరిదృశ్యమాన మగుజగత్తును అధీనములో నుంచుకొనినవాడు నగునాభగవానుడె మమ్ము రక్షించుగాక!

**ఏవమేవ దధిమండోదాత్పరతః పుష్కరద్వీపస్తతో ద్విగుణాయామః సమన్తత ఉపక్లిప్తః సమానేన స్వాదూదకేన సముద్రేణ బహిరావృతః। యస్మిన్ బృహత్పుష్కరం జ్వలన శిఖామలకనకపత్రాయుతాయుతం భగవతః కమలాసనస్యాధ్యాసనం పరికల్పితమ్ ॥ 29**

ఇట్లు దధిసముద్రమునకు బయట పుష్కరద్వీపము కలదు. ఈ ద్వీపము యొక్క పరిమాణము శాకద్వీపపరిమాణమునకు రెండురెట్లు, ఇది నలువైపుల తనతోసమాన మగు స్వాదుజలసాగరముద్వారా పరివేష్టిత మైయున్నది. ఈద్వీపమునందొకగొప్పపుష్కరము అనగా పద్మ మున్నది; దానియం దగ్నిశిఖవలె ఆయుతాయుతములగు (అసంఖ్యములగు) నిర్మల కనకమయ పత్రములు శోభిల్లుచున్నవి. ఆకమలపత్రములయందు జ్ఞానవంతుడగుపద్మయోనికి (బ్రహ్మకు) ఉపవేశనస్థానము కల్పింపబడినది.

**తద్ద్వీపమధ్యే మానసోత్తరనామైక ఏవార్వాచీనపరాచీన వర్షయోర్మర్యాదాచలోఽయుత యోజనోచ్ఛ్రాయాయామః। యత్ర తు చతసృషు దిక్షు చత్వారి పురాణి లోకపాలానామిన్ద్రాదీనామ్। యదుపరిష్టాత్ సూర్యరథస్య మేరుం పరిక్రామతః సంవత్సరాత్మకం చక్రం దేవానామహోరాత్రాభ్యాం పరిభ్రమతి ॥ 30**

ఈద్వీపమున పూర్వపశ్చిమవర్షముల రెండింటికి సరిహద్దుపర్వతముగ మానసోత్తరమనుపర్వత మొకటి యున్నది. దానివిస్తారము, ఉన్నతము అయుత (10వేల) యోజనములు. ఈపర్వతమునకు నలువైపుల ఇంద్రాదిలోకపాలురయొక్క నాలుగుపురములు గలవు. మేరువునకు నలువైపుల పరిభ్రమించి సూర్యరథముయొక్క సంవత్సరాత్మకచక్రము ఉత్తరాయణ దక్షిణాయనమను కాలమును గడచి దేవతల నాలుగుపురములకు పైభాగమున లౌకికచక్రమువలె పరిభ్రమించుచుండును.

**తద్ద్వీపస్యాధిపతిః ప్రైయవ్రతో వీతిహోత్రో నామ తస్యాత్మజౌ రమణక ధాతక నామానౌ వర్షపతీ నియుజ్యస్వయం పూర్వజవద్భగవత్కర్మశీల ఏవాస్తే॥ 31**

ఆద్వీపమున (పుష్కరద్వీపమున)కు అధిపతి ప్రియవ్రతునిపుత్రుడగు వీతిహోత్రుడు, అతడు రమణకుడు ధాతకుడు నను తన ఇరువురుపుత్రులను పూర్వపశ్చిమవర్షములకు అధిపతులునుగా జేసి తాను జ్యేష్ఠభ్రాతయగు మేధాతిథివలె భగవదుపాసనయందు రతుడయ్యెను.

**తద్వర్షపురుషా భగవన్తం బ్రహ్మరూపిణం సకర్మకేన కర్మణారాధయన్తి; ఇదం చోదాహరన్తి ॥ 32**

ఈవర్షవాసు లగుమానవులు స్వయంభూమూర్తి యగుభగవానుని సకామభావనతో వందనాదులద్వారా ఆరాధించుచు ఇట్లు పలుకు చుందురు.

**యత్తత్కర్మమయం లిఙ్గం బ్రహ్మలిఙ్గం జనోఽర్చయేత్।**
**భేదేనైకాన్తమద్వైతం తస్మై భగవతే నమః ఇతి ॥ 33**

"స్వధర్మనిష్ఠః శతజన్మభిః పుమాన్ విరించతామేతి" అనగా తన వర్ణాశ్రమధర్మముల యందు నిష్ఠగలపురుషుడు నూఱుజన్మములలో బ్రహ్మత్వమును పొందును" అనుభాగవత వాక్కు ననుసరించి ఆయన (బ్రహ్మ) కర్మఫలమునకు మూర్తిస్వరూపుడు, బ్రహ్మమును అనగా వేదమును వెలువరించినవాడు, పరమేశ్వరునియం దేకాంతనిష్ఠాయుక్తుడు, ఆయన కంటె అభిన్నుడు కనుక సేవ్యసేవకభావముతో ఆయనసేవనే చేయవలెను. అందువలన మే మా బ్రహ్మమూర్తి యగుభగవానునకు నమస్కరించుచున్నాము.

**తతః పరస్తల్లోకాలోకనామాచలో లోకాలోకయోరన్తరాలే పరిత ఉపక్షిప్తః ॥ 34**

దానికి పరమున శుద్ధజలసాగరమునకు బహిర్భాగమున సూర్యాదుల ఆలోక (ప్రకాశ) విశిష్టము, ఆలోక (ప్రకాశ) విహీనము నగుదేశములున్నవి. ఈరెండుదేశముల విభాగము కొఱకు ఈరెండింటిమధ్యదేశమున లోకాలోక పర్వతము నిర్మితమైనది.

**యావన్మానసోత్తరమేర్వోరన్తరం తావతీ భూమిః కాంచన్యాదర్శతలోపమా, యస్యాం ప్రహితః పదార్థో న కథంచిత్పునః ప్రత్యుపలభ్యతే; తస్మాత్సర్వసత్త్వ పరిహృతాసీత్ ॥ 35**

సుమేరుపర్వతమధ్యదేశమునుండి మానసోత్తరపర్వతమువఱకు గల పరిమిత భూమియె శుద్ధజలసాగరమునకు ఆవలకూడ గలదు. అచట ఎన్నియో జీవరాసులుగూడ నున్నవి. దానికిపిమ్మట లోకాలోకపర్వతమునకు దధిసముద్రమునకు నడుమ నొకకాంచనమయ మగుభూమి యున్నది. ఈభూమి దర్పణమువలె స్వచ్ఛమైనది. దానియం దేద్రవ్యముంచిన అను అది మరల లభింపదు. అందువలన ఈభూమి సర్వప్రాణులచే వర్జితమై యున్నది.

**లోకాలోక ఇతి సమాఖ్యా యదనేనాచలేన లోకో ఽలోకస్యాన్తర్వర్తినావస్థాప్యతే ॥ 36**

ప్రకాశితము అప్రకాశితము నగురెండుదేశములనడుమ నొకపర్వతమున్నది. దానిద్వారా యీరెండుప్రదేశములు వేఱువేఱుగ వ్యవస్థాపితము లై యుండుటచే దానికి లోకాలోకపర్వత మను పేరు కలగినది.

స లోకత్రయాన్తే పరిత ఈశ్వరేణ విహితః; యస్మాత్సూర్యాదీనాం ధ్రువాపవర్గాణాం జ్యోతిర్గణానాం గభస్తయో ఽర్వాచీనాస్త్రీన్ లోకానావితన్వానా న కదాచిత్పరాచీనా భవితుముత్సహన్తే తావదున్న హనాయామః ॥ 37

పరమేశ్వరు డీలోకాలోకపర్వతమును భూర్భువస్స్వర్లోకములకు మూడింటికి సరిహద్దు పర్వత రూపమున స్థాపించెను. సూర్యాదులలోకముల నుండి ధ్రువలోకమువఱకు జ్యోతిర్మయమండలము యొక్క కిరణములు నలువైపుల మండలాంతరమున నున్నమూడు లోకములవఱకు వ్యాప్త మై యున్నవి. ఈపర్వతము ప్రతిబంధక మగుటచే నీకిరణము లెప్పుడును దానిబయటకు వెడలజాలవు. ఈపర్వతము మిగుల ఉన్నతముగను, బహు దూరమువఱకును విస్తరించి యున్నది. అది ధ్రువలోకమునకంటె మిగుల ఉన్నతముగ నుండుటచే త్రిభువనములకు సరిహద్దుపర్వతముగ నున్నది.

ఏతావాన్ లోకవిన్యాసో మానలక్షణసంస్థాభిర్విచిన్తితః కవిభిః। స తు పంచాశత్కోటిగుణితస్య భూగోలకస్య తురీయ భాగో ఽయం లోకాలోకాచలః ॥ 38

ఇట్లు పండితులు పరిమాణము, లక్షణము ఆకారము ననువానిద్వారా యీలోకసృష్టిని విచారించి స్థిరపఱచిరి. ఆలోకాలోకపర్వతము పరిమాణమున ఏబదికోట్లయోజనముల పరిమితిగల భూలోకము యొక్క నాలుగవ భాగము అనగా పండ్రెండున్నరకోట్ల యోజనము లున్నది.

తదుపరిష్టాచ్చతసృష్వాశాస్వాత్మయోనినాఖిలజగద్గురుణా వినివేశితా యే ద్విరదపతయ ఋషభః పుష్కరచూడోవామనో ఽపరాజిత ఇతి సకల లోకస్థితిహేతవః ॥ 39

ఈలోకాలోకపర్వతమునకు పైభాగమున నలువైపుల జగద్గురు వగు బ్రహ్మచే స్థాపింపబడిన నాలుగుగజపతు లున్నవి. ఋషభము, పుష్కరచూడము, వామనము, అపరాజితము ననివానిపేర్లు. ఇవియే సర్వలోకముల యునికికి మూలములు.

తేషాం స్వవిభూతీనాం మహేన్ద్రాదీనాం లోకపాలానాం చ వివిధవీర్యోపబృంహణాయ భగవాన్ పరమమహాపురుషో మహా విభూతిపతిరన్తర్యామ్యాత్మనో విశుద్ధసత్త్వం ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యాద్యష్టమహాసిధ్యుపలక్షణం విష్వక్సే నాదిభిః స్వపార్షదప్రవరైః పరివారితో నిజవరాయుధోపశోభి తైర్భుజదణ్డైః సంధారయమాణస్తస్మిన్ గిరివరే సమన్తాత్సకల లోకస్వస్తయ ఆస్తే ॥ 40

పరమైశ్వర్యరూపుడు, పరవ్యోమపతియు, మహాపురుషుడు, అంతర్యామియు వగు భగవానుడు విశుద్ధసత్త్వమయము, అప్రాకృతము నగుతనరూపమును ప్రకటించి స్వపార్ష

ప్రవరు లగువిష్వక్సేనాదులద్వారా పరివేష్టితుడై స్వాంశభూతము లగుదిగ్గజములకు, మహేంద్రాదిలోకపాలకులకు వీర్యవర్ధనము, సర్వజీవులకు మంగళకరము వగునాగిరిశ్రేష్ఠము (లోకాలోకపర్వతము) న నుండును. అచట భగవానునిభగశబ్దవాచ్యము లగుధర్మజ్ఞానవైరాగ్యాదులైనషడ్విధైశ్వర్యములయొక్క, అణిమాదులైన అష్టమహాసిద్ధుల యొక్క స్వరూపలక్షణము శోభిల్లుచున్నది. తనయస్త్రములచే అలంకృతములైన నాలుగుభుజములతో గూడి పరమ శోభతో విరాజిల్లుచుండును.

**ఆకల్పమేష ఏవం గతో భగవానాత్మయోగమాయా విరచిత వివిధ లోకయాత్రా-గోపీథాయేత్యర్థః ॥ 41**

వివిధము లగునీలోకయాత్ర లన్నియు భగవానునిచిచ్ఛక్తిస్వరూపిణి యగు యోగ మాయచే విరచితములైనవే. భగవానుడు తనశక్తిచే విరచితము లైనలోకములను పరిపాలించుటకై యిట్టి వివిధైశ్వర్యమయము లగు రూపములను ప్రకటించుచుండును .

**యోఽన్తర్విస్తార ఏతేన హ్యలోకపరిమాణం చ వ్యాఖ్యాతం యద్బహిర్లోకాచలాత్, తతః పరస్తాద్యోగేశ్వరగతిం విశుద్ధాముదాహరన్తి ॥ 42**

రాజా! లోకాలోకపర్వతమునకు బయట నున్న అలోకవర్షము మధ్యభాగమున విస్తరించి యున్నది. ఈవర్షముయొక్క పరిమాణము పండ్రెండున్నరకోట్లయోజనము లనిచెప్పబడినది. ఈఅలోకవర్షమునకు పిమ్మట ముముక్షువులు వెడలగలప్రదేశ మున్నది; ఇది రజస్తమోముల రహితము, యోగేశ్వరులకు గమ్యము వనికవులు వర్ణించిరి. (బ్రాహ్మణ పుత్రుని దెచ్చునపుడు శ్రీకృష్ణభగవాను డీప్రదేశమును అర్జునునకు జూపెను.)

**అణ్డమధ్యగతః సూర్యోద్యావాభూమోర్యదన్తరమ్ ।**
**సూర్యాణ్డగోలయోర్మధ్యే కోట్యః స్యుః పంచవింశతిః ॥ 43**

బ్రహ్మాండమధ్యగతస్థానమున సూర్యుడున్నాడు. భూర్భువర్లోకముల రెండింటికి గల అంతరమె బ్రహ్మాండముయొక్క మధ్యభాగము అవగా అంతరిక్షము. సూర్యాండగోలకముల మధ్యస్థలముయొక్క పరిమాణము ఇరువదియైదుకోట్లయోజనములు.

**మృతేఽణ్డ ఏష ఏతస్మిన్ యదభూత్ తతో మార్తణ్డ ఇతి వ్యపదేశః హిరణ్యగర్భ ఇతి యద్ధిరణ్యాణ్డసముద్భవః ॥ 44**

అచేతన మగునీయండమున సూర్యుడు వైరాజ (స్థూలము లేదా సమష్టిశరీర) రూపముతో ప్రవిష్టుడై యుండుటచే ఆయన మార్తండుడయ్యెను. ఇంకను ఆయన హిరణ్యగర్భనామముతోను పిలువబడుచున్నాడు; సూక్ష్మము లేదా మహత్తత్త్వశరీరుడగు హిరణ్యగర్భునినుండియె ఆయన వైరాజరూప మగుస్థూలశరీరము ప్రకటమయ్యెను.

వివరణము :

హిరణ్యగర్భః సూక్ష్మో ఽత్రస్థూలో వైరాజసంజ్ఞకః।
భోగాయ సృష్టయే చాభూత్ పద్మభూరితి స ద్విధా ॥
వైరాజ ఏవ ప్రాయస్స్యాత్ సర్గాద్యర్థం చతుర్ముఖః
కదాచిద్భగవాన్ విష్ణుర్బ్రహ్మా సన్ సృజతి స్వయమ్ ॥

(లఘుభాగవతామృతము, పూ.ఖం. 13)

జీవకోటి, ఈశ్వరకోటి యనిబ్రహ్మ ద్వివిధము; వారిలో జీవకోటి బ్రహ్మవిషయమే యని యీశ్లోకము చెప్పుచున్నది. జీవకోటి యైనబ్రహ్మహిరణ్యగర్భుడు, వైరాజుడు ననుభేదముచే రెండువిధములు, హిరణ్యగర్భబ్రహ్మ - సూక్ష్మసమష్టిశరీరము అనగా మహత్తత్త్వశరీరము. దేవాదుల కగోచరుడు, వైరాజబ్రహ్మ స్థూలసమష్టిశరీర మగుబ్రహ్మాండ విగ్రహము. ఈ శ్లోకమున సూర్యుడు వైరాజరూపముతో కీర్తింపబడినాడు.

సూర్యేణ హి విభజ్యన్తే దిశః ఖం ద్యౌర్మహీ భిదా।
స్వర్గాపవర్గౌ నరకా రసౌకాంసి చ సర్వశః ॥ 45

రాజా! సూర్యునివలననే దిక్కులు, ఆకాశము, స్వర్గము, పృథివి, ఇంకను యితర విభాగములు ఏర్పడినవి. భోగమోక్షస్థానములు, నరకము, అతలము మున్నగుసర్వలోకములు - అనునీవిభాగముగూడ సూర్యుని వలననే ఏర్పడినది.

దేవతిర్యఙ్మనుష్యాణాం సరీసృప్ఖగవీరుధామ్।
సర్వజీవనికాయానాం సూర్య ఆత్మా దృగీశ్వరః ॥ 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే సముద్రద్వీపవర్ణనం
నామ వింశోఽధ్యాయః ॥

దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, పరీసృపములు (ప్రాకునట్టివి), లతలు మున్నగుసర్వజీవసృష్టికి ఆధారుడు, వానికంటె (సర్వజీవులకంటె) అభిన్నస్వరూపుడు, నేత్రముల కధిష్ఠానదేవత సూర్యుడే.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
సముద్రద్వీపవర్ణన మను ఇరువదియవఅధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదియొకటవ అధ్యాయము

## సూర్యుని రథగమన వర్ణనము

కథాసారము:-ఈయధ్యాయమున కాలచక్రము నందు భ్రమణముచేయు సూర్యుని గమనము ననుసరించి దివారాత్రములవృద్ధిక్షయములు మున్నగునవి నిరూపితము లైనవి.

ఉత్తరాయణమున పగటియందు సూర్యునకు మందగమనము, రాత్రియందు శీఘ్రగమనము నుండుటవలన ఆసమయము పగటికి వృద్ధి; రాత్రికి హ్రాసము నగును. దక్షిణాయనమున దానికి పూర్తిగ విరుద్ధముగ నుండును అనగా అపుడు దివాభాగమున సూర్యునకు శీఘ్రగమనము, రాత్రికాలమున మందగమనము నుండును. అందువలన ఆసమయము రాత్రికాలమునకు వృద్ధి, దివాభాగమునకు హ్రాసము నగును. ఉత్తరాయణమున ప్రథమములో సూర్యుడు మకరరాశిలోనికి, తదనంతరము కుంభరాశిలోనికి, అనంతరము మీనరాశిలోనికి గమనము సాగించును. సూర్యుడు మేషతులారాసులలో నున్నపుడు దివారాత్రములు సమముగనుండును. సూర్యుడు కర్కటకమునుండి ధనుస్సువఱకు గలరాసులలో నున్నకాలము దక్షిణాయనము. మకరమునుండి మిథునరాశివఱకు గల రాసులలో నున్న కాలము ఉత్తరాయణము. మానసోత్తరపర్వతమున సుమేరువునకు తూర్పుదిక్కున దేవధాని యనునామముతో ఇంద్రునిపురము, దక్షిణమున సంయమని యనునామముతో యమునిపురము, పశ్చిమమున నిమ్లోచమను పేరుతో వరుణుని పురము, ఉత్తరమున విభావరియనునామముతో చంద్రుని పురము నున్నవి. ఆ పురములలో తగినకాలమున సూర్యునకు ఉదయము, మధ్యాహ్నము, అస్తమయము, నిశీథము కలుగును. ఏప్రదేశమున సూర్యుడు తెల్లవారుజామున జనులకు గోచరుడగునో ఆసమయమున ఆప్రదేశమునకు సరిగ ఎదురుగ నున్నస్థానమున (దేశమున) ఆయన అచటిజనులకు అస్తమితరూపమున అగుపడును. ఇంకను ఏస్థానమున ఆయన ఆకాశమున నడుమనుండి తాపమును గలుగజేయునో సరిగ దానికి ఎదురుగ నున్నస్థానమున అర్ధరాత్రమును గలుగజేయును. చంద్రుడు మున్నగునితర గ్రహములతోను, నక్షత్రములతోను గూడి జ్యోతిశ్చక్రమున ఉదయించును, అస్తమించును. సౌరరథముయొక్క సంవత్సరమను చక్రమున సముదాయకాలచక్రము ప్రతిష్ఠితమైనది. దీని అక్షము (ఇరుసు) యొక్క ఒకకొన సుమేరుపర్వతమునకు శీర్ష దేశమున, మరియొకకొన మానసోత్తరమున నున్నది.

గాయత్రి, బృహతి, ఉష్ణిక్కు, జగతి, త్రిష్టుప్పు, అనుష్టుప్పు, పంక్తి యనునీయేడు ఛందములు సూర్యునియశ్వములు. ఇవి అరుణదేవునిచే నవలక్షయోజనములపరిమితి

గల కాడియందు గూర్పబడి ఆదిత్యదేవుని మోయుచున్నవి. అంగుష్ఠపరిమాణముగల అఱువది వేలమంది వాలఖిల్యమునులు ఎదురుగ నుండి సూర్యదేవుని స్తుతించుచుందురు. గంధర్వులు, అప్సరసలు మున్నగుపదునాలుగుసంఖ్యగలవ్యక్తులు ఏడుగణములుగ నేర్పడి వేఱువేఱుకర్మలద్వారా ప్రతిమాసమునందును భిన్న నామధారి యగు సూర్యుని, సర్వాంతర్యామి యగుభగవానుని ఉపాసించుచుందురు. ఆదిత్యదేవుడు తొమ్మిది కోట్లయేబది యొక్క లక్షలయోజనములపరిమితి గలభూమండలమున ప్రతిక్షణము రెండువేల రెండు యోజనముల దూరము పరిభ్రమించుచుండును.

## శ్రీ శుకఉవాచ

**ఏతావానేవ భూవలయస్య సన్నివేశః ప్రమాణలక్షణతో వ్యాఖ్యాతః ॥1**

శుకుడు పలికెను : రాజా! భూమండలము యొక్క ఆపరిమాణమును (విస్తారమున ఏబదికోట్లయోజనములు, ఔన్నత్యమున ఇరువదియైదుకోట్ల యోజనములు) నీకు ప్రమాణములతోను, లక్షణములతోను వివరించి చెప్పితిని.

**ఏతేన హి దివో మణ్డలమానం తద్విద ఉపదిశన్తి యథా ద్విదలయోర్ని ష్పావాదీనామ్। తే అన్తరేణాన్తరిక్షం తదుభయసన్ధితమ్ ॥ 2**

గోధుమ మున్నగు ద్విదళసస్యమునకు క్రింద నున్నదళముయొక్క పరిమాణము నిర్దిష్టమైనచో పైన నున్నదళము యొక్కపరిమాణమును నిర్దేశింపవచ్చును. అట్లే స్వర్గతత్త్వవేత్త లగుపండితులు భూగోళమానము ననుసరించి స్వర్గమండలముయొక్క పరిమాణమును నిర్దేశించుచుందురు. భూగోళస్వర్గలోకములనడుమ నున్నస్థానమే ఆకాశము: అది భూగోళము నకు పైన, స్వర్గలోకమునకు క్రింద నున్నది.

**యన్మధ్యగతో భగవాంస్తపతాం పతిస్తపన ఆతపేన త్రిలోకీం ప్రతపత్య వభాసయత్యాత్మభాసా। స ఏష ఉదగయనదక్షిణాయనవై షువత సంజ్ఞాభి ర్మాన్ద్యశైఘ్ర్య ప్రసమానాభిర్గతిభిరారోహణావరోహణసమస్థానేషు యథాసవన మభిపద్య మానో మకరాదిషు రాశిష్వహోరాత్రాణి దీర్ఘహ్రస్వ సమానాని విధత్తే॥ 3**

ఆ యాకాశమధ్యభాగమున నుండి తాపమును గలుగజేయువాడు, చంద్రుడు మున్నగుగ్రహములకు రాజు, ఐశ్వర్యశాలియు నగు అంశుమాలి (సూర్యుడు) తనతేజః ప్రభావముతో త్రిలోకములకు తాపమును గలుగజేయుచుండును. అంగకాంతిద్వారా త్రిభువనముల నుద్దీపింపజేయుచుండును. ఉత్తరాయణము, దక్షిణాయనము, విషువత్తు

అనునీమూడునామముల ననుసరించి ఆయనకు మందము, క్షిప్రము, సమానము ననుమూడుగతులు గలవు. ఈమూడుగతుల ననుసరించి ఆరోహణావరోహణ సమస్థానముల యందు మకరాదిరాసులయందు తగినకాలమున ఆరోహణాదులను పొంది దివారాత్రములను హ్రస్వదీర్ఘసమానములుగ జేయుచుండును.

**యదా మేషతులయోర్వర్తతే తదాహోరాత్రాణి సమానాని భవన్తి; యదా వృషభాదిషు పంచసు చ రాశిషు చరతి, తదాహాన్యేవ వర్ధన్తే; హ్రసతి చ మాసి మాస్యేకైకా ఘటికా రాత్రిషు ॥ 4**

సూర్యుడు మేషతులారాసులయం దున్నపుడు దివారాత్రములు సమానముగ ఉండును. వృషభము మున్నగునైదురాసులలో సంచరించుచున్నపుడు దివాభాగము వృద్ధిబొందును. ప్రతిమాసమునందును ఒక్కొక్క ఘటికచొప్పున రాత్రిమానము హ్రాసమును పొందు చుండును.

**యదా వృశ్చికాదిషు పంచసు రాశిషు వర్తతే తదాహోరాత్రాణి విపర్యయాణి భవన్తి॥ 5**

వృశ్చికము మున్నగునై దురాసులలో మన్నపుడు పగలు తగ్గును, రాత్రి వృద్ధిపొందును.

**యావద్దక్షిణాయనమహాని వర్ధన్తే యావదుదగయనం రాత్రయః ॥6**

ఎన్నిదినములు దక్షిణాయన ముండునో అన్నిదినములు పగలు, ఎన్నిదినములు ఉత్తరాయణ ముండునో అన్నిదినములు రాత్రి వృద్ధిపొందుచుండును.

**ఏవం నవకోటయ ఏకపంచాశల్లక్షాణి చ యోజనానాం మానసోత్తర గిరిపరివర్తనస్యోపదిశన్తి, తస్మిన్నైన్ద్రీంపురీం పూర్వస్యాం మేరోర్దేవధానీం నామ దక్షిణతో యామ్యాం సంయమనీం నామ పశ్చాద్వారుణీం నిమ్లోచనీం నామ ఉత్తరతః సౌమ్యాం విభావరీం నామ, తాసూదయమధ్యాహ్నాస్తమయనిశీథాని భూతానాం ప్రవృత్తినివృత్తినిమిత్తాని సమయవిశేషేణ మేరోశ్చతుర్దిశమ్ ॥ 7**

రాజా! వెనుక చెప్పబడినభ్రమణవిధానముద్వారా సూర్యుడు మానసోత్తరపర్వతమునకు నలువైపుల మండలాకారమున తొమ్మిదికోట్లయేబది యొక్కలక్షలయోజనములు సంచరించుచుండు ననిపండితులు నిర్ణయించిరి. ఈమానసోత్తరపర్వతమున సుమేరువునకు తూర్పుదిక్కున 'దేవధాని' యను పేరుతో ఇంద్రునిపట్టణము, దక్షిణమున 'సంయమని' యను పేరుతో యమునిపట్టణము, పశ్చిమమున 'నిమ్లోచని' యను పేరుతో వరుణుని పురము, ఉత్తరమున 'విభావరి' యనునామముతో చంద్రునిపట్టణము గలవు. ఈ

పట్టణములలో కాలవిశేషము ననుసరించి ఉదయము, మధ్యాహ్నము, అస్తమయము, నిశీథము (అర్ధరాత్రము) నగుచుండును. ఈయుదయాదులు జీవుల ప్రవృత్తినివృత్తులకు హేతువులై యున్నవి.

**తత్రత్యానాం దివసమధ్యగత ఏవ సదాదిత్యస్తపతి సవ్యేన చలన్ దక్షిణేన కరోతి। యత్రోదేతి తస్య సమాన సూత్రనిపాతే నిమ్లోచతి యత్ర క్వచన స్యన్దే నాభి తపతితస్య హైష సమాన సూత్రానిపాతే ప్రస్వాపయతి తే తత్ర గతం న పశ్యన్తి యేఽస్తమనుపశ్యేరన్ ॥ 8**

అన్నివేళలయందు సూర్యుడు ఆకాశమధ్యగతుడై అనగా మధ్యాహ్నకాలమున సుమేరువునందు నివసించుజనులకు తాపమును గలుగజేయును. ఆయననక్షత్రాభిముఖము స్వాభావికము నగుగమనము ననుసరించి సుమేరువును ఎడమవైపున నుంచుకొని ప్రయాణముచేయును.అయినను దక్షిణావర్తప్రవర్తకప్రవాహ మనువాయువు ద్వారాత్రిప్పబడు జ్యోతిశ్చక్రము ననుసరించి ప్రతిదినము సుమేరువు నొక్కమారు దక్షిణమున నుంచుకొని పయనించును. ఆయన ఏప్రదేశమున మొదట జనుల నేత్రములకు గోచరు డగునో సరిగ నాసమయమున ఆ ప్రదేశమునకు సమసూత్రపాతస్థానమున అనగా ఎదురుగా నున్నస్థానమున అచటిజనులకు అస్తమయరూపముతో గనపడును. ఇంకను అంశమధ్యభాగమునమండి ఆయన యేస్థానమున ప్రాణులకు స్వేదమును పుట్టించి తాపమును కలుగజేయునో సరిగ అపుడు ఆప్రదేశమునకు సమసూత్రపాతస్థానమున అనగా ఎదురుగా నున్నస్థానమున అచటిజనులకు అర్ధరాత్రమగును. అందువలన ఎవరేస్థానములయందుండి ఆయన అస్తమయమును దర్శింతురో వా రాయనసమసూత్రపాతస్థానమున అనగా ఎదురుగా నున్నస్థానమున ఆయనను ఆస్థితిలో చూడజాలరు.

**యదా చైన్ద్రాః పుర్యాః ప్రచలతే పంచదశభిర్ఘటికాభిర్యామ్యాం సపాద కోటిద్వయం యోజనానాం సార్ధద్వాదశలక్షాణి సాధికాని చోపయాతి। ఏవం తతో వారుణీం సౌమ్యామైన్ద్రీంచ పునః ॥ 9**

సూర్యుడు ఇంద్రపురమునుండి యమపురమున కభిముఖముగ పయనించునపుడు పదునైదుగడియలలో రెండుకోట్లముప్పదియేడులక్షలడెబ్బదియైదువేల (23775000) యోజనముల నతిక్రమించి యమపురమునకు వెడలును, అచటినుండి వరుణునిపుర మగువారుణికి, అచటినుండి చంద్రుని పురమునకు, అచటినుండి మరల యింద్రుని పురమునకు తిరిగివచ్చును.

తథాన్యే చ గ్రహాః సోమాదయో నక్షత్రైస్సహ జ్యోతిశ్చక్రే సమభ్యుద్యన్తి సహ వాభినిమ్లోచన్తి ॥ 10

ఇట్లు చంద్రుడు మున్నగునితరగ్రహములు నక్షత్రగణములతో జ్యోతిశ్చక్రమునం దుదయించి, నక్షత్రాదులతోడనె అస్తమించును.

ఏవం ముహూర్తేన చతుస్త్రింశల్లక్షయోజనాన్యష్ట శతాధికాని సౌరరథ స్త్రయీమయోఽసౌ చతసృషు పరివర్తతే పురీషు ॥ 11

ఇట్లు సూర్యుని త్రయీమయమైన యారథము నాలుగుపట్టణముల చుట్టు ఒక ముహూర్తములో ముప్పదినాలుగులక్షల యెనిమిదివేల యోజనములు సంచరించును.

యస్యైకం చక్రం ద్వాదశారం షణ్ణేమి త్రిణాభి సంవత్సరాత్మకం సమామనన్తి తస్యాక్షో మేరోర్మూర్ధని కృతో మానసోత్తరే కృతేతరభాగో యత్ర ప్రోతం రవిరథచక్రం తైలయన్త్రచక్రవన్మానసోత్తరగిరౌ పరిభ్రమతి ॥ 12

ఈ సూర్యరథమున కొకచక్రమున్నది. అది సంవత్సర మని వర్ణింపబడినది. పండ్రెండునెలలు దానిపండ్రెండు ఆకులు, అనగా ప్రాంతభాగములు, ఆరుఋతువులు దాని ఆఱునేత్రములు అనగా అగ్రభాగములు; మూడు చాతుర్మాస్యములు దాని నాభులు (కుండులు) అనగా మధ్యభాగము, దాని అక్షము (ఇరుసు) వకు ఒకవైపు సుమేరు పర్వత శీర్షదేశము, మరియొకవైపు మానసోత్తరము నున్నవి. రథచక్రమీయక్షమున గూర్చబడి యుండుటవలన తైలయంత్రచక్రమువలె మానసోత్తరపర్వతమున నిరంతరము పరి భ్రమించుచుండును.

తస్మిన్నక్షే కృతమూలో ద్వితీయోఽక్షస్తుర్యమానేన సమ్మితస్తైలయన్త్రాక్ష వద్ధ్రువే కృతోపరిభాగః ॥ 13

ఈ చక్రమునకు మఱియొకయిరుసు ఉన్నది. దాని పూర్వభాగము మేరుమానసోత్తరా యతము, అనగా 15750000 యోజనములపరిమిత మగుప్రథమాక్షమున నిబద్ధమైయున్నది. దానిపరిమాణము-మొదటి అక్షములోని చతుర్థాంశము అనగా 3937500 యోజనములు, తైలయంత్రమువలె దాని పైభాగము ధ్రువలోకమున వాయుపాశముతో గట్టబడియున్నది.

రథనీడస్తు షట్త్రింశల్లక్షయోజనాయతస్తత్తురీయభాగవిశాలస్తావాన్ రవిరథయుగః ; యత్ర హయాశ్ఛన్దోనామానః సప్తారుణయోజితా వహన్తి దేవమాదిత్యమ్ ॥ 14

మహారాజా! సూర్యరథములోని ఉపవేశనస్థానము ముప్పదియాఱులక్షల యోజనముల పొడవు. దానిలోని నాలుగవవంతు అనగా తొమ్మిదిలక్షల యోజనములు దాని వైశాల్యము (వెడల్పు) రథము యొక్క యుగము అనగా కాడియొక్క పరిమాణముకూడ అంతేసంఖ్యలో ఉన్నది. అనగా తొమ్మిది లక్షలయోజనములు. ఈకాడియందు అరుణదేవునిచే గూర్పబడిన వై గాయత్రి మున్నగునేడుఛందములనామముతో ఏడశ్వములు ఆదిత్యుని వహించు చుండును.

వివరణము :-

**హయాశ్చ సప్తఛన్దాంసి తేషాం నామాని మే శృణు।**

**గాయత్రీ చ బృహత్యుష్ణిగ్జగతీ త్రిష్టు పేవ చ।**

**అనుష్టుప్ పఙ్త్రిరిత్యుక్తాశ్ఛన్దాంసి హరయో రవేః॥** (విష్ణుపురాణము 2-87)

ఏడుఛందములె సూర్యుని అశ్వములు. వానినిగూర్చి చెప్పుచున్నాను వినుము :- 1.గాయత్రి, 2. బృహతి, 3. ఉష్ణిక్, 4. జగతి, 5. త్రిష్టుప్, 6. అనుష్టుప్, 7. పంక్తి. ఈ ఛందస్సులు సూర్యునిసప్తాశ్వము లనిచెప్పబడినవి.

**పురస్తాత్ సవితురరుణః పశ్చాచ్చ నియుక్త సౌత్యేకర్మణి కిలాస్తే ॥15**

అరుణుడు సూర్యరథాశ్వచోదన మను సారథ్యకర్మమునందు నియుక్తుడై సూర్యుని యెదుట ఉండియు ప్రత్యఙ్ముఖు డైయుండును.

**తథా వాలిఖిల్యా ఋషయోఽఙ్గుష్టపర్వమాత్రాః షష్టి సహస్రాణి పురతః సూర్యం సూక్తవాకాయ నియుక్తాః సంస్తువన్తి ॥ 16**

అంగుష్ఠపరిమితము గల అఱువదివేలమంది వాలఖిల్యఋషులు స్తుతివాక్యములను పలుకుటకై నియమింపబడి సూర్యునియెదుట నిలబడి ఆయనను స్తుతించుచుందురు.

**తథాన్యే చ ఋషయో గన్ధర్వాప్సరసో నాగాగ్రామణ్యో యాతుధానా దేవా ఇత్యేకైకశో గణాః సప్తచతుర్దశ మాసి మాసి భగవన్తం సూర్యమాత్మానం నానానామానంపృథఙ్నామానః పృథక్కర్మభిర్ద్వన్ద్వశ ఉపాసతే ॥ 17**

ఇట్లు ఇతరులైన ఋషులు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు మున్నగువారిని ఒక్కొక్కరిగ జేసి లెక్కించిన పదునలుగు రగుదురు. వారు ఇరువురిచొప్పున ఏడుగణములుగ విభజింపబడి ప్రతిమాసమునందును భిన్నభిన్ననామము లను ధరించి విభిన్న కర్మలద్వారా విభిన్ననామములను ధరించినసూర్యుని, సర్వాంతర్యామి యగుభగవానుని ఉపాసించుచుందురు.

లక్షోత్తరసార్ధనవకోటియోజనపరిమణ్డలం భూవలయస్య క్షణేన సగవ్యూత్యుత్తరం ద్విసహస్రయోజనాని స భుఙ్క్తే॥ 18

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్దే జ్యోతిశ్చక్రే సూర్యరథవర్ణనం
నామైక వింశోఽధ్యాయః॥

మహారాజా! తొమ్మిదికోట్ల యేబది యొక్కలక్షయోజనములపరిమితమైన భూమండలమున సూర్యుడొక్కక్షణములో రెండువేల రెండుయోజనములదూరము పరిక్రమించును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
జ్యోతిశ్చక్రమున సూర్యరథవర్ణన మను
ఇరువదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.





# ఇరువదిరెండవ అధ్యాయము

## విభిన్నగ్రహముల స్థితిగతుల వర్ణనము

కథాసారము :- ఈయధ్యాయమున జ్యోతిశ్చక్రమధ్యమున చంద్రుడు, శుక్రుడు మున్నగు గ్రహములయునికిని, వాని గమనమును అనుసరించి మానవులశుభాశుభఫలములు వర్ణింపబడినవి.

జగత్పతి యగునారాయణునియొక్క ఋగ్యజుస్సామ స్వరూపత్రయీమయ మగుమూర్తియే సూర్యరూపముతో నున్నది. ఆసూర్యుడె తనయాత్మను పండ్రెండు భాగములుగ విభజించి క్రమముగ వసంతము మున్నగుఋుతువులను, శీతోష్ణాది ఋుతుగుణములను ఏర్పాటుచేసెను. యోగులు, వర్ణాశ్రమధర్మముల ననుసరించుకర్మిష్ఠులు అష్టాంగయోగముల ద్వారా, అగ్నిహోత్రాదియజ్ఞములద్వారా సూర్యునిలో నున్నవారాయణుని యుపాసించి ఆత్మకల్యాణమును పొందుచుందురు. భగవాను డగునారాయణుని సాన్నిధ్యమువలన సూర్యుడు స్వర్గముయొక్క అంతరిక్షముయొక్క నడుమ కాలచక్రస్థము లైనమేషాదిరాసులయం దుండి రాసులనామము లనుసరించు పండ్రెండుమాసముల ననుభవించును. చంద్రమానమున రెండుపక్షములొకమాసము. సౌరమానమునసపాద ద్వయ నక్షత్రభోగకాల మొకమాసము. సూర్యుని సంవత్సరషష్ఠాంశభోగకాల మొకఋుతువు, నభోమండలము యొక్క అర్ధాంశము అనగా ఆఱుమాసములభోగకాల మొక అయనము నని చెప్పబడినది. సూర్యుడేకాలమున తనమందక్షిప్రసమానగమనముల ననుసరించి స్వర్గ భూమండల నభోమండలముల ననుభవించునో ఆకాలమును పండితులు సంవత్సరము, పరివత్సరము, ఇదావత్సరము, అనువత్సరము, వత్సరము ననునామములతో పిలచు చుందురు.

సూర్యమండలమునకు లక్షయోజనముల పైభాగమున చంద్రగ్రహ మున్నది. షోడశ కళలు గలచంద్రునివృద్ధిక్షయముల ననుసరించి దేవలోకపితృలోకములలో అహోరాత్ర విధానము జరుగుచుండును. చంద్రమండలమునకు రెండులక్షల యోజనముల పైభాగమున కొన్నినక్షత్రములు కూర్పబడి యున్నవి. ఈనక్షత్రమండలమునకు పైభాగమున శుక్ర గ్రహమున్నది. ఈగ్రహము ప్రాణులపై నెల్లపుడును శుభదృష్టి నుంచుచుండును. ఈశుక్రగ్రహమునకు రెండులక్షల యోజనముల పైభాగమున బుధగ్రహ మున్నది. ఇది ప్రాణుల కొకప్పుడు శుభప్రదము, ఒకప్పుడశుభప్రదము నైయున్నది. ఈబుధగ్రహమునకు రెండులక్షల యోజనములపైన బృహస్పతి గ్రహమున్నది. ఈగ్రహము తఱచుగ బ్రాహ్మణుల కనుకూలమైయున్నది. ఈబృహస్పతిగ్రహమునకు పైభాగమున శనైశ్చరమను అశుభగ్రహ

మున్నది. దానికి పైన సప్తర్షిమండలమున్నది. ఈసప్తర్షిమండలము ఎల్లపుడు జనులక్షేమమును గోరుచు విష్ణువునకు పరమపద మగుధ్రువలోకమును ప్రదక్షిణము చేయుచుండును.

## శ్రీరాజోవాచ

**యదేతద్భగవత ఆదిత్యస్య మేరుం ధ్రువం చ ప్రదక్షిణేవ పరిక్రామతో రాశీనామభిముఖం ప్రచలితంచాప్రదక్షిణం భగవతోపవర్ణితమముష్య వయం కథమనుమిమీమహీతి ॥ 1**

పరీక్షిన్మహారాజు పలికెను :- దేవా! సూర్యభగవాను డేకాలమున ధ్రువమేరువులను కుడిప్రక్కన ఉంచుకొని పయనించునో సరిగ నాసమయమునందె ఆయన ఇంకను రాసుల కభిముఖముగ వానిని యెడమప్రక్కన ఉంచుకొని ముందుకు పోవు నని నీవు చెప్పితివి. ఒకేవస్తువు ఒక్కమారె రెండుదిక్కులకు పోవుట సంభవముకాదు. అందువలన ఈ విషయమును మే మెట్లు అంగీకరింతుము ?

## స హోవాచ

**యదా కులాలచక్రేణ భ్రమతా సహభ్రమతాం తదాశ్రయాణాం పిపీలికాదీనాం గతిరన్యైవ ప్రదేశాన్తరేష్వప్యుపలభ్యమానత్వాత్। ఏవం నక్షత్ర రాశిభిరుపలక్షితేన కాల చక్రేణ ధ్రువం మేరుం చ ప్రదక్షిణతః పరిధావతా సహపరిధావమానానాం తదాశ్రయాణాం సూర్యాదీనాం గ్రహాణాం గతిరన్యైవ నక్షత్రాన్తరే రాశ్యన్తరే చోపలభ్యమానత్వాత్ ॥ 2**

శుకుడు పలికెను :- రాజా! త్రిప్పబడుచున్న కుమ్మరిసారెపై తిరుగుచు దాని నాశ్రయించియున్న పిపీలికాదులకు చక్రముయొక్క భిన్నభిన్నప్రదేశములయందు చక్రగమనముకంటె భిన్నభిన్నగతులతో గూడియున్నట్లగపడును. అట్లే నక్షత్రములద్వారా రాసులద్వారా ఉపలక్షిత మగుకాలచక్రము ధ్రువమేరువులకు చుట్టు తిరుగుచుండును. దానితో పాటు పరుగిడు సూర్యాదులయొక్క, వారి నాశ్రయించిన గ్రహాదుల యొక్క గమనముగూడ భిన్నభిన్నములైన నక్షత్రములయందు, రాసులయందు ఈచక్రగమనము కంటె వేఱువిధముగా నగపడును.

**స ఏష భగవానాదిపురుష ఏవ సాక్షాన్నారాయణో లోకానాం స్వస్తయ ఆత్మానం త్రయీమయం కర్మవిశుద్ధి నిమిత్తం కవిభిరపి వేదేన విజిజ్ఞాస్య మానో ద్వాదశధా విభజ్యషట్సు వసన్తాదిష్వృతుషు యథోపజోషమృతుగుణాన్ విదాధాతి ॥ 3**

జగత్తుకు మూలకారణము ఆదిపురుషు డైననారాయణుడు, వేదజ్ఞులగుపండితులు వేదస్తుతులద్వారా ఆయన నుపాసించిన ఆయనయే సూర్యరూపమున నుండి లోకహితార్థమై కర్మశద్ధికి నిమిత్తము, ఋగ్యజుస్సామరూపము నగు వేదముచే ప్రతిపాద్యము, కాల స్వరూపము నగు తన్ను పండ్రెండు భాగములుగ విభజించి వసంతాదులైన ఆరుఋతువుల యందు కర్మభోగానుసారముగ శీతోష్ణాదిగుణములను విధించుచున్నాడు.

**తమేనమిహ పురుషాస్త్రయ్యా విద్యయా వర్ణాశ్రమాచారానుపథా ఉచ్చావచైః కర్మభిరామ్నాతైర్యోగవితానైశ్చ శ్రద్ధయా యజన్తోఽఞ్జసా శ్రేయః సమధిగచ్ఛన్తి ॥ 4**

ఇట్లు సూర్యరూపమున నున్న ఆదిపురుషుడగు నారాయణుని యీలోకమున వర్ణాశ్రమధర్మావలంబులు వేదోక్తములైన అగ్నిహోత్రాది కర్మలద్వారా ఇంద్రాదిరూపముల యందు, అష్టాంగయోగములద్వారా పరమాత్మరూపమునందు శ్రద్ధఉంచి యుపాసించుచు అనాయాసముగ ఆత్మసుఖమును పొందుచుందురు.

**అథ స ఏష ఆత్మా లోకానాం ద్యావాపృథివ్యోరన్తరేణ నభోవలయస్య కాలచక్రగతో ద్వాదశ మాసాన్ భుఙ్క్తే రాశిసంజ్ఞకాన్ సంవత్సరావయవాన్ మాసః పక్షద్వయం సపాదర్క్షద్వయం దివా నక్తంచేత్యుపదిశన్తి యావతా షష్ఠమంశం భుంజీత, స వై ఋతురిత్యుపదిశ్యతే సంవత్సరావయవః ॥5**

సర్వలోకమున కాత్మస్వరూపు డగునారాయణునిసాన్నిధ్యమువలన ఆదిత్యుడు స్వర్గమర్త్యములకు నడుమ నున్న అంతరిక్షమునకు (నక్షత్రములకు) నడుమ కాలచక్రస్థమైనమేషాదిరాసులయం దుండి రాసులనామముల ననుసరించుచు ద్వాదశమాసముల ననుభవించును. ఈద్వాదశమాసములు సంవత్సరావయవములు. చాంద్రమానమున రెండుపక్షములతో నొకమాసమగును. అది పితరులకు ఒక అహోరాత్ర మగును. సౌర మానమున సపాద (చతుర్థాంశము) నక్షత్రద్వయ ($2\frac{1}{4}$) భోగకాల మొకమాస మగును. సూర్యుడేకాలమున సంవత్సరముయొక్క షష్ఠాంశమున అనగా రాశి ద్వయమును అనుభవించునో, ఆకాలమును "ఋతు" వందురు. ఈఋతువు గూడ సంవత్సరావయవమె.

**అథ చ యావతార్ధేన నభోవీథ్యాః ప్రచరతి తం కాలమయనమాచక్షతే ॥ 6**

ఇట్లు సూర్యుడు ఎంతకాలము వ్యాపించి నభోమండలముయొక్క అర్ధాంశమున సంచరించునో అనగా ఆఱునెలల ననుభవించునో అంతకాలము "అయన" మని చెప్పబడును.

**అథ చ యావన్నభోమణ్డలం సహ ద్యావాపృథివ్యోర్మణ్డలాభ్యాం కార్త్స్న్యేన సహ భుఞ్జీత, తం కాలం సంవత్సరం పరివత్సరమిదావత్సరమను వత్సరం వత్సరమితి భానోర్మాన్ద్య శైఘ్ర్యసమగతిభిః సమామనన్తి ॥ 7**

సూర్యుడు తన మందశీఘ్రసమానగమనముద్వారా యెంతకాలమువఱకు స్వర్గమర్త్యవ భోమండలములను మూడింటిని సంపూర్ణముగ అనుభవించునో అవగా ప్రదక్షిణము చేయునో తావత్కాలపరిమిత మగుసమయమును పండితులు సంవత్సరము, పరివత్సరము, ఇదావత్సరము, అనువత్సరము, వత్సరము అను ఐదునామములతో పిలుచుచున్నారు.

**ఏవం చంద్రమా అర్కగభస్తిభ్య ఉపరిష్టాల్లక్షయోజనత ఉపలభ్య మానోఽర్కస్య సంవత్సరభుక్తిం పక్షాభ్యాం మాసభుక్తిం సపాదర్క్షాభ్యాం దినేనైవ పక్షభుక్తిముగ్రచారీ ద్రుతతరగమనో భుంక్తే ॥ 8**

సూర్యమండలమునకు లక్షయోజనములపైన చంద్రగ్రహ మగపడును. చంద్రుడు తన ఉగ్రాచరణశీలత్వమువలన శీఘ్రగమనము గలవాడై రెండుపక్షములతో సూర్యుని సంవత్సరమును, సపాదదినద్వయముతో ($2\frac{1}{4}$) దినములతో) సూర్యునియొకమాసమును, ఒక్కొక్కదినముతో సూర్యునియొక్కొక్కపక్షమును అనుభవించును.

**అథ చాపూర్యమాణాభిశ్చ కలాభిరమరాణామపక్షీయ మాణాభిశ్చ కలాభిః పితౄణామహోరాత్రాణి పూర్వపక్షాపరపక్షాభ్యాం వితన్వానః సర్వ జీవనివహప్రాణో జీవశ్చైకమేకం నక్షత్రం త్రింశతా ముహూర్తైర్భుంక్తే ॥ 9**

ఆయన (చంద్రుడు) శుక్లపక్షమున ఆపూర్యమాణములగు అవగా వృద్ధిశీలము లగుకళలద్వారా దేవలోకమునకు కృష్ణపక్షమున తగ్గిపోవుస్వభావము గలకళలద్వారా పితృలోకమునకు దివారాత్రములను గలుగజేయును. ఇట్లు రెండుపక్షములయందు దేవపితృలోకములకు దివారాత్రములను గలిగించి ఆయన ముప్పదిముహూర్తములతో నొకనక్షత్రమును అనుభవించును. ఆయన అమృతమయుడు, అన్నమయుడు వగుటచే సర్వజీవులకు ప్రాణమైయున్నాడు. జీవులకు జీవన మైయుండుటచే వానిని 'జీవు' డనిచెప్పుచున్నారు.

**స ఏషః షోడశకలః పురుషో భగవాన్ మనోమయోఽన్నమయో ఽమృతమయో దేవపితృమనుష్య భూతపశుపక్షిసరీసృపవీరుధాం ప్రాణాప్యా యనశీలత్వాత్ సర్వమయ ఇతివర్ణయన్తి ॥ 10**

షోడశకళావిశిష్టుడు, భగవద్విభూతిరూపుడు నగుచంద్రుడు మనస్సున కధిష్ఠాత యగుటచే మనోమయుడు, ఓషధీపతి యగుటచే అన్నమయుడు, సర్వప్రాణులకు జీవన స్వరూపు డగుటచే అమృతమయుడు నైయున్నాడు. అందువలన ఆయ దేవతలు, పితరులు, మనుష్యులు, భూతములు, పశువులు, పక్షులు, సరీసృపములు, వృక్షములు, లతలు మున్నగువానియన్నింటిప్రాణములను పరితప్తముచేయుటచే పండితులు వానిని సర్వమయు డనివర్ణించుచుందురు.

**తత ఉపరిష్టాద్ద్విలక్షయోజనతో నక్షత్రాణి మేరుం దక్షిణేనైవ కాలాయన ఈశ్వరయోజితాని సహాభిజితాష్టావింశతిః ॥ 11**

చంద్రమండలమునకు రెండులక్షలయోజనములకు పైన పరమేశ్వరునియిచ్చ ననుసరించి కాలచక్రమున కొన్నినక్షత్రములు కూర్చబడియుండెను. అవి సుమేరువు యొక్క దక్షిణాంశమునందే తిరుగుచుండును (సూర్యాదిగ్రహములవలె భిన్నగమనము గలవి కావు). అభిజిన్నక్షత్రముతో గలసి వానిసంఖ్య ఇరువది యెనిమిది.

**తత ఉపరిష్టాదుశనా ద్విలక్షయోజనత ఉపలభ్యతే పురతః పశ్చాత్ సహైవార్కస్య శైఘ్ర్యమాన్ద్యసామ్యాభిర్గతిభిరర్కవచ్చరతి లోకానాం నిత్య దానుకూల ఏవ, ప్రాయేణ వర్షయంశ్చారేణానుమీయతే సవృష్టివిష్టమ్భగ్రహోప శమనః ॥ 12**

ఈనక్షత్రమండలమునకు రెండులక్షలయోజనముల పైన (భూతలమునుండి యేడులక్షలయోజనములు) శుక్రగ్రహ మున్నది. సూర్యుని శీఘ్రమందసమానగమనముల ననుసరించి యీగ్రహము ఒకప్పుడు సూర్యునితో సమానము, ఒకప్పుడు వెనుక, ఒకప్పుడు ముందు నడచుచుండును. వృష్టికి ప్రతిబంధక మైనగ్రహమును ఆశుక్రగ్రహము, నాశము చేయును. దానిసంచారమువలన సామాన్యముగ వర్షము కురియును. కనుక అది ప్రాణుల కెల్లపుడు హితకరమే యని నిశ్చయింపబడినది.

**ఉశనసా బుధో వ్యాఖ్యాతః తత ఉపరిష్టాద్ద్విలక్షయోజనతో బుధః సోమసుత ఉపలభ్యమానః ప్రాయేణ శుభకృత్ యదార్కాద్వ్యతిరిచ్యతే తదాతివాతాభ్రప్రాయా నావృష్ట్యా దిభయమాశంసతే ॥ 13**

బుధగ్రహముకూడ శుక్రగ్రహమువలె వ్యాఖ్యాత మగును.

(అనగా అదిగూడ శుక్రగ్రహమువలె ఒకప్పుడు సూర్యునియెదుట, ఒకప్పుడు వెనుక, మఱియొకప్పుడు కలిసి పరిభ్రమించుచుండును.)శుక్రగ్రహమునకు రెండు లక్షలయోజనముల పైన (అనగా భూతలమునుండి తొమ్మిదిలక్షలయోజనముల పైన) చంద్రతనయుడగు బుధుడున్నాడు. ఇతడుగూడ సామాన్యముగ లోకమునకు శుభమును గలుగజేయువాడే. కాని సూర్యునిసాంగత్యమును వదలునపుడు ప్రబలవాయువుచే జలశూన్యమగుమేఘాడంబరము అనగా అనావృష్టి, అతివృష్టి మున్నగుభయములు సూచింపబడును

**అత ఊర్ధ్వమంగారకోఽపి యోజనలక్షద్వితయ ఉపలభ్యమానస్త్రిభిస్త్రిభిః పక్షైరేకైకశోరాశీన్ ద్వాదశానుభుంక్తే యది న వక్రేణాభివర్తతే ప్రాయేణా శుభగ్రహోఽఘశంసః ॥ 14**

బుధమండలమునకు రెండులక్షలయోజనముల పైన (అనగా భూతలమునుండి పదునొకండులక్షలయోజనముల పైన) కుజగ్రహమున్నది. దీనిగమనము వక్రముగ నుండనిచో నది మూడుమూడుపక్షములతో నొక్కొక్కటిగ జేపి క్రమముగ పండ్రెండురాసుల ననుభవించును. అది సామాన్యముగ దుఃఖజనక మగునశుభగ్రహ మైయున్నది.

**తత ఉపరిష్టాద్ద్విలక్షయోజనాన్తరగతో భగవాన్ బృహస్పతిరేకైకస్మిన్ రాశౌ పరివత్సరం ప్రచరతి యది న వక్రః స్యాత్ ప్రాయేణానుకూలో బ్రాహ్మణకులస్య ॥ 15**

కుజమండలమునకు రెండులక్షలయోజనముల పైన (భూతలము నుండి పదమూడు లక్షలయోజనముల పైన)బృహస్పతిగ్రహ మున్నది. అది యొక్కొక్కపరివత్సరముతో నొక్కొక్కరాశి ననుభవించును. దాని గమనము వక్రము కానిచో నది సామాన్యముగ బ్రాహ్మణకులమునకు శుభకరమగును.

**తత ఉపరిష్టాద్యోజనలక్షద్వయాత్ ప్రతీయమానః శనైశ్చర ఏకైకస్మిన్ రాశౌ త్రింశతం త్రింశతం మాసాన్ విలంబమానః సర్వానేవానుపర్యేతి తావద్భిరనువత్సరైః ప్రాయేణ హి సర్వేషామశాన్తికరః ॥ 16**

బృహస్పతిమండలమునకు రెండులక్షలయోజనముల పైన (భూతలమునుండి పదునైదులక్షలయోజనములపైన) శనైశ్చరగ్రహమున్నది. ఒక్కొక్కరాశియందు అది ముప్పది ముప్పదిమాసములను గడపి ముప్పది యనువత్సరములలో ద్వాదశరాసులను చుట్టి వచ్చును. అది సామాన్యముగ సర్వులకు అశాంతిని కలుగజేయును.

తత ఉత్తరస్మాదృషయ ఏకాదశలక్షయోజనాన్తర ఉపలభ్యన్తేయ ఏవ లోకానాం శమనుభావయన్తో భగవతో విష్ణోర్యత్పరమం పదం ప్రదక్షిణం ప్రక్రామన్తి ॥ 17

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే జ్యోతిశ్చక్రవర్ణనే
ద్వావింశోఽధ్యాయః ॥

శనిమండలమునుండి పదునొకండులక్షలయోజనములలో అనగా భూతలమునుండి యిరువదియాఱువేలలక్షలయోజనములలో సప్తర్షిమండలమ్మున్నది. ఇది లోకకల్యాణమును గాంక్షించుచు విష్ణువు యొక్క పరమపదమును(ధ్రువలోకమును) ప్రదక్షిణము చేయుచుండును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
జ్యోతిశ్చక్రవర్ణన మను ఇరువది రెండవ అధ్యాయము
సంపూర్ణము.

❀ ❀ ❀



# ఇరువదిమూడవ అధ్యాయము

## శిశుమారచక్రవర్ణనము

కథాసారము:- ఈయధ్యాయమున జోతిశ్చక్రమున కాశ్రయస్వరూప మైనధ్రువ స్థానము, శిశుమారరూపముతో శ్రీహరి యునికి వర్ణింపబడినవి.

సప్తర్షి మండలమునకు పదుమూడులక్షలయోజనముల లోపల విష్ణుభగవానుని పరమపద మున్నది. అచట అగ్ని ఇంద్ర ప్రజాపతి కశ్యపధర్మదేవతలద్వారా బహుసమ్మానితుడై ధ్రువుడు వారితోపాటు నివసించుచుండును. కాడికి గట్టి వేయబడిన వృషభమువలె కాలము జ్యోతిర్గణముచుట్టు నిరంతరము తిరుగుచుండును. ధ్రువుడు దానికి స్తంభము అనగా కట్టుగొయ్యవంటివాడు. కాలచక్రమునం దున్న జ్యోతిర్గణము ధ్రువుని ఆధారము చెసికొనియె ఆయనచుట్టు తిరుగుచుండును. నిరాడుపాపకులవలె ఉపాసనయందు చిత్తసన్నివేశార్థమై కొందఱుయోగులు ఈజ్యోతిశ్చక్రమును శిశుమారాకృతి యగువాసుదేవుని రూపముతో కల్పనచేయుదురు. ఆశిశుమారముయొక్కమస్తకము అధోముఖముగను, దేహము సర్పమువలెను కుండలీభూత మైయుండును. దానిపుచ్ఛాగ్రమున ధ్రువుడు, లాంగూలమున ప్రజాపతి, అగ్ని, ఇంద్రుడు, ధర్మదేవత, పుచ్ఛమూలమున ధాత విధాతలు, కటిదేశమున సప్తర్షులు అధిష్ఠించియున్నారు. దానిశరీరము దక్షిణావర్తమున కుండలీభూతావస్థ యందున్నది. దాని దక్షిణపార్శ్వమున అభిజిత్తు నుండి పునర్వసు వరకు పదునాలుగు క్షత్రములు, వామ పార్శ్వమున పుష్యమి మొదలుకొని పదునాలుగు నక్షత్రములు కలసియున్నవి. పునర్వసు పుష్యమీనక్షత్రములు శిశుమారమునకు కుడియెడమల నితంబముల యందు, ఆర్ద్ర ఆశ్లేషనక్షత్రములు దక్షిణవామపాదముల యందు, ఇతర నక్షత్రములు దాని (శిశుమారముయొక్క) విభిన్నాంగముల యందు సంయోజితములై యున్నవి. ఇట్లు కల్పితములైనవి. యోగులు చిత్తమును స్థిరపఱచుకొనుటకై త్రిసంధ్యల యందు శిశుమారాకృతి యగు భగవానుని యుపాసన విషయము నుపదేశించు చుందురు.

## శ్రీ శుకఉవాచ

**అథ తస్మాత్ పరతస్త్రయోదశలక్షయోజనాన్తరతో యత్ తద్విష్ణోః పరమం పదమభివదన్తి యత్ర మహాభాగవతో ధ్రువఔత్తానపాదిరగ్ని వేన్ద్రేణ ప్రజాపతినా కశ్యపేన ధర్మేణచ సమకాలయుగ్భిః సబహుమానం దక్షిణతః క్రియమాణ ఇదానీమపి కల్పజీవినామా జీవ్య ఉపాస్తే తస్య మహానుభావ ఉపవర్ణితః ॥ 1**

శుకుడు పలికెను! సప్తర్షిమండలమునకు పదుమూడు లక్షల యోజనముల లోపల నున్న స్థానమును పండితులు విష్ణువుయొక్క పరమపదమని చెప్పుచున్నారు. అచట ఉత్తానపాదతనయుడు, మహాభాగవతుడు నగు ధ్రువుడు కల్పజీవుల కుపజీవ్యరూపముల నిపుడుగూడ నున్నాడు. అగ్ని, ఇంద్రుడు, ప్రజాపతి, కశ్యపుడు, ధర్మదేవత అనువారు ఒకేసమయమున అందఱితో గలసి బహుసమ్మాన పూర్వకముగ ఆయనను (ధ్రువుని) దక్షిణభాగమున నుంచుకొని ప్రదక్షిణము చేయుచుందురు. ఇహలోకమున ఆ ధ్రువుని భగవదారాధనము, రాజ్యపాలనాదిరూప మగు మాహాత్మ్యము చతుర్థస్కంధమున వర్ణితమైనవి.

**సహి సర్వేషాం జ్యోతిర్గణానాం గ్రహనక్షత్రాదీనా మనిమిషేణావ్యక్తరం హసా భగవతా కాలేన భ్రామ్యమాణానాం స్థాణురివావష్టమ్భ ఈశ్వరేణ విహితః శశ్వదవభాసతే॥ 2**

విశ్రాంతిరహితుడు, అవ్యక్తగమనము గలవాడు నగు కాలభగవానుడు ఏ గ్రహ నక్షత్రాదులను త్రిప్పుచున్నాడో, పరమేశ్వరునిచే ఆగ్రహ నక్షత్రాదుల కాశ్రయరూపమున నియమింపబడినవాడై ధ్రువుడు స్థాణువు వలె స్థిరభావముతో నిరంతరము ప్రకాశమును పొందుచున్నాడు.

**యథా మేఢీస్తమ్భ ఆక్రమణపశవః సంయోజితాస్త్రిభిః సవనైర్యథాస్థానం మండలాని చరన్తి, ఏవం భగణాగ్రహాదయ ఏతస్మిన్నన్త బహిర్యోగేన కాలచక్ర ఆయోజితా ధ్రువమే వావలమ్బ్య వాయునోదీర్యమాణా ఆకల్పాన్తం పరితః క్రామన్తి నభసి యథామేఘాః శ్యేనాదయో వాయువశాః కర్మసారథయః పరివర్తన్తే ఏవం జ్యోతిర్గణాః ప్రకృతిపురుష సంయోగాను గృహీతాః కర్మనిర్మిత గతయో భువి న పతన్తి ॥ 3**

ధాన్యము నూర్చుటకు పశువులు కట్టుకొయ్యయందు బంధింపబడినవై స్తంభమునకు సమీపమధ్యదూరముల యందున్న ప్రదేశముల విభాగము ననుసరించి తమతమ స్థానముల నతిక్రమింపక స్తంభమునకు నలువైపుల మండలాకారమున తిరుగుచుండును. అట్లే ఈ కాలచక్రమునందు పై స్థానముయొక్క క్రిందిస్థానము యొక్కవిభాగము ననుసరించి సూర్యాది గ్రహములు ఈశ్వరునిచే నియమింపబడిన వై ధ్రువునినే అవలంబించి, వాయువుచే సంచాలితములై కల్పాంతము వఱకు ధ్రువలోకముచుట్టు తిరుగుచుండును. ఆకాశమున మేఘము, గ్రద్ధ మున్నగు పక్షులు వాయువశమున నెట్లు కర్మ నవలంబించి నభోమండలమున పరిభ్రమించునో, ఎప్పుడును పడిపోవవో, అట్లు గ్రహములుగూడ పురుషాధిష్ఠితమైన మాయయొక్క అధీనమున కర్మనిర్మిత మగు గతిననుసరించి తిరుగు చుండును, కాని భూమియందు పడవు.

కేచిదేతజ్జ్యోతిరనీకం శిశుమార సంస్థానేన భగవతో వాసుదేవస్య యోగధారణాయా మనువర్ణయన్తి ॥ 4

ఈ శిశుమారాకృతి జ్యోతిశ్చక్రరూపము. వాసుదేవుని యుపాసన యందు మనస్సు నుంచుటకై యిట్లు కల్పితమైనదని కొందఱు చెప్పుచున్నారు.

యస్య పుచ్ఛాగ్రేఽవాక్శిరసః కుణ్డలీభూతదేహస్య ధ్రువ ఉపకల్పితః తస్యలాంగులే ప్రజాపతిరగ్నిరిన్ద్రో ధర్మ ఇతి పుచ్ఛమూలే ధాతా విధాతా చ కట్యాం సప్తర్షయస్తస్య దక్షిణావర్త కుణ్డలీభూతశరీరస్య యాన్యుదగయనాని దక్షిణ పార్శ్వేనక్షత్రాణి ఉపకల్పయన్తి దక్షిణాయనాని తు సవ్యే యథా శిశు మారస్య కుణ్డలాభోగసన్నివేశస్య పార్శ్వయోరుభయోరప్యవయవాః సమసంఖ్యా భవన్తి; పృష్ఠే త్వజవీథీ ఆకాశగంగా చోదరతః ॥ 5

ఆ శిశుమారముయొక్క మస్తకము అధోముఖముగను, దేహము కుండలీ భూతముగను నుండును. దానిపుచ్ఛాగ్రమున ధ్రువుడు, లాంగూలము నందు ప్రజాపతి, అగ్ని, ఇంద్రుడు, ధర్మదేవత, పుచ్ఛమూలమున ధాత, విధాత; కటిప్రదేశమున సప్తర్షులు నధిష్ఠించి యుందురు. దానిశరీరము దక్షిణావర్తమున కుండలీభూతమై యుండును. దాని దక్షిణపార్శ్వమందు అభిజిత్తు నుండి పునర్వసు వఱకు గల పదునాలుగు నక్షత్రములు, ఎడమ వైపున పుష్యమినుండి ఉత్తరాషాఢవరకు గల పదునాలుగు నక్షత్రములు సన్నివిష్టములై యుండును. దానిచే కుండలీభూతదేహ విశిష్టమైన శిశుమారమునకు రెండు పార్శ్వముల యందలి యవయవముల సంఖ్య సమానముగ నుండును. దాని పృష్ఠభాగమున అజవీథి (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ - అను మూడు నక్షత్రముల సమూహము) ఉదరమున ఆకాశ గంగ యున్నవి.

పునర్వసుపుష్యౌ దక్షిణవామయోః శ్రోణ్యోరార్ద్రాశ్లేషే చ దక్షిణవామయోః పాదయోరభిజిదుత్తరాషాఢే దక్షిణ వామయోర్నాసికయోర్యథాసంఖ్యం శ్రవణ పూర్వాషాఢే దక్షిణ వామయోర్లోచన యోర్ధనిష్ఠా మూలం చ దక్షిణ వామయోః కర్ణయోర్మఘాదీన్యష్టనక్షత్రాణి దక్షిణాయనాని వామపార్శ్వవ ంక్రిషు యుంజీత తథైవ మృగశీర్షాదీన్యుదగయనాని దక్షిణపార్శ్వేషు ప్రాతిలోమ్యేన యుంజీత। శతభిషా జ్యేష్ఠే స్కన్ధయోర్దక్షిణ వామయోర్న్యసేత్ ॥ 6

పునర్వసు పుష్యమీనక్షత్రములు క్రమముగ శిశుమారమునకు దక్షిణ వామశ్రోణుల యందు, ఆర్ద్రాశ్లేషలు దక్షిణవామపాదముల యందు, అభిజిత్తు ఉత్తరాషాఢలు దక్షిణవామ నాసికల యందు, శ్రవణా పూర్వాషాఢలు దక్షిణ వామనేత్రముల యందు, ధనిష్ఠా మూలలు దక్షిణవామ కర్ణములయందు, మఘనుండి అనూరాధ వఱకుగల దక్షిణాయన సంబంధములగు ఎనిమిది నక్షత్రములు ఎడమప్రక్కనున్న యెముకల యందు, మృగశీర్ష నుండి ప్రతిలోమక్రమముతో పూర్వాభాద్ర పదమువఱకు గల ఉత్తరాయణ సంబంధములగు ఎనిమిది నక్షత్రములు దక్షిణపార్శ్వము నందు, శతభిష జ్యేష్ఠా నక్షత్రములు దాని దక్షిణ వామస్కంధముల యందు నుండును.

**ఉత్తరాహనావగస్తిరధరాహనౌ యమోముఖే చాంగారకః శనైశ్చర ఉపస్థే బృహస్పతిః కకుది వక్షస్యాదిత్యో హృదయే నారాయణో మనసిచన్ద్రో నాభ్యాముశనాస్తనయోరశ్వినౌ బుధః ప్రాణాపానయో రాహుర్గలే కేతవః సర్వాంగేషు రోమసుసర్వే తారాగణాః ॥ 7**

ఇంకను దాని పైదవడయందు అగస్త్యుడు, క్రింది దవడయందు యముడు, ముఖమునందు కుజుడు, ఉపస్థయందు శని, కంఠమునకు వెనుకభాగమున బృహస్పతి, వక్షస్థలమున ఆదిత్యుడు, హృదయమున నారాయణుడు, మనస్సున చంద్రుడు, నాభి యందు శుక్రుడు, స్తనములయందు అశ్వినీకుమారులు, ప్రాణాపానముల యందు బుధుడు, కంఠదేశమున రాహువు, సర్వాంగముల యందు కేతువు, రోమములయందు తారలు సన్నివిష్టములై యున్నవి.

**ఏతదుహైవ భగవతో విష్ణోః సర్వదేవతామయం రూపమహరహః సన్ధ్యాయాం ప్రయతో వాగ్యతో నిరీక్షమాణ ఉపతిష్ఠేత నమోనమో జ్యోతిర్లోకాయ కాలాయనా యానిమిషాం పతయే మహాపురుషాయాభిధీమహీతి ॥8**

మహారాజా! ఇట్లు వర్ణింపబడిన శిశుమారాకృతియే విష్ణుభగవానుని సర్వదేవతా మయరూపము. ప్రతిదినము సంధ్యాకాలమునందు పవిత్రుడు మౌనియునై ఈరూపమును నిరీక్షించుచు క్రింద చెప్పబోవు మంత్రముతో నుపాసింపవలెను. జ్యోతిర్గణముల కాశ్రయభూతుడు, కాలచక్రరూపుడు, సర్వదేవాధిపతియు నగు మహాపురుషునకు నమస్కరించుచున్నాను. ఆయన రూపమును ధ్యానించుచున్నాను.

గ్రహర్క్షతారామయమాధిదైవికం
పాపాపహం మన్త్రకృతాం త్రికాలమ్ ।
నమస్యతః స్మరతో వాత్రికాలం
నశ్యేత తత్కాలజమాశు పాపమ్ ॥ 9

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే శిశుమారసంస్థానం నామ
త్రయోవింశోఽధ్యాయః॥

ఇట్లు వెనుక చెప్పబడిన మంత్రముతో సర్వగ్రహములకు, నక్షత్రాదులకు వాశ్రయభూతుడు శిశుమారమూర్తియు నగు భగవానుని త్రిసంధ్యలయందు జపించువారి పాపరాశి నశించును. త్రిసంధ్యలయందు ఆయనకు నమస్కరించి స్మరించు వారి తాత్కాలిక పాపములు వెంటనె నశించును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
శిశుమారసంస్థాన మను ఇరువది మూడవ అధ్యాయము
సంపూర్ణము.

❀ ❀ ❀

# ఇరువదినాల్గవ అధ్యాయము

## రాహువు మున్నగు గ్రహముల యునికి , అతలాద్యధోలోకముల వర్ణనము.

కథాసారము :- ఈ యధ్యాయమున సూర్యునకు పదిలక్షల యోజనముల క్రింద రాహువుయొక్క ఉనికి, అతలాదులైన ఏడు అధోలోకముల వివరణము మున్నగువవి వర్ణింపబడినవి.

సూర్యమండలమునకు, చంద్రమండలమునకు క్రింది భాగమున రాహువు ఉనికి యున్నది. సూర్యచంద్రుల అంతరాళమున రాహువుయొక్క యునికియే 'గ్రహణము'. ఋజు వక్రభావములతో దాని యునికి ననుసరించి సర్వగ్రాసము, అర్ధగ్రాసము వగును.

రాహుగ్రహమునకు పదిలక్షల యోజనముల క్రింద సిద్ధచారణ విద్యాధరుల స్థానములున్నవి. ఈ స్థానము లన్నింటికి క్రింద యక్షులు, రాక్షసులు, మున్నగువారి స్థానములున్నవి. వానికి క్రింద పృథివి, పృథివికి క్రింద ఒక్కొక్క పదియోజనముల తేడాలో అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము, రసాతలము, పాతాళము వను ఏడుపాతళము లున్నవి. ఈ యేడు పాతాళములలో దైత్యులు దానవులు తమ భార్యాపుత్రాదులతో గూడి నిర్భయముగ నింద్రియ సుఖములలో నిమగ్నులై యుందురు. పాతాళాదుల యందు సూర్యుని వెలుగు ప్రవేశింప లేకపోయినను అచ్చటి సర్పములయొక్క నాగులయొక్క మస్తకముల పైనుండు మణులకాంతులచే అంధకారము తొలగిపోవు చుండును. ఈప్రదేశములలో నున్నవారు జరమున్నగు వయోధర్మములు లేనివారై నివసించు చుందురు. వారు భగవానుని కాలమనుచక్రమునకు దప్ప యమునకుగూడ భయపడరు.

అతల భూవివరమున మయదానవుని పుత్రుడగు 'బలు'డను దైత్యుడు నివసించుచుండును. వాని యావలింతనుండి స్వైరిణీ, కామిని, పుంశ్చలి యను మూడువిధములగు స్త్రీలు పుట్టిరి. అతలమునకు క్రింద వితలము హరగౌరుల నివాసస్థానము. వారివలన 'హాటక' మనుసువర్ణ ముత్పన్నమయ్యెను. వితలమునకు క్రింద సుతలమున్నది. అచ్చట మహాభాగవతుడగు బలిచక్రవర్తి నివసించుచుండును. బలి ప్రహ్లాదుని మను మడగుటచే వాని నిమిత్తమై భగవానుడు బలిపై కృపచూపెను. భగవానుడు వామనరూపముతో బలిచేయు యజ్ఞమునకు వెడలి వానిపై కృపచూపుటకై ముందు వాని రాజ్యము నంతటిని యాచనానెపముతో అపహరించి వానికి ప్రేమ నిచ్చెను. పిమ్మట వానిప్రేమకు వశుడై భగవానుడు వానిద్వారము నందు ద్వారపాలుడయ్యెను. ఈకథ అష్టమస్కంధమున వర్ణింపబడినది.

భోగైశ్వర్యాదిప్రదానము భగవానుని దయాలక్షణముకాదు. అది మాయామయము, భగవానుని స్మృతిపథమునకు రానీయదు. ఇంద్రాది దేవతలు తమతమ విషయభోగముల యందు ప్రమత్తులై భగవానునివలన భోగసుఖములనె ప్రార్థింతురు. అదితప్ప మఱియే యితరసుఖ విషయము వారికి తెలియదు. ప్రహ్లాదప్రముఖులగు భక్తులు భోగసుఖముల గోరుట అట్లుండనీయుడు; భగవానుడు మోక్షము నీయదలచినను స్వీకరింపలేదు. నామాభాసోచ్చారణముననే ఆమోక్షము సులభముగ లభించును. సుతలము నకు క్రింద తలాతలమున్నది. అచట మయదానవు డుండును. పరమభాగవతుడగు మహాదేవుని కృపచే ఈ దానవుడు తలాతలమునందలి వ్యావహారిక భోగములయందు ప్రమత్తుడై భక్తవరుడగు బలివలె పరమార్థ సుఖమును పొందలేకపోయెను. తలాతలమునకు క్రింద మహాతలమున్నది. అనేక ఫణములు గల సర్పముల కది నివాసస్థానము. మహాతలమునకు క్రింద రసాతలము దానికి క్రింద పాతాళము ఉన్నది. ఈ పాతాళమున వాసుకి మున్నగు సర్పము లుండును.

## శ్రీ శుక ఉవాచ

**అధస్తాత్ సవితుర్యోజనాయుతే స్వర్భానుర్నక్షత్ర వచ్చరతీత్యేకే యోఽసావమ రత్వం గ్రహత్వంచాలభత భగవదనుకంపయా స్వయమసురాప సదః సైంహికేయో హ్యతదర్హః తస్య తాత జన్మ కర్మాణి చోపరిష్టాద్వక్ష్యామః ॥ 1**

శుకుడు పలికెను:- మహారాజా! సూర్యునకు పదిలక్షల యోజనములు దిగువ రాహుగ్రహము నక్షత్రమువలె సంచరించుచుండును. ఈ యసురాధముడగు సింహి కానందనుడు గ్రహత్వమును దేవత్వమును పొందుటకు పూర్తిగ నయోగ్యుడయ్యును భగవానుని యనుగ్రహమువలన దేవత్వగ్రహత్త్వములను పొందెనని పండితులు చెప్పు చున్నారు. వత్సా! వీని పుట్టుకను, కర్మలను పిమ్మట వర్ణింతును.

**యదదస్తరణేర్మణ్డలం ప్రతపతస్తద్విస్తరతో యోజనాయుత మాచక్షతే ద్వాదశసాహస్రం సోమస్య త్రయోదశ సాహస్రం రాహోర్యః పర్వణి తద్వ్యవధాన కృద్వైరానుబన్ధః సూర్యచన్ద్రమసావభిధావతి ॥ 2**

తాపమును గలిగించు సూర్యదేవుని మండలము పదివేల యోజనములు, చంద్రలోకము పండ్రెండు వేల యోజనములు, విస్తృతములు, రాహుమండలము విస్తారమున పదమూడు వేల యోజనములున్నది. పూర్వకాలమున ఈ రాహువు అమృతమును

పానము చేయు సమయమున సూర్యచంద్రులలో ప్రవేశించి వ్యవధానమును గలుగజేసెను. అందువలన సూర్యచంద్రులతో వానికి వైర మేర్పడెను. ఈ కారణమువలన వతడు ప్రత్యమావాస్యనాడు, పూర్ణిమనాడు సూర్యచంద్రులపైకి పరుగిడుచు వారిని లోకచక్షువుల కగోచరులుగ జేయుచుండెను.

**తన్నిశమ్యోభయత్రాపి భగవతా రక్షణాయ ప్రయుక్తం సుదర్శనం నామ భాగవతం దయితమస్త్రం తత్తేజసా దుర్విషహం ముహుః పరివర్తమాన మభ్యవస్థితో ముహూర్త ముద్విజమానశ్చకిత హృదయ ఆరాదేవ నివర్తతే తదుపరాగమితి వదతి లోకః ॥ 3**

సూర్యచంద్రులవలన రాహువు చేసినపనిని తెలిసికొని విష్ణుభగవానుడు చంద్రసూర్యులను రక్షించుటకై తనశక్తితో గూడినదియు పరమప్రియ మైనదియు నగు సుదర్శనమను అస్త్రమును ప్రయోగించెను. ఆ చక్రముయొక్క తేజస్సు మిగుల సహింపరానిది. అది నిరంతరము తిరుగుచుండును. దాని దర్శనమువలన రాహువు దానియెదుట ముహూర్తమాత్ర ముండి భయముచే కంపితుడై దూరమునుండియే పరుగిడెను. సూర్యచంద్రుల నడుమ రాహువు ముహూర్త మాత్ర ముండుటను గ్రహణమని చెప్పుచున్నారు.

**తతోఽధస్తాత్ సిద్ధచారణవిద్యాధరాణాం సదనాని తావన్మాత్ర ఏవ ॥4**

రాహుగ్రహమునుండి పదిలక్షల యోజనముల దిగువభాగమున సిద్ధులు, చారణులు, విద్యాధరులు నివసించుచుందురు.

**తతోఽధస్తాత్ యక్షరక్షః పిశాచప్రేత భూతగణానాం విహారాజిరమన్తరీక్షం యావద్వాయుః ప్రవాతి యావన్మేఘా ఉపలభ్యన్తే ॥ 5**

వారికి క్రిందిభాగమున యక్షులు, రాక్షసులు, పిశాచులు, భూతప్రేతములు విహరించు స్థాన మగునంతరీక్ష మున్నది. ఎంతదూరము వఱకు వాయువు ప్రసరించుచుండునో, మేఘములు కనబడుచుండునో అంతదూరము వఱకు నది విస్తృతమై యున్నది.

**తతోఽధస్తాచ్ఛతయోజనాన్తర ఇయం పృథివీ యావద్ధంసభాస - శ్యేన - సుపర్ణాదయః పతత్రిప్రవరా ఉత్పతన్తీతి ॥ 6**

దానికి క్రిందిభాగమున నూఱుయోజనములలోపల ఈ పృథివి యున్నది. ఎంతదూరము వఱకు హంసలు, గ్రద్దలు, డేగలు, గరుడపక్షి మున్నగు ప్రధానపక్షులు ఎగురుచుండునో అంతదూరము వఱకు ఈ భూమికి హద్దు చెప్పబడినది.

ఉపవర్ణితం భూమేర్యథాసన్నివేశావ స్థానమ్। అవనేరప్యధస్తాత్ సప్త భూవివరా ఏకైకశో యోజనాయుతాన్తరేణాయామవిస్తారేణో పక్లిప్తా: అతలం వితలం సుతలం తలాతలం మహాతలం రసాతలం పాతాలమితి ॥ 7

మహారాజా! భూమియొక్క యేయే స్థానము లేయేభాగముల యందు సన్నివేశితములై యున్నవో దానిని నీకు వివరించితిని. పృథివికి దిగువన ఒక్కొక్క పదిలక్షల యోజనముల తేడాతో అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము, రసాతలము, పాతాళము నను ఏడు భూవివరములున్నవి. భూమండల మెంత పరిమాణమున మన్నదో అవి గూడ నంతే పరిమాణముతో వ్యాపించియున్నవి.

ఏతేషు బిలస్వర్గేషు స్వర్గాదప్యధికకామభోగైశ్వర్యానన్దభూతివిభూతిభి: సుసమృద్ధభవనోద్యానాక్రీడవిహారేషు దైత్యదానవకాద్రవేయా నిత్యప్రముదితాను రక్తకలత్రాపత్య బన్ధు సుహృదనుచరా గృహపతయ ఈశ్వరాదప్యప్రతిహత కామామాయా వినోదా నివసన్తి ॥ 8

ఈ యేడు వివరములు బిలస్వర్గములని చెప్పబడుచున్నవి. వానియందే భవనములు, ఉద్యానములు, క్రీడాస్థానములు, విహారభూములు నున్నవో అవియన్నియు స్వర్గమువందలి భవనాదుల కంటెను మిగుల కామములు, భోగములు, ఐశ్వర్యములు, ఆనందము ప్రభావము, సంపద ననువానిచే సమృద్ధము లై యున్నవి. ఈ ప్రదేశములయందు దైత్యులు, దానవులు, నాగులు గృహాధిపతులై నివసించుచున్నారు. వీరికి భార్యలు, పుత్రులు, బంధువులు, అనుచరులు ఎల్లపుడు వశులై ఆనందమున మగ్నులై యుందురు. ఈ దైత్యదానవాదుల భోగ్యవిషయములు సమర్థులైన ఇంద్రాది దేవతలకంటెను అప్రతిహతములు అనగా విఘ్నాదికంటక రహితములై యున్నవి. అందువలన వారీ ప్రదేశముల యందు మాయకు వశులై అమోద ప్రమోదముల యందు మత్తులై యున్నారు.

యేషు మహారాజ మయేన మాయావినా వినిర్మితా: పురో నానామణి ప్రవరప్రవేక విరచిత విచిత్ర భవనప్రాకార గోపుర సభాచైత్యాచత్వరాయతనాది భిర్నాగా సురమిథున పారావత శుకశారికాకీర్ణ కృత్రిమభూమిభిర్వివరేశ్వర గృహోత్తమై: సమలంకృతాశ్చకాసతి ॥ 9

మహారాజా! ఈ బిలస్వర్గముల యందు మాయావియగు మయదానవునిచే నిర్మితములైన ఎన్నియో దానవపురములు నిరంతరము శోభిల్లుచుండును. అచట విచిత్ర భవనములు, ప్రాకారములు, గోపురములు, సభాగృహములు, దేవాలయములు, చత్వరములు

(మందిరాంగణములు), ఉత్తమ మణినిర్మితములతో విరచితమగు ప్రవాసజనుల విశ్రాంతి గృహములు, వివరాధిపతుల శ్రేష్ఠగృహములు, నాగులచేత అసురులచేత పారావత మిథునములచేత సమాకీర్ణములై యున్నవి. వానిచే నీకృత్రిమ భూభాగములు సమలంకృతములై అతిమనోహర మగు శోభను గలిగియున్నవి.

**ఉద్యానాని చాతితరాం మన ఇన్ద్రియానన్దిభిః కుసుమఫలస్తబక-సుభగ కిసలయావనత రుచిరవిటపవిటపినాం లతాంగాలింగితానాం శ్రీభిః సమిథున వివిధవిహంగ జాలాశయానామమలజలపూర్ణానాం ఝషకులోల్లంఘనక్షుభిత నీర నీరజ కుముద కువలయ కల్హార నీలోత్పలలోహితశత పత్రాదివనేషు కృతనికేతనానామేక విహారాకుల మధురవివిధస్వనాదిభిరిన్ద్రియోత్సవైరమర లోకశ్రియమతిశయితాని ॥ 10**

అచట గల ఉద్యానములు అమరలోక శ్రీనిగూడ తిరస్కరించి శోభిల్లుచున్నవి. ఈ యుద్యానవనములలో నానావిధములగు వృక్షములు లతాంగములచే నాలింగితములై యున్నవి. వానిశాఖలు ఫలముల భారముతోను, పూలగుత్తుల భారముతోను, నవపల్లవముల భారముతోను వంగి మనోహరముగ శోభిల్లుచున్నవి. దర్శనమాత్రము చేతనే జనుల మనస్సు, ప్రాణములు ఆనందముచే నుత్ఫుల్లము లగుచుండెను. ఇంకను అచట నున్న జలాశయములు తెల్లకలువలు, కలువలు, కహ్లారములు (ఎఱుపు తెలుపు గలసి పరిమళము గల కలువలు), నల్లకలువలు, ఎఱ్ఱ కలువలు మున్నగువాని వనములయందు గూళ్ళను నిర్మించుకొని చక్రవాకాది పక్షుల జంటలు నివసించుచున్నవి. అవి నిరవచ్ఛిన్నములగు విహారములచే వ్యాకులచిత్తములై నానావిధములగు మధురకూజనములతో సమస్త కాననమును ముఖరిత చేయుచుండెను. దానివలన శ్రోతలకు చక్కగ ఇంద్రియతృప్తి కలుగుచుండెను. ఆశోభ అమరలోక సౌందర్యమును గూడ తిరస్కరించుచున్నట్లు కనబడుచుండెను.

**యత్ర హ వావ న భయమహోరాత్రాదిభిః కాలవిభాగై రుపలక్ష్యతే ॥ 11**

ఈ భూవివరములలో సూర్యుని వెలుగు లేకపోవుటచే దివారాత్రాది కాలవిభాగము లేదు. అందువలన నచట కాలమువలన కలుగు భయమేదియు కనబడదు.

**యత్ర హి మహాహిప్రవరశిరోమణయః సర్వతస్తమః ప్రబాధన్తే ॥12**

అచట నివసించు మహాసర్పముల మస్తకముల యందున్న మణుల ప్రభలచే చుట్టునున్న అంధకారము నశించుచుండెను.

న వా ఏతేషు వసతాం దివ్యౌషధిరసరసాయనాశన పానస్నానాదిభి
రాధయో వ్యాధయో వలీపలిత జరాదయశ్చ దేహవైవర్ణ్యం దౌర్గన్ధ్యం స్వేదః
క్లమో గ్లానిరితి వయోఽవస్థాశ్చ భవన్తి ॥ 13

ఈ ప్రదేశము లన్నింటిలో నివసించువారు దివ్యౌషధీరసమును త్రాగుదురు. దానితోడనే స్నానము చేయుదురు, అందువలన వారి కెట్టి శారీరిక మానసిక బాధలు, పలితము (తెల్లబడుట), ముడతలు, వార్ధక్యము మున్నగు దేహవైవర్ణ్యములు, దౌర్గంధ్యము, చెమట, శ్రమ, అనుత్సాహము, వయస్సునకు గారణములగు వార్ధక్యాదులు మున్నగు వివిధావస్థలు కలుగవు.

నహి తేషాం కల్యాణానాం ప్రభవతి కుతశ్చన మృత్యుర్వినా భగవత్తే
జసశ్చక్రా పదేశాత్ ॥ 14

వారు మంగళస్వరూపులు. సుదర్శనచక్ర మను భగవత్తేజస్సు తప్ప యముడుగూడ వారిపై నెట్టి ప్రభావమును చూపజాలడు.

యస్మిన్ ప్రవిష్టేఽసురవధూనాం ప్రాయః పుంసవనాని భయాదేవ
స్రవన్తి పతన్తి చ ॥ 15

ఈ భగవత్తేజస్సు ప్రవేశించినచో భయమువలన అసురరమణుల గర్భములు స్రవించిపడిపోవును.

అథాతలే మయపుత్రోఽసురో బలో నివసతి। యేన హ వా ఇహ
సృష్టాః షణ్ణవతిర్మాయా యాః కాశ్చనాద్యాపి మాయావినో ధారయన్తి యస్య
చ జృమ్భమాణస్య ముఖతస్త్రయః స్త్రీగణా ఉదపద్యన్త స్వైరిణ్యః కామిన్యః
పుంశ్చల్య ఇతి। యా వై విలాయనం ప్రవిష్టం పురుషం రసేన హాటకాఖ్యేన
సాధయిత్వా స్వవిలాసావలోకాను రాగ స్మితసంలాపోప గూహనాదిభిః స్వైరం
కిల రమయన్తి। యస్మిన్నుపయుక్తే పురుష ఈశ్వరోఽహం సిద్ధోఽ హమిత్య
యుత మహాగజబల ఆత్మానమభిమన్యమానః కత్థతే మదాన్ధ ఇవ ॥ 16

మహారాజా! అతలాది భూవివర విషయములను వినుము. అతలమున మయదానవుని పుత్రుడగు 'బలు'డను అసురుడు నివసించుచుండును. ఈ బలుడు తొంబదియాఱు విధములైన మాయలను సృష్టించెను. వానిలో గొన్ని నేటికిని మాయావులలో లభించు చుండును. ఈ దానవుడొక్క మారు ఆవలింపగా వానిముఖ వివరమునుండి స్వైరిణి (తన వర్ణముల పురుషులతో రమించు స్త్రీ) కామిని (అన్యవర్ణ పురుషులను పొందు స్త్రీ),

పుంశ్చలి (మిగుల చంచల స్వభావముగల) స్త్రీ అను మూడుస్వభావములు గల స్త్రీలు బయల్వెడలిరి. ఏ పురుషుడైన అతలమున ప్రవేశించినచో ఈ స్త్రీలందఱు వానిచే హాటక (ఉమ్మెత్త) రసమును పానముచేయించి, వానికి రతి సామర్థ్యమును గలుగజేసి, అసాధారణము లైన తమతమవిలాసములను జూపి, అనురాగయుక్తహాసము, ఏకాంతభాషణము, ఆలింగనము మున్నగు వానిద్వారా తమతమ యిచ్ఛ ననుసరించి రమింతురు. ఈ హాటకమను రసమును త్రాగుటవలన పురుషుడు పదివేల యేనుగుల బలముగలవాడై మదాంధునివలె 'నేను ఈశ్వరుడను, నేను సిద్ధుడను' అని తన్నుతాను పొగడుకొనును.

**తతోఽధస్తాద్వితలే హరో భగవాన్ హాటకేశ్వరః స్వపార్షద భూతగణావృతః ప్రజాపతి సర్గోపబృంహణాయ భవోభవాన్యా సహ మిథునీభూయాస్తే।యతః ప్రవృత్తాసరిత్ప్రవరా హాటకీ నామ భవయోర్వీర్యేణ। యత్తచ్చిత్రభానుర్మా తరిశ్వనా సమిధ్యమాన ఓజసా పిబతి। తన్నిష్ఠ్యూతం హాటకాఖ్యం సువర్ణం భూషణేనా సురేన్ద్రావరోధేషు పురుషాః సహపురుషీభిర్ధారయన్తి ॥17**

అతలమునకు దిగువనగల వితలమునందు హాటకేశ్వరుడగు మహాదేవుడు తనయ నుచరులైన భూతగణములతో గూడి ప్రజాపతి యగు బ్రహ్మ యొక్క సృష్టిని వృద్ధిచేయుటకై భవానితో గలసి మిథునీభూతుడై నివసించు చుండును. హరగౌరుల వీర్యముచేత హాటకి యనునది వితలమునుండి ప్రవహించుచుండును. అగ్ని వాయుబలముచే ప్రజ్వలితమై ఈ నదియందు ప్రవహించు జలరూపమైన వీర్యమును పానముచేసి ఉమియును. దానివలన హాటక మను సువర్ణముత్పన్న మగును. అసురేంద్రునియంతః పురమున పురుషులు స్త్రీలతోగూడి ఈ హాటక స్వర్ణ నిర్మితములైన యా భూషణములను ధరింతురు.

**తతోఽధస్తాత్ సుతల ఉదారశ్రవాః పుణ్యశ్లోకో విరోచనాత్మజో బలిర్భగవతా మహేన్ద్రస్య ప్రియం చికీర్ష మాణేనాదితేర్లబ్ధకాయో భూత్వా వటువామనరూపేణ పరాక్షిప్త లోకత్రయో భగవదనుకంపయైవ పునః ప్రవేశిత ఇన్ద్రాదిష్వవిద్యమానయా సుసమృద్ధయా శ్రియాభిజుష్టః స్వధర్మేణారాధయంస్తమేవ భగవన్తమారాధనీయమపగతసాధ్వస ఆస్తేఽధునాపి ॥ 18**

వితలమునకు దిగువన సుతలమున్నది. అచట విరోచనాత్మజుడు, మహాయశస్వియు, పుణ్యశ్లోకుడు నగు బలిచక్రవర్తి నేటికిని నివసించి యున్నాడు. విష్ణుభగవానుడు మహేంద్రునకు ప్రియమును గలుగజేయు నుద్దేశ్యముతో అదితిగర్భమునుండి వామనరూపముతో వావిర్భవించి బలినుండి మూడడుగుల భూమిని యాచించు మిషతో మూడులోకములను అపహరించెను. చివరకింకను దయతో వానిని వాని రాజ్యమునందు మరల ప్రతిష్ఠించెను.

దానివలన అతడు ఇంద్రాదులకు లభింపని సంపదచే సమృద్ధుడై స్వధర్మాచరణము ద్వారా ఆరాధ్యుడగునా భగవానుని నేటికిని భయరహితుడై ఆరాధించు చున్నాడు.

నో ఏవైతత్ సాక్షాత్కారో భూమిదానస్య యత్తద్భగవత్యశేషజీవనికాయానాం జీవభూతాత్మభూతే పరమాత్మని వాసుదేవే తీర్థతమే పాత్ర ఉపపన్నే పరమయా శ్రద్ధయా పరమాదరేణ సమాహితమనసా సమ్ప్రతిపాదితస్య సాక్షాదపవర్గద్వారస్య యద్బిలనిలయైశ్వర్యమ్ ॥ 19

రాజా! బలిచక్రవర్తి భగవానుడైన వామనమూర్తికి దానముచేసిన మూడడుగుల భూమివలన వానికి సుతలమున ఏ యైశ్వర్యసుఖములు లభించినవో అవి భూదానమునకు సాక్షాత్ఫలములు కావు. ఆయన అనంతజీవ కోటికి జీవస్వరూపుడు, జీవాంతర్యామి యగు పరమాత్మ, సర్వజీవ నియంతయగు ఆత్మారామ పురుషుడు, స్వయముగ భగవానుడైన వాసుదేవునే దానమునకు పరమపవిత్ర పాత్రరూపమున పొంది బలిచక్రవర్తి పరమశ్రద్ధతోను ఆదరముతోను, సమాహిత చిత్తముతోను భూమిని దానముచేసెను. దానిని సాక్షాత్తుగ అపవర్గము అనగా భగవత్ప్రాప్తికి ద్వారస్వరూపమని యెఱుంగవలెను. బిలస్వర్గసుఖాదులైన అనిత్య సుఖభోగము లెప్పుడును దానికి సాక్షాత్ఫలములు కాజాలవు.

యస్య హ వావ క్షుత్పతనప్రస్ఖలనాదిషు వివశఃసకృన్నామాభిగృణన్ పురుషః కర్మబన్ధనమంజసా విధునోతి। యస్య హైవ ప్రతిబాధనమ్ముముక్షవో ఽన్యథైవోప లభన్తే ॥ 20

(త్రైలోక్యదానాది విషయమట్లుండనిచ్చి భక్తితో పత్రపుష్పాది దానఫలమున నామాభాస రూపమగు సుకృతిద్వారాను, అనాయాసముగను కర్మ బంధనములు తెగిపోవును). మానవుడు క్షుత్పతనస్ఖలనాదుల సమయమున అనగా ఇచ్ఛ లేకపోయినను ఒక్కమారు ఆయననామము నుచ్చరించినచో వారింప నలవికాని కర్మబంధనముల నుండి అతడు అనాయాసముగ ముక్తుడగును. ముక్తికాముకులు కర్మమూల స్వరూప మగు సంసార బంధనములను ఛేదించుటకు అష్టాంగ యోగసాంఖ్యాదులైన నానాక్లేశములను పొందుచుందురు.

తద్భగవతామాత్మవతాం సర్వేషామాత్మన్యాత్మద ఆత్మతయే చ ॥21

సర్వాత్ముడగు శ్రీహరి భగవానుడు నారదాదిభక్తులకు తనను తాను విక్రయించుకొనును. అనగా ప్రేమానందములను దానము చేయును. సనకాదులైన జ్ఞానులకు తన పరమాత్మ స్వరూపానుభూతి యను బ్రహ్మానందాదులను దానముచేయును. అందువలన భగవానునకు భూమిని దానము చేసినందులకు ఫలముగ బలిచక్రవర్తికి సుతలాధిపత్యము

లభింపలేదు. భగవానుని వశము చేసికొను ప్రేమానందములె వాని యాత్మనివేదనమునకు సాక్షాత్ఫలములు. కనుకనే భక్తవశ్యుడగు భగవానుడు భక్తుని ప్రేమరజ్జువుచే బద్ధుడై యుండును.

న వై భగవాన్ నూనమముష్యానుజగ్రాహ। యదుత పునరాత్మానుస్మృతి మోషణాం మాయామయం భోగైశ్వర్యమేవాతనుతేతి ॥ 22

భోగైశ్వర్యముల నిచ్చి భగవానుడు బలిచక్రవర్తి పై జూపిన అనుగ్రహము సరియైనది కాదు. భోగైశ్వర్యములు మాయామయములు. అవి పరమేశ్వరుని స్మృతిపథమునకు రానీయవు.

యత్తద్భగవతానధిగతాన్యోపాయేన యాచ్ఞాచ్ఛలేనా పహృతస్వశరీరావ శేషితలోకత్రయో వరుణపాశైః సంప్రతి ముక్తో గిరిదర్యాంచాపవిద్ధ ఇతి హోవాచ ॥ 23

(మహారాజా! బలిచక్రవర్తియొక్క యేకాంతభక్తిని, భగవదనుగ్రహ ప్రాప్తిని గూర్చి చెప్పుచున్నాను, వినుము). భగవానుడు ఉపాయాంతరము లేనివాడై యాచనామిషతో బలిచక్రవర్తి శరీరమాత్రమును ఉంచి వానినుండి త్రిలోకాధిపత్యమును అపహరించి తెచ్చెను. దానివలన గూడ సంతృప్తి చెందక వానిని వరుణపాశములతో గట్టివేసి పర్వతగుహలో బడవేసెను. కాని బలిచక్రవర్తి గుహామధ్యమున నిక్షిప్తుడయ్యును ఇట్లు పలికెను.

నూనం బతాయం భగవానర్థేషు న నిష్ణాతో యోఽసావిన్ద్రో యస్య సచివో మన్త్రాయ వృత ఏకాన్తతో బృహస్పతి స్తమతిహాయ స్వయముపేన్ద్రేణ ఆత్మానమయాచత ఆత్మనశ్చాశిషో నో ఏవ తద్దాస్యమ్। అతి గమ్భీరవయసః కాలస్య మన్వన్తర పరివృత్తం కియల్లోక త్రయమిదమ్ ॥ 24

ఆహా! ఎంతటి బాధాకర విషయము! ఈ దేవరాజగు నింద్రుడు బృహస్పతిని తనకు ఏకాంత సహాయకునిగను (సచివునిగను) ఆలోచనల కొఱకును ఎన్నుకొనెను. కాని యీ యింద్రుడు విద్వాంసుడయ్యును పరమార్థ విషయమున మిక్కిలి అనభిజ్ఞుడయ్యెను. అతనికి సచివుడైన బృహస్పతియు నట్టివాడే. ఏలయన, ఆయనగూడ ఇంద్రునకు ఉన్నది న్నట్లుగ నుపదేశింపలేదు. వామనుడు ద్వారదేశమున నుండగా ఇంద్రుడాయనను దాస్యము నడుగక తన యింద్రియతృప్తికై సామాన్య మగు త్రిలోకాధిపత్యమును యాచించెను. ఈ త్రిలోకాధిపత్యము మిగుల హీనమైనది. అది నశించునట్టిది. దురంతవీర్యమగు కాలములో నొక మన్వంతరము దానివి పంపూర్ణముగ నావరించియున్నది. అనగా ఇంద్రియభోగ్యము లగు జడపదార్థములన్నియు మన్వంతరావ సానమున నశించును.

**యస్యానుదాస్యమేవా స్మత్పితామహః కిల వవ్రే న తు స్వం పిత్ర్యం యదుతాకుతోభయం పదం దీయమానం భగవతః పరమితి భగవతోపరతే ఖలు స్వపితరి ॥ 25**

నా పితామహుడగు ప్రహ్లాదుడొక్కడె పురుషార్థమును జక్కగ దెలిసినవాడు. హిరణ్యకశిపుడు మృతిచెందగా శ్రీనృసింహదేవుడు ప్రహ్లాదునకు వాని పితృరాజ్యమును అభయ మగు తన మోక్షపదమును నీయదలంచినను ప్రహ్లాదుడు దానిని స్వీకరింపలేదు. అవి భగవద్భావమును నాశముచేయు నట్టివి. భగవానుని అనుగ్రహమును గలిగింపనివి అని తలంచి యతడు భగవద్దాస్యమునే యాచించెను.

**తస్య మహానుభావస్యానుపథమమృజిత కషాయః కో వాస్మద్విధః పరిహీనభగవదనుగ్రహ ఉపజిగమిషతీతి ॥ 26**

మాకు రాగాదికషాయములు నశింపలేదు. అందువలన మేము భగవదనుగ్రహముచే వంచితుల మైతిమి. మావలె నేవ్యక్తియైనను మహానుభావుడైన ఆప్రహ్లాదుని యాచరణము ననుసరించుటకు ఇష్టపడునా?

**తస్యానుచరితముపరిష్టాద్విస్తరిష్యతే। యస్య భగవాన్ స్వయమఖిల జగద్గురుర్నారాయణో ద్వారి గదాపాణిరవతిష్ఠతే విజజనానుకమ్పితహృదయః యేనాంగుష్ఠేనపదా దశకన్దరో యోజనాయుతాయుతం దిగ్విజయ ఉచ్చాటితః ॥ 27**

(రాజా! బలిచక్రవర్తి మహిమను గురించి యేమిచెప్పుదును?) అఖిలజగద్గురువు, తన భక్తులపట్ల సదయహృదయుడు అగు నారాయణుడు తాను గదాహస్తుడై బలియొక్క గృహద్వారమున నుండును. దిగ్విజయార్థమై దశస్కంధుడగు రావణుడు బలిచక్రవర్తి ద్వారముకడకు రాగా అపుడు ద్వారపాలకరూపమున నున్న భగవానుడు పాదాంగుష్ఠము ద్వారా రావణుని పదివేల యోజనముల దూరమున పడునట్లు చిమ్మెను. అంనతర మీ బలిచక్రవర్తియొక్క చరిత్రను (అష్టమస్కంధమున) విస్తారముగ వర్ణింతును.

**తతోఽధస్తాత్ తలాతలే మయో నామ దానవేన్ద్రస్త్రిపురాధిపతిర్భగవతా త్రిపురారిణా త్రిలోక్యాః శం చికీర్షుణా నిర్దగ్ధస్వపురత్రయస్తత్ప్రసాదాల్లబ్ధపదో మాయావినామాచార్యో మహాదేవేన పరిరక్షితో విగతసుదర్శనభయో మహీయతే ॥ 28**

సుతలమునకు గ్రింద తలాతలమున్నది. పురత్రయాధిపతియు, దానవరాజు నగుమయుడా ప్రదేశమున నివసించుచుండును. మయుడు మాయావులకు గురువు.

మహాదేవుడు ముల్లోకముల శుభమును గోరి మొదట మయుని మూడుపురములను దగ్ధము చేసెను. కాని పిమ్మట ప్రసన్నుడై వాని కధికారము నిచ్చెను. అప్పటినుండియు దానవేంద్రుడగు మయుడు త్రిపురారి యగు మహాదేవునిచే సంపూర్ణముగ రక్షితుడు, భగవచ్చక్రమగు సుదర్శనమునుండి భయరహితుడు, తన సేవకులచే పూజితుడు నై యుండెను.

**తతోఽధస్తాన్మహాతలే కాద్రవేయాణాం సర్పాణాం నైకశిరసాం క్రోధవశో నామ గణః కుహకతక్షకకాలియసుషేణాదిప్రధానా మహాభోగవన్తః పతత్రి రాజాధిపతేః పురుష వాహాదనవరత ముద్విజమానాః స్వకలత్రాపత్య సుహృ త్కుటుంబ సంగేన క్వచిత్ ప్రమత్తా విహరన్తి ॥ 29**

తలాతలమునకు క్రింద మహాతలమున్నది. అచట బహుఫణములను ధరించినవి, కోపస్వభావము గలవియు, కద్రూతనయులు నగు సర్పములు నివసించుచుండును. ఆ సర్పములలో కుహకుడు, తక్షకుడు, కాలియుడు, సుషేణుడు మున్నగు దీర్ఘకాయులగు సర్పములు భగవద్వాహనుడు, పక్షిశ్రేష్ఠుడు నగు గరుడునివలన భయముచే నిరంతరము ఉద్విగ్నులు చింతాకులురునై తమతమ భార్యాపుత్రులతోను, బంధువులతోను, కుటుంబ ములతోను గూడి ఎచ్చటెచ్చటో నివసించుచున్నారు.

**తతోఽధస్తాద్రసాతలే దైతేయా దానవాః పణయో నామ నివాతకవచాః కాలకేయా హిరణ్యపురవాసినః ఇతి విబుధప్రత్యనీకా ఉత్పత్త్యా మహౌజసో మహాసాహసినో భగవతః సకలలోకానుభావస్య హరేరేవ తేజసా ప్రతిహత బలాబలేపా బిలేశయా ఇవ వసన్తి యే వై సరమయేన్ద్రదూత్యా వాగ్భిర్మన్త్రవర్ణా భిరిన్ద్రాద్బిభ్యతి ॥ 30**

మహాతలమునకు గ్రింద రసాతలమున్నది. అచట పణినామముతో ప్రసిద్ధిచెందిన దైత్యదానవులు, నివాతకవచులు, కాలకేయులు, హిరణ్య పురవాసులు - అను నీ మూడు విధములుగ మన్న దేవతా ప్రతిపక్షులు సర్పాదులవలె వివరముల నాశ్రయించి నివసించు చుందురు. వీరు పుట్టుకనుండియె మహాబలశాలురు, మహాసాహసులు, సకల లోకములను దేదీప్యమానముగ జేయు నా విష్ణుభగవానుని తేజస్సుచేతనే వీరి బలదర్పములు అణగిపోవు చుండును. ఇంద్రదూతియగు సరమ పలికిన మంత్రగర్భములగు నా వాక్కులచే వీరు దేవరా జగునింద్రునకు భయపడుచుందురు.

తతోఽధస్తాత్ పాతాలే నాగలోకపతయో వాసుకి ప్రముఖాః శంఖకులిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్ర శంఖచూడకంబలాశ్వతర దేవదత్తాదయో మహాభోగినో మహామర్షా నివసన్తి। యేషాముహ వై పంచసప్తదశ శతసహస్రశీర్షాణాం ఫణాసు విరచితా మహామణయో రోచిష్ణవః పాతాలవివర తిమిరనికరం స్వరోచిషా విధమన్తి ॥ 31

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే వివరతలలోపవర్ణనం నామ
చతుర్వింశోఽధ్యాయః॥

రసాతలమునకు దిగువన పాతాళమున్నది. అచట శంఖ కులిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్ర శంఖచూడ కంబలాశ్వతర దేవదత్త ప్రభృతి మహాఫణాధారులు, మిగుల కోపస్వభావులు, వాసుకిప్రముఖులు, నాగలోకపతులు నగు మహాసర్పములు నివసించుచున్నారు. ఈ సర్పములలో గొన్నియైదు, కొన్ని యేడు, కొన్ని పది, కొన్ని వేయి పడగలు గలిగి యున్నవి. ఈ పడగల యందు ఎల్లపుడు ప్రకాశవంతములగు శ్రేష్ఠమణు లుండును. వానికాంతిచే పాతాళ వివరముల యందున్న అంధకారము నశించుచుండుమ.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
వివరతలోపవర్ణన మను ఇరువది నాల్గవ అధ్యాయము
సంపూర్ణము.



# ఇరువదియైదవ అధ్యాయము

## శ్రీ సంకర్షణ దేవుని వివరణము, ఆయన స్తుతి

కథాసారము :- ఈయధ్యాయమున పాతాళము క్రింద సంహారకారి యగురుద్రుని యంశియు, పృథ్వీధారియు నగు అనంతువియునికి వర్ణింపబడినది.

పాతాళమునకు మూలమున భగవానుడగు అనంతుడు విరాజిల్లుచున్నాడు. ఆయన రూపము విశుద్ధసత్త్వమయము. ఆయన రుద్రుని లోపల నుండి సంహారకార్యాదులను జేసి యుండుటచే శాస్త్రమున ఆయన యామూర్తి తామసమూర్తి యనిచెప్పబడినది. ఆయన అహంకారమున కధిష్ఠాత. సర్వ జీవులను చక్కగ ఆకర్షించుటచే సాత్వతులు ఆయనను సంకర్షుడని చెప్పుచున్నారు. అనంతమూర్తి యగు సంకర్షణభగవానుని పడగలయందు ఈ సమగ్రబ్రహ్మాండము ఆవగింజవలె నుండును. సంకర్షణుని లలాటమునుండియె సంహారకారి యగురుద్రుడు జన్మించెను. నిఖిలకల్యాణగుణముల కాశ్రయుడు, భగవదభిన్నుడు, అనంతమూర్తియు నగుసంకర్షణుని పాతాళమునందున్న సురలు, అసురులు, గంధర్వులు, విద్యాధరులు, మునులు ఎల్లపుడు ధ్యానించుచుందురు. ఆయన (సంకర్షణుడు) గూడ మధురవాక్కులతో ఆయనతో సంభాషించుచుండును. విశుద్ధ సత్త్వమయ మగు ఆయనయామూర్తి మిగుల సుందరము. గురు ముఖమున అనంతదేవుని కథను విని కీర్తించువారి ప్రాకృతా హంకారమంతయు నశించును. అనంతదేవుని యీక్షణప్రభావముచే ప్రకృతియొక్క గుణత్రయము తమతమ కార్యములను అనగా సృష్టిస్థితి ప్రళయాది కార్యములనుజేయ సమర్థమగును. అందువలన ఆయనయె సృష్ట్యాదికి మూలకారణము. ఆయన ప్రభావమునకు అంతములేదు. అందువలన అనంతముఖముల ద్వారాగూడ అనంతుని మహిమ వర్ణింపజాలనిది. ధరణీధరేంద్రుడగు ననంతుడు జీవులపై మిగుల దయగలవాడై తన యీ విశుద్ధ సత్త్వమయ మగురూపమును వెల్లడిచేసెను. శుకదేవుడు పరీక్షిన్మహారాజున కిట్లు అనంతదేవుని మహిమను వివరించి చెప్పెను.

### శ్రీ శుక ఉవాచ

**తస్య మూలదేశే త్రింశద్యోజన సహస్రాన్తర ఆస్తే యా వై కలా భగవతస్తామసీ సమాఖ్యాతా అనన్త ఇతి సాత్వతీయా ద్రష్టృదృశ్యయోః సంకర్షణమహమిత్యభిమాన లక్షణం యం సంకర్షణ ఇత్యాచక్షతే ॥ 1**

శుకుడు పలికెను :- మహారాజా! పాతాళమునకు గ్రింద ముప్పది వేల యోజనముల లోపల భగవానుని యొకతామసకళ యున్నది. దానిపేరు 'అనంతుడు' (ఈ రూపము వాస్తవముగ విశుద్ధ సత్త్వమయ మైనది, తమోగుణావతారు డగు రుద్రుని లోపల నుండి సంహార కార్యాదులను జేయుటవలన ఈ మూర్తి తమోమయ మనిచెప్పబడుచున్నది). ఈయన "నేను దీనికి భోక్తను, ఇది నాకు భోగ్యము" అను జీవుల అభిమాన లక్షణాహంకారము నకు అధిష్ఠానరూపముతో భోక్తను, భోగ్యమును ఆకర్షించుటచే సాత్వతు లాయనను సంకర్షణు డనిచెప్పుచున్నారు.

**యస్యేదం క్షితిమణ్డలం భగవతోఽనన్తమూర్తేః సహస్రశిరస ఏకస్మిన్నేవ శీర్షణి ధ్రియమాణం సిద్ధార్థ ఇవ లక్ష్యతే ॥ 2**

భూమండల మీ సహస్రశీర్షుడు అనంతమూర్తియు నగుసంకర్షణుని యొక్క పడగపై నిలచి ఆవగింజవలె గనపడుచుండును.

**యస్య హ వా ఇదం కాలేనోపసఞ్జిహీర్షతోఽమర్షవిరచితరుచిర భ్రమద్భ్రువోరన్తరేణ సంకర్షణో నామ రుద్ర ఏకాదశవ్యూహస్త్ర్యక్షస్త్రిశిఖం శూలముత్తమ్భయన్నుదతిష్ఠత్ ॥ 3**

ప్రళయకాలము సమీపింపగా అనంతదేవుడు ఈ విశ్వమును సంహరింపదలచును. అప్పుడు క్రోధవశమున ముడిపడిన ఆయన కనుబొమల నడుమనుండి మూడుశిఖలు గల శూలమును ధరించి త్రిలోచనుడు, ఏకాదశ రుద్రరూపుడు, సంకర్షణుడు నను రుద్రుడు బయల్వెడలెను.

**యస్యాంఘ్రికమలయుగలారుణవిశదనఖమణిషణ్డమణ్డలే ష్వాదర్శే ష్విహిపతయః సహ సాత్వతర్షభైరేకాన్తభక్తియోగేనావనమన్తః స్వవదనాని పరిస్ఫురత్కుణ్డల ప్రభామణ్డలీమణ్డిత గణ్డస్థలాన్యతిమనోహరాణిప్రముదిత మనసః ఖలు విలోకయన్తి ॥ 4**

ఈ సంకర్షణుని పాదపద్మములయందలి అరుణవర్ణములు, స్వచ్ఛములు నగు నఖము లనుమణిమండలము దర్పణరూపమున భాసించుటచే నాగపతులు శ్రేష్ఠు లైన భక్తులతో నేకాంతభక్తితో ప్రణమిల్లి ఆనందచిత్తముతో తమతమ వదనమండలశోభను దానియందు గాంచుచుందురు. అత్యుజ్జ్వలము లగుకుండలముల ప్రభలచే మండితము లైనగండస్థలములశోభచే వారి యావదనశోభ మిగుల సుదర్శనముగ నుండెను.

యస్యైవ హి నాగరాజకుమార్య ఆశిష ఆశాసానాశ్చార్వఙ్గవలయ విలసిత విశదవిపుల ధవళసుభగరుచిరభుజరజ తస్తమ్భేష్వగురుచన్దన కుంకుమపంకానులేపే నావలిమ్పమానా స్తదభిమర్శనోన్మథిత హృదయమకర ధ్వజావేశరుచిరలలితస్మి తాస్త దనురాగ మదముదితమదావి ఘూర్ణితారుణ కరుణావలోక నయనవదనారవిన్దం సవ్రీడం కిల విలోకయన్తి ॥ 5

నాగరాజపుత్రికలు వివిధము లగుకోరికలతో మనోహరములు, వలయ విభూషిత ములు, నిర్మలములు, శుభ్రవర్ణములు, సుందరములు, సుదీర్ఘములు, రుచిరములు, రజతస్తంభసదృశములు నగునాసంకర్షణుని నాలుగుభుజముల యందు అగురు చందన కుంకుమ పంకమును అనులేపనము చేయుచుందురు. అపుడు ఆహస్త సంస్పర్శము వలన వారిహృదయము కామవేగసంచారముచే మథిత మగును. దానివలన వారు లలిత మధుర హాసములతో అనురాగమద జనిత హర్షములు, మదవిఘూర్ణితములు, ఈష దరుణవర్ణములు, కరుణావలోకనయుక్తములు నగునయనములచే శోభిల్లు అనంతదేవుని ముఖారవిందమును లజ్జాపూర్ణము లగునయనములతో దర్శించుచుందురు.

స ఏష భగవాననన్తోఽనన్తగుణార్ణవ ఆదిదేవ ఉపసం హృతామర్షరోష వేగో లోకానాం స్వస్తయ ఆస్తే ॥ 6

ఆ సంకర్షణు డపరిఛిన్నుడు అనంతకల్యాణగుణసముద్రు డగునాది దేవునికంటె అభిన్నుడు. అతడు ప్రాణుల క్షేమార్థమై అసహిష్ణుతను క్రోధ వేగమును ఉపసంహరించు కొని యున్నాడు.

ధ్యాయమానః సురాసురోరగసిద్ధగన్ధర్వవిద్యాధరముని గణైరనవరతమద ముదిత వికృతవిహ్వలలోచనః సులలితముఖ రికామృతేనాప్యాయమానః స్వపార్షద విబుధయూథపతీనపరి మ్లానరాగనవతులసికామోదమధ్వాసవేన మాద్యన్మధుకర వ్రాతమధురగీతశ్రియం వైజయన్తీం స్వాం వనమాలాంనీల వాసా ఏకకుణ్డలో హలక కుది కృతసుభగసున్దర భుజో భగవాన్మ హేన్ద్రవారణేన్ద్ర ఇవ కాంచనీం కక్ష్యాముదారలీలో బిభర్తి ॥ 7

సురలు, అసురులు, ఉరగులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, మునులు నిరంతర మాయనను ధ్యానించుచుందురు. మత్తెక్కిన ఆయన నేత్రములు ఉత్ఫుల్లములు, వికృతములు, విహ్వలములు నైయున్నవి. సులలితవాగమృతముద్వారా తనపార్షదులను విబుధులను, యూథపతులను ఎల్లపుడు సంతోషపెట్టు చుండును. ఆయన వస్త్రములు నీలవర్ణములు. కర్ణములయందు కుండలము నున్నవి. రెండుహస్తములు సుభగములుగను

సుందరములుగను నున్నవి. వీపున నాగలియు నున్నది. ఆయన లీలలు అత్యుదారముగ నుండును. దేవరాజగు నింద్రునిదైరావతము కంఠమున కాంచనమయ మగుత్రాడును ధరించియున్నట్లు ఆయనకూడ కంఠమున వైజయంతీమాలను ధరించి యున్నాడు. దాని యందు నూతనతులసీ దళములు గూర్చబడియున్నవి. వానికాంతి యెప్పుడును వాడిపోదు. దాని మధురరససౌరభముచే మత్తిల్లి మధుపములు (తుమ్మెదలు) మధురముగ ధ్వనించు చుండును. దానివలన ఆ మాల అత్యపూర్వశోభను గలిగియున్నది.

**యఏష ఏవమనుశ్రుతోఽభిధ్యాయమానో ముముక్షూణామనాదికాల కర్మవాసనా గ్రథితమవిద్యామయం హృదయ గ్రన్థిం సత్త్వరజస్తమోమయ మన్తర్హృదయం గత ఆశు నిర్భినత్తి తస్యానుభావాన్ భగవాన్ స్వాయంభువో నారదః సహ తుంబురుణా సభాయాం బ్రహ్మణః సంశ్లోకయామాస ॥ 8**

పైన చెప్పబడిన అనంతదేవుని వర్ణనమును గురుముఖమునుండి విని ఆయనను ధ్యానించు ముముక్షువుల సత్త్వరజస్తమోమయ మగు హృదయములో ఆ సంకర్షణ భగవానుడు ప్రవేశించి వారి యనాదికాలసంచితకర్మ వాసనాజనితము, అజ్ఞాన మయము, హృదయగ్రంథిరూపము నగు సంసారమును శీఘ్రముగ నాశముచేయును. స్వాయంభువు డగునారదుడు 'తుంబురు' డను గంధర్వునితోగూడి బ్రహ్మసభలో క్రింద చెప్పబోవు మహిమను వర్ణించెను.

**ఉత్పత్తి స్థితిలయహేతవోఽస్య కల్పాః**
**సత్త్వాద్యాః ప్రకృతిగుణా యదీక్షయాసన్।**
**యద్రూపం ధ్రువమకృతం యదేకమాత్మన్**
**నానాధాత్ కథముహ వేద తస్య వర్త్మ ॥ 9**

ఈ జగత్తుయొక్క ఉత్పత్తిస్థితి లయములకు గారణములై సత్త్వాది ప్రాకృతగుణము లెవరియాక్షణప్రభావముచే తమతమ కార్యములను జేయు సమర్థము లగుచుండునో, ఎవరిస్వరూపము అనంతము అనాదియునై యున్నదో, ఎవనిసత్స్వరూప మొకటియె అయ్యును తనశరీరమందలి రోమకూపములలో నానాకార్యరూప ప్రపంచమును ధరించి యున్నాడో అట్టి యా భగవానుని తత్త్వమును మానవు డేమియెరుగును?

**మూర్తిం నః పురుకృపయా బభార సత్త్వం**
**సంశుద్ధం సదసదిదం విభాతి యత్ర ।**
**యల్లీలాం మృగపతిరాదదేఽనవద్యా -**
**మాదాతుం స్వజనమనాంస్యుదారవీర్యః ॥ 10**

ఎవనియందు కార్యకారణాత్మక మగునీవిశ్వము భాసించుచున్నదో, సచ్చిదానంద స్వరూపు డగునాభగవానుడు మాపై కృపజూపి తనశుద్ధసత్త్వమయ మగుమూర్తిని ప్రకటించెను. ఆయన ఉదారపరాక్రముడు అనగా అధికప్రభావసంపన్నుడు. భక్తుల చిత్తమును వశపఱచు కొనుటకై చూపిన పరమపవిత్ర మగులీలను మృగరా జగుసింహము తనయనుచరుల చిత్తమునకు వినోదమును గలిగించుటకై ఆయననుండియే నేర్చెను.

వివరణము : శ్రీలజీవగోస్వామిప్రభువు వ్రాసిన వాఖ్య ననుసరించి ఈశ్లోకతాత్పర్య మిట్లున్నది -

ఏ భగవానునియం దీకార్యకారణాత్మకజగత్తు ప్రకాశించుచున్నదో ఆ సచ్చిదానంద స్వరూపు డగుభగవానుడు మమ్మనుగ్రహించుటకై శుద్ధసత్త్వమయ మగు తనమూర్తిని ప్రకటించెను. మహాపరాక్రమశాలి యగు వరాహదేవుడు తనభక్తులచిత్తమునకు వినోదమును గలిగించుటకై పృథివీ ధారణరూపలీలను చేసెను.

యన్నామ శ్రుతమనుకీర్తయేదకస్మా -
దార్తో వా యది పతితః ప్రలమ్భనాద్వా ।
హన్త్యంహః సపది నృణామశేషమన్యం
కం శేషాద్భగవత ఆశ్రయేన్ముముక్షుః ॥ 11

ఆ భగవానుని నామమును (సాధుగురువులవలన) విని యేవ్యక్తియైన ఆకస్మాత్తుగ గీర్తించునో, లేదా ఆర్తుడుగాని, పతితుడుగాని పరిహాసముగ నైన నొక్కమారుచ్చరించునో సాన్నిధ్యమాత్రముననే ఆవ్యక్తి అన్యమానవుని యశేషపాపరాశిని నాశము చేయగలుగును. అందువలన ముముక్షువు ఆశేష భగవానునికాక మఱియెవరిని ఆశ్రయించును?

మూర్ధన్యర్పితమణువత్ సహస్రమూర్ధ్నో
భూగోలం సగిరిసరిత్సముద్రసత్త్వమ్।
ఆనన్త్యాదనిమితవిక్రమస్య భూమ్నః
కో వీర్యాణ్యపి గణయేత్ సహస్రజిహ్వః ॥ 12

అనంతపరాక్రమవంతు డగు ఆ విభునిసహస్రమస్తకములలో నొక దానిపై గిరులు, నదులు, సాగరములు, ప్రాణులు మున్నగువానితో గూడ ఈ భూమండలము రజఃకణము వలె నుండి ప్రకాశించుచున్నది. వెయ్యినాలుకల బొందియు నెవ్వడైన ఆయనంత దేవుని ప్రభావము గీర్తింపగలుగునా?

ఏవం ప్రభావో భగవాననన్తో
దురన్తవీర్యోరుగుణానుభావః ।
మూలే రసాయాః స్థిత ఆత్మతన్త్రో
యో లీలయా క్ష్మాం స్థితయే బిభర్తి ॥ 13

అనంతదేవునియం దిట్టిప్రభావమున్నది. ఆయనపరాక్రమమున కంతము లేదు. ఆయన గుణములు, మహత్త్వము మిగులవిపులములు. ఆయన తనకు తానే ఆధారము (లేదా ఆయన సంపూర్ణముగ స్వతంత్రుడు). ఆయన రసాతలమునకు గ్రింద నుండి పృథివీరక్షణకై విలాసముగ ధరిత్రిని ధరించుచున్నాడు.

ఏతా హ్యేవేహ నృభిరుపగన్తవ్యా గతయో యథా కర్మ వినిర్మితా యథోపదేశమను వర్ణితాః కామాన్ కామయ మానైః ॥ 14

రాజా! నేను వినినదాని ననుసరించి ఈ విషయముల నన్నింటిని నీకు వివరించితిని. కర్మిష్ఠులకర్మానుసారముగ ఈగతులు నిర్మితము లైనవి. సకామవ్యక్తు లీసంసారమున ఇట్టి గతులను పొందుచుందురు.

ఏతావతీర్హి రాజన్ పుంసః ప్రవృత్తిలక్షణస్య ధర్మస్య విపాకగతయ ఉచ్చావచా విసదృశా యథాప్రశ్నం వ్యాచఖ్యే కిమన్యత్ కథయామీతి ॥15

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కంధే సంకర్షణమాహాత్మ్యం నామ
పంచవింశోఽధ్యాయః ॥

మహారాజా! జనులు ప్రవృత్తిలక్షణధర్మముల నాచరించుచున్నచో వారికి ఉచ్చనీచము లగు భిన్నభిన్నగతులు గలుగును. నీ వడిగిన విషయముల ననుసరించి నేను వానిని వర్ణించితిని. ఇంకను ఏమివినగోరెదవో అడుగుము చెప్పెదను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి పంచమస్కంధములో
సంకర్షణమాహాత్మ్య మను ఇరువదియైదవ అధ్యాయము
సంపూర్ణము.



# ఇరువదియాఱవ అధ్యాయము

## విభిన్ననరకముల వర్ణనము

కథాసారము :- ఈయధ్యాయమున నరకముల వివరణము, పాపముల ననుసరించి పాపులు విభిన్నము లగు నరకములకు వెడలుట, అచట యమదూతలు పెట్టు నానావిధములగు యాతనల ననుభవించుట యను విషయములు వర్ణింపబడినవి.

ప్రకృతిగుణములచే బద్ధుడై జీవుడు తన్ను కర్తగా భావించి గర్వితు డగును. అందువలన ప్రకృతియొక్క త్రివిధ గుణముల ననుసరించి కర్మల జేయువారుగూడ మూడువిధములుగ నుందురు. వీరు తమతమ భావముల ననుసరించి యే కర్మలను జేయుదురో వాని ననుసరించి ఫలములను పరలోకమున అనుభవింతురు. ఇంకను అధార్మికులు నానావిధము లగు నేపాప కర్మల జేయుదురో వానిఫలములనుగూడ వా రనుభవింతురు. ఏ పాప ఫలముచే ఏనరకము లభించునో, అచట యెట్టికష్టము కలుగునో, దానిని వివరముగ జెప్పుటకే శుకమహర్షి పరిక్షిత్తునకు మొదట ఇరువదియెనిమిది నరకముల నామములను జెప్పినాడు. అవి 1. తామిస్రము, 2. అంధతామిస్రము, 3. రౌరవము, 4. మహారౌరవము, 5. కుంభీపాకము, 6. కాలసూత్రము, 7. అసిపత్రవనము, 8. సూకరముఖము, 9. అంధకూపము,10. కృమిభోజనము, 11. సందంశము, 12. తప్తశూర్మి, 13. వజ్రకంటకశాల్మలి, 14. వైతరణి, 15. పూయోదము, 16. ప్రాణరోధము, 17. విశసనము, 18.లాలాభక్షము, 19. సారమేయాదనము, 20. అవీచి, 21. అయఃపానము, 22. క్షారకర్దమము, 23. రక్షోగణభోజనము, 24. శూలప్రోతము, 25. దందశూకము, 26. అవటనిరోధనము, 27. పర్యావర్తనము, 28. సూచీముఖము.

ఇతరులధనము, కళత్రము మున్నగువాని నపహరించుట వలన మిగుల అంధకారముతో నిండిన 'తామిస్రము', పురుషుని వంచించి ఆతని కళత్రాదుల ననుభవించిన మిగుల క్లేశములను గలిగించు 'అంధతామిస్ర' మను నరకము లభించును. ఈ లోకమున స్థూల దేహమునందు నే ననుబుద్ధి నుంచి ప్రాణి హింసాదులద్వారా భార్యాపుత్రాదులను పోషించువారు రౌరవ మను నరకమునందు పతితులగుదురు. చంపబడిన పశువు లచట రురు వను నొకవిధ ముగ్రప్రాణి విశేషముతో జన్మించి వారిని బాధించును. పశుపక్షులను చంపి వండువారిని యమదూతలు కుంభీపాక నరకమున పడవైచి తప్తతైలముతో పచనముచేయుదురు. బ్రాహ్మణులను చంపినవారు 'కాలసూత్ర' మను నరకమున పతితులగుదురు. ఆస్థానము అత్యుష్ణముగను, తామ్రమయముగను, సమముగను ఉండును

బ్రహ్మహత్యనొనరించినవా రచట పడి బహుకాలమువరకు దగ్ధులగుచుందురు. భ్రష్టాచారులు, పాషండమతావలంబులు అగువారు 'అసిపత్రవన' మను నరకమును పొందుదురు. రాజపురుషులు ఆలోచనారహితులై దండింపదగనివారిని దండించినచో యమదూతలు వారిని 'సూకరముఖ' మను నరకమున పడవేసి నిర్దయతో కొట్టుదురు. భగవానుడు మానవులకు వివేకశక్తి నిచ్చినాడు. దానివలన వారన్యుల సుఖదుఃఖముల ననుభవింప గలుగుదురు. కాని వివేకరహితులై అన్యప్రాణులకు కష్టముల గలిగించు వారిని యమదూతలు 'అంధకూప' మను నరకమున బడవేయుదురు. వారు జీవితావస్థయం దే యేప్రాణులకు కష్టముల కలిగించిరో వారచట వీరిని బాధింతురు. అతిథులు మున్నగు వారికి భక్ష్యద్రవ్యముల నీయక తామె భుజించువారు 'కృమిభోజన' మను నరకమున పడుదురు. అచట లెక్కలేనన్ని కృములు వారిని భక్షించును. చౌర్యవృత్తివలన 'సందంశ' మను నరకము, అగమ్య స్త్రీగమనమువలన 'తప్తశూర్మి' యను నరకము, పశ్వాచరణమువల 'వజ్ర కంటకశాల్మలి' యను నరకము లభించును.

సత్కులజాతు లయ్యును స్వధర్మభ్రష్టులగు రాజపురుషులు నరకమునకు అగడ్తవంటిదియు, రక్తపూయ మూత్రాదులతో పరిపూర్ణము నగు 'వైతరిణి' యను నది యందును, శౌచాచారరహితు లగు స్వేచ్ఛాచారులు లాలా జలపూర్ణ మగు సాగరమున పడుదురు. ఆసమయమున వేట మొదలగు నెపములతో ప్రాణిహింస చేసినచో 'ప్రాణరోధ' మను నరకము, డాంబికత్వమును వెల్లడిచేయుటకై యజ్ఞాదులనొనరించి పశ్వాదులను చంపినచో 'వైసస' మను నరకము లభించును. అగ్నిదానము, ప్రాణులచంపుటకై విషప్రయోగము మున్నగువానివలన 'సారమేయాదన' మను నరకము, అసత్యసాక్ష్యముల నిచ్చుట ద్వారా జీవనము గడుపుటవలన 'అవీచి' యను నరకము కలుగును. సురాపానముచేసిన 'అయఃపాన' మను నరకము, గురువులమర్యాద నుల్లంఘించుటవలన 'క్షారకర్దమ' మను నరకము కలుగును. ఆశ్రయించిన పశుపక్ష్యాదులను ఏదియోప్రలోభమును చూపి శూలములతో పొడిచినచో 'శూలప్రోత' మను నరకము కలుగును. పరపీడకులకు 'దందశూక' మను నరకముకలుగును. ప్రాణులను గుహలయందు బంధించి బాధించినచో 'అవటనిరోధన' మను నరకము, అతిథులపైన, అభ్యాగతులపైన రోషమును పూనిన 'పర్యావర్తన' మను నరకము, ధనమదమత్తు లై ధనసంరక్షణచింతారతు లగు వ్యక్తులు 'సూచీముఖ' మను నరకమున బడుదురు. పుణ్యవంతులగు వ్యక్తులు స్వర్గమును పొందుదురు, కాని పుణ్యము క్షయమైనచో వారు మరల మర్త్యలోకమునకు వత్తురు. అనంతరము శుకమహర్షి పరీక్షిత్తునకు భగవానుని విరాడ్రూపమును, అరూపముయొక్క మాహాత్మ్యమును వివరించెను.

## శ్రీరాజోవాచ

మహర్ష ఏతద్వైచిత్ర్యం లోకస్య కథమితి ॥ 1

రాజు పలికెను: మహర్షీ ! లోకమున నిట్లు భిన్న భిన్నములగు భోగవైచిత్ర్యము లేలకలుగుచున్నవో దయయుంచి చెప్పుము.

## శ్రీఋషిరువాచ

త్రిగుణత్వాత్ కర్తుః శ్రద్ధయా కర్మగతయః పృథగ్విధాః సర్వా ఏవ సర్వస్య తారతమ్యేన భవన్తి ॥ 2

ఋషి పలికెను: రాజా ! కర్తలు సాత్త్వికరాజసికతామసికభేదములతో ముప్విధములుగ నున్నారు. ఈమూడువిధములుగ నున్నకర్తలయొక్క త్రివిధశ్రద్ధలవలన కర్మ గతులు గూడ భిన్నభిన్నములుగ నుండును. అనగా సాత్వికశ్రద్ధవలన కర్తసుఖియు, రాజసికశ్రద్ధవలన సుఖియు దుఃఖియు, తామసికశ్రద్ధవలన దుఃఖియు మూఢుడు నగును. శ్రద్ధలో తారతమ్య మున్నచో సర్వుల యొక్క సర్వవిధగతులు తారతమ్యరూపమున నుండును.

అథేదానీం ప్రతిషిద్ధలక్షణస్యాధర్మస్యతథైవ కర్తుః శ్రద్ధాయా వైసాదృశ్యాత్ కర్మఫలం విసదృశం భవతి యా హ్యనాద్యవిద్యాకృతకామానాం తత్పరిణామ లక్షణాః సృతయః సహస్రశః ప్రవృత్తాస్తాసాం ప్రాచుర్యేణానువర్ణయిష్యామః ॥ 3

కనుక ధర్మము నాచరించువారికే శ్రద్ధావైచిత్ర్యమువలన ఫలవైచిత్ర్యము కలుగును అనుట సరికాదు. కాని ప్రతిషిద్ధము లైన అధర్మముల నాచరించువారికిగూడ శ్రద్ధయొక్క తారతమ్యము ననుసరించి కర్మఫలముగూడ వేఱుగ నుండును. అనగా పొరపాటువలన అధర్మము నాచరించువారి ఫలమునకు అల్పత్వము, జ్ఞానముచే అధర్మము నాచరించు వారిఫలమునకు మధ్యమత్వము, నాస్తికత్వప్రయుక్తమైన అధర్మము నాచరించు వారిఫలము నకు పూర్ణత్వము సంఘటిల్లును. అనాద్యవిద్యాకృత మగుకోరిక యొక్కపరిణామ స్వరూపముగ ఏ యే నరకములు కలుగునో నేను వానిని వివరముగ వర్ణింతును.

## శ్రీరాజోవాచ

నరకా నామ భగవన్ కిం దేశవిశేషా అథవా బహి స్త్రిలోక్యా అహోస్విద న్తరాల ఇతి॥ 4

పరీక్షిన్మహారాజు పలికెను: దేవా ! నరకములు పృథివిలో ఏస్థానమున నున్నవి? త్రిలోకములకు బయట ఉన్నవా? లేక అంతరాళముననున్నవా ?

## శ్రీఋషిరువాచ

అన్తరాల ఏవ త్రిజగత్యాస్తు దిశి దక్షిణస్యామధస్తాద్భూమేరుపరిష్టాచ్చ జలాద్యస్యామగ్నిష్వాత్తాదయః పితృగణా దిశిస్వానాం గోత్రాణాం పరమేణ సమాధినా సత్యా ఏవాశిష ఆశాసానా నివసన్తి ॥ 5

ఋషి పలికెను: నరకములు మూడులోకములయొక్క అంతరాళమున నున్నవి. దక్షిణదిక్కున భూమికి క్రిందిభాగమున, జలమునకు పై భాగమున నరకము లున్నవి. ఈదిక్కున అగ్నిష్వాత్త మున్నగుపితృదేవతలు పరమసమాధియోగముతో భగవానుని ధ్యానించుచు, తమతమగోత్రోద్భవు లగువ్యక్తులక్షేమమును కాంక్షించి నివసించుచుందురు.

యత్ర హ వావ భగవాన్ పితృరాజో వైవస్వతః స్వవిషయం ప్రాపి తేషు స్వపురుషైర్జన్తుషు పరేతేషు యథాకర్మావద్యం దోషమేవానుల్లంఘిత భగవచ్ఛాసనః సగణోదమం ధారయతి ॥ 6

ఈ ప్రదేశమున పితృరాజును, ఐశ్వర్యశాలియు, రవిపుత్రుడును నగు యముడు పార్షదులతో గూడి పరమేశ్వరుని ఆజ్ఞ నుల్లంఘింపక మరణించినపిమ్మట దూతలద్వారా తనయధికారములోనికి దీసికొనిరాబడినప్రాణులను వారివారికర్మల ననుసరించి దోషాదోషముల విచారించి శిక్షించుచుండును.

తత్ర హైకే నరకానేకవింశతిం గణయన్తి అథ తాంస్తే రాజన్ నామరూప లక్షణతోఽనుక్రమిష్యామః । తామిస్రోఽన్ధతామిస్రో రౌరవో మహారౌరవః కుమ్భీపాకః కాలసూత్రమసి పత్రవనం సూకరముఖమన్ధకూపః కృమిభోజనః సన్దంశస్తప్త శూర్మిర్వజ్రకణ్టకశాల్మలీ వైతరణీ పూయోదః ప్రాణరోధో విశసనం లాలాభక్షః సారమేయాదనమవీచిరయః పానమితి। కించ క్షారకర్దమో రక్షోగణభోజనః శూలప్రోతో దన్దశూకోఽవటనిరోధనః పర్యావర్తనః సూచీముఖ మిత్యష్టా వింశతిర్నరకా వివిధయాతనాభూమయః ॥ 7

ఈ ప్రదేశమున గొందఱు ఇరువదియొక్క నరకములని వర్ణించిరి. మహారాజా! నేను నామరూపలక్షణముల నిర్దేశించి నీకా నరకముల విషయమును వివరింతును వినుము 1 తామిస్రము 2. అంధతామిస్రము 3. రౌరవము 4. మహారౌరవము 5. కుంభీపాకము

6. కాలసూత్రము 7. అసిపత్రవనము 8. సూకరముఖము 9. అంధకూపము 10. కృమి భోజనము 11. సందంశము 12. తప్తశూర్మి 13. వజ్రకంటకశాల్మలి 14. వైతరణి 15. పూయోదము 16. ప్రాణరోధము 17. విశసనము 18. లాలాభక్షము 19. సారమేయాదనము 20. అవీచి 21. అయఃపానము అనునవి యిరువది యొక్క నరకములు. ఇంతేకాక క్షారకర్దమము, రక్షోగణ భోజనము, శూలప్రోతము, దందశూకము, అవటనిరోధనము, పర్యావర్తనము, సూచీముఖము నను నామములతో నింకను ఏడునరకములు గలవు. సంపూర్ణముగ నీ యిరువది యెనిమిది నరకములు నానావిధములగు యాతనలకు స్థానములు.

**తత్ర యస్తు పరవిత్తాపత్యకలత్రాణ్యపహరతి స హి కాలపాశబద్ధో యమపురుషైరతి భయానకై స్తామిస్ర నరకే బలాన్నిపత్యతే। అనశనాను దపానదణ్డతాడనసన్తర్జనాదిభిర్యాతనాభిర్యాత్యమానో జన్తుర్యత్రకశ్మల మాసాదిత ఏకదైవ మూర్ఛాముపయాతి తామిస్రప్రాయే ॥ 8**

రాజా! ఈపుడమియందు ఇతరుల ధనమును, భార్యాపుత్రులను అపహరించువానిని అతిభయంకరులగు యమదూతలు కాలపాశముచే బంధించి వెనుకచెప్పబడిన నరకములలో తామిస్ర మను నరకమున పడవేయుదురు. ఈ తామిస్రనరకము ఘోరమగు అంధకారముచే నావరింప బడియుండును. ప్రాణులు దానియందు పడి ఆహారపానీయములు లేక పోవుటచేత, దండతాడన తర్జనాది యాతనలచేత పీడితులగుదురు. వారిట్లు దుఃఖమున బడి మూర్ఛపొందుదురు.

**ఏవమేవాన్ధతామిస్రే యస్తు వంచయిత్వా పురుషం దారాదీనుపయుంక్తే యత్ర శరీరీ నిపాత్యమానో యాతనాస్థో వేదనయా నష్టమతిర్నష్టదృష్టిశ్చ భవతి యథా హి వనస్పతి ర్వృశ్చ్యమాన మూలస్తస్మాదన్ధతామిస్రం తము పదిశన్తి ॥ 9**

పురుషుని వంచించి అతని కళత్రాదుల ననుభవించు వాడంధతా మిస్ర మనునరకమున బడును. ఎవ్వడైన వృక్షమును బడవేయుటకు పూర్వము దానిమూలమును ఛేదించును. అట్లే ఈ నరకమున బడవేయుటకు పూర్వము యమదూత లాపాపిని నానావిధములుగ బాధింతురు. ఈ యాతనలచే పీడితుడై వేదనవలన జీవునిబుద్ధి, దృష్టిశక్తి నశించును. కనుకనే యీ నరకమును పండితులు 'అంధతామిస్ర' మనుపేరుతో పిలచుచున్నారు.

**యస్త్విహ వా ఏతదహమితి మమేదమితి భూతద్రోహేణ కేవలం స్వకుటుంబమేవానుదినం ప్రపుష్ణాతి స తదిహ విహాయ స్వయమేవ తదశుభేన రౌరవే నిపతతి ॥ 10**

ఈ ప్రపంచమున ఏ మానవుడు దేహద్రవిణాదుల యందు నేనను బుద్ధి నుంచి అన్యజీవులను హింసించి దానిద్వారా అనుదినము తన్ను తనవారిని పోషించునో అట్టివ్యక్తి దేహమును, కుటుంబమును ఇక్కడే వదలివేసి ప్రాణిద్రోహమువలన గలుగు పాపఫలకారణమున రౌరవ నరకమున పడును.

**యే త్విహ యథైవామునా విహింసితా జన్తవః పరత్ర యమయాతనా ఉపగతం త ఏవ రురవో భూత్వా తథా తమేవ విహింసంతి తస్మాద్రౌరవ మిత్యాహుః రురురితి సర్పాదతిక్రూరసత్త్వస్యాపదేశః ॥ 11**

ఈ లోకమున పురుషుడు ప్రాణులను పీడించి మరణించిన పిమ్మట తాను చేసిన కర్మలదోషమువలన యమయాతనల ననుభవించును. అపుడు వానిచే జంపబడిన ప్రాణు లన్నియు రురువనునొకవిధ మగుప్రాణిగ జన్మించి వానిని బాధించును. కనుకనే పండితులు ఈనరకమును 'రౌరవ' మనిపిలుతురు. ఆరురువు సర్పముకంటెను మిగులక్రూరస్వభావము గలది. (భారశృంగ మనునొకప్రాణి యున్నది, దానిని కొందరు 'రురు' వందురు).

**ఏవమేవ మహారౌరవో యత్ర నిపతితం పురుషం క్రవ్యాదా నామ రురవస్తం క్రవ్యేణ ఘాతయన్తి యః కేవలం దేహమ్భరః ॥ 12**

మహారౌరవనరకముగూడ నిట్లే యుండును. ఇట్టి హింసాపరాయణు లగుజనుల కీనరకము లభించును. అచట క్రవ్యాద మను రురువులు పరమాంసముచే స్వదేహమును పోషించుకొనుచు నరకస్థు డగుమానవుని మాంసమును గ్రహించుటకై నానావిధములుగ వానిని బాధించుచుండును.

**యస్త్విహ వా ఉగ్రః పశూన్ పక్షిణో వా ప్రాణత ఉపరన్ధయతి తమప కరుణం పురుషాదైరపి విగర్హితమముత్ర యమానుచరాః కుమ్భీపాకే తప్తతైల ఉపరన్ధయన్తి ॥ 13**

నిష్ఠురు లగువ్యక్తు లీప్రపంచమున తమతమ ప్రాణములను పోషించుకొనుటకై పశువులను, పక్షులను జంపి వంటచేయుదురు. పరలోకమున నరమాంసభక్షకు లగురాక్షసుల చేతగూడ నిందితు లగు ఆనిష్ఠురవ్యక్తులను యమదూతలు 'కుంభీపాక' మనునరకమున బడవేసి తప్తతైలమున వండుదురు.

యస్త్విహ బ్రహ్మధ్రుక్ స కాలసూత్రసంజ్ఞకే నరకేఽయుతయోజనప రిమండలే తామ్రమయే తప్తే ఖలే ఉపర్యధస్తాదగ్న్యర్కాభ్యామభితప్యమానే ఽభినివేశిత: క్షుత్పిపాసాభ్యాంచ దహ్యమానాన్తర్బహి:శరీర ఆస్తే శేతే చేష్టతే ఽవతిష్ఠతే పరిధావతి చ యావన్తి పశురోమాణి తావద్వర్ష సహస్రాణి ॥ 14

ఈలోకమున బ్రాహ్మణహంతకుడు 'కాలసూత్ర' మనునరకమున బడును. ఈనరకము యొక్కపరిధి పదివేలయోజనములు, ఈస్థానము తామ్రమయ మైనసమతలభూమి. క్రిందిప్రదేశమునుండి అగ్నిచేత, పై ప్రదేశము నుండి తీక్షమైన సూర్యునితాపము చేత ఈ తామ్రము (రాగి) మిగుల తప్తమగును. బ్రహ్మహంతకు డీస్థానమున బడినచో ఆకలిదప్పులు వాని శరీరమును లోపలనుండి బయటనుండి దగ్ధము చేయుచుండును. దానివలన వాడు ఒకప్పుడు పరుండును, ఒకప్పుడు కూర్చుండును, ఒకప్పుడు పొర్లాడును, ఒకప్పుడు పరుగిడును. పశుదేహమున ఎన్ని రోమములుండునో అన్నివేల సంవత్సరము లీపాపి ఇట్టి యాతనల ననుభవించును.

యస్త్విహ వై నిజవేదపథాదనాపద్యపగత: పాషణ్డం చోపగతస్తమసి పత్రవనం ప్రవేశ్యకశయా ప్రహరన్తి తత్ర హాసావితస్తతో ధావమాన ఉభయతో ధారైస్తాలవనాసిపత్రైశ్ఛిద్యమానసర్వాంగో హా హతోఽస్మీతి పరమయా వేదనయా మూర్ఛిత: పదేపదే నిపతతి స్వధర్మహా పాషణ్డానుగమన ఫలం భుంక్తే ॥ 15

ఈ ప్రపంచమున ఆపత్కాలము సంభవింపక పోయినను వేదమార్గమునుండి భ్రష్టుడై పాషండ ధర్మమును అనగా వేదవిరుద్ధ మార్గము నవలంబించు వానిని యమదూతలు 'అసిపత్రవన'మను నరకమున బడవేసి బెత్తములతో గొట్టుదురు. దెబ్బల బాధలవలన వాడీ నరకమున అటునిటు పరుగిడు చున్నప్పుడు రెండువైపుల నున్న కత్తులవంటి తాళపత్రముల అంచులచే వాని సర్వాంగములు చీల్చుకొని పోవుచుండును, అపుడు వాడు 'అయ్యో! అయ్యో! ప్రాణములు పోవుచున్నవి. ప్రాణములు పోవుచున్నవి' యని యఱచుచు కఠిన బాధలచే ధైర్యము చెడినవాడై అడుగడుగున మూర్ఛిల్లుచుండును. స్వధర్మమును విడచినవాడిట్టి పాషండ మతావలంబన ఫలము ననుభవించును.

యస్త్విహ వై రాజా రాజపురుషో వాదణ్డ్యే దణ్డం ప్రణయతి బ్రాహ్మణే వా శరీరదణ్డం స పాపీయాన్ నరకేఽమూత్రశూకరముఖే నిపతతి। తత్రాతి బలైర్వినిష్పిష్య మాణావయవో యథైవేహేక్షుదణ్డ ఆర్తస్వరేణ స్వనయన్ క్వచి న్మూర్ఛిత: కశ్మలముపగతో యథైవేహాదృష్టదోషా ఉపరుద్ధా: ॥ 16

ఈ లోకమున రాజు లేదా రాజపురుషుడు దండించుటకు దగనివానిని దండించినను, లేదా దండింపదగని బ్రాహ్మణునకు శారీరకదండనము విధించినను అట్టిపాపి పరలోకమునకు వెడలి 'శూకరముఖ'మను నరకమున పడును. అచట అతిబలశాలు రగు యమదూతలు చెఱకుగడవలె వానియవ యవములను విఱచివేయుదురు (పిండివేయుదురు). అప్పుడు వాడు ఆర్తస్వరముతో రోదించుచుండును. ప్రపంచమున దోషరహితుడగు వ్యక్తి దండింప బడినచో మోహగ్రస్తుడై మూర్ఛను బొందును, అట్లే అతడు గూడ మోహమును బొంది అప్పుడప్పుడు మూర్ఛితుడగు చుండును.

**యస్త్విహ వై భూతానామీశ్వరోప కల్పితవృత్తీనా మవివిక్తపరవ్యథానాం స్వయం పురుషోపకల్పితవృత్తిర్వి విక్త పరవ్యథో వ్యథామాచరతి స పరత్రాన్ధ కూపే తదభిద్రోహేణ నిపతతి। తత్ర హాసౌ తైస్తైర్జన్తుభిః పశుమృగ పక్షిసరీ సృపమశక యూకామత్కుణమక్షికాదిభిర్యే కే చాభిద్రుగ్ధాస్తైః సర్వతోఽ భిద్రుహ్యమాణస్తమసి విహతనిద్రానిర్వృతిరలబ్ధావ స్థానః పరిక్రామతి యథా కుశరీరే జీవః ॥ 17**

ఈశ్వరుడు నల్లి మున్నగు ప్రాణులకు మనుష్యరక్త పానరూపవృత్తిని నిర్ధారణ చేసియున్నాడు, కాని వివేకమును గలిగింపలేదు. అందువలన నవి యితరుల బాధల నెఱుంగజాలవు. కాని ఆయన మానవులకు బ్రాహ్మణాది స్వభావముల ననుసరించి విధినిషేధ పూర్వకములైన భిన్నభిన్న వృత్తులను నిర్దేశించి యిచ్చినాడు. వారికి వివేకమును గూడ నిచ్చినాడు. ఆశక్తి ద్వారా వారు ఇతరులబాధలను తెలిసికొనగలరు. అందువలన వివేకియై యుండియు ఏ మానవుడు ఈ వివేకహీనులగు జీవులను పీడించునో అతడాహింసవలన గలిగిన పాపమువలన పరలోకమున "అంధకూప" మను నరకమున బడును. ఈ పాపిచే పూర్వము చంపబడిన పశువులు, పక్షులు, మృగములు, సరీసృపములు, దోమలు, పేలు, నల్లులు, ఈగలు మున్నగు సర్వజీవులు అపుడు నలువైపుల వానిని బాధించు చుండును. దానివలన వాని నిద్రాసుఖములు నశించును. యాతనవలన అస్థిరుడై యెచ్చటను విశ్రమ స్థానమును పొందలేడు. తిర్యక్కుమున్నగు కుత్సితయోనుల యందు సంచరించుచు జీవుడెన్నియో కష్టముల బొందుచుండునట్లే వాడుగూడ ఆయంధకారమున బడి కష్టములను బొందును.

**యస్త్విహ వా అసంవిభజ్యాశ్నాతి యత్కించనోప నతమనిర్మిత పంచయజ్ఞో వాయససంస్తుతః స పరత్ర కృమి భోజనేనరకాధమే నిపతతి। తత్రశతసహస్ర యోజనే కృమికుణ్డే కృమిభూతః స్వయం కృమిభిరేవ భక్ష్యమాణః కృమిభోజనో యావత్ తదప్రత్తాప్రహుతాదోఽనిర్వేశమాత్మానం యాతయతి ॥ 18**

ఏ యాహారద్రవ్యములు లభించినను వానిని అతిథులకు, బాలురకు, వృద్ధులకు తగినవిధముగ పంచక తానే భుజించువాడు లేదా పంచవిధ యజ్ఞముల నొనరింపనివాడు వాయసతుల్యుడని చెప్పబడినాడు. అనంతరకాలమున "కృమిభోజన" మను అతినికృష్ట మగు నరకమున బడును. ఆ నరకమున లక్షయోజనముల వైశాల్యముగల ఒక కృమికుండమున్నది. అతడా కుండములో కృమియై కృములను భుజించును. అచట కృములుగూడ వానిని భుజించును ఇట్లు సర్వులు ఇతరులకు భాగము నీయక వస్తువుల నన్నింటిని తామే అనుభవించినను లేదా యజ్ఞావశిష్ట ద్రవ్యమును స్వీకరింపకపోయినను తమపాపము నశింపనంతవఱకు వారు ప్రాయశ్చిత్తము లేని వారై తమకుతామే నానావిధములగు యాతనలను గలుగజేసికొనుచుందురు.

**యస్త్విహ వై స్తేయేన బలాద్వా హిరణ్యరత్నాదీని బ్రాహ్మణస్యాపహరత్య న్యస్య వానాపది పురుషస్తమముత్ర రాజన్ యమపురుషా అయస్మయైరగ్నిపిణ్డైః సందంశైస్త్వచి నిష్కుషన్తి ॥ 19**

రాజా! ఈ లోకమున ఏ వ్యక్తి ప్రాణసంకటస్థితి కలుగకపోయినను బ్రాహ్మణుల యొక్క లేదా ఇతరులయొక్క హిరణ్యరత్నాది సంపదను దొంగిలించినను లేదా బలప్రయోగముచే హరించినను ఆ వ్యక్తిని పరలోకమున యమదూతలు "సందంశ" మను నరకమున బడవేసి లోహమయ మగు అగ్నిపిండములతోను, పట్టకార్లతోను వానిచర్మమును చిన్నభిన్నము చేయుదురు.

**యస్త్విహ వా అగమ్యాం స్త్రియం పురుషోఽగమ్యం వా పురుషం యోషిదభిగచ్ఛతి తావముత్ర కశయా తాడయన్తస్తిగ్మయా శూర్మ్యా లోహ మయ్యా పురుషమాలింగయన్తి స్త్రియం చ పురుషరూపయా శూర్మ్యా ॥20**

ఇంకను ఈ లోకమున ఏ పురుషుడు పొందదగని స్త్రీని పొందినను లేదా యే స్త్రీ పొందదగని పురుషుని పొందినను అనంతరకాలమున యమదూతలా పురుషుని లేదా స్త్రీని "తప్తశూర్మి" యను నరకమున బడవేసి కొరడాలతో గొట్టుదురు. పురుషుని తప్త మగు లోహమయ స్త్రీమూర్తిచేత, స్త్రీని తప్తమగు లోహమయ పురుషమూర్తిచేత ఆలింగనము చేయింతురు.

**యస్త్విహ వై సర్వాభిగమస్త మముత్ర నిరయే వర్తమానం వజ్రకంటక శాల్మలీమారోప్య నిష్కర్షన్తి ॥ 21**

ఏ మానవుడీ లోకమున పశ్వాదులను సంభోగించునో అనంతరకాలమున వానిని యమదూతలు వజ్రకంటక శాల్మలి యను నరకమున బడవేయుదురు. ఈ నరకమునవొక

శాల్మలీవృక్ష మున్నది. దానిముండ్లు వజ్రతుల్యములు, యమదూతలు పాపులను వానిపై బడవేసి లాగుదురు.

**యే త్విహ వై రాజన్యా రాజపురుషా వాఽపాషణ్డా ధర్మసేతూన్ భిన్దన్తి తే సంపరేత్య వైతరణ్యాం నిపతన్తి భిన్న మర్యాదాస్తస్యాం నిరయపరిఖా భూతాయాం నద్యాం యాదో గణైరితస్తతో భక్ష్యమణా ఆత్మనా న వియుజ్య మానాశ్చాసుభిరుహ్యమానాః స్వాఘేన కర్మపాకమనుస్మరన్తో విణ్మూత్ర పూయశోణిత కేశనఖాస్థిమేదో మాంసవసావాహిన్య ముపతప్యన్తే ॥ 22**

ఇహలోకమున రాజన్యులు లేదా రాజపురుషులు సత్కులమున జన్మించినను ధర్మమర్యాదను నాశము చేసినచో వారు అవమానితులై పరలోకమున "వైతరణీ" యను నదియందు పడుదురు. ఈ నది నరకమునకు అగడ్తవంటిది. దానియందుండు క్రూరజల జంతువులు ఆ పాపిని భక్షించును. అయినను ఆ పాపిశరీరము నశింపదు. వాని ప్రాణములు బహిర్గతములు గావు. తన పాపమువలన గలిగిన కర్మవిపాకమును స్మరించుచు వాడు మలమూత్ర పూయశోణిత కేశనఖాస్థి మేదమాంసవసావాహిని అగునది యందు పడి భయంకరములగు యాతనల ననుభవించును.

**యే త్విహ వై వృషలీపతయో నష్టశౌచాచార నియమాస్త్యక్తలజ్జాః పశుచర్యాం చరన్తి తే చాపి ప్రేత్య పూయవిణ్మూత్ర శ్లేష్మలాలా పూర్ణార్ణవే నిపతన్తి తదేవాతిబీభత్సితమశ్నతి ॥ 23**

ఈ ప్రపంచమున శూద్రస్త్రీపతులై శౌచాచార నియమములనుండి భ్రష్టులై, లజ్జావిహీనులై పశువులవలె సంచరించువారు మరణించిన పిమ్మట "పూయోద" యను నరకములోని చీము, మలమూత్రములు, శ్లేష్మము, లాలాజలము ననువానితో నిండిన సముద్రమున బడి అసహ్యకరము లగు ఆ పదార్థములను భుజింతురు.

**యే త్విహ వై శ్వగర్దభపతయో బ్రాహ్మణాదయో మృగయావిహారా అతీర్థే చ మృగాన్ నిఘ్నన్తి తానపి సమ్పరేతాల్లక్ష్య భూతాన్ యమపురుషా ఇషుభిర్విధ్యన్తి ॥ 24**

ఈ లోకమున బ్రాహ్మణాది వర్ణముల వారు కుక్కలను, గాడిదలను పెంచుచున్నవారై వేట మున్నగువానియందు నిమగ్నులై యుండి శాస్త్రమునకు వ్యతిరేకముగ పశువులను వధించుచున్నచో మరణానంతరము వారిని "ప్రాణరోధ"మను నరకమున బడవేసి యమదూతలు బాణములతో గొట్టుదురు.

**యే త్విహ వై దామ్భికా దమ్భయజ్ఞేషు పశూన్ విశసన్తి తానముష్మిన్ లోకే వైశసే నరకే పతితాన్ నిరయపతయో యాతయిత్వా విశసన్తి ॥ 25**

డాంభికులగు వ్యక్తులు ఈ లోకమున కేవలము డాంభికత్వమును (ఆడంబరమును) వెల్లడించుటకై యజ్ఞముల నొనరించుచు పశువులను వధింతురు. పరలోకమున వారు "వైశస"మను నరకమున బడుదురు. యమదూతలు వారి ననేకవిధములుగ బాధింతురు.

**యస్త్విహ వై సవర్ణాం భార్యాం ద్విజో రేతః పాయయతి, కామమోహితస్తం పాపకృతమముత్ర రేతఃకుల్యాయాం పాతయిత్వా రేతః సంపాయయన్తి ॥ 26**

ఈ లోకమున కామాంధుడై సవర్ణభార్యను వశముచేసికొనుటకై తన శుక్రమును ఆమెచే పానము చేయించు ద్విజుని పరలోకమున యమదూతలు "లాలాభక్ష"మను నరకమున బడవేయుదురు. శుక్రనదియందు వానిచే శుక్రపానము చేయింతురు.

**యే త్విహ వై దస్యవోఽగ్నిదా గరదా గ్రామాన్ సార్థాన్ వా విలుమ్పన్తి రాజానో రాజభటా వా తాంశ్చాపి హి పరేతాన్ యమదూతా వజ్రదంష్ట్రాః శ్వానః సప్తశతాని వింశతిశ్చ సరభసం ఖాదన్తి ॥ 27**

ఈ లోకమున దస్యువృత్తి నొనరించువారు, పరగృహమున నిప్పుబెట్టువారు, లేదా పరులప్రాణములను దీయుటకై విషము పెట్టువారు లేదా గ్రామవాసులను లేదా వ్యాపారులను హింసించు రాజులు లేదా రాజదూతలు మరణించిన పిమ్మట "సారమేయాదన" మను నరకమున బడుదురు. అచట ఏడువందల యిరువది సంఖ్యలో నున్నయముని అనుసరించుకుక్కలు వజ్రముల వంటి తమకోరలచే అత్యంతానందముతో నీ పాపులను దినును.

**యస్త్విహ వా అనృతం వదతి సాక్ష్యే ద్రవ్యవినిమయే దానే వా కథంచిత్ సవై ప్రేత్య నరకేఽవీచిమత్యధః శిరా నిరవకాశే యోజనశతో చ్ఛ్రాయాద్గిరిమూర్ధ్నః సంపాత్యతే। యత్ర జలమివ స్థలమశ్మపృష్ఠమవభాసతే తదవీచిమత్। తిలశో విశీర్యమాణశరీరో న మ్రియమాణః పునరారోపితో నిపతతి ॥ 28**

ఏ వ్యక్తులు ఈ లోకమున సాక్ష్యము నిచ్చునపుడు లేదా క్రయవిక్రయములు చేయునపుడు లేదా దానము చేయునపుడు అనృతమును బలికినచో పరలోకమునకు వెడలిన పిమ్మట యమదూతలు వారిని నూఱుయోజనములు ఉన్నతమైన పర్వతశిఖరము

నుండి తలను గ్రిందకుజేసి "అవీచిమంతము" అను నరకమున బడవేయుదురు. అచట ఎట్టి యవలంబన స్థానము లేదు. ప్రస్తరపృష్ఠ స్థలముల జలమువలె గనబడును. అందువలన ఈ జలమున తరంగములుండవు. కనుక అది అవీచి యని చెప్పబడినది. దానియందు పతితుడైన పాపిశరీరము ముక్కలు ముక్కలగును. కాని ఒక్కమారే మరణము కలుగదు. యమదూతలు మరల వారిని యిట్లు ఉన్నతప్రదేశమున కెత్తుకొని పోయి యచటనుండి యీ నరకమున బడవేయుదురు. ఇట్లు నానాయాతనలను గలిగింతురు.

యస్త్విహ వై విప్రో రాజన్యో వైశ్యో వా సోమపీథ స్తత్కలత్రం వా సురాం వ్రతస్థో వా పిబతి ప్రమాదతస్తేషాం నిరయం నీతానామురసి పదాక్రమాస్యే వహ్నినా ద్రవమాణం కార్ష్ణాయసం నిషించన్తి ॥ 29

ఈ లోకమున బ్రాహ్మణుడు లేదా బ్రాహ్మణస్త్రీ సురాపానము చేసినను, లేదా యెవ్వడైన వ్రతస్థుడైన వాడుకాని రాజుగాని వైశ్యుడుగాని పొరపాటున సోమపానము చేసినను యమదూతలు వారిని "అయఃపాన" మను నరకమున బడవేసి పాదములచే వారి వక్షఃస్థలమును ద్రొక్కి నోటి యందు సలసలకాగు వహ్నిలోహ ద్రవమును బోయుదురు.

అథ చ యస్త్విహ వా ఆత్మసంభావనేన స్వయమధమో జన్మతపోవిద్యాచారవర్ణాశ్రమవతో వరీయసో న బహుమన్యేత స మృతక ఏవ మృత్వా క్షారకర్దమే నిరయే అవాక్శిరా నిపాతితో దురన్తయాతనా హ్యశ్నుతే ॥ 30

ఈ ప్రపంచమున తన్నుతాను గౌరవించుకొను వ్యక్తి తానధముడయ్యు "నేను గొప్పవాడ" నను మిథ్యాహంకారముతో తనకంటెను జన్మ, తపస్సు, విద్య, ఆచారము, వర్ణము, ఆశ్రమము మున్నగు పదవుల యందు సంపూర్ణముగ శ్రేష్ఠుడైన వానిని గౌరవింపడు. అట్టివాడు జీవన్మృతుడగును. ఇంకను మరణించిన పిమ్మట యమదూతలు వానిని అధోముఖునిగ జేసి "క్షారకర్దమ" మను నరకమున బడవేయుదురు. అచట అతడు మిగుల దుఃఖయాతనల ననుభవించును.

యే త్విహ వై పురుషాః పురుషమేధేన యజన్తే యాశ్చస్త్రియో నృపశూన్ ఖాదన్తి తాంశ్చతాశ్చ తే పశవ ఇవ నిహతా యమసదనే యాతయన్తో రక్షోగణాః సౌనికా ఇవ స్వధితినా వదాయాసృక్ పిబన్తి నృత్యన్తి గాయన్తి చ హృష్యమాణా యథేహ పురుషాదాః ॥ 31

ఈప్రపంచమున సంహరించులక్షణములు గల యజ్ఞములద్వారా భైరవభద్రకాళి మున్నగుదేవతల నారాధించి నరరూపపశువులను, స్త్రీలను భక్షించువారు మరణించినపిమ్మట

వారిచే ఆ చంపబడినపశువులు యమాలయమున రాక్షసులై ఘాతకునివలె పదునై నఖడ్గముద్వారా వారిని వధించును. ఈలోకమున పురుషమేధ మను యజ్ఞము చేయువారు నరరూపపశువుల రక్తమును పానముచేసి ఆనందముతో నృత్యగానముల నొనరించు చుందురు. ఆచంపబడినపశువు లన్నియు పరలోకమున ఆహింసకులరక్తమును పానము చేసి ఆనందముతో నృత్యగానముల నొనరించును.

**యే త్విహ వా అనాగసోఽరణ్యే గ్రామే వా వైశ్రమ్భకై రుపశ్రితాను పవిస్రభ్య జిజీవిషూన్ శూలసూత్రాదిషు ప్రోతాన్ క్రీడనకతయా యాతయన్తి తేఽపిచ ప్రేత్య యమయాతనాసు శూలాదిషు ప్రోతాత్మానఃక్షుత్తృడ్భ్యాం చాభి హతాః కంకవటాదిభి శ్చేతస్తతస్తిగ్మతుణ్డైరాహన్యమానా ఆత్మశమలం స్మరన్తి ॥ 32**

ఈలోకమున అమాయకపశువులు తమ బ్రతుకులను కాపాడుకొనుటకై గ్రామమును లేదా అరణ్యమును ఆశ్రయించినచో అట్టి అమాయకము లైనప్రాణులకు నానావిధము లగునుపాయములద్వారా నమ్మకమును కలిగించి శూల సూత్రాదులచేత పొడిచినవారు క్రీడాసామగ్రులవలె ఆడి వానికి యాతనలను గలుగజేయువారు పరలోకమున 'శూలప్రోత' మను నరకమునకు వెడలుదురు. అచట వారిదేహములు శూలాదులచే గ్రుచ్చుబడిన వై ఆకలిదప్పులచే పీడింపబడును. తీక్ష్ణములైన ముక్కులుగల కంకవటప్రభృతి పక్షులు వచ్చి వారిని పీడించును. ఇట్లు యమయాతనలచే నస్థిరు లై అపుడు తాము చేసిన పాపములను తలచుకొనుచుందురు.

**యే త్విహ వై భూతానుద్వేజయన్తి నరా ఉల్బణ స్వభావా యథా దన్దశూకాస్తేఽపి ప్రేత్యనరకే దన్దశూకాఖ్యే నిపతన్తి యత్ర నృప దందశూకాః పంచముఖాః సప్తముఖా ఉపసృత్య గ్రసన్తి యథా బిలేశయాన్ ॥ 33**

ఈలోకమున సర్పాదిదుష్టస్వభావము గలప్రాణులవలె క్రోధపరాయణు లై ప్రాణులను పీడించువారు పరలోకమున 'దందశూక' మను నరకమున బడుదురు. రాజా! ఈనరకమున పంచముఖములు, సప్తముఖములు గల సర్పములు వారిని మూషికములవలె గ్రసించును.

**యే త్విహ వా అన్ధావటకుశూలగుహాదిషు భూతాని నిరున్ధన్తి తథా ముత్ర తేష్వేవోపవేశ్య సగరేణ వహ్నినా ధూమేన నిరున్ధన్తి ॥ 34**

ఈలోకమున ప్రాణులను అంధకూపమునందు, కుశూలమునందు (తుషానలము నందు), గుహాదులయందు బంధించి పీడించువారు పరలోకమున 'అవటనిరోధ' మను

నరకమును పొందుదురు. అచట ఇట్టి అంధకూపాదులయందు విషమిశ్రిత మైన వహ్ని (అగ్ని) ద్వారా ధూమము ద్వారా శ్వాస నిరోధింపబడి యాతనల ననుభవింతురు.

యస్త్విహ వా అతిథీనభ్యాగతాన్ వా గృహపతి రసకృదుపగతమన్యుర్దిధక్షురివ పాపేన చక్షుషా నిరీక్షతే తస్య చాపి నిరయే పాపదృష్టేరక్షిణీ వజ్రతుణ్డా గృధ్రకంకకాకవటాదయః ప్రసహ్యోరుబలాదుత్పాటయన్తి ॥ 35

ఈలోకమున అతిథులను, అభ్యాగతులను జూచి మాటిమాటికి క్రుద్ధుడై, పాప కుటిలదృష్టిద్వారా వారిని దగ్ధముచేయుటకు ఉద్యుక్తు డగు గృహపతి 'పర్యావర్తన' మను నరకమున బతితుడగును. అచట వజ్రమువలె కఠినము లైనముక్కులతో గూడిన గ్రద్దలు, కాకులు, వటములు మున్నగుపక్షులు ఈపాపదృష్టి గల వ్యక్తియొక్కరెండుచక్షువులను బలవంతముగ బెరికివేయును.

యస్త్విహ వా ఆఢ్యాభిమతిరహంకృతి స్తిర్యక్ప్రేక్షణః సర్వతోఽభిశంకీ వ్యయవినాశచిన్తయా పరిశుష్యమాణ హృదయవదనో నిర్వృతిమనవగతో గ్రహ ఇవార్థమభిరక్షతి, స చాపి ప్రేత్య తదుత్పాదనోత్కర్షణరక్షణశమల గ్రహః సూచీముఖే నరకే నిపతతి । యత్ర హ విత్తగ్రహం పాపపురుషం ధర్మ రాజపురుషా వాయకా ఇవ సర్వతోఽఙ్గేషు సూత్రైః పరివయన్తి ॥ 36

ఇహలోకమున ధనమదమత్తుడై "నేను శ్రేష్ఠ" డనను అహంకారముచే వక్రదృష్టి గలవాడు, ధనము నపహరించు నను అనుమానముచే గురుజనులపట్లగూడ సందేహమును వెలిబుచ్చువాడు, ధనము నశించు నను భావనచే శుష్క మైనహృదయ వదనములుగలవాడు నగుమానవుడు ఎట్టి శాంతియు బొందజాలడు. పిశాచమువలె ధనమును సంపాదించుట, పెంచుట, రక్షించుట మున్నగు విషయములయందు మనస్సును ప్రవేశపెట్టును. ఆపాపముచే పరలోకమున "సూచీముఖ" మను నరకమున బడును. అచట యమదూతలు ఈ ధనపిశాచపాపియొక్క సర్వావయవములను సాలెవాని వలె సూత్రములతో (దారములతో) వేయుదురు.

ఏవంవిధా నరకా యమాలయే సన్తి శతశః సహస్రశస్తేషు సర్వేషు చ సర్వ ఏవాధర్మవర్తినో యే కేచిదిహోదితా అనుదితాశ్చావనిపతే పర్యాయేణ విశన్తి తథైవ ధర్మానువర్తిన ఇతరత్ర। ఇహ తు పునర్భవేతే ఉభయశేషాభ్యాం నిర్విశన్తి ॥ 37

పరీక్షిన్మహారాజా ! యమాలయము నిట్లు వందలు వేలునరకములున్నవి. ఇచట ఏ యధార్మికులవిషయము చెప్పబడినదో ఇంకను ఎవరిని గూర్చి చెప్పబడలేదో వారందఱు క్రమముగ ఈసమస్తనరకములలోనికి ప్రవేశింతురు. ధార్మికు లైనవారు స్వర్గాదు లైన పుణ్యమయలోకములకు వెడలుదురు. కాని పాపముగాని పుణ్యముగాని మిగిలివను మిగులకపోయినను మరల జన్మించుటకై ఈపృథివికి దిరిగివత్తురు.

**నివృత్తిలక్షణమార్గ ఆదావేవ వ్యాఖ్యాతః ఏతావానేవాణ్డకోషో యశ్చతు ర్దశధా పురాణేషు వికల్పిత ఉద్గీయతే। యత్తద్భగవతో నారాయణస్య సాక్షాన్మహాపురుషస్య స్థవిష్ఠం రూపమాత్మమాయాగుణమయమనువర్ణితమా దృతః పఠతి శృణోతి శ్రావయతి స ఉపగేయం భగవతః పరమాత్మనోఽ గ్రాహ్యమపి శ్రద్ధాభక్తివిశుద్ధబుద్ధిర్వేద ॥ 38**

నివృత్తిలక్షణమార్గమునుగూర్చి నేను ముందే వివరించితిని. పురాణములయందు బ్రహ్మాండగోళము పదునాలుగువిధములుగ వర్ణింపబడినది. అదియె సాక్షాత్తుగ మహాపురుషు డగు నారాయణభగవానుని ఆత్మమాయా గుణమయ మైన విరాడ్రూపముగా వర్ణితమైనది. శ్రద్ధాయుక్తు డైనవాడు భగవానుని ఈ స్థూలరూపమును శ్రద్ధాభక్తులతో వర్ణించినను, పఠించినను, శ్రవణముచేసినను, ఇతరులకు వివరించినను వానిచిత్తము క్రమముగ శుద్ధ మగును. ఉపనిషత్తులలో వర్ణింపబడిన భగవానునిస్థూలరూపము అగ్రాహ్య మైనను దాని తత్త్వము తెలిసికొనవచ్చును.

**శ్రుత్వా యథా స్థూలసూక్ష్మరూపం భగవతో యతిః।**
**స్థూలే నిర్జితమాత్మానం శనైః సూక్ష్మం ధియా నయేదితి ॥ 39**

నివృత్తిమార్గము ననుసరించు యతులు భగవానునిస్థూలసూక్ష్మరూపముల విషయములను శ్రవణముచేసి మొదట స్థూలరూపముయొక్క చింతనద్వారా మనస్సును వశపఱచుకొందురు. పిమ్మట బుద్ధిద్వారా మనస్సును మెల్లమెల్లగ సూక్ష్మరూపమునందు అనగా భక్తులుమాత్రమే పొందదగిన ఆయనరూపమునందు నిలుపవలెను. అనగా భక్తియోగము నవలంబింపవలెను.

**భూద్వీపవర్ష సరిదద్రినభః సముద్ర**
**పాతాలదిఙ్నరకభాగణలోకసంస్థా ।**
**గీతా మయా తవ నృపాద్భుతమీశ్వరస్య**
**స్థూలం వపుః సకలజీవనికాయధామ ॥ 40**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
పంచమస్కన్ధే నరకవర్ణనం నామ
షడ్వింశో౽ధ్యాయః ॥

రాజా! నేను (శుకమహర్షి) నీకు పృథివి, ద్వీపము, వర్షములు, నదులు, పర్వతములు, ఆకాశము, సముద్రములు, పాతాళము, దిక్కులు, నరకములు, నక్షత్రమండలము మున్నగులోకములస్థితిని వివరించిచెప్పితిని. ఇదియె సర్వప్రాణుల కాశ్రయ మైన పరమాద్భుత మైన భగవానుని స్థూల శరీరము.

ఇది బ్రహ్మ సూత్రభాష్యము, పారమహంస్య సంహి
తయు, వైయాసిక్యము నగు శ్రీమద్భాగవత మహా
పురాణ మందలి పంచమ స్కంధములో నరకవర్ణన
మను ఇరువది యాఱవ అధ్యాయము
సంపూర్ణము.





# పంచమస్కంధ శ్లోకానుక్రమణిక

## హ







షష్ఠ స్కంధము

# విషయసూచిక

శ్రీశ్రీగురుగౌరాంగౌ జయతః

# అవతరణిక

జీవులు అనావిలము, అకృత్రిమము, అత్యుత్తమమునగు ప్రేమ పురుషోత్తమునిపై కలిగి యున్నప్పుడే పరమశాంతిని పొందగలరు. పురుషోత్తముడగు శ్రీకృష్ణుని నామరూపగుణ లీలా మాధుర్యాస్వాదనమున జీవుడు నిమగ్నమై ఉండుటయే అట్టి ప్రేమకు పరాకాష్ఠస్థితి. అట్టి ప్రేమకు నిదర్శనము భాగవత దశమస్కంధములోని గోపికాభక్తి. అట్టి భక్తిని పరిశీలింపదలచినచో అనావిలమైన, అకృత్రిమమైన, అత్యుత్తమమైన చిత్తము కావలయును. దానికై సాధన అవసరము. భక్తియే సాధన. భగవంతుని గుఱించి చేయు శ్రవణ కీర్తన స్మరణాదులేభక్తి. భక్తి ఫలములు ఇవి :- 1) సాధుకృప 2) మహత్సేవ 3) శ్రద్ధ 4) గురుపాదాశ్రయము 5) భజన స్పృహ 6) భజనము 7) అనర్థాపగమము 8) నిష్ఠ 9) రుచి 10) ఆసక్తి 11) భావ భక్తి లేక రతి 12) ప్రేమభక్తి 13) కృష్ణదర్శనము 14) కృష్ణ మాధుర్యానుభవము. ఇందులో చివరకు చెప్పిన కృష్ణమాధుర్యానుభవమే పరాకాష్ఠ స్థితి. దానిని అందుకొను సాధనమును భాగవతషష్ఠస్కంధము మనకు తెలియచేయుచున్నది.

ఈ షష్ఠస్కంధము సాధనను తెలియజేయునప్పటికి ఇది శ్రీకృష్ణమాధుర్యాస్వాదనము కూడ అగుచున్నది. ఏలయన "కృష్ణతుల్య భాగవత విభుసర్వాశ్రయ" అని శ్రీచైతన్య చరితామృతము, "షష్ఠో భుజాంతరం" అని పద్మపురాణము.

**"అంగాని యస్య సకలేంద్రియ వృత్తిమంతి ।**
**పశ్యంతి, పాంతి, కలయంతి, చిరం జగంతి ।**
**ఆనంద చిన్మయ సదుజ్జ్వల విగ్రహస్య"**
**గోవిందమాది పురుషం తమహం భజామి ॥**

అని శ్రీబ్రహ్మసంహిత.

పై ప్రమాణములను బట్టి శ్రీమద్భాగవతము శ్రీకృష్ణునితో సమానమై విభుస్వరూపమై సర్వులకు ఆశ్రయమైయున్నది. ఈ షష్ఠస్కంధము భాగవత భగవానుని భుజాంతరము, అనగా వక్షఃస్థలమై యున్నది. శ్రీబ్రహ్మ సంహిత శ్లోకమును బట్టి శ్రీకృష్ణుని యే అంగమై నను అన్ని అంగములయొక్క వృత్తి అనగా మాధుర్యము గలదై ఉన్నది. దీనివలన శ్రీమద్భాగవతములోని ఏ స్కంధ మైనను విశుద్ధ జ్ఞానముతో నిండినదే. అన్నివిధములుగా పరిపూర్ణత్వము కలిగినదే. అట్లు గాక దీనిని భాగవత భగవానుని వక్షఃస్థలమని తలచినప్పటికిని అది మిక్కిలి ఉత్తమమైన అంగమేకదా! మిగిలిన అంగముల కంటె ఇది రహస్యమైనది. దీనిని ఆస్వాదింపదలచినచో కొంత ఆంతరంగికమైన భావము కలిగియుండవలెను. అనగా కడు శ్రద్ధతో పరిశీలింపవలెను.

ఈ షష్ఠస్కంధములోని అజామిళో పాఖ్యానము వలన జీవునకు ప్రేమభక్తి లేకపోయినచో వేదపఠనము, సదాచారము, దేవతార్చనము మున్నగునవి ప్రారబ్ధ కర్మమునుండి రక్షింప లేవనియు, భగవన్నామాభాసము కూడ అన్నివిధములైన పాపములను తొలగింప గలదనియు, పార్షదుల దర్శనము వలన భక్త్యున్ముఖి సుకృతి కలుగుననియు; యమ-యమదూతల సంవాదము వలన భగవన్నామోచ్చారణయే శ్రేష్ఠసాధనమనియు, అజామిళుడు హరి నామోచ్చారణ బలముచేతనే వైకుంఠమునకు వెడలెననియు, నామజపము జేయువారే వైష్ణవులనియు, వైష్ణవులు యమాధీనములో లేరనియు; దక్షుడు జేసిన హంసగుహ్యస్తవము వలన కోరికలతో గూడిన వారైనను విష్ణువునే ఆరాధింప వలెననియు,నారదుని కూట వాక్యమువలన మహాభాగవతుల ఉపదేశ వాక్యములు ఒక్కొక్కప్పుడు పరోక్షముగా ఉండుననియు, దానిని అర్థము చేసికొనగలిగినచో సంసార విముక్తి కలుగుననియు; దక్షుడు నారదుని శపించిన ఘట్టము వలన కర్మకాండీయులు ఏకాంత భక్తిని అంగీకరింప రనియు, మహాభాగవతులు తమకు కలిగిన శాపమును భగవంతుని సేవకు వినియోగింతు రనియు, ఇంద్ర - బృహస్పతి వ్యవహారము వలన గురువును గౌరవింపని వారికి గుర్వను గ్రహము లేనివారికి, గురుపౌరోహిత్యము లేని సత్కార్మానుష్ఠానము చేయువారికి కీడు కలుగకతప్పదనియు, అసుర స్వరూపమగు దుష్టేంద్రియములను జయింపలేరనియు, నారాయణ కవచ వర్ణన ఘట్టమువలన అన్ని వేళలయందు అన్ని పరిస్థితులందు భగవన్నామ స్మరణము చేయకలిగినచో సాధకుల హృదయమున దుష్టగుణములు రాకుండగా ఉండగల వనియు; వృత్రాసుర వధ ఘట్టమువలన అవిద్య లేక మాయాచక్రము భగవంతుని వలన సృష్టింపబడినప్పటికిని, జగత్సృష్టి విషయమున అది భగవానునకు చేదోడు వాదోడుగా ఉన్నప్పటికిని జీవుడు మాయాబంధములో నుండకూడదనియు; దధీచి మహాముని ఘట్టము; మాయను తొలగింపదలచినచో మహాభాగవతుల కృప అనెడు దృఢమైన స్నేహరసము చేతనే సంభవింపగలదనియు; వృత్రాసుర చరిత్రము వలన; ముక్త పురుషులగు మహాభాగవతులు ఎట్టి పరిస్థితిలో కూడ భగవంతుని మరచిపోకుండగా నుండగలరనియు ఇతరుల వలన వారికి కలిగిన శాపముగాని, సంతోషముగాని భగవంతుని కృపయే అని తలంతురనియు, అట్టివారు భోగములో గాని,వైరాగ్యములోగాని ,స్వర్గములోగాని, నరకములో గాని ఎక్కడైనను ఉండగలరనియు, ఎచ్చట నుండినను వారు భగవంతునే సేవింతురనియు, భగవంతుని ఇష్టానుసారముగా బ్రతుకుటగాని, మరణించుటకాని వారికి ఇష్టమే అనియు; దితి కశ్యప సంవాదము వలన అసదుద్దేశ్యమును సాధింప దలచి మహాభాగవతుల సాన్నిధ్యమునకు వచ్చినవారికీ వైష్ణవ వ్రతము జేయుటకు ఉపదేశింప వలెననియు, వైష్ణవ వ్రతముకూడ కడు శ్రద్ధానిష్ఠలతో చేయవలెననియు, వ్రతనైగుణ్యము కలిగినచో ఫల వైపరీత్యము కలుగుననియు, ఫలవైపరీత్యము కలిగినప్పటికి కూడ వైష్ణవ వ్రతము జేయు

వారికి చిత్తక్షోభము కలుగదనియు పయోవ్రతము వలన సాత్త్వికభావముతో భగవంతుని ఆరాధించినచో భగవంతునకు సంతృప్తి కలుగుననియు భగవంతుని కృప పొందినచో సర్వాభీష్టములు కలుగుననియు మనకు తెలియజేయుచున్నది.

భగవానుని అపారమైన కృపవలన శ్రీ శ్రీనృసింహదేవుని ఆవిర్భావ సమయమున భాగవత భగవానుని వక్షఃస్థలస్వరూపమైన భాగవత షష్ఠస్కంధావిర్భావము దర్శించి మిక్కిలి సంతసించుచున్నాము.

శ్రీ చైతన్యమఠ ప్రతిష్ఠాతలగు శ్రీ శ్రీలభక్తి సిద్ధాంత సరస్వతీఠాకూరులు వంగభాషలో వ్రాసిన దానిని శ్రీజన్నాభట్ల వాసుదేవశాస్త్రి (భాషాప్రవీణ) గారు సరళగ్రాంధిక భాష లోనికి అనువదించి ఆంధ్రపాఠకలోకమున కెంతయో ఉపకారము కలుగజేసినారు. వారికి శ్రీ శ్రీ రాధామాధవులు మాధుర్యభక్తిని ఇచ్చి పరమ సుఖమును కలిగించుదురుగావుత.

ఇట్లు,

గుంటూరు — బుధజన విధేయుడు,

2-5-1982 — శ్రీభక్తి విజయవిష్ణు

# విన్నపము

శ్రీమద్భాగవతము భగవానుని వాఙ్మయరూపము ఈ షష్ఠస్కంధము భగవానుడైన ఆ శ్రీకృష్ణుని భుజాంతరము అనగా వక్షస్థలము "షష్ఠో భుజాన్తరమ్ ".

ఈ స్కంధమున అజామిళోపాఖ్యానము,దక్షవంశ విస్తారము, నారాయణ కవచము, విశ్వరూపవధ, దధీచిఋషి యస్థికలతో నిర్మితమైన వజ్రాయుధముచే నింద్రుడు వృత్రాసురుని సంహరించుట, వృత్రాసురుని పూర్వచరితము, మరుద్గణ జననము, పుసంవన వ్రతవిధి మున్నగు విషయములు వర్ణింప బడినవి.

జ్ఞానమార్గావలంబి కావచ్చు; భక్తి మార్గావలంబి కావచ్చు, ఎవ్వరైనను పరమాత్ముని మంగళమయమైన నామమును జపింపవలసినదే, ఏ యొక్క సాధనయందు మనస్సును స్థిరపఱచినను మానసికశక్తి వృద్ధిపొందును. ధ్యానము, అర్చనము, నామము అనునీ మూడు సాధనముల సాహాయ్యముచే పాపము నశింపగలదు. ఈ మూడింటిచే భక్తి దృఢపడును.

భగవానుని నామమే పరమాత్మయొక్క స్వరూపము. నామము నాశ్రయించిన పాపములు నశించును. దీనికి దృష్టాంతము అజామిళుడే. దుష్టుడైన అజామిళుడు భగవన్నామము నాశ్రయించుటచే కృతార్థుడయ్యెను. 'అజా' అనగా మాయ. మాయలో చిక్కుకొనిన జీవుడు అజామిళుడు పాపి యగు అజామిళుడు అంత్యకాలమున యమదూతలను చూచి భయపడి తనపుత్రుడైన నారాయణుని పిలచెనుగాని వైకుంఠవాసియైన విష్ణువును పిలువలేదు. అయినను విష్ణుదూతలు వచ్చి వానిని యమదూతలనుండి విడిపించిరి.

విష్ణుదూతలు యమదూతలకు భగవన్నామోచ్చారణ మహిమను చాలగొప్పగా చెప్పిరి.

**సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా**
**వైకుంఠనామగ్రహణమశేషాఘహారం విదుః ।**
**పతితః స్ఖలితో భగ్నః సన్దష్టస్తప్త ఆహతః**
**హరిరిత్యవశేనాహ పుమాన్నార్హతి యాతనాః ॥**

అజామిళుడు 'నారాయణా! నారాయణా!' అని యుచ్చరించి తననాలుకను, తన జీవితమును ధన్యత పఱచుకొని మాయనుండి విముక్తుడై భగవద్ధామమునకు జేరికొనినాడు.

ఇంద్రుడు గురుతిరస్కారమువలన శ్రీ హీనుడయ్యెను. బ్రహ్మదేవుని యాదేశము ననుసరించి దేవతలు విశ్వరూపుని గురువుగా వరించిరి. ఆయన ఉపదేశించిన నారాయణ కవచముచే దేవతలు రాక్షసులపై విజయమును పొందిరి.

యోధులు యుద్ధమునకు వెడలునప్పుడు లోహనిర్మిత మైన కవచమును ధరింతురు. ఈ నారాయణ కవచము మంత్రాత్మకమైన కవచము. ఈ మంత్రమును జపించువాడు మొదట అంగన్యాసకర న్యాసముల నొనర్పవలెను. పిమ్మట ఈ మంత్రమును జపింపవలెను. భయము కలిగినప్పుడు ఈకవచమును శ్రవణము చేసినవాడు లేదా శ్రద్ధతో దీనిని పఠించిన వాడు సర్వలోక పూజ్యుడు, సర్వభయవిముక్తుడునగును. సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు వగు శ్రీహరి భగవానుడు ఎల్లప్పుడు, అన్నిచోట్ల, సర్వరూపములతో మనలను రక్షించును. ఇది భారతీయుల విశ్వాసము. నేటికిని ఆస్తికులైన భారతీయులు ఈ కవచమును ప్రతి నిత్యము పఠించునటుల కానవగును. ఈ కవచము ఈ స్కంధములోని యెనిమిదవ అధ్యాయమున గలదు.

సకామ కర్మలలో ఏ మాత్రము లోపము కలిగినను విపరీతఫలము కలుగును. యజ్ఞమంత్రములలో స్వరలోపము కలుగుటవలననే ఇంద్రుని సంహరించు పుత్రునకు బదులుగ ఇంద్రునిచే సంహరింపబడు పుత్రుడు జన్మించినాడు. వాడే వృత్రాసురుడు. పరమాత్మను ప్రసన్నము చేసికొనుటకు కర్మ చేయవలెను. నిష్కామకర్మలో లోపము కలిగినను దోషము లేదు. భాగవతగర్మమున కర్మకాండ నిందింపబడినది.

ఆ వృత్రాసురుని సంహరించుటకు దేవతలకు బలమైన ఆయుధము కావలసివచ్చినది. భగవదాదేశముచే వారు బ్రహ్మనిష్ఠుడైన దధీచిమహర్షి కడకు వెడలి ఆయనయెముకల నీయవలసినదిగా ప్రార్థించిరి. ధర్మరక్షణమునకంటె కావలసినది యికయేమున్న దనితలంచి దధీచిమహర్షి దేవతలకై తన శరీరమును త్యజించెను. భగవానుడు తన దివ్యతేజస్సును వజ్రాయుధమున ప్రవేశపెట్టెను. తచ్ఛక్తి యుక్తమైన వజ్రాయుధముతో ఇంద్రుడు వృత్రాసురుని సంహరించెను.

త్రాసదాయక మైనవృత్తియే వృత్రాసురుడు. వృత్తులు అంతర్ముఖమైనచో భగవానుడు లభించును. వృత్తుల బహిర్ముఖత్వము దుఃఖదాయకము, త్రాసదాయకము నగును. బహిర్ముఖ వృత్తులను జ్ఞాన మనుఖడ్గముచే ఛేదింపవలెను.

వృత్రాసురుడు గొప్ప భక్తుడు. ఇంద్రునిచేతిలో నున్న వజ్రాయుధములో నారాయణు డున్నాడు. కాని యింద్రునకు కనబడుటలేదు. వృత్రాసురునకు కనబడుచున్నాడు. ఇంద్ర వృత్రాసురుల సంభాషణము చాలవిశిష్టమైనది. వృత్రాసురుడు శ్రీహరినిస్తుతించినాడు. ఈ స్తుతిని వైష్ణవగ్రంథములు గొప్పగ ప్రశంసించినవి. ఈస్తుతిలోని మూడవ శ్లోకమును పెక్కెంద్రు మహాత్ములు తమకిష్టమైన శ్లోక మనితలంచిరి. ఈ స్తుతి 11వ అధ్యాయమున 24-27 శ్లోకములలో గలదు. దీనిలో మొదటి శ్లోకమున వృత్రాసురుని శరణాగతి, రెండవ శ్లోకమున వాని వైరాగ్యము, మూడవ శ్లోకమున ప్రార్థన వర్ణింపబడినవి. ఈస్తుతి యైనతరువాత ఇంద్రుడు వృత్రాసురుని సంహరించినాడు. వాని తేజస్సు భగవానుని పొందినది. భగవానుడు వానిపై పూర్తి కృప జూపెను.

వృత్రాసురుడు పూర్వజన్మమున చిత్రకేతు వనురాజు. వానిభార్య కృతద్యుతి. వారికెట్టి సంతానము లేదు. ఇచట శబ్దార్థమునుగాక లక్ష్యార్థమును గ్రహింపవలెను. చిత్ర విచిత్ర కల్పనలు చేయువాడు చిత్రకేతువు. బుద్ధియే కృతద్యుతి. మనస్సు అనేక విషయములను గూర్చి ఆలోచించుచుండను. ఆవిషయాకారస్థితిలో చిత్రకేతువు ఉన్నాడు. విషయవాసనా వాసితుడగు చిత్రకేతువు నిర్వికారులైన పార్వతిపరమేశ్వరులను దూషించెను. ఇట్లు లౌకిక దృష్టితో చూచుటచే చిత్రకేతువు పతనుడయ్యెను. చిత్రకేతువు వృత్రాసురునిగా జన్మించి భగవద్భక్తి కలిగి పరమాత్మను పొందెను.

తన యిరువురు పుత్రులు మరణించుటచే దితి ఇంద్రుని చంపుటకు వ్రతము చేసినది. కశ్యపుడు దితికి యొకసంవత్సరము జరుగువ్రతము నుపదేశించెను. అదియే పుంసవనవ్రతము.

చంచల మగుమనస్సును భగవానునియందు స్థిరపఱచు సాధనయే వ్రతము. దితి వ్రతమును చేసినది కాని నియమములను పాటింపలేదు. దానివలన మరుద్గణములు జన్మించిరి. పుంసవనవ్రతవిధి మాహాత్మ్యములతో నీస్కంధము సమాప్తమయ్యెను.

ఈస్కంధమున పందొమ్మిది అధ్యాయములు, 853 శ్లోకములు గలవు. వెనుకటి స్కంధములలోవలె దీనిలోగూడ మొదట స్కంధకథాసారము, అధ్యాయ కథాసారము, పిమ్మట ప్రతిశ్లోకమునకు తెనుగు తాత్పర్యము వ్రాయబడినది. పుస్తక ప్రారంభమున వ్యాసమహర్షి కృతబ్రహ్మ సూత్రములలో 46సూత్రములు, వానికి వ్యాఖ్యానరూపములైన 62 షష్ఠస్కంధ శ్లోకములు ప్రత్యేకముగ నీయబడినవి.

నా యీ యనువాదము ప్రభుపాద శ్రీలభక్తిసిద్ధాంత సరస్వతీగోస్వామి వారి వంగాను వాదము ననుసరించిసాగినది. నిత్యలీలా ప్రవిష్టులగు ఓం విష్ణుపాద శ్రీశ్రీమద్భక్తి విలాసతీర్థ గోస్వామి మహారాజుగారి యనుగ్రహ పాత్రులగు త్రిదండి స్వామి శ్రీభక్తికమల పద్మనాభ మహారాజు,త్రిదండిస్వామి శ్రీభక్తి విజయవిష్ణు మహారాజు, త్రిదండిస్వామి శ్రీ భక్తిసుధీర దామోదర మహారాజుగార్ల ప్రోత్సాహముచే నా కీ భాగవతసేవా భాగ్యము లభించినది. పై వారందఱకు సాష్టాంగ దండప్రణామములు. శ్రీభక్తి విజయవిష్ణు మహారాజుగారు ముద్రణకు పూర్వము నా యీ యనువాదమును శ్రద్ధగ విని అచ్చటచ్చట తగుసలహాల నిచ్చియున్నారు. వారికి నానమస్సుమముల నర్పించుచున్నాను.

ఇట్లు

గుంటూరు — భాగవతసేవాభిలాషి

1-5-1982 — జన్నాభట్ల వాసుదేవశాస్త్రి

# బ్రహ్మసూత్రములు-వానికి వ్యాఖ్యానరూపములైన షష్ఠస్కంధములోని శ్లోకములు

1) **అనుపపత్తేస్తు న శరీర: (1-2-3)**
విజ్ఞాప్య పరమగురో: కియదివ సవితురివ ఖద్యోతై: (16-46 తృ.పా.)

2) **కర్మకర్తృం వ్యపదేశాచ్చ (1-2-4)**
యం వై శ్వసన్తమను విశ్వసృజ: శ్వసన్తి (16-48)
ఏతావనేవ మనుజైర్యోగనైపుణ్యబుద్ధిభి: (16-63)

3) **ప్రకరణాచ్చ (1-2-10)**
దురవబోధ ఇవ తవాయం విహారయోగో (9-33)

4) **ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్ (1-3-1)**
తవ విభవ: ఖలు భగవాన్ (16-35)
పరమాణుపరమమహతో (16-36)

5) **ముక్తోపసృప్య వ్యపదేశాత్ (1-3-2)**
నిష్కించనా యే మునయ (16-40 తృ.పా.)

6) **నానుమానమతచ్ఛబ్దాత్ (1-3-3)**
అహం వై సర్వభూతాని భూతాత్మా భూతభావన: (16-51)

7) **ప్రాణభృచ్చ (1-3-4)**
లోకే వితతమాత్మానం లోకంచాత్మని సన్తతమ్. (16-52)

8) **భేదవ్యపదేశాచ్చ (1-3-5)**
యదేత్ విస్మృతం పుంసో మద్భావం భిన్నమాత్మన:. (16-57)

9) **ప్రకరణాత్ (1-3-6)**
యస్మిన్నిదం యతశ్చేదం తిష్ఠత్యపేతి జాయతే. (16-22)

10) **కంపనాత్ (1-3-39)**
అథేన్ద్రో వజ్రముద్యమ్య నిర్మితం విశ్వకర్మణా (10-13)
వజ్రేణ వజ్రీ శతపర్వణాచ్ఛినత్ (12-3 తృ.పా.)
భూషణాయుధలింగాఖ్యా ధత్తేశక్తీ: స్వమాయయా (8-32 తృ.పా.)
యథా దారుమయీ నారీ యథా పత్రమయీమృగ: (12-10)
లోకా: సపాలా యస్యేమే శ్వసన్తి వివశావశే. (12-8)

11) **జ్యోతిర్దర్శనాత్ (1-3-40)**
నన్వేష వజ్రజన్తవ శక్రతేజసా. (11-20)
12) **అకాశో౽ర్థాన్తరత్వాదివ్యపదేశాత్ (1-3-41)**
అనామరూపశ్చిన్మాత్రః సో౽వ్యాన్నః సదసత్పరః (16-21 తృ.పా.)
యన్న స్పృశన్తి నవిదుర్మనో బుద్ధీన్ద్రియాసవః (16-23)
13) **ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః (1-4-28)**
సవై మమాశేషవిశేషమాయా (4-28)
14) **న విలక్షణత్వాదయస్య యథాత్వం చశబ్దాత్ (2-1-4)**
వేదప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్విపర్యయః । (1-40)
యేన స్వధామ్న్యమీభావా రజః సత్త్వతమోమయాః । (1-41)
15) **భోక్తృపత్తేరవిభాగశ్చేత్ స్యాల్లోకవత్ (2-1-13)**
ఏష నిత్యో౽వ్యయః సూక్ష్మ ఏష సర్వాశ్రయః స్వదృక్. (16-9)
న హ్యస్యాస్తి ప్రియః కశ్చిన్నాప్రియః స్వపరో౽పి వా. (16-10)
నాదత్త ఆత్మా హి గుణం నదోషం న క్రియాఫలమ్ (16-11)
16) **తదనన్యత్వమారమ్భణ శబ్దాదిభ్యః (2-1-14)**
యస్మిన్నిదం యతశ్చేదం తిష్ఠత్యప్యేతి జాయతే । (16-22)
17) **పటవచ్చ (2-1-19)**
పరో మదన్యో జగతస్తస్థుషశ్చ । (3-12)
18) **కృత్స్నప్రసక్తిర్నిరవయవశబ్దహ్యాకోపోవా (2-1-26)**
ఏవం యోనిగతో జీవః స నిత్యో నిరహంకృతః । (16-8)
ఏష నిత్యో౽వ్యయః సూక్ష్మ ఏష సర్వాశ్రయః స్వదృక్ । (16-9)
దేహేన్ద్రియప్రాణమనో ధియో౽మీ । (16-24)
19) **శ్రుతేస్తు శబ్దమూలత్వాత్ (2-1-23)**
శబ్దబ్రహ్మ పరంబ్రహ్మ మమోభే శాశ్వతీ తనూ । (16-51 తృ.పా.)
20) **స్వపక్షే దోషాచ్చ (2-1-29)**
యస్మిన్ యతో యేన చ యస్య యస్మై । (4-30)
21) **న ప్రయోజనవత్వాత్ (2-1-32)**
న తస్య కశ్చిత్ దయితః ప్రతీపో । (17-22)

2) ఉభయథాఽపి న కర్మాతస్తదభావః (2-2-12)
పరమాణుపరమమహతో (16-36)

3) నైకస్మిన్నసంభవాత్ (2-2-33)
అస్తీతి నాస్తీతి చ వస్తునిష్ఠయో (4-32)

24) అన్యావస్థితేశ్చోభయనిత్యత్వాదవిశేషాత్ (2-2-36)
యథా వస్తూని పణ్యాని హేమాదీని తతస్తతః (16-6)

25) యావద్వికారన్తు విభాగో లోకవత్ (2-3-6)
యస్మిన్ యతో యేన చ యస్య యస్మై । (4-30)

26) అసంభవస్తు సతోఽనుపపత్తేః (2-3-8)
అహమేవాసమేవాగ్రే నాన్యత్ కించాన్తరం బహిః । (4-47)

27) నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః (2-3-16)
ఏష నిత్యోఽవ్యయః సూక్ష్మ ఏష సర్వాశ్రయః స్వదృక్ । (16-9)

28) జ్ఞత ఏవ (2-3-17)
ఏకః సర్వధియాం ద్రష్టా కర్తౄణాం గుణదోషయోః । (16-10 తృ.పా.)

29) ఉత్క్రాన్తిగత్యాగతీనాం (2-3-18)
ఏష నిత్యోఽవ్యయః సూక్ష్మః (16-9)
యథా వస్తూని పణ్యాని హేమాదీని తతస్తతః । (16-6)
ఏవం యోనిగతోజీవః స నిత్యోనిరహంకృతః । (16-8)

30) నాణురతచ్ఛ్రుతేరితి చేన్నేతరాధికారాత్ (2-3-20)
ఏష నిత్యోఽవ్యయః సూక్ష్మః । (16-9)

31) పృథగుపదేశాత్ (2-3-26)
యదేతత్ విస్మృతం పుంసో మద్భావం భిన్నమాత్మనః । (16-57)

32) నిత్యోపలబ్ధిఅనుపలబ్ధిప్రసంగోన్యతరనియమో వాన్యథా (2-3-30)
ఏష నిత్యోఽవ్యయః సూక్ష్మ । (16-9)

33) కర్తా శాస్త్రార్థవత్వాత్ (2-3-31)
న హ్యస్యాస్తి ప్రియః కశ్చిన్నాప్రియః స్వఃపరోఽపి వా । (16-10)

34) విహారోపదేశాత్ (2-3-32)
నాదత్త ఆత్మా హి గుణం న దోషం న క్రియా ఫలమ్ । (16-11)

35) **అనుజ్ఞాపరిహారౌ దేహసమ్బన్ధాత్ జ్యోతిరాదివత్**
యదేతద్విస్మృతం పుంసో మద్భావభిన్నమాత్మనః । (16-57)
లబ్ధ్వేహ మానుషీం యోనిం జ్ఞానవిజ్ఞానసంభవామ్ । (16-58)

36) **ఆభాస ఏవ చ (2-3-48)**
విజ్ఞాప్యం పరమగురోః కియదివ (16-46 తృ.పా.)

37) **ప్రాణవతా శబ్దాత్ (2-4-15)**
దేహోఽసవోఽక్షామనవో (4-25)

38) **సన్ధ్యే సృష్టిరాహహి (3-2-1)**
యేన ప్రసుప్తః పురుషః స్వాపంవేదాత్మనస్తదా । (16-55)

39) **తదభావోనాడీషు తచ్ఛ్రుతేరాత్మని చ (3-2-7)**
యేన ప్రసుప్తః పురుషః స్వాపం వేదాత్మనస్తదా । (16-55)

40) **ముగ్ధేఽర్థసంప్రాప్తిః పరిశేషాత్ (3-2-10)**
ఏవం విపర్యయం బుద్ధ్వా నృణాం విజ్ఞాభిమానినామ్ । (16-61)
దృష్టశ్రుతాభిర్మాత్రాభిర్నిర్ముక్తః స్వేన తేజసా । (16-62)

41) **అత ఏవ చోపమా సూర్యకాదివత్ (3-2-18)**
విదితమనన్తసమస్తం తవ జగదాత్మనో । (16-46)

42) **అధ్యయనమాత్రవత : (3-4-12)**
వృణీమహే త్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం గురుమ్ । (7-32)

43) **ఆతివాహికాస్తల్లింగాత్ (4-3-4)**
విశమ్య మ్రియమాణస్య ముఖతో హరికీర్తనమ్ । (1-30)

44) **వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః (4-3-6)**
విశమ్య మ్రియమాణస్య ముఖతో హరికీర్తనమ్ । (1-30)

45) **విశేషం చ దర్శయతి (4-3-16)**
అథైనం మాపనయత కృతాశేషాఘనిష్కృతమ్ । (2-13)

46) **ఆత్మా ప్రకరణాత్ (4-4-3)**
ఏష నిత్యోఽ వ్యయః సూక్ష్మ ఏష సర్వాశ్రయః స్వదృక్ । (16-9)



# షష్ఠస్కంధ కథాసారము

శ్రీమద్భాగవతమున సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతి, మన్వంతరకథ, ఈశానుకథ, విరోధము, ముక్తి, ఆశ్రయము - అనుపదివిషయములు వివరింపబడినవి. వానిలో వెనుకటి స్కంధములలో సర్గము, విసర్గము, స్థానము అనునవి వర్ణింపబడినవి. ఈ స్కంధమున పోషణము వివరింపబడినది.

పరీక్షిన్మహారాజు - " ఏ ఉపాయముచే జీవుడు నరక యాతనలనుండి బయటపడగల" డనియడుగగా శ్రీశుక మహర్షి పలికెను - ఇహకాలమున మనోవాక్కాయముల ద్వారా పాపముచేసి జీవులు ఈ జన్మమునందే వానికి తగినవిధముగ ప్రాయశ్చిత్తము చేసికొననిచో మరణించిన పిమ్మట ఈ పాపకర్మ ఫలముచే నరకములో బడి యాతనలను పొందును. కర్మజ్ఞాన మార్గముల యందలి వివిధ ప్రాయశ్చిత్తములద్వారా పాపములు నశించినను పాపమూల మగు అవిద్య నశింపక పోవుటచే మరల పాపమునందు ప్రవృత్తి కలుగును. వాసుదేవుని యందలి భక్తి యోగప్రభావముచేతనే అది సమూలముగ ధ్వంసమగును. ఒక్కమారైనను కృష్ణునియందు మనస్సు నర్పింపగలిగినవానికి ఇక యముడుగాని, యమదూతలుగాని కనబడరు. ఆ విషయమున నొకకథ వినబడుచున్నది. కాన్యకుబ్జవాసి యగు అజామిళుడను బ్రాహ్మణుడు వేదనిష్ఠుడు, సదాచార సంపన్నుడు అయ్యును, ప్రాక్తనకర్మఫలముచే నొకశూద్రస్త్రీయం దాసక్తుడై సదాచారభ్రష్టుడయ్యెను. మరణ సమయమున అజామిళుడు యమదూతలను జూచి భయపడి తన కాశూద్రస్త్రీ యందు జన్మించిన పదుగురు పుత్రులలో కడపటి కొమరుని 'నారాయణా' యని పిలచుటచే వానికి ఏసాంకేత్యనామాభాసము కలిగెనో దానివలన విష్ణుదూతలు అచటికి వచ్చి వానిని యమదూత పాశములనుండి విడిపించిరి. యమదూతలు విష్ణుదూతలను అజామిళునకు యమ దండనము కలుగకపోవుటకు గల కారణ మడుగగా వారు (విష్ణుదూతలు) ఇట్లు సమాధాన మొసంగిరి - నారాయణుని నామాభాసముచే బ్రాహ్మణుని కోటిజన్మలలోని పాపములకు ప్రాయశ్చిత్తము కలిగినది. శాస్త్రవిహితములైన ప్రాయశ్చిత్తములద్వారా పాపములకు శాంతి కలిగినను దానివలన పాపి యొక్క పాపప్రవృత్తి తొలగదు. కాని హరినామాభాసముచే పాపమూలము పెకలింపవేయబడగా హృదయము విశుద్ధమగును. అజామిళుడు ఈ దూతలు పరస్పరము మాటలాడుకొనుచున్న మాటలు విని ధర్మతత్త్వము నెరింగి తా నొనరించిన వెనుకటి పాపములకై పశ్చాత్తాపము చెందుచు హరిద్వారక్షేత్రమునకు వెడలి యేకాంత భక్తియోగసమాధియందు నిమగ్నుడయ్యెను. అపుడు వెనుక కనబడిన విష్ణుదూతలు అచటికి వచ్చి వానిని సువర్ణవిమానమున నెక్కించుకొని విష్ణులోకమునకు దీసికొని వెడలిరి.

యమదూతలు యమునకు సమస్తవృత్తాంతమును జెప్పి యెవరు యమదండనమున కర్హులు, ఎవరు అనర్హులు అనువిషయమును పూర్తిగ తెలియజెప్పవలసిన దని ప్రార్థింపగా యముడు చెప్పనారంభించెను. "సనాతనధర్మము మిగుల నిగూఢమైనది. దానిని భగవానుడు, తద్భక్తులు తప్ప యితరు లెవ్వరును ఎరుంగజాలరు. పండ్రెండుగురు మహాత్ములమైన మేము భగవత్కృపచేతనే ఆతత్త్వమును కొలదిగ నెఱుంగగల్గితిమి. నిరపరాధముగ నామసంకీర్తనముచేయుటయే సర్వ శ్రేష్ఠధర్మము. హరిభక్తు లెప్పుడును యమదండనమున కర్హులుగారు. ఒక్కమారయినను నిష్కపటముగ భగవన్నామమును శ్రవణము, కీర్తనము, స్మరణము చేయనివారు, శ్రీహరికి నమస్కరింపనివారు, గృహాసక్తులు నగువ్యక్తులే యమదండనమునకు అర్హులు. నిరపరాధముగ అసంపూర్ణమైన శ్రీహరి నామోచ్చారణము చేసినంత పాపహరణము బహుకష్ట సాధ్యములైన కర్మాదులు గూడా చేయజాలవు. అజామిళుడు దానికి దృష్టాంతము."

శుకమహర్షి పరీక్షిత్తుని ప్రార్థన ననుసరించి మరల జీవసృష్టి విషయమును వర్ణించుచు నిట్లు పలికెను. ప్రజాపతి యగు దక్షుడు ప్రజాసృష్టికై 'హంసగుహ్య' మను స్తోత్రముద్వారా శ్రీహరిని సంతుష్టి పఱచగా ఆయన ప్రజాపతిని 'అసిక్ని' యను కన్యను పరిణయ మాడవలసిన' దని యాదేశించి అంతర్హితుడయ్యెను. దక్షప్రజాపతి పదివేలమందిపుత్రులను గని వారిని ప్రజాసృష్టి చేయవలసిన దని ఆదేశింపగా పుత్రులు నారాయణసరమను తీర్థమున తపస్సు చేయ వెడలిరి. అచట దేవర్షి యగు నారదుని యుపదేశముచే వారు ప్రజాసృష్టి ప్రయత్నమును విరమించి పారమహంస్యధర్మమున అనురాగము గలవారైరి. పుత్రులు కనబడకపోవుటచే దక్షుడు దుఃఖించి మరల వేయి మంది పుత్రులను గని వారిని ప్రజాసృష్టి చేయవలసినదిగా ఆదేశించెను. వారుగూడ తమజ్యేష్ఠ సోదరుల మార్గము ననుసరించి శ్రీవిష్ణ్వారాధనమున నియుక్తులైరి. ఈ వార్తను విని దక్షుడు దేవర్షిని నిందించి "నీకు లోకములో నెక్కడను స్థానము లభింపకుండుగాక" యనిశపించెను.

దక్షుడు అఱువదిమంది పుత్రికలనుగని వారిని చంద్రుడు, కశ్యపుడు, ధర్ముడు, మున్నగువారి కొసంగెను. ఆకన్యకలవలననే దేతలు, దానవులు, మనష్యులు, నాగులు, పశువులు, పక్షులు మున్నగు అసంఖ్యజీవు లుత్పన్నులగుటచే వారిద్వారా విశ్వము నిండి పోయెను.

ఒకనాడు దేవరా జగు నింద్రుడు శచీదేవితో సురసింహాసనమున గూర్చుండియుండెను. అట్టి సమయమున దేవ గురువగు బృహస్పతి అచటికి వచ్చెను. కాని ఐశ్వర్యమదమత్తు డగు నింద్రుడు వాని నేవిధముగను గౌరవింపకపోవుటచే బృహస్పతి సభను విడచి వెడలిపోయెను. గురుతిరస్కారముచే ఇంద్రుడు కొలదికాలములోనే దైత్యులతోడి యుద్ధమున

పరాజితుడై సింహాసనమును విడువవలసి వచ్చెను. ఇంద్రుడు చివరకు త్వష్టతనయు డగు విశ్వరూపుని పురోహితునిగా వరించి వాని యనుగ్రహముచే నారాయణకవచమును బొంది మరల దేవ సింహాసనమును స్వాధీనము చేసికొనెను.

పురోహితు డగు విశ్వరూపుడు రహస్యముగ అసురులకు యజ్ఞభాగముల నొసంగుట ఎరింగి ఇంద్రుడు వానిమస్తకమును ఛేదించెను. తనకు గలిగిన ఈ బ్రహ్మహత్యా పాపమును భూమికి, జలమునకు, వృక్షములకు,స్త్రీలకు పంచెను. విశ్వరూపునితండ్రి యగుత్వష్ట ఇంద్రవధ వాంఛతో యజ్ఞము నొనరించెను. కాని స్వరక్రమాదులు వ్యతిక్రమ మగుటచే ఫలము విపరీతమయ్యెను. అతడు ఇంద్రుని శత్రువు వృద్ధిపొందవలెనని కాంక్షించెను. కాని యింద్రు డెవరికి శత్రువో ఆ వృత్రాసురుడు పుట్టెను. వృత్రాసురుని ప్రభావముచే తేజోవిహీనులై దేవతలు భగవానుని శరణుపొందగా ఆయన వారిని దధీచి ముని కడకు వెడలి వానిదేహము నడుగవలసినది యని యాదేశించెను. ఆదధీచిముని యొక్క యెముకచే నిర్మిత మైన వజ్రాయుధముచే వృత్రాసురుడు నిహతుడయ్యెను.

వృత్రాసురుని వధించి ఇంద్రుడు బ్రహ్మహత్యా పాపముచే సుఖపడనివాడై దానినుండి విముక్తిపొందు నుపాయమునుగూర్చి యాలోచించుచు మానససరోవరము నందలి లక్ష్మీదేవికృపచే సంరక్షితుడై, వేయిసంవత్సరము లచ్చట నివసించెను. ఆసమయమున నహుషచక్రవర్తి ఇంద్రునకు ప్రతినిధిగా పనిచేయుచుండెను. కాని శచీదేవిని పొందవలయు ననెడి దుర్బుద్ధి వలన నతడు సర్పజన్మను పొందెను.

వృత్రాసురుడు పూర్వజన్మలో శూరసేనరాజయిన చిత్రకేతువు నామముతో విఖ్యాతు డయ్యెను. మొదట అతడు సంతానరహితుడయ్యెను. పిమ్మట అంగిరస మహర్షి వరముచే వాని మొదట భార్య కొక పుత్రుడు జన్మించెను. దానివలన వానియితరపత్నులు అనాదరింప బడినవారై బదులు తీర్చుకొనదలిచి విషమును ప్రయోగించి బాలుని సంహరించిరి. అపుడు రాజు పుత్రశోకముచే మిగుల కాతరుడయ్యెను. అపుడు అంగిరసమహర్షితో గలసి నారదమహర్షి వానికడకు వెడలి మరణించిన బాలుని పునర్జీవితునిగాజేసి చిత్రకేతువునకు జ్ఞానము కలుగుటకై ఆబాలుని ద్వారా జీవతత్త్వము నిట్లు వెల్లడి చేసెను. - "జీవాత్మ తనకర్మవలన నానావిధ జన్మల నెత్తు చుండును. దేహాదులవలన గలిగిన మాతాపితృ సంబంధము దేహత్యాగానంతరము జీవాత్మ మరియెవ్వరితోను ఎట్టి సంబంధమును కలిగి యుండదు. అందువలన దానికై శోకించుట తగదు". ఇట్లు తన మృతపుత్రునివలన తత్త్వోపదేశమును విని చిత్రకేతువు వాని పత్నులు శోకమును విడచిరి. నారదమహర్షి కృపచే మహారాజగు చిత్రకేతువు భగవత్తత్త్వమును దెలిసికొని యేడు దినములలో సంకర్షణదేవుని దర్శనమును పొందెను.

మహారాజగు చిత్రకేతువు ఒకసమయమున మునుల సభలో మహేశ్వరుడు పార్వతీదేవిని ఆలింగనము చేసికొని కూర్చుండియుండుట చూచి నవ్వెను. పరమహంస యగు మహేశ్వరునిపట్ల చిత్రకేతువు చేసిన అవమానమును జూచి పార్వతీదేవి కోపించి "చిత్రకేతూ! నీవు అసురకులమున జన్మింతువుగాక" యని శపించెను. చిత్రకేతువు పార్వతీదేవి యిచ్చిన శాపమునకు ఏమాత్రమును భయపడక ధైర్యముతో స్థిరచిత్తముతో నిట్లు పలికెను - "జీవుడు పూర్వజన్మకర్మఫలమువలననే ఉచ్చనీచము లగు జన్మల నెత్తుచుండును. ఒకడు మఱియొకని సుఖదుఃఖములకు కారణముకాడు". (ఈ చిత్రకేతువే పిమ్మట వృత్రాసురుని రూపమున జన్మించెను.) అదిచూచి ఆనందించి మహాభాగవతుడగు మహాదేవుడు భగవద్భక్తుల మాహాత్మ్యమును వర్ణించుసందర్భమున భగవద్భక్తులకు గల నిర్భయత్వము, శుద్ధభక్తులకు స్వర్గనరకముల పట్ల గల సమానభావము, ఈశ్వరాభిమానులగు దేవతలకు లభించు భగవత్స్వరూప ప్రభావము, చిత్రకేతువుతో తనకు గల అప్రాకృత బంధుత్వము, దానికై చిత్రకేతువు చేసిన పరిహాసములో గల గూఢ రహస్యము మున్నగు విషయములను పార్వతికి, ఇతరసభాసదులకు వివరించెను. పరమభక్తుడగు చిత్రకేతువు దేవిని శపించుటకు సమర్థుడయ్యును శపింపక ఆమె యొసంగిన శాపమును తలవంచి స్వీకరించెను. సాధువుల లక్షణము అట్లేయుండును.

మరల సృష్టివర్ణ ప్రసంగమున శుకుడు అదితి దితివంశ విస్తారమును వివరించెను. అదితి పుత్రులకు బహుసంతానము కలిగెను. దితికి హిరణ్యాక్షహిరణ్య కశిపులను నిరువురుపుత్రులు కలిగిరి. హిరణ్యకశిపునకు ప్రహ్లాదాదులు జన్మించిరి. హిరణ్యాక్ష హిరణ్యకశిపు లిరువురు విష్ణువుచేతిలో మరణింపగా దితి తన పుత్ర హత్యకు బదులు తీర్చుకొన సంకల్పించెను. ఈ హత్యకు మూలము ఇంద్రుడే యని భావించి దితి ఇంద్రుని సంహరించు పుత్రుని పొందుటకై కశ్యపుని సేవింపసాగెను. సేవకు సంతుష్టుడై కశ్యపుడు ఆమెకు కొన్ని నియమములతో పాటు సంవత్సరకాల వ్రతమును ధరింపవలసినదిగా ఉపదేశించి లోపము కలిగినచో విపరీతఫలము కలుగునని పలికెను. దితి వ్రతమును ధరింపగా రంధ్రాన్వేషియగు ఇంద్రుడు అదృష్టమువలన ఆమె వ్రతలోపమును లక్ష్యముగాజేసి యోగబలముతో నామె గర్భములో ప్రవేశించి గర్భస్థసంతానమును నలుబది తొమ్మిది ముక్కలుగా ఖండించెను. భగవదిచ్ఛచే దానివలనగూడ వారు జీవించియుండిరి. వారు ఇంద్రునకు శత్రువగుటకు బదులు వానికి మిత్రరూపమున నలువది తొమ్మండుగురు మరుత్తులుగా ప్రసిద్ధి కెక్కిరి.



శ్రీశ్రీ గురు గౌరాంగౌ జయతః

# శ్రీ మద్భాగవతము

# షష్ఠ స్కంధము

## మొదటి అధ్యాయము

### అజామిళోపాఖ్యానము ప్రారంభము

కథాసారము :- శ్రీమద్భాగవతమున సర్గము, విసర్గము మున్నగు పదివిషయములు వివరింపబడినవి. భాగవతవక్తయగు శ్రీశుకమహర్షి తృతీయ చతుర్థ పంచమ స్కంధములలో సర్గము, విసర్గము, స్థానము అను విషయములను వర్ణించి యీ స్కంధమున పందొమ్మిది అధ్యాయములలో 'పోషణ' మను దానిని వర్ణించుచున్నాడు. వానిలో నీయధ్యాయమున మహాపాపియగు అజామిళునిపాపమునుపోగొట్టుటకు నల్వురు విష్ణుదూత లేతెంచుట, యమదూతలతో ధర్మచర్చచేయుట, అజామిళుని పాపవృత్తాంతము మున్నగు విషయములు వివరింపబడినవి.

ఇహలోకపరలోకములు రెండును పాపమును, యాతనలను గలుగజేయునవియే. అందువలన సర్వవిధక్లేశములకు మూలస్వరూప మగుపాపము నశించుటకు కర్మమార్గమున నానావిధములగు ప్రాయశ్చిత్తాదులవ్యవస్థ కనబడును. కాని దానిద్వారా పాపము నశించినను పాపమూల మగుఅవిద్య నశింపదు. అందువలన ప్రాయశ్చిత్తాదులను జేసినను పురుషునిలో ఇంకను పాపాదిప్రవృత్తి కనబడుచునేయుండును. కావున ద్వాదశవార్షికవ్రతములు మున్నగు వానిని ముఖ్యప్రాయశ్చిత్తము లని చెప్పరాదు. జ్ఞానమార్గమున జ్ఞానమే ముఖ్యప్రాయశ్చిత్త రూపమున వివరింపబడినది.

కర్మిష్ఠులదృష్టిలో తపస్సు, బ్రహ్మచర్యము, శమము, దమము, దానము, సత్యము, యమనియమములు మున్నగు వానిద్వారా పాపబీజము భస్మమగును. జ్ఞానముచే పాప బీజము నశించును. కావున దీనిని ముఖ్యప్రాయశ్చిత్త మని చెప్పవచ్చును. కాని దానిద్వారా పాపమూల మగుఅవిద్య నశింపదు. వాసుదేవునిపై భక్తి కలిగియుండుటవలననే పాప మూలము అగు అవిద్య నశించునుగాని మఱియేయుపాయము చేతను నశింపదు. అందువలన శాస్త్రమున కర్మజ్ఞానముల కంటె భక్తికే శ్రేష్ఠత్వమున్నట్లు కనబడుచున్నది.

భక్తి మార్గమే పరమమంగళదాయక మైనది. ఈ మార్గమున విఘ్నాదులు కలుగునని శంకింపవలసినయవసరము లేదు. కర్మ జ్ఞానాదులు స్వతంత్రముగ నెట్టిఫలములను ఈయజాలవు. కాని భక్తి నిరపేక్షమైనది. అత్యల్పపరిమాణమున అనుష్ఠింపబడినను అది జీవుని పవిత్రము చేయగలుగును. ఒక్కమారైనను కృష్ణునిపాదపద్మములయందు మనస్సు నుంచినచో మానవునకిక స్వప్నమునందైనను యముడుగాని, యమదూతలుగాని కనుపించరు.

ఈ విషయమున ప్రమాణస్వరూపముగ అజామిళోపాఖ్యానము చెప్పబడుచున్నది. కాన్యకుబ్జదేశవాసియగు అజామిళుడు వేదనిష్ఠుడు, సదాచారసంపన్నుడు నగు బ్రాహ్మణుడై యుండియు ప్రాక్తనకర్మఫలము ననుసరించి యొకానొకశూద్ర స్త్రీయం దాసక్తుడై సదాచారభ్రష్టుడయ్యెను. ఆశూద్రస్త్రీవలన కలిగిన పదుగురుకుమారులలో చివరివానికి నారాయణుడను పేరుబెట్టెను. మరణసమయమున యమదూతలను జూచి భయముతో ప్రియపుత్రు డగు నారాయణుని పిలచుచుండగా విష్ణుస్మృతి ద్వారా దానికి సంకేతరూప మగునామాభాసము కలిగెను. నామోచ్చారణ శ్రవణమాత్రముచేతనే విష్ణుదూతలచటికి వచ్చి అజామిళుని బలవంతముగ యమదూతలహస్తములనుండి విడిపించిరి. యమ దూతలు విష్ణుదూతలు పరస్పరము సంభాషించుకొనుటవలన అజామిళుడు భాగవత ధర్మశ్రేష్ఠతను, కర్మమార్గముయొక్క నికృష్టతను హృదయంగమము చేసికొనెను.

## శ్రీపరీక్షిదువాచ

**నివృత్తిమార్గః కథిత ఆదౌ భగవతా యథా ।**
**క్రమయోగోపలబ్ధేన బ్రహ్మణా యదసంసృతిః ॥ 1**

పరీక్షిత్తుపలికెను :- దేవా! నీవు వెనుక (ద్వితీయ స్కంధమున) నివృత్తిమార్గమును వివరించితివి. మానవుడు ఆ నివృత్తిమార్గముద్వారా క్రమమార్గమున అర్చిరాది లోకములనుపొంది బ్రహ్మతో గూడ ముక్తిని పొందును.

**ప్రవృత్తిలక్షణశ్చైవ త్రైగుణ్యవిషయో మునే ।**
**యోఽసావలీనప్రకృతేర్గుణసర్గః పునః పునః ॥ 2**

శుకదేవా! ప్రకృతి (మాయ) తొలగి పోకపోవుటచే పురుషునకు మాటిమాటికి దేహము కలుగుచుండును. అదియే ప్రవృత్తి మార్గస్వరూపము. దానిద్వారా స్వర్గాదిసుఖములు కలుగును. నీ వీ ప్రవృత్తి మార్గమును తృతీయ స్కంధమున వర్ణించితివి.

**అధర్మలక్షణా నానా నరకాశ్చానువర్ణితాః ।**
**మన్వన్తరశ్చ వ్యాఖ్యాత ఆద్యః స్వాయంభువో యతః ॥ 3**

అధర్మ స్వరూపములుగ నున్న నానావిధ నరకములనుగూడ నీవు తరువాత (పంచమస్కంధమున) వర్ణించితివి. ఏమన్వంతరమున బ్రహ్మపుత్రుడగు స్వాయంభువ మనువు ఆవిర్భవించెనో ఆ మొదటి మన్వంతర విషయమునుగూడ చతుర్థస్కంధమున ప్రథమ భాగమున వివరించితివి.

ప్రియవ్రతోత్తానపదోర్వంశస్తచ్చరితాని చ ।
ద్వీపవర్షసముద్రాద్రినద్యుద్యానవనస్పతీన్ ॥ 4

ధరామణ్డలసంస్థానం భాగలక్షణమానతః ।
జ్యోతిషాం వివరాణాం చ యథేదమసృజద్విభుః ॥ 5

నీవు ప్రియవ్రతోత్తానపాదుల వంశమును, చరితమును కీర్తించితివి. విభుడగు శ్రీహరి యేవిధముగ విభాగలక్షణపరిమాణములను, నిర్దేశించి ద్వీపములు, వర్షములు, సముద్రములు, పర్వతములు, నదులు, ఉద్యానములు, వనస్పతులు మున్నగువానివి సృష్టించెనో, ఏ విధముగ భూమండలము, జ్యోతిశ్చక్రము, పాతాళము మున్నగు లోకములకు ఉనికిని యేర్పాటు చేసెనో నీవు వానినిగూడ కీర్తించితివి.

అధునేహ మహాభాగ యథైవ నరకాన్నరః ।
నానోగ్రయాతనాన్ నేయాత్ తన్మే వ్యాఖ్యాతు మర్హసి ॥ 6

మహాభాగా! ఈ ప్రపంచమున ఏయుపాయముల నవలంబించిన మనుష్యుడు సహింపరాని నానావిధములగు యాతనామయము లైన నరకములలో పడడో వా కాయుపాయముల నిపుడు దయయుంచి చెప్పవలసినది.

## శ్రీశుక ఉవాచ

న చేదిహైవాపచితిం యథాంహసః
కృతస్య కుర్యాన్మన ఉక్తిపాణిభిః ।
ధ్రువం స వై ప్రేత్య నరకానుపైతి
యే కీర్తితా మే భవతస్తిగ్మయాతనాః ॥ 7

శుకుడు పలికెను :- రాజా! ఈ జన్మమున మానవులు మనోవాక్కాయములద్వారా పాపముల నొనరించి యీజన్మమునందే ఆ మనోవాక్కాయముల ద్వారా విధివనుసరించి (మన్వాదులు) చెప్పిన ధర్మముల ననుసరించి ఆ యా పాపములకు ప్రాయశ్చిత్తములను జేయనిచో మరణించినపిమ్మట వారికి నేను చెప్పిన యాతనాపూర్ణము లైననరకములు తప్పక లభించును.

తస్మాత్పురైవాశ్విహ పాపనిష్కృతౌ
యతేత మృత్యోరవిపద్యతాత్మనా ।
దోషస్య దృష్ట్వా గురులాఘవం యథా
భిషక్ చికిత్సేత రుజాం నిదానవిత్ ॥ 8

అందువలన మరణించుటకు పూర్వమే దేహమున సామర్థ్యముండగనే త్వరత్వరగ పాపముల ప్రాయశ్చిత్తమునకై యత్నింపవలెను. (అట్లుకాక కాలాతీత మైనచో రెండింతలుగ ప్రాయశ్చిత్తము చేసికొనవలసి వచ్చును) నిదానవేత్తలగు వైద్యులు రోగముల గురుత్వ లఘుత్వములను వివేచన చేసి వైద్యము చేయునట్లు పాపములయొక్క మహత్త్వాల్పత్వము వివేచన చేసి వానికి ప్రాయశ్చిత్తములకై యత్నింపవలెను.

## శ్రీరాజోవాచ

దృష్టశ్రుతాభ్యాం యత్పాపం జానన్నప్యాత్మనోఽహితమ్ ।
కరోతి భూయో వివశః ప్రాయశ్చిత్తమథో కథమ్ ॥ 9

పరీక్షిన్మహారాజు పలికెను :- పాపముచేసినచో ఇహలోకమున రాజదండనము, లోకనింద మున్నగుభయములు, పరలోకమున నరకవాసము కలుగును. ఇది చూచియు, వినియు మానవుడు పాపము తనకు మేలు కలిగించునది కాదని యెఱుంగును. అయినను ఆతడు వివశుడై ప్రాయశ్చిత్తమునకు పిమ్మటకూడ మాటిమాటికి ఆపాపకర్మలనె చేయు చుండును. అందువలన ద్వాదశవార్షికవ్రతాదులెట్లు ప్రాయశ్చిత్తము లగును? (వీనియన్నింటి ద్వారా ప్రాయశ్చిత్తములకు పిమ్మటకూడ పాపప్రవృత్తియే యున్నచో అవి ప్రాయశ్చిత్తము లనబడవు.)

క్వచిన్నివర్తతేఽభద్రాత్ క్వచిచ్చరతి తత్ పునః ।
ప్రాయశ్చిత్తమథోఽపార్థం మన్యే కుంజరశౌచవత్ ॥ 10

ఒకప్పుడు మానవుడు పాపమునుండి నివృత్తుడగును. కాలాంతరమున మరల అట్లే పాపమునే యొనరించును. అందువలన (కర్మకాండీయ) ప్రాయశ్చిత్తము గజస్నానమువలె నిరర్థకమని యంగీకరింపవలెను.

## శ్రీబాదరాయణిరువాచ

కర్మణా కర్మనిర్హారో న హ్యాత్యన్తిక ఇష్యతే ।
అవిద్వదధికారిత్వాత్ ప్రాయశ్చిత్తం విమర్శనమ్ ॥ 11

వేదవ్యాసనందను డగు శుకదేవుడు పలికెను :- రాజా! పాపాచరణసమూహము కర్మ. ఇంకను చాంద్రాయణాదిప్రాయశ్చిత్తసమూహముగూడ కర్మయే. అందువలన కర్మలద్వారా కర్మలు సమూలముగ నశించునని ఆశించుటకు వీలులేదు. ఏలయన, ఈ ప్రాయశ్చిత్తాది కర్మల కధికారులగు మానవులందఱు అవిద్యాగ్రస్తులే. వారి యవిద్య నశింపక పోవుటచే ప్రాయశ్చిత్తముద్వారా ఒక్కమారు పాపక్షయమయ్యును సంస్కారమువలన మాటిమాటికి పాపాంతరమునకు అంకురోద్గమమగును. రాజా! నిజమైన ప్రాయశ్చిత్తమనగా అవిద్యానివర్తకత్వహేతువగు భగవత్‌జ్ఞానమే. అదియే యేకైక మగు ప్రాయశ్చిత్తము.

నాశ్నతః పథ్యమేవాన్నం వ్యాధయోఽభిభవన్తి హి
ఏవం నియమకృద్రాజన్ శనైః క్షేమాయ కల్పతే ॥ 12

రాజా! రోగములను గలిగింపని పథ్యమును అనగా సరియగు ఆహారమును భుజించినవ్యక్తికి వ్యాధులు కలుగవు. మెల్లమెల్లగ వెనుకటి వ్యాధులు గూడ తొలగిపోవును. అట్లే నియమముల ననుసరించి మెలగువాడు మెల్లమెల్లగ తత్త్వజ్ఞానమున కధికారియగును.

తపసా బ్రహ్మచర్యేణ శమేన చ దమేన చ ।
త్యాగేన సత్యశౌచాభ్యాం యమేన నియమేన వా ॥ 13

దేహవాగ్బుద్ధిజం ధీరా ధర్మజ్ఞాః శ్రద్ధయాన్వితాః ।
క్షిపన్త్యఘం మహదపి వేణుగుల్మమివానలః ॥ 14

చిత్తైకాగ్రత, అష్టాంగమైథునరహిత మగు బ్రహ్మచర్యము, అంతరింద్రియనిగ్రహము, బాహ్యేంద్రియనిగ్రహము, దానము, సత్యభాషణము, శౌచము, అహింసాది యమములు, జపాదినియమములు, మున్నగువాని ప్రభావముచే ధర్మరహస్యవేత్తలు, శ్రద్ధావంతులు నగుజ్ఞానులు శరీరవాగ్బుద్ధికృత మగుపాపము లనుగూడ అగ్నిచే దగ్ధమగు వెదురుపొదవలె నాశము చేతురు.

కేచిత్ కేవలయా భక్త్యా వాసుదేవపరాయణాః ।
అఘం ధున్వన్తి కార్త్స్న్యేన నీహారమివ భాస్కరః ॥ 15

(అగ్నిచే వెదురుపొద నాశముపొందునట్లు తపోబ్రహ్మచర్యాదుల బలమువలన పాపము నశించు ననువిషయము చెప్పబడినది. దానివలన కూడ మరల పాపాంకురము పుట్టు ననుశంక ఉన్నది. ఏలయన, అగ్నివలన వెదురుపొదయొక్కమొదలు సంపూర్ణముగ దగ్ధముకాకపోవుటకు ముందే ఆరిపోవచ్చును. అందువలన ఇట్టి ప్రాయశ్చిత్తవిషయమును విని పరీక్షిన్మహారాజు సంతుష్టుడు కాకపోవుటచూచి శుకమహర్షి ఆయనకు భక్తుల యభిప్రాయమును వివరించుచున్నాడు). వాసుదేవపరాయణులగు కొందఱు మానవులు

తపస్సాదులు లేకుండగ కేవలము భక్తిద్వారానే పాపమును సమూలముగ నాశముచేయుదురు. (ఇట్టి భక్తి ప్రధానపురుషులు మిగుల దుర్లభులు). సూర్యుడు హిమరాశిని సంపూర్ణముగ నాశముచేయునట్లు వాసుదేవపరాయణులగు ఏకాంతభక్తులుగూడ భక్తిబలమువలన (ఆనుషంగిక భావముతో) పాపములను సమూలముగ పెరికివేయుదురు.

(వెలుగు నిచ్చుటయే సూర్యుని ముఖ్యకార్యము, హిమాద్రివినాశమానుషంగికము. ఆవిధముగనే భగవత్సేవ లేదా ప్రేమప్రాప్తి యే భక్తి యొక్కముఖ్య సాధ్యవిషయము, అవిద్య లేదా పాపాదివినాశము ఆనుషంగికము. సూర్యు డుదయించినచో ఇక మంచు ఎక్కడ ఉండును? అట్లే కేవలభక్తి ఉదయించినచో జీవునకిక పాపాదులయందు ప్రవృత్తియుండదు).

న తథా హ్యఘవాన్ రాజన్ పూయేత తప ఆదిభిః।
యథా కృష్ణార్పితప్రాణస్తత్పూరుషనిషేవయా ॥ 16

రాజా! పాపి యగుమానవుడు భగవద్భక్తుల సాంగత్యము (సేవ) ద్వారా శ్రీకృష్ణున కాత్మసమర్పణము చేసికొనినచో (శరణాగతుడు సేవోన్ముఖుడునై ) పవిత్రుడగును. తపస్సాదులద్వారా అతడట్లు పవిత్రతను పొందజాలడు.

సధ్రీచీనో హ్యయం లోకే పన్థాః క్షేమోఽ కుతోభయః ।
సుశీలాః సాధవో యత్ర నారాయణపరాయణాః ॥ 17

ఈ ప్రపంచమున మంగళమయము, విఘ్నాది భయవిహీనము, శాస్త్రప్రసిద్ధము నగు భక్తిమార్గమె నిజమగు మార్గము. ఈ భక్తి మార్గమునందే నారాయణపరాయణులు, నిష్కాములు నగుసాధువులు సంచరించుచుందురు.

ప్రాయశ్చిత్తాని చీర్ణాని నారాయణపరాఙ్ముఖమ్।
న నిష్పునన్తి రాజేన్ద్ర సురాకుమ్భమివాపగాః ॥ 18

రాజేంద్రా! సర్వనదులు గలిసియు సురాభాండమును శుద్ధిచేయజాలనట్లు కర్మకాండమునందలి గొప్పప్రాయశ్చిత్తములుగూడ నారాయణ పరాఙ్ముఖుడగు వ్యక్తిని పవిత్రము చేయజాలవు.

క॥ *అరుదుగ నరహరిభక్తిం*
*బొరయని యాపురుషు సుకృతపుంజంబులు వే*
*మఱుఁ బుణ్యుఁ జేయనేరవు*
*నరవర మధుఘటముఁ బెక్కునదులుం బోలెన్.* (6. 57)

సకృన్మనః కృష్ణపదారవిన్దయో-
ర్నివేశితం తద్గుణరాగి యైరిహ ।
న తే యమం పాశభృతశ్చ తద్భటాన్
స్వప్నేఽపిపశ్యన్తి హి చీర్ణనిష్కృతాః ॥ 19

ఈ ప్రపంచమున ఒక్కమారయినను కృష్ణపాదపద్మములయందు మనస్సును లగ్నముచేసినవారియొక్క (యాథార్థ్యానుభవము తరువాత విషయము), శ్రీకృష్ణుని గుణావళులయందు కొంచెముగనైన అనురక్తమైనచిత్తము గలవారియొక్క అవగా ఎవరికి రత్యాభాసము జన్మించునో వారియొక్క ప్రాయశ్చిత్తములు దానిచేతనే (రత్యాభాసము చేతనే) సాధింపబడును. వారు స్వప్నమునందైనను యమునిగాని యమదూతలను గాని దర్శింపరు.

*చ॥ సతతముఁ గృష్ణపాదజలజంబులయందు మనంబు నిల్పు సు*
*వ్రతులు దదీయశుద్ధగుణరాగులుఁ గాలునియుగ్రపాశసం*
*హతుల ధరించు తత్సుభటకోఘములుం గలలోనఁగాన, రే*
*గతులను దుష్టకర్మములు గైకొని వారలఁ జెందనేర్చునే.* (6. 57)

అత్ర చోదాహరన్తీమమితిహాసం పురాతనమ్।
దూతానాం విష్ణుయమయోః సంవాదస్తం నిబోధ మే ॥ 20

ఈ విషయమున పండితు లొక్కపురాతనేతిహాసమును దృష్టాంత స్వరూపముగ కీర్తించిరి. విష్ణుదూత యమదూతల సంవాదముతో గూడిన యాయితిహాసమును చెప్పెదను వినుము.

కాన్యకుబ్జే ద్విజః కశ్చిద్దాసీపతిరజామిలః।
నామ్నా నష్టసదాచారో దాస్యాః సంసర్గదూషితః ॥ 21

కాన్యకుబ్జదేశమున అజామిళు డను బ్రాహ్మణుడు నివసించుచుండెను. అత డొక శూద్రస్త్రీని వివాహమాడెను. ఆశూద్రస్త్రీసంసర్గముచే వాని సదాచారము లన్నియు నశించెను.

వన్ద్యక్షైః కైతవైః శ్చౌర్యైర్గర్హితాం వృత్తిమాస్థితః।
బిభ్రత్కుటుంబమశుచిర్యాతయామాస దేహినః ॥ 22

ఆ యజామిళుడు పందెమొడ్డి ద్యూతక్రీడ, మోసము, చౌర్యము మున్నగు నిందితములైనవృత్తులను జేపట్టి అపవిత్ర భావముతో కుటుంబమును పోషించుకొనుచు ప్రాణులను పీడించుచుండెను.

ఏవం నివసతస్తస్య లాలయానస్య తత్సుతాన్।
కాలోఽత్యగాన్మహాన్ రాజన్నష్టాశీత్యాయుషః సమాః ॥ 23

రాజా ! ఇట్లు దురాచారములయందుండి ఆ దాసీపుత్రులను లాలన పాలన చేయు చున్న అయ్యజామిళునకు ఎనుబదియెనిమిది సంవత్సరముల పరమాయువు గడచిపోయెను.

తస్య ప్రవయసః పుత్రాదశ తేషాం తు యోఽవమః।
బాలో నారాయణో నామ్నా పిత్రోశ్చ దయితో భృశమ్ ॥ 24

వృద్ధుడగు నా యజామిళునకు పదుగురు పుత్రులు కలిగిరి. వారిలో అందఱికంటె చిన్నవాడు నారాయణుడను బాలుడు. ఇతడు తల్లిదండ్రులకు మిగుల ప్రేమపాత్రుడయ్యెను..

స బద్ధహృదయ స్తస్మిన్నర్భకే కలభాషిణి।
నిరీక్షమాణ స్తల్లీలాం ముముదే జరఠో భృశమ్ ॥ 25

వృద్ధుడగు అజామిళునిచిత్తము మధురముగను అస్పష్టముగను సంభాషించు ఆశిశువు నందు లగ్నమై ఎల్లపుడును వానిబాల్య చేష్టలనే దర్శించుచు మిగుల హర్షయుక్తు డగు చుండును.

భుంజానః ప్రపిబన్ ఖాదన్ బాలకం స్నేహయన్త్రితః !
భోజయన్ పాయయన్ మూఢో న వేదాగతమన్తకమ్ ॥ 26

మూఢు డగు అజామిళుడు ప్రేమబద్ధుడై తాను తినుచు త్రాగుచు ఆ బాలకునిచేగూడ తినిపించుచు త్రాగించుచు నుండును. ఈ పనులయంద భినివిష్టుడై యుండుటచే మృత్యువు మెల్లమెల్లగ తన్ను సమీపించె నను విషయము ఆత డెరుంగలేకపోయెను.

స ఏవం వర్తమానోఽజ్ఞో మృత్యు కాల ఉపస్థితే।
మతిం చకార తనయే బాలే నారాయణాహ్వయే ॥ 27

ఇట్లు కాలము గడచుచుండగా బాలుని యందలి ప్రేమచే ముగ్ధుడైన అజామిళునకు మరణకాల మాసన్నమయ్యెను. అప్పు డతడు తన పుత్రుడైన నారాయణుని విషయమును గూర్చియె ఆలోచింపసాగెను.

స పాశహస్తాంస్త్రీన్ దృష్ట్వా పురుషానతిదారుణాన్।
వక్రతుణ్డానూర్ధ్వరోమ్ణ ఆత్మానం నేతుమాగతాన్ ॥ 28

దూరేక్రీడనకాస క్తం పుత్రం నారాయణాహ్వయమ్।
ప్లావితేన స్వరేణోచ్చైరాజుహావాకులేన్ద్రియః ॥ 29

అజామిళు డాసమయమున పాశముల ధరించినవారు, వక్రములైన ముఖములు గలవారు, ఊర్ధ్వరోమములు గలవారు, అతిభయంకరములైన రూపములు గలవారు నగుముప్పురు పురుషులు తనజీవాత్మను గొనిపోవుటకై వచ్చియుండుటను జూచెను. చూచినంతనె అజామిళుడు విహ్వలచిత్తుడయ్యెను. ఆ సమయమున తనపుత్రుడు దూరమున ఆడుకొనుచుండెను. అజామిళు డా నారాయణు డను పుత్రుని యుచ్చైఃస్వరముతో నారాయణా! నారాయణ! యని పిలువసాగెను.

మ॥ కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీకన్ రోషనిష్ఠ్యూతులన్
ఘనపీనోష్ఠవికారవక్త్ర విలసద్గర్వేక్షణో పేతులన్
జనసంత్రాసకరోద్ధృతాయతసుపాశశ్రేణికాహేతులన్
హననవ్యాప్తివిభీతులన్ మువురనాత్మానేతలన్ దూతలన్. (6.70)

క॥ దూరమున నాడు బాలుఁడు
బోరనఁ దనచిత్తసీమఁ బొడగట్టిన నో
నారాయణ! నారాయణ!
నారాయణ! యనుచు నాత్మనందును నొడివెన్. (6.72)

నిశమ్య మ్రియమాణస్య ముఖతో హరికీర్తనమ్।
భర్తుర్నామ మహారాజ పార్షదాః సహసాపతన్ ॥ 30

మహారాజా! మృత్యువు ఆసన్నము కాగా అజామిళుని నోటినుండి తమ ప్రభువగు నారాయణుని నామస్మరణమును విని, దానిని హరికీర్తనముగనే (అపరాధశూన్య సాంకేత్య రూప నామాభాసముగనే) భావించి శీఘ్రముగ విష్ణుపార్షదు లచటికి విచ్చేసిరి.

వికర్షతోఽన్తర్హృదయాద్దాసీపతిమజామిలమ్।
యమప్రేష్యాన్ విష్ణుదూతా వారయామాసురోజసా ॥ 31

యమదూతలు దాసీపతి యగుఅజామిళుని హృదయమునుండి జీవాత్మను లాగుచుండరి. విష్ణుదూతలు బలముగ వారిని నివారించిరి.

ఊచుర్నిషేధితా స్తాంస్తే వైవస్వతపురస్సరాః।
కే యూయం ప్రతిషేద్ధారో ధర్మరాజస్య శాసనమ్॥ 32

అపుడు యమదూత లట్లు నివారింపబడినవారై "యమధర్మరాజాజ్ఞను ధిక్కరించు మీ రెవ" రని ఆవిష్ణుదూతల నడిగిరి.

కస్య వా కుత ఆయాతాః కస్మాదస్య నిషేధథ।
కిం దేవా ఉపదేవా యా యూయం కిం సిద్ధసత్తమాః ॥ 33

మీ రెవరియనుచరులు? ఎచటినుండి వచ్చినారు? పాపిష్ఠు డగు నీయజామిళుని తీసికొనిపోవు మమ్మెందులకు వారించుచున్నారు? మీరు దేవతలా, ఉపదేవతలా, లేక సిద్ధశ్రేష్ఠులా ?

సర్వే పద్మపలాశాక్షాః పీతకౌశేయవాససః।
కిరీటినః కుణ్డలినో లసత్పుష్కరమాలినః ॥ 34

సర్వేచ నూత్నవయసః సర్వే చారుచతుర్భుజాః।
ధనుర్నిషంగాసిగదాశంఖచక్రాంబుజశ్రియః ॥ 35

దిశో వితిమిరాలోకాః కుర్వన్తః స్వేన తేజసా।
కిమర్థం ధర్మపాలస్య కింకరాన్ నో నిషేధథ ॥ 36

మీ నేత్రములు పద్మపత్రములవలె వికసించియున్నవి, అందఱు పీతకౌశేయ వస్త్రములను ధరించియున్నారు. అందఱి శిరస్సులపైన కిరీటములు, కర్ణములయందు కుండలములు, కంఠములయందు పద్మమాలలు శోభిల్లుచున్నవి. మీ రందఱు నవయౌవన సంపన్నులు, మనోహరములైన ఆజానులంబితములైన నాలుగు బాహువులతో గూడినవారు; ధనుస్సులు అమ్ములపొదులు ; అసి, గద, శంఖము, చక్రము, పద్మము ననువానిచే శోభిల్లు వారు. మీరు మీ మీ తేజస్సులద్వారా దిక్కులయందలి యంధకారమును పోద్రోలుచు ఇతరవస్తువులను ప్రకాశింపజేయుచున్నారు. మేము ధర్మరాజకింకరులము. మీరు మమ్మేల వారించుచున్నారు ?

## శ్రీశుక ఉవాచ

ఇత్యుక్తే యమదూతైస్తే వాసుదేవోక్తకారిణః ।
తాన్ ప్రత్యూచుః ప్రహస్యేదం మేఘనిర్హ్రాదయా గిరా ॥ 37

శుకుడు పలికెను ;- యమదూతలిట్లు అడుగగా వాసుదేవుని యాజ్ఞననుసరించు విష్ణుదూతలు నవ్వి జలదగంభీరస్వరముతో (యమదూతలతో) నిట్లు పలికిరి.

## శ్రీవిష్ణుదూతా ఊచుః

యూయం వై ధర్మరాజస్య యది నిర్దేశకారిణః।
బ్రూత ధర్మస్య వస్తత్త్వం యచ్చాధర్మస్య లక్షణమ్ ॥ 38

విష్ణుదూతలుపలికిరి:- మీరు ధర్మరాజుయొక్క ఆజ్ఞానువర్తులైనచో మాకు ధర్మ స్వరూపమును, అధర్మలక్షణములను వివరింపుడు.

కథం స్విద్ధ్రియతే దణ్డః కిం వాస్య స్థానమీప్సితమ్ ।
దణ్డ్యాః కిం కారిణః సర్వే ఆహోస్విత్కతిచిన్నృణామ్ ॥ 39

మీ రెట్లు దండములను ధరించుచున్నారు ? ఈ దండమునకు యోగ్యమైన స్థానము (కారణము ) ఏదియైయున్నది ? కర్మిష్ఠులలో నందఱు దండనకు తగినవారేనా లేక కొందరుమాత్రమేనా?

## యమదూతా ఊచుః

వేదప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్విపర్యయః।
వేదో నారాయణః సాక్షాత్ స్వయంభూరితి శుశ్రుమ ॥ 40

యమదూతలు పలికిరి ;- వేదములలో ఏది "కర్తవ్య" మని విధింపబడినదో అదియే ధర్మము. తద్విపరీత మైనది అధర్మము. వేదము సాక్షాత్తుగ నారాయణు డనియు, స్వయముగనే యుద్భవించిన దనియు మేము వింటిమి.

యేన స్వధామ్న్యమీ భావా రజస్సత్త్వతమోమయాః ।
గుణనామక్రియారూపైర్విభావ్యన్తే యథాతథమ్ ॥ 41

తనధామమునందే యుండి సత్త్వరజస్తమోమయములగుప్రాణులను సంకల్పమాత్రము చేతనే శాంతత్వాదిగుణములద్వారా, బ్రాహ్మణాది నామములద్వారా, అధ్యయనాది క్రియల ద్వారా, వర్ణాశ్రమాదిరూపములద్వారా ఉన్నదున్నట్లుగ వెల్లడిచేసినవాడే నారాయణుడు.

సూర్యోఽగ్నిః ఖం మరుద్దేవః సోమః సన్ధ్యాహనీదిశః ।
కం కుః స్వయం ధర్మఇతి హ్యేతే దైహ్యస్య సాక్షిణః ॥ 42

సూర్యుడు, అగ్ని, ఆకాశము, వాయువు, దేవతలు, చంద్రుడు, సంధ్యాకాలము, పగలు, రాత్రి, దిక్కులు, జలము, పృథివి, ధర్మము ఇవి యన్నియు జీవుని సర్వకర్మలకు సాక్షులు.

ఏతైరధర్మో విజ్ఞాతః స్థానం దణ్డస్య యుజ్యతే।
సర్వే కర్మానురోధేన దణ్డమర్హన్తి కారిణః ॥ 43

ఈ సర్వసాక్షులద్వారా విజ్ఞాత మగు ధార్మికులే దండనకు పాత్రులగురు. కర్మిష్ఠులందరు తాము చేసికొనిన కర్మలననుసరించి దండనకు పాత్రులగుదురు.

సంభవన్తి హి భద్రాణి విపరీతాని చానఘాః।
కారిణాం గుణసంగోఽస్తి దేహవాన్ న హ్యకర్మకృత్ ॥ 44

పాపరహితు లగుపురుషులారా! కర్మిష్ఠులకు పుణ్యపాపములు రెండును సంభవములే. ఏలయన వానికి సత్త్వాదిగుణసంబంధ ముండును, దేహధారియగు వ్యక్తి (క్షణకాలముగూడ) కర్మచేయకుండగ నుండజాలడు. (అందువలన కర్మిష్ఠులకు తప్పక పాపము సంభవించును. అందువలన వారందఱు దండనకు యోగ్యులే యగుదురు.)

యేన యావాన్ యథాధర్మో ధర్మో వేహ సమీహితః।
స ఏవ తత్ఫలం భుంక్తే తథా తావదముత్ర వై ॥ 45

ఈ లోకమున ఏవ్యక్తి యేపరిమాణమున, ఏవిధముగ ధర్మాధర్మముల నొనరించునో పరలోకమున ఆవ్యక్తి ఆ పరిమాణమున ఆవిధమగు కర్మఫలము ననుభవించును.

యథేహ దేవ ప్రవరాస్త్రైవిధ్యముపలభ్యతే।
భూతేషు గుణవైచిత్ర్యాత్ తథాన్యత్రాను మీయతే ॥ 46

ఓ దేవతాశ్రేష్ఠులారా! ఈ జన్మమునందు గుణవైచిత్ర్యముచే, గుణముల త్రైవిధ్యముచే ప్రాణులు (శాంతఘోరమూఢత్వము సుఖదుఃఖ మిశ్రత్వము, ధార్మికత్వమధార్మికత్వము, తన్మధ్యరీతియని) మువ్విధములుగ గనపడుదురు. అట్లే అనంతరకాలమునందున వారి త్రివిధత్వ మూహింపబడును.

వర్తమానోఽన్యయోః కాలో గుణాభిజ్ఞాపకో యథా।
ఏవం జన్మాన్యయోరేతద్ధర్మాధర్మనిదర్శనమ్ ॥ 47

ప్రస్తుత వసంతాదికాలము భూతభవిష్యద్వసంతాది ఋతువుల గుణాదులను తెలియజేయునట్లు ఈజన్మము భూతభవిష్యజ్జన్మముల ధర్మాధర్మములను నిర్దేశించును.

మనసైవ పురే దేవః పూర్వరూపం విపశ్యతి।
అనుమీమాంసతేఽపూర్వం మనసా భగవానజః ॥ 48

సర్వజ్ఞుడు, బ్రహ్మతుల్యుడు నగు యముడు తనపురమునందుండి (లేదా ప్రాణుల హృదయములలో అంతర్యామి రూపముతో నుండి ) మనస్సుద్వారానే జీవులపూర్వకృత మగు ఆచరణమును చూచును. దానివలన మనస్సుద్వారానే తదనురూపముగ భవిష్యత్కాలా చరణమును గూర్చి ఆలోచించుచుండును.

యథాజ్ఞస్తమసా యుక్తఉపాస్తే వ్యక్తమేవ హి।
న వేద పూర్వమపరం నష్టజన్మస్మృతి స్తథా ॥ 49

నిద్రించునట్టివ్యక్తి స్వప్నదృష్టమగు దేహమును సేవించును. అనగా దానియందే ఆత్మబుద్ధి నుంచును. అట్లే నశించిన జన్మస్మృతి గలవాడు, అవిద్యోపాధిగ్రస్తుడు నగు జీవుడు పూర్వకర్మాభివ్యక్త మగు ప్రస్తుత దేహాదికమును సేవించును, అనగా దానియందే "నేను, నాది " యనిబుద్ధినుంచును. పూర్వాపరములను వేనినిగూడ తెలిసికొనజాలడు.

**పంచభిః కురుతే స్వార్థాన్ పంచ వేదాథ పంచభిః।**
**ఏకస్తు షోడశేన త్రీన్ స్వయం సప్తదశోఽశ్నుతే ॥ 50**

మనస్సు పదునాఅవది, జీవుడు తదతిరిక్త మగు పదునేడవవాడు : కనుక ఒక్కడే. షోడశపదార్థములతో గలసి పదునేడవవాడైనపుడు ఒంటరిగ రాగాదులైన ఐదుకర్మేంద్రియము లద్వారా తా నభిలషించు కార్యముల జేయును. శ్రోత్రాదులైన ఐదుజ్ఞానేంద్రియాలద్వారా శబ్దస్పర్శాదిపంచ విషయముల విజ్ఞానమును పొందును. ఇట్లు తానొక్కడేయైకూడ జీవుడు కర్మేంద్రియ జ్ఞానేంద్రియములకు, మనస్సునకు గ్రాహ్యములగు విషయములను పొందును.

**తదేతత్ షోడశకలం లింగం శక్తిత్రయం మహత్।**
**ధత్తేఽనుసంసృతిం పుంసి హర్ష శోకభయార్తిదామ్ ॥ 51**

పదియింద్రియములు, శబ్దస్పర్శాదు లైన పంచతన్మాత్రలు, మనస్సు అనునీ షోడశకళావిశిష్టము, గుణత్రయమునకు కార్యభూతము, దుర్నివారము, నానానామయము నగులింగదేహము మాటిమాటికి జీవునకు హర్షశోకభయపీడప్రద మగుసంసారమును గలుగ జేయుచుండును.

**దేహ్యజ్ఞోఽజితషడ్వర్గో నేచ్ఛన్ కర్మాణి కార్యతే ।**
**కోశకార ఇవాత్మానం కర్మణాచ్ఛాద్యముహ్యతి ॥ 52**

అజ్ఞుడు, అజితేంద్రియుడు నగు జీవుడు ఇష్టము లేకపోయినను కర్మచేయుటకు బాధ్యుడగును, కోశకార మనుకీటకము తననోటినుండి బయలు వెడలిన తంతువు (దారము ) లనుండి కోశమును నిర్మించి దానియందే బద్ధమై యుండునుగాని బయటకు వెడలుత్రోవను కనుగొనజాలదు. అట్లే జీవుడుగూడ తాను జేసికొనిన కర్మములచే బద్ధుడై మోహమును పొందునుగాని కర్మముక్తి కుపాయమును తెలిసికొనజాలడు.

**న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।**
**కార్యతే హ్యవశః కర్మ గుణైః స్వాభావికైర్బలాత్ ॥ 53**

ఏజీవుడైనను కర్మచేయకుండగ క్షణకాల మైనను ఉండజాలడు. వెనుకటిసంస్కారము వలన గలిగిన రాగాదులు వానిని బలవంతముగ లాంగదీసికొని కర్మలయందు బ్రవృత్తునిగ జేయును.

లబ్ధ్వా నిమిత్తమవ్యక్తం వ్యక్తావ్యక్తం భవత్యుత !
యథాయోని యథాబీజం స్వభావేన బలీయసా ॥ 54

జీవుడు చేసిన పుణ్యపాపాత్మక కర్మలు ఫలోన్ముఖము లైనచో దానిని అదృష్టమందురు. అయ్యదృష్టమే జీవునిపుట్టుకకు గారణము. ఆయదృష్టమును పొంది జీవుడు ప్రబల మైనకర్మవాసనారూప మగు, పితృసదృశము లేదా మాతృసదృశము వగు స్థూలసూక్ష్మదేహములను పొందును.

ఏష ప్రకృతిసంగేన పురుషస్య విపర్యయః।
ఆసీత్స ఏవ న చిరాదీశసంగాద్విలీయతే ॥ 55

ప్రకృతియొక్క సాంగత్యమువలననే మానవున కిట్టివిపర్యయము అనగా స్వరూప భ్రమజనిత మగుసంసారము కలుగును. భగవద్భజన ప్రభావముచే ఈసంసార మచిర కాలములోనే విలీనమగును.

అయం హి శ్రుతసంపన్నః శీలవృత్తగుణాలయః।
ధృతవ్రతో మృదుర్దాన్తః సత్యవాఙ్మన్త్రవిచ్ఛుచిః ॥ 56

గుర్వగ్న్యతిథివృద్ధానాం శుశ్రూషరనహంకృతః !
సర్వభూతసుహృత్సాధుర్మితవాగనసూయకః ॥ 57

ఈ బ్రాహ్మణుడు (అజామిళుడు ) మొదట శాస్త్రజ్ఞానసంపన్నుడు, సత్స్వభావుడు, సదాచారి, క్షమాది సద్గుణములకు నిలయుడు, వ్రతనిష్ఠుడు, కోమలచిత్తుడు; జితేంద్రియుడు; సత్యవాది, మంత్రజ్ఞుడు, పవిత్రుడు, గురువు, అగ్ని, అతిథి, వృద్ధులు మున్నగువారిసేవయందు రతుడు, నిరహంకారుడు, సర్వభూత హితుడు, సాధువు, మితభాషి, అసూయారహితుడు నైయుండెను.

ఏకదాసౌ వనం యాతః పితృసన్దేశకృద్ద్విజః।
ఆదాయ తత ఆవృత్తః ఫలపుష్పసమిత్కుశాన్ ॥ 58

దదర్శ కామినం కంచిచ్ఛూద్రం సహ భుజిష్యయా।
పీత్వా చ మధు మైరేయం మదాఘూర్ణిత నేత్రయా ॥ 59

మత్తయా విశ్లథన్నీవ్యా వ్యపేతం నిరపత్రపమ్।
క్రీడన్తమనుగాయన్తం హసన్తమనయాన్తికే ॥ 60

ఒకప్పు డా బ్రాహ్మణుడు (అజామిళుడు ) తండ్రియాదేశము ననుసరించి ఫలములను, పుష్పములను, సమిధలను, కుశలను (దర్భలను) తీసికొనివచ్చుటకై వనమునకు వెడలెను. ఫలపుష్పాదులను సంగ్రహించి వనమునుండి యింటికి తిరిగివచ్చుచుండగా నతనికి త్రోవలో నొకశూద్రుడు సిగ్గువిడచి యొకవేశ్యతో గలసి నవ్వుచు, పాడుచు విహరించు చుండుట కనబడెను. మద్యపానముచే ఆవేశ్యయొక్క నేత్రములు తిరుగుచుండెను. మదోన్మత్తతవలన ఆమెకటిప్రదేశమునుండి నీవి ( పోకముడి ) విడిపోయెను.

దృష్ట్వా తాం కామలిప్తేన బాహునా పరిరమ్భితామ్।
జగామ హృచ్ఛయవశం సహసైవ విమోహితః ॥ 61

శూద్రుడు కామోద్దీపక మగుఅంగరాగముతో గూడిన తన బాహువులద్వారా ఆవేశ్యను ఆలింగనము చేసికొనియుండెను, ఇదిచూచి యాద్విజుడు హఠాత్తుగ మోహితుడు, మన్మథవశుడు అయ్యెను.

స్తమ్భయన్నాత్మనాత్మానం యావత్సత్త్వం యథాశ్రుతమ్।
న శశాక సమాధాతుం మనో మదన వేపితమ్ ॥ 62

తనధైర్యము ననుసరించి, శాస్త్రజ్ఞానము ననుసరించి, బుద్ధిననుసరించి యతడు తనచిత్తమును నిగ్రహించుటకు తీవ్రప్రయత్నము చేసెను. కాని మన్మథవేగకంపిత మగుమనస్సును నిగ్రహించుకొన లేకపోయెను.

తన్నిమిత్తస్మరవ్యాజగ్రహగ్రస్తో విచేతనః।
తామేవ మనసా ధ్యాయన్ స్వధర్మాద్విరరామ హ ॥ 63

ఆవేశ్యను నిమిత్తముగ జేసికొని ప్రారబ్ధకర్మ మనెడి గ్రహము మన్మథవేషముతో బ్రాహ్మణు డగునాయజామిళుని గ్రసింపగా వానిజ్ఞానము విలుప్తమయ్యెను. అత డావేశ్యను చిత్తమున నిలుపుకొని యామెను గూర్చియే యాలోచించుచు స్వధర్మమునుండి భ్రష్టుడయ్యెను.

తామేవ తోషయామాస పిత్ర్యేణార్థేన యావతా ।
గ్రామ్యైర్మనోరమైః కామైః ప్రసీదేత యథా తథా ॥ 64

అతడు తండ్రి సంపాదించిన ధనముతో ఆ వేశ్యను సంతోషపెట్టసాగెను. గ్రామ్యములు మనోహరములు నగుయేవస్తువులచే దానిమనసునకు సంతోషము కలుగుచుండునో ఆ వస్తువులను సంపాదించుట కతడు నిరంతరము ప్రయత్న పరుడగుచుండును.

విప్రాం స్వభార్యామప్రౌఢాం కులే మహతి లమ్భితాం ।
విససర్జాచిరాత్పాపః స్వైరిణ్యాపాంగవిద్ధధీః ॥ 65

ఆ వారాంగనయొక్క కటాక్ష బాణములచే వాని (అజామిళుని) చిత్తము విద్ధమయ్యెను. (ఛేదింపబడెను) అందువలన అతడు పాప కార్యములయందు ప్రవృత్తుడై నవయౌవన వతియు, సత్కుల సంజాతయు, వివాహితయ నగుతన భార్యను వెంటనే విడిచిపెట్టెను.

**యత స్తతశ్చోపనిన్యే న్యాయతోఽన్యాయతో ధనమ్ ।**
**బభారాస్యాః కుటుమ్బిన్యాః కుటుమ్బం మన్దధీరయమ్ ॥ 66**

మందబుద్ధి యగునాబ్రాహ్మణుడు న్యాయములు అన్యాయములు నగునుపాయము లచే ధనమునుసంపాదించియావేశ్యయొక్క పరివారమును పోషింప నారంభించెను.

**యదసౌ శాస్త్రముల్లంఘ్య స్వైరచార్యర్గిగర్హితః ।**
**అవర్తత చిరం కాలమఘాయురశుచిర్మలాత్ ॥ 67**

ఆ ద్విజుడు ఇట్లు శాస్త్రవిధి నుల్లంఘించిస్వేచ్ఛావిహారములయందు ప్రవృత్తుడై యావేశ్యయొక్క అపవిత్రాన్నమును స్వీకరించుట మున్నగు అశుద్ధాచారములతో బహు కాలము గడిపెను. గర్హితములైన పాపకర్మములచే వానిజీవితము పాపమయమయ్యెను.

**తత ఏనం దణ్డపాణేః సకాశం కృతకిల్బిషమ్ ।**
**నేష్యామోఽకృతనిర్వేశం యత్ర దణ్డేన శుధ్యతి ॥ 68**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే అజామిలోపాఖ్యానే శ్రీవిష్ణుయమ
పురుషసంవాదే ప్రథమోఽధ్యాయః ॥

అతడు పాపమునకెట్టి ప్రాయశ్చిత్తమును ఒనరింపలేదు. అందు వలన మేము వీనిని దండధరుడగు యమునికడకు తీసికొనివెడలగలము. ఆ ప్రదేశమున ఇతడు పాపములకు తగిన దండనమును పొంది శుద్ధుడగును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
అజామిళోపాఖ్యానమున విష్ణుయమదూతసంవాద మను
మొదటి అధ్యాయము
సంపూర్ణము.



# రెండవ అధ్యాయము

## విష్ణుదూతలు భాగవతధర్మమును నిరూపించుట :

## అజామిళుడు పరమధామమునకు వెడలుట

కథాసారము :- ఈ యధ్యాయమున విష్ణుదూతలు యమదూతలకు అద్భుత మగు హరినామమహాత్మ్యమును జెప్పుట, ద్విజుడగు అజామిళుడు విష్ణులోకమును పొందుట అనువిషయములు వర్ణింపబడినవి.

యమదూతలు చెప్పిన విషయములను విని న్యాయపరులగు విష్ణుదూతలు "ప్రస్తుతము సాధువుల సభలలో అధర్మము ప్రవేశించినది, దండింపదగనివారు దండింపబడుచున్నారు, పశువులవలె అజ్ఞానులు అబలురునగు ఏ ప్రజలు ఆ సాధువులపై నమ్మక ముంచి చింతా రహితులై యున్నారో ఆ ప్రజలపట్ల యోగ్య మగువిధమున వ్యవహరింపక వారు అన్యాయముగ ప్రవర్తించుచున్నారు. అట్లయిన ఆ ప్రజ లెవరిని శరణుజొచ్చెద"రని యాక్షేపించి ద్విజుడగు అజామిళు డెట్టియమదండనముకు తగ దని చెప్పుటకు హరినామమహాత్మ్యమును వర్ణించిరి. ఆ సందర్భమున వారిట్లు పలికిరి. "ఈ బ్రాహ్మణుడు మరణసమయమున నారాయణ నామాభాసము నుచ్చరించి ఒకజన్మలో కాదు కోటిజన్మలయందలి పాపములకు ప్రాయశ్చిత్తము చేసెను. శాస్త్రవిహిత మగు ప్రాయశ్చిత్తము ద్వారా పాపములకు శాంతి కలిగినను దానివలన పాపియొక్క పాపప్రవృత్తి నశింపదు. ఇంకను నతడు పాపమునందు రతుడగును. కాని హరినామాభాసముచే పాపమూలము నశించును. హృదయము పాప ప్రవృత్తిశూన్యమై విశుద్ధమగును. ఏ విధముగనైన, ఏ యవస్థలోనైన హరినామ ముచ్చరింప బడినచో అది వ్యర్థముకాదు. దానివలన పరమశుభము కలుగును. అమంగళములు నశించును. తపోవ్రతదానాది ధర్మకర్మలుగూడ ఈనామాభాసమువలె హృదయమాలిన్య మును నాశముచేయజాలవు. ప్రజ్వరిల్లు అగ్నివలె, వీర్యవంత మగు ఔషధమువలె, ఈ నామాభాసము అజ్ఞానముచే గ్రహింపబడిన దయ్యును.అది తన ప్రభావమును ప్రకటించును. అందువలన అజామిళుడు ఇతరుని లక్ష్యముగ జేసి సాంకేత్య మగునామాభాసము చేయుటచే పాపముక్తు డయ్యెను. అందువలన అతడు యముని శిక్షకు పాత్రుడుకాడు."

ఇట్లుపలికి విష్ణుదూతలు బ్రాహ్మణుని యమపాశమునుండి విడిపించి పయనమైరి. బ్రాహ్మణుడు వారికి నమస్కరించి వారి శ్రీమూర్తుల దర్శించి పరమానందమును పొందెను. ఇట్టి దర్శనము, మరణసమయమున హరినామాభాసోచ్చారణము తన పూర్వ సుకృతఫల మని తెలిసికొనగలిగెను.

అత డిరుపక్షములలో నున్న దూతల మాటల ననుసరించి సగుణనిర్గుణధర్మతత్త్వము లను తెలిసికొని భగవానునిపై భక్తి గలవాడయ్యెను. వెనుక చేసిన పాపమువలన వాని హృదయమున ఘోరమైన నిర్వేదము బయలుదేరెను. తన్ను తాను దూషించుకొని యత డెంతగనో పరితపించెను. సాధుసాంగత్య ప్రభావమువలన ఇట్టిసద్బుద్ధి కలుగుటచే త్వరలోనే యతడు అన్నింటిని త్యజించి హరిద్వారతీర్థమునకు పయనమయ్యెను. అచట ఏకాంతభావముతోహరిభజనమున మగ్నుడై అచిరకాలములోనే భగవానునియందు సమాధి యోగమును పొందెను. ఇంతలో ఆవిష్ణుదూత లచటికి వచ్చి వానిని స్వర్ణవిమానమున నెక్కించుకొని వైకుంఠధామమునకు దీసికొని వెడలిరి. పుత్రునినామగ్రహ మిషవలన హరి నామమును గీర్తించిన (నామాభాసమున) మహాపాపి యగువాడు సయితము విశుద్ధుడై పరమగతిని పొందును. అందువలన శ్రద్ధతో పరమ ప్రాయశ్చిత్తస్వరూప మగు ఈనామమును స్వీకరించిన అది ఎంత ఫలము నిచ్చునదియగునో చెప్పనలవికాదు.

## శ్రీబాదరాయణిరువాచ

ఏవం తే భగవద్దూతా యమదూతాభిభాషితమ్ ।
ఉపధార్యాథతా న్ రాజన్ ప్రత్యాహుర్నయ కోవిదాః ॥ 1

శుకుడు పలికెను :- రాజా! నీతిశాస్త్రకుశలు రగువిష్ణుదూతలు యమదూతలవలన ఈ వాక్కులను విని ప్రత్యుత్తరముగ వారితో నిట్లు పలికిరి.

## శ్రీవిష్ణుదూతా ఊచుః

అహో కష్టం ధర్మదృశామధర్మః స్పృశతే సభామ్ ।
యత్రాదణ్డేష్వపాపేషు దణ్డో యైర్ధ్రియతే వృథా ॥ 2

విష్ణుదూతలు పలికిరి :- ఆహా! ఎంతకష్టము! ధర్మజ్ఞులసభలను అధర్మము స్పృశించినది కదా! ధర్మవేత్తలు పాపరహితులు, అదండ్యులు నగువారిని వ్యర్థముగ దండించుచున్నారు.

ప్రజానాం పితరో యే చ శాస్తారః సాధవః సమాః ।
యది స్యాత్తేషు వైషమ్యం కం యాన్తి శరణం ప్రజాః ॥ 3

తండ్రివలె వాత్సల్యముతో ప్రజలను పాలించువారు, గురువువలె ఉపదేశించువారు, అంతట సమదర్శులు, యమాదులవంటివారునగు సాధువులలోగూడ అదండ్యులగుజను లను దండించుట యను వైషమ్యము కనబడినచో ఇక యపుడు ప్రజ లెవ్వరిని శరణు జొచ్చెదరు.

యద్యదాచరతి శ్రేయానితరస్తత్తదీహతే ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ 4

శ్రేష్ఠుడగు వ్యక్తి యొక్క ఆచరణమును ఇతరజనులుగూడ అనుసరింతురు. అతడు దేనిని ప్రమాణముగ స్వీకరించునో లోకము దానినే అనుసరించును.

యస్యాంకే శిర ఆధాయ లోకః స్వపితి నిర్వృతః ।
స్వయం ధర్మమధర్మం వా న హి వేద యథా పశుః ॥ 5

స కథం న్యర్పితాత్మానం కృతమైత్రమచేతనమ్ ।
విస్రమ్భణీయో భూతానాం సఘృణో దోగ్ధుమర్హతి ॥ 6

అబోధ యగుపశువువలె ప్రాణులు తాము ధర్మాధర్మముల నేమియు నెఱుంగజాలరు. వారు ఇతరులయధీనములో నున్న పశువులవలె పోషించు యజమాని ఒడిలో తలనుంచి నిశ్చింతగ నిద్రింతురు. కాని యీ యజమాని దయార్ద్రచిత్తుడు. విశ్వాసపాత్రుడు నై విశ్వస్తచిత్తులు, సమర్పితాత్ములు, అజ్ఞానులు నగు ప్రాణుల నెట్లు వ్యర్థముగ పీడించును? అనగా అది యెప్పుడును సంభవముగాదు.

అయం హి కృతనిర్వేశో జన్మకోట్యంహసామపి ।
యద్వ్యాజహార వివశో నామ స్వస్త్యయనం హరేః ॥ 7

అజామిళుడు కేవలము యొక్క జన్మములోని పాపమునకే కాదు కోటి జన్మలలోని పాపములకు ప్రాయశ్చిత్తము చేసికొనెను. ఏలయన అతడు వివశుడై కేవలము పాపమునకు ప్రాయశ్చితముకాదు మోక్షప్రాప్తికిగూడ ఉపాయస్వరూపము, పరమమంగళ మయము నగు హరినామము (నామాభాసము) నుచ్చరించెను.

ఏతేనైవ హ్యఘోనోఽస్య కృతం స్యాదఘనిష్కృతమ్।
యదా నారాయణాయేతి జగాద చతురక్షరమ్॥ 8

ఇయ్యజామిళుడు పూర్వమునందును భోజనాదిసమయములలో "వత్సా! నారాయణా! శీఘ్రముగ రమ్ము" అని పుత్రుని పిలచుటద్వారా నాలుగక్షరములు గల "నారాయణ" యనునామమును (నామభాసము) ఉచ్చరించెను. దానివలన ఆపాపియొక్క అశేషజన్మార్జిత పాపములకు ప్రాయశ్చిత్తము కలిగెను.

స్తేనః సురాపో మిత్రధ్రుగ్బ్రహ్మహా గురుతల్పగః ।
స్త్రీరాజపితృగోహన్తా యే చ పాతకినోఽపరే ॥ 9

సర్వేషామప్యఘవతామిదమేవ సునిష్కృతమ్ ।
నామవ్యాహరణం విష్ణోర్యతస్తద్విషయా మతిః ॥ 10

సువర్ణాదిబహుమూల్యద్రవ్యముల నపహరించువాడు, మద్యపానము చేయువాడు, మిత్రద్రోహి, బ్రహ్మహంతకుడు, గురుపత్నిని పొందువాడు, స్త్రీహత్య నొనరించువాడు, గోహత్యను జేసినవాడు, పితృహత్య చేసినవాడు, రాజును జంపినవాడు, ఇంకను నితర మహాపాతకులందఱు విష్ణునామ ముచ్చరించిన అదియే వారి పాపములకు ప్రాయశ్చిత్త మగును. ఏలయన ఏవ్యక్తి యీ నామము నుచ్చరించునో వానిని గూర్చి విష్ణు భగవానుడు "వీడు నా భక్తుడు, వీనిని పూర్తిగ నేను రక్షింపవలె"నని భావించుచుండును.

న నిష్కృతైరుదితైర్బ్రహ్మవాదిభి-
స్తథా విశుధ్యత్యఘవాన్ వ్రతాదిభిః ।
యథా హరేర్నామపదైరుదాహృతై
స్తదుత్తమశ్లోకగుణోపలమ్భకమ్ ॥ 11

శ్రీహరినామమాత్రము నుచ్చరించిన పాపుల కేవిధ మగునైర్మల్యము కలుగునో మన్వాదులు విధించిన వ్రతాదులు లేదా ప్రాయశ్చిత్తములద్వారా అట్టి నైర్మల్యము కలుగదు. ఉత్తమశ్లోకు డగుభగవానునియైశ్వర్యగుణజ్ఞాపక మగు నామోచ్చారణము కృచ్ఛ్ర చాంద్రాయణాది ప్రాయశ్చితములవలె పాపములను మాత్రము బోగొట్టి నివృత్తముకాదు.

నైకాన్తికం తద్ధి కృతేఽపి నిష్కృతే
మనః పునర్ధావతి చేదసత్పథే ।
తత్కర్మనిర్హారమభీప్సతాం హరే-
ర్గుణానువాదః ఖలు సత్త్వభావనః ॥ 12

ప్రాయశ్చిత్తములద్వారా చిత్తము చక్కగ నిర్మలముగాదు. ప్రాయశ్చిత్తము చేసికొనినను మనస్సు మరల అసన్మార్గములోనికి పయనించును. అందువలన పాపములను సమూలముగ నాశముచేయదలచినవారికి శ్రీహరిగుణకీర్తనమే గొప్ప ప్రాయశ్చిత్తము. అదియే పాపమూల మగు అవిద్యను నాశము చేసి చిత్తసంశోధనముచేయ సమర్థమగును.

అథైనం మాపనయత కృతాశేషాఘనిష్కృతమ్ ।
యదసౌ భగవన్నామ మ్రియమాణః సమగ్రహీత్ ॥ 13

ఈవ్యక్తి మృత్యుపాశముచే చనిపోవుచున్నవాడై భగవన్నామమును పూర్తిగ నుచ్చరించెను. దానిద్వారానే వీని యశేషపాపములకు ప్రాయశ్చిత్తము కలిగెను. అందువలన మీరు వీనిని నరకాది పాపమార్గములోనికి తీసికొనిపోవలదు.

సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా।
వైకుంఠనామగ్రహణమశేషాఘహరం విదుః ॥ 14

అన్యవస్తువును లక్ష్యముగ జేసికొని, ఎవనినైన పరిహసించు నెపముతోగాని, గీతాలాప పూరణముకొఱకు లేదా అశ్రద్ధగాని వైకుంఠ నిలయుడగుభగవానునినామమును ఉచ్చరించి నంతనె అశేషపాపములు నశించును. ఇది శాస్త్రవేత్తలగు మహాత్ములకు తెలియును.

ఆ॥ బిడ్డపేరు పెట్టి పిలుచుట విశ్రామ
కేలినైన మిగులఁ గేలినయినఁ
పద్యగద్యగీతభావార్థములనైన
గమలనయనుఁ దలపఁ గలుషహరము. (6. 122)

పతితం స్ఖలితో భగ్నః సన్దష్టస్తప్త ఆహతః।
హరిరిత్యవశేనాహ పుమాన్ నార్హతి యాతనాః॥ 15

ఎత్తయిన గృహాదుల నుండి పడినవాడు, త్రోవలో జారిపడినవాడు, భగ్నగాత్రుడు, సర్పాదులచే కఱవబడినవాడు, జ్వరాదిరోగములచే పీడితుడు, లేదా కఱ్ఱలచే గొట్టబడినవాడు నై మానవుడు చివరకు "హరి' యను శబ్దము నుచ్చరించినచో వాని కెప్పుడును నరకయాతన లను అనుభవింప వలసిన అవసరము కలుగదు.

ఉ॥ కూలినచోట గొట్టువడి కుందినచోట మహాజ్వరాదులం
బ్రేలినచోట సర్పముఖపీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణుభవదూరునిఁ బేర్కొనరేని మీఁదన
క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్. (6. 123)

గురూణాం చ లఘూనాం చ గురూణి చ లఘూని చ।
ప్రాయశ్చిత్తాని పాపానాం జ్ఞాత్వోక్తాని మహర్షిభిః॥ 16

మహర్షులు విశేషముగ నాలోచించి అధికపాపమున కధికప్రాయశ్చిత్తమును, అల్పపాపమున కల్పప్రాయశ్చిత్తమును విధించిరి. ప్రాయశ్చిత్త సంబంధమున ఇట్టివ్యవస్థయే యున్నది. కాని హరినామమున ఇట్టి వ్యవస్థ లేదు. ఈ నామస్మరణమాత్రమునవే పాపులు సర్వపాపముల నుండి ముక్తులగుదురు.

తైస్తాన్యఘాని పూయన్తే తపోదానవ్రతాదిభిః।
నాధర్మజం తద్ధృదయం తదపీశాంఘ్రిసేవయా॥ 17

తపస్సు, దానము, వ్రతము మున్నగుప్రాయశ్చిత్తములద్వారా పాపులపాపములు నశించును. కాని దానివలన అధర్మానుష్ఠానజనిత మగు హృదయమాలిన్యము లేదా పాపమునకు మూలభూత మగు చిత్తవృత్తిరూపసంస్కారము నాశముపొందదు. భగవానుని పాదపద్మముల సేవ వలననే అది నశించును.

**అజ్ఞానాదథవా జ్ఞానాదుత్తమశ్లోకనామ యత్ ।**
**సంకీర్తితమఘం పుంసో దహేదేధో యథానలః ॥ 18**

అగ్ని తృణరాశిని దగ్ధముచేయునట్లు జ్ఞానమువలన గాని అజ్ఞానము వలనగాని ఉత్తమ శ్లోకు డగుభగవానుని నామమును కీర్తించినచో అది ఆ నామము నుచ్చరించినవాని పాపములను భస్మము చేయును.

**యథాగదం వీర్యతమముపయుక్తం యదృచ్ఛయా ।**
**అజానతోఽప్యాత్మగుణం కుర్యాన్మన్త్రోఽప్యుదాహృతః ॥ 19**

ఔషధప్రభావమును తెలిసికొనక అధికవీర్యవంతమగునాయౌషధమును సేవించిన మానవునకు అది తనగుణమును చూపును. అట్లే అజ్ఞానముచేనుచ్చరింపబడినను హరినామము ఉచ్చరించినవానికి తన గుణమును జూపును. (ఏలయన, వస్తుశక్తి యెప్పుడును శ్రద్ధాదుల నపేక్షింపదు; అది స్వయముగనే తన ప్రభావమును చూపునుగదా)

ఉ॥ *ఆరయ వీర్యవంత మగునౌషధ మెట్లు యదృచ్ఛఁ గొన్న ద*
*చ్చారుగుణంబు రోగములఁ జయ్యనఁబాపెడుమాడ్కిఁబుణ్యవి*
*స్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁడజ్ఞుఁడవజ్ఞ బల్కినన్*
*వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే.* (6. 126)

## శ్రీశుక ఉవాచ

**త ఏవం సువినిర్ణీయ ధర్మం భాగవతం నృప ।**
**తం యామ్యపాశాన్నిర్ముచ్య విప్రం మృత్యోరమూముచన్ ॥ 20**

శుకదేవుడు పలికెను :- రాజా! ఆభగవత్పార్షదులు ఇట్లు భాగవత ధర్మమును జక్కగ వివరించి ఆవిప్రుని యమపాశమునుండి విడిపించి మృత్యువునుండి కాపాడిరి.

**ఇతి ప్రత్యుదితా యామ్యా దూతా యాత్వా యమాన్తికమ్ ।**
**యమరాజ్ఞే యథా సర్వమాచచక్షురరిన్దమ ॥ 21**

శత్రునిషూదనా! యమదూత లట్లు నిరాకృతులై యమునికడకు వెడలి ఆయనకు జరిగిన వృత్తాంతము నంతటిని తెలియజెప్పిరి.

ద్విజః పాశాద్వినిర్ముక్తోగతభీః ప్రకృతిం గతః ।
వవన్దే శిరసా విష్ణోః కింకరాన్ దర్శనోత్సవః ॥ 22

అజామిళుడు మృత్యుపాశమునుండి నిర్ముక్తుడు, నిర్భయుడు, స్వస్థచిత్తుడునై శిరముతో విష్ణుదూతలకు నమస్కరించి, వారిదర్శనముచే పరమానందము ననుభవింప సాగెను.

తం వివక్షుమభిప్రేత్య మహాపురుషకింకరాః ।
సహసా పశ్యతస్తస్య తత్రాన్తర్దధిరేఽనఘ ॥ 23

అనఘా! మహాపురుషుడగు భగవానునియనుచరులు తమతో అయ్యజామిళు డేదియో చెప్పదలంచుచున్నాడనియెఱింగి వెంటనే వారచటనే అంతర్హితులైరి.

అజామిలోఽప్యథాకర్ణ్య దూతానాం యమకృష్ణయోః ।
ధర్మం భాగవతం శుద్ధం త్రైవేద్యం చ గుణాశ్రయమ్ ॥ 24

భక్తిమాన్ భగవత్యాశు మాహాత్మ్యశ్రవణాద్ధరేః ।
అనుతాపో మహానాసీత్ స్మరతోఽశుభమాత్మనః ॥ 25

అజామిళుడు యమవిష్ణుదూతల సంవాదముచే ప్రతిపాద్యమైన సగుణధర్మమును భగవత్ప్రణీతము గుణాతీతము నగు శుద్ధభాగవత ధర్మమును,భగవానునిమాహాత్మ్యమును విని వెంటనే శ్రీహరియందు భక్తికలవాడయ్యెను. అప్పుడతడు తనపూర్వకృతకర్మలను స్మరించి మిగుల పరితాపముచెందసాగెను.

అహో మే పరమం కష్టమభూదవిజితాత్మనః ।
యేన విప్లావితం బ్రహ్మ వృషల్యాం జాయతాఽఽత్మనా॥ 26

అతడు పలికెను :- ఆహా! ఇంద్రియములకు వశుడనైన నాకెంతటి కష్టము కలిగినది! నేను శూద్రస్త్రీవలన సంతానమును గని బ్రాహ్మణజాతిని నాశముచేసితిని.

ధిఙ్మాం విగర్హితం సద్భిర్దుష్కృతం కులకజ్జలమ్ ।
హిత్వా బాలం సతీం యోఽహం సురాపీమసతీమగామ్ ॥ 27

ఆహా! సజ్జననిందితుడను, దుష్కర్మముల నొనరించినవాడను, కులమునకు కళంక స్వరూపుడను నగు నాకు ధిక్కారము! నేను తరుణియు, సాధ్వియు నగుభార్యను వదలి సురాపానముచేయు వేశ్యసహవాసమున ఆసక్తి కలిగియుంటిని.

వృద్ధావనాథౌ పితరౌ నాన్యబన్ధూతపిస్వనౌ ।
అహో మయాధునా త్యక్తావకృతజ్ఞేన నీచవత్ ॥ 28

నా తల్లిదండ్రు లిరువురు వృద్ధులు, అనాథులు, నేను తప్ప వారి కితరపుత్రులుగాని బంధువులుగాని యెవ్వరును లేరు. అందువలన వారు మిగులకష్టములలో బడిరి. అయ్యో! నేను నీచుడగుమానవునివలె కృతఘ్నుడనై వారినట్టి యవస్థలో విడచిపెట్టితినిగదా!

సోఽహం వ్యక్తం పతిష్యామి నరకే భృశదారుణే।
ధర్మఘ్నాః కామినో యత్ర విన్దన్తి యమయాతనాః॥ 29

ధర్మనాశకులు, కాముకులు నగ మానవు లేనరకమున యమయాతనల ననుభవింతురో అట్టి భయంకర మగునరకము నావంటి మహాపాపికి గలుగునని దీనివలన స్పష్టమగుచున్నది.

కిమిదం స్వప్న ఆహోస్విత్ సాక్షాద్దృష్టమిహాద్భుతమ్।
క్వ యాతాఅద్య తే యే మాం వ్యకర్షన్ పాశపాణయః॥ 30

ఈ యద్భుతదృశ్యమును నేను స్వప్నమున గాంచితినా? లేక జాగ్రదవస్థయందు సాక్షాత్తుగ దర్శించితినా? నన్ను లాగుకొనిపోవు పాశహస్తు లగు ఆపురుషులిపు డెచటికి వెడలినారు?

అథ తే క్వ గతాః సిద్ధాశ్చత్వారశ్చారుదర్శనాః।
వ్యమోచయన్నీయమానం బధ్వా పాశైరధో భువః ॥ 31

పృథివికి క్రిందిభాగములోనికి గొనిపోబడి పాశబద్ధుడనై యున్న నన్ను విడిపించిన సుదర్శనులైన ఆనల్వురు సిద్ధపురుషు లిపుడెచటికి వెడలినారో!

ఉ॥ *దారుణపాశబంధవిధానములన్ నరకార్ణవంబులోఁ*
*గూరినన్ను నేడు సెడకుండ నొనిర్చన పుణ్యమూర్తులం*
*భోరుహనేత్రు లుజ్జ్వలనభోమణి తేజులు లోచనోత్సవుల్*
*చారుదయాసమంచితవిచారులు నల్వురు నెందు నేగిరో.* (6.142)

అథాపి మే దుర్భగస్య విబుధోత్తమదర్శనే ।
భవితవ్యం మంగలేన యేనాత్మా మే ప్రసీదతి ॥ 32

అదృష్టహీనుడనగు నే నిపుడు అశేషములగు పాపములచే కలుషితుడ నై యున్నాను. అయినను పూర్వపుణ్యఫలముచే దేవతాశ్రేష్ఠులైన యీనల్వురు పురుషుల దర్శనము నాకు కలిగినది. వారి శ్రీమూర్తి దర్శనముచే నా చిత్తము మిగుల ప్రసన్నమైనది.

అన్యథా మ్రియమాణస్య నాశుచేర్వృషలీపతేః ।
వైకుంఠనామగ్రహణం జిహ్వా వక్తుమిహార్హతి ॥ 33

ఆ పూర్వసుకృతిలేనిచో మరణాసన్నుడను, శుచిరహితుడను, శూద్రస్త్రీభర్తను వగువా జిహ్వ ఆవైకుంఠునినామము నుచ్చరింపగలదా?

క్వ చాహం కితవః పాపో బ్రహ్మఘ్నో నిరపత్రపః ।
క్వ చ నారాయణేత్యేతద్భగవన్నామమంగలమ్ ॥ 34

వంచకుడను, పాపిని, బ్రాహ్మణత్వనాశకుడను, లజ్జావిహీనుడను నగు నే నెక్కడ? మంగళస్వరూప మగు ఆ భగవానుని నారాయణ నామ మెక్కడ?

సోఽహం తథా యతిష్యామి యతచ్చిత్తేన్ద్రియానిలః ।
యథా న భూయ ఆత్మానమన్ధే తమసి మజ్జయే ॥ 35

అట్టిమహాపాపి నగు నే నిపుడు మనస్సును, ప్రాణములను, ఇంద్రియములను నిగ్రహించుకొని మరల మహామోహాంధకారమయ మగు నీ సంసార మున విమగ్నుడను కాకుండగ నుండుటకై యత్నింపగలను.

విముచ్యతమిమం బన్ధమవిద్యాకామకర్మజమ్ ।
సర్వభూతసుహృచ్ఛాన్తో మైత్రః కరుణ ఆత్మవాన్ ॥ 36

మోచయే గ్రస్తమాత్మానం యోషిన్మయ్యాత్మ మాయయా ।
విక్రీడితో యయైవాహం క్రీడామృగ ఇవాధమః ॥ 37

దేహాదులయందాత్మబుద్ధి యుండుటవలన విషయభోగవాసన గలుగును. ఈభోగ వాసన వలన మాయికము లైనశుభాశుభకర్మలయందాసక్తి కలుగును. ఇదియే జీవుని బంధనము. దీనినుండి నేను ముక్తుడ నగుదును. శ్రీహరిమాయయే రమణీరూపముతో నన్ను వశము చేసికొనినది. నరాధముడ నగునే నామెచేతిలో గీలుబొమ్మనై యాడితిని. ఈమాయ నుండి నేను ముక్తుడ నగుదును. సర్వభోగాభిలాషలను త్యజింతును. సర్వజీవులకు మిత్రుడను, మేలుచేయువాడను, దయగలవాడను నగుదును. ఎల్లపుడు భగవచ్చింతనము నందే మగ్నుడనై యుందును.

మమాహమితి దేహాదౌ హిత్వాఽ మిథ్యార్థధీర్మతిమ్ ।
ధాస్యే మనో భగవతి శుద్ధం తత్కీర్తనాదిభిః ॥ 38

భగవన్నామ సంకీర్తనముచేత, ఆయనపార్షదులసహవాసముచేత నాచిత్తము శుద్ధమైనది. అసత్యములగు ప్రలోభములకు లొంగను. సత్యవస్తువునందు నాబుద్ధి స్థిరమైనది. ఈమారు నేను దేహాదులయందు 'అహంకారమమకారభావనను' విడచి ఆయనచరణములయందు మనస్సు నుంతును.

ఇతి జాతసునిర్వేదః క్షణసంగేన సాధుషు ।
గంగాద్వారముపేయాయ ముక్తసర్వానుబన్ధనః ॥ 39

క్షణమాత్రపుసాధుసాంగత్య ప్రభావముచే అజామిళున కిట్టిదృఢ మగు వైరాగ్యము కలిగినది. అతడు సర్వబంధనములనుండి విముక్తుడై హరిద్వారమునకు వెడలెను.

స తస్మిన్ దేవసదన ఆసీనో యోగమాస్థితః ।
ప్రత్యాహృతేన్ద్రియగ్రామో యుయోజ మన ఆత్మని ॥ 40

అజామిళు డచట ఒకదేవసదనమున ఉపవిష్టుడై భక్తి యోగసాధనమున ప్రవృత్తు డాయెను. దానివలన వానియింద్రియములు విషయములనుండి మరలినవి. అతడు తన మనసును భగవానునియందు లగ్నము చేసెను.

తతో గుణేభ్య ఆత్మానం వియుజ్యాత్మసమాధినా ।
యుయుజే భగవద్ధామ్ని బ్రహ్మణ్యనుభవాత్మని ॥ 41

అనంతర మతడు ఆత్మసమాధి ద్వారా దేహేంద్రియములనుండి మనస్సును మరలించి సర్వవ్యాపకము, సచ్చిదానందమయము నగు భగవత్స్వరూపము నందు నియమించెను.

యర్హ్యుపారతధీస్తస్మిన్నద్రాక్షీత్పురుషాన్ పురః ।
ఉపలభ్యోపలబ్ధాన్ ప్రాగ్వవన్దే శిరసా ద్విజః ॥ 42

ఇట్లు భగవానునియందు బుద్ధి నిశ్చలమై యుండగా ఒకప్పు డాద్విజుడు తనయెదుట నిలచియున్న కొందఱు పురుషులను జూచెను. వారు తనకు పూర్వము కనబడిన నలుగుర పురుషులే యనిభావించి అతడు వారికి తలవంచి నమస్కరించెను.

హిత్వా కలేవరం తీర్థే గంగాయాం దర్శనాదను ।
సద్యః స్వరూపం జగృహే భగవత్పార్శ్వవర్తినామ్ ॥ 43

వారిని దర్శించిన పిమ్మటనే అజామిళుడు శీఘ్రముగ ఆ హరిద్వార తీర్థమున జడదేహమును త్యజించి వెంటనే భగవత్పార్శ్వవర్తులగు సేవకుల స్వరూపమును పొందెను.

**సాకం విహాయసా విప్రో మహాపురుషకింకరైః ।**
**హైమం విమానమారుహ్య యయౌ యత్ర శ్రియః పతిః ॥ 44**

అతడా హరికింకరులతో గూడి స్వర్ణవిమానమును అధిరోహించి ఆకాశమార్గముగుండా శ్రీపతి యగు శ్రీహరిసమీపమునకు వెడలెను.

**ఏవం స విప్లావితసర్వధర్మా**
**దాస్యాః పతిః పతితో గర్హ్యకర్మణా ।**
**నిపాత్యమానో నిరయే హతవ్రతః**
**సద్యో విముక్తో భగవన్నామ గృహ్ణన్ ॥ 45**

ఈయజామిళుడు సర్వధర్మములను పరిత్యజించెను; వాని స్వదారనియమాది సర్వ వ్రతములు నష్టములయ్యెను. అతడు చౌర్యాదినిందితకర్మల ద్వారా పతితుడు, బ్రాహ్మ ణ్యమునుండి చ్యుతుడునై శూద్రస్త్రీకి భర్తయయ్యెను. యమదూతలు వానిని నరకమునకు గొనిపోయినప్పుడుని భగవన్నామోచ్చారణ ప్రభావముచే (నామాభాసముచే) అతడు తత్క్షణమే యమపాశమునుండి ముక్తుడయ్యెను.

**నాతః పరం కర్మనిబన్ధకృన్తనం**
**ముముక్షతాం తీర్థపదానుకీర్తనాత్ ।**
**న యత్పునః కర్మసు సజ్జతే మనో**
**రజ స్తమోభ్యాం కలిలం తతోఽన్యథా ॥ 46**

విముక్తికై ప్రయత్నించు వ్యక్తులకు తీర్థపాదుడగు భగవానుని నామ సంకీర్తనము కాక పాపమూలమును నాశము చేయు శ్రేష్ఠవస్తువు మఱి యేదియు లేదు. ఏలయన నామ సంకీర్తనాదులనుండి చిత్తము ఇక కర్మమునందు లగ్నముకాదు, కాని యది ప్రాయశ్చిత్తాదు లను చేసినను మరల రజస్తమోగుణములచే మలినమగును.

**య ఏతం పరమం గుహ్యమితిహాసమఘాపహమ్ ।**
**శృణుయాచ్ఛ్రద్ధయా యుక్తో యశ్చ భక్త్యానుకీర్తయేత్ ॥ 47**

**న వై స నరకం యాతి నేక్షితో యమకింకరైః ।**
**యద్యప్యమంగలో మర్త్యో విష్ణులోకే మహీయతే ॥ 48**

పరమగుహ్యము, సర్వపాపనాశకము నగునీయితిహాసమును నమ్మి భక్తితో శ్రవణ కీర్తనముల నొనరించువాడు పాపి యయ్యును కాలవశుడయ్యును నరకమునకు వెడలడు. యమదూతలు వానికి కనబడరు. అతడు విష్ణులోకమున పూజితు డగును.

మ్రియమాణో హరేర్నామ గృణన్ పుత్రోపచారితమ్ ।
అజామిలోఽప్యగాద్ధామ కిముత శ్రద్ధయా గృణన్ ॥ 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే అజామిలోపాఖ్యానే
ద్వితీయోఽధ్యాయః ॥

ఆహా! మరణాసన్నుడై పుత్రనామనెపముతో హరినామము నుచ్చరించి అజామిళుని వంటి బ్రహ్మబంధువుగూడ భగవద్ధామమును పొందెను. ఆ హరినామమును అపరాధ రహితుడై (శ్రద్ధతో) నిరంతరము కీర్తించినో జీవుడు ఆయనధామమును పొందును. దానిలో నెట్టి సందేహము లేదు. అదియే స్థిర మైన సిద్ధాంతము.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
అజామిళోపాఖ్యానమున రెండవ అధ్యాయము
సంపూర్ణము.





# మూడవ అధ్యాయము

## యముడు తనదూతలతో సంభాషించుట

కథాసారము :- ఈ యధ్యాయమున తన దూతలకు యమధర్మరాజు భాగవత ధర్మముయొక్క గొప్పతనమును వివరించుట, దూతలకు నచ్చజెప్పి వారిని వైష్ణవ సేవలో నియమించుట మున్నగువిషయములు వర్ణింపబడినవి.

యముడు పలికెను : దూతలారా! అజామిళుడు పుత్రునిమిషతో భగవాముని నామాభాసమును ఉచ్చరించి యే సాంకేత్యనామాభాసమును జేసెనో ఆనామాభాసము వలన వానికి విష్ణుభక్తసాంగత్యము గలిగినది. మృత్యుపాశము ఛిన్నమైనది. మహాపాపులుగూడ నామాభాసము వలన వెంటనే విముక్తులగుదురు. వారికిక జన్మాంతరాపేక్ష కలుగదు. అజామిళుడు నామాభాస ముచ్చరించినంతనే నల్వురు అలౌకిక పురుషులు శీఘ్రగతితో వానికడకు వచ్చి వానిని యమదూతల హస్తములనుండి విడిపించిరి. అప్రాకృత రూపలావణ్య యుక్తులగు ఆనల్వురు విష్ణుదూతలు తమ్మునిట్లు పరిచయము చేసి కొనిరి. "మేము భగవానుని భక్తులము, ఆ భగవానుడొక్కడే సృష్టిస్థితిలయకర్త, సర్వజీవుల కధీశ్వరుడు. ఇంద్రుడు, యముడు, వరుణుడు, శివుడు, బ్రహ్మ, అష్టలోకపాలురు, మునులు, ఎవ్వరుమ ఆయన యద్భుతకార్యములనెఱుంగజాలరు, ఆయన స్వయంప్రకాశుడు, అధోక్షజుడు, అందువలన ప్రాకృతము లైన యింద్రియములు ఆయనను వెల్లడిచేయలేవు. ఆయన మాయాధీశుడు, నిఖిలకల్యాణగుణాకరుడు. ఆయన భక్తులుగూడ నట్టి వారే. వారు జీవుల క్షేమమునకై తఱచుగ భూమండలముపై విహరించుచుందురు. పరమార్థులగుజీవులమ వారు మృత్యువు మున్నగు నానావిధము లగు విపత్తులనుండి సంపూర్ణముగ కాపాడుదురు.

సనాతనధర్మతత్త్వ మత్యంతనిగూఢము. దానిని భగవానుడుతప్ప మఱియెవ్వరుమ ఎఱుంగజాలరు. భగవానునికృపచే ఆయన భక్తులే ఆతత్త్వము నెఱుంగజాలుదురు. వారిలో బ్రహ్మ, నారదుడు, శంభువు, సనత్కుమారుడు, కపిలుడు, మనువు, ప్రహ్లాదుడు, జనకుడు, భీష్ముడు, బలి, వ్యాసతనయు డగుశుకుడు, యముడు - ఈ పండ్రెండుగురు ముఖ్యులు. వీరే ద్వాదశమహాజనులనునామముతో విఖ్యాతు లైయున్నారు. ఈ పండ్రెండు గురు మహాజనులు కాక కర్మిష్ఠులయెదుట మహాజనులుగా పరిచితులైన జైమిని మున్నగు శాస్త్రకారులబుద్ధి దైవమాయచే మోహితమైనది. ఋగ్యజుస్సామము లనువేదములలోని ఆపాతమధురవాక్యజాలముచే వారిచిత్తము జడమైనది. అందువలన వారు ద్రవ్యము, అనుష్ఠానము, మంత్రము మున్నగువానిచే విస్తృతము, బహుకష్టసాధ్యము నగుకర్మ యజ్ఞములయందు ప్రవృత్తులైరి. సుఖసాధ్యములైన నామసంకీర్తనాదులయందు వారిబుద్ధి లగ్నమగుటలేదు. బుద్ధిమంతులగు వ్యక్తులు భగవానునియందు భక్తికలిగి యుందురు.

నిరపరాధముగ నామమును గీర్తించుటయే సర్వశ్రేష్ఠ మగుభక్తి. భక్తులెన్నడును యమ దండనమునకు పాత్రులుగారు. విధివశమున వారికి పాపము కలిగినచో భగవదభిన్న మగు శ్రీనామము దానిని క్షమించును. అమితపరాక్రమశాలి యగు ఆయన గద ఆయనభక్తుల నెల్లపుడు రక్షించుచుండును. ఒక్కమారైన నిష్కపటభావముతో భగవానుని నామగుణాదులను శ్రవణకీర్తనస్మరణములను లేదా వందనములను చేయనివారు, పరమహంస లగువారికి సేవ్యము లగుభగవత్పాదపద్మములసేవయందు విముఖులైవారు, నరకద్వారభూతమగు గృహమునందే ఆసక్తులై యున్నవారు నగుమానవులె యమదండనమునకు పాత్రులగుదురు. పిమ్మట శుకుడు నామాభాసమునకు పాపమును పొగొట్టు సామర్థ్యమును గూర్చియు, కర్మ కాండకు సంబంధించిన ప్రాయశ్చిత్తాదులనిరర్థకత్వమును గూర్చియు పరీక్షిత్తునకు జెప్పెను.

## శ్రీరాజోవాచ

నిశమ్య దేవః స్వభటోపవర్ణితం
ప్రత్యాహ కిం తానపి ధర్మరాజః ।
ఏవం హతాజ్ఞో విహతాన్ మురారే -
ర్నైదేశికైర్యస్య వశే జనోఽయమ్ ॥ 1

రాజు పలికెను :- ఋషివరా! ఈలోక మంతయు ఎవరియధీనమందున్నదో అట్టి యాయమధర్మరాజు యొక్క ఆజ్ఞ వ్యర్థము కాగా, తన దూతలవలన ఆ విషయమును తెలిసికొని యతడు హరికింకరులచే పరాజితులైన ఆ దూతల కేమిచెప్పెను?

యమస్య దేవస్య న దణ్డభంగః ।
కుతశ్చనర్షే శ్రుతపూర్వ ఆసీత్ ।
ఏతన్మునే వృశ్చతి లోకసంశయం
నహి త్వదన్య ఇతి మే వినిశ్చితమ్ ॥ 2

మునివరా! యమధర్మరాజుయొక్క ఆజ్ఞ ఉల్లంఘింపబడెను. అట్టివార్త పూర్వమెన్నడును వినియుండలేదు. అందువలన ఈ విషయమున సర్వజనులకు సంశయము కలిగెను. నీవుతప్ప మఱియెవ్వరును ఈ సంశయమును నివారింపజాలరు. ఇది నాదృఢవిశ్వాసము, అందువలన దయయుంచి యా సందేహమును తొలగింపుము.

## శ్రీశుక ఉవాచ

భగవత్పురుషై రాజన్ యామ్యాః ప్రతిహతోద్యమాః ।
పతిం విజ్ఞాపయామాసుర్యమం సంయమనీపతిమ్ ॥ 3

శుకుడుపలికెను :- రాజా! భగవత్పార్షదులచే భగ్నము చేయబడిన ప్రయత్నములు గల యమదూతలు సంయమనీపురాధీశ్వరుడగు యమధర్మరాజునకు సర్వవృత్తాంతమును నివేదించిరి.

**యమదూతా ఊచుః**

**కతి సన్తీహ శాస్తారో జీవలోకస్య వై ప్రభో ।**
**త్రైవిధ్యం కుర్వతః కర్మ ఫలాభివ్యక్తి హేతవః ॥ 4**

యమదూతలు పలికిరి :- దేవా! ఈ జీవలోకమునకు శాసనకర్త లెందఱున్నారు? సత్త్వరజస్తమోగుణముల ననుసరించి శుభాశుభకర్మల నొనరించు జీవులకర్మఫలమున వెల్లడిచేయు హేతువు లెన్ని ?

**యది స్యుర్బహవో లోకే శాస్తారో దణ్డధారిణః ।**
**కస్య స్యాతం న వా కస్య మృత్యుశ్చామృతమేవ వా ॥ 5**

జగత్తులో దండధారులగు శాసనకర్త లనేకులున్నచో వారిపరస్పరాభిప్రాయభేదమువలన ఎవ్వరికిని పాపఫలము (దుఃఖము) గాని, పుణ్యఫలము (సుఖము)గానిలభింపదు. ఇంకను ఈయభిప్రాయములు ఒకటియే యైనచో గొందఱకు రెండును లభించును.

**కిన్తు శాస్తృబహుత్వే స్యాద్బహూనామిహకర్మిణామ్ ।**
**శాస్తృత్వముపచారో హి యథా మణ్డలవర్తినామ్ ॥ 6**

కర్మల జేయువారెందరు ఉన్నారు, వారికర్మఫలవ్యవస్థకై శాసనకర్తలుగూడ ఎందఱో యుందురు. కాని మండలవర్తులగు అధీనస్థవ్యక్తుల పెక్కండ్రను శాసనకర్త లనువట్లు ఈ శాసకులశాసనకర్తృత్వము ఔపచారికము అనగా గౌణము. కర్మచేయువారి ప్రకారభేదము గూడ ఎక్కువగా నుండును. వారి కర్మఫలదాతలు, శాసనకర్తలుగూడ పెక్కండ్రు ఉందురు. దానిలో దోషము లేదు. ఈ మండలవర్తులగుశాసకుల శాసన కర్తృత్వము గౌణము, అనగా ఒకచక్రవర్తి ముఖ్యశాసనకర్త యధీనములో నుండును.

**అతస్త్వమేకో భూతానాం సేశ్వరాణామధీశ్వరః ।**
**శాస్తా దణ్డధరో నృణాం శుభాశుభవివేచనః ॥ 7**

ముఖ్యశాసనకర్త యొక్కడే యగునుగాని ఎక్కువమంది కాజాలరు అందువలన దేవతలతోపాటు సర్వభూతములకు నీవొక్కడవే అధీశ్వరుడవు. మానవులపాపపుణ్యములను వివేచనచేయువాడవు నీ వొక్కడవే యను విషయము మాకు తెలిసియుండెను.

**తస్య తే విహితో దణ్డో న లోకే వర్తతేఽధునా ।**
**చతుర్భిరద్భుతైః సిద్ధైరాజ్ఞా తే విప్రలమ్భితా ॥ 8**

లోకమున నీవు విధించిన దండనముగ్రాహ్య మగుటలేదు. అద్భుత మూర్తులగు నలుగురు సిద్ధపురుషులు నీయాదేశమును ధిక్కరించి వెడలుటను మే మిప్పుడే చూచితిమి.

**నీయమానాం తవాదేశాదస్మాభిర్యాతనాగృహాన్ ।**
**వ్యామోచయన్ పాతకినం హిత్వా పాశాన్ ప్రసహ్య తే ॥ 9**

మేము నీయాదేశమును అనుసరించి యొకపాతకుని యాతనాగృహమునకు దెచ్చుచుంటిమి. ఆ సిద్ధపురుషులు బలవంతముగ వానిపాశబంధమును ఛేదించి వానిని విడచిపుచ్చిరి.

**తాంస్తే వేదితుమిచ్ఛామో యది నో మన్యసే క్షమమ్ ।**
**నారాయణేత్యభిహితో మా భైరిత్యాయయుర్ద్రుతమ్ ॥ 10**

ఈపాతకి నోటినుండి నారాయణ యను శబ్దము వెలువడినంతనె వారు "మాభైర్మాభై" "భయపడవలదు భయపడవలద"ని పలుకుచు శీఘ్రముగ నచటికి విచ్చేసిరి. నీవలన వారిని గుఱించి తెలిసికొన దలంచితిమి. ప్రభూ! నీవు మాక్షేమమును గోరినచో వారెవరో చెప్పుము.

## శ్రీబాదరాయణిరువాచ

**ఇతి దేవః స ఆపృష్టః ప్రజాసంయమనో యమః ।**
**ప్రీతః స్వదూతాన్ ప్రత్యాహ స్మరన్ పాదామ్బుజం హరేః ॥ 11**

శుకుడు పలికెను :- దూత లిట్లు అడుగగా "నారాయణ" నామశ్రవణముచే పరమప్రీతుడు ప్రజాసంయమనకారియు నగు యముడు శ్రీహరి పాదపద్మములను స్మరించి తనదూతలతో నిట్లు పలుకసాగెను.

## శ్రీయమ ఉవాచ

**పరో మదన్యో జగత స్తస్థుషశ్చ**
**ఓతంప్రోతం పటవద్యత్ర విశ్వమ్ ।**
**యదంశతోఽస్య స్థితిజన్మనాశా**
**వస్యోతవద్యస్య వశే చ లోకః ॥ 12**

యముడు పలికెను :- దూతలారా! మీరు నన్నే సర్వశ్రేష్ఠు డని భావించుచున్నారు. కాని, యది తగదు. నాకంటెను ఇంద్రచంద్రప్రముఖ లోకపాలురకంటెను శ్రేష్ఠుడు, అఖిలచరాచరముల కధీశ్వరుడు నగువాడొక డున్నాడు. అతని యంశభూతులగు బ్రహ్మ విష్ణుశివుల వలననే యీప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు జరుగుచుండును. వస్త్రమున దారములవలె ఈవిశ్వ మాయనయందే ఓతప్రోతభావముతో నున్నది. ముకుత్రాడు వేయబడిన వృషభమువలె లోకము లాయనయధీనములో నున్నవి.

**యో నామభిర్వాచి జనం నిజాయాం**
**బధ్నాతి తన్త్ర్యామివ దామభిర్గాః ।**
**యస్మై బలిం త ఇమే నామకర్మ -**
**నిబన్ధబద్ధాశ్చకితా వహన్తి ॥ 13**

లోకమున రజ్జువుచే వృషభము గట్టివేయబడినట్లు భగవానుడుగూడ తనవాక్కులనెడు వేదవాక్యములయందు బ్రాహ్మణాదినామరూపబంధనములచే సర్వజనులను బంధించి యున్నాడు. వా రీ నామకర్మబంధనములయందు బంధితులై భయముతో ఆయననిమిత్తమై పూజోపహారములను దెచ్చుచున్నారు. అనగా తమతమకర్మలద్వారా అతని నారాధించు చున్నారు.

**అహం మహేన్ద్రో నిరృతిః ప్రచేతాః**
**సోమోఽగ్నిరీశః పవనో విరించిః ।**
**ఆదిత్యవిశ్వే వసవోఽథసాధ్యా**
**మరుద్గణా రుద్రగణాః ప్రసిద్ధాః ॥ 14**

**అన్యే చ యే విశ్వసృజోఽమరేశా**
**భృగ్వాదయోఽస్పృష్టరజ స్తమస్కాః ।**
**యస్యేహితం న విదుః స్పృష్టమాయాః**
**సత్త్వప్రధానా అపి కిం తతోఽన్యే ॥ 15**

నేను, ఇంద్రుడు, నిరృతి, వరుణుడు, చంద్రుడు, అగ్ని, మహాదేవుడు, పవనుడు, బ్రహ్మ, సూర్యుడు, విశ్వావసు, అష్టవసువులు, సాధ్యులు, మరుద్గణము, రుద్రగణము, సిద్ధులు, మరీచి మున్నగు నితర విశ్వస్రష్టలు, బృహస్పతి మున్నగు దేవతాశ్రేష్ఠులు రజస్తమోగణములు ఎవని స్పృశింపజాలవో, ఆభృగువు మున్నగు సత్త్వప్రధాను లెవని లీలాకర్మల నెఱుంగజాలరో ఆయనను మాయామోహితులగు అన్యజీవులెట్లు తెలిసికొనగలరు?

యం వై న గోభిర్మనసాసుభిర్వా
హృదా గిరా వాసుభృతో విచక్షతే ।
ఆత్మానమన్తర్హృది సన్తమాత్మనాం
చక్షుర్యథైవాకృతయస్తతః పరమ్ ॥ 16

శరీరనిర్మాణపదార్థములు చక్షువులను చూడజాలనట్లు జీవుడుగూడ స్థావర జంగమములలో అంతర్యామి రూపముతో విరాజిల్లు భగవానుని ఇంద్రియమనోప్రాణ హృదయములద్వారా లేదా వాక్కులద్వారా నిర్ణయింపజాలడు.

తస్యాత్మతన్త్రస్య హరేరధీశితుః
పరస్య మాయాధిపతేర్మహాత్మనః ।
ప్రాయేణ దూతా ఇహ వై మనోహరా-
శ్చరన్తి తద్రూపగుణస్వభావాః ॥ 17

సర్వస్వతంత్రుడు, సకలాధీశ్వరుడు, మాయాధీశుడు, మహాత్ముడు పరమపురుషుడు నగు శ్రీహరియొక్క రూపగుణస్వభావాదులవలె సుందరులైన ఆయనయనుచరుల స్వభావాదులు గూడ తఱచుగ నట్లే యుండును. వారీ పృథివియందు సంచరించుచుందురు.

భూతాని విష్ణోః సురపూజితాని
దుర్దర్శలింగాని మహాద్భుతాని ।
రక్షన్తి తద్భక్తి మతః పరేభ్యో
మత్తశ్చ మర్త్యానథ సర్వతశ్చ ॥ 18

ఆ విష్ణుభృత్యులు దేవతలకుగూడ పూజ్యులే. వారియలౌకిక రూపదర్శనము మిగుల దుర్లభము. వారు విష్ణుభక్తులగుమానవులను శత్రువుల నుండి, నానుండి,అగ్నిజ్వాలాది దైవదుర్విపాకములనుండి సంపూర్ణముగ రక్షించుచుందురు.

ధర్మస్తు సాక్షాద్భగవత్ప్రణీతం
న వై విదుర్ఋషయో నాపి దేవాః ।
న సిద్ధముఖ్యా అసురా మనుష్యాః
కుతో ను విద్యాధరచారణాదయః ॥ 19

ధర్మము సాక్షాత్తుగ భగవత్ప్రణీతము, భృగువు మున్నగు సత్త్వప్రధాన ఋషులుగూడ దానిని నిశ్చయరూపమున ఎఱుంగజాలరు, దేవతలుగూడ ఎఱుంగజాలరు. ప్రధాను లగు సిద్ధులు, అసురులు మనుష్యులు ఎవ్వరును ఎఱుంగజాలరు. విద్యాధరచారణుల విషయమిక చెప్పునదేమి?

స్వయమ్భూర్నారదః శమ్భుః కుమారః కపిలో మనుః ।
ప్రహ్లాదో జనకో భీష్మో బలిర్వైయాసకిర్వయమ్ ॥ 20

ద్వాదశైతే విజానీమో ధర్మం భాగవతం భటాః ।
గుహ్యం విశుద్ధం దుర్బోధం యం జ్ఞాత్వామృత మశ్నుతే ॥ 21

దూతలారా! బ్రహ్మ, నారదుడు, శంభువు, సనత్కుమారుడు, దేవహూతినందను డగుకపిలుడు, స్వాయంభువమనువు, ప్రహ్లాదుడు, జనకుడు, భీష్ముడు, బలి, శుకదేవుడు, నేను( యముడు) ఈ పండ్రెండుగురు మహాజనులకుమాత్రము భాగవతధర్మతత్త్వము తెలియును. ఈ ధర్మము మిగుల నిర్మలము, గుహ్యము, దుర్బోధ్యము. దీనిని తెలిసికొనినచో జీవునకు భగవానుని పరమపదప్రాప్తిరూపముక్తి లభించును.

ఏతావానేవ లోకేఽస్మిన్ పుంసాం ధర్మః పరః స్మృతః ।
భక్తియోగో భగవతి తన్నామగ్రహణాదిభిః ॥ 22

నామసంకీర్తనాదులద్వారా భగవాను డగు వాసుదేవునియందు గలుగు భక్తియోగమే యీ జగత్తులో జీవులపరమధర్మ మని చెప్పబడినది.

నామోచ్చారణమాహాత్మ్యం హరేః పశ్యత పుత్రకాః ।
అజామిళోఽపి యేనైవ మృత్యుపాశాదముచ్యత ॥ 23

నాయనలారా! శ్రీహరినామోచ్చారణమాహాత్మ్యమును జూడుడు, అజామిళునివంటి మహాపాపియు పుత్రునిమిషతో నొక్కమారు ఆనామము ఉచ్చరించినంతనె (విష్ణుస్మృతివలన) నామాభాసప్రభావముచే మృత్యుపాశమునుండి ముక్తుడయ్యెను.

ఏతావతాలమఘనిర్హరణాయ పుంసాం
సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నామ్ ।
విక్రుశ్య పుత్రమఘవాన్ యదజామిలోఽపి
నారాయణేతి మ్రియమాణ ఇయాయ ముక్తిమ్ ॥ 24

అందువలన జీవులపాపములను పోగొట్టుటకు భగవానుని గుణకర్మ నామముల సంకీర్తనమె అవసరములేదు, నిరపరాధముగ తదీయనామగుణములను చక్కగ గీర్తింపక పోయినను, లేదా నామాభాసముచేతను ఈపాపహరణాదికార్యములు సంపన్నము లగును. అజామిళుడె దానికి దృష్టాంతము. మహాపాపి యగు అయ్యజామిళుడు మరణసమయమున అస్వస్థచిత్తముతో 'నారాయణ' యనితనపుత్రుని పిలచినను విష్ణుస్మృతివలన ముక్తిని పొందెను.

ప్రాయేణ వేద తదితం న మహాజనోఽయం
దేవ్యా విమోహితమతిర్బత మాయయాలమ్ ।
త్రయ్యాం జడీకృతమతిర్మధుపుష్పితాయాం
వైతానికే మహతి కర్మణి యుజ్యమానః ॥ 25

(నామసంకీర్తనాదులద్వారానే ముక్తి సులభమైనచో విద్వాంసులు కర్మయోగాదుల నేల యుపదేశించిరనుప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది) వెనుకచెప్పబడిన భాగవత ధర్మతత్త్వవేత్తలగు పండ్రెండుగురు మహాజనులు కాక యాజ్ఞవల్క్యజైమిని ప్రభృతిధర్మశాస్త్ర కారులమతి దైవీ మాయచే మిగుల మోహిత మగుటవలన వారీనామ సంకీర్తనమను పరమ భాగవతధర్మము నెఱుగజాలకపోయిరి. వారిచిత్తము ఋగ్యజుస్సామములను మూడువేద ములయందలి యర్థవాదాదులద్వారా మనోహర వాక్యముల యందే జడీభూత (లగ్న) మైనది. అందువలన వారు ద్రవ్యము, అనుష్ఠానము, మంత్రము మున్నగువానిద్వారా విస్తృతములు, బహుకష్ట సాధ్యములు నగు దర్శపౌర్ణమాసి మున్నగు తుచ్ఛములు అనిత్యఫలప్రదములు నగు కర్మయజ్ఞములయందే ప్రవృత్తులైరి. సుఖసాధ్యములు, చతుర్వర్గములను తిరస్కరించు నవియు, పరమార్థఫలప్రదములు నగు నామసంకీర్తనాదులయందు లగ్నమై యుండుట లేదు.

ఏవం విమృశ్య సుధియో భగవత్యనన్తే
సర్వాత్మనా విదధతే ఖలు భావయోగమ్ ।
తే మే న దణ్డమర్హన్త్యథ యద్యమీషాం
స్యాత్పాతకం తదపి హన్త్యురుగాయవాదః ॥ 26

ఈ సర్వవిషయముల నాలోచించియే బుద్ధిమంతు లగు వ్యక్తులు సర్వాంతః కరణముతో అఖిలకల్యాణగుణనిలయుడగు వాసుదేవునినామకీర్తనాదు లనుభక్తియోగమునె విధించుచున్నారు. వారు నాదండనమున కర్హులుకారు. వారికి పాపము కలగదు. పొరపాటు వలన నెప్పుడైన పాపము కలిగినచో భగవానునినామసంకీర్తన ప్రభావముచేతనే అది ధ్వంస మగును.

తే దేవసిద్ధపరిగీతపవిత్రగాథా
యే సాధవః సమదృశో భగవత్ప్రపన్నాః ।
తాన్ నోపసీదత హరేర్గదయాభిగుప్తాన్
నైషాం వయం న చ వయః ప్రభవామ దణ్డే ॥ 27

దేవతలచేత సిద్ధులచేత కీర్తింపబడు గుణగాథలు గలవారు, భగవానుని శరణు బొందినవారు, సర్వభూతములను సమముగ జూచువారు అగుసాధువులకడకు మీ రెప్పుడును వెడలవలదు. శ్రీహరియొక్క కౌమోదికి యనుగద వారి నెల్లప్పుడును రక్షించుచుండును. మేము (బ్రహ్మాదులతోగూడ నేను) వారిని దండింపజాలము, కాలము కూడ దండింపజాలదు.

తానానయధ్వమసతో విముఖాన్ ముకున్ద
పాదారవిన్ద మకరన్ద రసాదజస్రమ్ ।
నిష్కించనైః పరమహంసకులైరసంగై -
ర్జుష్టాద్గృహే నిరయవర్త్మని బద్ధతృష్ణాన్ ॥ 28

ఇట్లు ముకుందపదారవిందమకరందరసమును అసత్సంగవర్జితులు, నిష్కించనులు నగు పరమహంసలు నిరంతరము పానముచేయుచుందురు. దానికి విముఖులై అపద్వ్యక్తులు నరకమునకు ద్వారస్వరూప మగు గృహము నందే ఆసక్తులై యుందురు. దూతలారా! మీరు వారినే నాకడకు దీసికొనిరండు.

జిహ్వా న వక్తి భగవద్గుణనామధేయం
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిన్దమ్ ।
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాపి
తానానయధ్వమసతోఽకృతవిష్ణుకృత్యాన్ ॥ 29

ఒక్కమారైన కృష్ణనామగుణములను గీర్తింపని జిహ్వాగలవారు, ఆయన పాదపద్మము లను ఒక్కమారైన స్మరింపని చిత్తముగలవారు, ఆయన చరణముల కొక్కమారైన నమస్కరింపని శిరస్సు గలవారు, ఎప్పుడును వైష్ణవవ్రతాదుల నొనరింపనివారు నగు పాపిని మీరు నాకడకు దీసికొనిరావలయును.

తత్ క్షమ్యతాం స భగవాన్ పురుషః పురాణో
నారాయణః స్వపురుషైర్యదసత్కృతం నః ।
స్వానామహో న విదుషాం రచితాంజలీనాం
క్షాన్తిర్గరీయసి నమః పురుషాయ భూమ్నే ॥ 30

(అనంతరము యమధర్మరాజు తన భృత్యులయపరాధమును తన యపరాధముగ భావించి భగవానునినుండి క్షమాపణమును వేడుకొను చున్నాడు) నాదూత లొనరించిన అపరాధమును పురాణపురుషు డగు నారాయణుడు క్షమించుగాక! నే నాయనభృత్యుడను.

ఇది తెలియక వారపరాధమొనరించిరి. అందువలన దోసిలొగ్గి క్షమాపణమును వేడుకొను చున్నాను. ఆహా! సర్వోత్తము డగు ఆయనయందు క్షమాగుణ మవశ్యముండును. నే నాపరపురుషునకు నమస్కరించుచున్నాను.

**తస్మాత్సంకీర్తనం విష్ణోర్జగన్మంగల మంహసామ్ ।**
**మహతామపి కౌరవ్య విద్ధ్యైకాన్తికనిష్కృతమ్ ॥ 31**

శుకదేవుడు పలికెను :- కురునందనా! ఈ ప్రసంగమువలన శ్రీహరినామసంకీర్తనమే గురుతరము లగు పాపములను సమూలముగ నాశనము చేయుననియు, నామసంకీర్తనమే అఖిలజగత్తునకు మంగళస్వరూప మైనదనియు వ్యక్తమైనది.

**శృణ్వతాం గృణతాం వీర్యాణ్యుద్దామాని హరేర్ముహుః ।**
**యథా సుజాతయా భక్త్యా శుధ్యేన్నాత్మా వ్రతాదిభిః ॥ 32**

పాపములను నివారించు శ్రీహరియొక్క యత్యుత్తమ మాహాత్మ్యకథను నిరంతరము శ్రవణకీర్తనముల జేసినచో సులభముగ ఆయనయందు భక్తి యేర్పడును. ఈ భక్తి యంతఃకరణమును శుద్ధిచేసినట్లుగ ఇతరవ్రతాదులు చేయజాలవు.

**కృష్ణాఙ్ఘ్రిపద్మమధులిడ్ న పునర్విసృష్ట**
**మాయాగుణేషు రమతే వృజినావహేషు ।**
**అన్యస్తు కామహత ఆత్మరజః ప్రమార్ష్టు**
**మీహేత కర్మ యత ఏవ రజః పునః స్యాత్ ॥ 33**

శ్రీకృష్ణపాదపద్మ మధుపానవ్రతులగు భాగవతులు నరకాది దుఃఖప్రదము లగు మాయాగుణములను (విషయములను) అతితుచ్ఛములనిభావించి పరిత్యజింతురు. మఱియెన్నడును వానియం దాసక్తులు గారు. కాని భగవత్పాదసేవ నెఱుంగనివారు, కామాభిభూతులు నగు వ్యక్తులు తమ పాపాదిదోషములను నాశనము చేసికొనుటకు కర్మ కాండలోని ప్రాయశ్చిత్తముల నొనరింతురు. కాని వానివలన వారిచిత్తము శుద్ధముకాదు. అందువలన వారు మరల ఆపాపకర్మములయందు లగ్నమగుదురు.

**ఇత్థం స్వభర్తృగదితం భగవన్మహిత్వం**
**సంస్మృత్య విస్మితధియో యమకింకరాస్తే ।**
**నైవాచ్యుతాశ్రయజనం ప్రతి శంకమానా**
**ద్రష్టుం చ బిభ్యతి తతః ప్రభృతి స్మ రాజన్ ॥ 34**

యమదూతలు తమప్రభువు చెప్పిన ఈ విధమగు శ్రీహరిమాహాత్మ్యమును విని మిగుల విస్మితులైరి. అప్పటినుండి వారు భగవచ్చరణాశ్రితులగు వ్యక్తులను జూచినంతనె "ఆహా! వీరే మనకు కాల"మని శంకించి తిరిగి చూచుటకు భయపడుచుందురు.

**ఇతిహాసమిదం గుహ్యం భగవాన్ కుమ్భసమ్భవః ।**
**కథయామాస మలయ ఆసీనో హరిమర్చయన్ ॥ 35**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్ర భాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే అజామిలోపాఖ్యానే
తృతీయోఽధ్యాయః॥

మలయపర్వతమున ఒకప్పుడు అగస్త్యమహర్షి శ్రీహరి యర్చన యందు నిమగ్నుడై యుండెను. అపుడు ఆయనయే నాకు (శుకునకు) రహస్య మగునీయితిహాసమును జెప్పెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
అజామిళోపాఖ్యాన మనుమూడవ అధ్యాయము
సంపూర్ణము.





# నాలుగవ అధ్యాయము

## దక్షుడు భగవానుని స్తుతించుట :

## భగవానుడు ప్రాదుర్భవించుట

కథాసారము :- ఈ అధ్యాయమున ప్రజాసృష్టికై దక్షుడు తపస్సుచేయుట, 'హంసగుహ్య' మను స్తోత్రముద్వారా శ్రీహరిని ఆరాధించుట, దక్షునకు విష్ణుభగవానుడు తగిన వరముల నిచ్చుట యనువిషయములు వర్ణింపబడినవి.

పరీక్షిన్మహారాజు శుకమహర్షిని జీవసృష్టివిషయమును గూర్చి విపులముగ చెప్పవలసినది యని యడుగగా శుకుడు పరీక్షిత్తున కిట్లు చెప్పెను. ప్రాచీనబర్హిపుత్రులగు పదుగురు ప్రచేతసులు తపస్సుకొరకై సముద్రములోనికి వెడలగా రాజు లేకపోవుటచే పృథివీతలమున ఎట్టిసస్యాదులు ఫలింపలేదు. కాని సర్వప్రదేశములు వృక్షలతలచే నిండియుండెను. ప్రచేతసులు సముద్రమునుండి బయల్వెడలి వృక్షలతలతో నిండియున్న భూమిని జూచి వృక్షములపై గోపించి వానిని నాశము చేయుటకు తమతమనోళ్ళనుండి వాయువును అగ్నిని సృష్టించిరి. వనస్పతులకురాజగు సోముడు మిగుల కాతరుడై జీవులకు భక్ష్య భోజ్యములైన వృక్షలతలను నాశనముచేయుట నిషేధించి యావృక్షములచేపెంచబడిన 'ప్రమ్లోచ' యను అప్సరస పుత్రికను ప్రచేతసులకు అర్పించి వారిని సంతుష్టి పఱచెను. ప్రచేతసులవలన ఆకన్యక దక్షుని గనినది.

దక్షుడు మొదట దేవదైత్యమనుష్యాదులను మనస్సు నుండి సృష్టించెను. కాని వారివలన సృష్టి వృద్ధిపొందకపోవుట చూచి యతడు సన్యసించి వింధ్యపర్వతమునకు వెడలి కఠోర తపస్సు చేయ నారంభించెను. 'హంసగుహ్య'మను స్తోత్రము ద్వారా విష్ణువును స్తుతించి యిట్లుపలికెను. "పరమాత్మయగు శ్రీహరియే జీవమాయానియామకుడు, స్వప్రకాశుడు. శబ్దస్పర్శాది విషయములు శ్రోత్రాదు లైన యింద్రియముల సఖ్యమును అనగా ప్రకాశత్వమును దెలియనట్లు సఖుడైన జీవుడుగూడ ఈదేహరూప మగు పురమున నివసించి ఆస్థానము నందే నివసించు సఖునియొక్క ఇంద్రియ ప్రవర్తకాదిరూపసఖ్యము నెఱుంగజాలడు. ఏలయన, వానిసృష్టి ప్రపంచమునందే నిబద్ధమైయున్నది. జీవాత్మ చేతనుడగుటచే దేహాదులను వానికి మూలభూతము లగుగుణములను తెలిసికొనినవాడై నను సర్వజ్ఞుడు, అనంతగుణవిశిష్టుడు నగు అధోక్షజ భగవాను నెఱుంగజాలడు. పండితులు హృదయమున దుర్విజ్ఞేయ మగు భగవానుని సవిశేష స్వరూపమును నిలుపుకొని ఆయనను నిత్యము దర్శించుచుందురు. జీవుని వాక్కు, బుద్ధి మొదలైన వన్నియు మాయికములే. మాయిక వస్తువుద్వారా నిరూపిత మగునది మాయా స్వరూపమే కాని ప్రాకృత మనోవాక్కుల

ద్వారా నిరూపిత మగునది అధోక్షజుని స్వరూపముకాదు. సేవోన్ముఖమగు ఆత్మయందే అధోక్షజుని నిత్యభగవత్స్వరూపము స్వయముగ ప్రకాశితమగును. ఏయధికరణమువందు, ఏయ పాదానము వలన, ఏకరణముద్వారా, ఎవనిసంబంధముచే, ఎవనిసంప్రదానార్థమై, యత్కర్మ కము, యత్కర్తృకము నగు ఏకర్మ చేయబడెనో లేదా చేయింపబడెనో అదియె బ్రహ్మవస్తువు. అదియె సమస్తమునకు గారణము. ఏలయన, అది అన్నింటికి మొదటనే స్వయముగ సిద్ధమైయున్నది. అది పరము అపరము అన్నింటికి పరమకారణము, అది అన్యనిరపేక్షము. ఎవరియొక్క అవిద్య యను మాయాశక్తి ఒకప్పుడు వివాదకారుల వివాదమునకు, సంవాదమునకు గారణస్వరూప మగునో మాటిమాటికి వారికి ఆత్మమోహమును గలుగజేయునో అట్టి యనంత గుణమయు డగు ఆపరమపురుషుడే స్తవనీయుడు. ఆయన భక్తవత్సలుడు, భక్తులపై కృపజూపుటకే ఆయన నిత్యములు, అప్రాకృతములు, అనంతములునగు తన నామరూప గుణలీలలను ప్రకటించును.

ప్రాకృతులు, అర్వాచీనులు నగు వ్యక్తులే పరమేశ్వరు డగు విష్ణువునుగాక ఫలప్రదాత లగు ఇతరదేవతల నారాధింతురు. వాయువు భౌతికపద్మాదివిశేషపదార్థముల విశేషగంధము నాశ్రయించి నానావిధములగు గంధవిశిష్టరూపములతో ప్రకాశించునట్లు, రేణువులయొక్క ధూసరత్వాది గుణముల నాశ్రయించి నానారూపములతో భాసిల్లునట్లు భగవానుడుగూడ అర్వాచీన మగు ఉపానామార్గముద్వారా మానవులవాసనల ననుసరించి ఆయాఫలప్రదాత లగు దేవతా రూపములతో వెల్లడియగును. ఏకైక పరమేశ్వరుడు సత్య స్వరూపుడు నగు విష్ణువే తన్నాశ్రయించిన వ్యక్తులమనో వాంఛలను పూర్తిచేయజాలును. అందువలన అన్యదేవతలను ఆరాధించుట నిష్ప్రయోజనము.

దక్షునియాస్తుతికి భగవానుడు సంతుష్టుడై ఎనిమిది అస్త్రములచే శోభిల్లునట్టి ఎనిమిది భుజములతో గూడినట్టి పీతవసనధారియైన తన నవఘనశ్యామరూపమును జూపించెను. కాని దక్షుని హృదయగతభావము నెఱింగి యతడు ప్రవృత్తి మార్గాసక్తుడై యుండుట చూచి వానిని తనబహిరంగమాయ ద్వారా తరగిపోని విషయభోగములయందు అనగా కర్మ మార్గమునందు బడవేయుటకై పంచజన ప్రజాపతి పుత్రిక యగు అసిక్ని యనునామెను వానికి భార్యగా నొసంగి స్త్రీపురుషుల రతిక్రీడాధర్మమున దక్షతను పొందు వరము నిచ్చి ఆయన అంతర్హితుడయ్యెను.

## శ్రీరాజోవాచ

**దేవాసురనృణాం సర్గో నాగానాం మృగపక్షిణామ్ ।**
**సామాసిక స్త్వయా ప్రోక్తో యస్తు స్వాయంభువేఽన్తరే ॥** 1

తస్యైవ వ్యాసమిచ్ఛామి జ్ఞాతుం తే భగవాన్ యథా ।
అనుసర్గం యయా శక్త్యా ససర్జ భగవాన్ పరః ॥ 2

పరీక్షిన్మహారాజు పలికెను :- దేవా! స్వాయంభువమన్వంతరమున దేవతలు, అసురులు, మనుష్యులు, నాగులు, మృగములు, పక్షులు అనువాని సృష్టివృత్తాంతమును నీవు (తృతీయ స్కంధమున) సంక్షేపముగ వర్ణించితివి. దానిని నీవలన సవిస్తరముగ తెలియ గోరుచున్నాను. పరమపురుషుడగు భగవానుడు ఏ శక్తిద్వారా ఏవిధముగ వ్యష్టిసర్గమును అవాంతరసర్గమును సృష్టించెనో నే నాశక్తిని, ఆ విధమును తెలిసికొనగోరుచున్నాను.

## శ్రీసూత ఉవాచ

ఇతి సంప్రశ్నమాకర్ణ్య రాజర్షేర్బాదరాయణిః ।
ప్రతినన్ద్య మహాయోగీ జగాద మునిసత్తమాః ॥ 3

సూతుడుపలికెను :- మునిశ్రేష్ఠులారా! రాజర్షి యగు పరీక్షిత్తు ఇట్లడుగగా విని మహాయోగి యగు శుకమహర్షి వానియీప్రశ్నను ప్రశంసించుచు ఇట్లు సమాధాన మిచ్చెను.

## శ్రీశుక ఉవాచ

యదా ప్రచేతసః పుత్రా దశ ప్రాచీనబర్హిషః ।
అన్తస్సముద్రాదున్మగ్నా దదృశుర్గాం ద్రుమైర్వృతామ్ ॥ 4

శుకుడు పలికెను :- ప్రాచీనబర్హియొక్క పదుగురు పుత్రులైన ప్రచేతసులు సముద్రమునుండి బయల్వెడలివచ్చి చూడగా పృథివి వృక్షాదులచేగప్పివేయబడి యుండెను. (నారదోపదేశము ననుసరించి ప్రాచీనబర్హి సంసార విరక్తుడై తపస్సునకు వెడలెను. దాని వలన భూమండలమున అరాజకము ప్రబలెను. కృష్యాదికర్మలు జరుగకపోవుటచే పృథివి తరువులచే నిండిపోయెను)

ద్రుమేభ్యః క్రుధ్యమానాస్తే తపోదీపితమన్యవః ।
ముఖతో వాయుమగ్నించ సస్పృజుస్తద్దిధక్షయా ॥ 5

అపుడు తపఃక్లేశమువలన కలిగిన సంతాపముచే క్రోధోద్దీప్తులగు ఆప్రచేతసులు ద్రుమముల (చెట్ల) పై క్రుద్ధులై వానిని దగ్ధము చేయదలచి నోటినుండి వాయువును, అగ్నిని సృష్టించిరి.

తాభ్యాం నిర్దహ్యమానాంస్తానుపలభ్య కురూద్వహ ।
రాజోవాచ మహాన్ సోమో మన్యుం ప్రశమయన్నివ ॥ 6

పరీక్షిన్మహారాజా! ఆ యగ్నివాయువులచే పూర్తిగ దగ్ధమగుచున్న తరువులను జూచి వనస్పతులకు రాజగు చంద్రుడు ప్రచేతసుల క్రోధమును శాంతింపజేయుటకై యిట్లు పలికెను.

**న ద్రుమేభ్యో మహాభాగా దీనేభ్యో ద్రోగ్ధుమర్హథ ।**
**వివర్ధయిషవో యూయం ప్రజానాం పతయః స్మృతాః ॥ 7**

మహాత్ములారా! దీనములైన ఈ ద్రుమములను దగ్ధముచేయుట మీకు తగదు. ఏలయన మీరు ప్రజావర్గమును వృద్ధిచేయనభిలాషకలవారు, పాలకులు గదా!

**అహో ప్రజాపతిపతిర్భగవాన్ హరిరవ్యయః ।**
**వనస్పతీనోషధీశ్చ ససర్జోర్జమిషం విభుః ॥ 8**

ఆహా! బ్రహ్మాదిప్రజాపతులకు పతియు, విభుడు (చరాచరవ్యాపియు), అవ్యయుడు, (అవికారి) యగు శ్రీహరి ఈవనస్పతులను ఓషధులను జీవులకు అన్నరూపమున సృష్టించెను. (మీరు ప్రజాపతులు, ప్రజలభక్ష్య భోజ్యములను నాశముచేయుట మీకు తగదు. ఏలయన, ఆహారద్రవ్యము నశించిన ప్రజలుగూడ నశింతురు గదా!)

**అన్నం చరాణామచరా హ్యపదః పాదచారిణామ్ ।**
**అహస్తా హస్తయుక్తానాం ద్విపదాం చ చతుష్పదః ॥ 9**

అచరము (స్థావరము) లైనపుష్పఫలాదులు చరము (జంగమము) లగు భ్రమరాదులకు అన్నము అనగా భక్ష్యము. పదహీనములు అనగా తృణాదులు పాదచారు లగు గోమహిషాదుల కన్నము; హస్తహీనము లైన మృగాదులు హస్తవిశిష్టము లగు వ్యాఘ్రాదులకు అన్నము, చతుష్పాద మృగాదులు, స్థావరము లగు వ్రీహ్యాదులు ద్విపాదు లగు మనుష్యులకు అన్నము.

**యూయం చ పిత్రాన్వాదిష్టా దేవదేవేన చానఘాః ।**
**ప్రజాసర్గాయ హి కథం వృక్షాన్ నిర్దగ్ధుమర్హథ ॥ 10**

నిర్మలాత్ములారా! మీ తండ్రి యగు ప్రాచీనబర్హి, దేవదేవుడగు భగవానుడు మిమ్ము ప్రజాసృష్టిచేయుటకై ఆదేశించినారు. అందువలన ప్రజలజీవనధారణమున కుపయోగపడు వృక్షములను, ఓషధులను దగ్ధము చేయుట మీకెట్లు తగును?

**ఆతిష్ఠత సతాం మార్గం కోపం యచ్ఛత దీపితమ్ ।**
**పిత్రా పితామహేనాపి జుష్టం వః ప్రపితామహైః ॥ 11**

మీపితృపితామహప్రపితామహప్రభృతులచే సేవింపబడిన జీవరక్షణ లక్షణమగు సాధుమార్గమును మీ రనుసరింపుడు. కోపమును ప్రదర్శించుట మీకు తగదు. మీకోపము నుపసంహరించుకొనుడు.

**తోకానాం పితరౌ బన్ధు దృశః పక్ష్మ స్త్రియాః పతిః ।**
**పతిః ప్రజానాం భిక్షూణాం గృహ్యజ్ఞానాం బుధః సుహృత్ ॥ 12**

తల్లిదండ్రులు బాలకులకు, రెప్పలు నేత్రములకు, పతి స్త్రీకి, గృహస్థు భిక్షుకులకు, జ్ఞాని అజ్ఞులకు బంధువు లైనట్లు ప్రజలకు రక్షకుడు జీవికా ప్రదాతయు నగుటచే ప్రజాపతి యగురాజే ప్రజలకు బంధువు (అందువలన) ప్రజలకు సంబంధించన వృక్షములను నాశముచేయుట మీకు తగదు.

**అన్తర్దేహేషు భూతానామాత్మాస్తే హరిరీశ్వరః ।**
**సర్వం తద్ధిష్ణ్యమీక్షధ్వమేవం వస్తోషితో హ్యసౌ ॥ 13**

స్థావరజంగమాత్మక మగుభూతములదేహములలో జగదీశ్వరుడగు శ్రీహరి ఆత్మ రూపముతో విరాజిల్లుచున్నాడు. అందువలన మీ రీ స్థావర జంగమాత్మక మగు విశ్వమును ఆయన కధిష్ఠానభూమిగ దర్శించుడు. ఇట్టి దర్శనముచేతనే మీరు శ్రీహరిని తుష్టిపఱచితిరి. అందువలన మీకు భూతద్రోహము తగదు.

**యస్సముత్పతితం దేహే ఆకాశాన్మన్యుముల్బణమ్ ।**
**ఆత్మజిజ్ఞాసయా యచ్ఛేత్ స గుణానతివర్తతే ॥ 14**

ఆత్మవిచారముద్వారా ఆకాశమునుండి (అకస్మాత్తుగ) సముత్పతిత మైన (బయల్వెడలిన) దేహమునందున్న ఉత్కట మగు క్రోధమును నిగ్రహించుకొనినవాడు దుఃఖములకు హేతువగు సంసారమును అతిక్రమింప గలుగును.

**అలం దగ్ధైర్ద్రుమైర్దీనైః ఖిలానాం శివమస్తు వః ।**
**వార్క్షీ హ్యేషా వరా కన్యా పత్నీత్వే ప్రతిగృహ్యతామ్ ॥ 15**

ఈదీనవృక్షములను దగ్ధముచేయుటవలన ఎట్టి ప్రయోజనము ఉండదు. దగ్ధము చేయగా మిగిలిన వృక్షములకు, మీకు శుభము కలుగుగాక! మీరు వృక్షములచే పెంచబడిన 'మారిష' యను మంచిలక్షణములు గల యీ కన్యను పత్నిగా స్వీకరింపుడు.

**ఇత్యామన్త్ర్య వరారోహాం కన్యామాప్సరసీం నృప ।**
**సోమో రాజా యయౌ దత్త్వా తే ధర్మేణోపయేమిరే ॥ 16**

రాజా! ప్రభువైన సోముడిట్లు నచ్చజెప్పి వారికి "ప్రమ్లోచ" యను అప్సరసకు జన్మించినదియు పులినశ్రోణియు నగుకన్యకను ఇచ్చి వెడలి పోయెను. వారు పదుగురు ధర్మానుసారముగ ఈ కన్యను పరిణయమాడిరి.

**తేభ్యస్తస్యాం సమభవద్దక్షః ప్రాచేతసః కిల ।**
**యస్య ప్రజావిసర్గేణ లోకో ఆపూరితాస్త్రయః ॥ 17**

ఆపదుగురు ప్రచేతసులవలన ఆమారిష యనునామెకు ప్రాచేతసుడను దక్షుడు ఉత్పన్నుడయ్యెను. ఈ దక్షునిచే సృష్టించబడిన ప్రజలచే మూడు లోకములునిండిపోయెను.

**యథా ససర్జ భూతాని దక్షో దుహితృవత్సలః ।**
**రేతసా మనసా చైవ తన్మమావహితః శృణు ॥ 18**

దుహితృవత్సలుడు, ప్రజాపతియు నగుదక్షు డేవిధముగ వీర్యము ద్వారా, మనస్సుద్వారా భూతములను సృష్టించెనో దానిని నావలన శ్రద్ధగ వినుము.

**మనసై వాసృజత్పూర్వం ప్రజాపతిరిమాః ప్రజాః ।**
**దేవాసురమనుష్యాదీన్ నభఃస్థలజలౌకసః ॥ 19**

ప్రజాపతి యగు దక్షుడు మొదట మనస్సుద్వారానే దేవతలు, అసురులు, మనుష్యులు, ఖేచరులు, భూచరులు, జలచరులు మున్నగు ప్రజలను సృష్టించెను.

**తమబృంహితమాలోక్య ప్రజాసర్గం ప్రజాపతిః ।**
**విన్ధ్యపాదానుపవ్రజ్య సోఽచరద్దుష్కరం తపః ॥ 20**

కాని ఆయన తనచే సృష్టింపబడిన ప్రజలు వృద్ధిపొందకపోవుట చూచి వింధ్యాచలము నకు సమీపమున నున్న ఒకానొక పర్వతముమీదకు వెడలి దుష్కర మగు తప మొనరింప సాగెను.

**తత్రాఘమర్షణం నామ తీర్థం పాపహరం పరమ్ ।**
**ఉపస్పృశ్యానుసవనం తపసాతోషయద్ధరిమ్ ॥ 21**

ఆ పర్వతమున పాపహరము, అఘమర్షణము నగు నొకతీర్థరాజమున్నది. ప్రజాపతి యగు దక్షు డాప్రదేశమున త్రిసంధ్యలయం దాచమనాదుల నొనరించి తపస్సుద్వారా శ్రీహరికి సంతోషమును కలిగించెను.

**అస్తౌషీద్ధంసగుహ్యేన భగవన్తమధోక్షజమ్ ।**
**తుభ్యం తదభిధాస్యామి కస్యాతుష్యద్యథా హరిః ॥ 22**

ప్రజాపతియగు దక్షుడు 'హంసగుహ్య' మనుస్తోత్రముద్వారా అధోక్షజు డగు శ్రీహరిని స్తుతించెను. ఆ స్తుతివలన ఏవిధముగ శ్రీహరి దక్షునిపట్ల సంతుష్టిచెందెనో దానిని నీకు వివరింతును.

## శ్రీప్రజాపతిరువాచ

నమః పరాయాఽవితథానుభూతయే
గుణత్రయాభాసనిమిత్తబన్ధవే ।
అదృష్టధామ్నే గుణతత్త్వబుద్ధిభి-
ర్నివృత్తమానాయ దధే స్వయమ్భువే॥ 23

దక్షప్రజాపతి అధోక్షజుడగు శ్రీహరిని ప్రసిద్ధమగు 'హంసగుహ్య' స్తవము ద్వారా ఇట్లు స్తుతించెను - మాయకంటె మాయికపదార్థముల కంటె నుత్తముడు, అవ్యభిచారిణి యగు జ్ఞానేచ్ఛాశక్తులతో గూడినవాడు, జీవమాయలకు నియంతయు, ప్రవర్తకుడు, మాయికగుణత్రయపరిణామభూతములు అనిత్యములు నగు పృథివ్యాదివిషయములయందు స్వభోగ్య జ్ఞానముతో సత్యబుద్ధివిశిష్టుడు, లేదాగుణాదులపరిణామభూతత్త్వముచేతనే "ఇతడు దేవత ఇతడు మనుష్యుడు" నునుబుద్ధితో గూడిన జనులకు గనబడని స్వరూపము గలవాడు, ప్రత్యక్షాదిప్రమణముల కతీతుడు అనగా స్వతఃప్రమాణుడు లేదా అపరిచ్ఛిన్నుడు, కారణాంతరములవలన ఉత్పన్నము కానివాడు అనగా స్వయంప్రకాశుడు అగు ఆ భగవానునకు నేను నమస్కరించుచున్నాను.

న యస్య సఖ్యం పురుషోఽవైతి సఖ్యుః
సఖా వసన్ సంవసతః పురేఽస్మిన్ ।
గుణో యథా గుణినో వ్యక్తదృష్టే-
స్తస్మై మహేశాయ నమస్కరోమి ॥ 24

రూపరసగంధస్పర్శశబ్దాదివిషయములు తమ్ము వెల్లడిచేయు నింద్రియముల ప్రకాశకత్వము నెఱుంగలేవు. అట్లే జీవు డాదేహపురమున నుండియు జీవదేహమున విరాజిల్లువాడు, ప్రపంచాధీశుడు, విభుచిత్తుడు నగు పరమేశ్వరునికరణ (ఇంద్రియ) ప్రవర్తకత్వాదులను అనగా హృషీకేశత్వమును తెలిసికొనజాలడు. ఆ మహేశ్వరునకు నేను నమస్కరించుచున్నాను.

దేహోఽసవోఽక్షా మనవో భూతమాత్రా
మాత్మానమన్యం చ విదుః పరం యత్ ।
సర్వం పుమాన్ వేద గుణాంశ్చ తజ్జ్ఞో
న వేద సర్వజ్ఞమనన్తమీడే ॥ 25

దేహము, ప్రాణములు, ఇంద్రియములు, అంతఃకరణము, పృథివ్యాదిస్థూల భూతములు, శబ్దాదితన్మాత్రలు స్వస్వరూపమును ఇతరేంద్రియ స్వరూపమును ఇంకను ఈ రెండింటికంటె శ్రేష్ఠులైన తదధిష్ఠాత లగు దేవతలస్వరూపమును - ఒక్కదానివిగూడ నెఱుంగజాలవు. ఏలయన ఆదేహాదులు జడములు. కాని జీవుడు చేతను డగుటచే దేహాదులను వానికి మూలభూతములగు తత్త్వాదిగుణములను ఎఱుంగును. ఈసకల విషయముల నెఱింగినవాడైనను జీవుడు సర్వజ్ఞుడగుఅనంతస్వరూపుని ఎఱుగజాలడు. నేనట్టి సర్వజ్ఞుడగు ఈశ్వరుని స్తుతించుచున్నాను.

యదోపరామో మనసో నామరూప -
రూపస్య దృష్టస్మృతిసంప్రమోషాత్ ।
య ఈయతే కేవలయా స్వసంస్థయా
హంసాయ తస్మై శుచిసద్మనే నమః ॥ 26

ఏ సమయమున చిత్తమున కుపరతి గలుగునో (నిగ్రహము కలుగునో) అనగా జాగ్రదవస్థవలె లేదా స్వప్నావస్థవలె చిత్తమునకు విక్షేపము కలుగక సుషుప్త్యవస్థవలె చిత్తమునకు లయము కలుగక సమాధి కలుగునో అపుడు నామరూపములను కలుగజేయు నీచిత్తముయొక్క దర్శన స్మరణముల వినాశమును పొందును. ఇట్టి సమాధికాలమున జీవచిత్తమున తనసచ్చిదానందస్వరూపముతో ప్రకాశితు డగువాడు, శుద్ధాంతఃకరణైక గమ్యుడు నగు ఆహంసభగవానునకు నమస్కరించుచున్నాను.

మనీషిణోఽన్తర్హృది సన్నివేశితం
స్వశక్తిభిర్నవభిశ్చ త్రివృద్భిః ।
వహ్నిం యథా దారుణి పాంచదశ్యం
మనీషయా నిష్కర్షన్తి గూఢమ్ ॥ 27

స వై మమాశేషవిశేషమాయా -
నిషేధనిర్వాణసుఖానుభూతిః ।
స సర్వనామా స చ విశ్వరూపః
ప్రసీదతామనిరుక్తాత్మశక్తిః ॥ 28

కాష్ఠములో నిగూఢముగ నున్న అలౌకిక మగు అగ్నిని పండితులు పంచదశసామధేనీ మంత్రముల ద్వారా బహిర్గతము చేయుదురు. అట్లే వివేకవంతులుగూడ సత్త్వరజస్తమము లను మూడు గుణములు, ప్రకృతి, మహదహంకారమనస్సులు, పంచతన్మాత్రలు - ఈ

తొమ్మిది, పంచమహాభూతములు దశేంద్రియములు, ఈ పదునైదు మొత్తము ఇరువదియేడు తత్త్వములతో గూడిన తనశక్తిచే ఆవరింబడిన హృదయములో నున్న పరమాత్మను ధ్యానించుచుందురు. ఆ పరమాత్మ నాకు ప్రసన్నుడగుగాక! కార్యకారణాత్మకము ప్రపంచ రూపము అశేషవైచిత్రమయము నగు మాయ యొక్క భోగములు తొలగుటచే మోక్షసుఖము (స్వరూపసిద్ధియందు సేవాసుఖము) ఉపస్థితము కాగా ఆయన అనుభూతు డగును. ఆయన సకల చిదుదితనామములకు వాచ్యుడు. సర్వచిత్స్వరూపుడు, అచింత్యశక్తి యుక్తుడు. ఆయన నాకు ప్రసన్నుడగుగాక.

యద్యన్నిరుక్తం వచసా నిరూపితం
ధియాక్షభిర్వా మనసోత యస్య ।
మా భూత్ స్వరూపం గుణరూపం హి తత్తత్
స వై గుణాపాయవిసర్గలక్షణః ॥ 29

వాక్కులచే అభిహితమగునది బుద్ధిచే నిరూపితమైనది ఇంద్రియములచే గ్రహింప బడినది మనస్సుచే సంకల్పింపబడునది సమస్తము గుణములకార్య మగుటచే వానిలో నేదియు ఆయన స్వరూపముకాదు. ఆయన స్వయముగ గుణాతీతుడు, గుణములయుత్పత్తి వినాశములకు కారణుడు నగుటచే త్రిగుణముల కార్యంతములయందు విరాజిల్లుచున్నాడు. ఆయనకు నమస్కరించుచున్నాను.

యస్మిన్ యతో యేన చ యస్య యస్మై
యద్యో యథా కురుతే కార్యతే చ ।
పరావరేషాం పరమం ప్రాక్ ప్రసిద్ధం
తద్బ్రహ్మ తద్ధేతురనన్యదేకమ్ ॥ 30

ఈ విశ్వము ఎవనియందు, ఎవనివలన, ఏకారణముచేత, ఎవని సంబంధమై, ఎవని కొఱకు, ఏ యభీష్టకర్మను, ఎవడు ఏవిధముగ చేయుచున్నాడో, చేయించుచున్నాడో, ఉత్కృష్టాపకృష్టము లగు ఆకారణములకు పరమకారణము ఏకమాత్ర మగు బ్రహ్మము. అయన సమస్తవస్తువులకు పూర్వమేయున్నాడు. ఏలయన ఆయన యీసకలవస్తువులకు కారణుడు, సజాతీయవిజాతీయ భేదరహితుడు, నేను ఆయనకు నమస్కరించుచున్నాను.

యచ్ఛక్తయో వదతాం వాదినాం వై
వివాదసంవాదభువో భవన్తి ।
కుర్వన్తి చైషాం ముహురాత్మమోహం
తస్మై నమోఽనన్తగుణాయ భూమ్నే ॥ 31

ఎవనిశక్తులు మాటలాడెడువారలకు, వాదము చేయువారలకు వివాద సంవాదస్థలము లగుచు మాటిమాటకి వారిమనస్సులకు మోహమును గలుగజేయుచున్నవో అట్టి యనంత గుణములు గల మహాత్మునకు ప్రణామము చేయుదును.

వివరణము :- ఎవని మాయావిద్యాదిశక్తులు జడములైన ద్వైతాద్వైతస్వభావాదుల నాశ్రయించి వివాదపడు పండితులవివాదసంవాదముల కేకమాత్రహేతువులైయున్నవో, ఎవనిశ్తి ప్రభావముచే పండితమ్మన్యులగునీవ్యక్తులకు ఆత్మమోహము కలుగుచున్నదో అట్టి యనంతసచ్చిదానంద గుణశాలియు, సర్వవ్యాపియు నగు భగవానునకు నమస్కరించు చున్నాను.

**అస్తీతి నాస్తీతి చ వస్తునిష్ఠయో -**
**రేకస్థయోర్భిన్నవిరుద్ధధర్మణో: ।**
**అవేక్షితం కించన యోగసాంఖ్యయో:**
**సమం పరం హ్యనుకూలం బృహత్తత్ ॥** 32

అస్తినాస్తి యను వస్తుద్వయనిష్ఠలంగలిగి యొక్కటన యుండి విరుద్ధధర్మములుగ గనబడు ఉపాసనాశాస్త్రసాంఖ్యశాస్త్రములకు సమమై వీక్షింపదగిన పరమము నాకు అను కూలమగుగాక !

వివరణము :- పరమాత్మోపాసనాత్మక మగు యోగశాస్త్రము సచ్చిత్ప్రతీతియొక్క ఆశ్రయముచే తత్త్వవస్తువుయొక్క అస్తిత్వమును స్వీకరించును (అంగీకరించును). కాని ప్రకృతివాదాశ్రిత మగుజ్ఞానశాస్త్రము సాంఖ్యనిర్విశిష్టభావమువలన తత్త్వవస్తువుయొక్క అస్తిత్వమును స్వీకరింపదు. అవి 'అస్తి నాస్తి' యను విచారమును గైకొని ద్వంద్వరతము విరుద్ధధర్మాశ్రితము నగుశాస్త్రద్వయము ఒక్క పరబ్రహ్మవస్తువునందే పర్యవసిత మనిచెప్పనగును. ఏలయన రెండింటి యభిప్రాయము విభిన్నమైనను భావాభావములకు పరముగ నేయధిష్ఠానము ప్రతీతమగుచున్నదో. అదియే బృహత్పరబ్రహ్మము. నే నా పరబ్రహ్మమునకు నమస్కరించుచున్నాను.

**యోఽను గ్రహార్థం భజతాం పాదమూల -**
**మనామరూపో భగవాననన్త: ।**
**నామాని రూపాణి చ జన్మకర్మభి -**
**ర్భేజేస మహ్యం పరమ: ప్రసీదతు ॥** 33

అచింత్యైశ్వర్యసంపన్నుడగు భగవానుడు (జడబుద్ధియుక్తుడగు జీవునికడ) దేశకాలవస్తు ప్రభృతిపరిచ్ఛేదశూన్యుడు, ప్రాకృతనామరూపాదిరహితుడు, తన పాదములను సేవించు భక్తుల ననుగ్రహించుటకై ఆయన ఎల్లపుడు జన్మలీలలను ప్రదర్శించును. అట్టి నామరూప యుక్తుడు సచ్చిదానందవిగ్రహుడు నగు ఆ పరమేశ్వరుడు నాకు ప్రసన్నుడగు గాక!

**యః ప్రాకృతైర్జ్ఞానపథైర్జనానాం**
**యథాశయం దేహగతో విభాతి ।**
**యథానిలః పార్థివమాశ్రితో గుణం**
**స ఈశ్వరో మే కురుతాం మనోరథమ్ ॥ 34**

వాయువు పార్థివపంకజాదుల గంధమును గ్రహించి నానాగంధములతో గూడి, పంకజరేణువులు మున్నగు వాని ధూసరకృష్ణాదుల వర్ణములను ధరించి నానా రూపములు గలదిగ తోచును. అట్లే సర్వదేహగతుడు, అంతర్యామియు నగు భగవానుడుగూడ దేహ ధారులగుమానవులప్రాక్తనవాసనల ననుసరించి (రుచుల ననుసరించి) అర్వాచీనములైన ఉపాసనామార్గములచే ఉపాసితుడై గణేశాదినానాదేవతారూపములతో నాయుపాసకులకు ప్రత్యక్ష మగును. అట్టి పరమేశ్వరుడు నా మనోరథమును తీర్చుగాక! అన్యదేవతలను ఆశ్రయించిన యేమి ప్రయోజనము కలుగును?

## శ్రీశుక ఉవాచ

**ఇతి స్తుతః సంస్తువతః స తస్మిన్నఘమర్షణే ।**
**ప్రాదురాసీత్కురుశ్రేష్ఠ భగవాన్ భక్తవత్సలః ॥ 35**

**కృతపాదః సుపర్ణాంసే ప్రలంబాష్టమహాభుజః ।**
**చక్రశంఖాసిచర్మేషు ధనుఃపాశగదాధరః ॥ 36**

**పీతవాసా ఘనశ్యామః ప్రసన్నవదనేక్షణః ।**
**వనమాలానివీతాంగో లసత్ శ్రీవత్సకౌస్తుభః ॥ 37**

**మహాకిరీటకటకః స్ఫురన్మకరకుణ్డలః ।**
**కాంచ్యంగులీయవలయనూపురాంగదభూషితః ॥ 38**

**త్రైలోక్య మోహనం రూపం బిభ్రత్త్రిభువనేశ్వరః ।**
**వృతో నారదనన్దాద్యైః పార్షదైః సురయూథపైః ।**
**స్తూయమానోఽనుగాయద్భిః సిద్ధగన్ధర్వచారణైః ॥ 39**

శుకమహర్షి పలికెను :- కురుశ్రేష్ఠుడ వగు పరీక్షిన్మహారాజా! భక్తవత్సలుడగు శ్రీహరి భగవానుడు దక్షునిచే స్తుతింపబడినవాడై అఘమర్షణపర్వతమున ప్రాదుర్భవించెను. ఆయన పాదపద్మములు గరుడుని స్కంధములపై నుంచబడియున్నవి. ఆజానులంబితము లగు అష్టమహాభుజములయందు శంఖము, చక్రము, అసి, చర్మము, బాణము, ధనుస్సు, పాశము, గద అను ఎనిమిది అస్త్రములు విలసిల్లు చున్నవి. ఆయన పీతవసనుడు, ఘన శ్యామదేహుడు, ప్రసన్నములైన వదనము నేత్రములు గలవాడు, పాదములవరకు వ్రేలాడు వనమాల కంఠమునందు గలవాడు, శ్రీవత్సమను మనోహర రోమావర్తము కౌస్తుభమణి వక్షస్థలమున గలవాడు, మనోహర మగు కిరీటముచే శోభిల్లు మస్తకము గలవాడు, మకరకుండలములచే విలసిల్లు కర్ణములు గలవాడు, చేతులకు కంకణములు బాహువుల యందు భుజకీర్తులు గలవాడు, వ్రేళ్ళయందు అంగుళీయకములు, కటిప్రదేశమున మొలనూలు, చరణయుగళమునందు నూపురము గలవాడునై శోభిల్లుచుండెను.

ఇట్లలంకృతుడై అఖిలలోకనాథుడైన శ్రీహరి త్రైలోక్యమోహన మగు శ్రీపురుషోత్తమాఖ్య రూపమును ధరించి నారదుడు నందుడు మున్నగు పార్షదులతోను, ఇంద్రాదిలోకపాలుర తోను, సిద్ధగంధర్వచారణులతోను, పరివేష్ఠితుడై యుండెను. వారందఱు ఆయన కిరుప్రక్కల వెనుక నిలబడి స్తుతించుచుండిరి.

**రూపం తన్మహదాశ్చర్యం విచక్ష్యాగతసాధ్వసః ।**
**ననామ దణ్డవద్భూమౌ ప్రహృష్టాత్మాప్రజాపతిః ॥ 40**

దక్షప్రజాపతి త్రైలోక్యమోహనము పరమాశ్చర్యకరము నగు ఆభగవానుని రూపమును దర్శించి మొదట భీతుడయ్యెను. పిమ్మట మిగుల ప్రఫుల్లుడై సాష్టాంగదండప్రణామము లొనరించెను.

**న కించనోదీరయితుమశకత్ తీవ్రయా ముదా ।**
**ఆపూరితమనోద్వారై ర్హ్రదిన్య ఇవ నిర్ఝరైః ॥ 41**

సెలయేళ్ళచే నదులు నిండునట్లు అధికానందముతో దక్షునివాగాదీంద్రియములు పరిపూర్ణము లయ్యెను. అందువలన ఆయన ఇక యేమియు మాటలాడకపోయెను.

**తం తథావనతం భక్తం ప్రజాకామం ప్రజాపతిమ్ ।**
**చిత్తజ్ఞః సర్వభూతానామిదమాహ జనార్దనః ॥ 42**

ప్రజాపతి యేమియు మాటలాడకపోయినను సర్వభూతాంతర్యామి యగు జనార్దను డిట్లు అవనతుడు ప్రజాకామియు నగు భక్తునితో నిట్లు పలికెను.

## శ్రీభగవానువాచ

**ప్రాచేతస మహాభాగ సంసిద్ధస్తపసా భవాన్ ।**
**యచ్ఛ్రద్ధయా మత్పరయా మయి భావం పరం గతః ॥ 43**

భగవానుడు పలికెను :- మహాభాగా! ప్రాచేతసా! నీవు మద్విషయక మగు శ్రద్ధద్వారా నాయందు పరమభక్తి గలవాడవై తపస్సుచే సిద్ధిని పొందితివి.

**ప్రీతోఽహం తే ప్రజానాథ యత్తేఽస్యోద్బృంహణం తపః ।**
**మమైష కామో భూతానాం యద్భూయాసుర్విభూతయః ॥ 44**

ప్రజాపతీ! నీవీ ప్రపంచాభివృద్ధికై తపస్సు చేసినందులకు నేను చాల సంతసించితిని. సర్వభూతములు సమృద్ధిపొందుగాక! ఇదియే నాయభిలాష.

**బ్రహ్మా భవో భవన్తశ్చ మనవో విబుధేశ్వరాః ।**
**విభూతయో మమ హ్యేతా భూతానాం భూతిహేతవః ॥ 45**

బ్రహ్మ, భవుడు, మనువులు, లోకపాలురు, మీరు (ప్రజాపతులు) సర్వప్రాణుల పుట్టుకకు కారణమైయున్నారు కదా! మీరందఱు నావిభూతులే. అనగా గుణావతారవిశేషులు.

**తపో మే హృదయం బ్రహ్మంస్తనుర్విద్యా క్రియాకృతిః ।**
**అంగాని క్రతవో జాతా ధర్మ ఆత్మాసవః సురాః ॥ 46**

మహాత్మా! తపస్సు అనగా యమనియమాదిసహిత మగు ధ్యానము నా హృదయము; విద్య అనగా సాంగమంత్రజపము నాదేహము; క్రియ అనగా ధ్యానాదులకు విషయము భావనాశబ్దవాచ్యము నగు పురుషుని వ్యాపారము నాయాకృతి; సునిష్పన్నము లగు యజ్ఞములు నాయవయవములు; యజ్ఞానుష్ఠానజన్య మగు అపూర్వము అనగా సుకృతి నా మనస్సు; యజ్ఞ భోక్తలగు సురలు నా ప్రాణములు.

**అహమేవాసమేవాగ్రే నాన్యత్కించాన్తరం బహిః ।**
**సంజ్ఞానమాత్రమవ్యక్తం ప్రసుప్తమివ విశ్వతః ॥ 47**

ఈ విశ్వసృష్టికి పూర్వమున నే నొక్కడనే యుంటిని. అపుడు అంతర్గ్రాహకములగు అంతఃకరణములు, బహిర్గ్రాహ్యములగు విషయములు ఏమియు లేకుండెను. ఇంద్రియ వృత్తుల ద్వారా అభివ్యక్తముకాని యేకైక చైతన్యమే అంతట నిద్రించినవానివలె విరాజిల్లు చుండెను.

**మయ్యనన్తగుణేఽనన్తే గుణతో గుణవిగ్రహః ।**
**యదాసీత్తత ఏవాద్య స్వయమ్భూః సమభూదజః ॥ 48**

నేను అనంతగుణాధారుడ నగు అనంతుడను అనగా వ్యాపకుడను, నామాయవలన, నాయందే బ్రహ్మాండము ప్రకాశితమైనది. ఆ బ్రహ్మాండమునందే నీకు కారణభూతుడు, అయోనిజుడు నగు స్వయంభువు (బ్రహ్మ) ఆవిర్భవించినాడు.

**స వై యదా మహాదేవో మమ వీర్యోపబృంహితః ।**
**మేనే ఖిలమివాత్మానముద్యతః స్వర్గకర్మణి ॥ 49**

**అథ మేఽభిహితో దేవస్తపోఽతప్యత దారుణమ్ ।**
**నవ విశ్వసృజో యుష్మాన్ యేనాదావసృజద్విభుః ॥ 50**

నా శక్తిచే వృద్ధిపొందిన దేవతాశ్రేష్ఠుడగు ఆ స్వయంభువుడు సృష్టి కార్యమున కుద్యుక్తుడై ఆ విషయమున తన్ను అసమర్థునిగ దలంచెను. అప్పుడాయన నాచే ఉపదేశింపబడినవాడై తపస్సు చేసెను. ఆ తపః ప్రభావముచే విభుడు మొదట విశ్వస్రష్ట లగు మిమ్ము తొమ్మండుగురిని సృష్టించెను.

**ఏషా పంచజనస్యాఙ్గ దుహితా వై ప్రజాపతేః ।**
**అసిక్నీ నామ పత్నీత్వే ప్రజేశప్రతిగృహ్యతామ్ ॥ 51**

ప్రజేశా! దక్షా! పంచజను డనుప్రజాపతియొక్క పుత్రిక యగు 'అసిక్ని' యను నామెను నీవు భర్యగా స్వీకరింపుము.

**మిథునవ్యవాయధర్మస్త్వం ప్రజాసర్గమిమం పునః ।**
**మిథునవ్యవాయధర్మిణ్యాంభూరిశో భావయిష్యసి ॥ 52**

నీవు స్త్రీపురుషులరతిరూప మగు ధర్మము నవలంబించి యట్టిరతిధర్మ శీల యగు ఈకన్యనుండి అధికముగ ప్రజాసృష్టిచేయగలవు.

**త్వత్తోఽధస్తాత్ప్రజాః సర్వా మిథునీభూయ మాయయా ।**
**మదీయయా భవిష్యన్తి హరిష్యన్తి చ మే బలిమ్ ॥ 53**

నీయనంతరము ప్రజలు నామాయకు వశులై మైథునభావము నవలంబించి పుత్రాది రూపములతో ఉత్పన్నులగుదురు. నాకు పూజా సామగ్రిని సమర్పింపగలరు.

## శ్రీశుక ఉవాచ

ఇత్యుక్త్వా మిషత స్తస్య భగవాన్ విశ్వభావనః ।
స్వప్నోపలబ్ధార్థ ఇవ తత్రైవాన్తర్దధే హరిః ॥ 54

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే హంసగుహ్యస్తవో నామ
చతుర్థోఽధ్యాయః ॥

శుకుడు పలికెను :- విశ్వభావనుడగు శ్రీహరి యిట్లుపలికి స్వప్నోపలబ్ధ మగు వస్తువు వలె చూచుచుండగనె అంతర్హితుడయ్యెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
హంసగుహ్యస్తవ మను నాల్గవ అధ్యాయము
సంపూర్ణము.





# ఐదవ అధ్యాయము

## నారదుని ఉపదేశము ననుసరించి

## దక్షపుత్రులు విరక్తిచెందుట :

## నారదుని దక్షుడు శపించుట

కథాసారము :- ఈ యధ్యాయమున దేవర్షియగు నారదుని కటువాక్కుల ననుసరించి దక్షపుత్రులు విరక్తులయ్యెనని విని దక్షుడు నారదుని శపించుట యనువిషయము వ్యక్తమయ్యెను.

విష్ణుమాయావర్ధితుడగు దక్షప్రజాపతి తనభార్య యగు పంచజని (అసిక్ని) వలన గనిన 'హర్యశ్వ' లను సమస్వభావు లగు పదివేలమంది పుత్రులను ప్రజాసృష్టి చేయవలసినదిగా ఆదేశించెను. వారు పశ్చిమదిక్కున సింధునది సముద్రమున గలియు సంగమ స్థలమున సిద్ధమునిగణసేవిత మగు 'నారాయణ' మను సరోవరమునకు వెడలి యచటి జలమును స్పృశించి రాగాదిమనోమలముక్తులు, పరమ హంసధర్మమున అనురక్తులు నయిరి. అయి నను వారు తండ్రి యాదేశము ననుసరించి ప్రజా సృష్టికొఱకే యచట తపస్సు చేయ నారంభించిరి.

ఒకప్పుడు దేవర్షి యగు నారదుడు అచట మాయికజనో చితములైన సకామకర్మల జేయుట కుద్యుక్తులైన నిర్మల సత్త్వులైన దక్షపుత్రులను జూచి వారిపై దయగలవా డయ్యెను. అర్థాంతరమును స్ఫురింపజేయు కొన్ని వాక్కులను బలికి వారి బుద్ధి పరమ శ్రేయస్సాధన మగు పారమహంస్య ధర్మమున లగ్నమగునట్లుగా వారికి బోధచేసెను. ఆయన పలికిన గూఢ వాక్కులచే వారు పరమపురుషుడగు భగవానుడే యందఱకు సంపూర్ణముగ సేవ్యు డనియెఱింగి ప్రజాసృష్టిప్రయత్నమునుండి విరతులై పరమార్థపథమున అపునరావృత్తితో పయనమైరి.

దక్షప్రజాపతి హర్యశ్వాదిపుత్రులు కనబడకపోవుటచే దుఃఖించి మరల తనభార్య యగు పంచజనికి జన్మించిన సబలాశ్వు లనువేయిమంది పుత్రులను ప్రజాసృష్టిచేయ వలసినదిగ ఆదేశించెను. వారుగూడ హర్యశ్వులమార్గానుయాయులై, ఆ ప్రదేశమునకు వెడలి నిర్మలురై ప్రజాసృష్టి వాంఛతో విష్ణువు నారాధింపసాగిరి. దేవర్షి వారికడకు గూడ వెడలి వారిని వెనుకటివలె ప్రజాసృష్టిప్రయత్నమునుండి విరమింప జేసి వారికి హర్యశ్వులగతిని గలుగజేసెను.

ఇట్లు సబలాశ్వాదిపుత్రులుగూడ అదృశ్యులుకాగా తత్సంవాదము విని దక్షుడత్యంత శోకకాతురు డయ్యెను. కాలముకాని కాలమునందే పుత్రులను సంసారమునుండి నివృత్తులునుగా జేసి పారమహంస్యధర్మమున భిక్షుమార్గమునకు ప్రేరేపించిన హరిపరాయణుడగు దేవర్షిని పరుషవాక్కుల బలికి యిట్లు శపించెను. 'ఇకముందు లోకములో ఎచ్చటగూడ నీకు స్థానము లభింపకుండుగాక!' దేవర్షి వైష్ణవో చితములగు మహద్గుణములతో తథాస్తు అని పలికి ఆ శాపము నంగీకరించెను.

## శ్రీశుక ఉవాచ

**తస్యాం స పాంచజన్యాం వై విష్ణుమాయోపబృంహితః ।**
**హర్యశ్వసంజ్ఞానయుతం పుత్రానజనయద్విభుః ॥ 1**

శుకుడు పలికెను :- రాజా! దక్షప్రజాపతి విష్ణుమాయా వర్ధితుడై పాంచజని (అసిక్నీ) వలన హర్యశ్వులను పదివేలమంది పుత్రులను గనెను.

**అపృథగ్ధర్మశీలాస్తే సర్వే దాక్షాయణా నృప ।**
**పిత్రా ప్రోక్తాః ప్రజాసర్గే ప్రతీచీం ప్రయయుర్దిశమ్ ॥ 2**

రాజా! ఆదక్షపుత్రుల స్వభావము, ఆచారము ఒకేవిధముగ నున్నవి. ప్రజాసృష్టి చేయవలసిన దని తండ్రి వారి నాదేశింపగా వారందఱు పశ్చిమదిక్కునకు వెడలిరి.

**తత్ర నారాయణసర స్తీర్థం సిన్ధుసముద్రయోః ।**
**సంగమో యత్ర సుమహన్మునిసిద్ధనిషేవితమ్ ॥ 3**

పశ్చిమదిక్కున సింధునది సముద్రములో గలియు ప్రదేశమునందు మునులచేత సిద్ధులచేత సేవింపబడు అతివిస్తీర్ణమగు నారాయణ సరోవర మను నొక తీర్థమున్నది.

**తదుపస్పర్శ నాదేవ వినిర్ధూతమలాశయాః ।**
**ధర్మే పారమహంస్యే చ ప్రోత్పన్నమతయోఽప్యుత ॥ 4**

**తేపిరే తప ఏవోగ్రం పిత్రాదేశేవ యన్త్రితాః ।**
**ప్రజావివృద్ధయే యత్తాన్ దేవర్షిస్తాన్ దదర్శ హ ॥ 5**

దక్షపుత్రు లగు హర్యశ్వు లాతీర్థమునకు వెడలి స్నానాచమనాదుల జేయుటకై జలమును స్పృశించిరి. వెంటనే వారి హృదయమలము పూర్తిగ తొలగెను. వారిబుద్ధి పారమహంస్యధర్మమున లగ్నమయ్యెను. కాని తండ్రి వారిని ప్రజాసృష్టికై యాదేశించి యుండుటచే బాధ్యులై వారు ప్రజాసృష్టి నిమిత్తమై తీవ్రముగ తపస్సు చేయసాగిరి. ఒకనాడు నారద ఋషి అట్లు తపస్సునందు ప్రవృత్తులైనహర్యశ్వులను జూచెను.

ఉవాచ చాథ హర్యాశ్వా: కథం స్రక్ష్యథ వై ప్రజా: ।
అదృష్ట్వాన్తం భువో యూయం బాలిశా బత పాలకా: ॥ 6

తదైకపురుషం రాష్ట్రం బిలం చాదృష్టనిర్గమమ్ ।
బహురూపాం స్త్రియం చాపి పుమాంసం పుంశ్చలీపతిమ్ ॥ 7

నదీముభయతోవాహాం పంచపంచాద్భుతం గృహమ్ ।
క్వచిద్ధంసం చిత్రకథం క్షౌరపవ్యం స్వయంభ్రమి ॥ 8

వారిని జూచి నారదు డిట్లు పలికెను :- హర్యశ్వులారా! మీరు పృథివియొక్క అంతమును జూడలేదు. అచట ఒక రాజ్య మున్నది.దానియందొకడే పురుషుడు విరాజిల్లు చున్నాడు. అచట ఒకబిలమున్నది. దానినుండి బయటకు వచ్చుటకు త్రోవయే లేదు. అచట ఒక స్త్రీ యున్నది. ఆమె బహురూపములు గలది. అచట ఒక పురుషుడున్నాడు. అత డాపుంశ్చలి (వ్యభిచారిణి) భర్త. అచట ఒకనది యున్నది. అది రెండు దిక్కుల ప్రవహించును. అచట ఒక గృహ మున్నది. అది యిరువది యైదు వస్తువులచే నిరిత్మమైనది. అక్కడ ఒక హంస యున్నది. అది బహువిధములుగ ధ్వని చేయుచుండును. అచట ఒకవిధ మగుపదార్థ మున్నది అది కత్తులచేత వజ్రముచేత నిర్మింపబడినది. అది దానియంతటది తిరుగు చుండును. మీరు వాని నన్నింటిని జూడుడు. కాని మీరు పాలకు లయ్యును అజ్ఞులె. అందు వలన మీరెట్లు ప్రజాసృష్టి చేయగలరు?

కథం స్వపితురాదేశమవిద్వాంసో విపశ్చిత: ।
అనురూపమవిజ్ఞాయ అహో సర్గం కరిష్యథ ॥ 9

ఆహా! సర్వజ్ఞు డగు మీ తండ్రియొక్క అదేశమును తెలిసికొనక అజ్ఞులగు మీరెట్లు ప్రజాసృష్టి చేయగలరు?

తన్నిశమ్యాథ హర్యాశ్వా ఔత్పత్తికమనీషయా ।
వాచ: కూటన్తు దేవర్షే స్వయం విమమృశుర్ధియా ॥ 10

హర్యశ్వులు దేవర్షి యగునారదుడు పలికిన అర్థాంతరస్ఫోరకము లగు వాక్కులను విని స్వాభావిక విచారణశక్తి సంపన్న మగు బుద్ధిద్వారా తమంత తామే యామాటలనుగూర్చి విచారణచేయసాగిరి.

భూ: క్షేత్రం జీవసంజ్ఞం యదనాది నిజబన్ధనమ్ ।
అదృష్ట్వా తస్య నిర్వాణం కిమసత్కర్మభిర్భవేత్ ॥ 11

భూశబ్దమున కర్థము భూమి లేదా క్షేత్రము. జీవునకు ఉపాధిభూత మగు లింగ శరీరమే ఆక్షేత్రమువలె సుఖదు:ఖములపుట్టుకకు స్థానమైయున్నది. అది యనాది, జీవుని

బంధములకు మూలము. దానియంతమును అనగా నాశమును జూడకయే మోక్షమున కుపయోగపడని యనిత్యకర్మల అనుష్టించుటవలన నేమి ప్రయోజనము కలుగును.

**ఏక ఏవేశ్వర స్తుర్యో భగవాన్ స్వాశ్రయః పరః ।**
**తమదృష్ట్వాభవం పుంసః కిమసత్కర్మభిర్భవేత్ ॥ 12**

(అచట ఒక రాజ్యమున్నది. అక్కడ ఒక్కడే పురుషుడున్నాడు. ఈమాటల తాత్పర్య మేమియనగా) ఈశ్వరు డొక్కడే యేకైకవస్తు వైయున్నాడు. ఆయన సర్వసాక్షి. షడైశ్వర్య పూర్ణుడు. తనకు తానే ఆశ్రయుడు, నిత్యమాయాముక్తుడు, పరతత్త్వము నై యున్నాడు. ఆయన నెఱుంగకుండగ మానవులు చేయు సర్వకర్మలు అసత్యములే అనగా భగవానునకు సమర్పితములు కావు. అందువలన ఆ కర్మలను జేయుటవలన నేమిఫలము కలుగును?

**పుమాన్ నైవైతి యద్గత్వా బిలస్వర్గం గతో యథా ।**
**ప్రత్యగ్ధామావిద ఇహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 13**

(అచట ఒకబిలమున్నది. దానినుండి యెవ్వడును బయటకు వెడలుట కనబడదు. ఈ మాటలోని తాత్పర్య మేమియనగా) పాతాళము లోనికి వెడలినచో అచటినుండి బయటకు వచ్చుటకు వీలులేనట్లు జ్యోతిర్మయ మగు బ్రహ్మధామమునకు వెడలినచో అచటినుండి ప్రపంచములోనికి తిరిగి వచ్చుట యుండదు. మనుష్యులు దానిని (బ్రహ్మమును) దెలిసికొనకుండగ స్వర్గాదులను పొందుటకై చేయుకర్మ లన్నియు అనిత్యములే. వానివలన నేమి ఫలము కలుగును?

**నానారూపాత్మనో బుద్ధిః స్వైరిణీవ గుణాన్వితా ।**
**తన్నిష్ఠామగతస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 14**

(బహురూపిణియగు స్త్రీ యనుదానితాత్పర్య మేమి యనగా) బుద్ధి వ్యభిచారిణి యగు స్త్రీవలె పురుషునకు మోహమును గలుగజేయును, రజస్సు మున్నగు గుణములతో గూడియు నుండును. మానవు లాబుద్ధి యొక్క యంతమును తెలిసికొనలేనివారై అసత్కర్మల జేయుచుందురు. దానివలన నేమిఫలము కలుగును?

**తత్సంగభ్రంశితైశ్వర్యం సంసరన్తం కుభార్యవత్ ।**
**తద్గతీరబుధస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 15**

(అచట ఒక పురుషుడున్నాడు. అతడు పుంశ్చలి (వ్యభిచారిణికి) భర్త-ఈవిషయ తాత్పర్య మేమియనగా) వ్యభిచారిణి యగు భార్యకు భర్తయైనచో పురుషుని స్వాతంత్ర్యము నశించునట్లు బుద్ధిసంసర్గముచే జీవుని స్వాతంత్ర్యము నశించును. ఆ జీవులు బుద్ధియొక్క సుఖదుఃఖరూపములైన ద్వివిధగతులను అనుసరింతురు. ఆజీవుల నెఱుంగక అనిత్యకర్మల ననుష్ఠించుటవలన ఏమిఫలము కలుగును?

సృష్ట్యప్యయకరీం మాయాం వేలాకూలాన్తవేగితామ్ ।
మత్తస్య తామవిజ్ఞస్య కిమసత్కర్మభిర్భవేత్ ॥ 16

(అచట ఒక నది యున్నది. అది రెండువైపులా ప్రవహించును. అనుదాని తాత్పర్యమేమి యనగా) సృష్టిప్రళయముల నొనరించు మాయయే ఆనది. ఆనదియొక్క జలప్రవాహమున బడినవ్యక్తి పైకిలేచుటకు రెండు మార్గములున్నవి వానిలో నొకటి తపస్సు, రెండవది విద్య. ఈ రెండు స్థానములయందే ప్రవాహవేగ మధికముగ నుండును. ఆవేగమున నిమగ్నుడగువ్యక్తి నదివిషయమును దెలిసికొనకుండగ మాయికకర్మల నొనరించును. వానివలన నేమి ఫలము కలుగును?

పంచవింశతితత్త్వానాం పురుషోఽద్భుతదర్పణః ।
అధ్యాత్మమబుధస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 17

(అచట ఒక గృహ మున్నది. అది యిరువదియైదు పదార్థములతో నిర్మితమై యున్నది. దీనితాత్పర్య మేమియనగా) అంతర్యామి యగు పురుషుడు పంచవింశతి తత్త్వముల కాశ్రయుడు, ప్రకాశకుడు, కార్యకారణ సంయోగకర్తయునై యున్నాడు. వాని నెఱుంగక మిథ్యాస్వాతంత్ర్యాభి మానముతో కర్మనొనరించిన నేమిఫలము కలుగును?

ఐశ్వరం శాస్త్రముత్సృజ్య బన్ధమోక్షానుదర్శనమ్ ।
వివిక్తపదమజ్ఞాయ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 18

(అచట ఒక హంస యున్నది. అది విచిత్రముగ ధ్వనిచేయుచుండును. దీనితాత్పర్య మేమియన) ఈశ్వరప్రతిపాదకశాస్త్రమున 'చిత్తు, జడము' అనురెండువస్తువులు విచారింప బడినవి. అందువలన అది హంసస్వరూపము. బంధమోక్షములనుపదేశించు ఈశాస్త్రవాక్కులు నానావిధములుగ నుండును. ఆ శాస్త్రములను విడచి అజ్ఞుడగు వ్యక్తి బహిర్ముఖ కర్మల నొనరించిన యేమిఫలము కలుగును?

కాలచక్రం భ్రమి స్తీక్ష్ణం సర్వం నిష్కర్షయజ్జగత్ ।
స్వతన్త్రమబుధస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 19

(క్షురము (కత్తి) వజ్రము మున్నగువానిచే స్వయముగ నిర్మింపబడినది. తనంతతాను తిరుగునట్టిది యనుదానియర్థ మేమియనగా) భ్రమణశీలము, వజ్రక్షురనిర్మితము నగు వస్తువువలె మిగుల తీక్ష్ణమగు కాలచక్రమే యావస్తువు. అది సమస్త జగత్తును త్రిప్పుచు స్వతంత్రభావముతో తిరుగుచుండును. ఆకాలచక్రమును దెలిసికొనకుండగ కర్మ ఫలమును నిత్య మనిభావించి కామ్యకర్మ ననుష్ఠించిన యేమిఫలము కలుగును?

శాస్త్రస్య పితురాదేశం యో న వేదనివర్తకమ్ ।
కథం తదనురూపాయ గుణవిస్రమ్భ్యుపక్రమేత్ ॥ 20

(నీతండ్రి ఆదేశమేమి అనువాక్యతాత్పర్య మేమియనగా) ఉపనయనాది సంస్కారములచే జీవునకు ఏరెండవజన్మము కలుగుచుండునో దానికి శాస్త్రమే కారణము, ఉపదేష్ట యగుటచే శాస్త్రమే తండ్రి. నివృత్తి మార్గమే వానియాదేశతాత్పర్యము. ఆయాదేశము నెఱుంగనివాడు గుణమయ మగు ప్రవృత్తిమార్గమునం దాసక్తులై తండ్రియాదేశము ననుసరించి సృష్ట్యాదికార్యముల యం దెట్లు ప్రవృత్తులగుదురు?

**ఇతి వ్యవసితా రాజన్ హర్యశ్వా ఏకచేతసః ।**
**ప్రయయుస్తం పరిక్రమ్య పన్థానమనివర్తనమ్ ॥ 21**

(శుకుడు పలికెను) :- రాజా! హర్యశ్వులు నారదునిమాటలను విని ఐకమత్యముతో ఆయనకు ప్రదక్షిణ మాచరించి, యేమార్గమున పయనించిన మరల తిరిగివచ్చుట యుండదో ఆ మార్గమున పయనించిరి.

**స్వరబ్రహ్మణి నిర్భాతహృషీకేశపదామ్బుజే ।**
**అఖణ్డం చిత్తమావేశ్య లోకాననుచరన్మునిః ॥ 22**

షడ్జాదిస్వరములు బ్రహ్మస్వరూపములు. మునివరుడగు నారదుని లీలాగాన ప్రభావముచే ఆస్వరబ్రహ్మమునందు సర్వేంద్రియా కర్షకుడు, హృషీకేశుడు నగు శ్రీకృష్ణుడు సాక్షాత్తుగ ఆవిర్భవించెను. అపుడు భగవత్పాదపద్మములయం దేకాంతభావముతో మనస్సును లగ్నముచేసి నారదుడు పరిభ్రమించెను.

**నాశం నిశమ్య పుత్రాణాం నారదాచ్ఛీలశాలినామ్ ।**
**అన్వతప్యత కః శోచన్ సుప్రజస్త్వం శుచాం పదమ్ ॥ 23**

సౌశీల్యముచే శోభిల్లు నాపుత్రులు పిత్రాజ్ఞాపాలనరూప మగు స్వధర్మమునుండి భ్రష్టులైరి. దక్షప్రజాపతి నారదునివలనయావార్తను విని దుఃఖింపసాగెను. సత్పుత్రులు లేకపోవుట యనునది శోకమునకు నిలయము వంటిది. అందువలన ఏలశోకింపకుండగ నుండును?

**స భూయః పాంచజన్యాయామజేన పరిసాన్త్వితః ।**
**పుత్రానజనయద్దక్షః సబలాశ్వాన్ సహస్రిణః ॥ 24**

దక్షప్రజాపతి యట్లు దుఃఖించుచుండగా బ్రహ్మ వానిని ఓదార్చెను. పిమ్మట దక్ష ప్రజాపతి తనభార్య యగు పంచజనివలన మరల సబలాశ్వులనువేయిమంది పుత్రులను గనెను.

**తే చ పిత్రా సమాదిష్టాః ప్రజాసర్గే ధృతవ్రతాః ।**
**నారాయణసరో జగ్ముర్యత్ర సిద్ధాః స్వపూర్వజాః ॥ 25**

తండ్రియగు దక్షుడు ప్రజాసృష్టి చేయవలసినదిగ సబలాశ్వుల నాదేశించెను. తండ్రి యాదేశమును పాలించుటకై వారు నియమనిష్ఠులై తమయన్నలేప్రదేశమున నారదోపదేశము ననుసరించి భక్తిని పొంది యుండిరోఅట్టి నారాయణసరోవర మను తీర్థమునకు వెడలిరి.

**తదుపస్పర్శనాదేవ వినిర్ధూతమలాశయాః ।**
**జపన్తో బ్రహ్మపరమం తేపుస్తత్ర మహత్తపః ॥ 26**

నారాయణసరోవరమునందలి పవిత్రజలమును స్పృశించినంతనె వారి హృద్గతమైనమలము క్షాళితమయ్యెను. అచట వారు విశుద్ధచిత్తముతో ప్రణవసంపుటిత మగు మంత్రమును జపించుచు మహాతపస్సును చేయనారంభించిరి.

**అబ్భక్షాః కతిచిన్మాసాన్ కతిచిద్వాయుభోజనాః ।**
**ఆరాధయన్ మన్త్రమిమమభ్యస్యన్త ఇడస్పతిమ్ ॥ 27**

**ఓం నమో నారాయణాయ పురుషాయ మహాత్మనే ।**
**విశుద్ధసత్త్వధిష్ణ్యాయ మహాహంసాయ ధీమహి ॥ 28**

వారు కొన్నిమాసములు నీటిని త్రాగి, కొన్నిమాసములు వాయువును భక్షించి యీమంత్రమును పఠించుచు మంత్రాధిదేవత యగు శ్రీమహావిష్ణువు నారాధింపసాగిరి. "ప్రణవము నుచ్చరించి మహాపురుషుడగు శ్రీనారాయణునకు నమస్కరించుచున్నాము. ఆయన విశుద్ధసత్త్వగుణముల కాశ్రయుడు, పరమహంసస్వరూపుడు, మే మాయనను ధ్యానించుచున్నాము".

**ఇతి తానపి రాజేన్ద్ర ప్రజాసర్గధియో మునిః ।**
**ఉపేత్య నారదః ప్రాహ వాచః కూటాని పూర్వవత్ ॥ 29**

రాజేంద్రా! మునివరు డగు నారదుడు ప్రజాసృష్టివాంఛతో తపస్సునందు ప్రవృత్తులైన సబలాశ్వులకడకు వెడలి వెనుకటివలె పరోక్ష వాదపూర్ణము లగు కూటవాక్యములను చెప్ప సాగెను.

**దాక్షాయణాః సంశృణుత గదతో నిగమం మమ ।**
**అన్విచ్ఛతానుపదవీం భ్రాతౄణాం భ్రాతృవత్సలాః ॥ 30**

(నారదుడు పలుకసాగెను):- దక్షపుత్రులారా! మీరు నాయుపదేశములను జక్కగ వినుడు. మీరు భ్రాతృవాత్సల్యము గలవారు. అందువలన అగ్రజులమార్గము ననుసరింపుడు.

భ్రాతౄణాం ప్రాయణం భ్రాతా యోఽనుతిష్ఠతి ధర్మవిత్ ।
న పుణ్యబన్ధుః పురుషో మరుద్భిః సహ మోదతే ॥ 31

ధర్మతత్త్వము నెఱింగినవాడే సోదరులయుత్కృష్టపదవి ననుసరించును. పుణ్యవంతుడగు నాపురుషుడు మరుదాదిభ్రాతృవత్సలు రగు దేవతలతో గూడ ఆమోదమును, ఆహ్లాదమును పొందును.

ఏతావదుక్త్వా ప్రయయౌ నారదోఽమోఘదర్శనః ।
తేఽపి చాన్వగమన్మార్గం భ్రాతౄణామేవ మారిష ॥ 32

ఆర్యా! అమోఘదర్శను డగు నారదు డిట్లు పలికి వెడలిపోయెను. సబలాశ్వులుగూడ తమయగ్రజులమార్గమునే అనుసరించిరి.

సధ్రీచీనం ప్రతీచీనం పరస్యానుపథం గతాః ।
నాద్యాపి తే నివర్తన్తే పశ్చిమా యామినీరివ ॥ 33

వారు భగవత్సేవోన్ముఖ మగు వృత్తిద్వారా లభ్యము, సర్వోత్కృష్టము, భగవత్ప్రాప్తి కనుకూలము నగు భక్తిమార్గమున పయనించిరి. అందువలన గడచిన రాత్రివలె వారు నేటికిని తిరిగిరాలేదు.

ఏతస్మిన్ కాల ఉత్పాతాన్ బహూన్ పశ్యన్ ప్రజాపతిః ।
పూర్వవన్నారదకృతం పుత్రనాశముపాశృణోత్ ॥ 34

ఆ సమయమున దక్షప్రజాపతి బహువిధము లగు నశుభములను దర్శించెను. వెనుకటివలె తనపుత్రులను నారదుడు నాశముచేసెనని వినెను.

చుక్రోధ నారదాయాసౌ పుత్రశోకవిమూర్ఛితః ।
దేవర్షిముపలభ్యాహ రోషాద్విస్ఫురితాధరః ॥ 35

'పుత్రులు పారమహంస్య ధర్మమున నిష్ఠగలవారయ్యే' నను విషయమును విని దక్షప్రజాపతి పుత్రశోకముచే నష్టజ్ఞానియై నారదునిపై క్రుద్ధుడయ్యెను. వెంటనే నారుదునికడకు వెడలి క్రోధముచే అధరము కంపించుచుండగా ఆయన యిట్లు పలికెను.

## శ్రీదక్ష ఉవాచ

అహో అసాధో సాధూనాం సాధులింగేన నస్త్వయా ।
అసాధ్వకార్యర్భకాణాం భిక్షోర్మార్గః ప్రదర్శితః ॥ 36

దక్షుడు పలికెను :- ఆహా! నీవు సాధువేషమును మాత్రము ధరించితివి. కాని నీవు సాధువవు కావు. నేనే సాధువును. నా కుమారులకు నీవు నివృత్తిమార్గముమ జూపి నాకు తీరనిఅన్యాయము జేసితివి.

**ఋణైస్త్రిభిరముక్తానామమీమాంసితకర్మణామ్ ।**
**విఘాతః శ్రేయసః పాప లోకయోరుభయోః కృతః ॥ 37**

బ్రాహ్మణులు జన్మించినంతనే ఋషి ఋణము, దేవ ఋణము, పితృఋణము, అనుమూడుఋణములతో గూడియుందురు. వానిలో బ్రహ్మచర్యముద్వారా ఋషిఋణము నుండి, యజ్ఞముద్వారా దేవఋణము నుండి,సంతానోత్పాదనముద్వారా పితౄణమునుండి ముక్తులగుదురు కాని నాపుత్రులు వెనుక చెప్పబడిన త్రివిధఋణములనుండి ముక్తులు కాలేదు. కర్మలనుగూర్చియు ఆలోచింపలేదు. అందువలన ఓ పాపీ నీవు వారి కిహలోక పరలోకములయందు గలుగు శుభములకు ప్రతిబంధకుడ వైతివి అనగా అడ్డుపడితివి.

**ఏవం త్వం నిరనుక్రోశో బాలానాం మతిభిద్ధరేః ।**
**పార్షదమధ్యే చరసి యశోహా నిరపత్రపః ॥ 38**

ఇట్లు జీవహింసచేసి నీవు నీప్రభు వగు శ్రీహరినిర్మల యశస్సును నాశముచేసితివి. నీవు అజ్ఞు లగు బాలుర బుద్ధిలో భేదమును గలుగజేసితివి. అందువలన నీవు నిర్దయుడవు. నిర్లజ్జుడవై భగవత్పార్షదుల నడుమ యెట్లు తిరుగగలవు?

**నను భాగవతా నిత్యం భూతానుగ్రహకాతరాః ।**
**ఋతే త్వాం సౌహృదఘ్నం వై వైరంకర మవైరిణామ్ ॥ 39**

నీవుతప్ప యితరభాగవతు లందఱు ప్రాణులపై దయజూపుట యందు వ్యగ్రులై యుందురు. కాని నీవు లోకములోని బాంధవ్యమును నాశముచేయుటలోను, వైరము లేనిజనులలో వైరమును కలిగించుటలోను తత్పరుడ వైయున్నావు. లోకమున కిట్లు కీడును గలుగజేయు నీకు సిగ్గుగలుగుటలేదా?

**నేత్థం పుంసాం విరాగః స్యాత్త్వయా కేవలినా మృషా ।**
**మన్యసే యద్యుపశమం స్నేహపాశనికృన్తనమ్ ॥ 40**

వైరాగ్యమువలన ఉపశమము, ఉపశమమువలన స్నేహపాశము ఛిన్నమగు నని నీవు భావించినచో జ్ఞానముద్వారాకాక కేవల మీవిధమగు నీయీవేషముద్వారా పురుషునకు వైరాగ్యము కలుగదు.

**నానుభూయ న జానాతి పుమాన్ విషయతీక్ష్ణతామ్।**
**నిర్విద్యతే స్వయం తస్మాన్న తథా భిన్నధీః పరైః ॥ 41**

దు:ఖములకు కారణ మగు విషయముల ననుభవింపనిదే మానవుడు విషయతీక్ష్ణతను తెలిసికొనజాలడు. అందువలన విషయములను అనుభవించుచున్న ఆదు:ఖములకు గలమూలకారణమును తెలిసికొనగలుగును. దానివలన తనకెంతటి నిర్వేదము కలుగునో యితరులచే ప్రేరేపింపబడిన బుద్ధిద్వారా అంతటి నిర్వేదమును పొందజాలడు.

**యన్నస్త్వం కర్మసన్ధానాం సాధూనాం గృహమేధినామ్ ।**
**కృతవానసి దుర్మర్షం విప్రియం తవ మర్షితమ్ ॥ 42**

మేము వైదిక కర్మల ననుష్ఠించి కర్మమర్యాదను రక్షించుచున్నాము. మేమే సాధువులము, గృహమేధులము(అనగా ఫలభోగము తరువాత వైదిక కర్మల ననుసరించి దేవయజ్ఞము, ఋషియజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము , మనుష్యయజ్ఞము అను ఐదుగృహవ్రతముల యందుదీక్షితులమై యున్నాము) నీవు నాపుత్రులను నివృత్తిమార్గమున బ్రవేశపెట్టి భరింపరాని అపకారమును గలుజేసితివి. ఒకమారు దానిని సహించితిని.

**తన్తుకృన్తన యన్నస్త్వమభద్రమచర: పున: ।**
**తస్మాల్లోకేషు తే మూఢ న భవేద్భ్రమత: పదమ్ ॥ 43**

పుత్రనాశకా! కాని నీవు నాకు మరల అదేవిధ మగు అశుభమును గలుజేసితివి. మూర్ఖుడా! అందువలన నీవు సర్వలోకములలోను దిరుగుచుందువుగాక! ఎక్కడను నీకు స్థానము లభింపకుండుగాక!

## శ్రీశుక ఉవాచ

**ప్రతిజగ్రాహ తద్బాఢం నారద: సాధుసమ్మత: ।**
**ఏతావాన్ సాధువాదో హి తితిక్షేతేశ్వర: స్వయమ్ ॥ 44**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే నారదశాపో నామ
పంచమోఽధ్యాయ:

శుకుడు పలికెను :- రాజా! సాధుజన ప్రశంసితుడగు నారదుడు 'నీవాక్కు సత్యమగుగాక' యని పలికి ప్రజాపతివాక్కును స్వీకరించెను. తిరిగిశాపమిచ్చుటకు సమర్థు డైనను అట్లుచేయక దానిని సహించుటయే సాధకుని సాధుత్వ మగును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
నారదశాప మను ఐదవ అధ్యాయము
సంపూర్ణము

# ఆఱవ అధ్యాయము

## దక్షప్రజాపతియొక్క అఱువది

## పుత్రికలవంశవర్ణనము

కథాసారము :- ఈ యధ్యాయమున ప్రజాపతి యగు దక్షుడు అఱువది మంది పుత్రికలను గనుట, వారిద్వారా విశాలమగు ప్రపంచమున జరిగిన వివిధజీవసృష్టివృత్తాంతము వర్ణింపబడినది.

దక్షుడు తనభార్యయగు 'అసిక్ని' వలన అఱువదిమంది పుత్రికలను గనెను. వారిలో పదుగురిని ధర్మదేవతకు, పదుముగ్గురుని కశ్యపునకు, చంద్రునకు ఇరువదియేడుగురిని యిచ్చెను. మిగిలిన పదుగురులో నలుగురిని తార్క్ష్యుడను కశ్యపునకు, ఇరువురిని భూతములకు, ఇరువురిని అంగిరసునకు, ఇరువురిని కృశాశ్వునకు నిచ్చెను. దక్షుని యీ కన్యలకు దేవదానవమనుష్యనాగపశుపక్ష్యాదులైన అసంఖ్యజీవరాసులు ఉద్భవించినవి.

### శ్రీశుక ఉవాచ

**తతః ప్రచేతసోఽసిక్న్యామనునీతః స్వయమ్భువా ।**
**షష్టిం సంజనయామాస దుహితౄః పితృవత్సలాః ॥** 1

శుకుడు పలికెను :- రాజా! పిమ్మట బ్రహ్మయొక్క ప్రోత్సాహము ననుసరించి ప్రచేతసుడు (దక్షప్రజాపతి) అసిక్ని యను భార్యవలన పితృవత్సల రగు అఱువదిమంది పుత్రికలను గనెను.

**దశ ధర్మాయ కాయాదాద్ద్విషట్ త్రిణవ చేన్దవే ।**
**భూతాంగిరః కృశాశ్వేభ్యో ద్వే ద్వే తార్క్ష్యాయ చాపరాః ॥** 2

ధర్మ దేవతకు పదుగురు పుత్రికలను, కశ్యపునకు పదుముగ్గురను, చంద్రునకు ఇరువదియేడుగురిని, భూత అంగిరస కృశాశ్వుల ముగ్గురికి ఇద్దరిద్దరుచొప్పున ఆఱుగురు పుత్రికలను, మిగిలిన నల్వురుకన్యలను తార్క్ష్యుడనుకశ్యపునకు ఇచ్చెను.

**నామధేయాన్యమూషాం త్వం సాపత్యానాం చ మే శృణు ।**
**యాసాం ప్రసూతిప్రసవైర్లోకా ఆపూరితాస్త్రయః ॥** 3

నీవు నావలన ఆదక్షకన్యకల నామములను, వారిపుత్రపౌత్రాదుల నామములను వినుము. వారిపుత్రపౌత్రులే స్వర్గమర్త్యపాతాళములయందు వ్యాపించియున్నారు.

**భానుర్లమ్బా కకుద్యామిర్విశ్వా సాధ్యా మరుత్వతీ ।**
**వసుర్ముహూర్తా సంకల్పా ధర్మపత్న్యః సుతాన్ శృణు ॥ 4**

భాను, లంబ, కకుద్, యామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసు, ముహూర్త, సంకల్ప అనుపదుగురు ధర్మదేవతపత్నులు. వీరి పుత్రుల నామములను వినుము.

**భానోస్తు దేవఋషభ ఇన్ద్రసేనస్తతో నృప ।**
**విద్యోత ఆసీల్లంబాయా స్తతశ్చ స్తనయిత్నవః । 5**

రాజా! భానుగర్భమునుండి దేవఋషభుడు జన్మించినాడు. దేవఋషభునకు ఇంద్రసేనుడు జన్మించినాడు. లంబకు విద్యోత, విద్యోతకు మేఘములు జన్మించినవి.

**కకుదః సఙ్కట స్తస్య కీకటస్తనయో యతః ।**
**భువో దుర్గాణి యామేయః స్వర్గో నన్దిస్తతోఽభవత్ ॥ 6**

కకుదకు సంకటుడు, సంకటునకు కీకటతనయుడు పిమ్మట కీకటునకు భువదుర్గాభిమానులగు దేవతలు జన్మించిరి. యామ్యయొక్క పుత్రుడు స్వర్గము, స్వర్గమునకు నంది జన్మించినాడు.

**విశ్వే దేవాస్తు విశ్వాయా అప్రజాంస్తాన్ ప్రచక్షతే ।**
**సాధ్యోగణశ్చ సాధ్యాయా అర్థసిద్ధిస్తు తత్సుతః ॥ 7**

విశ్వయొక్క పుత్రులు విశ్వదేవులు, వారి కెట్టిసంతానము లేదు. సాధ్యకు సాధ్యులు, సాధ్యులకు అర్థసిద్ధి జన్మించిరి.

**మరుత్వాంశ్చ జయన్తశ్చ మరుత్వత్యా బభూవతుః ।**
**జయన్తో వాసుదేవాంశ ఉపేన్ద్ర ఇతి యం విదుః ॥ 8**

మరుత్వతికి మరుత్వానుడు జయంతుడు జన్మించిరి. జయంతుడు వాసుదేవాంశ సంభూతుడు, వీనినే ఉపేంద్రునిగా దెలిసికొనుము.

**మౌహూర్తికా దేవగణా ముహూర్తాయాశ్చ జజ్ఞిరే ।**
**యే వై ఫలం ప్రయచ్ఛన్తి భూతానాం స్వస్వకాలజమ్ ॥ 9**

ముహూర్తకు మౌహూర్తికనామములతో దేవత లుద్భవించిరి. వారే ప్రాణులకు తమ తమ కాలజాతములైన కర్మఫలముల నొసంగుచున్నారు.

సంకల్పాయాస్తు సంకల్పః కామః సంకల్పజః స్మృతః ।
వసవోఽష్టౌ వసోః పుత్రా స్తేషాం నామాని మే శృణు ॥ 10

ద్రోణః ప్రాణో ధ్రువోఽర్కోఽగ్నిర్దోషో వాస్తుర్విభా వసుః ॥
ద్రోణస్యాభిమతేః పత్న్యా హర్షశోకభయాదయః ॥ 11

సంకల్పకు సంకల్పుడు, వానికి కాములు ఉత్పన్నులైరి. వసువునకు అష్టవసువులు జన్మించిరి. వారి నామములను జెప్పెదను వినుము. ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు అగ్ని, దోషుడు, వాస్తువు, విభావసుడు వీరే అష్టవసువులు. వారిలో ద్రోణుని భార్యయగు అభిమతి హర్షశోకభయాదులను గనినది.

ప్రాణస్యోర్జస్వతీ భార్యా సహ ఆయుః పురోజవః ।
ధ్రువస్య భార్యా ధరణీరసూత వివిధాః పురః ॥ 12

ప్రాణునిభార్య యగు ఊర్జస్వతి సహుడు, ఆయువు, పురోజవుడు వనుముగ్గురు పుత్రులను గనినది. ధ్రువునిభార్య ధరణి, ఆమె వివిధ పురములను వెలువరించినది.

అర్కస్య వాసనా భార్యా పుత్రాస్తర్షాదయాః స్మృతాః ।
అగ్నేర్భార్యా వసోర్ధారా పుత్రా ద్రవిణకాదయః ॥ 13

అర్కునిభార్య వాసన, ఆమెకు తర్ష (తృష్ణ) మున్నగు అనేక పుత్రులు జన్మించిరి. అగ్ని యను వసువుభార్య ధార, ఆమె ద్రవిణాకాది పుత్రుల నెందఱినో కనినది.

స్కన్దశ్చ కృత్తికాపుత్రో యే విశాఖాదయస్తతః ।
దోషస్య శర్వరీపుత్రః శిశుమారో హరేఃకలా ॥ 14

కృత్తిక పుత్రుడు స్కందుడు, (కార్తికేయుడు) వీనికి విశాఖాదులు జన్మించిరి. దోషుడను వసువుభార్య శర్వరి, ఆమెకు శిశుమారుడు జన్మించినాడు. అతడు హర్యంశసంభూతుడు.

వాస్తోరాంగిరసీ పుత్రో విశ్వకర్మాకృతీపతిః ।
తతో మనుశ్చాక్షుషోఽభూత్విశ్వే సాధ్యా మనోఃసుతాః ॥ 15

వాస్తు వను వసువు భార్య ఆంగిరసి, ఆమెకు శిల్పాచార్యుడగు విశ్వకర్మ జన్మించెను. ఆతడే ఆకృతికి భర్త. ఈ విశ్వకర్మకు చాక్షుషమనువు జన్మించినాడు. ఈ మనువుపుత్రులే విశ్వదేవులు, సాధ్యులు.

విభావసోరసూతోషా వ్యుష్టం రోచిషమాతపమ్ ।
పంచయామోఽథ భూతాని యేన జాగ్రతి కర్మసు ॥ 16

విభావసుభార్య యగు ఉషవ్యుష్టరోచిష, ఆతపులను ముగ్గురు పుత్రులను గనినది. పిమ్మట ఆతపునకు పంచయామములు (దివసములు) జనించినవి. వానివలన ప్రాణులు తమతమకర్మలయందు నిమగ్ను లైయుందురు.

సరూపాసూత భూతస్య భార్యా రుద్రాంశ్చ కోటిశః ।
రైవతోఽజో భవో భీమో వామ ఉగ్రో వృషాకపిః ॥ 17

అజైకపాదహిర్బుధ్న్యో బహురూపో మహానితి ।
రుద్రస్య పార్షదాశ్చాన్యే ఘోరాః ప్రేతవినాయకాః ॥ 18

భూతునిభార్య సరూప, ఆమె కోటిమంది రుద్రులను ప్రసవించినది. వారిలో ఏకాదశ రుద్రనామములను వినుము. వారు రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాముడు, ఉగ్రుడు, వృషాకపి, అజైకపాదుడు, అహిర్బుధ్న్యుడు, బహురూపుడు, మహత్తు అనువారు. ఈభూతుని మరియొక భార్య పదునొకండుగురురుద్రులకు సహచరులగు ఘోరప్రేత వినాయకప్రభృతులను ప్రసవించినది.

ప్రజాపతేరఙ్గిరసః స్వధా పత్నీ పితౄనథ ।
అథర్వాఙ్గిరసం వేదం పుత్రత్వే చాకరోత్సతీ ॥ 19

ప్రజాపతియగుఅంగిరసునకు స్వధ, సతి యను నిరువురు భార్యలు గలరు. వారిలో స్వధ యను పత్ని పితృగణములను పుత్రరూపమున స్వీకరించెను. సతియనునామె అథర్వాంగిరస మను వేదమును పుత్ర రూపమున గల్పించినది.

కృశాశ్వోఽర్చిషి భార్యాయాం ధూమకేతుమజీజనత్ ।
ధిషణాయాం వేదశిరో దేవలం వయునం మనుమ్ ॥ 20

కృశాశ్వునకు అర్చిస్సు ధిషణ యను నిరువురు భార్య లుండిరి, వారిలో అర్చిస్సు అనునామెవలన కృశాశ్వుడు ధూమకేతువును గనెను. ధిషణవలన వేదశిరుడు, దేవలుడు, వయునుడు, మనువు అనునల్వురు పుత్రులను గనెను.

తార్క్ష్యస్య వినతా కద్రూః పతఙ్గీ యామినీతి చ ।
పతఙ్గ్యసూత పతగాన్ యామినీ శలభానథ ॥ 21

సుపర్ణాసూత గరుడం సాక్షాద్యజ్ఞేశవాహనమ్ ।
సూర్యసూతమనూరుం చ కద్రూర్నాగా ననేకశః ॥ 22

తార్క్ష్యుడును కశ్యపునకు వినత, కద్రువ, పతంగి, యామిని యను నల్వురు పత్నులు గలరు. వారిలో పతంగి యను భార్య పక్షులను, యామిని శలభములను ప్రసవించిరి. సుపర్ణ (వినత) సాక్షత్తుగ విష్ణువునకు వాహనమగు గరుడుడు, సూర్యుని సారథియగు అనూరుడు (అరుణుడు) అను నిరువురు పుత్రులను గనినది. కద్రువ నాగులను గనినది.

కృత్తికాదీని నక్షత్రాణీన్దోః పత్న్యస్తు భారత ।
దక్షశాపాత్ సోఽనపత్యస్తాసు యక్ష్మగ్రహార్దితః ॥ 23

భారతా! కృత్తికాది నక్షత్రములు చంద్రుని పత్నులు. చంద్రుడు పత్నుల నందఱను తిరస్కరించి రోహిణిపై మిగుల అనురక్తుడై యుండెను. అందువలన దక్షప్రజాపతి యితరపుత్రికల దుఃఖమును జూచి కుపితుడై చంద్రుని 'క్షయరోగపీడితుడవగుదువు గాక' యని శపించెను. అందువలన వానికి ఏ భార్య వలనగూడ సంతానము కలుగలేదు.

పునః ప్రసాద్య తం సోమః కలా లేభే క్షయే దితాః ।
శృణు నామాని లోకానాం మాతౄణాం శంకరాణి చ ॥ 24

అథ కశ్యపపత్నీనాం యత్ప్రసూతమిదం జగత్ ।
అదితిర్దితిర్దనుః కాష్ఠా అరిష్టా సురసా ఇలా ॥ 25

మునిః క్రోధవశా తామ్రా సురభిః సరమా తిమిః ।
తిమేర్యాదోగణా ఆసన్ శ్వాపదాః సరమాసుతాః ॥ 26

అనంతరము చంద్రుడు వివిధములగు వినయవాక్కులతో దక్షుని బ్రసన్నునిగ జేసి కళలనుమాత్రము పొందెనుగాని సంతానమును పొందలేదు. ఈ కళలు కృష్ణపక్షమున తగ్గిపోవుచుండును. శుక్లపక్షమున పెరుగుచుండును. రాజా! అనంతరము కశ్యపప్రజాపతి భార్యల నామములను వినుము. వారిగర్భమునుండి జగత్తు బయల్వెడలినది. వారే సర్వలోకములకు తల్లులు. వారి నామములను శ్రవణముచేసిన పరమశుభము కలుగును. అదితి, దితి, దనువు, కాష్ఠ, అరిష్ట, సురస, ఇల, ముని,క్రోధవశ, తామ్ర, సురభి, సరమ, తిమి యనువారందఱు కశ్యపునిభార్యలు. తిమికు, యాదోగణములు (జలజంతువులు) సరమకు శ్వాపదములు (సింహవ్యాఘ్రాదిజంతువులు) ప్రాదుర్భవించినవి.

సురభేర్మహిషాః గావో యే చాన్యే ద్విశఫా నృప ।
తామ్రాయాః శ్యేనగృధ్రాద్యా మునేరప్సరసాం గణాః ॥ 27

మహారాజా! సురభిసంతానము మహిషములు, గోవులు, రెండు గిట్టలు గల యితర జంతువులు; తామ్రకు శ్యేనములు, గృధ్రములు మున్నగు పక్షులు; మునికి అప్సరసలు జన్మించిరి.

దన్దశూకాదయః సర్పా రాజన్ క్రోధవశాత్మజాః ।
ఇలాయా భూరుహాః సర్వే యాతుధానాశ్చ సౌరసాః ॥ 28

క్రోధవశయొక్క సంతానము దోమలు, సర్పములు,మున్నగునవి, ఇలకు వృక్షములు, సురసకు రాక్షసులు జన్మించిరి.

అరిష్టాయాస్తు గన్ధర్వాః కాష్ఠాయా ద్విశఫేతరాః ।
సుతా దనోరేకషష్టిస్తేషాం ప్రాధానికాన్ శృణు ॥ 29

ద్విమూర్ధా శమ్బరోఽరిష్టో హయగ్రీవో విభావసుః ।
అయోముఖః శంకుశిరాః స్వర్భానుః కపిలోఽరుణః ॥ 30

పులోమా వృషపర్వా చ ఏకచక్రోఽనుతాపనః ।
ధూమ్రకేశో విరూపాక్షో విప్రచిత్తిశ్చ దుర్జయః ॥ 31

అరిష్టకు గంధర్వులు జన్మించిరి. కాష్ఠకు ఒకగిట్ట గలిగిన అశ్వములు మున్నగు పశువులు జన్మించినవి. రాజా! దనువునకు అఱువది యొక్కమంది కుమారులు జన్మించిరి. వారిలో ముఖ్యులైన పదునెనమండుగురు పుత్రుల నామములను వినుము - ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసుడు, అయోముఖుడు, శంకుశిరసుడు, స్వర్భానుడు, కపిలుడు, అరుణుడు, పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రడు, అనుతాపనుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, విప్రచిత్తి, దుర్జయుడు, అనువారు పదునెనమండుగురు.

స్వర్భానోః సుప్రభాం కన్యాముపాహ నముచిః కిల ।
వృషపర్వణస్తు శర్మిష్ఠాం యయాతిర్నాహుషో బలీ ॥ 32

స్వర్భానునకు సుప్రభ యనునొక పుత్రిక యుండెను. నముచి యామెను వివాహ మాడెను, వృషపర్వుని పుత్రిక శర్మిష్ఠ, ఆమెను నహుషునిపుత్రుడగు యాయాతి వివాహ మాడెను.

వైశ్వానరసుతాయాశ్చ చతస్రశ్చారుదర్శనాః ।
ఉపదానవీ హయశిరా పులోమాకాలకా తథా ॥ 33

ఉపదానవీం హిరణ్యాక్షః క్రతుర్హయశిరాం నృప ।
పులోమాం కాలకాం చ ద్వే వైశ్వానరసుతే తు కః ॥ 34

ఉపయేమేఽథ భగవాన్ కశ్యపో బ్రహ్మచోదితః ।
పౌలోమాః కాలకేయాశ్చ దానవా యుద్ధశాలినః ॥ 35

దన్దశూకాదయః సర్పా రాజన్ క్రోధవశాత్మజాః ।
ఇలాయా భూరుహాః సర్వే యాతుధానాశ్చ సౌరసాః ॥ 28

క్రోధవశయొక్క సంతానము దోమలు, సర్పములు,మున్నగునవి, ఇలకు వృక్షములు, సురసకు రాక్షసులు జన్మించిరి.

అరిష్టాయాస్తు గన్ధర్వాః కాష్ఠాయా ద్విశఫేతరాః ।
సుతా దనోరేకషష్టిస్తేషాం ప్రాధానికాన్ శృణు ॥ 29

ద్విమూర్ధా శమ్బరోఽరిష్టో హయగ్రీవో విభావసుః ।
అయోముఖః శంకుశిరాః స్వర్భానుః కపిలోఽరుణః ॥ 30

పులోమా వృషపర్వా చ ఏకచక్రోఽనుతాపనః ।
ధూమ్రకేశో విరూపాక్షో విప్రచిత్తిశ్చ దుర్జయః ॥ 31

అరిష్టకు గంధర్వులు జన్మించిరి. కాష్ఠకు ఒకగిట్ట గలిగిన అశ్వములు మున్నగు పశువులు జన్మించినవి. రాజా! దనువునకు అఱువది యొక్కమంది కుమారులు జన్మించిరి. వారిలో ముఖ్యులైన పదునెనమండుగురు పుత్రుల నామములను వినుము - ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసుడు, అయోముఖుడు, శంకుశిరసుడు, స్వర్భానుడు, కపిలుడు, అరుణుడు, పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రడు, అనుతాపనుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, విప్రచిత్తి, దుర్జయుడు, అనువారు పదునెనమండుగురు.

స్వర్భానోః సుప్రభాం కన్యాముువాహ నముచిః కిల ।
వృషపర్వణస్తు శర్మిష్ఠాం యయాతిర్నాహుషో బలీ ॥ 32

స్వర్భానునకు సుప్రభ యనునొక పుత్రిక యుండెను. నముచి యామెను వివాహ మాడెను, వృషపర్వుని పుత్రిక శర్మిష్ఠ, ఆమెను నహుషునిపుత్రుడగు యాయాతి వివాహ మాడెను.

వైశ్వానరసుతాయాశ్చ చతస్రశ్చారుదర్శనాః ।
ఉపదానవీ హయశిరా పులోమాకాలకా తథా ॥ 33

ఉపదానవీం హిరణ్యాక్షః క్రతుర్హయశిరాం నృప ।
పులోమాం కాలకాం చ ద్వే వైశ్వానరసుతే తు కః ॥ 34

ఉపయేమేఽథ భగవాన్ కశ్యపో బ్రహ్మచోదితః ।
పౌలోమాః కాలకేయాశ్చ దానవా యుద్ధశాలినః ॥ 35

తయోః షష్టిసహస్రాణి యజ్ఞఘ్నాంస్తే పితుః పితా ।
జఘానస్వర్గతో రాజన్నేక ఇన్ద్రప్రియఙ్కరః ॥ 36

దనువు పుత్రుడగు వైశ్వానరునకు ఉపదానవి, హయశిర, పులోమ, కాలక యను నామములతో అందమైన నల్వురు పుత్రికలు గలరు. వారిలో హిరణ్యాక్షుడు ఉపదానవిని, క్రతువు హయశిరసును వివాహమాడిరి. పిమ్మట బ్రహ్మపట్టుదలవలన కశ్యపప్రజాపతి వైశ్వానరుని పుత్రికలైన పులోమ, కాలక యను ఇరువురిని భార్యలుగా గ్రహించెను. వారికి నివాతకవచాదులను అరువదివేల మందిపుత్రులు జన్మించిరి. వీరు పౌలోమ కాలకేయ నామములతో ప్రసిద్ధులు. వారు మిగుల బలశాలురు, యుద్ధనిపుణులు, వారెల్లపుడు ఋషులయజ్ఞములను ధ్వంసముచేయుచుందురు. రాజా! నీ పితామహుడగు అర్జునుడు స్వర్గమునకు వెడలి ఒంటరిగ యజ్ఞవిఘ్న కారులగు దానవులను సంహరించి దేవరా జగు ఇంద్రునకు మిగుల ప్రియపాత్రు డయ్యెను.

విప్రచిత్తిః సింహికాయాం శతం చైకమజీజనత్ ।
రాహుజ్యేష్ఠం కేతుశతం గ్రహత్వం య ఉపాగతాః ॥ 37

విప్రచిత్తుని భార్య యగు సింహికకు నూటొక్క మంది పుత్రులు జన్మించిరి. వారిలో జ్యేష్ఠుడు రాహువు, మిగిలిన నూఱుగురుకేతువులు, వా రందఱు గ్రహత్వమును పొందిరి.

అథాతః శ్రూయతాం వంశో యోఽదితే రనుపూర్వశః ।
యత్ర నారాయణో దేవః స్వాంశేనావాతర ద్విభుః ॥ 38

వివస్వానర్య మా పూషా త్వష్టాథ సవితా భగః ।
ధాతా విధాతా వరుణో మిత్రః శక్ర ఉరుక్రమః ॥ 39

పిమ్మట అదితివంశమున విస్తారముగజెప్పబడు చున్నది. దానిని క్రమముగ వినుము. ఈ వంశమునందే భగవానుడు, విభుడునగు నారాయణుడు తనయంశముతో అవతరించినాడు. వివస్వానుడు, అర్యముడు, పూష, త్వష్ట, సవిత, భగ, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు, శక్రుడు, ఉరుక్రముడు వీ రదిత పుత్రులు.

వివస్వతః శ్రాద్ధదేవం సంజ్ఞాసూయత వై మనుమ్ ।
మిథునం చ మహాభాగా యమం దేవం యమీం తథా
సైవ భూత్వాథ బడబా నాసత్యౌ సుషువే భువి ॥ 40

వివస్వానునిభార్య (సూర్యునిపత్ని) సంజ్ఞ శ్రాద్ధదేవుడనుమనువును గనినది. మహా భాగ్యవతి యగు నీ సంజ్ఞయే యముడు, యమున అను కవలలను (సంతానరూపమును) గనినది. పిమ్మట ఆ యమి బడబా (ఆడుగుఱ్ఱము) రూపమును ధరించిపుడమిపై విహరించుచు అశ్వినీకుమారుల నిరువురను గనినది.

ఛాయా శనైశ్చరం లేభే సావర్ణిం చ మనుం తతః ।
కన్యాం చ తపతీం యా వై వవ్రే సంవరణం పతిమ్ ॥ 41

సూర్యుని మఱియొక భార్య ఛాయ; ఆమె వివస్వానుని (సూర్యుని) వలన శనైశ్చరుడు, సావర్ణి (మనువు) అనునిరువురు పుత్రులను, తపతి యను పుత్రికను గనినది. ఈ తపతియే సంవరుణిని పతిగా వరించినది.

అర్యమ్ణో మాతృకా పత్నీ తయోశ్చర్షణయః సుతాః ।
యత్ర వై మానుషీ జాతిర్బ్రహ్మణా చోపకల్పితా ॥ 42

అర్యమునిపత్ని మాతృక, ఆమె జ్ఞానవంతు లగు పెక్కండ్రు పుత్రులను పడసినది. ఆ పుత్రులయందు ఆత్మానుసంధానవిశేషముద్వారా బ్రహ్మ మనుష్యజాతిని సృష్టించెను.

పూషానపత్యః పిష్టాదో భగ్నదన్తోఽభవత్పురా ।
యోఽసౌదక్షాయ కుపితం జహాస వివృతద్విజః ॥ 43

పూషున కెట్టి సంతానము లేదు. అతడు పుత్రహీనుడు, (దక్షయజ్ఞమున) దంతహీనుడు అయ్యెను. అందువలన అతడు పిష్టకమును (పిండిని) భక్షించుచుండెను. పూర్వకాలమున దక్షునిపై గోపించిన హరుని దర్శించి యతడు తనదంతములను జూపి పరిహసించెను. అందువలన అతనిదంతములు విరిగిపోయెను.

త్వష్టుర్దైత్యాత్మజా భార్యా రచనా నామ కన్యకా ।
సన్నివేశస్తయోర్జజ్ఞే విశ్వరూపం చ వీర్యవాన్ ॥ 44

దైత్యకన్యక యగు రచన త్వష్టప్రజాపతిభార్య. ఆమెప్రజాపతి వలన మహాబలశాలు రగు సన్నివేశవిశ్వరూపులను గనినది.

తం వవ్రిరే సురగణాః స్వస్రీయం ద్విషతామపి ।
విమతేన పరిత్యక్తా గురుణాఽఽఙ్గీరసేన యత్ ॥ 45

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే దక్షకన్యావంశః షష్ఠోఽధ్యాయః ॥

విశ్వరూపుడు చిరశత్రువులగు దైత్యులకు మేనల్లుడు. ఐనను కులగురువగు బృహస్పతిచే అవమానితులు పరిత్యక్తులు నగు దేవతలు వానిని పురోహితునిగా వరించిరి.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
దక్షకన్యావంశవర్ణన మను ఆఱవ అధ్యాయము
సంపూర్ణము

# ఏడవ అధ్యాయము

## బృహస్పతి దేవతలను త్యజించుట : దేవతలు విశ్వరూపుని గురువుగా వరించుట

కథాసారము :- ఈ యధ్యాయమున దేవరాజగు నింద్రుడొనరించిన అపరాధముచే దేవగురు వగు బృహస్పతి దేవపౌరోహిత్యమును త్యజించుట, దేవతల ప్రార్థన నమపరించి త్వష్ట తనయుడు ద్విజవరుడు నగు విశ్వరూపుడు దేవపౌరోహిత్యమును అంగీకరించుట యనువిషయములు వర్ణింపబడినవి.

ఒకప్పుడు దేవరాజగు నింద్రుడు తనప్రేయసి యగు శచిదేవితో గూడి సుర సింహాసనమున నాసీనుడై సిద్ధచారణ గంధర్వాది దేవతాబృందములతో గూడియున్న రాజసభా మధ్యమున విరాజిల్లుచుండెను. అప్పుడు దేవగురువగు బృహస్పతి యచటికి విచ్చేసెను. ఇంద్రుడు విషయమదముచే క్షణకాలము తన్నుతాను మఱచి బృహస్పతిని గౌరవింపక పోయెను. దానివలన బృహస్పతి యింద్రుని యైశ్వర్యగర్వము నెఱింగి వానికి గుణపాఠము చెప్పదలచి వెంటనే సభనుండి వెడలిపోయెను. అనంతరము ఇంద్రుడు తనయైశ్వర్యగర్వమును, గురుదేవునిపట్ల తాను వ్యవహరించిన తీరును గుర్తించి మిగుల దుఃఖితుడయ్యెను. అప్పుడే క్షమాపణమును వేడుకొనుటకై లేచి గురుదేవు నన్వేషించుటకై వెడలెను. కాని యెక్కడను ఆయన కనబడలేదు.

గురువు నవమానించుటచే గలిగిన వాని యాయపరాధమువలన త్వరలోనే సురరాజ్యలక్ష్మి వానిని విడచిపోయెను. దైత్యులు ఘోరయుద్ధమున దేవతలతో గూడ నింద్రుని యోడించి సురసింహాసనమును హస్తగత మొనరించు కొనిరి. చివరకు ఇంద్రుడు దేవతలతో కలసి బ్రహ్మను శరణుజొచ్చెను. ఆయన వారు చేసిన యపరాధమునకు మందలించి త్వష్టుతనయు డగు విశ్వరూపుని పురోహితునిగ జేసికొనవలసిన దనియు పదేశించెను. తదనుసారముగ దేవరాజు విశ్వరూపుని పురోహితునిగ వరించి అతని యను గ్రహముచే దైత్యుల నోడించి సురసింహాసనమునుమరల స్వాధీనము చేసికొనెను.

### శ్రీరాజోవాచ

**కస్య హేతోః పరిత్యక్తా ఆచార్యేణాత్మనః సురాః ।**
**ఏతదాచక్ష్వ భగవన్ శిష్యాణామక్రమం గురౌ ॥** 1

పరీక్షిన్మహారాజు పలికెను :- దేవా! కులగురు వగు బృహస్పతి తనశిష్యులగు దేవతల నేలపరిత్యజించెను? దేవతలు తమ గురువున కేయపరాధ మొనర్చిరి? ఆ విషయమును నాకు వివరింపవలసినది.

## శ్రీబాదరాయణిరువాచ

ఇన్ద్రస్త్రిభువనైశ్వర్యమదోల్లంఘితసత్పథః ।
మరుద్భిర్వసుభీరుద్రైరాదిత్యై ర్ఋభుభిర్నృప ॥ 2

విశ్వేదేవైశ్చ సాధ్యైశ్చ నాసత్యాభ్యాం పరిశ్రితః ।
సిద్ధచారణగన్ధర్వైర్మునిభిర్బ్రహ్మవాదిభిః ॥ 3

విద్యాధరాప్సరోభిశ్చ కిన్నరైః పతగోరగైః ।
నిషేవ్యమాణో మఘవాన్ స్తూయమానశ్చ భారత ॥ 4

ఉపగీయమానో లలితమాస్థానాధ్యాసనాశ్రితః ।
పాణ్డురేణాతపత్రేణా చన్ద్రమణ్డలచారుణా ॥ 5

యుక్తశ్చాన్యైః పారమేష్ఠ్యైశ్చామరవ్యజనాదిభిః ।
విరాజమానః పౌలమ్యా సహార్ధాసనయా భృశమ్ ॥ 6

స యదా పరమాచార్యం దేవానామాత్మనశ్చ హ ।
నాభ్యనన్దత సంప్రాప్తం ప్రత్యుత్థానాసనాదిభిః ॥ 7

వాచస్పతిం మునివరం సురాసురనమస్కృతమ్ ।
నోచ్చచాలాసనాదిన్ద్రః పశ్యన్నపి సభాగతమ్ ॥ 8

శుకదేవుడు పలికెను :- మహారాజా! ఒకప్పుడు దేవరా జగు ఇంద్రుడు ముల్లోకముల యందలి యైశ్వర్యమును బొంది గర్వోన్మత్తుడై సత్పథము నుల్లంఘించి మరుత్తులు, వసువులు, రుద్రులు,ఆదిత్యులు, ఋభువులు, విశ్వదేవులు, సాధ్యులు, అశ్వినీ కుమారులు, సిద్ధచారణులు, గంధర్వులు, బ్రహ్మవాదులగుమునులు మున్నగు వారిచే పరివృత్తుడై సభామధ్యమున సింహాసనమున నుపవిష్టుడైయుండెను. విద్యాధరులు, అప్సరసలు, కిన్నరులు, పక్షులు, ఉరగులు వానిని సేవించుచు స్తుతించుచుండిరి. అప్సరసలు, గంధర్వులు ఆయన సమీపమున సులలితస్వరముతో గానము చేయుచుండిరి. శిరముపై చంద్రమండ

లమువలె మనోహరమునగు శ్వేతఛత్రముతోను, చామరములు మున్నగు చక్రవర్తి చిహ్నములతోను, విరాజిల్లు చున్నవాడై ఆయన తనయర్ధసింహాసనమున భార్య యగు శచీదేవితో గూడ యుపవిష్టుడైయుండెను. అట్టి సమయమున దేవతలకు, దేవరా జగు నింద్రునకు పరమగురువు, సర్వులకు వంద్యుడు, మునిశ్రేష్ఠుడు నగు బృహస్పతి సభా మండపములోనికి ఏతెంచెను. ఎదుట ఇంద్రుడు సురగురు వగు బృహస్పతి యొక్క రాకను జూచియు సింహాసనమునుండి లేచి ఆసనాదులద్వారా ఆయనను అభినందింపలేదు. గురువుపై గౌరవమును ప్రదర్శించుట కేమాత్రమును ప్రయత్నింపలేదు.

**తతో నిర్గత్య సహసా కవిరాఙ్గిరసః ప్రభుః ।**
**ఆయయౌ స్వగృహం తూష్ణీం విద్వాన్ శ్రీమదవిక్రియామ్ ॥ 9**

పిమ్మట భావికార్యవేత్త యగు బృహస్పతి దేవరాజుయొక్క యీయసద్వ్యవహారమును జూచి వాని కైశ్వర్యగర్వము గలిగెనని గుర్తించెను. ఆయన యింద్రునకు శాపాదులద్వారా శాస్తిచేయగలిగిన వాడై యుండియు అట్లు చేయక వెంటనే సభాస్థలమునుండి తన గృహమునకు మౌనముగ వెడలిపోయెను.

**తర్హ్యేవ ప్రతిబుద్ధ్యేన్ద్రో గురుహేలనమాత్మనః ।**
**గర్హయామాస సదసి స్వయమాత్మానమాత్మనా ॥ 10**

దేవగురు వగు బృహస్పతి సభామండపమునుండి బయలువెడలిన పిమ్మట 'నేను గురుదేవుని అవమానించితి' నని ఇంద్రుడు తెలిసికొనెను. ఇది తలంచుకొని యింద్రుడు తన్నుతానే సభలో నిందించుకొన సాగెను.

**అహో బత మయాసాధుకృతం వై దభ్రబుద్ధినా ।**
**యన్మయైశ్వర్యమత్తేన గురుః సదసి కాత్కృతః ॥ 11**

ఆహా ! నే నెంతటి యన్యాయ మొనరించితిని? నేను అల్పబుద్ధివలన ఐశ్వర్యమదమత్తుడ నై సభలోనికి వచ్చిన గురుదేవుని గౌరవింపక యవమానించితిని గదా!

**కో గృధ్యేత్ పణ్డితో లక్ష్మీం త్రివిష్టపపతేరపి ।**
**యయాహమాసురం భావం నీతోఽద్య విబుధేశ్వరః ॥ 12**

నేను సాత్త్వికప్రకృతు లగు దేవతలకు రాజునై యుండియు సామాన్యధనమదముచే గర్వితుడనై నేడు అహంకారగ్రస్తుడ నైతిని. ఏ పండితుడు నన్ను ధనము కొఱకై ప్రార్థించును? ఛీ, నాధన మెంత హీనమైనది!

**యో పారమేష్ఠ్యం ధిషణమధితిష్ఠన్న కంచన ।**
**ప్రత్యుత్తిష్ఠేదితి బ్రూయుర్ధర్మం తే న పరం విదుః ॥ 13**

మహారాజసింహాసనము నధిష్ఠించిన చక్రవర్తి బ్రాహ్మణాదుల గౌరవార్థమై సింహాసనమునుండి లేవవలసినపని లేదని కొందఱు పలుకుచున్నారు. కాని వారుత్కృష్ట ధర్మమును దెలియనివారే యగుదురు.

**తేషాం కుపథదేష్టౄణాం పతతాం తమసి హ్యధః ।**
**యే శ్రద్దధుర్వచస్తేవై మజ్జన్త్యశ్మప్లవా ఇవ ॥ 14**

అజ్ఞానములో బడినవారు, కుమార్గము నుపదేశించువారు, శ్రద్ధతో వారివాక్కులను విశ్వసించువారు నగు మానవులు రాళ్ళతో జేయ బడిన నౌకయం దెక్కి పయనింప నభిలషించు వ్యక్తులవలె అధఃపతితులగుదురు. రాళ్ళతో చేయబడిన నౌక మొదట తన్ను పిమ్మట దానియం దెక్కినవానిని నీటిలో ముంచునట్లు కుమార్గము నుపదేశించిన వ్యక్తి మొదట నరకమున బడును, పిమ్మట శిష్యుని బడవేయును.

**అథాఽహమమరాచార్యమగాధధిషణం ద్విజమ్ ।**
**ప్రసాదయిష్యే నిశఠః శీర్ష్ణా తచ్చరణం స్పృశన్ ॥ 15**

ఏమైనగానిమ్ము, నే నిపుడు సరళభావముతో శఠత్వమును వదలి తలవంచి అగాధమైన బుద్ధిగలవాడు, దేవగురువు, బ్రాహ్మణశ్రేష్ఠుడు నగు బృహస్పతి చరణముల బట్టుకొని ఆయనను ప్రసన్నునిగ చేసికొనుటకు బ్రయత్నింతును.

**ఏవం చిన్తయతస్తస్య మఘోనో భగవాన్ గృహాత్ ।**
**బృహస్పతిర్గతోఽదృష్టాం గతిమధ్యాత్మ మాయయా ॥ 16**

ఇంద్రు డిట్లాలోచించుచున్నా డనియెఱింగి బృహస్పతి తనగృహమునుండి బయల్వెడలి ఆత్మమాయచే వెంటనే అదృశ్యుడయ్యెను.

**గురోర్నాధిగతః సంజ్ఞాం పరీక్షన్ భగవాన్ స్వరాట్ ।**
**ధ్యాయన్ ధియా సురైర్యుక్తః శర్మ నాలభతాత్మనః ॥ 17**

అనంతర మింద్రుడు దేవతలతో గలసి ఇటునటు వెదకినను బృహస్పతిని కనుగొనజాలక పోయెను. అయ్యో! గురుదేవుడు విముఖుడయ్యెనుగదా ! ఇక మా కెట్టియుపాయము లేదుగదా అని చింతింప సాగెను. దేవతలతో గూడి యున్నను ఆతని కెట్టి మనశ్శాంతియు కలుగలేదు.

**తచ్ఛ్రుత్వైవాసురాః సర్వే ఆశ్రిత్యౌశనసం మతమ్ ।**
**దేవాన్ ప్రత్యుద్యమం చక్రుర్దుర్మదా ఆతతాయినః ॥ 18**

దుష్టమతులు, ఆతతాయులు నగు అసురులు ఇంద్రునియీదుర్దశను దెలిసికొనివవారై దైత్యగురువగు శుక్రాచార్యుని సమ్మతి ననుసరించి అస్త్రాదుల ధరించి దేవతలతో యుద్ధముచేయ బయల్వెడలిరి.

తైర్విసృష్టేషుభి స్తీక్ష్ణ ర్నిర్భిన్నాఙ్గోరుబాహవః ।
బ్రహ్మాణం శరణం జగ్ముః సహేన్ద్రో నతకన్ధరాః ॥ 19

అసురులతీక్ష్ణబాణాఘాతములచే దేవతల మస్తకములు, ఊరువులు (తొడలు), బాహువులు మున్నగునవయవములు భగ్నమయ్యెను. వారుపాయాంతరముమ గానవివారై యింద్రునితో గూడి అవనతమస్తకులై బ్రహ్మను శరణుబొందిరి.

తాంస్తథాభ్యర్దితాన్ వీక్ష్య భగవానాత్మభూరజః ।
కృపయా పరయా దేవ ఉవాచ పరిసాన్త్వయన్ ॥ 20

భగవానుడు, స్వయంభు వగు బ్రహ్మదైత్యులబాణాఘాతములచే కాతరులైన దేవతలిట్లు తనకడకు వచ్చుట చూచి దయాపరవశుడై వారిని యోదార్చుచూ విట్లు పలుకసాగెను.

## శ్రీబ్రహ్మోవాచ

అహోబత సురశ్రేష్ఠా హ్యభద్రం వః కృతం మహత్ ।
బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం దాన్తమైశ్వర్యాన్నా భ్యనన్దత । 21

బ్రహ్మ పలికెను : సురశ్రేష్ఠులారా! మీ రైశ్వర్యమదమత్తులై మీ కడకు ఏగుదెంచిన బ్రహ్మజ్ఞానియు, ఇంద్రియనిగ్రహుడు, బ్రాహ్మణశ్రేష్ఠుడు వగు బృహస్పతిని గౌరవింపలేదు. ఆహా! మీ రెంతటి యన్యాయ మొనరించితిరి!

తస్యాయమనయస్యాసీత్ పరేభ్యో వః పరాభవః ।
ప్రక్షీణేభ్యః స్వవైరిభ్యః సమృద్ధానాం చ యత్సురాః ॥ 22

అట్టి యన్యాయప్రవర్తనమువలననే శత్రువులగు అసురులచేతిలో మీకు పరాజయము కలిగినది. దేవతలారా! అయ్యసురులు తమను తామే యుద్ధములో వినాశముచేసికొని క్షీణబలులైరి. లేనిచో మీ రత్యంత సమృద్ధశాలురై యుండియు వారిచేతిలో నేల పరభూతులగుదురు?

మఘవన్ ద్విషతః పశ్య ప్రక్షీణాన్ గుర్వతిక్రమాత్ ।
సంప్రత్యుపచితాన్ భూయః కావ్యమారాధ్య భక్తితః ।
ఆదదీరన్ నిలయనం మమాపి భృగుదేవతాః ॥ 23

ఇంద్రా! పూర్వము మీశత్రువులగు దైత్యులు గురువు నతిక్రమించి ఎట్లు బలహీనులైరో, ఇంకను వారిపుడు భక్తితో గురువగు శుక్రాచార్యు నారాధించి మరల యెట్లు బలశాలురయిరో చూడుము; శుక్రాచార్యునియందు వారి కత్యంత గురుభక్తియుండుటచేతనే వారి కింతటి శక్తి కలిగినది. దానిచేత వారు నాలోకమునుగూడ సునాయాసముగ హరింపజాలుదురు. (చూడుము, గురువునకు చేసిన మానావమానముల వలననే సంపదలు ఆపదలు కలుగుచుండును.)

త్రివిష్టపం కిం గణయ న్త్యభేద్య -
మన్త్రా భృగూణామనుశిక్షితార్థాః ।
న విప్రగోవిన్దగవీశ్వరాణాం
భవన్త్యభద్రాణి నరేశ్వరాణామ్ ॥ 24

శుక్రాచార్యునిశిష్యులైన దైత్యులు అభేద్యమగు ఆలోచన గలవారై దేవతలను పరిగణించుటలేదు. చూడుము బ్రాహ్మణులు, భగవానుడగు గోవిందుడు ఏరాజులపై అనుగ్రహమును జూపుదురో వారి కెప్పుడును అశుభము కలుగదు. (అట్లుగానిచో ఇతరజనుల కెప్పుడును అడుగడుగున అశుభము వాటిల్లు ననితెలిసికొనవలెను)

తద్విశ్వరూపం భజతాశు విప్రం
తపస్వినం త్వాష్ట్రమథాత్మవన్తమ్ ।
సభాజితోఽర్థాన్ స విధాస్యతే వో
యది క్షమిష్యధ్వముతాస్య కర్మ ॥ 25

దేవతలారా! ఇప్పుడు మీరొక్క పనిచేయుడు. తపస్వియు, ఆత్మజ్ఞానియు, త్వష్టృతనయుడు నగువిశ్వరూపుడను బ్రాహ్మణుని త్వరగ గురురూపమున సేవింపుడు. మీసత్కారముచే సంతుష్టుడై యతడు మీయభీష్టవిషయములను నెఱవేర్చును. అసురులపై వానికి గలపక్షపాత రూపదోషములను మీరు గ్రహింపవలదు.

## శ్రీశుక ఉవాచ

త ఏవముదితా రాజన్ బ్రహ్మణా విగతజ్వరాః ।
ఋషిం త్వాష్ట్రముపవ్రజ్య పరిష్వజ్యేద మబ్రువన్ ॥ 26

శుకుడు పలికెను :- మహారాజా! బ్రహ్మ యిట్లుపదేశింపగా దేవతల సంతాపము కొంచెము తొలగెను. వారు త్వష్టృతనయుడగు విశ్వరూప ఋషి సమీపమునకు వెడలి ఆలింగనము చేసికొని అతనితో నిట్లు పలుక సాగిరి.

## శ్రీదేవా ఊచుః

**వయం తేఽతిథయః ప్రాప్తా ఆశ్రమం భద్రమస్తు తే ।**
**కాలః సంపాద్యతాం తాత పితౄణాం సమయోచితః ॥ 27**

దేవతలు పలికిరి :-విశ్వరూపా! నీకు శుభము కలుగుగాక! మేము అతిథిరూపముతో నీ యాశ్రమమునకు వచ్చితిమి. అందువలన నీవు సమయోచిత మగు పితరుల యభిలాషము నెఱవేర్పుము.

**పుత్రాణాం హి పరో ధర్మః పితృశుశ్రూషణం సతామ్ ।**
**అపి పుత్రవతాం బ్రహ్మన్ కిముత బ్రహ్మచారిణామ్ ॥ 28**

మహాత్మా! పుత్రవంతులైన సాధువులగు పుత్రులకు పితృ శుశ్రూషయె పరమధర్మము. బ్రహ్మచారులైన వారిసంగతి యిక చెప్పునదేమి?

**ఆచార్యో బ్రహ్మణో మూర్తిః పితామూర్తిః ప్రజాపతేః ।**
**భ్రాతా మరుత్పతేర్మూర్తిర్మాతా సాక్షాత్ క్షితేస్తనుః ॥ 29**

**దయాయా భగినీ మూర్తిర్ధర్మస్యాత్మాతిథిః స్వయమ్ ।**
**అగ్నేరభ్యాగతో మూర్తిః సర్వభూతాని చాత్మనః ॥ 30**

ఉపనయనముచేసి సాంగోపనిషదమగు వేదము నధ్యయనము చేయించు నాచార్యుడు వేదమూర్తి, తండ్రి బ్రహ్మమూర్తి, సోదరుడు ఇంద్రమూర్తి, తల్లి సాక్షాత్తుగ పృథివీమూర్తి, సోదరి దయామూర్తి, అతిథి స్వయముగ ధర్మమూర్తి, అభ్యాగతుడు అగ్నిదేవమూర్తి, భూతములు సర్వాత్మకు డగు విష్ణుభగవానుని మూర్తులు. (అందువలన సర్వప్రాణులను తమవలె జూచుకొనవలెను)

**తస్మాత్పితౄణామార్తానామార్తిం పరపరాభవమ్ ।**
**తపసాపనయంస్తాత సన్దేశం కర్తుమర్హసి ॥ 31**

వత్సా! మేము శత్రువులచేతిలో పరాజితులమై మిగుల దుఃఖితులమైతిమి. శత్రుపరాభవమగు మా యీ దుఃఖమును నీ తపోబలముచే పోగొట్టి మా విన్నపమును పాలింపసమర్థుడవు నీవు.

**వృణీమహే త్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం గురుమ్ ।**
**యథాఽఞ్జసా విజేష్యామః సపత్నాం స్తవ తేజసా ॥ 32**

నీవు బ్రహ్మనిష్ఠుడవగు (బ్రహ్మజ్ఞానియగు) బ్రాహ్మణుడవు. అందువలన వర్ణమాత్రముచేతనే గురువువై యున్నావు. మేము మిమ్ము ఉపాధ్యాయునిగ వరించుచున్నాము. నీ తపోబల ప్రభావముచే అనాయాసముగ మేము శత్రువులను జయించి గెలుపును పొందగలము.

న గర్హయన్తి హ్యర్థేషు యవిష్ఠాఙ్ఘ్ర్యభివాదనమ్ ।
ఛన్దోభ్యోఽన్యత్ర నబ్రహ్మన్ వయో జ్యైష్ఠస్య కారణమ్ ॥ 33

ప్రయోజనము ననుసరించి కనిష్ఠుని పాదములకు నమస్కరించిన దోష మేమియు నుండదు. వాస్తవములో వేదజ్ఞానమునగాక యితర స్థలములలో వయోజ్యేష్ఠత్వమునకు కారణ ముండును. వేదజ్ఞత్వమే జ్యేష్ఠత్వమునకు గారణము. అందువలన నీవే మాకు జ్యేష్ఠుడ వగుదువు.

## శ్రీఋషి రువాచ

అభ్యర్థితః సురగణైః పౌరహిత్యే మహాతపాః ।
స విశ్వరూపస్తానాహ ప్రసన్నః శ్లక్ష్ణయా గిరా ॥ 34

శుకుడు పలికెను :- దేవతలు మహాతపస్వి యగు విశ్వరూపుని పౌరోహిత్యమునకై ప్రార్థింపగా అతడు దేవతలకు ప్రసన్నుడై మధుర వాక్కులతో వారితో నిట్లు పలుకసాగెను.

## శ్రీ విశ్వరూప ఉవాచ

విగర్హితం ధర్మశీలైర్బ్రహ్మవర్చ ఉపవ్యయమ్ ।
కథం ను మద్విధో నాథా లోకేశైరభియాచితమ్ ।
ప్రత్యాఖ్యాస్యతి తచ్ఛిష్యః స ఏవ స్వార్థ ఉచ్యతే ॥ 35

విశ్వరూపుడు పలికెను :- దేవతలారా! పౌరోహిత్యము పూర్వసిద్ధమగు బ్రహ్మతేజస్సును నాశము చేయునది యగుటచే ధర్మశీలు రైన మునులు దానిని నిందించుచుందురు. అయినను మావంటి వ్యక్తి నీవంటి లోకపాలుర ప్రార్థనను కాదనజాలడు. నేను మీశిష్యుడను. అనేక విషయములలో శిక్షణార్హుడను, అందువలన మీయాజ్ఞను అంగీకరించుటయే నాస్వార్థము.

అకించనానాం హి ధనం శిలోఞ్ఛనం
తేనేహ నిర్వర్తితసాధుసత్క్రియః ।
కథం విగర్హ్యం ను కరోమ్యధీశ్వరాః
పౌరోధసం హృష్యతి యేన దుర్మతిః ॥ 36

అధీశ్వరులారా! శిలోంఛనము అనగా క్షేత్రస్వామి వదలివేసిన ధాన్యపుగింజలను ఏరుకొనుట, అంగడిలో పడిన వ్రీహ్యాదులను గ్రహించుట ఇదియే అకించనులధనము, దానివలననే గృహస్థాశ్రమములో నున్న సాధువులు తాముచేయదగిన సత్కర్మలను జేయుచుందురు. దుర్మతి యైనవాడు, పౌరోహిత్యమును అవలంబించిన ధనముద్వారా ఆనందమును బొందును. అట్టి దూష్యమైనపౌరోహిత్యమును నేనెట్లు చేయుదును?

**తథాపిన ప్రతిబ్రూయాం గురుభిః ప్రార్థితం కియత్ ।**
**భవతాం ప్రార్థితం సర్వం ప్రాణైరర్థైశ్చ సాధయే ॥ 37**

మీరు నాకు గురువులు, పౌరోహిత్యము మిగుల దూష్యమైన దైవను వేమ మీస్వల్ప మాత్రప్రార్థనము నెట్లు కాదనగలను? అందువలన నేను ధనప్రాణములద్వారా మీ విన్నపమును అంగీకరింతును.

## శ్రీబాదరాయణి రువాచ

**తేభ్య ఏవం ప్రతిశ్రుత్య విశ్వరూపో మహాతపాః ।**
**పౌరోహిత్యం వృతశ్చక్రే పరమేణ సమాధినాః ॥ 38**

శుకుడు పలికెను :- రాజా! మహాతపస్వి యగు విశ్వరూపు డాదేవతల కడ ఇట్లు ప్రతిజ్ఞ చేసి వారి పౌరోహిత్యమును మిగుల ప్రయత్న పూర్వకముగ నిర్వహింపసాగెను.

**సురద్విషాం శ్రియం గుప్తామౌశనస్యాపి విద్యయా ।**
**ఆచ్ఛిద్యాదాన్మహేన్ద్రాయ వైష్ణవ్యా విద్యయా విభుః ॥ 39**

శుక్రాచార్యుని విద్య ద్వారా దేవశత్రువు లగు దైత్యులశ్రీరక్షింపబడినను విశ్వరూపుడు నారాయణ కవచవిద్యను సంపాదించి మహేంద్రునకు బోధించెను.

**యయా గుప్తః సహస్రాక్షో జిగ్యేఽసురచమూర్విభుః ।**
**తాం ప్రాహ స మహేన్ద్రాయ విశ్వరూప ఉదారధీః ॥ 40**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే విశ్వరూపోపాఖ్యానే
సప్తమోఽధ్యాయః ॥

సహస్రాక్షుడగు నింద్రుడు ఉదారమతి యగువిశ్వరూపుడుపదేశించిన విద్యచేరక్షితుడై దైత్యసేనను జయించెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
విశ్వరూపోపాఖ్యాన మను ఏడవ అధ్యాయము
సంపూర్ణము

# ఎనిమిదవ అధ్యాయము

## విశ్వరూపుడు మహేంద్రునకు నారాయణ కవచము నుపదేశించుట

కథాసారము :- దేనిబలముచే నింద్రుడు అసురులను జయించెనో, వృత్రాసురభ్రాత యగు విశ్వరూపుడు చెప్పిన ఆనారాయణ కవచ విషయ మీ యధ్యాయమున వర్ణింపబడినది.

మొదట దర్భలను పట్టుకొని, ఆచమించి, మౌనము నవలంబించి అష్టాక్షర ద్వాదశాక్షర మంత్రముల ద్వారా అంగన్యాసములను జేయవలెను. పిమ్మట "ఓం నమో నారాయణాయ" అను అష్టాక్షర మంత్రమును అష్టాంగములయందు విన్యాసముచేసి విపరీత భావముతో ఉత్పత్తి న్యాసమును, సంహార న్యాసమును జేయవలెను. "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను ద్వాదశాక్షరమంత్రములోని ప్రత్యక్షరమును ప్రణవముతో సంపుటిచేసి దక్షిణతర్జని నుండి వామతర్జని వరకు క్రమముగ నెనిమిది వర్ణములను న్యాసము చేసిన తరువాత మిగిలిన నాలుగువర్ణములను రెండు చేతులలోని యంగుష్ఠమునందలి ఆద్యంతపర్వము (కణుపులతో) న్యాసముచేయవలెను. అనంతరము "ఓం విష్ణవేనమః" అను షడక్షర మంత్రములోని ప్రత్యేకాక్షరమును క్రమముగ హృదయమునందు, మస్తకమునందు, కనుబొమల నడుమ, శిఖయందు, రెండునేత్రముల నడుమ సంధిస్థానమునందు న్యాసము చేసి "మః అస్త్రాయ ఫట్" అను మంత్రముతో దిగ్బంధనముచేసి "నాదేవోదేవమర్చయేత్ అనగా దేవుడు కాకుండగ దేవత నర్చింపజాలడు- అనుశాస్త్రవచనము ననుసరించి తనధ్యేయ వస్తువునకు దగినట్లుగ తదభిన్నముగ చింతింపవలెను.

ఇట్లు న్యాసమును పూర్తిచేసిన పిమ్మట గరుడుని వీపుపై పాదపద్మములనుంచి యెనిమిది చేతులయందు శంఖచక్రాద్యస్త్రములను ధరించి విరాజిల్లుచున్నవాడు, షడైశ్వర్యపూర్ణుడు నగు భగవానుని స్తుతింపవలెను. పిమ్మట మత్స్యవామన కూర్మనృసింహ వరాహ పరశురాములను, లక్ష్మణాగ్రజు డగు రామచంద్రుని,నరనారాయణులను, శక్త్యావేశ వతారుడగు దత్తాత్రేయుని, కపిలుని, సనత్కుమారుని, హయగ్రీవుని, భక్తావతారుడు దేవర్షియు నగు నారదుని, ధన్వంతరిని, ఋషభదేవుని, యజ్ఞేశ్వరుని, బలభద్రుని, వ్యాసదేవుని, బుద్ధదేవుని, కేశవుని, బృందావనాధిపతియు స్వయముగ భగవానుడు నగు గోవిందుని, పరమవ్యోమనాథుడగు నారాయణుని, మధుసూదనుని, త్రిధాముని, మాధవుని, హృషీకేశుని,పద్మనాభుని, జనార్దనుని, దామోదరుని, గదాధరుని, విశ్వేశ్వరుని, స్వాంశులను, శక్త్యావేశావతారులను స్తుతించి, నారాయణాస్త్రములగు సుదర్శన గదా శంఖ ఖడ్గములకు వందన మాచరించి వారిని తమ శుభములకై ప్రార్థింపవలెను.

పిమ్మట శుకదేవుడు పరీక్షిన్మహారాజునకు వృత్రాసుర భ్రాత యగు విశ్వరూపుడు ఇంద్రునకు బోధించిన నారాయణకవచమును, దానిమాహాత్మ్యమును వివరించెను ఆప్రసంగముతో నీయధ్యాయము సమాప్తమయ్యెను.

### శ్రీరాజోవాచ

యయా గుప్తః సహస్రాక్షః సవాహాన్ రిపుసైనికాన్ ।
క్రీడన్నివ వినిర్జిత్య త్రిలోక్యా బుభుజే శ్రియమ్ ॥ 1
భగవంస్తన్మమాఖ్యాహి వర్మ నారాయణాత్మకమ్ ।
యథాऽऽతతాయినః శత్రూన్ యేన గుప్తోऽజయన్మృధే ॥ 2

పరీక్షిన్మహారాజు పలికెను :- మహాత్మా! వైష్ణవీవిద్యచే రక్షితుడై దేవరాజు శ్రమలేకుండగ వాహనములతో గూడ శత్రుసేనను జయించి త్రైలోక్యసంపదను అనుభవించెను. దేవిచే రక్షితుడై దేవరాజు యుద్ధమున వధోద్యుక్తులైన శత్రువుల నెట్లు జయించెనో ఆనారాయణ కవచ విషయమును నాకు వివరింపుము.

### శ్రీబాదరాయణిరువాచ

వృతః పురోహితస్త్వాష్ట్రో మహేన్ద్రాయాను పృచ్ఛతే ।
నారాయణాఖ్యం వర్మాహ తదిహైకమనాః శృణు ॥ 3

శుకదేవుడు పలికెను :- దేవతలచే పౌరోహిత్యకర్మమున నియమింపబడిన విశ్వరూపుని ఇంద్రుడు నారాయణ కవచవిషయము నడుగగా ఆయన చెప్పెను. దానిని చెప్పుచున్నాను, స్థిరచిత్తుడై వినుము.

### శ్రీవిశ్వరూప ఉవాచ

ధౌతాఙ్ఘ్రిపాణిరాచమ్య సపవిత్ర ఉదఙ్ముఖః ।
కృతస్వాఙ్గకరన్యాసో మన్త్రాభ్యాం వాగ్యతః శుచిః ॥ 4
నారాయణపరం వర్మ సన్నహ్యేద్భయ ఆగతే ।
పాదయోర్జానునోరూర్వోరుదరే హృద్యథోరసి ॥ 5
ముఖే శిరస్యానుపూర్వ్యాదోఙ్కారాదీని విన్యసేత్ ।
ఓం నమో నారాయణాయేతి విపర్యయమథాపి వా ॥ 6

విశ్వరూపుడు పలికెను:- ఎట్టియాపద కలిగినను కాలుసేతులను కడుగుకొని ఆచమించి, దర్భలను పట్టుకొని, ఉత్తరదిక్కుగా గూర్చుండి మౌనము నవలంబించి శుద్ధభావముతో అష్టాక్షర ద్వాదశాక్షర మంత్రముల ద్వారా అంగన్యాస కరన్యాసముల నొనర్చి నారాయణాత్మక మగు నారాయణకవచమును బంధింపవలెను. మొదట పదద్వయము నందు పిమ్మట రెండు జానువులయందు, రెండుతొడలయందు, ఉదరము నందు, హృదయము నందు,

వక్షస్థలమునందు, ముఖమునందు, మస్తకమునందు, క్రమముగ ఓంకారాదిమంత్ర విన్యాసము చేయవలెను. అనగా "ఓం నమో నారాయణాయ" అను నీయష్టాక్షరమంత్రమును పైన చెప్పబడిన యష్టాంగములయందు ఓంకారాది క్రమముతో విన్యాసము చేయవలెను. ఇంకను వ్యతిరేక భావములో ఉత్పత్తి న్యాసమును, సంహార న్యాసమును చేయవలెను. అనగా శిరస్సునుండి పాదముల వరకు గల అష్టాంగములయందు ఓంకారాద్యష్టవర్ణములను విన్యాసము చేయవలెను. లేదా విపరీతభావముతో అనగా 'య'నుండి 'ఓం' వరకు గల సర్వవర్ణములను పాదములనుండి మస్తకము వరకు సంహారన్యాసమును చేసి మరల 'ఓం' నుండి 'య' వరకు గల సర్వవర్ణములను శిరస్సునుండి పాదములవరకు క్రమముగ ఉత్పత్తి న్యాసము చేయవలెను. ఇట్లు ఉత్పత్తి న్యాసమును సంహారన్యాసమును చేయవలెను.

**కరన్యాసం తతః కుర్యాద్ద్వాదశాక్షరవిద్యయా ।**
**ప్రణవాదియకారాన్తమఙ్గుల్యఙ్గుష్ఠపర్వసు ॥** 7

పిమ్మట 'ఓం నమో భగవతే వాసుదేవాయ" అను నీ ద్వాదశాక్షర మంత్రముతో కరన్యాసము చేయవలెను. పై మంత్రములోని యొక్కొక్క యక్షరమును ప్రణవముతో గలిపి కుడిచేతియందలి చూపుడుగ్రేలు నుండి యారంభించి యెడమచేతియందలి చూపుడువ్రేలువఱకు గల యీ యెనిమిది వ్రేళ్ళయందు క్రమముగ నెనిమిది వర్ణములను న్యాసముచేయవలెను. పిమ్మట మిగిలిన నాలుగు అక్షరములను రెండుచేతులయొక్క ప్రత్యేకాంగుష్ఠములయందు గల ఆద్యంతపర్వములయందు న్యాసము చేయవలెను.

**న్యసేద్ధృదయ ఓంకారం వికారమను మూర్ధని ।**
**షకారన్తు భ్రువోర్మధ్యే ణకార శిఖయా న్యసేత్ ॥** 8
**వేకారం నేత్రయోర్యుఞ్జ్యాన్నకారం సర్వసన్ధిషు ।**
**మకారమస్త్రముద్దిశ్య మన్త్రమూర్తిర్భవేద్బుధః ॥** 9
**సవిసర్గం ఫడన్తం తత్ సర్వదిక్షు వినిర్దిశేత్ ।**
**ఓం విష్ణవే నమ ఇతి ॥** 10

పిమ్మట 'ఓం విష్ణవే నమః' అను నీమంత్రము నీక్రింది విధముగ న్యాసము చేయవలెను. హృదయమున 'ఓం' అను వర్ణమును, మస్తకమున 'వి' యను వర్ణమును, రెండు కనుబొమలనడుమ 'ష' కారమును, శిఖయందు 'ణ' కారమును, రెండు నేత్రములయందు 'వ' యను వర్ణమును, సర్వసంధి స్థలములలోను 'న' కారమును న్యాసము చేసి పిమ్మట మంత్రజపకర్త యగు పండితుడు 'మ' కారమును అస్త్రరూపమున చింతనచేసి స్వయముగ మంత్రమూర్తి కావలెను. అనంతరము 'మ' కారముతో విసర్గమ అస్త్రమును చివర 'ఫట్' అనుదానిని జోడించి అనగా "మః అస్త్రాయ ఫట్" అనుమంత్రమున తూర్పుమున్నగు సర్వదిక్కులయందుంచి దిగ్బంధనము చేయవలెను.

ఆత్మానం పరమం ధ్యాయేద్ధ్యేయం షట్ఛక్తిభిర్యుతమ్ ।
విద్యాతేజస్తపోమూర్తి మిమం మన్త్రముదా హరేత్ ॥ 11

పైన చెప్పబడిన న్యాసము పూర్తియైన తరువాత తనను ఐశ్వర్యాది షట్ఛక్తియుక్తుడగు ధ్యేయపరమాత్మ రూపముతో ధ్యానింపవలెను. అనగా "నాదేవో దేవమర్చయేత్" అను నీ శాస్త్రవచనముననుసరించి తన్ను ధ్యేయవస్తువున కనురూపముగ తదభిన్నరూపముతో చింతన చేయవలెను. పిమ్మట జ్ఞానప్రభావమునకు, సత్కర్మకు నాశ్రయమగు "నారాయణ కవచ" మను మంత్రమును జపింపవలెను.

ఓం హరిర్విదధ్యాన్మమ సర్వరక్షాం
న్యస్తాఙ్ఘ్రిపద్మః పతగేన్ద్రపృష్ఠే ।
దరారిచర్మాసిగదేషుచాప -
పాశాన్ దధానోఽష్టగుణోఽష్టబాహుః ॥ 12

గరుడుని పృష్ఠదేశమున పాదపద్మములను నిలిపి అష్టబాహువుల యందు శంఖ చక్ర చర్మ ఖడ్గ గదా బాణధనుస్సులను పాశములను ధరించి విరాజిల్లుచున్నవాడును, అణిమాదులైన అష్టైశ్వరములతో గూడినవాడును, ఎనిమిదిబాహువులు గలవాడునునగు శ్రీహరి యెల్లప్పుడు నన్ను రక్షించుగాక!

జలేషు మాం రక్షతు మత్స్యమూర్తి -
ర్యాదోగణేభ్యో వరుణస్య పాశాత్ ।
స్థలేషు మాయావటువామనోఽవ్యాత్
త్రివిక్రమః ఖేఽవతు విశ్వరూపః ॥ 13

మత్స్యరూపధారి యగు భగవానుడు క్రూరములైన జలజంతువు లనెడి వరుణపాశమునుండి రక్షించుగాక! మాయాబలముచే వామన రూపధారి యగు భగవానుడు స్థలములయందు నన్ను రక్షించుగాక! విశ్వరూపుడగు త్రివిక్రముడు గగనమండలమున నన్ను రక్షించుగాక!

దుర్గేష్వటవ్యాజిముఖాదిషు ప్రభుః
పాయాన్నృసింహోఽసురయూథపారిః ।
విముంచతో యస్య మహాట్టహాసం
దిశో వినేదుర్న్యపతంశ్చ గర్భాః ॥ 14

ఎవని అట్టహాసధ్వనిచే దిఙ్మండలము ప్రతిధ్వనిత మగునో అసురస్త్రీలగర్భములు పతనము లగునో అట్టి యసురయూథపు డైన హిరణ్యకశిపునకు శత్రువగు శ్రీనృసింహదేవుడు అరణ్యమునందును యుద్ధక్షేత్రమునందును ఇంకను దుర్గమములగు నితర ప్రదేశములలోను నిలచి మమ్ము రక్షించుగాక!

రక్షత్వసౌ మాధ్వని యజ్ఞకల్పః
స్వదంష్ట్రయోన్నీతధరో వరాహః ।
రామోఽద్రికూటేష్వథ విప్రవాసే
సలక్ష్మణోఽవ్యాద్భరతాగ్రజోఽస్మాన్ ॥ 15

తనయవయవరూపము లగు యజ్ఞములద్వారా యజ్ఞేశ్వరరూపముతో నిరూపితు డైనవాడు,రసాతలమునుండి తీక్షణములైన దంతములయొక్క అగ్రభాగములద్వారా పృథివిని, పైకి దెచ్చినవాడు, వరాహరూపుడు నగు నాభగవానుడు నన్ను మార్గమధ్యమున రక్షించుగాక! పరశురామరూపుడగభగవానుడు గిరిశిఖరమునందు, లక్ష్మణునితో గూడిన భరతాగ్రజుడగు రామచంద్రుడు ప్రవాసమునందు నన్ను రక్షించుగాక !

మాముగ్రధర్మాఖిలాత్ప్రమాదాత్
నారాయణః పాతు నరశ్చ హాసాత్ ।
దత్తస్త్వయోగాదథ యోగనాథః ।
పాయాద్గుణేశః కపిలః కర్మబన్ధాత్ ॥ 16

నారాయణుడు నన్ను అభిచారాదులైన ఉగ్రధర్మములనుండి, విహితకర్మల నుల్లంఘించుట మున్నగు ప్రమాదములనుండి రక్షించుగాక! నరరూపు డగు భగవానుడు నన్ను గర్వమునుండి రక్షించుగాక! యోగేశ్వరుడు దత్తాత్రేయరూపుడు నగు భగవానుడు నన్ను యోగభ్రంశము అనగా యోగమునుండి పతనమగుట మున్నగు ప్రమాదములనుండి రక్షించుగాక! గుణేశ్వరుడైన కపిలునిరూపములో నున్న భగవానుడు నన్ను కర్మబంధనముల నుండి అనగా సంసారమునుండి రక్షించుగాక !

సనత్కుమారోఽవతు కామదేవా -
ద్ధయశీర్షా మాం పథి దేవహేలనాత్ ।
దేవర్షివర్యః పురుషార్చనాన్తరాత్
కూర్మో హరిర్మాం నిరయాదశేషాత్ ॥ 17

సనత్కుమారభగవానుడు నన్ను కామభయమునుండి, హయగ్రీవుడు మార్గములో నడచునప్పుడు దేవతాతిరస్కారాదులవలన గలిగిన యపరాధములనుండి, దేవర్షియగు

నారదుడు భగవదర్చన విషయమున ముప్పది రెండపరాధములనుండి, కూర్మరూపుడగు భగవానుడు అశేషనరకముల నుండి నన్ను రక్షించుగాక !

**ధన్వన్తరిర్భగవాన్ పాత్వపథ్యా -**
**ద్వన్ద్వాద్భయాదృషభో నిర్జితాత్మా ।**
**యజ్ఞశ్చ లోకాదవతాజ్జనాన్తా**
**ద్బలో గణాత్ క్రోధవశాదహీన్ద్రః ॥** 18

భగవానుడగు ధన్వంతరి యపథ్యమునుండి (శరీరమునకు వ్యాధులను గలుగజేయు ద్రవ్యాదులను భక్షించుటనుండి), అంతరింద్రియములను బహిరింద్రియములను జయించిన ఋషభదేవుడు శీతోష్ణాదులవలన గలుగు భయమునుండి, యజ్ఞావతారుడగు భగవానుడు లోకాపవాదమునుండి, బలభద్రుడు జనులు బెట్టుబాధలనుండి, శేషరూపుడగు భగవానుడు క్రోధవశములైన సర్పములనుండి నన్ను రక్షించుగాక !

**ద్వైపాయనో భగవానప్రబోధా -**
**ద్బుద్ధస్తు పాషణ్డగణప్రమాదాత్ ।**
**కల్కిః కలేః కాలమలాత్ ప్రపాతు**
**ధర్మావనాయోరుకృతావతారః ॥** 19

వ్యాసదేవుడజ్ఞానమునుండి, బుద్ధదేవుడు వేదవిరుద్ధములగు నాచారములనుండి, అలసత్వమువలన వేదవిహిత కర్మానుష్ఠానవిషయమున విముఖత్వ మనెడు ప్రమాదము నుండి రక్షించుగాక! ధర్మరక్షణకై శ్రేష్ఠమైన అవతారరూపముగ పరిగణింప బడిన వాడైన కల్కిభగవానుడు నికృష్టమగుకలికాలమునుండి నన్ను రక్షించుగాక !

**మాం కేశవో గదయా ప్రాతరవ్యాత్**
**గోవిన్ద ఆసఙ్గవమాత్తవేణుః ।**
**నారాయణః ప్రాహ్ణ ఉదాత్తశక్తి -**
**ర్మధ్యన్దినే విష్ణురరీన్ద్రపాణిః ॥** 20

కేశవుడు గదద్వారా ప్రాతఃకాలమునందు (దివాభాగమున మొదట ఐదుఘడియలు వరకు) నన్ను రక్షించుగాక! సంగవసమయమున (ఆఱుఘడియలనుండి పదిగడియల వరకు) వేణుధారియు బృందావనాధిపతియునగు గోవిందుడు నన్ను రక్షించుగాక! ప్రాహ్ణమున (పదునొకండు ఘడియల నుండి పదునైదు ఘడియలవరకు) నారాయణుడు శక్తిని

ధరించినన్ను రక్షించుగాక! మధ్యందినమున (పదునాలు ఘడియలనుండి ఇరువదిఘడియల వరకు) చక్రహస్తుడగువిష్ణువు నన్ను రక్షించుగాక !

దేవో ऽపరాహ్ణే మధుహోగ్రధన్వా
సాయం త్రిధామావతు మాధవో మామ్ ।
దోషే హృషీకేశ ఉతార్ధరాత్రే
నిశీథ ఏకోऽవతు పద్మనాభః ॥ 21

అపరాహ్ణమున (పగటియందలి యైదవభాగమున అనగా నిరువది యొక్క ఘడియలనుండి ఇరువదియైదు ఘడియలవరకు) ఉగ్రధనుస్సును ధరించినవా డగు మధుసూదనుడు, సాయంకాలమున (ఇరువదియాఱు ఘడియలనుండి ముప్పదిఘడియల వఱకు) త్రిధాముడు అనగా బ్రహ్మవిష్ణు మహేశ్వరురూపు డగు మాధవుడు, ప్రదోషకాలమున (రాత్రియొక్క మొదటి నాలుగుఘడియలవరకు) హృషీకేశుడు, అర్ధరాత్రమున (ఐదవ ఘడియనుండి పదు నాలుగు ఘడియలవరకు) నిశీథకాలమున (పదునైదవ ఘడియనుండి పదునాఱవ ఘడియవఱకు) పద్మనాభుడు నన్ను రక్షించుగాక !

శ్రీవత్సధామాపరరాత్ర ఈశః
ప్రత్యూష ఈశోऽసిధరో జనార్దనః ।
దామోదరోऽవ్యాదనుసన్ధ్యం ప్రభాతే
విశ్వేశ్వరో భగవాన్ కాలమూర్తిః ॥ 22

అపరరాత్రమందు (నిశీథకాలమునకు బిమ్మట అరుణోదయ కాలమునకు ముందు వరకు) శ్రీవత్సలాంఛను డగు భగవానుడు, ప్రత్యూషకాలమున (రాత్రియందు చివరి నాలుగు ఘడియల కాలమును) జనార్దనుడు ఖడ్గమును ధరించి నన్ను రక్షించుగాక ప్రభాత కాలమున దామోదరుడు, ప్రతిసంధి సమయమున కాలమూర్తి యగు విశ్వేశ్వరుడు నన్ను రక్షించుగాక !

చక్రం యుగాన్తానల తిగ్మనేమి
భ్రమత్ సమన్తాద్భగవత్ప్రయుక్తమ్ ।
దన్దగ్ధి దన్దగ్ధ్యరిసైన్యమాశు
కక్షం యథా వాతసఖో హుతాశః ॥ 23

ప్రళయకాలమందలి యగ్నివలె తీక్ష్ణములైన అంచులు గల సుదర్శన చక్రము భగవానునిచే నియమింపబడినదై నలువైపుల దిరుగుచు వాయువుతో గూడిన అగ్ని తృణరాశిని దగ్ధముచేయునట్లు శత్రుసమూహమును దగ్ధము చేయుగాక !

గదేఽశనిస్పర్శనవిస్ఫులిఙ్గే
నిష్పిణ్ఢి నిష్పిణ్ఢ్యజితప్రియాసి ।
కూష్మాణ్డవైనాయక యక్షరక్షో -
భూతగ్రహాం శ్చూర్ణయ చూర్ణయారీన్ ॥ 24

పిడుగులవంటి తీక్ష్ణస్పర్శగల విస్ఫులింగములను వెడలుగ్రక్కుచున్న ఓ గదా! నీవు భగవానున కతిప్రియ మైనదానవు (నేనుగూడ ఆయనకు దాసుడనె); అందువలన నీవు నాశత్రువులగు కూష్మాండ వినాయక యక్షరాక్షసభూతగ్రహములను పొడిపొడిగా జేయవలసినది.

త్వం యాతుధానప్రమథ ప్రేతమాతృ -
పిశాచవిప్రగ్రహఘోరదృష్టీన్ ।
దరేన్ద్ర విద్రావయ కృష్ణపూరితో
భీమస్వనోహారేర్హృదయాని కంపయన్ ॥ 25

ఓ శంఖరాజమా! పాంచజన్యమా! నీవు శ్రీకృష్ణనిముఖవాయువుచే పూరింపబడి భయంకరశబ్దముతో శత్రువుల హృదయములను కంపింప జేయుచు రాక్షసులను, ప్రమథులను, ప్రేతములను, మాతృకలను, పిశాచులను, భయంకరదర్శనులగు బ్రహ్మరాక్షసులను బారద్రోలుము.

త్వం తిగ్మధారాసివనారిసైన్య -
మీశప్రయుక్తో మమ ఛిన్ధి ఛిన్ధి ।
చక్షూంషి చర్మన్ శతచన్ద్రఛాదయ
ద్విషామఘోనాం హర పాపచక్షుషామ్ ॥ 26

తీక్ష్ణధార గల ఓ ఖడ్గరాజమా! నీవు భగవానునిచే బ్రయోగింపబడిన దానివై నాశత్రుసైన్యమును నాశముచేయుము. శతచంద్రా కారమండల విశిష్ట మైన ఓ డాలా! నీవు పాపాత్ములగు శత్రువుల చక్షువులను కప్పివేయుము. ఉగ్రదృష్టిగల శత్రువుల నేత్రములను బెఱికివేయుము.

యన్నో భయం గ్రహేభ్యోఽభూత్కేతుభ్యో నృభ్య ఏవ చ ।
సరీసృపేభ్యో దంష్ట్రిభ్యో భూతేభ్యోఽంహోభ్య ఏవ చ ॥ 27

సర్వాణ్యేతాని భగవన్నామరూపానుకీర్తనాత్ ।
ప్రయాన్తు సంక్షయం సద్యో యే నః శ్రేయః ప్రతీపకాః ॥ 28

ఆదిత్యాదులైన నవగ్రహములు, ఉల్కాపాతములు, దుష్టమనుష్యులు, సర్పములు, వృశ్చికాదులైన సరీసృపములు, సింహవ్యాఘ్రాదులైన క్రూరమృగములు, ప్రేతాదులు, జలము, అగ్ని, విద్యుత్తు మున్నగు నుపద్రవములు, పాపములు మున్నగువాని నన్నింటివలన గలుగు భయములు, మాశుభవిషయములకు విరోధములైన సర్వభావములు భగవన్నామ రూపాను కీర్తనముచే వెంటనే నశించుగాక !

**గరుడో భగవాన్ స్తోత్రస్తోభశ్ఛన్దోమయః ప్రభుః ।**
**రక్షత్వశేషకృచ్ఛ్రేభ్యో విష్వక్సేనః స్వనామభిః ॥** 29

బృహద్రథంతరాది సామతంత్రములచే స్తుతింపబడువాడు, వేదమూర్తియు, పరమ పూజ్యుడు, ప్రభువు నగు గరుడుడు, తననామములచే విష్వక్సేనుడు సమస్తదుఃఖములనుండి నన్ను రక్షింతురుగాక !

**సర్వాపద్భ్యో హరేర్నామరూపయానాయుధాని నః।**
**బుద్ధీంద్రియమనః ప్రాణాన్ పాన్తు పార్షదభూషణాః ॥** 30

శ్రీహరినామము, రూపము, వాహనము, అస్త్రములు, పార్షదముఖ్యులు మాబుద్ధులను, ఇంద్రియములను , మనస్సును, ప్రాణములను సమస్త విపత్తులనుండి రక్షింతురుగాక !

**యథా హి భగవానేవ వస్తుతః సదసచ్చ యత్ ।**
**సత్యేనానేన నః సర్వే యాన్తు నాశముపద్రవాః ॥** 31

స్థూలసూక్ష్మాత్మకమగు జగత్తు వాస్తవములో భగవానునికంటె భిన్నముకాదు. వస్తుతత్త్వమును విచారించినచో వాస్తవ వస్తువు భగవానుని కార్యస్వరూపము, జగత్కారణ రూపుడగు భగవానునికంటె భిన్నమైన వస్తువొక్కటియు లేదు, సత్యస్వరూపుడు వాస్తవవస్తువు నకు భగవానునిచే మాసర్వ విపత్తులు నశించుగాక !

**యథైకాత్మ్యానుభావానాం వికల్పరహితః స్వయమ్ ।**
**భూషణాయుధలిఙ్గాఖ్యా ధత్తే శక్తీః స్వమాయయా ॥** 32

**తేనైవ సత్యమానేన సర్వజ్ఞో భగవాన్ హరిః ।**
**పాతు సర్వైః స్వరూపైర్నః సదా సర్వత్ర సర్వగః ॥** 33

ఈశ్వరుడు, జీవుడు, మాయ-జగత్తు ఇవి యన్నియు వస్తువులే. వస్తుతత్త్వమును విచారించినచో వీనిలో వెట్టిభేదము లేదు. ఇట్టిభావనాపరు లగు వ్యక్తులకడ వాస్తవవస్తువగు భగవానుడు వస్తుతత్త్వవిచారమున నభిన్నుడై కూడ కృపాశక్తివలన కౌస్తుభాదిభూషణములను, సుదర్శనాద్యాయుధములను, చతుర్భుజద్విభుజాదిరూపములను ధరించుచున్నాడు. అట్లే

విద్యుత్ప్రతీతిలక్షణ మగు సత్యప్రమాణము ననుసరించి భూషణాదిలక్షణము లతో గూడి విచిత్రస్వరూపములలో మమ్ము రక్షించుగాక !

**విదిక్షు దిక్షూర్ధ్వమధః సమన్తా దన్తర్బహిర్భగవాన్ నారసింహః ।**
**ప్రహాపయల్లోకభయం స్వనేన స్వతేజసా గ్రస్తసమస్తతేజాః ॥ 34**

మహాభయంకరముగ గర్జించి లోకభయమును సంపూర్ణముగ దొలగించుచు తన తేజస్సుచే తేజస్సుల యొక్క అనగా దిగ్గజములు, విషము, శస్త్రములు, జలము, అగ్ని, వాయువు మున్నగు తేజస్సుల నాచ్ఛాదనము చేసిన ఆనృసింహదేవుడు లేదా ఆయన భక్తు డగు ప్రహ్లాదుడు దిక్కులు, విదిశలు, పైన, క్రింద, లోపల, బయట అంతట మమ్ము రక్షింతురుగాక !

**మఘవన్నిదమాఖ్యాతం వర్మ నారాయణాత్మకమ్।**
**విజేష్యసేఽఞ్జసా యేన దంశితోఽసురయూథపాన్ ॥ 35**

ఇంద్రుడా! ఈనారాయణకవచమును నీకుపదేశించితిని. నీవు దీనిని ధరించినవాడవై తప్పక అసురసేనను జయింపగలవు.

**ఏతద్ధారయమాణస్తు యం యం పశ్యతి చక్షుషా ।**
**పదా వా సంస్పృశేత్సద్యః సాధ్వసాత్స విముచ్యతే ॥ 36**

ఈ కవచమును ధరించిన వ్యక్తి యెవనిని జూచునో, లేదా పాదమును స్పృశించునో అతడువెంటనే భయమునుండి విముక్తుడగును.

**న కుతశ్చిద్భయం తస్య విద్యాం ధారయతో భవేత్ ।**
**రాజదస్యుగ్రహాదిభ్యో వ్యాధ్యాదిభ్యశ్చ కర్హిచిత్ ॥ 37**

ఈ నారాయణకవచమను విద్యను ధరించువ్యక్తికి ఏకాలమునందును రాజులు, దొంగలు, గ్రహాదులు, వ్యాధులు మున్నగు వానివలన భయముండదు.

**ఇమాం విద్యాం పురా కశ్చిత్ కౌశికో ధారయన్ ద్విజః ।**
**యోగధారణయా స్వాఙ్గం జహౌ మరుధన్వని ॥ 38**

దేవేంద్రా! ప్రాచీనకాలమున కౌశికు డను నొక బ్రాహ్మణు డుండెను. అతడీ నారాయ ణాత్మక మగు విద్యను ధరించి మరుప్రదేశమున యోగబలముచే దేహత్యాగము చేసెను.

**తస్యోపరి విమానేన గన్ధర్వపతిరేకదా ।**
**యయౌ చిత్రరథః స్త్రీభిర్వృతో యత్ర ద్విజక్షయః ॥ 39**

ఒకనాడు పెక్కండ్రు స్త్రీలతో గూడినవాడై గంధర్వపతి యగు చిత్రరథుడు విమానము నధిరోహించి బ్రాహ్మణుడు దేహత్యాగముచేసిన ప్రదేశమునకు పైగా పయనముచేసెను.

గగనాన్న్యపతత్సద్యః సవిమానో హ్యవాక్ఛిరాః ।
స వాలఖిల్యవచనాదస్థీన్యాదాయ విస్మితః ।
ప్రాస్య ప్రాచీసరస్వత్యాం స్నాత్వా ధామ స్వమన్వగాత్ ॥ 40

ఆస్థానము నుల్లంఘించుటవలన చిత్రరథుడు వెంటనే తలక్రిందులుగా విమానముతో గూడ గగనమునుండి పడిపోయెను. పిమ్మట వాలఖిల్యముని వాక్కుల ననుసరించి చిత్రరథుడు కౌశికునియస్థులను పూర్వవాహిని యగు సరస్వతీనదియందు గలిపెను. దానిలో స్నానముచేసి మిగుల విస్మితుడై తనయావాస మగు గంధర్వలోకమునకు వెడలెను. (వాలఖిల్యముని చిత్రరథునితో 'నీవీ యస్థులను నదిలో గలుపనిచో నిచటినుండి ప్రయాణము సాగింపలేవ' వని చెప్పెను. గంధర్వరాజు మునియుపదేశానుసారము అస్థులను సర్వస్వతీనది యందు గలపుటచేతనే వెడలగలిగెను.)

## శ్రీశుక ఉవాచ

య ఇదం శృణుయాత్కాలే యో ధారయతి చాదృతః ।
తం నమస్యన్తి భూతాని ముచ్యతే సర్వతో భయాత్ ॥ 41

ఏతాం విద్యా మధిగతో విశ్వరూపాచ్ఛతక్రతుః ।
త్రైలోక్యలక్ష్మీం బుభుజే వినిర్జిత్య మృధేఽసురాన్ ॥ 42

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే నారాయణవర్మోపదేశో
నామాష్టమోఽధ్యాయః ॥

శుకుడు పలికెను :- పరీక్షిన్మహారాజా! భయము కలిగినప్పుడీనారాయణకవచమును శ్రవణముచేసినవాడు లేదా శ్రద్ధతో దీనిని ధరించినవాడుసర్వలోకపూజ్యుడు, సర్వభయ విముక్తుడు నగును.

ఇంద్రుడు విశ్వరూపునినుండి ఈ విద్యను పొంది అసురుల నోడించి, ముల్లోకముల యందలి సంపదలననుభవించెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
నారాయణకవచోపదేశ మను ఎనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

# తొమ్మిదవ అధ్యాయము

## విశ్వరూపవధ : వృత్రాసురుడు దేవతలను జయించుట : భగవత్ప్రేరణచే దేవతలు దధీచిబుుషికడకు వెడలుట

కథాసారము:- ఈ యధ్యాయమున నింద్రుడు విశ్వరూపుని వధించుట, దానివలన విశ్వరూపునితండ్రి యగు త్వష్టచేయు యజ్ఞమున వృత్రాసురు డావిర్భవించుట, వానికి భయపడి దేవతలు భగవానుని స్తుతించుట యనువిషయములు వర్ణింపబడినవి.

విశ్వరూపుడు రహస్యముగ అసురులకు యజ్ఞభాగముల నిచ్చుచున్నాడనియెఱింగి దేవేంద్రుడు వాని శిరమును ఖండించెను. విశ్వరూపవధవలన గలిగిన బ్రహ్మహత్యా పాపమును బోగొట్టుకొన జాలినవాడయ్యును, ఇంద్రుడు దోసిలొగ్గి బాధతో నాపాపమును స్వీకరించి సంవత్సరము తరువాత దానిని భూమికి, జలమునకు, వృక్షములకు, స్త్రీలకు పంచెను. భూమి స్వీకరించిన బ్రహ్మహత్యా పాపములోని నాలుగవ భాగము నేటికిని ఊషరభూమి (ఎడారి) రూపమున నగపడుచున్నది. వృక్షములు స్వీకరించిన బ్రహ్మహత్యా పాపములోని నాలుగవ భాగమె నేటికిని వృక్షనిర్యాస (బంక) రూపమున గనబడుటచే వృక్షనిర్యాసమును పానముచేయుట నిషిద్ధము. స్త్రీలలో నీపాపము రజోరూపమున నగపడును. అందువలన రజస్వల యగు స్త్రీ అస్పృశ్య (అంటుకొనరానిది) అయ్యెను. జలమున నీ పాపము బుద్బుదరూపముతో నగుపడును. అందువలన నురుగుతో గూడిన జలము వ్యవహారమునకు యోగ్యముకాదు.

విశ్వరూపుడు నిహతుడు కాగా వానితండ్రి యగు త్వష్ట యింద్రవధవాంఛతో యజ్ఞము నొనరించెను. కాని కర్మకాండకు సంబంధించిన యజ్ఞమున మంత్రముల స్వర క్రమాదులు వ్యతిక్రమమైనచో తద్విపరీత మగు ఫలము కలుగును. త్వష్టయొక్క యజ్ఞము నందును అదియే జరిగినది. అనగా త్వష్ట ఇంద్రశత్రువర్ధనవాంఛతో యజ్ఞమున నాహుతుల నిచ్చెను. దానివలన ఇంద్రశత్రువు వృద్ధిపొందక ఇంద్రుడెవనికి శత్రువో ఆవృత్రాసురుడు జన్మించెను. ఆవృత్రాసురుని భయంకర రూపమును జూచి ముల్లోకములు కంపించినవి. వాని ప్రభావముచే దేవతలు తేజోవిహీనులై యుండిరి.

అపుడు వారు ఉపాయాన్తరమును కనుగొనజాలనివారై విశ్వస్రష్టయు, విశ్వపతియు, విశ్వమునకు నిమిత్తోపాదానకారణుడయ్యు నిర్వికారు డైనవాడు, సర్వయజ్ఞభోక్తయు, భయత్రాతయు నగు భగవానుని శరణు బొందినవారై ఆయనను స్తుతింపసాగిరి. ఏలయన

భయమునుబోగొట్టుటకై భగవద్భిన్ను లగు అన్యదేవతలను శరణుబొందుట కుక్కతోక బట్టుకొని సముద్రమును దాటు ప్రయత్నమువలె బుద్ధిహీనతను తెలియజేయును. భగవానుడు దేవతలస్తుతికి సంతుష్టుడై దధీచిమునికడకు వెడలి ఆయనను తనదేహము నీయ ప్రార్థింపవలసినదిగ వారి నాదేశించెను. ఆదధీచిమునియొక్క అస్థులచే నిర్మిత మగు వజ్రాయుధముతో వృత్రాసురుడు నిహతుడయ్యెను.

## శ్రీశుక ఉవాచ

**తస్యాసన్ విశ్వరూపస్య శిరాంసి త్రీణి భారత ।**
**సోమపీథం సురాపీథమన్నాదమితి శుశ్రుమ ॥ 1**

శుకుడు పలికెను:- పరీక్షిన్మహారాజా! దేవపురోహితుడగు నావిశ్వరూపునకు మూడుశిరస్సులు గలవు. ఒకదానిపేరు "సోమపీథము". దాని ద్వారా అతడు సోమరసమును పానము చేయును. రెండవది 'సురాపీథము'. దానిద్వారా సురాపానము చేయును. మూడవది 'అన్నాదము'. దానిద్వారా అన్నమును భుజించును. ఈ విధముగ శాస్త్రములు చెప్పుచున్నవి.

**స వై బర్హిషి దేవేభ్యో భాగం ప్రత్యక్షముచ్చకైః ।**
**అదదద్యస్య పితరో దేవాః సప్రశ్రయం నృప ॥ 2**

రాజా! దేవతలు విశ్వరూపునకు పితృపురుషులగుటచే విశ్వరూపుడు ప్రత్యక్షముగ వినయముతో 'ఇంద్రాయ ఇదమ్, అగ్నయే ఇదమ్' మున్నగు మంత్రములను పెద్దగనుచ్చరించుచు అగ్నియందు దేవతల నుద్దేశించి హవిర్భాగములను వ్రేల్చుచుండును.

**స ఏవ హి దదౌ భాగం పరోక్షమసురాన్ ప్రతి ।**
**యజమానోఽవహద్భాగం మాతృస్నేహవశానుగః ॥ 3**

విశ్వరూపు డొకవైపు దేవతల యజ్ఞముల నొనరించుచు వేరొకవైపు మాతృప్రేమవలన అనగా మాతృసంబంధులు మాతామహపక్షమువారు నగు అసురులకు ప్రీతిని గలుగజేయుటకై దేవతల కనుగప్పి రహస్యముగ వారికిగూడ యజ్ఞభాగముల నిచ్చుచుండెను.

**తద్దేవహేలనం తస్య ధర్మాలీకం సురేశ్వరః ।**
**ఆలక్ష్య తరసా భీతస్తచ్ఛీర్షాణ్యచ్ఛినద్రుషా ॥ 4**

ఒకనాడు విశ్వరూపుడు దేవతలను వంచించి అసురులకు యజ్ఞభాగముల నిచ్చుట యను కపటధర్మమును జూచి ఇంద్రుడు భవిష్యత్తులో అసురులయభివృద్ధినిగూర్చి యాలోచించి భయపడినవాడై విశ్వరూపుని యాయపరాధముచే గుపితుడై వెంటనే యతడు వానిమస్తకములను ఖండించెను.

**సోమపీథస్తు యత్తస్య శిర ఆసీత్కపింజలః ।**
**కలవిఙ్కః సురాపీథమన్నాదం యత్స తిత్తిరిః ॥** 5

పిమ్మట వానిసోమపీథ మను మస్తకము కపింజలపక్షి (చాతకము) సురాపీథ మను మస్తకము కలవింక (చటక) పక్షి, అన్నాద మను మస్తకము తత్తిరిపక్షి యయ్యెను.

**బ్రహ్మహత్యామఞ్జలినా జగ్రాహ యదపీశ్వరః ।**
**సంవత్సరాన్తే తదఘం భూతానాం స విశుద్ధయే ।**
**భూమ్యమ్బుద్రుమయోషిద్భ్యశ్చతుర్ధా వ్యభజద్ధరిః ॥** 6

దేవరా జగునింద్రుడు విశ్వరూపుని వధించినందువలన గలిగిన బ్రహ్మహత్యాపాపమును క్షాళితముచేసికొనజాలినవా డయ్యును అతడు కృతాంజలియై అనుతాపముతో నీపాపమును స్వీకరించెను. ఇట్టి భావముతో సంవత్సరకాలము గడువగా తనదేహారంభకము లైన మహాభూతముల శుద్ధికై లేదా లోకాపవాద పరిహారార్థమై బ్రహ్మహత్యా పాపమును భూమికి, జలములకు, వృక్షములకు, స్త్రీలకు పంచెను.

**భూమిస్తురీయం జగ్రాహ ఖాతపూరవరేణ వై ।**
**ఈరిణం బ్రహ్మహత్యాయా రూపం భూమౌ ప్రదృశ్యతే ॥** 7

భూమి యందున్న గుంటలు స్వయముగనే పూడిపోవుగాక యను వరమును ఇంద్రునిమండి పొంది భూమి ఇంద్రకృత మగు బ్రహ్మహత్యాపాపములోని నాలుగవ భాగమును దీసికొనెను. నేటికిని యీపాపము ఊషరభూమిరూపముతో నగపడును. (ఇట్లు పాపయుక్త మగుటచే ఊషర భూమియందు అధ్యయనాదిశుభకర్మల శాస్త్రనిషిద్ధములుగా జెప్పనబడినవి.)

**తుర్యం ఛేదవిరోహేణ వరేణ జగృహుర్ద్రుమాః ।**
**తేషాం నిర్యాసరూపేణ బ్రహ్మహత్యా ప్రదృశ్యతే ॥** 8

వృక్షములు ఛిన్నములైనచో మరల ఉత్పన్నము లగుగాక యను వరమును ఇంద్రుని నుండి పొంది యింద్రకృత మగు బ్రహ్మహత్యా పాపములోని చతుర్థాంశమును వృక్షములు గ్రహించెను. నేటికిని వృక్షముల నిర్యాసరూపమున (జిగురురూపమున) ఈ పాపము కనబడును. (కనుక ఇది అభక్ష్యము)

**శశ్వత్కామవరేణాంహస్తురీయం జగృహుః స్త్రియః ।**
**రజోరూపేణ తాస్వంహో మాసి మాసి ప్రదృశ్యతే ॥** 9

సర్వకాలములయందును అనగా గర్భిణిగ నున్నప్పుడుగూడ గర్భపాతము కాకుండగ సంభోగము కలుగుచుండుగాక యనువరమును బొంది స్త్రీలు ఇంద్రకృత మగు బ్రహ్మహత్యా పాపములోని నాలుగవ వంతును స్వీకరించిరి. నేటికిని ప్రతిమాసమునందును ఋతు కాలమున రజోరూపమున ఆ పాపము కనబడుచుండును. (అందువలన రజస్వల యగు స్త్రీ స్పృశింపరానిదయ్యెను.)

**ద్రవ్యభూయోవరేణాపస్తురీయం జగృహుర్మలమ్ ।**
**తాసు బుద్బుదఫేనాభ్యాం దృష్టం తద్ధరతి క్షిపన్ ॥** 10

జలమేవస్తువులయందు (దుగ్ధాదులయందు) గలియునో వాని కాధిక్యము గలుగునుగాక లేదా సెలయేళ్ళద్వారా వృద్ధిపొందుగాక యనువరమును బొంది జలములు ఇంద్రకృత పాపములోని నాలుగవ వంతును స్వీకరించినవి. నేటికిని జలములలో నీపాపము బుద్బుదరూపముతోను, ఫేన (నురుగు) రూపముతోను గనబడును. బుద్బుదయుక్తము ఫేనయుక్తము నగు జలమును తొలగించిన పాపము తొలగును. (అందువలన బుద్బుద ఫేనశూన్య మగు జలమునె యుపయోగించవలెను.)

**హతపుత్రస్తతస్త్వష్టా జుహావేన్ద్రాయ శత్రవే ।**
**ఇన్ద్రశత్రో వివర్ధస్వ మా చిరం జహి విద్విషమ్ ॥** 11

విశ్వరూపుడు నిహతుడు కాగా విశ్వరూపునితండ్రి యగు త్వష్టఇంద్రుని నాశముచేయుటకై ఇంద్రశత్రువు జన్మించు కోరికతో యజ్ఞము నారంభించెను. ఈ యజ్ఞమున "ఇంద్రశత్రో! వివర్ధస్వ" అనగా "ఓ ఇంద్రశత్రువా! నీవు వృద్ధిపొందుము. త్వరగా నీశత్రువగు ఇంద్రుని నాశము చేయుము" అని పలుకుచు నాహుతినిచ్చెను.

వివరణము :- ఇచట "ఇంద్రశత్రో అనుపదమున "ఇంద్రస్య శత్రు: ఇంద్రశత్రు:" అనగా ఇంద్రునియొక్క శత్రువు అనుషష్ఠీతత్పురుష సమాస మనునభిప్రాయముతో త్వష్ట సంబోధించెను. కాని స్వరోచ్చారణ దోషముచే ఇంద్రుడే యెవనికి శత్రువో వానిని సంబోధించి నట్లయ్యెను. ఆకారణముచేతనే ఆ యజ్ఞమున ఇంద్రునకు శత్రువు జన్మింపక ఇంద్రుడే యెవనికి శత్రువో ఆ వృత్రాసురుడు జన్మించెను. తత్పురుషసమాసముచేఇంద్ర శత్రు పదము నిష్పన్నము కాగా పూర్వపద మగు నింద్రశబ్దము అనుదాత్తమగును బహువ్రీహి సమాసముచే నిష్పన్నము కాగా పూర్వపద మగు ఇంద్రశబ్దము ఉదాత్తమగును. కాని త్వష్ట దైవవశమున ఇంద్రశబ్దము నుదాత్తస్వరముతో పఠించెను. అందువలననేవిపరీత కార్యమయ్యెను. శిక్షాశాస్త్రమునందును నిట్టి ప్రమాణమే లభించును.

**అథాన్వాహార్యపచనాదుత్థితో ఘోరదర్శనః ।**
**కృతాన్త ఇవ లోకానాం యుగాన్తసమయే యథా ।** 12

పిమ్మట యజ్ఞసంబంధ మగు దక్షిణాగ్నినుండి ప్రళయకాలరుద్రుని వలె ఘోరదర్శను డగు నొక యసురుడు జన్మించెను.

విష్వగ్నివర్ధమానం తమిషుమాత్రం దినే దినే ।
దగ్ధశైలప్రతీకాశం సన్ధ్యాభ్రానీకవర్చసమ్ ॥ 13

తప్తతామ్రశిఖాశ్మశ్రుం మధ్యాహ్నార్కోగ్రలోచనమ్ ।
దేదీప్యమానే త్రిశిఖే శూల ఆరోప్య రోదసీ ॥ 14

నృత్యన్తమున్నదంతంచ చాలయన్తం పదా మహీమ్ ।
దరీగమ్భీరవక్త్రేణ పిబతా చ నభస్తలమ్ ॥ 15

లిహతా జిహ్వయర్క్షాణి గ్రసతా భువనత్రయమ్ ।
మహతా రౌద్రదంష్ట్రేణ జృమ్భమాణం ముహుర్ముహుః ।
విత్రస్తా దుద్రువుర్లోకా వీక్ష్య సర్వే దిశో దశ ॥ 16

నలువైపుల విక్షిప్తమైన బాణమువలె ద్రుతగతితో నీయసురుని శరీరము దినదినము వృద్ధికాజొచ్చెను. వాని శరీరము దగ్ధమైన పర్వతము వలె నతి ప్రకాండముగను కృష్ణ వర్ణముగను నుండెను. సంధ్యాకాల మేఘములవలె వానియవయవములు ప్రకాశింపసాగెను. వానిజుట్టు మీసములు మిగుల తప్తమైన తామ్రమువలె నుండెను. పింగళవర్ణ లోచనములు మధ్యాహ్నకాల సూర్యునివలె దుర్నిరీక్ష్యముగ నుండెను. అతడు స్వర్గలోక భూలోకములను దేదీప్యమానమగు త్రిశూలముతో నెత్తి పెద్దగ నఱచుచు నృత్యము చేయసాగెను. వానికాలి త్రొక్కిడులకు భూమి కంపింపసాగెను.

అపుడు పర్వతగుహవలె గంభీరమైన వానినోరు ఆకాశమును పానముచేయుచుండెను. జిహ్వచే నతడు నక్షత్రమండలమును నాకసాగెను. విశాలములు భయంకరములు తీక్ష్ణములునగు దంతములద్వారా త్రిభువనములను గ్రసింపసాగెను. మాటిమాటికి ఆవలింపసాగెను. భయంకరుడగు నయ్యసురుని జూచి సర్వజనులు భయపడి దశదిశల పరుగిడసాగిరి.

యేనావృతా ఇమే లోకాస్తపసా త్వాష్ట్రమూర్తినా ।
స వై వృత్ర ఇతి ప్రోక్తః పాపః పరమదారుణః ॥ 17

త్వష్టకు పుత్రతుల్యుడైన ఆవృత్రాసురుడు తపోబలముచే సర్వలోకముల నావరించెను. అందువలన పరమదారుణుడగు అ పాపాత్మునకు వృత్రుడను అర్థవంత మగు నామము లభించెను.

తం నిజఘ్నురభిద్రుత్య సగణా విబుధర్షభాః ।
స్వైః స్వైర్దివ్యాస్త్రశస్త్రౌఘైః సోఽగ్రసత్ తాని కృత్స్నశః ॥ 18

పిమ్మట ఇంద్రాదిదేవతలు సైన్యయుక్తులై వానికడకు వెడలి దివ్యములైన తమతమ యస్త్రశస్త్రములతో వానిని గొట్ట నారంభించిరి. కాని యావృత్రాసురు డాశస్త్రాస్త్రములను గ్రసించెను.

తతస్తే విస్మితాస్సర్వే విషణ్ణా గ్రస్తతేజసః ।
ప్రత్యఞ్చమాదిపురుషముపతస్థుః సమాహితాః ॥ 19

అసురుని యిట్టి ప్రభావమును జూచి దేవతలు నిస్తేజులు, ఆశ్చర్యాన్వితులు నైరి. అనంతరము వారందఱు గలసి యేకాగ్రచిత్తముతో సర్వాంతర్యామియు ఆదిపురుషుడు నగు నారాయణుని యుపాసింపసాగిరి.

### శ్రీదేవా ఊచుః

వాయ్వమ్బరాగ్న్యప్క్షితయస్త్రిలోకా
బ్రహ్మాదయో యే వయముద్విజన్తః ।
హరామ యస్మై బలిమన్తకోఽసౌ
బిభేతి యస్మాదరణం తతోఽస్తు నః ॥ 20

దేవతలు పలికిరి:- వాయువు, ఆకాశము, అగ్ని, జలము,భూమి - అనునీపంచమహాభూతములవలన ముల్లోకములు సృష్టింపబడినవి. ఈ ముల్లోకముల కధిపతు లగు బ్రహ్మాదిదేవతలు, వారికంటె నర్వాచీనులమైన మేము సర్వులము కాలములనకు భయపడి ఆ పరమేశ్వరుని పూజించితిమి. ఆయన మమ్ము రక్షించుగాక!

అవిస్మితం తం పరిపూర్ణకామం
స్వేనైవ లాభేన సమం ప్రశాన్తమ్ ।
వినోపసర్పత్యపరం హి బాలిశః
శ్వలాఙ్గులేనాతి తితర్తి సిన్ధుమ్ ॥ 21

నిరహంకారుడు లేదా విస్మితరహితుడు, స్వస్వరూపభూతమగుపరమానందము చేతనే పూర్ణకాముడు, ఉపాధి లేదా పరిచ్ఛేదశూన్యుడు, ప్రశాంతుడు అనగా రాగాదిశూన్యుడు, నగు ఆయనను విడచి యన్యులను శరణుడందు మహామూర్ఖుడు కుక్కతోక పట్టుకొని సముద్రమును దాటగోరు వ్యక్తివంటివాడగును.

(కుక్కయే సముద్రమును దాటజాలనప్పుడు దానితోకను బట్టుకొనిన వ్యక్తి యెట్లు దాటగలడు? ఆ వ్యక్తి సంసార సముద్రమున మునిగిపోవు నప్పుడు పరమేశ్వరుని విడచి యన్యోపాయముల నవలంబించిన దుఃఖసాగరమున మగ్నుడగును.)

**యస్యోరుశృఙ్గే జగతీం స్వనావం**
**మనుర్యథాబధ్య తతార దుర్గమ్ ।**
**స ఏవ నస్త్వాష్ట్రభయాద్దురన్తాత్**
**త్రాతాశ్రితాన్ వారిచరోఽపి నూనమ్ ॥ 22**

సత్యవ్రతు డగు మనువు మత్స్యమూర్తి యగు భగవానుని మహచ్ఛృంగమునందు పృథివీరూప మగు తననౌకను గట్టివేసి ప్రళయ కాలమున మహత్కష్టమునుండి రక్షింప బడెను. మత్స్యమూర్తియగు నట్టి భగవానుడు శరణాగతుల మగు మమ్ము దురంత మగు వృత్రాసుర భయమునుండి రక్షించుగాక !

**పురా స్వయంభూరపి సంయమామ్భ -**
**స్యుదీర్ణవాతోర్మిరవైః కరాలే ।**
**ఏకోఽరవిన్దాత్పతితస్తతార**
**తస్మాద్భయాద్యేన స నోఽస్తు పారః । 23**

సృష్ట్యాదియందు భయంకరమగు ప్రళయ సలిలమున ప్రచండ వాయువేగముచే లేచిన తరంగమాలయొక్క వికట శబ్దముచే నారాయణుని నాభికమలమునుండి ప్రళయ జలమున పడబోవువాడై అసహాయావస్థలో బ్రహ్మగూడ నెవని సాహాయ్యముచే పతన భయమునుండి రక్షింపబడెనో అట్టి భగవానుడు మమ్ము రక్షించుగాక!

**య ఏక ఈశో నిజమాయయా నః**
**ససర్జ యేనానుసృజామ విశ్వమ్ ।**
**వయం న యస్యాపి పురః సమీహతః**
**పశ్యామ లింగం పృథగీశమానినః ॥ 24**

ఏ యీశ్వరుడు ఏకైక మగు తనమాయచే మమ్ము సృష్టించెనో, ఎవనియనుగ్రహముచే మేమీ విశ్వమును సృజించితిమో, మాకుముందే అంతర్యామిరూపముతో విరాజమానుడై యున్న సృష్టికర్త యగు నాభగవానునిరూపమును గూడ మేము చూడలేదు. ఏలయన మేమందఱము వేఱువేఱుగ నీశ్వరుల మని యభిమాన పడుచుండుటయే దానికి కారణము.

యో నః సపత్నైర్భృశమర్ద్యమానాన్
దేవర్షితిర్యఙ్నృషు నిత్య ఏవ ।
కృతావతారస్తనుభిః స్వమాయయా
కృత్వాత్మసాత్పాతి యుగే యుగే చ ॥ 25

తమేవ దేవం వయమాత్మదైవతం
పరం ప్రధానం పురుషం విశ్వమన్యమ్ ।
ప్రజామ సర్వే శరణం శరణ్యం
స్వానాం స నో ధాస్యతి శం మహాత్మా ॥ 26

సచ్చిదానందు డగు నాభగవానుడు అచింత్య మగు తనశక్తిచే వామన పరశురామ నృసింహ మత్స్యకూర్మ వరాహాది నానాతనువులను ధరించి దేవతలు, ఋషులు, తిర్యక్కులు, మనుష్యులు మున్నగువారిలో నవతరించి శత్రువులచే ననేక విధముల బీడితుల మైన మమ్ము తనవారినిగా జేసికొని యుగయుగములలోను రక్షించుచున్నాడు. జీవుల కుపాస్యుడు, పరమకారణుడు, ప్రకృతిపురుషోభయాత్మకుడు, విశ్వస్వరూపుడు నై విశ్వముకంటె భిన్నము అనగా ప్రచంచమువలె వికారయుక్తుడు కానివాడు, సర్వులకు శరణ్యుడునగు నా భగవానుని శరణుబొందుచున్నాము. మహానుభావుడగు నా భగవానుడు మాకు శుభమును గలుగ జేయుగాక !

## శ్రీశుక ఉవాచ

ఇతి తేషాం మహారాజ సురాణాముపతిష్ఠతామ్ ।
ప్రతీచ్యాం దిశ్యభూదావిః శంఖచక్రగదాధరః ॥ 27

శుకుడు పలికెను :- మహారాజా! దేవత లిట్లు స్తుతింపగా శంఖ చక్రగదాధారి యగు హరి మొదట వారి హృదయములలోను పిమ్మట వారి యెదుట పశ్చిమదిక్కున ఆవిర్భవించెను.

ఆత్మతుల్యైః షోడశభిర్వినా శ్రీవత్సకౌస్తుభౌ ।
పర్యుపాసితమున్నిద్రశరదంబురుహేక్షణమ్ ॥ 28

దృష్ట్వా తమవనౌ సర్వే ఈక్షణాహ్లాదవిక్లవాః ।
దణ్డవత్పతితా రాజన్ శనైరుత్థాయ తుష్టువుః ॥ 29

రాజా! శ్రీవత్సకౌస్తుభభిన్నములైన ఇతరచిహ్నములచే విభూషితులు, భగవత్సారూప్యమును బొందినవారు, భగవానున కాత్మతుల్యులు నగు సునందాదులైన పదునాలుగురు పార్షదులచే నలువైపుల సేవింపబడు చున్నవాడు, వికసించిన శరత్కాల కమలములవంటి లోచనములు గలవాడు నగు భగవానుని దర్శించి దేవతలు ఆనందముచే విహ్వలులై సాష్టాంగదండ ప్రణామ మాచరించిరి. ప్రాణాయామ పురస్సరముగ మెల్లమెల్లగ లేచి మరల స్తుతింపసాగిరి.

## శ్రీదేవా ఊచుః

**నమస్తే యజ్ఞవీర్యాయ వయసే ఉత తే నమః ।**
**నమస్తే హ్యస్తచక్రాయ నమః సుపురుహూతయే ॥ 30**

దేవతలుపలికిరి :- యజ్ఞవీర్యుడవు అనగా యజ్ఞాదులవలన గలిగిన స్వర్గాదిఫలముల నిచ్చుటలో సమర్థుడవు. యజ్ఞజనితములైన స్వర్గాది ఫలములను నాశముచేయు కాలస్వరూపుడవు. యజ్ఞవినాశకులగు దైత్యులను సంహరించుటకై చక్రాయుధమును బ్రయోగించువాడవు, లలితములైన బహునామములను ధరించువాడవు నగు నోదేవా! మేము నీకు నమస్కరించుచున్నాము.

**యత్తే గతీనాం తిసృణామీశితుః పరమం పదమ్ ।**
**నార్వాచీనో విసర్గస్య ధాతర్వేదితుమర్హతి ॥ 31**

విధాతా! నీవు స్వర్గమోక్షములకు, నరకమునకు నియంత వైయున్నావు. నీ పరమ ధామము వైకుంఠము, నీ విసర్గమునకు అనగా నానావిధసృష్టులకు అనంతరకాలమున సృష్టింపబడిన ఆధునికు లగు మావంటి వ్యక్తులు నీపరమపదమును దెలిసికొనజాలరు. అందువలన నీకు నమస్కరించుచున్నాము.

**ఓం నమస్తేఽస్తు భగవన్నారాయణ వాసుదేవాదిపురుష మహాపురుష మహానుభవ పరమమఙ్గళ పరమకల్యాణ పరమకారుణిక కేవల జగదాధార లోకైకనాథ సర్వేశ్వర లక్ష్మీనాథ పరమహంసపరివ్రాజకైః పరమేణాత్మయోగ సమాధినా పరిభావితపరిస్ఫుట పారమహంస్య ధర్మేణోద్ఘాటిత తమః కవాట ద్వారే చిత్తే పావృత ఆత్మలోకే స్వయముపలబ్ధనిజసుఖానుభవో భవాన్ ॥ 32**

భగవానుడా! నారాయణా! వాసుదేవా! ఆదిపురుషా! మహాపురుషా! మహానుభావా! పరమమంగళా! (స్వయముగ మంగళరూపుడు) పరమకల్యాణా! పరమ కారుణికా! (స్వార్థములేకుండగ పరులకష్టములను జూచి సహింపనివాడా!) నిర్వికారా! జగదాధారా! లోకైకనాథా! సర్వేశ్వరా! లక్ష్మీనాథా! పరమహంసపరివ్రాజకులు అష్టాంగయోగ సాధనముద్వారా సమాధి యోగమున చిత్తైకాగ్రతను బొంది నిన్ను చింతనచేయుచుండగ వారి శుద్ధాంతః

కరణమున భగవద్భజనరూపమైన పారమహంస్య ధర్మము ఉదయించును. అపుడు చిత్తముయొక్క తమోరూప మగు కవాటము విడివడి ఆత్మలోకము అనగా ప్రత్యక్స్వరూపము ప్రకాశితమగును. అపుడు ఏ నిజసుఖ స్వరూపము లభించునో లేదా అనుభూతి కలుగునో ఆసుఖ స్వరూపుడవు నీవే. నిన్నెవ్వరును తెలిసికొనజాలరు. అందువలన నీకు నమస్కారము.

**దురవబోధ ఇవ తవాయం విహారయోగో యదశరణోఽశరీర ఇదమన వేక్షితా స్మత్సమవాయ ఆత్మనైవావిక్రియ మాణేన సగుణ మగుణః సృజసి పసి హరసి ॥ 33**

నీ వాశ్రయహీనుడవు. ప్రాకృతశరీరరహితుడవు అయ్యును మమ్మెట్టి సహాయమును గోరుటలేదు. నీవీ ప్రపంచమునకు ఉపాదానకారణుడవయ్యును నిర్వికార మగు నాత్మస్వరూపముతో మాయాగుణ మగు నీవిశ్వమును సృష్టించుచున్నావు, పాలించుచున్నావు, సంహరించుచున్నావు. నీవు స్వయముగ నిర్గుణుడవు; నీ యీ లీల మిగుల తెలియరానిది.

**అథ తత్ర భవాన్ కిం దేవదత్తవదిహ గుణవిసర్గపతితః పారతంత్ర్యేణ స్వకృత కుశలాకుశలఫలముపాదదాతి। ఆహో స్విదాత్మారామ ఉపశమశీలః సమంజసదర్శన ఉదాస్త ఇతి హ వావ న విదామః॥ 34**

దేవదత్తాదిసాంసారికజీవులు సంసారమున గృహాదులను నిర్మించి వానియందు స్వకృతములైన శుభాశుభఫలములను బొందుదురు. అట్లే నీవు గూడ బ్రహ్మస్వరూపుడ వయ్యును ఈ సంసారమున జీవరూపముతో గుణకార్యభూతశరీరమున ప్రవేశించి కాలకర్మాదుల యధీనమున నుండి స్వకృతములైన శుభాశుభకర్మఫలముల ననుభవింతువో లేదా ఆత్మారాముడవు, శాంతస్వభావుడవు, నిత్యచిచ్ఛక్తి యుక్తుడవు వగు నీవు సాక్షీ రూపముతో విరాజిల్లు చున్నావో మే మెఱుగజాలము.

**నహి విరోధ ఉభయం భగవత్యపరిమితగుణగణ ఈశ్వరేఽనవగాహ్య మా హాత్మ్యేఽర్వాచీన వికల్ప వితర్క విచార ప్రమాణాభాస కుతర్క శాస్త్రకలి లాన్తః కరణా శయదురవగ్రహ వాదినాం వివాదానవసర ఉపరతసమస్తమాయా మయే కేవల ఏవాత్మమాయామన్తర్ధాయ కోన్వర్థో దుర్ఘట ఇవ భవతి స్వరూ పద్వయాభావాత్ ॥ 35**

నీలో పరస్పరవిరుద్ధము లగుధర్మము లన్నియు నుండవచ్చును. నీవుభగవానుడవు, అపరిమితము లగు గుణములు గల యీశ్వరుడవు. నీమాహాత్మ్య మితరులకు దెలియదు. వైశేషికాదినవ్యశాస్త్రములయందు వికల్పము (ఈవిధముగనా లేదా యీవిధముగనా), వితర్కము (ఇచట యేది యుక్తము), విచారము (ఇట్లు కావచ్చును), ప్రమాణాభాసము

(దుష్టప్రమాణము) అనువాని నవలంబించి కుతర్కాదు లుండును, వానిచే నెవరి చిత్తము భ్రాంతిచెందునో వారు వాస్తవవస్తువును స్పృశింపజాలరు. వారి దురాగ్రహమువలన గలుగు వివాదములకు నీవుగోచరింపవు. నీవు మాయా ప్రపంచమునుండి దూరముగ నుందువు. నీ వద్వితీయుడవు. నీయందు కర్తృత్వాకర్తృత్వములు, సుఖదుఃఖములు మున్నగున వేవియులేవు. అఘటనఘటనాపటీయసియగు ఆత్మమాయ అనగా చిచ్ఛక్తి యొక్క సాహాయ్యముచే నీయందుదుర్ఘట మైనదేమి యుండను? ఏలయన నీయందు స్వరూప ద్వయము అనగా బంధనము, ముక్తి యను రెండవస్థలు లేవు. (అందువలన నీమాయాప్రభావముచే నీవు సమస్తము చేయగలుగుదువు)

**సమవిషమమతీనాం మతమనుసరసి యథా రజ్జుఖండః సర్పాదిధి యామ్ ॥ 36**

యథార్థజ్ఞానము కలవ్యక్తి త్రాటిని త్రాడనియే భావించును, అందువలన వాని కెప్పుడును భయము కలుగదు. కాని భ్రాంతు డగువాడు, రజ్జువును సర్పముగా భావించి భయపడును. నీవు సమబుద్ధిగలవానికి అనగా జ్ఞానికి అభయము నిత్తువు, విషయబుద్ధిగల వానికి అనగా అజ్ఞానికి భయమును గలుగజేయుదువు. నిజముగ వారు తమతమమతిభేదము వలననే భయా భయములను బొందుచుందురు. కాని నీయందు సమవిషమభావములు లేవు.

**స ఏవ హి పునః సర్వవస్తుని వస్తుస్వరూపః సర్వేశ్వరః సకలజగత్కారణ కారణభూతః సర్వప్రత్యగాత్మత్వాత్ సర్వ గుణాభాసోపలక్షిత ఏక ఏవ పర్యవశేషితః ॥ 37**

విచారించి చూడగా నానారూపములతో వెల్లడియగువాడే సర్వప్రపంచమునందు పరమార్థభూతసత్స్వరూపుడు. అతడే సర్వేశ్వరుడు, జగత్కారణుడు, మహదాదుల 42
గారణభూతుడు. అతడే సర్వజీవులకు బ్రత్యగాత్మ అనగా అంతర్యామి, అతడే బుద్ధ్యం
విషయాదులకు ప్రకాశరూపముతో నుపలక్షితుడగును. ఆయనకంటె భిన్నము... వగు
ప్రాయములు. 'నేతి, నేతి' యనుశ్రుతిచే పర్యవసితుడు ఆయనయె. అట్టినీ...వము. నీ
...పరిశ్రమను
డైనవాడెవ్వడునూ లేడు.

**అథహ వావ తవ మహిమామృతరససముద్రవిప్రుషా
స్వమనసి నిష్యన్దమానానవరతసుఖేవ విస్మారిత దృష్టిశ్రుతి...
పరమభాగవతా ఏకాన్తినో భగవతి సర్వభూతప్రియ... ॥ 43
నితరాం నిరత నిర్వృతమనసః కథమూహ వా** ...ంచు త్వష్ట్రనందనుడగు
**స్వార్థకుశలా హ్యాత్మప్రియసుహృదః సాధవ స్త్వ**...తేజోరాశిని, అస్త్రములను,
**విసృజన్తి న యత్ర పునరయం సంసారపర్యా**...

హంసాయ దహ్రనిలయాయ నిరీక్షకాయ
కృష్ణాయ మృష్టయశసే నిరుపక్రమాయ ।
సత్సంగ్రహాయ భవపాన్థనిజాశ్రమాప్తా -
వన్తే పరీష్టగతయే హరయే నమస్తే ॥ 44

నీ వతివశుద్ధుడవు. హృదవియాకాశవాసివి, చిత్తవృత్తులకు సాక్షివి, సదానందుడైన కృష్ణనిస్వరూపుడవు,ఉజ్జ్వల మైన యశస్సు గలవాడవు, అనాదివి, సత్పురుషులచే గ్రాహ్యుడవు, లేదా సత్పురుషుల నమగ్రహించు వాడవు. నిన్ను శరణుజొచ్చిన సంసారపాంథులకు సంసారాంతమున వారి కుత్తమఫలరూపమున లభ్యమగుదువు. అందువలన ఓహరీ! నీకు నమస్కారము.

## శ్రీశుక ఉవాచ

అథైవమీడితో రాజన్ సాదరం త్రిదశైర్హరిః ।
సముపస్థానమాకర్ణ్య ప్రాహ తానభినన్దితః ॥ 45

శుకుడు పలికెను :- రాజా! దేవత లిట్టిభావముతో మిగుల సాదరముగ శ్రీహరిని స్తుతింపగా ఆయన దానిని విని ప్రసన్నుడై దేవతలతో నిట్లు పలికెను.

## శ్రీభగవానువాచ

ప్రీతోఽహం వః సురశ్రేష్ఠ మదుపస్థానవిద్యయా ।
ఆత్మైశ్వర్యస్మృతిః పుంసాం భక్తిశ్చైవ యయా మయి ॥ 46

భగవానుడు పలికెను :- దేవరాజా! మీరు జ్ఞానముద్వారా నన్ను స్తుతించితిరి. దానివలన నేను చాల సంతుష్టుడనైతిని. ఈ జ్ఞానమువలన పురుషునకు సంసారభావ శూన్యత్వరూప మైన యైశ్వర్యస్మృతి కలుగును. దానివలన నాయందు భక్తి కలుగును.

కిం దురాపం మయి ప్రీతే తథాపి విబుధర్షభాః ।
మయ్యేకాన్తమతిర్నాన్యన్మత్తో వాంఛతి తత్త్వవిత్ ॥ 47

దేవతాశ్రేష్ఠులారా! నేను సంతుష్టుడనైన భక్తులకు ఎట్టివస్తువు దుర్లభముకాదు. అయినను నాయనన్య భక్తులగు తత్త్వజ్ఞానులు నాకంటె భిన్నముగ దేనినిగూడ వాంఛింపరు.

న వేద కృపణః శ్రేయ ఆత్మనో గుణవస్తుదృక్ ।
తస్య తానిచ్ఛతో యచ్ఛేద్యది సోఽపి తథావిధః ॥ 48

అందువలన మధుసూదనా! నీమహిమామృతసముద్రములోని యొక్క బిందువు నొక్కమారైన పానముచేసినచో వారి మనస్సున అజస్ర మగునొక యానందప్రవాహము బయల్వెడలి మాయికవస్తుదర్శనశ్రవణములవలన గలిగిన విషయసుఖాభాసమును మరపించును. అట్టివారు భోగకాంక్షారహితులగు పరమభాగవతులు. వారు సర్వభూత ప్రియుడవు, ఆప్తుడవు, పరమాత్ముడవు, భగవానుడవు నగు నీయందు మనస్సు నుంచి పరమసుఖమును పొందుదురు. పురుషార్థములయందెవరు నిపుణులో, నీవెవరకు ఆత్మవు, ఆప్తుడవు నైయున్నావో ఆ భక్తులు పునరావృత్తి రహితమైన నీచరణపద్మములసేవనెట్లు విడువగలరు?

**త్రిభువనాత్మభవన త్రివిక్రమ త్రినయన త్రిలోకమనోహరానుభవ తవైవ విభూతయో దితిదనుజాదయశ్చాపి తేషాముపక్రమసమయోఽయమితి స్వాత్మమాయయా సురనరమృగమిశ్రితజలచరాకృతిభిర్యథాపరాధం దణ్డం దణ్డధర దధర్థ ఏవ మేనమపి భగవన్ జహి త్వాష్ట్రముత యది మన్యసే ॥39**

త్రిభువనస్వరూపా! త్రిభువనజనకా!త్రివిక్రమా! (వామనరూపధారీ) త్రినయానా! (నృసింహరూపధారీ) త్రిలోకమనోహరానుభవశీలా! దైత్యదానవ మనుష్యాదులుగూడ నీవిభూతులే; దండధరా! నీవెల్లప్పుడు దైత్యులయభివృద్ధి సమయమును దెలిసికొని నీమాయాశక్తి చేనొకప్పుడు దేవతాకృతులైనవామనాద్యవతారములను, ఒకప్పుడు మానవ రూపములైన రామకృష్ణాద్యవతారములను, ఒకప్పుడు మృగాకారము లైన వరాహాద్య వతారాములను, ఒకప్పుడు మిశ్రాకృతులైన హయగ్రీవ నృసింహాద్యవతారములను, ఒకప్పుడు జలచరాకృతు లైన మత్స్యకూర్మాద్యవతారములను ధరించి, యసురులయపరాధముల ననుసరించి వారికి శిక్షలను విధించుచుందువు. దేవా! ఈ వృత్రాసురుడు వధించుటకు దగినవాడని తలంచినచో నీవు వానిని వధింపుము.

**అస్మాకం తావకానాం తతతత నతానాం హరే తవ చరణనలినయుగల ధ్యానానుబద్ధహృదయనిగడానాం స్వలింగవి వరణేనాత్మసాత్కృతానా మను కమ్పానురఞ్జిత విశదరుచిరశిశిరస్మి తావలోకేన విగలిత మధురముఖరసా మృతకలయా చాన్తస్తాప మనఘార్హసి శమయితుమ్ ॥ 40**

రక్షకా!పితామహా! అనఘా! మేము నీ చరణయుగళమునందు ప్రణతులము. నీ చరణారవిందయుగళధ్యానముచే మాచిత్తము బంధింపబడినది. నీనిజమూర్తిని ప్రకటించి మమ్ము నీభక్తులునుగా స్వీకరించి అనుకంపానురంజితము విశదము శీతలమృదుహాస యుక్తము నగు వాక్సుధ ద్వారా వృత్రాసుర భయమువలన గలిగిన మామానసికబాధను దొలగింపుము.

ధ భగవంస్తవాస్మాభిరఖిల జగదుత్పత్తి స్థితిలయనిమిత్తాయ
వ్యమాయావినోదస్య సకలజీవనికాయానామన్తర్హృదయేషు బహిరపి
మ్మప్రత్యగాత్మస్వరూపేణప్రధాన రూపేణ చ యథాదేశకాలదేహావస్థాన
తదుపాదానోపలమ్భకతయానుభవతః సర్వప్రత్యయసాక్షిణ ఆకాశ
సాక్షాత్పరబ్రహ్మణః పరమాత్మనః కియానిహవార్థవిశేషో విజ్ఞాపనీయః
స్ఫులింగాదిభిరివ హిరణ్యరేతసః ॥ 41

దేవా! నీ వనంతకోటిబ్రహ్మాండలములయుత్పత్తిస్థితి లయములకు గారణ భూతయు,
గశక్తియు నగు యోగమాయతో నెల్లప్పుడు క్రీడించుచుందువు. సర్వజీవుల హృదయము
గ్మరూపముతోను అంతర్యామి యగు పరమాత్మ స్వరూపముతోను, బయట ప్రకృతి
తోను నీవే విరాజిల్లుచున్నావు. దేశకాలములను, బాల్యపౌగండాదిదేహావస్థలను
ంపక అనగా స్వీకరించి వాని యన్నింటియొక్క యపాదానములజ్ఞాతరూపముతో
ంచుచు) నీవే కనబడుచుందువు. నీవు బుద్ధ్యాది సకలవృత్తులకు సాక్షివైయున్నావు.
శమువలె అనగా గుణాదులచే వికారమును బొందుట లేదు. సాక్షాత్తుగ పరబ్రహ్మ
్మవు. అంశగతములైన స్ఫులింగములు అగ్నిని ప్రకాశింపజేయజాలనట్లు స్ఫులింగ
త్కణముల మైన మేము సర్వజ్ఞుడ వగు నీకడ కార్యార్థమును బ్రకాశింపచేయజాలము.
వు సర్వము నెఱుగుదువు, నీకు తెలియని దేమియు లేదు.

అత ఏవ స్వయం తదుపకల్పయాస్మాకం భగవతః పరమగురోస్తవ
శతపలాశచ్ఛాయాం వివిధవృజినసంసారపరిశ్రమోపశమనీముప
గాం వయం యత్కామేనోపసాదితాః ॥ 42

వు సర్వజ్ఞుడ వగుటవలన మేముకార్యసిద్ధి నభిలషించి పరమగురురూపుడ వగు
ద్మచ్ఛాయలోనికి జేరితిమి. మా యీకార్యమునునీవే స్వయముగ నెఱవేర్పుము. నీ
రణకమలచ్ఛాయను శరణుబొందిన భక్తులపాపజనితమైన సంసారపరిశ్రమను
ర్తము.

అథో ఈశ జహి త్వాష్ట్రం గ్రసన్తం భువనత్రయమ్ ।
గ్రస్తాని యేన నః కృష్ణ తేజాంస్యస్త్రాయుధాని చ ॥ 43

ందువలన ఓ యీశా! నీవు మూడులోకములను గ్రసించు త్వష్టృనందనుడగు
సురుని సంహరింపుము. కృష్ణా! ఈయసురుడు మాతేజోరాశిని, అస్త్రములను,
ధములను గూడ గ్రహించినాడు.

హంసాయ దహ్రనిలయాయ నిరీక్షకాయ
కృష్ణాయ మృష్టయశసే నిరుపక్రమాయ ।
సత్సంగ్రహాయ భవపాన్థనిజాశ్రమాప్తా -
వన్తే పరీష్టగతయే హరయే నమస్తే ॥ 44

నీ వతివశుద్ధుడవు. హృదయియాకాశవాసివి, చిత్తవృత్తులకు సాక్షివి, సదానందుడైన కృష్ణనిస్వరూపుడవు,ఉజ్జ్వల మైన యశస్సు గలవాడవు, అనాదివి, సత్పురుషులచే గ్రాహ్యుడవు, లేదా సత్పురుషుల ననుగ్రహించు వాడవు. నిన్ను శరణుజొచ్చిన సంసారపాంథులకు సంసారాంతమున వారి కుత్తమఫలరూపమున లభ్యమగుదువు. అందువలన ఓహరీ! నీకు నమస్కారము.

## శ్రీశుక ఉవాచ

అథైవమీడితో రాజన్ సాదరం త్రిదశైర్హరిః ।
సముపస్థానమాకర్ణ్య ప్రాహ తానభినన్దితః ॥ 45

శుకుడు పలికెను :- రాజా! దేవత లిట్టిభావముతో మిగుల సాదరముగ శ్రీహరిని స్తుతింపగా ఆయన దానిని విని ప్రసన్నుడై దేవతలతో నిట్లు పలికెను.

## శ్రీభగవానువాచ

ప్రీతోఽహం వః సురశ్రేష్ఠ మదుపస్థానవిద్యయా ।
ఆత్మైశ్వర్యస్మృతిః పుంసాం భక్తిశ్చైవ యయా మయి ॥ 46

భగవానుడు పలికెను :- దేవరాజా! మీరు జ్ఞానముద్వారా నన్ను స్తుతించితిరి. దానివలన నేను చాల సంతుష్టుడనైతిని. ఈ జ్ఞానమువలన పురుషునకు సంసారభావ శూన్యత్వరూప మైన యైశ్వర్యస్మృతి కలుగును. దానివలన నాయందు భక్తి కలుగును.

కిం దురాపం మయి ప్రీతే తథాపి విబుధర్షభాః ।
మయ్యేకాన్తమతిర్నాన్యన్మత్తో వాంఛతి తత్త్వవిత్ ॥ 47

దేవతాశ్రేష్ఠులారా! నేను సంతుష్టుడనైన భక్తులకు ఎట్టివస్తువు దుర్లభముకాదు. అయినను నాయనన్య భక్తులగు తత్త్వజ్ఞానులు నాకంటె భిన్నముగ దేనినిగూడ వాంఛింపరు.

న వేద కృపణః శ్రేయ ఆత్మనో గుణవస్తుదృక్ ।
తస్య తానిచ్ఛతో యచ్ఛేద్యది సోఽపి తథావిధః ॥ 48

గుణజాతములగు విషయములనె తత్త్వముగా నెఱుంగువాడు కృపణుడు. అతడాత్మ శ్రేయస్సు నెఱుంగడు. అట్టి విషయాభిలాషికి వాని కిష్టములైన విషయముల నెవ్వడైన గలుగజేసినచో ఆదాతగూడ నట్టియజ్ఞుడే యగును.

**స్వయం నిశ్శ్రేయసం విద్వాన్ న వక్త్యజ్ఞాయ కర్మ హి ।**
**న రాతి రోగిణోఽపథ్యం వాంఛతోఽపి భిషక్తమః ॥ 49**

పరమానందప్రాప్తిసాధన మగు భగవద్భజనము నెఱింగినవాడు, అజ్ఞానుల కెప్పుడును ప్రవృత్తి మార్గము నుపదేశింపడు. (దానిని సంపాదించి యిచ్చుట పాసగనివిషయము) రోగి యపథ్యమును గోరినచో మంచివైద్యు డెప్పుడును వాని కపథ్యము నీయడుగదా !

**మఘవన్ యాత భద్రం వో దధ్యంచమృషిసత్తమమ్ ।**
**విద్యావ్రతతపస్సారం గాత్రం యాచత మాచిరమ్ ॥ 50**

దేవేంద్రా! మీకు శుభము కలుగుగాక ! మీరు ఋషిశ్రేష్ఠుడగు దధ్యంచుని (దధీచి) కడకు వెడలుడు. విద్యావ్రతతపస్సులద్వారా వాని శరీరము మిగుల దృఢమయ్యెను. వెంటనే వానియాదేహమును యాచించుడు. ఈ విషయమున అలస్యము కూడదు.

**స వా అధిగతో దధ్యఙ్ఙశ్విభ్యాం బ్రహ్మ నిష్కలమ్ ।**
**యద్వా అశ్వశిరో నామ తయోరమరతాం వ్యధాత్ ॥ 51**

ఆ దధ్యంచ (దధీచి) ఋషి విశుద్ధమగు బ్రహ్మవిద్యను బొందెను. అత డాబ్రహ్మ జ్ఞానమును అశ్వినీకుమారులకు బోధించెను. దధ్యంచుడు (దధీచి) అశ్వశిరమును ధరించిబ్రహ్మజ్ఞానమును ఉపదేశించుటచే ఆబ్రహ్మ జ్ఞానమున కశ్వశిర మనుపేరు కలిగెను. అశ్వినీకుమారులు లీయుపదేశము వలనజీవన్ముక్తిని బొందిరి.

**దధ్యఙ్ఙాథర్వణ స్త్వష్ట్రే వర్మాభేద్యం మదాత్మకమ్ ।**
**విశ్వరూపాయ యత్ప్రాదాత్ త్వష్టా యత్త్వమధాస్తతః ॥ 52**

దధ్యంచ (దధీచి) ఋషి మదీయస్వరూపము, దుర్భేద్యము నగు నారాయణ కవచమును బొంది త్వష్టకు, త్వష్ట విశ్వరూపునకు బోధించెను. నీవు విశ్వరూపునినుండి దానిని బొందితివి. ఆ విద్యాబలమువలన దధ్యంచ (దధీచి) ఋషిశరీర మతిదృఢముగ నుండెను. మీ రిపు డాశరీరము నీయవలసినదిగా ఆయనను ప్రార్థింపుడు.

**యుష్మభ్యం యాచితోఽశ్విభ్యాం ధర్మజ్ఞోఽఙ్గాని దాస్యతి ।**
**తతస్తైరాయుధశ్రేష్ఠో విశ్వకర్మవినిర్మితః ।**
**యేన వృత్రశిరో హర్తా మత్తేజ ఉపబృంహితః ॥ 53**

అశ్వినీకుమారులు మీకొఱకై ఆయన శరీరమును ప్రార్థించినచో ఆయన తనదేహమును మీకు సమర్పింపగలడు. ఆ విషయమున నెట్టి సందేహము వలదు. ఆయన గొప్పధర్మజ్ఞుడు. ఆయన తనశరీరమును దానము చేసినచో ఆయన యెముకచే విశ్వకర్మ ఆయుధశ్రేష్ఠ మగు వజ్రాయుధమును నిర్మింపగలడు.

**తస్మిన్ వినిహతే యూయం తేజోఽస్త్రాయుధసమ్పదః ।**
**భూయః ప్రాప్స్యథ భద్రం వో న హింసన్తి చ మత్పరాన్ ॥ 54**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే భగవదుపదేశోనామ
నవమోఽధ్యాయః ॥

నా తేజస్సుద్వారా మిగుల తేజస్వివై నీవు పైన చెప్పబడిన వజ్రాయుధముతో ఆవృత్రాసురునిశిరస్సును ఛేదింపగలవు. వృత్రాసురుడు సంహరింపబడగా మీరు తేజస్సును, అస్త్రములను, ఆయుధసంపదను మరల పొందగలరు. మీకు శుభమగుగాక! త్రిభువనములను గ్రసించు ఆమహాపురుషుడు మిమ్ము సంహరించు నని మీరు భావింపవలదు. నా భక్తుల నెవ్వరును హింసింపజాలరు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
భగవదుపదేశ మను తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.





# పదియవ అధ్యాయము

## దేవతలు దధీచిఋషి యస్థికలతో వజ్రాయుధమును నిర్మించి వృత్రాసురునిసేనపై దండెత్తుట

కథాసారము :- ఈ యధ్యాయమున నింద్రుడు దధీచి మునియొక్క యస్థికలచే నిర్మితమైన వజ్రాయుధమును ధరించి వృత్రాసురుడు మున్నగు నసురులతో యుద్ధము చేయుట యను విషయము వర్ణింపబడినది.

భగవదాదేశము ననుసరించి దేవతలు దధీచిమునికడకు వెడలి ఆయనదేహమును యాచించిరి. దధీచిముని వారినుండి ధర్మకథను వినుటకై మొదట పరిహాసమిషతో ప్రత్యాఖ్యానము చేసెను. పిమ్మట కుక్కలు నక్కలు తినదగిన అనిత్యమగు దేహముద్వారా పరోపకారమును చేయుటయే యేకైక మగు ధర్మమని భావించి తన దేహమును దేవతల కొసంగెను. దధీచిముని మొదట తనస్థూలదేహమునందున్న పంచభూతము లను క్రమముగ వాని మూలకారణములందు నియమించి చివరకు జీవాత్మను పరమాత్మతో గలిపి పాంచ భౌతికదేహమును పరిత్యజించెను. అనంతరము ఆయన యస్థికలను విశ్వకర్మ వజ్రా యుధముగ నిర్మింపగా ఇంద్రుడు దానిని ధరించి దేవగణపరివృతుడై యైరావతము నధిరోహించెను.

కృతయుగాంతమున త్రేతాయుగారంభమున నర్మదానదీ తీరమున దేవాసురులకు సంగ్రామము ఘటిల్లెను. ఈ సంగ్రామమున అసురులు దేవతల తేజస్సును సహింపజాలనివారై తమ సేనాపతి యగు వృత్రాసురుని యుద్ధములో వదలి నలువైపుల పారిపోసాగిరి. వృత్రాసురుడు వారికి ధార్మికవిషయముల నిట్లుబోధించెను - యుద్ధమున మరణము వాంఛనీయము. ఏలయన, దానివలన స్వర్గము లభించును. జయముకలిగిన జడప్రతిష్ఠ వచ్చును. అందువలన యుద్ధమున వెన్నుజూపి పోరాదు.

### శ్రీబాదరాయణిరువాచ

ఇన్ద్రమేవం సమావిశ్య భగవాన్ విశ్వభావనః ।
పశ్యతామనిమేషాణాం తత్రైవాంతర్దధే హరిః ॥ 1

శుకుడు పలికెను :- విశ్వభావనుడగు శ్రీహరి యింద్రునితోనిట్లు పలికి దేవతలయెదుటనె అంతర్ధానుడయ్యెను.

**తథాభియాచితో దేవైరృషిరాథర్వణో మహాన్ ।**
**మోదమాన ఉవాచేదం ప్రహసన్నివ భారత ॥ 2**

రాజా! భగవానునియుపదేశము ననుసరించి దేవతలుదారచిత్తుడు, అథర్వపుత్రుడునగు దధీచిముని కడకు వెడలి ఆయనశరీరమును యాచించిరి. అప్పుడాయన సంతుష్టచిత్తుడై వారినుండి ధర్మకథను వినదలచి నవ్వుచు నిట్లు పలికెను.

**అపి బృందారకా యూయం న జానీథ శరీరిణామ్ ।**
**సంస్థాయాం యస్త్వభిద్రోహో దుస్సహశ్చేతనాపహః ॥ 3**

దేవతలారా! మీరు దేవత లయ్యును శరీరధారుల కంత్యకాలమున చైతన్యము నపహరించునది, సహింపరానిది అగు నేయుపద్రవము కలుగునో దానిని యెఱుగరా?

**జిజీవిషూణాం జీవానామాత్మా ప్రేష్ఠ ఇహేప్సితః ।**
**క ఉత్సహేత తం దాతుం భిక్షమాణాయ విష్ణవే ॥ 4**

ఈ ప్రపంచమున జీవులకు తమ శరీరమే ప్రియమైనవస్తువు. అందువలన జీవింపగోరువారీ దేహమునె సంపూర్ణముగ రక్షించుకొనుట యుచితము. అందువలన విష్ణువుగూడ నతిథిరూపమున వచ్చి యాచించినచో ఆ దేహమును దానముచేయుట కెవ డుత్సాహమును జూపును?

### శ్రీదేవా ఊచుః

**కిం ను తద్దుస్త్యజంబ్రహ్మన్ పుంసాం భూతానుకంపినామ్ ।**
**భవద్విధానాం మహతాం పుణ్యశ్లోకేడ్యకర్మణామ్ ॥ 5**

దేవతలు పలికిరి :- మహాత్మా! మీ వలె ప్రాణులపై దయగలవారు, ఉదారచిత్తులు, పుణ్యశ్లోకులచే స్తుతింపబడు కర్మలు గలవారు నగు మానవులకు ఈ ప్రపంచమున (పరోపకారమునకై) త్యజింపరాని దేమి యుండును?

**నూనం స్వార్థపరో లోకో న వేద పరసంకటమ్ ।**
**యది వేద న యాచేత నేతి నాహ యదీశ్వరః ॥ 6**

స్వార్థపరులగు జను లితరుల (దాతల) కష్టముల నెఱుంగజాలరు. యాచకుడు దాతయొక్క కష్టముల నెఱుంగజాలినచో నతడు యాచింపడు. అట్లే దానసమర్థు డగు వ్యక్తిగూడ యాచకుని కష్టముల నెఱుంగజాలినచో యాచకుని విముఖింపడు.

## శ్రీఋషిరువాచ

ధర్మం వః శ్రోతుకామేన యూయం మే ప్రత్యుదాహృతాః ।
ఏష వః ప్రియమాత్మానం త్యజన్తం సన్త్యజామ్యహమ్ ॥ 7

ఋషిపలికెను :- మీవలన ధర్మకథను వినదలచినవాడనై నేనుమిమ్ము విమర్శించితిని. అందువలన మిగుల ప్రియమైనదైనను శరీరము ఒకానొకదినమున నన్ను విడిచి వెడలును. అట్టి యీ శరీరమును మీ యుపకారముకొఱకు ఇత్తును.

యోఽధ్రువేణాత్మనా నాథా న ధర్మం న యశః పుమాన్ ।
ఈహేత భూతదయయా స శోచ్యః స్థావరైరపి ॥ 8

దేవతలారా! ప్రాణులపై దయగలవాడై మానవుడు అనిత్యమగు నీ దేహముద్వారా ధర్మమును, కీర్తిని సంపాదించుటకు ప్రయత్నము చేయనిచో నతడు స్థావరము లైన వృక్షాదుల కంటెను జడుడే యగును.

ఏతావానవ్యయో ధర్మః పుణ్యశ్లోకైరుపాసితః ।
యో భూతశోకహర్షాభ్యామాత్మా శోచతి హృష్యతి ॥ 9

ప్రాణుల శోకముచే శోకించువాడు, ఆనందముచే ఆనందించువాడు, నగు మానవుని ధర్మమునె పుణ్యశ్లోకులగు వ్యక్తులు అక్షయమగు ధర్మమని భావించి దానిని యుపాసించు చుందురు.

అహో దైన్యమహో కష్టం పారక్యైః క్షణభఙ్గురైః ।
యన్నోపకుర్యాదస్వార్థైర్మర్త్యః స్వజ్ఞాతివిగ్రహైః ॥ 10

కుక్కలు నక్కలు తినదగినవియు, స్వార్థోపయోగ శూన్యము లైనవియు క్షణభంగురము లైనవియు నగు ధనపుత్ర దేహములచే పరోపకారము చేయనిచో మానవుని జీవితము కేవలము దుఃఖభోగార్థమే యగును.

## శ్రీబాదరాయణిరువాచ

ఏవం కృతవ్యవసితో దధ్యఙ్ఙాథర్వణస్తనుమ్ ।
పరే భగవతి బ్రహ్మణ్యాత్మానం సన్నయన్ జహౌ ॥ 11

శుకుడు పలికెను :- అథర్వపుత్రు డగు దధీచిముని యిట్లు తన యస్థుల నిచ్చుటకు కృతనిశ్చయుడై పరబ్రహ్మ మగు భగవానుని యందు ఆత్మ నేకముచేసి పాంచభౌతిక దేహమును విడచెను.

యతాక్షాసుమనోబుద్ధిస్తత్త్వదృగ్ ధ్వస్తబన్ధనః ।
ఆస్థితః పరమం యోగం న దేహంబుబుధే గతమ్ ॥ 12

అప్పుడాయన ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, బుద్ధి మున్నగువానిని వశముచేసికొని సమాధియందు పరమార్థతత్త్వమును దర్శించెను. బంధనము లన్నియు ఛిన్నము లగుటచే నతడు దేహవియోగమును ఎఱుంగజాలకపోయెను.

అథేన్ద్రో వజ్రముద్యమ్య నిర్మితం విశ్వకర్మణా ।
మునేః శక్తిభిరుత్సిక్తో భగవత్తేజసాన్వితః ॥ 13

వృతో దేవగణైః సర్వైర్గజేన్ద్రోపర్యశోభత ।
స్తూయమానో మునిగణైస్త్రైలోక్యం హర్షయన్నివ ॥ 14

అనంతరము దేవేంద్రుడు దధీచిమునియొక్క అస్థికలచే విశ్వకర్మ నిర్మించిన వజ్రాయుధమును ధరించి మునియొక్క శక్తిచే శక్తిమంతుడు, భగవంతుని తేజస్సుచే తేజస్వియు, సర్వదేవతలచే బరివృతుడు నై యైరావతము నధిరోహించెను. అప్పుడు మునులాతనిని స్తుతించిరి. ఇట్లతడు ముల్లోకములకు సంతోషమును గలుగజేసి శోభిల్లెను.

వృత్రమభ్యద్రవచ్ఛక్రమసురానీకయూథపైః ।
పర్యస్తమోజసా రాజన్ క్రుద్ధో రుద్ర ఇవాన్తకమ్ ॥ 15

రాజా! రుద్రుడు క్రుద్ధుడై అంధకునిపైకి బరుగిడినట్లు ఇంద్రుడు కూడ క్రుద్ధుడై అసురసేవాపరివృతు డగు వృత్రాసురున కెదురుగ వేగముతో బరుగిడెను.

తతస్సురాణామసురై రణః పరమదారుణః ।
త్రేతాముఖే నర్మదాయామభవత్ప్రథమే యుగే ॥ 16

అనంతరము కృతయుగావసానమున త్రేతాయుగారంభమున నర్మదానదియొడ్డున అసురులతో దేవతల కొక భీషణసమరము జరిగెను.

రుద్రైర్వసుభిరాదిత్యైరశ్విభ్యాం పితృవహ్నిభిః ।
మరుద్భిరృభుభిః సాధ్యైర్విశ్వేదేవైర్మరుత్పతిమ్ ॥ 17

దృష్ట్వా వజ్రధరం శక్రం రోచమానం స్వయా శ్రియా ।
నామృష్యన్నసురా రాజన్మృధే వృత్రపురస్సరాః ॥ 18

రాజా! వృత్రుడు మున్నగు నసురులు యుద్ధరంగమున రుద్రులతోను, ఆదిత్యులతోను, అశ్వనీకుమారులతోను, పితృదేవతలతోను, వహ్నిగణములతోను, మరుత్తులతోను, ఋభువులతోను, సాధ్యులతోను, విశ్వేదేవులతోను, తనయైశ్వర్యములతోను గూడి యున్నవాడు దేవతాధిపతియు వజ్రధరుడు నగు నింద్రుని జూచి అతని తేజస్సును సహింప జాలకపోయిరి.

నముచిః శంబరో నర్వా ద్విమూర్ధా ఋషభోఽసురః ।
హయగ్రీవః శఙ్కు శిరా విప్రచిత్తిరయోముఖః ॥ 19

పులోమా వృషపర్వా చ ప్రహేతిర్హేతిరుత్కలః ।
దైతేయా దానవా యక్షా రక్షాంసి చ సహస్రశః ॥ 20

సుమాలిమాలిప్రముఖాః కార్తస్వరపరిచ్ఛదాః ।
ప్రతిషిధ్యేన్ద్రసేనాగ్రం మృత్యోరపి దురాసదమ్ ॥ 21

అభ్యర్దయన్నసంభ్రాన్తాః సింహనాదేన దుర్మదాః ।
గదాభిః పరిఘైర్బాణైః ప్రాసముద్గరతోమరైః ॥ 22

స్వర్ణాలంకారభూషితులగు నముచి, శంబరుడు, అనర్వుడు, ద్విమూర్ధుడు, ఋషభుడు, అసురుడు, హయగ్రీవుడు, శంకుశిరుడు, విప్రచిత్తి, అయోముఖుడు, పులోముడు, వృషపర్వుడు, ప్రహేతి, హేతి, ఉత్కలుడు, ఇంకను స్వర్ణాలంకారభూషితులగు వేలకొలది దైత్యులు, దానవులు, యక్షులు, రాక్షసులు, సుమాలి, మాలి మున్నగు భయంకరులైన అసురులు సింహమువలె గర్జించుచు నిర్భయముగ మృత్యువునకుగూడ లొంగని యింద్రసైన్యము నెదుర్కొని గద, పరిఘ, బాణములు, ప్రాసము, ముద్గరము, తోమరము మున్నగు నాయుధములచే బీడింపసాగిరి.

శూలైః పరశ్వధైః ఖడ్గైః శతఘ్నీభిర్భుశుణ్డిభిః ।
సర్వతోఽవాకిరన్ శస్త్రైశ్చ విబుధర్షభాన్ ॥ 23

(అయ్యసురులు) నలువైపులనుండి శూలములు, గండ్రగొడ్డళ్ళు, ఖడ్గములు, శతఘ్నులు, భుశుండి మున్నగు అస్త్రశస్త్రములద్వారా దేవతలలో శ్రేష్ఠులగువారిని బాధింపసాగిరి.

న తేఽదృశ్యన్త సంఛన్నాః శరజాలైః సమన్తతః ।
పుంఖానుపుంఖం పతితైర్జ్యోతీంషీవ నభోఘనైః ॥ 24

ఆకాశమునందున్న మేఘముచే నక్షత్రములు గనబడునట్లు పుంఖానుపుంఖములుగ నలువైపులనుండి పడుచున్న శరములచే గప్పబడిన వారై దేవతలు కనబడకుండగ పోయిరి.

**న తే శస్త్రాస్త్రవర్షౌఘా హ్యాసేదుః సురసైనికాన్ ।**
**ఛిన్నాః సిద్ధపథే దేవైర్లఘుహస్తైః సహస్రధా ॥ 25**

అసురులు గురిపించిన అస్త్రశస్త్రములు దేవసైన్యమున బొందలేదు అనగా వారిపై బడలేదు. ఏలయన, లఘుహస్తులగు (శీఘ్రముగ భేదించు అనగా హస్తలాఘవము గల) దేవతలు ఆకాశమార్గమున (లక్ష్యస్థానమును జేరకముందే) వేయిముక్కలుగ వానిని ఛేదించిరి.

**అథ క్షీణాస్త్రశస్త్రౌఘా గిరిశృఙ్గద్రుమోపలైః ।**
**అభ్యవర్షన్ సురబలం చిచ్ఛిదుస్తాంశ్చ పూర్వవత్ ॥ 26**

అసురులు తాము ప్రయోగించిన అస్త్రశస్త్రము లన్నియు నశించుట జూచి పిమ్మట దేవసైన్యముపై పర్వతములను, శిఖరములను , వృక్షములను, పాషాణములను గురిపింప సాగిరి. దేవతలు గూడ వెనుకటివలె వానిని ఆకాశ మార్గమునందే ఛేదించిరి.

**తానక్షతాన్ స్వస్తిమతో నిశామ్య**
**శస్త్రాస్త్రపూగైరథ వృత్రనాథాః ।**
**ద్రుమైర్దృశద్భిర్వివిధాద్రిశృఙ్గై**
**రవిక్షతాం స్తత్రసురిన్ద్రసైనికాన్ ॥ 27**

వివిధములైన అస్త్రశస్త్రములయొక్క దెబ్బలచే సురసైన్య మక్షతముగ కుశలముగ నుండుటయు, వృక్షపాషాణ పర్వతశిఖరములయొక్క దెబ్బలచే క్షతిచెందకుండుటయు చూచి వృత్రాసురుని సైన్యము భీతిల్లెను.

**సర్వే ప్రయాసా అభవన్ విమోఘాః**
**కృతాః కృతా దేవగణేషు దైత్యైః ।**
**కృష్ణానుకూలేషు యథా మహత్సు**
**క్షుద్రైః ప్రయుక్తా ఉషతీ రుక్షవాచః ॥ 28**

నీచులగు వ్యక్తులు మహాత్ములపై క్రోధోద్దీపకము లగు నెట్టి పరుషవాక్కులను ప్రయోగించినను అవి మహాత్ముల కెట్టి క్షోభమును గలుగజేయలేవు. పైగా నవి నిష్ఫలములే

యగును. అట్లే అసురులు దేవతలకు మాటిమాటికి జేసిన వ్యతిరేకకార్యము లన్నియు శ్రీకృష్ణసాహాయ్యముచే నిష్ఫలములయ్యెను.

తే స్వప్రయాసం వితథం నిరీక్ష్య
హరావభక్తా హతయుద్ధదర్పాః ।
పలాయనాయాజిముఖే విసృజ్య
పతిం మనస్తే దధురాత్తసారాః ॥ 29

హరిపై నసురులకు భక్తి లేకపోవుటచే వారి యుద్ధగర్వము నశించెను. దేవతలు వారి ధైర్యము నపహరించిరి. అసురులు తమప్రయత్నము లన్నియు విఫల మగుట జూచి యుద్ధారంభమున తమప్రభువగు వృత్రాసురుని బరిత్యజించి పారిపోవదలంచిరి.

వృత్రోఽసురాంస్తాననుగాన్మనస్వీ
ప్రధావతః ప్రేక్ష్య బభాష ఏతత్ ।
పలాయితం ప్రేక్ష్య బలంచ భగ్నం
భయేన తీవ్రేణ విహస్య వీరః ॥ 30

శత్రువులచే దిరస్కృతులై మిగుల భయముతో తనసైనికులు పారిపోవుచుండిరి. వీరులని ప్రసిద్ధిచెందిన అంతరంగులైన అసురులందఱు పారిపోవుట చూచి ధీరుడు వీరుడు నగు వృత్రాసురుడు నవ్వి యిట్లు పలికెను.

కాలోపపన్నాం రుచిరాం మనస్వినాం
జగాద వాచం పురుషప్రవీరః ।
హే విప్రచిత్తే నముచే పులోమన్
మయానర్వన్ శమ్బర మే శృణుధ్వమ్ ॥ 31

పురుషప్రవీరుడగు వృత్రాసురుడు శౌర్యవ్యంజకములు, సమరానుసారముగ ప్రయోగ యోగ్యములు బుద్ధిమంతులకు మనోజ్ఞములు నగు నీవాక్కులను బలికెను - 'ఓ విప్రచిత్తీ! ఓనముచీ! ఓ పులోమా! ఓ మయుడా! ఓ అనర్వుడా! ఓ శంబరుడా! మీరు నా మాటలను వినుడు.'

జాతస్య మృత్యుర్ధ్రువ ఏవ సర్వతః
ప్రతిక్రియా యస్య న చేహ క్లృప్తా ।
లోకే యశశ్చాథ తతో యదిహ్యాముం
కో నామ మృత్యుం న వృణీతయుక్తమ్ ॥ 32

జగత్తులో జీవమాత్రునకే మరణము సంభవించును. ఈ ప్రపంచములో మృత్యువు నుండి తప్పించుకొను ఉపాయమును దేనినిగూడ విధాత చెప్పలేదు. ఇట్టిస్థితిలో మృత్యువుద్వారా స్వర్గాదిలోకములు సత్కీర్తియు లభించుచున్నచో నిక యేబుద్ధిమంతు డాయుత్తమ మృత్యువును వరింపకుండగ నుండును?

> ద్వౌ సమ్మతావిహ మృత్యూ దురాపౌ
> యద్బ్రహ్మసన్ధారణయా జితాసుః ।
> కలేవరం యోగరతో విజహ్యా
> ద్యదగ్రణీర్వీరశయేఽనివృత్తః ॥ 33

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే విశ్వరూపోపాఖ్యానే
దశమోఽధ్యాయః ॥

యోగమార్గప్రవృత్తుడై ప్రాణాదీంద్రియములను నిరోధించి భగవచ్చింతన చేయుచు కళేబరమును త్యజించుట యొకవిధమగు మరణము. యుద్ధరంగమున వీపును జూపక సైన్యమున కెదురునిలచి శరీరమును విడచుట మఱియొకవిధమగుమరణము. ఈ రెండును శాస్త్రసమ్మతములైన మరణములే. అందువలన ఇవి మిగుల దుర్లభములు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములోని
పదియవ అధ్యాయము
సంపూర్ణము.



# పదునొకండవ అధ్యాయము

## వృత్రాసురుని వీరవాక్కులు : భగవత్ప్రాప్తి

కథాసారము :- ఈ యధ్యాయమున వజ్రాయుధధారి యగు నింద్రునితో గూడ యుద్ధమునకు ప్రవృత్తుడైన వృత్రాసురుని జ్ఞానమునకు, బలమునకు, భక్తికి సంబంధించిన విషయము వర్ణింబడినది.

వెనుకటి యధ్యాయమున వృత్రాసురుడుపారిపోవుచున్న తనసైనికులకు జేసిన ధర్మోపదేశమును వారు వినలేదు. అప్పుడతడు మాతృగర్భమునుండి మలమువలె వ్యర్థముగ జన్మించిన వారు పలాయనరతులు నగు సైనికులను ధిక్కరించి దేవతల యెదుటకు వచ్చి భయంకరముగ గర్జించెను. దానివలన దేవతలు భీతిచెంది మూర్ఛితులు కాగా వృత్రాసురుడు వారిని కాళ్ళతో త్రొక్కసాగెను. అదిచూచి దేవరాజగు నింద్రుడు సహింప జాలనివాడై వానిపై గదను ప్రయోగించెను. కాని వృత్రాసురుడాగదను ఎడమచేతితో పట్టుకొని దానితో ఇంద్రుని వాహనమగు ఐరావతముయొక్క శిరముపై గొట్టెను. దానిచే ఐరావతము దెబ్బతిని ఇంద్రుని వెనుకకు తీసికొనిపోయి యేడు ధనుస్సులదూరమున పడిపోయెను. ఇంద్రుడు వృత్రాసురుని సోదరుడగు విశ్వరూపుని మొదట ఉపాధ్యాయ రూపమున స్వీకరించి పిమ్మట వానిని వధించెను. వృత్రాసురుడు ఇంద్రుడు చేసిన యాక్రూరకర్మను దలంచి యుద్ధమునకు సిద్ధమై యిట్లు పలుకసాగెను. విష్ణుభగవానుడెవరికి సాహాయ్యముగ నుండునో వారికి జయము, సంపద, సంతోషము మున్నగు గుణములు తప్పక కలుగును. వారికి స్వర్గమర్త్య పాతాళములయందు అలభ్యమైనదేదియు నుండదు. అయినను భగవానుడు భక్తుల శుభమును గోరి యాభౌతిక సంపదలను వారికీయడు. అదియే భగవానుని కృప. అందువలన నేను సర్వస్వమును పరిత్యజించి భగవానుని దాసానుదాసుడ నగుదును. మనోవాక్కాయముల ద్వారా ఆయన గుణములను స్మరించుచు, కీర్తించుచు, సేవ చేయుదును. దేహమునందు, పుత్రకళత్రాదులయందు అనాసక్తుడనై భగవద్భక్తులతో స్నేహము చేయుదును. ఇదియే నాప్రార్థన. ఇదితప్ప ధ్రువలోకముగాని, బ్రహ్మపదముగాని, పుడమియందు ఏకచ్ఛత్రాధి పత్యముగాని, ముక్తిగాని నా కవసరములేదు.

### శ్రీశుక ఉవాచ

**త ఏవం శంసతో ధర్మం వచః పత్యురచేతసః ।**
**నైవాగృహ్ణన్త సమ్భ్రాన్తాః పలాయనపరా నృప ॥** 1

శుకుడు పలికెను:- రాజా ! అసురపతి యగు వృత్రాసురు డిట్లు ధర్మోపదేశము చేసినను వ్యాకుల హృదయులు, పలాయన రతులు, భీతులు నగు అసురులు వానిమాటలను వినకపోయిరి.

విశీర్యమాణాం పృతనామాసురీమసురర్షభః ।
కాలానుకూలైస్త్రిదశైః కాల్యమానామనాథవత్ ॥ 2

దృష్ట్వాతప్యత సంక్రుద్ధ ఇన్ద్రశత్రురమర్షితః ।
తాన్ నివార్యౌజసా రాజన్నిర్భర్త్స్యేదమువాచ హ ॥ 3

రాజా: దేవతలు శుభసమయము నెఱింగి యసురసేన నాక్రమించిరి. అసురులు ఆశ్రయము లేనివారివలె చెల్లాచెదరైరి. అసురశ్రేష్ఠుడు, ఇంద్రశత్రువు నగు వృత్రాసురుడు దానిని జూచి మిగుల సంతప్తు డయ్యెను. పిమ్మట సహింపలేనివాడై కోపముతో దేవ సైన్యమును నిరోధించి దూషించుచు నిట్లుపలికెను.

కిం వ ఉచ్చరితైర్మాతుర్ధావద్భిః పృష్ఠతో హతైః ।
న హి భీతవధః శ్లాఘ్యో న స్వర్గ్యః శూరమానినామ్ ॥ 4

(దేవతలారా!) పలాయనరతులగు నీయసురులు మాతృగర్భమునుండి పురీషమువలె వెలువడిరి. నిజముగ వీరిపుట్టుక వ్యర్థమే. ఇట్టిశత్రువులను వెనుకనుండి వధించిన మీకేమిలాభము కలుగును? తమ్ము వీరులుగా దలంచుకొనువారు పిరికి వారిని వధించుట యేమాత్రమును ప్రశంసనీయము కాదు. దానివలన-స్వర్గముగూడ లభింపదు.

యది వః ప్రధనే శ్రద్ధా సారం వా క్షుల్లకా హృది ।
అగ్రే తిష్ఠత మాత్రం మే న చేద్గ్రామ్యసుఖే స్పృహా ॥ 5

క్షుద్రదేవతలారా ! మీకు యుద్ధమున శ్రద్ధ, హృదయమున ధైర్యమునున్నచో, భౌతికసుఖములయందు అనగా విషయభోగములయందు అభిలాష లేనిచో క్షణకాలము నాయెదుట నిలువుడు.

ఏవం సురగణాన్ క్రుద్ధో భీషయన్ వపుషా రిపూన్ ।
వ్యనదత్ సుమహాప్రాణో యేన లోకా విచేతసః 6

మహాబలశాలి యగు వృత్రాసురుడు క్రుద్ధుడైతన విశాలశరీరమును ప్రదర్శించి శత్రువులగు దేవతలను భయపెట్టి గర్జించెను. దానివలన సర్వప్రాణులు మూర్ఛిల్లెను.

తేన దేవగణాః సర్వే వృత్రవిస్ఫోటనేన వై ।
నిపేతుర్మూర్ఛితా భూమౌ యథైవాశనినా హతాః ॥ 7

వృత్రాసురుడు చేసిన భయంకర మగు నీసింహనాదమును విని వజ్రాహతు డగు వ్యక్తివలె దేవతలు మూర్ఛితులై భూమిపై బడిరి.

మమర్ద పద్భ్యాం సురసైన్యమాతురం
నిమీలితాక్షం రణరఙ్గదుర్మదః ।
గాం కమ్పయన్నుద్యతశూల ఓజసా
నాలం వనం యూథపతిర్యథోన్మదః ॥ 8

రణరంగమున ఉన్మత్తుడగు వృత్రాసురుడు తనశూలమును పైకెత్తి పట్టుకొని తనబలముచే పృథివిని కంపింపజేసెను. వాని భయముచే దేవతలు భీతి చెందినవారై కన్నులు మూసికొనియుండినను ఆవృత్రాసురుడు మదించిన యూథపతి యైన యేనుగు పద్మవనమును పాదములతో త్రొక్కివేయునట్లు వారినిగూడ కాళ్ళతో త్రొక్కివేసెను.

విలోక్య తం వజ్రధరోఽత్యమర్షితః
స్వశత్రవేఽభిద్రవతే మహాగదామ్ ।
చిక్షేప తామాపతతీం సుదుస్సహాం
జగ్రాహ వామేన కరేణ లీలయా ॥ 9

దేవేంద్రుడు దానిని చూచి సహింపలేనివాడై ఆక్రమించుచున్న తన శత్రువుపైకి యొకమహాగదను ప్రయోగించెను. వృత్రాసురుడుగూడ తన యెదుట బడియున్న దుస్సహ మగు నాగదను శ్రమలేకుండగ ఎడమచేతితో బట్టుకొనెను.

స ఇన్ద్రశత్రుః కుపితో భృశం తయా
మహేన్ద్రవాహం గదయోరువిక్రమః ।
జఘాన కుమ్భస్థల ఉన్నదన్ మృధే
తత్కర్మ సర్వే సమపూజయన్నృప ॥ 10

రాజా ! అనంతర మతిపరాక్రమశాలియు, నింద్రశత్రువు నగు వృత్రాసురుడుగూడ మిగుల కుపితుడై యుద్ధములో నుచ్చైస్స్వరమున సింహనాదముచేయుచు నాగదాద్వారము ననే ఇంద్రవాహన మగు నైరావత మస్తకముపై గొట్టెను. స్వపక్షపరపక్షములలో నున్న సైనికు లందఱు వానియాకార్యమును ప్రశంసించిరి.

ఐరావతో వృత్రగదాభిమృష్టో
విఘూర్ణితోఽద్రిః కులిశాహతో యథా ।
అపాసరద్భిన్నముఖః సహేన్ద్రో
ముంచన్నసృక్ సప్తధనుర్భృశార్తః ॥ 11

వృత్రాసురునిగదాఘాతముచే నైరావతముయొక్క ముఖము పగిలిపోయెను. దానివలన నది మిగుల పీడితమై రక్తమును కక్కుకొనుచు వజ్రాహత మగు పర్వతమువలె ఘీంకారము చేయుచు ఇంద్రుని వెనుకకు దీసికొనిపోయి యిరువది యెనిమిదిమూరల దూరములో పడెను.

న సన్నవాహాయ విషణ్ణచేతసే
ప్రాయుఙ్క్త భూయః స గదాం మహాత్మా ।
ఇన్ద్రోఽమృతస్యన్దికరాభిమర్శ -
వీతవ్యథక్షతవాహోఽవతస్థే ॥ 12

ఐరావతము మూర్ఛపోవుటచూచి దుఃఖితచిత్తుడైయున్న యింద్రునిపై ధర్మాత్ముడగు వృత్రాసురుడు మరల గదను ప్రయోగింపలేదు. ఇట్టిసమయమున ఇంద్రుడు అమృతము స్రవించు తనహస్తముతో స్పృశించి ఐరావతముయొక్క బాధను పోగొట్టి మరల యచటికి వచ్చి నిలిచెను.

స తం నృపేన్ద్రాహవకామ్యయా రిపుం
వజ్రాయుధం భ్రాతృహణం విలోక్య ।
స్మరంశ్చ తత్కర్మ నృశంసమంహః
శోకేన మోహేన హసన్ జగాద ॥ 13

రాజా ! తనభ్రాతృహంతయు, శత్రువునగు నింద్రుడు యుద్ధము చేయుకోరికతో వజ్రాయుధమును ధరించి యెదుట నిలబడియుండుట చూచి వృత్రాసురుడు ఇంద్రుని భ్రాతృహననరూపమైన పాపకర్మమును స్మరించుచు శోకమోహములచే విభ్రాంతుడై నవ్వుచు నిట్లు పలికెను.

## వృత్ర ఉవాచ

దిష్ట్యా భవాన్ మే సమవస్థితో రిపు -
ర్యో బ్రహ్మహా గురుహా భ్రాతృహా చ ।
దిష్ట్యానృణోఽద్యాహమసత్తమ త్వయా
మచ్ఛూలనిర్భిన్నదృషద్ధృదాచిరాత్ ॥ 14

వృత్రాసురుడు పలికెను ; బ్రాహ్మణవధను, గురువధను, నాభ్రాతృవధను చేసిన నీవు అదృష్టమువలన నేడు శత్రుభావముతో నా యెదుట నిలచితివి. ఎంతయదృష్టము? పాపిష్ఠుడా! నాశూలముతో పాషాణతుల్యమగు నీహృదయమును జీల్చుదును. దానివలన నేడు నేను త్వరలోనే భ్రాతృఋణమునుండి విముక్తుడనగుదును.

యో నోఽగ్రజస్యాత్మవిదో ద్విజాతే -
ర్గురోరపాపస్య చ దీక్షితస్య ।
విస్రభ్య ఖడ్గేన శిరాంస్యవృశ్చత్
పశోరివాకరుణః స్వర్గకామః ॥ 15

నీవు స్వర్గకామనతో ఆత్మజ్ఞానియు, పాపరహితుడు, దీక్షితుడు, ముఖ్యముగ నీకు గురువు, నాకు సోదరుడు, బ్రాహ్మణుడు నగు విశ్వరూపుని యుపాధ్యాయునిగ వరించి విశ్వాసమును గలుగజేసి, స్వర్గకామియు యాజ్ఞికుడు నగు పురుషుడు నిర్దయతో పశువు శిరమును ఛేదించునట్లు ఖడ్గముచే వానిశిరస్సును ఛేదించితివి.

శ్రీహ్రీదయాకీర్తిభిరుజ్ఝితం త్వాం
స్వకర్మణా పురుషాదైశ్చ గర్హ్యమ్ ।
కృచ్ఛ్రేణ మచ్ఛూలవిభిన్న దేహ -
మస్పృష్టవహ్నిం సమదన్తి గృధ్రాః ॥ 16

సంపద, లజ్జ, దయ, యశస్సు మున్నగు సద్గుణములచే భ్రష్టుడవు, నీకర్మలవలన రాక్షసులకు గూడ నిందనీయుడవు నగు నిన్ను నా యీ శూలముతో బొడిచెదను. దానివలన నీ వతికష్టముతో మరణింతువు. అగ్నిగూడ నీ యీ దేహమును స్పృశింపదు. గ్రద్దలే దానిని భక్షించును.

అన్యేఽను యే త్వేహ నృశంసమజ్ఞా
యదుద్యతాస్త్రాః ప్రహరన్తి మహ్యమ్ ।
తైర్భూతనాథాన్ సగణాన్ నిశాత -
త్రిశూలనిర్భిన్నగలైర్యజామి ॥ 17

ఇతరదేవతలుగూడ నాప్రభావమును దెలిసికొనలేక క్రూరప్రవృత్తిగల నిన్నే యనుసరించుచు అస్త్రములను ధరించి యుద్ధమున నన్నుగొట్టినచో తీక్ష్ణమగు నీశూలముచే వారికంఠమును తెగవేసి దానిచే భూతప్రేతాదులతో గూడ భూతనాథులకు యజ్ఞము చేయుదును.

అథో హరే మే కులిశేన వీర
హర్తా ప్రమథ్యైవ శిరో యదీహ ।
తత్రానృణో భూతబలిం విధాయ
మనస్వినాం పాదరజః ప్రపత్స్యే ॥ 18

వీరుడ వగు నోయింద్రా ! అట్లుకాక నీవే వజ్రాయుధముతో పరాక్రమముతో నాశిరస్సును ఛేదించినచో నేను నా యీ దేహమును భూతముల కుపహారముగ నర్పించి కర్మబంధనములనుండి ముక్తుడనై ధీరజనోచితమగు పదవిని బొందగలను.

సురేశ కస్మాన్న హినోషి వజ్రం
పురఃస్థితే వైరిణి మయ్యమోఘం ।
మా సంశయిష్ఠా న గదేవ వజ్రః
స్యాన్నిష్ఫలః కృపణార్థేవ యాచ్ఞా ॥ 19

సురాధిపతీ ! నేను నీకు శత్రురూపముతో నిలిచియున్నను ఏల నాపైనమోఘ మగు నీవజ్రాయుధమును బ్రయోగించుటలేదు. కృపణుని యాచించినచో విఫల మగునట్లు నాపై బ్రయోగింప నీగదకూడ నిష్ఫలమయ్యెను. కాని యీ వజ్రాయుధ మట్లు విఫలముగాదు. అందువలన నీ వీ విషయమున నేవిధముగను సందేహపడ నవసరములేదు.

నన్వేష వజ్రస్తవ శక్ర తేజసా
హరేర్దధీచేస్తపసా చ తేజితః ।
తేనైవ శత్రుం జహి విష్ణుయన్త్రితో
యతో హరిర్విజయః శ్రీర్గుణాస్తతః ॥ 20

ఇంద్రా ! నీ యీ వజ్రాయుధము శ్రీహరి తేజస్సుచేత, దధీచిమహర్షి తపస్సుచేత మిగుల తేజోయుక్తమైనది. నీవుగూడ విష్ణువుచే ప్రేరితుడవైతివి. అందువలన దీనిచే నన్ను నీవు వధింపగలుగుదువు. శ్రీహరి యేపక్షమున నుండునో ఆపక్షమున జయము, సంపద, సంతోషాది గుణములు తప్పక యుండునుగదా !

అహం సమాధాయ మనో యథాహ నః
సఙ్కర్షణస్తచ్చరణారవిన్దే ।
త్వద్వజ్రరంహోలులితగ్రామ్యపాశో
గతిం మునేర్యామ్యపవిద్ధలోకః ॥ 21

నేనుగూడ నీవజ్రాయుధముచే సంసారబంధనభూత మగు కళేబరమును ఛేదించి యిహలోకమును విడచి సంకర్షణుని పాదపద్మములయందు చిత్తమును లగ్నముచేసి భగవద్భక్తుల గతిని బొందుదును.

పుంసాం కిలైకాన్తధియాం స్వకానాం
యాః సమ్పదో దివి భూమౌ రసాయామ్ ।
న రాతి యద్ద్వేష ఉద్వేగ ఆధి -
ర్మదః కలిర్వ్యసనం సంప్రయాసః ॥ 22

భగవానునియం దేకాంతభావముతో చిత్తము నర్పించినవారికి, భగవానుడు తనభక్తులుగా నంగీకరించినవ్యక్తులకు ఆయన స్వర్గమర్త్యపాతాళములయందలి సంపదల నన్నింటిని యిచ్చివేయడు. ఏలయన దానివలన శత్రుత్వము, ఉద్వేగము, మనస్తాపము, గర్వము, కలహము, నాశముచే దుఃఖము, రక్షించు కొనుటలోను వృద్ధిచేయుటలోను అతి ప్రయాసము కలుగును.

త్రైవర్గికాయాసవిఘాతమస్మత్ -
పతిర్విధత్తే పురుషస్య శక్రః ।
తతోఽనుమేయో భగవత్ప్రసాదో
యో దుర్లభోఽకించనగోచరోఽన్యైః ॥ 23

ఇంద్రా! నాప్రభువగు శ్రీహరి భగవానుడు తన భక్తులకు త్రివర్గ ప్రయాసమును అనగా ధర్మార్థకామప్రయత్నమును నివారించును. దాని వలననే ఆయన కృప యెట్టిదో యూహింపవచ్చును. ఇట్టి భగవత్ప్రసాద మొక్కనిష్కించను లగు భగవద్భక్తులకే లభించును గాని విషయావిష్టచిత్తులగు మానవులకు లభింపదు.

అహం హరే తవ పాదైకమూల -
దాసానుదాసో భవితాస్మి భూయః ।
మనః స్మరేతాసుపతేర్గుణాంస్తే
గృణీత వాక్కర్మ కరోతు కాయః ॥ 24

శ్రీహరీ! నీపాదముల నాశ్రయించిన దాసులకు నేను దాసుడను కాగలనా? నామనస్సు ప్రాణపతి వగు నీగుణములను స్మరించుగాక! వాక్కులు నీగుణములను కీర్తించుగాక! శరీరము నీసేవాకార్యమును సంపన్నము చేయుగాక !

న నాకపృష్ఠం న చ పారమేష్ఠ్యం
న సార్వభౌమం న రసాధిపత్యమ్।
న యోగసిద్ధీరపునర్భవం వా
సమంజస త్వా విరహయ్య కాంక్షే ॥ 25

సర్వసౌభాగ్యనిధీ! నేను నిన్ను విడచి ధ్రువలోక బ్రహ్మలోక మర్త్యలోకములయం దేకఛత్రాధి పత్యమును, అణిమాద్యష్టసిద్ధులను, మోక్షమును గోరను.

అజాతపక్షా ఇవ మాతరం ఖగాః
స్తన్యం యథా వత్సతరాః క్షుధార్తాః ।
ప్రియః ప్రియేవ వ్యుషితం విషణ్ణా
మనోఽరవిన్దాక్ష దిదృక్షతే త్వామ్ ॥ 26

కమలనయనా! ఱెక్కలు కలుగని పక్షులపిల్లలు తల్లిరాకకై యెదురుచూచుచున్నట్లు, త్రాటిచే గట్టివేయబడిన దూడలు ఆకలిచేపీడింపబడినవియై స్తన్యమును త్రాగుట కాతురత జెందునట్లు, విషణ్ణ యగు ప్రేయసి ప్రవాసములోనున్న పతిని దర్శింప నభిలషించునట్లు నామనస్సు గూడ నిన్నే దర్శింప నుత్సుకత జెందుచున్నది.

మమోత్తమఃశ్లోకజనేషు సఖ్యం
సంసారచక్రే భ్రమతః స్వకర్మభిః ।
త్వన్మాయయాత్మాత్మజదారగేహే -
ష్వాసక్తచిత్తస్య న నాథ భూయాత్ ॥ 27

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే వృత్రవాక్యనామ
ఏకాదశోఽధ్యాయః ॥

నాథా! కర్మవశమున నేనుసంసారమున దిరుగుచున్నాను. అందువలన నాకుపుణ్యకీర్తులగు నీభక్తులతోడి సాంగత్యము కలుగుగాక! నీమాయచే నాచిత్తము దేహపుత్రకళత్ర గృహాదులయందు ప్రస్తుత మాసక్తమైయున్నది. వానియం దిక నా కాసక్తి కలుగకుండుగాక!

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములోని
వృత్రవాక్య మను పదునొకండవ అధ్యాయము
సంపూర్ణము.

# పండ్రెండవ అధ్యాయము

## వృత్రాసురవధ

కథాసారము:- ఈ యధ్యాయమున వృత్రాసురునిచే బరిగొల్పబడినవాడై విషణ్ణహృదయుడగు నింద్రుడు వృత్రాసురుని వధించుట యను విషయము వర్ణింపబడినది.

వృత్రాసురుడు క్రుద్ధుడై భయంకర మగు శూలమును ఇంద్రునిపై విసరగా ఇంద్రుడు శతపర్వవిశిష్టమగు (నూఱుగణుపులతో గూడిన) వజ్రాయుధముచే నయ్యసురుని యొక భుజమును ఖండించెను. భుజము తెగిన వృత్రాసురుడు మరల లోహదండముచే నింద్రుని గొట్టగా వానిహస్తమునుండి వజ్రాయుధము జారిపడెను. ఇంద్రుడు సిగ్గుపడి మరల ఆయుధమును తీసికొనలేక పోయెను. అపుడు వృత్రాసురుడు మరల ఇంద్రుని యుత్తేజితు నిగ జేసి వజ్రాయుధమును గైకొని యుద్ధముచేయ వలసినదిగా ఆహ్వానించెను.

వృత్రాసురుడు పలికెను:- యుద్ధమున జయపరాజయములకు హేతువు సర్వకారణకారణుడగు భగవానుడొక్కడే. మూఢులగు వ్యక్తులు దాని నెఱుంగలేక తమనే జయపరాజయములకు గారణమని భావింతురు. వాస్తవములో సమస్తము భగవదధీనమే. ఆయనకు దప్ప మఱియెవ్వరికిని స్వాతంత్ర్యము లేదు. పురుషుడు, ప్రకృతి, కాలము మున్నగునవన్నియు భగవానుని యనుగ్రహము చేతనే సృష్టిచేయ సమర్థము లైయున్నవి. దానిని తెలిసికొనలేక అనీశ్వరులగు జీవులు తమనే యీశ్వరు డనిభావించుచుందురు. దాని నెఱింగిన జీవులు సుఖదుఃఖభయాదులకు లొంగరు.

ఇరువురు నిట్లు ధర్మకథను బలుకుచు ఉత్సాహితులై మరల యుద్ధమున ప్రవృత్తులైరి. ఈమారు యుద్ధమున మహాబలశాలి యగువృత్రాసురునిమఱియొక బాహువును ఇంద్రుడు ఖండించెను. అసురుడు భయంకరముగ నోటిని తెఱచి ఇంద్రుని కడకు వెడలి వాహనముతో గూడ నింద్రుని మ్రింగెను. కాని యింద్రుడు నారాయణ కవచ బలముచే నసురుని యుదరమునందుండియు తన్ను రక్షించుకొన గలిగెను. ఇంద్రుడు వృత్రాసురుని యుదరమునుండి బయల్వెడలి మిగుల వేగవంత మగు వజ్రాయుధముతో వృత్రాసురుని మస్తకమును ఖండించెను. వృత్రాసురునిశిరస్సును ఖండించుటకు ఇంద్రున కొక్క సంవత్సరకాలము పట్టెను.

## శ్రీఋషిరువాచ

ఏవం జిహాసుర్నృప దేహమాజౌ
మృత్యుం వరం విజయాన్మన్యమానః।
శూలం ప్రగృహ్యాభ్యపతత్సురేన్ద్రం
యథా మహాపురుషం కైటభోఽప్సు ॥ 1

శుకమహర్షి పలికెను :- రాజా! యుద్ధమున విజయముకంటె మృత్యువునే శ్రేష్ఠమైన దని భావించి తనకళేబరమును త్యజింపదలచి వృత్రాసురుడు శూలమును దీసికొని ప్రళయజలమున కైటభదైత్యుడు విష్ణువుపైకి బరుగిడినట్లు దేవేంద్రునిపైకి లంఘించెను.

తతో యుగాన్తాగ్నికఠోరజిహ్వ -
మావిధ్య శూలం తరసాసురేన్ద్రః ।
క్షిప్త్వా మహేన్ద్రాయ వినద్య వీరో
హతోఽసి పాపేతి రుషా జగాద ॥ 2

పిమ్మట అసురశ్రేష్ఠుడు, మహావీరుడు నగు వృత్రాసురుడు యుగాంతకాలాగ్ని శిఖవలె కఠోరాగ్రములు గలశూలమును ద్రిప్పుచు అతివేగముతో కోపముతో నింద్రునిపైకి విసరి బిగ్గరగా "ఓరీ! పాపీ! నీవు నా చేతిలో జచ్చితి" వని పలికెను.

ఖ ఆపతత్ తద్విచలద్గ్రహోల్కవ -
న్నిరీక్ష్య దుష్ప్రేక్ష్యమజాతవిక్లబః ।
వజ్రేణ వజ్రీ శతపర్వణాచ్ఛిన -
ద్భుజంచ తస్యోరగరాజభోగమ్ ॥ 3

గ్రహమువలె,తోకచుక్కవలె దుర్నిరీక్ష్య మగు నాశూల మాకాశమార్గమున దిరుగుచు వచ్చుట చూచి యింద్రుడు నిర్భయచిత్తముతో శతపర్వవిశిష్ట మగు వజ్రాయుధముచే దానిని ఛేదించెను. దానితోపాటు సర్పరాజగు వాసుకిశరీరమువలె విశాలమైన వానియొక భుజమును గూడ ఛేదించెను.

ఛిన్నైకబాహుః పరిఘేణ వృత్రః
సంరబ్ధ ఆసాద్య గృహీతవజ్రమ్ ।
హనౌ తతాడేన్ద్రమథామరేభం
వజ్రం చ హస్తాన్న్యపతన్మఘోనః ॥ 4

ఒకబాహువు ఖండితము కాగా వృత్రాసురుడు క్రుద్ధుడై వజ్రాయుధధారియగు ఇంద్రునికడకు వెడలి పరిఘచే వానిదవుడపై భయంకరముగ గొట్టెను. దానితో ఐరావతమును గూడ గొట్టెను. ఆదెబ్బచే ఇంద్రుని హస్తమునుండి వజ్రాయుధము జారిపడెను.

వృత్రస్య కర్మాతిమహాద్భుతం తత్
సురాసురాశ్చారణసిద్ధసఙ్ఘాః ।
అపూజయంస్తత్ పురుహూతసంకటం
నిరీక్ష్య హాహేతి విచుక్రుశుర్భృశమ్ ॥ 5

వృత్రాసురుని యీయద్భుతకార్యమును జూచి సురాసురులు, చారణులు, సిద్ధులు వాని నెక్కువగ బ్రసంసించిరి. కాని దేవేంద్రునివిపత్తును జూచి హాహాకారములు జేయుచు విలపింపసాగిరి.

ఇంద్రో న వజ్రం జగృహే విలజ్జిత -
శ్చ్యుతం స్వహస్తాదరిసన్నిధౌ పునః ।
తమాహ వృత్రో హర ఆత్తవజ్రో
జహి స్వశత్రుం న విషాదకాలః ॥ 6

శత్రువునెదుట చేతిలోనుండి వజ్రాయుధము జారిపోవుటచే సిగ్గుపడి యింద్రుడు దానిని మరల గైకొనలేదు. అపుడు వృత్రాసురుడు ఇంద్రుని సంబోధించుచు "ఇంద్రా! వజ్రాయుధమును తీసికొనుము. నీశత్రువును సంహరింపుము, ఇది దుఃఖపడుటకు సమయము కాదు" అని పలికెను.

యుయుత్సతాం కుత్రచిదాతతాయినాం
జయః సదైకత్ర న వై పరాత్మనామ్ ।
వినైకముత్పత్తిలయస్థితీశ్వరం
సర్వజ్ఞమాద్యం పురుషం సనాతనమ్ ॥ 7

ఇంద్రుడా! ఉత్పత్తిస్థితిలయముల నొనర్చువాడు, సర్వజ్ఞుడు, అనాది, సనాతనుడు, నగుభగవంతునకు గాక దేహధారులు లేదా పరతంత్రులు, జీవాత్ములు, యుద్ధాభిలాషులు నగు శత్రువుల కెల్లపుడు జయము కలుగు నను నియమము లేదు. ఒకచోట జయము, మఱియొకచోట పరాజయము కలుగును.

లోకాః సపాలా యస్యేమే శ్వసన్తి వివశా వశే ।
ద్విజా ఇవ శిచా బద్ధాః స కాల ఇహ కారణమ్ ॥ 8

లోకపాలురతో పాటు ఈ లోకము లెవరియధీనములో నుండి వలలో జిక్కుకొనిన పక్షులవలె వివశభావముతో వర్తించుచున్నవో ఆకాలము అనగా భగవానుడె జయపరా జయముల కేకైకకారణ మైయున్నాడు.

**ఓజః సహో బలం ప్రాణమమృతం మృత్యుమేవ చ ।**
**తమజ్ఞాయ జనో హేతుమాత్మానం మన్యతే జడమ్ ॥ 9**

ఓజస్సు (ఇంద్రియశక్తి), మనశ్శక్తి, బలము (శరీరశక్తి), ప్రాణములు, అమృతము, మృత్యువు అనువానికి హేతువగు ఆభగవాను నెఱుంగక మూఢజను లాజడదేహమునె జయపరాజయములకు హేతువని తలంచుచుందురు.

**యథా దారుమయీ నారీ యథా పత్రమయో మృగః ।**
**ఏవంభూతాని మఘవన్నీశతన్త్రాణి విద్ధి భోః ॥ 10**

ఇంద్రా! దారుమయి యగు నారి (కొయ్యతో జేయబడిన బొమ్మ), పత్రమయమగు మృగము (లేడి) స్వేచ్ఛగ నృత్యాదికములను జేయజాలక నర్తకునియిచ్ఛ ననుసరించి నృత్యము చేయును. అట్లే సర్వవస్తువుల భగవానునియధీనమందే యున్నవి. వేనికిని స్వాతంత్ర్యము లేదు.

**పురుషః ప్రకృతిర్వ్యక్తమాత్మా భూతేన్ద్రియాశయాః ।**
**శక్నువన్త్యస్య సర్గాదౌ న వినా యదనుగ్రహాత్ ॥ 11**

పురుషుడు, ప్రకృతి, మహత్తత్వము, అహంకారము, ఆకాశాది పంచభూతములు, చక్షురాదీంద్రియములు,మనస్సు, బుద్ధి, చిత్తము - అను నీవస్తువు లన్నియు భగవదను గ్రహము లేనిదే సృష్ట్యాదికార్యములను జేయజాలవు.

**అవిద్వానేవమాత్మానం మన్యతేఽనీశమీశ్వరమ్ ।**
**భూతైః సృజతి భూతాని గ్రసతే తాని తైః స్వయమ్ ॥ 12**

అందువలన సర్వనియంతయు, స్వతంత్రుడు నగునీశ్వరుని ఎఱుంగలేక అనీశ్వరుడగు (పరాధీనుడగు) జీవుడు తన్ను స్వతంత్రు డగు నీశ్వరునిగ దలంచును. కర్మసహకారముతో పిత్రాదులె స్రష్టలు, వ్యాఘ్రాదులె హంతకులు - అనిభావించుట సంగతము కాదు. ఏలయన, భగవానుడె భూతములచే భూతములను సృష్టించుచు, ఆభూతములద్వారానే భూతములను నాశముచేయును. అందువలన భూతముల కెట్టి స్వాతంత్ర్యము లేదు. ఈశ్వరుడె స్వతంత్రుడు.

**ఆయుః శ్రీః కీర్తిరైశ్వర్యమాశిషః పురుషస్య యాః ।**
**భవన్త్యేవ హి తత్కాలే యథానిచ్ఛోర్విపర్యయాః ॥ 13**

ఇష్టము లేకపోయినను వినాశకాలము రాగా పురుషుని ఆయువు, సంపద, కీర్తి మున్నగువానికి హాని కలుగును. అట్లే జయకాలమునందును ప్రయత్నములేకయే మానవునకు ఆయువు, సంపద, కీర్తి లభించును.

తస్మాదకీర్తి యశసోర్జయాపజయయోరపి ।
సమః స్యాత్సుఖదుఃఖాభ్యాం మృత్యుర్జీవితయోస్తథా ॥ 14

అందువలన సర్వము ఈశ్వరాధీన మని తలంచి కీర్త్యపకీర్తులు, జయాపజయములు, చావుబ్రతుకులు, వీనికార్యములు, సుఖదుఃఖములు మున్నగు సర్వావస్థలయందు సమభావముగ నుండవలెను.

సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్నాత్మనో గుణాః।
తత్ర సాక్షిణమాత్మానం యో వేద స న బధ్యతే ॥ 15

సత్త్వరజస్తమస్సు లనుమూడు ప్రకృతిగుణములు, ఆత్మగుణములు కావు. ఈ సత్త్వాదులపరిణామభూత మగు దేహమునం దున్న ఆత్మను కేవలము సాక్షిగనే భావించువాడు హర్షవిషాదములయందు లగ్నముగాడు.

పశ్య మాం నిర్జితం శక్ర వృక్ణాయుధభుజం మృధే ।
ఘటమానం యథాశక్తి తవ ప్రాణజిహీర్షయా ॥ 16

ఇంద్రా! చూడుము, యుద్ధమున నా ఆయుధము భుజము ఖండితము లైనవి. నీవు నన్నొంటరిగ నోడించితివి. అయినను నేనునీప్రాణములను హరించునుద్దేశ్యముతో యుద్ధమున చేతనైన ప్రయత్నముచేసితిని. ఏమాత్రము నాకువిషాదము కలుగలేదు. నీవుగూడ నిట్లు విషాదమును బొందవలదు.

ప్రాణగ్లహోఽయం సమర ఇష్వక్షో వాహనాసనః ।
అత్ర న జ్ఞాయతేఽముష్య జయోఽముష్య పరాజయః । 17

ఓ యింద్రా! ఈ యుద్ధమును ద్యూతక్రీడవలె భావింపవలెను. దీని యందు ప్రాణమే పణము, బాణములే పాచికలు, వాహనము లైన ఏనుగులు, గుఱ్ఱములు మున్నగు నవే చదరంగపుబల్ల. పాచికలాటవలె దీనియం దెవరికి గెలుపు, ఎవరికి ఓటమి గలుగునో తెలియదు.

## శ్రీశుక ఉవాచ

ఇన్ద్రో వృత్రవచః శ్రుత్వా గతాలీకమపూజయత్ ।
గృహీతవజ్రః ప్రహసంస్తమాహ గతవిస్మయః ॥ 18

శుకుడు పలికెను:- ఇంద్రుడు వృత్రాసురుడు పలుకు కపటములేని మాటలను విని వజ్రాయుధమును గైకొని వానిని ప్రసంశింపసాగెను. పిమ్మట విస్మయమును విడచి నవ్వుచు వృత్రాసురునితో నిట్లు పలికెను.

**అహో దానవ సిద్ధోఽసి యస్య తే మతిరీదృశీ ।**
**భక్తః సర్వాత్మనాత్మానం సుహృదం జగదీశ్వరమ్ ॥ 19**

ఇంద్రుడు పలికెను :- దానవా! ఇట్టి సంకటస్థితిలో నున్నను నీకు వివేకధైర్యభక్త్యాది యుక్తము అలౌకికము నగు మనస్సున్నది. అందువలన నీవు కృతార్థుడ వైతివి. నీవు సర్వాత్ముడు, సర్వసుహృదుడు నగు జగదీశ్వరుని అనన్యభావముతో సేవించితివి.

**భవానతార్షీన్మాయాం వై వైష్ణవీం జనమోహినీమ్ ।**
**యద్విహాయాసురం భావం మహాపురుషతాం గతః ॥ 20**

ఆహా! నీవు జనమోహిని యగు వైష్ణవమాయను దాటితివి. అసుర భావమును నాశముచేసి జ్ఞానవైరాగ్యభక్తియుక్త మగుమహాపురుషభావమును బొందితివిగదా!

**ఖల్విదం మహాశ్చర్యం యద్రజఃప్రకృతేస్తవ ।**
**వాసుదేవే భగవతి సత్త్వాత్మని దృఢా మతిః ॥ 21**

రజః ప్రకృతిసంపన్నుడ వగు నీకు సత్త్వమూర్తి యగు వాసుదేవుని యందు దృఢభక్తి కలిగినది. వాస్తవములో నిది యొకగొప్ప ఆశ్చర్యకరమైన విషయము.

**యస్య భక్తిర్భగవతి హరౌ నిశ్శ్రేయసేశ్వరే ।**
**విక్రీడతోఽమృతామ్భోధౌ కిం క్షుద్రైః ఖాతకోదకైః ॥ 22**

పరమమంగళాధిపతి యగు శ్రీహరియందు భక్తి కలవాడు అమృత సాగరమున క్రీడించును. క్షుద్రమైన గర్తములోని (గుంటలోని) నీటివంటి స్వర్గాదులచే వాని కేమిప్రయోజనముండును?

## శ్రీశుక ఉవాచ

**ఇతి బ్రువాణావన్యోఽన్యం ధర్మజిజ్ఞాసయా నృప ।**
**యుయుధాతే మహావీర్యావిన్ద్రవృత్రౌ యుధాం పతీ ॥ 23**

శుకుడు పలికెను :- రాజా! వృత్రాసురుడు ఇంద్రుడు పరస్పరము ధర్మజ్ఞానేచ్ఛులై యీ విధముగ బలుకుచు యుద్ధము చేయనారంభించిరి. వారిరువురు గొప్పయోధులు, మహాపరాక్రమవంతులు.

అవిధ్య పరిఘం వృత్రః కార్ష్ణాయసమరిన్దమః ।
ఇన్ద్రాయ ప్రాహిణోద్ఘోరం వామహస్తేన మారిష ॥ 24

మారిషా! (రాజా) అరిందము డగు వృత్రాసురుడు లోహనిర్మిత మగు పరిఘ యను ఆయుధమును ఎడమచేతితో త్రిప్పుచు ఇంద్రునిపైకి విసరెను.

స తు వృత్రస్య పరిఘం కరంచ పరిఘోపమమ్ ।
చిచ్ఛేద యుగపద్దేవో వజ్రేణ శతపర్వణా ॥ 25

ఇంద్రుడుగూడ తనవజ్రాయుధముతో ఒకేసమయమున వృత్రుడు విసరిన పరిఘను వానివామహస్తమును ఛేదించెను.

దోర్భ్యాముత్కృత్తమూలాభ్యాం బభౌ రక్తస్రవోఽసురః ।
ఛిన్నపక్షో యథా గోత్రః ఖాద్భ్రష్టో వజ్రిణా హతః ॥ 26

ఛిన్నమూల మైన యా బాహుయుగళమునుండి రక్తము స్రవించుచుండగా వృత్రాసురుడు ఇంద్రునివజ్రాఘాతముచే ఆకసమునుండి క్రిందబడిన రెక్కలు తెగిన పర్వతమువలె శోభిల్లుచుండెను.

మహాప్రాణో మహావీర్యో మహాసర్ప ఇవ ద్విపమ్
కృత్వాధరాం హనుం భూమౌ దైత్యే దివ్యుత్తరాం హనుమ్ ।
నభోగమ్భీరవక్త్రేణ లేలిహోల్బణజిహ్వయా ॥ 27

దంష్ట్రాభిః కాలకల్పాభిర్గ్రసన్నివ జగత్త్రయమ్ ।
అతిమాత్రమహాకాయ ఆక్షిపంస్తరసా గిరీన్ ॥ 28

గిరిరాట్పాదచారీవ పద్భ్యాం నిర్జరయన్మహీమ్।
జగ్రాస స సమాసాద్య వజ్రిణం సహవాహనమ్ ॥ 29

మహాప్రభావసంపన్నుడు, అత్యంత బలశాలియు నగు వృత్రాసురుడు క్రిందదవుడను భూమియందుంచి పైదవుడను స్వర్గము (ఆకాశము)వరకు వ్యాపింపజేసి ఆకాశమువలె లోతైన వదనముచేత, సర్పమువంటి భయంకరమగు జిహ్వచేత, మృత్యు తుల్యము లగు భయంకరదంష్ట్రలచేత ముల్లోకములను మ్రింగుట కుద్యుక్తు డయ్యెను. మిక్కిలి యున్నత కాయుడగు నయ్యసురుడు వేగముగ పర్వతములను గదలించుచు, పాదములద్వారా భూమిని పొడిపొడిగ త్రొక్కుచు పాదచారి యగు గిరిరాజువలె నింద్రుని కడకువచ్చి

మహాకాయము గలదియు, మహాబలశాలియు నగు కొండచిలువ ఏనుగును మ్రింగునట్లు వాహన సహితు డగు నింద్రుని మ్రింగెను.

వృత్రగ్రస్తం తమాలోక్య సప్రజాపతయః సురాః ।
హా కష్టమితి నిర్విణ్ణాశ్చుక్రుశుః సమహర్షయః ॥ 30

ఇంద్రు డసురునిచే మ్రింగబడుట చూచి ప్రజాపతులతోను మహర్షుల తోను గూడిన దేవతలు దుఃఖితాంతఃకరణులై ఎంతకష్టమెంతకష్ట మనుచు దుఃఖింపసాగిరి.

నిగీర్ణోఽప్యసురేన్ద్రేణ న మమారోదరం గతః ।
మహాపురుషసన్నద్ధో యోగమాయాబలేన చ ॥ 31

నారాయణాభిన్న మగు నారాయణ కవచముచే నావృతుడై యుండుట చేత, యోగమాయాబలముచేత ఇంద్రు డసురునియుదరములో నున్నను మరణింపలేదు.

భిత్వా వజ్రేణ తత్కుక్షిం నిష్క్రమ్య బలభిద్విభుః ।
ఉచ్చకర్త శిరః శత్రోర్గిరిశృఙ్గమివౌజసా ॥ 32

ప్రభావశాలి యగు నింద్రుడు వజ్రాయుధముచే వాని యుదరమును భేదించి బయల్వెడలి వేగముగ పర్వతశిఖరమువంటి వృత్రాసురుని శిరస్సును ఖండించెను.

వజ్రస్తు తత్కన్ధరమాశువేగః
కృన్తన్ సమన్తాత్పరివర్తమానః ।
న్యపాతయత్ తావదహర్గణేన
యో జ్యోతిషామయనే వార్త్రహత్యే ॥ 33

వజ్రాయుధము మిగుల వేగముగలది యయ్యును వృత్రాసురుని కంఠమునకు నలువైపుల తిరుగుచు దానిని ఛేదించుట కొక్క సంవత్సరకాల మా యాయుధమునకు బట్టెను. అనగా సూర్యాదుల కాల మగు ఉత్తరదక్షిణాయనములయందు మూడువందల యరువది దినములు గడవగా వృత్రాసుర సంహారమునకు దగినకాలము కలిగెను. అపుడు వజ్రాయుధముచే వృత్రాసురుని మస్తకము తెగి భూమిపైబడెను.

తదా చ ఖే దున్దుభయో వినేదు -
ర్గన్ధర్వసిద్ధాః సమహర్షిసంఘాః ।
వార్త్రఘ్నలిఙ్గైస్తమభిష్టువానా
మన్త్రైర్ముదా కుసుమైరభ్యవర్షన్ ॥ 34

వృత్రాసురుడు నిహతుడు కాగా స్వర్గమున దుందుభులు మ్రోగినవి. గంధర్వులు, సిద్ధులు, మహర్షులు వృత్రహంతప్రకాశకములైన మంత్రములతో నింద్రుని స్తుతించుచు హర్షముతో బుష్పవృష్టిని గురిపించిరి.

వృత్రస్య దేహాన్నిష్క్రాన్తమాత్మజ్యోతిరరిన్దమ ।
పశ్యతాం సర్వదేవానామలోకం సమపద్యత ॥ 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే వృత్రవధో నామ
ద్వాదశోఽధ్యాయః

రాజా! అప్పుడు వృత్రాసురుడు దేహమునండి జీవరూప మగు నాత్మజ్యోతి బయల్వెడలి అనగా పార్షదదేహము ప్రకాశితమై సర్వదేవతల యెదుట లోకాతీతు డగు సంకర్షణభగవానుని బొందెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములోని
వృత్రాసుర వధ యను పంద్రెండవ అధ్యాయము
సంపూర్ణము.

# పదుమూడవ అధ్యాయము

## ఇంద్రుడు బ్రహ్మహత్యాపాపగ్రస్తు డగుట

కథాసారము:- ఈ యధ్యాయమున వృత్రాసుర బ్రాహ్మణుని వధించి బ్రహ్మహత్యా భయముచే నింద్రుడు పలాయను డగుట, విష్ణుభగవాను డాతనిని రక్షించుట యను విషయములు వర్ణింపబడినవి.

వృత్రాసురుని వధింపవలసినదిగా దేవత లింద్రుని యాదేశింపగా బ్రహ్మహత్యా భయముచే ఇంద్రుడు మొదట అంగీకరింపలేదు. ఇంద్రుడు వృత్రవధ కిష్టపడక పోవుటచే దేవతలు ఆతనితో నిట్లుపలికిరి-"వృత్రాసుర బ్రాహ్మణుని వధించి బ్రహ్మహత్యా జనితపాపమునకు భయపడవలసిన పనిలేదు. ఏలయన, నారాయణుని నామాభాస మాత్రముచే స్త్రీహత్య, గోహత్య, బ్రహ్మహత్య మున్నగు సర్వపాపముల నుండి విముక్తుడగును. ఆనారాయణుని అశ్వమేధయజ్ఞముచే నారాధించినచో తుచ్ఛమగు వృత్రవధను గుఱించి చెప్పునదేమి సర్వజగత్తును నాశము చేసినను దానివలన గలుగు పాపమునుండి ముక్తుడు కాగలడు.

దేవతల ప్రోత్సాహముచే నింద్రుడు వృత్రవధయందు ప్రవృత్తుడయ్యెను. ఇంద్ర యుద్ధమున వృత్రాసురుడు నిహతుడు కాగా దేవతలతోపాటు సర్వజగత్తునకు సుఖము కలిగినను ఇంద్రునకు మాత్రము సుఖము కలుగలేదు. దూష్యమగు కార్యము నొనర్చి యైశ్వర్యమును బొందినను లజ్జాశీలు డగు వ్యక్తి దానివలన సుఖపడజాలడు. ముఖ్యముగ బ్రహ్మహత్య వలన గలిగిన పాపము ఇంద్రుని యాశ్రయించెను. అతడు మూర్తిమంత మగు బ్రహహత్యాజనితమగు పాపమునుండి విముక్తిపొందు నుపాయమును గూర్చి ఆలోచించుచు నలువైపుల పరుగిడసాగెను. అనంతరము మానససరోవరమున లక్ష్మిచే సంరక్షితుడై యచట వేయిసంవత్సరములకాలము నివసించెను. ఆసమయమున నహుషుడు స్వర్గమున నింద్రునకు ప్రతినిధి రూపముగ పనిజేయుచు ఇంద్రునిభార్య యగు శచీదేవిపట్ల చేసిన భోగవృద్ధిజనిత మగు అపరాధముచే సర్పయోనిని బొందెను. పిమ్మట ఇంద్రుడు బ్రహ్మర్షులచే ప్రేరితుడై నారాయణారాధన రూప మగు యజ్ఞమున దీక్షితుడై బ్రహ్మహత్య యను పాపమునుండి ముక్తుడయ్యెను. ఈప్రసంగముతో నీయధ్యాయము సమాప్తమగును.

### శ్రీశుక ఉవాచ

వృత్రే హతే త్రయో లోకా వినా శక్రేణ భూరిద ।
సపాలా హ్యభవన్ సద్యో విజ్వరా నిర్వృతేన్ద్రియాః ॥ 1

శుకుడు పలికెను :- అధికదానశీలుడ వగు రాజా! వృత్రాసురుడు నిహతుడు కాగా ఒక్కయింద్రుడుతప్ప లోకపాలురతో పాటు ముల్లోకములు వెంటనే సంతాపరహితములు ఆనందభరితములు నయ్యెను.

దేవర్షి పితృభూతాని దైత్యా దేవానుగాః స్వయమ్ ।
ప్రతిజగ్ముఃస్వధిష్ణ్యాని బ్రహ్మేశేన్ద్రాదయస్తతః ॥ 2

అనంతరము దేవతలు, ఋషులు, పితరులు, భూతములు, దైత్యులు, దేవానుచరులు, బ్రహ్మ, మహేశ్వరుడు, ఇంద్రుడు మున్నగు వారందఱు తమతమస్థానములకు వెడలిరి. (వెడలునపుడు వారెవ్వరును ఇంద్రునితో మాటలాడలేదు.)

## శ్రీరాజోవాచ

ఇన్ద్రస్యానివృతేర్హేతుం శ్రోతుమిచ్ఛామి భో మునే ।
యేనాసన్ సుఖినో దేవా హరేర్దుఃఖం కుతోఽభవత్ ॥ 3

పరీక్షిన్మహారాజు పలికెను :- ఓ మునీ! ఇంద్రుని దుఃఖమునకు గారణమేమి? దానిని వినగోరుచున్నాను. వృత్రవధకు దేవత లందఱు సంతోషించుచున్న ఇంద్రుడేల దుఃఖము ననుభవించెను?

## శ్రీశుక ఉవాచ

వృత్రవిక్రమసంవిగ్నాః సర్వే దేవాః సహర్షిభిః ।
తద్వధాయార్థయన్నిన్ద్రం నైచ్ఛద్భీతో బృహద్వధాత్ ॥ 4

శుకుడు పలికెను:- సర్వఋషులు, దేవతలు వృత్రాసురుని పరాక్రమముచే నుద్విగ్నులై వానివధకై యింద్రుని ప్రార్థింపగా ఇంద్రుడు బ్రహ్మవధకు భయపడినవాడై దాని నంగీకరింప లేదు.

## ఇన్ద్ర ఉవాచ

స్త్రీభూద్రుమజలైరేనో విశ్వరూపవధోద్భవమ్ ।
విభక్తమనుగృహ్ణద్భిర్వృత్రహత్యాం క్వ మార్జ్మ్యహమ్ ॥ 5

ఇంద్రుడు పలికెను:- విశ్వరూపవధవలన నాకుగలిగిన పాపమును స్త్రీ, భూమి, వృక్షములు, జలములు దయతో విభజించి స్వీకరించినవి. కాని యిపుడు వృత్రుని వధించి యాబ్రహ్మహత్యారూపపాపము నెవరికి యిచ్చి దానినుండి విముక్తుడ నగుదును?

## శ్రీశుక ఉవాచ

ఋషయస్తదుపాకర్ణ్య మహేన్ద్రమిదమబ్రువన్।
యాజయిష్యామ భద్రం తే హయమేధేన మాస్మ భైః ॥ 6

శుకుడు పలికెను :- ఋషులు దేవేంద్రుడు పలికిన యామాటలు విని యిట్లనిరి 'దేవరాజా! నీకు శుభమగు గాక! నీవు దానికై భయపడబనిలదు. మేము నీచే నశ్వమేధ యజ్ఞమును జేయింతుము. దానివలన నీవు సర్వపాపవినిర్ముక్తుడ వగుదువు.

హయమేధేన పురుషం పరమాత్మానమీశ్వరమ్ ।
ఇష్ట్వా నారాయణం దేవం మోక్ష్యసేఽపి జగద్వధాత్ ॥ 7

నీ వశ్వమేధయజ్ఞముచే పరమపురుషుడు, పరమాత్మయు, ఈశ్వరుడు నగు నారాయణుని అర్చించినచో తుచ్ఛమగు వృత్రవధపాపమును గురించి చెప్పునదేమి? సమస్తజగద్వధజనిత మగు పాపమునుండియు ముక్తుడ వగుదువు.

బ్రహ్మహా పితృహా గోఘ్నో మాతృహాచార్యహాఘవాన్ ।
శ్వాదః పుల్కసకో వాపి శుధ్యేరన్ యస్య కీర్తనాత్ ॥ 8

తమశ్వమేధేన మహామఖేన
శ్రద్ధాన్వితోఽస్మాభిరనుష్ఠితేన ।
హత్వాపి సబ్రహ్మచరాచరం త్వం
న లిప్యసే కిం ఖలనిగ్రహేణ ॥ 9

బ్రహ్మహంతకుడు, గోహంతకుడు, పితృహంతకుడు, మాతృహంతకుడు, ఆచార్య హంతకుడు నగు మహాపాపియు, కుక్కమాంసమును దినువాడగు చండాలుడు గూడ నీవు మాచే ననుష్ఠింపబడు నీయశ్వమేధయజ్ఞముద్వారా ఆ భగవానుని సేవించినచో బ్రాహ్మణు నితోపాటు సర్వచరాచరప్రాణులను సంహరించినను ఆ పాపమునీకుకలుగదు. దుష్టుడగు వృత్రాసురుని వధించుటవలన కలుగు పాపమునుగూర్చి యిక చెప్పునదేమి?

## శ్రీశుక ఉవాచ

ఏవం సంచోదితో విప్రైర్మరుత్వానహనద్రిపుమ్ ।
బ్రహ్మహత్యా హతే తస్మిన్నాససాద వృషాకపిమ్ ॥ 10

శుకుడు పలికెను :- ఋషులచే నిట్లు ప్రేరేపింపబడినవాడై యింద్రుడు శత్రువగు వృత్రాసురుని వధించెను. కాని వృత్రాసురుడు విహతుడు కాగా ఆ బ్రహ్మహత్యాపాప మింద్రుని యాశ్రయించెను.

తయేన్ద్రః స్మాసహత్ తాపం నిర్వృతిర్నాముమావిశత్ ।
హ్రీమన్తం వాచ్యతాం ప్రాప్తం సుఖయన్త్యపి నో గుణాః ॥ 11

దేవతల ప్రేరణచే నింద్రుడు బ్రహ్మహత్యచేసి దానివలన సంతాపమును బొందెను. అందువలన వృత్రాసుర వధవలన కలుగు సుఖ మాతనికి లభింపలేదు. ఏదియోనొక నిందనీయమగు కార్యమొనర్చి యైశ్వర్యాదులను బొందినను లజ్జాశీలుడగు వ్యక్తి వానివలన సుఖపడజాలడు.

తాం దదర్శానుధావన్తీం చాణ్డాలీమివరూపిణీమ్ ।
జరయా వేపమానాఙ్గీం యక్ష్మగ్రస్తామసృక్పటామ్ ॥ 12
వికీర్య పలితాన్ కేశాం స్తిష్ఠతిష్ఠేతి భాషిణీమ్ ।
మీనగన్ధ్యసుగన్ధేన కుర్వతీం మార్గదూషణమ్ ॥ 13

చండాలస్త్రీవలె మూర్తిమంతమైనదియు, వార్ధక్యముచే వణకుచున్న యవయవములు గలదియు, క్షయరోగముతో గూడినదియు, రక్తముచే దడిసిన వస్త్రములు గలదియు, తెల్లనిజుట్టును విరబోసికొని తన వెంటబడి 'నిలు నిలు' మని పలుకుచున్నదియు, మత్స్య గంధమువలె చెడువాసనగల శ్వాసలను విడచుచు మార్గమునుగూడ దుర్గంధముగ జేయుచు వచ్చుచున్నదియు నగు బ్రహ్మహత్యను ఇంద్రుడు చూచెను.

నభో గతో దిశః సర్వాః సహస్రాక్షో విశాంపతే ।
ప్రాగుదీచీం దిశం తూర్ణం ప్రవిష్టో నృప మానసమ్ ॥ 14

రాజా! ఇంద్రుడు మొదట ఆకాశమునకు వెడలెను. అచటినుండి దానిని జూచి పిమ్మట సర్వదిక్కులకు వెడలెను. అంతటనుదానినే చూచెను. పిమ్మట వేగముగ ఉత్తరపూర్వ కోణమునకు (ఈశాన్యదిక్కుగ) వెడలి మానససరోవరమున బ్రవేశించెను.

స ఆవసత్పుష్కరనాలతన్తు -
నలబ్ధభోగో యదిహాగ్నిదూతః ।
వర్షాణి సాహస్రమలక్షితోఽన్తః
సంచిన్తయన్ బ్రహ్మవధాద్విమోక్షమ్ ॥ 15

ఇంద్రుడామానససరోవరమున నితరులకు గనబడకుండగ బ్రహ్మ హత్యవలన గలిగిన పాపమునుండి విముక్తుడగుట కుపాయము నాలోచించుచు పద్మనాళమున వేయి సంవత్సరముల కాలము నివసించెను. అగ్ని ఆయనకై యజ్ఞభాగమును దెచ్చుచుండును. కాని యతడు జలములలో ప్రవేశించుట యసంభవము. అందువలన చాలకాలము దేవేంద్రుడు భోగశూన్యుడుగనే యుండెను.

తావత్ త్రినాకం నహుషః శశాస
విద్యాతపోయోగబలానుభావః ।
స సమ్పదైశ్వర్యమదాన్ధబుద్ధి -
ర్నీతస్తిరశ్చాం గతిమిన్ద్రపత్న్యా ॥ 16

ఇంద్రుడు జలములో పద్మనాళమున దాగియున్నంతవరకు విద్యాతపోయోగబలముచే స్వర్గ పాలనశక్తి సంపన్నుడగు నహుషుడే స్వర్గరాజ్యమును పాలించెను. కాని యానహుషుడు ఐశ్వర్యగర్వముచే హతబుద్ధి యగుటచే ఇంద్రునిభార్య యగు శచీదేవి వానికి సర్పయోనిని గలుగజేసినది. అనగా నహుషు డైశ్వర్యమదముచే మత్తుడై యింద్రునిభార్య యగు శచీదేవి ననుభవింపవలయు ననితలంచుటచే బ్రాహ్మణశాపమువలన సర్పయోనిని బొందెను.

తతో గతో బ్రహ్మగిరోపహూత
ఋతమ్భరధ్యాననివారితాఘః ।
పాపస్తు దిగ్దేవతయా హతౌజా -
స్తం నాభ్యభూదవితం విష్ణుపత్న్యా ॥ 17

అనంతరము దేవేంద్రుడు సత్యపాలకు డగుశ్రీహరి నారాధించి బ్రహ్మహత్యాపాపము నుండి ముక్తుడయ్యెను. బ్రాహ్మణవాక్కులచే నాహ్వానితుడై మరల స్వర్గమును బొందెను. బ్రహ్మహత్యవలన గలిగిన పాపము దిగ్దేవతల యొక్క, రుద్రునియొక్క ప్రభావమున ప్రభావిహీన మగుటచే మానససరోవరమునందలి కమలవనమున నున్న లక్ష్మీదేవిద్వారా సంరక్షితుడై యున్న దేవేంద్రుని పరాభూతము చేయలేకపోయినది.

తం చ బ్రహ్మర్షయోఽభ్యేత్య హయమేధేన భారత ।
యథావద్దీక్షయాంచక్రుః పురుషారాధనేన హ ॥ 18

రాజా! దేవేంద్రుడు స్వర్గమునకు రాగా బ్రహ్మర్షు లాయనకడకు వెడలి నారాయణ ఆరాధనము ప్రధానముగా గల అశ్వమేధయజ్ఞమున ఆయనను దీక్షితునిగ జేసిరి.

అథేజ్యమానే పురుషే సర్వదేవమయాత్మని ।
అశ్వమేధే మహేన్ద్రేణ వితతే బ్రహ్మవాదిభిః ॥ 19
స వై త్వాష్ట్రవధో భూయానపి పాపచయో నృప ।
నీతస్తేనైవ శూన్యాయ నీహార ఇవ భానునా ॥ 20

పిమ్మట బ్రహ్మవాదులగు ఋషులచే ననుష్ఠింపబడిన అశ్వమేధ యజ్ఞమున దేవేంద్రుడు సర్వదేవమయుడు,పరమపురుషుడు నగు భగవానునర్చించెను. రాజా! దానిచే ఆవధవలన గలిగిన యాతనిపాపము మిక్కిలి ప్రబల మైనను సూర్యతేజస్సుచే నశించిన మంచువలె పూర్తిగ నశించెను.

స వాజిమేధేన యథోదితేన
వితాయమానేన మరీచిమిశ్రైః ।
ఇష్ట్వాధియజ్ఞం పురుషం పురాణ -
మిన్ద్రో మహానాస విధూతపాపః ॥ 21

మరీచి మున్నగు ఋషులచే యథావిధిగ నొనర్పబడిన అశ్వమేధ యజ్ఞమున యజ్ఞేశ్వరుడు పురాణపురుషుడు నగుభగవానుని యర్చించి పాపముక్తుడగుటచే నింద్రుడు (వెనుకటివలె) సకలలోక పూజ్యుడయ్యెను.

ఇదం మహాఖ్యానమశేషపాప్మనాం
ప్రక్షాళనం తీర్థపదానుకీర్తనమ్ ।
భక్త్యుచ్ఛ్రయం భక్తజనానువర్ణనం
మహేన్ద్రమోక్షం విజయం మరుత్వతః ॥ 22

పఠేయురాఖ్యానమిదం సదా బుధాః
శృణ్వన్త్యథో పర్వణి పర్వణీన్ద్రియమ్ ।
ధన్యం యశస్యం నిఖిలాఘమోచనం
రిపుంజయం స్వస్త్యయనం తథాయుషమ్ ॥ 23

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే ఇన్ద్రవిజయో నామ
త్రయోదశోఽధ్యాయః ॥

ఈయుపాఖ్యానము మిగుల విశిష్టమైనది. దీనియందు తీర్థపాదు డగు నారాయణుని మాహాత్మ్యము, భక్త్యుత్కర్షప్రతిపాదనము, భక్తజనుల విషయము, దేవేంద్రుని బ్రహ్మహత్యా పాపవిముక్తి, అసురయుద్ధమున ఆయింద్రుని విజయము అనునవి వర్ణింపబడినవి. అందు వలన నిది సర్వవిధ పాపములను నాశముచేయును. పండితు లీయాఖ్యానమునెల్లపుడు పఠింపగలరు. ఇంద్రియపటుత్వము, ధనవృద్ధి, యశోవృద్ధి, సర్వవిధపాపక్షయము, శత్రు జయము, ఆయుర్వృద్ధి, శ్రేయోలాభము గలుగుటచే పండితులు ప్రతి పర్వమునందును దీనిని వినుచుందురు.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠసంకంధములో
ఇంద్రవిజయ మను పదుమూడవ అధ్యాయము
సంపూర్ణము.

# పదునాల్గవ అధ్యాయము

## వృత్రాసురుని పూర్వచరితము

కథాసారము:- ఈ యధ్యాయమున యుద్ధరంగమునందు వృత్రాసురుని జ్ఞానభక్త్యాదుల విషయమును విని శుకమహర్షిని పరీక్షిన్మహారాజు ఆ విషయమును గూర్చి ప్రశ్నించుట, శుకుడు దానికి సమాధానము చెప్పు నుద్దేశ్యముతో వృత్రాసురుని పూర్వజన్మ చరితమును వర్ణించు ప్రసంగమునముందు చిత్రకేతువు యొక్క పుత్రశోకమును వర్ణించుట యను విషయములు వివరింపబడినవి.

అసంఖ్యజీవులలో మనుష్యజాతి మిగుల అల్పతరమైనది. దానిలో కొందఱు ధర్మము ననుష్ఠింతురు. ధర్మానుష్ఠానము చేయువారిలో గొలదిమందే ముముక్షువు లగుదురు. కోటిమంది ముక్తులలో నారాయణ పరాయణు డగు భక్తుడు మిగుల దుర్లభుడు. ఇట్టి దుర్లభమగు భక్తి వృత్రాసురున కెట్లు లభించనది? పరీక్షిన్మహారాజున కావిషయమై సందేహము కలుగగా శుకమహర్షి ఆయనకు వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతమును సవిస్తరముగ వర్ణించు నుద్దేశ్యముతో మొదట శూరసేన రాజగు చిత్రకేతువు యొక్క యుపాఖ్యానమును జెప్పెను.

ఈయధ్యాయమున సంతానరహితు డగు చిత్రకేతుని గృహమునకు అంగిరస మహర్షి యేతెంచి రాజును కుశల మడుగుట మహర్షికి తనమనోవేదనను రాజు వివరించుట, మహర్షి వరముచే రాజుయొక్క జ్యేష్ఠపత్ని యగు కృతద్యుతికి హర్షశోకప్రదు డగు పుత్రుడు జన్మించుట, పుత్ర జననముచే రాజు పురవాసులు ఆనందించుట, కృతద్యుతి సవతులు వానిపై పగబూని పుత్రునకు విష మిచ్చుట, పుత్రుడు మరణించుట, రాజు పురవాసులు మిగుల దుఃఖించుట, పుత్ర శోకకాతరు డగు చిత్రకేతువున కుపదేశించుటకై అంగీరస మహర్షితో పాటు నారద ఋషి యచటికి వచ్చుట యను విషయములు వర్ణింపబడినవి.

### శ్రీపరీక్షిదువాచ

**రజస్తమస్స్వభావస్య బ్రహ్మన్ వృత్రస్య పాప్మనః ।**
**నారాయణే భగవతి కథమాసీద్దృఢా మతిః ॥** 1

పరీక్షిన్మహారాజు పలికెను :- మహాత్మా! రజస్తమస్స్వభావసంపన్నుడు, పాపాత్ముడు నగు వృత్రాసురున కెట్లు శ్రీమన్నారాయణునియందు దృఢభక్తి గలిగెను.

దేవానాం శుద్ధసత్త్వానామృషీణాం చామలాత్మనామ్ ।
భక్తిర్ముకున్దచరణే న ప్రాయేణోపజాయతే ॥ 2

విశుద్ధసత్త్వగుణము గలదేవతలకు, భోగవాసనారహితులు నిర్మలాత్ములు నగు ఋషులకు సామాన్యముగ ముకుందచరణములయందు భక్తి కలుగదు. (కాని పాపాత్ము డగువృత్రాసురున కెట్లు భక్తి కలిగెను?)

రజోభిః సమసంఖ్యాతాః పార్థివైరిహజన్తవః।
తేషాం యే కేచనేహన్తే శ్రేయో వై మనుజాదయః ॥ 3

పార్థివములైన పరమాణువులు అసంఖ్యము లైనట్లు జీవులసంఖ్య గూడ నెక్కువగనే యున్నది. ఈ సర్వజవులలో మనుష్యజాతి అత్యల్పసంఖ్య గలది. వారిలో గొందఱు ధర్మము ననుష్ఠించుచుందురు.

ప్రాయో ముముక్షవస్తేషాం కేచనైవ ద్విజోత్తమ ।
ముముక్షూణాం సహస్రేషు కశ్చిన్ముచ్యేత సిధ్యతి ॥ 4

ద్విజోత్తమా! అధర్మము ననుష్ఠించువారలలో అత్యల్పసంఖ్యగల జనులే ముముక్షువు లగుచున్నారు. వేయిమంది ముముక్షువులలో నెవ్వడోఒక్కడే గృహాదిసంబంధమైన అసత్సంగమునుండి ముక్తుడగును. అట్టి వ్యక్తులలో నొక్కడే తత్త్వము నెఱుంగగలడు.

ముక్తానామపి సిద్ధానాం నారాయణపరాయణః ।
సుదుర్లభః ప్రశాన్తాత్మా కోటిష్వపి మహామునే ॥ 5

మహామునీ! ఇట్టి కోటిమందిముక్తులలోను, సిద్ధులలోను ప్రశాంతాత్ముడు, నారాయణ పరాయణుడు నగు భక్తు డత్యంత దుర్లభుడు.

వృత్రస్తు స కథం పాపః సర్వలోకోపతాపనః ।
ఇత్థం దృఢమతిః కృష్ణ ఆసీత్సంగ్రామ ఉల్బణే ॥ 6

భయంకరమగు యుద్ధరంగమున నిలచియున్నను పాపియు, సర్వలోకములకు దాపమును గలుగజేయువాడు నగు వృత్రాసురున కెట్లు కృష్ణునిపై నిట్టి దృఢ బుద్ధికలిగినది?

అత్ర నః సంశయో భూయాన్ శ్రోతుం కౌతూహలం ప్రభో ।
యః పౌరుషేణ సమరే సహస్రాక్షమతోషయత్ ॥ 7

ప్రభూ! సమరమున శౌర్యాదులను ప్రదర్శించి సహస్రాక్షు డగు నింద్రునకుగూడ తుష్టిని గలుగజేసిన పాపి యగు నావృత్రాసురున కెట్లు భక్తి కలిగినది? ఈ విషయమున

నాకు మిగుల సందేహము కలిగినది. అందువలన దానికి కారణమును వినుట కత్యంతము కుతూహలపడుచున్నాను.

## శ్రీసూత ఉవాచ

పరీక్షితోఽథ సంప్రశ్నం భగవాన్ బాదరాయణిః ।
నిశమ్య శ్రద్దధానస్య ప్రతినన్ద్య వచోఽబ్రవీత్ ॥ 8

సూతుడు పలికెను :- పిమ్మట శ్రద్ధావంతుడగు పరీక్షిన్మహారాజిట్లు యుక్తియుక్తముగ ప్రశ్నింపగా విని మహాత్ము డగు శుకదేవుడు సాదరముగ బలికెను.

## శ్రీశుక ఉవాచ

శృణుష్వావహితో రాజన్నితిహాసమిమం యథా।
శ్రుతం ద్వైపాయనముఖాన్నారదాద్దేవలాదపి ॥ 9

శుకుడు పలికెను :- రాజా! ద్వైపాయనుడు, నారదుడు, దేవలుడు ననువారివలన నేను వినిన యితిహాసమును నీకు ఉన్నదున్నట్లుగ జెప్పుచున్నాను, శ్రద్ధగా వినుము.

ఆసీద్రాజా సార్వభౌమః శూరసేనేషు వైనృప ।
చిత్రకేతురితి ఖ్యాతో యస్యాసీత్కామధుఙ్మహీ ॥ 10

రాజా! శూరసేనదేశమున చిత్రకేతుడను నొకరాజుండెను. ఆయన రాజ్యము చేయునప్పుడు పృథివి ప్రజలసర్వవాంఛలను దీర్చునట్టిదయ్యెను.

తస్య భార్యాసహస్రాణాం సహస్రాణి దశాభవన్ ।
సాన్తానికశ్చాపి నృపో న లేభే తాసు సన్తతిమ్ ॥ 11

ఆచిత్రకేతువునకు కోటిమందిభార్యలు గలరు. ఆయన సంతానోత్పాదనమున సమర్థుడయ్యును ఆభార్యలవలన ఆయనకు సంతానము కలుగలేదు. దైవవశమున ఆయనభార్య లందఱు వంధ్యలైరి.

రూపౌదార్యవయోజన్మవిద్యైశ్వర్యశ్రియాదిభిః ।
సంపన్నస్య గుణైః సర్వైశ్చిన్తా వన్ధ్యాపతేరభూత్ ॥ 12

వంధ్యాపతి యగు నాచిత్రకేతువు రూపము, ఔదార్యము, వయస్సు, పుట్టుక (కులీనత), విద్య, ఐశ్వర్యము, సౌందర్యము మున్నగు సర్వగుణము లచే సంపన్నుడయ్యును సంతానము లేకపోవుటచే మిగుల చింతాగ్రస్తుడయ్యెను.

నతస్య సంపదః సర్వా మహిష్యో వామలోచనాః ।
సార్వభౌమస్య భూశ్చేయమభవన్ ప్రీతిహేతవః ॥ 13

సకలసంపదలు, చారులోచన లగు భార్యలు, భూమి-యివియేవియు సార్వభౌముడగు ఆ చిత్రకేతువున కానందమును కలుగజేయలేకపోయినవి.

తస్యైకదాతు భవనమఙ్గిరా భగవానృషిః ।
లోకాననుచరన్నేతానుపాగచ్ఛద్యదృచ్ఛయా ॥ 14

ఒకప్పుడు మహాత్ముడగు అంగిరసఋషి స్వేచ్ఛగ సర్వలోకములలోను దిరుగుచు చిత్రకేతురాజ గృహమున కేతెంచెను.

తం పూజయిత్వా విధివత్ ప్రత్యుత్థానార్హణాదిభిః ।
కృతాతిథ్యముపాసీదత్ సుఖాసీనం సమాహితః ॥ 15

చిత్రకేతువు ప్రత్యుత్థానముద్వారా అర్ఘ్యపాద్యాదులద్వారా అంగిరస ఋషిని తగువిధముగ పూజించి భోజనాదులచే నతిథిసత్కారమొనరించెను. పిమ్మట మహర్షి సుఖాసనమున ఉపవిష్టుడు కాగా రాజు స్వయముగ సంయతచిత్తముతో ఋషిసమీపమున గూర్చుండెను.

మహర్షిస్తముపాసీనం ప్రశ్రయావనతం క్షితౌ ।
ప్రతిపూజ్య మహారాజ సమాభాష్యేదమబ్రవీత్ ॥ 16

మహారాజా! వినయావనతభావముతో భూమిపై గూర్చుండియున్న రాజును జూచి గౌరవించి మహర్షి ఆయనను సంబోధించుచు నిట్లు పలుక సాగెను.

## శ్రీఅంగిరా ఉవాచ

అపి తేఽనామయం స్వస్తి ప్రకృతీనాం తథాత్మనః ।
యథా ప్రకృతిభిర్గుప్తః పుమాన్ రాజా చ సప్తభిః ॥ 17

అంగిరసుడు పలికెను :- మహారాజా! నీశరీర మారోగ్యముగ నున్నదా? నీ స్వామ్యాది సప్తప్రకృతులు కుశలముగ నున్నవా? మహదహంకారములు , పంచతన్మాత్రలు అనునేడు ప్రకృతులద్వారా జీవు డెల్లపుడు రక్షితుడై యుండును. అవిలేనిచో నతడు క్షణకాలముకూడ నిలువజాలడు. అట్లే రాజుగూడ స్వామి, అమాత్యులు, జనపదములు, దుర్గములు, ధనరాసులు (కోశము), దండము, మిత్రులు - అనునేడు ప్రకృతులద్వారా నిత్యము రక్షితుడై సుఖము ననుభవించును. అవి లేనిచో రాజు క్షణకాలము గూడ నిలువజాలడు.

**ఆత్మానం ప్రకృతిష్వద్ధా నిధాయ శ్రేయ ఆప్నుయాత్ ।**
**రాజ్ఞా తథా ప్రకృతయో నరదేవాహితాధయః ॥ 18**

నృపతీ! రాజు తాను సాక్షాత్తుగ సప్తప్రకృతుల ననుసరించి మెలగినచో రాజ్యసుఖమును బొందును. ఇంకను ప్రజలు ధనము, తురగములు మున్నగువానిని రాజున కర్పించిరాజున కనుకూలముగ మెలగిన సుఖు లగుదురు.

**అపి దారాః ప్రజామాత్యా భృత్యాః శ్రేణ్యోఽథమన్త్రిణః ।**
**పౌరా జానపదా భూపా ఆత్మజా వశవర్తినః ॥ 19**

మహారాజా! నీ రాణులు, ప్రజలు, అమాత్యులు, సేవకులు, వ్యాపారులు, మంత్రులు, నాగరికులు, దేశవాసులు, మండలాధి పతులు, పుత్రులు నీయధీనములో నున్నారా?

**యస్యాత్మానువశశ్చేత్స్యాత్సర్వే తద్వశగా ఇమే ।**
**లోకాః సపాలా యచ్ఛన్తి సర్వే బలిమతన్ద్రితాః ॥ 20**

చిత్తము తనయధీనమున నున్నచో రాజునకు వానిభార్యాదు లందఱు ఎల్లపుడు వాని వశములో నుందురు. ఇక యెక్కువ చెప్పనదేమి? లోకపాలురతోపాటు సర్వలోకములు సావధానముగ నారాజునకు పూజోపహారముల నిచ్చును. (భృత్యులిచ్చు దానిని గూర్చి యిక చెప్పనదేమి?)

**ఆత్మనా ప్రయతే నాత్మా పరతః స్వత ఏవ వా ।**
**లక్షయేఽలబ్ధకామం త్వాం చిన్తయా శబలం ముఖమ్ ॥ 21**

రాజా! నీకు మానసికసంతుష్టియున్నట్లు అగుపడుటలేదు. నిన్ను అలబ్ధమనోరథునిగా (కోరికలు నెరవేరనివానిగా) తలంచుచున్నాను. ఈ భావము నీకు ఇతరులవలన గలిగినదా లేక స్వయముగ గలిగినదా? నీ ముఖము చింతచే వివర్ణమైనదిగ గనబడుచున్నది.

**ఏవం వికల్పితో రాజన్ విదుషా మునినాపి సః ।**
**ప్రశ్రయావనతోఽభ్యాహ ప్రజాకామస్తతో మునిమ్ ॥ 22**

రాజా! సర్వజ్ఞుడగు నాయంగిరసుడు సర్వము నెఱింగినవాడైనను రాజు నావిధముగ ప్రశ్నింపగా పుత్రార్థి యగు చిత్రకేతువు వినీతభావముతో అంగిరసునితో నిట్లుపలికెను.

**చిత్రకేతురువాచ**

**భగవన్ కిం న విదితం తపోజ్ఞానసమాధిభిః ।**
**యోగినాం ధ్వస్తపాపానాం బహిరన్తశ్శరీరిషు ॥ 23**

చిత్రకేతువు పలికెను:- మహాత్మా! తపోజ్ఞాన సమాధులద్వారా పాపమును ధ్వంసము చేయు నీవంటియోగులకు మావంటిశరీరుల యొక్క అంతరికబాహ్య విషయములు ఏలతెలియకుండగ నుండును?

తథాపి పృచ్ఛతే బ్రూయాత్ బ్రహ్మన్నాత్మని చిన్తితమ్ ।
భవతో విదుషశ్చాపి చేదిత స్త్వదనుజ్ఞయా ॥ 24

మహాత్మా! నీవు సర్వజ్ఞుడవై యుండియు నన్నీవిషయముల నన్నింటిని యడుగుచున్నావు. అందువలన నేను నీయాజ్ఞచే ప్రేరితుడనై నామానసికచింతా విషయమును వెల్లడిచేయుదును.

లోకపాలైరపి ప్రార్థ్యాః సామ్రాజ్యైశ్వర్యసంపదః ।
న నన్దయన్త్యప్రజం మాం క్షుత్తృట్కామమివాపరే ॥ 25

ఆకలిదప్పులచే బీడింపబడిన వ్యక్తికి ప్రక్చందనాది సుఖప్రద విషయములు సుఖము నీయజాలవు. అట్లే మావంటి అపుత్రకవ్యక్తులకుగూడ లోకపాలుర కభిలషణీయములైన సామ్రాజ్యము, ఐశ్వర్యము, సంపదలు మున్నగునవి గూడ సుఖము నీయజాలవు.

తన్న పాహి మహాభాగ పూర్వైః సహ గతం తమః ।
యథా తరేమ దుష్పారం ప్రజయా తద్విధేహి నః ॥ 26

అందువలన మహాభాగా! దేనివలన నేను పుత్రుని బొంది పితృపితామహులతో గూడ దురంత మగు నరకమునుండి రక్షింపబడగలనో అట్టియుపాయమును నాకు చెప్పవలసినది.

## శ్రీశుక ఉవాచ

ఇత్యర్థితః స భగవాన్ కృపాలుర్బ్రహ్మణః సుతః ।
శ్రపయిత్వా చరుం త్వాష్ట్రం త్వష్టారమయజద్విభుః ॥ 27

శుకుడు పలికెను :- చిత్రకేతు వట్లు పరమదయాళువు, విభుడు, బ్రహ్మపుత్రుడు, నగు అంగిరసునకు తనయభీష్టమును వివరింపగా అంగిరసుడు త్వష్టృయాగమును సంపన్న మొనరించెను.

జ్యేష్ఠా శ్రేష్ఠా చ యా రాజ్ఞో మహర్షీణాం చ భారత ।
నామ్నా కృతద్యుతి స్తస్యై యజ్ఞోచ్ఛిష్టమదాద్ద్విజః ॥ 28

భారతా! చిత్రకేతువు యొక్క రాణులలో సౌశీల్యాదిగుణములచే శ్రేష్ఠయు, జ్యేష్ఠయు అనగా ప్రథమవివాహితయు నగు స్త్రీ పేరు కృతద్యుతి. అంగిరస ఋషిఆమెకే యజ్ఞశేషము నిచ్చెను.

అథాహ నృపతిం రాజన్ భవితైకస్తవాత్మజః ।
హర్షశోకప్రదస్తుభ్యమితి బ్రహ్మసుతో యయౌ ॥ 29

యజ్ఞశేష మగుహవిస్సు నిచ్చి అంగిరస ఋషి "రాజా! నీకు హర్షశోక ప్రదుడగు నొకపుత్రుడు జన్మించు"నని చెప్పి వెడలిపోయెను. (పుట్టుకచే హర్షము, మరణముచే శోకము - ఇదియే మునియొక్క యభిప్రాయము. బహుగుణాన్వితు డగుటచే హర్షమును గలిగించు ననియు ఐశ్వర్యగర్వముతో గూడియుండుటచే శోకమును గలిగించువా డనియు రాజు తలంచెను)

సాపి తత్ప్రాశనాదేవ చిత్రకేతోరధారయత్ ।
గర్భం కృతద్యుతిర్దేవీ కృత్తికాగ్నేరివాత్మజమ్ ॥ 30

అగ్నినుండి మహాదేవుని వీర్యమును గ్రహించి కృత్తిక స్కందుడను (కార్తికుడను) పుత్రుని గర్భమున ధరించినట్లు కృతద్యుతియు యజ్ఞావశిష్ట మగు ప్రసాదమును భక్షించి చిత్రకేతువువలన గర్భమును ధరించెను.

తస్యా అనుదినం గర్భః శుక్లపక్ష ఇవోడుపః ।
వవృధే శూరసేనేశతేజసా శనకైర్నృప ॥ 31

రాజా! శూరసేనదేశాధిపతి యగు చిత్రకేతువు వలన పట్టపురాణి యగు కృతద్యుతికి గలిగిన గర్భము శుక్లపక్షచంద్రునివలె దినదిన ప్రవర్ధమానము కాసాగెను.

అథ కాల ఉపావృత్తే కుమారః సమజాయత ।
జనయన్ శూరసేనానాం శృణ్వతాం పరమాం ముదమ్ ॥ 32

అనంతరము తగిన సమయమున రాజున కొకపుత్రుడు జన్మించెను. ఈ వార్తను విని శూరసేన దేశవాసులు మిగుల సంతసించిరి.

హృష్టో రాజా కుమారస్య స్నాతః శుచిరలంకృతః ।
వాచయిత్వాశిషో విప్రైః కారయామాస జాతకమ్ ॥ 33

చిత్రకేతువు ఈ వార్తను విని మిగుల ఆనంద భరితుడయ్యెను. స్నానానంతర మతడు శుచియై అలంకారాదులు ధరించి విప్రులచే కుమారునకు స్వస్తివాచనముల బలికించి జాతకర్మాదులను జేయించెను.

తేభ్యో హిరణ్యం రజతం వాసాంస్యాభరణాని చ ।
గ్రామాన్ హయాన్ గజాన్ ప్రాదాద్ధేనూనామర్బుదాని షట్ ॥ 34

ఆ విప్రులకు స్వర్ణము, రజతము, వస్త్రములు, ఆభూషణములు, గ్రామములు, అశ్వములు, ఏనుగులు మున్నగువానిని ఆఱు అర్బుదముల (అరువదికోట్ల) గోవులను దానముచేసెను.

వవర్ష కామానన్యేషాం పర్జన్య ఇవ దేహినామ్ ।
ధన్యం యశస్యమాయుష్యం కుమారస్య మహామానాః ॥ 35

మేఘము అకాతరముగను అజస్రముగను వర్షించునట్లు మహామతి యగు రాజుగూడ కుమారుని యశస్సును, ధనమును, ఆయుష్యమును గోరి యితరజనులకు గూడ వారి కిష్టములైన వస్తువులను దానము చేసెను.

కృచ్ఛ్రలబ్ధేఽథ రాజర్షేస్తనయేఽ నుదినం పితుః ।
యథా నిఃస్వస్య కృచ్ఛ్రాప్తే ధనే స్నేహోఽ న్వవర్ధత ॥ 36

కష్టముగ సంపాదించిన ధనముపై దరిద్రున కనుదినము ప్రేమ వృద్ధిపొందునట్లు తండ్రియు రాజర్షియు నగు చిత్రకేతువునకుగూడ లేక లేక కలిగిన కుమారునిపై ప్రేమ వృద్ధి పొందసాగెను.

మాతుస్త్వతితరాం పుత్రే స్నేహో మోహసముద్భవః ।
కృతద్యుతేః సపత్నీనాం ప్రజాకామజ్వరోఽభవత్ ॥ 37

తల్లియగు కృతద్యుతికిగూడ పుత్రునిపై మోహజనిత మగు ననురాగము క్రమముగ వృద్ధిపొందసాగెను. కృతద్యుతి యొక్క సంతానమును జూచి ఆమెసవతులకు పుత్రవాంఛా రూపమగు పరితాపము మెండయ్యెను.

చిత్రకేతోరతిప్రీతిర్యథా దారే ప్రజావతి ।
న తథాన్యేషు సంజజ్ఞే బాలం లాలయతోఽన్వహమ్ ॥ 38

నిరంతరము బాలునిలాలనపాలనములచే చిత్రకేతువునకు పుత్రవతి యగు కృతద్యుతిపై నధిక ప్రేమ జనించెను. మిగిలిన భార్యలపై ఆయన కంతటిప్రేమ కలుగలేదు.

తాః పర్యతప్యన్నాత్మానం గర్హయన్త్యోఽభ్యసూయయా।
ఆనపత్యేన దుఃఖేన రాజ్ఞశ్చానాదరేణ చ ॥ 39

పుత్రరహిత లగు రాజపత్నులు ఆనపత్యదుఃఖము చేత, రాజు అనాదరముగ జూచుట చేత అసూయగలిగినవారై తమ్ము నిందించుకొనుచు నిట్లు పరితపించిరి.

ధిగప్రజాం స్త్రియం పాపాం పత్యుశ్చాగృహసమ్మతామ్ ।
సుప్రజాభిః సపత్నీభిర్దాసీమివ తిరస్కృతామ్ ॥ 40

సంతానహీనయు, గృహిణి యని భర్తచే గౌరవింపబడనదియు, సత్సంతానము గల సవతులచే దాసివలె తిరస్కృతయు నగు స్త్రీ నిజముగ నిందకు యోగ్యురాలే యగును.

దాసీనాం కో ను సన్తాపః స్వామినః పరిచర్యయా ।
అభీక్ష్ణం లబ్ధమానానాం దాస్యా దాసీవ దుర్భగాః ॥ 41

నిరంతరము యజమానికి పరిచర్యచేయుచు దాసీలు ఆ యజమానివలన గౌరవమును బొందుచుందురు. అందువలన ఆ దాసీల కెట్టి సంతానము కలుగదు. కాని దాసికి దాసివలె నున్న మన మెంతయదృష్టహీనలము?

ఏవం సన్దహ్యమానానాం సపత్న్యాః పుత్రసంపదా ।
రాజ్ఞోఽ సమ్మతవృత్తీనాం విద్వేషో బలవానభూత్ ॥ 42

ఇటొకవైపు సవతి యగు కృతద్యుతికి పుత్రసంపద కలుగుట యను కారణముచే మిగిలిన రాణులహృదయములు మండిపోవుచుండెను. మఱియొక వైపు రాజు వారిపట్ల ఔదాసీన్యము వహించియుండెను. దానివలన వారికి కృతద్యుతిపై నెక్కువగ ద్వేషము కలిగెను.

విద్వేషనష్టమతయః స్త్రియో దారుణచేతసః ।
గరం దదుః కుమారాయ దుర్మర్షా నృపతిం ప్రతి ॥ 43

మెల్లగ సవతులలో విద్వేషము పెరుగగా వారిబుద్ధి నశించెను. వారు దారుణచిత్తలైరి. రాజుయొక్క అనాదరము నేమాత్రమును సహింపజాలకపోయిరి. చివర కారాణులు కుమారునకు విషము పెట్టిరి.

కృతద్యుతిరజానన్తీ సపత్నీనామఘం మహత్ ।
సుప్త ఏవేతి సంచిన్త్య నిరీక్ష్య వ్యచరద్గృహే ॥ 44

పట్టపురాణి యగు కృతద్యుతి సవతులు చేసిన విషప్రయోగ మను మహాపాపకార్యమును గమనింపలేక పోయినది. బాలుడు నిద్రించుచున్నా డనిభావించి యామె యింటిలో దిరుగసాగినది.

శయానం సుచిరం బాలముపధార్య మనీషిణీ ।
పుత్రమానయ మే భద్రే ఇతి ధాత్రీమచోదయత్ ॥ 45

బుద్ధిమతి యగు కృతద్యుతి బాలుడు చాలసేపు నిద్రించుచుండుట చూచి దాదితో "కళ్యాణీ! నా పుత్రు నిచటకు దె"మ్మనిచెప్పి ఆమెను పంపినది.

సా శయానముపవ్రజ్య దృష్ట్వా చోత్తారలోచనమ్ ।
ప్రాణేన్ద్రియాత్మభిస్త్యక్తం హతాస్మీత్యపతద్భువి ॥ 46

దాది నిద్రించు బాలునికడకు వెడలి చూడగా బాలునికనుగ్రుడ్లు పైకి వెడలివచ్చెను. ప్రాణములు, ఇంద్రియములు, ఆత్మ లేనిదిగ శరీరముండెను. ఇది చూచి 'అయ్యో! హతాస్మి' యనిపలుకుచు దాది భూమిపై బడెను.

తస్యాస్తదాకర్ణ్య భృశాతురం స్వరం
ఘ్నన్త్యాః కరాభ్యాముర ఉచ్చకైరపి ।
ప్రవిశ్య రాజ్ఞీ త్వరయాత్మజాన్తికం
దదర్శ బాలం సహసా మృతం సుతమ్ ॥ 47

దాది అతివ్యాకులభావముతో రెండు చేతులతో వక్షస్థలమును బాదుకొనుచు పెద్దగ నేడ్చుచుండెను. రాణి యాధ్వనిని విని తాను కుమారుని కడకు త్వరగ వెడలి చూడగా వాడు మరణించి యుండెను.

పపాత భూమౌ పరివృద్ధయా శుచా
ముమోహ విభ్రష్టశిరోరుహామ్బరా ॥ 48

తన పుత్రుని హఠాన్మరణమును జూచి యధికశోకముచే యామె మూర్ఛితురాలయ్యెను. ఆమెజుట్టు విడిపోయెను. శరీరముపైనున్న వస్త్రములు అస్తవ్యస్తములయ్యెను.

తతో నృపాన్తః పురవర్తినో జనా
నరాశ్చ నార్యశ్చ నిశమ్య రోదనమ్ ।
ఆగత్య తుల్యవ్యసనాః సుదుఃఖితా -
స్తాశ్చ వ్యలీకం రురుదుః కృతాగసః ॥ 49

రాజా! అనంతరము అంతఃపురవాసులగు స్త్రీపురుషు లెల్ల రాయేడుపును విని అచటికి వచ్చి వారివలె నేడ్వసాగిరి. అపరాధ మొనర్చిన సవతులుగూడ అచటికి వచ్చి కపటభావముతో నేడ్వసాగిరి.

శ్రుత్వా మృతం పుత్రమలక్షితాన్తకం
వినష్టదృష్టిః ప్రపతన్ స్ఖలన్ పథి ।
స్నేహానుబన్ధైధితయా శుచా భృశం
విమూర్ఛితోఽను ప్రకృతిర్ద్విజైర్వృతః ॥ 50

పపాత బాలస్య స పాదమూలే
మృతస్య విస్రస్తశిరోరుహామ్బరః ।
దీర్ఘంశ్వ సన్ బాష్పకలోపరోధతో
నిరుద్ధకంఠో న శశాక భాషితుమ్ ॥ 51

చిత్రకేతువు పుత్రునియొక్క యాకస్మిక మరణవార్తను విని దృష్టి విహీనుడయ్యెను. పుత్రప్రేమవలన దుఃఖము వృద్ధిపొందుచుండగా త్రోవలో మాటిమాటికి బడుచు అచటికి వచ్చి మూర్ఛితుడు కాజొచ్చెను. అమాత్యాదులుగూడ ఆయనతో పాటు వెడలిరి. ఆయన విడిపోయిన జుట్టు కలవాడు, జారిపోయిన వస్త్రములు గలవాడు నై , బ్రాహ్మణులచే బరివేష్టితుడై నిట్టూర్పులను విడచుచు మృతుడైయున్న బాలునిపాదములకడ బడెను. పిమ్మట మూర్ఛతొలగగా నిట్టూర్పులను విడచి బాష్పములచే కంఠము రుద్ధము కాగా అత డేమియు బలుకలేకపోయెను.

పతిం నిరీక్ష్యోరుశుచార్పితం తదా
మృతం చ బాలం సుతమేకసన్తతిమ్ ।
జనస్య రాజ్ఞీ ప్రకృతేశ్చ హృద్రుజం
సతీ దధానా విలలాప చిత్రధా ॥ 52

దారుణ మగు శోకముచే సంతప్తుడగు భర్తను, వంశాంకురుడు ఏక మాత్రుడు నగు కుమారుడు మరణించుటను చూచి రాణి యంతఃపురవాసుల యొక్క, అమాత్యులయొక్క మనస్సులోని బాధ నెక్కువగ జేయుచు బహువిధములుగ విలపింపసాగెను.

స్తనద్వయం కుంకుమపంకమండితం
నిషించతీ సాంజనబాష్పబిందుభిః ।
వికీర్య కేశాన్ విగలత్స్రజః సుతం
శుశోచ చిత్రం కురరీవ సుస్వరమ్ ॥ 58

విడిపోయిన పట్టపురాణియొక్క కేశపాశమునుండి పూలమాలలు జారిపడిపోయెను. కాటుకకన్నులనుండి బాష్పబిందువులు బయల్వెడలి కుంకుమరంజితమగు (రంజితములు

సువాసితములనగు) స్తనద్వయమును దడుపుచుండెను. ఇట్లు పట్టపురాణి ఉచ్చైస్స్వరముతో కరరిపక్షివలె పుత్రునికై విలపింప సాగెను.

అహో విధాత స్త్వమతీవ బాలిశో
యస్త్వాత్మసృష్ట్య ప్రతిరూపమీహసే ।
పరే ను జీవత్యపరస్య యా మృతి -
ర్విపర్యయశ్చేత్త్వమసి ధ్రువః పరః ॥ 54

హా! విధాతా! నీవు సృష్టి విషయమున నేమియు దెలియనివాడవే. ఏలయన, నీవుతండ్రి జీవించియుండగనే పుత్రమరణ మను కార్యమును నీసృష్టికి విరుద్ధముగ నొనరించితివి. ఇట్టివిపరీతాచరణము నీకిష్టమైనచో నీవు నిజముగ ప్రాణులకు శత్రువే యగుదువుగాని దయగల వాడవు కావు.

న హి క్రమశ్చేదిహ మృత్యుజన్మనోః
శరీరిణామస్తు తదాత్మకర్మభిః ।
యః స్నేహపాశో నిజసర్గవృద్ధయే
స్వయం కృతస్తే తమిమం వివృశ్చసి । 55

"పుత్రుడు జీవించియుండగనే తండ్రి మరణింపవచ్చును, లేదా తండ్రి జీవించి యుండగనే పుత్రుడు జన్మింపవచ్చును. ఇట్టి నియమము జననమరణ - సంబంధములో లేదు, తన కర్మ ననుసరించియే జననమరణములు ఘటిల్లుచుండు" నని నీవు పలుకవచ్చును. అట్లయిన ఈశ్వరు నంగీకరింప వలసిన పనియేమున్నది? జడకర్మవలననే జననమరణాదులు కలగవచ్చునుగదా! కాని జడమునకు స్వయముగ క్రియాశక్తి లేకపోవుటచే కర్మలకు నియంతగ నీశ్వరు నంగీకరింపవచ్చును. నీసృష్టివృద్ధికై నీవు నిర్మించిన స్నేహపాశమును పుత్రాదులమరణముద్వారా నీవే ఛేదించుచున్నావు. ప్రేమయం దిట్టి దుఃఖమును చూచి యెవ్వడును పుత్రాదులపై ప్రేమను జూపడు. కాని స్నేహభావముతో పుత్రాదులు జీవించియుండరు. క్రమముగ సృష్టిలోపించును, అందువలన నీవు నిజముగ మూర్ఖుడవే.

త్వం తాత నార్హసి చ మాం కృపణామనాథాం
త్యక్తుం విచక్ష్వ పితరం తవ శోకతప్తమ్ ।
అఞ్జస్తరేమ భవతాప్రజదుస్తరం యద్
ధ్వాన్తం న యాహ్యకరుణేన యమేన దూరమ్ ॥ 56

వత్సా! నేను మిగుల దీనురాలను, అనాథను నైతిని. నన్ను విడచిపోవుట నీకు దగదు. ఒక్కమారు శోకసంతప్తు డగు నీతండ్రిని జూడుము. పుత్రుడు లేకపోవుటవలన గలిగిన నరకదుఃఖము మాకు నీవలననే తొలగగలదు. అందువలన నిర్దయుడగు నీయమునితో నీవెక్కువ దూరము వెడలవలదు.

ఉత్తిష్ఠ తాత త ఇమే శిశవో వయస్యా
స్త్వామాహ్వయన్తి నృపనన్దన సంవిహర్తుమ్ ।
సుప్తశ్చిరం హ్యశనయా చ భవాన్ పరీతో
భుఙ్క్ష్వ స్తనం పిబ శుచో హర నః స్వకానామ్ ॥ 57

నాయనా! రాజకుమారా! నీవు చాలసేపు నిద్రించియుంటివి, ఇక లెమ్ము, నీయీ మిత్రులు ఆడుకొనుటకు నిన్ను పిలచుచున్నారు. నీవుగూడ ఆకలి గొనియున్నావు. లేచి స్తన్యమును త్రాగుము. నాదుఃఖమును బోగొట్టుము.

నాహం తనూజ దదృశే హతమఙ్గలా తే
ముగ్ధస్మితం ముదితవీక్షణమాననాబ్జమ్ ।
కిం వా గతోఽస్యపునరన్వయమన్యలోకం
నీతోఽఘృణేన న శృణోమి కలా గిరస్తే ॥ 58

కుమారా! నేను మందభాగ్యురాలను, కనుకనే నేను నీ కడకు వచ్చి నీముఖకమలమందలి మృదుహాసమును, ముదితదృష్టిని జూడలేకపోయితిని. తిరిగివచ్చుటకు వీలులేని యాలోకమునకు నిర్దయుడగు యముడు నిన్ను తీసికొనివెడలినాడా? అందువలననే అస్ఫుటము లగు నీ మధురవాక్కులు వినలేకపోవుచున్నానా?

## శ్రీశుక ఉవాచ

విలపన్త్యా మృతం పుత్రమితి చిత్రవిలాపనైః ।
చిత్రకేతుర్భృశం తప్తో ముక్తకంఠో రురోద హ ॥ 59

శుకుడు పలికెను :- ఇట్లు మరణించిన పుత్రునికై విచిత్రముగ విలపించు భార్యతోగూడ చిత్రకేతువు మిగుల శోకసంతప్తుడైముక్తకంఠముతో నేడ్వసాగెను.

తయోర్విలపతోః సర్వే దంపత్యో స్తదనువ్రతాః ।
రురుదుః స్మ నరా నార్యః సర్వమాసీదచేతనమ్ ॥ 60

ఇట్లు రాజు రాణి రోదించుచుండగా వారి ననుసరించు స్త్రీపురుషు లందఱు రోదించుచుండిరి. ఆకస్మికమగు నీదుర్ఘటనవలన నగరవాసు లందఱు శోకముచే నచేతన ప్రాయులైరి.

**ఏవం కశ్మలమాపన్నం నష్టసంజ్ఞమనాయకమ్ ।**
**జ్ఞాత్వాఙ్గిరా నామ ఋషి రాజగామ సనారదః ॥ 61**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్దే చిత్రకేతూపాఖ్యానే
చతుర్దశోఽధ్యాయః ॥

రాజు నిట్లు దుఃఖసంతప్తుడు, నష్టచేతనుడు, అనాథుడు నయ్యెనని దెలిసికొని నారదునితో గూడ అంగిరసు డను ఋషి యచటికి వచ్చెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
చిత్రకేతుపాఖ్యానమున పదునాల్గవ అధ్యాయము
సంపూర్ణము.





# పదునైదవ అధ్యాయము

## చిత్రకేతునకు అంగిరస నారదులు ఉపదేశించుట

కథాసారము :- ఈయధ్యాయమున అంగిరసుడు నారద మహర్షి చిత్రకేతుగృహము నకు వెడలి యాతని శోకమును బోగొట్టుట యనువిషయము వర్ణింపబడినది.

నారదమహర్షి, అంగిరసుడు పుత్రశోకాతురుడగు చిత్రకేతువుకడకు వెడలి తత్త్వోప దేశము చేసి యాతనిశోకమును బోగొట్టిరి.

పితాపుత్రాదుల సంబంధము భగవన్మాయచే కల్పిత మైనదికాని వాస్తవము కాదు. ఇట్టి సంబంధము పూర్వము లేదు, అనంతర ముండదు. ప్రస్తుతముకాలవశమున నిట్టి సంబంధము ఏర్పడినది. అందువలన అనిత్యసంబంధమగు వస్తువునకై శోకించుట తగదు. చరాచర మగు నీజగత్తంతయు నొక్కమారు అస్తిత్వశూన్యము కాకపోయినను వాస్తవమున యునికి లేనిదే. విశ్వస్రష్ట యగు భగవానుడు మూలకారణ రూపముతోనె పరతంత్రభూతము అనగా పిత్రాదిరూపముతో సంతానమును గనును. ఈపనులయందు భగవానునకుదప్ప ఇతరులకు కర్తృత్వముండదు. అపుడు జీవుల కున్న పిత్రాది రూప మగు నభిమానము మాయవలననే కలుగుచున్నది.

ఇరువురు ఋషులవాక్కులను విని రాజు శోకరహితుడై వారి పరిచయము నడిగెను. ఋషులు తమ్ము తాము పరిచయము చేసికొని "దేహాభిమానమే సర్వక్లేశములకు మూలము; ఆత్మతత్త్వ మునుగూర్చి ఆలోచించి భగవానుని శరణుజొచ్చినచో కృష్ణేతర విషయసంయోగ వియోగమువలన గలిగిన సుఖదుఃఖాదులు నశించును; పరమశుభము కలుగు" నని ఆయనకు ఉపదేశ మొనర్చిరి.

### శ్రీశుక ఉవాచ

**ఊచతుర్మృతకోపాన్తే పతితం మృతకోపమమ్ ।**
**శోకాభి భూతం రాజానాం బోధయన్తౌ సదుక్తిభిః ॥ 1**

శుకుడు పలికెను :- శవసమీపమున మరణించిన వానివలె బడియున్న పుత్రశోకాతురు డగు చిత్రకేతువును జూచి మహర్షులైన నారదాంగిరసులు నానావిధము లగు సదుప దేశములద్వారా వానిని ప్రబోధించుచు నిట్లు పలికిరి.

**కోఽయం స్యాత్తవ రాజేన్ద్ర భవాన్ యమనుశోచతి ।**
**త్వంచాస్య కతమః సృష్టౌ పురేదానీమతఃపరమ్ ॥ 2**

రాజేంద్రా ! నీ వెవనికై దుఃఖించుచున్నావో అతడు నీ కేమి కావలెను? నీవు వీనిబంధువులలో నెవడవు. సృష్టినుండియు నతడు నాపుత్రుడు, వేను వానితండ్రిని యనిపలికినచో (నిన్నొకటి యడుగుచున్నాము) మీ యీ సంబంధము పూర్వమున గలదా? ఇప్పు డున్నదా? ముందుండునా?

**యథా ప్రయాన్తి సంయాన్తి స్రోతోవేగేన వాలుకాః ।**
**సంయుజ్యన్తే వియుజ్యన్తే తథా కాలేన దేహినః ॥ 3**

రాజా! ప్రవాహవేగముచే నిసుకరేణుపులు ఒక్కొక్కమారు విడివడి పోవుచుండును. మఱియొకమారు వచ్చి కలియుచుండును. అట్లే ప్రాణులు గూడ కాలనియమము ననుసరించి యొక్కమారు వచ్చి కలియుచుందురు. మఱియొకమారు విడివడి పోవుచుందురు.

**యథా ధానాసు వై ధానా భవన్తి చ భవన్తి చ ।**
**ఏవం భూతాని భూతేషు చోదితానీశమాయయా ॥ 4**

ధాన్యాదిబీజములను నాటిన వానినుండి యొకప్పుడు ఇతరబీజములు పుట్టును, ఒకప్పుడు పుట్టవు (ఒకప్పుడు వానియంకురోత్పాదన శక్తిగూడ నశించును), అట్లే భగవన్మాయచే ప్రేరితము లైన ప్రాణులొకప్పుడు పుత్రాదులరూపముతోను పిత్రాదుల రూపములతోను జన్మింతురు. ఒకప్పుడు జన్మింపరు. అందువలన నశ్వర మగు నీసంబంధ మునుగూర్చి దుఃఖించుట తగదు.

**వయంచ త్వంచ యే చేమే తుల్యకాలాశ్చరాచరాః ।**
**జన్మమృత్యోర్యథా పశ్చాత్ ప్రాఙ్నైవ మధునాపి భోః ॥ 5**

రాజా! మేము, నీవు, చరాచరజగత్తు ప్రస్తుత మున్నాము. ఈ జన్మమునకు పూర్వము గలసియుండలేదు. మరణానంతరముగూడ యుండము, అందువలన ఇప్పుడు గూడ లేము. (ఇప్పుడు మనము చూచుచున్నది ఆద్యంత విహీనమైన స్వప్నమువలె నసత్య మైన దని భావింపవలెను. అనగా అవాస్తవవస్తువు మాయావాదుల సిద్ధాంతముల ననుసరించి అస్తిత్వశూన్యము కాకపోయినను నిత్యసత్యము కాదు, అందువలన నది స్వాప్నికపదార్థమువలె వాస్తవ మగు అస్తిత్వము లేనిదే యగును. )

**భూతైర్భూతాని భూతేశః సృజత్యవతి హన్తి చ ।**
**ఆత్మసృష్టైస్వతన్త్రైరనపేక్షోఽపి బాలవత్ ॥ 6**

భూతపతి యగు జగదీశ్వరుడు జగత్సృష్టి విషయమున తనకు అపేక్ష లేకపోయినను బాలునివలె అనభిప్రేతభావముతో ఆత్మసృష్టములు అస్వతంత్రములు నగు భూతముల ద్వారా పితృరూపముతో భూతములను సృజించును. రాజరూపముతో పాలించును. సర్పాదిరూపములతో ధ్వంసముచేయును. అందువలన సృష్ట్యాదికార్యములయందు ఈ పరతంత్ర భూతాదులకు కర్తృత్వము లేదు. మాయవలన కేవలము కర్తృత్వాభిమాన ముండును.

**దేహేన దేహినో రాజన్ దేహాద్దేహోఽభిజాయతే ।**
**బీజాదేవ యథా బీజం దేహ్యర్థ ఇవ శాశ్వతః ॥ 7**

రాజా! బీజమునుండి బీజ ముత్పన్న మగునట్లు దహియొక్క అనగా తండ్రియొక్క దేహముద్వారా మాతృదేహమునుండి పుత్రదేహముత్పన్నమగును. అనగా జీవుడు భూమ్యా దులవలె నిత్యుడు.

**దేహదేహివిభాగోఽయమవివేక కృతః పురా ।**
**జాతివ్యక్తి విభాగోఽయం యథా వస్తుని కల్పితః ॥ 8**

(దేహము నశ్వర మైనచో దేహిగూడ అనిత్యుడే యనిన దానికి సమాధానము చెప్పబడుచున్నది.) జాతి, వ్యక్తి అనగా సామాన్యము. విశేషము ఈ రెండు విధములగు భేదము వస్తుమాత్రమున పరికల్పితమైనది. అట్లే అనాది యగు అజ్ఞానముచే గల్పితమగు (జీవాత్మల) దేహదేహుల విభాగముగూడ కల్పిత మైయున్నది.

## శ్రీశుక ఉవాచ

**ఏవమాశ్వాసితో రాజా చిత్రకేతుర్ద్విజోక్తిభిః ।**
**విమృజ్య పాణినా వక్త్రమాధిమ్లానమభాషత ॥ 9**

శుకుడు పలికెను :- నారదాంగిరసుల వాక్కులచే నిట్లోదార్చబడినవాడై చిత్రకేతువు దుఃఖముచే వడలిపోయిన ముఖమును చేతితో దుడుచుకొని యిట్లు పలికెను.

## శ్రీరాజోవాచ

**కౌ యువాం జ్ఞానసంపన్నౌ మహిష్ఠౌ చ మహీయసామ్ ।**
**అవధూతేన వేషేన గూఢావిహ సమాగతౌ ॥ 10**

రాజు పలికెను :- మహాపురుషులారా! అవధూత అనగా పరమహంస వేషములతో ఆత్మగోపనముచేసికొని యిచటికి వచ్చిన మీరెవరు? మీరధికజ్ఞానసంపన్నులు, మహామహిమ గలవారు నని నేను భావించుచున్నాను.

చరన్తి హ్యవనౌ కామం బ్రాహ్మణా భగవత్ప్రియాః ।
మాదృశాం గ్రామ్యబుద్ధీనాం బోధాయోన్మత్తలింగినః ॥ 11

భగవత్ప్రియు లగు బ్రాహ్మణులు ఉన్మత్తులవలె వేషముల ధరించి గ్రామ్యబుద్ధి సంపన్నులు అనగావిషయాసక్తచిత్తులమగు మావంటిమూర్ఖుల యజ్ఞానమును దొలగించుటకై యీపుడమి యందు స్వేచ్ఛగ దిరుగుచుందురు.

కుమారో నారద ఋభురంగిరా దేవలోఽసితః ।
అపాన్తరతమా వ్యాసో మార్కణ్డేయోఽథ గౌతమః ॥ 12

వసిష్ఠో భగవాన్ రామః కపిలో బాదరాయణిః ।
దుర్వాసా యజ్ఞవల్క్యశ్చ జాతుకర్ణ స్తథారుణిః । 13

రోమశశ్చ్యవనో దత్త ఆసురిః స పతంజలిః ।
ఋషిర్వేదశిరా ధౌమ్యో మునిః పంచశిఖస్తథా ॥ 14

హిరణ్యనాభః కౌశల్యః శ్రుతదేవ ఋతధ్వజః ।
ఏతే పరే చ సిద్ధేశాశ్చరన్తి జ్ఞానహేతవః ॥ 15

సనత్కుమారుడు, నారదుడు, ఋభువు, అంగిరసుడు, దేవలుడు, అసితుడు, అపాంతరతముడు, వ్యాసుడు, మార్కండేయుడు, గౌతముడు, వశిష్ఠుడు, పరశురాముడు, కపిలుడు, శుకదేవుడు, దుర్వాసుడు, యాజ్ఞవల్క్యుడు, జాతుకర్ణుడు, ఆరుణి, రోమశుడు, చ్యవనుడు, దత్తాత్రేయుడు, పతంజలి, కపిలుడు, వేదశిరఋషి యగు ధౌమ్యుడు, పంచశిఖముని, హరిణ్యానాభుడు, కౌశల్యుడు, శ్రుతదేవుడు, ఋతధ్వజుడు, ఇంకను నితరు లగు సిద్ధులు (అజ్ఞానాచ్ఛన్నజీవులకు) జ్ఞానోపదేశము చేయుచు నీ పుడమి యందు సంచరించుచుందురు. (మీరు వారిలో నెవరో?)

తస్మాద్యువాం గ్రామ్యపశోర్మమ మూఢధియః ప్రభూ ।
అన్ధే తమసి మగ్నస్య జ్ఞానదీప ఉదీర్యతామ్ ॥ 16

అందువలన మీరు నాకు జ్ఞానదానముచేయుటకు సమర్థులై యున్నారు. నేను గ్రామ్యపశువువంటి మూఢబుద్ధిని, అజ్ఞానాంధకారమున నిమగ్నమైయున్నవాడను, మీరు నా జ్ఞానదీపమును ప్రజ్వరిల్లజేయుదురుగాక!

## శ్రీఅంగిరా ఉవాచ

అహం తే పుత్రకామస్య పుత్త్రదోఽస్మ్యఙ్గిరా నృప ।
ఏష బ్రహ్మసుతః సాక్షాన్నారదో భగవానృషిః ॥ 17

అంగిరసుడు పలికెను:- రాజా! పుత్రకాముడ వగు నీకు పుత్రుని యిచ్చిన అంగిరసుడను నేను. ఈయన సాక్షాత్తుగ బ్రహ్మసుతుడు పరమ పూజ్యుడు నగునారద ఋషి.

ఇత్థం త్వాం పుత్రశోకేన మగ్నం తమసి దుస్తరే ।
అతదర్హమనుస్మృత్య మహాపురుషగోచరమ్ ॥ 18

అనుగ్రహాయ భవతః ప్రాప్తావావామిహ ప్రభో ।
బ్రహ్మణ్యో భగవద్భక్తో నావాసాదితుమర్హసి ॥ 19

నీవు భగవద్భక్తుడవు, శోకమోహాదులచే అభిభూతుడ వగుటకు దగవని విచారించి మేమిరువురము ఇట్టి పుత్రశోకముచే ఘోరతర మగు మోహాంధకారమున నిమగ్నుడ వైయున్న నీపై గృపజూపుటకు నీ కడకు వచ్చితిమి. బ్రహ్మజ్ఞానసేవారతుడవు, భగవద్భక్తుడవు నగు నీవు శోకించుట తగదు.

తదైవ తే పరం జ్ఞానం దదామి గృహమాగతః ।
జ్ఞాత్వాన్యాభినివేశం తే పుత్రమేవ దదామ్యహమ్ ॥ 20

నే నొకప్పుడు నీయింటి కేతెంచితిని, అపుడు నీకు పరమజ్ఞానమును బోధించితిని, కాని నీ కితర విషయములయందు అనగా పుత్రలాభమునందు ఆసక్తి యుండుట గమనించియిపుడు నీకు పుత్రు నిచ్చితిని.

అధునా పుత్రిణాం తాపో భవతైవానుభూయతే ।
ఏవం దారా గృహా రాయో వివిధైశ్వర్యసమ్పదః ॥ 21

శబ్దాదయశ్చ విషయాశ్చలా రాజ్యవిభూతయః ।
మహీ రాజ్యం బలం కోషో భృత్యామాత్యసుహృజ్జనాః ॥ 22

సర్వేఽపి శూరసేనేమే శోకమోహభయార్తిదాః ।
గన్ధర్వనగరప్రఖ్యాః స్వప్నమాయామనోరథాః ॥ 23

ఇప్పుడ నీవు స్వయముగనే పుత్రవంతులదుఃఖము ననుభవించితివి. శూరసేనా! భార్య, గృహము, ధనము, వివిధము లగు నైశ్వర్యములు, శబ్దస్పర్శాదివిషయములు, రాజ్యైశ్వర్యము - ఇవియన్నియు ననిత్యములే. మహీరాజ్యము, సైన్యము, ధనాగారము, భృత్యులు, అమాత్యులు, బంధువులు - వీరందఱు భయము, మోహము, శోకము, బాధ మున్నగు వానిని గలిగింతురు. గంధర్వనగరమువలె వీరొకక్షణములో నున్న మఱియొక క్షణములో నుండరు. స్వప్నమాయా సంకల్పమువలె నివి క్షణకాలమే యుండును.

దృశ్యమానా వినార్థేన న దృశ్యన్తే మనోభవాః ।
కర్మభి ర్ధ్యాయతో నానా కర్మాణి మనసోఽభవన్ ॥ 24

రాజా! దృశ్యమానమగు నీ స్త్రీపుత్రాది విషయవైభవము మనః కల్పితము, ఈ విషయములకు వాస్తవ మగు సత్తా లేకపోవుట కాలాంతరమున నగపడదు. (అందువలన అనిత్యము); ప్రాక్తనకర్మవాసన వలన విషయములను జింతించుచుండగా మానవుని మనస్సునుండి నానావిధము లగు కర్మలు పుట్టును.

అయం హి దేహినో దేహో ద్రవ్యజ్ఞానక్రియాత్మకః ।
దేహినో వివిధక్లేశ సన్తాపకృదుదాహృతః ॥ 25

దేహాభిమాని యగు జీవునకు పృథివ్యాది పంచభూతాత్మకము, పంచజ్ఞానేంద్రియాత్మకము, పంచకర్మేంద్రియాత్మకము అనగా ఆధిభూతము, ఆధిదైవము, ఆధ్యాత్మము అను నీ దేహమే వివిధక్లేశములను అనగా ఆధిభౌతికము, ఆధిదైవికము, ఆధ్యాత్మికము ననునీ త్రివిధ దుఃఖములను సంతాపమును గలిగించు నని చెప్పబడినది.

తస్మాత్ స్వస్థేన మనసా విమృశ్య గతిమాత్మనః ।
ద్వైతే ధ్రువార్థవిశ్రమ్భం త్యజోపశమమావిశ ॥ 26

అందువలన నీవు శాంతచిత్తముతో నాత్మతత్త్వమును విచారించి అనగా నీ వెవరవు? ఎచటినుండి వచ్చితివి? చివర కెచటకు వెడలెదవు? శోకమోహాదులచే నీవు అభిభూతుడ వగుట యెందులకు?- అని యీవిధముగ విచారించి అనిత్యమైన యీ గృహాది ప్రపంచాదిద్వైతము అనగా కృష్ణేతరమైన ద్వితీయ వస్తువునందు నిత్యత్వ విశ్వాసమును పరిత్యజించి శాంతిని బొందుము.

**శ్రీనారద ఉవాచ**

ఏతాం మన్త్రోపనిషదం ప్రతీచ్ఛ ప్రయతో మమ ।
యాం ధారయన్ సప్తరాత్రాద్ద్రష్టా సంకర్షణం విభుమ్ ॥ 27

నారదుడు పలికెను:- రాజా! నీవు నిగ్రహము కలవాడవై నాచే నొసంగబడు పరమశ్రేయస్సున కాస్పదమైన ఈ మంత్రమును గ్రహించుము. దానిని స్వీకరించినచో ఏడు రాత్రులలో సంకర్షణభగవానుని దర్శనమును పొందగలవు.

**యత్పాదమూలముపసృత్య నరేన్ద్ర పూర్వే**
**శర్వాదయో భ్రమమిమం ద్వితయం విసృజ్య ।**
**సద్యస్తదీయమతులానధికం మహిత్వం**
**ప్రాపుర్భవానపి పరం న చిరాదుపైతి ॥ 28**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే చిత్రకేతూపాఖ్యానే
పంచదశోఽధ్యాయః ॥

రాజేంద్రా! ప్రాచీనులైన మహాదేవాది దేవతలు ఎవని పాదములను శరణుజొచ్చి తత్క్షణమే ద్వైతభ్రమనువిడచి అసదృశము సర్వాతిశయము నగు ఆయనమహిమను బొందిరో ఆపరమపదమును నీవును శీఘ్రముగనే పొందగలవు.

క్రింద వ్రాయబడు నాలుగుశ్లోకములను శ్రీమధ్వాచార్యానుయాయి యగు శ్రీపాద విజయధ్వజతీర్థులు తమటీక యందు అదనముగ నుదహరించినారు. వీనికిగూడ తాత్పర్యము వ్రాయబడుచున్నది.

**నానాత్వం జన్మనాశశ్చ క్షయో వృద్ధిః క్రియాఫలమ్ ।**
**ద్రష్టుశ్చ భాన్త్యతద్ధర్మా యథాగ్నేర్దాహ్య విక్రియాః ॥ 1**

అగ్నికి వృద్ధిక్షయాదివికారములు గలవని లోకమున నొక భ్రాంతి యున్నది. అట్లే 'నేను దేవతను, నేను మనుష్యుడను' అనునానాభావములు, పుట్టుక, నాశము, క్షయము, వృద్ధి, కర్మఫలము మున్నగు దేహధర్మము లన్నియు సాక్షియగు నాత్మయొక్క ధర్మములుగా లోకమున వెల్లడియైనవి.

**త ఇమే దేహసంయోగాదాత్మన్యాభాన్త్యసద్గ్రహాత్ ।**
**స్వప్నే యథా తథా నాన్యద్ధ్యాయేత్సర్వం భయంచ యత్ ॥ 2**

జాగ్రదవస్థయం దనుభూత మగుసర్పవ్యాఘ్రాదిభయ సంస్కారము వలన భయము కలుగునట్లు స్వప్నమునందు ఈసమస్తపదార్థ దర్శనము వలన భయము కలుగును. అనాదికాలమునుండి వచ్చు "దేహమే నేను" అనునిట్టి యభిమానము, దేహముతోడి

సంయోగమువలన గలుగు జనన మరణాది దేహధర్మము లన్నియు ఆత్మకు సంబంధించి నవిగనే వెల్లడి యైనవి. అందువలన నిట్టి యనర్థములకు గారణములను జింతింపరాదు.

ప్రసుప్త స్యానహంమానాన్న ఘోరా భాతి సంసృతిః ।
జీవతోఽపి యథా తద్వద్విముక్తస్యానహంమతేః ॥ 3

సుషుప్త్యవస్థలయం దభిమానము లేకపోవుట వలన జీవునిహృదయమున సంసార భావము కలుగునట్లు అహంకారశూన్యుడు, ముక్తుడునగు వ్యక్తికి గూడ జీవద్దశయందే సంసారభావము నశించును.

తస్మాదన్యన్మనోమాత్రం జహ్యాహంమమతాతమః ।
వాసుదేవే భగవతి మనో ధేహ్యాత్మనీశ్వరే ॥ 4

పుత్రాదిపదార్థములు కేవలము మానసికములైన రాగద్వేషజనిత పుణ్యాపాపములకే నిమిత్తము లగును. అందువలన "ఇది నేను, ఇది నాది" అనునిట్టి యహంకారమమకారమను అజ్ఞానమును పరిత్యజించి సర్వాంతర్యామి యగు వాసుదేవుని యందు మనస్సు నుంచవలెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
చిత్రకేతూపాఖ్యానము గల పదునైదవ అధ్యాయము
సంపూర్ణము.





# పదునాఱవ అధ్యాయము

## చిత్రకేతువు విరాగియగుట : సంకర్షణ దేవుని దర్శించుట

కథాసారము :- ఈ యధ్యాయమున చిత్రకేతువు మరణించిన తనపుత్రుని వలన తత్త్వోపదేశమును విని శోకము తొలగినవాడు కాగా వానికి నారదమహర్షి సంకర్షణునకు సంతోషమును గలుగజేయు మహావిద్య నుపదేశించుట యను విషయము వర్ణింపబడినది.

జీవాత్మ నిత్యుడు, అందువలన ఆయనకు జనన మరణాదులు లేవు. కర్మఫలము వలనజీవుడు దేవతిర్యగాది నానావిధయోనుల యందు పరిభ్రమించును. అనిత్య కాలమునకై పిత్రాదులతో గూడ సంబంధము నేర్పఱచుకొని బంధువులు, జ్ఞాతులు, శత్రువులు, మిత్రులు మున్నగు ద్వంద్వభావములతో గూడినవాడై యొకప్పుడు సుఖిగను, మఱియొకప్పుడు దుఃఖిగను భావించును. వాస్తవముగ నిత్య జీవస్వరూపమున నీయనిత్య సంబంధములు ఉండకపోవుటచే దానికై దుఃఖించుట తగదు.

చిత్రకేతువు తన భార్యలతో గలసి మరణించిన పుత్రుని వలన నిట్టి తత్త్వోపదేశమును విని పుత్రాదులను దుఃఖమునకు హేతువులని దెలిసికొని శోకమోహాదులకు నిలయమైన గృహమనెడి యంధకూపమునుండి బయల్వెడలెను. పుత్రునకు విషమిడిన కృతద్యుతి సవతులు గూడ తా మొనరించిన దుష్కృత్యమును స్మరించుకొని లజ్జితులై, పుత్రవాంఛను పరిత్యజించి యమునానదీతీరమున యథావిధిగ బాలహత్యవలన కలిగిన పాపమునకు ప్రాయశ్చిత్త మొనరించుకొనిరి.

పిమ్మట నారదముని చతుర్వ్యూహాత్మకుడగు నారాయణుని స్తుతించి పరమ భాగవతుడు, జితేంద్రియుడు నగు చిత్రకేతువునకు సృష్టిస్థితిలయముల కేకైక కారణుడు ప్రకృతీక్షణకర్తయునగు భగవానుని తత్త్వమును ఉపదేశించి బ్రహ్మలోకమునకు వెడలెను. ఈ భగవత్తత్త్వోపదేశమునకే మహావిద్యయను నామాంతరము కలదు. మహారాజగు చిత్రకేతు వీమహావిద్యా ప్రభావముచే నేడుదినముల పిమ్మట సనత్కుమారాది సిద్ధేశ్వరులచే బరివృతుడు, నీలాంబరధారియు, సముజ్జ్వల కిరీట కేయూరకంకణాద్య లంకారయుక్తుడు, ప్రసన్న వదనుడు నగు సంకర్షణుని కడకు వెడలి తద్దర్శనముచే ప్రేమపులకితుడై నమస్కరించి ఆయనను స్తుతింపసాగెను.

పిమ్మట చిత్రకేతువు, అనంతకోటి బ్రహ్మాండములు పరమాణువులవలె నెవరి రోమకూపముల యందు విరాజిల్లు చున్నవో ఆద్యంతరహితుడగు నాసంకర్షణ భగవానుని

యొక్క, తదుపాసకుల యొక్క నిత్యత్వము, అన్యదేవతల యొక్క తదుపాసకుల యొక్క యనిత్యత్వము, పరమహంస లగు మునులయొక్క ఉపాస్య మగు భాగవత ధర్మముయొక్క మహిమ, సంకర్షణ భగవానుని యొక్క యంతర్యామిత్వము కపటయోగుల దురధిగ మ్యత్వము మున్నగు విషయములను వర్ణింపగా అనంత దేవుడు ఆయనకు తన తత్త్వమును విశేషముగ వివరించెను. ఈ ప్రసంగముతో నీ యధ్యాయము ముగిసెను.

## శ్రీ బాదరాయణి రువాచ

అథ దేవఋషీ రాజన్ సంపరేతం నృపాత్మజమ్ ।
దర్శయిత్వేతి హోవాచ జ్ఞాతీనామనుశోచతామ్ ॥ 1

శుకుడు పలికెను:- రాజా! పిమ్మట దేవర్షియగు నారదుడు యోగబలముచే మరణించిన రాజపుత్రుని శోకాకులురైన బంధువులకు ప్రత్యక్షముగ జూపి యిట్లు పలికెను.

## శ్రీ నారద ఉవాచ

జీవాత్మన్ పశ్య భద్రం తే మాతరం పితరంచ తే ।
సుహృదో బాన్ధవాస్తప్తాః శుచా త్వత్కృతయా భృశమ్ ॥ 2

నారదుడు పలికెను :- ఓ జీవాత్మా! నీకు మేలు కలుగుగాక! నీ శోకముచే మిగుల పరితప్తులగు నీ తల్లిదండ్రులకు, ఆప్తులకు, బంధువులకు నీ దర్శనమిమ్ము.

కలేవరం స్వమావిశ్య శేషమాయుః సుహృద్వృతః ।
భుంక్ష్వ భోగాన్ పితృప్రత్తానధితిష్ఠ నృపాసనమ్ ॥ 3

(నీవు అపమృత్యువు వలన మృతుడవగుటచే నీ యాయుష్కాల మింకను మిగిలి యున్నది. అందువలన) నీవు మరల నీకళేబరము లోనికి ప్రవేశించి యాప్తులచే బరివృతుడవై మిగిలిన అయుష్కాలమును తండ్రిచే నీయబడిన రాజ్యము ననుభవింపుము. రాజ సింహాసనము నధిష్ఠింపుము.

## జీవ ఉవాచ

కస్మిన్ జన్మన్యమీ మహ్యం పితరో మాతరోఽభవన్ ।
కర్మభిర్భ్రామ్యమాణస్య దేవతిర్యఙ్ నృయోనిషు ॥ 4

జీవాత్మ పలికెను:- నేను కర్మవశమున దేవతిర్యఙ్నరయోనుల యందు తిరుగుచుందును. అందువలన వీరే జన్మములో నాకు దల్లిదండ్రులై యుండిరి?

బన్ధుజ్ఞాత్యరిమధ్యస్థమిత్రోదాసీనవిద్విషః ।
సర్వ ఏవ హి సర్వేషాం భవన్తి క్రమశో మిథః ॥ 5

ఈ యనాది సంసార ప్రవాహమున క్రమముగ నందఱు పరస్పరము బంధువులు (వివాహాదులచే సంబంధము ఏర్పడినవారు), జ్ఞాతులు, శత్రువులు, మిత్రులు, (రక్షకులు) మధ్యస్థులు (శత్రువులు మిత్రులు కాక యితరులు) ద్రవ్యాది క్రయవిక్రయ నిమిత్తమై శత్రువులు, ఉపేక్షకులు నగుదురు.

యథా వస్తూని పణ్యాని హేమాదీని తతస్తతః ।
పర్యటన్తి నరేష్వేవం జీవో యోనిషు కర్తృషు ॥ 6

క్రయవిక్రయ యోగ్యములగు సువర్ణాది వస్తువులు క్రమముగ వేఱు వేఱు మనుష్యుల చేతులలో తిరుగునట్లు జీవులుగూడ క్రమముగ నానావిధ యోనుల యందు పరిభ్రమించుచుందురు.

నిత్యస్యార్థస్య సంబన్ధో హ్యనిత్యో దృశ్యతే నృషు ।
యావద్యస్య హి సంబన్ధో మమత్వం తావదేవ హి ॥ 7

(జన్మాంతర విషయమట్లుండనీయుము, ఈ జన్మమందే జీవునితో అన్యజీవునకున్న సంబంధము అనిత్యము, దానికి దృష్టాంతముగ నీ శ్లోకము చెప్పబడుచున్నది.) పశ్వాదిజీవులతో అన్యజీవుల సంబంధము నిత్యమైనట్లు అగుపడుట లేదు. ఎంతవఱకే వస్తువుతో సంబంధ ముండునో, అంతవఱకా వస్తువుపై పురుషునకు మమకార ముండును. సంబంధము తొలగిపోయిన మమత్వముండదు.

ఏవం యోనిగతో జీవః స నిత్యో నిరహంకృతః ।
యావద్యత్రోపలభ్యేత తావత్ స్వత్వం హి తస్య తత్ ॥ 8

పిత్రాదులతో సంబంధము గల వాడయ్యును జీవుడు నిత్యుడే, ఏలయన వాస్తవములో దేహాదులె జన్మించునుగాని జీవుడు జన్మింపడు. జీవుడు నిరహంకారి అనగా 'నేను వీనిపుత్రుడ' నను అభిమానము లేనివాడు; జీవుడు కర్మవశమున నెంతకాలము వరకు ఏతండ్రితో సంబంధము గలవాడై యుండునో అంతకాలము వరకు ఆ తండ్రికి ఆపుత్రునియందు స్వత్వముండును, మరణించిన పిమ్మట తండ్రికి పుత్రసంబంధము లోపించును, దానికై దుఃఖించుట నిరర్థకము.

ఏష నిత్యోఽవ్యయః సూక్ష్మ ఏష సర్వాశ్రయః స్వదృక్ ।
ఆత్మమాయాగుణైర్విశ్వమాత్మానం సృజతే ప్రభుః ॥ 9

ఈ జీవుడు నిత్యవస్తువు, వీనికి క్షయముగాని వినాశముగాని లేదు. అతడు సూక్ష్మము అనగా జన్మాది శూన్యుడు, సర్వాశ్రయుడు అనగా ఉత్పత్తి లేదా జన్మించు స్వభావముకల దేహాదుల కాశ్రయుడు (తాను దేహాదులు మాత్రము కాడు.) స్వతః ప్రకాశస్వరూపుడు, ప్రభువు లేదా సామర్థ్యము గలవాడు అయ్యును తనమాయా గుణములచే తన్ను నానావిధ రూపములుగ సృష్టించుకొనును.

**న హ్యస్యాస్తి ప్రియః కశ్చిన్నాప్రియః స్వః పరోఽపి వా ।**
**ఏకః సర్వధియాం ద్రష్టా కర్తౄణాం గుణదోషయోః ॥ 10**

ఈ జీవునకు ప్రియమైనవాడు కాని అప్రియమైనవాడు కాని ఎవ్వడును లేడు. అతడు ఒక్కడే అనగా సుహృదాదుల యందాసక్తి రహితుడు, హితాహితకారి యగు మిత్రుడు, శత్రువుల విచిత్రబుద్ధికి ద్రష్ట, అనగా సాక్షిమాత్రుడు.

**నాదత్త ఆత్మా హి గుణం న దోషం న క్రియాఫలమ్ ।**
**ఉదాసీనవదాసీనః పరావరదృగీశ్వరః ॥ 11**

ఆత్మ సుఖమునుగాని, దుఃఖమునుగాని లేదా కర్మఫలజనిత మగు రాజ్యాదులనుగాని గ్రహించదు. అతడు కార్యకారణస్రష్ట, దేహాది పారతంత్ర్యశూన్యుడునై ఉదాసీనుని వలె నుండును. నాకును నీకును ఇట్టిభావము లేకపోవుటచే శోకింప బనిలేదు.

## శ్రీబాదరాయణిరువాచ

**ఇత్యుదీర్య గతో జీవో జ్ఞాతయస్తస్య తే తదా ।**
**విస్మితా ముముచుః శోకం ఛిత్వాత్మస్నేహ శృంఖలామ్ ॥ 12**

శుకదేవుడు పలికెను :- ఇట్లు పలికి జీవాత్మ వెడలిపోగా చిత్రకేతువు మున్నగు బాలుని జ్ఞాతులు వాని వాక్కులను విని విస్మితులై తమస్నేహమనెడి శృంఖలమును ఛేదించి శోకమును పరిత్యజించిరి.

**నిర్హృత్య జ్ఞాతయో జ్ఞాతేర్దేహం కృత్వోచితాః క్రియాః ।**
**తత్యజుర్దుస్త్యజం స్నేహం శోకమోహభయార్తిదమ్ ॥ 13**

పిమ్మట సపిండాది జ్ఞాతులు జ్ఞాతియొక్క (సపిండునియొక్క) దేహమును దహనము చేసి మృతున కుచితములైన శ్రాద్ధతర్పణాదుల నొనర్చి శోకమోహభయార్తిప్రదమగు దుస్త్యజ స్నేహమును విడచిపెట్టిరి.

బాలఘ్న్యో వ్రీడితాస్తత్ర బాలహత్యాహతప్రభాః ।
బాలహత్యావ్రతం చేరుర్బ్రాహ్మణైర్యన్నిరూపితమ్ ।
యమునాయాం మహారాజ స్మరన్త్యో ద్విజభాషితమ్ ॥ 14

మహారాజా! రాణియగు కృతద్యుతియొక్క బాలుని జంపినవారు విషమిడినవారు నగు సవతులు బాలహత్యా జనితపాపముచే కాంతివిహీనలై తా మొనరించిన దుష్కర్మమునకు మిగుల సిగ్గుపడినవారై 'పుత్రాదులు దుఃఖమునకు హేతువు' లని అంగిరసుని వాక్కులను స్మరించి పుత్రవాంఛను బరిత్యజించి విప్రులచే నిరూపింపబడిన విధి ననుసరించి యమునా నది యొడ్డునకు వెడలి బాలహత్యకు ప్రాయశ్చిత్తము చేసికొనిరి.

స ఇత్థం ప్రతిబుద్ధ్వాత్మా చిత్రకేతుర్ద్విజోక్తిభిః ।
గృహాన్ధకూపాన్నిష్క్రాన్తం సరఃపంకాదివ దివ ద్విపః ॥ 15

నారదుడు అంగిరసుడు పలికిన వాక్కులచే ప్రతిబోధితుడై చిత్రకేతువు సరోవరము నందున్న పంకమునుండి బయల్వెడలిన ఏనుగువలె గృహమనెడు అంధకూపము నుండి నిర్గమించెను.

కాలిన్ద్యాం విధివత్ స్నాత్వా కృతపుణ్యజలక్రియః ।
మౌనేన సంయతప్రాణో బ్రహ్మపుత్రావవన్దత ॥ 16

పిమ్మట రాజు యమునయందు యథావిధిగ స్నానమొనరించి దేవ ఋషిపితృ తర్పణాదులను బూర్తిచేసి మౌనియు సంయతచిత్తుడు నైనారదాంగిరసులకు ప్రణామ మొనరించెను.

అథ తస్మై ప్రపన్నాయ భక్తాయ ప్రయతాత్మనే ।
భగవాన్ నారదః ప్రీతో విద్యామేతాామువాచ హ ॥ 17

అనంతరము నారదమహర్షి సంతుష్టుడై శరణాగతుడు, జితేంద్రియుడు, భక్తుడు నగు చిత్రకేతువునకు జెప్పబోవు విద్య నుపదేశించెను.

ఓం నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ ధీమహి ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ నమః సంకర్షణాయ చ ॥ 18

నమో విజ్ఞానమాత్రాయ పరమానన్దమూర్తయే ।
ఆత్మారామాయ శాన్తాయ నివృత్త ద్వైతదృష్టయే ॥ 19

(నారదోపదిష్టమైన విద్య యిట్లున్నది) ప్రణవాత్మకుడ వగు దేవా! నీకు నమస్కారము, వాసుదేవా! నేను నిన్ను మనస్సుతో ధ్యానించు చున్నాను. ప్రద్యుమ్నా! అనిరుద్ధా! సంకర్షణా!

నీకు నమస్కారము. చిచ్ఛక్తిమంతుడా! నీకు నమస్కారము. పరమానందమూర్తీ! ఆత్మారామా! శాంతుడా! ద్వైతము అనగా బ్రహ్మము, పరమాత్మ, భగవానుడు నను మూడువిధములగు తత్త్వములచేత భేదజ్ఞాన నివర్తకుడవైన అద్వయజ్ఞానుడా నీకు నమస్కారము.

ఆత్మానన్దానుభూత్యైవ న్యస్తశక్త్యూర్మయే నమః ।
హృషీకేశాయ మహతే నమస్తేఽనన్తమూర్తయే ॥ 20

స్వస్వరూపభూతమగు ఆనందముయొక్క అనుభూతి ద్వారా మాయాజనితములైన రాగద్వేషాది తరంగములను తొలగించు నీకు నమస్కారము. నీవు హృషీకేశుడవు అనగా సర్వేంద్రియముల కధిష్ఠాతవు, అనంతమూర్తివి, గొప్పవాడవు, అట్టినీకు నమస్కారము.

వచస్యు పరతేఽప్రాప్య య ఏకో మనసా సహ ।
అనామరూపశ్చిన్మాత్రః సోఽవ్యాన్నః సదసత్పరః ॥ 21

మనస్సుతో పాటు వాక్కు ఎవనిని పొందలేక విరతమగునో, ఎవడు నామరూప వివర్జితుడు, చిన్మాత్రుడు అనగా కేవల జ్ఞానమయుడు అనగా స్థూలసూక్ష్మముల కంటె అతీతుడు, ఏకమాత్రుడు అనగా నిర్విశేషబ్రహ్మ స్వరూపుడు నై యున్నాడో ఆయన మనలను రక్షించుగాక! (ఈశ్లోకమున భగవానునియొక్క అసమ్యగావిర్భావబ్రహ్మ స్వరూపస్తవము వర్ణింప బడినది).

యస్మిన్నిదం యతశ్చేదం తిష్ఠత్యప్యేతి జాయతే ।
మృణ్మయేష్వివ మృజ్జాతిస్తస్మై తే బ్రహ్మణే నమః ॥ 22

మట్టికుండ మట్టినుండి పుట్టును, మట్టియందు ఉండును. ఆ మట్టియందే లీనమగును. అట్లే యీ కార్యకారణత్మక మగు విశ్వము నీనుండియె జన్మించును, నీయందే యుండును, నీయందే లీనమగును. అట్టి బ్రహ్మ స్వరూపుడవగు నీకు నమస్కారము.

యన్న స్పృశన్తి న విదుర్మనోబుద్ధీన్ద్రియాసవః ।
అన్తర్బహిశ్చ వితతం వ్యోమవత్తన్నతోఽస్మ్యహమ్ ॥ 23

(సాంఖ్యులు దృశ్యమునకు, ప్రధానమునకు లేదా తత్పరిణామదేహమునకు, ఇంద్రియములకు, బుద్ధికి; కొందఱు జీవునకు ద్రష్టుసంజ్ఞ నిచ్చు చున్నారు. అట్టియపవిత్ర మగు నభిప్రాయమును నిరసించుట కీశ్లోకద్వయము చెప్పబడినది) ఏ బ్రహ్మము ఆకాశమువలె నిర్లిప్త భావముతో సర్వవస్తులకు లోపల బయట నున్నదో, మనస్సు బుద్ధి ఇంద్రియములు ప్రాణములు ఎవనిని స్పృశించుటకు గాని, తెలిసికొనుటకుగాని సమర్థములు కావో, నే నట్టి బ్రహ్మమునకు నమస్కరించు చున్నాను.

దేహేన్ద్రియప్రాణమనోధియోఽమీ
యదంశవిద్ధాః ప్రచరన్తి కర్మసు ।
నైవాన్యదా లౌహమివాప్రతప్తం
స్థానేషు తద్ద్రష్ట్రపదేశమేతి ॥ 24

లోహము అగ్నిశక్తిచే దహనసామర్థ్యమును బొందునట్లు దేహము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సు, బుద్ధి, అనునీ (దృశ్యజడ) పదార్థములు చైతన్యాంశముతో గూడినవై తమతమ పనులయందు ప్రవృత్తము లగును. అగ్ని లేనిదే లోహము అన్యవస్తువులను దహింప జాలనట్లు దేహాదులైన జడేంద్రియములు అచైతన్యావస్థ యందు తమతమ కర్మలయందు ప్రవర్తింప జాలవు. అందువలన సర్వావస్థలలోను బ్రహ్మ మొక్కటియె ద్రష్టృసంజ్ఞను గలిగియుండును.

(లోహ మగ్నిశక్తిచే దాహకశక్తిని బొంది అగ్నిని దహింపజాలనట్లు బ్రహ్మశక్తి చేతనే తమతమ విషయముల యందు ప్రవర్తిల్లు దేహాదులు బహుద్రష్టృ రూపములతో బ్రహ్మమును జూడజాలవు. ఇంకను దేహమున కంటె నతిరిక్తుడైన జీవుడు బ్రహ్మాత్మకు డగుటచే వానిని స్వతంత్రద్రష్టృ యని చెప్పుటకు వీలులేదు. అందువలన బ్రహ్మమె ఏకైకద్రష్ట - ఇది భావార్థము).

ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ మహావిభూతి పతయే సకలసాత్వతపరివృఢ నికరకరకమల కుట్మలోపలాలిత చరణార విన్దయుగల పరమపరమేష్ఠిన్ నమస్తే ॥ 25

గుణాతీతా! పరమేష్ఠీ! (సర్వేశ్వరా!) నీ చరణారవింద యుగళము సాత్వతభక్తశ్రేష్ఠుల కరకమల కుట్మలములచే సేవింపబడినది. నీవే భగవానుడవు, మహాపురుషుడవు, మహానుభావుడవు, మహావిభూతి కథిపతివి, అట్టినీకు నమస్కారము.

## శ్రీశుక ఉవాచ

భక్తాయైతాం ప్రపన్నాయ విద్యామాదిశ్య నారదః ।
యయావఙ్గిరసా సాకం ధామ స్వాయమ్భువం ప్రభో ॥ 26

శుకుడు పలికెను :- రాజా! శరణాగతుడు, భగవద్భక్తుడు నగు చిత్రకేతువునకు నారదుడీ విద్య నుపదేశించి అంగిరసునితో గూడ బ్రహ్మ లోకమునకు వెడలెను.

చిత్రకేతుస్తు తాం విద్యాం యథా నారదభాషితామ్ ।
ధారయామాస సప్తాహమబ్భక్షః సుసమాహితః ॥ 27

చిత్రకేతువు గూడ కేవలము జలమును మాత్రము స్వీకరించి సావధాన చిత్తముతో నారదుడు చెప్పిన యావిద్యను యథోచితముగ నేడు దినములు జపించెను.

**తతః స సప్తరాత్రాన్తే విద్యయా ధార్యమాణయా ।**
**విద్యాధరాధిపత్యంచ లేభేఽప్రతిహతం నృప ॥ 28**

రాజా! పిమ్మట చిత్రకేతువు ఆవిద్య నభ్యసించి తత్ప్రభావముచే నేడు రాత్రులు గడచిన తరువాత అప్రతిహతమగు విద్యాధరాధిపత్యమును అవాంతర ఫలముగ బొందెను.

**తతః కతిపయాహోభిర్విద్యయేద్ధమనోగతిః ।**
**జగామ దేవదేవస్య శేషస్య చరణాన్తికమ్ ॥ 29**

పిమ్మట కొన్ని దినములలోనే యావిద్యా ప్రభావముచే ప్రదీప్తమగు మనోగతిని బొంది దేవదేవుడగు అనంతదేవుని పాదములకడకు చేరెను.

**మృణాలగౌరం సితివాససం స్ఫురత్**
**కిరీట కేయూర కటిత్ర కంకణమ్ ।**
**ప్రసన్న వక్త్రారుణలోచనం వృతం**
**దదర్శ సిద్ధేశ్వరమణ్డలైః ప్రభుమ్ ॥ 30**

అచట నతడు మృణాలమువలె గౌరకాంతి కలవాడును, నీలాంబరమును ధరించిన వాడును, సముజ్జ్వలములైన కేయూరములు కటిసూత్రము కంకణములు మున్నగు నలంకారములతో గూడినవాడును, ప్రసన్న వదనుడును, అరుణలోచనుడును, సనత్కుమారాది సిద్ధేశ్వరులచే బరివృతుడును నగు సంకర్షణ భగవానుని దర్శించెను.

**తద్దర్శనధ్వస్తసమస్తకిల్బిషః**
**స్వస్థామలాన్తః కరణోఽభ్యయాన్మునిః ।**
**ప్రవృద్ధభక్త్యా ప్రణయాశ్రులోచనః**
**ప్రహృష్టరోమానమదాది పూరుషమ్ ॥ 31**

ఆయనను దర్శించినంత మాత్రముననే చిత్రకేతువుయొక్క సర్వపాపములు నశించెను. అంతఃకరణము స్వరూపస్థము, నిర్మలము నయ్యెను. అతడు మౌనభావముతో ప్రేమాశ్రువులను విడచుచు సంతోషముచే పులకితుడై ఆత్యంతిక భక్తితో ఆదిపురుషుడగు సంకర్షణునకు ప్రణమిల్లెను.

స ఉత్తమఃశ్లోకపదాబ్జవిష్టరం
ప్రేమాశ్రులేశైరుపమేహయన్ముహుః ।
ప్రేమోపరుద్ధాఖిలవర్ణ నిర్గమో
నైవాశకత్తం ప్రసమీడితుం చిరమ్ ॥ 32

చిత్రకేతువు ప్రేమాశ్రుధారలతో ఉత్తమశ్లోకుడగు సంకర్షణుని పాదపద్మతలము నందున్న ఆసనమును మాటిమాటి కభిషేకించు చుండెను. ప్రేమగద్గద కంఠముతో వర్ణములను పలుకజాలనివా డగుటచే బహుకాల మాయనను స్తుతింప లేకపోయెను.

తతః సమాధాయ మనో మనీషయా
బభాష ఏతత్ప్రతిలబ్ధవాగసౌ ।
నియమ్య సర్వేన్ద్రియబాహ్య వర్తనం
జగద్గురుం సాత్వతశాస్త్రవిగ్రహమ్ ॥ 33

పిమ్మట బుద్ధితో మనస్సును వశముచేసికొని, ఇంద్రియముల బాహ్యావృత్తులను నిరోధించి మరల వాక్శక్తిని బొంది యాచిత్రకేతువు నారద పంచరాత్ర ప్రభృతిభక్తి శాస్త్రములు చెప్పిన విధమున సచ్చిదానంద విగ్రహుడు జగద్గురువు నగు భగవాను నిట్లు స్తుతించెను.

## చిత్రకేతురువాచ

అజిత జితః సమమతిభిః
సాధుభిర్భవాన్ జితాత్మభిర్భవతా ।
విజితాస్తేఽపి చ భజతా -
మకామాత్మనాం య ఆత్మదోఽతికరుణః ॥ 34

చిత్రకేతువు పలికెను :- అజితుడా! నీ వితరులచే జయింపబడని వాడవయ్యును సమచిత్తులగు సాధువులచే జయింపబడితివి. అనగా వారు నిన్ను తమ యధీనములో నుంచుకొనిరి. దానికి గారణ మేమియనగా, నీవు గొప్ప దయగలవాడవు, నిష్కామ భజనకారులకు నిన్ను నీవు సమర్పించు కొంటివి. అందువలన నీవుగూడ వారిని వశము చేసికొంటివి.

తవ విభవః ఖలు భగవాన్ జగదుదయస్థితియాదీని ।
విశ్వసృజస్తేఽంశాంశా- స్తత్ర మృషా స్పర్ధన్తి పృథగభిమత్యా ॥ 35

దేవా! జగత్తుయొక్క ఉత్పత్తి స్థితిలయ ప్రవేశనియమాదులు వాస్తవముగ నీలీలలె. విశ్వస్రష్టలగు నా బ్రహ్మాదిదేవతలు నీ యంశాంశలే. అనగా నీయంశలగు పురుషావతారముల యొక్క అంశలు, సృష్ట్యాది కార్యముల యందు వారు వేఱువేఱుగ నీశ్వరులమని యభిమానపడుట వ్యర్థమే యగును.

పరమాణు పరమ మహతో - స్త్వమాద్యన్తాన్తరవర్తీ త్రయవిధురః ।
ఆదావన్తేఽపి చ సత్త్వానాం యద్ధ్రువం తదేవాన్తరాళ్ఽపి ॥ 36

జగత్సృష్టికి మూలభూతములైన సూక్ష్మకారణ పరమాణువుల యందును, అంతిమములైన మహత్కార్యముల యందును, వాని యన్నింటి యొక్క ఆదిమధ్యాంతములలోను నీవే విరాజిల్లుచున్నావు. నీవు స్వయముగ అది మధ్యాంత రహితుడవు. సత్త్వముచే ప్రతీయమానము లగు కార్యముల ఆద్యంతముల యందు స్థిరముగను, అనశ్వర రూపముగను నీవే యున్నావు. అంతరాళము నందును నీవే యున్నావు. అందువలన నీవే నిత్యమైనవాడవు. (అందువలన నీవే సర్వకారణ మైన వాస్తవ వస్తువవు. ఇతరమైన దంతయు కార్యజాత మగుటచే అవాస్తవము.)

క్షిత్యాదిభిరేషకిలా - వృతః సప్తభిర్దశగుణో త్తరైరణ్డకోశః ।
యత్ర పతత్యణుకల్పః సహాణ్డకోటికోటిభిస్తదనన్తః ॥ 37

వెనుకటివానికంటె ఉత్తరోత్తరము పదిరెట్లు అధికములైన పృథివ్యప్తేజో వాయురాకాశములు, మహత్తు, అహంకారము - అను నీ యేడు ప్రకృతులచే నీ బ్రహ్మాండము ఆవరింపబడి యున్నది. ఈ బ్రహ్మాండముతో గూడ నింకను కోట్లకొలది బ్రహ్మాండములు నీయందు పరమాణువుల వలె దిరుగుచున్నవి. ఆ నీవు అనంతుడ వని ప్రసిద్ధి చెందితివి.

విషయతృషో నరపశవో య ఉపాసతే విభూతీర్న పరం త్వామ్ ।
తేషామాశిష ఈశ తదను వినశ్యన్తి యథా రాజకులమ్ ॥ 38

ఈశా! విషయ సుఖముల యందు మగ్నులైయున్న నరపశువులు సర్వోత్తముడ వగు నిన్ను పరిత్యజించి నీవిభూతులైన ఇంద్రాదిదేవతల నుపాసింతురు. రాజదత్తములైన సేవకుల భోగ్యములు రాజకులము నాశమైన పిమ్మట నశించునట్లు వారి యాదేవదత్తములైన భోగ్యవస్తువులు గూడ ఆయాదేవతలు నశించిన పిమ్మట వినష్టములగను.

కామధియస్త్వయి రచితా న పరమ రోహన్తి యథా కరమ్భబీజాని ।
జ్ఞానాత్మన్యగుణమయే గుణగణతోఽస్య ద్వన్ద్వజాలాని ॥ 39

పరమాత్మా ! రాజ్యలాభాది వాంఛలకు వశులై యెవరు జ్ఞానాత్ముడవు నిర్గుణుడవు నగు నిన్ను ఉపాసింతురో, దగ్ధబీజమునుండి యంకురము పుట్టనట్లు వారికి దేహోత్పత్తికాదు.

గుణముల వలననే జీవునకు సంసారము, సుఖదుఃఖాదిద్వంద్వభావము కలుగును. నీవు నిర్గుణుడ వగుటచే నీ సేవ వలన నది సంఘటిల్లదు. కాని నిర్గుణత్వమే లభించును.

**జితమజిత తదా భవతా**
**యదాహ భాగవతం ధర్మమనవద్యమ్ ।**
**నిష్కించనా యే మునయ**
**ఆత్మారామా యముపాసతే ఽపవర్గాయ ॥ 40**

అజితుడా ! నీవు నిన్ను బొందుట కుపాయభూతము, అనవద్యమునగు భాగవత ధర్మమును జెప్పితివి, అప్పుడు నీకే జయము కలిగినది. నిష్కించను లగు సనత్కుమారాదులు ఆత్మారాము లగు మునులుగూడ అపవర్గమును బొందుటకై నిన్నే యుపాసించుచుందురు. (లేదా భాగవత ధర్మమునె యుపాసింతురు.)

**విషమమతిర్న యత్ర నృణాం త్వమహమితి మమ తవేతి చ యదన్యత్ర ।**
**విషమధియా రచితో యః స హ్యావిశుద్ధః క్షయిష్ణురధర్మబహులః ॥41**

ఇతరములైన కామ్యకర్మరూపధర్మములయందు "నీవు నేను, నాది నీది" యను విషమబుద్ధి కలుగునట్లు ఈ భాగవతధర్మమునందు మానవులకు ఎట్టిబుద్ధియు లేదు. శత్రుమారణాది వాంఛలతో విషమబుద్ధిరచిత మైన ధర్మము రాగద్వేషాదియుక్త మగుటచే అవిశుద్ధము, నశ్వరము, హింసాది బాహుళ్య ప్రయుక్తము నగును. అది అధర్మబహుళము.

**కః క్షేమో నిజపరయోః కియాన్ వార్థః స్వపరద్రుహా ధర్మేణ ।**
**స్వద్రోహాత్ తవ కోపః పరసంపీడయా చ తథాధర్మః ॥ 42**

తనకు నితరులకు ద్రోహమును గలుగజేయు ధర్మము అనగా కాయక్లేశముద్వారా తనకు ద్రోహమును, పరహింసవలన ఇతరులకు ద్రోహమును గలుగజేయు నేధర్మము కలదో దానివలన తనకుగాని ఇతరులకుగాని క్షేమము కలుగునా? ఏవస్తువైన లభించునా? స్వద్రోహమువలన తనకు బాధ, పరపీడనమువలన అధర్మము కలుగును. నీకు క్లేశము కలుగును.

(అందువలన నీవు కేవలము రాగాంధవ్యక్తిని ఏదియోనొకవిధ మగు వేదమార్గమున ప్రవర్తింపజేయుటకే కామ్యధర్మము నుపదేశించితివి కాని తత్త్వదృష్టితో నుపదేశింపలేదు.)

**న వ్యభిచరతి తవేక్షా యయా హ్యభిహితో భాగవతో ధర్మః ।**
**స్థిరచరసత్త్వకదంబే ష్వపృథగ్ధియో యముపాసతే త్వార్యాః ॥ 43**

నీ వేదృష్టితో భాగవత ధర్మమును నిరూపించితివో (కామ్యకర్మలవలె) ఆ నీదృష్టి యెప్పుడును పరమార్థవ్యభిచారిణికాదు. అందువలన స్థావరజంగమప్రాణులయందు సమ దృష్టికలవారు, ఆర్యులు, శ్రేష్ఠులు నగు వ్యక్తులె నీ యీ భాగవతధర్మము నుపాసింతురు.

**న హి భగవన్నఘటితమిదం త్వద్దర్శనాన్నృణామఖిలపాపక్షయః ।**
**యన్నామసకృచ్ఛ్రవణాత్ పుల్కశోఽపి విముచ్యతే సంసారాత్ ॥44**

దేవా ! నీ దర్శనము వలన మానవుల సర్వపాపములు నాశనమగుట అసంభవముకాదు. ఏలయన, నీనామము నొక్కమా ఉచ్చరించినచో పుల్కశుడు అనగా అధార్మికు డగు చండాలుడుగూడ సంసారమునుండి ముక్తుడగును. (అందువలన నీదర్శనమువలన నేపాపములు నశించునో వానిని గుఱించి యిక చెప్పునదేమి?)

**అథ భగవాన్ వయమధునా త్వదవలోకపరిమృష్టాశయమలాః ।**
**సురఋషిణా యత్కథితం తావకేన కథమన్యథా భవతి ॥ 45**

అందువలన ఓదేవా! నిన్ను చూచుటవలననే యిపుడు మాయంతః కరణముల యందలి సర్వపాపములు, వాని కార్యములైన రాగలోభాదులు నశించినవి. నీభక్తుడగు నారదుడు చెప్పినది యెప్పుడును వేఱువిధముగ గాజాలదు. అనగా తదుపదేశము వలననే నిదర్శనమును బొందితిమి.

**విదితమనంత సమస్తం తవ జగదాత్మనో జనైరిహాచరితమ్ ।**
**విజ్ఞాప్యం పరమగురోః కియదివ సవితురివ ఖద్యోతైః ॥ 46**

అనంతా! ఈ సంసారమున జనులాచరించునది యేదియైనను అంతర్యామి రూపుడవగు నీకుదెలియనిదికాదు. సూర్యునియెదుట మిణుగురు పురుగునకు ప్రకాశనీయ మగు వస్తు వేదియు లేనట్లు పరమగురుడ వగు (సర్వప్రకాశకుడవగు) నీకు మావంటివారు తెలుపవలసిన దేదియులేదు. (నీకు సర్వము తెలియు ననియర్థము.)

**నమస్తుభ్యం భగవతే సకలజగత్ స్థితిలయోదయేశాయ ।**
**దురవసతాత్మగతయే కుయోగినాం భిదా పరమహంసాయ ॥ 47**

నీవు జగదుత్పత్తిస్థితిలయకర్తవు, భేదదృష్టివలన విషయా విష్టచిత్తులగు కుయోగులకు నీ తత్త్వము తెలియదు. నీవు పరమహంసవు అనగా అతివిశుద్ధుడవు. నీవు భగవానుడవు, అనగా షడైశ్వర్య పూర్ణుడవు. అట్టి నీకు నమస్కారము.

యం వై శ్వసన్తమను విశ్వసృజః శ్వసన్తి
యం చేకితానమను చిత్తయ ఉచ్చకన్తి ।
భూమణ్డలం సరషపాయతి యస్య మూర్ధ్ని
తస్మై నమో భగవతేఽస్తు సహస్రమూర్ధ్నే ॥ 48

నీవు ప్రయత్నపరుడ వైన పిమ్మట విశ్వస్రష్ట యగు బ్రహ్మ మున్నగు దేవతలు ప్రయత్నపరులుగుదురు. నీవు దర్శించిన పిమ్మట జ్ఞానేంద్రియములు ప్రయత్నపరము లగును. నీశిరోభాగమున ఈ భూమండలము ఆవగింజ వలె విరాజిల్లుచున్నది. సహస్రశీర్షుడ వగు నీకు నమస్కరించు చున్నాను.

## శ్రీశుక ఉవాచ

సంస్తుతో భగవానేవమనన్తమభాషత ।
విద్యాధరపతిం ప్రీతశ్చిత్రకేతుం కురూద్వహ ॥ 49

శుకుడు పలికెను :- కురుశ్రేష్ఠా! (పరీక్షిన్మహారాజా!) భగవానుడగు అనంతదేవుడిట్టి స్తుతిచే సంతుష్టుడై విద్యాధరాధిపతి యగు చిత్రకేతువుతో నిట్లు పలికెను.

## శ్రీభగవానువాచ

యన్నారదాఙ్గిరోభ్యాం తే వ్యాహృతం మేఽనుశాసనమ్ ।
సంసిద్ధోఽసి తయా రాజన్ విద్యయా దర్శనాచ్చ మే ॥ 50

భగవానుడైన అనంతదేవుడు పలికెను:- రాజా! నారదుడు అంగిరసుడు నా సంబంధమగు నేవిద్యను నీ కుపదేశించిరో ఆవిద్యాబలము చేత, నాదర్శన ప్రభావముచేత నీవు కృతకృత్యుడ వైతివి.

అహం వై సర్వభూతాని భూతాత్మా భూతభావనః ।
శబ్దబ్రహ్మ పరంబ్రహ్మ మమోభే శాశ్వతీ తనూ ॥ 51

నేనే స్థావరజంగమాత్మకమగు భూతసమూహమును, నేనే సర్వమున కాత్మను, భూతభావనుడను, అనగా భూతప్రకాశకుడను, శబ్దబ్రహ్మము పరబ్రహ్మము - అను నీరెండును నానిత్య తనువులు.

లోకే వితతమాత్మానం లోకంచాత్మని సన్తతమ్ ।
ఉభయంచ మయా వ్యాప్తం మయి చైవోభయం కృతమ్ ॥ 52

భోగ్యాత్మక మగు ప్రపంచమున ఆత్మ భోక్తృత్వరూపమున వ్యాప్తమై యున్నది. ఆత్మయందు ఈ ప్రపంచము భోగ్యత్వరూపమున వ్యాప్తమై యున్నది. ఈ రెండును కారణాత్మకుడ నగు నాచే వ్యాప్తమైనవి అనగా నాయందే యీరెండును కల్పితములైనవని తెలిసికొనుము.

**యథా సుషుప్తః పురుషోః విశ్వం పశ్యతి చాత్మని ।**
**ఆత్మానమేక దేశస్థం మన్యతే స్వప్న ఉత్థితః ॥ 53**

**ఏవం జాగరణాదీని జీవస్థానాని చాత్మనః ।**
**మాయామాత్రాణి విజ్ఞాయ తద్ద్రష్టారం పరం స్మరేత్ ॥ 54**

నిద్రావస్థయందు సుషుప్తుడగు నేపురుషుడైన మరల స్వప్నమును జూచుచు భ్రమవలన గిరినదీవనాత్మక మగు విశ్వము దూరస్థమయ్యును దాని నంతటిని తనయాత్మయందు దర్శించును, ఇంకను స్వప్నమునందే లేచి తన్ను మనుష్య రూపమున శయ్యయందేక దేశమున నున్నట్లుగ భావించును, అట్లే జాగరణాది జీవోపాధి విశిష్టమగు బుద్ధియొక్క యవస్థలు పరమాత్మయొక్క మాయామాత్రములు అనగా మాయాకల్పితములని యెఱింగి పైన చెప్పబడిన అవస్థలు లేనివాడు, సర్వమునకు ద్రష్టరూపముతో నున్నవాడు నగు పరమాత్మను స్మరింపుము.

**యేన ప్రసుప్తః పురుషః స్వాపం వేదాత్మనస్తదా ।**
**సుఖంచ నిర్గుణం బ్రహ్మ తమాత్మానమవేహి మామ్ ॥ 55**

ప్రసుప్తుడగు పురుషుడు అనగా జీవుడు దేనిద్వారా నిద్రావస్థ యందు తననిద్రను, అతీంద్రియ సుఖమును దెలిసికొను నన్నే ఆ వ్యాపకమైన ఆత్మ యని తెలిసికొనుము.

**ఉభయం స్మరతః పుంసః ప్రస్వాపప్రతిబోధయోః ।**
**అన్వేతి వ్యతిరిచ్యేత తజ్జ్ఞానం బ్రహ్మ తత్పరమ్ ॥ 56**

పురుషుడు నిద్రాజాగ్రదవస్థల రెంటిని అనుభవించువాడు. అతడాయవస్థలలో అనుగతుడయ్యును వాస్తవములో వానికంటె వేఱుగ నున్నాడు. సర్వావస్థలలోను నుండు అఖండము ఏకరసము నగు జ్ఞానమే బ్రహ్మము, అదియే పరబ్రహ్మము.

వివరణము :- నిద్రావస్థయందు స్వప్నసాక్షి యగు పరమాత్మను దృష్ట విషయమగు జాగ్రదవస్థ యందు జీవుడెట్లు స్మరించును? ఏలయన, ఒకని కనుభవసిద్ధమగు విషయ మెప్పుడును ఇతరునకు స్మృతిగోచరము కాదు. నిద్రాజాగరణము లను రెండవస్థల నన్వేషించు పురుషుని నిద్ర నిద్రాజాగ్రదవస్థల రెండింటియొక్క ప్రకాశక రూపముతో నున్నది.ఆ రెండవస్థల కంటెను వేఱుగ నున్న బ్రహ్మపదవాచ్య మగు జ్ఞానము చిన్మాత్ర బ్రహ్మముకంటె భిన్నముకాదు. బాల్యమునందు అనుభవించిన పదార్థములు యౌవనము

నందును స్మృతికి వచ్చునట్లు నిద్రావస్థయందను భూతమగు విషయముగూడ జాగ్రదవస్థ యందు అనుభవమునకు విషయమగును. దానికి గారణము జ్ఞాతయగు ఆత్మ సర్వావస్థల యందును అవికృతరూపముతో విరాజిల్లుచుండుటయే.

**యదేతద్విస్మృతం పుంసో మద్భావం భిన్నమాత్మనః ।**
**తతః సంసార ఏతస్య దేహాద్దేహో మృతేర్మృతిః ॥ 57**

పురుషుడు ఆబ్రహ్మ స్వరూపమును మఱచి తన్ను పరమాత్మకంటె భిన్నుడుగ (ఒక స్వతంత్ర పురుషుడు లేదా ఈశ్వరునిగ) భావించును. అప్పుడే భేదదర్శనము వలన జీవునకు సంసారము కలుగును. అనగా భేదదర్శనము వలన దేహపుత్రాదుల యందు 'నేను, నాది' యను అధ్యాత్మ జనితమగు కర్మద్వారా దేహమునుండి దేహాంతరము అనగా దేవమనుష్యాది జన్మ పరంపర, క్రమముగ మృత్యువు తరువాత మరణము సంఘటిల్లును.

**లబ్ధ్వేహ మానుషీం యోనిం జ్ఞానవిజ్ఞానసంభవామ్ ।**
**ఆత్మానం యో న బుధ్యేత న క్వచిత్ క్షేమమాప్నుయాత్ ॥ 58**

మానవ శరీరమందు ఆత్మతత్త్వ ప్రతిపాదకమగు శాస్త్రజ్ఞానము, అనుభవజన్య జ్ఞానము రెండును సంభవములగును. పుణ్యభూమి యగు నీభారత వర్షమున ఆ మానవ జన్మను బొందియు నేవ్యక్తి తన్ను దెలిసికొనజాలడో అతడొకప్పుడు దేవాది జన్మలను పొందినను నిజమైన శ్రేయస్సును బొందజాలడు.

**స్మృత్వేహాయాం పరిక్లేశం తతః ఫలవిపర్యయమ్ ।**
**అభయం చాప్యనీహాయాం సంకల్పాద్విరమేత్కవిః ॥ 59**

లౌకిక వైదిక కామ్యకర్మల వలన క్లేశము, ఫలవిపర్యయము అనగా నిరతిశయమగు సుఖముయొక్క అప్రాప్తి, దుఃఖముయొక్క అపరిహారము కలుగును. నిష్కామభావముతో భగవానునకు సర్వకర్మలను సమర్పించుట వలన అభయము అనగా నిరతిశయమగు సుఖప్రాప్తి, దుఃఖపరిహారము కలుగును. వీనిని స్మరించి వివేకి యగు మానవుడు సంకల్పముల నుండి నిరతుడు కావలెను.

**సుఖాయదుఃఖమోక్షాయ కుర్వాతే దమ్పతీ క్రియాః ।**
**తతో నివృత్తిరప్రాప్తిర్దుఃఖస్య చ సుఖస్య చ ॥ 60**

స్త్రీ పురుషులిర్వురు సుఖప్రాప్తి కొఱకు దుఃఖనివృత్తి కొఱకు కర్మల జేయుదురు. కాని యాకర్మ సకామమగుటచే సుఖప్రాప్తి లేదా దుఃఖనివృత్తి కలుగదు. పైగా దుఃఖప్రాప్తియే యగును.

**ఏవం విపర్యయం బుద్ధ్వా నృణాం విజ్ఞాభిమానినామ్ ।**
**ఆత్మనశ్చ గతిం సూక్ష్మాం స్థానత్రయవిలక్షణామ్ ॥ 61**

దృష్టశ్రుతాభిర్మాత్రాభిర్నిర్ముక్తః స్వేన తేజసా ।
జ్ఞానవిజ్ఞానసంతృప్తో మద్భక్తః పురుషో భవేత్ ॥ 62

ఎవరు తమ్ము కర్మమార్గమున ప్రవీణులని యభిమాన పడుదురో అట్టి మానవుల ఫలవిపర్యయమును, జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థల కంటె నతీతమైన ఆత్మను దుర్విజ్ఞేయమని తెలిసికొని తమ వివేకబలముచే ఐహిక పారలౌకిక విషయ పిపాసను పరిత్యజించి జ్ఞానవిజ్ఞానములచే సంతుష్టుడగు పురుషుడు నాభక్తుడు కాగలడు.

ఏతావానేవ మనుజైర్యోగ్య నైపుణ్యబుద్ధిభిః ।
స్వార్థః సర్వాత్మనా జ్ఞేయో యత్పరాత్మైక దర్శనమ్ ॥ 63

జీవాత్మయొక్క లేదా పరమాత్మయొక్క (చిదంశగతమగు) అభిన్నమగు సిద్ధ సంబంధ దర్శనము లేదా జీవబ్రహ్మముల అంశాంశి భావము యొక్క ఐక్యదర్శనము లేదా పరమాత్మయొక్క ఏకత్వదర్శనము యోగకుశలు రగు వ్యక్తుల సర్వప్రతయ్న సాధ్య మగు పురుషార్థము, తదతిరిక్త మగు పురుషార్థము ఏదియు లేదు.

త్వమేతచ్ఛ్రద్ధయా రాజన్నప్రమత్తో వచో మమ ।
జ్ఞానవిజ్ఞాన సంపన్నో ధారయన్నాశు సిధ్యసి ॥ 64

రాజా! నీవు విషయముల యందనాసక్తుడవై శ్రద్ధతో నా యీ వాక్కులను ధారణ చేసినచో జ్ఞానవిజ్ఞాన సంపన్నుడవై శీఘ్రముగ నన్ను బొందగలవు.

## శ్రీశుక ఉవాచ

ఆశ్వాస్య భగవానిత్థం చిత్రకేతుం జగద్గురుః ।
పశ్యతస్తస్య విశ్వాత్మా తతశ్చాన్తర్దధే హరిః ॥ 65

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కన్ధే చిత్రకేతూపాఖ్యానే
షోడశోఽధ్యాయః ॥

శుకుడు పలికెను :- భగవానుడు, జగద్గురువు, విశ్వాత్ముడు నగు సంకర్షణ దేవుడిట్లు చిత్రకేతువును ఓదార్చి, ఆచిత్రకేతువు చూచుచుండగనే అదృశ్యుడయ్యెను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
చిత్రకేతూపాఖ్యానమున పదునాఱవ అధ్యాయము
సంపూర్ణము

# పదునేడవ అధ్యాయము

## చిత్రకేతువును పార్వతి శపించుట

కథాసారము :- ఈ యధ్యాయమున శివుని పరిహసించుటచే చిత్రకేతువు వృత్రాసుర రూపమున జన్మించుట యను విషయము వర్ణితమైనది.

మహారాజగు చిత్రకేతువు భగవద్దత్తమగు విమానము నధిరోహించి విద్యాధరస్త్రీలతో గూడి హరికీర్తనము చేయుచు సుమేరుపర్వతగుహలు మున్నగు స్థలములలో సంచరించు చుండెను. ఇట్లు సంచరించుచు అతడు (చిత్రకేతువు) ఒకనాడు సిద్ధచారణ పరివేష్టితుడగు మహాదేవుడు తన బాహువులచే పార్వతి నాలింగనము చేసికొని మునులసభలో విరాజిల్లుచుండుట చూచి పరిహసించుచు పెద్దగ నవ్వెను. పార్వతి దానిని విని కుపితయై చిత్రకేతువును శపించెను. ఆ శాపమువలన చిత్రకేతువు వృత్రాసుర రూపమున జన్మించెను.

పార్వతిశాపముచే భక్తవరుడగు చిత్రకేతు వేమాత్రమును భయపడక యిట్లు పలికెను - "మానవులు ప్రాక్తన కర్మఫలము వలననే సుఖదుఃఖముల ననుభవించుచు భవాటవి యందు సంచరించుచుందురు. అందువలన ఎవ్వరును మఱియొకరి సుఖదుఃఖములకు గారణములు గారు, కాని యజ్ఞానులగు మానవులు తమ్ముకర్తగా భావించి యభిమానపడుదురు. ఈ మాయా మయమగు సంసారమున శాపానుగ్రహములు, వానివలన కలుగు స్వర్గనరకములు సర్వము సమానములె. వీని కెట్టి వాస్తవమగు ఉనికియు లేదు. భగవానుడు స్వయముగ కర్త అయ్యును అకర్తయే. ఆయన స్వయంరూపముతో సృష్ట్యాదివ్యాపారముల యందుదాసీనుడు, అంతట సమభావ విశిష్టుడు నై యున్నాడు. ఆయనమాయ యనుశక్తియే జగత్సంబంధములగు వ్యాపారముల యందు నియుక్తయై జీవునియనిత్యకర్మలను రచించి సుఖ దుఃఖాదులకు కారణమగును."

చిత్రకేతువు పలికిన జ్ఞానగర్భములగు వాక్కులను విని పార్వతి, అచట నున్న సభాసదులు అందఱు విస్మయులైరి. మహాదేవుడు వారికి భగవద్భక్తులకు స్వర్గనరకములు, బంధముక్తులు, సుఖదుఃఖములు మున్నగు మాయకములైన ద్వంద్వ విషయముల యందు సమత్వబుద్ధి కలుగుట, అవివేకము వలన జీవునకు స్థూలలింగ దేహముల యందు ఆత్మబుద్ధి యను వివర్తము కలుగుట, దానివలన క్లేశములు కలుగుట, భగవదంశాంశ లయ్యును దేవతలకు ఈశ్వరాభిమాన ఫలముచే భగవత్స్వరూపము లభింపకపోవుట, భక్తులయొక్క, భగవానునియొక్క మాహాత్మ్యము మున్నగు విషయములను వివరించుటతో నీయధ్యాయము ముగియును.

## శ్రీశుక ఉవాచ.

యతశ్చాన్తర్హితోఽనన్తస్తస్యై కృత్వాదిశే నమః ।
విద్యాధరశ్చిత్రకేతుశ్చచార గగనేచరః ॥ 1

శుకుడు పలికెను :- భగవానుడగు అనంతుడు ఏ దిక్కున అంతర్ధానము చెందెనో విద్యాధరుడైన చిత్రకేతు వాదిక్కు నుద్దేశించి నమస్కరించి ఆకాశ మార్గమున సంచరింపసాగెను.

స లక్షం వర్షలక్షాణామవ్యాహతబలేన్ద్రియః ।
స్తూయమానో మహాయోగీ మునిభిః సిద్ధచారణైః ॥ 2

కులాచలేన్ద్రద్రోణీషు నానాసంకల్పసిద్ధిషు ।
రేమే విద్యాధరస్త్రీభిర్గాపయన్ హరిమీశ్వరమ్ ॥ 3

మహాయోగి యగు చిత్రకేతువు, మునులచేత సిద్ధచారణులచేత స్తుతింపబడుచు లక్షలకొలది సంవత్సరముల వఱకు సంచరించు చుండెను. దానివలన ఆతనిబలము, ఇంద్రియములు అక్షుణ్ణముగ నుండెను, అతడు సంకల్పితములైన వివిధవిషయములకు సిద్ధిస్థలమగు సుమేరు పర్వతగుహలలో విద్యాధర స్త్రీలచే హరినామమును గీర్తింపజేయుచు ఆనందము ననుభవించు చుండెను.

ఏకదా స విమానేన విష్ణుదత్తేన భాస్వతా ।
గిరిశం దదృశే గచ్ఛన్ పరీతం సిద్ధచారణైః ॥ 4

ఆలింగ్యాఙ్కీకృతాం దేవీం బాహునా మునిసంసది ।
ఉవాచ దేవ్యాః శృణ్వంత్యా జహాసోచ్చైస్తదన్తికే ॥ 5

ఒకనాడు చిత్రకేతువు విష్ణుప్రదత్తమై ప్రకాశించు విమానము నధిరోహించి సంచరించుచు మునులసభలో సిద్ధచారణ పరివేష్టితుడగు మహాదేవుడు పార్వతిని యొడియం దుంచుకొని బాహువుచే నాలింగనము చేసికొని యుండుట చూచెను. ఇది చూచి చిత్రకేతువు పార్వతీదేవికి వినబడునట్లుగ బిగ్గరగ నవ్వుచు నిట్లు పలికెను.

## చిత్రకేతురువాచ

ఏష లోకగురుః సాక్షాద్ధర్మం వక్తా శరీరిణామ్ ।
ఆస్తే ముఖ్యః సభాయాం వై మిథునీభూయ భార్యయా ॥ 6

చిత్రకేతువు పలికెను :- ఈయన సాక్షాత్తుగ లోకగురువు, దేహధారులగు జీవులలో శ్రేష్ఠుడు, ధర్మమును బలుకువాడు. ఈయన యీ మునుల సభలో భార్యతో గూడియున్నాడు. ఎంతటి యాశ్చర్యము!

**జటాధరస్తీవ్రతపా బ్రహ్మవాదీ సభాపతిః ।**
**అఙ్కీకృత్య స్త్రియాంచాస్తే గతహ్రీః ప్రాకృతో యథా ॥ 7**

జటాధారియు, మహాతపస్వియు, బ్రహ్మవాదియు, సభాపతియు నగు శివుడు లజ్జాహీనుడై ప్రాకృతమానవుని వలె స్త్రీని ఆలింగనము చేసికొని సభలో గూర్చుండి యున్నాడు.

**ప్రాయశః ప్రాకృతాశ్చాపి స్త్రియం రహసి బిభ్రతి ।**
**అయం మహావ్రతధరో బిభర్తి సదసి స్త్రియమ్ ॥ 8**

నీచజనులు గూడ సాధారణముగ రహస్యముగనే భార్యను ధరించి యుందురు. కాని యీ మహాదేవుడు తపస్వియై కూడ సభలో భార్యను తొడపై గూర్చుండబెట్టుకొని యున్నాడు.

## శ్రీశుక ఉవాచ

**భగవానపి తచ్ఛ్రుత్వా ప్రహస్యాగాధధీర్నృప ।**
**తూష్ణీం బభూవ సదసి సభ్యాశ్చ తదనువ్రతాః ॥ 9**

శుకుడు పలికెను :- రాజా! అగాధమైన జ్ఞానముకల మహేశ్వరుడు చిత్రకేతువు పలికిన మాటలు వినియు మందహాసము చేసి మిన్నకుండెను. ఆయన యనుచరులగు సభ్యులుగూడ ఆయననే యనుసరించిరి.

**ఇత్యతద్వీర్యవిదుషి బ్రువాణే బహ్వశోభనమ్ ।**
**రుషాహ దేవీ ధృష్టాయ నిర్జితాత్మాభిమానినే ॥ 10**

చిత్రకేతువు శివుని ప్రభావము నెరుంగక ఆయనను గూర్చి యిట్లు ఎన్నియో విధములగు అనుచితములైన మాటలను పలుకగా పార్వతి క్రుద్ధయై జితేంద్రియుడ నని యహంకరించు నాగర్విష్ఠితో నిట్లు పలికెను.

## శ్రీపార్వత్యువాచ

**అయం కిమధునా లోకే శాస్తా దణ్డధరః ప్రభుః ।**
**అస్మద్విధానాం దుష్టానాం నిర్లజ్జానాంచ విప్రకృత్ ॥ 11**

పార్వతీదేవి పలికెను :- (ఆహా! )విరుద్ధముగ ప్రవర్తించు ఈ వ్యక్తియేనా యీజగత్తులో మావంటి నిర్లజ్జులగు దుష్టులను శాసించు దండధారియు, ఏకైక ప్రభువు?

స వేద ధర్మం కిల పద్మయోని -
ర్న బ్రహ్మపుత్రా భృగునారదాద్యాః ।
న వై కుమారః కపిలో మనుశ్చ
యే నో నిషేధన్త్యతివర్తినం హరమ్ ॥ 12

(ఆహా!) పద్మయోని యగు బ్రహ్మ, బ్రహ్మపుత్రులగు భృగు నారదాదులైన ఋషులు, సనత్కుమారులు, మనువు, కపిలుడు మున్నగు వారు ధర్మము నెఱుంగరా? అందువలననే వారు శాస్త్రవిరుద్ధముగ బ్రవర్తించు నీ శంకరుని యీదుష్కార్యమును నివారింపనట్లు తెలియుచున్నది. (ప్రస్తుత మీ వ్యక్తియె మమ్మీదుష్కార్యము నుండి నివారించుటకు వచ్చినాడా!)

ఏషామనుధ్యేయ పదాబ్జయుగ్మం
జగద్గురుం మంగళమంగళం స్వయమ్ ।
యః క్షత్రబన్ధుః పరిభూయ సూరీన్
ప్రశాస్తిధృష్టస్తదయం హి దణ్ద్యః ॥ 13

క్షత్రియాధముడగు నీ చిత్రకేతువు బ్రహ్మాదిదేవతల నజ్ఞానులుగా భావించి, వారిచే ధ్యానింపబడు చరణకమలములు గలవాడు, జగత్పూజ్యుడు, పరమధర్మమూర్తియు నగు శివుని గర్వముతో శాసించుచున్నాడు. అందువలన వీనిని తప్పక దండింపవలెను.

నాయమర్హతి వైకుంఠపాదమూలోపసర్పణమ్ ।
సమ్భావితమతిః స్తబ్ధః సాధుభిః పర్యుపాసితమ్ ॥ 14

నేనే సర్వశ్రేష్ఠుడనను ఆత్మాభిమానము గలవాడు, దుర్వినీతుడు నగు నీవ్యక్తి యీజన్మములో సాధుపరిసేవితుడగు నారాయణ భగవానుని పాదమూలమున నివసించుటకు యోగ్యుడు కాడు.

అతః పాపీయసీం యోనిమాసురీం యాహి దుర్మతే ।
యథేహ భూయో మహతాం న కర్తా పుత్ర కిల్బిషమ్ ॥ 15

ఓదుర్మతీ! అందువలన నీ వట్టి పాపపూర్ణమగు నసురకులమున జన్మింపుము. పుత్రా! దానివలన మరల సాధువులపట్ల యీలోకమున నిట్టి యపరాధము చేయకుందువుగాక!

## శ్రీశుక ఉవాచ

ఏవం శప్తశ్చిత్రకేతుర్విమానాదవరుహ్య సః ।
ప్రసాదయామాస సతీం మూర్ధ్నా నమ్రేణ భారత ॥ 16

శుకుడు పలికెను :- రాజా! ఇట్లు శపింపబడినవాడై చిత్రకేతువు విమానము నుండి దిగి తలవంచి నమస్కరించి సతీదేవికి సంతుష్టిని గలుగ జేసెను.

## చిత్రకేతురువాచ

ప్రతిగృహ్ణామి తే శాపమాత్మనోఽఞ్జలినామ్బికే ।
దేవైర్మర్త్యాయ యత్ప్రోక్తం పూర్వదిష్టం హి తస్య తత్ ॥ 17

చిత్రకేతువు పలికెను :- అంబికా! నీవు నాకిచ్చిన శాపమును నేను అంజలి బద్ధుడనై స్వీకరించు చున్నాను. దేవతలు మనుష్యులకు వారి పూర్వ జన్మకర్మఫలము ననుసరించియే సుఖమును లేదా దుఃఖమును గలుగజేయు చుందురు గదా!

సంసారచక్ర ఏతస్మిన్ జన్తురజ్ఞానమోహితః ।
భ్రామ్యన్ సుఖంచ దుఃఖంచ భుఙ్క్తే సర్వత్ర సర్వదా ॥ 18

అవిద్యాగ్రస్తుడగు జీవుడీ సంసారవనమున దిరుగుచు సకల ప్రదేశములలోను, సర్వవేళలలోను (ప్రాక్తనకర్మ ఫలములైన) సుఖదుఃఖముల ననుభవించును. (అందువలన ఓదేవా! ఈశాపము నిచ్చు విషయములో నా దోషముగాని నీ దోషముగాని యేమియు నున్నట్లు అగుపడుట లేదు)

నైవాత్మా న పరశ్చాపి కర్తా స్యాత్సుఖదుఃఖయోః ।
కర్తారం మన్యతేఽత్రాజ్ఞ ఆత్మానం పరమేవ చ ॥ 19

ఈ ప్రపంచములో తానుగాని శత్రుమిత్రాదులుగాని సుఖదుఃఖములకు కర్తలుగారు. కాని అజ్ఞానులు తమ్ము లేదా యితరులను ఈవిషయమున సుఖదుఃఖములకు కర్తలని భావింతురు.

గుణప్రవాహ ఏతస్మిన్ కః శాపః కో న్వనుగ్రహః ।
కః స్వర్గో నరకః కో వా కిం సుఖం దుఃఖమేవ వా ॥ 20

ఈ సంసారము మాయామయగుణ ప్రవాహస్వరూపమైనది. అందువలన దీనిలో నేది శాపము? ఏది యనుగ్రహము? ఏది స్వర్గము? ఏది నరకము? ఏవి సుఖదుఃఖములు? అనగా వీనిలో దేనికిగూడ వాస్తవిక సత్తా లేదు.

ఏకః సృజతి భూతాని భగవానాత్మమాయయా ।
ఏషాం బన్ధం చ మోక్షం చ సుఖం దుఃఖం చ నిష్కలః ॥ 21

బంధమోక్ష శూన్యుడగు భగవానుడొక్కడే తనమాయచే ప్రాణులను సృష్టించును. మాయాంశభూతమగు నవిద్యచే వానికి బంధమును, విద్యచే మోక్షమును, సత్త్వగుణముచే సుఖమును, రజోగుణముచే దుఃఖమును కలిగించును.

న తస్య కశ్చిద్దయితః ప్రతీపో
న జ్ఞాతిబన్ధుర్న పరో న చ స్వః ।
సమస్య సర్వత్ర నిరంజనస్య
సుఖే న రాగః కుత ఏవ రోషః ॥ 22

భగవానుడు సర్వభూతసముడు, అందువలన ఆయనకు ప్రియుడుగాని అప్రియుడు గాని, జ్ఞాతిగాని బంధువుగాని, పరుడుగాని ఆత్మీయుడుగాని యెవ్వడును లేడు. అందువలన నిస్సంగుడగు నా పురుషునకు సుఖములో అనురాగము లేదు. కనుక రోషమెక్కడ నుండి వచ్చును? (పూర్వ మనురాగము లేకపోవుటచే రోషము కలుగదు).

తథాపి తచ్ఛక్తివిసర్గ ఏషాం
సుఖాయ దుఃఖాయ హితాహితాయ ।
బన్ధాయ మోక్షాయ చ మృత్యుజన్మనోః
శరీరిణాం సంసృతయేఽవకల్పతే ॥ 23

ఆయన నిస్సంగుడు, ఆయన కెట్టి ప్రియాప్రియములు లేకపోయినను ఆయన తన మాయాశక్తిద్వారా పుణ్యపాపాది కర్మలను సృష్టించి యీ సర్వజీవుల సుఖదుఃఖరూపము, శుభాశుభరూపము, బంధమోక్షరూపము, జననమరణ రూపము నగు సంసారమునకు గారణమగుచున్నాడు. (అనగా భగవానుడు మూలకర్త అయ్యును, స్వయముగ ఆయన జీవుల సుఖదుఃఖములు, బంధమోక్షములు మున్నగువానికి కారణము గాడు, జీవుల కర్మఫలము ననుసరించి గుణమాయయే పుణ్యపాపాదికర్మలను సృష్టించి జీవుల జనన మరణములకు కారణమగుచున్నది).

అథ ప్రసాదయే న త్వాం శాపమోక్షాయ భామిని ।
యన్మన్యసే హ్యసాధూక్తం మమ తత్ క్షమ్యతాం సతి ॥ 24

భామినీ! (అకారణ క్రోధస్వభావము గలదానా!) అందువలన నాశాపవిముక్తికై నిన్ను అనునయింపను. (సుఖదుఃఖములు మానవులకు వారివారి కర్మల ననుసరించి

కలుగుచుండును గదా) నా మాటలు సంగతము లైనను నీవు వానిని అసంగతములుగ దలంచుచున్నావు. అందువలన నన్ను క్షమింతువుగాక!

### శ్రీశుక ఉవాచ

**ఇతి ప్రసాద్య గిరిశౌ చిత్రకేతురరిన్దమ ।**
**జగామ స్వవిమానేన పశ్యతోః స్మయతోస్తయోః ॥ 25**

శుకుడు పలికెను :- శత్రుదమనుడవగు రాజా! చిత్రకేతువిట్లు శివపార్వతులను ప్రసన్నులునుగ జేసి వారు చూచుచుండగనే తన విమానము నధిరోహించి వెడలిపోయెను. శాపమును వినియు చిత్రకేతువు భీతిచెందక పోవుటచూచి భవానీశంకరు లిరువురు ఆశ్చర్యాన్వితులైరి.

**తతస్తు భగవాన్ రుద్రో రుద్రాణీమిదమబ్రవీత్ ।**
**దేవర్షిదైత్యసిద్ధానాం పార్షదానాంచ శృణ్వతామ్ ॥ 26**

పిమ్మట భగవానుడగు రుద్రుడు దేవర్షిదైత్య సిద్ధ పార్షదుల సమక్షమున రుద్రాణితో నిట్లు పలికెను.

### శ్రీరుద్ర ఉవాచ

**దృష్టవత్యసి సుశ్రోణి హరేరద్భుతకర్మణః ।**
**మాహాత్మ్యం భృత్యభృత్యానాం నిస్పృహాణాం మహాత్మనామ్ ॥27**

రుద్రుడు పలికెను :- సుందరీ! అలౌకిక కర్మసంపాదకుడగు శ్రీహరియొక్క భృత్యులకు (నారదాదులకు) భృత్యులైన (చిత్రకేతువు మొదలైన), విషయ సుఖములయందు నిస్పృహు లైన మహాత్ముల మాహాత్మ్య మెట్టిదో చూచుచున్నావా?

**నారాయణపరాః సర్వే న కుతశ్చన బిభ్యతి ।**
**స్వర్గాపవర్గనరకేష్వపి తుల్యార్థదర్శినః ॥ 28**

నారాయణపరాయణులగు మానవులెక్కడను భయపడరు. వారు స్వర్గమును, ముక్తిని, నరకమును ఒకే విధముగ జూతురు.

**దేహినాం దేహసంయోగాద్ద్వన్ద్వానీశ్వర లీలయా ।**
**సుఖం దుఃఖం మృతిర్జన్మ శాపోఽనుగ్రహ ఏవ చ ॥ 29**

భగవానుని మాయవలననే జీవునకు దేహసంబంధము, దానివలన గలుగు సుఖ దుఃఖములు, జననమరణములు, శాపానుగ్రహములు - ఈ విధమగు ద్వంద్వములు గలుగును.

అవివేకకృత: పుంసో హ్యర్థభేద ఇవాత్మని ।
గుణదోష వికల్పశ్చ భిదేవ స్రజివత్కృత: ॥ 30

భ్రాంతివలన పుష్పమాల యందు సర్పబుద్ధి కలుగునట్లు, స్వప్నమున పురుషునకు (జీవునకు) తనయందు సుఖదు:ఖాదిజ్ఞానము ఆ వివేకమువలననే కలుగునట్లు సుఖ దు:ఖాదుల యందు గుణదోష విచారముగూడ (సుఖములయందు గుణవిచారము, దు:ఖములయందు దోషవిచారము) అవివేకము వలననే కలుగును.

వాసుదేవే భగవతి భక్తిముద్వహతాం నృణామ్ ।
జ్ఞానవైరాగ్యవీర్యాణాం న హి కశ్చిద్వ్యపాశ్రయ: ॥ 31

భగవానుడగు వాసుదేవునియందు భక్తిగలవారు, జ్ఞానవైరాగ్య సంపన్నులు నగు వ్యక్తుల కీ ప్రపంచమున విశేషముగ (ఇది నాది యను బుద్ధితో) ఆశ్రయింపదగిన వస్తువేదియు లేదు.

నాహం విరించో న కుమారనారదౌ
న బ్రహ్మపుత్రా మునయ: సురేశా: ।
విదామ యస్యేహితమంశకాంశకా
న తత్స్వరూపం పృథగీశమానిన: ॥ 32

నేను (శివుడు), బ్రహ్మ, అశ్వినీకుమారులు, బ్రహ్మపుత్రులగు నారదాదిఋషులు, దేవేంద్రుడు మున్నగువారు శ్రీహరిలీలలను దెలిసికొన జాలనట్లు శ్రీహరియొక్క అంశాంశ లయ్యును తమ్ము స్వతంత్రకర్తలగ నభిమానించు పురుషులుగూడ నిజముగ ఆయన స్వరూపమును తెలిసికొన జాలరు. (లేదా నేను (శివుడు), బ్రహ్మ, అశ్వినీకుమారులు, బ్రహ్మపుత్రులగు నారదాదిఋషులు, దేవేంద్రుడు మున్నగువారు స్వతంత్రముగ నీశ్వరుల మని యభిమానపడినచో మేము అంశాంశల మయ్యును ఆయన స్వరూపము నెఱుంగ జాలము)

న హ్యస్యాస్తి ప్రియ: కశ్చిన్నాప్రియ: స్వ: పరోఽపివా ।
ఆత్మత్వాత్సర్వభూతానాం సర్వభూత ప్రియో హరి: ॥ 33

ఆయన కెవ్వరును ప్రియులుగాని, అప్రియులుగాని, ఆత్మీయులు గాని, పరులుగాని లేరు. ఆయన సర్వభూతాంతర్యామి యగుటచే సర్వభూతములకు ప్రియుడు, శుభప్రదాతయు నగును.

తస్య చాయం మహాభాగశ్చిత్రకేతు: ప్రియోఽనుగ: ।
సర్వత్ర సమదృక్ శాన్తో హ్యహంచైవాచ్యుతప్రియ: ॥ 34

**తస్మాన్న విస్మయః కార్యః పురుషేషు మహాత్మసు ।**
**మహాపురుష భక్తేషు శాన్తేషు సమదర్శిషు ॥ 35**

ఉదారచేతస్కుఁడగు నీ చిత్రకేతువుగూడ ఆయనకు ప్రియసేవకుడు, సర్వభూత సమదర్శి, రాగద్వేషాదిరహితుడు. నేనుగూడ ఆ నారాయణ భగవానునకు బ్రియుడనే అందువలన మహాత్ములు, మహాపురుషులు, భక్తులు, రాగద్వేషరహితులు, సర్వభూత సమదర్శులు నగు పురుషులను (వారి కార్యములను) జూచి ఆశ్చర్యపడవలసిన యవసరము లేదు.

## శ్రీశుక ఉవాచ

**ఇతి శ్రుత్వా భగవతః శివస్యోమాభి భాషితమ్ ।**
**బభూవ శాంతధీ రాజన్ దేవీ విగతవిస్మయా ॥ 36**

శుకుడు పలికెను:- రాజా! పార్వతీదేవి పరమపూజ్యుడగు శంకరుడు పలికిన వాక్కులను విని విస్మయమును విడచి బుద్ధిని స్థిరపఱచు కొనెను.

**ఇతి భాగవతో దేవ్యాః ప్రతిశప్తుమలన్తమః ।**
**మూర్ధ్నా స జగృహే శాపమేతావత్సాధు లక్షణమ్ ॥ 37**

పరమభక్తుడగు నాచిత్రకేతువు పార్వతీదేవికి శాపమిచ్చుటకు సమర్థుడయ్యును నీయలేదు. పైగా నామె యిచ్చిన శాపమును తలవంచి స్వీకరించెను. సత్పురుషుల లక్షణము లిట్లే యుండును.

**జజ్ఞే త్వష్టుర్దక్షిణాగ్నౌ దానవీం యోనిమాశ్రితః ।**
**వృత్ర ఇత్యభివిఖ్యాతో జ్ఞానవిజ్ఞాన సంయుతః ॥ 38**

ఆ చిత్రకేతువే భవానిశాపముచే అసురయోని నాశ్రయించి జ్ఞానవిజ్ఞాన సంపన్నుడై త్వష్టయొక్క దక్షిణాగ్నియందు జన్మించి వృత్రనామముతో బ్రసిద్ధికెక్కెను.

**ఏతత్తే సర్వమాఖ్యాతం యన్మాం త్వం పరిపృచ్ఛసి ।**
**వృత్రస్యాసురజాతేశ్చ కారణం భగవన్మతేః ॥ 39**

రాజా! నీవు భగవద్భక్తుడగు వృత్రుడు అసురునిగ జన్మించుటకు గల కారణము నడిగితివి. ఆవిషయమును నేను నీకు సంపూర్ణముగ జెప్పితిని.

**ఇతిహాసమిమం పుణ్యం చిత్రకేతోర్మహాత్మనః ।**
**మాహాత్మ్యం విష్ణుభక్తానాం శ్రుత్వా బన్ధాద్విముచ్యతే ॥ 40**

మహాత్ముడగు చిత్రకేతువుయొక్క పవిత్రము మహిమాన్వితము నగు నీ యితిహాసమును విష్ణుభక్తులవలన శ్రవణము చేసిన మానవుడు సంసార బంధనముల నుండి విముక్తుడగును.

**య ఏతత్ప్రాతరుత్థాయ శ్రద్ధయా వాగ్యతః పఠేత్ ।**
**ఇతిహాసం హరిం స్మృత్వా స యాతి పరమాం గతిమ్ ॥ 41**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కంధే చిత్రకేతూపాఖ్యానే
సప్తదశో ఽధ్యాయః ॥

ప్రాతఃకాలమున నిద్రనుండి లేచి వాక్కును నిగ్రహించి శ్రీహరిని స్మరించి యీ యితిహాసమును పఠించినచో మానవుడు పరమగతిని బొందును.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
చిత్రకేతూపాఖ్యానమున పదునేడవ అధ్యాయము
సంపూర్ణము





# పదునెనిమిదవ అధ్యాయము

## అదితికి దితికి గలిగిన సంతానవర్ణనము ;

## మరుద్గణములు జన్మించిన విధము

కథాసారము :- ఈ యధ్యాయమున ఇంద్రహంతకుడగు పుత్రుని గోరి కశ్యపపత్ని యగు దితి వ్రతమునుబూనుట, వ్రతలోపముల నన్వేషించు ఇంద్రుడు దితిగర్భస్థ మగు సంతానమును నలుబదితొమ్మిది భాగములుగ ఛేదించుట, త్వష్టృవంశమును వర్ణించు ప్రసంగమున ఆదిత్యునియొక్క, ఇతర దేవతలయొక్క వంశములను వివరించుట యను విషయములు వర్ణింపబడినవి.

అదితిపుత్రుడగు సవిత్రునియొక్క భార్య పృశ్ని, ఆమె సావిత్రి, వ్యాహృతి, త్రయి అనుముగ్గురు కన్యకలను; అగ్నిహోత్రము,పశుయాగము, సోమయాగము, చాతుర్మాస్య యాగములు, పంచమహాయజ్ఞములు అనుసంతానమును గనినది. భగపత్ని యగు సిద్ధికి మహిమానుడు, విభుడు, ప్రభువు నను ముువ్వురుపుత్రులు, ఆశీస్సు అనునొకకన్యయు జన్మించిరి. ధాతకు కుహు, సినీవాలి, రాక, అనుమతి యను నల్వురుభార్యలు గలరు. వారికి వరుసగ సాయము, దర్శము, ప్రాతఃకాలము, పూర్ణమాసి యను నల్వురుపుత్రులు కలిగిరి. విధాతకు క్రియ యను భార్యవలన పురీష్యలను పంచాగ్నులు జన్మించినవి. వరుణునిభార్య యగు చర్షణికి బ్రహ్మ-మానసపుత్రుడగు భృగువు మరల ఆవిర్భవించెను. వరుణవీర్యముచే వల్మీకమునుండి వాల్మీకి యనువాడావిర్భవించెను. అగస్త్యుడు, వశిష్ఠుడు- అనువీరిర్వురు మిత్రావరుణుల సాధారణ పుత్రులు. ఊర్వశిని జూడగా మిత్రునకు వరుణునకు రేతస్సు స్ఖలనమయ్యెను. అది కడవలో భద్రపఱుపబడెను. దానుండి అగస్త్యుడు వశిష్ఠుడు జన్మించిరి. మిత్రునకు రేవతి యను భార్యవలన ఉత్సర్గుడు, అరిష్టుడు, పిప్పలుడు నను ముగ్గురు పుత్రులు జన్మించిరి.

అదితికి పదునొకండుగురు పుత్రులు కలిగిరి. వారిలో నింద్రుడు తనభార్య యగు పౌలోమివలన జయంతుడు, ఋషభుడు, మీఢుషుడు నను ముగ్గురు పుత్రులు గలిగిరి. స్వశక్తి ప్రభావముచే స్వయముగ నవతరించిన భగవదవతారుడగు వామునునకు కీర్తి యనుభార్య గలదు. ఆమెకు బృహచ్ఛ్లోకు డగు పుత్రుడు జన్మించెను. ఈబృహచ్ఛ్లోకుని పుత్రుడె సౌభగుడు.

అదితిపుత్రులగు ఆదిత్యులకథ చెప్పబడినది. ఆదిత్యరూపముతో నవతరించిన ఉరుక్రమభగవానుని విషయ మష్టమస్కంధమున వర్ణింపబడును. ఇపుడు దితికి జన్మించిన దైత్యులకథ చెప్పబడుచున్నది. ఈదితియొక్క వంశమున పరమభాగవతులగు ప్రహ్లాదుడు, బలి యనువారు ఆవిర్భవించిరి.

దితిపుత్రులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు. హిరణ్యకశిపుని భార్య యగు కయాధువునకు సంహ్లాదుడు, అనుహ్లాదుడు, హ్లాదుడు, ప్రహ్లాదుడు ననునల్వురు పుత్రులు, సింహిక యను నొకపుత్రికయు గలిగిరి. సింహిక విప్రచిత్తు డనుదానవుని వలన రాహువును పుత్రునిగ బొందినది. శ్రీహరిభగవానుడీరాహువు శిరమును ఖండించెను. సంహ్లాదుని భార్య యగు కృతియను నామె పంచజనుడనుపుత్రుని, హ్లాదుని భార్య యగు ధమని వాతాపి ఇల్వలుడు నను ఇరువురుపుత్రులను గనిరి. ఈయిల్వలుడె అతిథిగ వచ్చిన అగస్త్యునకు మేషరూపుడగు వాతాపిని వండి భోజనముగ బెట్టెను. అనుహ్లాదునిభార్య సూర్య. ఆమెకు బాష్కలుడు, మహిషుడు నను ఇర్వురుపుత్రులు గలిగిరి. ప్రహ్లాదునిపుత్రుడు విరోచనుడు, మనుమడు బలి. బలికి యేడుగురుపుత్రులు గలిగిరి. వారిలో నొకడు శివపార్షదులలో నగ్రగణ్యు డగు బాణు డనువాడు.

ఆదిత్యులయొక్క, ఇతరదేవతలయొక్క విషయము వర్ణింపబడినది. ఇపుడు దితికి జన్మించిన మరుద్గణములయొక్క విషయము, వారికి దేవత్వము లభించినవిధము వర్ణింపబడును. ఇంద్రునకు సాహాయ్యముచేయు నుద్దేశ్యముతో విష్ణుభగవానుడు హిరణ్యాక్ష హిరణ్యకశిపులను సంహరింపగా, దితి యీర్ష్యానలముచే ప్రజ్వరిల్లి ఇంద్రవధవాంఛతో పుత్రార్థినియై తనభర్త యగు కశ్యపుని సేవచే మోహపఱచి ఆయనను ఇంద్రుని సంహరించు పుత్రునీయవలసినదిగా ప్రార్థించినది. పరమవిద్వాంసు డగు కశ్యపమహర్షి "విద్వాంసమపి కర్షతి" యనువాక్యుయొక్కయథార్థ్యము, ఆపాతమనోహరము నగు స్త్రీసాంగత్యమను విషమయఫలమును అనుభవించుచు తన్ను నిందించుకొనసాగెను. పిమ్మట దితికి జీవచిత్తశోధక మగు వైష్ణవవ్రతమును ఉపదేశించెను. కశ్యపుని యుపదేశము ననుసరించి దితి వ్రతానుష్ఠానతత్పరయయ్యెను. అపుడు ఇంద్రుడు దితియొక్క అభిప్రాయము నెఱింగి ఆమెకు సేవ చేయునెపముతో వ్రతలోపము నన్వేషింపసాగెను. ఒకనాడు దోషమును గనిపెట్టి ఇంద్రుడు యోగసిద్ధిప్రభావముతో దితిగర్భమున ప్రవేశించి గర్భస్థ మగు సంతాన మును నలువది తొమ్మిదిముక్కలుగ ఖండించెను. వానినుండి నలువది తొమ్మండు గురుమరుత్తులు జన్మించిరి. వైష్ణవవ్రతానుష్ఠాన ఫలముచే దితిపుత్రులగు మరుత్తులు అదేవ (రాక్షసులకు) బంధువులుకాక దేవబంధు వగు నింద్రునకు సహచరులైరి యను ప్రసంగముతో నీయధ్యాయము ముగియును.

## శ్రీశుక ఉవాచ

పృశ్నిస్తు పత్నీ సవితుః సావిత్రీం వ్యాహృతిం త్రయీమ్ ।
అగ్నిహోత్రం పశుం సోమం చాతుర్మాస్యం మహామఖాన్ ॥ 1

శుకుడు పలికెను :- అదితికి జన్మించిన పండ్రెండుగురుపుత్రులలో నైదవవాడు సవిత, ఆతనిభార్య యగు పృశ్ని సావిత్రి, వ్యాహృతి, త్రయి యనుముగ్గురు పుత్రికలను; అగ్నిహోత్రము, పశుయాగము, సోమయాగము, చాతుర్మాస్యయాగము, పంచమహాయజ్ఞ ములు ననుపుత్రులను గనినది.

సిద్ధిర్భగస్య భార్యాఙ్గమహిమానం విభుం ప్రభుమ్ ।
ఆశిషం చ వరారోహాం కన్యాం ప్రాసూత సువ్రత ॥ 2

రాజా! అదితికి ఆఱవపుత్రుడైన భగుడను ఆదిత్యునిభార్య సిద్ధి. ఆమె మహిముడు, విభుడు, ప్రభువు ననుముప్వురుపుత్రులను అతిసుశీలయు పరమసుందరియు నగు ఆశిష యనునొకకన్యను ప్రసవించినది.

ధాతుః కుహూః సినీవాలీ రాకా చానుమతిస్తథా ।
సాయం దర్శమథ ప్రాతః పూర్ణమాసమనుక్రమాత్ ॥ 3

అగ్నీన్ పురీష్యానాధత్త క్రియాయాం సమనన్తరః ।
చర్షణీ వరుణస్యాసీద్యస్యాం జాతో భృగుః పునః ॥ 4

అదితికి జన్మించిన పుత్రులలో నేడవవాడైన ధాత యను ఆదిత్యునకు కుహువు, సినీ వాలి, రాక, అనుమతి యనునలువురు భార్యలు గలరు. వీరు క్రమముగ సాయంకాలము, దర్శము, ప్రాతఃకాలము, పూర్ణమాసి ననునల్వురు పుత్రులను గనిరి. అదితి యొక్క యెనిమిదవపుత్రుడగు విధాత యనుఆదిత్యుడు క్రియ యను భార్యవలన పురీష్యాఖ్యు లగుపంచచిత్యగ్నులను పుత్రులను గనినాడు. అదితియొక్క తొమ్మిదవపుత్రుడగు వరుణు డను ఆదిత్యునకు చర్షణి యనుభార్య కలదు. బ్రహ్మపుత్రుడగు భృగువు ఈమెకు మరల జన్మించినాడు.

వాల్మీకిశ్చ మహాయోగీ వల్మీకాదభవత్కిల ॥
అగస్త్యశ్చ వశిష్ఠశ్చ మిత్రావరుణయోర్ఋషీ ॥ 5

వరుణునివీర్యముచే వల్మీకమునుండి మహాయోగి యగు వాల్మీకి జన్మించెను. భృగువు, వాల్మీకి వరుణుని యసాధారణ పుత్రులు: అగస్త్య వశిష్ఠఋషులు మిత్రావరుణులకు సాధారణ పుత్రులు.

రేతః సిషిచతుః కుంభే ఊర్వశ్యాః సన్నిధౌ ద్రుతమ్ ।
రేవత్యాం మిత్ర ఉత్సర్గమరిష్టం పిప్పలం వ్యధాత్ ॥ 6

ఊర్వశిని జూచినంతనె ఆమెయెదుటనె మిత్రునకు (అదితియొక్క పదియవపుత్రుడు), వరుణునకు రేతస్సు స్ఖలనమయ్యెను. ఇరువురారేతస్సును ఒకకడవలో నుంచిరి. కుంభము నుండి అగస్త్యుడు వశిష్ఠుడు నను ఇరువురు పుత్రులు జన్మించిరి. వీరిరువురు సాధారణ పుత్రులు. మిత్రుడను నాదిత్యుడు తనభార్య యగు రేవతివలన ఉత్సర్గుడు, అరిష్టుడు, పిప్పలుడు ననుముప్పురు కుమారులను గనెను.

పౌలోమ్యామిన్ద్ర ఆధత్త త్రీన్ పుత్రానితి నః శ్రుతమ్ ।
జయన్తమృషభం తాత తృతీయం మీఢుషం ప్రభుః ॥ 7

రాజా! అదితికి పదునొకండవపుత్రుడు, స్వర్గమునకు ప్రభువు నగు ఇంద్రుడను ఆదిత్యుడు పౌలోమి యను తనభార్యవలన జయంతుడు, ఋషభుడు, మీఢుషుడు నను ముగ్గురు కొమరులను కనె ననిమేము వింటిమి.

ఉరుక్రమస్య దేవస్య మాయావామనరూపిణః ।
కీర్త్యాం పత్న్యాం బృహచ్ఛ్లోకస్తస్యాసన్ సౌభగాదయః ॥ 8

స్వరూపభూత మగు నిత్యశక్తి ప్రభావముచే నవతరించినవాడు, భగవదవతారుడు నగు ఉరుక్రమునకు కీర్తి యనుపత్నివలన బృహచ్ఛ్లోకు డనుకొమరుడు జన్మించెను. ఈ బృహచ్ఛ్లోకునకు సౌభగాదిపుత్రులు జన్మించిరి.

తత్కర్మగుణవీర్యాణి కాశ్యపస్య మహాత్మనః ।
పశ్చాద్వక్ష్యామహేఽదిత్యాం యథైవావతతార హ ॥ 9

మహాత్ముడగు కశ్యపునికుమారుడైన ఉరుక్రముడు త్రిపాదములద్వారా త్రిభువనము లను ఆక్రమించుట మున్నగుప్రసిద్ధకర్మలు, తన భక్తుల ననుగ్రహించుట మున్నగు గుణములు, ఆయనసర్వశక్త్యాదివీర్యము, ఆయన అదితికి కుమారుడుగ జన్మించుట మున్నగు విషయములు పిమ్మట (అష్టమస్కంధమున) వర్ణింపబడును.

అథ కశ్యపదాయాదాన్ దైతేయాన్ కీర్తయామి తే ।
యత్ర భాగవతః శ్రీమాన్ ప్రహ్లాదో బలిరేవ చ 10

ఇప్పుడు కశ్యపునివలన దితికి జన్మించిన దైతేయులగు పుత్రులను గూర్చి నీకు వివరింతును. ఆవంశములోనే పరమభాగవతులగు బలి, ప్రహ్లాదుడు జన్మించిరి.

దితేర్ద్వావేవ దాయాదౌ దైత్యదానవవన్దితౌ ।
హిరణ్యకశిపుర్నామ హిరణ్యాక్షం చ కీర్తితౌ ॥ 11

మొదట దితికి దైత్యదానవవందితుడగు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు ననుఇరువురు తనయులు జన్మించిరి (ఈవిషయము తృతీయ స్కంధమున వర్ణింపబడినది).

హిరణ్యకశిపోర్భార్యా కయాధుర్నామ దానవీ ।
జమ్భస్య తనయా సా తు సుషువే చతురః సుతాన్ ॥ 12

సంహ్రాదం ప్రాగనుహ్రాదం హ్రాదం ప్రహ్రాదమేవ చ ।
తత్స్వసా సింహికా నామ రాహుం విప్రచితోఽగ్రహీత్ ॥ 13

జంభాసురునిపుత్రిక యగు కయాధు వనుదానవి హిరణ్యకశిపునిభార్య. ఆమె క్రమముగ సంహ్రాదుడు (సంహ్లాదుడు), అనుహ్రాదుడు (అనుహ్లాదుడు), హ్రాదుడు, (హ్లాదుడు), ప్రహ్రాదుడు (ప్రహ్లాదుడు) ననునల్వురుపుత్రులను గనినది. ఈనల్వురకు సోదరి సింహిక యనునది, సింహిక తనభర్త యగు విప్రచిత్తుడనుదానవుని వలన రాహువును పుత్రునిగ గనినది.

శిరోఽహరద్యస్య హరిశ్చక్రేణ పిబతోఽమృతమ్ ।
సంహ్రాదస్య మతిర్భార్యాసూత పంచజనం తతః ॥ 14

అమృతమును పానముచేయు రాహువుయొక్క శిరమును శ్రీహరి చక్రాయుధముచే ఖండించెను. సంహ్లాదునిభార్య కృతి. ఆమె సంహ్లాదుని వల పంచజనుడనుతనయుని గనినది.

హ్రాదస్య ధమనిర్భార్యాసూత వాతాపిమిల్వలమ్ ।
యోఽగస్త్యాయ త్వతిథయే పేచే వాతాపిమిల్వలః ॥ 15

హ్రాదునిభార్య యగుధమని వాతాపి ఇల్వలుడు అనునిరువురు తనయులను గనినది. ఇల్వలుడు అతిథిగా వచ్చిన అగస్త్యునకు మేషరూపమును ధరించియున్న వాతాపిని వండి యాహారముగా నిడెను.

అనుహ్రాదస్య సూర్యాయాం బాష్కలో మహిషస్తథా ।
విరోచనస్తు ప్రాహ్లాదిర్దేవ్యాం తస్యాభవద్బలిః ॥ 16

అనుహ్రాదునిభార్య యగు సూర్య యనునామె బాష్కలుడు, మహిషుడు ననునిర్వురు పుత్రులు గనినది. ప్రహ్లాదునిపుత్రుడు విరోచనుడు, విరోచనునకు దేవి యనుభార్య వలన బలి యనుపుత్రుడు జన్మించివాడు.

**బాణజ్యేష్ఠం పుత్రశతమశనాయాం తతోఽభవత్ ।**
**తస్యానుభావం సుశ్లోక్యం పశ్చాదేవాభిధాస్యతే ॥ 17**

పిమ్మట బలికి అశన యనుభార్యవలన ఏడుగురుపుత్రులు జన్మించిరి. వారిలో బాణుడు జ్యేష్ఠుడు. బలిప్రభావము మిగుల ప్రశంసనీయమైనది. అనంతర మష్టమస్కంధమున ఈవిషయము వర్ణింపబడును.

**బాణ ఆరాధ్య గిరిశం లేభే తద్గణముఖ్యతామ్ ।**
**యత్పార్శ్వే భగవానాస్తే హ్యద్యాపి పురపాలకః ॥ 18**

బాణుడు శివుని ఆరాధించి శివపార్షదులలో శ్రేష్ఠుడయ్యెను. భగవానుడగుశివుడు పురపాలకుని రూపముతో నేటికిని బాణునిప్రక్కన నున్నాడు.

**మరుతశ్చదితేః పుత్రాశ్చత్వారింశన్నవాధికాః ।**
**త ఆసన్నప్రజాః సర్వే నీతా ఇన్ద్రేణ సాత్మతామ్ ॥ 19**

నలుబదితొమ్మండుగురుమరుత్తులు దితిపుత్రులై యుండిరి. వారపుత్రకులు. దేవేంద్రు వారికి దేవత్వమును గల్పించెను.

## శ్రీ రాజోవాచ

**కథం త ఆసురం భావమపోహ్యౌత్పత్తికం గురో ।**
**ఇన్ద్రేణ ప్రాపితాః సాత్మ్యం కింతత్సాధు కృతం హి తైః ॥ 20**

పరీక్షిన్మహారాజు పలికెను :- గురుదేవా! ఆనలుబది తొమ్మండుగురు మరుత్తులు పుట్టినప్పటినుండి అసురభావము గలవారై యుండిరి. ఇంద్రుడు వారియసురభావమును బోగొట్టి వారికి దేవత్వము నేలగల్పించెను? వా రెట్టి సత్కర్మ మొనరించిరి?

**ఇమే శ్రద్దధేత బ్రహ్మన్నృషయో హి మయా సహ ।**
**పరిజ్ఞానాయ భగవంస్తన్నో వ్యాఖ్యాతుమర్హసి ॥ 21**

దేవా! నాతోపాటే ఋషులుగూడనే నడిగిన యీవిషయమును వినుట కుత్సుకులై యున్నారు. అందువలన మహాత్మా! ఆవిషయమును మాకు వివరింపుము.

## శ్రీసూత ఉవాచ

**తద్విష్ణురాతస్య స బాదరాయణి - ర్వచో నిశమ్యాదృతమల్పమర్థవత్।**
**సభాజయన్ సన్నిభృతేన చేతసా జగాద సత్రాయణ సర్వదర్శనః ॥22**

సూతుడు పలికెను : శౌనకా! అర్థయుక్తములు, పరిమితాక్షరములు, సారగర్భములు నగుపరీక్షిత్తువాక్కులను విని సర్వజ్ఞుడగు బాదరాయణి (శుకుడు) ఆనందముతో ఆయనను ప్రశంసించుచు నిట్లుప్రత్యుత్తరమిచ్చెను.

## శ్రీశుక ఉవాచ

**హతపుత్రా దితిః శక్రపార్ష్ణిగ్రాహేణ విష్ణునా ।**
**మన్యునా శోకదీప్తేన జ్వలన్తీ పర్యచిన్తయత్ ॥ 23**

శుకుడు పలికెను :- ఇంద్రునకు పరోక్షముగ సాహాయ్యముచేయు నుద్దేశ్యముతో విష్ణువు హిరణ్యాక్షహిరణ్యకశిపులను సంహరించెను. అపుడు పుత్రహీన యైన దితి శోకప్రదీప్త మగు క్రోధముచే ప్రజ్వరిల్లుచునిట్లు ఆలోచింపసాగెను.

**కదా ను భ్రాతృహన్తారమిన్ద్రియారామముల్బణమ్ ।**
**అక్లిన్నహృదయం పాపం ఘాతయిత్వా శయే సుఖమ్ ॥ 24**

ఇంద్రియసుఖపరాయణుడు, విష్ణువుచే తన యిరువురుసోదరులను జంపించినవాడు (హిరణ్యాక్ష హిరణ్యకశిపులు ఇంద్రుని సవతితల్లికొడుకులు). క్రూరుడు, కఠినచిత్తుడు, పాపియునగునింద్రుని సంహరించి నే నెప్పుడు సుఖముగ నిద్రింతును ?

**కృమివిడ్భస్మసంజ్ఞాసీద్యస్యేశాభిహితస్య చ ।**
**భూతధ్రుక్ తత్కృతే స్వార్థం కి వేద నిరయోయతః ॥ 25**

అధీశ్వరులు లేదా రాజులుగ బ్రసిద్ధికెక్కిన వ్యక్తులదేహములు కృమివిష్ఠాభస్మములుగ బరిణమించినవి. (మరణానంతరము దేహములట్లేయుండినచో క్రుళ్ళి కృములగును, కుక్కలు మున్నగునవి భక్షించిన మలమగును, అగ్నిచే దగ్ధములు కాగా భస్మములగును) ఆదేహములను రక్షించుకొనుటకై మానవుడు ప్రాణులను హింసించుచున్నాడు. వానికి తన స్వార్థము కొలదిగనైన అర్థమైనదా! అనగా ఏమియు దెలియలేదు. భూతద్రోహమువలన నరకమే కలుగును.

**ఆశాసానస్య తస్యేదం ధ్రువమున్నద్ధ చేతసః ।**
**మదశోషక ఇన్ద్రస్య భూయాద్యేన సుతో హి మే ॥ 26**

ఇంద్రుడీదేహాదులను నిత్యమనిభావించి ఉచ్ఛృంఖలచిత్తుడయ్యెను. అందువలన ఆయింద్రునిగర్వము నణగించుపుత్రుని బొందుట కుపాయమునాలోచింతును.

**ఇతి భావేన సా భర్తురాచచారాసకృత్ప్రియమ్ ।**
**శుశ్రూషయానురాగేణ ప్రశ్రయేణ దమేన చ ॥ 27**

**భక్త్యా పరమయా రాజన్ మనోజ్ఞైర్వల్గుభాషితైః ।**
**మనో జగ్రాహ భావజ్ఞా సస్మితాపాఙ్గవీక్షణైః ॥ 28**

ఇట్లు భావించి యింద్రుని సంహరించు పుత్రుని బొందు నభిప్రాయముతో దితి నిరంతరము కశ్యపునకు ప్రియము గలుగునట్లుగ వ్యవహరింపసాగెను. రాజా! ఆ దితి భర్తయొక్క యభిప్రాయము ననుసరించి శుశ్రూషతోను, అనురాగముతోను, నమ్రతతోను, ఇంద్రియనిగ్రహముతోను, పరమభక్తితోను, మనోహరము లగు మధురవాక్కులతోను, చిరునవ్వు లొలకించు క్రీగంటిచూపులతోను భర్తయొక్క మనస్సును వశముచేసికొనెను.

**ఏవం స్త్రియా జడీభూతో విద్వానపి మనోజ్ఞయా ।**
**బాఢమిత్యాహ వివశో న తచ్చిత్రం హి యోషితి ॥ 29**

కశ్యపుడు పండితు డయ్యును కపటాచారనిపుణ యగు భార్య యొక్క శుశ్రూషచే మోహితుడై భార్యకు వశుడయ్యెను. అందువలన "నీమనోరథమును నెరవేర్తు" నని దితినిగూర్చి ఆయన పలికినమాటలో నెట్టి యాశ్చర్యము లేదు.

**విలోక్యైకాన్తభూతాని భూతాన్యాదౌ ప్రజాపతిః ।**
**స్త్రియం చక్రే స్వదేహార్ధం యయా పుంసాం మతిర్హృతా ॥ 30**

సృష్టిప్రారంభమున ప్రజాపతి (బ్రహ్మ) ప్రాణులు నిస్సంగులగుట చూచి మైథునధర్మముద్వారా సృష్టివృద్ధికై తనయర్ధాంగముతో నేస్త్రీలను సృష్టించెనో ఆస్త్రీలద్వారానే పురుషులచిత్త మపహృతమగును.

**ఏవం శుశ్రూషితస్తాత భగవాన్ కశ్యపః స్త్రియా ।**
**ప్రహస్య పరమప్రీతో దితిమాహాభినన్ద్య చ ॥ 31**

నాయనా! భగవానుడగు కశ్యపుడు దితి చేయునీశుశ్రూషచే పరమ ప్రీతుడై అభినందించి నవ్వి యామెతో నిట్లుపలికెను.

## శ్రీకశ్యప ఉవాచ

**వరం వరయ వామోరు ప్రీతస్తేఽహమనిన్దితే ।**
**స్త్రియా భర్తరి సుప్రీతే కః కామ ఇహ చాగమః ॥ 32**

కశ్యపుడు పలికెను :- వామోరూ (సుందరీ)! అనిందితా! నేను నీకు ప్రసన్నుడనైతిని. అందువలన నీవు వరము నడుగుము. భర్తసంతుష్టుడైనచో భార్య కిహకాలము లేదా పరకాలములో నెట్టికోరికయైన లభింపకుండగనుండునా!

పతిరేవ హి నారీణాం దైవతం పరమం స్మృతమ్ ।
మానసః సర్వభూతానాం వాసుదేవః శ్రియఃపతిః ॥ 33

స ఏవ దేవతాలిఙ్గైర్నామరూపవికల్పితైః ।
ఇజ్యతే భగవాన్ పుమ్భిః స్త్రీభిశ్చ పతిరూపధృక్ ॥ 34

స్త్రీలకు పతియే పరమదైవము; సర్వభూతములయంతఃకరణములలో నున్నవాడు, లక్ష్మీపతియు నగు వాసుదేవుడు భిన్నభిన్నములగు నామరూపములద్వారా విభిన్నములైన దేవతామూర్తులతో కర్మిష్ఠులపూజకు పాత్రుడైనట్లు ఆభగవానుడె పతిరూపముతో భార్యలపూజలకు విషయమగును.

తస్మాత్పతివ్రతా నార్యః శ్రేయస్కామాః సుమధ్యమే ।
యజన్తే ఽనన్యభావేన పతిమాత్మానమీశ్వరమ్ ॥ 35

సుమధ్యమా! పతిరూపముతో భగవానుడె విరాజిల్లుచుండును. అందువలన వివేకవతులు పతివ్రతలు నగు స్త్రీలు తదేకచిత్తలై పరమ భక్తితో ఆత్మస్వరూపుడు, పతిరూపుడు నగునీశ్వరుని బూజించుచుందురు.

సోఽహం త్వయార్చితో భద్రే ఈదృగ్భావేన భక్తితః
తం తే సంపాదయే కామమసతీనాం సుదుర్లభమ్ ॥ 36

కల్యాణీ! ఇట్టిభావముతో నీవు భక్తిపురస్సరముగ పతిరూప భగవానుడ నగు నన్నర్చించితివి. అందువలన పతివ్రతలు కాని స్త్రీలకు దుర్లభ మగు నీకోరికను నేను పూర్తిచేయగలను.

## దితిరువాచ

వరదో యది మే బ్రహ్మన్ పుత్రమిన్ద్రహణం వృణే ।
అమృత్యుం మృతపుత్రాహం యేన మే ఘాతితౌ సుతౌ ॥ 37

దితి పలికెను :- మహాత్మా! నేను మృతపుత్రను. నీవు నాకు వరము నీయదలచినచో నేను ఇంద్రహంతకుడు, అమరుడు నగు పుత్రుని గోరుచున్నాను. ఏలయన, ఈయింద్రుడు విష్ణుసాహాయ్యముతో నాపుత్రులగు హిరణ్యాక్షహిరణ్యకశిపులను సంహరించినాడు.

**నిశమ్య తద్వచో విప్రో విమనాః పర్యతప్యత ।**
**అహో అధర్మః సుమహానద్య మే సముపస్థితః ॥ 38**

దితి పలికిన యీమాటలను విని కశ్యపుడు విషణ్ణమనస్కుడై పరితాపముచెందెను "ఆహా! నేడు నాకు ఇంద్రహత్యారూప మగు గొప్ప అధర్మమెదురయ్యెనుగదా! "

**అహో అర్థేన్ద్రియారామో యోషిన్మయ్యేహ మాయయా ।**
**గృహీతచేతాః కృపణః పతిష్యే నరకే ధ్రువమ్ ॥ 39**

అహా! నేను మిగుల విషయభోగములయందు మగ్నుడనైతిని. ఇట్టిసమయములో స్త్రీరూపిణి యగు భగవన్మాయచే నాకృష్టచిత్తుడనై ధైర్యాదిరహితుడనైతిని. నేను తప్పక నరకమున బడగలను.

**కోఽతి క్రమోఽనువర్తన్త్యాః స్వభావమిహ యోషితః ।**
**ధిఙ్మాం బతాబుధం స్వార్థే యదహం త్వజితేన్ద్రియః ॥ 40**

భార్య తనస్వభావము ననుసరించియే మెలగును. ఈవిషయమున నామెయపరాధ మేమియున్నది? స్వార్థమును తెలిసికొనని నే నెంతటి మూర్ఖుడను. నేను ఇంద్రియనిగ్రహము లేనివాడ నైతినిగదా!

**శరత్పద్మోత్సవం వక్త్రం వచశ్చ శ్రవణామృతమ్ ।**
**హృదయం క్షురధారాభం స్త్రీణాం కో వేద చేష్టితమ్ ॥ 41**

స్త్రీలవదనము శరత్కాలపద్మమువలె వికసించియుండును, వాక్కులు శ్రవణేంద్రియములకు ప్రీతిని గలిగించును, హృదయము ఖడ్గధారవలె మిగుల తీక్ష్ణతరమైనది. అందువలన వారికార్యకలాపముల నెవ రెరుంగగలరు.

**న హి కశ్చిత్ప్రియః స్త్రీణామఞ్జసా స్వాశిషాత్మనామ్ ।**
**పతిం పుత్రం భ్రాతరం వా ఘ్నన్త్యర్థే ఘాతయన్తి చ ॥ 42**

తనయభీష్టమును దీర్చుకొను నుద్దేశ్యముతో స్త్రీలు మిగుల ప్రియమైనవారిగ నగపడుదురు. కాని నిజముగ వారికెవ్వరును ప్రియమైనవారు లేరు. స్వార్థమునకై వారు భర్తను, పుత్రులను లేదా సోదరులను సంహరింతురు, ఇతరులచే జేయింతురు.

**ప్రతిశ్రుతం దదామీతి వచస్తన్న మృషా భవేత్ ।**
**వధం నార్హతి చేన్ద్రోఽపితత్రేదముపకల్పతే ॥ 43**

నేను వరము నిచ్చుట కంగీకరించితిని. ఇదికూడ మిథ్య కాకూడదు, ఇంద్రుడు నశింపరాదు. ఇట్లొనర్చుట ఇపుడు నాకర్తవ్యము. (దీని తాత్పర్య మేమియనగా, పుత్రార్థి యగు నీమెకు (దితికి) నేను వైష్ణవవ్రతము నుపదేశింతును. వైష్ణవవ్రతమును పాలించుట ద్వారా ఈమెచిత్తము శుద్ధమగును. దానివలన ఇంద్రునిపై నీమెకు గల క్రోధము తొలగును. ఇంద్రవధవాంఛను పరిత్యజించి విహితమైన వైష్ణవవ్రతము ననుష్ఠించుట వలన చెడుఫలము కలుగుటకు వీలులేదు. ఇట్లయినచో నింద్రుడుగూడ నాశముచెందడు, నావాక్కుగూడ మిథ్యకాదు. దీర్ఘకాలవ్యాప్తమైన వ్రతానుష్ఠానముచే కొంచెమైన వైగుణ్యము (లోపము) తప్పక కలుగును. వైష్ణవవ్రతమునకు వైగుణ్యము ఘటిల్లినను అది యుత్కృష్ట ఫలమునే యిచ్చును. అందువలన అదితెలియకుండగ దితియొక్క చిత్తమును పరిశుద్ధ మొనర్చి యింద్రవధ యనుమాత్సర్యమును పోగొట్టును).

**ఇతి సంచిన్త్య భగవాన్ మారీచః కురునన్దన ।**
**ఉవాచ కించిత్ కుపిత ఆత్మానం చ విగర్హయన్ ॥ 44**

కురునందనా! భగవానుడగు కశ్యపు డిట్లాలోచించి కొలదిగ కుపితుడై తన్ను నిందించుకొని దితితో నిట్లుపలికెను.

## శ్రీకశ్యప ఉవాచ

**పుత్రస్తే భవితా భద్రే ఇన్ద్రహాదేవబాన్ధవః ।**
**సంవత్సరం వ్రతమిదం యద్యఞ్జో ధారయిష్యసి ॥ 45**

కశ్యపుడు పలికెను :- కల్యాణీ! ఈవ్రతమును సంవత్సరకాలము యథావిధిగ నిర్వహించినచో నీకు నింద్రహంతకు డగు నొకపుత్రుడు జన్మించును. వ్రతమున వైగుణ్యము (లోపము) సంఘటిల్లినచో దేవబాంధవుడు అనగా నింద్రపక్షపాతి యగు పుత్రుడు జన్మించును.

## దితిరువాచ

**ధారయిష్యే వ్రతం బ్రహ్మన్ బ్రూహి కార్యాణి యాని మే ।**
**యాని చేహ నిషిద్ధాని న వ్రతం ఘ్నన్తి యాన్యుత ॥ 46**

దితి పలికెను:- మహాత్మా! నేను వ్రతమును నిర్వహింతును. దానికై యేయే కార్యములను తప్పక చేయవలయునో, ఏవి యీవ్రతమున నిషిద్ధములో, ఏపను లీవ్రతమును నాశముచేయవో వాని నన్నింటిని నాకు వివరింపవలెను.

## శ్రీకశ్యప ఉవాచ

న హింస్యాద్భూతజాతాని న శపేన్నానృతం వదేత్ ।
న ఛిన్ద్యాన్నఖరోమాణి న స్పృశేద్యదమంగలమ్ ॥ 47

కశ్యపుడు పలికెను :- ఈవ్రతమును ధరించి ప్రాణిహింసచేయరాదు. ఎవ్వరిని నిందింపరాదు. అసత్యమాడరాదు, గోళ్ళను రోమములను ఛేదింపరాదు, అశుభములైన ఎముకలుమున్నగు వానిని స్పృశింపరాదు.

నాప్సు స్నాయాన్న కుప్యేత న సంభాషేత దుర్జనైః ।
న వసీతాధౌతవాసః స్రజం చ విధృతాం క్వచిత్ ॥ 48

నీటిలో ప్రవేశించి స్నానమాడరాదు, కోపింపరాదు, దుర్జనులతో సంభాషింపరాదు, పరిశుభ్రము చేయనివస్త్రములను ధరింపరాదు, ఒకమారుధరించిన మాలను మరల యెప్పుడును ధరింపరాదు.

నోచ్ఛిష్టం చండికాన్నం చ సామిషం వృషలాహృతమ్ ।
భుంజీతోదక్యయా దృష్టం పిబేన్నాంజలినా త్వపః ॥ 49

ఉచ్ఛిష్టాన్నమును భుజింపరాదు, భద్రకాళి మున్నగువారికి నివేదించిన అన్నమునుగాని, మాంసముతోగూడిన అన్నమునుగాని, శూద్రునిచే గొని రాబడిన అన్నమునుగాని, రజస్వలచే జూడబడిన అన్నమునుగాని భుజింపరాదు. దోసిలితో నీటిని త్రాగరాదు.

నోచ్ఛిష్టాస్పృష్టసలిలా సన్ధ్యాయాం ముక్తమూర్ధజా ।
అనర్చితాసంయతవాక్ నాసంవీతా బహిశ్చరేత్ ॥ 50

ఎంగిలినోటితో జలము నాచమింపరాదు, సంధ్యాకాలమున జుట్టు విరబోసికొని, అలంకరించుకొనకుండగ, వాక్కును నిగ్రహించుకొనకుండగ, సర్వావయవములను వస్త్రముచే గప్పుకొనకుండగ ఎప్పుడును బయట తిరుగరాదు.

నాధౌతపాదాప్రయతా నార్ద్ర పాదా ఉదక్శిరాః ।
శయీత నాపరాఙ్నాన్యైర్న నగ్నా న చ సన్ధ్యయోః ॥ 51

పాదములు కడుగుకొనకుండగగాని, శుచిత్వము తప్పిగాని, ఆర్ద్రపాదుడైగాని, ఉత్తరదిక్కుగ తలపెట్టికాని, పశ్చిమదిక్కుగ తలపెట్టిగాని, లేదా ఇతరస్త్రీలతో గలసిగాని, నగ్నావస్థయందుగాని, ప్రాతఃకాలమున గాని, సంధ్యాసమయమునగాని యెప్పుడును నిద్రింపరాదు.

ధౌతవాసా శుచిర్నిత్యం సర్వమఙ్గలసంయుతా ।
పూజయేత్ప్రాతరాశాత్ప్రాగ్గోవిప్రాన్ శ్రియ మచ్యుతమ్ ॥ 52

ధౌతవస్త్రములను ధరించి యెల్లపుడు పవిత్రవై (పూజోపకరణములు) హరిద్రా చందనాది మంగళద్రవ్యయుక్తవై పగటిభోజనమునకు పూర్వము గోవులను, విప్రులను లక్ష్మిని, అచ్యుతుని పూజింపవలెను.

స్త్రియో వీరవతీశ్చార్చేత్ స్రగ్గన్ధబలిమణ్డనైః ।
పతిం చార్చ్యోపతిష్ఠేత ధ్యాయేత్కోష్ఠగతం చ తమ్॥ 53

పుత్రవతులు, జీవద్భర్తృకలు నగు స్త్రీలను పుష్పమాలికలు, చందనము, ఉపాయనములు, అలంకారములు మున్నగువానిద్వారా పూజింపవలెను. ఇంకను పతిని చక్కగ అర్చించి ఆయనను స్తుతింపవలెను, పతిని కుక్షిలో నున్నట్లుగ భావించి స్తుతింపవలెను.

సంవత్సరం పుంసవనం వ్రతమేతదవిప్లుతమ్ ।
ధారయిష్యసి చేత్తుభ్యం శక్రహా భవితా సుతః ॥ 54

ఒకసంవత్సరమువఱకు పుత్రోత్పత్తికర మగు నీవ్రతమును నిర్విఘ్నముగ నిర్వహింపగలిగినచో నీకు ఇంద్రుని సంహరించు నొక పుత్రుడు జన్మించును. వ్రతమున నేవిధమగు విఘ్నము తటస్థించినను ఆపుత్రుడు ఇంద్రునకు బంధువగును.

బాఢమిత్యభ్యుపేత్యాథ దితీ రాజన్ మహామనాః ।
కశ్యపాద్గర్భమాధత్త వ్రతం చాంజో దధార సా ॥ 55

రాజా! ఆ దితి "నేనట్లే ప్రవర్తింతు" ననియంగీకరించి ప్రఫుల్లచిత్తముతో గశ్యపునివలన గర్భమును ధరించెను. ప్రయత్నముతో వ్రతమును పాలింపజొచ్చెను.

మాతృష్వసురభిప్రాయమిన్ద్ర ఆజ్ఞాయ మానద ।
శుశ్రూషణేనాశ్రమస్థాం దితిం పర్యచరత్కవిః ॥ 56

రాజా! స్వార్థదర్శి యగు నింద్రుడు పినతల్లి యగు దితియొక్క యభిప్రాయము నెఱింగి "స్వకార్యముద్ధరేత్ ప్రాజ్ఞః" అనునీతి ననుసరించి వ్రతవిఘ్నముద్వారా తనకార్యసిద్ధికై ఆశ్రమవాసిని యగు దితికి నిత్య సేవచేయనారంభించెను.

నిత్యం వనాత్సుమనసః ఫలమూలసమిత్కుశాన్ ।
పత్రాంకురమృదోఽపశ్చ కాలే కాలఉపాహరత్ ॥ 57

ఇంద్రుడు ప్రతిదినము వనమునుండి పుష్పములు, ఫలములు, మూలములు, యజ్ఞకాష్ఠములు (సమిధలు), కుశలు, పత్రములు, అంకురములు, మృత్తిక, జలము మున్నగు వానిని నిర్దిష్టసమయములో దెచ్చి యిచ్చుచుండెను.

ఏవం తస్యా వ్రతస్థాయా వ్రతచ్ఛిద్రం హరిర్నృప ।
ప్రేప్సుః పర్యచరజ్జిహ్మో మృగహేవ మృగాకృతిః ॥ 58

రాజా! మృగహంతకుడగు వ్యాధుడు మృగములను మోసగించుటకై మృగాకారమును ధరించి మృగమును సేవించునట్లు ఇంద్రుడుగూడ లోపల కుటిలభావమును బెంచియు బయటకు సాధుభావమును ప్రదర్శించి వ్రతధారిణి యగు దితియొక్క వ్రతమునకు విఘ్నమును గలిగించుటకై ఆమెకు సేవచేయుచుండెను.

నాధ్యగచ్ఛద్వ్రతచ్ఛిద్రం తత్పరోఽథ మహీపతే ।
చిన్తాం తీవ్రాం గతః శక్రః కేన మే స్యాచ్ఛివన్త్విహ ॥ 59

మహారాజా! ఇంద్రుడిట్లు దితి యొనర్చు వ్రతములో దోషములను వెదకుటయందు తత్పరతగలవా డయ్యును వ్రతదోషములను గనిపెట్టలేక పోయెను. అపుడు 'నాకెట్లు శుభము చేకూరగల' దనితీవ్రముగ నాలోచింపసాగెను.

ఏకదా సా తు సన్ధ్యాయాముచ్ఛిష్టా వ్రతకర్శితా ।
అస్పృష్టవార్యధౌతాఙ్ఘ్రిః సుష్వాప విధిమోహితా ॥ 60

ఒకప్పుడు వ్రతకాతర యగు దితి దుర్విధిచే ప్రేరితయై ఉచ్ఛిష్టావస్థయందు జలములను స్పృశింపక (అచమింపక), పాదములను కడుగుకొనకుండగ సాయంకాలమున నిద్రించెను.

లబ్ధ్వా తదన్తరం శక్రో నిద్రాపహృతచేతసః ।
దితేః ప్రవిష్ట ఉదరం యోగేశో యోగమాయయా ॥ 61

ఈలోపమును గనిపెట్టి అణిమాదిసిద్ధులు గలవాడు, యోగేశ్వరుడునగు ఇంద్రుడు నిద్రావశముచే చైతన్యము లేని దితియొక్కయుదరము లొనికి బ్రవేశించెను.

చకర్తసప్తధా గర్భం వజ్రేణ కనకప్రభమ్ ।
రుదన్తం సప్తధైకైకం మా రోదీరితి తాన్ పునః ॥ 62

ఇంద్రుడు గర్భమున బ్రవేశించి బంగారమువలె ప్రకాశించు ఆగర్భమును వజ్రాయుధముచే నేడుఖండములుగ ఛేదించెను. ఛేదింపబడిన ఖండములు ఏడ్చుచుండగ 'ఏడువవల' దని యోదార్చి మరల ప్రతిఖండమును ఏడుభాగములుగ ఛేదించెను.

తమూచుః పాత్యమానాస్తే సర్వే ప్రాంజలయో నృప ।
కిం న ఇన్ద్ర జిఘాంససి భ్రాతరో మరుతస్తవ ॥ 63

రాజా! అనంతరము ఖండఖండములుగా జేయబడిన ఆపిండములు ఇంద్రునిచే బాధింపబడినవై చేతులుజోడించి ఆయింద్రునితో నిట్లు పలికినవి - 'ఇంద్రా! మేము మరుద్గణములము; నీకు సోదరులము. అందువలన మమ్మేలవధింపదలంచుచున్నావు?'

మా భైష్ట భ్రాతరో మహ్యం యూయమిత్యాహ కౌశికః ।
అనన్యభావాన్ పార్షదానాత్మనో మరుతాం గణాన్ ॥ 64

ఇట్లు వారు పలుకగా ఇంద్రుడు మరుద్గణముల యనన్యభావమును జూచి, తనయొక్క యాజ్ఞ ననుసరించువా రనిభావించి "మీరు నాసోదరులైనచో మీ కెట్టిభయములే" దని పలికెను.

న మమార దితేర్గర్భం శ్రీనివాసానుకంపయా ।
బహుధా కులిశక్షుణ్ణో ద్రౌణ్యస్త్రేణ యథాభవాన్ ॥ 65

(పరీక్షిన్మహారాజా!) నీవు శ్రీనివాసునికృపచే నశ్వత్థామయొక్క వజ్రాయుధముద్వారా దగ్ధుడవయ్యును మృతుడవు కాలేదు, అట్లే యాదితియొక్క గర్భముకూడ వజ్రాయుధముచే ఖండఖండములయ్యును శ్రీనివాసుని కృపచే నది వినష్టముకాలేదు.

సకృదిష్ట్వాదిపురుషం పురుషో యాతి సామ్యతామ్ ।
సంవత్సరం కించిదూనం దిత్యా యద్ధరిరార్చితః ॥ 66

సజూరింద్రేణ పంచాశద్దేవాస్తే మరుతోఽభవన్ ।
వ్యపోహ్య మాతృదోషం తే హరిణా సోమపాః కృతాః ॥ 67

ఆదిపురుషుడగు భగవానుని జీవుడొక్కమారైన పూజించినచో భగవానుని సమానరూపత్వమును (సారూప్యముక్తిని) బొందును. అట్టి భగవానుని దితి సంవత్సరపర్యంత మర్చించెను. తత్ఫలముచే ఇంద్రునితో గూడి యేబదిమందిమరుత్తులు జన్మించిరి. శ్రీహరి ఆమరుత్తులదోషమైన దైత్యభావమును బోగొట్టి వారిని సోమమును ద్రావు మాతృ దేవతలునుగా జేసెను. దానియం దాశ్చర్యమేమియున్నది?

దితిరుత్థాయ దదృశే కుమారాననలప్రభాన్ ।
ఇన్ద్రేణ సహితాన్ దేవీ పర్యతుష్యదనిన్దితా ॥ 68

భగవద్వ్రతధారణముచే శుద్ధాంతఃకరణము గలిగిన దితి శయ్యనుండి లేచి అగ్ని తుల్యులు, అతితేజస్వులు, ఇంద్రునితోగూడ మైత్రిభావమును నెఱపువారు నగు కుమారులను జూచి సంతుష్టయయ్యెను.

**అథేన్ద్రమాహ తాతాహమాదిత్యానాం భయావహమ్ ।**
**అపత్యమిచ్ఛన్త్యచరం వ్రతమేతత్సుదుష్కరమ్ ॥ 69**

పిమ్మట దితి యింద్రునితో నిట్లుపలికెను- వత్సా! ద్వాదశాదిత్యులైన మీకు భయమును గలిగించు పుత్రుని గోరి నేనీ దుష్కర మగు వ్రతము నాచరించితిని.

**ఏకః సంకల్పితః పుత్రః సప్తసప్తాభవన్ కథమ్ ।**
**యది తే విదితం పుత్ర సత్యం కథయ మా మృషా ॥ 70**

నే నొక్కపుత్రుని గోరితిని, కాని నలువదితొమ్మండుగురు పుత్రులెట్లుకలిగిరి. కుమారా! నీకీ విషయము తెలిసినచో నాకు జెప్పవలసినది, అసత్యమాడవలదు.

**ఇన్ద్రఉవాచ**

**అమ్బ! తేఽహం వ్యవసితముపాధార్య గతోఽన్తికమ్ ।**
**లబ్ధాన్తరోఽచ్ఛిదం గర్భమర్థబుద్ధిర్న ధర్మదృక్ ॥ 71**

ఇంద్రుడు పలికెను :- తల్లీ! నేను స్వార్థముచే అంధుడనైతిని. నాకు ధర్మదృష్టి లేదు. నేను నీవ్రతప్రయత్నము నెఱింగి నీకడకు వచ్చితిని. లోపమును గనిపెట్టి గర్భమున ప్రవేశించి దానిని ఛేదించితిని.

**కృత్తో మే సప్తధా గర్భ ఆసన్ సప్త కుమారకాః ।**
**తేఽపి చైకైకశో వృక్ణాః సప్తధా నాపి మమ్రిరే॥ 72**

మొదట నేను గర్భమును ఏడుఖండములుగ ఛేదించితిని. దాని వలన నేడుగురు కుమారులైరి. వారిలో నొక్కొక్కరు మరల ఏడేడు ఖండములుగ ఛేదింపబడిరి. కాని యెవ్వరును మరణింపలేదు. అందువలన మొత్తము నలువదితొమ్మండుగురు కుమారులైరి.

**తతస్తత్పరమాశ్చర్యం వీక్ష్య వ్యవసితం మయా ।**
**మహాపురుషపూజాయాః సిద్ధిః కాప్యానుషఙ్గిణీ ॥ 73**

ఛేదింపబడిన ఖండములు మరణింపకపోవుటచూచి నేను మిగుల ఆశ్చర్యాన్వితుడనైతిని. ఇది మహాపురుషుడగు విష్ణువుయొక్క ఆరాధనకు సంబంధించిన యొకానొక ఆనుషంగికసిద్ధి యనినేను భావించితిని.

**ఆరాధనం భగవత ఈహమానా నిరాశిషః ।**
**యే తు నేచ్ఛన్త్యపి పరం తే స్వార్థకుశలాః స్మృతాః ॥ 74**

భగవదారాధనాభిలాషులై నిష్కాములైనవారు మోక్షమునుగూడ గోరరు. వారే స్వార్థమునందు నిపుణులుగా జెప్పబడిరి.

**ఆరాధ్యాత్మప్రదం దేవం స్వాత్మానం జగదీశ్వరమ్ ।**
**కో వృణీత గుణస్పర్శం బుధః స్యాన్నరకేఽపి యత్ ॥ 75**

ఏవివేకియైనను నిరతిశయపురుషార్థస్వరూపుడు, నిరతిశయప్రియదేవుడు నగు జగదీశ్వరుని యారాధించి నరకమునందును లభించువిషయసుఖములు గోరునా !

**తదిదం మమ దౌర్జన్యం బాలిశస్య మహీయసి ।**
**క్షన్తుమర్హసి మాతస్త్వం దిష్ట్యా గర్భో మృతోత్థితః ॥ 76**

మహాత్మురాలవగు జననీ! నేను మూఢుడను, నాదౌర్జన్యమునుక్షమింపుము. నీయ దృష్టమువలననే గర్భము మరణించియు మరల జీవించినది.

**శ్రీశుక ఉవాచ**

**ఇన్ద్రస్తయాభ్యనుజ్ఞాతః శుద్ధభావేన తుష్టయా ।**
**మరుద్భిః సహ తాం నత్వా జగామ త్రిదివం ప్రభుః ॥ 77**

శుకుడు పలికెను :- ఇంద్రుని సౌజన్యముచే దితి సంతుష్టయైనది, ప్రభువగు ఇంద్రుడు దితికి ప్రణమిల్లి యామెయాజ్ఞ ననుసరించి మరుద్గణముతో స్వర్గమునకు వెడలను.

**ఏవం తే సర్వమాఖ్యాతం యన్మాం త్వం పరిపృచ్ఛసి ।**
**మఙ్గలం మరుతాం జన్మ కిం భూయః కథయామి తే ॥ 78**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం
షష్ఠస్కంధే మరుదుత్పత్తిర్నామ
అష్టాదశో ఽధ్యాయః ॥

పరీక్షిన్మహారాజా! నీవు నన్నేవిషయమును గూర్చి యడిగితివో మంగళజనకమగు వామరుత్తులపుట్టుకనుగూర్చి నీకు వివరించితిని. మరల నీవేమివినదలచితివో అడుగుము చెప్పెదను.

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందలి షష్ఠస్కంధములో
మరుద్గణముల యుత్పత్తి యను పదునెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము

# పందొమ్మిదవ అధ్యాయము

## పుంసవనవ్రతవిధి

కథాసారము :- ఈయధ్యాయమున కశ్యపుడు దితికి ఉపదేశించిన హరితోషణపర మగు వ్రతము విస్తృతముగ వర్ణింపబడినది.

మార్గశీర్ష శుక్లప్రతిపత్తున స్త్రీలు భర్తయొక్క ఆజ్ఞగొని పుంసవనవ్రతము నారంభింప వలెను. దంతధావనముచేసి స్నానముచేసి శుచియైయుండు మరుద్గణముల జనన వివరణమును శ్రవణము చేయవలెను. పిమ్మట శ్వేతవస్త్రములను ధరించి అలంకృతలై ప్రాత:కాలభోజనమునకు పూర్వము పరాశక్తి రూపిణియు, శక్తిమానుడగు భగవానునికంటె అభిన్నయు, విష్ణుపత్నియు నగు లక్ష్మీదేవితోగూడ దయ, ధైర్యము, తేజస్సు, సామర్థ్యము, మహిమ మున్నగుగుణములు గలవాడు అణిమాదిసర్వసిద్ధులకు నిలయమైనవాడు నగు విష్ణుభగవానునారాధింపవలెను. తదనంతరము "మహానుభావుడు మహాపురుషుడు నగు భగవానునకు నమస్కారి" మను మంత్రముచే భగవాను నాహ్వానించి పాద్యము, అర్ఘ్యము, స్నానీయము, వస్త్రాభూషణములు, ఉపవీతము, గంధపుష్పములు, ధూపదీపములు మున్నగు వివిధోపహారములను సమర్పింపవలెను. పిమ్మట ఉపహారావశిష్టమగు వ్రతముద్వారా "భగవానుడు, మహాపురుషుడునగు మహాభూతపతికి నమస్కారి" మనుమంత్రముచే అగ్నియందు పండ్రెండుమాఱు లాహుతుల నీయవలెను. పదిమారులు మంత్రమును జపించి లక్ష్మీనారాయణులస్తవమును పఠింపవలెను. అనంతరము నివేదింపబడిన ఉప హారములను దొలగించి ఆచమనీయములనిచ్చి మరల లక్ష్మీనారాయణుల నర్చింపవలెను.

ఈ పుంసవనవ్రతమును భార్యాభర్త లిరువురిలో నే యొక్కరు చేసినను ఇరువురకు ఫలములభించును. ఒక్క సంవత్సరమువఱకు ఇట్టిపూజాదులద్వారా వ్రతము ననుష్ఠించి కార్తిక పూర్ణిమనాడుపవసింపవలెను. మఱునాడు భగవానునర్చించి పార్వణస్థాలిని పాకవిధానానుసారముగ దుగ్ధపక్వసఘృతచరుద్వారా పండ్రెండుమారు లాహుతుల నిచ్చిన పిమ్మట బ్రాహ్మణులయనుమతినిగొని తాము భోజనము చేయవలెను. పిమ్మట పుంసవన వ్రతఫలశ్రుతిని కీర్తించుట యనుప్రసంగముతో నీయధ్యాయము సమాప్తి చెందును.

### శ్రీరాజోవాచ

వ్రతం పుంసవనం బ్రహ్మన్ భవతా యదుదీరితమ్ ।
తస్య వేదితుమిచ్ఛామి యేన విష్ణుః ప్రసీదతి ॥ 1

పరీక్షిన్మహారాజు పలికెను :- మహాత్మా! నీవు చెప్పిన పుంసవనవ్రత విషయముయొక్క ప్రకారవిశేషమును వినగోరుచున్నాను. ఈవ్రతానుష్ఠానమువలన విష్ణువు ప్రసన్నుడగునుగదా!

## శ్రీ శుక ఉవాచ

**శుక్లేమార్గశిరే పక్షే యోషిద్భర్తురనుజ్ఞయా ।**
**ఆరభేత వ్రతమిదం సర్వకామికమాదితః ॥ 2**

**నిశమ్య మరుతాం జన్మ బ్రాహ్మణాననుమన్త్ర్య చ ।**
**స్నాత్వా శుక్లదతీ శుక్లే వసీతాలంకృతాఽమ్బరే ।**
**పూజయేత్ ప్రాతరాశాత్ప్రాగ్భగవన్తం శ్రియా సహ ॥ 3**

శుకుడు పలికెను :- మార్గశిరశుక్లప్రతిపత్తున స్త్రీ తనభర్తయాజ్ఞననుసరించి సర్వకామప్రద మగు నీవ్రతము నారంభింపవలెను. వ్రతారంభమునకు పూర్వము మరుద్గణముల జనన వివరణమునుగూర్చి వినవలెను. బ్రాహ్మణుల నడిగి దంత ధావనముచేసి స్నానమాచరించి శుక్లవస్త్రములను ధరింపవలెను. అనంతరము అలంకృతయై ప్రథమభోజనమునకు పూర్వము లక్ష్మీదేవితో గూడ విష్ణువు నర్చింపవలెను.

**అలం తే నిరపేక్షాయ పూర్ణకామనమోఽస్తు తే ।**
**మహావిభూతిపతయే నమః సకలసిద్ధయే ॥ 4**

పూర్ణకాముడా! నీయందన్నియును చాలినంత యున్నవి. అందువలన మఱి దేనివలన గూడ నీకు ప్రయోజనములేదు. నిరపేక్షస్వరూపుడ వగునీకు నమస్కరించుచున్నాను. నీవు మహావిభూతిస్వరూపిణి యగు లక్ష్మీదేవికి పతివి, అణిమాదిసర్వసిద్ధులు నీయందున్నవి. అట్టినీకు నమస్కారము.

**యథా త్వం కృపయా భూత్యా తేజసా మహిమౌజసా ।**
**జుష్ట ఈశ గుణైః సర్వైస్తతోఽసి భగవాన్ ప్రభుః ॥ 5**

ఈశా! ఏలయన, నీవు కృప, ఐశ్వర్యము, తేజస్సు, మహిమ, బలము, మున్నగు సకలగుణములచే భూషితుడవై యున్నావు. అందువలన భగవానుడ వగు నీకు నమస్కారము.

**విష్ణుపత్ని మహామాయే మహాపురుషలక్షణే ।**
**ప్రీయేథా మే మహాభాగే లోకమాత ర్నమోఽస్తుతే ॥ 6**

పైనచెప్పిన విధముగ విష్ణువునకు నమస్కరించి లక్ష్మికి నమస్కరింపవలెను. 'విష్ణుపత్నీ! స్వరూపశక్తిరూపిణీ! పురుషోత్తముని వలె నిరపేక్షత్వాదిగుణములు గలదానా! మహాభాగా! నాకు ప్రసన్నురాలవగుము, లోకమాతా! నీకు నమస్కరించుచున్నాను.'

ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ మహావిభూతి పతయే సహ మహావిభూతిభిర్బలిముపహరామీతి। అనేనాహరహర్మంత్రేణ విష్ణోరావాహనార్ఘ్యపాద్యోప స్పర్శన స్నానవాస ఉపవీత విభూషణగన్ధపుష్పధూప దీపోపహారాద్యుపచారాన్ సుసమాహితోపాహరేత్ ॥ 7

"షడ్గైశ్వర్యపూర్ణుడవు, పురుషోత్తముడవు మహాప్రభావశాలివి, లక్ష్మీపతివి నగునీకు నమస్కారము. విష్వక్సేనాదిపార్షదులతోను విభూతులతోను గూడిన నీకు పూజోపహారములను సమర్పించుచున్నాను" అని సమాహితచిత్తముతో ప్రతిదినము నీమంత్రముతో విష్ణువునకు ఆవాహనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, ఉపవీతము, భూషణము, గంధము, పుష్పము, ధూపము, దీపము, ఉపహారము మున్నగు నుపచారములను సమర్పింపవలెను.

హరిశ్శేషం చ జుహుయాదనలే ద్వాదశాహుతీః -
ఓం నమో భగవతే మహాపురుషాయ మహావిభూతి పతయే స్వాహేతి ॥ 8

పిమ్మట ఉపహారవిశిష్ట మగు హవిస్సుద్వారా, "ఓం నమోభగవతే వాసుదేవాయ మహావిభూతయే స్వాహా" అనుమంత్రముచే అగ్నియందు పండ్రెండు ఆహుతులను సమర్పింపవలెను.

శ్రియం విష్ణుం చ వరదావాశిషాం ప్రభవావుభౌ ।
భక్త్యా సంపూజయేన్నిత్యం యదీచ్ఛేత్సర్వ సంపదః ॥ 9

సర్వసంపదలను గోరువాడు లక్ష్మీనారాయణులను భక్తితో నెల్లపుడు పూజింపవలెను. వారిరువురు వరప్రదాతలు, సర్వమంగళాకారులు.

ప్రణమేద్దణ్డవద్భూమౌ భక్తి ప్రహ్వేన చేతసా ।
దశవారం జపేన్మన్త్రం తతః స్తోత్రముదీరయేత్ ॥ 10

భక్తివినమ్రచిత్తముతో భూమిపై సాష్టాంగదండప్రణామములజేసి పైమంత్రమును పదిమార్లు జపించి పిమ్మట స్తోత్రమును పఠింపవలెను.

యువాంతు విశ్వస్య విభు జగతః కారణం పరమ్ ।
ఇయం హి ప్రకృతిం సూక్ష్మా మాయాశక్తి ర్దురత్యయా ॥ 11

మీరిరువురు విశ్వమున కధిపతులు, జగత్తునకు ముఖ్యకారణులు. వారిలో నీలక్ష్మీదేవి దుర్జ్ఞేయ, దురత్యయ, చిన్మాయాశక్తి రూపిణియగు ప్రకృతియై యున్నది.

**తస్యా అధీశ్వర: సాక్షాత్త్వమేవ పురుష: పర: ।**
**త్వం సర్వయజ్ఞ ఇజ్యేయం క్రియేయం ఫలభుగ్భవాన్ ॥ 12**

ఈప్రకృతి కధీశ్వరుడ వగు నీవు సాక్షాత్తుగ పరమపురుషుడవు. నీవు యజ్ఞము, ఈ లక్ష్మి ఇజ్య (భావనాఖ్య మగు యజ్ఞాంగ విశేషము), క్రియ. నీవు యజ్ఞఫలభోక్తవు.

**గుణవ్యక్తిరియం దేవీ వ్యంజకో గుణభుగ్భవాన్ ।**
**త్వం హి సర్వశరీర్యాత్మా శ్రీ: శరీరేన్ద్రియాశయా: ।**
**నామరూపే భగవతీ ప్రత్యయస్త్వమపాశ్రయ: ॥ 13**

ఈలక్ష్మీదేవి సర్వగుణప్రకాశస్వరూపిణి, నీవు గుణప్రకాశకుడవు, భోక్తవు. నీవు శరీరధారి యగు జీవున కాత్మవు, ఈశ్రీదేవి శరీరేంద్రియాశయ రూపిణి నామరూపయుక్త. నీవు నామరూపప్రకాశకుడవు, ఆధారుడవు.

**యథా యువాం త్రిలోకస్య వరదౌ పరమేష్ఠినౌ ।**
**తథా మ ఉత్తమ: శ్లోక సన్తు సత్యా మహాశిష: ॥ 14**

మీరిరువురు మూడులోకములకు వరముల నిచ్చువారు పరమేశ్వరులు, అందువలన ఉత్తమశ్లోకుడా! మామనోరథము లన్నియు పూర్తియగుగాక!

**ఇత్యభిష్టూయ వరదం శ్రీనివాసం శ్రియా సహ ।**
**తన్నిస్సార్యోపహరణం దత్త్వాచమనమర్చయేత్ ॥ 15**

ఇట్లు శ్రీనివాసుని, లక్ష్మీదేవిని స్తుతించి యచటినుండి పూజోపహారనైవేద్యాదులను దొలగించి, మరల ఆచమనము నిచ్చి మరల పూజింపవలెను.

**తతస్తువీత స్తోత్రేణ భక్తి ప్రహ్వేణచేతసా ।**
**యజ్ఞోచ్ఛిష్టమవఘ్రాయ పునరభ్యర్చ్యయద్ధరిమ్ ॥ 16**

పిమ్మట భక్తి వినమ్రచిత్తముతో మరల స్తుతింపవలెను. యజ్ఞోచ్ఛిష్టము నాఘ్రాణించి మరల హరిని అర్చింపవలెను.

**పతిం చ పరయా భక్త్యా మహాపురుషచేతసా ।**
**ప్రియైస్తైస్తైరుపనమేత్ ప్రేమశీల: స్వయం పతి: ।**
**బిభృయాత్సర్వకర్మాణి పత్న్యా ఉచ్చావచాని చ ॥ 17**

ఏకాంతభక్తితో నీశ్వరబుద్ధితో జెప్పబడి ఉపచారములద్వారా పతినిగూడ సేవింపవలెను. పతిగూడ ప్రీతుడైనచో పతియొక్క వివిధ కర్మలు సానుకూలములగును.

**కృతమేకతరేణాపి దంపత్యోరుభయోరపి ।**
**పత్న్యాం కుర్యాదనర్హాయాం పతిరేత త్సమాహిత: ॥** 18

భార్యాభర్త లిరువురిలో నేయొక్కరైన నీవ్రతము ననుష్ఠించినచో ఉభయులు ఫలభాగులగుదురు. అందువలన భార్య వ్రతము నొనర్చుట కసమర్థురాలైనచో భర్త తాను సమాహితచిత్తముతో నీవ్రతము ననుష్ఠింపవలెను.

**విష్ణోర్వ్రతమిదం బిభ్రన్న విహన్యాత్కథంచన ।**
**విప్రాన్ స్త్రియోవీరవతీ: స్రగ్గన్ధబలిమణ్డనై:।**
**అర్చేదహరహర్భక్త్యా దేవం నియమమాస్థితా ॥** 19

**ఉద్వాస్య దేవం స్వే ధామ్ని తన్నివేదితమగ్రత: ।**
**అద్యాదాత్మవిశుద్ధ్యర్థం సర్వకామసమృద్ధయే ॥** 20

ఈవిష్ణువ్రతమును ధరించి (క్రోధాదులవలన) ఎప్పుడును ఆవ్రతమునకు భంగము గలిగింపరాదు. విప్రులను, పతిపుత్రవతులగు స్త్రీలను మాలలు గంధము ఉపహారములు అలంకారములు మున్నగువానిద్వారా ప్రతిదినము నియమముల బాలించుచు భక్తితో విష్ణువు నర్చింపవలెను. అనంతరము భగవానుని (విశ్రాంతి కొఱకై) స్వధామమున నుంచి ఆయనకు నివేదించిన వస్తువులను మొదట తగువిధముగ విభజించి ఆత్మశుద్ధికొఱకు సర్వాభిలాషలు నెరవేరుటకు తాను భుజింపవలెను.

**ఏతేన పూజావిధినా మాసాన్ ద్వాదశహాయనమ్ ।**
**నీత్వాథోపరమేత్సాధ్వీ కార్తికే చరమేఽహని ॥** 21

సాధ్వి యగు స్త్రీ యిట్లు పూజావిధివనుసరించి ద్వాదశమాసాత్మక మగు సంవత్సర కాలమును గడపి కార్తికమాసమునందలి పూర్ణిమాతిథియందుపవసింపవలెను.

**శ్వోభూతేఽప ఉపస్పృశ్య కృష్ణ మభ్యర్చ్య పూర్వవత్ ।**
**పయ:శృతేన జుహుయాచ్చరుణా సహ సర్పిషా ।**
**పాకయజ్ఞవిధానేన ద్వాదశైవాహుతీ: పతి: ॥** 22

మఱునాటి ప్రాత:కాలమున వెనుకటివలె ఆచమించి శ్రీకృష్ణునర్చించిన పిమ్మట గృహ్యసూత్రములలో జెప్పబడిన పాకయజ్ఞవిధానము ననుసరించి ఘృతముతో క్షీరపక్వ మగు చరువుద్వారా భర్త పండ్రెండు ఆహుతుల నీయవలెను.

**ఆశిషః శిరసాదాయ ద్విజైః ప్రీతైః సమీరితాః ।**
**ప్రణమ్య శిరసా భక్త్యా భుంజీత తదనుజ్ఞయా ॥ 23**

పిమ్మట బ్రాహ్మణులు సంతుష్టులై ఆశీస్సుల బలుకగా నతడు తలవంచి స్వీకరించి, భక్తిచే అవనతశిరస్కుడై వారికి ప్రణామ మాచరించి వారియనుమతి ననుసరించి తాను భోజనమొనర్పవలెను.

**ఆచార్యమగ్రతః కృత్వా వాగ్యతః సహ బన్ధుభిః ।**
**దద్యాత్ పత్న్యై చరోః శేషం సుప్రజాస్త్వం సుసౌభగమ్ ॥ 24**

అనంతరము బంధువులతో గూడి మౌనియై యాచార్యుని ముందుంచుకొని సత్పుత్రప్రదము, సౌభాగ్యజనకము నగు చరువులోని మిగిలిన భాగమును తనభార్య కిడవలెను.

**ఏతచ్చరిత్వా విధివద్వ్రతం విభో-**
**రభీప్సితార్థం లభతే పుమానిహ ।**
**స్త్రీ చైతదాస్థాయ లభేత సౌభగం**
**శ్రియం ప్రజాం జీవపతిం యశో గృహమ్ ॥ 25**

ఈవ్రతమును యథావిధిగ నొనర్చినచో పురుషు డీజన్మమునందే భగవానునివలన వాంఛితార్థమును బొందును. స్త్రీ యీవ్రతమును యథావిధిగ ఆచరించినచో సౌభాగ్యము, సంపద, సంతానము, దీర్ఘాయుష్మంతుడగు పతి, యశస్సు, గృహము మున్నగువానిని పొందగలదు.

**కన్యా చ విన్దేత సమగ్రలక్షణం**
**పతిం త్వవీరా హతకిల్బిషాం గతిమ్ ।**
**మృతప్రజా జీవసుతా ధనేశ్వరీ**
**సుదుర్భగా సుభగా రూపమగ్ర్యమ్ ॥ 26**

**విన్దేద్విరూపా విరుజా విముచ్యతే**
**య ఆమయావీన్ద్రియకల్యదేహమ్ ।**
**ఏతత్పఠన్నభ్యుదయే చ కర్మ -**
**ణ్యనన్తతృప్తిః పితృదేవతానామ్ ॥ 27**

# షష్ఠంధ శ్లోకానుక్రమణిక

## హ

# శ్రీమద్భాగవత గ్రంథ ముద్రణకు సహకరించిన దాతలు

| | రూ. |
|---|---|
| శ్రీ చేబ్రోలు నరేంద్ర చౌదరి, భార్య లక్ష్మి గార్లు, గుంటూరు | 10,000.00 |
| డా॥ బాదం సురేంద్రబాబు, (హరిత యూరాలజీ స్పెషలిస్టు) కాకినాడ | 5,116.00 |
| శ్రీమతి గన్నమనేని శిరోమణి, పూనూరు | 5,000.00 |
| శ్రీ చుక్కపల్లి భాస్కరరావుగారు, కంచెర్లపాలెం | 3,000.00 |
| శ్రీమతి గోపవరపు వెంకటరత్నమ్మగారి జ్ఞాపకార్థం కుమారులు, గుంటూరు | 2,116.00 |
| శ్రీ యండూరి హనుమంతరావు గారు, విజయవాడ | 2,001.00 |
| శ్రీ పల్లబోతు. నాగేశ్వరరావుగారు, భార్య హైమవతి, గుంటూరు | 2,000.00 |
| శ్రీమతి ఎ.లక్ష్మి, గుంటూరు | 2,000.00 |
| శ్రీమతి ప్రభల అపర్ణ, కెనరాబ్యాంక్, విజయవాడ | 1,116.00 |
| శ్రీ పి.పాండురంగారావు గారు, విజయవాడ | 1,116.00 |
| శ్రీమతి రుద్రంరాజు సరస్వతి, సఖినేటిపల్లి | 1,116.00 |
| శ్రీ కలిదిండి నారాయణరాజుగారు, భీమవరం | 1,116.00 |
| శ్రీ పెన్మెత్స రామచంద్రరాజుగారు, హైదరాబాదు | 1,116.00 |
| శ్రీ వాగిరెడ్డి సత్యనారాయణ గారి జ్ఞాపకార్థము భార్య పుష్పావతి గారు, కొవ్వూరు | 1,116.00 |
| శ్రీ కస్తూరి కామేశ్వర శర్మ, భార్య సుబ్బలక్ష్మిగార్లు, కొవ్వూరు | 1,116.00 |
| శ్రీ మాదిరాజు బాలకృష్ణారావుగారి జ్ఞాపకార్థము భార్య రమణమ్మ గారు, కొవ్వూరు | 1,116.00 |
| శ్రీ గుత్తా సత్యవరప్రసాదు గారు, కొవ్వూరు | 1,116.00 |

| | |
|---|---|
| శ్రీ నంబూరి నాగేశ్వరరావుగారు, విజయవాడ | 1,116.00 |
| శ్రీ కుర్రా సాంబశివరావు, భార్య రమాదేవిగార్లు, గుంటూరు | 1,116.00 |
| శ్రీ అయినంపూడి చలపతిరావుగారు, గుంటూరు | 1,116.00 |
| శ్రీమతి పారేపల్లి సీతమ్మగారు, నందివెలుగు | 1,116.00 |
| శ్రీమతి సి. కౌసల్యగారు, హైదరాబాదు | 1,116.00 |
| శ్రీ వి.రామకృష్ణరాజుగారు, హైదరాబాదు | 1,116.00 |
| శ్రీ రమణకృష్ణదాసుగారు, పాలకొల్లు | 1,116.00 |
| శ్రీమతి వి.పద్మలత, గుంటూరు | 1,116.00 |
| శ్రీ కృష్ణారావుగారు, బృందావనము | 1,116.00 |
| శ్రీమతి సోమేపల్లి సీతారామమ్మగారు, యద్దనపూడి | 1,116.00 |
| శ్రీమతి గొట్టిపాటి వెర్రెమ్మగారు, యద్దనపూడి | 1,116.00 |
| శ్రీమతి గొట్టిపాటి భారతమ్మగారు, యద్దనపూడి | 1,116.00 |
| శ్రీ తేలప్రోలు దుర్గాప్రసాద్‌గారు, విజయవాడ | 1,116.00 |
| శ్రీ మండవ ఆదినారాయణరావు, అనసూయమ్మగార్ల జ్ఞాపకార్థము కు॥ రామకృష్ణారావుగారు, నరసారావుపేట | 1,116.00 |
| శ్రీ అద్దంకి వెంకటేశ్వర్లుగారు, తెనాలి | 1,116.00 |
| శ్రీ మాగాపు అన్నాజీరావుగారి జ్ఞాపకార్థము భార్య లలితాంబ గారు, కొవ్వూరు. | 1,116.00 |

